

# ఆంధ్రదీపిక

రచయితలు

"పండితరాయ" "బాలామర" "సాహిత్యచక్రవర్తి"

**శ్రీ మామిడి వేంకటార్యులు**

పరిష్కర్తలు

**శ్రీ శుద్ధచైతన్యస్వాములవారు**

ప్రకాశకులు

శ్రీ వాసవీ గ్రంథప్రచారణ సమితివారు

మచిలీపట్టణము

ప్రతులకు :
శ్రీ వాసవీ గ్రంథ ప్రచారణ సమితి
మచిలీపట్టణము

ఈ "ఆంధ్రదీపిక"కు, "సశేషామరకోశము" అను మతొక గ్రంథమునకు కేంద్రప్రభుత్వమువారు 8250 రూపాయలు సబ్సిడీ యిచ్చిరి. వీరికి మా సమితి - ధన్యవాదములు.

విశ్వావసు - శ్రీరామనవమి
ప్రథమ ముద్రణము
వేయి ప్రతులు
1965

ఓమ్ 19389

# శ్రీ మన్మామిడి వేంకటార్యులవారి జీవిత సంగ్రహము*

ఆ॥వె॥ తెలుఁగు సీమయందు వెలుఁగు గోదావరీ
మండలమున మంచి పండితులకు
నిలయ మగుచు సంపదల కాటపట్టుగా
'పాలకొల్లు' నాఁగఁ బ్రోలొకండు. 1

క॥ అందున్ ధనదాభ వణి
జ్మందారంబులకు నెలవు మామిడి కులమొ
ప్పుం దానధర్మములలో
ముందడుగిడు కామిసెట్టి మూలపురుషుఁడై. 2

ఆ॥వె॥ విజయలక్ష్మియందు వేంకనార్యునకుద్భ
వించె "వేంకటార్య" విబుధుఁడందుఁ
జంద్రువలనఁ బాలసంద్రంబు వలెఁ బేరు
గాంచి మించె నితని కతనఁ గులము. 3

గీ॥ నిర్మలులె యిర్వురును గళానిధులె సర్వ
విచ్ఛిరోధార్యులే యవివేకతిమిర
హరణశౌండులె, కాని చందురునకట్లు
వంక లేదీతఁడతి నిష్కళంకమూర్తి. 4

గీ॥ మార్చి పదియాఱు-వేదర్తు మౌని విధు వి
భాసి హూణాబ్దమునఁ(1764)బుట్టి బాలుఁడీతఁ
డెల్ల బాంధవులను సంతసిల్లఁజేసె,
నుత్తముల జన్మదిన మట్లె యొప్పుఁగాదె. 5

శా॥ వాపీకూపతటాకముల్ నిలిపి, విద్వత్కోటిఁ బూజించి, స
ద్వ్యాపారమ్ము లొనర్చి, దాతలయి, యేతత్పూర్వు లార్జించు మే
లౌ పుణ్యంబె శిశుస్వరూపమున నిట్లావిర్భవంబందె నా
ధీ పాండిత్య కళాదులందు నతఁడుద్దీపించెఁ జిన్నప్పుడే. 6

* గ్రంధి వేంకటసుబ్బరాయశర్మగారు రచించిన (సం. 1929న ముద్రితమైన) మామిడి వేంకటార్యజీవితము ననుసరించి యిది వ్రాయబడినది.

మ॥ తగు కాలమ్మున సంస్కృతుల్ వడసి మేధాశాలి యాతండు శ్రీ
బగళోపాసననో? గుహేశకృపనో? ప్రాగ్జన్మ భాగ్యోదయ
ప్రగతిం జేసియొ? దేశికాళి యనుకంపాశ్రీనొ? వే నేరిచెన్
నిగమంబుల్, స్మృతులభ్యసించె, బహుమానించెన్ గళల్, శాస్త్రముల్. 7

ఆ॥వె॥ యుక్తకాలమందు నుద్వాహమై సువ
ర్లక్ష్మియందు స్వగృహలక్ష్మియందు,
సుతచతుష్టయంబు, సుత గల్గ ఋణవిము
క్తుండు నాయెఁ గూకుదుండు నాయె. 8

సీ॥ అమరశేషముఁ బూరణము సేసి యింతప్డె
'బాలామర' ఖ్యాతి లీలఁ దాల్చె,
సాహితీప్రియులు ప్రశంసింప 'సాహిత్య
చక్రవర్తి' మహాయశము గడించె,
ప్రతిభమై విరచించి ప్రౌఢనిఘంటువుల్
'పండితరాయ'లన్ ప్రథ వహించె,
కోరి శ్రీవిక్టోరియారాణి యిడు వేయి
దీనారముల బహుమాన మందె.

గీ॥ బ్రౌనుదొర మున్నుగాఁ గల ప్రాజ్ఞజనుల
మన్ననలఁ గనెఁ, బేర్గన్న చెన్ననగర
పండితులలోన నగ్రగణ్యుండు నాయె,
మేటి వేంకటబుధుఁడు మామిడి కులుండు. 9

ఉ॥ అష్టశతావధానముల నద్భుతరీతి నొనర్చుచున్ మహా
కష్టములైన ప్రశ్నలడుగన్ సభయందునఁ బృచ్ఛకుల్ తదీ
యేష్టమె తీర్చు వేంకటబుధేంద్రుఁడు మామిడి వంశ్యుఁ డెంత వి
రుష్ట కవిత్వ మంచు విబుధుల్ తను మెచ్చి బహూకరింపఁగన్. 10

శా॥ సంసారంబిటు సౌఖ్యదాయకముగా సాగంగ, వేదాంత మీ
మాంసన్ గాలముఁ బుచ్చు నా బుధున కిమ్మాడ్కిన్ మదిందోఁచె సో౽
హం సో౽హమ్మను ధ్యానవేళ నొకనాఁ డస్మత్కులంబందు వి
ధ్వంసంబందఁగనేల వైదికకృతుల్ వైశ్యుల్ ద్విజన్ముల్ గదా? 11

ఉ॥ దీని విచారమున్ సలిపి ధీరులతో నెటు వైశ్యజాతిలో
మానిత వేదసంస్కృతులు మాసెనొ! తేలెడు దాఁక నిద్దురన్
బోనని గట్టి పట్టుదలఁ బూని సహాయులు లేమి స్వస్థలిన్
జ్ఞాని యతండు చేరె నిజసంఘము స్వాగతమీయ బందరున్. 12

ఉ॥ బందరు సుప్రసిద్ధమగు పట్టణ, మందలి వైశ్యజాతిలోఁ
గొందఱు సంస్కృతప్రియులు, గొందఱు వైదికధర్మతత్పరుల్,
కొందఱు పండితుల్, కవులు కొందఱు, కొందఱు ధీరు, లుంట నా
నందముఁ జెంది యాతఁడు కనంగలిగెన్ జయలక్ష్మి ముంగలన్. 13

క॥ ద్విజులకె వేదోక్తంబులు,
ద్విజశబ్దార్థంబు ధరణిదేవులు, భూమీ
భుజులున్, వైశ్యులు, గాఁగ, వ
ణిజులకు లోపింపనేల నిగమోక్తవిధుల్. 14

శా॥ అన్యాయంబిది యంచు న్యాయసభలం, దామ్నాయ ఘంటాపథా
ధ్వన్యల్ నిండినచోట, రచ్చల, వివాదం బేర్పడంగా మహో
పన్యాసంబు లొనర్చుచున్ గెలిచి స్వప్రత్యర్థులన్ వెండియున్
మాన్యుండీతఁడు నిల్పె వైశ్యులకు నామ్నాయోక్త సంస్కారముల్. 15

క॥ పంచశిఖ లిడుచు బాలుర
కంచితగతిఁ దాఁ బురోధ యయి వడుగులు చే
యించె నితఁ డల్లరుల కే
తెంచిన కుటిలుల నెదిర్చి ధీరత మెఱయన్. 16

మ॥ ప్రతినం బూనె స్వజాతిఁ బాదుకొను దౌర్భాగ్యంపు టాచారమున్
విత గావింప, స్వజన్మదేశ సుఖమున్ వీడెన్ బరావాసమే
గతి గాఁగన్ మసలెన్ వ్యయించె ధనమున్ గష్టాలకుం బాల్పడెన్
మతిమన్ముఖ్యుఁడు వేంకటార్యుఁడు స్వధర్మస్థాపనాచార్యుఁడై. 17

మ॥ తమ యత్నంబిటు వ్యర్థమై చెడఁగఁ బ్రత్యర్థుల్ మహేర్ష్యాళువుల్
క్షమఁ గోల్పోయి తదీయ పుస్తక విమర్శల్ సల్ప నవ్వానికిన్
క్రమమౌ నుత్తరమిచ్చెఁ బండితుఁడు తత్కార్యంబు తత్కీర్తికే
గమకం బాయెను సత్ఫలంబు లిడ వెక్కాలంబునన్ దుష్కృతుల్. 18

గీ॥ బందరుపురీ వసద్వైశ్యబృంద మిట్లు
సాయపడి యెల్ల విధముల జయముఁ గూర్ప
వేంకటార్యుండు శిష్టజీవితము నటనె
కడపె హాయిగ స్వీయులు గారవింప. 19

గీ॥ ద్విజులగుట వైశ్యులకు వేదవిహిత సంస్కృ
తులను వెలయించెఁ బూజించెఁ బలుకుఁబోఁటిఁ
గృతిసుమంబుల వీక్షించె సుతుల వృద్ధి
మించు కీర్తి గడించె మామిడి కులుండు. 20

గీ॥ శ్రీమదాత్మూరి లక్ష్మీనృసింహసోమ
యాజివైశ్యసమాజ మీ యనఘు కృతుల
గర్భమునఁ దాల్చి కాపాడె నర్భకులను
గన్న తల్లి విధంబుగా నెన్ని యేండ్లొ॥ 21

సీ॥ గణ్యమౌ శబ్దార్థకల్పతర్వాఖ్య కో
శ మ్మాంధ్రదీపికా సాధుకృతియు
ఆంధ్రలక్షణము పేరలరు లక్షణశాస్త్ర
మలఘు రేఫంబులఁ దెలుపు కృతియు
తన పేరితో వెలసిన వ్యాకరణము వి
నూత్నమౌ పర్యాయరత్నమాల
శ్లాఘనీయ విశేషశబ్ద చింతామణి
యమరశేషంబున కనతి వివృతి

గీ॥ వైశ్యధర్మప్రకాశికా ప్రకటితార్య
తత్కులాచారబోధి సుధామణియును
మొదలుగాఁ గల కృతిరత్నములు జనించె
నమల వేంకటబుధ కలశాబ్ధియందు. 22

గీ॥ వీని వాసవి....సమితియే వెలయఁ జేయు
తలఁపుతో మచ్చునకుఁ దొలుదొలుతగాఁ బ్ర
కాశిత మొనర్చె శబ్దార్థకల్పతరువు
శుద్ధచైతన్యయతి పరిశోధకుఁడుగ. 23

గీ॥ ఆంధ్రదీపిక రెండవవదందు వేంక
టార్య జీవితమును సంగ్రహముగ వ్రాయ
నడిగె నను శుద్ధచైతన్య యతివరుండు
మాకు *మిత్రుండు పూర్వాశ్రమమ్మునందె. 24

ఉ॥ ఈ యతివర్యు వాంఛితము నేనెటు తీర్పక యుందు నక్కటా!
కాయము జాడ్యపీడితము గావున నించుక సంశయించితిన్
వ్రాయఁగ లేఖినిం గొన నపారముగా నది సాగె సాయమై
శ్రీయుత శుద్ధచిద్యతివరేణ్యుఁడె యీ పని నిర్వహించెనో! 25

గీ॥ ఏతదుత్తమకోశ విఖ్యాతనిధుల
జ్ఞానభక్తి విరాగాద్యనూనమణులు
కొల్లగానుండె బుధులేఱుకొన్నఁడు సాంద్ర
చంద్రికాచ్ఛాయఁ గల్పద్రుశాఖనీడ. 26

7–4–65
గుంటూరు

ఇట్లు
కవిశేఖర, శతావధాని,
పళ్లె పూర్ణప్రజ్ఞాచార్యులు

---

* ఆచార్యులవారికడ నేను పూర్వాశ్రమమున భారవికావ్యమును వైయాకరణసిద్ధాంతకౌముదిని కొంత కొంత చదువుకొని యుంటిని. శిష్యుడు పుత్రసముడు. ఐనను "ప్రాప్తే తు షోడశే వర్షే పుత్రం మిత్రవదాచరేత్" అనెడి సూక్తి ననుసరించి ఆచార్యులవారు నన్ను మిత్రుడనిరి.
— స్వామి

# గ్రంథ ప్రాశస్త్యము

అకారాద్యక్షర క్రమమున గూర్చిన అన్ని తెలుగు నిఘంటువు లకు ఈ యాంధ్రదీపిక తల్లి యనిన అతిశయోక్తి కాజాలదు.

1. ఎ. డి. కాంబెలు అను నాంగ్లపండితుని తెలుగు–ఇంగ్లీషు నిఘంటువు, 2. బ్రౌనుదొర కూర్చిన బ్రౌణ్యము (తెలుగు–ఇంగ్లీషు నిఘంటువు), 3. లక్ష్మీనారాయణీయము (అచ్చాంధ్ర నిఘంటువు), 4. శబ్దార్థచంద్రిక, 5. ఆంధ్రవాచస్పత్యము, 6. శబ్దార్థదీపిక (ఈ మూడు మిశ్రాంధ్ర నిఘంటువులు) ఇవి ఆంధ్రదీపికా సాహాయ్యమును పొందిన నిఘంటువులన్న సంగతి ఈ నిఘంటువుల కర్తలు తమ నిఘంటువుల పీఠికలలో వ్రాసిన దానినిబట్టి సుస్పష్టమే.

వావిళ్ల నిఘంటువు, శబ్దరత్నాకరము, సూర్యరాయాంధ్ర నిఘంటువు– ఇవి ఆంధ్రదీపికా సాహాయ్యమును పొందినట్లు ఏతద్గ్రంథ కర్తలు తెలుపలేదు. ఐనను పైనిపైని అంతస్తులకు క్రిందిక్రింది అంత స్తులవలె ఉత్తరోత్తర నిఘంటువులకు పూర్వపూర్వ నిఘంటువు లాధా రములు గావున కొంచెమో గొప్పయో ఆధునికనిఘంటువులు బ్రౌణ్య నిఘంటు సాహాయ్యమును తప్పక పొందియే యుండును. ఆ బ్రౌణ్యము ఆంధ్రదీపికను సహాయముగా గొనినది గావున అన్ని నిఘంటువులకును సాక్షాత్తుగాగాకున్నను పరంపరగానైనను ఆంధ్రదీపిక ఆదర్శప్రాయము ఆధారమునై యున్నదన్న సంగతిని ఒప్పుకొనక తప్పదు గావున అన్ని నిఘంటువులకు ఆంధ్రదీపిక తల్లి యనవలెను. తల్లిపోలిక బిడ్డలయందు గనబడునట్లు అన్ని నిఘంటువులయందును ఆంధ్రదీపికలోని పదములు యథాతథము కొన్ని, *కొలది మార్పులతో కొన్ని కనబడుచున్నవి. ముద్రితమయిన ఆంధ్రదీపిక యొకటి గలదు. అది కొద్దిమార్పులుగలిగి చాలవఱకీ యాంధ్రదీపికను బోలియేయున్నది. వ్రాతప్రతిలోగల చాల పదములు ముద్రితప్రతిలో లేవు. ఆంధ్రదీపిక–వ్రాతప్రతి యొకటి పశ్చిమ

---

* పర్వతమునకు కొండయని, ఉదకమునకు జలమని, ఏనుగునకు గజ మని, లతకు తీగెయని, తీగెకు లతయని సంగ్రహముగా నున్నవానిని విస్తరించియు, విస్తృతముగా నున్నవానిని క్లుప్తపఱచియు ఇప్పటి నిఘంటువులలో కొన్ని యర్థములు గన్పట్టుచున్నవి.

గోదావరిజిల్లాలోని "రాయకుదురు" గ్రామమున శ్రీ వల్లూరి జమీందారుగారి గృహమున గలదు. మఱొకటి రాజమండ్రి—శ్రీగౌతమీ విద్యాపీఠమున నున్నట్టు తెలిసినది. ఇంకను అనేకులయొద్ద ఈ వ్రాత ప్రతు లుండియుండును. మాకు లభించిన ప్రతి బందరు శ్రీ ఆతుక్కూరి లక్ష్మీనృసింహసోమయాజి వైశ్యసమాజము వారిచే వారి లైబ్రరీ యందు కాపాడబడియున్నట్టిది. దానినే మేము సంస్కరించి ఏతద్గ్రంథ రూపమున ముద్రింపించితిమి.

## అచ్చాంధ్ర మిశ్రాంధ్ర నిఘంటువులు

| | |
|---|---|
| చౌడప్ప సీసపద్యనిఘంటువు | ఆంధ్రపదాకరము |
| శ్రీ వేంకటేశాంధ్రము | ఆంధ్రపద పారిజాతము |
| ఆంధ్రనామసంగ్రహము | లక్ష్మీనారాయణీయము |
| ఆంధ్రనామశేషము | శబ్దరత్నాకరము |
| సాంబనిఘంటువు | శబ్దార్థచంద్రిక |
| ఆంధ్రభాషార్ణవము | శబ్దార్థదీపిక |

## సంస్కృతనిఘంటువులు

| | |
|---|---|
| అమరకోశము | శబ్దార్థకల్పతరువు |
| త్రికాండశేషము | (మేము ముద్రింపించినది) |
| నానార్థరత్నమాల | శబ్దార్థచింతామణి |
| విశ్వనిఘంటువు | తారానాథవిరచిత |
| మేదినీకోశము | వాచస్పత్యము |
| శబ్దకల్పద్రుమము | హారావళి |

వ్రాతప్రతిలో లేని కొన్ని పదములను ఈ నిఘంటువులలోనుండి యిందు చేర్చియున్నాము. వృద్ధయయినతల్లికి పెద్దవారైన బిడ్డలవలె ఈ యాంధ్రదీపికకు ఇప్పటి ఆంధ్రనిఘంటులు ఇంచుక అక్కఱకువచ్చెను. ఎవడో పోకిరి వ్రాతప్రతిలో అక్కడక్కడ కొన్ని బూతులు వ్రాసియున్నాడు. పదములను వర్గాంతరములలోజేర్చి వ్యత్యస్తము చేసియున్నాడు. "అంసకూటము"ను "హంసకూటము" అని. ఇత్యాదులు. వర్గ ద్వితీయ చతుర్థాక్షరములను ర-ఱ-లను సైతము వ్యత్యస్తముల గావించెను. అట్టివానిని చాల కష్టపడి సవరింప వలసి వచ్చెను.

అన్ని నిఘంటువులలోను దోషములుండియేయున్నవి. యథాశక్తి వానిని సవరణచేసి యిందు చేర్చుకొంటిని. సంస్కృతనిఘంటువుల లోని పదములు కొన్నిమాత్రము ఇందుగలవు. చాలవఱకు అన్నిపదము లను, అన్ని అర్థములను, విపులముగ—విశదముగ—సమగ్రముగ—మేము ముద్రింపించిన శబ్దార్థకల్పతరువునందు జూడదగును.

తల్లిదండ్రులకంటె బిడ్డలు కొన్నికొన్ని విషయములలో ప్రాజ్ఞులయ్యును తల్లిదండ్రులయందు సదా కృతజ్ఞులు, వినయవిధేయతలు గలవారును అయియేయుండవలెను; దశరథునియెడ రామచంద్రునివలె. ఆధునిక నిఘంటువులు (శబ్దరత్నాకరము, వావిళ్ల నిఘంటువు, సూర్యరాయాంధ్రనిఘంటువు) కొన్ని కొన్ని విషయములలో వైశిష్ట్యము గలిగినవియయియున్నను తల్లియయిన ఆంధ్రదీపికయందు కృతజ్ఞము లయియుండవలెను. అన్ని తెలుగు నిఘంటువులును సహాయకగ్రంథము లలో ఆంధ్రదీపికనుచూపి తమ సహృదయతను ప్రకటించుకొనినవి. అధికమగుగాక, అల్పమగుగాక, స్వల్పమగుగాక! సాహాయ్యమది యెట్టి దయినను సాహాయ్యమేయగును. బ్రౌను దొరగారి తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు సాయపడలేదని ఆధునికమయిన యే పెద్ద నిఘంటువయినను అన సాహసింపగలదా? ఆ బ్రౌనుదొర తననిఘంటువులో ఆంధ్రదీపికను శబ్దార్థకల్పతరువును ఏతద్గ్రంథకర్తలయిన శ్రీ మామిడి వెంకయ్యగారిని స్మరించియు, వ్రాసియు తన సహృదయతను చాటియున్నాడు. అదిగదా సహృదయత మఱియు సుహృదయతయు.

## ధన్యవాదములు

పూర్వము విక్టోరియా ప్రభుత్వమువలెనే యిప్పటి మన కేంద్రప్రభుత్వమువారును ఈ యాంధ్రదీపికకును, ఏతద్గ్రంథకర్తృ కృతమగు సశేషామరకోశ మనెడి మఱొక గ్రంథమునకును 8250 రూపాయలు సాహాయ్యమొనర్చి ఏతద్గ్రంథ ముద్రణమునకు ప్రధానోపకారకులయి యున్నారు గావున వీరికి శ్రీ వాసవీసమితి ధన్యవాదము లర్పించుచున్నది; నేనును.

## కృతజ్ఞత

మేము వెలువఱిచియున్న శబ్దార్థకల్పతరు-ముద్రణమువలెనే యీ నిఘంటు ముద్రణమును గుంటూరుపుర వాస్తవ్యులు సంపన్నులును వదాన్యులును నిత్యము గాయత్రీజప దేవతార్చనాది వేదోక్త

కర్మానుష్ఠానమహితులును ఔపనిషదతత్త్వాన్వేషణాసక్తులున్నైన శ్రీ చక్కా సుబ్బారావుగారు, శ్రీ కర్పూరపు వేంకటనారాయణగారు, శ్రీ కన్యకాపరమేశ్వరీ సత్రమువారు,మఱియు ప్రార్థనాసంఘ సభ్యులు-వీరి యౌదార్యముతో నిశ్చింతముగా పూర్ణము చేయగలిగితిని.

కల్పతరు పరిష్కరణమునవలెనే ఏతద్గ్రంథ పరిష్కరణమునను మిత్రుడు "న్యాయవేదాంతశిరోమణి" శ్రీనారాయణమూర్తి సహాయుడాయెను. వీ రెల్లరియెడ వాసవీసమితి పక్షమున, నా పక్షమునను సదా కృతజ్ఞుడనయి యుండుటయేకాక వీరల కితోధికముగా శ్రేయః ప్రేయముల గూర్చును గాక యని మదిష్టదైవతమగు శ్రియఃపతిని ప్రార్థించుచున్నాను.

శబ్దార్థకల్పతరువువలె ఈ గ్రంథముగూడ అకారాద్యక్షరాను క్రమముతో బాటు కకారాది ప్రాసబద్ధముగా నుండి యించుక రచనా వైలక్షణ్యము గలిగి యున్నది. పదములకు అర్థములు వ్యావహారిక భాషలో వ్రాయబడియున్నవి. ఆంధ్ర భాషావైదుష్యముగాని గ్రంథ పరిష్కరణ సామర్థ్యముగాని ముద్రణ కార్యనిర్వాహణశక్తిగాని నాకు లేకున్నను పెద్దలు సమర్థులైనవారు పూనుకొననందున సమితిమిత్రుల సదాశయము ననాదరింపక యీ భారమును శిరసావహించి యథామతి యథాశక్తి గ్రంథమును పరిష్కరింపబూని హరికృపచే నేటికి కార్యక్రమమును సంపూర్ణము గావింపగలిగితిని. "యదత్ర సౌష్ఠవం కించిద్వేంకటార్యస్య నో మమ। యదత్రాసౌష్ఠవం కించిత్తన్మమైవార్యకస్య న॥" అని తెలుపుచు 'హంసో యథా క్షీర మివాంబుమిశ్రమ్మ'నెడి సూక్తిని స్మరించి పురోభాగులుగాక గుణగ్రహణశీలు రయ్యెదరుగాక యని విబుధులను సవినయముగ ప్రార్థించుచున్నాను.

ఓంతత్ సత్

మకాము :
గోసంరక్షణసంఘము
గుంటూరు. 7-4-1965

ఇట్లు
శుద్ధచైతన్యస్వామి

## ఇష్టదేవతావందనము

వందే వందారుసందోహమందారం గిరిమందిరమ్ ।
కుందేందుసుందరం దేవం నందనందనవందితమ్ ॥

ఉ॥ శ్రీజగదీశ్వరు న్నిగమసేవితు సేవకసేవధిన్ హృదం
భోజమునందు నిల్పి మతిపుష్పము పాదమునందుఁ గొల్పి వి
భ్రాజితభక్తి సల్పి సుకరంబుగఁ గొల్చెద నిన్ను విశ్వమూ
ర్తీ జగతీసతీరథ రతీసుదతీశహృతీ సతీపతీ. ॥౧॥

చ॥ పరమకృపామతీ సుజనభక్తతతీ నిగమాంతసన్నుతీ
సరసశరాకృతీ వృషభచారుగతే ద్యువదీసరస్వతీ
భరణసదారతీ విశదపాదధృతీ సుకృతీక్షణాదృతీ
స్థిర జగతీసతీరథ రతీసుదతీశహృతీ సతీపతీ. ॥౨॥

చ॥ శరణని మ్రొక్కెద న్మొదల చారుమదీయహృదంబుజాంతరాం
తరగురుకర్ణికాప్రకటితారకతారనవాసనాంచిత
స్ఫురదగజోపగూహనవిపూరితభూరితరోత్సవా ప్రు నిన్
స్థిర జగతీసతీరథ రతీసుదతీశహృతీ సతీపతీ. ॥౩॥

క॥ త్వష్ట్రభివందితపద సా
రాష్ట్రాంచద్ధ్యానలోల రాజమకుట సా
రాష్ట్రికకంఠా శ్రేయో
రాష్ట్రప్రద పాలకొలని రామేశ శివా. ॥౪॥

క॥ కృతాస్నమరవందిత శ
శ్వత్స్నపనప్రియ మహేశ సర్వగ సేవా
కృత్స్నిగ్ధదయాకరణ స
రత్స్నహా పాలకొలని రామేశ శివా. ॥౫॥

క॥ రుద్ధ్వస్తత్రిపురకుహూ
నిద్ధ్వాంతా నీలకంఠ నిర్మలనిలయా

ఖ్రేడ్ధ్వానాట్టహాసనగో
రాడ్ధ్వజ శ్రీపాలకొలని రామేశ శివా. ||౬||

వాఃపతితూణా వేదవ
చఃపరిమాణాతిదూర శశధరదహనా
హాఃపనయన మునిహృదయస
రఃపద్మా పాలకొలని రామేశ శివా. ||౭||

నేను మామిడివంశాంబునిధివిధుండ
సూరనామాత్యు పౌత్రుండ సుజనహితుఁడ
వేంకనార్యుని పుత్రుండ వినుతయశుఁడ
వేంకటార్యసమాఖ్యచే వెలయువాఁడ. ||౮||

నా యొనర్పంబూనిన విన్నపం బవధరింపుము సంస్కృతశబ్దంబులు పర్యాయంబులు దెలియుటకై తొల్లి యమరసింహుం డొనర్చిన నామలింగానుశాసనత్రికాండంబు వేయునాఱు నూఱు శ్లోకంబులలో విశేషపర్యాయంబులు నక్కడక్కడ ఫక్కికలు పూర్ణంబు లౌటకు నేను రెండువేల శ్లోకంబులు గూర్చి యంతయు మూఁడువేలు నాఱు నూఱు శ్లోకంబులకు విశేషశబ్దచింతామణి యను వ్యాఖ్యానంబు రచియించి యా పిమ్మట సంస్కృతశబ్దంబులకు నానార్థములు దెలియుటకు పదునాలుగు నిఘంటు లేకీభావంబు చేసి వానియందుఁ గల శబ్దంబులు సంకేతరూపంబుగాఁ గూర్చి ముప్పదియైదు కాండంబులు మూఁడు భాగంబులుగా శబ్దార్థకల్పతరువను గ్రంథం బొనర్చి యున్నంత నస్మన్మిత్రులు విద్వజ్జనంబులుంగూడి యాంధ్రంబున పెక్కు నిఘంటులు లేవనియు నాంధ్రనామసంగ్రహంబు మిక్కిలి క్లిష్టంబనియును నీవు నన్నయభట్టకృతాంధ్రశబ్దచింతామణివ్యాకరణంబును తద్వివేచకంబులగు నహోబల పతీ(పండితీ) యాదిగ్రంథంబులు నాథర్వణవ్యాకరణంబు నాంధ్రకౌముదీవ్యాకరణంబు వికృతిచంద్రికావ్యాకరణంబు నప్పకవీయంబు మొదలగు ఛందోగ్రంథంబులందు పరిచితి.గలవాఁడవు గావున నీ

## ఇష్టదేవతావందనము

వందే వందారుసందోహమందారం గిరిమందిరమ్ ।
కుందేందుసుందరం దేవం నందనందనవందితమ్ ॥

ఉ॥ శ్రీజగదీశ్వరు న్నిగమసేవితు సేవకసేవధిన్ హృదం
భోజమునందు నిల్పి మతిపుష్పము పాదమునందుఁ గొల్పి వి
భ్రాజితభక్తి సల్పి సుకరంబుగఁ గొల్చెద నిన్ను విశ్వమూ
ర్తీ జగతీసతీరథ రతీసుదతీశహృతీ సతీపతీ. ॥౧॥

చ॥ పరమకృపామతీ సుజనభక్తతతీ నిగమాంతసన్నుతీ
సరసశరాకృతీ వృషభచారుగతీ ద్యుపదీసరస్వతీ
భరణసదారతీ విశదపాదధృతీ సుకృతీక్షణాదృతీ
స్థిర జగతీసతీరథ రతీసుదతీశహృతీ సతీపతీ. ॥౨॥

చ॥ శరణని మ్రొక్కెద న్మొదల చారుమదీయహృదంబుజాంతరాం
తరగురుకర్ణికాప్రకటితారకతారనవాసనాంచిత
స్ఫురదగజోపహూతనిపూరితభూరితరోత్సవా ప్రు నిన్
స్థిర జగతీసతీరథ రతీసుదతీశహృతీ సతీపతీ. ॥౩॥

క॥ త్వష్ట్రాభివందితపద సౌ
రాష్ట్రాంచద్గ్రానలోల రాజమకుట సౌ
రాష్ట్రికకంఠా శ్రేయో
రాష్ట్రప్రద పాలకొలని రామేశ శివా. ॥౪॥

క॥ కృత్స్నామరవందిత శ
శ్వత్స్నపనప్రియ మహేశ సర్వగ సేవా
కృతిస్నిగ్ధదయాకరణ స
రత్స్నేహా పాలకొలని రామేశ శివా. ॥౫॥

క॥ రుద్ధ్వాస్త్రత్రిపురకుహూ
నిద్ధ్వాంతా నీలకంఠ నిర్మలనిలయా

క్రేద్ధ్వానాట్టహాసనగో
రాద్ధ్వజ శ్రీపాలకొలని రామేశ శివా. ||౬||

వాఃపతితూణా వేదవ
చఃపరిమాణాతిదూర శశధరదహనా
హాఃపనయన మునిహృదయస
రఃపద్మా పాలకొలని రామేశ శివా. ||౭||

నేను మామిడివంశాంబునిధివిధుండ
సూరనార్యుని పౌత్రుండ సుజనహితుఁడ
వేంకనార్యుని పుత్రుండ వినుతయశుఁడ
వేంకటార్యసమాఖ్యచే వెలయువాఁడ. ||౮||

నా యొనర్పంబూనిన విన్నపం బవధరింపుము సంస్కృతశబ్దంబులు పర్యాయంబులు దెలియుటకై తొల్లి యమరసింహుం డొనర్చిన నామలింగానుశాసనత్రికాండంబు వేయునాఱు నూఱు శ్లోకంబులలో విశేషపర్యాయంబులు నక్కడక్కడ ఫక్కికలు పూర్ణంబు లౌటకు నేను రెండువేల శ్లోకంబులు గూర్చి యంతయు మూఁడువేలు నాఱు నూఱు శ్లోకంబులకు విశేషశబ్దచింతామణి యను వ్యాఖ్యానంబు రచియించి యా పిమ్మట సంస్కృతశబ్దంబులకు నానార్థములు దెలియుటకు పదునాలుగు నిఘంటు లేకీభావంబు చేసి వానియందుఁ గల శబ్దంబులు సంకేతరూపంబుగాఁ గూర్చి ముప్పదియైదు కాండంబులు మూఁడు భాగంబులుగా శబ్దార్థకల్పతరువను గ్రంథం బొనర్చి యున్నంత నస్మన్మిత్రులు విద్వజ్జనంబులుంగూడి యాంధ్రంబున పెక్కు నిఘంటులు లేవనియు నాంధ్రనామసంగ్రహంబు మిక్కిలి క్లిష్టంబనియును నీవు నన్నయభట్టకృతాంధ్రశబ్దచింతామణివ్యాకరణంబును తద్వివేచకంబులగు నహోబలపతి(పండితీ) యాదిగ్రంథంబులు నాథర్వణవ్యాకరణంబు నాంధ్రకౌముదీవ్యాకరణంబు వికృతిచంద్రికావ్యాకరణంబు నప్పకవీయంబు మొదలగు ఛందోగ్రంథంబులందు పరిచితి.గలవాఁడవు గావుననీ

యాంధ్రంబున సకలశబ్దంబులు సంకేతరూపంబులుగాఁ గూర్చి యేకార్థ నానార్థంబు లేర్పడునట్లుగా నొక గ్రంథంబు నిర్మింపుమని యుపదేశించు టంజేసి వారి యనుమతి యంగీకరించి యుండునంత స్వప్నంబున మద్గురు స్వామి...దర్శనంబిచ్చి నీవు సేయు నుద్యోగంబు సమీచీనం బస్మదర్థ కరంబని యానతీయుడు నదియ గుహేశ్వరుండవగు నీ యనుగ్రహం బుగా గ్రహించి యాంధ్రశబ్దజాలసంకేతరచనాచాతురీధురీణంబగు నీ యాంధ్రదీపికానామక గ్రంథంబు సేయ సమకట్టితి. సంకేతంబెట్టిదనిన సకలశబ్దంబులు నాద్యక్షర క్రమంబుచేత కూర్చఁబడుచున్నవి.*

---

* ఇట అరటావు పరిమితి గల 12 పుటలలో వ్యాకరణవిషయములు కొన్ని వ్రాయబడి పిమ్మట అకారాదిగా గ్రంథ మారంభింప బడినది. ఈ వ్యాకరణ విషయములొక చిన్న గ్రంథముగా ప్రకటింప దలంపు గలదు.—స్వామి.

## సంజ్ఞలు

అ. క్రి. అకర్మకక్రియ.
అప. అపదము.
అప్ర. అప్రసిద్ధము.
అవ్య. అవ్యయము.
ఇం. ఇంగ్లీషు.
ఉప. ఉపపదము, లేక ఉపసర్గము.
క్రి. విశే. క్రియావిశేషణము.
గ్రా. గ్రామ్యము.
ద్ర. ద్రుతము.
ప్రే. ప్రేరణము.
బ. బహువచనము.
మి. మిశ్రము.
మొ. మొదలైనది.
రూ. రూపాంతరము.
వా. వాడుక.
వ్య. వ్యవహారము.
విశే. విశేషణము.
స. సర్వనామము.
సం. సంస్కృతము.
స. క్రి. సకర్మక క్రియ.
హిం. హిందుస్తాని.
, పర్యాయ పదము.
; భిన్నార్థకము.
[ క్రింది పంక్తియొక్క శేషము.
† చెట్లు, చేమ మొ.
? సంశయాస్పదములు, లేదా (పూర్వకవి ప్రయోగములున్నను) వ్యాకరణవిరుద్ధములైన పదములు, అర్థములును. ('అక్షోహిణి, ప్రౌఢిమ' అను మొ*)

గ్రంథము మొత్తము చాలవఱకు దేశ్యములతోను విశేష్యములతోను నిండి యున్నందున ఎట్టిసంజ్ఞ ఉండని పదములు "దేశ్యములు, విశేష్యములు" నని యెఱుగ దగినవి.

---

* 'భద్రం కర్ణేభిః' 'అక్షభిర్యజత్రాః' అనెడి శ్రుతివాక్కులవలె, 'త్రియంబకం దదర్శ' అనెడి ఋషి వాక్కులవలె 'అక్షోహిణి' ఇత్యాది ప్రయోగములు నిరంకుశులయిన మహాకవులకే చెల్లునుగాని మనబోటివారి కట్టి నిరంకుశత తగదు. మనము వ్యాకరణ విరుద్ధముగా పదప్రయోగము గావించిన ప్రత్యవాయమునకు లోనయ్యెదము.

పరిష్కర్త—స్వామి.



# ఆంధ్రదీపిక

## అ

అ. సం. విష్ణువు; బ్రహ్మ; శివుఁడు; ఓంకారములోని మొదటిమాత్ర; విశ్వుఁడనఁబడెడి స్థూలదేహాభిమానియగు జీవుఁడు; వైశ్వానరుఁడు; విరాట్టు, ఒక భగవద్విభూతి, అక్షర సమామ్నాయము నందలి మొదటి యక్షరము. అవ్య. శీఘ్రత, వెంటనే; ఆక్షేపము; నిషేధము.

అ. సం. అవ్య. సాదృశ్యము; అభావము; అన్యత్వము; అల్పత్వము; అప్రాశస్త్యము; వ్యతిరేకము, విరోధము. (ఇచటి అకారము నకారము లోపింపఁగా వచ్చినట్టిది.)

అ. ఇది తర్వాతి యక్షరమునకు ద్విత్వము పుట్టించి తచ్ఛబ్దార్థకమగును. (అక్కాలము, అక్కోమలి అద్దేశము అని).

అ. అవ్య. ఆశ్చర్యము; ప్రార్థనార్థక క్రియలపై అనుప్రయుక్తమగునది; అంగీకారము; ప్రశ్న; లేమి; అనంతటు; బొత్తిగా; ఎ, ఏ, మాత్రము, నిశ్చయార్థకము (అర్జునుఁడసుమ్మ అని).

అఆలు. బ. అ ఆ లను రెండక్షరములు; అచ్చులు.

అంక. ప్రక్క, పార్శ్వము; అంక.

అంకంబువాఁడు. రాజముద్రాధారి.

అంకకాఁడు. మి. విణ. మచ్చరీఁడు; కళంక సహితుఁడు; హారము గలవాఁడు.

అంకకారము. సం. విణ. పోరుసలుపునది, ప్రతిఘటించునది; ఔపమ్యవాచకము.

అంకచండాలము. రోఁత.

అంకణము. తొట్టికట్టు; కక్ష్య; నలుచదరపుచోటు; రెండు దూలముల మధ్య ప్రదేశము.

అంకన. సం. స్తుతి.

అంకనము. ఆనవాలు. సం. అంకెవేయుట; గుఱుతు వేయుట, ముద్రవేయుట; అచ్చు పొడుచుట; స్తుతించుట.

అంకపాలి(ళి). సం. ఆలింగనము, కౌఁగిలి; దాది; వేదిక, ఒకగంధద్రవ్యము; బొమ్మ; ఒడి (తొడ) పైభాగము.

అంకపీఠము. సం. పీఠమువలె నుండెడు తొడ పైభాగము.

అంక(కా)పొంకములు. బ. కోపము; విరోధము; శీఘ్రము; అధికము. విణ. ఉగ్రము.

అంకమాలికలు. సం. బ. స్తుతులు.

అంకము. ఆక్షేపము. సం. ఒడి; తొడ; తొడ ముందటి భాగము; చిహ్నము, గుఱుతు; యుద్ధము; సమీపము; ప్రకరణము; నాటక భేదము; అధ్యాయము; దశరూపకముల లో నొకటి; హృదయము, బొమ్మ; భాగము; అంకె, సంఖ్య; కళంకము; తొమ్మిది; మంత్రము; కొండ; యుద్ధ భూషణము; దేహము; దోషము; స్థానము, తావు; చిత్రయుద్ధము; పరంపరాసంబంధముగల చిహ్నము; స్తనభూషణము; కటిప్రదేశము; స్తోత్రము; నాటక పరిచ్ఛేదము.

అంకమ్మ. ఒక గ్రామదేవత.

అంకవంక. విణ. మెత్తనిది.

అంకవన్నియ(వన్నె). రికాబు.

అంకవిద్య. సం. గణిత శాస్త్రము.

అంకారించు. హిం. స. క్రి. లంగరు (ఓడ చాఁప) ఎత్తు.

అంకాల(ళ)మ్మ. ఒక గ్రామదేవత.

అంకించు. అ. క్రి. ఉల్లసిల్లు; స్తుతించు; పూను. స. క్రి. ఆడించు; జళిపించు; త్రిప్పు;

అపహరించు; పైకెత్తు; పట్టుకొను; భావించు; కలిగించు. సం. పొగడు.
అంకిణి. ఒక మల్లబంధము. [కారము.
అంకిణీలు. గుఱ్ఱపు జీనునకు చేయు అలం
అంకితము. సం. గ్రంథము నొకరికి కృతి యిచ్చుట. విణ. ఎంచఁబడినది; గుర్తు చేయఁబడినది; నామాద్యంకితము.
అంకియ. అంకె; అధీనత; చేరిక.
అంకియము. అంకెము; రికాబు.
అంకిలి. కలఁత; ఆపద; దౌడ కింది సీలు; ఆటంకము, ప్రతిబంధము. [ఆగిపోవు.
అంకిలిపడు. అ. క్రి. అడ్డపడు; కష్టపడు;
అంకిలిపాటు. అడ్డపాటు.
అంకిలిపెట్టు. స. క్రి. అడ్డగించు; కలఁత పెట్టు
అంకిళ్ళు. బ. దౌడకీళ్ళు.
అంకు. అంకమ్మ; దౌడకీలు.
అంకుఁడు. వేలుపు; పొందినవాఁడు.
అంకుటము. సం. కుంచెకోల.
అంకురము. సం. చిగురు; నీళ్ళు; నెత్తురు; మొలక; వెంట్రుక.
అంకురార్పణము. సం. ప్రారంభము; శుభకార్యములలో పంచపాలికలయందు నవధాన్యములు చల్లుటగల ఒక సంస్కారము.
అంకు(కూ)రించు. సం. అ. క్రి. మొలకెత్తు; కలుగు. [నది.
అంకు(కూ)రితము. సం. విణ. అంకురించి
అంకురిలు(ల్లు). సం. అ. క్రి. అంకురించు.
అంకులు. బ. దేవతలు.
అంకుశబీజము. సం. క్రోం.
అంకుశము. సం. (ఏనుఁగును శిక్షించెడి) ఆయుధము; ఆటంకము; ఒక ముద్ర.
అంకుసంబుమాద్రి. మి. మూలనక్షత్రము.
అంకుసము. అంకుశము.
అంకూరము. సం. చిగురు; మొలక; కొన.
అంకె. లెక్క; సంజ్ఞ, ఒకటి మొదలైన సంఖ్యలను దెలుపునట్టి రేఖ, అంకము; వశము, అధీనత; చేరిక; సమయము; అణక.
అంకెకాఁడు. విణ. ముఖ్యుఁడు.
అంకెగొను. స. క్రి. కప్పుకొను; క్రమ్ముకొను.
అంకెన. ఒక ఫలవృక్షము.
అంకెము. ఎద్దుమీఁది యొకవైపు గోనె; రికాబు (గుఱ్ఱమెక్కెడు సాధనము).
అంకెవన్నియ(వన్నె). రికాబు.
అంకోట(ర,ల)ము. సం. ఊడుగు† శ్లోకాలము†.?
అంకోలిక. సం. కౌఁగిలి.
అంకోల్లిక. సం. ఊడుగు†.
అంగ. కాలుచాఁచి పెట్టిన యడుగు.
అంగకము. సం. అగలు†.
అంగకర్మ. సం. దేహ సంస్కారము, అభ్యంగము గంధలేపనము మొ.
అంగజ. సం. కూఁతురు.
అంగజము. సం. నెత్తురు; రోమము, వెంట్రుక; మదము; రోగము. విణ. శరీరమునఁగలిగినది. [మన్మథుఁడు.
అంగజుఁడు. సం. కొడుకు; కాముఁడు,
అంగజ్వరము. సం. క్షయరోగము.
అంగజాల. రాణివాసపు కావలివాఁడు. రూ. అంగిజాలుఁడు.
అంగడి. కర్మాగారము; సభ; కచ్చేరి; దుకాణము, ఆపణము.
అంగడికెక్కు. అ. క్రి. రచ్చకెక్కు.
అంగడివాడ. బజారు.
అంగడిపెట్టు. స. క్రి. రచ్చకెక్కించు.
అంగణము. సం. ముంగిలి.
అంగద. ఆఁకలి; తిండిమీఁది అత్యాశ; ఆపద; సన్నాహము; ఉపద్రవము; కోపము; దిగులు; దుఃఖము; సంతాపము; సం. దక్షిణ దిగ్గజముయొక్క భార్య.
అంగదట్టము. మి. గాగరా, స్త్రీలు మొలకుకట్టుకొనెడి పావడ, యోగాపాంతరీయము, శరీరము కప్పు ముదుగు బట్ట.
అంగదము. సం. బాహుపురి.
అంగదుఁడు. సం. వాలికొడుకు.
అంగదేశము. సం. 56 దేశములలో నొకటి.
అంగన. సం. ఆఁడుది; ప్రశస్తమైన అవయవములుగల స్త్రీ; ఉత్తరదిగ్గజముయొక్క భార్య.
అంగనము. సం. పోకడ; ముంగిలి.
అంగనాజనము. సం. స్త్రీసముదాయము.
అంగనాప్రియము. సం. అశోకము†.
అంగన్యాసము. సం. మంత్రవిశేషము నుచ్చరించి కరస్పర్శచేత చేయఁదగిన తంత్రోక్తమగు న్యాసవిశేషము.

అంగపాలి (ళి.) సం. కౌఁగిలి.

అంగబిల్లము. మి. ఆఁడుబిడ్డల మొలనుగట్టెడు వెండి బంగారముల బిల్ల.

అంగభవుఁడు } సం. చూ. అంగజుఁడు.
అంగభువు

అంగమచ్చము. మి. గుర్తు.

అంగమర్దకుఁడు. సం. విణ. ఒడలుపట్టు సేవకుఁడు.

అంగమర్దనము } సం. ఒడలుపట్టుట.
అంగమర్దము

అంగమర్ది } సం. అంగమర్దకుఁడు.
అంగమర్దుఁడు

అంగము. అందము; విధము.-సం. శరీరము; అవయవము; అప్రధానము; భాగము; ఆలు; లగ్నము; మనస్సు; ఉపాయము; అంగదేశము. విణ. అవయవములుగలది; సమీపించినది. (చతురంగములు = రథ గజతురగపదాతులు. అంగపంచకము = ఉపాయము, సహాయము, దేశ కాల విభజనము, ఆపదకు ప్రతిక్రియ, కార్యసిద్ధి. పంచాంగములు = తిథివార నక్షత్ర యోగకరణములు. షడంగములు = శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము. సప్తాంగములు = స్వామి, అమాత్యుఁడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము. అష్టాంగములు = కరములు, చరణములు, ఉరము, లలాటము, భుజములు; మోఁకాళ్లు, కాళ్లు, చేతులు, ఱొమ్ము, మనస్సు, శిరస్సు, వాక్కు, కన్నులు. యోగ-అష్టాంగములు = యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణము, సమాధి. పంచదశయోగాంగములు = త్యాగము, మౌనము, దేశము, కాలము, మూలబంధము, దేహసామ్యము, దృక్స్థితి, యమాదు లెనిమిది.)

అంగమొల. మి. దిసమొల.

అంగమొలవేల్పు. మి. శివుఁడు.

అంగరంగభోగములు. బ. దేవతల విగ్రహములకును ఆలయములకును చేయు భోగములు.

అంగరకా. హిం. చొక్కా.

అంగరక్ష. సం. తాయెతు; మంత్రించిన విభూతి మొ.

అంగరక్షకుఁడు. సం. బంటు.

అంగరాగము. సం. గంధాదుల మైపూఁత; అఱుగఁదీసిన గంధము.

అంగరుహము. సం. కేశము; రోమము; గోరు.

అంగరేకు. మి. చొక్కా.

అంగరొల్లెలు. బ. భక్ష్యవిశేషము.

అంగలారుచు(ర్చు). అ. క్రి. దుఃఖించు; వెఱపుచే అఱచు.

అంగలారుపు(ర్పు). దుఃఖము; విచారము.

అంగలేపము. సం. మైపూఁత.

అంగళ్ళవాడ. అంగళ్ళ బజారు.

అంగవము. సం. వరుగు.

అంగవస్త్రము. సం. ఉత్తరీయము; కొల్లాయి గుడ్డ.

అంగవి త్ప్రాప్తి.

అంగవించు. అ. క్రి. యత్నించు. స. క్రి. అతిక్రమించు.

అంగవికలుఁడు. సం. విణ. అవయవ వైకల్యము గలవాఁడు.

అంగవికృతి. సం. మూర్ఛ.

అంగవిక్షేపము. సం. నృత్యము.

అంగసంస్కారము. సం. అంగరాగము; అభ్యంగస్నానాది దేహసంస్కారము.

అంగహారము } సం. నృత్యము.
అంగహారి

అంగహీనుఁడు. సం విణ. అవయవలోపము గలవాఁడు; మన్మథుఁడు.

అంగాంగిభావము. సం. గౌణ ముఖ్య భావము; ఉపకార్యోపకారకభావము.

అంగారకమణి. సం. పగడము.

అంగారకవారము. సం. మంగళవారము.

అంగారకుఁడు. సం. కుజుఁడు.

అంగారధాని. సం. కుంపటి.

అంగారమంజరి. సం. నిప్పువన్నె గుత్తుల కానుగు†.

అంగారము. సం. నిప్పు; బొగ్గు.

అంగారవల్లరి (వల్లి). సం. బారంగి†; గురివెంద†; అంగారమంజరి†.

అంగారశకటి. సం. కుంపటి.

అంగారసింధువు. సం. విణ. నిప్పుటేఱు.

అంగారి. సం. కుంపటి. [కుక్క.
అంగారిణి. సం. సూర్యుఁడు విడఁబాసిన
అంగారితము. సం. విణ. కాలినది.
అంగారుఁడు. సం. కుజుఁడు.
అంగి. అంగీ. సం. విణ. అవయవ సహితము; ముఖ్యము.
అంగిక. సం. చొక్కా; రవిక.
అంగిటిముల్లు. అంగిటనయ్యెడి వ్యాధి.
అంగిరసుఁడు, అంగిరుఁడు } సం. ఒక ఋషి, బృహస్పతి-తండ్రి.
అంగిరస్సు. సం. బృహస్పతి - తండ్రి; ఒక సంవత్సరము. [భాగము.
అంగిలి. లోనుత్తుక, జిహ్వామూలోర్ధ్వ
అంగిలిగుంట. వావిక, గళగర్తము.
అంగీ. మోఁగాళ్ళదాఁక జాఱుచొక్కా.
అంగీకరించు. సం. స. క్రి. సమ్మతించు, ఇయ్యకొను.
అంగీకారము. సం. సమ్మతి, ఇయ్యకోలు.
అంగీకృతము. సం. విణ. అంగీకరింపఁ (ఇయ్యకొనఁ) బడ్డది.
అంగీకృతి. సం. అంగీకరించుట.
అంగు. అందము; విధము. సం. చేయి.
అంగుటము. బొటనవ్రేలు, అంగుష్ఠము.
అంగుడుదుడిపి(దుడుపు). విణ. తెంటాలమారి.
అంగుదారు. విణ. సహకరించువాఁడు.
అంగురి. సం. వ్రేలు.
అంగురీ(ళీ)యకము, అంగురీ(ళీ)యము } సం. ఉంగరము.
అంగుల(ళ)ము. సం. వ్రేలు, ఎనిమిది యవోదరముల పరిమాణము; అంగుళి; బొటనవ్రేలు. [తోఁకము చివర.
అంగులి(ళి). సం. వ్రేలు; బొటనవ్రేలు;
అంగులి(ళి)తోరణము. సం. అర్ధచంద్రాకృతిగల చందనాది తిలకము.
అంగులి(ళి)త్రము (త్రాణము). సం. అత్రైము, వ్రేలితొడుగు, అంగుళికవచము.
అంగులి(ళి)ముద్ర(ముద్రిక). సం. ముద్దుటుంగరము. [చిటిక
అంగులి(ళి)మోటన(సందేశ)ము. సం.
అంగులీ(ళీ)కము, అంగులీ(ళీ)యకము, అంగులీ(ళీ)యము } సం. ఉంగరము.
అంగుష్ఠము. సం. బొటనవ్రేలు; అంగుళము.
అంగుళిస్ఫోటనము. సం. రెండువ్రేళ్ళతో చేసెడి చప్పుడు. [కొలత.
అంగుళీమానము. సం. జేనమూరమొదలైన
అంగూరు. హిం. ద్రాక్ష†.
అంహస్సు. సం. పాపము.
అంఘి, అంఘ్రి } సం. పాదము; చెట్టువేరు.
అంఘ్రినామకము. సం. వేరు, వృక్షమూలము.
అంఘ్రిపము. సం. వృక్షము.
అంఘ్రిపర్ణి(వల్లి). సం. కోలపొన్న†.
అంచలము. సం. బట్టయంచు; మైజాఱు; కొన.
అంచించు. అ. క్రి. అంచనవేయు.
అంచితము. సం. విణ. పూజింపఁబడ్డది; ఒప్పుచున్నట్టిది. [వాఁడు.
అంచితుఁడు. సం. విణ. పూజింపఁదగిన
అంచియ, అంచె } దారిలోని మకాము.
అంచెలు. బ.వ. ఋస; మకాములు; దఫాదఫాలు.
అంచె. హంస.
అంచెగుఱ్ఱపుజోదు, అంచెతత్తడి } హంసవాహనుఁడు, బ్రహ్మ.
అంచెతత్తడి చెలియ. హంస వాహన, సరస్వతి.
అంచెతేజీమేటి. బ్రహ్మదేవుఁడు.
అంచెన(నా). ఉజ్జాయింపు, పంటనుగాని వెలనుగాని ఇంతియని ఊహించుట.
అంచెపట్టు. అ. క్రి. ఊహచేయు.
అంచెన(నా)దారుఁడు. విణ. ఉజ్జాయించువాఁడు, చేను కొయ్యకముందు పంట అకళింపు చేయువాఁడు.
అంచెనవేయు. అ. క్రి. ఊహచేయు.
అంచెపదము. మి. హంసపాదము.
అంచెయాన. మి. హంసయాన, హంసవంటి నడకగల ఆఁడుది; స్త్రీ.

అంచె యేనుఁగు మావంతు. బ్రహ్మ ;
మన్మథుఁడు ?. [నుఁడు.
అంచెరవుతు(రౌతు). బ్రహ్మ,హంసవాహ
అంచెల. ప్రక్క.
అంచెలము. కోపము.
అంచెల విడిది. గంగ.
అంపు. బట్టకొంగు; బట్టలు మొదలగు వాని వెడల్పు చివర; విధము; కొన, తుద ; బండికంటి ఆకు ; చనుమొన; సమీపము ; ఓర. క్రి. పుచ్చు ; ఆజ్ఞా పించు, పంపించు, అరుగఁజేయు.
అంపులవాఁడు. చిత్రకారుఁడు.
అంపులు మోయు. అ. క్రి. ఇరుప్రక్కలను సందులేకుండ నిండియుండు.
అంజన. సం. హనుమంతునితల్లి; ఉత్తర దిగ్గజము-భార్య.
అంజనకాఁడు. అంజనము వేసి అగోచర మైనవానిని కనుగొనెడి మాంత్రికుఁడు.
అంజనకేశి. సం. గువ్వగుత్తి†.
అంజనక్రియ. సం. కాటుక పెట్టుట.
అంజనము. సం, కాటుక; రసాంజనము; సౌవీరాంజనము; బల్లి; వరుణదిగ్గజము; మిశ్రము చేయుట; పూయుట; మాలిన్యము; గమనము; వ్యక్తము చేయుట; సిరా; వ్యంజనావృత్తి; అగ్ని; మ్రక్షణము, అభ్యంజనము.
అంజనాధిక. సం. నల్లబల్లి. [భార్య.
అంజనావతి. సం. ఈశానదిగ్గజముయొక్క
అంజని. సం. మైపూఁతచే శోభించెడి స్త్రీ.
అంజనిక. సం. చిట్టెలుక; కాటుకబల్లి; నలికండ్లపాము ?. [పరిమాణము.
అంజలి. సం. చేమోడ్పు; దోసిలి; కుడప
అంజలికారిక. సం. అత్తపత్తి †; బొమ్మ (పుత్తలిక)
అంజసము. సం. విణ. సరళమైనది.
అంజి. బాలికాక్రీడావిశేషము. సం.
అంజిక. భయము. [ప్రేరకుఁడు.
అంజిష్ఠుఁడు(ష్ఠువు) సం. సూర్యుఁడు.
అంజీరము. సం. అంజూరు†; కాకిమేడి†.
అంజె పాదము, అడుగు; సమీపము.
అంజెమెడపట్టు. మల్లబంధ విశేషము.
అంజెలి-కి. దోసిలి.
అంజెలిగుంజెలి. విణ. శ్రమ నొందినది. అవ్య. చీకాకుపడునట్లు, క్షోభపడునట్లు.
అజాయించు. అ. క్రి. సందేహించు.
అంజు. అ. క్రి. భయపడు.
అంజూరు. మేడి†; మేడివంటి ఫలములు గల ఒక వృక్షము. [అవ్య. అఁట.
అంట. అనుట; అడ; కుట్టుడాకు; చెట్టుపట్టు.
అంటఁగట్టు. స. క్రి. అంటునట్లు కలిపి కట్టు; అణఁచు; ఆరోపించు; బలవంతముగా కూర్చు; చేర్చు. [అశుచియగు.
అంటగు. అ. క్రి. బహిష్ఠయగు; ఎంగిలియగు;
అంటనిజెజె. అగ్ని.
అంటనిది. విణ. ముట్టుత; స్పృశింపరానిది.
అంటనివేల్పు. అగ్ని దేవుఁడు.
అంటరానివాఁడు. విణ. అస్పృశ్యుఁడు.
అంటరానివేల్పు. అగ్ని దేవుఁడు.
అంటలు. బ. గుంపు, గుబురు.
అంటసిలు(ల్లు). అ. క్రి. చేరు, సమీపించు.
అంటాకు. అరఁటియాకు.
అంటి. అరఁటి, రంభ†.
అంటించు. స. క్రి. తేలు మొ॥ కుట్టు; కాలు; పొడుచు. ప్రే. అంటఁజేయు, తగిలించు.
అంటికుంచి. లేఁబ్రాయము, చిఱుతతనము.
అంటిగది. కులట. [సంబంధము.
అంటిస. గుడ్డల కంటుకొను ఒక గడ్డి;
అంటు. స్పర్శము; తాఁకరానివస్తువుయొక్క స్పర్శ; అన్నాదుల లేపము; బాంధవము; అతుకు; కూడిక; స్నేహము; మైల; ఆశౌచము; ముట్టు; శాఖాలతాది బీజము, చెట్టుగుటకు చెట్టునుండి వంచిపాఁతు నట్టి కొమ్మ; చెట్టునుండి కొమ్మ మొ॥ వంచి పాఁతి పైరుచేసిన చెట్టు; స్నేహితుఁడు; ఒక మొలకను వేరొక చెట్టుకొమ్మకు చేర్చి కట్టుట. స. క్రి. తాఁకు; అత్తు, పొందు; నూనె మొ॥ రాచు; పట్టుకొను. అ. క్రి. తగులు; తగులుకొను; కలియు; అబ్బు. [విటకత్తె.
అంటు కత్తియ (కత్తె). ప్రియురాలు ;
అంటుకాఁడు. ప్రియుఁడు ; విటుఁడు ; వలపుకాఁడు.

అంటుకొనిపోవు. స. క్రి. అపహరించికొని పోవు.
అంటుకొను. స. క్రి. అగ్ని ముట్టుకొను; తగులుకొను; పట్టుకొను. [కలువు
అంటుకొలుపు. స. క్రి. అంటుకొనఁజేయు;
అంటుజోడు. అంటుపోఁగుల జత, కర్ణాభరణవిశేషము. [మంచినూనె
అంటునూనియ (నూనె). తలంటుకొను
అంటుప (వ) డు. అ. క్రి. అశుచియగు; మైలపడు. [ముత్తైము.
అంటుపూస. ముత్తైపుఁ జిప్పయం దంటిన
అంటుపేను. తలపై నంటియుండు చిన్న పేను, యూకాభేదము.
అంటుపోఁగులు. బ. చెవినంటి యుండెడి పురుషుల కర్ణాభరణ విశేషము.
అంటుప్పు. బిడలవణము.
అంటుమెడ. అణఁగిన మెడ, పొట్టిమెడ.
అంటుఱాయి. సూదంటు ఱాయి.
అంటుఱాలు. బ. అయస్కాంత శిలలు.
అంటులు. బ. అంట్లు, శాఖా లతాది బీజములు.
అంటుసంటు. కన్నవారు; చుట్టాలు.
అంటుసేయు. స. క్రి పాల్గొనుచు.
అంటుళ్లు. వా. తగులము, సంబంధము.
అంటెలు. బొంతె; ముడుతలు.
అంట్రాయి. అంటుఱాయి.
అంట్రింత. అంటిసత్.
అంట్లు. బ. వండి కడుగని పాత్రములు; అంటుపేలు; అంటులు. [సమీపము.
అండ. ఆసరా, ఆశ్రయము; వెనుక;
అండకోశము. సం. వృషణము.
అండగొట్టు. అ. క్రి. జాగుచేయు.
అండగొను. అ. క్రి. జాగుచేయు. స. క్రి. ఆశ్రయించు.
అండజ. సం. కస్తూరి. [తల్పము.
అండజంబుపాన్పు. మి. హంసతూలికా
అండజము సం. చేప; తొండ; పక్షి; పాము. విణ. గ్రుడ్డునుండి పుట్టినది.
అండజశయ్య. సం. అండజంబుపాన్పు.
అండనము. డాలు.
అండము. సం. గ్రుడ్డు; వృషణము; వీర్యము; కస్తూరి.

అండా గుండిగ, నీళ్లు కాఁచు పెద్దపాత్ర, లోహకటాహము.
అండాలువు. సం. చేప.
అండి. లోహపాత్ర విశేషము; గౌరవార్థకమైన ఒకపదము. [గ్రోవి.
అండియ. వసంతము లాడెడు చిమ్మన
అండియము. అంకెము.
అండీ. అండి.
అండీరుఁడు. సం. పురుషుఁడు; సమర్థుఁడు;
అండుకము. సం లకుముకి పిట్ట.
అండె. అండియ.
అండెము. అంకెము, కంట్లములో నొక భాగము, ఎద్దుమీఁదిబరువులో సగము.
అంత. పరిమాణార్థకము, ఆకొలఁది; ఆయైశ్వర్యముకొలఁది; అంతట్, అపుడు, పిదప.
అంతన్. అఖిలము, సర్వము; అంతట, తరువాత, అనంతరము.
అంతంతన్. అవ్య. కొంతదూరమున.
అంతఃకరణ చతుష్టయము సం. మనస్సు బుద్ధి చిత్తము అహంకారము.
అంతఃకరణము. సం. లోపలి కరణము, మనస్సు.
అంతఃకలహము. సం. లోపలిపోరు; తన పక్షమువారిలోఁ గలుగు భేదాభిప్రాయము.
అంతఃపురము(పురి). సం. రాణివాసము, రాజస్త్రీ లుండుచోటు; రాణి; రాజస్త్రీలు. [కుఁడు.
అంతఃపురికుఁడు. సం. అంతఃపురరక్షు
అంతఃప్రజ్ఞుఁడు. సం. తైజసుఁడు.
అంతకంతకు. అవ్య. క్రమక్రమముగా.
అంతకక్షయము. సం. యమగృహము.
అంతకము. అంతు, మొత్తము. సం. విణ. నశింపఁజేయునది.
అంతకరము. సం. విణ. నశింపఁజేయునది.
అంతకాలము. సం. అంత్యకాలము.
అంతకుఁడు. సం. యముఁడు. విణ. నశింపఁజేయువాఁడు. [చావు.
అంతగమనము. సం. తుదముట్టుట;
అంతగుఁడు. సం. విణ. అంతుచూచిన వాఁడు; మృతుఁడు.

అంతటన్. అవ్య. అంతన్, తదనంతరము.
అంతట(టా). అవ్య. వా. సర్వత్ర.
అంతటికిన్. అవ్య. ఎల్లన్.
అంతము. సం. చివర; మరణము; నడుము; స్వభావము; స్వరూపము; నాశము; హద్దు; శేషావయవము; తుద; నిశ్చయము. విణ. సమీపము; అతిసుందరము; శేషము; అంత్యము.
అంతరంగము. సం. మనస్సు, హృదయము. విణ. లోపలిది; తనతో సంబంధము గలది; మిక్కిలి ప్రియమైనది; సన్నిహితమై ఉపకరించునది.
అంతరంగుఁడు. సం విణ. ఆత్మీయుఁడు.
అంతరగ్ని. సం. జఠరాగ్ని.
అంతరతమము. సం. విణ. పరమప్రేమాస్పదము (ఆత్మ, బ్రహ్మము).
అంతరదామర. మి. శైవాల విశేషము, భూసంపర్కము లేకుండ బావులలో నీటిపై తేలియుండు ఒక తెగ చిన్న మొక్క; ఆకాశ తామర.
అంతరపల్లటి. మి. ఒక పావుగము.
అంతరప్రభవుఁడు. సం. సంకర జాతి వాఁడు.
అంతరము. సం. భేదము; తారతమ్యము, తేడా; తీసివేత; ఎడము; వినా, మినహాయింపు; వెలుపల; వ్యసనము; అవకాశము; నడుము, నడిమిచోటు; మఱుఁగుపాటు; మేర; సందు; సమయము; తాదర్థ్యము, కోసము; ఉత్తరీయము; కట్టుబట్ట; అంతరాత్మ. విణ. అన్యము; సమానము; ఆత్మీయము; అంతర్గతము.
అంతరవల్లి. సం. ఆకాశవల్లి
అంతరాక్కర. మి. జాతిపద్య విశేషము (అంతరాక్కర; అల్పాక్కర; మధ్యాక్కర; మధురాక్కర; మహాక్కర).
అంతరాత్మ. సం. మనస్సు; సమస్తమునకు లోపలనుండెడి పరమాత్మ.
అంతరాపత్య. సం. గర్భిణి.
అంతరాభవసత్త్వము. సం. అంతర పిశాచము, యాతనా శరీరము.
అంతరాయము. సం. విఘ్నము; ఆటంకము.
అంతరారాముఁడు. సం. విణ. అంతరాత్మయందు ఆనందించువాఁడు.
అంతరాల(ళ)ము. సం. మధ్యప్రదేశము; సంకరజాతి. [కడచు, దాఁటు.
అంతరించు. స. అ. క్రి. నశించు. స. క్రి.
అంతరింద్రియము. సం. మనస్సు.
అంతరి(రీ)క్షము. సం. నక్షత్రము లుండు స్థలము; ఆకాశము.
అంతరితము. సం. విణ. మఱుఁగుపడినది; నశించినది; నడుమనున్నది; తొలఁగింపఁబడినది; తిరస్కరింపఁబడినది; శేషించినది; వ్యవధానముగలది; కప్పఁబడినది; స్వీకరింపఁబడినది.
అంతరీపము. సం. నీళ్ళనడిమి తిప్ప.
అంతరీయము. సం. కట్టుబట్ట.
అంతరువు. తారతమ్యము; మఱుఁగుచోటు; అంతస్తు.
అంతర్గతము. సం. విణ మఱవఁబడినది; నడుమనున్నది; లోనఁజేరినది; మనస్సులోనున్నది; దేహములోపలనున్నది. [ము.
అంతర్గృహము. సం. అవ్య. గృహమధ్య
అంతర్ఘణము. సం. నడవ, అళిందము.
అంతర్నిఖాతము సం. విణ. మనస్సులో నాటఁబడినది.
అంతర్దృష్టి. సం. లోచూపు.
అంతర్ధ(ర్ధి) } సం. కప్పుట; కప్పు;
అంతర్ధానము } మఱుఁగుపాటు.
అంతర్భవము. సం. విణ. లోపలిది; లోపలనున్నది. [చొచ్చియుండు.
అంతర్భవించు. సం. అ. క్రి. లోపలఁ
అంతర్భాగము. సం. నడుమ; లోపలి ప్రదేశము.
అంతర్భావము. సం. అంతర్భవించుట; మఱుఁగుపాటు; సహజభావము.
అంతర్భూతము. సం. విణ. లోనున్నది; అప్రధానము.
అంతర్మనస్కుఁడు } సం. విణ. సమాహిత చిత్తుఁడు;
అంతర్మనుఁడు } వ్యాకుల చిత్తుఁడు.
అంతర్ముఖుఁడు. సం. విణ. బహిర్దృష్టి లేనివాఁడు.
అంతర్యము. సం. విణ. నడుమనుండునది.

అంతర్యాగము. సం. మానసిక పూజ.
అంతర్యామి. సం. అంతఃకరణ నియామకుం
డైన పురుషుఁడు, ఆత్మ; అవిద్యో
(మాయో)పహిత చైతన్యము.
అంతర్లాపి. సం. లోపల జవాబు ఇమిడి
యుండునట్లు ప్రశ్నించు విషమసమస్య.
అంతర్వంశికుఁడు. సం. అంతిపురపు
కావలివాఁడు.
అంతర్వత్ని. సం. గర్భిణి.
అంతర్వాణి. సం. లోపలివాక్కు. విణ.
పండితుఁడు, శాస్త్రము తెలిసినవాఁడు.
అంతర్వాహిని. సం. భూమిలోఁ బ్రవ
హించునది. [వేదిక-నడిమి.
అంతర్వేది. సం. బ్రహ్మావర్తదేశము. అవ్య.
అంతర్వేశి(శ్మి)కుఁడు. సం. కంచుకి మొ.
అంతర్హితము. సం. విణ. మఱుఁగుపడినది.
అంతలపొంతల. అక్కడక్కడ; ఒక
దానితో నొకటి సంబంధము లేమి.
అంతలపొంతలవాఁడు. దూరపుచుట్టము.
అంతలు. బ. విణ. ఆ పరిమాణముగలవి.
అంతవంతము. సం. విణ. అంతముగలది.
అంతవట్టు. స. యావత్తు, అంతయు;
అంతమాత్రము.
అంతవట్టువారు. బ. అందఱు.
అంతవాసి. సం. శిష్యుఁడు.
అంతశ్శయ్య. సం. భూమి శయ్య;
మృత్యువు; స్మశానము.
అంతస్తు. మఱుఁగు-చోటు; తొట్టికట్టు.
కక్ష్య; నిలువు, మిద్దెకట్టు; అంతరువు,
పరువు, తారతమ్యము.
అంతస్థములు. సం. బ. య ర ల వ లు.
అంతస్సత్త్వ. సం. గర్భిణి.
అంతస్సన్నిధి. సం. మనస్సునందుఁ గలి
గించుకొను దేవతా సాన్నిధ్యము.
అంతస్సు. సం. అంతర్భాగము, అంతః
కరణము.
అంతా. అవ్య. వా. సమస్తము.
అంతావశా(సా)యి. సం. చండాలుఁడు;
మంగలవాఁడు; మునివిశేషము.
అంతిక. నాట్యోక్తియందు అక్క;
ప్రొయ్యి; శాతల †.
అంతికము. సం. సమీపము. విణ. దగ్గరది.

అంతికలు. బ. గడ్డిచాఁప (తడిక)లు.
అంతిపురము(పురి). అంతఃపురము.
అంతిమము. సం. విణ. కడపటిది; దగ్గఱది.
అంతియ. స. అంతమాత్రము, అంతే.
అంతు. మొత్తము, వెరసి; తుద.
అంతె. స. అంతే.
అంతే. స. అంతియ.
అంతేవాసి. సం. శిష్యుఁడు; చండాలుఁడు.
విణ. సమీపస్థుఁడు.
అంత్యజుఁడు. సం. శూద్రుఁడు. (అంత్య
జులు—రజక-చర్మకార-నట-వరుడ-
కైవర్త-మేద-భిల్లులు.)
అంత్యభము. సం. రేవతి; మీనరాశి.
అంత్యము. సం. దశసాగర సంఖ్య. విణ.
అధమము; చివరది.
అంత్యావసాయి. సం. కాటికాపరి. (బ.
చండాల-శ్వపచ-క్షత్తృ-సూత-వైదే
హక-మాగధ-అయోగవ జాతులు.)
అంత్యేష్టి. సం. అపరకర్మ.
అంత్రము. సం. ప్రేగు.
అందందన్. అవ్య. మఱిమఱి; అచ్చటచ్చట.
అందన్. అవ్య. అందు, తత్రార్థకము.
అందంబు గూడుకొను. అ. క్రి. కలసికొను.
అందఁజేయు. స. క్రి. అందునట్లు చేయు.
అందకత్తియ(కత్తె). విణ. సౌందర్యముగల
స్త్రీ. [వాఁడు
అందగాఁడు. విణ. సౌందర్యము గల
అందగించు. అ. క్రి. రమ్యమగు.
అందగింపు. ఇంపు, సౌందర్యము.
అందచందము. సౌందర్యము. విణ.
సుందరము.
అందదుకు. విణ. మిక్కిలి యదుకుగలది;
సంపూర్ణము గానిది.
అందనుకన్. అందాఁకన్.
అందపడు. అ. క్రి. రమ్యమగు.
అందము. సౌందర్యము, విధము. విణ.
మనోహరము. [జడపళ్ళాది).
అందమైనది. విణ. సుందరమైనది (స్త్రీ
అందమైనవాఁడు. విణ. సుందరుఁడు.
అందఱు. స. బ. ఎల్లవారు, సమస్త స్త్రీ
పురుషులు; అంతసంఖ్యగలవారు.

అంచలము. పార్శ్వముల మఱుఁగు లేని పల్లకి, ఆందోళిక.
అందలములు. బ. బాలక్రీడావిశేషము.
అందలి. విణ. అందున్న.
అందాఁకన్. అవ్య. అంతవఱకు.
అందించు. స. క్రి. అందఁజేయు.
అందిక. విణ సమీపము. సం. నాట్యోక్తి యందు అక్క.
అందికోలు. సమీపము. [చుట్టము.
అందిపొందిన (పొందు) వాఁడు. దూర పు
అందియ. అందె, నూపురము.
అందు. స. క్రి. పొందు; చేకొను, గ్రహించు.
అందున్. అవ్య. అచ్చట, తత్ప్రదేశమున, సప్తమీవిభక్తి (రామునియందు భూమి యందు అని).
అందుకము సం. అందె; ఏనుఁగుసంకెల.
అందుకొను. స. క్రి. గ్రహించు, పుచ్చుకొను.
అందుకోలు. గ్రహించు. విణ. అతి సమీ
అందుగు. పల్లకి†. [పము.
అందుపాటు. విణ. సమీపము.
అందుబడి. విణ. లభించి (న) నది; ఫల ప్రదము; సమీపము; సులభము.
అందులకున్. అవ్య. అచ్చోటికి; దానికి.
అందువు. అందుగు† సం. ఏనుఁగుసంకెల; అందె, పాదభూషణము; మొలత్రాడు
అందె స్త్రీలు కాళ్లనుధరించెడి ఒకసొమ్ము, నూపురము. [ములు.
అందెబందెలు. బ. చిక్కులు; కట్టుదిట్ట
అందోలు. స. అందలు.
అంధం కరణము. సం. విణ. గ్రుడ్డివాని ని గాఁజేయునది. [జేయువాఁడు.
అంధం భావుకుఁడు. సం. విణ. గ్రుడ్డిఁగాఁ
అంధకరిపుఁడు (వు). సం. శివుఁడు.
అంధకారము. సం. చీఁకటి.
అంధకుఁడు. సం. విణ అంధకాసురుఁడు; గ్రుడ్డివాఁడు.
అంధకూపము. సం. చీఁకటిబావి.
అంధత(తా)మసము సం. చిమ్మచీకఁటి, కటిక చీఁకటి, మిక్కిలి చీఁకటి.
అంధతామిస్రము. సం. కటిక చీఁకటి; ఒక నరకము; దేహమునశింప నే నే నశింతుననెడిబుద్ధి.

అంధము. సం. చీఁకటి; జలము. విణ. గ్రుడ్డిది.
అంధ మూషిక. సం. దేవతాళము†.
అంధస్సు. సం. అన్నము.
అంధాతమసము. సం. పెంజీఁకటి.
అంధాహి. సం కుచిక, ఒక చేఁప.
అంధిక. సం. ఒక జూదము; చీఁకటి; రాత్రి; ఆప†; ఒక స్త్రీ; కనుమసక, ఒకరోగము.
అంధుఁడు. సం. విణ. గ్రుడ్డివాఁడు; వివేకములేనివాఁడు; నేత్రేంద్రియ నిగ్రహముగలయతి.
అంధువు. సం. నుయ్యి, బావి.
అంధ్రము. సం. ఆంధ్రదేశము.
అంధ్రుఁడు. సం. ఆంధ్రుఁడు; వ్యాధుఁడు; వైదేహునకు వారస్త్రీయందుఁ బుట్టిన సంకరజాతివాఁడు.
అంప. బాణము.
అంపకము. అంపుట, ప్రేషణము. [కాఁడు.
అంపకాఁడు. విణ. విలుకాఁడు; గుఱి
అంపకోల. బాణము.
అంపగరి. బాణమునకుఁగట్టెడి యీఁక.
అంపపెట్టు. బాణపుదెబ్బ. [హము.
అంపఱ. బాణము; అమ్ములు, బాణసమూ
అంపాచోరము } వఱద
అంపాజోలము }
అంపించు. స. క్రి. పంపించు.
అంపియ. చింపిగుడ్డ.
అంపు. ఉత్సవవిశేషము. స. క్రి. ఆజ్ఞాపించు; పంపు. [వాఁడు.
అంపుదోడు. విణ. తోడు గాపంపఁబడు
అంపె. అంపియ.
అంబ. సం. అమ్మ; కాశిరాజుకూఁతురు; పార్వతీదేవి; అంబష్ఠ†.
అంబకము. సం. కన్ను; బాణము; రాగి.
అంబకళము. జొన్న; అంబలి.
అంబటికుండ. అంబలివండెడికుండ.
అంబటిజోరిగాఁడు. ఒకపక్షి.
అంబరమణి. సం. సూర్యుఁడు.
అంబరము. సం. ఆకాశము; వస్త్రము; వ్యసనము; దూది; అంబరు.

అంబరరత్నము. సం. సూర్యుఁడు.
అంబరాంబరుఁడు. సం. శివుఁడు.
అంబరిషము. సం. వేఁపుడుచట్టి.
అంబరీషము. సం. సంగలము,యుద్ధము; ఒకనరకము;అంబాళము†;పశ్చాత్తాపము.
అంబరీషుఁడు. సం. విష్ణువు; శివుఁడు; సూర్యుఁడు; బాలుఁడు; విష్ణుభక్తుఁడగు ఒకరాజు.
అంబరు. ఒకసుగంధి ద్రవ్యము.
అంబలము. కోలాహలము.
అంబలి. జావలో భేదము; పిండియునూక లనుచేర్చి పలుచేగా కాఁచినజావ.
అంబష్ఠ. సం. పులిచింత†; చిఱుబొద్ది†; అడవిమొల్ల†; బిరుసద్దసరము†.
అంబష్ఠిక. సం. బ్రాహ్మి†; బారంగి†.
అంబష్ఠుఁడు. సం. బ్రాహ్మణునివలనవైశ్య స్త్రీయందు పుట్టినవాఁడు (చికిత్సోపజీవి, మంగలి,వైద్యుఁడు); మావటీఁడు; ఒకకాయస్థజాతివాఁడు.
అంబస్తు. నిమ్మపట్టుఁడు.
అంబారము. ధాన్యరాశి.
అంబారి. ఏనుఁగుమీఁదిపీఠము.
అంబారు. ధాన్యరాశి.
అంబారుపిడుఁజే(దు). పశువులమేననంటి కొని రక్తము పీల్చెడి ఒకపురుగు.
అంబాలిక. సం. తల్లి; పాండురాజు తల్లి.
అంబాళము. పీతనము†.
అంబిక. సం. పార్వతి;తల్లి;ధృతరాష్ట్రుని తల్లి; ఒకజైన దేవత.
అంబికాత్రయము. సం. జ్ఞానప్రసూనాంబిక-భ్రమరాంబిక-మూకాంబిక.
అంబికేయుఁడు. సం. ఆంబికేయుఁడు.
అంబు. బాణము; మేదరవానియొక్క అమ్మువంటి ఒకఇనుపకోలముట్టు.
అంబుకణము. సం. నీటితుంపురు.
అంబుజము. సం.పద్మము†;ఎఱ్ఱగన్నేరు†; శంఖము.
అంబుదము. సం. మేఘము.
అంబుధి. సం. సముద్రము.
అంబుధీమధి. సం. శివుఁడు.
అంబుపక్కెత. ఒకచేఁప. [ప్రసాదనము.
అంబుప్రసాధము. చిల్ల . రూ. అంబు

అంబుమర్కటము. సం. పిడకమొసలి.
అంబురుహము. సం పద్మము†.
అంబులపొది. తూణీరము.
అంబువాహము. సం. మేఘము.
అంబువాహిని. సం. దోనె; ఎత్తుడునీరు పోయుటకై తొలిచికాలువ మొదట నుంచెడుతాటిమ్రానుమొ.
అంబువు. సం. ఉదకము.
అంబువేతనము. నీరుప్రబ్బ†.
అంబుసేచని. సం. బొక్కెన.
అంబుస్ఫోటము సం.బుద్బుదము,బుడగ.
అంబూకృతము సం. విణ. తుంపరలతోఁ గూడినమాట.
అంబే. ఆవుదూడకూఁత.
అంబేద. విణ. పిఱికి; కొఱగానివాఁడు; దిట్టతనములేనివాఁడు.
అంబ్లము. సం. పులుపు. విణ. పుల్లనిది.
అంభస్సు. సం. ఉదకము.
అంభా. ఆవుల యఱపు (అనుకరణధ్వని).
అంభోజము. సం. పద్మము†.
అంభోజిని. చూ. కమలిని
అంభోధి
అంభోనిధి } సం. సముద్రము.
అంభోభృత్పథము. సం. మేఘమార్గము.
అంభోరాశి. సం. సముద్రము.
అంభోరుహము. సం. పద్మము†.
అంశకుఁడు. సం. దాయాదుఁడు.
అంశము. సం. పాలు, భాగము; నాలవ వంతు; అవయవము. [అవయవి.
అంశి. సం. విణ. భాగముగలవాఁడు;
అంశుకము. సం. పైపంచె; దోవతి; బట్ట; సన్నబట్ట.
అంశుమంతుఁడు. సం. సూర్యుఁడు.
అంశుమతి. సం. ముయ్యాకుపొన్న†.
అంశుమత్ఫల. సం. అరఁటి†.
అంశుమాలి. సం. సూర్యుఁడు.
అంశులుఁడు. సం. చాణక్యముని.
అంశువు. సం. కిరణము; కాంతి; లేశము; దారము; అణువు.
అంసకూటము. సం. ఎద్దుమూఁపురము.
అంసము. సం. మూఁపు.

అంసలుఁడు. సం. విణ. బలిసినవాఁడు.
అంహతి. సం. దానము; రోగము;
త్యాగము. [విఘ్నము.
అంహస్సు. సం. పాపము; దుఃఖము;
అఁట. అవ్య. ఆక్షేపమహాత్మ్యమిథ్యాత్వ
వృత్తాంతాదుల సూచించు ప్రత్యయము.
అక. అక్క; పూజ్యస్త్రీ; వంటకత్తె.
అకంటకము. సం. విణ. కంటకము గానిది;
కంటకరహితము. [తము.
అకచము. సం. కేతుగ్రహము. విణ. కేశరహి
అకట(టా). అవ్య. అయ్యో, సంతాపార్థ
అకటకట. అవ్య. అయ్యయ్యో. [కము.
అకట(టా)వికటము. విణ. తాఱుమాఱు.
అకథ్యము. సం విణ. చెప్పనలవిగానిది;
వాక్కునకందనిది.
అకము. సం. దుఃఖము; పాపము.
అకరణి. సం. శాపము.
అకరికుఁడు. సం. సుంకరి?.
అకరు. తామగదుద్దుమున్నగు వానిమెట్టు
నుండునది. రూ. అకరువు.
అకరుణము. సం. విణ. దయారహితము.
అకర్ణము. సం. చెవులు లేనిది; బ్రహ్మము.
అకర్త. సం. విణ. కర్త కానివాఁడు; సాక్షి.
అకర్మ. సం. కర్మాభావము; అప్రశస్త
మైన (చెడ్డ) కర్మ. విణ. కర్మ లేనిది (ఆత్మ,
బ్రహ్మము).
అకర్మకము. సం. విణ. కర్మ లేనిది
(ధాతువు). [గ్యము.
అకర్మణ్యము. సం. విణ. కర్మకు అయో
అకర్ముఁడు. సం. విణ. నిష్కర్ముఁడు;
పనికిరానివాఁడు; స్వేచ్ఛాచారి.
అకలకజ్జ. అక్కలకర్ర. [వికము.
అకల్పితము. సం. విణ. సత్యము; స్వాభా
అకస్మాత్తు. సం. అవ్య. ఉన్నట్టుండి,
తటాలున. [వాఁడు.
అకాముఁడు. సం. విణ. కోరికలు లేని
అకాయము. సం. విణ. శరీరము లేనిది;
శరీరము కానిది (ఆత్మ, బ్రహ్మము).
అకాయుఁడు. సం. రాహువు.
అకారణము. సం. బ్రహ్మము. విణ. కార
ణము లేనిది. అవ్య. కారణము లేక.
అకార్యము. సం. ఆత్మ, బ్రహ్మము;
కుకార్యము విణ. చేయరానిది; కార్యము
కానిపదార్థము.
అకాలకౌముది. సం. ఉత్సవవిశేషము. [నది.
అకాలజము. సం. విణ. అకాలమునఁగలిగి
అకాలము. సం. అప్రశస్తమైన (అనువు
గాని) కాలము; యోగ్యకాలమును
మించిన సమయము.
అకించనత. సం. కాసైనను కూడఁబెట్టు
కొండుట, ఒకయమము.
అకించనుఁడు. సం. విణ. నిఱుపేద; లేశ
మును కూడఁబెట్టనివాఁడు; వ్యర్థుఁడు;
అతిలోభి.
అకించిజ్జ్ఞుఁడు. సం. విణ. అజ్ఞాని. [నము.
అకించిత్కరము. సం. విణ. నిష్ప్రయోజ
అకీర్తి. సం. అపకీర్తి.
అకుంఠుఁడు. సం. విణ. ప్రతిబంధరహి
తుఁడు; నేర్పరి.
అకుతోభయుఁడు. సం. విణ. దేనివలనను
భయము లేనివాఁడు; జ్ఞాని.
అకూపారము. సం. సముద్రము; కూర్మ
రాజు; కూర్మము. [సూర్యుఁడు.
అకూపా(వా)రుఁడు. సం. సముద్రుఁడు;
అకృతము. సం. కారణము; మోక్షము.
విణ. నిత్యము; స్వాభావికము.
అకృతాభ్యాగమము. సం. చేయనిదే
వచ్చుట, ఒకదోషము.
అకృత్యము. సం. విణ. అకార్యము.
అకృపుఁడు. సం. విణ. నిర్దయుఁడు.
అకృష్టపచ్యము. సం. విణ. దున్నకయే
పండు నివ్వరివెు. [తుఁడు.
అకృష్ణకర్ముఁడు. సం. విణ. పాపరహి
అకో } అవ్య. వితర్కార్థకము (ఏమకో,
అకో } ఏలకోయని).
అక్క. పెద్దతోఁబుట్టువు, జ్యేష్ఠభగిని.
అక. చూ. అవ్య. ఔర, ఆశ్చర్యార్థకము.
సం. తల్లి.
అక్కజపడు. అ. క్రి. ఆశ్చర్యపడు.
అక్కజము. విణ. అధికము; అశక్యము;
ఆశ్చర్యము.
అక్కజుఁడు. విణ. అధికుఁడు.
అక్కజురాలు. విణ. అధికురాలు.

అక్కట(టా). అవ్య. అకట. చూ.
అక్కటపడు. అ. క్రి. దుఃఖపడు.
అక్కటి. విణ. దయగలవాఁడు; దయగలది.
అక్కటిక / అక్కటికము } కనికరము, జాలి, దయారసము.
అక్కటికంపడు. అ. క్రి. జాలిగొను.
అక్కడ. ఆచోటు, తత్ప్రదేశము; ఆవల.
అక్కడన్. అవ్య. అందు.
అక్కయ్య. అక్క, అగ్రజ.
అక్కరము. అక్షరము, అకారము మొ.
అక్కఱ. అపేక్ష; కార్యము; అవసరము; శ్రద్ధ; ప్రయోజనము; నిమిత్తము; సంభ్రమము, త్వర.
అక్కఱకాఁడు / అక్కఱగండఁడు } విణ. అక్కఱగలవాఁడు
అక్కఱగొను / అక్కఱపడు } అ. క్రి. అపేక్షపడు.
అక్కఱపాటు అక్కఱపడుట.
అక్కలకర(ఱ్ఱ). ఒకమూలిక†.
అక్కలి. తిరంగము.
అక్కళించు. స. క్రి. సగ్గించు, కడుపుముగఁజేయు.
అక్కసము. కాఠిన్యము; సంతాపము.
అక్కసి. విణ. కోపముగలవాఁడు.
అక్కసు. కోపము.
అక్కసుకాఁడు. విణ. కోపి.
అక్కాయి. అక్క, అగ్రజ.
అక్కాలము. మి. ఆకాలము.
అక్కి. ఒక వాత్రధ.
అక్కిబిక్కిపంత. ఒక బాలక్రీడ.
అక్కిలి. కలఁత.
అక్కు. రొమ్ము, వక్షస్థలము; హృదయము.
అక్కుగొల్లు. అక్కుముల్లు, హృదయశల్యము.
అక్కుపక్కి / అక్కుపక్షి. మి } అజ్ఞుఁడు; బక్కవాఁడు.
అక్కుముల్లు. హృదయకంటకము.
అక్కుళ్లు. బ. అట్రుగిడలు, ఒక ధాన్యము.
అక్కోమలి. అకోమలి, అస్త్రీ.
అక్తము. సం. విణ. చేరనది; పోయినది; యుక్తము; వ్యక్తము.
అక్రమము. సం. క్రమములేమి. విణ. క్రమవిరుద్ధము.
అక్రియుఁడు. సం. విణ. క్రియాశూన్యుఁడు; సోమరి.
అక్రోధము. సం. కోపములేకుండుట, దైవీసంపదలో నొకటి.
అక్లిష్టకర్ముఁడు. సం. విణ. అనాయాసముగా పనులు చేయఁగలవాఁడు. రూ. అక్లిష్టకారి.
అక్లేద్యము. సం. విణ. తడుపరానిది.
అక్లిష్టము. సం. విణ. క్లేశరహితము, ఆయాసములేనిది.
అక్షత. సం. బియ్యము.
అక్షతము. సం. పేడి; పేలాలు; యవధాన్యము; విఱుగని బియ్యము; అక్షింతలు. విణ. నొప్పింపఁబడనిది; ఖండింపఁబడనిది.
అక్షతలు. సం. బ. పేలాలు; అక్షింతలు.
అక్షదర్శకుఁడు / అక్షదృక్కు } సం. న్యాయాధిపతి. రూ. అక్షదృశుఁడు.
అక్షదేవి / అక్షద్యూవు } సం. జూదరి.
అక్షద్యూతము. సం. జూదము.
అక్షద్యూతికము. సం. జూదమందలి జగడము.
అక్షధూర్తిలము. సం. ఎద్దు.
అక్షధూర్తుఁడు. సం. జూదరి.
అక్షపాదుఁడు. సం. గౌతమఋషి.
అక్షమాల. సం. జపమాల; రుద్రాక్షమాల. అకారాదిక్షకారాంతవర్ణమాల; అరుంధతి.
అక్షము. సం. రుద్రాక్షము†; ఇంద్రాక్షము†; తాండ్ర†; జ్ఞానము; పాము; వ్యవహారము; 16 మాషముల (80 గురిగింజల) పరిమాణము; పాచిక; వ్యాప్తి; ఆత్మ; ఒక జూదము; బండి; బండిగాను; ఎఱుఁగఁబడినయర్థము; బండియిరుసు; ఇంద్రియము; నల్లఉప్పు; మైలుతుత్తము; పొల్లు; కన్ను; ఒక రాశిచక్రావయవము; దక్షిణోత్తరధ్రువమధ్యప్రదేశము.
అక్షముఁడు. సం. విణ. అసమర్థుఁడు.
అక్షయ. సం. ఒక యోగము (సోమవారముతోఁగూడిన అమావాస్య; ఆదివారముతోఁగూడిన సప్తమి; మంగళవారముతోఁగూడిన చవుతి).

అక్షయతృతీయ. సం. వైశాఖశుద్ధ-తదియ.
అక్షయపాపిష్ఠుఁడు.సం.విణ.మిక్కిలి పాపి
అక్షయము. సం.ఒకయోగము;పరమాత్మ. విణ. నాశములేనిది; నిత్యము.
అక్షయుఁడు. సం. విణ. నిత్యుఁడు; ఇల్లు లేనివాఁడు.
అక్షరచంచువు } సం. వ్రాఁతకాఁడు.రూ.
అక్షరచణుఁడు } అక్షరచుంచువు.
అక్షరజనని. సం. కలము; గంటము.
అక్షరజీవ(వి)కుఁడు. సం. వ్రాఁతకాఁడు.
అక్షరతూలిక. సం. కలము; గంటము.
అక్షరవిన్యాసము } సం. లిపి, వ్రాఁత.
అక్షరసంస్థానము }
అక్షరము. సం. పరబ్రహ్మము; కూటస్థ చైతన్యము; మూలప్రకృతి; ఆకాశము; ధర్మము; తపస్సు; అకారాదివర్ణము; మోక్షము. విణ. నాశములేనిది.
అక్షరముఖుఁడు } సం. శిష్యుఁడు. విణ.
అక్షరాస్యుఁడు } చదివినవాఁడు; పండితుఁడు. [నాశములేనివాఁడు.
అక్షరుఁడు. సం. కూటస్థము.ప్రకృతి.విణ.
అక్షవతి. సం. జూదము.
అక్షవాటము. సం. మల్లభూమి; జూదపు పలక. [జూదరి.
అక్షశౌండుఁడు. సం. విణ. నేర్పరియగు
అక్షసూత్రము. సం. జపమాల.
అక్షాంతి. సం. ఈర్ష్య.
అక్షారలవణము. సం.ఒకహావిష్యాన్నము; సైంధవలవణము.
అక్షావాపము. సం. జూదపు పలక.
అక్షి. సం. కన్ను.
అక్షింతలు. బ. తలఁబ్రాలు, పసుపుగాని కుంకుమ గాని రాచినబియ్యము,అక్షతలు.
అక్షికౌక్షేయుఁడు. సం. శివుఁడు.
అక్షిగతుఁడు. సం. శత్రువు. [ఉప్పు.
అక్షి(క్షీ)బము. సం. మునగ; సముద్రపు
అక్షీవుఁడు. సం. విణ. అమత్తుఁడు.
అక్షుఁడు. సం. గరుడుఁడు; పుట్టుగ్రుడ్డి.
అక్షేత్రము. సం. పండనిభూమి; ఉపదేశార్హుఁడు గాని శిష్యుఁడు; అపాత్రుఁడు.
అక్షోట(ఠ)ము. సం. కొండగోఁగు.
అక్షోభము. సం. ఏనుఁగునుకట్టుకంబము.
అక్షోభ్యుఁడు. సం. విష్ణువు. విణ. ఎదుర్కొన శక్యముగానివాఁడు; కలఁతలేనివాఁడు.
అక్షౌహిణి. సం. సేనావిశేషము (21870 రథములు, అన్నియేనుఁగులు, 65610 గుఱ్ఱములు, 109350 కాల్బలమునుగల సేన). రూ. అక్షోహిణి. [దీపము.
అఖండదీపము.సం. ఎల్లప్పుడు వెలిఁగెడు
అఖండము. సం. విణ. ఖండముకానిది; సర్వము,సంపూర్ణము.వా.అఖండదీపము.
అఖండుకము. సం.పొట్టిటెంకాయచెట్టు, చెన్నంగి.? [యము.
అఖాతము. సం. దేవతాకృతమగు జలాశ
అఖాతివాసు. పెద్దతివాసి,పెద్దరత్నకంబళి
అఖిలము. సం.విణ.సర్వము;దున్నిన నేల.
అఖిలర్తువులు. సం. బ. అన్నిఋతువులు, సర్వకాలము.
అగండ్రపాకు. ఒకచెట్టు.
అగంధము. సం. విణ. గంధముకానిది; గంధములేనిది (ఆత్మ, బ్రహ్మము).
అగచాట్లపోతు } విణ. పెక్కుకడగండ్లు
అగచాట్లమారి } పడినవాఁడు.
అగచాట్లు. బ. ఆపద, కష్టము.
అగచ్ఛము. సం. చెట్టు.
అగచు స.క్రి. కలఁచు, పాడుచేయు.
అగజ. సం. పార్వతి, అగజాత.
అగడారు. నింద, అపవాదము.
అగడిత. అగడ్త.
అగడు. అవ్వ, నింద, దూఱు; నెగడు; కలఁత; తొట్రుపాటు. విణ. నింద్యము.
అగడుఁగాకి. తుంటరి. [పడు.
అగడుపడు. అ.క్రి. దూఱుపడు; తొట్రు
అగడుపఱుచు. స.క్రి. అల్లరిచేయు, నిందించు; నలగఁజేయు.
అగడుసేయు. స.క్రి.నిందించు;నిరసించు.
అగడ్త. పరిఖ, కోటచుట్టు త్రవ్వఁబడిన జలాధారము.
అగణితము } సం. విణ.ఎంచవీలుకానిది.
అగణ్యము }
అగతి. సం. గతిలేమి. విణ. గతిలేనిది.
అగత్యము. వా. ఆవశ్యకత. క్రి. విణ. అవశ్యము.
అగదంకారుఁడు. సం. వైద్యుఁడు.

అగదగులు. అ.క్రి. కనఁబడు; సమావేశమగు; తటస్థమగు. [రహితము.
అగదము. సం. ఔషధము. విణ. రోగ
అగప. అబక.
అగపడు. అ. క్రి. కనిపించు, దృశ్యమగు; అధీనమగు; లభించు.
అగపఱచు. స. క్రి. చూపించు.
అగపా(బా)టు. అగపడుట.
అగమము. సం. అగము. విణ. స్థావరము.
అగము. సం. పర్వతము; వృక్షము.
అగమ్య. సం. పరస్త్రీ.
అగమ్యము. సం. విణ. వెళ్లరానిది; పోశక్యముకానిది; ఎఱుఁగరానిది; ఒకలెక్క ని.
అగరి, సం. దేవతాడి †. [అగురువు.
అగరు. పొగరు; గాటు; అగలుచెక్క,
అగరువు. సం. అగలుచెక్క.
అగలము. వైశాల్యము.
అగలించు. స. క్రి. పెల్లగించు; పగులఁగొట్టు; బద్దలు చేయు.
అగలు. అగురువు. అ.క్రి. ఛేదిల్లు; పెల్లగిల్లు; నశించు; కలఁగు; దుఃఖించు.
అగలుచు. స.క్రి. ఛేదించు; పెల్లగించు.
అగలుసత్తు. ఒక గంధద్రవ్యము.
అగలుసొంటి. ఏకాష్ఠీల †.
అగల్చు. అగలుచు.
అగవాళ్ళు. బ.ఒంటిఅట్టచెప్పులు.
అగవు. కార్శ్యము, అక్కఱ.
అగవుతగవులు. బ. వివాహాదులలో తెచ్చేడు కానుకలు.
అగసాలి(లె). కమసాలె. [కారుఁడు.
అగసాలెవాఁడు. కమసాలెవాఁడు, స్వర్ణ
అగసి. అగిసె †.
అగస్తి. సం. అగస్త్యుఁడు; అగస్త్యము †; ఆశ్వయుజమాసము.
అగస్త్యమంత్రము. సం. భోజనానంతరము పఠింపఁదగిన ఒక మంత్రము.
అగస్త్యము. సం. బకపుష్పము†; అగిసె†; అగస్త్య నక్షత్రము.
అగస్త్యుఁడు. సం. కుంభసంభవుఁడు, ఒక బ్రహ్మర్షి. [ముందఱ.
అగాడీ. హిం. గుఱ్ఱపు బంధము.క్రి. విణ.
అగాదు. అగ్న్యస్త్రములయందు నిప్పు తగిలించుట; అగ్న్యస్త్రముల ప్రేలుడు; ధ్వని.
అగాధము. సం. రంధ్రము. విణ. మిక్కిలి లోఁతైనది; అతిగంభీరము; దుర్బోధము; అసాధ్యము ని.
అగారము. సం. ఇల్లు; గృహము.
అగావు. తాకట్టు; నింద. అవ్య. అకస్మాత్తుగా.
అగిని. అగ్ని.
అగిసియ. అగిసె, అతసి. †.
అగిసె. నల్లయగిసె, నూనెయగిసె †.
అగిసెనూనె. అగిసె విత్తులచేత తీసిన నూనె.
అగు. అ.క్రి. అవు; ఔ; కలుగు; జరుగు; గతించు; నెఱవేఱు; ప్రాప్తించు; తగు; ఉండు; కలవాఁడగు; పరిణమించు; శక్యమగు.
అగున్. అవ్య. అవును,అంగీకారార్థకము.
అగుఁగదె. అవ్య. అవుఁగదే, ఆశ్చర్యార్థకము; నిశ్చయార్థకము.
అగుఁగాక. అవ్య. సరే,అంగీకారార్థకము; అగుఁగాత, ఆశీరాద్యర్థకము.
అగుఁగాత. అవ్య. అగుఁగాక.
అగుఁగాములు. బ. అగుటయును కాక పోవుటయును. [కారార్థకము.
అగుఁబొమ్ము. అవ్య. సరే, సరేపో,అంగీ
అగుదెంచు. అ.క్రి. అగు; కావచ్చినదియగు, కానున్నదియగు.
అగుర. అవ్య. ఔర.
అగురగుర. అవ్య. ఔరౌర.
అగురా. అవ్య. ఔరా.
అగురు. అవురుగడ్డి†.
అగురువు. సం. ఇరుగుడు†; గంధద్రవ్యవిశేషము, అగలుచెక్క, సుగంధకాష్ఠవిశేషము. విణ. గురువుకానిది, బరువులేనిది.
అగురుశింశప. సం. ఇరుగుడు†.
అగుర్వు. అతిశయము;భయంకరము విణ. గొప్పది, అధికము.
అగులు, అ.క్రి. రాలు, ఊడు; పగులు; సడలు.

అగులుబొట్టు. నూకలు సగ్గుబియ్యము మొ॥ మాడ్చి తయారుచేసిన తిలకవిశేషము.
అగోచరము. సం. విణ. కానరానిది.
అగౌకసము. సం. సింహము; శరభము; పక్షి. [అధీనమగు.
అగ్గపడు. అ.క్రి. అగపడు; పట్టుఁబడు;
అగ్గపాటు. అగ్గపడుట.
అగ్గము. విణ. స్వాధీనము; అనుకూలము; గోచరము; సమావేశమైనది.
అగ్గలము. అతిశయము. విణ. వెక్కసము, అధికమైనది; దుస్సహము.
అగ్గలించు. అ.క్రి. ఎక్కువగు, అతిశయించు; పూను, ఉత్సహించు.
అగ్గలిక-ము. ఆధిక్యము; పూనిక; శౌర్యము; ఉబలాటము; విలాసము.
అగ్గి. అగ్ని.
అగ్గించు. స.క్రి. స్తోత్రము చేయు.
అగ్గింపు. స్తుతి.
అగ్గికంటి. శివుఁడు, ఫాలాక్షుఁడు.
అగ్గిచూలి. కుమారస్వామి, అగ్నిభువు.
అగ్గితత్తడి. పొట్టేలు; అగ్నివాహనము.
అగ్గిపాపఁడు. అగ్గిచూలి.
అగ్గిబొడి. కరదీపము, కాగడా.
అగ్గువ. చేవుక. వా. అధికము.
అగ్గెడన్. అందన్.
అగ్నాయి. సం. అగ్ని భార్య.
అగ్ని. సం. అగ్నిహోత్రుఁడు; అగ్నిమూలకధిపతి; పంచభూతములలో నొకటి; జఠరాగ్ని; రూపతన్మాత్ర; అగ్న్యభిమాని దేవత; నిప్పు; ఎఱ్ఱచిత్రమూలము†. నల్లజీడి†; నిమ్మ†; పిత్తము; బంగారు; కృత్తిక; మూఁడు.
అగ్నికణము. సం. నిప్పురవ, మిణుఁగురు.
అగ్నికార్యము. సం. యథావిధి అగ్నియందు ప్రాతః సాయంకాలములలో సమిధలను వేల్చుట.
అగ్నికాష్ఠము. సం. అగ్గిపుల్ల; అగురుచెక్క.
అగ్నికోణము. సం. అగ్ని-మూల, తూర్పు దక్షిణముల నడిమిదిక్కు.
అగ్నిచిత్తు. సం. అగ్ని చయనము చేసిన వాఁడు.
అగ్నిజార(ల)ము. సం. జఠరాగ్ని నివృద్ధి నొందించెడి ఒక ఓషధి.
అగ్నిజిహ్వలు. సం.బ. కాలి కరాలి మనోజవ సులోహిత సుధూమ్రవర్ణ స్ఫులింగిని విశ్వరుచి యనునవియేడు.
అగ్నిజ్వాల. సం. నిప్పుమంట; ధాతకీకుసుమము†; ఆరె†.
అగ్నిత్రయము. సం. దక్షిణాగ్ని గార్హపత్యము ఆహవనీయము అనెడిమూఁడు.
అగ్నిదుఁడు. సం. ఇంటికి నిప్పంటించు వాఁడు.
అగ్నిదృక్కు. సం. శివుఁడు.
?అగ్నినక్రజరాయువు. సం. అగ్నిజారము.
అగ్నినామకము. సం. అగ్ని పేర్లుగలది (నల్లజీడి†; చిత్రమూలము†).
అగ్నినిర్యాసము. సం. అగ్నిజారము†.
అగ్నిపరీక్ష. ఒకదివ్యము, అగ్నిచే చేయు దోషాదోషముల పరీక్ష.
అగ్నిప్రతిష్ఠ. సం. అగ్నిస్థాపనము.
అగ్నిబీజము. సం. బంగారము; రం.
అగ్నిభట్టారకుఁడు. సం. అగ్నిదేవుఁడు.
అగ్నిభువు. సం. కుమారస్వామి.
అగ్నిమంథము. సం. నెల్లి†.
అగ్నిమణి. సం. సూర్యకాంతము.
అగ్నిమాంద్యము. సం. జఠరాగ్ని సన్నగిలుట.
అగ్నిముఖము(ముఖి). సం. జీడి†. [వేలుపు
అగ్నిముఖుఁడు. సం. బ్రాహ్మణుఁడు;
అగ్నిరక్షణము. సం. అగ్నిహోత్రము.
అగ్నిలింగము. సం. పాగ. [పోతు.
అగ్నివాహము(వాహనము). సం. మేఁక
అగ్నివేత్త. సం. అగ్నిహోత్రి.
అగ్నిశిఖ. సం. తరిగొట్టు†; తరిగొజ్జ†; నాఁగేటిచాలుకూర†; అగ్నిజ్వాల.
అగ్నిశిఖము. సం. కుంకుమపువ్వు; కుంకుమము†; కుసుమపువ్వు; సిందూరము?.
అగ్నిష్టోమము. సం. ఒక యజ్ఞము.
అగ్నిష్వాత్తులు. సం.బ. పితృగణవిశేషము
అగ్నిసఖుఁడు. సం. వాయువు.
అగ్నిసహము. సం. కిప్పి?.
అగ్నిసాక్షికము. సం.విణ. అగ్నిని సాక్షిగా నుంచుకొని చేసినట్టిది.

అగ్నిస్తంభనము. సం. మంత్రౌషధులచే అగ్నియొక్క దహనశక్తిని నిరోధించుట; అట్టి ఒక విద్య.
అగ్నిహోత్రము. సం. ఒక యజ్ఞము; అగ్ని; నిప్పు; హవిస్సు, హోమము చెయ్యఁదగ్గ ద్రవ్యము. [వాఁడు.
అగ్నిహోత్రి. సం. అగ్నిచయనము చేయు
అగ్నిహోత్రుఁడు సం. అగ్ని.
అగ్నీధ్రుఁడు. సం. ఒక ఋత్విక్కు.
అగ్నీషోమీయము. సం. అగ్నియు సోముఁడును దేవతలుగాఁగల యాగము మొ.
అగ్న్యస్త్రము. సం. ఆగ్నేయాస్త్రము; తుపాకి మొ.
అగ్న్యాధానము. సం. యథావిధి అగ్ని సంస్కారము, అగ్నిహోత్రము.
అగ్న్యుత్పాతము. సం. అశుభసూచకమైన తోఁకచుక్క ఉల్కాపాతము మొ॥ ఉపద్రవము. [పఁదగినది.
అగ్రగణ్యము. సం. విణ. మొదట లెక్కిం
అగ్రగణ్యుఁడు. విణ. శ్రేష్ఠుఁడు.
అగ్రగామి } సం.విణ ముందడుగు వేయు
అగ్రగుఁడు } వాఁడు, ముఖ్యుఁడు.
అగ్రజ. సం. అక్క, జ్యేష్ఠభగిని.
అగ్రజన్ముఁడు. సం. అన్న; బ్రహ్మ; బ్రాహ్మణుఁడు.
అగ్రజాతకుఁడు } సం. బ్రాహ్మణుఁడు.
అగ్రజాతి }
అగ్రజుఁడు. సం. అన్న; బ్రాహ్మణుఁడు.
అగ్రణి. సం. విణ. శ్రేష్ఠుఁడు.
అగ్రతఃసరుఁడు. సం. విణ. అగ్రగామి.
అగ్రధన్వుఁడు. సం. ఇంద్రుఁడు?.
అగ్రబీజము. సం విత్తు అగ్రమందుఁగల చెట్టు, ముంత (జీడి) మామిడి మొ.
అగ్రభుక్కు (భుజుఁడు). సం విణ. తిండిపోతు.
అగ్రము. సం. చివర; పైభాగము; శేషభాగము; శిరస్సు; శిఖరము; ఎదురు, ముందు, లక్ష్యము; ముందఱ; నాలుగు పిడుచేలయన్నము; ఆశ్రయము; పలపరిమాణము; ప్రాంతము, కొన; సమూహము. విణ. శ్రేష్ఠము; ప్రధానము; అధికము; మొదటిది; మొదలు.

అగ్రయాయి. సం. విణ. అగ్రగామి.
అగ్రసంధాని. సం జీవుల శుభాశుభకర్మలు లిఖించినయముని పుస్తకము, యమపంజిక
అగ్రసరుఁడు. సం. విణ అగ్రగామి.
అగ్రహాయణము. సం. మార్గశిరము.
అగ్రహారము. సం. బ్రాహ్మణునకై తీసిన పొలములోని పంట మొ॥; గురుకులము నుండి మఱలివచ్చిన బ్రహ్మచారికి ఈయఁదగిన పొలము మొ॥; స్వాధ్యాయసంపన్నులగు బ్రాహ్మణులుండు గ్రామము.
అగ్రాహ్యము. సం. విణ. గ్రహింపరానిది; జ్ఞానేంద్రియముల కందనిది (ఆత్మ, బ్రహ్మము). [శ్రేష్ఠము.
అగ్రిమము, సం. విణ. ప్రధానము,
అగ్రిముఁడు. సం. అన్న. విణ. శ్రేష్ఠుఁడు.
అగ్రి(గ్రీ)యము. సం. విణ. ప్రధానము.
అగ్రి (గ్రీ) యుఁడు. సం. అన్న. విణ. శ్రేష్ఠుఁడు.
అగ్రేదధిషువు. సం. మాఱుమనువు దాని మొదటి మగఁడు; అక్కకంటె ముందు పెండ్లాడిన చెల్లెలు.
అగ్రేసరుఁడు. సం. విణ. ముందఱ వెళ్లువాఁడు; శ్రేష్ఠుఁడు. [మగు జలము.
అగ్రోదకము. సం. దేవపూజకుపయుక్త
అగ్ర్యము. సం. విణ. ప్రధానము.
అఘటనము } సం. విణ. సంభవింప
అఘటమానము } నిది; ఘటిల్లనిది; అసాధ్యము.
అఘమర్షణము. సం. స్నానము చేయునపుడు పాపపరిహారార్థము పఠించెడిఒక సూక్తము; అశ్వమేధయాగాంగ - అవభృథస్నానమంత్రము. విణ. పాపనాశము గావించునది.
అఘము. సం. పాపము; వ్యసనము; దుఃఖము; అశౌచము.
అఘాయువు. సం. ఎల్లప్పుడు పాపములు చేయువాఁడు.
అఘోర. సం. భాద్రపదకృష్ణచతుర్దశి.
అఘోరము. సం. విణ. సౌమ్యము; అతి భయంకరము.
అఘోరించు. అ.క్రి.వా. ఏడ్చు.
అఘ్న్య. సం. ఆవు.

అచండి. సం, సాధువైన ఆవు.
అచల–కీల. సం. భూమి.
అచలము. సం. పర్వతము; మేరు. విణ. కదలిక లేనిది.
అచలుఁడు. సం. శివుఁడు.
అచాపలము. సం. చాపల్యము లేకుండుట; దైవసంపదలలో నొకటి.
అచింత్యము. సం. విణ. మనస్సునకందనిది; విచారింప శక్యముగానిది (ఆత్మ, బ్రహ్మము); ఒక లెక్క.
అచిత్తు. సం. విణ. అచేతనము.
అచిరద్యుతి. సం. మెఱుపు.
అచిరము. సం. అవ్య. శీఘ్రము. విణ. క్షణికము.
అచిరాంశువు. సం. మెఱుపు.
అచేతనము / అచైతన్యము | సం. విణ. చిత్తుమాత్రము ఉండి చిదాభాసము లేని (జడ) పదార్థము.
అచ్చారము. బయానా.
అచ్చి. అచ్చిమట్టము, దేశవిశేషము.
అచ్చిక. కొలఁతి, వెలితి, లోపము.
అచ్చికబుచ్చిక. కలుపుగోలుతనము, అభేదము.
అచ్చికబుచ్చికము. అభేదము; ఇచ్చకము.
అచ్చికమచ్చిక. అభేదము.
అచ్చికము. అభేదము; అచ్చిక.
అచ్చినవాఁడు. విణ. అధమర్ణుఁడు, అప్పుపుచ్చుకొన్నవాఁడు.
అచ్చివచ్చు. అ.క్రి. ఋణముండు; కలసివచ్చు, మేలై వచ్చు, శ్రేయస్కరమగు.
అచ్చులు. సం.బ. స్వరములు, అకారాదులు.
అచ్చెరియము. ఆశ్చర్యము.
అచ్చెరుప(వ)డు. అ.క్రి. ఆశ్చర్యపడు.
అచ్చెరుపాటు. ఆశ్చర్యపడుట.
అచ్చెరువు. ఆశ్చర్యము.
అచ్చెరువుపడు. అ.క్రి. ఆశ్చర్యపడు.
అచ్చెరువుపాటు. అచ్చెరుపాటు.
అచ్ఛభల్లము. సం. ఎలుఁగుగొడ్డు.
అచ్ఛము. సం. ఎలుఁగుబంటి; స్ఫటికము; తెలుపు. విణ. నిర్మలము; స్వచ్ఛము; కలితిలేనిది.

అచ్ఛావాకుఁడు. సం. సోమయాగమందలి ఒకఋత్విక్కు.
అచ్ఛిద్రము. సం. విణ. దోష (లోప) రహితము.
అచ్ఛుఁడు. సం.విణ.కళంకములేనివాఁడు
అచ్ఛేద్యము. సం. విణ. ఛేదింపరానిది.
అచ్ఛోదము. సం. ఈ పేరుని క్రీడాసరస్సు.
అచ్యుతము. సం.విణ.చ్యుతిలేనిది(ఆత్మ, బ్రహ్మము).
అచ్యుతాగ్రజుఁడు. సం. బలరాముఁడు; ఇంద్రుఁడు.
అచ్యుతుఁడు. సం. కృష్ణుఁడు; విష్ణువు. విణ. జాఱనివాఁడు.
అచ్చటన్. అవ్య. అందన్,తత్ప్రదేశమున.
అచొటు. ఆచోటు.
అచౌటము. విణ. విరివిరియైనది.
అచోటు. ఆచోటు.
అచ్ఛ. అచ్ఛము, కేవలము. అవ్య. బొత్తిగా.
అచ్ఛగుండ్లపేరు. చాటుకారము; ముత్యాల హారము; స్ఫటికమాల.
అచ్చటన్. అవ్య. తత్ప్రదేశమున.
అచ్చటు. అవ్య. ఆచోటు.
అచ్చన. అచ్చనగాయ; అర్చన. బ. బాలికా క్రీడావిశేషము.
అచ్చనగం(గుం)డ్లు / అచ్చనగాయలు | బ. అచ్చనగండ్లాటలో నుపయోగించు గోళీలు, గిరియకములు.
అచ్ఛము. విణ. స్వచ్ఛము; కేవలము; కలితిలేనిది; తెల్లనిది; తేరినది; దట్టము.
అచ్చర. అప్సర: స్త్రీ.
అచ్చరము. అక్షరము, స్త్రీలు
అచ్చరలు. బ. దేవవేశ్యలు, అప్సర:
అచ్చెరు. అచ్చెరువు.
అచ్చెరుప(వ)డు. అ.క్రి. ఆశ్చర్యపడు.
అచ్చెరువు. అచ్చెరువు, ఆశ్చర్యము.
అచ్చలము. కోపము; ఉత్సాహము; పట్టుదల.
అచ్చలించు. అ.క్రి. ఆగ్రహించు.
అచ్ఛోడి(వీ). విణ.నిర్మలుఁడు; శ్రేష్ఠుఁడు; స్వచ్ఛము; శ్రేష్ఠము.
అచ్ఛాఫీసు. ముద్రణాలయము.

అచ్చావునెయ్యి. కలితి లేని ఆవునెయ్యి.

అచ్చాళు. విణ. జంజాటము లేనివాఁడు.

అచ్చు. బెల్లము మున్నగువాని అచ్చు; చేట్రము; పోఁతపోసిన అక్షరము మొ॥; నాణెము; రూపు; ప్రతిబింబము; దృష్టాంతము; నియమము; ముద్ర, ప్రతిరూపము కల్పించునది; విధము; సామ్యము; బట్ట నేయుటకు సాధ్యమైనది. విణ. అచ్చము; పరిశుద్ధుఁడు. అ. క్రి. అప్పపడు. స. క్రి. ఇచ్చు; దండుగగా చెల్లించు.

అచ్చుకట్టు. స. క్రి. ఏర్పఱచు; మడి మడిగా గనిమ తీయు.

అచ్చుకుప్ప. విణ. ధనవంతుఁడు.

అచ్చుకూ(ఁగూ)టము. ముద్రాక్షరశాల.

అచ్చుకొను. అ. క్రి. పూచిపడు.

అచ్చుగా. అవ్య. ఒప్పగా.?

అచ్చుటెద్దు. ఆఁబోతు.

అచ్చుతుఁడు. అచ్యుతుఁడు. [వచ్చుట.

అచ్చుదల. అప్ప; అచ్చుకొనుట; అచ్చి

అచ్చుపడు. అ. క్రి. ఏర్పడు; విశదపడు; ఉపయోగపడు; ముద్రితమగు; రూపు దాల్చు; సార్థకమగు; నిరూపితమగు.

అచ్చుపఱచు. స. క్రి. ఏర్పఱచు; నియమించు.

అచ్చుపాటు. ఏర్పాటు; అచ్చుపడుట.

అచ్చుబెల్లము అచ్చులంగా పోసిన బెల్లము.

అచ్చోటన్. అవ్య. అక్కడ.

అచ్చోటు. ఆచోటు; అందుగుఱి; ఆవైపు, ఆదిక్కు.

అచ్చొత్తు. స. క్రి. అచ్చువేయు, ముద్రించు.

అచ్చోన్
అచ్చోటన్ } అవ్య. అందన్, అక్కడ.

అచ్చోటు. అచ్చోటు.

అజ. సం. ఆఁడుమేఁక; ప్రకృతి.

అజక. సం. మేఁక మెడక్రిందిచన్ను; మేఁక పెంటిక.

అజకవము. సం. శివధనుస్సు. [ధనుస్సు.

అజకావము. సం. ఒకయజ్ఞపాత్ర; శివ

అజక్షీరము. సం. మేఁక (గొఱ్ఱె) పాలు.

అజగంధిక. సం. వాయింట†.

అజగము. సం. శివధనుస్సు. [పాము.

అజగరము. సం. పెనుఁబాము, ఒకజాతి

అజగర్దము. సం. నీరుపాము.

అజగ(గా)వము. సం. శివుని విల్లు.

అజనని. సం. శాపము.

అజన్యము. సం. ఉత్పాతము. విణ. జన్యము కానిది. [రూపము.

అజప. సం. హంసమంత్రము; అర్ధనరనారీ

అజపాగాయత్రి. సం. హంసమంత్ర విశేషము. [చదువువాఁడు.

అజపుఁడు. సం. వైదికముగాని గ్రంథము

అజమాయిషీ. హిం. అంచనా.

అజము. సం. మగమేఁక; పొట్టేలు. విణ. పుట్టుకలేనిది (ఆత్మ, బ్రహ్మము, కైవల్యము).

అజమోద. సం. ఓమము (వాము)†.

అజయము. సం. ఓటమి. [గానిది.

అజయ్యము. సం. విణ. జయింపశక్యము

అజరము. సం. విణ. ముదిమిలేనిది.

అజర్యము. సం. చెలిమి.

అజశృంగి. సం. జొట్టుపు†.

అజస్రము. సం. అవ్య. నిత్యము, ఎల్లప్పుడు విణ. ఎడతెఱపిలేనిది.

అజహ. సం. దూలగొండి†.

అజహత్స్వార్థ
అజహల్లక్షణ } సం. విడువనిలక్షణ, తనయర్థమును విడువకయే ఇతరార్థమును బోధించు శబ్దశక్తి.

అజహల్లింగము. సం. విశేష్యము ననుసరించి మార్పునొందని లింగము గల పదము, నిత్యనపుంసకలింగము మొ.

అజాంత్రి. సం. బొద్దికూర†.

అజాగరము. సం. గుంటకలగర†.

అజాగ్రత్త. సం. ప్రమత్తత.

అజాజీవి(జీవుఁడు). సం. కురుమవాఁడు, మేఁక (గొఱ్ఱె) లు బ్రదుకుఁదెరువుగాఁ గలవాఁడు.

అజాతము. సం. విణ. పుట్టనిది, పుట్టుక లేనిది (ఆత్మ, బ్రహ్మము).

అజాతవాదము. సం. దేనికిని (ఉన్న

దానికిఁగాని లేనిదానికిఁగాని) పుట్టుక సంభవింపదనెడి అద్వైతవాదము.
అజాతశత్రువు(ఁడు). సం. ధర్మరాజు. విణ. శత్రువులు లేనివాఁడు.
అజాతి. సం. విణ. జాతి (జన్మ మొ॥) లేనిది, ఆత్మ, బ్రహ్మము.
అజానేయము. సం. ఉత్తమాశ్వము.
అజితుఁడు. సం విష్ణువు; బుద్ధుఁడు; జైన విశేషము.
అజినపత్ర(త్రి). సం. చీఁకురువాయి.
అజినము. సం. చర్మము; జింక మొ॥వాని చర్మము.
అజినయోని. సం. జింక.
అజిరము. సం. ఇంటిముంగిలి; కప్ప; గాలి; శరీరము; విషయము.
అజిహ్మగము. సం. బాణము.
అజిహ్మము. సం. కప్ప. విణ. వంకర లేనిది.
అజిహ్వము. సం. కప్ప. విణ. నాలుక లేనిది. [హము గల యతి.
అజిహ్వుఁడు. సం జిహ్వేంద్రియ నిగ్ర
అజీక(గ)వము / అజీగావము } సం. శివధనుస్సు.
అజీర్ణము. సం. అజీర్తి.
అజీర్ణి. సం. అజీర్ణము.
అజీర్తి. వా. అన్నము అఱుగని వ్యాధి.
అజీవని. సం. శాపము; చావు.
అజీవము. సం. విణ. నిర్జీవము.
అజుఁడు. సం. బ్రహ్మ; విష్ణువు; శివుఁడు; మన్మథుఁడు; రఘుమహారాజుకొడుకు. విణ. పుట్టుకలేనివాఁడు (ఆత్ముఁడు).
అజేయుఁడు. సం. విణ. జయింపరాని వాఁడు.
అజైకపాత్తు / అజైకపాదుఁడు } సం. ఒకరుద్రుఁడు.
అజ్జుక. సం. నాట్యోక్తియందు వేశ్య.
అజ్ఝట. సం. నేలయుసిరిక†.
అజ్ఞత. సం. అజ్ఞానము.
అజ్ఞాతము. సం. మూలప్రకృతి, అజ్ఞానము. విణ. ఎఱుఁగఁబడనిది.
అజ్ఞానము. సం. ఎఱుఁగమి, తెలియక పోవుట; గీతోక్తమైన అమానిత్వాది వింశతి (20) గుణములకు వ్యతిరిక్తము; ప్రపంచోపాదానకారణము; అవివేకము; విపరీతదృష్టి; ఆవరణవిక్షేపశక్తిద్వయవిశిష్టము; అనాదిసాంతమునైనది; అనృతము సర్వానర్థమూలమునైనది; ఆత్మాశ్రయము ఆత్మవిషయమునైనది; అవిద్య; అహంమతి; మాయ; తమస్సు మోహము మహామోహము తామిస్రము అంధతామిస్రమనెడి పంచవిధాజ్ఞానము; సత్తనికాని అసత్తనికాని సదసత్తనికాని నిర్వచింప వీలుకానిది; త్రిగుణాత్మకము; జ్ఞానవిరోధి. విణ. జ్ఞానరహితము.
అజ్ఞాని. సం. విణ. జ్ఞానము లేని వాఁడు.
అజ్ఞుఁడు. సం. విణ. మూర్ఖుఁడు; తెలియనివాఁడు, జ్ఞానరహితుఁడు.
అజ్మాయిషీ. హిం. పరీక్ష, తనిఖీచేయుట.
అఝారము. మొగసాల; కొలువుకూటము.
అఝారె(రే). అవ్య. బళీ.
అజ్ఝె. అడుగు; సమయము. అవ్య. బళీ.
అజ్ఝెము. అనువాకము.
అజ్ఝెరె(రే). అవ్య. బళీ.
అజ్ఝెవాలు. కోడి.
అజ్ఝా / అజ్ఝారె(రే) } అవ్య. బళీ.
అజ్ఝోడించు. స.క్రి. మాఱుమాటాడకుండ (ఆలస్యముచేయక) పనిచేయు.
అఝ్ఝురె / అఝ్ఝూరె } అవ్య. ప్రశంసార్థకము.
అఁట. అవ్య. అంట, కిలార్థకము (వచ్చెనఁట, పోయెనఁటయని); మహాత్వబోధకము; ఆశ్చర్యాద్యర్థకము.
అట. సం. పర్యటనము.
అటన్. అవ్య. అక్కడ, ఆ స్థలమందు; ఆవల, అనంతరము.
అటక. అటుక. చూ. [బస్తాంత్రి†.
అటకమామిడి. అటికమామిడి †;
అటకలి. నలుఁగుపిండి; ఒకరకముజోవ.? బ. అటుకండ్లు.
అటకాయించు. హిం. స.క్రి. అడ్డగించు.
అటకావు. హిం. ఆటంకము.

అటకు. అవ్య. అక్కడను.
అటతాళము. సం. ఒక సంగీతతాళము.
అటనము. సం. తిరుగుట, సంచారము.
అటని. సం. వింటికొప్పు, వింటిబద్దచివర.
అటను. భయము.
అటమట-ము. అపలాపము, మఱుఁగు మాట; మోసపుమాట; కలఁత, దుఃఖము; మాయ, వంచన. విణ. అసత్యము; మోసము; వ్యర్థము.
అటమటకాఁడు. విణ. వంచకుఁడు.
అటమటించు. స.క్రి. వంచించు; అపహరించు; దాఁచు. అ.క్రి. చలించు; దుఃఖించు.
అటమటింపు. అటమట.
అటమటీఁడు. విణ. మోసకాఁడు.
అటమర. పాటిపోవుట; వ్యర్థము.
అటమరింపు. పాటిపోవుట.
అటయితే. అవ్య. ఆలాగయితే.
అటరు(రూ)షము. సం. అడ్డసరము †.
అటవి. సం. అడవి.
అటాట్య. సం. పర్యటనము.
అటి. విణ. అట్టి.
అటిక(కె). చేట్టి, చిన్నకుండ.
అటికమామిడి. ఒక ఓషధి, ? మండలచ్ఛదము†. [అక్కడను.
అటు. అవ్య. ఆప్రకారము; ఆవైపు;
అటుక. ఇంటిసరంబీ, ఇంటిలో దూలములపై ఏర్పఱిచిన మంచె. [అటుకులు.
అటుకులు. బ.వా. పృథుకములు. చూ.
అటులన్. అవ్య. అట్లు.
అటులు. అవ్య. ఆప్రకారము, ఆలాగు.
అటువంటి. విణ. అట్టి.
అటువంటిది. విణ. అట్టిది, తాదృశము.
అటువంటివాఁడు. విణ. అట్టివాఁడు.
అటువలెన్. అవ్య. అటులు.
అటె. అవ్య. ఆశ్చర్యాద్యర్థకము (ఆశ్చర్యము, దుఃఖము, నిశ్చయము, పరిహాసము, మహత్త్వము, సంశయము - వీనిని తెలుపును).
అటే. అవ్య. ఆక్షేపార్థకము.
అట్ట. శరీరపుమెండెము; చెప్పులకు అడుగున వేయు తోలుముక్క; పుస్తకములకు పైన వేయు దళసరికాగితముతో లుం మొ||; ఒకదానితో నొకటి అంటుకొనిపోయిన పదార్థము. [ఒక ఆట.
అట్టచెమ్మ. నాలుగు గవ్వలతో ఆడెడి
అట్టడి. కోటకొత్తడము, కోటబురుజుమీఁదిగది. (బ. అట్టళ్లు).
అట్టము. సం. అన్నము; అట్టడి; అట్ఠము; మేడ, ఉపరిగృహము; మేడవెనుకఁగట్టిన యిల్లు; వంటచెఱకు. విణ. ఉన్నతము; అధికము; శుష్కము,
అట్టహాసము. సం. పెద్దనవ్వు, వీరరౌద్రరసముల వలనఁ బుట్టెడు నవ్వు. వా. ఆడంబరము.
అట్టాలకము. సం. ఉపరిగృహము, మేడ; కొత్తడము, కోటవాకిటిమీఁదిగృహము.
అట్టాలిక. సం. రాజభవనము.
అట్టి. విణ. అటువంటి.
అట్టిఁడు. విణ. అటువంటివాఁడు.
అట్టిక. అటిక.
అట్టిటు(ట్టు). అటునిటు; తాఱుమాఱుగా
అట్టిది. విణ. అటువంటిది.
అట్టిపెట్టు. స.క్రి. మిగుల్చు; ఉంచు.
అట్టియ. గుంపు.
అట్టిరు. బ. అట్టివారు.
అట్టివాఁడు. విణ. తాదృశుఁడు.
అట్టు. దోసె, కాందవము, పెనము మీఁదవండినది. అవ్య. చూ. అటు.
అట్టుక. అటుక.
అట్టుపుట్టానవాళ్లు. బ. పుట్టుపూర్వోత్తరాలు, పూర్తివివరములు.
అట్టుప్పు. వంటయుప్పు, పాక్యము.
అట్టులన్(లు). అవ్య. అట్లు.
అట్టువ. అటుక.
అట్టువోలెన్. అవ్య. అట్లు.
అట్టె. చూ. అటె.
అట్టెడ. గోనెసంచి; వంతెన; బద్దలతో అల్లినతట్ట; జల్లెడవంటి తడిక; కాయ ధాన్యములను శుభ్రపఱుచుటకు కట్టిన గోఁగుకట్టెలు మున్నగువాని మోపు.
అట్టెడి. అట్టడి.
అట్టే. అవ్య. అంతలోనే; అధికముగా.
అట్ఠము. వేదభాగము.

అట్యా. సం. పర్యటనము.
అట్లపోలె. అవ్య. ఆప్రకారము.
అట్లు. అవ్య. ఆప్రకారము; ప్రకారము.
అట్లువోలెన్. అవ్య. ఆప్రకారము, ఆలాగు.
అట్లొట్లు. బ. వానవెలిసిన పిమ్మట చూరు నుండి పడు నీటిబొట్లు
అడ. ముద్ద; ఆకృతి; పోఁకచెక్క; అట్ట; చింతపండు, రేఁగుపండ్లు మున్నగునవి త్రొక్కి చేసిన ఉండ.
అడంగు. విణ. తగులుబడిరైన. అ. క్రి.
అడఁగు. హిం. మొదటి చోటు.
అడంచు. స. క్రి. కొట్టు; నశింపఁజేయు.
అడఁకువ. వినయము.
అడఁగారు. అ. క్రి. అడఁగు, తగ్గు; క్రుంగు.
అడఁగించు. స. క్రి. అడఁగునట్లు చేయు; నశింపఁజేయు.
అడఁగు. అ. క్రి. తగ్గు, అణఁగియుండు; ఉపశమిల్లు; నమ్రమగు; నశించు; లోపడు.
అడఁగు బొద్దు. (బేలుదారి) లోపల నణఁగి యుండునట్లు గోడ యంచుల యందు గీటి ఏర్పఱచెడు బొద్దు.
అడఁచు. ప్రే. అడఁగఁజేయు; అపహ రించు; చూ. అడంచు.
అడకత్తు. వా. అడకత్తెర.
అడకత్తెర. పోఁకలు కత్తిరించు కత్తెర.
అడకము. విణ. అంతర్భూతము.
అడకర్త. ఓర్పు.
అడకించు. స. క్రి. అపహసించు, పరిహ సించు; వంచించు.
అడకు. స. క్రి. దాఁచు.
అడకొత్తు. అడకత్తెర.
అడగొంటు. పోఁకముక్క; పుప్పిచెక్క.
అడగొను. అ. క్రి. అడ (ముద్ద) కట్టు.
అడగోలుకొను. స. క్రి. అపహరించు; వశ పఱచుకొను.
అడచిపడు. అ. క్రి. గర్వించు.
అడచిపాటు. వడి, వేగము.
అడపేడి. దుఃఖము.
అడపేడిపెట్టు. స. క్రి. దుఃఖపెట్టు.
అడదడి. అ ప్ర. ప్రభుత్వము.
అడది. పసుపు, పచ్చన.
అడప. అడపకత్తె; అడుప.
అడపకత్తియ } తాంబూలము, తములపాకుల
అడపకత్తె } సంచి పట్టుకొను స్త్రీ.
అడపకాఁడు. తాంబూల దుఁడు, తముల పాకుల సంచి పట్టుకొనువాఁడు.
అడపట్టియ } అడ్డమాను.
అడపట్టె }
అడపతడప. వా. అప్పుడప్పుడు.
అడపది. అడపకత్తె.
అడపము. తాంబూల కరంకము, తముల పాకుల సంచి (బరణి); మంగలి పొది.
అడపర. అడ, ముద్ద.
అడపొడ. జాడ, స్వరూపము.
అడబాల. విణ. వంటవాఁడు; వంటలక్క.
అడలించు. ప్రే. బాణాదులు ప్రయోగించు
అడరు. ఆధిక్యము; కష్టము, దుఃఖము, విచారము. అ. క్రి. అతిశయించు; ఉత్స హించు; పూను; ఒప్పు; ప్రకాశించు; కలుగు; త్వరపడు; వర్ధిల్లు; విజృం భించు; వ్యాపించు.
అడరుచు. ప్రే. ఆదరించు. [అడరు.
అడరుదెంచు. అ. క్రి. అతిశయించు;
అడర్చు. చూ. అడరించు.
అడలడి. అలజడి, దుఃఖము.
అడలించు. అ. క్రి. అదరించు.
అడలు. భయము; శోకము. అ. క్రి. భయ పడు; ఏడ్చు, ధ్వని యుక్తముగా రోద నము చేయు; విలపించు; శోకించు.
అడలుకొను. అ. క్రి. భయపడు; దుఃఖపడు
అడవి. అరణ్యము, వనము.
అడవికంద. స్థూలకందము, వనకందము†.
అడవికాఁకర. వనకారవేల్లము†.
అడవికాఁపు. వనవాసి.
అడవికాకి. ద్రోణకాకము.
అడవికిక్కస. దేవనాళము†.
అడవికుక్క. తోఁడేలు. [ధాన్యము.
అడవికుసుమ. వనకుసుంభము†. బ. ఒక
అడవికోడి. గునపనకోడి, వనకుక్కుటము.
అడవిగెనసు. ఒకగెనసు†.

అడవిచిచ్చు. కార్చిచ్చు, దావాగ్ని.
అడవిచెఱకు. కాంతారము†.
అడవిచేమ. ఒకచేమ†.
అడవితిరుగుడు. కోఁతి.
అడవితొగరి. వనతువరి†.
అడవితొల(ళ)సి. వనతులసి†.
అడవిత్రిమ్మరి. కోఁతి. [వము.
అడవిదున్న. కారెనుఁబోతు, వనమహి
అడవిదోమ. అరణ్యమశకము.
అడవిధాన్యము. నీవారము.
అడవినట్టు. కోఁతి.
అడవినువ్వులు. బ. కారునువ్వులు†.
అడవినెలవరి } వనవాసి, వానప్రస్థుఁడు
అడవినెలవు }
అడవిపంది. వరాహము.
అడవిపిచ్చుక. వనచటకము.
అడవిపిల్లి. వనమార్జాలము.
అడవిపెసలు. మకుష్టకము†.
అడవిప్రత్తి. భారద్వాజి†.
అడవిబచ్చలి. తనోపోదకి†.
అడవిబీర. కోశఫల†.
అడవిమనికిపట్టు. వనవాసి, వానప్రస్థుఁడు
అడవిమల్లె. గిరికాలత†.
అడవిమామిడి. వనామ్రము†. [మిడి†.?
అడవిమామెన. వనశారిబ†; అటకమా
అడవిమునగ. వనశిగ్రువు†.
అడవిమేఁక. వనచ్ఛాగము.
అడవిమొల్ల. మాగధీలత†.
అడవియరఁటి. గిరికదళి†.
అడవియులవలు. వనకుళుత్థము†.
అడవిసదాప. వనశాలేయము†.
అడవీఁగ. దంశము.
అడసాల. వంటయిల్లు.
అడావుడి. హిం. అల్లరి, ఆడంబరము; తొందర; తొట్రుపాటు.
అడి. విణ. అధికము; అందనిది; వ్యర్థము. ఉప. పాదము; క్రిందిభాగము.
అడిగండ్లు. బ. బియ్యము మొ॥ చెరుఁగఁగా అడుగున నిలిచిన తాళ్లు.
అడిగము. భారవిశేషము, పరిమాణభేదము
అడిగజ్జ. పాదుక.
అడిగించు. స.క్రి. ఒకరిచే అడిగించు.

అడిగికొను. స.క్రి. తానుప్రార్థించు; ముష్టి యెత్తుకొను; యాచించు.
అడిగికోలు. ప్రార్థన; యాచన; భిక్షాటనము
అడిగిననొసఁగెడియావు. కామధేనువు.
అడిగొంటు } విణ. కుత్సితుఁడు.
అడిగొట్టు }
అడిచిపడు. అ.క్రి. త్వరపడు; మండిపడు; మిడిసిపడు.?
అడిచిపాటు. త్వర.
అడితి. కమీషను, ఇతరుల సరకులను అమ్మి పెట్టుటకును వారికి కావలసినవి కొని పెట్టుటకును ఏర్పఱచుకొనిన లాభము; నూటికింతయని పుచ్చుకొనెడు తఱుగు; కజ్జలం మొ॥ అమ్ముచోటు.
అడిత్రాగుడు. కఱవు. [మృగము.
అడిదపుమెకము. ఖడ్గమృగము; శరభ
అడిదము. కత్తి, తరవారు.
అడిబండ. విణ. దుష్టుఁడు.
అడిబీరము. మత్తు, మదము.
అడిమోహము. మి. అధికప్రేమ.
అడియఁడు. పాదసేవకుఁడు.
అడియరి. సేవకుఁడు; లోభి.
అడియాల(ళ)ము. గుఱుతు, ఆనవాలు.
అడియాస. కలుగునెడియాశ, ప్రత్యాశ; అత్యాశ, అందనికోరిక.
అడియేను. దాసత్వము.
అడియొత్తు. పాదుక. [బేరము.
అడిసాటా. తఱుగుబేరము; అమానతు
అడుకు. దొంతి, వరుస; భయము. స.క్రి. దొంతరగాఁబేర్చు.
అడుకులు. బ. నానఁబోసి వేఁచి దంపిన వడ్లు, అటుకులు.
అడుగంటు. అ.క్రి. అడుగునమాఁడు; ఇగిరిపోవు; పట్టు; మొదలంటాఁకు; మొదలు నశించు; క్రిందికిపోవు.
అడుగంట్లు. బ. అడుగుననిలిచినతాళ్లు మొ; అధమములు.
అడుగిడు. స.క్రి. అడుగుపెట్టు; ప్రవేశించు
అడుగు. క్రిందు; పాదము; పాదప్రమాణము విణ. అధమము. స. క్రి. ప్రశ్నించు; యాచించు.
అడుగుఁదమ్మి. పాదపద్మము.

అడుగుఁబుట్టువు. గంగ; శూద్రుఁడు.
అడుగుకొను. అడిగికొను.
అడుగుకోలు. అడిగికోలు.
అడుగుచెమ్మటలాఁడు. విష్ణువు.
అడుగుతాటించు. స.క్రి. తన్ను; కాళ్లు కొట్టుకొను. [పెండ్లాడు.
అడుగుత్రొక్కు. స. క్రి. కాలంద్రొక్కు,
అడుగుదాఁటు. స. క్రి. మీఱు, అతిక్రమించు.
అడుగుది. విణ. క్రిందనున్నది, అధస్స్థము.
అడుగుదీయు. స.క్రి. వెనుదీయు; అడుగు కదల్చు.
అడుగుదోదుమి. కోడి.
అడుగుపట్టు, అడుగుపడు } అ. క్రి. క్రిందగు; అధమమగు; నశించు.
అడుగుపఱచు. ప్రే. అడుగుపడఁజేయు.
అడుగుపుట్టువు. అడుగుఁబుట్టువు.
అడుగుపెట్టు. అడుగిడు.
అడుగుమాలిపోవు. అ. క్రి. నిర్మూలమగు, మొదలం నశించు. [అడుగంటు.
అడుగుముట్టు. అ. క్రి. నిర్మూలమగు;
అడుగువాఁడు. విణ. క్రిందనున్నవాఁడు, అధస్థితుఁడు. [యుధము.
అడుగువాలుపులుఁగు. కోడి, చరణా
అడుచు. స.క్రి. కొట్టు, మోఁదు.
అడుజే. ఒక డేగ.
అడుప. పశుపాదరోగము.
అడుపు. దెబ్బ; ఇంటిసరంబీ.?
అడుపె. విణ. ప్రాఁత.
అడువరి. అళువరి, వప్రము.
అడువు. పాదము. స.క్రి. ప్రశ్నించు.
అడువుఁబుట్టువు. అడుగుఁబుట్టువు,
అడుసు. బురద, పంకము.
అడుసుపుట్టువు. తామర, పంకజము†.
అడ్గు. అడుగు.
అడ్డ. గుంటకమున్నగువాని దిండు; మంచములో సగము, రెండుమానికల కొలఁది; వాలుగు. విణ. అడ్డముగానున్నట్టిది, తిరశ్చీనము.
అడ్డంకి. అడ్డు, అటకావు.
అడ్డకట్ట. ఆనకట్ట; చేలకునీళ్లు నిలుచుటకై కట్టిన గట్టు.
అడ్డకట్టు. స.క్రి. అడ్డగించు.
అడ్డకత్తి. పట్టాకత్తి, పట్టిసము.
అడ్డకమ్మి. గుమ్మముకమ్మి, ద్వారబంధపు లత్తుకమ్మి; అడ్డముగా నుండు కమ్మి.
అడ్డకఱ్ఱ. అడ్డు; ఒకసుఖరోగము.
అడ్డకొడమ. చేఁపలఁబట్టు ఒకసాధనము.
అడ్డగఱ్ఱ. తలుపుగడియ.
అడ్డగాలు. అడ్డు.
అడ్డగించు. స.క్రి. నిరోధించు.
అడ్డగింత. అడ్డము.
అడ్డగోలు. అడ్డదిడ్డము.
అడ్డచేఁపు. అడ్డవాసపు దూలము.
అడ్డణము. అడ్డనము.
అడ్డతలది. విణ. తిర్యఙ్ముఖి, అడ్డతలగల స్త్రీ, శిరాల?. [శిరాలుఁడు?.
అడ్డతలవాఁడు. విణ. తిర్యఙ్ముఖుఁడు,
అడ్డదిడ్డము. విణ. అక్రమము, అసందర్భము
అడ్డన. పళ్లెములుమున్నగునవియుంచుపీఁట
అడ్డనము. కేడెము, బెత్తములోనగుదాని చేత చేయఁబడిన డాలు.
అడ్డపట్టియ. అడ్డపట్టె. [ముగా పట్టు.
అడ్డపట్టు. స క్రి. శిశువును చేతులపై అడ్డ
అడ్డపట్టె. మడి చదును పఱచెడి పలక.
అడ్డపడు. అ.క్రి. అడ్డమువచ్చు.
అడ్డపాటు. అడ్డపడుట; కప్పు, మాఁత.
అడ్డపాప. చేతులపై అడ్డముగా పట్టఁదగిన శిశువు; దూరవస్తువు చూడలేని వాని కన్నులలోని పాప. [బెట్టు.
అడ్డపెట్టు. అడ్డు. స.క్రి. అడ్డగించు; కుదువఁ
అడ్డబాస. బులాకి, నాసాభరణవిశేషము.
అడ్డబొట్టు. తిర్యక్పుండ్రము.
అడ్డమాడు. అ.క్రి. అడ్డుచెప్పు.
అడ్డమాను. అడ్డపట్టె; దూలము.
అడ్డము. అడ్డు; చాటు; తాకట్టు; పూఁట; శిశువును అడ్డముగా పట్టుకొనుటకై వంపుగా పట్టిన రెండుచేతుల నడిమి భాగము. విణ. తిర్యక్కు; నిరోధకము.
అడ్డరి. అడ్డుగా వచ్చి మాటాడువాఁడు.
అడ్డరిక. సం. అప. ఒకరకము పోలీ.
అడ్డవాట్లు. బ. అడ్డుదెబ్బలు; అడ్డు.
అడ్డవాతియమ్ము. వాయి అడ్డముగాఁగల ఒకబాణము.

అడ్డవేడెము. ఒక గుఱ్ఱపు నడక.
అడ్డసరము. అటరూషము †.
అడ్డసారె. పాచిక.
అడ్డసాళులు } అడ్డసాళ్లు—లు } బ. సోగటాలపాచికలు.
అడ్డాదిడ్డి. విణ. అడ్డదిడ్డము.
అడ్డాయుధము. వంకర కత్తి, ఆయుధభేదము.
అడ్డి. అడ్డు; వ్యవధానము.
అడ్డిగ. రూకలో సగము, పణార్ధము.
అడ్డిగలు. బ. స్త్రీలుధరించు ఒక కంఠాభరణము.
అడ్డిపడు } అడ్డిపోవు } అ.క్రి. ఆగిపోవు, నిలిచిపోవు.
అడ్డీ. అనుకైనవస్తువుయొక్క పూఁత; ద్రవద్రవ్యముల లేపము. అప్ర. అమానతు.
అడ్డు. అడ్డగింత; చాటు. స.క్రి. అడ్డగించు.
అడ్డుకొను. అ.క్రి. అడ్డపడు.
అడ్డుగ. అడ్డిగ; చిన్నములో సగము.
అడ్డుఁగట్టు. విఘ్నము; గడియప్రమాను. విణ విఘాతము.
అడ్డుగొను. అ.క్రి. అడ్డపడు.
అడ్డుగోడ. చాటుకొసము పెట్టిన గోడ.
అడ్డేఁడు. రెండుమానికెల సరకు.
అడ్వాన్సు. ఇం. బయానా, అగ్రిమశుల్కము
అడ్వొకేటు. ఇం. ప్లీడరు.
అణఁకువ. వినయము.
అణఁగారు. అ.క్రి. అడఁగారు.
అణఁగించు. స.క్రి. అణఁచు.
అణఁగు. అ.క్రి. అణఁగియుండు, అడఁగు, శాంతిబొందు; నశించు.
అణఁచు. స.క్రి. అడఁచు; క్రిందికిఅదుము; నశింపఁజేయు; శాంతినొందించు.
అణక. మెడమీఁదనున్న కాఁడి మున్నగువానిని మెడక్రిందికి తెచ్చుకొనుట.
అణకించు. స.క్రి. అడకించు.
అణకుఁడు. సం. విణ. కుత్సితుఁడు, నికృష్టుఁడు.
అణవీనము } అణవ్యము } సం. చిఱువడ్లు పండెడు పొలము.
అణా. హిం. అణకము, రూపాయలో పదియాఱవ వంతు.
అణి. సం. ఇఱుసుతుదిచీల; అంచు; ఎల్ల; సూదిమొ॥ కొన (మొన).

అణిమ } అణిమము } సం. శివునిఒక లీలావిభూతి, అణుత్వము, అణువంత (కేశములో సహస్రాంశము) యగుట, అణుస్వరూపుఁడగుట, ఐశ్వర్యవిశేషము, ఒక సిద్ధి.
అణిష్ఠము. సం. విణ. అన్నిటికంటె చిన్నది, సూక్ష్మతమము.
అణీయము } అణీయస్సు } సం. విణ. సూక్ష్మతరము.
అణుకము. సం. విణ. అణువు; అల్పము; చిన్నది.
అణుకుఁడు. సం. విణ. అల్పుఁడు; నేర్పరి
అణుజే. అడుజో; ఈఁకలురాల్చినపక్షి.
అణువీక్షణము. సం. దుర్భిణి.
అణువు. సం. చిఱువడ్లు, నల్లవరి. విణ. లేశము, సూక్ష్మము; స్వల్పము, అణుపరిమాణము.
అతంత్రము. సం. విణ. కారణాధీనముగానిది; చెప్పఁదలంపఁబడనిది.
అతఁడు. స. ఆమనుష్యుఁడు; ఆయన; తత్పదార్థము.
అతకరించు. స.క్రి. క్రిందుపఱచు, మించు, అతిక్రమించు; నిందించు.
అతగాఁడు. స. అతఁడు.
అతగుఁడు. విణ. అజ్ఞాని; బక్కవాఁడు; బీద
అతత్తద్బుద్ధి. సం. అధ్యాస, అదికాని దానియందదియనెడి బుద్ధి.
అతద్వ్యావృత్తి } అతన్నిరసనము } సం. అదికాని దానిని (అనాత్మను) త్రోసిపుచ్చుట.
అతనుఁడు. సం. మన్మథుఁడు. విణ. గొప్పవాఁడు.
అతర్క్యము. వా. అపరాధము; మట్టుమీఱిన కార్యము.
అతర్కితము. సం. విణ. అనుకొననిది, తలఁచుకొనఁబడనిది.
అతల(లా)కుతలము. క్రమ, తాఱుమాఱు. విణ. తాఱుమాఱైనది.
అతలము. సం. ప్రథమఖండపాతాళము, భూలోకమునకు క్రిందిలోకము.
అతలసు. హిం. వస్త్రవిశేషము, ఒక పట్టుబట్ట.
అతలస్పర్శము(స్పృక్కు). సం. విణ. అగాధము.

అతసి. సం. అగిసె†.
అతి. సం. అవ్య. అధికము.
అతికించు. స.క్రి. అదికించు
అతికృచ్ఛ్రము. సం. ప్రాయశ్చిత్తవ్రత విశేషము.
అతిక్రమణము. సం. అతిక్రమించుట.
అతిక్రమము. సం. శత్రువు నెదుర్కొనుట; అతిక్రమించుట.
అతిక్రమించు } సం. స.క్రి. మించిపోవు;
అతిక్రమిల్లు } మీఱు; దాఁటు; క్రమము నుల్లంఘించు. [దాఁటినది.
అతిక్రాంతము. సం. విణ. మీఱినది;
అతిక్రాంతి. సం. అతిక్రమించుట.
అతిక్రామకుఁడు. సం. విణ. అతిక్రమించువాఁడు.
అతిగండము. సం. ఒక యోగము.
అతిగము. సం. విణ. అతిక్రమించినది.
అతిగ్రహము. సం. కర్మేంద్రియము; జ్ఞానేంద్రియము; సమ్యక్ జ్ఞానము. విణ గ్రహింపరానిది.
అతిచర. సం. మెట్టతామర†.
అతిచారము. సం. శీఘ్రగమనము; అతిక్రమించి వెళ్లుట; గ్రహగతివిశేషము.
అతిచ్ఛత్ర. సం. పెద్ద సదాప†.
అతిచ్ఛత్రము. సం. గొడుగుగడ్డి†.
అతిజగతి. సం. పదుమూఁడవ ఛందస్సు.
అతిథి. సం. విందు, (అంతకుమున్ను పరిచయము లేక) ఇంటికి వచ్చిన వ్యక్తి; ధర్మార్థము ఇంటికి వచ్చిన యాచకుఁడు.
అతిదిష్టము. సం. విణ. అతిదేశముగలది.
అతిదేశము. సం. అన్యధర్మములను అన్యత్ర ఆరోపించుట.
అతిధృతి. సం. పందొమ్మిదవ ఛందస్సు.
అతినువు. సం. విణ. ఓడనతిక్రమించినది.
అతిపత్తి. సం. అతిక్రమణము.
అతిపథము. సం. మంచిత్రోవ.
అతిపన్నము. సం. విణ. దాఁటిపోయినది
అతిపాతము. సం. అతిక్రమణము; క్రమము తప్పుట; విడిపడుట.
అతిబల. సం. చిట్టాముదము†; రామునకు విశ్వామిత్రుఁడుపదేశించిన ఒక విద్య.
అతిబలము. సం. గాలివాన.

అతిభూమి. సం. అతిశయము.
అతిమధురము. సం. ఒక మందుదినుసు.
అతిమాత్రము. సం. ఎక్కువ. విణ. అధికము. క్రి.విణ. పెల్లు.
అతిమానము } సం. దురభిమానము.
అతిమానిత }
అతిమానుషము. సం. విణ. మనుష్యులకుండని దివ్య రూప కర్మాదికము.
అతిముక్తకము. సం. నెమ్మి†.
అతిముక్తము. సం. పువ్వుల గురువెంద†; తినాస†. విణ. కూడిక లేనిది.
అతిమృత్యువు. సం. అమరత్వము, మోక్షము.
అతిరథుఁడు. సం. విణ. పెక్కు విలుకాండ్రతో యుద్ధము చేయువాఁడు.
అతిరసము. సం. అరిసె, భక్ష్యవిశేషము.
అతిరిక్తము. సం. ఆధిక్యము; శ్రేష్ఠత్వము విణ. భిన్నము; శ్రేష్ఠము; ఎక్కువైనది.
అతిరేకము. సం. ఆధిక్యము; శ్రేష్ఠత్వము.
అతిరోగము. సం. క్షయ.
అతివ. ఆఁడుది.
అతివర్ణాశ్రమి. సం. ఆత్మదర్శనము చే వర్ణాశ్రమధర్మములదాఁటిపోయినవాఁడు
అతివర్తులము. సం. బటానీలు†.
అతివస. ఒక ఓషధి, శుక్లకంద†.
అతివాదము. సం. అప్రియముగాఁబలుకుట
అతివాసము. వా. శ్రాద్ధదినమునకు ముందుదినము.
అతివిష. సం. అతివస†.
అతివృష్టి. సం. మితి మీఱిన వాన, ఒక ఈతిబాధ. [గల సంబంధవిశేషము.
అతివేధము. సం. ఏకాదశికి దశమితోఁ
అతివేలము. సం. అవ్య. అతిక్రమము; అతిశయము. విణ. అతిశయించినది.
అతివ్యాప్తి. సం. ఒకదోషము, లక్ష్యము కానిచోటఁగూడ లక్షణము ప్రవర్తించుట.
అతిశయనము } సం. ఎక్కువ, అధికము.
అతిశయము }
అతిశయించు } సం. అ.క్రి. హెచ్చు.
అతిశయిలు(ల్లు) }
అతిశయితము. సం. విణ. మీఱినది.

అతిశయోక్తి. సం. కొంచెమునుగొప్పచేసి చెప్పుట; ఒక అర్థాలంకారము.
అతిశాయనము. సం. ఆధిక్యము; ప్రశంస.
అతిశాయి. సం. విణ. అతిశయించినది.
అతిశోభనుఁడు. సం. విణ. మిక్కిలికాంతి గలవాఁడు; మిక్కిలి మంచివాఁడు.
అతిసర్గము. సం. దానము; స్వేచ్ఛనొసఁగుట. విణ. నిత్యము; ముక్తము.
అతిసర్జనము. సం. ఈవి; హింస.
అతిసాంతపనము. సం. ఒక వ్రతము.
అతిసారకి } సం.విణ.అతిసారరోగముగలవాఁడు.
అతిసారి }
అతిసారము. సం. పాచనాలు, నీళ్లవిరేచనాలగుట.
అతిహసితము } సం. ఒడలు కదలునట్లు నవ్వుట, పెద్దనవ్వు.
అతిహాసము }
అతీంద్రియము. సం. మనస్సు; పరమాత్మ విణ. ఇంద్రియగోచరముగానిది (ఆత్మ, బ్రహ్మము).
అతీతము. సం. భూతకాలము. విణ. కడచినది; మీఱినది; అతిక్రమించినది.
అతీతుఁడు. సం. విణ. మీఱి (మించి) యున్నవాఁడు.
అతీసారము. సం. అతిసారము.
అతుకు. అతికిన తావు, మాసిక. అ. క్రి. జతపడు; అంటుకొను; అనుకూలపడు, కలియు, సరిపడు. స. క్రి. జతపఱచు; అతికించు. విణ. జతపఱచినది.
అతులము } సం. విణ. సాటిలేనిది.
అతులితము }
అత్త. భార్య(భర్త)యొక్క తల్లి, శ్వశ్రువు. సం. పరమేశ్వరుఁడు; తల్లి; అక్క. విణ. తినువాఁడు.
అత్తగంతు. వేశ్యామాతలసముదాయము.
అత్తగారు. అత్తమ్మ.
అత్తడము. అట్ట, కాగితపు అట్ట.
అత్తడి. గోడిగరొద.
అత్తపత్తి. సోఁకుడుముడుఁగు, లజ్జాళువు†
అత్తమామలు. శ్వశ్రూశ్వశురులు.
అత్తమిల్లు స.క్రి. ఆనుకొను. అ. క్రి. క్రుంకు; ఒఱగు; తగ్గు; నశించు; పరుండు; వ్యాపించు.
అత్తము. గుత్తి, గుంపు; అరఁటిపండ్లగుత్తి అరఁటిగెలలోనొకభాగము

అత్తమ్మ. అత్తయ్య.
అత్తయ్య. అత్తగారు.
అత్తరము. అత్తరు.
అత్తరు—వు. సువాసనాద్రవ్యము, సుగంధతైలము.
అత్తఱి. ఆకాలము, ఆసమయము, అప్పుడు
అత్తల(ళ)ము. ఈఁటె; బల్లెము.
అత్తల్లి. ఆ తల్లి.
అత్తళువు. ఎదను వచ్చిన ఆఁడుగుఱ్ఱము. విణ. ఎదను వచ్చినది.
అత్తి. మేడి†; ఏనుఁగు. సం. అత్తిః; అపేక్ష.
అత్తిక. సం. తల్లి; నాట్యోక్తియందు అక్క.
అత్తు. మైనపుగుడ్డ. అ. క్రి. కలుగు; కలసి మెలసియుండు; తగు, యుక్తమగు.
అత్తుకొను. అ. క్రి. అత్తు.
అత్తుగడ. పొందుట.
అత్తెము. అత్తము; అత్తు; హస్తకవచము.
అత్తెసరు. గంజివార్చకుండ అన్నములో ఇగిరిపోవునట్లు పెట్టెడి యొసరు.
అత్యంతము. సం. క్రి.విణ. మిక్కిలి. విణ. అధికమైనది.
అత్యంతాభావము. సం. ఎన్నఁడును ఎచ్చటను బొత్తిగా లేకుండుట.
అత్యంతీనుఁడు. సం. విణ. మిక్కిలినడచువాఁడు.
అత్యసద్వాహము. సం. విణ. ఎద్దునతిక్రమించినది.
అత్యసద్వాహుఁడు. సం. ఎద్దునతిక్రమించినవాఁడు.
అత్యయము. సం. అతిక్రమము; కష్టము; జరిమానా; దోషము; నాశము; మరణము.
అత్యర్థము. సం. క్రి.విణ. అతిశయము. విణ. అధికమైనది.
అత్యర్థిన్. అధికభక్తితో.
అత్యష్టి. సం. పదునేడవ ఛందస్సు.
అత్యాకారము. సం. తిరస్కారము.
అత్యాచారము. సం. ఆచారమునుల్లంఘించుట; అయోగ్యముగాఁ బ్రవర్తించుట; అన్యాయ్యము.
అత్యాచారుఁడు. సం.విణ. అత్యాచారముగలవాఁడు.
అత్యాశ సం. పేరాస, గొంతెమకోరిక.
అత్యాశ్రమి. సం. సన్న్యాసి.
అత్యాహితము. సం. మిక్కిలిభయము; బ్రదుకుకోరని సాహసకార్యము. విణ. కూడఁబడినది.

అత్యుక్త. సం. రెండవ ఛందస్సు.
అత్యుక్తి. సం. అతిశయోక్తి.
అత్రి. సం. సప్తఋషులలో నొకఋషి.
అత్రినేత్రజుఁడు. సం. చంద్రుఁడు.
అథర్వణము. సం. నాల్గవ వేదము.
అథర్వణి. సం. అథర్వవేదజ్ఞుఁడు; పురోహితుఁడు.
అథర్వణుఁడు. సం. శివుఁడు.
అథర్వము. సం. అథర్వణము.
అథర్వుఁడు. సం. ఒకముని; బ్రాహ్మణుఁడు
అథవా. సం. అవ్య. అట్లుగాకున్న; పక్షాంతరమున.
అదంత్రము. విణ. స్వాతంత్ర్యము తప్పినది; నడుము భగ్నమైనది.
అదంభి సం. విణ. దంభములేనివాఁడు.
అదక. ప్రాఁతచెప్పు.
అదక్షిణము. సం. విణ. దక్షిణలేనిది.
అదటు. గర్వము; మదము.
అదత్త. సం. పెండ్లికానిది.
అదనము. విణ. అధికము. సం. తినుట.
అదను. కాలము, సమయము.
అదనైనవాఁడు. ఆఁకలిగొనినవాఁడు.
అదపు. హిం. గద్దింపు; భయము.
అదభ్రము. సం. విణ. ఎక్కువైనది.
అదయుఁడు. సం. విణ. దయలేనివాఁడు.
అదరము. పెదవి.
అదరవైచు } స.క్రి. భయపెట్టు.
అదరించు }
అదరిపడు. అ.క్రి. అదిరిపడు, ఉలికిపడు.
అదరిపాటు. అదిరిపాటు.
అదరు. చంచలత్వము, చలనము; జంకు. అ.క్రి. కంపించు; చలించు; త్రుళ్లిపడు.
అదరుగడ. భయము.
అదరులు. బ. మిణుఁగురులు.
అదర్శనము. సం. కనఁబడకపోవుట; లోపించుట; నశించుట; చూడకుండుట.
అదలించు. స.క్రి. భయపెట్టు; నివారించు.
అదలు. అ.క్రి. భయపడు.
అదలుచు(పు) } ప్రే. అదలించు.
అదల్చు(ల్పు) }
అదవ. అద్దొ; కోన.

అదవద. కలఁత; చింత; పరాభవము. విణ. వ్యత్యస్తము.
అదవదపడు. అ.క్రి. కలఁతపడు.
అదసీయము. సం. విణ. దీ(వీ)నికి సంబంధించినది, దీ(వీ)ని సంబంధమైనది.
అదాటు. వా. అవ్య. ఉన్నట్టుండి.
అదాహ్యము. సం. విణ. దహింపరానిది.
అది. అవశ్యకార్థకము (పలుకునది, చేయునది, వలయునది అని). స. ఆమె; అయ్యది, తచ్ఛబ్దార్థకము; ఇది యేదియుఁ గానిది, బ్రహ్మపదార్థము. (ఇయ్యది స్త్రీవాచకము, పశుపక్ష్యాదివాచకము, జడవాచకమునగు సర్వనామము.)
అదిగాక. అవ్య. మఱియు.
అదిగొ(గో)న్. అవ్య. చూపుటను తెలుపునది, సూచనార్థకము.
అదితి. సం. భూమి; దేవతలతల్లి, కశ్యపునిభార్య; పునర్వసు నక్షత్రము.
అదితినందనులు. సం. బ. దేవతలు.
అదిర(రా). అవ్య. ఔరా, ఆశ్చర్యార్థకము.
అదిరిపడు. అ.క్రి. ఉలికిపడు, భయకంపితుఁడగు.
అదిరిపాటు. అదిరిపడుట; గర్వము. అవ్య. అకస్మాత్తుగా.
?అదీనము. సం. ఏనుఁగు.
అదుఃఖనవమి. సం. భాద్రపదశుద్ధనవమి.
అదుకకపోవు. అ.క్రి. పిండిమొదలగునది హత్తక విరవిరవోవు.
అదుకు. చూ. అతుకు.
అదుగో. వా. అదిగో.
అదుము. స.క్రి. క్రిందికి అణఁచు, నొక్కు.
అదుముడు. అదుముట.
అదురు. చూ. అదరు.
అదురుఁగోవి. భూమియందు ఇనుపగొట్టములు నాటి వానియందు మందుదట్టించి అదురునట్లు వేసెడు వేటు.
అదురుఁదిక్కు. పశురోగ విశేషము.
అదురుగడ. అదిరిపాటు.
అదురుగుండియ(గుండె) విణ. పిఱికి.
అదురుచు } చూ. అదరు.
అదుర్చు }

అదురుపేటు. అదురునట్లు కొట్టెడు దెబ్బ. చూ. అదుర(ుగ్రోవి.
అదుర్గము. సం. విణ. కోటలేనిది.
అదువ. విణ. అస్థిరము; అస్థిరుఁడు.
అదువ(వు)కాఁపు. అద్దెకాఁపు.
అదృక్కు. సం. విణ. గ్రుడ్డివాఁడు; దృక్కు కానిది, జడము, దృశ్యపదార్థము, అనాత్మ.
అదృశ్యకరణి. సం. ఉండియు కనఁబడకుండునట్లు చేసెడి ఒకసిద్ధి. [హితము.
అదృశ్యము. సం. దృశ్యముకానిది; తిరో
అదృష్టచర (పూర్వ) ము. సం విణ. మున్నెన్నఁడును కనఁబడనిది.
అదృష్టము. సం. అగ్ని జలము వ్యాధి దుర్భిక్షము మున్నగువానివలని (దైవకృతమగు) ఆపద; భాగ్యము; సుఖదుఃఖములకు కారణమయిన పుణ్యపాపరూపమగు పూర్వజన్మ కర్మ. విణ. కనఁబడనిది; అహమాది సర్వదృశ్యములకంటె వేఱైనది (ఆత్మ, బ్రహ్మము)
అదృష్టవంతుఁడు. సం. విణ. భాగ్యవంతుఁడు.
అదృష్టి. సం. కోపముతోఁగూడిన వక్రదృష్టి;పాడుచూపు;అట్టిచూపుగలకన్ను.
అదె(దే). అవ్య. అదిగో.
అదేమొ(మో). అవ్య. ఎందుకో.
అదేశము. సం. అయోగ్యమైన ప్రదేశము.
అద్ద. అరసోల; నూర్చక వేసిన కుప్పయొక్క క్రింది సగముభాగము. విణ. సగము.
అద్దకము. బట్టలకు వేయు రంగు.
అద్దగడియ. అర్ధఘటిక.
అద్దగోడ. మఱుఁగుగోడ, సగముగోడ.
అద్దపావు. నాటాకు.
అద్దమఱుఁగు. మఱుఁగులో సగము.
అద్దమరాతిరి(రేయి). అర్ధరాత్రము.
అద్దము. ముఖము చూచుకొను (ముఖాదుల ప్రతిబింబించు) గాజుబిల్ల, ముకురము, దర్పణము.
అద్దరి. ఆవల, అక్కడ.
అద్దరూపాయి. రూపాయిలో సగము.
?అద్దలవాడ. ఉప్పుచేయుటకు ఆరంభము
అద్దసేరు. సేరులో సగము.
అద్ది. అది, అయ్యది.
అద్దించు. స.క్రి. అద్దు; ఊహించు.
అద్దికము. కావలి.
అద్దిటి-య్యో. అవ్య. బళిరా.
అద్దియ. అద్దె. [కము.
అద్దిర(రా). అవ్య ఔరా, ఆశ్చర్యార్థ
అద్దిరపాటు. అబ్బురపాటు.
అద్దిరన్న } అవ్య. ఔరా, ఆశ్చ
అద్దిరమ్మ(య్య) } ర్యార్థకము.
అద్దు. అద్దకము; అద్దుడు. స.క్రి. తోఁచు; పూయు; ముంచు; రంగువేయు; పీల్చు కొనునట్లుచేయు. [కాగితము.
అద్దుకాకితము. సిరాను పీల్చుకొనెడి
అద్దువ. అదువ.
అద్దె. బాడుగ, ఇల్లు బండిలోనగువానికి నియమిత కాలమున ఇచ్చు సొమ్ము.
అద్దెఱ. అవ్య. ఔరా.
అద్దెస ఆదిక్కు, తత్ప్రదేశము.
అద్ధా. సం. అవ్య. సత్యముగా.
అద్ధాన్నము. వా.అధ్వానము,అర్ధాన్నము.
అద్భుతపడు. సం. అ. క్రి. ఆశ్చర్యముఁ జెందు.
అద్భుతము. సం. విస్మయస్థాయి భావకము, నవరసములలో నొకటి; ఆశ్చర్యము; ఆకస్మికమగు ఉల్కాపాతాద్యుత్పాతము. విణ. ఆశ్చర్యజనకము.
అద్మరుఁడు. సం. విణ. తిండిపోతు.
అద్యతనము. సం. కడచినరాత్రి రెండు జాములతోను (మలిజాములతోను) రాఁబోవు రాత్రి రెండు జాములతోను (తొలిజాములతోను) చేరినదినము, నేఁడు. విణ. నేఁడు ఉండునది; ఈనాఁటిది.
అద్యత్వము. సం. ఇప్పుడు.
అద్రి. సం. పర్వతము; చెట్టు;సూర్యుఁడు,
అద్రిజ. సం. పార్వతి.
అద్రిరాజము(రాజు). సం. మంచుకొండ, హిమవంతుఁడు.
అద్రుచు. అ. క్రి. అదురు, చలించు [ఇందు మొదటి యక్షరము 'అ'లఘువే యగును].
అద్రువ. చలింపఁగా.

అద్రోహము. సం. మనోవాక్కాయములచే ఏ ప్రాణికిని చెఱుపు చేయమి, దైవీసంపదలలో నొకటి.
అద్వయము. సం. అద్వైతము.
అద్వయవాది } సం. అద్వైతి; బుద్ధుఁడు.
అద్వయుఁడు }
అద్వితీయ. సం. దేవి.
అద్వితీయము. సం. విణ. రెండవదిలేనిది; తోడులేనిది; సాటిలేనిది (ఆత్మ, బ్రహ్మము).
అద్వితీయుఁడు. సం. విణ. తోడులేనివాఁడు; సాటిలేనివాఁడు; అద్వైతి; పరమాత్ముఁడు.
అద్వేష్ట. సం. విణ. ఏ ప్రాణిని ద్వేషింపనివాఁడు, భగవంతునకు ప్రియమైన భక్తుఁడు.
అద్వైతము. సం. అభేదము; జహదజహల్లక్షణాను సారముగా జీవేశ్వరుల కైక్యము చెప్పెడి మతము. విణ. రెండు కానిది, ఏకము; అద్వితీయము.
అద్వైతవాది. సం. విణ. అద్వైతి.
అద్వైతి. సం. విణ. అద్వైతమతస్థుఁడు (బ్రహ్మమే సత్యమని, జీవుడు, ఈశ్వరుఁడు, జగత్తు, ప్రకృతియు పర్యవసానమున బ్రహ్మమే యనియు, బ్రహ్మాభిన్నముగా ఏదియు సత్యము కాదనియు వచించువాఁడు.)
అద్వైతుఁడు. సం. విష్ణువు; దక్షిణామూర్తి. విణ. భేదరహితుఁడు; అద్వైతి.
అధఃకరణము. సం. తక్కువ పఱచుట; క్రిందుపఱచుట.
అధఃకరించు. చూ. అతికరించు.
అధఃకృతము. సం. విణ. క్రిందు (తక్కువ) పఱపఁబడినది. [వస్తువు.
అధఃక్షిప్తము. సం. విణ. క్రిందఁబడవేసిన
అధఃపతనము. సం. అధోగతి.
అధఃపాతి. సం. విణ. అధోలోకమును బొందువాఁడు; నరకమొందువాఁడు.
అధనుఁడు. సం. విణ. ధనములేనివాఁడు.
అధమ. సం. విణ. ప్రియుఁడు హితకరుఁడే యయ్యును అహితము చేయు నాయిక; అధమస్త్రీ.
అధమపాఱులు. ని.బ. నీచులైన బ్రాహ్మణులు.
అధమము. సం. విణ. తక్కువైనది; నీచము
అధమర్ణుఁడు } సం. విణ. అచ్చినవాఁడు
అధమర్ణికుఁడు } అప్పుతీసికొనినవాఁడు.
అధమాధమము. సం. విణ. మిక్కిలితక్కువది.
అధముఁడు. సం. విణ. కుత్సితుఁడు; నికృష్టుఁడు; హీనుఁడు; దయ భయము సిగ్గు కర్తవ్యాకర్తవ్య విచారమును లేని ఒక ఉపపతి.
అధర. సం. క్రింది దిక్కు.
అధరము. సం. పైపెదవి; క్రిందిపెదవి; యోని. విణ. హీనము; నీచము; క్రిందిది; ఈవలిది.
అధరామృతము. సం. మోవితేనె, చొల్లు.
అధరీణము. సం. విణ. తిరస్క (ధిక్క) రింపఁబడినది; క్రిందిది; ఈవలిది.
అధరోత్తరము. సం. విణ. ఎచ్చుతగ్గులుగలది; ఎగుడు దిగుడు.
అధరోష్ఠము. సం. క్రిందిపెదవి.
అధర్మ. సం. ధర్మరహితుఁడు.
అధర్మము సం. ధర్మవిరోధి; శాస్త్రనిషిద్ధమైన కార్యము; ప్రాణిహింసమొ॥ దానిచేతఁ గలుగు పాపము; నేరము; అనర్థహేతువు; ధర్మాతీతము; బ్రహ్మపదార్థము.
అధర్మి. సం. పాపి.
అధర్మిష్ఠుఁడు. సం. పాపిష్ఠుఁడు.
అధవ సం. విధవ.
అధస్తనము. సం. విణ. క్రిందిది; ఈవలిది.
అధి. సం. ఆధి, మనోవ్యథ.
అధికతమము. సం. విణ. అన్నింట నుత్కృష్టమైనది. [ఉత్కృష్టమైనది.
అధికతరము. సం. విణ. రెండింటిలో
అధికమాసము. సం. రవిసంక్రాంతులు రెండుగలమాసము; రవిసంక్రాంతి లేని మాసము; రవిసంక్రమణములేని అమావాస్యలు రెండు గల మాసము.
అధికము. సం. ఒక అర్థాలంకారము; ఎక్కువ. విణ. ఎక్కువది, గొప్పది, పెద్దది, ప్రధానము; శ్రేష్ఠము; అసాధారణము,

అధికరణము. సం. ఆధారము; క్రియా శ్రయమైన కారకము; ఏదేనొక న్యాయ మును ప్రతిపాదించుటగలయది; సంగతి సందేహము ఆక్షేపము సమాధానము నిర్ణయము - అను వీని వివేచనగల గ్రంథము; పూర్వమీమాంస; ఉత్తర మీమాంస; కమ్మరవాని దాగలి.
అధికరణికుఁడు. సం. తీర్పరి.
అధికరించు. సం. స.క్రి. చేయు; చేర్చు; సంపాదించు. [వాఁడు.
అధికర్ధి. సం. విణ. అధికమైన సంపదగల
అధికర్మికుఁడు. సం. సుంకరి.
అధికాంగము సం. యోధులవడికట్టు; 21 వ్రేళ్లు మొ.
అధికారము. సం. రాజు మొదలైనవారికి గొడుగు పట్టుట మొ॥; ప్రకరణము; దొర తనము, పెత్తనము; ఆధిపత్యము; హక్కు కర్మానుష్ఠానమునఁగాని తత్తత్కర్మ ఫలానుభవమునఁగాని కల యధికారము; అర్హత; ఆరంభము; అధికారమునొందిన దేశము గ్రామము స్థలము పదార్థము మొ॥; కర్తవ్యము, నియమితమైన కార్యము, ఉద్యోగము; అనువృత్తి, వ్యాకరణ సూత్రాధికారము; శాస్త్ర విధికిని పురుషునకునుగల సంబంధము.
అధికారి. సం. అధికారముగల వాఁడు; వేదాంతశాస్త్రోక్త-అనుబంధ చతుష్టయ ములలో నొకటి. సాధన చతుష్టయ సంపత్తిగల ప్రమాత; భావంకు, దొర, హక్కుగలవాఁడు.
అధికృచ్ఛ్రము. సం. నెలగోజులనుష్ఠించు నట్టి ఒకవ్రతము. [గూడినది.
అధికృతము. సం. విణ. అధికారముతోఁ
అధికృతి. సం. అధికారము.
అధికృతుఁడు. సం. అధ్యక్షుఁడు; అధికారి.
అధిక్షిప్తము. సం. విణ. ఉంచఁబడినది; నిందింపఁబడినది; తిరస్కరింపఁబడినది; ప్రేరణ చేయఁబడినది; వేయఁబడినది; బెదరింపఁబడినది.
అధిక్షేపము. సం. తిరస్కరించుట; ఉంచుట, వేయుట; ప్రేరణచేయుట; ఆక్షేపిం చుట; బెదరించుట.

అధిగతము. సం. విణ. పొందఁబడినది; తెలిసికొనఁబడినది.
అధిగమము. సం. తెలిసికొనుట; పొందుట; స్వీకరించుట.
అధిజ్యధన్వుఁడు. సం. విణ. ఎక్కుపెట్టఁ బడిన విల్లుగలవాఁడు.
అధిజ్యము. సం. విణ. ఎక్కుపెట్టఁబడిన నారిగలది (ధనుస్సు).
అధిత్యక. సం. పర్వతముమీఁది భూమి.
అధిదేవత. సం. అధిష్ఠాత్రియైన దేవత; పరమేశ్వరుఁడు.
అధిదేవతలు. సం. బ. మనోబుద్ధీంద్రి యాదుల ననుగ్రహించెడి చంద్రుఁడు బృహస్పతి మొదలైన దేవతలు. (మనస్సు నకు చంద్రుఁడు, బుద్ధికి బృహస్పతి, చిత్తమునకు క్షేత్రజ్ఞుఁడు, అహంకారము నకు రుద్రుఁడు, చెవికి దిగ్దేవతలు, త్వగింద్రియమునకు వాయువు, నేత్రము నకు సూర్యుఁడు, జిహ్వకు వరుణుఁడు, ఘ్రాణేంద్రియమునకు అశ్వినీదేవతలు, వాక్కునకు అగ్ని, హస్తమునకు ఇంద్రుడు పాదమునకు విష్ణువు, పాయువునకు మృత్యువు, ఉపస్థేంద్రియమునకు ప్రజా పతి, పంచప్రాణములకు సద్యోజాత వామదేవ అఘోర తత్పురుష ఈశా నులు.) [గర్భుఁడు; అధిదేవత.
అధిదైవతము. సం. పురుషుఁడు; హిరణ్య
అధిదైవము. సం అధిదేవత.
అధినగ్నిక. సం. పదునొకండేండ్ల యీడు గల కన్యక.
అధినాథుఁడు. సం. అధీశ్వరుఁడు.
అధిపతి, అధిపుఁడు, అధిభువు } సం. విణ. అధికారి, ప్రభువు ఏలిక.
అధిభూతము. సం. సకల భూతములు
అధిమాసము. సం. అధికమాసము, మల మాసము. [మేశ్వరుఁడు.
అధియజ్ఞము. సం. అంతర్యామియైన పర
అధిరాజు (రాట్టు). సం. చక్రవర్తి.
అధిరోహణము. సం. ఎక్కుట.
అధిరోహ(హి)ణి. సం. నిచ్చెన.
అధిరోహించు. సం. స. క్రి. ఎక్కు.

అధివచనము. సం. పక్షపాతముతోఁ బలుకుట. [ఉండు.
అధివసించు. సం. అ. క్రి. నివసించు;
అధివాసనము. సం. ధూపా (గంధమాల్యా)దులచే సంస్కరించుట; వాసెన కట్టుట.
అధివాసరము సం. అతివాసము.
అధివాసము సం. గృహము, నివాసము, ఉనికి; పరిమళయుక్తము గావించుట; పరిమళము; యజ్ఞారంభ పూర్వదినమున చేసెడి దేవతావాహన పూజనాది కార్యము; అధివాసనము.
అధివిన్న. సం. పెద్దభార్య; మొదట పెండ్లిచేసికొనఁబడిన స్త్రీ. [వాఁడు.
అధివేత్త. సం. మాఱుపెండ్లి చేసికొనిన
అధివేదము(వేదనము). సం. భార్యయుండఁగా మఱొక పెండ్లి చేసికొనుట.
అధిశ్రప(య)ణము. సం. పాకము చేయుట
అధిశ్రయణి. సం. ప్రొయ్యి.
అధిశ్రయము. సం. పాకము చేయుట.
అధిశ్రవణము. సం. శ్రాద్ధకాలమున వినఁదగిన వేదమంత్ర సముదాయ విశేషము
అధిష్ఠాత. సం. అధ్యక్షుఁడు; కర్తృత్వము లేక కృతాకృతములఁ బరికించువాఁడు; నియంత, నియామకుఁడు; అధిదేవత; సాన్నిధ్యమాత్రమున నడుపు వాఁడు; అధికారి [దుర్గ.
అధిష్ఠాత్రి. సం. అధిష్ఠాన దేవత, పరదేవత,
అధిష్ఠానము. సం. పట్టణము; చక్రము, రాష్ట్రము; ప్రభావము; నివాసము; అధిష్ఠించుట; ఆధారము; ఆశ్రయము; నియంతృత్వము, తాను చేయకయే సాన్నిధ్యమాత్రమున నియతి కార్యమున నియమించునది (వాఁడు)గా నుండుట; ఆరోపస్థానము, అధ్యాససామగ్రిలో నొకటి; దేహము; సన్నిధిమాత్రము; సన్నిధిమాత్రమున నియమింపఁబడునది; ఉంచుట?.
అధిష్ఠించు. సం. అ. క్రి. ఎక్కు, కూర్చుండు; ఉండు. స. క్రి. ఆశ్రయముగాఁ జేసికొను.
అధిష్ఠితము. సం. విణ. ఎక్కఁబడినది; సన్నిధిమాత్రమున నియోగింపఁబడినది; స్థానము చేసికొనఁ బడినది.
అధికారము. సం. అధికారము.
అధీతము. సం. అధ్యయనము. విణ. పఠింపఁ (అభ్యసింపఁ) బడినది.
అధీతి. సం. అధ్యయనము. విణ. అధ్యయన మొనర్చినవాఁడు.
అధీనము. సం. విణ. అగ్గము, వశమందున్నది, లోఁబడినది.
అధీనుఁడు సం. వశుఁడు, లోఁబడినవాఁడు
అధీయానుఁడు. సం. విణ. పఠించువాఁడు.
అధీర. సం. నాయికావిశేషము.
అధీరము సం. విణ. చంచలము.
అధీరుఁడు. సం. విణ. భయపడువాఁడు, పిఱికి; వ్యాకులచిత్తుఁడు.
అధీశుఁడు. సం. అధిపతి; రాజు.
అధీశ్వరుఁడు. సం. సమస్త సామంతులచే నమస్కరింపఁబడెడి మహారాజు.
అధునాతనము. సం. విణ. ఇప్పటిది.
అధృతుఁడు. సం. విష్ణువు. [లేనివాఁడు.
అధృష్టుఁడు. సం. విణ. సిగ్గరి; దిట్టతనము
అధృష్యుఁడు. సం. విణ. ఎదిరింపరాని వాఁడు; అధృష్టుఁడు.
అధైర్యము సం ధైర్యము లేమి; ధీరత లేమి.
అధోంశుకము. సం. కట్టుబట్ట.
అధోక్షజుఁడు. సం. పరమాత్మ, విష్ణువు.
అధోగతి. సం. నరకాదిప్రాప్తి; అధమస్థితి.
అధోదిక్కు. సం. దక్షిణదిక్కు.
అధోదృష్టి. సం. విణ. నాసికాగ్రమున దృష్టి నిలిపినవాఁడు. [పాతాళము.
అధోభువనము. సం. అధోలోకము,
అధోమర్మము. సం. యోని.
అధోముఖనక్షత్రములు. సం. బ. భరణి-కృత్తిక-ఆశ్లేష-మఘ-పుబ్బ-విశాఖ-మూల-పూర్వాషాఢ-పూర్వభాద్ర.
అధోముఖము. సం. ఒకముద్ర. [వాఁడు.
అధోముఖుఁడు. సం. విణ. తలవంచుకొనిన
అధోలోకము సం. పాతాళము.
అధోవాయువు. సం. అపానవాయువు.
అధ్యండ. సం. దురదగొండి†; నేలయుసిరిక†. [జ్ఞానము. విణ. ప్రత్యక్షము.
అధ్యక్షము. సం. ప్రత్యక్ష (ఇంద్రియజన్య)

అధ్యక్షించు. సం. స.క్రి. పాలించు.
అధ్యక్షుఁడు. సం. అధికారి; రాజసంబంధి ఛత్రధారణాది వ్యవహారముల యందధికారముగలవాఁడు; వ్యాపకుఁడు; అధిష్ఠాత, సన్నిధి మాత్రమున నియమించువాఁడు.
అధ్యగ్ని-కృతము. సం. స్త్రీధన విశేషము, అగ్నిసన్నిధిని వివాహాదులలో స్త్రీకిఁజదివించిన సొమ్ము.
అధ్యధోభువనము. సం. పాతాళలోకము.
అధ్యయనము. సం. గురువుచ్చరించిన దాని ననుసరించిన ఉచ్చారణము; గురుముఖతః గ్రహించుట; పఠనము, అక్షరమాత్రపాఠము; అర్థయుక్తముగ అక్షరగ్రహణము; వేదాధ్యయనము, బ్రాహ్మణుల షట్కర్మలలో నొకటి. [చేయు
అధ్యయనించు. సం. స.క్రి. అధ్యయనము
అధ్యయము. సం. అధ్యయనము.
అధ్యర్ధము. సం. ఒకటిన్నర రూపాయి; ఒకటిన్నర.
అధ్యవసాయము. సం. నిశ్చయము; ఇది కర్తవ్యమనెడి బుద్ధివృత్తి విశేషము; ఉత్సాహము, ప్రయత్నము.
అధ్యశనము. సం. అజీర్తియున్నను అతిగా తినుట. [గావించు.
అధ్యసించు. సం. స.క్రి. అధ్యాసము
అధ్యస్తము సం. విణ. అధ్యసింపఁ (ఆరోపింపఁ) బడినది; మిథ్యయైనది.
అధ్యాత్మము. సం. స్వభావము(బ్రహ్మము తానే జీవుని రూపముతో నుండుట); ఆత్మ; బ్రహ్మము.
అధ్యాత్మవిదుఁడు. సం. విణ. బ్రహ్మసాక్షాత్కారముఁ బడసినవాఁడు.
అధ్యాపకుఁడు. సం. అధ్యయనము చేయించువాఁడు; ఉపాధ్యాయుఁడు.
అధ్యాపనము. సం. చదువు చెప్పుట; వేదము నేర్పుట, బ్రాహ్మణుల షట్కర్మలలో నొకటి.
అధ్యాపించు. సం. ప్రే. వేదముచదివించు.
అధ్యాయము. సం. అధ్యయనము; గ్రంథ పరిచ్ఛేదము. [వును ఆరోపించుట.
అధ్యారోపము. సం. వస్తువునందు అవస్తు

అధ్యావాహనికము సం. సారె, స్త్రీధన విశేషము. [దుర్బుద్ధి;అవిద్య;ఆరోపణము.
అధ్యాసము. సం. మిథ్యాజ్ఞానము; అతత్త
అధ్యాసి. సం. విణ. అధిష్ఠించినవాఁడు.
అధ్యాహరణము. సం. అధ్యాహారము.
అధ్యాహారము సం. ఉత్ప్రేక్ష; ఊహ; అస్పష్టార్థమును శబ్దాంతరముచే స్పష్టము చేయుట; బదులు, ప్రతినిధి.
అధ్యుష్ట్రము. సం. ఒంటెల బండి.
అధ్యూఢ. సం. అధివిన్న.
అధ్యేత. సం. అధ్యయనముచేయువాఁడు.
అధ్యేతవ్యము. సం. విణ. అధ్యయనము చేయఁదగినది.
అధ్యేషణ-ము సం. ప్రార్థనాపూర్వకముగా పెద్దలను పనిలో నియమించుట; ప్రవర్తించుట; యాచన.
అధ్రువము. సం. కర్మ. విణ. అస్థిరము.
అధ్వ. సం. మార్గము.
అధ్వగుఁడు, అధ్వనీనుఁడు, అధ్వన్యుఁడు } సం. బాటసారి, తెరువరి, దారినడచువాఁడు. విణ. ప్రయాణముచేయుటకు సమర్థుఁడు.
అధ్వము. సం. మార్గము.
అధ్వరము. సం. యజ్ఞము.
అధ్వర్యువు(ఁడు). సం. యజుర్వేదజ్ఞుఁడై హోమము నడపెడి ఋత్విక్కు.
అధ్వర్యువేదశాఖ. సం. యజుర్వేదశాఖ.
అధ్వానము. సం. మార్గము. వా. ఎటును గానిచోటు; అమార్గము (అపమార్గము). విణ. ఎటును (ఏమియు) తేలని స్థితిలో నున్నది, కష్టదశలోనున్నది. [దారి.
అధ్వానపుఁబట్టు. త్రోవ ప్రదేశము, నడు
అధ్వాయనము. సం. యాత్ర.
అనంగ. ద్రు. అనఁగా. [దశి.
అనంగత్రయోదశి. సం. చైత్రశుద్ధ త్రయో
అనంగము. సం. ఆకాశము; మనస్సు. విణ. ఆకారములేనిది; ఉపకరణము గానిది.
అనంగా. ద్రు. అనఁగా.
అనంగుఁడు. సం. మన్మథుఁడు.
అనంత. సం. భూమి; దుర్గ;తీఁటకసింద†; నాఁగేటిచాలుకూర†;తఱిగొఱ్ఱ†;గఱిక†.

అనంతము. సం. ఆకాశము; ఒక లెక్క, అసంఖ్యేయము. విణ. మేర లేనిది; నాశములేనిది; బ్రహ్మము; దేశ కాల వస్తు పరిచ్ఛేద రహితము.
అనంతముడులు. మి. నాగుపోఁగులు.
అనంతరము. సం. క్రి. విణ. పిమ్మట. విణ. వెనుకటిది; తరువాతిది; అంతరము కా(లే)నిది; నిరవకాశము నిరవధికము నగు బ్రహ్మపదార్థము. [రాయము.
అనంతరాయము. సం. విణ. నిరంత
అనంతవిజయము. సం. ధర్మరాజుయొక్క శంఖము.
అనంతవ్రతము. సం. అనంత చతుర్దశి.
అనంతశయనము. సం. ఒక విష్ణుక్షేత్రము, ఒక పట్టణము.
అనంతశయనుఁడు. సం. విష్ణువు.
అనంతుఁడు. సం. విష్ణువు, శేషుఁడు; బలరాముఁడు, కృష్ణుఁడు.
అనంత్యము. సం. బ్రహ్మపదవి.
అనంశుమత్ఫల. సం. అరఁటి†.
అనఁగ(ఁగా). అనిన; అనినతరువాత; అనఁగా అనఁగా; సతిసప్తమ్యర్థము.
అనఁగా అనఁగా. కథారంభసూచకము.
అనఁగి పెనఁగియుండు. అ.క్రి. కలసి మెలసియుండు.
అనఁగు. అ.క్రి. కలయు.
అనఁటి. అరఁటి, రంభావృక్షము.
అన ఆనకట్ట; అన్న; చాఁగునట్టి మిక్కిలి లేఁతకొమ్మ.
అనకట్ట. ఆనకట్ట.
అనకుఁడు. సం. విణ. అధముఁడు.
అనక్షరము. సం. అనరానిమాట, తిట్టు, బూతు, దుర్వాక్యము.
అనక్షరుఁడు. సం. విణ. నిరక్షరుఁడు.
అనగట్టు. అడ్డకట్ట. [స్థుఁడు.
అనగ్ని. సం. అగ్నిహోత్రములేని గృహ
అనఘము. సం.విణ. నిర్మలము; రమ్యము; పాపరహితము; దుఃఖరహితము.
అనఘుఁడు. సం. విణ. పాపరహితుఁడు; దుఃఖరహితుఁడు; నిర్మలుఁడు.
అనడుహము. సం. ఎద్దు.
అనడుహి. సం. ఆవు.
అనడ్వాహము. సం. ఎద్దు.
అనడ్వాహి. సం. ఆవు.
అనతికాలము. సం. కొద్దిసమయము.
అనద. విణ. అనాథ, విధవ; అల్పుఁడు, అధముఁడు.
అనద్యతనము. సం. విణ. నేఁటిది కానిది. (భూతకాలమునకుఁగాని, భవిష్యత్కాలమునకుఁగాని సంబంధించినది.)
అనధికారి(కృతుఁడు). సం. విణ. అధికారి కానివాఁడు. [పొందఁబడనిది.
అనధిగతము. సం.విణ. ఎఱుఁగఁబడనిది;
అనధీనకుఁడు. సం. ఒకరికి అధీనుఁడు గాక తనయింటనుండి కూలిపని చేయు వడ్రంగి.
అనధ్యయనము, అనధ్యాయము } సం. అధ్యయనములేమి; అధ్యయననిషిద్ధకాలము (పాడ్యమి, అష్టమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, నిత్యములు నైమిత్తికములునయిన అధ్యయన నిషిద్ధ సమయములు); ఆటవిడుపురోజు.
అనన్. అనఁగా.
అననము. సం. జీవించుట.
అననుపస్థలము. సం. నీరులేని చోటు.
అననురూపము. సం. విణ. అనురూపము కానిది, తగనిది.
అనన్యచింతుఁడు(చిత్తుఁడు). సం. విణ. అన్యమును తలంపనివాఁడు, అనన్యభక్తుఁడు.
అనన్యజుఁడు. సం. మన్మథుఁడు.
అనన్యధనము. సం. ఇతరుల కుపయోగింపని సొమ్ము. [షుని గూడని స్త్రీ.
అనన్యపూర్వ. సం. మున్నెన్నడును పురు
అనన్యప్రకాశనీయము. సం. విణ. ఇతరులకుఁ దెలుపఁదగనిది.
అనన్యభక్తుఁడు, అనన్యభాక్కు } సం. విణ. అన్యుని సేవింపనివాఁడు. రూ. అనన్యభాజుఁడు. [మనస్కుఁడు.
అనన్యమనస్కుఁడు. సం. విణ. ఏకాగ్ర
అనన్యము. సం. విణ. అన్యము కానిది; అన్యములేనిది; సాటిలేనిది.
అనన్యవిషయము. సం. విణ. ఇతరులకు విషయము కానిది; ఇతరులు చేయ శక్యము కానిది; అన్యవిషయములు లేనిది.

అనన్యవృత్తి. సం. విణ. ఏకాగ్రచిత్తుఁడు
అనన్యవ్యాపారుఁడు. సం. విణ. ఇతర వ్యాపారము లేనివాఁడు.
అనన్యశరణుఁడు. సం. విణ. ఇతరుఁడు రక్షకుఁడుగా లేనివాఁడు; ఇతరమును శరణు చొచ్చనివాఁడు.
అనన్యసాధారణ(సామాన్య)ము. సం.విణ. ఒరులకు దొరకనిది, సామాన్యముగా ఇతరులకుండనిది.
అనన్వయము. సం. ఒక అర్థాలంకారము. విణ. అన్వయములేనిది.
అనపకర్మ (క్రియ). సం. ఇచ్చి తిరుగ తీసికొనుట; ఋణాదులు తీర్చకుండుట.
అనపత్యుఁడు. సం.విణ.సంతతిలేనివాఁడు
అనపబ్రువము. సం. విణ. ఉత్కృష్టము; ప్రశస్తము; నిర్దోషము; పాపరహితము
అనపము. సం. విణ. కొద్ది జలముగల గుంటము.
అనపరము. సం. విణ. కార్యము కానిది కార్యములేనిది (ఆత్మ, బ్రహ్మము).
అనపహార్యము. సం. విణ. అపహరింప నశక్యము. [లేనిది.
అనపాయము. సం. విణ. అపాయము
అనపాయి. సం. విణ. ఎడఁబాటులేనిది; స్థిరము.
అనపాశ్రయుఁడు. సం. విణ. ఆశ్రయము లేనివాఁడు; దక్షతలేనివాఁడు.
అనపేక్షుఁడు. సం. విణ. ఇచ్ఛలేనివాఁడు.
అనపేతము. సం. విణ. తప్పనిది, తొలఁగనిది, కూడియుండునది.
అనభిజ్ఞుఁడు. సం. విణ. జ్ఞానరహితుఁడు.
అనభిసంధి. సం. కర్మఫలోద్దేశము లేకుండుట.
అనభ్యావృత్తి. సం. అభ్యాసములేమి.
అనము. సం. జీవించుట; ప్రాణము.
అనయము. సం. అశుభము; ఆపద; దురదృష్టము; ద్యూతాదివ్యసనము; దైవము; వ్యసనము. విణ. నీతికానిది; నీతిలేనిది.
అనయమున్. అవ్య. అత్యంతము, కడు; అవశ్యము, తప్పక; మఱియు మఱియు; సతతము, ఎల్లప్పుడు.
అనరు. సంకటము; దుర్బలత; సుస్తి.
అనరులు. బ. ఆయము, జీవస్థానము.
అనర్గళము. సం. విణ. అడ్డులేనిది.
అనర్ఘము. సం. విణ. అమూల్యము.
అనర్ఘ్యము. సం. విణ. అత్యంతపూజ్యము.
అనర్థకము. సం. విణ. నిరర్థకము; పొసఁగనిమాట.
అనర్థము. సం. అధర్మము. విణ. అనిష్టము.
అనర్హము. సం. విణ. అర్హముకానిది, తగనిది.
అనర్హుఁడు. సం. విణ. అయోగ్యుఁడు.
అనల. సం. అనల సంవత్సరము.
అనలద్రావితము. సం. విణ. అగ్నిచే నీరుగా చేయఁబడినది.
అనలము. సం. అగ్ని. [వసువు.
అనలుఁడు. సం. అగ్నిహోత్రుఁడు; ఒక
అనవకాశము. సం. అవకాశములేమి. విణ. అవకాశములేనిది.
అనవగాఢ(ధ)ము. సం. విణ. ఆకళింపు లేనిది, దురవగాహము. [చల్లారు.
అనవటిల్లు. అ. క్రి. అన్నము పక్వమై
అనవద్యము. సం. విణ. దోషములేనిది; నింద్యముకానిది. [గలవాఁడు.
అనవద్యశీలుఁడు. సం. విణ. మంచిశీలము
అనవధానత. సం. తప్పిపోవుట; ఏమఱుపాటు, కర్తవ్యకార్యమున ప్రమత్తత.
అనవరతము. సం. అవ్య. ఎల్లప్పుడు, నిరతము. విణ. ఎడతెగనిది.
అనవరార్ధ్యము. సం. విణ. ప్రధానము.
అనవసరము. సం. అవసరములేమి. విణ. అవకాశము లేనిది; అవసరము గానిది.
అనవస్కరము. సం. విణ. పరిశుభ్రము గావింపఁబడినది.
అనవస్థ. సం. అనవస్థాదోషము, ప్రతిపాదించునది ప్రతిపాదింపఁబడునది యను వీనికి తెంపులేకుండుట; నిలుకడలేమి.
అనవస్థితి. సం. నిలుకడలేమి.
అనవుడు. అవ్య. అనినపిమ్మట, అనఁగా.
అనవేక్ష. సం. అపేక్షలేమి.
అనశనము. సం. పస్తు, ఉపవాసము.
అనసూయ. సం. అసూయలేమి; అత్రిముని భార్య. [వాఁడు.
అనసూయుఁడు. సం. విణ. అసూయలేని

అనసూ్న. సం. బండి.
అనహంకృతి. సం. అహంకారములేమి. విణ. అహంకారములేనివాఁడు.
అనహంవాది. సం. విణ. గర్వరహితుఁడు.
అనాకారము. సం. పరమాత్మ. విణ. ఆకారము లేనిది.
అనాకులము. సం. విణ. చెదరనిది; కలఁత లేనిది; సంకీర్ణముకానిది.
అనాగతము. సం. విణ. రానిది; భవిష్యత్తు, రాఁబోవునది.
అనాగతార్తవ. సం. సమర్తాడనిది.
అనాచారము. సం. దురాచారము.
అనాచారుఁడు. సం. దురాచారముగల వాఁడు.
అనాతపము సం. నీడ
అనాతురుఁడు. సం. విణ. రోగము లేని వాఁడు.
అనాత్మ. సం. విణ. ఆత్మ (తాను) కానిది (దేహేంద్రియాదులు).
అనాథ. సం. విణ. నాథుఁడు (దిక్కు) లేని స్త్రీ; విధవ.
అనాథనాథుఁడు. సం. విణ. దిక్కు లేని వారికి దిక్కైనవాఁడు, పరమాత్మ.
అనాథము. సం. విణ నాథుఁడు (ప్రభువు) లేనిది.
అనాథుఁడు. సం. విణ. ఆశ్రయములేని వాఁడు; ప్రభువులేనివాఁడు; రక్షకుఁడు లేనివాఁడు.
అనాదరము. సం. అవమానము, తిరస్కారము. విణ ఆదరములేనిది.
అనాది. సం. విష్ణువు; ఆత్మ; బ్రహ్మము. విణ. ఆదిలేనిది; పుట్టుకలేనిది; సనాతనము (షడనాదులు — శుద్ధచైతన్యము, ఈశ్వరుఁడు, జీవుఁడు, మాయ, భేదము, సంబంధము).
అనాదిజటిలుఁడు. సం. శివుఁడు.
అనాదినిధన. సం. శ్రుతి; దుర్గ.
అనాదినిధనము. సం. చావు పుట్టుకలు లేనిది (ఆత్మ, బ్రహ్మము).
అనాదినిధనుఁడు. సం. విణ. జననమరణములు లేనివాఁడు.
అనాదిమత్తు. సం. విణ. ఆదిలేనిది; కార్యవర్గముకంటె వేఱయినది.
అనాదృతము. సం. అవమానింపఁబడినది.

అనాధ. సం. విణ. అనాథ.
అనాధారము. సం. విణ. ఆధారములేనిది; ఆధారముకానిది; సర్వాధారము (ఆత్మ, బ్రహ్మము).
అనాధుఁడు. సం. విణ. దిక్కులేనివాఁడు.
అనాధేయము. సం. విణ. అనాశ్రితము (ఆత్మ, బ్రహ్మము).
అనామ సం. అనామిక.
అనామకము. సం. మూలవ్యాధి.
అనామకుఁడు. సం. విణ. పేరులేనివాఁడు మూలవ్యాధిగలవాఁడు.
అనామతు. హిం. నమ్మకము మీఁద అల్పకాలమొకవస్తువునిచ్చుట; ఒకవస్తువును వాడుకొనక ఊరకయుంచుట.
అనామధేయము. సం. విణ. పేరులేనిది.
అనామయము. సం. ఆరోగ్యము, నీరోగత్వము. విణ. రోగము లేనిది; నిరామయము (ఆత్మ, బ్రహ్మము).
అనామిక. సం. దర్భవ్రేలు, ఉంగరపువ్రేలు, చిటికెన వ్రేలి ప్రక్కవ్రేలు.
అనాయకము. సం. విణ. అరాజకము, నాయకుఁడు లేనిది.
అనాయాసము. సం. విణ. శ్రమలేనిది; ప్రయత్నము లేనిది.
అనాయుష్యము. సం. విణ. ఆయుష్యమును క్షీణింపఁజేయునది.
అనారంభము. సం. చేయకుండుట, చేయమి.
అనారతము. సం. సంతతము, నిత్యము.
అనారోగ్యము. సం. వ్యాధి.
అనార్తవ. సం. విణ. రజస్వల కానిది.
అనార్తవము. సం. విణ. ఋతు సంబంధము లేక యేర్పడెడి ఫలపుష్పాదికము.
అనార్యతిక్తము. సం. నేలవేము †
అనార్యుఁడు. సం. విణ. ఆర్యుఁడు కాని వాఁడు.
అనాలోచితము. సం. విణ. ఆలోచింపబడనిది
అనావర్షము. సం. అనావృష్టి.
అనావిద్ధము. సం. విణ. తొలవేయ బడినది.
అనావిలము. సం. విణ స్వచ్ఛము.
అనావృత్తి. సం. పునరావృత్తి లేమి, జనరాహిత్యము, మోక్షము.

అనావృష్టి. సం. వఱపు, వాన లేమి, ఈతి బాధలలో నొకటి.
అనాశి. సం. విణ. నాశము లేనిది (ఆత్మ, బ్రహ్మము).
అనాశ్రమి. సం. విణ. బ్రహ్మచర్యాద్యాశ్రమములలో నొకఁటియు లేనివాఁడు.
అనాశ్రితుఁడు. సం. విణ. ఆశ్రయింపని వాఁడు.
అనాస. మొగలి పనస, ఒక ఫలవృక్షము.
అనాహతము. సం. ద్వాదశదళ పద్మాకారమై హృదయమున విరాజిల్లెడి చక్రము, యోగషట్చక్రములలో నొకటి; క్రొత్తబట్ట. విణ. కొట్టఁబడనిది.
అని. యుద్ధము; అల్లిక మొదలం. స. అన్ని.
అవ్య. ఈ ప్రకారము ప్రకారము కారణము ప్రసిద్ధి శబ్ద స్వరూపము వాక్యార్థ స్వరూపము అనుకరణము- అను వీనిని తెలుపును. [గాలు; బాన.
అనికి. అల్లిక; నీళ్ళ కాఁగు; గంగాళము;
అనికేతుఁడు. సం. విణ. గృహము (నియమితమైన నివాసము) లేనివాఁడు.
అనిక్షువు. సం. రెల్లుగడ్డి †
అనిత్యము. సం. విణ. నశ్వరము, అస్థిరము, నియతము గానిది.
అనిదంపూర్వము. సం. విణ. ఇంతకు పూర్వము లేనిది.
అనిద్రము. సం. విణ. అలసత లేనిది; నిద్ర లేనిది; (ఆత్మ, బ్రహ్మము).
అనిన. ద్రు. అనఁగా.
అనిపించుకొను. అ. క్రి. అనుపునట్లు చేసికొను; సెలవుకొను; అనునట్లు చేసికొను; తిట్టుపడు; మాటపడు; కనఁబడు; నటించు. [కారణము లేనిది.
అనిమిత్తము. సం. దుర్నిమిత్తము; విణ.
అనిమిత్తాగమము. సం. నిమిత్తము లేక వచ్చునది, కారణము లేక సంభవించునది.
అనిమిషము. సం. చేఁప, మత్స్యము.
అనిమి(మే)షుఁడు. సం. దేవత, వేలుపు; విష్ణువు. విణ. తెప్పపాటు లేనివాఁడు; అప్రమత్తుఁడు.
అనియతము. సం. విణ. అనిత్యము; కట్టుబడనిది; నియమితమైన రూపము లేనిది; క్రమము లేనిది.
అనిరుక్తము. సం. విణ. నిర్వచింపఁబడనిది; వాక్కున కందనిది (ఆత్మ, బ్రహ్మము).
అనిరుద్ధపదము. సం. ఆకాశము.
అనిరుద్ధుఁడు. సం. ఉషాపతి; మనస్సునకధిదేవత; వ్యూహ విశేషము, విణ. అడ్డులేనివాఁడు.
అనిర్వచనీయము. సం. విణ. వాక్కునకందనిది; ఆత్మ, బ్రహ్మము, ఉన్నదని కాని లేదని కాని నిర్వచింప నలవి కానిది (జగత్తు; అజ్ఞానము).
అనిర్వాచ్యము. సం. విణ. వాక్కున కందనిది (ఆత్మ, బ్రహ్మము). [తంత్ర్యము.
అనిర్వృతి. సం. దారిద్ర్యము; అస్వా
అనిలము. సం. వాయువు.
అనిలుఁడు సం. వాయువు; ఒక వసువు.
అనివార్యము. సం. విణ. నివారింపరానిది.
అనిశము. సం. సంతతము, నిత్యము.
అనిష్టము. సం. దుఃఖము; దుఃఖ సాధనము (పాపము, అపకారము మొ||). విణ. ఇష్టము కానిది. [యుద్ధము.
అనీకము. సం. చతురంగ బలము;
అనీకస్థము. సం. యుద్ధమునందలి సైన్యము; చిహ్నము; జయభేరి.
అనీకస్థుఁడు. సం. యుద్ధమున నున్నవాఁడు.
అనీకిని. సం. సేన; 2187 రథములును అన్ని యేనుగులును 6561 గుఱ్ఱములు 10935 కాల్బలమునుగల సేనాభేదము.
అనీశ్వరము. సం. విణ. ఈశ్వరుఁడు లేనిది.
అనీహమానుఁడు. సం. విణ. కోరిక లేని వాఁడు; ఉపేక్షించువాఁడు.
అను. స. క్రి. అని చెప్పు; చెప్పు; అనియడుగు; అని తలఁచు; ప్రసిద్ధుఁడగు; చదువు; నిందించు; పలుకు; పాడు.
అనుఁగు. విణ. మనోహరము; ఇంపు; మొదటిది; ముఖ్యుఁడు; స్నేహితుఁడు; స్నేహితురాలు.
అనుఁగుఁగత్తియ (గత్తె). చెలికత్తె.
అనుఁగుఁదనము. మైత్రి.
అనుకంపనము. సం. దయ, జాలి.

అనుకంపకు(ను)డు. సం. విణ. దయ గలవాడు. [పాత్రుడు.
అనుకంప్యుడు. సం. విణ. దయకు
అనుకరణము. సం. అనుక(స)రించుట, ఒకరు చేయునట్లుచేయుట; ఒకరు చెప్పిన మాటల నట్లే చెప్పుట; ఒక దాని ధ్వనిని సూచించు శబ్దము; పోలిక.
అనుకరించు. సం. స. క్రి. అనుకరణము చేయు; పోలు.
అనుకర్త. సం. విణ. అనుకరించువాడు.
అనుకర్తవ్యము. సం. విణ. అనుకరింప దగినది.
అనుకర్షణము(కర్షము). సం. కోడిపీట, బండినొగ దిగువనుండుకొయ్య; ఆకర్షణము.
అనుకల్పము. సం. గౌణకల్పము, ప్రధానమైన దానికి బదులుగా జెప్పిన విధి.
అనుకామీనుడు. సం. విణ. ఇచ్ఛవచ్చినట్లు మెలగువాడు.
అనుకారము. సం. అనుకరణము.
అనుకారి. సం. విణ. అనుకరించువాడు.
అనుకీర్తనము. సం. కీర్తించుట.
అనుకు. విణ. ముద్దుగాక పలుచనైనది.
అనుకుడు. సం. విణ. స్త్రీకాముకుడు; కోరిక గలవాడు.
అనుకూలత. సం. అనుకూలముగా నుండుట; అనుగ్రహము, దయ; సాహాయ్యము.
అనుకూలము. సం అర్థాలంకార విశేషము. విణ. ఇష్టము; సహాయము; ప్రతికూలము గానిది.
అనుకూలించు. సం. అ. క్రి. సహాయపడు.
అనుకూలుడు. సం. పతి విశేషము, పరాంగనావిముఖుడై స్వస్త్రీనిసంతోషపరచు నాయకుడు. విణ. సహాయుడు; ఇష్టమైనవాడు.
అనుకృతి. సం. అనుకరణము.
అనుకొను. స. క్రి. తలచు, భావించు.
అనుక్తము. సం. విణ. చెప్పబడనిది.
అనుక్రమణము. సం. అనుసరించుట, వరుసగాబోవుట.
అనుక్రమణి. సం. అనుక్రమణిక.
అనుక్రమణిక. సం. భూమిక, గ్రంథాదియందలి ముఖబంధము; పురాణాదులలో వివరముగా చెప్పినదానిని మరల సంగ్రహముగాజెప్పుట; విషయసూచిక గ్రంథమందలి విషయములను క్రమముగా సూచించు పట్టీ.
అనుక్రమము. సం. వరుస, అనుక్రమణిక; క్రమము తప్పకుండుట. విణ. క్రమము తప్పనిది.
అనుక్రోశము. సం. దయారసము.
అనుక్షణము. సం ప్రతిక్షణము; అనవరతము.
అనుగంత సం. విణ అనుసరించి పోవువాడు; వెంబడించువాడు.
అనుగతము. సం. విణ. ఆశ్రితము; అధీనము; వెంబడించినది; అనుసరించినది.
అనుగతి, అనుగమనము } సం. అనుసరించుట; వెంబడించుట; తోడ్పడుట.
అనుగమము. సం. అనుగతి; ఒక లక్షణము పెక్కింటికి సరిదాకుట.
అనుగమించు. సం. స. క్రి. అనుక(స)రించు; వెంబడించు. [అనుసరించునది.
అనుగము. సం. విణ. వెంబడించునది,
అనుగలము. విణ. అనుకూలము; సమానము; సహాయము; ఆప్తుడు; అధీనుడు.
అనుగలించు. అ. క్రి. ప్రియపడు.
అనుగవీనుడు. సం. గోపాలుడు.
అనుగామి. సం. విణ. సహచరుడు, వెంబడించువాడు.
అనుగీతి. సం ఆర్యావృత్తభేదము.
అనుగుంఫము. సం. రచన, వాక్యరచన.
అనుగుడు. సం. అనుచరుడు, సహచరుడు.
అనుగుణము. సం. విణ. తగినది; అనుకూలము, అనుగలము; అనుగతము.
అనుగులము. అనుగలము.
అనుగ్రహము. సం. ఏలుకొనుట; ప్రీతిపూర్వకముగా గ్రహించుట; అనిష్టనివారణ పూర్వకముగా అభీష్టములు నెఱవేర్చుట. [చేయు; ఏలుకొను.
అనుగ్రహించు. సం. స. క్రి. అనుగ్రహము

అనుగ్రాహ్యుఁడు. సం. విణ. అనుగ్ర
హింపఁదగినవాఁడు.
అనుచరుఁడు. సం. విణ. కూడఁదిరుగు
వాఁడు, తోడు, సహాయుఁడు;
దాసుఁడు. [వాఁడు; సేవకుఁడు.
అనుచారకుఁడు. సం. విణ. వెంబడించు
అనుచారిణి. సం. సేవకురాలు.
అనుచింతనము. సం. ఎడతెగని చింత,
(ధ్యానము); ఆలోచించుట. [చితము.
అనుచితము. సం. విణ. తగనిది; అపరి
అనుచు. ప్రే. చూ. అంచు. చేయించు?.
అనుచ్ఛిత్తి. సం. ఎడతెగనియునికి.
అనుచ్ఛిష్టము. సం. విణ. పవిత్రము.
అనుజ. సం. చెల్లెలు. [తుఁడు.
అనుజీవి. సం. విణ. సేవకుడు; ఆశ్రి
అనుజుఁడు. సం. తమ్ముఁడు.
అనుజ్ఞ. సం. సెలవు, అనుమతి; ఆజ్ఞ.
అనుజ్ఞాతుఁడు. సం. విణ. అనుమతిని
పొందినవాఁడు; ఆజ్ఞాపింపఁబడిన
వాఁడు.
అనుజ్ఞానము. సం. అనుజ్ఞ.
అనుడు. అనవుడు, అనఁగా.
అనుతర్షణము. సం. మద్యపానపాత్రము;
కల్లుకుండకు మూఁగుట.
అనుతర్షము. సం. కల్లు; కల్లు త్రాగెడి
గిన్నె; మద్యపానము; మద్యపానేచ్ఛ;
ఇచ్ఛ.
అనుతాపము. సం. పశ్చాత్తాపము.
అనుతాపించు. అ. క్రి. పశ్చాత్తాపపడు;
ఉత్తలపాటునొందు.
అనుత్తమము. సం. విణ. సర్వోత్తమము.
అనుత్తముఁడు. సం. విణ. అత్యుత్త
ముఁడు.
అనుత్తరము. సం. జవాబులేమి. విణ.
అనుత్తమము; అధమము; జవాబులేనిది.
అనుత్సాహము. సం. ఉత్సాహములేమి.
విణ. నిరుత్సాహము.
అనుదగ్రము. సం. విణ. మృదువైనది;
ఉన్నతముగానిది; అత్యున్నతము.
అనుదరుఁడు. సం. విణ. కృశోదరుఁడు.
అనుదాత్తము. సం. వేదగానమున క్రిందు
గా ఉచ్చరింపఁబడెడి స్వరము.

అనుదారుఁడు. సం. విణ. మిక్కిలి
త్యాగి; లోభి; మిక్కిలి గొప్పవాఁడు;
అధముఁడు. [నానాడు.
అనుదినము. సం. అవ్య. ప్రతిదినము,
అనుద్రుతము. సం. ఒక తాళము. విణ.
వెంటఁబరుగెత్తినది. [లేనిది.
అనుద్విగ్నము. సం. విణ. వ్యాకులత
అనుద్వేగము. సం. వ్యాకులతలేమి.
అనుధావనము. సం. వెంటఁబరుగెత్తుట.
అనుధావ్యమానుఁడు. సం. విణ. తఱు
మఁబడినవాఁడు.
అనునయము. సం. ఓదార్చుట; మంచి
మాటలాడుట; బతిమాలుట.
అనునయించు. సం. స. క్రి. బతిమాలు;
ఓదార్చు. [మయవలలు.
అనునాసికములు. సం. బ. ఙ ఞ ణ న
అనుపదము. సం. విణ. వెంబడించువాఁ
డు. అవ్య. అడుగడుగున; మాటమాటకు;
వెంబడిగా. [ఁగొనిన చెప్పు.
అనుపదీన. సం. కాలికి సరిపడ తొడుగు
అనుపధి. సం. నిష్కాపట్యము. విణ. నిష్క
పటుఁడు. [వాఁడు.
అనుపనీతుఁడు. సం. విణ. వడుగు కాని
అనుపపత్తి. సం. యుక్తిలేమి; అసంగతత;
పొసఁగమి.
అనుపపన్నము. సం. విణ. యుక్తియుక్తము
గానిది; అసంగతము; పొసఁగనిది.
అనుపమ. సం. నైరృత దిగ్గజ భార్య.
అనుపముఁడు సం. విణ. సాటిలేనివాఁడు,
సర్వోత్తముఁడు.
అనుపయోగము. సం. ఉపయోగములేమి;
అననుకూలత. విణ ఉపయుక్తముగానిది.
అనుపరి. సుంకరి.
అనుపలబ్ధి. సం. లేమి; ప్రత్యక్షాది
జ్ఞానము లేమి. [పాట.
అనుపల్లవి. వా. పల్లవి తరువాత పాడెడి
అనుపసూది. గుండుసూది.
అనుపాతకము. సం. బ్రహ్మహత్యాది
మహాపాపసమాన పాపవిశేషము.
అనుపానము. సం. అన్నముతోఁ గాని
ఔషధముతోఁగాని చేర్చి పుచ్చుకొనెడి
పదార్థము.

అనుపాలనము. సం. పరిపాలించుట.
అనుపాల్యము. సం. విణ. ఏలఁదగినది.
అనుపు. ప్రయాణమై పోవువారికిఁ దోడు పంపుట; సుంకము. స. క్రి. ఆజ్ఞాపించు; పుచ్చు, పంపు.
అనుప్రవేశము. సం. ప్రవేశించుట; జయించినవాని అభిప్రాయమునకు లోంగియుండుట.
అనుప్రాసము. సం. శబ్ద సామ్యము గల్గియుండునట్లు చెప్పిన ఒక శబ్దాలంకారము (అచ్చులు భిన్నముగా నున్నను వచ్చిన హల్లే మరల మరల వచ్చుట); సదృశము. [తోడు.
అనుప్లవుఁడు. సం. విణ. సహాయుఁడు,
అనుబంధకము. సం. వెక్కిళ్లు.
అనుబంధము. సం. దోషోత్పత్తి; ప్రకృతి ప్రత్యయాగమాదేశములు; నశించునది; ప్రకృతము ననుసరించుట; ప్రయోజన విశిష్టమై ఉపదేశమున నుండి తరువాత లోపించు వర్ణము; బంధము; ఆరంభము; లేశము; అభ్యాసము; బంధించుట; అనుసరించుట; నిరంతర సంబంధము; తరువాత నేర్పడెడి శుభాశుభములు; తరువాతి సంబంధము; పుస్తకానుబంధము; దోషాభ్యాసము. (అనుబంధ చతుష్టయము — అధికారి, సంబంధము, విషయము, ప్రయోజనము)
అనుబంధి. సం వెక్కిళ్ళు; దప్పి.
అనుబంధుఁడు. సం. విణ. ముఖ్యుల ననుసరించి యుండువాఁడు; శిశువు.
అనుబింబించు. సం. అ. క్రి. ప్రతిఫలించు.
అనుబోధము. సం. పరిమళము లోపించిన చందనాదులను ప్రయత్న విశేషముచే మరల పరిమళింపఁ జేయుట.
అనుభవము. సం. ఎఱుక; అనుభవించుట; సాక్షాత్కారము, స్మరణమున కంటె వేఱయిన జ్ఞానము; ఇంద్రియములకుఁ దెలియుట; ప్రత్యక్షాది ప్రమాణముల చేత నేర్పడెడి జ్ఞానము.
అనుభవించు. సం. స. క్రి. కుడుచు; భోగించు; అనుభవము సేయు; పొందు.
అనుభావము. సం. భావమును దెలిపెడి ముఖ వికాసము మొ॥; నిశ్చయము; ప్రభావము; తేజస్సు; సత్పురుషులకు సంబంధించిన మనో నిశ్చయము; అనుభవము. [దగినది.
అనుభావ్యము. సం. విణ. అనుభవింపఁ
అనుభాషణము. సం. ముచ్చటించుకొనుట.
అనుభూతము. సం. విణ. అనుభవింపఁబడినది
అనుభూతి. సం. అనుభవము.
అనుమంత. సం. విణ. ఆమోదించెడివాఁడు; సాక్షి; ఆమోదించువానివలె నుండెడి యాత్మ.
అనుమంతిగాఁడు. హనుమంతునివంటి సామర్థ్యము గలుగుటచేత నుక్కకీయఁబడిన పేరు.
అనుమఁడు. హనుమానుఁడు.
అనుమ. సం. అనుమానప్రమాణము.
అనుమతము. సం. విణ. సమ్మతము; ఆమోదింపఁబడినది.
అనుమతి. సం. అనుజ్ఞ, సమ్మతి, ఒడఁబాటు; ఏకకళాహీనుఁడైన చంద్రుఁడు గల పౌర్ణమి. [ఒడఁబడు.
అనుమతించు. సం. స. క్రి. సమ్మతించు,
అనుమతుఁడు. సం. విణ. అనుమతి పొందినవాఁడు; అనుమతించినవాఁడు.
అనుమరణము. సం. సహగమనము.
అనుమానము. అపోహ; సంశయము. సం. అనుమానించుట, ఊహ, వ్యాప్తిజ్ఞానము చేతవ్యాపకమునిశ్చయించుట; అట్టినిశ్చయమునకుఁ గారణమైన ధూమాదికము; అనుమితికరణము, అనుమానప్రమాణము; ఒక అర్థాలంకారము. [ఊహించు.
అనుమానించు. స. క్రి. సంశయించు. సం.
అనుమితి. సం. అనుభవవిశేషము, ఊహ.
అనుము. ఒప్పు. [షము.
అనుములు. బ. నిష్పావము; ధాన్యవిశేషము.
అనుమేయము. సం. విణ. ఊహింపఁదగినది.
అనుమోదనము, అనుమోదము } సం. సమ్మతించుట.
అనుమోదించు సం. స. క్రి. సమ్మతించు.
అనుమోదితము. సం విణ. అనుమతము.
అనుయాత్రికుఁడు. సం. విణ. వెంబడించువాఁడు.

అనుయాయి. సం. విణ. అనుచరుఁడు; అనుబంధుఁడు; సమానుఁడు.

అనుయుక్తము. సం. విణ. ప్రశ్నింపఁబడినది.

అనుయోక్త. సం. విణ. ప్రశ్నించెడు [వాఁడు.

అనుయోగము. సం. ప్రశ్నము, అడుగుట.

అనుయోజ్యము. సం. విణ. ప్రశ్నింపఁదగినది.

అనురంజనము. సం. ప్రీతిపుట్టించుట, సంతోషపెట్టుట; అనురాగము.

అనురక్తము. సం. విణ. అనురాగము గలది.

అనురక్తి. సం. అనురాగము.

అనురక్తుఁడు. సం. విణ. అనురాగము గలవాఁడు; ఆసక్తుఁడు.

అనురతము. సం. విణ. అనురక్తిగలది.

అనురతి. సం. అనురాగము.

అనురతుఁడు. సం. విణ. అనురక్తుఁడు.

అనురాగము. సం. ఆసక్తి; అత్యంతప్రీతి; కూరిమి; స్నేహము.

అనురాగించు. సం. అ. క్రి. ఆసక్తిచేయు; [ప్రేమించు.

అనురాధ. సం. ఒక నక్షత్రము.

అనురుద్ధము. సం. విణ. అపేక్షింపఁబడినది; అనుసరింపఁబడినది; అడ్డఁబడినది.

అనురుద్ధుఁడు. సం. విణ. అపేక్షించువాఁడు; అనుసరించువాఁడు.

అనురూపము. సం. యోగ్యత; రూపసామ్యము. విణ. సమానరూపము (గుణములు) గలఁది; తగినది.

అనురోధము. సం. అనుసరించుట; పూజ్యులయు ఇష్టులయు ఉద్దేశము నెఱవేర్చవలెనను నెడ యిచ్చు; అవరోధము, అడ్డు.

అనురోధించు. సం. స. క్రి. అనుసరించు.

అనులాపము. సం ఆడినమాటయే ఆడుట; మాటిమాటికిఁ జెప్పెడిమాట.

అనులాపించు. సం. స. క్రి. చెప్పినదే చెప్పు

అనులిప్తుఁడు. సం. విణ. చందనాదులు పూసికొనినవాఁడు.

అనులేపకుఁడు. సం. అంగరాగమొసర్చుకొనువాఁడు; అనులేపనము చేయువాఁడు

అనులేపనము. సం. గంధాదుల మైపూత; తత్సాధనమైన చందనము మొ.

అనులోమజుఁడు. సం. విణ. పై వర్ణము వానివలన క్రిందివర్ణము దానియందుఁ బుట్టిన కుమారుఁడు, సంకీర్ణజాతుఁడు.

అనులోమము. సం. యథాక్రమము. విణ. యథాక్రమముగా నేర్పడినది; అనురూపముగా నేర్పడినది, క్రమమునను సరించినది; అనుకూలము.

అనువదించు. సం. స. క్రి. అనుసరించి చెప్పు; తర్జుమా చేయు.

అనువయించు. సం. స. క్రి. నేయు.

అనువరి. విణ. ఉపాయశాలి.

అనువత్సరము. సం. అధికఫలదమై దానాదుల కనుకూలము గానుండు సంవత్సర విశేషము.

అనువర్ణించు. సం. స. క్రి. క్రమముగా [వచించు.

అనువర్తనము. సం. అనురోధము; అనుసరించుట, అనువృత్తి.

అనువర్తించు. సం. స. క్రి. అనుసరించు.

అనువాకము. సం. వేదవిశేషము; గానరహితమైన యొక ఋక్కు; ఋగ్యజుస్సామ మంత్రసమూహము; శస్త్రమునఁ బడు వేదాంశము.

అనువాచనము. సం. అధ్యాపనము.

అనువాచనీయుఁడు. సం. అధ్యాపకుఁడు.

అనువాదకము. సం. విణ. అనువదించునది

అనువాదకుఁడు. సం. విణ. అనువదించువాఁడు.

అనువాదము. సం. పునరుక్తి, ఒకరు చెప్పినదాని ననుసరించి మరల జెప్పుట; కుత్సితమైన అర్థముగల వాక్యము; తర్జుమా. భాషాంతరీకరణము; అనుక్షణము కీర్తించుట.

అనువారము. సం. అవ్య. మాటిమాటికి.

అనువిద్ధము. సం. విణ. సంబంధించి యున్నది; చేరియున్నది.

అనువు. ఉపాయము; విధము; అవకాశము; సొగసు. విణ. ఉచితము; తగినది; తగునట్టు; యుక్తము; అనుకూలము; సిద్ధము.

అనువుచేయు. స. క్రి. సిద్ధపఱచు.

అనువుపడు. అ. క్రి. ఒప్పు; యుక్తమగు; సరిపడు; ఏర్పడు; సానుకూలమగు.

అనువృత్తి. సం. అనుసరించుట; ఆమోదించుట; సేవించుట; అన్వయము; సమన్వయము; పూర్వసూత్రమునందలి పదము ఉత్తరసూత్రములోనికి అన్వయార్థము వచ్చుట.
అనువ్రజనము. సం. పైనమై వెళ్లుచున్న వానివెంటఁ గొంత దూరమేగుట.
అనుశయము. సం. దీర్ఘద్వేషము; పశ్చాత్తాపము; పూర్వవైరము; అనుబంధము.
అనుశాసనము. సం. ఆజ్ఞ; ఉపదేశము; క్రియాధారమును దెలుపుట; నిరూపించుట; కర్తవ్యము నుపదేశించుట; అట్టిది గల శాస్త్రము.
అనుశాసి. సం. విణ. కర్తవ్యము నుపదేశించువాఁడు; దండించువాఁడు.
అనుశిష్టుఁడు. సం. విణ. ఉపదేశింపఁబడినవాఁడు; దండింపఁబడినవాఁడు.
అనుశీలనము. సం. మరల మరల నభ్యసించుట; మరల మరల సేవించుట; అనవరతము ఆచరించుట.
అనుశోకము. } శోకము; పశ్చాత్తాపము.
అనుశోచనము. }
అనుశ్రుతము. వా. పరంపరగా వచ్చినట్టిది
అనుశ్రుతి. వా. వినికిడి, వదంతి.
అనుషంగము. సం. దయ; ఒకచోట నన్వయించిన యర్థములను ఇతరత్ర అన్వయించుట; ఆసక్తి; న్యాయము; ఒక యుద్దేశముతోఁగూడిన ప్రవృత్తియందు మఱొకటిగూడ సిద్ధించుట.
అనుష్టుప్పు. సం. సరస్వతి; ఒక ఛందస్సు.
అనుష్ఠాత. సం. విణ. అనుష్ఠించువాఁడు.
అనుష్ఠానము. సం. అనుష్ఠించుట; శాస్త్రవిహిత కర్మాదులఁజేయుట; అనుశీలనము.
అనుష్ఠాపనము. సం. అనుష్ఠింపఁజేయుట.
అనుష్ఠించు. సం. స.క్రి. చేయు; ఆచరించు; పఠించు.
అనుష్ఠితము. సం. శాస్త్రవిధిననుసరించి చేయఁబడిన కర్మము.
అనుష్ణము. సం. విణ. వేఁడిమి లేనిది.
అనుష్ణుఁడు. సం. విణ. అలసుఁడు; మందుఁడు.

అనుసంధానము. సం. అన్వేషణము; చింతనము; ధ్యానము; చేష్ట; ప్రయత్నము.
అనుసంధించు. సం. స.క్రి. కూర్చు; నియమించు; బోధపరచుకొను.
అనుసరణము. సం. అనుసరించుట.
అనుసరించు. సం. స.క్రి. కూడవెళ్లు, వెంటఁబోవు; వెంబడించు; ఒకరు చేయునట్లు చేయు; పోలు; క్రమమును పాటించు. [వెంటఁబోవువాఁడు.
అనుసరుఁడు. సం. విణ. అనుచరుఁడు;
అనుసారము. సం. అనుసరణము.
అనుసారి. సం. విణ. అనుసరించువాఁడు.
అనుసు. కఱ్ఱ మున్నగువానికి వేసెడి పొన్ను.
అనుసృతి. సం. అనుసరణము.
అనుస్యూతము. సం. విణ. ఎడతెగనిది; కూర్చఁబడినది; నిత్యసంబంధము గలది.
అనుస్వారము. సం. సున్న, బిందువు.
అనుహారము. సం. పోలిక; పోలుట; సరిపోలుట. జన్మ.]
అనూకము. సం. కులము; శీలము; గత
అనూచానుఁడు. సం. విచక్షణుఁడు; సాంగవేదాధ్యయనము గావించినవాఁడు; వేదార్థప్రవచన నిపుణుఁడు; వినయసంపన్నుఁడు.
అనూఢ. సం. పెండ్లిగాని పడుచు.
అనూఢుఁడు. సం. అవివాహితుఁడు.
అనూద్యము. సం. విణ. అనువదింపఁదగినది.
అనూనము. సం. విణ. వెలితిలేనిది; పూర్ణము, సమగ్రము; సమస్తము.
అనూపము. సం. సముద్రము. విణ. జలసమృద్ధిగల దేశము.
అనూరాధము. సం. అనూరాధానక్షత్రము
అనూరుఁడు. } సం. అరుణుఁడు, సూర్యుని సారథి.
అనూరువు. }
అనృజుఁవు. సం. శఠుఁడు; మోసకాఁడు.
అనృజువు. సం. విణ. శఠుఁడు; కుటిలము.
అనృణి. } సం. విణ. అప్పు తీర్చిన వాఁడు.
అనృణుఁడు. }
అనృతము. సం. కృషి; మిథ్య; అబద్ధము; కృషిజీవనము.
అనేకపము. సం. ఏనుగు, ద్విపము.

అనేకబారువులు. మి. అనేక బారువుల యెత్తు.
అనేకము. సం. స. పెక్కు.
అనేకాంతము. సం. విణ. నియమము లేనిది; నిశ్చితమైన ఫలము లేనిది.
అనేకాగ్రత. సం. విణ. ఒకనిశ్చయము లేకపోవుట.
అనేడమూకుఁడు. సం. విణ. చెవిటియు మూగయునైనవాఁడు; చెప్ప విన నేరని శిశువు; శఠుఁడు.
అనేధుఁడు. సం. అవివేకి.
అనేహము(స్సు). సం. కాలము.
అనైకాంతికము. సం. అనేకాంతము.
అనైక్యము. సం. ఐక్యములేమి.
అనోకహము. సం. వృక్షము.
అన్చు. చూ. అంచు.
అన్న. సం. అగ్రజుఁడు, జ్యేష్ఠభ్రాత, అన్నయ్య; తండ్రి; వాత్సల్యముతోఁ గూడిన సంబోధనమునందుపయుక్తము. అవ్య. ఆశ్చర్య విషాదాదులఁ దెలుపును; ప్రార్థనాద్యర్థమును దెలుపు వ్యతిరేక క్రియలమీఁద అనుప్రయుక్తము.
అన్నన్. అనగా, అనిన.
అన్నగంధి. సం. ఆమాశయరోగ విశేషము. విణ. పక్వముగామింజేసి అన్నమువంటి గంధముగలది. [కొజ్జ.
అన్నగళ(ళి). అ.ప్ర. నపుంసకుఁడు,
అన్నగళమాట. కటికవారల మాట.
అన్నదమ్ములు. బ. అన్నయును తమ్ముఁడును.
అన్నన్న. భార్యయొక్క సోదరుఁడు. అవ్య. ఔరా; మిక్కిలి ఆశ్చర్యార్థకము.
అన్నన్నా. అవ్య. అన్నా, మిక్కిలి ఆశ్చర్యార్థకము.
అన్నప్రాశనము. సం. ఆఱవ నెలలో శిశువులకు అన్నము ముట్టించెడి యొక సంస్కారము.
అన్నపూర్ణ. సం. కాశీపురాధీశ్వరి.
అన్నభేది. వా. ఒక మందు దినుసు.
అన్నమయకోశము. సం. పంచకోశములలో మొదటిది, స్థూలదేహము, అన్నమువలనఁ బుట్టి అన్నముచే వృద్ధి నందెడి దేహము.
అన్నమయము. సం. విణ. అన్నవికారమైనది; మనస్సు.
అన్నము. సం. ధాన్యము; వంటకము, ఉడికించిన బియ్యము, కూడు. విణ. తినఁబడి(డు)నది; తినునది; భూమి.
అన్నయ్య. జ్యేష్ఠభ్రాత, అగ్రజుఁడు.
అన్నశాంతి. వా. అన్నదానముచేఁ దృప్తి పఱచుట.
అన్నసూక్తము. సం. అన్నమును అన్నదానమును స్తుతించు వేదమంత్ర సముదాయ విశేషము.
అన్నా. అవ్య. ఔరా, ఆశ్చర్యార్థకము.
అన్నాదమ్ములు. బ. అన్నదమ్ములు.
అన్నాదుఁడు సం. విష్ణువు. విణ. అన్నము దినువాఁడు.
అన్ని. అల్లిక మొదలు. స. అంత సంఖ్య గలవి; అన్నియు, సమస్తము.
అన్నింటి తిండికాఁడు } అగ్ని దేవుఁడు.
అన్నిదినువాఁడు }
అన్ను. అందుది; మైమఱపు.
అన్నుకొను. అ. క్రి. పరవశమగు; చొక్కు.
అన్నుకొలుపు. ప్రే. పారవశ్యమునొందించు
అన్నువ. అందుది. విణ. సూక్ష్మము; సన్నము; పిన్న; పిన్నవాఁడు.
అన్నువబ్రహ్మచారి. మి. మనోహరుఁడైన బ్రహ్మచారి.
అన్నువు. అందుది; మైమఱపు.
అన్నెకాఁడు } విణ. అన్యాయము చేయువాఁడు.
అన్నెకారి }
అన్నెము, అన్యాయము. స. అన్యము.
అన్పు. స. క్రి. అనుపు, అంచు.
అన్మ. అ. క్రి. అనుము, ఒప్పు.
అన్య. సం. పరకీయనాయిక; ఇతరస్త్రీ; విలక్షణ.
అన్యతమము. సం. విణ. అనేకములలో నిర్ధారితమైన ఒకటి; భిన్నతమము.
అన్యతరము. సం. విణ. రెంటిలో నిర్ధారితమైన ఒకటి; భిన్నతరము; అన్యము.
అన్యత్ర. సం. అవ్య. మఱియొకచోట.
అన్యథా. సం. అవ్య. మఱియొకవిధముగా.

అన్యథాకరించే. సం. స. క్రి. మీఱు,
మఱొకవిధముగాఁజేయు, వేఱుచేయు,
వ్యతిరేకముచేయు. [అగుట, చెడుట.
అన్యథాకలన. సం. మఱియొక విధముగా
అన్యథాత్వము. సం. వేఱొక విధముగా
అగుట, వ్యతిరేకము.
అన్యథాసిద్ధి. సం. మఱియొక విధముగా
సిద్ధించుట, కారణత్వ ప్రతిబంధకదోష
ములలోనొకటి. [సంబంధించినది.
అన్యదీయము. సం. విణ. ఇతరున(ల)కు
అన్యము. సం. స. మఱియొకటి; వేఱయి
నది; సమానము, సాటి.
అన్యాదృశ(క్ష)ము. సం. విణ. మఱియొక
దానిని బోలినది. [కొని చెప్పుట.
అన్యాపదేశము. సం. ఒకటిని నెపముబెట్టు
అన్యాయము. సం. న్యాయము లేమి;
ఔచిత్యములేమి; అయుక్తత; అసంగ
తత. విణ. అన్యాయ్యము. [లేనిది.
అన్యాయ్యము. సం. విణ. న్యాయము
అన్యార్థము. సం. ఇతరుని(ల)కొఱకు. విణ.
ఇతరుని(ల)కొఱకైనది.
అన్యుఁడు. సం. స. మఱియొకఁడు, ఇత
రుఁడు; సమానుఁడు.
అన్యూనము. సం. విణ. లోపములేనిది,
సంపూర్ణము. [లంకారము.
అన్యోన్యము. సం. పరస్పరము; ఒక అర్థా
అన్యోన్యాభావము. సం. ఒకదానియందు
మఱొక దానికిఁ గల లేమి.
అన్యోన్యాశ్రయము. సం. పరస్పరము (ఒక
దాని నొకటి) ఆశ్రయించుకొని యుం
డుట, ఒకదోషము.
అన్వక్కు } సం. విణ. వెంబడించువాఁడు,
అన్వక్షుఁడు } అనుచరుఁడు.
అన్వక్షము. సం. విణ. ప్రత్యక్షము; వెంబ
డించునది.
అన్వయమగు. సం. అ. క్రి. వర్తించు,
సరిపడు; బోధపడు, తెలియు.
అన్వయము. సం. వంశము, కులము; వంశ
పరంపర; పొందిక, పదములపొందిక,
భావమునకనుకూలముగ పదములను
జేర్చుట; కార్యములైన వానియందు
ఉపాదానముగా (కారణరూపేణ) అను
వర్తించుట; అధ్యస్తములైనవానియందు
అధిష్ఠానరూపేణ విరాజిల్లుట; కారణమై
నది యున్ననే కార్యమైనది యుండుట.
అన్వయించు. సం. స. క్రి. భావానుకూల
ముగా పదములను కూర్చు; భావమును
వివరించు.
అన్వర్థము } సం. విణ. యథార్థము,
అన్వర్థకము } సార్థకము, అర్థమునను స
రించినదియు వ్యుత్పత్తిగలదియునగు
శబ్దము.
అన్వవాయము. సం. గోత్రము, వంశము.
అన్వాచయము. సం. ముఖ్యమైనదియుండఁ
గా అప్రధానమైనదాని నిష్పత్తి(సిద్ధి).
అన్వాదేశము. సం. అనువాదము, అనుకథ
నము; చెప్పిన దానినే వేఱురీతిఁజెప్పుట;
మరలఁజెప్పఁబడిన పదార్థము; ఒకపని
చేయుటకు స్వీకరింపఁబడినవానిని మఱి
యొక కార్యము చేయుటకు మఱలఁ
జెప్పుట. [విశేషము.
అన్వాధేయము. సం. సారె, స్త్రీ ధన
అన్వాహార్యము. సం. దర్శశ్రాద్ధము;
మాసికశ్రాద్ధము.
అన్వితము. సం. విణ. కూడుకొనినది;
అన్వయింపఁబడినపదము మొ||; పరస్పర
సంబంధముగలది.
అన్విష్టము. సం. విణ. వెదకఁబడినది.
అన్వీక్షణము. సం. వెదకుట; వేదవాక్య
శ్రవణానంతరము తదర్థనిశ్చయార్థము
తదర్థ పర్యాలోచనము.
అన్వీతము. సం. విణ. కూడుకొనినది.
అన్వేషణము. సం. వెదకుట; తత్త్వాను
సంధానము; నష్టద్రవ్య దర్శనమునకై
కాని తత్ప్రాప్తికై కాని చేయుప్రయ
త్నము. [కుట.
అన్వేషము. సం. అనుసంధానము; వెద
అన్వేషించే. సం. స. క్రి. అన్వేషణము
చేయు. [బడినది.
అన్వేషితము. సం. విణ. అన్వేషింపఁ
అన్వేష్ట. సం. విణ. అన్వేషించువాఁడు,
వెదకెడివాఁడు.
అప. తల్లి; తండ్రి; అక్క; పేరుచివర
చేర్పఁబడు పదములలో నొకటి.

అపంచీకృతము. సం. విణ. పంచీకరణము చేయఁబడనిది, ఆకాశాది సూక్ష్మ భూతము.
అపక. అగప.
అపకర్మ. సం. దుష్కర్మ; తొలఁగించుట.
అపకర్షము. సం. తగ్గుదల, హీనదశ.
అపకారము. సం. కీడు; ద్వేషము; అత్యాచారము. [వాఁడు.
అపకారి. సం. విణ. అపకారముచేయు
అపకీర్తి. సం. చెడుపేరు, దుర్యశము.
అపకృతము } అపకృతి } సం. అపకారము.
అపకృతుఁడు. సం. విణ. అపకారము గావింపఁ బడినవాఁడు.
అపకృష్టము. సం. విణ. అధమము; నింద్యము; పాపము; అపశబ్దము; ఆకర్షింపఁబడినది; పరసూత్రమునుండి పూర్వసూత్రాన్వయమునకై గ్రహింపఁబడినది; ఉచిత కాలమునకు ముందే చేయఁబడినది.
అపక్రమము. సం. పాఱిపోవుట; క్రమము తప్పుట; క్రమములేమి. విణ. క్రమము తప్పినది.
అపక్రమించు. సం. అ.క్రి. పాఱిపోవు.
అపక్రియ. సం. అపకారము; విపరీతప్రక్రియ. [రింపు.
అపక్రోశము. సం. నింద; జుగుప్స; బెద
అపక్వము. సం. పండనిది; వండనిది; పచ్చిది; సిద్ధముకానిది.
అపఖ్యాతి. సం. అపకీర్తి.
అపగ. సం. నది.
అపగతము. సం. విణ. పోయినది; పాఱిపోయినది; మరణించినది.
అపగమము. సం. పోవుట; తొలఁగుట; రాలుట; భంగము, చెడుట.
అపఘనము. సం. శరీరము; అవయవము
అపఘాతము. సం. దుష్టుఁడు కారణముగాఁగల మరణము; హత్య.
అపచయము. సం. హాని; అపహరించుట; తగ్గుట, వ్యయము; పూజ.
అపచాయితుఁడు. సం. విణ. పూజింపఁబడినవాఁడు.

అపచారము. సం. అహితము గావించుట; అపథ్యముసేవించుట; వినాశము; కర్తవ్య కర్మలోపరూపమగు దోషము.
అపచితము. సం. పూజింపఁబడినది; హీనము; అవయవలోపముగలది; క్షీణించినది; వ్యయించినది.
అపచితి. సం. పూజ; ప్రాయశ్చిత్తము; వ్యయము; హాని; నాశము.
అపచితుఁడు. సం. విణ. పూజింపఁబడిన వాఁడు.
అపజయము. సం. ఓటమి.
అపటుఁడు. సం. విణ. రోగి; పటుత్వము లేనివాఁడు.
అపటువు. సం. విణ. అపటుఁడు; పటుత్వములేనిది. [మైన తలగడ.
?అపతల్పకము. సం. అర్ధచంద్రాకార
అపతోక. సం. ఈఁచుకపోయిన ఆవు మొ.
అపత్నీకుఁడు. సం. భార్యలేనివాఁడు; దగ్గఱ భార్య లేనివాఁడు.
అపత్యము. సం. సంతానము.
అపత్రప. సం. సిగ్గు, పరులవలనఁ గలిగిన లజ్జ; సిగ్గు లేని స్త్రీ.
అపత్రపుఁడు. సం. విణ. సిగ్గులేనివాఁడు.
అపత్రపిష్ణువు. సం. విణ. సిగ్గరి, లజ్జాశీలుఁడు. [లేనిది.
అపథము. సం. తప్పుత్రోవ. విణ. త్రోవ
అపథ్యము. సం. విణ. అహితమైన ఆహారము విహారము మొ. [కదిసినది.
అపదాంతరము. సం. సామీప్యము. విణ.
అపదానము. సం. పరిశుద్ధాచరణము, మంచి నడవడి.
అపదిశము. సం. ఐమూల, రెండుదిక్కుల నడుమ, విదిక్కు.
అపదూఱు. మి. అపనింద.
అపదేశము. సం. లక్ష్యము; నెపము, మిష, స్వరూపాచ్ఛాదనము; ఉపదేశము.
అపధ్వని. సం. అపస్వరము. విణ. అపస్వరముగలది.
అపధ్వస్తము. సం. నిందింపఁ బడినది; విడిచిపెట్టఁబడినది.
అపధ్వస్తుఁడు. సం. విణ. అతిదురాచారుఁడు; తిరస్కరింపఁ బడినవాఁడు.

అపనమ్మకము (నమ్మిక). మి. అవిశ్వాసము; అనుమానము.
అపనయనము. సం. తొలఁగించుట; దూరీకరించుట.
అపనయము. సం. కీడు; తొలఁగించుట; దుష్టనీతి. [పోఁగొట్టు.
అపనయించు. సం. స.క్రి. తొలఁగించు;
అపనింద. సం. మోపినదూఱు, అభిశాపము
అపనీతము. సం. విణ. తొలఁగింపఁబడినది.
అపనుత్తి. సం. తొలఁగించుట; పోఁగొట్టుట
అపనుదము. సం. విణ. తొలఁగించునది; పోఁగొట్టునది.
అపనెపము. మి. అపదూఱు, నింద.
అపనోదనము. సం. తొలఁగించుట; ఖండించుట. విణ. ఖండించునది; తొలఁగించునది
అపనోదము. సం. తొలఁగించుట; ఖండించుట. [చదువుట; తప్పు.
అపపాఠము. సం. తప్పుపాఠము; తప్పు
అపపాడి. మి. అన్యాయము.
అపపాత్రుఁడు } సం. వెలివేయఁబడిన
అపపాత్రితుఁడు } వాఁడు.
అపప్రథ. సం. అపఖ్యాతి.
అపభ్రంశము. సం అపశబ్దము, భాషాభేదము, గ్రామ్యభాష; జాఱుట.
అపమానము. సం. అవమానము.
అపమార్గము. సం. తప్పుత్రోవ.
అపమిత్యకము. సం. ఋణము; కుదువయుంచి యెరవు తెచ్చుకొన్నది.
అపమృత్యువు. సం. దుర్మరణము.
అపయశము. సం. అపకీర్తి. విణ. కీర్తిలేనిది.
అపయశస్సు. సం. అపకీర్తి.
అపయానము. సం. పాఱిపోవుట.
అపర. సం. పడమర; అపరవిద్య. స అన్య (స్త్రీ).
అపరంజి. మేలిమిబంగారము.
అపరకర్మ (క్రియ). సం. ఉత్తరక్రియ, మృతునిఉద్దేశించి చేసెడికర్మ, అంత్యేష్టి.
అపరపక్షము. సం. కృష్ణపక్షము.
అపరభాగము. సం. ఉత్తరభాగము
అపరము. సం. ఏనుఁగు వెనుకభాగము; శేషభాగము. విణ. భిన్నము, ఇతరము; విరోధి; వెనుకది; తరువాతిది; ఈవలిది; తక్కువది; కార్యము; దేశకాలములయందు కడపటిది.
అపరరాత్రము. సం. రాత్రిశేషము, తెల్లవాఱు జాము. [మైన విద్య.
అపరవిద్య. సం. బ్రహ్మవిద్యకంటె భిన్న
అపరస్పరము. సం మిథునము; ఎడతెగని క్రియ. విణ. ఎడతెగనిక్రియగలది.
అపరాఙ్ముఖుఁడు. సం. విణ. పెడమొగము పెట్టనివాఁడు.
అపరాజిత. సం. దుర్గ, పార్వతి; తక్కిలి†; విష్ణుక్రాంత†; సోమిద†; నవమీశేషముతోఁగూడిన దశమి (విజయదశమి) యందు పూజింపఁదగిన దేవీమూర్తి విశేషము; ఈశాన-మూల.
అపరాజితము. సం. ఇంద్రుని రథము.
అపరాజితుఁడు. సం. విష్ణువు; ఒక రుద్రుఁడు, ఈశానుఁడు. విణ. ఓటమిలేనివాఁడు. [రాత్రము.
అపరాతిరి. మి. గ్రా. అర్ధమరేయి, అర్ధ
అపరాద్ధపృషత్కుఁడు. సం. విణ. గుఱితప్పిన బాణముగలఁవాఁడు.
అపరాద్ధుఁడు. సం. విణ. అపరాధి.
అపరాధము. సం. తప్పు, నేరము, అకార్యము.
అపరాధి సం. విణ. అపరాధముగలవాఁడు.
అపరాలు. బ. కందులు పెసలు మున్నగు పయిర ధాన్యము.
అపరావతారము. సం. మాఱురూపము నొందినది; మఱొక అవతారము.
అపరాహ్ణ (హ్ణా) తనము. సం. విణ. అపరాహ్ణమునఁ గలిగినది; అపరాహ్ణమందైనది.
అపరాహ్ణము. సం. రెండుగా విభజింపఁబడిన పగటిలో చివర (ఉత్తర) భాగము, మధ్యాహ్నానంతరకాలము; మూడుగా విభజింపఁబడిన పగటిలో మూడవ భాగము; అయిదుగా విభజింపఁబడిన పగటిలో నాల్గవభాగము.
అపరిగ్రహము. సం. స్వీకరింపమి, కూడఁబెట్టకుండుట.

అపరిచితము. సం. విణ. పూర్వ మెఱుఁగఁ బడనిది; పూర్వము అభ్యసింపఁబడనిది.
అపరిచితుఁడు. సం. విణ. పరిచయము లేనివాఁడు.
అపరిచ్ఛిన్నము. సం. విణ. దేశకాల వస్తు పరిచ్ఛేదరహితము, సదా సర్వత్ర సర్వరూపమై భాసిల్లునది, దేశకాల వస్త్వధిష్ఠానమగుటంజేసి దేశకాలవస్తువులు లేక విరాజిల్లెడి కేవలచైతన్యము, ఆత్మ, బ్రహ్మము.
అపరిపక్వము. సం. విణ. చక్కఁగా పక్వముగానిది.
అపరిమితము. సం. విణ. పరిమితములేనిది, అమితము, కొలఁదిలేనిది.
అపరిహార్యము. సం. విణ. పరిహరింప (విడువ) నలవిగానిది.
అపరూపము. సం. విణ. వికృతరూపము; అద్భుతము; ప్రశంసితరూపము.
అపరోక్షము. సం. ప్రత్యక్షము; విషయేంద్రియసన్నికర్షముచే నేర్పడిన జ్ఞానము. విణ. ఇంద్రియములకు గోచరమగునట్టిది; స్వయంప్రకాశము, ఆత్మ, బ్రహ్మము.
అపర్ణ. సం. పార్వతీదేవి (తపస్సు చేయునపుడు ఆకులుగూడ తిననిది).
అపర్యాప్తము. సం. విణ. అపరిమితము; అసమర్థము; చాలనిది. [క్రొత్తది.
అపర్యుషితము. సం. అప్పుడు ఏర్పడినది,
అపలపించు. సం. స. క్రి. అపలాపించు.
అపలాపము. సం. మఱుగుమాట, మోసపుఁబలుకు; ఉన్నదానిని లేదనుట; ఎఱిఁగినది కప్పిపుచ్చుట; ప్రేమ.
అపలాపించు. సం. స. క్రి. కప్పిపుచ్చి చెప్పు; తక్కువపఱచు; నిరసించు; నిందించు. [రానీయనిది.
అపలితంకరణము. సం. విణ. ముదిమిని
అపవదించు. సం. స. క్రి. అపవాదము చేయు.
అపవనము. సం. తోఁట.
అపవరకము. సం. లోఁగది, పడకటిల్లు; దీపపు గ్లాసు.
అపవర్గము. సం. మోక్షము; త్యాగము; శేషము; సమాప్తి.
అపవర్జనము. సం. దానము; మోక్షము; త్యాగము.
అపవాదము. సం. నింద, అపకీర్తి; మిథ్యావాదము; విశేషవిధి; విశ్వాసము; ఆజ్ఞ; మిథ్యయైనదానిని త్రోసిపుచ్చుటకై చేయునట్టి ఉపదేశవిశేషము; రజ్జువివర్తమైన సర్పము రజ్జుమాత్రమైనట్లు వస్తు (ఆత్మ) వివర్తమైన అవస్తువు (అనాత్మ) వస్తుమాత్రమై యుండుట; బాధకము; నిరసించుట. [మఱుఁగు,
అపవారణము. సం. తిరోధానము;
అపవారితకము. సం. అప్రకటము, అప్రకాశము.
అపవారితము. సం. విణ. మఱుఁగుపడినది.
అపవిత్రము. సం. విణ. దూషితము; అపరిశుద్ధము.
అపవిత్రుఁడు. సం. విణ. శౌచాదులం నిర్వర్తించుకొననివాఁడు.
అపవిద్ధుఁడు. సం. విణ. నిరాకరింపఁబడినవాఁడు; వదలివేయఁబడినవాఁడు.
అపవ్యాపాయుఁడుసం. విణ. నిరపాయుఁడు.
అపశకునము. సం. దుశ్శకునము.
అపశదుఁడు. సం. విణ. నీచుఁడు, హీనుఁడు
అపశబ్దము. సం. తొచ్చెపుమాట, శాస్త్రశిక్షితముగాని శబ్దము, అపభ్రంశము.
అపష్ఠువు. సం కాలము. విణ. ప్రతికూలము
అపసడి. మి. అపనింద.
అపసదుఁడు. సం. విణ. నీచుఁడు; అనులోమజుఁడు.
అపసరణము, అపసరము } సం. తొలఁగుట.
అపసరిల్లు. సం. అ. క్రి. తొలఁగు.
అపసర్జనము. సం. మోక్షము; త్యాగము; దానము; వధ.
అపసర్పుఁడు. సం. గూఢచారుఁడు.
అపసవ్యము. సం. పితృతీర్థము; శరీరమున కుడిభాగము. విణ. ప్రతికూలము; విపరీతము.
అపసారణము, అపసారము } సం. త్రోసివేయుట, తొలఁగించుట.
అపసారితము. సం. విణ. దూరము చేయఁబడినది.

అపసిద్ధాంతము. సం. ఒక దోషము, సిద్ధాంతము చేసికొనిన దానినుండి తప్పుకొనుట. [రథావయవము.

అపస్కరము. సం. చక్రముకాక మిగిలిన

అపస్నాతుఁడు. సం. విణ. మృతుని ఉద్దేశించి స్నానము చేసినవాఁడు; సంస్కారార్థము స్నానము గావింపఁబడిన మృతుఁడు (శవము).

అపస్నానము. సం. మృతుని ఉద్దేశించి చేయుస్నానము; శవస్నానము; స్నానముచేయఁగా మిగిలిన నీరు; స్నానావశిష్ట జలస్నానము.

అపస్మారము. సం. మూర్ఛ; తెలవు మఱపు మాటలు, వెఱ్ఱి.

అపస్వరము. సం. తప్పఁజెప్పిన స్వరము.

అపహతము. సం. విణ. నశింపఁజేయఁబడినది.

అపహతి. సం. నాశనము.

అపహము. సం. విణ. నశింపఁజేయునది.

అపహరణము. సం. దొంగిలించుట; అన్యాయ్యముగాఁ దీసికొనుట; పోఁగొట్టుట. విణ. అపహరించునది.

అపహరము. సం. విణ. అపహరించునది.

అపహరించు. సం. స. క్రి. అపహరణము చేయు.

అపహర్త. సం. విణ. అపహరించువాఁడు.

అపహసించు. సం. అ. క్రి. అకారణముగా నవ్వు. స. క్రి. గేలిచేయు.

అపహసితము. సం. దేహము ద్రవ కన్నీరు కాఱ నవ్వెడి నవ్వు.

అపహస్తము. సం. గెంటుటకు మెడమీఁద వేయఁబడినచేయి.

అపహస్తితుఁడు } సం. విణ. మెడమీఁద
అపహస్తుఁడు } చేయి వేసి గెంటివేయఁబడినవాఁడు. [వాఁడు.

అపహారకుఁడు సం. విణ. అపహరించు

అపహారము. సం. తగ్గుదల; హాని; అపహరణము; చౌర్యము; కప్పిపుచ్చుట; ధనస్వామికి ప్రయోజనము లేని వ్యయము; నాశము.

అపహాస(స్య)ము. సం. అపహసించుట; పరిహాసూచకము, వేళాకోళము.

అపహుతము. సం. తప్పుగా చేయు హోమము. [బడినది.

అపహృతము. సం. విణ. అపహరింపఁ

అపహ్నవము. సం. ఒక అర్థాలంకారము; అపలాపము.

అపహ్నవించు. సం. స. క్రి. మర్మ పెట్టు.

అపహ్నుతి. అపలాపము, అపహ్నవము.

అపాంక్తు(క్త్య)ఁడు } సం. సజ్జన పంక్తి
అపాంక్తేయుఁడు } భోజనానర్హుఁడు (దొంగ, నాస్తికుఁడు, పతితుఁడు మొ).

అపాంగము. సం. కడకన్ను; బొట్టు.

అపాంపతి. సం. సముద్రుఁడు; వరుణుఁడు.

అపాకరణము. సం. తీర్చుట; తొలఁగించుట; నిరాకరించుట; దూరము చేయుట.

అపాకరించుట. సం. అపాకరణము.

అపాకృతము. సం. విణ. అపాకరింపఁబడినది, తొలఁగింపఁబడినది.

అపాక్కు. సం. అవాక్కు.

అపాచి. సం. అవాచి.

అపాటవము. సం. రోగము; జడత్వము. విణ. అసమర్థము.

అపాత్రము. సం. విణ. అపాత్రుఁడు.

అపాత్రీకరణము. సం. పాపవిశేషము (నిందితులనుండి ధనమును గైకొనుట, వాణిజ్యము, శూద్రసేవ, అసత్య భాషణము).

అపాత్రుఁడు. సం. విణ. నిందితుఁడు; అయోగ్యుఁడు; దానాదియోగ్యతలేనివాఁడు; విద్యాతపోరహితుఁడు.

అపాదానము. సం. ఎందుండి పాయునో అది. [వాయుచేష్ట.

అపాననము. సం. ప్రశ్వాస, అపాన

అపానము. సం. మలద్వారము, మూడి; అందుండువాయువు; ముఖనాసికలనుండి లోపలఁ బ్రవేశించు వాయువు.

అపాపము. సం. విణ. పాపరహితము.

అపాపవిద్ధము. సం. విణ. పాపముచే కొట్టుపడనిది, ఆత్మ, బ్రహ్మము.

అపామార్గము. సం. ఉత్తరేణు†.

అపాయము. సం. విశ్లేషము, తొలఁగుట;

చలనము, పోకడ; హాని, చెడుపు, నాశము; విడఁదీయుట.

అపాయి. సం. విణ. చలనము గలది.

అపారము. సం. ఈవలి యొడ్డు. విణ. దరి లేనిది; అగాధము; అంతము లేనిది, హద్దు లేనిది; దాఁటరానిది.

అపార్థము. సం. తప్పర్థము. విణ. అర్థము లేనిది; వ్యర్థము.

అపావృతము. సం. విణ. తెఱవఁబడినది; స్వతంత్రము. [నది.

అపావృత్తము. సం. పొర్లాడినది; మఱలి

అపాశ్రయము. సం. మధ్యభాగము.

అపాశ్రయుఁడు. సం. విణ. ఆశ్రితుఁడు; నిరాశ్రయుఁడు.

అపాసనము. సం. వధ; తొలఁగించుట.

అపాస్తము. సం. విణ. నిరసింపఁబడినది.

అపిధానము. సం. కప్పుట; కప్పు; మఱుఁగు; ఆచ్ఛాదనసాధనము.

అపినద్ధము. సం. విణ. ధరింపఁబడినది.

అపుంస్క. సం. మగఁడు లేని స్త్రీ.

అపుడు. అప్పుడు, తత్కాలము.

అపుత్రకుఁడు. సం. అపుత్రుఁడు, సంతతి లేనివాఁడు.

అపునర్భవము. సం, తిరుగ (మఱల) పుట్టమి; మోక్షము. విణ. ముక్తినొందినది.

అపురూపము. విణ అరుదు.

అపుష్పఫలదము. సం. పూవక యే ఫలించెడి పనస మేడి మొ. [భక్ష్యము.

అపూపము. సం. అప్పము; పిండివంట;

అపూర్వము. సం. ఈశ్వరాధిష్ఠితము సూక్ష్మావస్థాపన్నమునైన కర్మ చేఁగలిగెడి అదృష్టము, శాస్త్రవిహితములు శాస్త్రనిషిద్ధములు నైన కర్మలచే నేర్పడునవియు కాలాంతరమునఁగలుగునవియు సుఖదుఃఖములకు కారణమైనవియునగు పుణ్యపాపములు. విణ. మున్నెన్నడును తెలియఁబడనిది; అద్భుతము; పూర్వదిగ్దేశకాలములకు వేఱయినది. కారణము లేనిది; అధ్యస్తములైన అన్నింటికి తానె కారణమై తనకు కారణమనునది లేక విరాజిల్లునది, ఆత్మ, బ్రహ్మము.

అపూర్వత. సం. శబ్దప్రమాణము చేఁగాక (బ్రహ్మము) ప్రమాణాంతరములచే నెఱుఁగఁబడనిదిగా నుండుట; షడ్లింగములలో నొకటి.

అపూర్వవాది. సం. మీమాంసకుఁడు.

అపేక్ష. సం. కోరిక; అనుసరించుట; అనురాగము. [రించు.

అపేక్షించు. సం. స. క్రి. కోరు; అనుస

అపేక్షితము. సం. విణ. కోరఁబడినది.

అపేక్ష్యము. సం. అపేక్షణీయము, కోరఁదగినది.

అపేతము. సం. విణ. తొలఁగినది.

అపేయము. సం. విణ. త్రాగఁగూడనిది.

అపోగండుఁడు. సం. విణ. వికలాంగుఁడు.

అపోసానము. అపోశనము.

అపోహనము. సం. స్మృతిజ్ఞానములం మఱుఁగుపడుట

అపోహము. సం. త్యాగము, విడుచుట; అతద్వ్యావృత్తి; విపరీతముగా ఊహించుట; అపోహనము.

అపోహము పుచ్చు. త్రోసిపుచ్చు; పోఁగొట్టు

అపౌరుషేయము. సం. విణ. పురుషప్రణీతము గానిది, వేదము.

అప్డు. అపుడు.

అప్ప. తల్లి; తండ్రి; అక్క, జ్యేష్ఠభగిని; స్త్రీపురుషుల పేళ్ళకుతుదిని జేర్పఁబడు పదములలో నొకటి. అవ్య. అప్పా.

అప్పగించు. స. క్రి. ఒకరియధీనము చేయు; ఒప్పగించు, పదిలముగా కాపాడుమని యొప్పగించు.

అప్పగింత. ఒప్పగింత, అర్పణము.

అప్పచి. అప్పచ్చి; ఒకబాలక్రీడ.

అప్పచ్చి. అపూపము, భక్ష్యవిశేషము.

అప్పటము. విణ. కలపడము లేనిది, అచ్చము.

అప్పటి. అవ్య. మరల.

అప్పటిది. విణ. ఆ కాలమునకు సంబంధించినది. [ధించినవాఁడు.

అప్పటివాఁడు. విణ. ఆ కాలమునకు సంబం

అప్పడము. పర్పటము, భక్ష్యవిశేషము.

అప్పణ. ఆనతి, ఆజ్ఞ.

అప్పతి. సం. వరుణుఁడు.

అప్పన. అనుమతి, ఆజ్ఞ; కానుక.

అప్పనము. అప్పగింత; అర్పణము; కానుక; పన్ను.
అప్పనసేయు. స. క్రి. అప్పగించు.
అప్పప్ప. అవ్య; ఆశ్చర్యార్థకము.
అప్పము. గుడాపూపము, భక్ష్యవిశేషము.
అప్పళము. అప్పడము; చఱపు, ఆస్ఫాలనము; శీఘ్రము.
అప్పళములు. బ. బాలక్రీడావిశేషము.
అప్పళించు. స. క్రి. చఱచు; ఆక్రమించు; కప్పు; గ్రహించు; తుడుచు; మొత్తు; స్పృశించు. అ. క్రి. యత్నించు, పూను; ఉద్రేకించు. ?
అప్పళింత. చఱపు; అప్పళించుట.
అప్పసము. చిన్న నీటికాలువ. అవ్య. ఎల్లపుడు. [యుక్తసంబోధనార్థకము.
అప్పా. అవ్య. ఆశ్చర్యార్థకము; వాత్సల్య
అప్పాటి. ఆ సమయముననే.
అప్పిచ్చువాఁడు. విశే. ఉత్తమర్ణుఁడు.
అప్పిత్తము. సం. అగ్ని.
అప్పీలు. ఇం. న్యాయసభవారివిచారణకై చేసెడి విన్నపము.
అప్పు. ఋణము. సం. ఉదకము.
అప్పుడు. తత్కాలము; ఆ సమయమున.
అప్పులకాఁపు | అప్పుపుచ్చుకొన్న వాఁడు,
అప్పులపోతు | అధమర్ణుఁడు.
అప్పులవాఁడు అప్పిచ్చువాఁడు.
అప్పులు. సం. బ. నీళ్లు.
అప్పువడు. అ. క్రి. ఋణపడు, బాకీపడు.
అప్పుసప్పులు. బ. అప్పులు, బాకీలు.
అప్యయము. సం. లయము.
అప్రకాండము. సం. పొద, గుల్మము.
అప్రకాశము. సం. పరోక్షము; ప్రకాశము లేమి; ప్రకటముకానిరీతి; ఏకాంతము. విశే. ప్రకాశములేనిది; అదృశ్యము; రహస్యము. [రనిది.
అప్రగుణము. సం. విశే. ఆకులము, చెదిరనిది.
అప్రజ్ఞము. సం. విశే. తెలిసికొననిది.
అప్రతర్క్యము. సం. విశే. అనూహ్యము, లింగాదులులేమింజేసి అనుమానప్రమాణమునకు గోచరముగానిది, ఆత్మ, బ్రహ్మము. [విశే. ప్రతిక్రియలేనిది.
అప్రతీ(తి)కారము. సం. ప్రతిక్రియలేమి.
అప్రతిపత్తి. సం. ఏమియును తోఁచకపోవుట; అర్థముచేసికొనలేకపోవుట.
అప్రతిమము. సం. విశే. సాటిలేనిది.
అప్రతిముఁడు. సం. విశే. సాటిలేనివాఁడు.
అప్రతిష్ఠ. సం. అపఖ్యాతి, అగౌరవము.
అప్రతిష్ఠము. సం. విశే. ఆధారములేనిది; ఇతరముపై ఆధారపడనిది, ఆత్మ, బ్రహ్మము.
అప్రతిహతము. సం. విశే. అడ్డులేనిది.
అప్రత్యక్షము. సం. విశే. అగపడనిది, ఇంద్రియగోచరము గానిది.
అప్రదక్షిణము. సం. ఎడమ ప్రక్కగా చుట్టివచ్చుట.
అప్రధానము. సం. విశే. ప్రధానము కానిది; గౌణము. [వాఁడు.
అప్రమత్తుఁడు. సం. జాగరూకత గల
అప్రమాణము. సం. విశే. ప్రమాణము కానిది; ప్రమాణములేనిది (శ్రుతిస్మృతివిరుద్ధమైన వాక్యము మొ).
అప్రమాదము. సం. జాగరూకత.
అప్రమేయము. సం. విశే. పరిమితిచేయ శక్యముగానిది, అపరిచ్ఛిన్నము; ఇట్టిదని నిర్ణయింపనలవిగానిది; ఏ ప్రమాణము చేతను ఎఱుఁగఁబడనిది, స్వయంప్రకాశము (ఆత్మ, బ్రహ్మము).
అప్రయత్నము. సం. ప్రయత్నములేమి.
అప్రయోజకుఁడు. సం. విశే. పనికిమాలిన వాఁడు.
అప్రవృత్తి. సం. ప్రవృత్తిలేమి.
అప్రశస్తము. సం. విశే. శాస్త్రవిహితము కానిది; దుష్టము, నిందితము.
అప్రసక్తము. సం. విశే. ప్రసక్తిలేనిది.
అప్రస్తుతప్రశంస. సం. ఒక అర్థాలంకారము
అప్రస్తుతము. సం. విశే. ప్రకృతము ననుసరింపనిది.
అప్రస్తుతవాది. సం. ప్రకృతమునకు సంబంధింపని మాటలాడువాఁడు.
అప్రహతము. సం. విశే. బీడు, దున్నని నేల; నూతన వస్త్రము.
అప్రాకృతము. సం. విశే. అసామాన్యము; ప్రకృతికార్యము గానిది, దివ్యము, ఈశ్వరలీలాదికము.

అప్రాగ్ర్యము. సం. విణ. అధమము.
అప్రాణము. సం. ప్రాణము కానిది; ప్రాణములేనిది; ప్రాణమునకు ప్రాణమైనది (ఆత్మ, బ్రహ్మము).
అప్రాప్త ప్రాప్తి. సం. ప్రాప్తముగానిది (లేనిది) లభించుట.
అప్రాప్తము. సం. విణ. లభింపనిది, రానిది; ప్రమాణాంతరముచే ఎఱుఁగఁబడనిది.
అప్రాప్తవ్యవహారుఁడు. సం. విణ. మైనరు.
అప్రాప్యము. సం. సర్వవ్యాపకమై పొందనవసరములేనిది... అవశ్యకమై యుండునది (ఆత్మ, బ్రహ్మము). విణ. పొందరానిది.
అప్రామాణికము. సం. విణ. ప్రామాణ్యము లేనిది. [మెఱుఁగనివాఁడు.
అప్రామాణికుఁడు. సం. విణ. ప్రమాణ
అప్రామాణ్యము. సం. ప్రామాణ్యము లేమి, యథార్థమును బోధించునదిగా లేకుండుట.
అప్రియము. సం. విణ. ప్రియముకానిది.
అప్రీతి. సం. ప్రీతిలేమి.
అప్సర } సం. అచ్చర, దేవతావేశ్య.
అప్సరస } రూ. అప్సరస్సు.
అప్సరసాంపతి. సం. ఇంద్రుఁడు.
అప్సరోజనము. సం. స్వర్గవేశ్యలు.
అఫలము. సం. గొడ్డుమ్రాను. విణ. ఫలము లేనిది.
అఫేనము. సం. నల్లమందు.
అబందర. విణ. చక్కనచెడినది; అజ్ఞుఁడు.
అబక. టెంకాయచిప్పగరిటె.
అబద్ధము. అనృతము, అసత్యవచనము. సం. విణ. పొసఁగనిమాట.
అబద్ధముఖుఁడు. సం. విణ. అప్రియముగాఁబలుకువాఁడు.
అబల. సం. ఆఁడుది.
అబలము. సం. విణ. బలములేనిది.
అబాధకము. సం. విణ. అబాధము; బాధించనిది. [ధితము; అడ్డపాటులేనిది.
అబాధము. సం. విణ. బాధలేనిది; అబా
అబాధితము. సం. విణ. యథార్థము; బాధింపఁబడనిది; ప్రమాణాంతరముచే త్రోసివేయఁబడనిది.
అబాధ్యము. సం. విణ. అబాధము.
అబాసి. విణ. దుష్టుఁడు.
అబాసు. అభాసు. [రోతులు.
అబిసీలు. బ. అబిసీనియా దేశస్థులు;
అబోధము. సం. ఎఱుకలేమి.
అబ్జజుఁడు. సం. తమ్మిచూలి, బ్రహ్మ.
అబ్జము. సం. కల్పవృక్షము; పద్మము; శంఖము; శతకోటి.
అబ్జయోని. సం. తమ్మిచూలి, బ్రహ్మ.
అబ్జారి. సం. చంద్రుఁడు.
అబ్జుఁడు. సం. చంద్రుఁడు; ధన్వంతరి.
అబ్దము. సం. మేఘము; సంవత్సరము; అద్దము. ?
అబ్ధి. సం. సముద్రము.
అబ్ధికఫము. సం. సముద్రపు నురుఁగు.
అబ్ధిజ. సం. లక్ష్మీదేవి.
అబ్ధిజము. సం. లవణము; శంఖము. విణ. సముద్రమునఁబుట్టినది.
అబ్ధిజుఁడు. సం. అబ్జుఁడు.
అబ్ధిజులు. సం. బ. అశ్వినీసుతులు.
అబ్ధినవనీతము. సం. అమృతము; చంద్రుఁడు.
అబ్ధిపల్లవము. సం. పగడము.
అబ్ధిమేఖల. సం. భూమి.
అబ్బ. తండ్రి. అవ్య. బాధ ప్రశంస ఆశ్చర్యము ఆనందము వాత్సల్యము-వీనిని దెలుపునది.
అబ్బకాఁడు. విణ. మూఢుఁడు.
అబ్బగించు అ. క్రి. ఓర్చు, సహించు.
అబ్బబ్బ(బ్బా). అవ్య. అబ్బ-ఆమ్రేడితము.
అబ్బరము. విణ. అపారము; అద్భుతము.
అబ్బాటు. ఆకస్మికము; జనసమ్మర్దము వలనఁగలిగెడి కాఁక. [కుమారుఁడు.
అబ్బాయి. పిల్లవాఁడు; బాలుఁడు;
అబ్బాలాడు. అ. క్రి. తడఁబడు.
అబ్బి. అబ్బాయి. అవ్య. సామాన్యసంబోధనార్థకము. [సిద్ధించు; స్వాధీనమగు.
అబ్బు. అ. క్రి. దక్కు; దొరకు; పట్టుపడు;
అబ్బురపడు. అ. క్రి. ఆశ్చర్యపడు.
అబ్బురపాటు. అబ్బురపడుట; ఆశ్చర్యము
అబ్బురము. విణ. అపూర్వము; అరిది; ఆశ్చర్యము.

అబ్బెంద. వృక్షవిశేషము.
అబ్బే. అవ్య. అభావము అనాదరము మున్నగు భావములను సూచించునది.
అబ్బెనము. అభ్యాసము.
అబ్బో. అవ్య. అనాదరము ఆశ్చర్యము మున్నగు భావములను సూచించునది.
అబ్రపడు. అ.క్రి. ఆశ్చర్యపడు.
అబ్రము. అబ్బురము.
అబ్రహ్మణ్యము. సం. మొఱ్ఱ; అయ్యో! పాపము చంపరాదనెడిమాట.
అభయ. సం. ఒక దుర్గామూర్తి; కరక†.
అభయదానము. సం. అభయమొసఁగుట, భయములేదని శరణమిచ్చుట.
అభయము. సం. భయములేమి; వట్టివేరు†; అభయముద్ర, భయపడకుమని చూపెడి హస్తముద్ర; రక్షణము; అద్వయమగు బ్రహ్మము. విణ భయములేనిది.
అభయహస్తము సం. భయము లేదని సూచించు హస్తము.
అభవము. సం. పుట్టుకలేమి; మోక్షము.
అభవుఁడు. సం. శివుఁడు. విణ. పుట్టుకలేనివాఁడు.
అభాండము. వా. అపవాదము.
అభాగ్యము. సం. అదృష్టములేమి. విణ. అదృష్టములేనిది. [మరణము.
అభావము. సం. లేమి, లేకపోవుట;
అభాషణము. సం. మౌనము.
అభానము } వా. భ్రంశము, చెడుట;
అభాను } రసభంగము; అవమానము.
అభికుఁడు. సం. విణ. కాముకుఁడు.
అభిక్రమము. సం. శత్రువుల మీఁద దండెత్తుట.
అభిఖ్య. సం. నామము, పేరు; కీర్తి; కాంతి.
అభిగతము. సం. విణ. పొందఁబడినది.
అభిగమనము. సం. పొందు; పొందిక; ఎదురుగాఁబోవుట; సేవించుట.
అభిగమ్యుఁడు. సం. విణ. పొందఁదగినవాఁడు; ఆశ్రయింపఁదగినవాఁడు; సేవింపఁదగినవాఁడు.
అభిగ్రహణము. సం. కొల్లపెట్టుట.
అభిగ్రహము. సం. అభిక్రమము.
అభిఘరించు. సం. స. క్రి. సంస్కారార్థము కొంచెము నెయ్యివేయు.
అభిఘాతి. సం. శత్రువు.
అభిఘారము. సం. నెయ్యి.
అభిచరుఁడు. సం. విణ. సహాయుఁడు, అనుచరుఁడు.
అభిచారము. సం. పంపు, చిల్లంగిపెట్టుట, తోడుబోతుపెట్టుట, ప్రయోగము చేయుట, పరహింసాకర్మ.
అభిజనము. సం. జన్మభూమి; గోత్రము, వంశము; కీర్తి.
అభిజనుఁడు. సం. కులపెద్ద.
అభిజాతుఁడు. సం. విణ. పండితుఁడు; ఉత్తమవంశసంజాతుఁడు.
అభిజిత్తు. సం. పగటఁబదునాల్గు గడియల మీఁద రెండు గడియలకాలము; ఉత్తరాషాఢయొక్క చివరపాదమును శ్రవణముయొక్క మొందటి నాలుగుగడియల కాలము సంజ్ఞగాఁగల ఒక నక్షత్రము; కుతపకాలము.
అభిజ్ఞానము. సం. ఆనవాలు, చిహ్నము; స్మృతి. [నేర్పరి; పండితుఁడు.
అభిజ్ఞుఁడు. సం. విణ. తెలిసినవాఁడు;
అభితఃస్థితము. సం. విణ. ఎప్పుడును అంతటను ఉండునది.
అభిద్రవణము } సం. వేగము గాఁబోవుట
అభిద్రవము }
అభిధ. సం. ఒకశబ్దవృత్తి; నామము, పేరు.
అభిధానము. సం. పేరు; కథనము, చెప్పుట; కోశము, నిఘంటువు.
అభిధేయము. సం. పేరు; వాచ్యము, ప్రతిపాదింపఁబడునది, శబ్దార్థము.
అభిధ్య. సం. పరద్రవ్యాభిలాష.
అభినందనము. సం. ప్రశంస.
అభినందించు. సం. స.క్రి. ప్రశంసించు, మెచ్చు. [దగినది.
అభినంద్యము. సం. విణ. అభినందింపఁ
అభినయము. సం. అభినయించుట, నాట్యమునందు హస్తవిన్యాసము.
అభినయించు. సం. స.క్రి. అంగవిన్యాసాదులచే అర్థమును (భావమును) సూచించు.

అభినవము. సం. విణ. క్రొత్తది.

అభిని. నల్లమందు.

అభినిర్ముక్తుఁడు. సం. సూర్యుఁడస్తమించు వేళ నిద్రించువాఁడు. [దండయాత్ర.

అభినిర్యాణము. సం. బయలు దేఱుట;

అభినివేశము. సం. పట్టు, ఆగ్రహము; చొరవ, ప్రవేశము; మరణభయకారణమైన అవిద్యా విశేషము.

అభినీతము. సం. విణ. న్యాయముతోఁ గూడినది; యోగ్యము; లెస్సగా సంస్కరింపఁబడినది; ఓరిమిగలది.

అభినుతించు. సం. స. క్రి. స్తుతించు, ప్రశంసించు. [నటుఁడు.

అభినేత. సం. విణ. అభినయించువాఁడు;

అభినేత్రి. సం. అభినయించు స్త్రీ; నటి.

అభిన్నము. సం. విణ. అనన్యము, వేఱుకానిది.

అభిపన్నుఁడు. సం. విణ. అపరాధి; శత్రువుచే ఆక్రమింపఁ బడినవాఁడు; ఆపదనొందినవాఁడు.

అభిప్రాయము సం. ఆశయము, తలఁపు, తాత్పర్యము, భావము. [ఇష్టమైనది.

అభిప్రేతము. సం. విణ. తలఁపఁబడినది;

అభిభవము. సం. తిరస్కారము.

అభిభూతము. సం. విణ. తిరస్కరింపఁ బడినది.

అభిభూతి. సం. తిరస్కారము.

అభిమంత్రణము. సం. పిలుపు, మంత్రోచ్చారణచే సంస్కరించుట.

అభిమంత్రించు. సం. స. క్రి. మంత్రముచే సంస్కరించు. [త్రింపఁబడినది.

అభిమంత్రితము. సం. విణ. అభిమం

అభిమతము. సం. విణ. ఇష్టము, సమ్మతము; ప్రియము. [బంధించుట.

అభిమరము. సం. చంపుట; యుద్ధము;

అభిమరుఁడు. సం. విణ. ధనాశచే మరణభయమువీడి వ్యాఘ్రాదులతో పోరాడు వాఁడు.

అభిమర్శనము } సం. స్పర్శ; తిరస్కా
అభిమర్శము } రము.

అభిమానము. సం. ధనాదిగర్వము; ప్రేమ; మిథ్యాజ్ఞానము, దేహాది అనాత్మలయందు ఆత్మబుద్ధి.

అభిమానకత్తె. మి. అభిమానముగల స్త్రీ.

అభిమానించు. సం. గారవించు; అభిమానముచూపు. [నది, సమ్ముఖము.

అభిముఖము. సం. విణ. ఎదురుమొగమై

అభిముఖుఁడు. సం. సుముఖుఁడు, అనుకూలుఁడు; సన్నద్ధుఁడు; సమీపించిన వాఁడు; ఎదురుమొగమైనవాఁడు, సమ్ముఖుఁడు. [జేసికొనుట.

అభిముఖీకరణము. సం. అభిముఖునిగాఁ

అభియాతి. సం. శత్రువు.

అభియానము. సం. ఎదుర్కొనుట.

అభియుక్తుఁడు. సం. విణ. శత్రువు; ప్రతివాది; ఆప్తుఁడు, పెద్ద; శత్రువులచే ఎదుర్కొనఁబడినవాఁడు.

అభియోక్త. సం. విణ. పగ కెదిరించువాఁడు; ఫిర్యాది, వాది.

అభియోగము. సం. పగకెదిరించుట; దావా చేయుట, ఫిర్యాదు చేయుట; వ్యాజ్యము. [బడినది.

అభిరక్షితము. సం. విణ. అంతటను రక్షింపఁ

అభిరామము. సం. విణ. చక్కనిది, సుందరము; ఆనందదాయకము.

అభిరుచి. సం. అత్యాసక్తి; కాంతి.

అభిరూక్షము. సం. విణ. కఠినము.

అభిరూపము. సం. విణ. మనోహరము.

అభిరూపుడు. సం. పండితుఁడు.

అభిలషణము. సం. అభిలాష.

అభిలషణీయము. సం. విణ. కోరఁదగినది.

అభిలషించు. సం. స. క్రి. కోరు.

అభిలషితము. సం. విణ. కోరఁబడినది.

అభిలాపము. సం. శబ్దము; వాక్యము, మాట; సంకల్పాంగమైన వాక్యము.

అభిలావము. సం. కోఁత; కోయుట.

అభిలాషము. సం. ఇచ్ఛ; శ్రద్ధ; రుచి; లోభము.

అభిలాషి } సం. విణ. అభి
అభిలాషి (మ) కుఁడు } లాషగలవాఁడు

అభివందనము. సం. ప్రణామము.

అభివంద్యుఁడు సం. విణ. నమస్కరింపఁ దగినవాఁడు.

అభివర్ణించు. సం. స. క్రి. స్తుతించు.
అభివర్షించు. సం. అ. క్రి వానకురియు.
అభివాదకుఁడు. సం. విణ. అప్రియముగా మాటలాడువాఁడు; మ్రొక్కునట్టివాఁడు
అభివాదనము. సం. ప్రవర చెప్పి చేయు నమస్కారము; పాదములంటి మ్రొక్కుట.
అభివాదము. సం. అప్రియముఁగా బలుకుట; ప్రణామము.
అభివాదితుఁడు. సం. విణ. మ్రొక్కఁబడినవాఁడు.
అభివృద్ధి. సం. పెంపు.
అభివ్యంజకము. సం. విణ. స్పష్టపఱచునది; వ్యంజనావృత్తిచేత తెలుపునది.
అభివ్యక్తము. సం. విణ. స్పష్టమైనది; (కారణరూపముననున్నది) కార్యరూపమున ఆవిర్భవించినది.
అభివ్యక్తి. సం. అవ్యక్తముగనున్నది వ్యక్తమగుట; ప్రతిబింబము.
అభివ్యాప్తి. సం. అంతటను ఉండుట, వ్యాపించుట. [దోషారోపణము.
అభిశంసనము. సం. నింద, దూఱు;
అభిశస్తి. సం. యాచన; లోకాపవాదము.
అభిశస్తుఁడు. సం. విణ. పరస్త్రీగమనాది దోషములచే దూఱఁబడినవాఁడు; అపనింద ఏర్పడినవాఁడు.
అభిశాపము. సం. అపదూఱు; తిట్టు, శాపము
అభిషంగము. సం. తిరస్కారము; ఒట్టు; తిట్టు; ఆసక్తి; భూతాద్యావేశము.
అభిషవము. సం. స్నానము; సోమలతను దంచుట; కల్లుతీయుట; యజ్ఞము; యజ్ఞస్నానము; సోమపానము; పులికడుగు.
అభిషిక్తుఁడు. సం. విణ. అభిషేకింపఁబడినవాఁడు.
అభిషుతము. సం. పులికడుగు.
అభిషువు సం. కిరణము.
అభిషేకము. సం. జలము; స్నానము; పట్టాభిషేకము; దేవతా స్నానము; మంత్రపూర్వకముగా నీళ్లుపోయుట.
అభిషేకించు. సం. స. క్రి. అభిషేకము చేయు, స్నానముచేయించు.
అభిషేచనము. సం. అభిషేకము; అభిషేకించుట.

అభిషేచితము. సం. విణ. అభిషేకింపఁబడినది. [నెదుర్కొనిపోవుట.
అభిషేణనము. సం. సేనతో శత్రువు
అభిష్టుతము. సం. విణ. స్తుతింపఁబడినది.
అభిష్వంగము. సం. అత్యాసక్తి; అనాత్మయందు అహంబుద్ధి. [అభిసంధి.
అభిసంధానము. సం. ఉద్దేశము. రూ.
అభిసంపాతము. సం. యుద్ధము.
అభిసరుఁడు. సం. అనుచరుఁడు, సహాయుఁడు.
అభిసారిక. సం. ప్రియునిగూర్చి సంకేతస్థలమునకుఁ బోయెడి నాయిక.
అభిహారము. సం. పగకెదిరించుట; దొంగిలించుట; ఆయత్తపడుట.
అభిహితము. సం. విణ. చెప్పఁబడినది; అభిధావృత్తిచే చెప్పఁబడినది. [యుఁడు.
అభీకుఁడు. సం. విణ. కాముకుఁడు; నిర్భ
అభీతి. సం. అభయము.
అభీప్సితము. సం. విణ. అభీష్టము.
అభీప్సువు. సం. విణ. అభిలాషగలవాఁడు.
అభీరుపత్రి. సం పిల్లపీఁచర† [యుఁడు.
అభీరువు. సం. పిల్లపీఁచర†. విణ. నిర్భ
అభీషంగము. సం. తిట్టు.
అభీషువు. సం. పగ్గము; కిరణము.
అభీష్టము. సం. కోరిక. విణ. కోరఁబడినది; ప్రియమైనది. [వింపఁబడనిది.
అభుక్తము. సం. విణ. తినఁబడనిది; అనుభ
అభూతము. సం. విణ. జరగనిది; కానిది; లేనిది. [లేనిది.
అభేదము. సం. భేదములేమి. విణ. భేదము
అభేద్యము. సం. విణ. భేదింపరానిది.
అభోజనము. సం. ఉపవాసము.
అభ్యంగము. సం. తలంటు, శరీరమంతయు నూనెరాచుకొనుట; తైలమర్దనము.
అభ్యంజనము. సం. తలంటు; తైలము.
అభ్యంతరము. అడ్డు, ఆటంకము. సం ఎల్లదిక్కులకు నడిమిచోటు; నడిమిచోటు; లోపలిభాగము. విణ. లోపలిది
అభ్యక్తము. సం. విణ. అభ్యంగము చేసినట్టిది.
అభ్యగ్రము. సం. దాపు. విణ. దాపైనది
అభ్యమితుఁడు. సం. విణ. రోగి.

అభ్యమిత్రీణుఁడు
అభ్యమిత్రీయుఁడు } సం. విణ. శత్రువు నెదుర్కొని పోవు వాఁడు. రూ. అభ్యమిత్ర్యుఁడు.
అభ్యర్ణము. సం. సమీపము. విణ. దాపైనది
అభ్యర్థన–ము. సం. కోరిక; కోరుట; వేఁడి కొనుట.
అభ్యర్థి. సం. విణ. కోరువాఁడు; ప్రార్థించు వాఁడు.
అభ్యర్హణ–ము. సం. పూజ; పూజించుట
అభ్యర్హితుఁడు. సం. విణ. పూజ్యుఁడు; అర్హుఁడు; పూజితుఁడు.
అభ్యవకర్షణము. సం. నాటికొనినముల్లు మున్నగు వానిని ఊడఁదీయుట.
అభ్యవస్కందనము
అభ్యవస్కందము } సం. ముట్టడి వేయుట, శత్రువు నెదుర్కొనుట; శత్రువును ప్రహరించుట
అభ్యవహారము. సం. భోజనము.
అభ్యవహరించు. సం. స. క్రి. భుజించు.
అభ్యవహృతము. సం. విణ. తినఁబడినది.
అభ్యసనము. సం. అభ్యాసము; అభ్యసించుట; ఆవృత్తి.
అభ్యసనీయము. సం. విణ. అభ్యసింపఁ దగినది.
అభ్యసించు. సం. స. క్రి. అలవాటుచేయు మరలమరలచేయు; మరలమరలచెప్పు; ధ్యానించు, మరలమరల చింతనచేయు; మరలమరల చదువు.
అభ్యస్తము. సం. విణ. అభ్యసింపఁబడినది; గుణకారము.
అభ్యాంతుఁడు. సం. విణ. రోగి
అభ్యాఖ్యానము. సం. కల్లజగడము, అసత్యపు వ్యాజ్యెము.
అభ్యాగతుఁడు సం (పూర్వపరిచయ ముండి) ఇంటికి వచ్చిన అతిథి.
అభ్యాగమనము. సం. ఎదురేగుట; పెద్దలు వచ్చినపుడు గౌరవసూచకముగా ఆసనాదులనుండి లేచి యెదురుగాఁబోవుట
అభ్యాగమము. సం. సమీపము; వధ; ప్రహారము; యుద్ధము; వైరము; అభ్యాగమనము.
అభ్యాగారికుఁడు. సం. విణ. కుటుంబపోషణమునందాసక్తుఁడు.
అభ్యాధానము. సం. ప్రారంభము.
అభ్యామర్దము. సం. యుద్ధము.
అభ్యాశము. సం. దాపు విణ. దాపైనది.
అభ్యాసపడు. అ. క్రి. అలవాటుపడు, వాడుకపడు.
అభ్యాసము. సం. అలవాటు; దాపు; అభ్యసించుట; సాధన; ఆవృత్తి; మరల మరల చెప్పుట, షడ్లింగములలోనొకటి. విణ. దాపైనది.
అభ్యాసాదనము. సం. అభ్యవస్కందనము.
అభ్యాసి. సం. విణ. అభ్యసించువాఁడు; అభ్యాసముగలవాఁడు.
అభ్యసించు. సం స. క్రి. అభ్యసించు.
అభ్యుండి. సం. కుంకుమకత్తె.
అభ్యుత్థానము. సం. అభ్యాగమనము; పెచ్చుపెరుగుట.
అభ్యుదయము. సం. మేలుకాన్పు; శుభోదయము; ఇష్టప్రాప్తి; పరాక్రమము; వృద్ధినిమిత్తమగుకర్మ; వివాహాది శుభకార్యము; ధనజనాదులవృద్ధి; ఉన్నతి; సమృద్ధి; సంసారమునందలి మేలు.
అభ్యుదయించు. సం. స. క్రి. ఉదయించునట్లుచేయు.
అభ్యుదితుఁడు. సం. విణ. సూర్యోదయ సమయమున నిద్రించువాఁడు.
అభ్యుద్గతుఁడు. సం. విణ. అభ్యాగమనము చేసినవాఁడు.
అభ్యుపగతము. సం. విణ. అంగీకరింపఁ బడినది; నిర్ధారితము; సమీపించినది.
అభ్యుపగమము. సం. అంగీకారము; సమీపించుట.
అభ్యుపగమించు. సం. స. క్రి. అంగీకరించు; అధిగమించు; పరిశీలించు.
అభ్యుపపత్తి. సం. అనుగ్రహము.
అభ్యుపేతము. సం. విణ. అంగీకరింపఁ బడినది.
అభ్యు(భ్యూ)షము
అభ్యో (భ్యో) షము } సం. గుగ్గిళ్లు; రొట్టె.
అభ్రంకషము
అభ్రంలిహము } సం. వాయువు. విణ. మిన్నంటినది, అత్యున్నతము.
అభ్రకము. సం. బేగడ, కాకిబంగారము.
అభ్రపుష్పము. సం. ప్రబ్బలి†.
అభ్రమాతంగము. సం. ఐరావతము.

అభ్రము. సం. ఆకాశము; మేఘము; అభ్రకము.
అభ్రమువల్లభము. సం. ఐరావతము.
అభ్రమువు. సం. ఐరావతముయొక్క భార్య
అభ్రి. సం. పడవలోని మన్ను మున్నగు నవి తుడిచెడి సాధనము; లవణాదులు త్రవ్వునట్టి మ్రానిగుద్దలి, కొయ్యగుద్దలి; గుద్దలి. [జలము మొ.
అభ్రియము. సం.విణ. మబ్బునఁబుట్టినది,
అభ్రేషము. సం. న్యాయము, పాడి.
అమ. అమ్మ; పూజ్యస్త్రీ. సం. అమావాస్య; మహాకళ, చిచ్ఛక్తి.
అమంగళము. సం. అశుభము. విణ. అశుభముగలది.
అమండము. సం. ఆముదపు చెట్టు.
అమంత్రము. సం. విణ. మంత్రము కా(కే)నిది.
అమడ. జంట.
అమడలు. బ. కవలు, కవబిడ్డలు; తృణ ధాన్య విశేషము.
అమతము. సం. విణ. భావింపఁబడనిది (ఆత్మ, బ్రహ్మము). [కంచము.
అమత్రము. సం. గిన్నె, పాత్రము;
అమనము } సం. మనస్సు కానిది,
అమనస్కము } మనస్సు లేనిది (ఆత్మ, బ్రహ్మము).
అమనీభావము. సం. సంకల్పవికల్పములు లేనిస్థితి; బ్రాహ్మీస్థితి.
అమనుఁడు సం. విణ. అమనస్కుఁడు, మనోరహితుఁడు; పరమాత్మ.
అమయు. అ.క్రి. ఉపయుక్తమగు.
అమర. సం. అమరావతి; అమృత.
అమరకము. అమరము; ఈ నాములు మొదలగు సాగుబడి పొలములను సేద్యగాండ్రకు సొమ్మునకుఁగాని ధాన్యాదుల మక్తాలకుఁగాని కవులు కదపాలను వ్రాసికొని అమర్చుట.
అమరము. పాళెపట్టు దొరలకీయఁబడు గ్రామాదిరూపమగు సన్నసము, ఈనాము; భటులకును రాజసంబంధుల కును ఇచ్చు మాన్యము.
అమరలేమ. మి. దేవతాస్త్రీ.

అమరశిలాగంధకము. గంధకభేదము.
అమరావతి. సం. ఇంద్రుని పట్టణము.
అమరించు. స క్రి. అమర్చు.
అమరిక. ఒప్పు, అందము; అనుకూల్యము, కుదిరిక; విధము.
అమరు. అ. క్రి. ఒప్పు; కుదురు; పొందికపడు; నడుముగట్టుకొను; నెఱవేఱు.
అమరుఁడు. సం. వేలుపు, దేవత. విణ. చావులేనివాఁడు.
అమరుచు. స.క్రి. అమరఁజేయు.
అమరులు. సం. బ. సురలు, దేవతలు.
అమర్చు. స. క్రి. కుదుర్చు; కావించు; చేయు, రచించు, ఏర్పఱుచు, పెట్టు; నియోగించు, నియమించు.
అమర్త్యుఁడు. సం. వేలుపు.
అమర్యాద. సం. మర్యాదలేమి.
అమర్షణుఁడు. సం. విణ. అమర్షముగల వాఁడు.
అమర్షము. సం. కోపము; అసహనము.
అమల. సం. లక్ష్మి; నేలయుసిరిక †.
అమలము. సం. అభ్రకము; తెలుపు.విణ. నిర్మలము.
అమలావతి. సం. వరుణపట్టణము. ?
అమలు. హిం. అధికారము, ప్రభుత్వము; ఆచరణ; విచారణ.
అమలుదారు. హిం. తహశ్శీలుదారు.
అమవస. అమావాస్య.
అమాంతగాఁడు. చిల్లరబేరగాఁడు.
అమాంతము. చిల్లరబేరము; అకస్మాత్తు.
అమాంసుఁడు. సం. విణ. దుర్బలుఁడు.
అమాత్యుఁడు. సం. మంత్రి, రాజులోఁ గూడ నుండు మంత్రి.
అమానస్యము. సం.బాధ.విణ.బాధగలది.
అమాని. విణ. దొరతనమువారి స్వతంత్ర విచారణగలది. సం. విణ. అభిమానము లేనివాఁడు.
అమానుదస్తా. హిం. తాంబూలము మొదలైనవి దంచులోహమయమైన రోలు రోఁకలియు.
అమానుషము. సం. విణ. మనుష్యకృతముగానిది; మనుష్యులులేనిది; మనుష్య

లను సంబంధింపనిది; మనుష్యశక్తికిమించినది; అవమానకరమైనది.
అమామ(మా)సి. సం. అమావాస్య.
అమారు. ఓడలంగరు మోకు. విశే. తయారు, సిద్ధము.
అమావ(వా)సి } సం. కృష్ణపక్షమున పదునైదవతిథి, సూర్యచంద్రా
అమావ(వా)స్య } మలు కలసియుండుతిథి. రూ. అమావస.
అమాస. అమావాస్య.
అమిజి. వెట్టి, కూలిలేమి.
అమితము. సం. విశే. మితి (హద్దు)లేనిది; ఎఱుఁగఁబడనిది.
అమిత్రుఁడు. సం. శత్రువు.
అమీన్ } హిం. చిన్న ప్రదేశము మీఁద
అమీనా } న్యాయాధిపతి; న్యాయాధికారి తీర్పులలోని విషయములను అమలుజరుపువాఁడు; జమీందారీ గ్రామములలో శిస్తు వసూళ్లుచేయు గ్రామాధికార్లపై చిన్న అధికారి.
అమీరు. హిం. ధనవంతుఁడు.
అముకము. సం. విశే. ఫలానా.
అముష్కరుఁడు. విశే. మూర్ఖత లేనివాఁడు
అముష్యపుత్రుఁడు } సం. విశే. కులీనుఁడు,
అముష్యాయణుఁడు } గొప్ప వంశమునఁ బుట్టినవాఁడు.
అమూదృక్ష(శ)ము. సం. విశే. ఇట్టిది.
అమూర్తము. సం. విశే. ఆకృతిలేనిది (ఆకాశము వాయువు).
అమూలకము } సం. విశే. మూలములేనిది;
అమూలము } ప్రమాణములేనిది.
అమూల్యము. సం, విశే. వెల లేనిది; మిక్కిలి వెలగలది. [వట్టివేరు†
అమృణాల(ళ)ము. సం. వట్టివేరు†; నీటి
అమృత. సం. తిప్పతీఁగె†; గజికి†; ఉసిరిక†; కరక†; తులసి†; పిప్పలి†; ఒక సూర్యరశ్మి. [భక్ష్యవిశేషము.
అమృతకలశము. సం. అమృత ఘటము;
అమృతపాణి. ఒక అరఁటి†. [విశేషము.
అమృతఫలము. భక్ష్యవిశేషము. సం. ఫల
అమృతము. సం. సుధ, వేలుపుల బువ్వ; పాలు; జలము; నేయి; విషము; అమృతయోగము; ఆత్మ, బ్రహ్మము; అయాచితవృత్తి; అయాచితము; బంగారము; మోక్షము; యజ్ఞశేషము. విశే. మధురము; చావులేనిది; అమృత తుల్యము.
అమృతాంధసులు. సం. బ. దేవతలు.
అమృతాయమానము. సం. విశే. అమృతమువలెనుండునది.
అమృతాశి } సం. విశే. అమృతము
అమృతాశుఁడు } తినువాఁడు.
అమృతాహరణుఁడు. సం. గరుడుఁడు.
అమృతుఁడు. సం. ధన్వంతరి; వేలుపు. విశే. చావులేనివాఁడు. [పవిత్రము.
అమేధ్యము. సం. మలము. విశే. అప
అమేయము. సం. విశే. ఎఱుఁగరానిది; అప్రమేయము.
అమేషా. హిం. ఎల్లప్పుడు.
అమోఘ. సం. కలిగొట్టు†; కరక†; వాయువిళంగము†. [కానిది, సఫలము.
అమోఘము. సం. విశే. తప్పనిది; వ్యర్థము
అమ్మ. తల్లి; పూజ్యస్త్రీ; స్త్రీల పేళ్లతుదిని కదాచిత్తు పురుషుల పేళ్లతుదిని చేర్చుపదము. అవ్య. ఆశ్చర్యాద్యర్థకము
అమ్మకచెల్ల. అవ్య. ఆశ్చర్య సంతాపాదులఁ దెలుపునది.
అమ్మకము. అమ్మకట, విక్రయము.
అమ్మగారు. తల్లి; పూజ్యురాలు; రాజుభార్య
అమ్మకటా } అవ్య. అమ్మకచెల్ల.
అమ్మచెల్ల }
అమ్మనబొంట్లు. బ. బాలికాక్రీడావిశేషము
అమ్మనములు } బ. బాలికా క్రీడావిశేషము; అమ్మనలాడు పరి
అమ్మనలు } కరములు.
అమ్మమ్మ. అమ్మయొక్క అమ్మ, అవ్వ, మాతామహి. అవ్య. అమ్మ, ఆశ్చర్యాద్యర్థకము
అమ్మయము. సం. విశే. జలవికారము.
అమ్మయ్య. అవ్య. సంతాప సంతోషాద్యర్థకము.
అమ్మరో(రో). అవ్య. ఆశ్చర్య సంతాపాద్యర్థకము; అమ్మను సంబోధించుట.
అమ్మవారు. బ. స్త్రీదేవత; పూజ్యస్త్రీ; పూజ్యురాలగు బ్రాహ్మణస్త్రీ; గ్రామదేవత; రోగవిశేషము, మారి మశూచికము.
అమ్మాయి. ఆఁడుపిల్ల; బాలిక.

అమ్మి. అమ్మాయి. అవ్య. సామాన్యా సంబోధనార్థకము.
అమ్మించు. ప్రే. విక్రయింపఁజేయు.
అమ్మిక. అంబిక, పార్వతి.
అమ్ము. బాణము. స.క్రి. వెలకిచ్చు, విక్రయించు.
అమ్ముడు. అమ్మకము, వెలకిచ్చుట.
అమ్ముడుపోవు. అ.క్రి. వెలకీయఁబడు.
అమ్ములు. బ. నక్షత్ర విశేషము.
అమ్ముపేటునేల. బాణము పోయి పడునంత దూరముగల భూమి.
అమ్మొత్తు. అదుముడు.
అమ్రము. సం. మామిడి †.
అమ్రాతము. } సం. అంబాళము,
అమ్రాతకము. } ఆమ్రాతకము †.
అమ్లం. సం. చింత †.
అమ్లము. సం. పులుపు; మజ్జిగ; చింతపండు.
అమ్లలోణిక. సం. పులిచింత †.
అమ్లవేతసము. సం. పుల్లప్రబ్బలి †.
అమ్లానము. సం. పెద్దగోరింట †. విశ. వాడనిది; నిర్మలము.
అమ్లిక. సం. చింత†; చింతపండు; పులిత్రేఁపు.
అమ్లోద్గారము. సం. పులి త్రేఁపు.
అయ. అయ్య. విశ. పూజ్యుఁడు.
అయగా(వా)రు. ఆచార్యుఁడు, గురువు; ఉపాధ్యాయుఁడు; పూజ్యుఁడగు బ్రాహ్మణుఁడు.
అయథార్థవర్ణుఁడు. సం. చారుఁడు.
అయనము. సం. మార్గము; గమనము; సూర్యుని ఉత్తరదక్షిణ దిక్సంచారము; సూర్య సంక్రాంతి - విశేషము; ఆఱు మాసముల కాలము; గృహము; స్థానము; ఆశ్రయము; వ్యూహమునఁ బ్రవేశించు మార్గము.
అయము. సం. శుభదాయకమైన దైవము (విధి); పూర్వజన్మసుకృతము; ఇనుము.
అయయొ(యో). అవ్య. అయ్యొ, అయ్యో.
అయరె (రే). అవ్య. అయ్యరె, అయ్యరే.
అయశము(స్సు). సం. అపకీర్తి.
అయశస్కుఁడు } సం. కీర్తిలేనివాఁడు.
అయశుఁడు }
అయస్కాంతము. సం. సూదంటుఱాయి.
అయస్కారుఁడు. సం. కమ్మరి.

అయస్సు. సం. ఇనుము.
అయాచితము. సం. విశ. కోరఁబడనిది.
అయాజ్యుఁడు. సం. విశ. యాగము చేయింపఁబడుటకు అర్హుఁడు కానివాఁడు పతితుఁడు.
అయారె (రే). అవ్య. ఆశ్చర్యప్రశంసా ద్వ్యర్థకము.
అయితి. అలవి, శక్యము.
అయితేన్. అవ్య. చేదర్థకము (వచ్చినట్టయితే, తెచ్చినట్టయితే అని); తు శబ్దార్థకము (నీవయితే, నేనయితే అని).
అయిదన్. అవ్య. వెంబడి, వెనుక.
అయిదవది. విశ. పంచమము.
అయిదవవాఁడు. విశ. పంచముఁడు.
అయిదు. స. ఐదు, పంచసంఖ్య; తత్సంఖ్యేయము, పంచకము.
అయిదుగురు. స. బ. ఐదుమంది (స్త్రీలుంగాని పురుషులుగాని).
అయిదుపదిచేయు. అ. క్రి. వెనుదీయు, ఓడు; నమస్కరించు.
అయిదువ } ముత్తైదువ, పుణ్యస్త్రీ.
అయిదువరాలు }
అయినన్. అవ్య. ఐనన్.
అయినిల్లు. నట్టిల్లు, అంతర్గృహము. వా. గొప్పవారి కుటుంబము.
అయిపు. తప్పు, నేరము; జాడ.
అయిపోవు. అ. క్రి. సమాప్తమగు; చెల్లు, వెచ్చమై తీఱు.
అయిమాయిషీ. హిం. అంచనా.
అయిమూల. ఐమూల, రెండు దిక్కుల మధ్యభాగము.
అయిర. నేత్రరోగ విశేషము.
అయిరకొను. అ. క్రి. చక్కఁబడు, యుక్తమగు.
అయిరేని. బచ్చెనపనిచేసిన పెండ్లికుండలు.
అయిలారము. ఒక మూలిక †.
అయివచ్చు. అ. క్రి. అచ్చివచ్చు.
అయివ(వే)జు. హిం. బదులు; రాఁబడి, పొలమునఁ బండిన ధాన్యము మొ.
అయుక్తము. సం. విశ. తగనిది; యుక్తము కానిది.
అయుగ్మము. సం. విశ. బేసిది.

అయుతము. సం. పదివేలు. విణ. కూడు కొననిది.
అయొ. } అయో. } అవ్య. అయ్యో, అయ్యో.
అయోగవుఁడు. సం. శూద్రునివలన వైశ్య స్త్రీ యందుఁ బుట్టినవాఁడు.
అయోగ్యత. సం. అనర్హత,యోగ్యతలేమి
అయోగ్యుఁడు. సం. విణ. యోగ్యతలేని వాఁడు, అనర్హుఁడు.
అయోగ్రము. సం. రోఁకలి.
అయోఘనము. సం. సమ్మెట, లోహ ముద్గరము.
అయోధ్య. సం. మోక్షదాయకములగు సప్తపురములలో నొకటి.
అయోనిజుఁడు. సం. విణ. యోనినుండి (శుక్రశోణితములనుండి) పుట్టనివాఁడు.
అయోమయము. తెలియశక్యము గానిది. సం. విణ. ఇనుపది.
అయోముఖము(ముఖి). సం. రోఁకలి.
అయ్య. తండ్రి; వాత్సల్యగౌరవపరిహా సాద్యర్థకము; పురుషసంబోధనార్థకము; సాక్షేపప్రశ్నార్థకము; పురుషుల పేళ్ల తుదిని చేర్చెడిపదము; మానవుఁడు. విణ. ఆర్యుఁడు, పూజ్యుఁడు.
అయ్యగారు. గురువు; పూజ్యుఁడు; బాబు గారు (అధికారి); అయగారు.
అయ్యది. స. అది, తచ్ఛబ్దార్థము.
అయ్యయొ (యో) } అవ్య. సంతాపా
అయ్యయ్యొ (య్యో) } ర్థకము; మిక్కిలి కనికరముచే పలుకునది.
అయ్యరె (రే). అవ్య. ఆశ్చర్యాద్యర్థకము.
అయ్యలు. అవ్య. సంతాపార్థకము.
అయ్యవారు. అయగారు.
అయ్యారె (రే). అవ్య. ఆశ్చర్యాద్యర్థ కము; ప్రశంసార్థకము (మెచ్చుట).
అయ్యున్. అవ్య. అయియున్, అయినను, అప్యర్థకము. [త్రార్థకము.
అయ్యెడన్. అవ్య. అందున్, అక్కడ,
అయ్యొ } అవ్య. సంతాపాద్యర్థకము,
అయ్యో } అహో అనుట.
అర. సగము, అర్ధము; సందేహము, శంక; ఆరె. సం. బండికంటియాకు.
అరంజోతి. అరుంధతి.
అరఁగు. తిన్నె, వేదిక.
అరఁటి. అనఁటి, కదళి†
అరక. ఎద్దులఁగట్టి దున్నుటకు సిద్ధపఱ చిననాఁగలి, మడక.
అరకాఁడు. సేద్యకాఁడు, కర్షకుఁడు.
అరకాని. కానీలో సగము.
అరకాలు. పాదతలము.
అరకుత్తుక. సగముగొంతుక.
అరకూఁత. కూఁతపెట్టినయెడ నెంతదూ రము వినిపించునో అంతలో సగము.
అరఖు. హిం. ద్రవరూపమైన ఔష ధము, అర్కు. [ముదుసలి.
అరగడము. విణ. వయసు చెల్లినది;
అరగడి. కుఱుచగోడ.
అరగడియ. అర్ధఘటిక.
అరగన్ను. సగముమూయఁబడిన కన్ను.
అరగలి. సందేహము; పెడమొంగము.
అరగలిగొను. సందేహించు.
అరగిద్ద. గిద్దలోసగము.
అరగూఁడు. గోడయందేర్పఱచినగూఁడు.
అరగ్వధము. సం. ఆరగ్వధము†.
అరఘట్టము. సం. పెనుబావి; నీళ్లు పైకి తోడెడి గిలక; ఏతము.
అరచె (చే) యి. అఱచేయి.
అరచేట్టి. పావడ,అంగదట్టము;చొక్కా.
అరజొట్టు. ఒకపందెపు కోడిపుంజు.
అరడ. ఏఱుదాఁటుటకుప యోగించెడి సాధనము. [ణము, కుప్ప.
అరడా. కత్తిరియుఱమొదట కట్టెడి భూష
అరణము. వివాహకాలమున అల్లునకు కూఁతునకు ఇయ్యఁబడుధనము(సామగ్రి) హరణము. [కొయ్య.
అరణి. సం. త్రచ్చి నిప్పుఁ బుట్టించెడి
అరణ్యము. సం. అడవి; దండకారణ్యము నైమిశారణ్యము మొ.
అరణ్యశునకము. సం. తోఁడేలు.
అరణ్యాటుఁడు. సం. వానరుఁడు.
అరణ్యాని. సం. పెద్ద అడవి.
అరతన్. అవ్య. సమీపమునందు.
అరతావు. అరతావు కాగితము.

అరతి. సం. ఇష్టములేమి, విరక్తి; మనోవ్యాకులత; సయింపమి, ఒక మన్మథావస్థ; అనుత్సాహము; అనుద్యమము.
అరతులము. తులములో సగము.
అరత్ని. సం. చిటికెనవ్రేలుచాచినమూర; పిడికిలిమూర; మోఁచేయి.
అరదండ. రెండు చేతులకు తగిలించెడి సంకెల.
అరదము. రథము.
అరదుడ్డు. ఏగాని.
అరదేశి(సి). పరదేశి.
అరప. మంచె; మంచము.
అరపది. సం. ఐదు.
అరపమీసలు. బ. నరసిన మీసములు.
అరపు. అఱపు, పశుకంఠధ్వని.
అరబంద. రెండు ఫరదులు, రెండుపావు రావుకాగితములు.
అరబి. అరేబియాదేశపు భాష.
అరబ్బీ. అరేబియాదేశపు గుఱ్ఱము.
అరమర—ము / అరమరిక } భేదము; సందేహము.
అరమీటుమొన. మల్లబంధ విశేషము.
అరము. సం. బండికంటి ఆకు; కోణము, అంచు; వేగము. విణ. శీఘ్రమైనది.
అరముడి. క్రి. విశే. మాటిమాటికి.
అరమోడుచు. స.క్రి. (కన్నుమొ॥) సగము మూడుచు.
అరమోడుపు. అరమోడుచుట.
అరయిక. అరయుట, విచారణ.
అరయు. స.క్రి. వెదకు; విచారించు; పరిశీలించు; తెలిసికొను; రక్షించు.
అరరము / అరరి } సం. తలుపు, కవాటము.
అరరె. ప్రశంసాద్యర్థకము.
అరరే. అరర. సం. త్వరతోఁగూడిన సంబోధనము.
అరలు. అ. క్రి. వికసించు.
అరవ. పర్వతమార్గము.
అరవడి. ఋణము.
అరవము. ద్రావిడము, అరవభాష.
అరవరలు. బ. విణ. తునుకలు; శుష్కములు.
అరవలు. బ. ద్రావిడదేశీయులు.

అరవాయి. అధైర్యము; వెనుదీయుట; సంకోచము; సగము సగము మాట.
అరవాయిగొను. అ. క్రి. అధైర్యపడు; సంకోచించు.
అరవిందము. సం. పద్మము, తామర, ఎఱ్ఱతామర; నల్లకలువ; ఎఱ్ఱకలువ; ఒక మన్మథబాణము.
అరవిందాక్షుఁడు. సం. విష్ణువు.
అరవిందాలయ. సం. లక్ష్మి.
అరవిందాసనసుందరి. సం. సరస్వతి.
అరవిరి. సగము విరిసిన మొగ్గ.
అరవీసము. వీసములో సగము.
అరవీసె. వీసెలో సగము.
అరవుడు. తునుక, ముక్క.
అరసంజ. ప్రదోషకాలము.
అరసము. హర్షము. సం. రసముకానిది; రసములేనిది, ఆత్మ, బ్రహ్మము.
అరసాపు. మూర్ఛ.
అరసు. రాజు.
అరసోల. సోలలో సగము.
అరహము. అర్హము.
అరహుఁడు. అర్హుఁడు.
అరళము. సం. తలుపు.
అరళువు. సం. దుండిగము†.
అరాజకము. సం. విణ. రాజులేనిది.
అరాతి. సం. శత్రువు.
అరాబా. హిం. ఫిరంగిబండి.
అరాబు. ఫిరంగులు మొదలైనవి ఉంచుటకై కోటముందు కట్టిన ఎత్తైన గోడ.
అరాళము. సం. మదపుటేనుఁగు; సర్జరసము; వక్రహస్తము. విణ. వంకరైనది.
అరి. కప్పము; మతుబర్థము (తెరవరి, వెరవరి అని); శరసంధానస్థానమైన అల్లెత్రాటినడిమిభాగము; వింటినారి. సం. శత్రువు; చక్రము.
అరిందముఁడు. సం. విణ. శత్రువులనణఁచువాఁడు.
అరికట్టు. స.క్రి. అడ్డగించు; పరివేష్టించు.
అరికట్టుకొను. స.క్రి. అరికట్టు.
అరికట్లు. బ. దుప్పటి మెలిపెట్టి రెండు బుజములయందును జంధ్యపు వాటుగా వైచి కట్టిన కట్లు.

అరిగ. ఒక బిరుదు, ఒకరాజచిహ్నము; చర్మఫలకము; కేడెము.
అరిగాఁపు. కప్పముకట్టువాఁడు.
అరిగాపు. కట్టుకావలి, పడిగాపు, కని పెట్టుకొనిపడియుండుట; కంచెకోట.
అరిగాళ్లు. బ. నిలువులు.
అరిగె. అరిగ; రాజులకు పట్టెడి అరిగ.
అరిగొను. అ. క్రి. అడ్డపడు.
?అరిగోరులు. అంబారము; పాలు.
అరిగోలు. ఏఱుదాఁటఁదగిన సాధన విశేషము.
అరిజె. పొట్టిచేఁప.
అరిణ (ణి). దోనె, కారెము.
అరితి. కూరిమి, ప్రేమ,
అరితోసి. మూర్వీమధ్యతంతుబంధము.
అరిత్రము. సం. ఓడనడపెడుత్రెడ్డు.
అరిదళము. హరిదళము.
అరిది. విణ. వింత, అద్భుతము; అపూర్వము;అశక్యము; దుర్లభము; దుస్సహము.
అరిపడు. అ. క్రి. అడ్డపడు.
అరిపె. మూషక భేదము.
అరిపెట్టు. స. క్రి. కప్పముచెల్లించు.
అరిపోసి. అరితోసి.
అరిమి. బిడ్డలకు గొంతునందుఁ గలిగెడి ఒకవ్యాధి.
అరిమిలి. అర్మిలి.
అరిమెనకుండలు. బ. అయిరేని విశేషములు.
అరిమేదము. సం. కంపుతుమ్మ, తెల్ల తుమ్మ, దుర్గంధముగల చంద్ర†.
అరివాణము. గిన్నె; పళ్లెము
అరివి. విణ. కూలినట్టిది.
అరిషడ్వర్గము. సం. కామము క్రోధము లోభము మోహము మదము మాత్సర్యము-అనెడి లోపలిశత్రువు లాఱు.
అరిష్టతాతి. సం. విణ. శుభము చేయువాఁడు.
అరిష్టనేమి. సం. వైనతేయుఁడు.
అరిష్టము. సం. పురిటిల్లు; వేము†; కుంకుడు†; వెల్లుల్లి†; మజ్జిగ; కాకి; మరణచిహ్నము; ఆసవము, ద్రాక్షారిష్టము మొ. విణ. దోశోపద్రవము; అశుభము; శుభము.
అరిసము. హర్షము.
అరిసియ } అతిరసము, భక్ష్యవిశేషము.
అరిసె
అరిసెము. సంతోషము, హర్షము.
అరీణుఁడు. సం. విణ. అధికుఁడు.
అరు. మధ్యమపురుష బహువచనమునకు వచ్చు ప్రత్యయము.
అరుంతుదము. సం. విణ. అయమును నొప్పించునట్టి మాట మొ.
అరుంధతి. సం. వసిష్ఠునిభార్య; నక్షత్రవిశేషరూపమున రాజిల్లెడి ఆవశిష్ఠపత్ని.
అరుఁగు. తిన్నె, వేదిక.
అరుగు. అ. క్రి. వెళ్లు, పోవు.
అరుగుదెంచు. అ. క్రి. వచ్చు; వెళ్లు.
అరుచము. సం. విణ. రుచిలేనిది.
అరుచి. మాంసము. సం. రుచిలేమి; రుచింపమి, సయింపమి; ఒకమన్మథదశ.
అరుజాతి. చెడుజాతి.
అరుజు. మత్స్యవిశేషము.
అరుణ. సం. అతివస†.
అరుణము. సం.ఎఱుపు;ఇంచుకరొఱుపు; రక్తము. విణ. ఇంచుక రొఱుపుగలది.
అరుణవారి. సం. నెత్తురు.
అరుణానుజుఁడు } సం. అనూరుని తమ్ముఁడు, గరుత్మంతుఁడు.
అరుణావరజుఁడు
అరుణిమ. సం. ఎఱుపు, రక్తిమ.
అరుణుఁడు.సం.అనూరుఁడు;సూర్యుఁడు.
అరుణోదయము. సం. సూర్యోదయమునకంటె పూర్వము నాలుగు గడియల కాలము.
అరుదారు. అ. క్రి. అపూర్వమగు; అతి సుందరమగు.
అరుదు. ఆశ్చర్యము. విణ. అరిది.
అరుదుపడు. అ. క్రి. ఆశ్చర్యపడు.
అరుదెంచు. అ. క్రి. వచ్చు; పోవు.
అరులు. వాత్సల్యము.
అరులుమరులు ముగిమియందుఁ గలిగెడి మది తబ్బిబ్బు.
అరువము. ఇచ్ఛ.
అరువరి. అప్పుపుచ్చుకొనువాఁడు.
అరువు. జ్ఞానము; ధాన్యాదుల అప్పు. సం. అరుస్సు.

అరువుడు. తునుక, ముక్క.
అరువుఁద్రిక్కు. పశురోగవిశేషము.
అరువుఁబూఁట. రొక్కపుపూఁట
అరుష్కరము. సం. జీడి† విణ. వ్రణముఁ గలుగఁజేయునది.
అరుసము. హర్షము.
అరుసు. రాజు.
అరుస్సు. వ్రణము, పరుపు; గాయము.
అరుహుఁడు అర్హుఁడు
అరూపము. సం. అమూర్తము. విణ. రూపము లేనిది; రూపముకానిది (ఆత్మ, బ్రహ్మము).
అరె(రే). అవ్య. ప్రశంసాద్యర్థకము.
అరోకము. సం. విణ. కాంతిలేనిది.
అరోచకము. సం. అన్నము సయింపమి, ఒకరోగము. విణ. సయింపనిది; అసహ్యము.
అర్కజుఁడు. సం. శని.
అర్కపర్ణము. జిల్లేడు†.
ర్కబంధువు. సం. బుద్ధుఁడు.
ర్కము. సం. జిల్లేడు†; స్ఫటికము.
ర్కరాజము. సం. తెల్లజిల్లేడు†.
అర్కారా. హిం. దూత.
అర్కాహ్వము. సం. జిల్లేడు†.
అర్కుఁడు. సం. సూర్యుఁడు; ఇంద్రుఁడు; అన్న.
అర్కోపలము. సం. సూర్యకాంతశిల.
అర్గళము. సం. గడియమ్రాను; ప్రతిబంధము, అడ్డు.
అర్గు. అ.క్రి. అరుగు, గమనము; అఱుగు.
అర్ఘము. సం. ధర; పూజించుట.
అర్ఘువు. సం. అర్ఘము, వెల,
అర్ఘ్యపాత్ర. సం. అర్ఘ్యము నిచ్చుపాత్ర.
అర్ఘ్యము. సం. విణ. పూజకొఱకైన జలము; ఒక ఉపచారము. విణ. పూజకు తగినది; యోగ్యము.
అర్చ. సం పూజ; ప్రతిమ, ప్రతినిధి.
అర్చకత్వము. సం. పూజారితనము.
అర్చకుఁడు. సం. పూజచేయువాఁడు; పూజారి.
అర్చన—ము. సం. పూజ.
అర్చనీయుఁడు. సం. విణ. పూజ్యుఁడు.
అర్చి. సం. అర్చిస్సు.
అర్చించు. సం. స.క్రి. పూజించు.
అర్చితము. సం. విణ. పూజించఁబడ్డది.
అర్చితుఁడు. సం. విణ. పూజింపఁబడినవాఁడు; ఆదరింపఁబడినవాఁడు.
అర్చిరాదిమార్గము. సం. దేవయానము.
అర్చిష్మంతుఁడు. సం. విణ. కాంతిగలవాఁడు.
అర్చిష్మతి. సం. అగ్ని దేవుని పట్టణము.
అర్చిస్సు. సం. అగ్నిజ్వాల; కిరణము; అగ్ని; వెలుఁగు.
అర్జకము. సం. తెల్లగగ్గెర†
అర్జకుఁడు. సం.విణ. సంపాదించువాఁడు.
అర్జనము. సం. సంపాదనము.
అర్జి } హిం. వ్రాఁతపూర్వకమైన మనవి,
అర్జీ } దరఖాస్తు.
అర్జుక. సం. అజ్జుక.
అర్జునము. సం. ఏరుమద్ది†; కసవు, గడ్డి; తెలుపు; బంగారము. విణ. తెల్లనిది.
అర్జుని. సం. ఆవు; బాహుదానది.
అర్జునుఁడు. సం. కార్తవీర్యార్జునుఁడు; ధర్మరాజు-తమ్ముడు.
అర్ణము సం. జలము; అక్షరము.
అర్ణవము. సం. సముద్రము.
అర్ణస్సు సం. జలము.
అర్తనము. సం. రోయుట, రోఁత.
అర్తి. సం. ఆర్తి; వింటికొప్పు.
అర్థకాంక్షి. సం. ధనమును కోరువాఁడు.
అర్థగౌరవము. సం. పెద్ద అర్థము గలిగి యుండుట.
అర్థజ్ఞుఁడు. సం. విణ. తెలివరి.
అర్థన. సం. యాచన, అడుగుట.
అర్థనము. సం. యాచన; ఇచ్ఛ.
అర్థప్రయోగము. సం. వడ్డిచేతిఁబ్రదుకు.
అర్థము. సం. అభిధేయము, శబ్దార్థము; ధనము; వస్తువు; విషయము; ప్రయోజనము; నివృత్తి, తొలఁగుట; పురుషార్థములలో రెండవది.
అర్థవంతము. సం. విణ. అర్థముగలది.
అర్థవాదము. సం. స్తుతి, ప్రకరణప్రతిపాద్యమైన విషయమును మరలమరలఁ బ్రశంసించుట, షడ్లింగములలో నొకటి.

అర్థశాస్త్రము. సం. భూమి ధనము మున్నగు వానినిగూర్చి విశదపఱచునట్టి చాణక్యాదివిరచితమైన నీతిశాస్త్రము.
అర్థశౌచము. సం. ద్రవ్యశుద్ధి, పదార్థముల పవిత్రత. [కారము.
అర్థాంతరన్యాసము. సం. ఒక అర్థాలం
అర్థాంతరము. సం. మఱియొక అర్థము.
అర్థాపత్తి సం. ఒక అలంకారము; బ్రతికియున్న చైత్రుఁడు ఇంటిలోఁగనఁబడకుండుటనుబట్టి వెలుపల వానియునికిని ఊహించుట అను మొదలగునది, ఆఱు ప్రమాణములలో నొకటి.
అర్థి. కోరిక. సం. వేఁడువాఁడు, యాచకుఁడు; వాది; ధనవంతుఁడు; కొలువుడుకాఁడు, సేవకుఁడు. [యాచించు.
అర్థించు. సం. స. క్రి. కోరు; వేఁడు,
అర్థితము. సం. విశే. కోరఁబడినది; వేఁడఁబడినది.
అర్థిత్వము. సం. యాచకభావము.
అర్థిసాత్కృతము. సం. విశే. యాచకులకియ్యఁబడినది.
అర్థ్యము. సం. శిలాజతు. విశే. అర్థము వలన తోఁచినది; వేఁడఁదగినది.
అర్థ్యుఁడు. సం. విశే. ఆత్మవంతుఁడు.
అర్దన / అర్దనము } సం. వేఁడికోలు; యాచన; గమనము; హింస.
అర్దితము. సం. విశే. యాచింపఁబడినది; బాధింపఁబడినది.
అర్ధకుడ్యము. సం. అర్ధగోడ.
అర్ధగంగ. సం. కావేరీనది.
అర్ధగుచ్ఛము. సం. ఇరువదినాలుగు (పదునాఱు) పేటల ముత్యాలహారము.
అర్ధచంద్ర. సం. నల్లతెగడ.
అర్ధచంద్రము. సం. గోటినెలవంక; అర్ధచంద్రాకారబాణము; తిలకవిశేషము; గళహస్తము; నెమిలికన్ను.
అర్ధచంద్రుఁడు. సం. అష్టమిచంద్రుఁడు.
అర్ధణా. మి. అణాలో సగము.
అర్ధతూరము సం. రణభేరి.
అర్ధనారీశ్వరుఁడు. సం. ఉమామహేశ్వరుఁడు, హరగౌరీరూపమైన శివమూర్తి విశేషము.

అర్ధనావము. సం. ఓడలో సగము.
అర్ధమాణవకము. సం. పంద్రెండు (పది) పేటల ముత్యాలహారము.
అర్ధమానసము. సం. పక్షము.
అర్ధము. సం. అర, సగము; తునుక.
అర్ధరథుఁడు. సం. ఒక్క విలుకానితోను పోరలేని యోధుఁడు.
అర్ధరాత్రము. సం. నడికి రేయి.
అర్ధరాత్రి. వా. నడిరేయి.
అర్ధర్చము. సం. అర్ధ ఋక్కు, ఋగాత్మక వైదిక మంత్రార్ధ భాగము.
అర్ధలక్ష్మీహరి. సం. హరిలక్ష్మీరూపమైన విష్ణుమూర్తి విశేషము.
అర్ధవిసర్గము. సం. ꣳ, జిహ్వామూలీయము ఉపధ్మానీయము. [నము.
అర్ధశనము. సం. అర్ధాశనము, అర్ధ భోజ
అర్ధహారము. సం. అఱువది (యేఁబది) నాలుగు పేటల ముత్యాలహారము.
అర్ధాసనము. సం. కూర్చుండుటకై ఆసనార్ధదానరూపమైన స్నేహవ్యంజకమగు సమ్మాన విశేషము.
అర్ధాంగీకృతము. సం. సగము అంగీకరించుట. [చంద్రుఁడు.
అర్ధేందువు. సం. అర్ధచంద్రము; అర్ధ
అర్ధోదయము. సం. పుష్యమాసము అథవా మాఘమాసము అమావాస్య ఆదివారము శ్రవణనక్షత్రము వ్యతీపాతము-ఇవి కలసిన యోగవిశేషము.
అర్ధోరుకము. సం. ఉత్తమస్త్రీలు సగము తొడలవఱకు తొడుగు కొనెడి చల్లాడము (లాఁగు); అట్టి వస్త్రవిశేషము.
అర్పణము. సం. అర్పించుట, స్వత్వత్యాగము; ఉంచుట.
అర్పించు. సం. స. క్రి. అప్పగించు, సమర్పించు; ఉంచు [ఉంచఁబడినది.
అర్పితము. సం. విశే. అర్పింపఁబడినది;
అర్బుదము. సం. మాంసపుకండ పెరుగుట ఒక రోగము; పదికోట్లు; కోటి ?
అర్భకుఁడు. సం. శిశువు; బాలుఁడు, చిన్నవాఁడు; కుమారుఁడు.
అర్మము. సం. నేత్రరోగవిశేషము.
అర్మిలి ఆపేక్ష; ప్రేమ; వాత్సల్యము.

అర్మ. అఱుము.
అర్య. సం. వైశ్యజాతి స్త్రీ.
అర్యమ్ణము. సం. ఉత్తర ఫల్గుని.
అర్యముఁడు. సం. సూర్యుఁడు; పితృదేవతలలో నొకఁడు.
అర్యాణి. సం. అర్య.
అర్యి. సం. వైశ్యుని భార్య.
అర్యుఁడు. సం. వైశ్యుఁడు; స్వామి, ప్రభువు, అధిపతి. విణ. శ్రేష్ఠుఁడు; పూజ్యుఁడు.
అర్లు. అరులు, వాత్సల్యము.
అర్లుమర్లు. బ. అరులుమరులు.
అర్వము. సం. గుఱ్ఱము. విణ. కుత్సితము.
అర్వాచీనము. సం.విణ. తరువాత నేర్పడినది; ఇప్పటిది; క్రింద నుండునది.
అర్శము. సం. అర్శస్సు.
అర్శసుఁడు. సం. మూలవ్యాధిగలవాఁడు
అర్శస్సు. సం. మొలక, ఆసనమునందలి దుర్మాంస విశేషము, గుదాంకురము, మూలవ్యాధి.
అర్శోఘ్నము. సం. కంద†; జీడి†.
అర్శోఘ్ని. సం. నేలతాడి.
అర్హణ. సం. పూజ.
అర్హంతుఁడు. సం. శివుఁడు; బుద్ధుఁడు; క్షపణకుఁడు. విణ. పూజ్యుఁడు.
అర్హత. సం. యోగ్యత.
అర్హము. సం. విణ. తగినది; అమూల్యము
అర్హితుఁడు. సం. విణ. పూజితుఁడు.
అర్హుఁడు. సం. విణ. తగినవాఁడు; యోగ్యుఁడు.
అర్హువు. సం. విణ. అర్హము.
అఱ. గది; పడకటిల్లు; ధర్మము; పెట్టె మొదలగువాని లోపలి యఱ; గడి; కొంచెము; సగము; కొఱఁత; కపటము; కీడు; చింపిగుడ్డ; గూడు; అడ్డు; భేదము; మఱుఁగు; సందేహము; (చెఱువు మొదలైనవాని కట్టకు) లోపలి వైపు; ఎల్ల దిక్కుల నడిమిచోటు; పాదాదితలము (అఱకాలు అఱ చెయ్యి అని); కుచ్చితము.
అఱక. మూఁపు; అరక;
అఱకడ—ము. మూఁపు.
అఱకము. అజీర్తి.
అఱకలి. మూఁపు.
అఱకాలు. పాదతలము.
అఱకువ. అజీర్తి; తక్కువ.
అఱగమి. అజీర్తి.
అఱగొండెతనము. అరగొడ్డెతనము.
అఱగొండెము. } సాహసకృత్యము.
అఱగొట్టెము }
అఱగొడ్డియము. అకార్యము, దుండగము
అఱగొడ్డె. విణ. దుండగీఁడు.
అఱగొడ్డెతనము. దుండగము, దౌష్ట్యము.
అఱగొడ్డెము. దుండగము. [న్యూనము.
అఱగొఱ. కొఱఁత, న్యూనత. విణ.
అఱచు. అ. క్రి. కూయు; విలపించు; ధ్వనితో రోదనము చేయు; బొబ్బలు పెట్టు; బిగ్గరగా మాటలాడు; ప్రేలు, వాగు; ఆవు కప్ప మొ॥ అఱచు.
అఱ(చేయి) చెయ్యి. కరతలము.
అఱజాతి. మి. దుష్టుఁడు; భ్రష్టుఁడు.
అఱఁటి. రంభావృక్షము.
అఱడా. ఒక కంఠాభరణము; జడ కుచ్చు మీఁది పూస; పల్లకీ బొంగుకొనకు వేసెడు సింహాలలాటపు తగడు; ఇంటి దూలము క్రింది భాగమున వేయు స్థంభము-చివరఁ దగిలించెడి గుండ్రని కఱ్ఱపూస.
అఱడు. అఱడా.
అఱప. జొన్న చేలు మొదలగు వానిని కాచునపుడు కూర్చుండుటకై యెత్తుగా కట్టిన మంచె. [శివుఁడు.
అఱపదిమోములవేలుపు. పంచవక్త్రుఁడు,
అఱపు. అఱచుట; కూఁత; మొఱ, ఆర్త ధ్వని. [పొట్టిది.
అఱపొఱడు. గూను. విణ. వామనుఁడు;
అఱమపాఱుఁడు. దుష్టబ్రాహ్మణుఁడు.
అఱమర } కాపట్యము; దాపటికము;
అఱమరిక } సందేహము; భేదము.
అఱమఱ. ఊహించుట. విణ. అపోహము లేనిది.
అఱమి. అజీర్ణవ్యాధి.
అఱవ. సాధువుకాని ఆవు. విణ. దుష్టుఁడు; దుష్టము; ద్రవిడదేశస్థుఁడు. బ. ద్రావిడులు; కఠినులు, నిర్దయులు.

అఱవడు. సస్యవిశేషము.
అఱవత. ద్రావిడస్త్రీ.
అఱవము. తమిళము, ద్రావిడభాష.
అఱవఱలు. బ. తునియలు.
అఱవఱసేయు. స. క్రి. ఖండించు; ధ్వంసముచేయు.
అఱిముఱి. సంభ్రమము, త్వర; కలఁత. అవ్య. ముందువెనుకలు.
అఱిముఱితనము. కలవరము; తొందర.
అఱిముఱిపడు. సంభ్రమించు; కలఁతపడు
అఱిమెనకుండలు. బ. అయిరేని విషయములు.
అఱిసియ, అఱిసె. అరిసె, అతిరసము.
అఱు. కంఠము; మెడ; సమీపము. అ. క్రి. క్షయించు; నశించు; తగ్గు.
అఱుఁదెవులు. క్షయ.
అఱుకువ. అజీర్తి; పక్వముగామి. విణ. అజీర్ణము; అపక్వము. [వచ్చు.
అఱుక్రమ్ము అ. క్రి. కవియు, మీఁదికి
అఱుఁగుదీయు. స. క్రి. అఱుగునట్లు చేయు; తోము, రాచు.
అఱుఁగు. వేదిక.
అఱుగు. అ. క్రి అఱిగిపోవు, అన్నాదులు జీర్ణమగు; క్షయించు, తఱుగు.
అఱుగుడు. అఱువుడు.
అఱుగుఁదెవులు. క్షయ. [హీనమగు.
అఱుగువడు. అ. క్రి. క్షయించు; నశించు;
అఱుగుళ్ళు. బ. శిథిలములు; తూట్లు.
అఱుట. విడుపు, విసర్జనము.
అఱుతన్. అవ్య. సమీపమున; కంఠమందు.
అఱుపు. స. క్రి. దక్కించు.
అఱుపుకొను. స. క్రి. దక్కించుకొను.
అఱుము. అభివృద్ధి; ఆక్రమణము; శౌర్యము. స. క్రి. ఆక్రమించు; ప్రతీక్షించు; సన్నద్ధుఁడగు.
అఱువండ్రు. స. బ. అఱువదిమంది (స్త్రీలుగాని పురుషులుగాని).
అఱువది. స. ఆఱుపదులు, షష్టి.
అఱువు. అ. క్రి. అఱుగు. [ఖండము.
అఱువుడు. విణ. అఱిగినది; శిథిలము;
అఱువుఁదెవులు. క్షయ,
అఱువుళ్ళు. బ. శిథిలములు.
అఱ్ఱ. గది; పడకటిల్లు; పెట్టెమున్నగువానిలోపలి అఱ; ప్రయాసమున పాలు పిండఁదగిన యావు, కరట.
అఱ్ఱము. ముండ్లమోపు మొ.
అఱ్ఱాఁక. మిక్కిలి నిర్బంధము; మఱుఁగు.
అఱ్ఱాఁకలి. మిక్కిలి ఆఁకలి.
అఱ్ఱాడు. అ. క్రి. చేరువ చుట్టి చుట్టి తిరుగు.
అఱ్ఱియము. అజీర్తి. [సమీపము.
అఱ్ఱు. ఉపద్రవము; ఆపద; కంఠము;
అఱ్ఱెము. అజీర్తి.
అల. తరంగము. విణ. ప్రసిద్ధిని తెలుపునది; ఆది, తచ్ఛబ్దార్థకము (అలవాఁడుఅని); నిర్దేశార్థకము. అవ్య. సంబోధనార్థకము.
అలంకరణము. సం. అలంకరించుట; నగ.
అలంకరించు. సం. స. క్రి. కైసేయు, శృంగారించు. [షముగలవాఁడు.
అలంకరిష్ణువు. సం. విణ. కైసేయు స్వభా
అలంకర్త. సం. విణ. అలంకరించువాఁడు
అలంకర్మీణుఁడు. సం. విణ. పనులలో నేర్పరి.
అలంకారము. సం. కైసేఁత; నగ; యమకాది శబ్దాలంకారము; ఉపమాద్యర్థాలంకారము.
అలంకారించు. సం స. క్రి. అలంకరించు.
అలంకృతము. సం. విణ. అలంకరింపఁబడినది.
అలంకృతి. సం. అలంకారము.
అలంకృతుఁడు. సం. అలంకరింపఁబడినవాఁడు.
అలంక్రియ. సం. అలంకృతి; శృంగారము
అలంగము. కోటచుట్టువేయు మట్టితిన్నె, వప్రము.
అలంఘ్యవర్ణలేఖనకరుఁడు. సం. దాఁటరాని వర్ణములు లిఖించువాఁడు, బ్రహ్మ.
అలంజరము. సం. కాఁగు; బాన.
అలందురు. దుఃఖము.
అలంభూష్ణువు సం. విణ. సమర్థుఁడు.
అలఁగు. అ. క్రి. వెనుదీయు; శ్రమపడు; శోకించు; సంకోచించు. [పఱచు.
అలఁచు, స. క్రి. అలఁగఁజేయు, శ్రమ

అలంత. బాధ; శోకము; శ్రమము.
అలంతి. తెలిక. విణ. కొంచెము, అల్పము, సూక్ష్మము; అల్పుఁడు.
అలంతికిఁదెచ్చు. స. క్రి. కొలంచు.
అలంతినగవు. మందహాసము.
అలంతు. స. క్రి. చందనము మున్నగు వానిని పూయు.
అలందురు. అ. క్రి. దుఃఖించు.
అలక. విణ. సూక్ష్మము. సం. కుబేరుని పట్టణము.
అలకన. సూక్ష్మత. విణ. సూక్ష్మము.
అలకనంద. సం. పెండ్లికానిపడుచు; భారతవర్షీయగంగ.
అలకములు. సం. బ. నెఱికురులు.
అలకలు. సం. బ. ముంగురులు.
అలకి. కుండ; పాత్ర విశేషము.
అలకువ. శ్రమము; విముఖత.
అలక్తము. సం. లత్తుక, లక్క.
అలక్షణము. సం. విణ. చిహ్నములు లేనిది; అనుమాన ప్రమాణమునకందనిది.
అలక్ష్మి. సం. పెద్దమ్మ, జ్యేష్ఠా దేవి; ప్రేతకళ
అలక్ష్యము. అనాదరము; నిరసనము. సం. లక్ష్యము లేమి. విణ. లక్ష్యము కా(లే) నిది; లక్షణాచే ఎఱుఁగఁబడుదానికంటె వేఱైనది.
అలక్ష్యముచేయు. స. క్రి. అనాదరించు.
అలగర్ద(ర్ధ)ము. సం. నీరుపాము.
అలఘువు. సం విణ. లఘువు కానిది.
అలచేందలు. వా. రాజమాషము†.
అలజేడి. ఆపద; క్లేశము, దుఃఖము, విచారము.
అలది. అలఁది.
అలపు. అలయిక, శ్రమము.
అలబలము. కలకలధ్వని; వ్యాకులము.
అలభ్యము. సం. విణ. లభ్యము గానిది.
అలమట. చింత, క్లేశము.
అలమటపడు, అలమటించు, అలమరు } అ. క్రి. చింతపడు, చింతించు, వగచు.
అలమారా. అల్మారా. [కట్టు.
అలమారుచు. స. క్రి. బంధిదొడ్లను మార్చి

అలము ఆక్రమణము; కాయ; పిందె; శాకవిశేషము. సం. కొండి; కొండిముల్లు; అరిదళము. అ. క్రి. కవియు, క్రమ్ము. స. క్రి. ఆక్రమించు; కౌఁగిలించు; పరిగ్రహించు; సమీపించు; పరివేష్టించు; కప్పు; పట్టుకొను; పూయు; వ్యాపించు.
అలముకొను. అ. క్రి. కవియు; పైకొను; వ్యాపించు.
అలయిక. శ్రమము, బడలిక.
అలయు. అ. క్రి. ఆలస్యముచేయు; విసుగు; శ్రమపడు.
అలరమ్ము. పుష్పబాణము.
అలరారు. అ. క్రి. ఒప్పు; ప్రకాశించు.
అలరింత. నవ్వు.
అలరు. వికాసము; పుష్పము; సంతోషము; ఒప్పు, ప్రకాశము. అ. క్రి. వికసించు; పుష్పించు; సంతోషించు; ప్రకాశించు, ఒప్పు.
అలరుఁబోఁడి, అలరుబోణి } పూఁబోఁడి, పూవుయొక్క సౌకుమార్యము వంటి సౌకుమార్యముగల స్త్రీ; స్త్రీ.
అలరుచు. స. క్రి. చేయు. ప్రే. వికసింపఁ జేయు; సంతసింపఁజేయు; ఒప్పఁజేయు.
అలరుపాయము. బాల్యము.
అలరువిలుకాఁడు, అలరువిలుతుఁడు } పుష్పధన్వుఁడు, మన్మథుఁడు. రూ. అలరువిల్తుఁడు.
అలరుసాయకవైరి. మి. పుష్పబాణునకు వైరి, శివుఁడు. [జిల్లేడు†.
అలర్కము. సం. వెఱ్ఱిత్తినకుక్క; తెల్ల
అలవ. దడి; గోడ.
అలవడు. అ క్రి. అభ్యస్తమగు; తగు; యుక్తమగు; అబ్బు, సిద్ధించు; లొంగు, స్వాధీనమగు; కుదురుపడు; ఒప్పు.
అలవడుట. అలవాటు.
అలవరి. అలంగము.
అలవరించు. ద్వి. ప్రే. అబ్బునట్లు చేసికొను అలంకరించు; పూను, వహించు; దిద్దు, సవరించు; సిద్ధపఱచు; వశపఱచుకొను; పట్టుకొను, గ్రహించు; ఒప్పించు.

అలవఱుచు } స.క్రి. అలవడు. ప్రే. అలవడఁజేయు, అలవరించు, నేర్పు.
అలవర్చు }

అలవాటు. అభ్యాసము; సిద్ధి. విణ. అలవరించినది, సిద్ధము.

అలవాలము. సం. పాదు.

అలవి. కొలఁది, పరిమితి. విణ. శక్యము.

అలవు. పరిశ్రమము; బలము; శ్రమము; అభ్యాసము; ఖడ్గము.

అలవోక. యదృచ్ఛ, అప్రయత్నము; క్రీడ; లీల, విలాసము; అశ్రద్ధ; ఉత్కంఠ; స్వేచ్ఛ; అలక్ష్యము.

అలనందియలు } బ. బొబ్బరలు, రాజమాషము, కాయధాన్యవిశేషము.
అలనందెలు }

అలసట. అలపు, బడలిక, ఆయాసము.

అలసత. సం. సోమరితనము, మాంద్యము.

అలసపడు. అ.క్రి. మందమగు.

అలసు. వా. తిరస్కారము.

అలసుఁడు. సం. విణ. సోమరి అవశ్యకర్తవ్యములయందు వెనుదీయువాఁడు.

అలా. అవ్య. అల.

అలాకు. అలక్ష్యము.

అలాతము. సం. కొఱవి; నిప్పు.

అలాబువు. సం. ఆనుగు, సొర†.

అలాయిదా. హిం. వేఱుగా.

అలి. సం. అళి.

అలింగము. సం. ఆత్మ, బ్రహ్మము. విణ. చిహ్నహీనము (లిం) లేనిది.

అలింగసంన్యాసము. సం. బ్రాహ్మణేతరులు చేయఁదగినట్టి కాషాయదండధారణాది చిహ్నములు లేని (అంతః) సంన్యాసము.

అలింజరము. సం. కాఁగు; బాన.

అలికము. సం. నొసలు, నుదురు.

అలికిడి. చప్పుడు.

అలిది. పసుపువన్నె; తెల్లతెగడ†.

అలిపకము. సం. కుక్క; కోయిల; తుమ్మెద

అలిపిరి. విణ. బక్కవాఁడు, అల్పశరీరముగలవాఁడు; మెల్లనిది.

అలిపిరిది. సన్ననూలు వడుకుసాధనము. విణ. పలుచనిది; బక్కది.

అలియు. అ.క్రి. అలయు.

అలివేణి. సం. తుమ్మెదవంటి వెండ్రుకలు గలస్త్రీ; స్త్రీ.

అలీకము. సం. అళీకము.

అలుఁగు. ఆయుధము; ఖడ్గము; చెఱువు నిండినపుడు నీళ్లుపోవుటకేర్పఱచిన దారి, జలోచ్ఛ్వాసము; బాణాదుల ములికి, ఫలము

అలుక. కోపము; ద్రోహచింత.

అలుకు. భయము. అ. క్రి. భయపడు. స క్రి. ఇల్లు మొ॥ అలుకు (విలేపనము చేయు); చల్లు, బీజావాపముచేయు.

అలుకుఁజుట్టి. అలికెడిప్రాఁతగుడ్డ మొ.

అలుకుడు అలికిడి, ధ్వని.

అలుకువ. కోపము.

అలుగ. అలుఁగు, జలోచ్ఛ్వాసము.

అలుగు. అ క్రి. కోపించు; ద్రోహము తలఁచు.

అలుగులు. నలఁగుడు, బాధ.

అలుగులపడు నలఁగుడుపడు; బాధపడు.

అలుగులము. అలుగుల.

అలుచు. విణ అధముఁడు; దుర్బలుఁడు; మందుఁడు.

అలుపము. విణ. అల్పము.

అలుపుఁడు. విణ. నీచుఁడు.

అలువు. అలుగు. అ. క్రి. అలుగు.

అలుసు. వా. అలుసు, లఘుత్వము, చిన్నతనము.

అలేపకము. సం. విణ. అసంగము, లిప్తముగానిది, ఆత్మ, బ్రహ్మము.

అలోకము సం. విణ. దృశ్యములేనిది, ఆత్మ, బ్రహ్మము.

అలౌకికము. సం. అప్రత్యక్షము; ప్రత్యక్షవిశేషము; అమానుషము, లోకాతీతము.

అల్క. అలుక.

అల్కా. హిం. విణ. తేలికైన.

అల్కుడు. అలికిడి.

అల్గు. అలుగు; బాణముములికి.

అల్గోజా. హిం. పిల్లనఁగ్రోవి.

అల్జడి. వేదన; వేదనవలనఁగలుగుతొందర.

అల్పతనువు. సం. విణ. దుర్బలుఁడు.

అల్పతమము. సం. విణ. అల్పిష్ఠము.

అల్పతరము. సం. విణ. అల్పీయము.

అల్పదృష్టి } సం. ఉదారబుద్ధి లేకుండుట.
అల్పబుద్ధి } విణ. విశాలదృష్టి లేనివాఁడు

అల్పమారిషము. సం. చిర్రికూర†.

అల్పము. సం. విణ. అలఁతి, సూక్ష్మము, సన్నము.

అల్పహర్మ్యము. సం. అటుక.

అల్పాక్కర. మి. అక్కరలలో నొకటి.

అల్పాచమానము వా. మూత్రవిసర్జనము.

అల్పాయువు. సం. మేఁకపోతు; తక్కువ ఆయుర్దాయము. విణ అల్పాయుష్కుఁడు.

అల్పాల్పము. సం. విణ. మిక్కిలిఅల్పము.

అల్పిరి. విణ. అలిపిరి.

అల్పిష్ఠము. సం. విణ. అన్నింట మిక్కిలి అల్పము.

అల్పీయము. సం. విణ. చాల అల్పము.

అల్పుఁడు. సం. విణ. తక్కువవాఁడు, అధముఁడు.

అల్మారా-రు. హిం. సామానులుంచుటకై గోడలో అమర్చెడి కఱ్ఱపెట్టె.

అల్యూమినియము. ఇం. సీమవెండి.

అల్ల. విణ.అల, ప్రసిద్ధ్యర్థకము; అదిశబ్దార్థకము (అల్లవాఁడుఅని); నిర్దేశార్థకము' మంచము. క్రి. విణ. కొంచెముగా. సం. తల్లి; అల్లా.

అల్లకము. అల్లిక, అల్లుట; గోఁచి.

అల్లకల్లోలము. విణ. తాఱుమాఱు.

అల్లట. కష్టము, దుఃఖము.

అల్లటపెట్టు. స. క్రి. కష్టపెట్టు.

అల్లదనము. సౌందర్యము.

అల్లది. విణ. ఇంచుక దూరములో నుండునది; వెనుకఁజెప్పబడినది.

అల్లన. తిన్నన; మెల్లన.

అల్లనల్లనన్. క్రి. విణ. మెల్లమెల్లగా.

అల్లని విణ. మెల్లనిది.

అల్లము. శృంగబేరకము†.

అల్లరి. దోషప్రకటనము; తప్పు బయలుపడుట; నింద; కోలాహలము. విణ. దోషమువలన ప్రకటమైనది; నింద పడినది.

అల్లలనాడు } అ. క్రి. కదలు, చలించు,
అల్లలా(ల్లా)డు } కంపించు.

అల్లా. హిం. తురకలదైవము, యవనోపాస్యుఁడగు పరమేశ్వరుఁడు.

అల్లాటము. అల్లాడుట.

అల్లాడు. కదలు, చలించు; తిరుగు; తహతహపడు; బాధపడు.

అల్లారుచు. ప్రే. అల్లాడఁజేయు.

అల్లారుపు. అల్లార్చుట, కదలించుట, విక్షేపణము.

అల్లారుబెల్లము } విణ. మిక్కిలి ప్రియము,
అల్లారుముద్దు } అతిమనోహరము.

అల్లార్చు. ప్రే. అల్లారుచు.

అల్లార్పు. అల్లారుపు.

అల్లి. కలువవంటి ఒక నీటిపువ్వు; అల్లిచెట్టు; బాలక్రీడావిశేషము; అల్లిక. విణ. చల్లనిది.

అల్లిక. అల్లుట, వ్యూతి; పదములకూర్పు.

అల్లికబిల్లిక. అల్లిబిల్లి.

అల్లితెమ్మెర. చల్లగాలి.

అల్లిబిల్లి. పెనఁకువ; ఒద్దిక.

అల్లిబిల్లికొను. అ. క్రి. అల్లికొనియుండు; పెనఁగొను.

అల్లియ. అల్లె.

అల్లియము. అల్లెము.

అల్లు. (తీఁగె)ప్రాకు. స.క్రి. అల్లికచేయు, (పదములు)కూర్చు.

అల్లుగుఱ్ఱు. అల్లుడు.

అల్లుఁడు. కూఁతుమగఁడు, జామాత.

అల్లుఁడుకొమాళ్లు. బ. కొంచెము ఇంచుమించుగా దొరతో సమమైన వేషము భోజనమునుగలిగి దొరకు అంగరక్షకుఁడుగా నుండువాఁడు.

అల్లుడు. అల్లిక, అల్లుట.

అల్లుతండము. మి. విటసమూహము.

అల్లుఁడనము. అల్లుఁడగుట, జామాతృత్వము.

అల్లుబచ్చలి. తీఁగెబచ్చలి.

అల్లువాఁడు. అల్లుఁడు.

అల్లెత్రాఁడు. వింటినారి, మౌర్వి.

అల్లెదమ్ము. మత్స్యవిశేషము.

అల్లెము. అల్లుఁడగుట, అల్లునివరుస; పెండ్లియైనతరువాత అల్లునికి అత్తవారుచేసెడి విందు.

అల్లొనేరెడు. నేరెడు†; రాచనేరేడు†; నమస్కారము; సంగీతవిశేషము.
అల్లొనేరెడు / అల్లోనేరెడు } సంగీతవిశేషము.
అల్లోనేరేడు. నేరేడు†; రాచనేరేడు†; బాలక్రీడావిశేషము.
అల్లోనేరేళ్ళు. బ. ఒకవిధమైన పాటలు.
అల్వరించు. అలవరించు.
అవ. అవ్వ; సంఖ్యాపూరణార్థకము.
అవంతి. సం. మాళవదేశము; అక్క.
అవంతిక. సం. ఉజ్జయిని, ఒక మోక్షపురి; వాసెనకుడుము.
అవంతిసోమము. సం. పులికడుగు.
అవంధ్యము. సం. విణ. గొడ్డువోక ఫలించెడి చెట్టు.
అవకతవక. విణ. సందర్భము లేనిది.
అవకరము. సం. చీఁపురుకట్టతో చిమ్మి చేర్చిన కసవుకుప్ప (చెత్త) అప్ర. చెడుపని; దోషము; లోపము.
అవకర్ణించు. సం. వెడచెవిని బెట్టు; విను.
అవకర్షణము. సం. వెడలించుట.
అవకలితము. సం. విణ. చూడఁబడినది.
అవకాశము. సం. ఎడము; తెఱపి; వీలు; స్థలము.
అవకీర్ణము. సం. బ్రహ్మచర్యవ్రతభంగము. విణ. చిమ్మఁబడినది; పొడిచేయఁబడినది; వ్యాపించినది; ఉల్లంఘింపఁబడినది.
అవకీర్ణి. సం. బ్రహ్మచర్యవ్రతమునుండి భ్రష్టుఁడైనవాఁడు. [నది; నీచము.
అవకృష్టము. సం. విణ. వెడలింపఁబడి
అవకేశి. సం. గొడ్డుమ్రాఁకు.
అవక్రయము. సం. అద్దె; పన్ను; వెల.
అవక్షిప్తము. సం. విణ. నిందితము.
అవగండము. సం. బొటిమ.
అవగడము. అగడము; కష్టము; ప్రమాదము. విణ. దుష్టము; అసాధ్యము; కష్టమైనది.
అవగణన. సం. తిరస్కారము.
అవగణితము. సం. విణ. అవమానింపఁబడినది.
అవగతము. సం. విణ. ఎఱుఁగఁబడినది.
అవగతి. సం. జ్ఞానము.
అవగమము. సం. అనుభవము, జ్ఞానము
అవగాఢము. సం. విణ. దట్టమైనది; లోపలఁ బ్రవేశించినది; మునిఁగినది; దేనిలోపలనుఁ గుదురుగా అది; ఎఱుఁగఁబడినది; అతికష్టమైనది.
అవగాహనము / అవగాహము } సం. మునుక, స్నానము; ఆకళింత; లోపలఁ జొచ్చుట; స్నానగృహము.
అవగాహించు. అ.క్రి. మునుఁగు; చొచ్చు. స.క్రి. ఆకళించు. [బడినది.
అవగీతము. సం. దూఱు విణ. దూఱఁ
అవగీర్ణము. సం. విణ. పొగడఁ బడినది.
అవగుంఠనము. సం. మేలిముసుఁగు; ఒక ముద్ర; ఆచ్ఛాదనము.
అవగుంఠిక. సం. మేలిముసుఁగు.
అవగుణము. సం. దుర్గుణము; దోషము.
అవగ్రహణము. సం. అడ్డపాటు; అనాదరము.
అవగ్ర(గ్రా)హము. సం. అనావృష్టి.
అవఘళము. వ్యాపనము; సామర్థ్యము. విణ. అధికము; దుష్కరము.
అవఘళించు. అ. క్రి. వ్యాపించు; సరియగు; స్పర్ధ సేయు. స.క్రి. అతిశయించు.
అవఘళుఁడు. విణ. వ్యాపకుఁడు; సమర్థుఁడు. [దంపుట.
అవఘాతము. సం. ధాన్యము మొ॥
అవచయము. సం. పండ్లు పూలు మొ॥ కోయుట. [మొ॥ కోయుట.
అవచాయము. సం. చేతితో పండ్లుపూలు
అవచూర్ణితము. సం. విణ. పొడిగా చేయఁబడినది.
అవచూలకము. సం. వింజామర.
అవచూళము. సం. జెండాగుడ్డక్రిందికుచ్చు.
అవచ్ఛిన్నము. సం విణ. విశిష్టము; ఉపహితము; పరిచ్ఛిన్నము. [దేశము.
అవచ్ఛేదము. సం. పరిచ్ఛేదము; ఏక
అవచ్ఛేదకము. సం. విశేషణము; ఉపాధి.
అవచోటము. క్రి. విణ. అకస్మాత్తు.
అవజ్ఞ. సం అవమానము. [బడినది.
అవజ్ఞాతము. సం. విణ. అవమానింపఁ

అవజ్ఞానము. సం. అవమానము.
అవటము. సం. గుంట, గొయ్యి; నుయ్యి.
అవటీటుఁడు. సం. విణ. చప్పిడి (నడ్డి) ముక్కు గలవాఁడు.
అవటువు. సం. పెడతల, ముచ్చిలిగుంట.
అవడీనము. సం. పక్షులు క్రిందికి దిగుట.
అవడు. అగడు. [భూషణము.
అవతంసము. సం. కర్ణాభరణము; శిరో
అవతంసితము. సం. విణ. అవతంసముగా చేయఁబడినది.
అవతమసము. సం. తగ్గిన చీఁకటి.
అవతరణము. సం. అవతరించుట.
అవతరణి-క. సం. ప్రస్తావన, ఉపక్రమణిక, ఉపోద్ఘాత రూపమైన సంగతి. గ్రంథ(వివక్షితాంశ)ప్రస్తావన;పరిపాటి
అవతరించు. అ.క్రి. దిగు; మాఱు రూపముతో ప్రకటమగు (ప్రాదుర్భవించు).
అవతరిల్లు. అ.క్రి. అవతరించు.
అవతలి. అవలి ప్రదేశము; పిమ్మట.
అవతారణము. సం. అవతరణిక; దింపుట.
అవతారము. సం. రేవు; అవతరించుట; అవతరణిక; దేవతలు గాని విశేషించి విష్ణువుగాని మాఱురూపముతో (పూర్ణ-అంశ-ఆవేశరూపములతో) భూమియందవతరించుట; ఉత్పత్తి; జన్మము;హరించుట, తొలఁగించుట. (అవతారములు —బ్రహ్మ, వరాహము, నారదుఁడు, నరనారాయణులు, కపిలుఁడు, దత్తాత్రేయుఁడు,యజ్ఞుఁడు, ఋషభదేవుఁడు, పృథుచక్రవర్తి, మత్స్యము, కూర్మము, ధన్వంతరి, మోహిని, నృసింహుఁడు, వామనుఁడు, పరశురాముఁడు, వేదవ్యాసుఁడు, శ్రీరాముఁడు, బలరామ కృష్ణులు, బుద్ధుఁడు, కల్కి.)
అవతారించు. సం. అ.క్రి. అవతరించు.
అవతారిక. సం. అవతరణిక.
అవతీర్ణుఁడు. సం.విణ.అవతరించినవాఁడు
అవతోక. సం. అపతోక.
అవదంశము. సం. ఊరుఁగాయ; కల్లు త్రాగునపుడు నంజుకొను పదార్థము.
అవదగారి. విణ. దుష్టుఁడు.
అవదాతము. సం. తెల్లన; పచ్చన. విణ. తెల్లనిది; పచ్చనిది; నిర్మలము; మనోహరము.
అవదానము. సం. అపదానము.
అవదాయము. సం. జూదమున తప్పుగా పాచికలు వేయుట.
అవదారణము. సం. చీల్చుట; త్రవ్వుట; గుద్దలి, గడ్డపాఱ.
అవదాహము. సం. నీటివట్టివేరు.
అవదీర్ణము. సం. విణ. కరఁగిన నేయి మొ; బద్దలుచేయఁబడినది.
అవదూఱు. మి. అపదూఱు.
అవద్యము. సం. పాపము. విణ.అధమము.
అవధరించు. సం. అ. క్రి. సావధానుఁడగు. స. క్రి. చిత్తగించు, విను; నిశ్చయించు; ధరించు.
అవధానము. సం. ఎచ్చరిక, ఏకాగ్రత; అప్రమత్తత. వా. కవితావినోదము, బుద్ధి చెదరకుండఁగ పెక్కు విషయములను ధారణచేయుట; వేదమున క్రమము జట ఘన మొ॥ నేర్చుట. [వాఁడు.
అవధాని. సం. విణ. అవధానము గల
అవధాయకుఁడు. సం. విణ. అవధానము చేయువాడు. [రించుట.
అవధారణము. సం. నిశ్చయము; అవధ
అవధారు. అవధరింపుము, చిత్తగింపుము, వినుము. [ధానము.
అవధి. సం. హద్దు; ఎడము; గడువు; అవ
అవధీరణము. సం. అవమానము.
అవధీరితము. సం. విణ. తిరస్కరింపఁబడినది.
అవధూత. సం. అతివర్ణాశ్రమి, సంన్యాసి విశేషము; కేవలము బ్రహ్మనిష్ఠుడున్న సంన్యాసి; అక్షరుఁడు వరేణ్యుఁడు ధూతసంసారబంధనుఁడు తత్త్వమస్యాదులను అర్థ్యముగైనవాఁడు; స్వేచ్ఛాచారుఁడు శుద్ధచిత్తుఁడు నైనవాఁడు. (శైవావధూత, కౌళావధూత, బ్రాహ్మవధూత, భక్తావధూత, గృహావధూత, హంసావధూత, పరమహంసావధూత అనబడువారు.)

అవధూతము. సం. ఒక ఉపనిషత్తు. విణ. ఎగురఁగొట్టబడినది; కదలింపఁబడినది; అనాదరింపఁబడినది, తిరస్కరింపఁబడినది; మఱలింపఁబడినది.
అవధూననము. సం. విదుల్చుట; కదల్చుట.
అవధేయము. సం. విణ. శ్రద్ధవహింపఁదగినది; తెలిసికొనఁదగినది.
అవధ్యుఁడు. సం. విణ. చంపరానివాఁడు.
అవధ్వస్తము. సం. విణ. దూఱఁబడినది; పొడిగాచేయఁబడినది; విడువఁబడినది.
అవనతము. సం. విణ వంగినది; క్రిందైనది; మ్రొక్కినది. [గుట; మ్రొక్కుట.
అవనతి. సం. వినయము; వంగుట; క్రింద
అవనద్ధము. సం. విణ. కప్పఁబడినది.
అవనము. సం. కాపాడుట; తనివినొందించుట.
అవనాటుఁడు. సం. అవటీటుఁడు.
అవనాయము. మి. న్యాయవిరుద్ధము. సం. పడఁద్రోయుట.
అవని. సం. భూమి; స్థానము.
అవనిశ్రవోభవుఁడు. సం. వాల్మీకి.
అవనీనాథుఁడు } సం. రాజు.
అవనీశుఁడు }
అవపాడి. మి. అన్యాయము.
అవపాతము. సం. రంధ్రము; ఓదము.
అవభాసము. సం. ప్రకాశము; జ్ఞానము; మిథ్యాజ్ఞానము.
అవభృథము. సం. దీక్షాంతమున చేయు హోమము; యజ్ఞాంతమున చేయు స్నానము.
అవభ్రటుఁడు. సం. అవటీటుఁడు.
అవమంత. సం.విణ.అవమానించువాఁడు.
అవమతము సం. విణ అవమానింపఁబడినది.
అవమతి. సం. అవమానము.
అవమతుఁడు. సం. విణ. తిరస్కరింపఁబడినవాఁడు.
అవమము. సం. మూఁడు తిథులు గలసిన రోజు, తిథిత్రయము. విణ. అధమము.
అవమర్దము. సం. రాయిడి, ఒరయిక; సస్యాదిసంపన్న దేశమునకు పరచక్రముచేఁ గలిగెడి రాయిడి,
అవమర్యాద. సం. అమర్యాద.
అవమానన-ము. తెగడిక, అనాదరము, అమర్యాద.
అవమానపడు. మి. అ. క్రి. భంగపడు.
అవమానపఱచు. మి.స.క్రి. భంగపఱచు.
అవమానపాటు.మి.అవమానముపొందుట.
అవమానపెట్టు. మి.స.క్రి. భంగపఱచు.
అవమానము. సం. తెగడిక, భంగము.
అవమానించు. సం. స.క్రి. అవమానము చేయు. [కొందుట.
అవమానింపమి. సం. అవమానము చేయ
అవమానితము. సం. అవమతము.
అవముఁడు. సం. విణ. అధముఁడు.
అవయవము. సం. కరచరణాద్యంగము; ఉపకరణము; అంశము; ఏకదేశము.
అవయవి. సం. విణ. అవయవయుక్తము.
అవర. సం. దుర్గ, పరదేవత.
అవరజ. సం. చెల్లెలు. [జుఁడు.
అవరజుఁడు సం. తమ్ముఁడు. విణ. అంత్య
అవరతి. సం. చాలించుట, విరామము.
అవరము. సం. ఏనుఁగు వెనుకటి పిక్కమున్నగు భాగము. విణ. వెనుకటిది; చిన్నది; హీనము; శ్రేష్ఠతమము.
అవరవర్ణుఁడు. సం. శూద్రుఁడు.
అవరీణుఁడు. సం.విణ. ధిక్కరింపఁబడినవాఁడు.
అవరుఁడు. సం. విణ. హీనుఁడు.
అవరోధము. సం. అంతఃపురము;అడ్డగింత; ముట్టడి. [ధించుట.
అవరోధనము. సం. అంతిపురము; అవరో
అవరోధించు. సం. స. క్రి. అడ్డగించు; ముట్టడించు.
అవరోధికుఁడు. సం. కంచుకి.
అవరోహణము. సం. దిగుట. [శిఖ.
అవరోహము. సం. దిగుట; ఊడ; శాఖా
అవర్ణము. సం. దూఱు, ఆక్షేపము.
అవల. పిమ్మట, తరువాతికాలము; అవతల, తరువాతిప్రదేశము; దూరము. విణ. అవతలిది; ఇతరము.
అవలంబనము } సం. కట్టు మొ|| పట్టుకొనుట; పట్టుకొనెడి
అవలంబము }

కట్టు మొ॥ అండ, ఆశ్రయము; ఆశ్ర
యించుట. [ధరించు.
అవలంబించు. సం. స.క్రి. ఆశ్రయించు;
అవలంబితము. సం. విణ. అండగా చేసి
కొనఁబడినది.
అవలక్షణము. సం. దుర్లక్షణము.
అవలక్షము. సం. తెలుపు. విణ. తెల్లనిది.
అవలగ్నము. సం. నడుము.
అవలిప్తము. సం. గర్వమునొందినది.
అవలీల. సం. చులుకన; అలక్ష్యము.
అవలేపము. సం. గర్వము; పూఁత.
అవలేహము. సం. లేహ్యౌషధము.
అవలోకనము. సం. చూపు, చూచుట.
అవలోకించు. సం. స. క్రి. చూచు.
అవలోకితము. సం. చూచుట, చూపు
విణ. చూడఁబడినది.
అవలోడనము. సం. పరామర్శము.
అవల్గుజము. సం. కారుగచ్చ†.
అవవాదము.సం.ఆజ్ఞ; నింద; విశ్వాసము.
అవశకునము. సం. అపశకునము.
అవశము. సం. అవశ్యము. విణ. పరా
ధీనము.
అవశిష్టము. సం. విణ. మిగిలినది.
అవశ్యభావ్యము. సం. విణ. అనివార్య
ముగా కాఁదగినది.
అవశ్యము. సం. అవ్య. తప్పక; నిశ్చయ
ముగా; నిశ్చితము. విణ. అధీనముకానిది;
తప్పనిది; మానఁగూడనిది.
అవశ్యాయము. సం. మంచు.
అవష్టంభము. సం. గర్వము
అవష్టబ్ధము. సం. విణ. సమీపము; ఆశ్రి
తము.
అవసక్థిక. సం. రోగులు నడుమునకు
మోఁకాళ్ళకుఁజుట్టుకొనెడి యోగపట్టా.
అవసడి. మి. అపవాదము.
అవసథము. సం. గృహము; గ్రామము;
పాఠశాల.
అవసన్నము. సం. విణ. విషాదము నొంది
నది; నశింపనున్నది; స్వకార్యమునం
దసమర్థము.
అవసరము. అక్కర; ఆవశ్యకము. సం.
అవకాశము, యోగ్యసమయము; ప్రస్తా
వము, అవశ్యకర్తవ్యరూపమైనసంగతి
విశేషము.
అవసాదనము. సం. నశింపఁజేయుట;
స్వకార్యమునందసమర్థత.
అవసాదము సం. విషాదము; నాశము;
కడ; స్వకార్యమునందసమర్థత.
అవసానము. సం. కడ; ముగియిక; చావు.
అవసితము. సం. విణ. నుఱిచినధాన్యము;
ఎఱుఁగఁబడినది; ముగిసినది.
అవస్కందము. సం. అభ్యవస్కందము.
అవస్కరము. సం. మలము; గుహ్యావ
యవము; కసవుకుప్ప.
అవస్తువు. సం. అసద్వస్తువు, అజ్ఞానాది
సకలజడసమూహము.
అవస్త్యము. సం. గృహము.
అవస్థ. వా. కష్టము. సం. కాలకృత విశే
షము; కాలవశమునఁ గలిగెడి దేహా
దుల దశ, బాల్యము మొ॥; జాగ్రత్తు
మొ॥; స్థితి, ఉనికి.
అవస్థాత్రయము. సం. జాగ్రత్తు, స్వ
ప్నము, సుషుప్తి; బాల్యము యౌవనము
వార్ధక్యము.
అవస్థానము. సం. ఉనికి, స్థితి.
అవస్థాపనము.సం.ఉంచుట, స్థాపించుట.
అవస్థితి. సం. ఉనికి, స్థితి.
అవహననము. సం. దంచుట.
అవహస్తము. సం. పెడచేయి, చేతివెనుక
భాగము.
అవహారము. సం. నెగడు, గ్రాహము.
అవహితము. సం. విణ. సావధానము.
అవహిత్థ. సం. ఆకారమును (భయలజ్జాదు
లను) కప్పిపుచ్చుట.
అవహేళనము. సం తిరస్కారము.
అవాంతర దిక్కు (దిశ). సం. విదిక్కు,
అగ్ని-మూల మొ॥.
అవాంతరము. వా. అవాంత్రము. సం.
విణ ప్రధానమైన దానిలో ఇమిడి
యుండునది; ప్రాసంగికము.
అవాంత్రము. వా. విఘ్నము; కష్టము.
అవాక్కు. సం. విణ. మూఁగ; దక్షిణము;
అధోముఖమైనది.
అవాక్పుష్పి. సం. పెద్దసదాప†.

అవాగ్రము. సం. విణ. వంగినది.
అవాఙ్ఞు. సం. విణ. అధోముఖుఁడు.
అవాఙ్మ (జ్మా) నస గోచరము. సం. విణ వాక్కునకును మనస్సునకును అందనిది, ఆత్మ, బ్రహ్మము.
అవాఙ్ముఖుఁడు. సం. విణ. అధోముఖుఁడు
అవాచి. సం. దక్షిణదిక్కు.
అవాచీనము. సం. విణ. దక్షిణదిక్కునఁ బుట్టినది.
అవాచ్యము. సం. దుర్వాక్యము. విణ. అనరానిది (మాట); వాక్కునకు అందనిది.
అవాజా. హిం. వదంతి; శబ్దము.
అవాప్తము. సం. విణ. పొందఁబడినది.
అవాప్తవ్యము. సం. విణ. పొందఁదగినది.
అవాప్తి. సం. ప్రాప్తి, పొందుట.
అవామనుఁడు. సం. విణ. పొట్టికానట్టి వాఁడు.
అవాయి-చువ్వ. ఆకాశబాణము.
అవారణము. సం. అడ్డులేమి. విణ. అడ్డులేనిది.
అవారము. సం. ఈవలి దరి.
అవారి. విణ. అపరిమితము.
అవారితము. సం. విణ. అడ్డగింపఁబడనిది.
అవాసనుఁడు } సం. విణ. దిసమొలవాఁడు
అవాసుఁడు }
అవి. స. బ. అయ్యవి. సం. సూర్యుఁడు; కొండ; పొట్టేలు; ముట్టుది; గొఱ్ఱె.
అవికారి. సం. విణ. వికారము బుట్టింపనిది; నిర్వికారము, ఆత్మ, బ్రహ్మము.
అవికిరి. వలికండ్లపాము.
అవిగ్నము. సం. కలివేఁగ.
అవిఘ్నము. సం. విఘ్నములేమి. విణ. విఘ్నములేనిది.
అవిచారము. సం. అన్యాయము; విచారము (వివేచనము) లేమి. విణ. విచారము లేనిది.
అవిచారితము. సం. వివేచింపనిది.
అవిచ్ఛిన్నము. సం. విణ. తెంపులేనిది.
అవిజ్ఞాత. సం. విణ. జ్ఞాతృత్వములేనివాఁడు, బ్రహ్మము. [బ్రహ్మము.
అవిజ్ఞాతము. సం. విణ. ఎఱుఁగఁబడనిది;
అవిజ్ఞేయము. సం. విణ. ఎఱుఁగఁదగనిది; ఎఱుఁగనలవికానిది, ఆత్మ, బ్రహ్మము.
అవిటి. విణ. పటుత్వములేనిది, వికలాంగము; వికలాంగుఁడు. [వచ్చుట.
అవిడీనము. సం. పక్షులు ఎదురుగా
అవిత. సం విణ. రక్షకుఁడు.
అవితము. సం. విణ. కావఁబడినది.
అవిత్రి సం. రక్షించునది, దుర్గ.
అవితథము. సం. సత్యము; సార్థకము.
అవిదూనము. సం. గొఱ్ఱెపాలు.
అవిద్య. సం. అజ్ఞానము.
అవిద్యుఁడు. సం. విణ. విద్యలేనివాఁడు.
అవిధి. సం. దుర్విధి; విధిలేమి; శాస్త్రవిరుద్ధము.
అవినయము. సం. వినయములేమి; అసభ్యాచారము. విణ. వినయములేనిది.
అవినాభావము. సం. విడువకుండుట; వ్యాప్తి; సంబంధము. [యుండనిది.
అవినాభూతము. సం. విణ. విడిచి
అవినాశి. సం. విణ. నాశములేనిది, ఆత్మ, బ్రహ్మము. [యము.
అవినీతి. సం. అసభ్యాచారము; అవిన
అవినీతుఁడు. సం, విణ. వినయములేనివాఁడు.
అవిభక్తము. సం. విణ. విభజింపఁబడనిది. వేఱుకానిది (ఆత్మ, బ్రహ్మము).
అవిమరీసము. సం. గొఱ్ఱెపాలు.
అవిముక్తము. సం. కాశీక్షేత్రము; గడ్డమునకు శిరమునకు నడిమిప్రదేశము.
అవియించు. స. క్రి. బ్రద్దలు చేయు.
అవియు. అ. క్రి. చెడు; పగులు; బాధపడు; విచ్చు.
అవిరతము. సం. సంతతము, నిత్యము.
అవిరళము. సం. విణ. దట్టమైనది; నిరంతరము.
అవిరి. నీలిగ; ఒక నేత్రవ్యాధి.
అవిలంబితము. సం. వేగము, శీఘ్రము. విణ. వడిగలది. [నిర్వివాదము.
అవివాదము. సం. వివాదములేమి విణ.
అవివాహితుఁడు. సం. పెండ్లికానివాఁడు.
అవివేకము. సం. సత్తు అసత్తుల వివేచింపమి. విణ. వివేకరహితము.

అవివేకి / అవివేకుఁడు / అవివేచకుఁడు } సం. విణ. వివేకరహితుఁడు; ఆలోచింపక పనులు చేయువాఁడు.
అవిషహ్యము. సం. విణ. సహింపరానిది.
అవిసియ / అవిసె } అగిసె, అతసి †.
అవిసెనూనె. అగిసెవిత్తులనూనె.
అవిసోఢము. సం. గొఱ్ఱెపాలు.
అవిస్పష్టము. సం. ప్రకటముగానిమాట.
అవీర. సం. మగఁడును బిడ్డలును లేని స్త్రీ.
అవు. అ. క్రి అగు.
అవున్. అవ్య. అగున్, నిజమనుట.
అవుకాఁపు. అర్ధ కాఁపురము.
అవుకు.జంకు;లోపము. విణ. శిథిలమైనది.
అవుఁగదె. అవ్య. ఆశ్చర్యార్థకము.
అవుఁగాక. అవ్య. ఔఁగాక, అట్లైకానిమ్ము, తథాస్తు అనుట.
అవుఁగాములు. బ. అగుటయును కాకపోవుటయును; యుక్తాయుక్తతలు; కలిమిలేములు; మేలు గీళ్లు.
అవుగు. భక్ష్యవిశేషము;
అవుజే. అడుసు; కాలువ; పనివాఁడు.
అవుడు. క్రింది పెదవి, అధరోష్ఠము.
అవుడుకఱచు. అ.క్రి. కోపముచే పండ్లు కొఱుకు.
అవుతుఖానా. హిం. స్నానముచేయుతొట్టి.
అవుదల. తల, శిరస్సు. [దిగుడు బావి.
అవుదు. కాలువ; జలయంత్రము గల
అవుర (రా). అవ్య. ఆశ్చర్యార్థకము.
అవురు. జొరుగడ్డి, వీరణము †.
అవురునవురు. విణ. నలఁగిపోయినది.
అవుల. అక్కడ; అవల.
అవులు. అ. క్రి. అగులు.
అవులెమ్ము / అవులే } అవ్య. ఔనులే, ఔనౌను.
అవుసు. సొగసు; ఒయ్యారము.
అవేక్షణము. సం. చూచుట; ఎచ్చరిక; అనుసంధానము.
అవ్యండ. సం. దూలగొండి †.
అవ్యక్తము. సం. మూలప్రకృతి; ఆత్మ, బ్రహ్మము. విణ. స్ఫుటముకానిది.
అవ్యక్తరాగము. సం. ఇంచుకయెఱుపు.
అవ్యక్తుఁడు. సం. ఆత్మ్మఁడు; పరమాత్మ్మఁడు. విణ. గోచరముకానివాఁడు. వా. మూర్ఖుఁడు.
అవ్యథ. సం. కరక †; మెట్టతామర †.
అవ్యపదేశము. సం. విణ. వాక్కున కందనిది
అవ్యభిచారి. సం. విణ. ఎట్టి ప్రతికూల హేతువు చేతను నివారింప నలవిగానిది; అబాధితము.
అవ్యయము. సం. లింగ విభక్తి వచన శూన్యమైన శబ్దవిశేషము; ప్రవాహరూపేణ నిత్యము; నాశములేనిది; నాశములేని ఫలము గలది; నిర్వికారము, ఆత్మ, బ్రహ్మము; ఒక సంఖ్య ?
అవ్యవసాయి. సం. విణ. నిర్ణ(శ్చ)యము లేనివాఁడు. [ములేమి.
అవ్యవస్థ. సం. నియమములేమి; సిద్ధాంత
అవ్యవహార్యము. సం. విణ. వ్యవహరింప నలవిగానిది; కర్మేంద్రియములకు విషయముగానిది.
అవ్యవహార్యుఁడు. సం. విణ. సంసర్గాయోగ్యుఁడు, పతితుఁడు మొ.
అవ్యవహితము. సం. విణ. కదిసినది; వ్యవధానము లేనిది.
అవ్యాప్తి. సం. వ్యాప్తిలేమి; లక్ష్యమునందు లక్షణము ప్రవర్తింపకుండుట, ఒక దోషము.
అవ్యాహతము. సం. విణ. సత్యము; అడ్డపాటులేనిది; కుంటుపడనిది.
అవ్యుత్పన్నము. సం. వ్యుత్పత్తిలేనిది.
అవ్వ. తల్లి; తల్లితల్లి, మాతామహి; తండ్రితల్లి, పితామహి; పూజ్యురాలు; వృద్ధస్త్రీ
అవ్వల్. హిం. విణ. మొదటిది, శ్రేష్ఠమైనది.
అవ్వల. అవల, అక్కడ, ఆ ప్రక్క; పిమ్మట
అవ్వలకించు. స. క్రి. చెరుగు; త్రోసివేయు.
అవ్వలించు. అ. క్రి. మాఱుమొగము (పెడమోము) పెట్టు.
అవ్వారి. విణ. అపరిమితము.
అశక్తము. సం. విణ. అసమర్థము.
అశక్యము. సం. విణ. అలవికానిది.
అశనము. సం. అన్నము; తినుట.
అశనాయ. సం. ఆఁకలి.

అశనాయితుఁడు. సం. విణ. ఆఁకలిగొన్న వాఁడు.
అశని. సం. పిడుగు; వజ్రాయుధము.
అశబ్దము. సం. ప్రకృతి; శబ్దముకానిది; శబ్దములేనిది (ఆత్మ, బ్రహ్మము).
అశరీరము. సం. ఆకాశవాణి. విణ. శరీరము కానిది; శరీరము లేనిది ఆత్మ, (బ్రహ్మ).
అశరీరవాక్కు. సం. ఆకాశవాణి.
అశరీరవాణి. సం. ఆకాశవాణి.
అశరీరి. సం. ఆకాశవాణి. విణ. శరీరము లేనివాఁడు (ఆత్మ, బ్రహ్మము).
అశరీరిణి. సం. ఆకాశవాణి.
అశరీరుఁడు. సం. చూ. అశరీరి.
అశాలాకము. సం. పుట్టతేనె.
అశితము సం. విణ. తినఁబడినది.
అశిశ్వి. సం. గొడ్రాలు.
అశిరస్కము. సం. విణ. తలలేనిది; అకారము మొదలుఁగలది. [లేనివాఁడు.
అశిరస్కుఁడు. సం. రాహువు. విణ. తల
అశీతి. సం. స. ఎనుబది.
అశుచి. సం. అశుద్ధి. విణ. అశుద్ధము.
అశుద్ధము. సం. మలము. విణ. పరిశుద్ధము కానిది; కోరికలు సంకల్పములును గలది (మలిన మనస్సు).
అశుభము. సం. కీడు. విణ. అమంగళము.
అశేషము. సం. విణ. సమస్తము, అంతయు, మిగులు లేనిది.
అశోక. సం. కటుకరోహిణి †.
అశోకము. సం. పుష్పవృక్ష విశేషము; ఒక మన్మథబాణము. విణ. శోకములేనిది.
అశోకరోహిణి. సం. అశోక †.
అశోచ్యము. సం. విణ. శోకింపరానిది.
అశోష్యము. సం. విణ. ఎండింపరానిది.
అశౌచము. సం. మైల; సూతకము (జాతాశౌచము మృతాశౌచము).
అశ్మంతము. సం. ప్రొయ్యి.
అశ్మగర్భము. సం. మరకతమణి.
అశ్మజము. సం. సిలాజిత్తు.
అశ్మపుష్పము. సం ఊపువు†.
అశ్మ—ము. సం. ఊయి. [కృచ్ఛ్రము.
అశ్మరి. సం. నీరుకట్టు రోగము, మూత్ర
అశ్మసారము. సం. ఇనుము.
అశ్రద్దధానుఁడు. సం. విణ. శ్రద్ధ (నమ్మకము) లేనివాఁడు.
అశ్రద్ధ. సం. అసడ్డ; అపనమ్మకము.
అశ్రము. సం. కన్నీరు.
అశ్రాంతము. సం. సంతతము, నిత్యము.
అశ్రి. సం. అంచు; కోణము.
అశ్రీకుఁడు. సం. విణ. సిరిలేనివాఁడు.
అశ్రుతము. సం. విణ. వినఁబడనిది.
అశ్రువు. సం. కన్నీరు.
అశ్రేష. సం. ఆశ్రేష, ఒక నక్షత్రము.
అశ్లీలము. సం. విణ. పాముఁరోక్తి, సిగ్గును రోఁతను కలిగించుమాట; ఒక కావ్య దోషము.
అశ్లేష. సం. ఆశ్రేష.
అశ్వ. సం. ఆఁడు గుఱ్ఱము.
అశ్వకర్ణకము. సం. ఇనుమద్ది †.
అశ్వఖరజము. సం. కంచరగాడిద.
అశ్వగంధ. సం. పెన్నేరు †.
అశ్వతరము. సం. కంచరగాడిద.
అశ్వత్థము. సం. రావి †.
అశ్వత్థిక. సం. కండ్లరావి †.
అశ్వము. సం. గుఱ్ఱము. [యజ్ఞము.
అశ్వమేధము. సం. క్రతురాజము, ఒక
అశ్వమేధీయము. సం. అశ్వమేధమునకర్హమైన అశ్వము. [ఆశ్వయుజము.
అశ్వయుక్కు. సం. అశ్వినీ నక్షత్రము;
అశ్వయుజము. సం. ఆశ్వయుజము.
అశ్వరక్షుఁడు. సం. అశ్వరక్షకుఁడు.
అశ్వరథము. సం. గుఱ్ఱపుబండి; గుఱ్ఱాలు పూన్చిన తేరు.
అశ్వవ(వా)హుఁడు } సం. గుఱ్ఱపురౌతు,
అశ్వవాహకుఁడు } అశ్వవాహనుఁడు.
అశ్వసేననృపనందనుఁడు. సం. సనత్కుమారుఁడు.
అశ్వారి. సం. మహిషము.
అశ్వారోహుఁడు. } సం. గుఱ్ఱపురౌతు.
అశ్వికుఁడు. }
అశ్విని. సం. అశ్వినీనక్షత్రము.
అశ్వినీసుతులు. } అశ్వినీకుమారులు, దేవ
అశ్వినులు. } వైద్యులు.

అశ్వి (శ్వీ) నము. సం. ఆశ్వయుజము. విణ. గుఱ్ఱముచేత ఒకదినము పోఁదగినదారి.
అశ్వీయము. సం. అశ్వసమూహము. విణ. అశ్వమునకు సంబంధించినది; అశ్వమునకు హితమైనది.
అశ్వులు. సం. బ. అశ్వినులు.
అషడక్షీణము. సం. విణ. ఒరులెఱుఁగని తెఱఁగున ఇద్దఱుమాత్రముచేరి చేసెడి సంభావణము మొ.
అషాఢ. సం. పూర్వాషాఢ; ఉత్తరాషాఢ.
అషాఢము. సం. ఆషాఢము.
అష్టక. సం. శ్రాద్ధవిశేషము.
అష్టకము. సం. అష్టము; ఎనిమిది; ఎనిమిది పద్యములుగల గ్రంథవిశేషము. విణ. ఎనిమిది అవయవములు గలది.
అష్టదిక్కులు. సం. బ. అష్టదిశలు (తూర్పు, అగ్నికోణము, దక్షిణము, నిరృతికోణము, పడమర, వాయుకోణము, ఉత్తరము, ఈశానకోణము).
అష్టదిక్పాలకులు సం. బ. అష్టదిక్పాలురు (ఇంద్రుఁడు, అగ్ని, యముడు, నిరృతి, వరుణుఁడు, వాయువు, కుబేరుఁడు, ఈశానుఁడు).
అష్టదిగ్గజభార్యలు. సం. బ. అభ్రమువు, కపిల పింగళ అనుపమ తామ్రపర్ణి శుభ్ర దంతి అంగన అంజనావతి.
అష్టదిగ్గజములు. సం. బ. ఐరావతము పుండరీకము వామనము కుముదము అంజనము పుష్పదంతము సార్వభౌమము సుప్రతీకము.
అష్టపాత్తు } సం. శరభమృగము; సాలె
అష్టపాదము } పురుగు.
అష్టమంగళము. సం. తెల్లనివైన ముఖము ఱొమ్ము గిట్టలు జూలు తోకయుఁగల గుఱ్ఱము; అష్టవిధమంగళము (సింహము, ఎద్దు, ఏనుఁగు, పూర్ణకలశము, వ్యజనము, వైజయంతి, భేరి, దీపము; బ్రాహ్మణుఁడు, గోవు, అగ్ని, బంగారము, నెయ్యి, సూర్యుఁడు, జలము, రాజు).
అష్టమదములు. సం. బ. అన్న అర్థ(ధన) స్త్రీ విద్యా కుల రూప ఉద్యోగ (అధికార) యౌవనములవల్లని మదములు.
అష్టమము. సం. విణ. ఎనిమిదవది.
అష్టమి. సం. ఎనిమిదవ తిథి.
అష్టమూర్తి. సం. పంచభూతములు సూర్యుఁడు చంద్రుఁడు జీవుఁడు ననెడి యెనిమిది రూపములు గలవాఁడు, శివుఁడు, పరమేశ్వరుఁడు.
అష్టసిద్ధులు. సం. బ. అణిమ మహిమ గరిమ లఘిమ ప్రాప్తి ప్రాకామ్యము ఈశిత్వము వశిత్వము.
అష్టాదశము. సం. పదునెనిమిది. విణ. పదునెనిమిదవది.
అష్టాధ్యాయి. సం. పాణిని ముని రచించిన సంస్కృతవ్యాకరణము.
అష్టాపదము. సం. నెత్తపలక, సొగటాలపాళి; బంగారు; శరభమృగము; వెండికొండ; సాలెపురుగు.
అష్టావక్రము. సం. విణ. ఎనిమిదివంకరలు గలది; అడ్డదిడ్డమైనది.
అష్టావక్రుఁడు. సం. ఒకముని, జనకుని యొక గురువు [భోజనము.
అష్టి. సం. పదునారవ ఛందస్సు;
అష్టోత్తరశతము. సం. స. నూటయెనిమిది.
అష్ఠీవత్తు. సం. మోఁకాలు.
అసంఖ్యము. సం. విణ. లెక్కింప నలవిగానిది, ద్విపరార్ధము మొ.
అసంఖ్యాతము. సం. విణ. పరిమితిలేనిది; అధికసంఖ్య గలది.
అసంఖ్యేయము. సం. విణ. అసంఖ్యము.
అసంగతము. సం. విణ. పొసఁగనిది.
అసంగతి. సం. అర్థాలంకారము.
అసంతుష్టుఁడు. సం. విణ. తృప్తిలేనివాఁడు
అసందర్భము. సం. సందర్భములేమి. విణ. సందర్భములేనిది.
అసంప్రజ్ఞాతసమాధి. సం. జ్ఞాత జ్ఞానము జ్ఞేయము అనెడి త్రిపుటి భాసిల్లని సమాధి, నిర్వికల్ప సమాధి.
అసంబద్ధము. సం. విణ. పొసఁగనిమాట; కూడనిది; పరస్పరసంబంధము లేనిది.
అసంభవము. సం. ఒక దోషము, చెప్పిన లక్షణ లక్ష్యమున లేకుండుట; సంభవింపమి. విణ. సంభవింపనిది; లభింపనిది.
అసంభావన. సం. నిశ్చయ ప్రాయమై

ఉత్కంఠతతోఁ గూడియున్న సంశయము; ఒక మనోదోషము.
అసంయుతము. సం. విణ. సంయమము లేనిది. [నిస్సందేహము.
అసంశయము. సం. సందేహము లేమి. విణ
అసంస్కృతము. సం. విణ. సంస్కారము లేనిది; శాస్త్రాచార్యోపదేశాదుల చేత సంస్కరింపఁబడనిది. [తరభావ.
అసంస్కృతవాక్యము. సం. సంస్కృతే
అసంహతము. సం. విణ. కూడియుండనిది.
అసకృత్తు. సం. అవ్య. పలుమాఱు.
అసక్తము. సం. విణ. సంగము లేనిది.
అసక్తి. సం. సంగము లేమి.
అసడ్డ. అశ్రద్ధ.
అసతి. సం. అంకుటాలు.
అసత్కృతము. సం. విణ. సత్కారము లేనిది
అసత్తు. సం. మూలప్రకృతి; బ్రహ్మము విణ. లేనిది; సాధువు కానిది; అనాత్మ; నిందితము; అశ్రద్ధతో చేసిన హోమదానతపఃకర్మలు.
అసత్యము. సం. బొంకుమాట. విణ. బొంకు; మిథ్యయైనది; సత్తలేనిది, అనాత్మ.
అసదు. విణ. అల్పము, సూక్ష్మము; నికృష్టము. [సాటిలేనిది
అసదృశము. సం. విణ. సమము కానిది;
అసనపర్ణి. సం. సోమిదము †.
అసనము. సం. వేఁగిస †.
అసభ్యము. సం. విణ. సభకు యోగ్యము కానిది. [అసంగతము.
అసమంజసము. సం. విణ. బాగు కానిది;
అసమగ్రము. సం. విణ. పూర్ణము కానిది.
అసమనేత్రుఁడు. సం. ముక్కంటి, శివుఁడు
అసమయము. సం. అకాలము.
అసమర్థత. సం. శక్తిలేమి.
అసమర్థము. సం. ఒక కావ్యదోషము. విణ. శక్తిలేనిది.
అసమవాయి. సం. విణ. సంబంధము లేనిది, మిళితము గానిది; సమవాయ సంబంధము లేని జాతి మొ||; ఒక కారణము.
అసమాప్తము. సం. విణ. ముగియనిది.
అసమీక్ష్యకారి. సం. విణ. ఆలోచింపక పనులు చేయువాఁడు.

అసము. చనవు; కీర్తి; గర్వము; ఉద్రేకవ
అసమ్మతము. సం. విణ. అంగీకరిం బడనిది, ఒప్పుకొననిది.
అసరలు. బ. రాక్షసులు.
అసరవేయు. అ. క్రి. ఆలస్యము చేయు.
అసరసంజ (జె). అరసంజ.
అసరు. అవుపసరు.
అసలారు. అ. క్రి. అతిశయిల్లు.
అసలు. అడుసు, బురద. విణ. ప్రశ తము; ప్రధానము; మూలము. హి. మూలధనము.
అసలుబుట్టువు. తామర, పంకజము.
అసలుకొను. అ. క్రి. బురదయగు.
అసహత. సం. అసహాత్వము.
అసహాత్వము. సం. ఓర్వమి.
అసహనము. సం. ఓర్వమి. విణ. ఓర్వని
అసహనుఁడు. సం. శత్రువు విణ. ఓర్వ వాఁడు. [వాఁడ
అసహమానుఁడు. సం. విణ. ఓర్పులే
అసహాయత. సం. తోడు లేమి
అసహాయశూరుఁడు. సం. విణ. తోడ లేకయే పోరు సలుపఁగల మేటి.
అసహాయుఁడు. సం. విణ. తోడ్పడ వాఁడు; తోడు లేనివాఁడు. [వాఁడు
అసహిష్ణువు(ఁడు). సం. విణ. ఓర్వ
అసహిష్ణుత. సం. ఓర్వలేనితనము
అసహ్యత. సం. అసహనము.
అసహ్యపడు. మి. అ. క్రి. రోఁతపడు.
అసహ్యము. సం. అసూయ, అసహనము ఏవ. విణ. సహింపఁగూడనిది; సహిం నలవిగానిది. వా. రోఁత కలిగించునది ఇష్టము కానిది.
అసహ్యించు. సం. స. క్రి ఏవగించు.
అసాంప్రతము. సం. విణ. అయుక్తము.
అసాదు. అవ్య. బళీ.
అసాధారణము. సం. విణ. విశేషమైనది; అందఱకు సంబంధింపనిది; అసమానము.
అసాధువు. సం. విణ చెడ్డది, సాధువు కానిది; వ్యాకరణ విరుద్ధమైనది.
అసాధ్యము. సం. విణ. అలవిగానిది.
అసారము. సం. విణ. నిస్సారము; నిష్ఫలము; స్థిరాంశము లేనిది.

అసి. విణ. కొంచెము. క్రి. విణ. కొంచెముగా. సం. ఖడ్గము; కాశికి సంబంధించిన ఒకనది.
అసిఁబోవు. అ. క్రి. తప్పిపోవు.
అసికోఁత. చిన్నకోఁత.
అసిక్ని. సం. యువతియగు అంతఃపుర పరిచారిక; ఒకనది.
అసితము. సం. నలుపు. విణ. నల్లనిది.
అసితుఁడు సం. శని.
అసిద్ధము. సం. విణ. పండనిది; వండనిది.
అసిధారావ్రతము. సం. కత్తియంచుపై నడచుటవలె దుష్కరమైన నియమము.
అసిధావకుఁడు. సం. కత్తులు సానపెట్టువాఁడు.
అసిధేను—వు. సం. చూరకత్తి.
అసిపత్రవనము. సం. ఒక నరకము
అసిపత్త్రవ్రతము. సం. విణ. అసిధారావ్రతము.
అసిపుత్రి. విణ. చూరకత్తి.
అసిమి. గోనెసంచి.
అసిమిగొల్లెన. గోనెసంచులలో ఇరుప్రక్కల వంపుగా నేర్పఱచిన చిన్నగుడారము.
అసియాడు. అ. క్రి. చలించు.
అసియార్చు. స. క్రి. చలించునట్లుచేయు.
అసిరమ్మ. ఒక గ్రామదేవత.
అసిలేరు. ఆశ్లేష.
అసివారు. సవారిమార్గము.
అసివాటు. వివారము. [నశించు.
అసిపోవు. అ. క్రి. పోవు; తప్పిపోవు;
అసిహేతి. సం. ఖడ్గకత్తి ఆయుధముగాఁ గలవాఁడు.
అసుక్షణము. సం. తిరస్కారము.
అసుఖము. సం. విణ. సుఖముకానిది; సుఖములేనిది.
అసుధారణము. సం. జీవనము.
అసురాహ్వయము. సం. కంచు.
అసురుఁడు. సం. దానవుఁడు.
అసురుసురు. శ్రమమునందగు ధ్వన్యనుకరణము.
అసుర్క్షణము. సం. అవమానము.
అసువులు. సం. బ. ఉసురులు, ప్రాణములు.

అసుహృత్తు. సం. విణ. శత్రువు; ప్రాణములు హరించునది.
అసూక్షణము. సం. అవమానము.
అసూయ. సం. ఇడుగడ, గుణములున్నను దోషములు నారోపించుట; అవమానము.
అసూర్క్షణము. సం. అవమానము.
అసూర్యంపశ్య. సం. ఎండ కన్నెఱుఁగని స్త్రీ, రాజపత్ని మొ.
అసృక్కు. సం. నెత్తురు.
అసృగ్ధర. సం. చర్మము.
అసేచనకము. సం విణ. ఎంతచూచినను తనివితీఱని దృశ్యము. [జాఱనిది.
అస్ఖలితము. సం. విణ. అప్రమత్తము;
అస్ఖలితుఁడు. సం. విణ. కర్తవ్యమున ఏమఱుపాటు లేనివాడు. [వాఁడు.
అస్తంగతుఁడు. సం. విణ. అస్తమించిన
అస్తమన (య) ము. సం. అస్తమించుట.
అస్తమానము. సం. అస్తమించుట; ప్రొద్దుగ్రుంకుట. [బడక పోవు; మరణించు.
అస్తమించు. సం. అ. క్రి. అడఁగు; కనఁ
అస్తమితము. సం. విణ అస్తమించినది.
అస్తము. సం. పడమటికొండ; మృత్యువు; కనఁబడకపోవుట; ప్రొద్దుగ్రుంకుట విణ. ముగిసినది.
అస్తరు. ఒకగుడ్డకాశ్రయముగా లోప్రక్క జేర్చి కుట్టెడు మఱియొక గుడ్డ.
అస్తవ్యస్తము. విణ. తాఱుమాఱైనది, వ్యత్యస్తము.
అస్తాచలము } పడమటికొండ, సూర్యుఁ
అస్తాద్రి } డస్తమించుకొండ.
అస్తిక్షీర. సం. ఎక్కువ పాలుగల ఆవు మొ.
అస్తిత } సం. ఉండుట, ఉనికి, సత్త;
అస్తిత్వము } నిలుచుట.
అస్తినాస్తిత. సం. అస్తినాస్తిత్వము, ఉండుట లేకుండుట, సందిగ్ధమైన యునికి.
అస్తిమంతుఁడు. సం. విణ. ఆస్తిగల వాఁడు; ఉనికిగలవాఁడు.
అస్తుంకారము. సం. అంగీకారము.
అస్తేయము. సం. దొంగిలింపమి.
అస్త్రము. సం. బాణము మొ॥ ఆయుధము; ఖడ్గము; విల్లు; యజ్ఞములలో ప్రరో

గింపఁదగిన ఒక మంత్రము; ఆగ్నేయా స్త్రము వెం.
అస్థి. సం. ఎముక.
అస్థిపంజరము. సం. ఎముకలగూడు.
అస్థిరము. సం. విణ. స్థిరముకానిది.
అస్థివిగ్రహుఁడు. సం. భృంగీశ్వరుఁడు, శివానుచరవిశేషము.
అస్థిహారుఁడు. సం. శివుఁడు.
అస్పర్శము. సం. విణ. స్పర్శగుణము లేనిది; స్పర్శకానిది; స్పర్శలేనిది (ఆత్మ బ్రహ్మము).
అస్పర్శయోగము. సం. ఎన్నడును దేని తోను సంబంధములేని జ్ఞానము, విషయ భానములేని నిర్వికల్పకజ్ఞానము, కేవల జ్ఞానము. [మలము మాత్రము వెం.
అస్పృశ్యము. సం. విణ. అంటరానిది,
అస్పృశ్యుఁడు. సం. విణ. అభిశస్తుఁడు పతితుఁడు వెం. [గుణము.
అస్పృహ. సం. ఆశలేమి, ఒక ఆత్మ
అస్మదీయము. సం. విణ. మనది; మాది.
అస్మిత. సం. నేను నాది యనెడి అభి మానము, దృగ్దృశ్యములతాదాత్మ్యము, హృదయగ్రంథి. [తుఁడు.
అస్రపుఁడు. సం. రాక్షసుఁడు; నైరృ
అస్రము. సం. కన్నీరు; నెత్తురు; మూల, కోణము; వెండ్రుక.
అస్రువు. కన్నీరు.
అస్వచ్ఛందము. సం. విణ. పరాధీనము.
అస్వప్నము. సం. విణ. నిద్రలేనిది, ఆత్మ, బ్రహ్మము.
అస్వప్నుఁడు. సం. వేలుపు, దేవుఁడు.
అస్వరుఁడు. సం. విణ. చెవులకింపుగాని కంఠధ్వని గలవాఁడు.
అస్వస్థత సం. అస్వాస్థ్యము.
అస్వస్థుఁడు. సం. విణ. స్వస్థతలేనివాఁడు.
అస్వాతంత్ర్యము. సం. పరాధీనత.
అస్వాధ్యాయుఁడు. సం. విణ వేదాధ్యయ నము లేనివాఁడు.
అస్వాస్థ్యము. సం. అనారోగ్యము, స్వస్థత లేమి; స్వస్థితిలేమి.
అహఃకరుఁడు, అహఃపతి } సం సూర్యుఁడు.

అహంకరణము. సం. అహంకారము; అహంకరించుట. [గర్వించు.
అహంకరించు. సం.అ క్రి. అభిమానించు;
అహంకారము. సం. అహం (నేననెడి) వృత్తి; అంతఃకరణచతుష్టయములో నొకటి; చిదాభాసము, జీవుఁడు; అనా త్మయందాత్మాభిమానము; [గర్వము.
అహంకారించు. సం. అ.క్రి. అహంకరించు.
అహంకారి. సం. విణ. అహంకారము గలవాఁడు.
అహంకృతి, అహంక్రియ } సం. అహంకారము, గర్వము.
అహంత. సం. అహంభావము.
అహంపదార్థము. సం. నేననెడి పదము నకు అర్థమైనది; ప్రత్యగాత్మ; దేహాభి మానియగు జీవుఁడు.
అహంపూర్విక. సం. నేనుముందు నేనుముం దనియోధులు ఒకరి నొకరు మీఱుట.
అహంబుద్ధి. సం. నేననెడిబుద్ధి, అహంమతి
అహంభావము. సం. నేననుట; అహంకా రము.
అహంమతి. సం. అహంబుద్ధి, అజ్ఞానము.
అహంయువు. సం. విణ. అహంకారము గలవాఁడు.
అహతము. సం. క్రొత్తబట్ట.
అహమహమిక. సం. వీరావేశము, నేను శ్రేష్ఠుఁడను నేను శ్రేష్ఠుఁడననుట; నేను ముందు నేను ముందనుట.
అహమించు. సం.అ.క్రి. అహంకరించుట.
అహమిక. సం. అహంకారము.
అహము. సం. ఆము, అహంకారము; పగలు; దినము; అహరభిమానిదేవత.
అహరహము, అహర్దివము } సం. అవ్య. ప్రతిదినము.
అహర్నిశము. సం. అహోరాత్రము.
అహర్పతి. సం. సూర్యుఁడు.
అహర్ముఖము. సం ప్రాతఃకాలము.
అహల్య. సం. ఒక అప్సరస; గౌతము పత్ని; దున్నుటకు తగని నేల.
అహస్కరుఁడు. సం. సూర్యుఁడు.
అహస్సు. సం. పగలు, దినము.

అహహ } అవ్య. ఔ॰రా. సం. అవ్య.
అహహో } అద్భుతము; క్లేశము; ఖేదము; అతిశయము; సంబోధనము.
అహో
అహోరె } అవ్య. ఔ॰రా.
అహోరే
అహోత్యము. సం. కొండ.
అహి. సం. పాము; వృత్రాసురుఁడు.
అహింస. సం. త్రికరణములచే ఏ ప్రాణికిని అపకారము చేయకుండుట; యజ్ఞమునకంటె అన్యత్ర ప్రాణిహింస చేయమి; దైవీసంపదలో నొకటి.
అహితము. సం. చెరుపు.
అహితుండికుఁడు. సం. పాములవాఁడు.
అహితుఁడు. సం. శత్రువు.
అహిఫేనము. సం. నల్లమందు.
అహిబ్రధ్నుఁడు. సం. శివుఁడు.
అహిభయము. సం. రాజులకు స్వపక్షము వారివలనఁ గలిగెడి భయము.
అహిభుక్కు. సం. నెమిలి; గరుత్మంతుడు; ముంగిస.
అహిభూషణుఁడు. సం. శివుఁడు.
అహిర్బుధ్న్యుఁడు. సం. శివుఁడు.
అహిహ. సం. ఇంద్రుఁడు. రూ. అహిహుఁడు
అహేరువు. సం. పిల్లపీఁచర †.
అహేతుకము. సం. అహైతుకము.
అహైతుకము. సం. విణ. హేతువులేకుండఁగవచ్చినది; ఉపపత్తి (యుక్తి) లేనిది; వేఱుఉద్దేశ్యముగాని ఆసక్తిగాని లేక చేయఁబడినది (నిష్కామకర్మ).
అహో. సం. అవ్య. అహహా.
అహోబలము. సం. ఒక నృసింహక్షేత్రము
అహోరాత్రము. సం. రేపగలు, పగలును రాత్రియును; ముప్పదిముహూర్తముల కాలము. [ఎల్లప్పుడు.
అహోరాత్రి. సం. పగలును రేయియు,
అహోరాత్రులు. సం. అహోరాత్రము.
అళఁది. పసుపు. పసుపువన్నె విణ. పసుపు వన్నె గలది. [చేసెడి కాయ.
అళఁదికాయ. వస్త్రమును పీతవర్ణము
అళఁదియాకు. వస్త్రమును పీతవర్ణము చేసెడియాకు.
అళఘారతి. ఆరాత్రిక విశేషము.
అళము. ఉప్పుపంట పెట్టెడి యేఁబది పాదులకొలఁది నేల; ఉప్పుమ్మెడిచోటు.
అళాకు. పడిలో ఎనిమిదవ వంతు.
అళి. సం. తుమ్మెద; తేలు.
అళిందము. సం. చోపా; నడవగది, వాకిటిముందఱనుండెడి చావడి; మొగసాల, వాకిటిముందఱనుండెడిప్రదేశము.
అళీకము. సం. విణ. అప్రియము; మిథ్య; అబద్ధము.
అళుకరి. విణ. భయపడువాఁడు.
అళుకు. భయము. అ. క్రి. భయముఁ జెందు, జడియు.

---

# ఆ

ఆ. సంబోధనము; తచ్ఛబ్దార్థకము (ఆ తల్లి, ఆ కొడుకు అని); వికల్పార్థకము (వాఁడా, వీఁడా అని); ప్రార్థనార్థకము (రక్షింపుమా అని); భూతార్థప్రశ్నము (తెలిసితివా అని); పూర్వము చెప్పఁబడినది; దూరముగానుండి గోచరమగునది; ఏని, ఎడల; అన్ననో; ఐనను; ప్రశంస; పూర్వస్మృతి; ఆక్షేపము; వ్యతిరేకము; కోపము; సంతసము; ప్రసిద్ధి; భావము; పరితాపము; సంశయము; పరోక్షార్థకము; ఉద్దిష్టార్థకము. అవ్య. అంగీకారము; ఆశ్చర్యము; అదలించుట; నిషేధము; జ్ఞప్తి. సం. ఉప. మొదలుకొని; వఱకు; ఇంచుక; అంతట; మిక్కిలి; వ్యతిరేకము.
ఆంక. ఆఁక.
ఆంక్ష. వెలివేయుట.

ఆంగికము. సం. భావమును సూచించు భ్రూవిక్షేపాది చేష్టావిశేషము.
ఆంగిరస. సం. అంగిరస్సంవత్సరము.
ఆంగిరసము. సం. పుష్యమి.
ఆంగిరసుఁడు. సం. బృహస్పతి.
ఆంగ్లో ఇం. ఇంగ్లీషుసంబంధమైనది.
ఆంజనేయుఁడు. సం. అంజనాదేవి పుత్రుఁడు, హనుమంతుఁడు.
ఆండారి. ఏలిక, ప్రభువు.
ఆండ్రు. బ. ఆలుశబ్ద బహువచనము; భార్యలు.
ఆంతరము. సం. విణ. నడుమ (లోపల) [నుండునది.
ఆంతరంగికము. సం. విణ. అంతరంగ సంబంధి.
ఆంతర్యము. సం. లోపలనునికి, అంతర్వర్తిత్వము; తలఁపు?
ఆంత్రము. సం. ప్రేగు. విణ. అంత్ర (ప్రేగు) [సంబంధి.
ఆందోళకము. సం. విణ. ఊఁచునది; వడకించునది.
ఆందోళన. సం. ఆందోళనము.
ఆందోళనము. సం. ఊయెల; అందలము; కదలిక; ఊఁగుట; ఊఁచు (పు) ట; కదల్చుట; చింత.
ఆందోళము. సం. అందలము; ఊఁగుట; సంశయము.
ఆందోళి. సం. ఒక స్త్రీ రాగము.
ఆందోళించు. సం. అ. క్రి. ఊఁగు: చలించు.
ఆందోళిక. సం. అందలము.
ఆందోళితము. సం. విణ. ఊఁచఁబడినది; కదల్పఁబడినది.
ఆంధసికుఁడు. సం. వంటవాఁడు.
ఆంధ్యము. సం. గ్రుడ్డితనము; మదముచే కన్నులు కానరాకుండుట.
ఆంధ్రదేశము. సం. ౫౬ దేశములలో నొకటి
ఆంధ్రభాష. సం. తెలుఁగుబాస.
ఆంధ్రము. సం. తెనుఁ(లుఁ)గు దేశము; తెనుఁగు.
ఆంధ్రి. సం. తెలుఁగు భాష; ఆంధ్ర [జాతి స్త్రీ.
ఆంధ్రించు. సం. స. క్రి. ఆంధ్రీకరించు, తెనుఁగుసేయు.
ఆంధ్రుఁడు. సం. తెలుఁగువాఁడు.
ఆంబికేయుఁడు. సం. ధృతరాష్ట్రుఁడు; కుమారస్వామి.
ఆఁక. అడ్డగింత; చెఱసాల; నిషేధము; ఆజ్ఞ; కట్టుపాటు; చెలియలికట్ట.
ఆఁకగొను. అ. క్రి. ఆఁగు.
ఆఁకట్టు. స. క్రి. అడ్డగించు; ఆక్రమించు.
ఆఁకత్రాళ్లు. బ. తరిగంబమునఁ గట్టెడిత్రాళ్లు
ఆఁకపడు. స. క్రి. అడ్డపడు.
ఆఁకపెట్టు. స. క్రి. అడ్డగించు.
ఆఁకరము. ఆగ్రహము; అము, మదము.
ఆఁకలి. క్షుత్తు.
ఆఁకలింపు. స్తోత్రము.
ఆఁకించు } స. క్రి. నిరోధించు.
ఆఁకిడు }
ఆఁకొను. అ. క్రి. ఆఁకలిగొను.
ఆఁగాఁకర. అడవికాఁకర, పానసి†.
ఆఁగు. అ. క్రి. అణఁగు; విరమించు; సైఁచు. స. క్రి. అడ్డగించు; నిలుపు; నిగ్రహించు; ఆక్రమించు; పోఁగొట్టు; నిషేధించు; మోచు; కాపాడు; సహించు.
ఆఁచికొను. స. క్రి. అపహరించు.
ఆఁచికోలు. అపహరించుట.
ఆఁచు. స. క్రి. అణఁగించు; ఆఁపు, నిలుపు.
ఆఁటది. ఆఁడది.
ఆఁటు. ఆఁడుతనము. అ. క్రి. చాలు; తాళు.
ఆఁడంగి. కొజ్జా స్త్రీస్వభావముగలవాఁడు
ఆఁడంగులు. బ. స్త్రీలు.
ఆఁడది. స్త్రీ.
ఆఁడి. ఒక స్త్రీ ప్రత్యయము.
ఆఁడు. ఒక పుం ప్రత్యయము; ఆఁడుతనము; స్త్రీ జాతి.
ఆఁడుఁగట్టు. ఆఁడుదాని కోకకట్టువంటి [కట్టు.
ఆఁడుగూఁతురు. స్త్రీ.
ఆఁడుగూచి. గయ్యాళి.
ఆఁడుగొల. స్త్రీహత్య.
ఆఁడుఁదనము. స్త్రీత్వము.
ఆఁడుఁదోడు. సోదరి; స్త్రీసాహాయ్యము.
ఆఁడుఁబడుచు. కూఁతురు; మగనిసోదరి.
ఆఁడుఁబాప. కన్యక.
ఆఁడుఁబుట్టువు. ఆఁడుది; స్త్రీజన్మ.
ఆఁడుగుఱి. యోని.
ఆఁడుది. స్త్రీ.

ఆఁడుదొంగ. దొంగయైన ఆఁడుది.
ఆఁడుపిల్ల. ఆఁడుశిశువు.
ఆఁడుబిడ్డ. ఆఁడుశిశువు; కూఁతురు; మగనిసోదరి, ననాంద.
ఆఁడుబీఱ. ఆఁడుజాతిబీఱ†.
ఆఁడుమొత్తము. స్త్రీసమూహము.
ఆఁదోఁక. ఆవుతోఁకనుబోలిన యాకారము. [తోఁకవలెనగుట.
ఆఁదోఁకపాటు. ఆఁదోఁకపడుట, ఆవు
ఆఁపు. అడ్డగింత. స. క్రి. ఆఁగఁజేయు.
ఆఁపువెట్టు. స. క్రి. ఒకరికని నిలిపిపెట్టు.
ఆఁపుసేయు స. క్రి. నిలుపచేయు.
ఆఁబడ్డ. పాలువిడిచిన ఆవుపెయ్య.
ఆఁబసి. ఆవు.
ఆఁబెయ్య. ఆవుపెయ్య.
ఆఁబెఱుఁగు. ఆవుపెఱుఁగు.
ఆఁబేయ. ఆవుపెయ్య.
ఆఁబోతు. ఎద్దు; అచ్చువేసి స్వేచ్ఛగా తిరుగవిడిచిన ఎద్దు. [ఁడు.
ఆఁబోతురౌతు. శివుఁడు, వృషభవాహను
ఆఁబోతుసారము. ఋషభము, ఒకస్వరము.
ఆకంఠము. సం. అవ్య. కంఠమువఱకు.
ఆకంపించు. సం. అ. క్రి. ఇంచుక (మిక్కిలి) కదలు (వణఁకు).
ఆకంపితము. సం. విణ. ఇంచుక (మిక్కిలి) కదల్పఁబడినది.
ఆకట. అవ్య. అక్కట.
ఆకడ. అవ్య. అక్కడ.
ఆకతాయి. విణ. దుష్టుఁడు
ఆకరణి. ఆ విధము. [పుట్టుచోటు.
ఆకరము. సం. గని; సమూహము; చోటు;
ఆకరి. కిరాతవిశేషము.
ఆకరికుఁడు. సం. విణ. గనులపైఅధికారి.
ఆకర్ణనము. సం. వినికి, వినుట.
ఆకర్ణాంతము. సం. విణ. చెవులవఱకు వ్యాపించినది; చెవి చివరను పొందినది.
ఆకర్ణించు. సం. స. క్రి. విను.
ఆకర్ణితము. సం. విణ. వినఁబడినది.
ఆకర్షకము. సం. సూదంటుఱాయి. విణ. ఆకర్షించునది.
ఆకర్షణము. సం. ఆకర్షిచుట.
ఆకర్షణి. సం. దోఁటి.

ఆకర్షము. సం. ఆకర్షించుట; జూదము; నెత్తపలక, సొగటాల పాచిక; నేత్రాదీంద్రియము; ధనుర్విద్యాభ్యాసము. విణ. ఆకర్షించునది.
ఆకర్షి. సం. విణ. ఆకర్షించునది.
ఆకర్షించు. సం. స. క్రి. లాగు; రప్పించు; వశపఱచు.
ఆకర్షితము. సం. విణ. ఆకర్షింపఁబడినది.
ఆకలనము. సం. ఆకళింత; గణించుట; ఎన్నిక; కోరిక; కూర్పు; ధ్యానము; బంధనము; సమూహము.
ఆకల్పము. సం. భూషణము; వేషము, వస్త్రాద్యలంకరణము; కల్పనము. అవ్య. కల్పమువఱకు. విణ. కల్పమువఱకుండునది
ఆకసము. ఆకాశము. [గలిగినది.
ఆకస్మికము. సం. విణ. అకస్మాత్తుగాఁ
ఆకళించు. స. క్రి. అవగాహనచెసికొను; కలిగించు, చేయు.
ఆకళింత (పు). అవగాహనము.
ఆకాంక్ష. సం. కోరిక; అన్వయముకొఱకై ఒక పదము మఱొక పదమునుకోరుట.
ఆకాంక్షించు. సం. స. క్రి. కోరు.
ఆకారణము. సం. పిలుపు; పిలుచుట.
ఆకారము. సం. స్వరూపము; అభిప్రాయమును సూచించెడి చేష్ట, ఇంగితము.
ఆకారితము. సం. విణ. పిలువఁబడినది; ఆకారముగలదిగా చేయఁబడినది.
ఆకాశగరిగ. సం. మిన్నేఱు.
ఆకాశతామర. మి. అంతరదామర†.
ఆకాశదీపము. సం. కార్తికమాసదీపము.
ఆకాశపురాణము. సం. ఏయాధారములేని మాటలప్రోగు.
ఆకాశబాణము. సం. తారాచువ్వ.
ఆకాశము. సం. మిన్ను; ఆకాశతన్మాత్ర; అభ్రకము; పరబ్రహ్మము; సున్న; దశమస్థానము. [గమనము.
ఆకాశయానము. సం. విమానము; ఆకాశ
ఆకాశరాముఁడు. ఊరు పేరు లేనివాఁడు.
ఆకాశవల్లి. సం. అంతరదామర; ఒకబదనిక†
ఆకాశవాణి. సం. మింటిపలుకు; అశరీర (దేవాదుల) వాక్కు; రేడియోశబ్దము.

ఆకిడు. స. క్రి. చీటినిచ్చు; ఆజ్ఞా పత్ర మునిచ్చు.
ఆకీర్ణము. సం. విణ. వెదచల్లఁబడినది; ఎడములేక నిండియున్నటువంటిది.
ఆకు. వృక్షాదులపర్ణము; శాకవిశేషము; తములపాకు; తాటాకు; విస్తరాకు; చెవి కమ్మ; ఇచ్చిపుచ్చుకోలుపత్రము; గ్రంథ పత్రము; ఆజ్ఞాపత్రము; అయప్పత్రము; చీటి; జాబు; బండికంటియాకు; తలు పుల కమర్చెడి యాకు; నాటు.
అకుంచనము. సం. ముఁడుగుఁటు; ముడు చుట; వంగుట; వంచుట.
ఆకుంచితము. సం.విణ. ముడువఁబడినది; వరింపఁబడినది.
ఆకుకూర. పత్రశాకము,తోఁటకూర మెుం
ఆకుచిఱుత. ఒక చిరుతపులి.
అకుచిలుక. ఒక రెక్కలపురుగు.
ఆకుచుట్ట. ఆకుబట్ట.
ఆకుచెప్పు. పలుచని అట్టగల చెప్పు.
ఆకుజెముడు. పత్రస్నుహి†.
ఆకుజెల్ల. ఒక చేఁప.
ఆకుటిల్లు (క్రు.). గుడిసె, పర్ణశాల.
ఆకుతేలు. తేలువంటి ఒకపురుగు.
ఆకుపచ్చ. ఆకుపచ్చన, పాలాశవర్ణము. విణ. ఆకుపచ్చనిది, హారిద్వర్ణము.
ఆకుపచ్చన. హారిద్వర్ణము.
ఆకుపత్రి. ఒక చెట్టు.
ఆకుపాఁచి. ఒకదినుసుపాఁచి.
ఆకుపీకె. బాలక్రీడావిశేషము. [పురుగు.
ఆకుపురుగు. ఆకులయందుండెడి ఒకపచ్చ
ఆకుపోయు. స.క్రి. నాటుపోయు.
ఆకుప్పు. ఆకులచే పక్వముగావింపఁబడిన ఒక ఉప్పు.
ఆకుబట్ట. పర్ణస్తబకము.
ఆకుమడుపు. తములపాకుల చుట్ట.
ఆకుమిడుత. ఆకుపచ్చని మిడుత.
ఆకురా(ఆ)యి. ఇనుము మొదలగువానిని కోసెడి శిల్పిసాధనము, పత్రపరశువు.
అకులత. సం. వ్యాకులత.
ఆకులపడు. అ.క్రి. ఆకులతనొందు, చెదరు
ఆకులపాటు. వి. ఆకులపడుట. [లము.
ఆకులము. సం. విణ, చెదరినది, వ్యాకు
ఆకులితము. సం.విణ. ఆకులపడినది.
ఆకుల్యము. సం. ఆకులత; నేలతంగేడు†?
ఆకునంపెంగ. చంపక విశేషము†.
ఆకునన్నములు. ఒక ధాన్యము.
ఆకూతము. } సం. అభిప్రాయము.
ఆకూతి. }
ఆకృతి. సం. ఆకారము; ఒక ఛందస్సు; దేహము; సామాన్యము, జాతి.
ఆకృష్టము. సం.విణ. ఆకర్షింపఁబడినది.
ఆకృష్టి. సం. ఆకర్షణము.
ఆకె. స. ఆమె, ఆ స్త్రీ.
ఆకొత్తు. అడకొత్తు.
ఆక్టు. ఇం. ఏక్టు, చట్టము.
ఆక్రందనము. సం. పిలుపు; మొఱ; ఏడుపు, ధ్వనియుక్తరోదనము.
ఆక్రందము. సం. ధ్వని; ఘోరయుద్ధము; ఏడ్చుచోటు; ఆక్రందనము.
ఆక్రందించు. సం.అ.క్రి బొబ్బలు పెట్టు, ధ్వనియుక్తగా ఏడ్చు; మొఱపెట్టు. స.క్రి. పిలుచు. [పిలువఁబడినది.
ఆక్రందితము. సం. ఏడుపు;అఱపు; విణ.
ఆక్రందుఁడు సం.రక్షకుఁడు; సోదరుఁడు; మిత్రుఁడు.
ఆక్రమణము. } సం. ఆక్రమించుట.
ఆక్రమము. }
ఆక్రమించు సం.స.క్రి.అటుము;మార్కొను; ఆవేశించు; ఆవరించు; ఓడించు, లోఁ జేసికొను.
ఆక్రాంతము.సం.విణ. ఆక్రమింపఁబడినది
ఆక్రాంతి. సం. ఆక్రమణము.
ఆక్రీడము. సం. ఉద్యానవనము. [నది.
ఆక్రుష్టము. సం.కఠినోక్తి.విణ. తిట్టఁబడి
ఆక్రోడము. సం. రెండు భుజములనడిమి చోటు.
ఆక్రోశనము. } సం. బొబ్బ; తిట్టు;
ఆక్రోశము. } శాపము; అపవాదము.
ఆక్రోశించు. సం.స.క్రి.నిందించు;శపించు; బొబ్బలుపెట్టు.
అకారణ-ము. సం. బూతు, అంకుతిట్టు; మైథునమునుగుఱించిన నింద.

అఖారితుఁడు. సం.విణ. పరస్త్రీగమనాది దోషములచే దూఱఁబడినవాఁడు.
అకికుఁడు. సం. ద్యూతకారుఁడు.
అక్షిప్తము. సం.విణ. ఆక్షేపింపఁబడినది; త్రోసివేయఁబడినది.
అక్షీబము. సం. మునుగ†.
అక్షేపకుఁడు. సం. బోయవాఁడు. విణ ఆక్షేపించువాఁడు.
అక్షేపణము. సం. ఆక్షేపము.
అక్షేపము. సం. లాగుట; అదల్చుట; నింద; తిరస్కారవచనము; పూర్వపక్షము; ఒక యలంకారము.
అక్షేపి. సం.విణ. ఆకర్షించువాఁడు; సూక్ష్మదృష్టితో పర్యాలోచించువాఁడు.
అక్షేపించు. సం. స.క్రి. ఆక్షేపము చేయు.
అక్షోటము. సం. కొండగోఁగు†.
అఖండలుఁడు. సం. ఇంద్రుఁడు.
అఖనికము. సం. పంది; ఎలుక.
అఖనికుఁడు. సం. కన్నపుదొంగ.
అఖరు. హిం. చివర, అంత్యము.
అఖుక(ప)ర్ణి. సం. ఎలుకచెవి†.
అఖుభుక్కు } సం. పిల్లి.
అఖుభుజము }
అఖువాహుఁడు. సం. వినాయకుఁడు.
అఖువు. సం. ఎలుక; పంది.
అఖేటకుఁడు. సం. వేఁటకాఁడు.
అఖేటము. సం. వేఁట.
అఖేటికము. సం. వేఁటకుక్క.
అఖోటము. సం. కొండగోఁగు†.
అఖ్య. సం. పేరు.
అఖ్యాత. సం. విణ. చెప్పెడివాఁడు.
అఖ్యాతము. సం. విణ. చెప్పఁబడినది.
అఖ్యానకము. సం. ఉపాఖ్యానము.
అఖ్యానము. సం. చెప్పుట; బదులు చెప్పుట; కథ; పూర్వచరిత్రము చెప్పుట; భారతము రామాయణము మొ. [దూత.
అఖ్యాయకుఁడు. సం.విణ. చెప్పువాఁడు;
అఖ్యాయిక. సం. వాస్తవవిషయములుగల హర్షచరిత్రాది గ్రంథవిశేషము.
అఖ్యేయము. సం. విణ. చెప్పఁదగినది.
అగంత. సం.విణ. వచ్చెడివాఁడు.
అగంతవ్యము. సం.విణ. రాఁదగినది.
అగంతుకము } సం.విణ. ఆకస్మికముగా వచ్చునది; వచ్చు స్వభావము గలది.
అగంతువు }
అగంతుకుఁడు. సం. అతిథి. [వాఁడు.
అగడకాఁడు. విణ. అకార్యము చేయు
అగడపలు. బ. దొంతిగా నేర్పడిన మేఘపంక్తి.
అగడము. కొంటెపని, చెడ్డపని; దుష్కార్యచిహ్నము; చెడ్డతనము; మోసము; అవమానము; అన్యాయ్యము; ఈ తొప్తము. విణ. మోసకాఁడు; అపరాధి. వా. అపహాస్యము.
అగడించు. స. క్రి. ధిక్కరించు.
అగడీఁడు. విణ. అగడకాఁడు.
అగతము. సం. వచ్చుట; లభించుట. విణ. వచ్చినది; లభించినది.
అగతి. సం. వచ్చుట; లభించుట.
అగతుఁడు. సం. విణ. వచ్చినవాఁడు.
అగమనము. సం. రాక, వచ్చుట; లభించుట
అగమము. రాకడ; రాబడి; ప్రాప్తి; శాస్త్రము; శల్పాద్యాగమము.
అగమాపాయి. సం.విణ. రాకపోకలుగలది
అగమించు. సం. అ. క్రి. వచ్చు.
అగము(స్సు) సం. అపరాధము; పాపము.
అగరా. ఆగ్రాపట్టణము.
అగాడి. తేలికైన ధాన్యము.
అగాత్యము. వా. కొంచెమును గొప్పగా చేసి కావించెడు అలుకు ఏడుపు మొ.
అగామి. సం.విణ. రానున్నది, భవిష్యత్తు.
అగాయిత్యము. ఆగాత్యము.
అగారము. సం. గృహము.
అగుబ్బతిలు. అ.క్రి. పెచ్చు పెరుగు.
అగుబ్బు. అతిశయము. విణ. అధికము; అసంఖ్యము.
అగుబ్బుకొను } అ.క్రి. అతిశయించు.
అగుబ్బులురేఁగు }
అగువు. సం. అంగీకారము.
అగ్నీధ్రము. సం. హోతయుండుస్థానము
అగ్నీధ్రుఁడు. సం. యజమానుఁడు; ఒక ఋత్విక్కు.
అగ్నేయము. సం. ఆగ్నేయ వ్రతము; ఆగ్నేయాస్త్రము; ఆగ్నేయ శ్రాద్ధము;

ఆగ్నిపురాణము. విణ. అగ్నికి సంబంధించినది. [మూల.
ఆగ్నేయి. సం. ఆగ్నేయ దిక్కు, అగ్ని-
ఆగ్నేయుఁడు. సం. కుమారస్వామి.
ఆగ్రయణము. సం. నవసస్యేష్టి.
ఆగ్రహము. కోపము. సం. అభినివేశము; తొందర; ఆవేశము; ఆసక్తి.
ఆగ్రహాయణము. సం. మార్గశీర్షము.
ఆగ్రహాయణి. సం. మార్గశీర్ష పూర్ణిమ.
ఆగ్రహాయణికము. సం. మార్గశీర్షము.
ఆగ్రహారికుఁడు. సం. తిలాదిదానములుబట్టెడి పతిత బ్రాహ్మణుఁడు. [హము చేయు.
ఆగ్రహించు. కోపించు; సం. స. క్రి. ఆగ్ర
ఆఘాటము. సం. హద్దు, మేర.
ఆఘాతము. సం. దెబ్బ; వధ; వధస్థానము.
ఆఘాతించు. సం. స. క్రి. కొట్టు; చంపు.
ఆఘారము. సం. ఒక హోమము; ఒక వైదికకర్మ; నేయి; నేతితోఁదడుపుట.
ఆఘోషము. సం. ప్రకటించుట; చాటుట.
ఆఘోషించు. సం. స. క్రి. చాటు; ప్రకటించు. [చున్నది.
ఆఘోష్యమాణము. సం. విణ. చాటఁబడు
ఆఘ్రాణము. సం. ఆఘ్రాణించుట; తృప్తి
ఆఘ్రాణించు. సం. స. క్రి. వాసనచూచు.
ఆఘ్రాతము. సం. వాసన చూడఁబడినది.
ఆచంద్రతారకము. సం. అవ్య. చంద్రుఁడును నక్షత్రములును ఉండువఱకు.
ఆచంద్రార్కము. సం. అవ్య. సూర్యచంద్రులున్నంతవఱకు.
ఆచమనము. సం. ఆచమించుట, సంధ్యాదికాలములయందు చూపుడువ్రేలు పైకి విడిచి నడిమి వ్రేలి మొదటికి బొట్టనవ్రేలిచివర చేర్చిపట్టి పుడిసిటితో జలము గ్రహించి మంత్రపూర్వకముగా ముమ్మాఱు ఉదకమును లోపలికి పుచ్చుకొనుట ; ఆచమనార్థమైన జలము; ఉపచారవిశేషము. [వార్చు.
ఆచమించు. సం. స. క్రి. ఆచమనముచేయు;
ఆచరణము. సం. స. క్రి. ఆచరించుట; ఆచారము. [ఆచరింపఁదగినది.
ఆచరణీయము. సం. విణ. ఆచరితవ్యము,
ఆచరించు. సం. స. క్రి. చేయు, నడపు, అనుష్ఠించు. [రింపఁబడినది.
ఆచరితము. సం. ఆచారము. విణ. ఆచ
ఆచాంతము. సం. విణ. ఆచమింపఁబడినది.
ఆచామము. సం. ఆచమనము; గంజి.
ఆచారదీపము. సం. రాజాదులకు మంగళార్థము నివాళిపట్టెడి దీపము.
ఆచారము. సం. మన్వాదులు విధించిన స్నానము ఆచమనము లోనగు వ్యవహారము; శీలము, మంచినడత; ఆచరించుట.
ఆచారలాజలు. సం. బ. రాజాదులు ఊరేగునప్పుడు మంగళార్థము కన్యకలు చల్లెడి లాజలు.
ఆచారవంతుఁడు, ఆచారి } సం. విణ. ఆచారము గలవాఁడు.
ఆచార్య. సం. స్వతః వేదమంత్రముల వ్యాఖ్యానించు స్త్రీ; మంత్రము నుపదేశించు స్త్రీ.
ఆచార్యకము సం. ఉపాధ్యాయత్వము, ఒజ్జఁదనము; గురుస్థానము.
ఆచార్యాని. సం. ఆచార్యుని భార్య.
ఆచార్యుఁడు. సం. శాస్త్రములను మథించి (శాస్త్రార్థము నెఱిఁగి) తాను ఆచరించుచు ఆచరింపఁజేయువాఁడు; మతస్థాపకులైన శ్రీ శంకరులు రామానుజులు మొ||; కల్పసూత్రాదులతోఁబాటు వేదము జదివించువాఁడు; వేదమంత్రముల వ్యాఖ్యానించువాఁడు; సకలమంత్రోపదేష్ట; కర్మములఁగాని మోక్షసాధనములఁగాని ఉపదేశించు సద్గురువు; పూజ్యుఁడు; ఉపాధ్యాయుఁడు; పండితుఁడు; ద్రోణాచార్యుఁడు.
ఆచితము. సం. పదిపుట్లయెత్తు; బండెఁడు బరువు. విణ. వ్యాపించినది; పఱచఁబడినది; కూర్పఁబడినది; సంగ్రహింపఁబడినది; కప్పఁబడినది.
ఆచ్ఛదము. సం. ఆచ్ఛాదము.
ఆచ్ఛన్నము. సం. విణ కప్పఁబడినది.
ఆచ్ఛాదకము. సం. విణ. కప్పునది.
ఆచ్ఛాదనము. సం. పైబట్ట; వస్త్రము; ఆవరణము; కప్పు; చాటు, మాటు,

మఱుఁగు; ముసుఁగు; మూఁత; కప్పుట; మూయుట.
అచ్ఛాదము. సం. వస్త్రము; ఆవరణము.
అచ్ఛాదించు. సం. స. క్రి. కప్పు; మఱుఁగు పఱుచు.
అచ్ఛాదితము. సం. విణ. కప్పఁ (మఱుఁగుపఱుచఁ)బడినది.
అచ్ఛురితకము / అచ్ఛురితము } సం. ఎత్తిపొడుపుతోఁ గూడిన నవ్వు; ధ్వనిగల నవ్వు; నఖక్షతవిశేషము; గోటివాద్యము. విణ. మిశ్రితము.
అచూకి. పోబడి, జాడ.
అజకము. సం. మేఁకలమంద.
అజకవము. సం. శివధనుస్సు.
అజన్మము. సం. అవ్య. పుట్టుక మొదలు
అజవంజవము. సం. సంసారము.
అజానజుఁడు. సం. దేవతావిశేషము.
అజానము. సం. దేవలోకవిశేషము.
అజానుబాహువు(ఁడు). సం. మోఁకాళ్ళ వఱకు చేతులుంగలవాఁడు.
అజానేయము. మేలుజాతి గుఱ్ఱము.
అజి. సం. యుద్ధము; యుద్ధభూమి; అజాని కుమారుఁడు.
అజిహీర్ష. సం. తీసికొని రాఁ గోరిక.
అజీవనము / అజీవము } సం. బ్రదుకుదెఱవు, జీవనోపాయము.
అజువు. సం. వెట్టి.
అజ్ఞ సం. సెలవు, ఆన, ఉత్తరువు; దశమస్థానము; అజ్ఞాచక్రము.
అజ్ఞపడు. మి. అ. క్రి. ఆజ్ఞావశుఁడగు, శిక్ష్య, తగులుంపడు.
అజ్ఞపె(వె)ట్టు. మి. స. క్రి. ఆజ్ఞాపించు; దండించు.
అజ్ఞప్తి. సం. ఆజ్ఞ, ఆనతి.
అజ్ఞప్తుఁడు. సం. విణ. ఆజ్ఞాపింపఁబడినవాఁడు.
అజ్ఞయిడు. మి. స. క్రి. దండించు.
అజ్ఞవాఁడు మి. విణ. ఆజ్ఞలోనున్న వాఁడు.
అజ్ఞాతుఁడు. సం. విణ. అజ్ఞప్తుఁడు.
అజ్ఞాపకుఁడు. సం. విణ. ఆజ్ఞాపించువాఁడు
అజ్ఞాపత్రము. సం. ఆజ్ఞను దెలిపెడిపత్రము.
అజ్ఞాపనము / అజ్ఞాపము } సం. ఆజ్ఞాపించుట, ఆజ్ఞ చేయుట; ఆనతి.
అజ్ఞాపించు. సం. స. క్రి. ఆనతిచ్చు; నియమించు.
అజ్ఞాపితము. సం. విణ. ఆజ్ఞాపింపఁబడినది.
అజ్ఞాపితుఁడు. సం. విణ. అజ్ఞప్తుఁడు.
అజ్ఞాశక్తి. (శైవసంప్రదాయమున) ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తుల కంటె వేఱైన శక్తి.
అజ్యము. సం. నెయ్యి.
అట నాట్యము; క్రీడ; నింద; నవ్వులు మొ॥ గానుగలో వేసి త్రిప్పుట; పరిహాసము.
అటంకము. అడ్డంకి, నిరోధము.
అటకాఁడు. నాట్యమాడు పురుషుఁడు; ఆటలాఁడు దొమ్మరి మొ.
అటకత్తియ / అటకత్తె } నటి, ఆట ఆడు వేశ్య మొ.
అటకము. సం. ఊరఁబిచ్చుక.
అటగొఱ్ఱు. మూడు కఱ్ఱులుగల గొఱ్ఱు, దున్నెడి ఒకపనిముట్టు.
అటచేదియ. ఆటకత్తియ.
అటదిగ్గియ. క్రీడార్థము ఏర్పఱుపఁబడిన నడబావి.
అటతిప్ప. క్రీడార్థమేర్పఱిచిన కొండ, కృతకాద్రి.
అటతోఁట. ఉద్యానవనము; ప్రమదావనము.
అటపట్టు. క్రీడాస్థానము; నాట్యస్థానము; నివాసస్థానము.
అటపాక. నర్తనశాల, నాట్యస్థానము.
అటరి. ఆటకత్తియ, నర్తకి; నర్తకుఁడు.
అటరూపము. సం. అడ్డసరము.
అటవికుఁడు. సం. విణ. అడవిలోఁ బుట్టినవాఁడు.
అటవిడుపు. బడిపిల్లలకు ఇచ్చెడి సెలవు, అనధ్యయనము మొ.
అటవెలఁది. ఆటకత్తియ; పద్యభేదము; వేశ్య.
అటాడు అ. క్రి. క్రీడించు.
అటి. సం. అడేలు, బాతు.
అటు. అడుపు, దెబ్బ, హతి; బాధ.
అటుపోటు. దుఃఖము.
అటువారము భిక్షు.
అటోపము. సం. అడంబరము; మదము; వేగిరపాటు, తొందఱ.
అటోపి. సం. విణ. ఆటోపముగలవాఁడు.
అటోపించు. సం. అ. క్రి. వేగిరపడు.

అట్రుగడ(డా)లు. బ. ధాన్యవిశేషము.
అట్లఁడు. ఖలుఁడు.
అట్లమ్మ. ఒక విషూచివ్యాధి.
అఠ. అవ్య. అక్కడ.
అడంబరము. సం. ఏనుఁగు గీఁక; యుద్ధాది సన్నాహము; యుద్ధవాద్య ధ్వని; వేగిరపాటు.
అడాలు. ఒకానొక చెట్టు.
అడి. సం. ఆటి, ఆడేలు.
అడించు. ప్రే. నాట్యమాడించు; క్రీడింపఁ జేయు; పలికించు.
ఆడిక. అపకీర్తి, నింద.
ఆడికపడు. అ. క్రి. నిందపడు.
ఆడికోలు. నింద, అవ్వ, ప్రవాదము; అప్పన
ఆడిపోసికొను. స. క్రి. నిందించు.
అడు. అ. క్రి. నాట్యమాడు; క్రీడించు; చలించు; నాటు; మునుఁగు; విహరించు; సంచరించు. స. క్రి. చెప్పు; నడపు; నిందించు; నవ్వులు మొ|| గానుగలో వేసి త్రిప్పు; చేయు (తానమాడెనని).
ఆడుకొను. స. క్రి. నిందించు.
ఆడువరి. అలంగము, కోటకొఱడు, వప్రము. ఆరెపువ్వు.
అడె. కడితమునందు ఏకదేశము; ఆరె,
ఆడెప(బ)లు. బ. మేఘపరంపరలు.
ఆడెలు. జాతు.
అడేలు. ఆటి, శరారిపక్షి; బకము.
అఢకము. సం. తూము, మానవిశేషము; కండిగ.
అఢకి. సం. కండిగ; తొవరిమన్ను.
ఆఢకికము. సం. విణ. తూమెఁడు విత్తులు విత్తఁదగిన పొలము.
ఆఢ్య. సం. విణ. సంపన్నురాలు.
ఆఢ్యంకరణము. సం. విణ. ఆఢ్యుఁడు గాని వానిని అఢ్యునిగాఁ జేయునది.
ఆఢ్యుఁడు. సం. విణ. ధనికుఁడు. సంపన్నుఁడు; గొప్పవాఁడు; సాధుఁడు.
అణవము. సం. చిత్తముల విశేషము.
అణి. ముత్యపు గుంద్రఁదనము; మర్మము, ఆయము. సం. అంచు; ఇరుసుతుదిచీల; ఎల్ల; ముత్తెపు గుణము.
అణికాఁడు. విణ. మర్మమెఱిఁగినవాఁడు.
ఆణిపూస. ముత్తెము.
అణిపోటు. జీవస్థానమున పొడిచినపోటు.
ఆణిమ. శ్లేష్మము.
ఆణియ. దద్రురోగము.
ఆణియము. దేశము.
అణీ. మర్మము, ఆయము.
అణె. ఆణియ.
అణెము. దేశము.
ఆతంకము. సం. చేమిరి; భయము; మద్దెల మ్రోఁత; రోగము; సంతాపము; సంశయము. [కలంగఁజేయు.
ఆతంకించు. సం. స. క్రి. ఆతంకము
ఆతంచనము. సం. వడి; కీడు; చేర్చుట; తనుపుట; పాడిచేయుట; వేయుట; తోడు వేయుట; క్షీరాదులు తోడుకొనుట.
ఆతఁడు. సం. ఆపురుషుఁడు; తచ్ఛబ్దార్థము
ఆతగాఁడు. స. ఆతఁడు.
ఆతట్టు. ఆవైపు, ఆదిశ.
అతతము. సం. విణ. విస్తారమైనది; అంతటను వ్యాపించినది.
ఆతతాయి. సం. విణ. చంపనుద్యుక్తుఁడైనవాఁడు (ఇంట నిప్పుపెట్టువాఁడు, విషముపెట్టువాఁడు, కత్తిగొని నఱకు వాఁడు, ధనమపహరించువాఁడు, భూమినపహరించువాఁడు, పరస్త్రీనపహరించువాఁడు-వీరు ఆతతాయులు).
ఆతపత్రము సం. గొడుగు.
ఆతపము. సం. ఎండ; ప్రకాశము.
ఆతపవారణము. సం. గొడుగు.
ఆతరము. సం. కేవు, ఓడకూలి.
ఆతర్పణము. సం. తనివి. విణ. తనివి నొందించునది.
ఆతల. అవ్య. అక్కడ; అవతల; తరువాత.
ఆతాపి. సం. చీపరపిట్ట, జెముడుకాకి.
ఆతి. సం. ఆడేలు.
ఆతిథేయము. సం. అతిథి సత్కారము. విణ. అతిథికి యోగ్యమైనది.
ఆతిథేయుఁడు. సం. అతిథిసేవలో నిపుణుఁడు. [కైన ద్రవ్యము.
ఆతిథ్యము. సం. అతిథిభక్తి; అతిథికొఱ
ఆతిథ్యుఁడు. సం. అతిథి.

అతివాహికము. సం. సూక్ష్మ శరీరము; ఉపాసకులను కర్మఠులను ఆయా పదవులకుఁ జేర్చెడిఅర్చిరాదిధూమాద్యభిమాని దేవతాగణము.
అతీరు. అవిధము.
అతు. ఉపస్థరోమము.
అతుమ. అత్మ.
అతురత. సం. ఆతురభావము, దుఃఖము; ఆదుర్దా; భయము; అశక్తత.
అతురపడు. మి. అ. క్రి. ఆతురతనొందు.
అతురుఁడు. సం. విణ. రోగి; పీడితుఁడు; ఆసక్తుఁడు; భయముగలవాఁడు; పనులఁ జేయలేనివాఁడు.
అతోద్యము. సం. వాద్యము.
అత్తగంధము. సం. విణ. పరాభవింపఁబడినది.
అత్తము. సం. విణ. తీసికొనఁబడినది.
అత్మ. సం. సర్వకాలసర్వావస్థలయందనుస్యూతముగా నుండు తత్త్వము; అగ్ని; సూర్యుఁడు; వాయువు; దేహము; మనస్సు; బుద్ధి; స్వరూపము; ప్రయత్నము; ధైర్యము; స్వభావము; నేత్రాదీంద్రియము; హృదయాకాశము; కేవలము చిద్రూపము తురీయము అహం ప్రత్యయవేద్యమునైన తత్త్వము; ఉపాధియందుండు చైతన్యము; అంతఃకరణము; తాను; జీవుఁడని క్షేత్రజ్ఞుఁడని త్వంపదార్థమని వ్యవహరింపఁబడుచున్నట్టినిత్యానుభవరూపమైనప్రత్యగాత్మ పరమాత్మ, బ్రహ్మము.
అత్మంభరి. సం. విణ. కుక్షింభరి.
అత్మగుణములు. సం. బ. ఆత్మవిగాగాతము పతితములైన అష్టగుణములు (మనుష్య మనుష్యేతరములైన సకల భూతములయందు దయ, ఓర్పు, అసూయ లేమి, శుచి, అమితముగా పరిశ్రమ మొనర్పకుండుట, ప్రశస్తకార్యములఁ జేయుట, శక్త్యనుసారము దాన ధర్మములు చేయుట, ఇతరుల సొత్తుకై ఆశపడకుండుట)
అత్మగుప్త. సం. దూలగొండి†.
అత్మఘోషము. సం. కాకి.
అత్మజ. సం. కూఁతురు.
అత్మజుఁడు. సం. కుమారుఁడు. [వాఁడు.
అత్మజ్ఞుఁడు. సం. విణ. అత్మ నెఱిఁగిన
అత్మదర్శము. సం. అద్దము.
అత్మనీనము. సం. విణ. తనసంబంధమైనది, స్వకీయము.
అత్మనేపదము. సం. క్రియాపదముయొక్క భేదము; క్రియాఫలము తననే పొందుటను తెలుపునది.
అత్మబంధువు. సం. మేనత్తకొడుకు; తల్లితోడఁ బుట్టిన దా (వా) ని కొడుకు; అత్మమిత్రుఁడు; అత్మ.
అత్మభువు. సం. కొడుకు; కూఁతురు; బుద్ధి; అత్మయోని.
అత్మయాజి. సం. విణ. చిత్తశుద్ధికై యజ్ఞములం చేయువాఁడు; జ్ఞాని.
అత్మయోని. సం. బ్రహ్మ; విష్ణువు; శివుఁడు; మన్మథుఁడు.
అత్మవంతుఁడు. సం. విణ. మనస్సు వశపఱచుకొనినవాఁడు.
అత్మవిదుఁడు. సం. విణ. అత్మజ్ఞుఁడు.
అత్మస్తుతి. సం. తన్ను దాను పొగడుకొనుట
అత్మహత్య. సం. బలవంతముగ ప్రాణత్యాగము చేయుట; ఆత్మాజ్ఞాన జనిత సంసారానుభవము. [రమించు జ్ఞాని.
అత్మారాముఁడు. సం విణ. ఆత్మయందే
అత్మీయము. సం. విణ. తనది.
అత్మీయుఁడు. సం. విణ. తనవాఁడు.
అత్ముఁడు. సం ఆత్మ, జీవుఁడు; పరమాత్మ
అత్మౌపమ్యము సం. సమదృష్టి, సమభావము
అత్యంతికము. సం. విణ. హద్దులేనిది.
అత్రగాఁడు. విణ. త్వరపడువాఁడు.
అత్రము. త్వర, తొందఱ.
అత్రేయి. సం. ముట్టుది.
అత్రేయుఁడు. సం. అత్రి పుత్రుఁడు (చంద్రుఁడు దత్తాత్రేయుఁడు దుర్వాసుఁడు); అత్రిగోత్రజులలో శ్రేష్ఠుఁడు.
అథర్వణము. సం. అథర్వఋషికనుగొనిన వేదమంత్ర సమూహము; అది విధించు క (ధ) ర్మము.
అద. విచారము, అధి; హృదయము.

అదట. తనివి; ధర్మము; క్షేమము;పిమ్మట; భక్తి; అపేక్ష.
అదటవోవు. అ. క్రి. తృప్తిపడు.
అదమఱవు. అదట; విచారములేమి.
ఆదరణము. ఆదరించుట; ఆదరము.
అదరబాదర. క్రి.విణ. అతిత్వరితముగా.
అదరము. సం. ఆసక్తి; సత్కారము.
అదరించు. సం. స. క్రి. అపేక్షించు; పాటించు; మన్నించు.
అదరింత. ఆదరణము.
అదరికము. దీక్ష; ఆదరణ.
అదరువు. సం. ఆధారము; ఆశ్రయము.
అదర్శము. సం. అద్దము; టీక; మేలుబంతి; ఒరవడిపుస్తకము.
ఆదా. హిం. ఆదాయము.
అదాత. సం. విణ. తీసికొనువాఁడు.
అదానము. సం. తీసికొనుట.
ఆదాయము. ద్రవ్యము; లాభము. సం. తీసికొనుట.
ఆది. గుర్తు; చొక్కాయి లోనగువాని కిచ్చిన కొలత; ధర్మము; తలఁపు. సం మొదలు. విణ. మొదటిది; తినువాఁడు. క్రి. విణ. మొదలుగా; సయితము.
ఆదికము. సం. మొదలైనది.
ఆదికవి. సం. బ్రహ్మ; వాల్మీకి. విణ. తొలికవి.
ఆదికావ్యము.సం. వాల్మీకిరామాయణము.
ఆదికుమ్మరి. మి. తొలికుమ్మరి.
ఆదికూర్మము. సం. కూర్మరాజము, విష్ణువు.
అదికొను. అ. క్రి. కన్నువేయు.
ఆదితాళము. సం. తాళవిశేషము (ఎనిమిదిమాత్రల కాలము).
అదితేయుఁడు. సం. దేవుఁడు, వేలుపు.
ఆదిత్యవారము. సం. భానువారము.
ఆదిత్యుఁడు. సం. దేవుఁడు, వేలుపు; సూర్యుఁడు. (ద్వాదశాదిత్యులు— ఇంద్రుఁడు, ధాత, పర్జన్యుఁడు, త్వష్ట, పూషుఁడు, అర్యముఁడు, భగుఁడు, వివస్వంతుఁడు, విష్ణువు, అంశుమంతుఁడు, వరుణుఁడు, మిత్రుఁడు.)
ఆదిత్స. సం. తీసికొనఁగోరిక.
ఆదిదేవుఁడు. సం. శివుఁడు; విష్ణువు.
ఆదిబీజము. సం. ప్రణవము.
ఆదిభిక్షువు (ఁడు). సం. శివుఁడు.
ఆదిమంతము. సం. విణ. ఆదిగలది (అనాత్మ, దృశ్యవర్గము).
ఆదిమతములు. సం.బ. పూర్వమతములు.
ఆదిమము. సం. విణ. మొదటిది.
ఆదిమవేదము. సం. ఋగ్వేదము.
ఆదివారము. సం. భానువారము.
ఆదివెలమలు. మి. బ. వెలమలలో ఒక తెగవారు. [శక్తి; దుర్గ.
ఆదిశక్తి. సం. వైష్ణవీమాయ, పారమేశ్వరి
ఆదిశబరుఁడు. సం. శివుఁడు.
ఆదిశేషుఁడు. సం. శేషనాగము.
ఆదిష్టము. సం. ఆజ్ఞ; ఉపదేశము;ఎంగిలి. విణ. ఆజ్ఞాపింపఁబడినది; ఉపదేశింపఁబడినది; ఆదేశముగఁజెప్పబడినది.
ఆదుఁడు. సం. విణ. తినువాఁడు.
అదుకొను. అ. క్రి. అనికయగు. స. క్రి. ఆదరించు.
అదుర్దా. భయము; తొందర.
ఆదులు. సం.బ. మొదలైనవారు; మొదలైనవి. [మన్నింపఁబడినది.
ఆదృతము. సం. విణ. ఆదరింపఁబడినది;
ఆదృతి. సం. ఆదరము; పాటింపు.
ఆదేయము. సం. విణ. తీసికొనఁదగినది.
ఆదేశకుఁడు. సం.విణ. ఆదేశించువాఁడు.
ఆదేశము. సం. ఆజ్ఞ; ఉపదేశము; వ్యా. ఒకటినిబోఁగొట్టి దానిస్థానమున వచ్చు మఱియొక వర్ణము మెం.
ఆదేశించు. సం.స.క్రి. ఆజ్ఞాపించు; ఉపదేశించు. [యాజ్ఞకర్త.
ఆదేష్ట. సం. విణ. ఆదేశించువాఁడు;
ఆద్య. సం. పరదేవత, దుర్గ.
ఆద్యంతము. సం. అవ్య. మొదటినుండి కడవఱకు.బ. మొదలు చివర.
ఆద్యమాషకము. సం.ఐదుగురిగింజలయెత్తు
ఆద్యము. సం.ధాన్యము;బ్రహ్మము.విణ. మొదటిది; తినఁదగినది.
ఆద్యుఁడు. సం.విణ. మొదటివాఁడు.
ఆద్యూనుఁడు. సం.విణ. తిండిపోతు.

ఆధానము. సం. ఉంచుట; సంస్కార పూర్వకముగా అగ్న్యాదు లుంచుట; కలిగించుట; కప్పుట; ధరించుట.
ఆధారదండము. సం. వెన్నెముక.
ఆధారము. సం. ఆదరువు, ఆశ్రయము; కోదు; చెఱువు; పాదు; మూలాధారము; సప్తమ్యధికరణము, ఒకదానిని మోసికొనియుండునది.
ఆధారిక. సం. ఎఱ్ఱజెఱ్ఱి; కోరింద†.
ఆధి సం. మనోవ్యథ; ఉనికిపట్టు; తాకట్టు.
ఆధికారికులు. సం. బ. నిగ్రహానుగ్రహ సామర్థ్యముగలిగి జగత్కార్యాదుల కు కారణభూతముగా నుండెడి అధికారములయందు పరమేశ్వరుని చేత నియోగింపఁబడిన ఇంద్రుఁడు వశిష్ఠుఁడు పరాశరుఁడు వ్యాసుఁడు మొ.
ఆధిదైవికము. సం. విణ. దైవమువలనఁ గలిగిన మిక్కిలి గాలి మిక్కిలి వాన లోనగువానివలని దుఃఖము.
ఆధిపత్యము. సం. దొరతనము.
ఆధిభౌతికము. సం విణ. భూతముల (సర్ప వ్యాఘ్ర చోరాదుల) వలనిదుఃఖము.
ఆధివేదనికము. సం. స్త్రీధనవిశేషము.
ఆధునికము. సం. విణ. ఇప్పటిది.
ఆధూతము. సం. విణ. కదలింపఁబడినది.
ఆధేయము. సం. విణ. ఆధారము జేసికొని యుండునది.
ఆధోరణుఁడు. సం. మావటీఁడు.
ఆధ్మాతము. సం. పెరుఁగు; ఊఁదుట. విణ. ఊఁదఁబడినది; కాల్పఁబడినది.
ఆధ్మానము. సం. ఊఁదుట.
ఆధ్యక్ష్యము. సం. అధ్యక్షత.
ఆధ్యాత్మికము. సం. విణ. ఆత్మకు సంబంధించినది; మనశ్శరీరములను బట్టి కలిగెడి శోకమోహాది దుఃఖము.
ఆధ్యానము. సం. స్మృతి, తలఁపు.
ఆధ్యాసికము. సం. విణ. అధ్యాసముచే ఏర్పడినది; భ్రాంతిజనితము.
ఆధ్వర్యవము సం. అధ్వర్యుభావము.
ఆన. ఆజ్ఞ; శపథము, ఒట్టు (గురువులాన అని); క్రీస్తుశకము. [వాతి దగుట.
ఆనంతర్యము. సం. అనంతరము; తరు

ఆనంత్యము. సం. అనంతమగుట.
ఆనంద. సం. ఒక సంవత్సరము; యతుల దశనామములలోనొకటి; ఒకయోగము.
ఆనందకాననము. సం. కాశి.
ఆనందథువు. సం. ఆనందము.
ఆనందనము. సం. ఆనందింపఁజేయుట.
ఆనందభైరవి. సం. దుర్గ; ఒకమందు; ఒక స్త్రీ రాగము.
ఆనందమయము. సం. ఆనందమయ కోశము, కారణదేహము, స్వరూపాజ్ఞానము, ప్రియము మోదము ప్రమోదము అను వృత్తులుంగల యది.
ఆనందమయుఁడు. పరమాత్మ; ప్రాజ్ఞుఁడు
ఆనందము. సం. ఆత్మ, బ్రహ్మము, అప్రాకృతము స్వరూపమునైన సుఖము; ఆనందింపజేయునది.
ఆనంది. సం. విణ. రసానుభూతిచే సుఖించు జ్ఞాని.
ఆనందించు. సం. అ. క్రి. రసానుభూతి నొందు; సుఖించు; సంతోషించు. స. క్రి. ఆనందింపఁజేయు.
ఆనకట్ట. ఏటిఅడ్డకట్ట, వంతెన.
ఆనకదుందుభి. సం. వసుదేవుఁడు.
ఆనకము. సం. తప్పెట; భేరి; మద్దెల; ఉఱిమెడు మేఘము.
ఆనతము. సం. విణ. వంగినది.
ఆనతి. ఆజ్ఞ. సం. మ్రొక్కు; నమ్రత.
ఆనతిచ్చు, ఆనతియిచ్చు } స. క్రి. సెలవిచ్చు, ఆజ్ఞ యిచ్చు.
ఆనతుఁడు. సం. విణ. మ్రొక్కినవాఁడు.
ఆనద్ధము. సం. చర్మవాద్యము, మద్దెల మొ.
ఆనపెట్టు, ఆనపాడుచు } స. క్రి. ఆజ్ఞాపించు.
ఆననము. సం. ముఖము; నోరు.
ఆనపకాయ. సొఱకాయ.
ఆనము. సం. ఉచ్ఛ్వాసము. [యము.
ఆనయనము. సం. తెచ్చుట రూ. ఆన
ఆనయించు. స. క్రి. తెచ్చు.
ఆనర్తము. సం. నీరు; పోరు; నాట్యశాల; ఒక దేశము.
ఆనర్తుఁడు. సం. విణ. నాట్యకాఁడు.

ఆనర్థక్యము. సం. అనర్థకత; నిరర్థకత
ఆనవాలు. గుర్తు; ఇవురఁగాఁచినపాలు, కూర్చిక.
ఆనాయము. సం. చేఁపల వల.
ఆనాయ్యము. సం. గార్హపత్యాగ్ని నుండి దక్షిణాగ్ని యందుంచఁబడిన అగ్ని.
ఆనాలు. ఆనవాలు; భక్ష్యవిశేషము.
ఆనాహము. సం. కట్టు; ఐరువాయికట్టు; నిడివి, వస్త్రాదుల పొడుగు.
ఆనిక. అండ; దార్ఢ్యము; త్రాగుడు.
ఆనియ. ఆణియ.
ఆనీతము. సం. విణ. తేఁబడినది.
ఆను. మర్మము; మొదలు. స. క్రి. ఆశ్రయించు; నిరోధించు; తిను; త్రాగు, అదుము; అణఁచు; ధరించు. అ. క్రి. ఆనుకొను, ఒఱగు.
ఆనుకఱ్ఱ. ఊఁతకఱ్ఱ.
ఆనుకూల్యము. సం. ఒద్దిక, అనుకూలత.
ఆనుకొను. స. క్రి. ఆధారముగాచేసికొను
ఆనుగము } సొఱ, అలాబువు, తుంబి.
ఆనుగు
ఆనుగుణ్యము. సం. ఇమ్ము, అనుగుణభావము.
ఆనుడుబిల్ల. ఒఱగుదిండు, ఉపధానము.
ఆనుపూర్వి. సం. అనుక్రమము, వరుస. రూ. ఆనుపూర్వ్యము.
ఆనువు. ఆనిక, ఆశ్రయము.
ఆనుశ్రవికము. సం. శ్రుతిప్రసిద్ధమైన స్వర్గాదిభోగము. [బడనిది.
ఆనుషంగికము. సం. విణ. ఉద్దేశింపఁ
ఆనృశంస్యము. సం. క్రూరత్వములేమి.
ఆనృణ్యము. సం. ఋణవిముక్తత.
ఆనె. ఆనియ.
ఆనేత. సం. విణ. తెచ్చువాఁడు.
ఆనేయము. సం. విణ. తేఁదగినది.
ఆన్వీక్షికి. సం. దుర్గ; తర్కవిద్య.
ఆపక్వము. సం. గుగ్గిల్లు.
ఆపగ. సం. నది. [భీష్ముఁడు.
ఆపగేయుఁడు. సం. గాంగేయుఁడు,
ఆపణము. సం. అంగడి; అంగడివీధి.
ఆపణికుఁడు. సం. వణిజుఁడు, దుకాణదారి.

ఆపతితము. సం. విణ. హఠాత్తుగా వచ్చినది
ఆపత్తి. సం. ఆపద; ప్రాప్తి; దోషప్రసక్తి; అర్థాదులసిద్ధి.
ఆపత్తు. సం. ఆపద.
ఆపద. సం. ఇడుము, కష్టము.
ఆపద్ధర్మము. సం. ఆపత్కాలమున విధించిన ధర్మము. [పొందఁబడినది.
ఆపన్నము. సం. విణ ఆపదగలది;
ఆపన్నసత్త్వ. సం. గర్భిణి. [వాఁడు.
ఆపన్నుఁడు. సం. విణ. ఆపదపొందిన
ఆపమిత్యకము. సం. మాఱకపువస్తువు.
ఆపము. సం. జలసమూహము. [దలిది.
ఆపరాహ్ణకము. సం. విణ. అపరాహ్ణమం
ఆపసోపాలుపడు. అ. క్రి. ఉస్సురుస్సురను.
ఆపస్తంబుఁడు. సం. కల్పసూత్రముల రచించిన ఒకఋషి.
ఆపాకము. సం. కుమ్మరి ఆవము.
ఆపాటున. అవ్య. ఉన్నట్లుండి, అకస్మాత్తుగా.
ఆపాతము. సం. పడుట; పడవేయుట; తత్కాలము; వివేచింపక గమనించుట; ఆకస్మికముగా వచ్చుట.
ఆపాదకము. సం. విణ. కలిగించునది.
ఆపాదనము. సం కలిగించుట.
ఆపాదమస్తకము. సం. అవ్య. పాదము మొదలు తలవఱకు. [నది.
ఆపాది. సం. విణ. కలిగించునది; చేయు
ఆపాదించు. సం. స. క్రి. కలిగించు; చేయు; ఆరోపించు.
ఆపాదితము. సం. విణ. కలిగినది.
ఆపాదిల్లు. సం. అ. క్రి. కలుగు.
ఆపానము. సం. కల్లంగడి; పానశాల.
ఆపీడము. సం. సిగదండ; శిరోభూషణము
ఆపీనము. సం. పొదుఁగు. విణ. బలిసినది.
ఆపుచేయు. స. క్రి. నిలుపుదలచేయు.
ఆపుదల. ఆపుచేయుట.
ఆపూపికుఁడు. సం విణ. అప్పములు చేయువాఁడు; అప్పములు అమ్మువాఁడు; అప్పములు తినువాఁడు.
ఆపూరము. సం. ప్రవాహము.
ఆపూర్ణము. సం. విణ. నిండినది.
ఆపూర్తి. సం. మిక్కిలినింపు; సంపూర్తి.

అపూర్యమాణము. సం. విణ. అంతటను నింపఁబడుచున్నట్టిది.
అపృచ్ఛ. సం. అప్రచ్ఛనము.
ఆపె. స. ఆమె.
అపేక్ష. కోరిక, అపేక్షు.
అపోసనము. ఆపోశనము.
అపోక. ఆపోవుట; తృప్తి. [శిలుఁడు.
అపోగండుఁడు. సం. శిశువు. విణ. భయ
అపోమయము. సం. ప్రాణము. విణ. జలమయము.
అపోవు. అ. క్రి. తృప్తిపడు.
అపోశనము. సం. భోజనమప్పుడు పుడిసిట జలముపోసికొని మంత్రపూర్వకముగా పుచ్చుకొనుట; త్రాగుట.
అపోశనముగొను. మి. స. క్రి. అపోశనము చేయు; వశపఱచుగొను [చేయు.
అపోశనించు. సం స. క్రి. ఆపోశనము
అపోశానము. సం. ఆపోశనము.
అపోసనము. అపోశనము.
అప్తజనుఁడు. సం. విణ. ఆప్తుఁడు.
అప్తము. సం. భాగహారము. విణ. భాగింపఁబడినది; పొందఁబడినది; సంబద్ధము, యుక్తియుక్తము; హితమైనది; నమ్మఁదగినది.
అప్తవాక్కు. సం. భ్రమప్రమాదాది దోషములు లేనివాక్కులు గల స్మృతి పురాణము మొ.
అప్తి. సం. సంబంధము; సంయోగము; పొందుట, లాభము, ప్రాప్తి; వ్యాప్తి; సమాప్తి; సంపద.
అప్తుఁడు. సం. విణ భ్రమప్రమాదాది దోషములులేని వాక్యులుగల బుద్ధిమంతుడు; నమ్మఁదగినవాఁడు; నిపుణుఁడు; యథార్థము వచించువాఁడు; హితుఁడు, హితముగఱపువాఁడు; బంధువు; పండితుఁడు; సజ్జనుఁడు. [దగినది.
అప్యము. సం. విణ. జలమయము; పొందఁ
అప్యానము. సం. ప్రీతి; వృద్ధి.
అప్యాయనము. సం. తృప్తి; ప్రీతి; వృద్ధి; దీక్షామంత్ర సంస్కార విశేషము; వృద్ధి నొందించుట; సంతోషపెట్టుట. విణ. సంతోషపెట్టునది; తనివి నొందించునది.
అప్యాయము. సం. తృప్తి; ప్రీతి; వృద్ధి.
అప్యాయితము. సం. విణ. తనిసినది; నింపఁబడినది; వర్ధినొందిపఁబడినది.
అప్యాయితుఁడు. సం. విణ. సంతోషపెట్టఁబడినవాఁడు.
అప్రచ్ఛనము. సం. అనదంపఁజేయుట; కుశలప్రశ్నము చేయుట; సంభాషించుట; వీడ్కోలు, సెలవుదీసికొనుట.
అప్రపదీనము. సం. విణ. మీఁగాళ్లదాఁక జాలుగల అంగి, పావడ మొ.
అప్లవనము
అప్ల(ప్లా)వము } సం. స్నానము.
అప్లావితము. సం. విణ. ముంచివేయఁబడినది
అప్లుతము. సం. స్నానము. విణ తడిసినది.
అప్లుతుఁడు. సం. విణ స్నానముచేసినవాఁడు; స్నాతకుఁడు; తడిసినవాఁడు; జలాదులతో నింపఁబడినవాఁడు.
అఫీసు. ఇం. కచ్చేరి, కార్యాలయము.
అబ. కంటిపాప; కనుఱెప్పలవాపు; ఆత్రము. (బ. అబలు.)
అబాలగోపాలము. సం. చిన్నలు పెద్దలు—అందఱు.
అబిడ. స. అ(స్త్రీ). రూ. అబిడె.
అబూతి. పెనుతిండి, అభుక్తి
అబూతికాఁడు. విణ. తిండిపోతు.
అబ్దికము. సం. ఏఁడుడి; తద్దినము; వార్షికము, సావత్సరికము.
అభ. సం. పోలిక; మిక్కిలిదీప్తి.
అభరణము. సం. తొడవు, నగ.
అభాణకము. సం. నిరాధారమైన జనవాక్యము.
అభాషణము. సం. నిందుమాట; బంధుమిత్రులతో మాటలాడుట.
అభాసము. సం. ఛాయ, ప్రతిబింబము; చిదాభాసము; స్ఫూర్తి; దుష్టమైన హేతువు మొ. లేకయే తత్సమానముగా తోఁచునది.
అభాసు. వాస్తవముగాకపోయినను పైకి వాస్తవమైనదానివలె గనఁబడునది.
అభాసుఁడు. సం. చిదాభాసుఁడు, తత్త్వం పదముల వాచ్యార్థము; తెలివి లేనివాఁడు,

అభాస్వరులు. సం. బ. (64 గురు గల) దేవతాగణ విశేషము.
అభిజాత్యము. సం. అభిజాతభావము.
అభిజితము. సం. అభిజిన్నక్షత్రసంబంధమైనది. [భావము.
అభిముఖ్యము. సం. సుముఖత, అభిముఖ
అభీక్ష్ణ్యము. సం. ఎడతెగకుండుట.
అభీరపల్లి. సం. గొల్లపల్లె.
అభీరము. సం. ఒకదేశము.
అభీరి. సం. గొల్లది; గొల్లవానిభార్య.
అభీరుఁడు. సం. గొల్లవాఁడు.
అభీలము. సం. కష్టము; భయంకరము.
అభుక్తి. సం. అబూతి.
అభోగము. సం. ఉత్సాహము; ప్రయత్నము; పరిపూర్ణత; చిత్తపరిపూర్తి; యత్నపూర్ణత్వము.
అభ్యంతరము. సం. విణ. లోనిది.
అభ్యుదయికము. సం. విణ. మంగళార్థమైన నాందీశ్రాద్ధాదికర్మ.
ఆమండము. సం. ఆముదపుచెట్టు.
ఆమంత్రణము. సం పిలుచుట; సంతోషపెట్టుట; అనుజ్ఞబడయుట; శ్రాద్ధాదులయందు దౌహిత్రాదుల నియోగించుట, స్వేచ్ఛనొసఁగుట; స్వాగతము; రహస్య సంభాషణము; వీడుకోలు. [చేయు.
ఆమంత్రించు. సం. స.క్రి. ఆమంత్రణము
ఆమడ. నాలుగుకోసుల దూరము, యోజనము.
ఆమతి. పిలుపు. [అప్పనము చేయు.
ఆమతించు. స. క్రి. పిలుచు; పూజించు;
ఆమతింపు. ఆమతించుట.
ఆమతిల్లు. అ. క్రి. పుట్టు.
ఆమనస్యము. సం. దుఃఖము; ప్రసవవేదన.
ఆమని. వసంతఋతువు; గ్రీష్మఋతువు; ఉత్సవము; సమృద్ధి; ఫలసమృద్ధి; పంట యొబ్బిడిచేయించుట.
ఆమనిచెలి. మన్మథుఁడు.
ఆమము. సం. రోగము; అజీర్ణరోగ విశేషము. విణ. పం (వం) దని పదార్థము, పచ్చిది.
ఆమయము. సం. రోగము.
ఆమయావి. సం. రోగి.
ఆమలకము } సం. ఉసిరిక†; ఉసిరిక
ఆమలకి } కాయ.
ఆమవడ. మెంతిపెరుగులో నానవేసినవడ
ఆమశ్రాద్ధము. సం. వండనిపదార్థములతో చేయుశ్రాద్ధము.
ఆమాశయము. సం. నాభికి పైస్థానమున జీర్ణముకాని అన్నాదులుండు కోశము.
ఆమిక. అము, మదము, అహము.
ఆమిత(తి). ఆహ్వానము.
ఆమికి. సం. కూరు, పాలవిఱుగుడు.
ఆమిషము. సం. మాంసము; కానుక; నిమ్మపండు; కామగుణము; లంచము; లాభము; లోభము; భోగము; భోగ్యపదార్థము; రమ్యమైన విషయము; విడువఁదగిన ఆశ (కూరి) లం.
ఆమిషి. సం. జటామాంసి†.
ఆము. ఆమిక; అహము, కొవ్వు.
ఆముకవియు. అ. క్రి. మదించు; మిక్కిలి క్రమ్ముకొను.
ఆముకొను. అ. క్రి. పైకొను; మదించు.
ఆముక్తము. సం. విణ. ధరింపఁబడిన వస్త్రము కవచము మొ.
ఆముక్తి. సం. వస్త్రము; ధరించుట. అవ్య. ముక్తిగలుగువఱకు. [కాంగము.
ఆముఖము. సం. ప్రస్తావన, ఒకనాట
ఆముటేనుఁగు. మదపుటేనుఁగు.
ఆముత్రికము. సం. విణ. ఆముష్మికము.
ఆముదపుఁజెట్టు. ఏరండము.
ఆముదము. ఏరండతైలము.
ఆముదాలు. బ. ఏరండబీజములు.
ఆముష్మికము. సం. విణ. పరలోకసంబంధమైనది.
ఆముష్యాయణుఁడు. సం విణ. ప్రఖ్యాతిగల వంశమునఁబుట్టినవాఁడు.
ఆమూలము. సం. క్రి. విణ. అవ్య. మూలముట్టుగ, మొదలంట.
ఆమూలాగ్రము సం. క్రి. విణ. మొదటి నుండి చివరదాఁక.
ఆమృష్టము. సం. విణ చక్కఁగా వివేచింపఁబడినది.
ఆమె. స. ఆ పూజ్యురాలు; ఆ స్త్రీ.

ఆమెత. పిలుపు; ఉత్సవము; విందు, భోజనము. [చున్నది.
ఆమోదమానము. సం. విణ. పరిమళించు
ఆమోదము. సం. సంతోషము; దూరముగా వ్యాపించెడి పరిమళము; ఆమోదించుట.
ఆమోదించు. సం. అ. క్రి. పరిమళించు; సంతోషించు; ఇది మంచిదేయను.
ఆమ్నాతము. సం. అభ్యసించుట. విణ. పరంపరగా వచ్చినట్టిది; స్మరింపఁబడినది; విచారింపఁబడినది; అభ్యసింపఁబడినది; చెప్పఁబడినది.
ఆమ్నాయము. సం. వేదము; అధ్యయనము; వేదాంగము; సంప్రదాయము; తంత్రశాస్త్రము; సదుపదేశము; అభ్యాసము; సముదాయము, వంశము.
ఆమ్రము. సం. మామిడి†.
ఆమ్రవణము. సం. మామిడితోఁట.
ఆమ్రాతకము. సం. అంబాళము†.
ఆమ్రేడించు. సం. అ. క్రి. ద్విరుక్తమగు.
ఆమ్రేడితము. సం. విణ. రెండు మూడు మాఱులు పలుకఁబడిన మాట; స్తుతింపఁబడినది.
ఆమ్లఖళము. సం. చేరు; దప్పళము.'
ఆమ్లము. సం. పులుసు, విణ. పుల్లనిది.
ఆమ్లలోణిక. సం. పులిచింత†.
ఆమ్లవేతసము. సం. పుల్లప్రబ్బ†.
ఆమ్లిక. సం. చింత†.
ఆయక. స. ఆకె, ఆస్త్రీ. [నిర్ణయము.
ఆయకట్టు. మి. ధనమువచ్చుబడియొక్క
ఆయకము. తాకట్టు.
ఆయకాఁడు. మి. పన్ను వసూలుచేయు అధికారి, కరణము మొ. [సామగ్రి.
ఆయగము. కత్తిపిడి; అశ్వాద్యలంకార
ఆయతనము సం. గృహము; గుడి; ఆశ్రయము; యాగశాల; బౌద్ధాలయము; విశ్రామస్థానము.
ఆయతము. ప్రయత్నము. సం. విణ నిడుపైనది; తేఁబడినది; లాగఁబడినది.
ఆయతి. కందాయము, కారు. సం. నిడుపు, పొడుగు; ప్రభావము; రాఁబోవుకాలము; రాబడి.
ఆయతికాఁడు. మి. విణ. ధనార్జనము చేయువాఁడు. [సంసిద్ధము.
ఆయత్తము. సం. విణ. అగ్గము, అధీనము;
ఆయత్తి. సం. ఎల్ల; రాక; చెలిమి; లాఁకువ; ఉపాయము; ప్రభావము; శయనము
ఆయత్తుఁడు. సం. విణ. అధీనుఁడు.
ఆయది. స. అది.
ఆయన. స. అతఁడు, ఆ పురుషుఁడు.
ఆయప. స. ఆపె, ఆమె, ఆస్త్రీ.
ఆయపఅచు. స. క్రి. సాగుబడిచేయు.
ఆయమ. స. ఆమె, ఆస్త్రీ.
ఆయము. మర్మము, జీవస్థానము; అశ్వశాల. సం. రాబడి, లాభము; పన్ను.
ఆయర్లు. వాత్సల్యము.
ఆయలె. అవ్య. అనాదరమును తెలిపెడిని
ఆయల్లకము. సం. ఎడఁబాటు; తహతహ.
ఆయవారము. ధాన్యయాచన.
ఆయసము. సం. ఇనుము విణ. ఇనుపది.
ఆయస్తము. సం. విణ. కొట్టఁబడినది; త్రోయఁబడినది; దుఃఖపెట్టఁబడినది; సానపెట్టఁబడినది.
ఆయా. హిం. సేవకురాలు.
ఆయాతము. సం. విణ. వచ్చినది.
ఆయానము సం. రాక; స్వభావము.
ఆయామము. సం. నిడుపు, నిడివి.
ఆయాసపాటు. మి. ఆయాసపడుట.
ఆయాసపెట్టు. మి. స. క్రి. శ్రమపెట్టు.
ఆయాసము. సం. శ్రమము; ఉత్సాహము.
ఆయిటి. బూరుగు†.
ఆయితపడు. అ. క్రి. సిద్ధమగు.
ఆయితపాటు. సిద్ధమగుట.
ఆయితపెట్టు. స. క్రి. సిద్ధముచేయు.
ఆయితము. సన్నాహము. విణ. సిద్ధము.
ఆయితు. ఆయిత్తు.
ఆయిత్తపడు. అ. క్రి. ఆయితపడు.
ఆయిత్తపాటు. ఆయిత్తపడుట.
ఆయిత్తము. విణ. సిద్ధము.
ఆయిత్తు. విణ. శక్యము, సాధ్యము.
ఆయిదము. ఆయుధము.
ఆయుగము. ఆయగము.
ఆయుధము. సం. కత్తి; పోటుముట్టు, అస్త్రము, శస్త్రము మొ॥సర్వాయుధము

ఆయుధికుఁడు. సం. విణ. ఆయుధము చేతఁ బ్రదుకువాఁడు. రూ. ఆయుధీయుఁడు

ఆయుర్దాయము. వా. ఆయుస్సు, జీవితకాలము. సం. ఆయుస్సునిచ్చుట.

ఆయుర్వేదము. సం. ధన్వంతరి ప్రణీతమైన చికిత్సాశాస్త్రము, వైద్యకము.

ఆయువు. సం. ఆయుస్సు, ఉగము, జీవితకాలము; నెయ్యి.

ఆయుష్కర్మము. సం. మంగిలిపని.

ఆయుష్కాముఁడు. సం. విణ. దీర్ఘాయుష్యముఁగోరువాఁడు.

ఆయుష్మంతము. సం. ఒకయోగము.

ఆయుష్మంతుఁడు. సం. విణ. దీర్ఘాయుష్యముగలవాఁడు. [ఆయుస్కారము.

ఆయుష్యము. సం ఆయుస్సు. విణ.

ఆయుస్కరము. సం. విణ. ఆయుర్హితమును ఆయుస్సాధనమునైనపథ్యము మొ.

ఆయుస్సు. సం. ఆయువు.

ఆయెడ అవ్య. అక్కడ.

ఆయెనా. అవ్య. యదిశబ్దార్థము (వచ్చినట్టాయెనా అని).

ఆయోగము. సం. ఒడ్డు; తెలివి; వ్యాపారము; గంధమాల్యాదుల కానుక.

ఆయోకవుఁడు. సం. చూ. ఆయోగవుఁడు.

ఆయోధనము. సం. యుద్ధము; యుద్ధభూమి

ఆర బహువచన సంభోధనమునందు వచ్చెడి ఆగమము (రాములార, వనితలార, వృక్షములార అని). సం. ఆరెనూది.

ఆరంగపువక్క. ఒకరకమువక్క.

ఆరంజోతి. అరుంధతి.

ఆరంబము. ఆరంభము.

ఆరంభణము సం. ఆరంభము; ఆరంభించుట; ఆరంభింపఁబడుచున్నది.

ఆరంభము. సం. త్వర; మదము; వధము; ప్రయత్నము; ప్రస్తావన; ఉపక్రమము.

ఆరంభవాదము. సం. (జగత్కారణము పరమేశ్వరుఁడు గాక) పరమాణువులు జగత్కారణమనెడి తార్కికులయు కర్మము జగత్కారణమనెడి మీమాంసకులయు వాదము.

ఆరంభించు. సం. అ. క్రి. కడఁగు, ఉపక్రమించు.

ఆరకాటి. ఓడనడపువాఁడు.

ఆరకూటము. సం. ఇత్తడి; ఇత్తడినగ.

ఆరక్ష, సం. రక్ష, విఘ్నములఁ బాలఁదోలుట. [క్రిందిచోటు.

ఆరక్షము. సం. సేన; ఏనుఁగు కుంభములక్రిందిచోటు.

ఆరక్షుఁడు. సం. ఆరకుఁడు, కావలివాఁడు.

ఆరగించు. స. క్రి. త్రాగు; భుజించు.

ఆరగింత (పు). నైవేద్యము; భోజనము; ఆహారము.

ఆరగింపఁజేయు. ప్రే. భుజింపఁజేయు.

ఆరగ్వధము. సం. రేల†. [నుయ్యి?.

ఆరఘట్టము. సం. ఏతము, కపిల; లోఁతునుయ్యి?.

ఆరజము. సం. వాద్యవిశేషము; వన్నెకాఁడితనము?. [అదిగలది.

ఆరజేము. సం. ఇంపు; కలధ్వని. విణ. అదిగలది.

ఆరట. విశ్రాంతి?.

ఆరటపడు. అ. క్రి. పరితపించు.

ఆరటపాటు. ఆరటపడుట.

ఆరటపెట్టు. స. క్రి. పరితపింపఁజేయు.

ఆరటము. ఆరాటము.

ఆరటించు. అ. క్రి. పరితపించు.

ఆరట్టజము. సం. పారసీక దేశపు గుఱ్ఱము.

ఆరట్టము. సం. పారసీక దేశము.

ఆరడము. పూనిక, ఉత్సాహము.

ఆరడి. నింద.

ఆరణపక్కి. ఆడేలం.

ఆరణాలు. బ. వేదమంత్ర విశేషములు.

ఆరణేయుఁడు. సం. శుకమహర్షి.

ఆరణ్యకము. సం. వేదభాగవిశేషము; వనపర్వము; ఆరణ్యకాండము. విణ. ఆరణ్యమునఁ గలిగినది.

ఆరణ్యము. సం. విణ. ఆరణ్యమునకు సంబంధించినది.

ఆరతి. నీరాజనము, హారతి. సం. ఉడుకువ

ఆరనాళకము. సం. కలి, పులియఁబెట్టిన కడుగునీళ్లు. రూ. ఆరనాళము.

ఆరబము. పైరు, సస్యము.

ఆరబ్ధము. సం. విణ. ఆరంభింపఁబడినది.

ఆరభటము. సం. విశ్వాసము; సాహసము

ఆరభటి. సం. ఒక కావ్యవృత్తి; ఒక నాట్యరచన; ప్రౌఢి; అతిశయము.
ఆరభటుఁడు. సం. విణ. వీరుఁడు; శూరుఁడు.
ఆరము. సం. అంగారక గ్రహము.
ఆరయు. స.క్రి. అరయు.
ఆరవము. సం. మ్రోఁత, ధ్వని.
ఆరా. ఆచూకి, జాడ.
ఆరాట. ఆరాటము.
ఆరాటము. పరితాపము; విరహావ్యసనము
ఆరాటించు. అ.క్రి. పరితపించు.
ఆరాతీయము. సం.విణ.దగ్గఱది;దూరపుది
ఆరాత్రికము. సం. హారతి; నీరాజనపాత్ర.
ఆరాధకుఁడు. సం.విణ.ఆరాధించువాఁడు
ఆరాధన. సం. సేవ, పూజించుట.
ఆరాధనము. సం. సిద్ధి; సేవ; పొందుట; వండుట; సంతోషపెట్టుట.
ఆరాధనీయము. సం. విణ ఆరాధ్యము.
ఆరాధించు. సం. స. క్రి. సేవించు; సంతోషపఱచు.
ఆరాధితము. సం.విణ. ఆరాధింపఁబడినది.
ఆరాధ్యము. సం.విణ. ఆరాధింపఁదగినది.
ఆరామము. సం. తోఁట. విణ. క్రీడించునది, ఆనందించునది.
ఆరామశాకము. సం. తోఁటకూర†.
ఆరాము. హిం. తోఁట; విశ్రాంతి.
ఆరాయు. అరయు?.
ఆరావము. సం. మ్రోఁత, ధ్వని.
ఆరాళికుఁడు. సం. విణ. వంటవాఁడు.
ఆరిందా. హిం. నేర్పరి.
ఆరిక (కె)లు. బ. అళ్ళు,సస్యవిశేషము.
ఆరికెపొలము. ఆళ్లుపండు భూమి.
ఆరితి. ఆర్తి, దుఃఖము. [మగు.
ఆరితేఱు. అ. క్రి. నేర్పరియగు; ప్రౌఢ
ఆరిప్స. సం. ఆరంభింపవలెనను ఇచ్ఛ.
ఆరియము. తోఁట.
ఆరివేరపుఁదపసి నారదుఁడు.
ఆరివేరము. కలఁత; కలహము; ద్వేషము.
ఆరు. రోమావళి. అ. క్రి. ఒప్పు; కలుగు; నిండు; అతిశయించు; పూర్తియగు; సార్థకమగు; సంతోషించు.
ఆరుక(గ)లు. బ. ఆరికెలు.
ఆరుచు. స క్రి. ఆడించు; విసరు.
ఆరుఁడు. సం. అంగారకుఁడు, కుజుఁడు.
ఆరుదూఱు. అల్లరి.
ఆరుదొండ. తుజాలకము†.
ఆరుద్ర. ఆర్ద్రానక్షత్రము.
ఆరుద్రపురుగు. ఎఱ్ఱని పట్టువంటి దేహము గల ఒక పురుగు.
ఆరుపు. గీపెట్టు, ప్రణాదము.
ఆరుపోరు. ఎడతెగని కలహము.
ఆరుమూడు. వైకల్యము.
ఆరురుక్షువు. సం. విణ. ఎక్కఁగోరికగలవాఁడు; జ్ఞానయోగమును పొందఁగోరినవాఁడు.
ఆరులు. బ. ఆరిగదుబ్బులు.
ఆరుషేయము. ఆగ్నేయము.
ఆరూఢము. సం ఎక్కుట, గజాద్యారోహణము. విణ. ఎక్కినది; కలిగినది; మొలచినది; ఎక్కఁబడినది; ఉన్నతస్థితిని జెందినది; పరిణతిజెందినది.
ఆరూఢి సం. ఎక్కుట; ప్రసిద్ధి.
ఆరూఢుఁడు. సం. విణ. ఎక్కినవాఁడు; ఉన్నతస్థితిని జెందినవాఁడు; జ్ఞాని.
ఆరె ధాతకి†; చెప్పులకుకుట్టెడునూది; బాణవిశేషము;ఆరెబొట్టె. విణ. మరాటివాఁడు. అవ్య. ప్రశంసార్థకము.
ఆరెకుఁడు. తలారి, ఆరకుఁడు.
ఆరెగోల. బరిగోల, తోత్రము.
ఆరెదేశము. మహారాష్ట్రదేశము.
ఆరెపువ్వు. ధాతకి†.
ఆరెబొట్టె. కోడికాలివ్రేళ్ళకు వెనుకతట్టున నూదివలె మిక్కిలి వాఁడియైయుండెడు ఒంటిగోరు.
ఆరెము. మహారాష్ట్రభాష; ఆరామము.
ఆరెవడ్లు బ. నూదులవంటి తోఁకలుగల ఒక దినుసు వడ్లు. [బడినది.
ఆరేచితము. సం. విణ. కొంచెముముడువఁ
ఆరేవతము. సం. రేల†.
ఆరోగ(గి)ణము. భోజనము.
ఆరోగ్యము. సం. రోగములేమి, నీరోగిత్వము.
ఆరోపకుఁడు. సం.విణ.ఆరోపించువాఁడు

ఆరోపణము. సం. మిథ్యాజ్ఞానము; మోపు
దల; ఆరోపించు.
ఆరోపము. సం. ఆరోపణము.
ఆరోపించు. సం. స. క్రి. అసత్యమును
ప్రకటించు; మిథ్యాదృష్టిచేయు; లేనిది
మోపు, వస్తువునందు అవస్తువు నారో
పించు, సత్యమైనదాని యందు అసత్య
మైనదానిని మోపు; ఎక్కించు; మోపు;
నాటు; మొలవేయు.
ఆరోపితము. సం. విణ. ఆరోపింపఁబడి
నది; ఎక్కపెట్టఁబడినది. [రౌతు
ఆరోహకుఁడు. సం. విణ. ఎక్కెడువాఁడు;
ఆరోహణము. సం. ఎక్కెడు; సోపానము,
మెట్టు; మొలచుట; ఆరోహించుట.
ఆరోహము. సం. దిగుట; నిడుపు, ఉన్నత
త్వము; వస్త్రాదులపొడవు; మొలక;
ఉత్తమస్త్రీ పిఱుఁదు; ఆరోహించుట.
ఆరోహి. సం. విణ. ఆరోహుఁడు.
ఆరోహించు. సం. ఎక్కు; అధిష్ఠించు;
ఆక్రమించు.
ఆరోహుఁడు. సం. విణ. రౌతు, గుఱ్ఱపు
రౌతు మావటీఁడు మొ. [కర్ణుఁడు.
ఆర్కి. సం. యముఁడు; సుగ్రీవుఁడు;
ఆర్చు. అ. క్రి. ఆఱు; కూయు; యోధులం
బొబ్బరించు. స. క్రి. ఆడించు; దీపము
మొ॥ ఆఱఁజేయు; నశింపఁజేయు.
ఆర్జకుఁడు. సం. విణ. లెస్సగా గడించు
(సంపాదించు) వాఁడు.
ఆర్జనము. సం. లెస్సగా గడించుట;
గడన, సంపాదనము. రూ. ఆర్జన.
ఆర్జవము. సం. మోసగింపమి; తిన్న
దనము, చక్కన, సరళత; పొడవు.
ఆర్జించు. సం. స. క్రి. లెస్సగా గడించు.
ఆర్జితము. లెస్సగా గడింపఁబడినది.
ఆర్డరు. ఇం. క్రమము; ఆజ్ఞ.
ఆర్తగళము. సం. నల్లగోరంట†; ఆరు
దొండ†. [తుచ్ఛము, సత్తలేనిది.
ఆర్తము. సం. విణ. దుఃఖము నొందినది;
ఆర్తవము. సం. ఋతువు; స్త్రీ ఋతువు;
పువ్వు. విణ. ఋతుసంబంధమైనది.
ఆర్తి. పోరలి. సం. నాశము; కష్టము;
పీడ, బాధ; వ్యాధి; వింటికొప్పు.
ఆర్తుఁడు. సం విణ. ఆర్తినొందినవాఁడు.
ఆర్త్విజ్యము. సం. ఋత్విగ్భావము
ఋత్విజుని కర్మయు. [ధించినది.
ఆర్థికము. సం. విణ. అర్థమునకు సంబం
ఆర్దము. ఆఱుతూములు.
ఆర్ద్ర. సం. ఒకనక్షత్రము.
ఆర్ద్రకము. సం. అల్లము†.
ఆర్ద్రము. సం. తడిసినది; సరసము: అను
కూలము; మృదువైనది.
ఆర్నెల్లు. బ. ఆఱునెలలు.
ఆర్పు. ఆఱుపు.
ఆర్భాటము. ఆడంబరము.
ఆర్భటము. సం. మ్రోఁత; ఆడంబరము.
రూ. ఆర్భటి, ఆర్భాటము.
ఆర్మ(ర్మా)సగు. అ. క్రి ఆఱుమాసగు.
ఆర్య. సం. దుర్గ, పార్వతీదేవి; పూజ్యు
రాలు; అత్త; ఛందస్సు. [పెనిమిటి.
ఆర్యపుత్రుఁడు. సం. నాటోక్తియందు
ఆర్యమిశ్రుఁడు. సం. విణ. పూజ్యుఁడు.
ఆర్యాణి సం. పూజ్యురాలు.
ఆర్యానాథుఁడు. సం శివుఁడు.
ఆర్యావర్తము. సం. ఆర్యులుండు పుణ్య
భూమి, వింధ్యహిమవంతముల మధ్య
దేశము.
ఆర్యుఁడు. సం. పూజ్యుఁడు; స్వామి,
అధిపతి; పెద్ద; గురువు; శ్రేష్ఠుఁడు;
మామ; కులీనుఁడు; సుహృదుఁడు;
సదాచారసంపన్నుఁడు; ఉదారచరి
తుఁడు; నాటోక్తియందు మాన్యుఁడు.
ఆర్వేరము. ఆరివేరము. [దగినకోడె.
ఆర్షభ్యము. సం. ఆఁబోతుగా విడువఁ
ఆర్షము. సం. ఆర్షప్రయోగము; ఆర్ష
వివాహము. విణ. ఋషిప్రణీతము; వేద
విహితము; ఋషిదృష్టము; ఋషిది.
ఆర్షేయము. సం. ఋషిగణరూపమైన
ప్రవరవిశేషము. [విశేషము.
ఆర్హతుఁడు. సం. విణ. జైనుఁడు; బౌద్ధ
ఆఱఁగట్టు } స. క్రి. ఆఱవేయు, ఎండఁ
ఆఱఁబెట్టు } బెట్టు.
ఆఱడి. హాని, భంగము; అపకీర్తి, నింద.
విణ. దుష్టము, చెడ్డది; వ్యర్థము.

అఱడిపడు. అ.క్రి. నిందపడు; వ్యర్థమగు; హానినొందు.
అఱడిపుచ్చు. స. క్రి. అఱడిపోవఁజేయు; భంగపఱచు; వ్యర్థముచేయు.
అఱడిపోక. అఱడిపోవుట.
అఱడిపోవు. అ.క్రి. చచ్చు; నిందపడు; భగ్నమగు; వ్యర్థమగు.
అఱవతిథి. షష్ఠి.
అఱవతూరి. షష్ఠావృత్తి.
అఱవది. విణ. షష్ఠము.
అఱవసంద్రము. పాలసముద్రము.
అఱాపు. అఱపు, బొబ్బ.
అఱు. స. షట్సంఖ్య; ఐదునొకటి, షట్కము. అ.క్రి. నశించు; ఎండు, తడితీయు, నిర్జలమగు; ఉపశమించు.
అఱుగురు. స. ఆఱుమంది, ఆర్గురు (స్త్రీలుగాని పురుషులుగాని)
అఱుచు. అ.క్రి. అఱచు. స.క్రి. ఉపశమింపఁజేయు; తడితీయఁజేయు; నశింపఁజేయు. రూ. ఆర్చు.
అఱుదూము. ఆఱుతూముల ప్రమాణము.
అఱునూఱు. షట్శతము.
అఱుపు. కూఁత; పశువుల కంఠధ్వని; యోధుల బొబ్బరింత. స.క్రి. అఱచు. రూ. అర్పు.
అఱుమాఱులు. షడావృత్తులు.
అఱుము. ఆర్ధము
అఱుమూడగు. అ.క్రి. చెడు; క్షీణమగు; వికలమగు; వ్యత్యస్తమగు.
అఱుమోములవేలుపు } కుమారస్వామి
అఱుమోములసామి } షణ్ముఖుఁడు.
అఱురిక్కలప్రోఁక. కృత్తికానక్షత్రము.
అఱురెట్లు. షడ్గుణము.
అఱువ. ఎల్ల, సీమ.
అఱువాళ్లు. బ. కొంచెము ఎండుట.
అఱువురు. స. అఱుగురు.
అఱుస. ఆఱుసంచములు.
అలంకి. కురిచీవంటి పల్లకి; ఆలంకిగుడి.
అలంకిగుడి. బాలక్రీడావిశేషము.
అలంకులు. బ. ఆలంకిగుడి.
అలంబనము. సం. ఆశ్రయము, పట్టు, ప్రాపు; ఆశ్రయించుట; ఒక రసము. విణ. రసముల కాలంబనముగానుండెడు నాయకుఁడు మొ.
అలంబము. సం. ఆశ్రయము, పట్టు.
అలంబించు. సం. స.క్రి. ఆశ్రయించు, ఊఁదు.
అలంభనము } సం. స్నేహము; స్పర్శము,
అలంభము } తాఁకుడు; హింస.
అలకాపరి } గోపాలుఁడు; శ్రీకృష్ణుఁడు.
అలకాపు }
అలకించు. స. క్రి. ఆదరించు; విను.
అలకించు. సం.స.క్రి. కనుఁగొను, చూచు.
అలగోఁడుబాలగోఁడు. పెడబొబ్బలు.
అలజాలము. మీనపదము, చేఁప నీటిలో పోవుచున్నప్పుడు మార్గమేర్పడి వెంటనే మాసిపోవుట.
అలతి(త్తి). రాగాలాపము.
అలన. ఆలించుట (మొఱ), వినుట.
అలపించు. స క్రి. రాగమాలాపించు.
అలపుఁదిండ్లయగారు. నారదుఁడు, కలహభోజనుఁడు.
అలపుటాలము. వినోదార్థమైన యుద్ధము.
అలపోతు. ఆఁబోతు, వృషభము.
అలప్తి. సం. రాగాలాపము.
అలము. అలక్ష్యము, ఉపేక్ష; యుద్ధము; వినోదము.
అలమెకము. నక్క.
అలయము. వా.గుడి. సం. ఇల్లు; స్థానము.
అలరి. విణ. దుశ్శీలుఁడు; నాథుఁడు లేనిది;? అజ్ఞలేనిది.?
అలఱేఁడు. బసవఁడు, వృషభము.
అలవట్టము. గొడుగు; గుడ్డతో గుండ్రముగాఁ గూర్చిన విసనకఱ్ఱ.
అలవాలము. సం. పాదు.
అలసించు. అ. క్రి. తడయు, ఆలస్యము చేయు.
అలస్యము. సం. జాగు; మాంద్యము, సోమరితనము. విణ. సోమరి.
అలాగు. అవ్య. ఆవిధము, తథార్థకము.
అలాగే కానీ. తథాస్తు అనుట.
అలానదండము. సం. ఏనుఁగుకు కట్టు స్తంభము.
అలానము. సం. త్రాడు; ఏనుఁగును కట్టు కంబము పలుపును.

ఆలాపము. సం. రాగాలాపము; నిందు మాట, సస్నేహసంభాషణము; దుఃఖముచే వదరుట.?
ఆలాపించు. సం స. క్రి. రాగముఁ దిన్నఁగా నీడ్చు; ఆలాపముచేయు.
ఆలాబువు. సం. సొర, అనుగు†.
ఆలాయమగు. అ. క్రి. పాల్పడు.?
ఆలాయము. పాత్రము; సిద్ధమగుట.?
ఆలావర్తము. సం. ఆలవట్టము.
ఆలి. భార్య;హీనము.సం. పంక్తి; చెలికత్తె.
ఆలింగనము. సం. కవుఁగిలింత.
ఆలింగి. ఆలింగ్యము. [బడినది.
ఆలింగితము. సం. విశే. కవుఁగిలింపఁ
ఆలింగ్యము. సం. గోపుచ్ఛమువంటి యాకారముగల మద్దెల. విశే. కౌఁగిలింపఁదగినది.
ఆలించు. స. క్రి. ఆలకించు, విను.
ఆలిఁజేయు. స. క్రి. చెఱచు, భగ్నము చేయు; కీడ్పఱచు, నిరసించు, చులకనఁగాఁజేయు.
ఆలిఁబఱచు } స. క్రి. అవమానపఱచు.
ఆలిఁబుచ్చు }
ఆలిఖించు. సం. స. క్రి. వ్రాయు.
ఆలిగొను. స. క్రి. అవమానించు; తక్కువపఱచు.
ఆలిచిప్ప. కప్పచిప్ప, శంబూక.
ఆలిపైదోడు. పెండ్లాముతోఁబుట్టువు.
ఆలీఢము. సం. విలుకాఁడు కుడికాలు ముందఱకుచాఁపి నిలుచుట.
ఆలు. భార్య; (వృత్తియందు) స్త్రీ (జవరాలు, ముద్దరాలు అని). బ. ఆవులు, గోవులు.
ఆలుకము. సం. శేషసర్పము; అనుగు†; ఆలుగడ్డ, బంగాళాదుంప†.
ఆలుకి. సం. గెనుసుగడ్డ, చిలగడదుంప†.
ఆలుగడ్డ. ఉరలగడ్డ†.
ఆలుడి. మంచినడత, శీలము.
ఆలువు. గిండిచెంబు, జారీచెంబు; ఉరలగడ్డ†; గెనుసుగడ్డ†; పడవ.
ఆలెగాఁడు. క్రింది కొలువుగాఁడు.
ఆలెప్రొయ్యి. ఒకసారిగా నాలుగైదు పాత్రములు వేఱు వేఱుఁగాఁబెట్టి వండు నట్లేర్పఱచిన పొయ్యి, పెదప్రొయ్యి.
ఆలేఖనము. సం. వ్రాయుట; చిత్తరువు వ్రాయుట.
ఆలేఖ్యము. సం. వ్రాఁత; చిత్తరువు.
ఆలోకము. సం, చూపు; కాంతి,వెలుఁగు.
ఆలోకనము సం. చూచుట
ఆలోకించు సం. స.క్రి. చూచు.
ఆలోకితము. సం. విశే. చూడఁబడినది.
ఆలోచన–ము. సం. చూచుట; చూపు; వివేచన; వివేచించుట.
ఆలోచించు. సం. స క్రి. చూచు; వివేచించు, ఏకతమాడు. [బడినది.
ఆలోచితము. సం. విశే. ఆలోచింపఁ
ఆలోడనము. సం. గాలించుట; పరామర్శించుట; పరిశీలించుట; మథించుట; విచారించుట. [డనము చేయు.
ఆలోడించు. సం. స. క్రి. తరుచు; ఆలో
ఆలోలము. సం. విశే. చంచలము;ఇంచుక చలించునది.
ఆవ. పల్లపు నేల; వరి పండు నేల; చీడ; సర్షపము†; స్మృతి?. బ. ఆవాలు, ఆవగింజలు.
ఆవంత. స్వల్ప పరిమాణము.
ఆవకాయ. ఆవనూనె మొ॥ చేర్చి ఊరఁబెట్టిన మామిడికాయ ఉసిరికకాయ లోనగు ఊరుఁగాయ.
ఆవపేము. వాద్యవిశేషము.
ఆవటము. పొందిక. విశే. పొందికైనది.
ఆవటముచేయు. స. క్రి. పొందికపఱచు.
ఆవటించు. స. క్రి. పొందుపఱచు; ఆవహించు.
ఆవటిలు(ల్లు). అ. క్రి. పొందుపడు.
ఆవడ. చేదుగల బీఱ†. వా. ఆమవడ.
ఆవది. ఉపద్రవము.
ఆవనూనె. సర్షప తైలము.
ఆవపాఱు. అ. క్రి. తోఁచు; జ్ఞప్తికివచ్చు. వా. యావపాఱు.
ఆవము. కుమ్మరి కుండలుకాల్చెడి కావు, ఆవాపము; ఆవగింజ.?
ఆవరణము. సం. కప్పు; మూఁత; కంచె

కోట వెం॥ ఆచ్ఛాదనము; అవిద్య మున్నగు వానివలని బంధము; జీవుని సప్తావస్థలలో నొకటి; కప్పుట, మూయుట, క్రమ్ముట, ఆక్రమించుట, అవరించుట, చుట్టుకొనుట. విణ. ఆవరించునది. బ. అష్టావరణములు (ప్రకృతి మహదహంకారములు పంచభూతములు).

ఆవరించు. సం.స.క్రి. ఆవరణముచేయు.

ఆవరించుకొను. మి. స. క్రి. ఆవరించు; ఆవరణము చేసికొను.

ఆవరింత. ఆవలింత.

అవర్జా. హిం. దినచర్య, ప్రతిదినపులెక్క.

అవర్జు. ఆసామివారి యిచ్చిపుచ్చుకోలు లెక్క.

ఆవర్తకము. సం. మేఘనాయకవిశేషము. విణ. మరలమరల త్రిప్పునది.

ఆవర్తనము. సం. పాఠము వల్లించుట; మఱలుట. విణ. మరలమరల త్రిప్పునది.

ఆవర్తము. సం. గుఱ్ఱపుసుడి, నాడులసుడి; నీటిసుడి; వెంట్రుకలసుడి; మఱలుట; వల్లెవేయుట; సంసారము.

ఆవర్తి. సం. విణ. తిరుగునట్టిది; త్రిప్పునట్టిది; మఱలివచ్చునది.

ఆవర్తించు. సం. స. క్రి. వల్లించు; మఱలివచ్చు; మఱలు.

ఆవర్తితము. సం. విణ. వల్లింపఁబడినది; మఱలినది; మఱల్పఁబడినది.

ఆవల. ఆ ప్రక్క; పిమ్మట; దూరము.

ఆవలి. ఉపద్రవము. సం. పంక్తి.

ఆవలించు అ. క్రి. ఆవులించు.

ఆవలింత. ఆవులింత.

ఆవలినాఁడు. ఎల్లుండికి పరదినము.

ఆవలిమొన్న. మొన్నటికి పూర్వదినము.

ఆవలియెల్లుండి. ఎల్లుండికి పరదినము.

ఆవశ్యకత / ఆవశ్యకత్వము } సం. ఆవశ్యకమగుట.

ఆవశ్యకము. సం. అక్కఱ. విణ. అక్కఱైనది, తప్పక అనుసరింపఁదగినది.

ఆవసథము. సం. గృహము; గ్రామము; విశ్రామస్థలము.

ఆవసితము. సం. నుఱిచిన ధాన్యము.

ఆవహము సం. ఒక వాయువు. విణ. కలిగించునది.

ఆవహించు. సం. స.క్రి. కలిగించు; చేయు; ఆవాహనముచేయు; సోఁకు, ఆవేశించు.

ఆవహిల్లు. సం. అ. క్రి కలుగు. స. క్రి. ఆవహించు.

ఆవళి. ఆవడి. [మురుగు వెం.

ఆవాపకము. సం. ముంజేతి నగ, గాజు

ఆవాపము. సం. పాదు; విత్తుట; చిమ్ముట; గాజు; కడియము; పరరాష్ట్ర చింత; ఎగుడుదిగుడు నేల; ఆవము.

ఆవాలము. సం. పాదు.

ఆవాలు. బ. ఆబలు, సర్షపములు.

ఆవాసము. సం. ఇల్లు, గృహము.

ఆవాసించు. సం. అ. క్రి. జీవించు; నివసించు

ఆవాహనము. సం. పిలుపు; పిలుచుట; షోడశోపచారములలో నొకటి.

ఆవాహించు. సం.స.క్రి. ఆహ్వానముచేయు.

ఆవాహితము. సం. విణ. పిలువఁబడినది.

ఆవి. ఉష్ణము; శ్వాసము; తాపము.

ఆవించు. స. క్రి. వాసెనమీఁదఁబెట్టి ఆవిరితో పక్వముచేయు. [నొందినది.

ఆవిగ్నము. సం. కలివి†. విణ. ఖేదము

ఆవిడ(డె). స. ఆకె.

ఆవిద్ధము. సం. విణ. తోలువఁబడినది; వంకరయినది. [పిడిసాన మొ.

ఆవిధము. సం. తొలిచెడు సాధనము,

ఆవిరి. ఆవి, ఊష్మము.

ఆవిరిల్లు. అ. క్రి. చెమర్చు.

ఆవిర్భవించు / ఆవిర్భవిల్లు(ల్లు) } సం. అ. క్రి. కలుగు; పుట్టు; ప్రకటమగు.

ఆవిర్భావము. సం. పుట్టుక; ప్రాకట్యము.

ఆవిర్భూతము. సం. విణ. ఆవిర్భవించినది

ఆవిలము. సం. విణ. కలఁకఁబాఱినది, కలుషము.

ఆవిలి. మాంత్రికుఁడు ఉపయోగించెడు కాచ పాత్రవిశేషము.

ఆవిష్కరణము. సం. ప్రకటనము, వెల్లడి.

ఆవిష్కరించు. సం. స. క్రి. వెలయించు, వెలువరించు. [బడినది.
ఆవిష్కృతము. సం. విణ. వెలయింపఁ
ఆవిష్కృతి } ఆవిష్క్రియ } సం.విణ.ఆవిష్కరణము.
ఆవిష్టము. సం. విణ. ఆవేశింపఁబడినది; ప్రవేశించినది; వ్యాపించినది.
ఆవీతి. సం. విణ. జంధెము-పసవ్యముగా వేసికొనినవాఁడు.
ఆవు. గోవు. [తండ్రి.
ఆవుకుఁడు. సం. నాట్యోక్తి యందు
ఆవుత్తుఁడు. సం. నాట్యోక్తియందు బావ.
ఆవురింత. ఆవరింత. [తహతహ.
ఆవురు ఏడ్పువచ్చునప్పటి ధ్వన్యనుకరణము;
ఆవులించు అ. క్రి. ఆవులింత విడుచు, జృంభించు; వికసించు; తెఱచుకొను; నోరుతెఱచు. వా. నోరు వెళ్ళఁబెట్టు; చచ్చు.
ఆవులింత. ఆవులించుట; జృంభణము.
ఆవృతము. సం. విణ. పొదుగఁబడినది; ఆవరింపఁబడినది; వ్యాపింపఁబడినది; గుప్తమైనది; సురక్షితమైనది.
ఆవృత్తము. సం. విణ. తిరుగుడుపడినది; *ఆవృత్తిచేయఁబడినది
ఆవృత్తి. సం. తడవ, సారి; తిరుగుడు; వల్లె; శ్రవణాద్యభ్యాసము.
ఆవృత్తు. సం. అనుక్రమము; సారిది;మరల మరల త్రిప్పుట; అభ్యసించుట.
ఆవేగము. సం. తహతహ;తొట్రుపాటు; త్వర; కోపము.
ఆవేగి. సం. బొద్దికూర†.
ఆవేదకుఁడు. సం. విణ. తెలిపెడివాఁడు.
ఆవేదనము. సం. తెలుపుట.
ఆవేదించు. సం. స. క్రి. తెలుపు; చెప్పు.
ఆవేదితము. సం. విణ. తెలుపఁబడినది.
ఆవేశనము. సం. శిల్పిశాల; ఆవేశింపఁజేయుట; ఆవేశము.
ఆవేశము. సం. చొరవ; సంగము; తొందర; భూతాద్యావేశము; ఒడలెఱుఁగమి; అహంకారవిశేషము; అభినివేశము. [భూతాదులుసోఁకు.
ఆవేశించు.సం.అ.క్రి.ప్రవేశించు,చొచ్చు;
ఆవేశికుఁడు. సం. అతిథి; బంధువు.
ఆవేష్టకము. సం. కంచెకోట.
ఆశ. సం. దిక్కు; తృష్ణ, తీవ్రేచ్ఛ; అస, లభించియుండనిదానియందిచ్ఛ.
ఆశంక. సం. సంశయము; భయము; అనర్థమును భావించుట. [సంశయించు.
ఆశంకించు. సం. అ. క్రి. భయపడు;
ఆశంసనము. సం. ఆశ, కోరిక; హితేచ్ఛ.
ఆశపడు. మి. అ. క్రి. ఆశించు.
ఆశపాశలు. బ. ఆశాపాశములు, ఆశానుబంధములు.
ఆశపెట్టు. మి. స. క్రి. ఆశకలిగించు.
ఆశయము. సం. అభిప్రాయము; ఆశ్రయము; హృదయము; సంస్కారము; స్థానము.
ఆశయేశయుఁడు. సం. మన్మథుఁడు.
ఆశరుఁడు. సం. అగ్ని; రాక్షసుఁడు.
ఆశాబంధము. సం. ఊఱట, ఓదార్పు; ఆశయనెడి ముడి; సాలెపట్టు.
ఆశాసనము. సం. ఆశంస; ఆశంసించుట.
ఆశాసించు. సం. స. క్రి. కోరు; హితము నాశించు, ఆశీర్వదించు.
ఆశాస్యము. సం. కోరిక; దీవన. విణ. కోరఁదగినది; ఆశీర్వదింపఁదగినది.
ఆశి. సం. పాముకోఱ; ఆశీస్సు. విణ. తినువాఁడు. [ఆసించు.
ఆశించు. సం. స. క్రి. అపేక్షించు,
ఆశీర్వచనము. సం. ఆశీర్వాదము.
ఆశీర్వదించు. సం. స. క్రి. దీవించు.
ఆశీర్వాదము. సం. దీవన.
ఆశీవిషము. సం. పాము.
ఆశీస్సు. సం. ఆశీర్వాదము; ప్రార్థన; పాముకోఱ; హితముకోరుట.
ఆశుకవిత్వము. సం. ఆశుధారగాఁజెప్పెడు కవిత, చతుర్విధకవితలలోనొకటి.
ఆశుగము. సం. గాలి; బాణము.
ఆశువు. సం ఆశువ్రీహి†; శీఘ్రము.విణ. వేగముగలది.
ఆశువ్రీహి. సం. షష్టికలు; ఎఱ్ఱజిలకఱవడ్లు.
ఆశుశుక్షణి. సం. అగ్ని.
ఆశౌచము. సం. అశౌచము.

ఆశ్చర్యము. సం. అచ్చెరువు. విణ. అచ్చెరువైనది, అద్భుతము.
ఆశ్రమము. సం. విష్ణువు; మఠము; తపోవనము; మునులుండెడి స్థానము; యతుల దశ నామములలో నొకటి; బ్రహ్మచర్యాద్యాశ్రమము. (నాలుగాశ్రమములు-బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సంన్యాసము.)
ఆశ్రమి. సం. విణ. ఆశ్రమముగలవాఁడు.
ఆశ్రయము. సం. ఆధారము; ప్రాపు; అండ; ఇల్లు; అవలంబించుట; ఆశ్రయించుట; బలవంతు నాశ్రయించుట; ఆశ్రయింపఁదగినది. [సేవించుట.
ఆశ్రయణము. సం. ఆ శ్ర యిం చు ట;
ఆశ్రయణీయుఁడు. సం. విణ. ఆశ్రయింపఁదగినవాఁడు.
ఆశ్రయాశుఁడు. సం. అగ్నిహోత్రుఁడు.
ఆశ్రయి. సం. విణ. ఆశ్రయముగలవాఁడు.
ఆశ్రయించు. సం. స. క్రి. అండగొను; ఆశ్రయముచేయు.
ఆశ్రవము. సం. అంగీకారము; క్లేశము; జ్ఞానవిశేషము.
ఆశ్రవుఁడు. సం. విణ. చెప్పినట్లువినువాఁడు
ఆశ్రితుఁడు. సం. విణ. శరణుచొచ్చినవాఁడు; ఆశ్రయించినవాఁడు; ఆశ్రయింపఁబడినవాఁడు.
ఆశ్రుతము. సం. విణ. అంగీకరింపఁబడినది.
ఆశ్రేష. సం. ఆశ్లేష.
ఆశ్లిష్టము. సం. విణ. కవుఁగిలింపఁబడినది.
ఆశ్లేష. సం. అని లేరు, ఒక నక్షత్రము.
ఆశ్లేషము. సం. ఆలింగనము.
ఆశ్లేషించు. సం. స. క్రి. కౌఁగిలించు.
ఆశ్వత్థము. సం. రావిపండు. విణ. రావిది
ఆశ్వయుజము. సం. ఒకమాసము.
ఆశ్వలాయనుఁడు. సం. శ్రౌతసూత్రకర్తయైన ఒక ఋషి. [స. క్రి. ఊఁఅడించు.
ఆశ్వసించు. సం. అ. క్రి. ఊఁఅడిల్లు.
ఆశ్వాసనము. సం. ఓదార్చుట. విణ. ఓదార్చునది.
ఆశ్వాసము. సం. గ్రంథపరిచ్ఛేదము; ఊఁఅట ఓదార్చుట; ఆశ్రయమిచ్చుట.
ఆశ్వాసించు. సం. స. క్రి. ఆశ్వసించు.
ఆశ్వికుఁడు. సం. గుఱ్ఱపురౌతు.
ఆశ్వినము. సం. ఆశ్వయుజమాసము.
ఆశ్వినులు } సం. బ. ఆశ్వినీకుమారులు, అశ్వినీదేవతలు.
ఆశ్వినేయులు }
ఆషాఢము. సం. ఒకమాసము; బ్రహ్మచారి పట్టుకొనెడు మోదుగుకోల.
ఆస. ఆశ. అపేక్ష; దుక్కు.
ఆసంగము. సం. రాగము, ఆసక్తి; చేరిక; అభినివేశము; సేను కర్తననెడి యభిమానము. 19389
ఆసంది. సం. చౌకమగు మంచమువంటి ఆసనము; గద్దె; పెండ్లిపీఁట; కటువు, పాడె
ఆసకప్పెరగాఁడు. పక్షివిశేషము.
ఆసక్తము. సం. విణ. ఆసక్తిగలది.
ఆసక్తి. సం. అధికేచ్ఛ; అనురాగము.
ఆసక్తుఁడు. సం. విణ. ఆసక్తిగలవాఁడు.
ఆసచేయు. స. క్రి. ఆశించు.
ఆసత్తి. ఆసక్తి. సం. చేరిక; దగ్గఱ; ప్రాప్తి; ఇంద్రియసన్నికర్షము; సన్నిహిత సంబంధము
ఆసన. సం. ఉండుట; కూర్చుండుట.
ఆసనము. సం. పీఁట; యోగాంగమైన పద్మాసనము మొ; కూర్చుండెడి దర్భాసనము కృష్ణాజినము మొ; కూర్చుండుట; ప్రయాణము నిలుపుట; ఉనికి, దాడి చేయమి; ఏనుఁగుమూఁపు.
ఆసన్నము. సం. దాపు; దాపైనది; సమీపించినది; చక్కఁగా ఉన్నట్టిది; ఆసత్తిగల వాక్యము. [సమీపించు.
ఆసన్నించు. సం. అ. క్రి. ఆసన్నమగు;
ఆసపడు. అ. క్రి. ఆశపడు, ఆశించు.
ఆసపాటు. ఆశపడుట.
ఆసరా. అండ, ప్రాపు, ఆశ్రయము.
ఆసవము. సం. కల్లు; సారాయి; పూఁదేనె; ద్రాక్షాద్యాసవము; కల్లుతీయుట; కల్లుతీయుపాత్రము.
ఆసాదనము. సం. ప్రాప్తి; దగ్గఱకు చేర్చుట; ఉంచుట; సాన్నిధ్యమును బడయుట.
ఆసాది. మాదిగ రూ. ఆసాదివాఁడు.
ఆసాదించు. సం. స. క్రి. ఆసాదనమొనర్చు.

ఆసాను. హిం. ఆధారము.
ఆసామి. హిం. అధిపతి.
ఆసారము. సం. మిత్రరాజసైన్యము; అంతటను సేన వ్యాపించుట; వ్యాపించుట; వడి గల వాన; జడివాన, ఎడతెగని వర్షము.
ఆసాలు. బ. అధికాశలు.
ఆసించు. స. క్రి. ఆశపడు.
ఆసీనుఁడు. సం. విణ. కూర్చున్న వాఁడు.
ఆసు. నేఁతగాని ఒక కొలముట్టు.
ఆసుఁగ్రోవి. నేఁతగాఁడు ఆసుపోయునప్పుడు నూలు చొప్పించెడు గుల్ల.
ఆసుపత్రి ఇం. వైద్యశాల.
ఆసుమ్రాను. ఆసు; నూలుపోఁగు వాటించుటకై ఏర్పఱచిన కొయ్యచట్టము.
ఆసురము. సం. అట్టుప్పు; అసుర (రాక్షస) వివాహము; బొంతకాకి. విణ అసురసంబంధమైనది; భయంకరత్వము.
ఆసురి. సం. నల్లావలు†; మూలనక్షత్రము; రాక్షస స్త్రీ; శస్త్రచికిత్స.
ఆసురీణము. సం. నల్లావలు పండెడు పొలము. [నిర్వృతి.
ఆసురుఁడు. సం. అసుర, రాక్షసుఁడు;
ఆసువేయు. స. క్రి. (ఆసుమ్రానిమొలలకు) నూలుపోఁగువాటించు.
ఆసేకము. సం. చల్లుట; తడుపుట.
ఆసేచనకము. సం విణ. ఎంతచూచినను తనివితీఱని వస్తువు.
ఆసేచనము. సం. చక్కఁగా చల్లుట (తడుపుట). విణ. చల్లెడి (తడిపెడి) పాత్రము మొ॥; ఆసేచనకము.
ఆసేద్ధ. సం. విణ. రాజాజ్ఞచే నిర్బంధించెడువాఁడు.
ఆసేధము. సం. రాజాజ్ఞచేనిర్బంధించుట.
ఆస్కందనము. సం. యుద్ధము; తిరస్కారము; ఆక్రమణము; గుఱ్ఱపు రవనడ.
ఆస్కందితము. సం. గుఱ్ఱపురవనడ. విణ. ఆస్కందన మొనర్పఁబడినది.
ఆస్కారము. శక్తి; ఆసరా, ఆధారము.
ఆస్తరణము. సం. పఱచిన పఱపు; ఆసనము; చాఁప; పఱచుట; విస్తరించుట; పరిస్తోమము
ఆస్తరము. సం. ఆస్తరణము.
ఆస్తి. కూడఁబెట్టిన ధనము మొ-(స్థిరాస్తి, చరాస్తి).
ఆస్తికత. సం. ఆస్తిక్యము.
ఆస్తికత్వము సం. ఆస్తిక్యము.
ఆస్తికాఁడు (పు). విణ. ధనికుఁడు.
ఆస్తికుఁడు. సం. శ్రద్ధగలవాఁడు, గురువేదశాస్త్రవాక్యములు సత్యములని విశ్వసించువాఁడు.
ఆస్తిక్యము. సం. ఆస్తికుఁడుగానుండుట.
ఆస్తీర్ణము. సం. విణ. పఱవఁబడినది; విస్తరించినది.
ఆస్తృతము. సం. విణ విస్తృతము.
ఆస్థ. సం. ఉనికి; శ్రద్ధ; నమ్మిక; అపేక్ష; ఆదరము; ఆశ్రయము; ఆస్థానము; ప్రయత్నము; మిక్కిలి ఆసక్తి.
ఆస్థానమగు. మి అ. క్రి. సభ చేయు; కొలువుండు. [శ్రద్ధ; విశ్రమస్థానము.
ఆస్థానము. సం. సభ, కొలువుకూటము;
ఆస్థాని. సం సభ.
ఆస్థికము. సం. వజ్రాయుధము.
ఆస్థితుఁడు. సం. విణ. ఆరూఢుఁడు; ఎక్కినవాఁడు.
ఆస్పత్రి. ఇం. వైద్యశాల.
ఆస్పదము. సం. స్థానము: పదవి; ప్రతిష్ఠ; ప్రభుత్వము; ఆశ్రయము; కార్యము.
ఆస్పిటాలు. ఇం. వైద్యశాల.
ఆస్ఫాలనము. సం. భుజాదులు చఱచుకొనుట; కదలించుట; ఆటోపము; ప్రౌఢి.
ఆస్ఫాలితము. సం. విణ. చఱవఁబడినది; కదల్పఁబడినది. [విష్ణుక్రాంత†.
ఆస్ఫోట. సం. అడవిమల్లె†; దిండెన;
ఆస్ఫోటనము. సం. చీలిక; చఱపు; పోటు; భేదనము; ఆస్ఫోటించుట.
ఆస్ఫోటని. సం. ఆవిధము, పిడిసాన.
ఆస్ఫోటించు. సం. స. క్రి. చెఱుగు; చఱచు; చీల్చు; పొడుచు; భేదించు; వికసింపఁజేయు. [బడినది.
ఆస్ఫోటితము. సం. విణ. ఆస్ఫోటింపఁ
ఆస్మాకము } సం. విణ. మనది; మాది.
ఆస్మాకీనము }
ఆస్యము. సం. ముఖము; నోరు.
ఆస్రము. సం. అస్రము, నెత్తురు.

అస్రవమము. సం. క్లేశము.
అస్వదనము. సం. ఆస్వాదించుట.
అస్వదించు. సం. స. క్రి. ఆస్వాదించు.
అస్వాదకుఁడు. సం. విణ. ఆస్వాదించువాఁడు.
అస్వాదనము. సం. ఆస్వాదించుట.
అస్వాదించు. సం. స. క్రి. అనుభవించు; చవిచూచు; తిను; త్రాగు.
అస్వాదితము. సం. విణ. ఆస్వాదింపఁబడినది.
అస్వాద్యము. సం. విణ. ఆస్వాదింపఁదగినది.
అహకము. ఆయకము.
అహతము. సం. ధక్కా; చినిఁగిన బట్ట; క్రొత్తబట్ట; కల్లమాట. విణ. కొట్టఁబడినది; త్రిప్పఁబడినది; రెట్టింపఁబడినది; మర్దింపఁబడినది; అభ్యసింపఁబడినది.
అహతలక్షణుఁడు. సం. విణ. సుగుణములచే ప్రసిద్ధుఁడు.
అహరణము. సం. ఆహరించుట.
అహరణీయము. సం. విణ. తేఁదగినది; అనుష్ఠింపఁదగినది; యత్నింపఁదగినది; అర్పింపఁదగినది (కానుక).
అహరించు. సం. స. క్రి. తెచ్చు; అనుష్ఠించు; యత్నించు; అర్పించు; భుజించు; ఉద్ధరించు; అపహరించు; మఱలించు.
అహర్త. సం విణ. ఆహరించువాఁడు.
అహవనీయము. సం. యజ్ఞవేదికకు తూర్పుదిక్కున చతురస్రముగా నుండెడి కుండమందలి అగ్ని.
అహవము. సం. యజ్ఞము; యుద్ధము.
అహా. అవ్య. ఔరా, ఆశ్చర్యప్రశంసానిందా సంతాపసంతోషాదులను సూచించును.
అహారము. సం. అన్నము; ఆరగింత; తెచ్చుట; శబ్దాదివిషయజ్ఞానము.
అహారించు. సం. స. క్రి. తిను; తెచ్చు; అనుభవించు.
అహార్యము. సం. లౌకికమైన ఉపాసనాగ్ని విణ. కృత్రిమము; తెచ్చుకోఁదగినది; తినఁదగినది; గ్రహింపఁదగినది.
అహావము. సం. అగ్ని; పిలుపు; యుద్ధము; పశువులు నీరుత్రాగెడు జాతితొట్టి; ఆవాహనము; ఆవాహనమంత్రము.
అహి. ఆధి, కుదువ.
అహికము. సం. నోటితో ఊఁదునట్టి సర్పాకారముగల ఒక వాద్యము.
అహికుఁడు. సం. పాణినిమహర్షి; కేతుగ్రహము.
అహితము. సం. విణ. ఉంచఁబడినది; చేయఁబడినది; సంపాదింపఁబడినది.
అహితాగ్ని. సం. విణ. అగ్న్యాధానము చేసినవాఁడు.
అహితి. సం. నిలుపుట; ఉంచుట; అగ్న్యాధానము.
అహితుండికుఁడు. సం. పాములవాఁడు.
అహితుఁడు. సం. ఆహితాగ్ని.
అహివెట్టు. స. క్రి. కుదువపెట్టు.
అహుకుఁడు సం. వసుదేవుఁడు.
అహుతము. సం. విణ. వేల్వఁబడినది.
అహుతి. సం. అగ్నియందు వేల్చుట.
అహూతము. సం. పిలుపు. విణ. పిలువఁబడినది.
అహూతి. సం. పిలుపు; పిలుచుట.
అహూతుఁడు. సం. విణ. పిలువఁబడినవాఁడు.
అహృతము. సం. విణ. ఆహరింపఁబడినది.
అహృతి. సం. ఆహరించుట.
అహేయము. సం. విణ. పాముది.
అహోపు(పూ)రుషిక. సం. గర్వముతో తన్నుతాను పొగడుకొనుట.
అహ్నికము. సం. నిత్యకృత్యము, స్నానము సంధ్య మొ; మహాభాష్యప్రకరణము; ఒకరోజునకిచ్చెడు కూలి; ఒకరోజుండెడి జ్వరము. విణ. పగటియందలిది; ఒకరోజు సాధింపఁదగినది.
అహ్నికుఁడు. సం. ఒకరోజునకు వచ్చెడి కూలివాఁడు.
అహ్లాదనము. సం. సంతోషపెట్టుట. విణ. సంతోషపెట్టునది.
అహ్లాదము. సం. సంతోషము.
అహ్లాదించు. సం. అ. క్రి. సంతోషించు.
అహ్వా. సం. పిలుపు; పేరు.
అహ్వాయము. సం. పేరు; ప్రాణులజూదము.
అహ్వానము. సం. పిలుపు; పిలుచుట.

ఆళతి. ఆలతి.
ఆళి. సం. పంక్తి; గట్టు, కట్ట, అడ్డకట్ట; చెలికత్తె; తుమ్మెద; తేలు; రేఖ; వంతెన; సంతతి. విణ. శుద్ధహృదయముగలది.
ఆళిందకి. సం. ఉడుత.
ఆళిందము. సం. చోపా.
ఆళుగ. ఆళువ.
ఆళులు. బ. అళ్లు.
ఆళువ. ఒకపక్షి, శల్యకము.
ఆళువది. ఆలంగము, వప్రము.
ఆళువారు. ఆళ్వారు.
ఆళ్లకోన. చెమురుకాకి.
ఆళ్లు. బకోద్రవము, ధాన్యవిశేషము.
ఆళ్వారు. ఒక శ్రీ వైష్ణవుఁడు.



# ఇ

ఇ. ఇది తరువాతియక్షరమునకు ద్విత్వము పుట్టించి ఏతెచ్ఛబ్దార్థకమగును (ఇద్దేశము ఇక్కాలము అని). [వాఁడు.
ఇన్స్పెక్టరు. ఇం. పై విచారణ చేయు
ఇంకు. అ. క్రి. నిర్జలమగు, ఇనికిపోవు, ఎండిపోవు, శోషిల్లు; క్షీణమగు. ఇం. సిరా.
ఇంకుడు. ఇంకుట. విణ. ఇంకినది; ఎండిపోయినది; క్షీణించినది.
ఇంకువ. చిహ్నము; మిట్ట; స్థానము.
ఇంగనము. సం. ఇంగితము; కదలిక; కదల్చుట; జ్ఞానము.
ఇంగము. సం. ఇంగితము; జ్ఞానము; కదలిక; జంగమము, కదలికగలది (ప్రాణి). విణ. అద్భుతము.
ఇంగలము. నిప్పు, అంగారము.
ఇంగళింపు. మల్లయుద్ధములోని మెలకువ.
ఇంగాలము. సం. బొగ్గు; అంగారము.
ఇంగితజ్ఞుఁడు. సం. విణ. ఇంగితమెఱిఁగినవాఁడు.
ఇంగితము. సం. అభిప్రాయము; అభిప్రాయమును సూచించు చేష్ట, బొమముడి మొ|| ముఖవికారము; కదలిక; నడక.
ఇంగిలము. ఇంగలము; హింగుళము.?
ఇంగిలాయ. దివిటీ, కరదీపము.
ఇంగిలాయి. ఒకచేఁప.
ఇంగిలి(లీ)కము. రాగద్రవ్య విశేషము, ఒక పర్వతధాతువు, హింగుళము.
ఇంగిలీషు. ఇం. ఆంగ్లము.
ఇంగిలీషులు. ఆంగ్లేయులు.
ఇంగుద(ల)ము. సం. గారf
ఇంగుది(లి). సం. గారf.
ఇంగువ. కూరలు లోనగువానియందు దుపయుక్తమగు ఒక సంబారము, హింగువు, రామఠము.
ఇంగ్లండు. ఇంగ్లీషువారి రాజధాని.
ఇంగ్లీజు. ఇంగ్లీషుభాష.
ఇంగ్లీషు. ఇం. ఆంగ్లభాష.
ఇంగ్లీషుభాష. ఆంగ్లేయభాష.
ఇంచించుక. అవ్య. కొంచెకొంచెము.
ఇంచిమంచి. రుచిగల భక్ష్యవిశేషము.
ఇంచు. చెఱకు, ఇక్షువుf; ప్రేమ; అల్పత్వము. అ. క్రి. ఇంపగు; సొంపగు; అతిశయించు; ఆనందించు. స. క్రి. కోరు, ఇచ్ఛించు.
ఇంచుఁబడతి. సుందరి; స్త్రీ.
ఇంచుఁబోఁడి } సుందరి; స్త్రీ.
ఇంచుఁబోణి
ఇంచుక. అవ్య. కొంచెము, కించిత్తు.
ఇంచుకంత. అవ్య. కొంచెము. విణ. కొంచెము పరిమితిగలది.
ఇంచుటలుక. ప్రణయకోపము.
ఇంచుపాలకడలి. ఇక్షుసముద్రము.
ఇంచుమించు. న్యూనాధికత; రమారమి, సుమారు.
ఇంచుమించులాడు. స. క్రి. న్యూనాధికతలు పలుకు; తిరస్కరించు.
ఇంచుప్రమాను. చెఱకు; ఇక్షువు.

ఇంచువింటిచెంచు. ఇక్షుధన్వుఁడు; మన్మథుఁడు.

ఇంచువిలుకాఁడు. } ఇంచుధన్వుఁడు.
ఇంచువిలుతుఁడు. } రూ. ఇంచువిల్తుఁడు

ఇంచువిలు(ల్లు). చెఱకువిల్లు, ఇక్షుధనువు.

ఇంచువిల్లుకాఁడు } ఇంచువింటిచెంచు,
ఇంచువిల్లుదాలుపు } మన్మథుఁడు.

ఇంజినీయరు. ఇం. వాస్తుశాస్త్రజ్ఞుఁడు.

ఇంజేటి. ఈఁజేటి, ఒక కంద†.

ఇంటరము. ఇఱుకు, సంకటము.

ఇంటాతఁడు. పెనిమిటి.

ఇంటాయన. వా. మగఁడు.

ఇంటికాఁపు. గృహస్థుఁడు.

ఇంటికిఁగాకపోవు. అ. క్రి. ముట్టగు.

ఇంటిగరిత. గృహిణి, భార్య.

ఇంటిపట్టు. గృహస్థధర్మము; ఇంటిదగ్గఱ.

ఇంటిపాప. వెలకుఁగొన్న దాసి.

ఇంటిపేరు. వంశముపేరు.

ఇంటిబిడ. దాసి.

ఇంటిమగఁడు. గృహపతి; గృహస్థుఁడు.

ఇంటియ(యా)తఁడు. మగఁడు.

ఇంటియాలు. గృహిణి, భార్య.

ఇంటిల్లిపాది. ఇంటిలోనివారందఱు.

ఇంటివాఁడు. గృహస్థు.

ఇంటివిడ. దాసి.

ఇంట్రపడు. అ. క్రి. సంకటపడు.

ఇంట్రము. ఇఱుకు.

ఇండి. ఇఁడి, అభావార్థకము.

ఇండు. ఈఁదు, ఖర్జూరిక†.

ఇండుగు. వా. ఇందుగు†.

ఇండె. పూలమాల; చీలిక; ఎముకకీలు.

ఇండెవాయు. అ. క్రి. చీలు.

ఇండెవాఱు. అ. క్రి. బీఁటవోవు.

ఇంత. స. ఏతావన్మాత్రము, ఈకొలఁది; ఈవేళ; ఇది; ఈసమస్తము; ఈగొడవ. అవ్య. అధికముగా; స్వల్పముగా; ఇంతవఱకు; ఇక్కడ; ఇంక.

ఇంతకుమున్ను. ఇక్కాలమునకంటె పూర్వము, ఇతఃపూర్వము.

ఇంతంత. విణ. పరిమితము.

ఇంతదనుక } ఇందనుక, ఇందాఁక,
ఇంతదాఁక } ఇంతపర్యంతము.

ఇంతనాఁడు. బాల్యము.

ఇంతమాత్ర. ఈకొలఁది, ఈపాటి.

ఇంతలేసి. ఇంతేసి.

ఇంతవట్టు. ఈ మాత్రము; ఇదియంతయు; ఇంత కాలము.

ఇంతవడి. ఇంతసేపు.

ఇంతి. ఆఁడుది, స్త్రీ; భార్య; పెండ్లి కూతురు; చెలికత్తె. [కొలది.

ఇంతింత. విణ. ఈకొలఁదివాఁడు; ఈ

ఇంతింతనరానిది. ఇతంత యనరానిది, అపరిమితము. [అత్యల్పమైనది.

ఇంతింతలు. బ. అల్పఖండములు. విణ.

ఇంతియ. స. ఇంతమాత్రము.

ఇంతె. స. ఇంతియ. రూ. ఇంతే.

ఇంతేసి. విణ. ఇంతటి; ఇటువంటి.

ఇందనుక. ఇందాఁక, ఇంత పర్యంతము.

ఇంద. ఇదిగో తీసికొనుము.

ఇందండి. బ. ఇదిగో తీసికొనుఁడు.

ఇందకో. ఇంద.

ఇందడవు. ఇంతదనుక.

ఇందనుక. ఇందాఁక.

ఇందము. ఇంద.

ఇందఱు. స. అందఱు; వీరందఱు; ఇంత సంఖ్యగలవారు.

ఇందలి. విణ. ఇందున్న, ఇందులోపలి.

ఇందాఁక. ఇంతవఱకు; ఇంతకుపూర్వము.

ఇంది. సం. లక్ష్మీదేవి.

ఇందిందిరము. సం. తుమ్మెద.

ఇందిర. సం. లక్ష్మీదేవి.

ఇంది(దీ)వరము. సం. తామర†; నల్ల కలువ†.

ఇందీవరి. సం. పిల్లపీఁచర†.

ఇందీవరుఁడు. సం. శ్రియఃపతి, విష్ణువు.

ఇందు. ఇందుగు. అవ్య. ఇక్కడ, ఇచ్చోటు. అ. క్రి. అడఁగు; ఇముడు; అనుకూలపడు; ఒంటఁబట్టు; స్రవింపక నిలుచు; బాగుగా స్రవించు; రుచించు. అవ్య. ఈమెయందు; దీనియందు; వీని యందు; వీరియందు; ఈలోకమున; ఈపనికి.

ఇందుఁడు. సం. చంద్రుఁడు.
ఇందుగ(గు) చిల్లగింజ, కతకము†.
ఇందుపు. వా. ఇంనువు†.
ఇందుప్పు. సైంధవలవణము.
ఇందుభము. సం. మృగశిర.
ఇందుల. అవ్య. ఇందుఁగల; ఈచోటున; ఈలోకమున; ఇందున.
ఇందులకు. అవ్య. ఇచ్చోటికి; దీనికి.
ఇందువారము. సం. సోమవారము.
ఇందువు. చిల్లచెట్టు; చిల్లగింజ. సం. చంద్రుఁడు.
ఇంద్ర. సం. ఇంద్రవారుణి†; మరువము†
ఇంద్రకీలము. సం. ఒక పర్వతము; మందరగిరి.
ఇంద్రకోశము. సం. మంచము; మంటపము
ఇంద్రగణములు. సం. బ. మాత్రా గణములు.
ఇంద్రగోపము. సం. ఆరుద్రపురుగు; మెఱుగుడు పురుగు?
ఇంద్రచ్ఛందస్సు(ము). వేయి పేఁటులు గల హారము.
ఇంద్రజాలము సం. కనుకట్టువిద్య; మాయవిద్య; గారడము, మాయ; ఒక విధమగు పదార్థమును మఱియొక విధముగా జూపుట; మోసగించుట.
ఇంద్రజాలికుఁడు. సం. గారడీఁడు, మాయావి.
ఇంద్రజి. ఇంద్రజిత్తు.
ఇంద్రజితుఁడు. సం. ఇంద్రజిత్తు.
ఇంద్రజిత్తు. సం. రావణుని కొడుకు.
ఇంద్రజిత్తుఁడు. సం. ఇంద్రజిత్తు.
ఇంద్రతూలము. సం. ఆకసమున ఎగిరెడు దూదము. మల్లె†
ఇంద్రద్రువు. సం. ఏఱుమద్ది†; కొండ
ఇంద్రధనుస్సు. సం వర్షర్తువున మేఘములపై నానా వర్ణములతో ధనురాకారమునఁ గనఁబడు సూర్యరశ్మి, రతనపు విల్లు.
ఇంద్రధ్వజము సం. వర్షము కొఱకు చేసెడు ఒక ఉత్సవము.
ఇంద్రనక్షత్రము. సం. జ్యేష్ఠా నక్షత్రము.
ఇంద్రనీలము. సం. నల్లఱాయి, మయూర కంఠచ్ఛాయగల నీలరత్నము.

ఇంద్రపదవి. సం. స్వర్గసౌఖ్యము.
ఇంద్రపేషజము. సం. సొంటి.
ఇంద్రయవము. సం. కొడిసెపండు.
ఇంద్రలుప్తము. కేశఘ్న (పేనుకొరుకుట గల) రోగము (బట్టతల).
ఇంద్రలుప్తకుఁడు. సం. విణ. బట్టతలవాఁడు.
ఇంద్రవజ్ర. సం. ఒక వృత్తము.
ఇంద్రవల్లి. సం. ఇల్లింద†; పారిజాతము†; పెద్ద పాఁపర†.
ఇంద్రవారుణి. సం. పెద్దపాఁపర†.
ఇంద్రశత్రువు. సం. వృత్రాసురుఁడు.
ఇంద్రసావర్ణి. సం. పదునాల్గవమనువు.
ఇంద్రసురసము. సం. వావిలి†.
ఇంద్రాణి. సం దుర్గ; ఇంద్రునిభార్య, శచీదేవి; ఒక మాతృక; ఏలకి†; నల్ల వావిలి†.
ఇంద్రాయుధము. సం. ఇంద్రధనుస్సు.
ఇంద్రారి. సం. వేల్పుదాయ, అసురుఁడు
ఇంద్రావరజుఁడు. సం. వేగంటిసైదోడు, విష్ణువు.
ఇంద్రియము. సం. జ్ఞానేంద్రియము (మనస్సు, త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము); కర్మేంద్రియము (వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము); రేతస్సు, వీర్యము; ఐదు.
ఇంద్రియార్థము. సం. శబ్దాదివిషయము.
ఇంద్రుఁడు. సం. పరమేశ్వరుఁడు; అంతరాత్మ; వేల్పుటేఁడు; దేవేంద్రుఁడు; ఒక ఆదిత్యుఁడు. విణ. ప్రభువు; ఐశ్వర్యవంతుఁడు; (పదాంతమున) శ్రేష్ఠవాచకము.
ఇంధనము. సం. చిదుగు, చిన్నపుల్ల; వంటచెఱకు; రగుల్చుట. విణ. రగుల్చునది.
ఇంపితము. విణ ఇంపైనది.
ఇంపు. ఆనందము; తీపి; ఇచ్ఛ; ప్రేమము; శోభ. విణ. హితము, ఇష్టము; సౌభాగ్యము.
ఇంపెసలారు. అ క్రి. శోభించు.
ఇంబు, ఇంపు.
ఇఁక. అవ్య. ఇతఃపరము, ఇందుమీఁద మఱియు; ఇంతవఱకు.

ఇఁకమీఁద. అవ్య. ఈపైని, ఇఁకమీఁదట.
ఇకెగ. అవ్య. ఇఁక, ఈపైని.
ఇఁడి. ప్ర. లేనిది; లేనివాడు.
ఇక్క. గృహము; స్థానము; సంకేతస్థలము; ఉనికి.
ఇక్కట్టు. ఆపద. విణ. ఇఱుకైన.
ఇక్కడ. ఈచోటు, ఏతత్ప్రదేశము; ఈలోకము. [క్షోభించు.
ఇక్కడక్కడపడు. అ. క్రి. కలఁగు,
ఇక్కన్ను. రెండుకన్నులు.
ఇక్కపట్టు. ఉనికిపట్టు.
ఇక్కము ఇఱుకటము, సంకటము.
ఇక్కలుపడు. అ. క్రి. చలించు.
ఇక్కిలి మార్దవము.
ఇక్కు. ఇఱుకు; నడినెత్తి; ఆయుస్థానము
ఇక్కుపాటు. ఇక్కట్టు.
ఇక్కుముట్టి. నడుముతాఁకి.
ఇక్కువ. ఉనికి; జాడ; స్థానము; ఉపాయము; కళాస్థానము; సంకేతస్థలము.
ఇక్కువము. విణ. అనంతము.
ఇక్షుధన్వ / ఇక్షుధన్వుఁడు } సం. ఇంచువిలుకాఁడు, మన్మథుఁడు.
ఇక్షువణము. సం. చెఱకుతోఁట.
ఇక్షువు. సం. చెఱకు†.
ఇక్షుశరాసనుఁడు. మన్మథుఁడు.
ఇక్షుశాకటము / ఇక్షుశాకినము } సం. చెఱకు పండెడు పొలము.
ఇక్షుసాయకుఁడు. సం. మన్మథుఁడు.
ఇక్షూదము. సం. చెఱకుసముద్రము.
ఇక్ష్వాకువు. సం. ఆదిరాజు, వైవస్వత మనువుకుమారుఁడు; చేదుసొర†.
ఇగము. చల్లఁదనము; హిమము, మంచు.
ఇగిడించు అ. క్రి. చిగిరించు; కలుగు; ఎల్లునగు. స. క్రి. ఇగిరిపోఁజేయు; నశింపఁజేయు.
ఇగిరిక(కె). హవిష్యాన్నము.
ఇగిర్పించు. ప్రే. పల్లవింపఁజేయు.
ఇగిలించు. అ. క్రి. ఇగుళ్ళు కనఁబడునట్లు చేయు. స. క్రి. పండ్లను వెలిపఱచు.
ఇగిలింత. ఇగిలించుట.
ఇగురాకు. చిగురు, పల్లవము.
ఇగురాకుఁబోఁణి. చిగురువలె అందమైన స్త్రీ; స్త్రీ.
ఇగురు. ఇగురుకూర; మొలక; చిగురు; పండ్లచుట్టునుండు కండ. అ. క్రి. ఇంకు, నిర్జలమగు; చిగిరించు; ఆనందించు.
ఇగురుఁగైదువుజోదు. మన్మథుఁడు.
ఇగురుఁబోఁడి. / ఇగురుఁబోణి } ఇగురాకుఁబోఁణి.
ఇగురుకూర. పులుసులేకుండ ఉడికించి వార్చి పోగపులో వేసినకూర.
ఇగురుకొను. అ. క్రి. చిగురించు.
ఇగురుచు అ. క్రి. చిగిరించు; పొడము. స. క్రి. ఇగురఁజేయు.
ఇగురువిలుతుఁడు. మన్మథుఁడు.
ఇగురువెట్టు. అ క్రి. మోహముకను, అనురక్తమగు.
ఇగురొత్తు. అ. క్రి. అలరు; కలుగు; చిగిరించు; అనురక్తమగు; ప్రారంభమగు.
ఇగుర్కొను. అ. క్రి. చిగిరించు.
ఇగుర్చు. ఇగురుచు; చెట్టు పల్లవించు.
ఇగులుచు / ఇగుల్చు } స. క్రి. ఇగిలించు.
ఇగుళ్లు. బ. చిగుళ్ళు.
ఇగో. అవ్య. ఇదిగో.
ఇగ్గు. అ. క్రి. ఒరఁగు; వెనుకకొఱఁగు. స. క్రి. లాగు.
ఇగ్గులాట. ఇగ్గులాడుట. [కీడ్చు.
ఇగ్గులాడు. అ. క్రి. వెనఁగు. స. క్రి. వెనుక
ఇగ్రుచు. అ. క్రి. ఇగురుచు, పొడము. (ఇచటి ఇ లఘువేయగును.)
ఇచ్చిపుచ్చుకోలు. ఇచ్చిపుచ్చుకొనట.
ఇచట. అవ్య. ఇక్కడ.
ఇచేటు. ఇచ్చోటు.
ఇచొటు. ఇచ్చోటు.
ఇచ్ఛ. కాంక్ష, ఇచ్ఛ; చిత్తము. క్రి. విణ. యథేచ్ఛముగా. విణ. ప్రియము.
ఇచ్ఛకదారి. విణ. ఇచ్ఛగొండి.
ఇచ్ఛకము. ప్రియవచనము. విణ. ప్రియము.
ఇచ్ఛకాలమారి. విణ. ఇచ్ఛగొండి.

ఇచ్చకుఁడు. విణ. ఇచ్చగొండి.
ఇచ్చగించు. స. క్రి. ఇచ్ఛయించు; సమ్మతించు.
ఇచ్చగింత. ఇయ్యకోలు, అంగీకారము.
ఇచ్చగొండి. విణ. ప్రియవచనములాడు వాఁడు, ప్రియవాది.
ఇచ్చగొను. స. క్రి. కోరు.
ఇచ్చట. అవ్య. ఇక్కడ.
ఇచ్చటు. ఇచ్చోటు.
ఇచ్చమానికము. చింతామణి. [చేయు.
ఇచ్చు. స. క్రి. ఇడు, ఒసఁగు, దానము
ఇచ్చొటు. ఈ స్థానము.
ఇచ్చో. అవ్య. ఇక్కడ; ఈ స్థానమున; ఈ సమయమున.
ఇచ్చోటు. ఈ స్థానము.
ఇచ్ఛ. సం. కోరిక, ఇచ్చ.
ఇచ్ఛావతి. సం. గంధపుష్పాద్యలంకారాభిలాష గల స్త్రీ.
ఇచ్ఛావృత్తి. సం. ఇచ్చవచ్చినట్లు ప్రవర్తించుట. [కోరు.
ఇచ్ఛించు. సం. అ. క్రి. ఇచ్ఛగించు. స. క్రి.
ఇజ్జలము. సం. ఎఱ్ఱగన్నేరు†.
ఇజ్య. సం. గోవు; యాగము; దానము; పూజ; ప్రతిమ. [పూజ్యుఁడు.
ఇజ్యుఁడు. సం. బృహస్పతి. విణ.
ఇజాఫా. హిం. వృద్ధి, ఎక్కువ.
ఇజారా. గుత్త.
ఇజారు. చల్లడము, లాఁగు.
ఇజేకు. శ్రమము; సంకటము.
ఇట. ఇక్కడ; ఇది. అవ్య. ఈవల.
ఇటఁబట్టి. అవ్య. ఇంతటినుండి; ఇది మొదలుకొని.
ఇటక. ఇటిక, ఇష్టక.
ఇటిక. బంకమట్టితోఁ జేసి కాలవేసిన రాయి; ఇష్టిక.
ఇటికగోడ. ఇటికలచేత కట్టినగోడ.
ఇటికపగడము. మట్టిపగడము.
ఇటికె. ఇటిక.
ఇటీవల. అవ్య. ఈ నడుమను.
ఇటు. ఇది. అవ్య. ఇట్లు; ఈవైపు; ఇక్కడకు.
ఇటుక. ఇటిక.
ఇటుకు. వా. ఇక్కడకు.
ఇటులు. అవ్య. ఇట్లు, ఈలాగు; ఈవైపు
ఇటువంటిది. విణ. ఇట్టిది, ఏతాదృశము.
ఇటువలె. అవ్య. ఇట్లు.
ఇట్చరము. సం. ఆఁబోతు.
ఇట్టటు. విణ. తాఱుమాఱైనది. అవ్య. ఇటునటు.
ఇట్టట్టను. స. క్రి. ఈరీతి నారీతి బలుకు, మాటాడు; సామాన్యునిగాఁ జూచు; అపకరించు.
ఇట్టట్టుపడు. అ. క్రి. తత్తఱపడు.
ఇట్టట్టువడన్. అవ్య. ఇటునటునూఁగఁగా
ఇట్టట్టువడఁజేయు. స. క్రి. కలఁచు.
ఇట్టలము. గొప్ప, ఆధిక్యము. విణ. అధికము; దృఢము; స్థిరము.
ఇట్టి. ఆయుధవిశేషము. విణ. ఇటువంటి.
ఇట్టిఁడు. విణ. ఇటువంటివాఁడు. బ. ఇట్టిరు.
ఇట్టిక. ఇటిక, మట్టిరాయి; ఇటికావము.
ఇట్టికాఁడు. విణ. ఇట్టితో యుద్ధముచేయు వీరుఁడు.
ఇట్టిది. విణ. ఇటువంటిది.
ఇట్టిపాటి. విణ. ఇటువంటి.
ఇట్టు. అవ్య. ఇటు; ఈవైపు.
ఇట్టుక. ఇటిక.
ఇట్టుపు. జొట్టుపు†.
ఇట్టులు. అవ్య ఇట్లు, ఈలాగు.
ఇట్టువలె. అవ్య. ఇట్లు.
ఇట్టె. అవ్య. క్షణములో, అతిశీఘ్రముగా. రూ. ఇట్టే.
ఇట్లు. అవ్య. ఈలాగు, ఈ ప్రకారము; ఇఁకమీఁదఁ జెప్పఁబోవు ప్రకారము. విణ. ఇట్లైనది.
ఇడ. సం. బుధుని భార్య; చంద్రనాడి; ముక్కు ఎడమరంధ్రము; పురోడాశము నుంచు పాత్రము; వాక్కు; ఆవు; భూమి; స్వర్గము; హవిష్యాన్నము; ఒక దేవత; దుర్గ.
ఇడి. సేవియ, సేమ్య, భక్ష్యవిశేషము.
ఇడికుడక. భక్ష్యవిశేషము.
ఇడిక్కము. సం. పొట్టేలు.
ఇడియు. అ. క్రి. చీలు, భేదిల్లు.

ఇడు. స.క్రి. ఇచ్చు; ఉనుచు.
ఇడుకొను. స.క్రి. ఉంచుకొను.
ఇడుగడ. అనూయ; కష్టము; అవమానము
ఇడుపు. చీలిక ; గోడ యిరుపార్శ్వముల మీది చోటు.
ఇడుమ. ఆపద; అలసట,
ఇడుమపాటు. ఇడుమపడుట. [చేర్చు.
ఇడుము. కష్టము; దారిద్ర్యము; స.క్రి.
ఇడ్డవాఁడు. విణ. ఉంచినవాఁడు
ఇడ్డెన. వాసెనకుడుము; భక్ష్యవిశేషము.
ఇతఁడు. స. ఈపూజ్యుఁడు;ఈపురుషుఁడు
ఇతఃపరము. సం. క్రి. విణ. ఇఁకమీఁద.
ఇతఃపురము } సం. క్రి. విణ. ఇంతకు ముందు.
ఇతఃపూర్వము }
ఇతకరి. విణ. హితమైనది.
ఇతము. విణ. హితము. సం. తలంపఁబడినది; పొందఁబడినది.
ఇతరము. సం. స. అన్యమైనది.
ఇతరవేల్పులు. మి. తక్కిన దేవతలు.
ఇతరుఁడు. సం. స. మఱియొకఁడు. విణ. అధముఁడు. [స్వరము.
ఇతరేతరము. సం. స. ఒండొకటి, పర
ఇతవరి. విణ. హితముచెప్పువాఁడు.
ఇతవు విణ. హితము.
ఇతవుఁడు. విణ. హితుఁడు.
ఇతికథ. సం. అపార్థవాక్యము.
ఇతికర్తవ్యత. సం. ఇట్లుచేయఁదగినదనుట
ఇతిహాసకుఁడు } సం.పూర్వచరిత్ర తెలిసినవాఁడు.
ఇతిహాసపరుఁడు }
ఇతిహాసము. సం. పూర్వ (తొల్లిటి) కథ.
ఇత్తడి(ళి). పిత్తళము, ఒకలోహము.
ఇత్తఱి. ఈసమయము,
ఇత్తిగ. పాచికలమీఁది మూడుబొట్ల జత.
ఇత్వము. సం. ఇకారము.
ఇత్వరము సం. ఎఁబోతు.
ఇత్వరి సం. అంకుటాలు, జారస్త్రీ.
ఇత్వరుఁడు. సం. విణ. బాటసారి; నీచుఁడు; క్రూరుఁడు; దరిద్రుఁడు.
ఇదమంశము. సం. నిర్విశేషాత్మ, సామాన్యసత్త.
ఇదమర్థము. సం. ఇది;దృశ్యము,అనాత్మ
ఇదమిత్థము. సం. ఇది యిట్టిది.

ఇదానీంతనము. సం. విణ. ఇప్పటిది.
ఇది. స. ఈయది, ఏ తచ్ఛబ్దార్థకము (స్త్రీ జడపశ్వాది).
ఇదిగో } ద్ర. ఇదియని చూపుటను తెలిపెడిని.
ఇదిగో }
ఇద్దఱు. స. ఇరువురు (స్త్రీలుంగాని పురుషులుంగాని).
ఇద్ది. స ఇది, ఇదమర్థకము.
ఇద్దుగ, పాచికమీఁది రెండు బొట్లజత.
ఇద్దుము. రెండుతూములు.
ఇద్దెన. ఇక్కడ.
ఇద్ధపదము. దీప్తిమంతమైనస్థితి;ఉచ్చస్థితి.
ఇద్ధము. సం. ప్రకాశము. విణ. పరిశుద్ధము; ప్రకాశితము. [సమిధ.
ఇధ్మము. సం చిదుగు; వంటచెఱకు;
ఇనాము హిం. బహుమానముగా నొకవ్యక్తికి రాజులిచ్చెడు భూమి;బహుమతి.
ఇని. స. బ. ఇన్ని.
ఇను. స. రెంటికాదేశముగా వచ్చునది.
ఇనుంపకత్తి. ఇనుపకత్తి. [డు.
ఇనుఁడు. సం. సూర్యుఁడు; రాజు; మగఁ
ఇనుకు. బొంతుచేతఁగప్పబడిన అల్పధాన్యము. అ.క్రి. ఇంకు; శోషిల్లు.
ఇనుపకుందులు. బ. తలుపుబందులకాధారమైనయవి.
ఇనుపచిట్టెము. మండూరము.
ఇనుపదుద్దు. ముద్గరము.
ఇనుమడి. రెట్టి, ద్విగుణము.
ఇనుమడించు స.క్రి. రెట్టించు,ద్విగుణించు
ఇనుమద్ది. నల్లమద్ది. [పౌత్రుఁడు.
ఇనుమనుమఁడు మనుమని కొడుకు, ప్ర
ఇనుమనుమరాలు. ప్రపౌత్రి.
ఇనుమాఱు. రెండుమాఱులు.
ఇనుమిక్కిలి. విణ. అత్యధికము.
ఇనుము. కృష్ణాయసము, అయస్సు.
ఇన్ని. స. ఈసమస్తము; ఇంతసంఖ్యగలవి
ఇన్నూఱు. స. రెండునూఱులు.
ఇన్మడి. ఇనుమడి.
ఇన్మడించు. స.క్రి. ఇనుమడించు.
ఇన్సాల్వెంటు. ఇం. దివాలాతీయుట.
ఇపుడు. ఇప్పుడు.

ఇష్టు. ఇపుడు.
ఇప్ప. మధూకము†. రూ. ఇప్పె.
ఇప్పటిది. విణ. ఇదానీంతనము.
ఇప్పటివాఁడు. విణ. ఆధునికుడు.
ఇప్పపూరాజనములు. బ. శాలిధాన్య విశేషము.
ఇప్పించు. ప్రే. ఇయ్యఁజేయు.
ఇప్పుడు. ఇదానీమర్థకము, ఈకాలము.
ఇప్పెసారా. ఇప్పెపువ్వులతో వండిన సారా.
ఇబ్బంది. ఇక్కట్టు; మిక్కిలి నిర్బంధము; మూర్ఖుఁడు; అడవిపందికిని ఊరఁబందికిని పుట్టిన పంది; కీడువేళ.
ఇబ్బందిగాఁడు. బెబ్బులికిని చిఱుతపులికిని పుట్టిన పులి; ఎలుగుబంటి.
ఇబ్బడి. ఇనుమడి. ద్విగుణము.
ఇబ్బడించు. స. క్రి. ఇనుమడించు.
ఇబ్బెద. వృక్షవిశేషము.
ఇభనిమీలిక. సం. నేర్పు, చాతుర్యము.
ఇభము. సం. ఏనుఁగు.
ఇభ్య. సం. అందుగు†; ఆఁడేనుఁగు విణ. ఒడయురాలు.
ఇభ్యుఁడు. సం. విణ. ధనికుఁడు.
ఇమిడిక. అడకము; పొందిక.
ఇముడు. అ. క్రి. అడఁగు; పొందుపడు.
ఇముడుకొను. ప్రే. ఇముడ్చుకొను; అఱుపుకొను.
ఇముడుచు } ప్రే. ఇముడఁజేయు.
ఇముడ్చు }
ఇమ్మడి. ఇనుమడి, ద్విగుణము.
ఇమ్మడించు. స. క్రి. ఇనుమడించు.
ఇమ్ము. గృహము; స్థానము; విరివి; అనుకూల్యము; ఇంపు; ఉపాయము; సుఖము. విణ. అనుకూలము; అమూలము; మనోజ్ఞము; యుక్తము; స్పష్టము.
ఇమ్ముకొను. అ. క్రి. వసించు.
ఇమ్ముదప్పు. ఇక్కట్టు, సంకటము.
ఇయత్త. సం. కొలఁది.
ఇయ్య. ఈయ.
ఇయ్యకొను. స. క్రి. సమ్మతించు.
ఇయ్యకొల్పు. ప్రే. సమ్మతింపఁజేయు.
ఇయ్యకోలు. అంగీకారము.
ఇయ్యది. స. ఈయది, ఇది.
ఇయ్యసేయు. అ. క్రి. సమ్మతించు.
ఇయ్యెడ. అవ్య. ఇక్కడ.
ఇయ్యేఁడు. ఈ సంవత్సరము.
ఇర. సం. కల్లు; నీళ్లు; నేల; మాట; మేర.
ఇరమ్మదము. సం. మేఘమునందలి అగ్ని, పిడుగునిప్పు.
ఇరవారు. అ. క్రి. స్థిరపడు.
ఇరవు. గృహము; స్థానము; విణ. స్థిరము.
ఇరవుకొను. అ. క్రి. నెలకొను; స్థిరపడు.
ఇరవుపడు. అ. క్రి. ఇరవుకొను.
ఇరవొందు. అ. క్రి. ఒప్పు.
ఇరసాలు } ప్రభుత్వమువారికి భూస్వాములు పన్ను చెల్లించుట.
ఇరుసాలు }
ఇరసాలునామా. హిం. పంపఁబడినరూకల పట్టి.
ఇరాలు. ఈరాలు. [వాయువు.
ఇరింగణము. సం. వడగాలి, చండ
ఇరిణము. సం. విణ. చవుటి నేల; పాడైనది.
ఇరివిలి. సాగినతోఁజేయఁబడినరంధ్రము
ఇరు స. రెంటికాదేశముగా వచ్చునది.
ఇరుఁదలపాము. రెండుప్రక్కల తలలు గల ఒకపాము, రాజిలము.
ఇరుఁదలపులుఁగు. రెండు తలలు గల ఒక పక్షి, గండభేరుండము.
ఇరుఁబుట్టువు. పక్షి; ద్విజుఁడు.
ఇరుగడ. ఉభయపార్శ్వ సమాహారము. రూ. ఇరుచక్కి, ఇరుదెస, ఇరువంక.
ఇరుగడలు. బ. ఉభయపార్శ్వములు. రూ. ఇరుప్రేవులు, ఇరుగెలకులు, ఇరుచ(ప)క్కియలు, ఇరుదెసలు, ఇరువంకలు
ఇరుగు. ప్రక్కయిల్లు; ప్రక్క.
ఇరుగుడు. శింశప†.
ఇరుగురు. స. ఇద్దఱు.
ఇరుమూడు. ఆఱు.
ఇరుమేను. రెండు శరీరముల సమాహారము
ఇరులు. చీఁకటి, అంధకారము.
ఇరులుకొను. అ. క్రి. చీఁకటిపడు.
ఇరులుగొంగ. వెలుఁగుఱేఁడు, సూర్యుఁడు
ఇరువంద్రు. స. ఇరువది మంది.
ఇరువది. స. రెండుపదులు, వింశతి.

ఇరువయి. స. ఇరువది.
ఇరువాయికట్టు. మలమూత్రబంధరోగము, ఆనాహము.
ఇరువాయిపక్కి. గండభేరుండపక్షి.
ఇరువా(చే)లు దుక్కి. రెండు మాఱులు దున్నిన పొలము.
ఇరువు. ఇరుగు.
ఇరువుడు. ఇరుగుడు†.
ఇరువురు. స ఇద్దఱు.
ఇరుస. రెండు కుంచములు, అర్ధాఢకము.
ఇరుసు. బండియిరుసు, రథాక్షము; ఏతపుమ్రాని నడిమి యడ్డుకొయ్య.
ఇర్వది. స. ఇరువది.
ఇఱి. సూక్ష్మత్వము; తనుత్వము; ఇఱ్ఱి. విణ. ఇరుకైనది; సన్ననిది.
ఇఱికి. బాలక్రీడా విశేషము.
ఇఱికికొను. అ.క్రి. ఇముడుకొను.
ఇఱియు. అ.క్రి. కదియు; నలఁగు.
ఇఱివిరి. సంకోచవ్యాకోచములను చెందుటకు మినుకుమినుకు మనుట.
ఇఱుకటము } ఇరుకుచోటు, సంకుచిత
ఇఱుకాటము } స్థలము.
ఇఱుకు. ఇఱుకటము ; గొంది. అ. క్రి. కొంచెపుతావున అడఁగు; రెంటిసందున చిక్కి అడుముడుపడు. ప్రే. కొంచెపుతావున అడఁచు; రెంటిసందున చిక్కఁబట్టి అడుము.
ఇఱుకుమ్రాను. వెలఁగు లోపలికిఁబోవు ద్వారమునందు ఒక్కొక్క మనుష్యుఁడుగా సంకటపడిపోఁదగినట్లు నాటిన పంగ గల గుంజ.
ఇఱుతిగ. స ఆఱు.
ఇఱుదాము. రెండుతూముల ప్రమాణము.
ఇఱునాలుగు. స ఎనిమిది.
ఇఱుము. మఱుఁగు.
ఇఱుముకొను. అ.క్రి. మఱుఁగుపడు.
ఇఱ్ఱి. జింక, హరిణము.
?ఇఱ్ఱింతలు. బ. దృష్టివిశేషము.
ఇఱ్ఱింకులు. బ. మిక్కిలి యింకాటలు.
ఇఱ్ఱింకులింకు అ.క్రి. ఇప్పస్తుపడు;అడఁగు
ఇఱ్ఱింకులుచేయు. స.క్రి. అణఁచు.
ఇఱ్ఱిగోఱజము. కస్తూరి.
ఇఱ్ఱియలు. బ. ప్రక్క, పార్శ్వము.

ఇల్. ఇలు.
ఇల. సం. భూమి; గోవు; మాట; బుధుని భార్య.
ఇలకఱచు. స. క్రి. (మనస్సు మెం||)బిగఁబట్టు; పండ్లుబిగించు.
ఇలకోడి. ఈలపురుగు. చిమ్మట.
ఇలాకా. హిం. సంబంధము.
ఇలాపతి. సం. బుధుఁడు; రాజు.
ఇలాయి. చుట్టవత్తులు వేసెడు దివ్వటీ.
ఇలారము. ఇలువరము.
ఇలి. మెతుకు. సం. చిన్నకత్తి; ఎలుక ?
ఇలిక. సం. భూమి.
ఇలికము సం. ఎలుక.?
ఇలిపాషాణము. ఉల్లిపాషాణము;? ఎలుకలబోను.?
ఇలు. ఇల్లు (వృత్తియందు) కులము.
ఇలుకు కీళ్ళనరము బెణకుట.
ఇలుగు. అ.క్రి. ఈలుగు, చచ్చు.
ఇలునింపడము. వధూవరుల నూతన గృహప్రవేశము.
ఇలుపుట్టు ఇలువరుసను వచ్చినది.
ఇలుపుట్టులెంక. ఇంటిసేవకుఁడు.
ఇలుఱేఁడు. గృహస్థుఁడు.
ఇలువడి. కులీనత; మంచినడత; మానము; అభిమానము.
ఇలువరము. గోడలు లేని మెత్తుడుగుడిసె; తృణముచేనేర్పఱుపఁబడినపుట్టివంటిగూడ
ఇలువరుస. వంశానుక్రమము.
ఇలువారము. ఇలువరము.
ఇలువేలుపు. కులదేవత.
ఇల్కఱచు. స. క్రి. ఇలకఱచు.
ఇల్లంట్రము. ఇల్లఱికము.
ఇల్లటము. ఇల్లఱికము.
ఇల్లడ. పదిలపఱచి పెట్టి అడిగినప్పుడు ఇమ్మని యేదేని యొక వస్తువును ఒకరి వద్ద దాఁచుట, న్యాసము; కాపురము;? అప్పగింత.?
ఇల్లడయిడు. స. క్రి. న్యాసముపెట్టు.
ఇల్లము. రెండుపలములు.
ఇల్లరి. ఇంటికప్పు.
ఇల్లఱికము. అల్లుఁడు మామగారియింటనే వాసముగా నుండుట.
ఇల్లవ. ఒక చేప.

ఇల్లాడి. మి. ఇంటిల్లపాది.
ఇల్లామల్లి. కొండెగాఁడు, పిశునుఁడు.
ఇల్లాలు. గృహిణి, భార్య; పతివ్రత; స్త్రీ
ఇల్లి. ఉపవాసము.
ఇల్లింద. ఇంద్రవల్లి†.
ఇల్లిగులు. బ. మిక్కిలి వెనుకకొఅగుటలు.
ఇల్లిముక్కు. పగిలి నెత్తురు కారెడి ముక్కులోపలి భాగము.
ఇల్లు. ఉనికిపట్టు; గృహము.
ఇల్లువాసితిరుగు. సంన్యాసి.
ఇల్లెము. ఆకుజెల్ల, ఒక చేఁప.
ఇల్వడి. ఇలువడి.
ఇల్వలలు. బ. మృగశిర శిరోభాగమునఁ గల నక్షత్రగణవిశేషము
ఇవక. శైత్యము.
ఇవతల. ఈవలిప్రదేశము; ఈ పిమ్మట.
ఇవత(తా)ళించు. అ.క్రి. చల్లనగు.
ఇవతాళింపు. శైత్యము.
ఇవము. మంచు, హిమము; శైత్యము.
ఇవముకొను. అ.క్రి. తడియు.
ఇవముమేపరి. సూర్యుఁడు.
ఇవమునూడు. సూర్యుఁడు.
ఇవల. ఈవల.
ఇవి. స.బ. ఇయ్యవి.
ఇవిరించు. అ.క్రి. చిగిరించు; ఎఱ్ఱనగు.
ఇవురు. చిగురు. అ.క్రి. ఇంకు.
ఇవురుచు. అ.క్రి. ఇగురుచు, ఇవుర్చు.
ఇవులుచు. స.క్రి. ఇగులుచు, ఇవుల్చు.
ఇవ్వల. ఈవల.
ఇషణము. సం. ఇచ్ఛయించుట.
ఇషము. సం. ఆశ్వయుజ మాసము.
ఇషి(షీ)క. సం. ఱెల్లు; దర్భయూఁచ; ముండ్లదుబ్బు; ఏనుఁగు కనుగుడ్డు; కలము; చిత్తరువు వ్రాసెడి కుంచె; ముంజెనడుమనుండు గడ్డియూఁచ.
ఇషుధి. సం. అమ్ములపొది.
ఇషువు సం. బాణము, అమ్ము.
ఇష్ట. సం. ప్రేయసి, ప్రియురాలు, భార్య.
ఇష్టక. సం. ఇటుక, ఇటికఱాయి.
ఇష్టకాపథము. సం. పట్టివేరు; ఇటికలతోఁ గట్టినదారి.
ఇష్టగంధము. నూఁగుదోస†; సువాసన. విణ. సుగంధిద్రవ్యము.
ఇష్టగోష్ఠి. సం. ఇష్టాగోష్ఠి.
ఇష్టదేవత. సం. ప్రియదైవము.
ఇష్టదైవము. సం. ఇష్టదేవత.
ఇష్టపూర్తము. సం. ఇష్టాపూర్తము; అన్నదానము?.
ఇష్టభోగము. సం. కోరిన సౌఖ్యములనుభవించుట.
ఇష్టము. సం. యజ్ఞము, యజ్ఞములో చేసెడి హోమదానాదిక్రియ; సంస్కారము; ఇటిక; ధర్మకార్యము; ప్రియము; ఆత్మ, బ్రహ్మము; ఆముదము†. విణ. ప్రియమైనది; పూజింపఁబడినది; కోరఁబడినది; సమ్మతము.
ఇష్టలింగము. సం. విణ. ఆరాధ్యులర్చించు త్రివిధలింగములలో నొకటి. (త్రివిధలింగములు—ఇష్టలింగము, భావలింగము, ప్రాణలింగము.)
ఇష్టసఖుఁడు. సం. ప్రియస్నేహితుఁడు.
ఇష్టాగోష్ఠి. సం. ప్రియముగా స్నేహితులతో చేయు నిచ్ఛాప్రసంగము.
ఇష్టాపూర్తము. సం. యాగాది రూపమగు శ్రౌతకర్మము వాపీకూపతటాకాది రూపమగు స్మార్తకర్మము.
ఇష్టి. సం. యజ్ఞము; ఇచ్ఛ.
ఇష్టిక. సం. ఇటిక.
ఇష్టుఁడు. సం. ఆప్తుఁడు; చెలికాఁడు. విణ. ప్రియమైనవాఁడు.
ఇష్వాసనము. సం. విల్లు; అమ్ములపొది.
ఇష్వాసుఁడు. సం. విలుకాఁడు.
ఇసడిలు. అ. క్రి. విసుగు.
ఇసిరో. అవ్య. ఇసీ.
ఇసిఱింతలు. బ. చలనము.
ఇసిఱింతలువాఱు. అ.క్రి. చలించు, అదరు
ఇసీ. అవ్య. నిందించుటను తెలిపెడిని.
ఇసుక. ఒకటితో నొకటి యంటని పొడి నూకలవంటి మట్టిదినుసు, (సమూహవాచకమైన) సికత.
ఇసుకదాసరి. ఒకపూర†.
ఇసుకదిన్నియ, ఇసుకదిన్నె } ఇసుకదిబ్బ, పులినము.
ఇసుకదొందు. ఒకచేఁప.

ఇసుకపులకండము. కండచక్కెర.
ఇసుకబేలు. ఒకతీఁగ.
ఇసుకమ్రానుు. ఉలిమిరిగ్.
ఇసుకుంత—లు. స్వల్పపరిమాణము.
ఇసుము. ఇసుక, వాలుక. రూ. ఇసుమ్ము.
ఇసుళ్లు. బ. ఱెక్కచెదలు.
ఇస్రూ్క. ఇం. మరిమేకు.
ఇస్త్రిరి(రీ). హిం. చిన్న యినుపపెట్టెలో నిప్పులు వేసి బట్టలమీఁదరాచి నునుపు చేయుట.
ఇస్తిహారు. హిం. ప్రకటన.
ఇస్తిహారునామా. హిం. ప్రకటన పత్రిక.
ఇస్తువు. సొత్తు, స్వామ్యము.
ఇస్పేటు. ఇం. చీట్లాటయందలి ఒక కాకితము పేరు.
ఇస్సిరో. అవ్య. ఇసిరో.
ఇస్సీ. అవ్య ఇసీ; విసుగునందలి ధ్వన్యనుకరణము (ఇస్సీ ఎంతలుబుట్టె అని.)
ఇహపరములు. సం. ఈలోకము మఱియు పరలోకము.
ఇహము. సం. అవ్య. ఈలోకము; ఈ లోకమునందలి సుఖము.
ఇహలలాటాక్షుఁడు. సం. ఈలోకమందలి శివుఁడు.
ఇహాముత్రఫలము. సం. ఇహపరలోకములందలి కర్మఫలము.
ఇహాముత్రలు. సం అవ్య. ఇహపరములు.
ఇహిహీ. నవ్వుటయందలిధ్వన్యనుకరణము అవ్య. ఇసీ.
ఇళ. సం. ఇల.



# ఈ

ఈ. ఎదుటనుండు దానిని దెలుపును; స్వప్రకాశము అపరోక్షమున నెడి అర్థమును సూచించును. (అవ్య. పశ్నార్థము (ఏరీ నీసాటి వేల్పులు అని); ప్రార్థనార్థకము (పోషించుమీ అని).
ఈంద్ర. ఈడిగ, సురా జీవి; తాటిచెట్టు మున్నగువానిని గీఁచి జీవించెడు జాతి.
ఈంద్రది. ఈంద్రజాతి స్త్రీ
ఈంద్రము. పీడనము.
ఈంద్రవాఁడు. సురాజీవి.
ఈంగ్రించు. స. క్రి. పీడించు.
ఈఁక. పక్షియొఱక. రూ. ఈఁకె.
ఈఁకు. అ. క్రి. ఇంకు; నిర్జలమగు.
ఈఁగ. మక్షిక.
ఈఁగపులి. ఈఁగనుపట్టెడు సాలీఁడు.
ఈఁగు. అ. క్రి. ప్రవేశించు. స.క్రి.తొలఁగించు, పోఁగొట్టు.
ఈఁచే. ఊఁచ.
ఈఁజేటి. ఇంజేటి.
ఈఁటియ. ఈఁటె.
ఈఁటె. ప్రాసము, కుంతాయుధము.
ఈఁటెకాఁడు. ఈఁటె ఆయుధముగాఁగలవాఁడు, కొంతికుఁడు.
ఈఁడు. కలవాఁడు అనెడి అర్థమునందు వచ్చెడి ఒక పుం ప్రత్యయము.
ఈఁత. తరణము, ఈఁదుట; పశ్వాదులు ఈనుట.
ఈఁతకల్లు. ఈఁతచెట్టుకల్లు.
ఈఁతకాఁడు. ఈఁదెడువాఁడు, తర్త.
ఈఁతకాయ. ఈఁదుటకు సహాయమగు సొఱకాయ; పరూషీఫలము.
ఈఁతకొట్టు. అ.క్రి. ఈఁదు, తరించు.
ఈఁతచెట్టు. ఈఁదు, పరూషి, ఖర్జూరికగ్.
ఈఁతబెల్లము. ఈఁతకల్లుతో వండిన బెల్లము
ఈఁద } చలిగాలి, అత్యంత శీతల
ఈఁదర } వాయువు.
ఈఁదాడు. గిఱకతాటిచెట్టు.
ఈఁదు. పరూషి, ఈఁతచెట్టు; గాలి. అ. క్రి. ఈఁతకొట్టు. స. క్రి. దాఁటు, తరించు.

ఈఁదులాడు. అ క్రి. ఈఁతకొట్టు; వ్రేలాడు
ఈకువ. తడి, ఆర్ద్రిత.
ఈకె. స. ఈమె, ఈ స్త్రీ.
ఈకొను. స. క్రి. ఈయకొను.
ఈకోలు. ఈయకోలు.
ఈక్ష. సం. దృష్టి.
ఈక్షణము. సం. కన్ను; చూపు, చూచుట; ఏతత్క్షణము.
ఈక్షణిక. సం. సోదెకత్తె, దైవజ్ఞ.
ఈక్షించు. సం స. క్రి. చూచు; భావించు.
ఈక్షిక. సం. దృష్టి.
ఈగడ. జాడ, పోబడి.
ఈగి. ఈవి, త్యాగము, దానము.
ఈగికాఁడు. విణ. ఈవికాఁడు, త్యాగి.
ఈగిమ్రాను. ఈవిమ్రాను, కల్పవృక్షము.
ఈగు. అ. క్రి. ఇగ్గు.
ఈచ. (కాలుసేతుల) వంకర.
ఈచేపడు. అ. క్రి. (కాలుసేతులు) వంకరగు
ఈచఁబోవు. అ. క్రి. ఈచపడు.
ఈచు. అ. క్రి. (పాఁడిపసులపాలు) వట్టు.
ఈచుకపోవు. అ. క్రి. (ఆవు) చావుదూడ వేయు.
ఈటు. విణ. వ్యర్థము; శూన్యము.
ఈటుపోవు. అ. క్రి. వ్యర్థమగు; శూన్యమగు.
ఈట్టు. సం. ఈశ్వరుఁడు.
ఈడ. ఒక ఎఱ్ఱ కత్తెలి, పారేవతము†. అవ్య. ఇక్కడ.
ఈడఁబోవు. అ. క్రి. వెనుదీయు.
ఈడము. ఈళము, లంక, సింహళద్వీపము.
ఈడముపేఁట. సింహళద్వీప వానులుండెడి పేఁట.
ఈడాడు. స. క్రి. మార్కొను.
ఈడిక. గడ్డిమున్నగునవి తెచ్చెడి బండి పరము వంటిఒక పనిముట్టు; కంపతోడుగు
ఈడిగ. ఈంద్ర రూ. ఈడిగె.
ఈడిగది. ఈడిగజాతి స్త్రీ.
ఈడిగవాఁడు. ఈడిగజాతివాఁడు.
ఈడిగిలఁబడు. అ. క్రి. భయాదులచే రానని మొండికెసికొని కూర్చుండు.
ఈడిగిల్లు. అ. క్రి. ఈడిగిలఁబడు.
ఈడితము. సం. విణ. స్తుతింపఁబడినది.
ఈడు. ప్రాయము; యౌవనము. విణ. సమానము. అ. క్రి. చాఁగు; జాఱు. స. క్రి. పిసుకు.
ఈడుచు. ప్రే. తిగుచు, ఆకర్షించు.
ఈడుపడు. అ. క్రి. సమానమగు.
ఈడుపు. ఆకర్షణము; విలంబనము; గోడదరిసి. బ. బుగడల గొలుసు
ఈడుముంత. పాలుపిదుకుపాత్రము.
ఈడె. ఈడ, పారేవతము†.
ఈడేఱు. అ. క్రి. యౌవనవతియగు; వర్ధిల్లు; నెఱవేఱు, సఫలమగు.
ఈడ్గిలఁబడు. అ. క్రి. ఈడిగిలఁబడు.
ఈడ్చు. స. క్రి. లాగు.
ఈడ్యము. సం. విణ పొగడఁదగినది.
ఈతఁడు. స. ఇతఁడు, ఈపురుషుఁడు.
ఈతగాఁడు. స. ఇతఁడు (స్వార్థమున కాఁడు).
ఈతల. ఈవలి ప్రదేశము.
ఈతి. సం. అతివృష్టి మొ॥ (వడీతులు— వాన, వఱపు, ఎలుక, చిలుక, మిడుత, చేరువరాజు); దేశోపద్రవము; ఊరు విడిచి పోవుట.
ఈదృక్కు, ఈదృక్షము, ఈదృశము. సం. విణ. ఇట్టిది, ఇటువంటిది.
ఈదృశి. సం. ఇటువంటి యాఁడుది.
ఈదృశుఁడు. సం. విణ. ఇటువంటివాఁడు
ఈన. చీఁపురుపుల్ల; ఈనె.
ఈనరాని. పూర్ణముగా పండని వడ్లరాశి.
ఈనాము. ఇనాము.
ఈనిక. (పశువులు) ఈనుట, ఈఁత.
ఈనికయావు. ఈనునట్టియావు.
ఈనియ. ఈనె.
ఈను. స. క్రి. (పశ్వాదులు) ప్రసవించు; కలిగించు; చేను ఈను.
ఈనె. ఆకులనరము; చీఁపురుపుల్ల.
ఈనెగాజులు. బ. బాలికాక్రీడావిశేషము
ఈపి. తలయందుండెడు ఈరు, లిఖ.
ఈపె. స. ఈమె, ఈ స్త్రీ.
ఈప్స. సం. ఇచ్ఛ, కోరిక.
ఈప్సితము. సం. కోరిక. విణ. కోరఁబడినది.
ఈబరి. విణ. నిష్ప్రయోజకుఁడు.

ఈబరిగొట్టు. విణ. ఈబరి.
ఈబిడ. స. ఈమె. రూ. ఈబిడె.
ఈమిరి. తడి, ఆర్ద్రిత.
ఈము. ఇవము.
ఈమె. స. ఈ పూజ్యురాలు.
ఈయ. అపేక్ష.
ఈయక. ఈ. స్త్రీ. రూ. ఈయప, ఈయమ
ఈయకొను స. క్రి. అంగీకరించు.
ఈయకోలు. ఈయకొనుట; అంగీకారము.
ఈయది. స. ఇది.
ఈయన. స. ఈతఁడు.
ఈయప. ఈయమ.
ఈరణము. సం. ప్రేరణము; పోక; చొటి నేల. విణ. పురికొల్పునది.
ఈరము పొదరిల్లు.
ఈరస. ఈర్ష్య; కోపము; ద్వేషము.
ఈరసము. అసూయ, ఈర్ష్య.
ఈరసించు. అ. క్రి. ఈర్ష్యపడు; కోపించు; ద్వేషించు.
ఈరాఱు. స. పండ్రెండు.
ఈరిక. మొలక; చీరిక.
ఈరిణము సం. ఇరిణము.
ఈరితము. సం. విణ. చెప్పఁబడినది; ప్రేరేపింపఁబడినది; త్రోయఁబడినది.
ఈరు. మీరు, తమరు; పేనుగ్రుడ్డు, ఈపి; మాంసము; వ్యతిరేకార్థకము (ఈయ రనుట). విణ. అల్పము; హీనము; వృత్తియందు అచ్చు పరముగుచో రెంటికా దేశము. [రూ. ఈర్పు.
ఈరుచు. స. క్రి. ఈర్పెనతో ఈళ్లను ఈడ్చు.
ఈరుపెన. ప్రసాధని, ఈళ్ళను ఈర్చెడు దువ్వెన. రూ. ఈరుపేన.
ఈరుబాఱు. యథేచ్ఛ.
ఈరువాఱు. ఆనివాఱు.
ఈరువు. ఎఱచి, మాంసము.
ఈరె. పంటెనుచుట్టితీసిన నూలు.
ఈరెండ. కొంచెపాటి ఎండ.
ఈరెలుఁగు. హీనస్వరము.
ఈరేడు. స. పదునాలుగు.
ఈరేను. స. పది.
ఈరైదు. స. పది.
ఈర్పెన. ఈరుపెన, కంకతిక.
ఈర్మము. సం. కుఱువు; గాయము.
ఈర్య. సం. ఈర్ష్య; ఆచారము; వ్రతానుష్ఠానము.
ఈర్ష్య. సం. ఓర్వలేనితనము, ఈరస.
ఈర్ష్యాళువు. సం. విణ. ఉడుకుఁబోతు, ఈర్ష్యపడు స్వభావముగలవాఁడు.
ఈఱతాఱలు. బ. వక్రము; పరుషము; అఱువుళ్లు; హెచ్చుతగ్గులు?
ఈఱమి. తీఁగలు మొదలగువానిఱచు జొంపము. విణ తఱచైనది.
ఈఱము. విణ. తఱచు, సాంద్రము.
ఈల. ఒకకూరాకు; చిమ్మటకూఁత; గోపకులు మొదలైనవారి సంగీతధ్వని, సిగ్గు; బోయవాఁడు మృగాదులకోసము పెట్టెడి కూఁత.
ఈలకఱచు. స. క్రి. ఇలకఱచు.
ఈలకూఁతలు. బ. బాలక్రీడా విశేషము.
ఈలగ్రద్ద. ఒకడేగ. విణ. లోభి.
ఈలపురుగు. ఇలకోడి, చిమ్మట, ఝిల్లిక.
ఈలాగు. ఈ విధము.
ఈలుగు. అ. క్రి. చచ్చు, మరణించు.
ఈలువు. పాతివ్రత్యము; ధైర్యము.?
ఈల్గు. అ. క్రి. ఈలుగు.
ఈవ. ఈఁగ.
ఈవరి. విణ. ఈవికాఁడు, త్యాగి.
ఈవల. ఈప్రక్క; ఇటువిమ్మట.
ఈవి. త్యాగము, దానము.
ఈవికాఁడు. విణ. త్యాగి.
ఈవు. ఇయ్యవనుట. స. నీవు.
ఈవులమొదవు. కామధేనువు.
ఈవులమ్రాను. కల్పవృక్షము.
ఈవులరతనము. చింతామణి.
ఈశ. సం. ఈష.
ఈశత్వము. సం. ఈశిత్వము.
ఈశానము. సం. జ్యోతి. [కుఁడు.
ఈశానుఁడు. సం. శివుఁడు; అష్టమదిక్పాల
ఈశిత. సం. ఈశిత్వము. విణ. ఒడయుఁడు, ప్రభువు. [నియామకత్వము.
ఈశిత్వము. సం. అష్టసిద్ధులలో నొకటి,
ఈశుఁడు. సం. రాజు; శివుఁడు.

ఈశ్వర. సం. ఒక సంవత్సరము; దుర్గ; నియామకురాలు. [విశేషము.
ఈశ్వరప్రియములు. సం. బ. ధాన్య
ఈశ్వరాగమములు సం.బ. శైవాగమములు
ఈశ్వరి. సం. పార్వతీదేవి; ఒక ఓషధి†.
ఈశ్వరుఁడు. సం. ధనవంతుఁడు; ప్రభువు; శివుఁడు; పరమాత్మ.
ఈష. సం. నాఁగటియేఁడికోల.
ఈషణ-ము. సం. ఇచ్ఛ.
ఈషణాత్రయము. సం. పెండ్లాము బిడ్డలు ధనము-వీనియందాస; పుత్ర విత్తలోకైషణలు [కుంచె; ఒక అస్త్రము.
ఈషిక. సం. ఏనుఁగు కనుగ్రుడ్డు; కలము;
ఈసడము. దూఱు, నింద.
ఈసడించు. అ. క్రి. రోఁతపడు; కోపించు. స. క్రి. నిందించు.
ఈసపిట్ట. ఒక చేఁప.
ఈసరుఁడు. ఈశ్వరుఁడు.
ఈసు. ఈర్ష్య; కోపము; వైరము.
ఈసుకాఁడు. ఉడుకుఁబోతు, ఈర్ష్యాళువు
ఈహ. సం. కోరిక; కడఁక.
ఈహమానుడు. సం. విణ. కోరుచున్నవాఁడు. [విశేషము.
ఈహామృగము. సం. తోఁడేలు; నాటక
ఈహితము. సం. విణ. కోరఁబడినది.
ఈహీ. అవ్య. ఇసీ.
ఈళము. సింహళద్వీపము. రూ. ఈళాము
ఈళిక. సం. కత్తిపీఁట; చురకత్తి.
ఈళితము. సం. విణ. పొగడఁబడినది.

## ఊ

ఊ. సం. విష్ణువు; ప్రణవము నందలి ద్వితీయమాత్ర.
ఊంకించు. అ. క్రి. పూను, యత్నించు.
ఊంకు. సమ్మతి. అ. క్రి. ఎగురు.
ఊంకుటుంగరము. వధూవరులు వివాహము చేసికొనుటకు పరస్పరము సమ్మతించి మార్చుకొనెడి ఉంగరము.
ఊంకువ. ఓలి, అల్లుఁడు కన్యకకై మామకిచ్చెడు ధనము, కన్యాశుల్కము.
ఊంగ. బిడ్డలకు పోసెడి ఉగ్గు.
ఊంగరపువ్రేలు. చేతి చిటికెన వ్రేలికి ముందు వ్రేలు, అనామిక.
ఊంగరము. వ్రేలియాభరణము, ఊర్మిక.
ఊంగిడి. నామను ఆముదపాకులను మేయుటచేపశువులకు కలిగెడి ఒక వ్యాధి
ఊంగుటము. బొటనవ్రేలు.
ఊంగము. ఉంగరము.
ఊంచు. క్రి. ఉనుచు, పెట్టు, ఉండఁజేయు
ఊంచుకొను. క్రి. పెట్టుకొను.
ఊంఛము. సం. ఊంఛవృత్తి, ఓళ్లయొద్దఁగాని చేనుమళ్ళలోఁగాని అక్కడక్కడ పడిన ఒక్కొక్క గింజను ఏఱుకొని జీవించుట.
ఊంట. ఉండ; ఉండుట. విణ. గుండ్రము
ఊంటగాలము. సీసపుగుండు కట్టిన ఒక గాలము.
ఊండ. మన్ను మొదలైనవానిచే చేయఁబడిన గుళిక, గోళము. విణ. గుండ్రము, గుండ్రనిది.
ఊండక్రోవి. చేతికఱ్ఱ, లాతము.
ఊండసురియ. ఒక ఆయుధము.
ఊండి. ఒక ప్రత్యయము అవ్య మొదలుకొని అను నర్థమును తెలుపునది.
ఊండించు స. క్రి. ఉండఁజేయు.
ఊండు. అ. క్రి. వసించు; వర్తించు; శేషించు.
ఊండ్ర. వెలిచంద్ర†
ఊంద్రము. విణ గుండ్రము, గుండ్రనిది.

ఉండ్రములు. బ. ఉండ్రాలు, మోదకములు.
ఉండ్రస. ఉండ్ర†.
ఉందురము. సం. ఎలుక; పందికొక్కు.
ఉందురువు. సం. ఎలుక.
ఉంపడము సం. గుత్తగా వేశ్యనుంచుకొనుట.
ఉంబ. గోవుల అంభారవము.
ఉంబళి, ఉంబళిక } విణ. పన్నులేని భూమి, గ్రామము మొ.
ఉక్క. ఉమ్మ, ఉష్ణము.
ఉక్కఁబట్టు. స.క్రి. వదలు.
ఉక్కడఁ(బఁ)గు. అ.క్రి. ఉక్కుచెడు; బలహీనమగు; చచ్చు.
ఉక్కడము. విణ. గొప్ప.
ఉక్కడీఁడు. విణ. బంటు, శూరుఁడు.
ఉక్కణఁచు, ఉక్కణగించు } స.క్రి. బలహీనము చేయు; చంపు. రూ. ఉక్కడఁచు.
ఉక్కణము. కావలి.
ఉక్కరి. విణ. శౌర్యవంతుఁడు.
ఉక్కఱు. అ.క్రి. ఉక్కడఁగు.
ఉక్కలుఁడు. విణ. ధురంధరుఁడు.
ఉక్కళము. దండును చుట్టువేసిన కంపకోట; శత్రువులెత్తివచ్చుటను తెలిసికొనుటకై ఉంచు కావలి, కోవురము; పురాభిముఖమైన రాజమార్గము.
ఉక్కిరిబిక్కిరి. విణ. ఊపిరితిరుగనిది.
ఉక్కివము. కపటము, కుచ్చితము.
ఉక్కివుఁడు. విణ. కపటి.
ఉక్కిస. పొడిదగ్గు
ఉక్కీఁడు. విణ. మూర్ఖుఁడు.
ఉక్కు. లోహసారము; శరీరబలము; శౌర్యము; స్థైర్యము. అ.క్రి. చచ్చు; నలఁగు
ఉక్కుతీఁగ. (వీణె మొదలైనవానికి వేసెడు) ఉక్కుతంతి.
ఉక్కుతునియ, ఉక్కుతునుక } విణ. ధీరుఁడు; శూరుఁడు
ఉక్కుమడఁగు. అ.క్రి. ఉక్కుచెడు; చచ్చు. (ప్రే. ఉక్కుమడఁచు.)
ఉక్కెఱ. చక్కెర చేర్చి పొరటిన పిండి.

ఉక్త. సం. ఒకఛందస్సు.
ఉక్తము. సం. విణ. చెప్పఁబడినది.
ఉక్తి. సం. మాట, వాక్కు.
ఉక్థము. సం. సామవేదము.
ఉక్షము. సం. ఎద్దు, వృషభము.
ఉఖ. సం. వంటకుండ; సూర్యకిరణము.
ఉఖ్యము. సం. విణ. కుండలో వండిన భక్ష్యము మొ.
ఉగము. ఆయువు; ఊపిరి.
ఉగాది. సం. చాంద్రాయణ సంవత్సరాది
ఉగ్గడించు. అ.క్రి. మ్రోఁగు, ధ్వనించు. స.క్రి. పలుకు, వచించు.
ఉగ్గడువు. విణ. మిక్కిలి, అధికము.
ఉగ్గము. చేతఁబట్టుకొనిపోవుటకు అనుకూలముగా కలశాదుల మెడను కట్టెడి త్రాడు.
ఉగ్గళించు. అ.క్రి. నట్టువుఁడు కొలిపించు
ఉగ్గించు. స.క్రి. (పడుగు పేకలపోఁగులను) చేర్చు.
ఉగ్గు. ముదుత; బిడ్డలకు కలిపి పోసెడి చనుఁబాలాముదము మొ.
ఉగ్గుడు. మేర, హద్దు.
ఉగ్గుపడు. అ.క్రి. ముదుతపడు.
ఉగ్గులువాఱు. అ.క్రి. (నూలిపోఁగు) మెలిపడు.
ఉగ్మలి. ఆఁడుది; భయపడుస్వభావముగలది.
ఉగ్ర. సం. వస†. విణ. భయంకరురాలు
ఉగ్రగంధ. సం. ఒక ఓమము†; వస†.
ఉగ్రము. సం. విణ. భయంకరము; ఉత్కటమైనది.
ఉగ్రాక్షుఁడు. సం. ముక్కంటి, శివుఁడు.
ఉగ్రాణము. సామగ్రులుంచెడు గది, కోష్ఠము; ధనాగారము.
ఉగ్రుఁడు. సం. రుద్రుఁడు; శూద్రస్త్రీయందు క్షత్రియునకుఁబుట్టి కోశరక్షణాదులచే బ్రదుకువాఁడు. విణ. భయంకరుఁడు.
ఉచ్చిత. ఉస్తె, కుండ†.
ఉచితజ్ఞుఁడు. సం. విణ. యోగ్యతనెఱిఁగినవాఁడు.
ఉచితము. సం. విణ. యోగ్యము, తగినది; ఉంచఁబడినది; ఎఱుఁగఁబడినది;

కొలఁదియిడఁబడినది; ధనము లేకుండ ఇచ్చునది. [గలది; వేగముగలది.

ఉచ్చండము. సం. విణ. ఆగ్రహము

ఉచ్చంద్రము. సం. అపరరాత్రము.

ఉచ్చట. సం. వట్రువముస్తె†.

ఉచ్చము. సం. వినఁబడునట్లు చేసెడి జపవిశేషము; గ్రహస్థాన విశేషము. విణ. ఉన్నతము, పొడవు.

ఉచ్చయము. సం. సమూహము; కోఁకముడి

ఉచ్చరణము. సం. ఉచ్చారణము.

ఉచ్చరించు. సం. స. క్రి. వాక్రుచ్చు, చెప్పు; రచించు.

ఉచ్చరితము. సం. విణ. ఉచ్చరింపఁబడినది

ఉచ్చరియించు సం. స. క్రి చేయు, ఒనరించు.

ఉచ్చాటనము సం. వెళ్లఁగొట్టుట; శత్రువు నొకచోట నిలువకుండునట్లు చేసెడి అభిచారవిశేషము. [గించు.

ఉచ్చాటించు. సం. స. క్రి. వెళ్లఁబెల్ల

ఉచ్చారణము. సం. ఉచ్చరించుట.

ఉచ్చారము. సం. మలము.

ఉచ్చావచము. సం. విణ. నానావిధమయినది; హెచ్చుతగ్గులుగలది.

ఉచ్చి. సోఁడు, బ్రహ్మరంధ్రము.

ఉచ్చిఁత
ఈచ్చింత } ఉస్త్రె, కుండ, వికీగణము†.

ఉచ్చిచ్చిరె. కుక్కను పిలుచుట యందగు ధ్వన్యనుకరణము.

ఉచ్చైశ్శ్రవము(స్సు). సం. నిక్కువీనుల జక్కి, ఇంద్రుని గుఱ్ఱము.

ఉచేకరించు. అ. క్రి. (అనాదరముచే) ఉచుక్కుమను. [నుకరణము.

ఉచెక్కు. ఉచుకరించుటయందగుధ్వన్య

ఉచ్చె. కాలుముడి, మూత్రము.

ఉచ్చెబుడ్డ నీరుతిత్తి, క్లోమము.

ఉచ్చెమల్లి. దిసమొల ఆఁడుది, నగ్నస్త్రీ

ఉచ్చు. ఉరి, వాగుర. అ. క్రి. నాటు; వెడలు; దూరు.?

ఉచ్ఛిష్టము. సం. విణ. ఎంగిలి, భుజింపఁగా మిగిలినది.

ఉచ్ఛూనము. సం. విణ. దట్టము.

ఉచ్ఛృంఖలము. సం. విణ. అడ్డపాటు లేనిది. [ఔన్నత్యము.

ఉచ్ఛ్ర (చ్ఛ్రా) యము. సం. పొడవు,

ఉచ్ఛ్రితము. సం. విణ. పెరిగినది; పొడవైనది; పుట్టినది.

ఉచ్ఛ్వసితము. సం. ఊపిరి వెలికిఁబుచ్చుట. విణ. ఊపిరి వెలికిఁబుచ్చినది.

ఉచ్ఛ్వాసము. సం. ఎగయూపిరి; ఊపిరి వెలిఁకిబుచ్చుట; ఊరట; కలఁజు; ఆఖ్యాయికాపరిచ్ఛేదము.

ఉచ్ఛ్వాసరోధము. సం. ఊపిరికుట్టు.

ఉజాడు. హిం. విణ. పాడైన.

ఉజ్జయిని. సం. అవంతి, ఒక మోక్షపురి.

ఉజ్జి. విణ. ఉద్ది, సమానము.

ఉజ్జిజీవిషువు. సం జీవింపనిచ్ఛగలఁవాఁడు

ఉజ్జీవనము. సం. జీవనము, బ్రదుకు.

ఉజ్జీవించు. సం. అ. క్రి. జీవించు, బ్రదుకు.

ఉజ్జృంభితము. సం. చేష్ట. విణ. విరిసినది.

ఉజ్జ్వలము. సం. శృంగార రసము. విణ. వెలుఁగునది; తెల్లనిది; విరియునది.

ఉజ్జె ఊహ; ఊహించుట.

ఉజ్జెగించు. స. క్రి. విడిచిపెట్టు.

ఉజ్జెగింపించు స. క్రి. నిలిపివేయు.

ఉజ్జెగిల్లు. అ. క్రి. తొలఁగు.

ఉజ్జెగొను. స. క్రి. ఊహించు.

ఉజ్జెనము. విడుపు.

ఉజ్జెనసేయు. స. క్రి. విడుచు.

ఉజ్జెని. ఉజ్జయిని.

ఉజ్జాయించు. స. క్రి. ఊహించు.

ఉజ్జువకల్లు. అగ్నిపర్వతమునుండి వెడలఁగ్రక్కఁబడిన ఱాయి.

ఉజ్ఝనము. సం. విడుపు, ఉజ్జనము.

ఉజ్ఝితము. సం. విణ. విడువఁబడినది.

ఉటంకము. టూకి, సంగ్రహము.

ఉటంకి. విణ. చొరవగలవాఁడు; ధైర్యముగలవాఁడు.

ఉటంకించు. స. క్రి. సంగ్రహించు.

ఉటంకు. విణ. ఉటంకి.

ఉటజము సం. ఇల్లు, పర్ణశాల
ఉట్టంకణము. సం. స్థాపనము.
ఉట్టంకితము. సం. విణ. స్థాపింపఁబడినది
ఉట్టి. శిక్యము, పిడుతలు మొదలైనవి ఉంచుటకై దారములతో అల్లి వ్రేలఁగట్టెడి చిక్కము.
ఉట్టిచీల. ఇరుప్రక్కల తలయేర్పడినచీల
ఉట్టిపడు. అ. క్రి. ఉన్నట్టుండి కలుగు; అతిశయించు.
ఉట్టు. ఉప్పుపండఁదగిన నేల. అ. క్రి. కాలు
ఉట్రవడియము. ఒకవడియము.
ఉట్లబొద్ది. ఒకచెట్టు †.
ఉరాణి, విణ. గొప్ప, ఉన్నతము.
ఉడాయించు. హిం. అ. క్రి. పాఱిపోవు; హరించు.
ఉడికిల్లు. అ. క్రి. ఉడుకు, తపించు.
ఉడిగము. ఊడిగము.
ఉడిగించు. స. క్రి. చాలింపఁజేయు.
ఉడివోవు. అ. క్రి. తొలఁగు; మొక్కబోవు.
ఉడుఁబోతు విణ. ఉడుగువాఁడు, విరతిశీలుఁడు. [చెట్లయందు కలిగెడిపిందె
ఉడుఁబోతుపిందె. కాపుఉడిగిన పిమ్మట
ఉడుక. ఉడుక్క
ఉడుకాటము. ఉడుకాడుట.
ఉడుకాడు. అ. క్రి. ఉడికిల్లు, తపించు.
ఉడుకు. ఉష్ణము, తాపము. అ. క్రి. తపించు; అన్నాదులు పక్వమగు; రోషయుక్తుఁడగు.
ఉడుకుఁబోతు. విణ. ఈర్ష్యాళువు.
ఉడుకువ. ఊరట; విరతి.
ఉడుక్క. హుడుక్క వాద్యము.
ఉడుగక. సంతతము.
ఉడుగర. కానుక; బహుమానము; బంధువులు వధూవరుల కిచ్చెడి ధనము.
ఉడుగు. అ. క్రి. కృశించు. స. క్రి. మాను, చాలించు.
ఉడుత. వీపున మూడు నిడుపు గీఱలుగల ఒక జంతువు, చిక్రోడము.
ఉడుపకుక్క. ఉడుము మొ॥ వేఁటాడెడి క్షుద్ర శునకము, మోఱసడము.
ఉడుపనేయి. ఉడుముయొక్క క్రొవ్వు నుండి తీసిన చమురు.
ఉడుపపిల్ల గాధేరము.
ఉడుపము. సం. తెప్పమాను.
ఉడుపు. ప్రే. ఉడుగఁజేయు, ఉడిగించు
ఉడుపుఁడు. సం. చుక్కల ఱేఁడు, చంద్రుఁడు. ర†; దాసనము†.
ఉడుపుష్పము. సం. అశోకము †; తామ
ఉడుమండలము. సం. నక్షత్రమండలము.
ఉడుము గోధ, బల్లివంటి రూపము గల ఒక పెద్దజంతువు.
ఉడువు. స. క్రి. ఉడుగు. సం. నక్షత్రము
ఉడుసర. కాఁచి †.
ఉడుక్రవ. ఉడుకువ.
ఉద్ద. నాలుగు; నాలుగు ప్రోఁగులు గల రాశి; రాశి.
ఉద్దకేలుగలాఁడు. } చతుర్భుజుఁడు,
ఉద్దకేలువేలుపు. } విష్ణువు.
ఉద్దమోమువేలుపు. చతుర్ముఖుఁడు, బ్రహ్మ
ఉద్దా. ఉద్ద.
ఉద్దాడు. అ. క్రి. కలఁగు. (ప్రే. ఉద్దాడించు)
ఉడ్డీనము. సం. సెగవు, పక్షులు పైకెగురుట.
ఉద్దుగుడుచు. అ. క్రి. ఊపిరి త్రిప్పలేక బాధపడు, తికమకలాడు.
ఉడ్లపల్లంచి. బాలికాక్రీడావిశేషము.
ఉణుజు. అ ప్ర. ఒక చేఁప. [కొయ్య.
ఉతక. తలుపుక్రింది కుబుసము తిరిగెడు
ఉతము. సం. విణ. ఊతము, నేసినది.
ఉతుకు. స. క్రి. వస్త్రము మొ॥ గుంజు, ఉదుకు.
ఉత్క. సం. అష్టవిధనాయికలలో నొకతె.
ఉత్కంఠ. సం. వేడుక, ఉబలాటము, ఇష్టవస్తుప్రాప్తియందలి వేగిరపాటు.
ఉత్కంపించు. సం. అ. క్రి. ఆకంపించు, వణఁకు.
ఉత్కటము. సం. లవంగపుపట్ట. విణ. అధికమైనది; మదించినది.
ఉత్కము. సం. విణ. ఉత్కంఠగలది.
ఉత్కరము. సం. సమూహము; రాశి.
ఉత్కర్షము. సం. అతిశయము; శ్రేష్ఠత్వము; మేలు.
ఉత్కలము. సం. ఒక దేశము.

ఉత్కలిక. సం. ఉత్కంఠ; పెద్ద అల, హేల.
ఉత్కలుఁడు. సం. విణ. ధురీణుఁడు, నిర్వాహకుఁడు. [ప్రోఁగుచేయుట.
ఉత్కారము. సం. ధాన్యము తూర్పెత్తుట;
ఉత్కృష్టము. సం. విణ. శ్రేష్ఠము, మేలు చేయి.
ఉత్కోచము. సం. లంచము.
ఉత్క్రమణము. సం. మీఁదికిఁబోవుట, లేచిపోవుట.
ఉత్క్రోశము. సం. లకుముకిపిట్ట; గోరువంక; పెన్నడవులుఁగు; నల్లనిముక్కు ఎఱ్ఱని కాళ్ళుఁగల హంస.? దీర్ఘక్రోధము ?
ఉత్క్షిప్తము. సం. విణ. ఎగఁజిమ్మఁబడినది.
ఉత్క్షేపము. సం. ఎగఁజిమ్ముట.
ఉత్ఖాతకేళి. సం. ఏనుగులు మొ|| కొమ్ములు మున్నగువానితో భూమిని కోరాడెడి యాట.
ఉత్ఖాతము. సం. పెల్లగించుట; విషమస్థలము, విణ పెల్లగింపఁబడినది.
ఉత్త. విణ. రిక్తము, శూన్యము.
ఉత్తండమఃలు. బ. ఆఁడువారి కంఠభూషావిశేషము. [చుట
ఉత్తంభనము. సం. నిలుపుట; పొడిగించుట
ఉత్తంభితము. సం. విణ నిలుపఁబడినది; పొడిగింపఁబడినది.
ఉత్తంసము. సం. చెవినగ; పూఁగమ్మ; సిగబంతి; తలమానికము.
ఉత్తప్తము. సం. ఎండినమాంసము. విణ. కదలినది; కాఁచఁబడినది.
ఉత్తమ. సం. ఉత్తమురాలు; చిలుపాల†.
ఉత్తమపురుషము. సం. నేను మేము మనము కర్తగాఁగల క్రియారూపము.
ఉత్తమపురుషుఁడు. సం. పురుషోత్తముఁడు, పరమాత్మ.
ఉత్తమము. సం. విణ. మిన్న, శ్రేష్ఠము.
ఉత్తమర్ణుఁడు. సం. విణ. అప్పిచ్చినవాఁడు
ఉత్తమాంగము. సం. తల, శిరస్సు.
ఉత్తము. సం. విణ. తడిసినది.
ఉత్తముఁడు. సం. విణ. మిన్న, మేటి, శ్రేష్ఠుఁడు; యోగ్యుఁడు.
ఉత్తమురాలు. మి. ఉత్తమస్త్రీ.
ఉత్తర సం ఒక నక్షత్రము; ఉత్తరదిక్కు.
ఉత్తరంగము. ద్వారముమీఁదిలక్కి కమ్మి. విణ. లేచునట్టి అలలుగలది.
ఉత్తరక్రియ. సం. మృతులకుఁజేసెడి అపరకర్మము.
ఉత్తరజందెము, ఉత్తరజన్నిదము } మి. యజ్ఞోపవీతమువలెధరించు ముత్యాల హారము
ఉత్తరడొక్కరము. మల్లబంధ విశేషము.
ఉత్తరణము. సం. దాఁటుట.
ఉత్తరదోఃకరణము. సం. ఉత్తరడొక్కరము.
ఉత్తరపక్షము, సం. సిద్ధాంతము.
ఉత్తరఫల్గుని. సం. ఉత్తరానక్షత్రము.
ఉత్తరభ(భా)ద్రపద సం. ఉత్తరభాద్ర నక్షత్రము. [దిక్కు దాఁటు.
ఉత్తరమించు. సం. అ. క్రి. ఉత్తర
ఉత్తరము. సం. ఒక అర్థాలంకారము; మాఱుమాట; ఉత్తరపు దిక్కు. విణ. ఉత్తరపు దిక్కుది; మీఁదిది; ముఖ్యము.
ఉత్తరవాసము. సం. ఉత్తరీయము.
ఉత్తర సర్కారులు. బ. తెలుఁగు దేశమునకు ఉత్తరముగాను ఓఢ్రదేశమునకు దక్షిణముగాను ఉన్న అయిదు జిల్లాలు. (గంజాము, కృష్ణా, విశాఖపట్టణము, గోదావరి గుంటూరు.)
ఉత్తరసాక్షి. సం. సాక్షులఁగుటకు సాక్షి.
ఉత్తరాషాఢ సం. ఒక నక్షత్రము.
ఉత్తరాసంగము. సం. పైబట్ట; పైఁట.
ఉత్తరాసులు. బ. తలుపుక్రిందను మీఁదను కుబుసములు తిరుగుటకు వేసెడి కుసులు.
ఉత్తరించు స క్రి. ఖండించు. సం. దాఁటు
ఉత్తరీయము. సం. బయిర వాసము, పైబట్ట; పైఁట.
ఉత్తరుఁడు. సం. సామంతుని చేరువనున్న రాజు. విణ. ఉత్తముఁడు.
ఉత్తరువు. సెలవు, ఆజ్ఞ.
ఉత్తరేణి. వా. అపామార్గము.
ఉత్తరేను. అపామార్గము †.
ఉత్తరోత్తరము. సం. క్రి. విణ. పై పై; ముందుముందు.

ఉత్తలపడు. అ. క్రి. త్వరపడు; పరితాపపడు; వ్యత్యస్తమగు; కలఁతపడు.
ఉత్తలపాటు. విచారము, దుఃఖము; ఉత్తలపడుట.
ఉత్తలపెట్టు. స. క్రి. ఉత్తలపడునట్లు చేయు
ఉత్తలము. త్వర; పరితాపము; వ్యత్యాసము; కలఁత. [వెలికిలనున్నది.
ఉత్తానము. సం. మెరక. విణ. లోఁతులేనిది;
ఉత్తానశయుఁడు. సం. వెలికిలఁబరుండు బిడ్డ, శిశువు. [వాఁడు.
ఉత్తారకుఁడు. సం. విణ. దాఁటించు
ఉత్తార్యము. సం. విణ. దాఁటఁదగినది.
ఉత్తాలము. సం విణ. పొడవైనది; తొట్రుపాటుగలది; మేలైనది; విరివియైనది.
ఉత్తి. ఈడు, ప్రతినిధి.
ఉత్తీర్ణము. సం. విణ దాఁటఁబడినది.
ఉత్తీర్ణుఁడు సం. విణ. దాఁటినవాఁడు, గట్టెక్కినవాఁడు.
ఉత్తుంగము, సం విణ. పొడవైనది, మిక్కిలి ఉన్నతము.
ఉత్తుండి. సం. గురుజ†.
ఉత్తుఁడు. విణ. తగినవాఁడు యుక్తుఁడు.
ఉత్తేజనము సం. ప్రేరేఁచుట; వాఁడిచేయుట; నడపుట; పుచ్చుట.
ఉత్తేజితము. సం. విణ. ఉత్తేజనమొనర్పఁబడినది.
ఉత్థము. సం. విణ. నిలిచినది; పుట్టినది.
ఉత్థానము. సం. లేచుట; పురుషప్రమాణము; ప్రయత్నము; ముంగిలి; యుద్ధము; మలఘుజాఖొడి ఒక రోగము; సంతోషము; సమాప్తి; సైన్యము.
ఉత్థాపకము. సం. విణ. లేపువది.
ఉత్థాపనము. సం. లేపుట.
ఉత్థాపితము. సం. విణ. లేపఁబడినది.
ఉత్థితము. సం. విణ లేచినది; పుట్టినది; పెరిగినది; యత్నించినది.
ఉత్పతనము. సం. ఎగురుట; పుట్టుక.
ఉత్పతిత. సం. విణ ఎగిరెడి స్వభావముగలవాఁడు.
ఉత్పతితము. సం. విణ ఎగసినది; పుట్టినది.
ఉత్పతిష్ణువు. సం. విణ. ఎగిరెడు స్వభావముగలవాఁడు.

ఉత్పత్తి. సం. పుట్టుక. [మార్గము.
ఉత్పథము. సం. కానిత్రోవ; ఆకాశ
ఉత్పన్నము. సం. విణ. పుట్టినది.
ఉత్పలపత్రము. సం. కలువ రేకు. బ. పిఱుఁదులమీఁది నఖక్షతములు.
ఉత్పలము. సం. కలువ; చెంగల్వకోష్టు†.
ఉత్పలశారిబ. సం. మామెన†. [వాఁడు.
ఉత్పశ్యుఁడు. సం. విణ. మీఁదు చూచు
ఉత్పాటనము. సం. పెఱుకుట; పెల్లగించుట
ఉత్పాటించు. సం. స. క్రి. పెఱుకు; పెల్లగించు.
ఉత్పాటితము. సం. విణ. పెఱుకఁబడినది; పెల్లగింపఁబడినది.
ఉత్పాతము. సం. ఎగురుట; కీడు; మారి మహామారి మొ॥ ఉపద్రవము; భూకంపము మొ.
ఉత్పాదకము. సం. శరభమృగము. విణ. కలిగించునది. [చుట.
ఉత్పాదనము. సం. ఆపాదనము, కలిగిం
ఉత్పాదితము. సం. విణ. కలిగింపఁబడినది.
ఉత్పాదిలు(ల్లు). సం. అ. క్రి. పుట్టు; కలుగు. ప్రే. ఉత్పాదించు.
ఉత్పిబము. సం. చాతకము.
ఉత్ప్రాసనము. సం. మర్మమునుదూఱిపాఱ నాడెడు పరిహాసము. [రికలేమి.
ఉత్ప్రేక్ష. సం. ఒకఅర్థాలంకారము; హెచ్చ
ఉత్ప్రేక్షించు. సం. స. క్రి. ఉత్ప్రేక్ష కలుగఁజెప్పు. [బలిసినది.
ఉత్ఫుల్లము. సం. విణ. వికసించినది;
ఉత్సంగము. సం. ఒడి; తొడ; అభినయహస్తవిశేషము. [పైకెత్తఁబడినది.
ఉత్సన్నము. సం. విణ. పెల్లగింపఁబడినది;
ఉత్సము. సం. ఊట.
ఉత్సర్గము సం. త్యాగము; దానము; వ్యాయామము; విడుపు; సామాన్యము.
ఉత్సర్జనము. సం. త్యాగము; విడుపు.
ఉత్సర్జించు. సం. స. క్రి. విసర్జించు, విడుచు
ఉత్సర్జితము సం. విణ. విడువఁబడినది.
ఉత్సవము. సం. పండుగ; కోరికలుకొనసాగుట; గర్వము; కోపము; వివాహాద్యుత్సవము; సంతోషము.

ఉత్సహించు. సం. అ. క్రి. యత్నించు, కడఁగు.
ఉత్పాదనము. సం. నలుఁగు; పెల్లగించుట; పైకెత్తుట.
ఉత్పాదము. సం. నాశము. పైకెత్తు.
ఉత్పాదించు. సం. స. క్రి. పెల్లగించు;
ఉత్పాదితము. సం. విణ. నలుఁగుపెట్టఁబడినది; పెల్లగింపఁబడినది; పైకెత్తఁబడినది.
ఉత్సారణము. సం. కదలించుట.
ఉత్సారించు. సం. స. క్రి. కదలించు.
ఉత్సారితము. సం. విణ కదలింపఁబడినది
ఉత్సాహము. సం. ఉత్సాహశక్తి; ప్రయత్నము; సూత్రము; ఉద్రేకము ?
ఉత్సాహవర్ధనము. సం. వీరరసము.
ఉత్సాహించు. సం. అ క్రి. ఉద్యమించు, కడఁగు; సతూహలపడు.
ఉత్సిక్తము. సం. విణ. అతిశయించినది; గర్వించినది; పొంగినది; ప్రోక్షింపఁబడినది
ఉత్సుకత. సం. ఉత్సుకభావము.
ఉత్సుకుఁడు. సం. విణ. ఇష్టమైన కార్యమునందు ఉద్యోగించినవాఁడు.
ఉత్సృష్టము. సం. విణ. ఈయఁబడినది; విడువఁబడినది. పొంగు; ప్రోక్షణము.
ఉత్సేకము. సం. అతిశయము; గర్వము;
ఉత్సేకించు. సం. అ క్రి. అతిశయించు; గర్వించు; పొంగు. స. క్రి. ప్రోక్షించు.
ఉత్సేధము. సం. శరీరము; పొడవు.
ఉదంకము. సం చిన్న తోలుసిద్దె.
ఉదంచనము. సం. మూకుఁడు; విజృంభించుట; పైకివైచుట.
ఉదంచితము. సం. విణ విజృంభించినది; పైకివైవఁబడినది.
ఉదంతము. సం. వార్త, సుద్ది.
ఉదంతుఁడు. సం మంచి మనుష్యుఁడు; వర్తకుఁడు.
ఉదకక్రియ. సం. జలాదితర్పణము.
ఉదకము సం. జలము, నీరు.
ఉదక్తము. సం. విణ. చేదఁబడినది
ఉదక్య. సం. రజస్వల, ముట్టుది.
ఉదగ్రము. సం. విణ. పొడవైనది; భయంకరమైనది. నీటఁబుట్టినది.
ఉదజము. సం. పసులఁదోలుట. విణ.
ఉదధి. సం. సముద్రము.
ఉదధిరము. సం. తెగరము.
ఉదన్వంతుఁడు. సం. సముద్రుఁడు.
ఉదపానము. సం. నుయ్యి, బావి.
ఉదము. సం. ఉదకము.
ఉదయనీయ. సం. సమాప్తేష్టి.
ఉదయము. సం. పుట్టుక; ఉన్నతి; తూర్పుకొండ; పొడవు.
ఉదయరాగపట్టులు. మి. వస్త్రభేదము.
ఉదరంభరి, ఉదరంభరుఁడు } సం. విణ. తన పొట్ట పోసుకొను వాఁడు, కుక్షింభరి, అజ్ఞుఁడు.
ఉదరము. సం. కడుపు; యుద్ధము.
ఉదరిపడు. అ. క్రి. అదరిపడు, ఉలికిపడు.
ఉదరిపాటు. అదరిపాటు.
ఉదరు. అ. క్రి. అదరు, చలించు.
ఉదర్కము. సం. రాఁగల కాలము; రాఁగల ఫలము. మంటలు గలది.
ఉదర్చి. సం. అగ్ని. విణ. పైకెగయు
ఉదవసితము. సం. ఇల్లు.
ఉదవేల. సం సముద్రము.
ఉదశ్విత్తు. సం. సగమునీళ్లుచేర్చిన చల్ల.
ఉదస్తుఁడు. సం. విణ. తొలఁగింపఁబడినవాఁడు.
ఉదాకరము. సం. సముద్రము.
ఉదాత్తము. సం. వేదమందు ఊర్ధ్వస్వరము; ఒక అర్థాలంకారము.
ఉదాత్తుఁడు. సం. విణ. గొప్పవాఁడు; దంటుగలవాఁడు; ఒప్పిదముగలవాఁడు; ఉద్యతుఁడు; దాత. పాము; బొద్దు.
ఉదానము. సం. కంఠమందుండు వాయువు;
ఉదారము సం. ఊదరలు, ఒకధాన్యము. విణ. ఔదార్యముగలది.
ఉదారుఁడు. సం. విణ. ఉద్యతుఁడు; దాత; ఇతరుల అభిప్రాయము ననుసరించి (పరహిత బుద్ధిగలిగి) నడచుకొనువాఁడు
ఉదాసనము సం. నిరసించుట.
ఉదానము సం. తగులమి.
ఉదాసించు. సం. స. క్రి తిరస్కరించు.
ఉదాసీనత. సం. తటస్థత, ఉపేక్ష; మిన్నకుండుట, తగులమి.
ఉదాసీనుఁడు. సం. దండెత్తి పోవువానికి

మిత్రుఁడగు వాని దేశమునకు ఆవలి దేశపు రాజు. విణ. తగులనివాఁడు.
ఉదాస్థితుఁడు. సం. వాకిటి కావలివాఁడు; కర్మలను వదలిన ముని; వేగులవాఁడు.
ఉదాహరణము. సం. తెలివిడి, చెప్పెడి అర్థమునకు సరితాఁకునట్లు ఎత్తిచూపెడు అర్థాంతరము; ఒకవిధమైన ప్రబంధము
ఉదాహరించు. సం. స.క్రి. ఉదాహరణ పలుచు.
ఉదాహారము. సం. ఉదాహరణము
ఉదాహృతము సం. విణ. చెప్పఁబడినది; పుట్టినది.
ఉదియ. ఉద్దియ, యత్నము.
ఉదియగొను. అ.క్రి. యత్నించు.
ఉదిరి. మేలిమిబంగారు.
ఉదిరిగొను. అ.క్రి. వందు, తపించు.
ఉదిల. పరితాపము.
ఉదిలకొను. అ.క్రి.ఉత్తలపడు,పరితపించు
ఉదిలపడు. అ.క్రి. చింతనొందు
ఉదీచి. సం. ఉత్తరదిక్కు.
ఉదీచ్యము. సం. కురువేరు; శరావతీనది యెల్లగాఁగల పశ్చిమోత్తరముల మధ్య దేశము. విణ ఉత్తరపు దిక్కుది.
ఉదీర్ణము. సం. విణ. ఉదారము, గొప్పది; ఉభియయతి.
ఉదీర్ణుఁడు. సం. విణ పురుషార్థములయందధికేచ్ఛగలవాఁడు
ఉదుంబరపర్ణి. సం. దంతి†.
ఉదుంబరము. సం. మేడి†; గడప; రాగి; ఒక కుష్టు.
ఉదుంబరుఁడు. సం. నపుంసకుఁడు, పేడి.
ఉదుకు. స. క్రి. ఉతుకు.
ఉదుకుట. గుంజుట, వస్త్రాదులంఉతుకుట, ధావనము.
ఉదుటు. ఉద్ధతి. విణ.ఉద్ధతము;దృఢము
ఉదురు. ఉదుటు. [నీతుఁడు.
ఉదురుమిడుకు. విణ. ఉద్ధతుఁడు; దుర్వి
ఉదూఖలము. సం.ఱోలు;గుగ్గిలపుచెట్టు†
ఉదూఢము. సం. విణ. పెండ్లియైనది; బలిసినది; వహింపఁబడినది.
ఉద్గతము. సం. విణ. భేదించుకొని వెలి కుబికినది,
ఉద్గతి. సం. ఎగవు; పుట్టుక.
ఉద్గమనీయము. సం. ఉదికిన బట్టల జత.
ఉద్గమము. సం. ఎగవు; పుట్టుక.
ఉద్గమించు. సం. అ. క్రి. ఎగయు.
ఉద్గరణము. సం. క్రక్కుడు; త్రేఁపు.
ఉద్గాఢము. సం. క్రి. విణ. అతిశయము, పెల్లు. విణ. అధికము.
ఉద్గాత. సం. యజ్ఞమునందు సామవేద తంత్రము నడుపువాఁడు.
ఉద్గారము. సం. క్రక్కుడు; త్రేఁపు.
ఉద్గారించు. సం. అ. క్రి. త్రేఁచు.
ఉద్గిరణము. సం. మ్రింగుట; ఉద్గారము.
ఉద్గీతి. సం. గట్టిగా పాడుట; గట్టిగా చదువుట.
ఉద్గీథము. సం. సామవేదము.
ఉద్గీర్ణము. సం. విణ. క్రక్కఁబడినది.
ఉద్గూర్ణము. సం. విణ. పైకెత్తఁబడినది.
ఉద్గ్రాహము. సం. ఉగ్గము; ఎత్తిపట్టుట.
ఉద్గ్రీవుఁడు. సం. విణ. పైకెత్తఁబడిన మెడగలవాఁడు; గర్వము గలవాఁడు.
ఉద్ఘనము. సం. దాయి, చెక్కడిమ్రానికి ఊఁతగా క్రింద నుంచుకొనెడి బల్ల మొ.
ఉద్ఘము. సం. ప్రశస్తవాచకము.
ఉద్ఘాటనము. సం. ఏతము; ఉగ్గడించుట; భేదించుట. [ఉగ్గడించు; ఎత్తు.
ఉద్ఘాటించు. సం.స.క్రి. భేదించు, ప్రచ్చు;
ఉద్ఘాటితము. సం. విణ. ఉగ్గడింపఁబడినది; భేదింపఁబడినది.
ఉద్ఘాతము. సం. ఇనుపగుదియ; కాలితొట్రుపాటు; దెబ్బ; ప్రారంభము.
ఉద్ఘుష్టము. సం. విణ. ఉద్ఘోషింపఁబడినది
ఉద్ఘోషము. సం. మొఱ.
ఉద్ఘోషించు. సం. అ.క్రి. మొఱపెట్టు.
ఉద్ద. మిక్కిలి. [ఎక్కువైనది.
ఉద్దండము. సం. విణ. పొడవైనది;
ఉద్దండించు. సం. అ. క్రి. ఎక్కుడగు; పొడవగు.
ఉద్దంశము. సం. నల్లి. [విజృంభించు.
ఉద్దండించు. సం. అ.క్రి. అతిశయించు,
ఉద్దరి. వాటమై మిక్కిలి పొడవైనగట్టు.

ఉద్దరువు. ధాన్యాదులతాకట్టు, భూమి మొ॥ ఉంచి తీసికొనెడి వడ్డిలేని అప్పు.

ఉద్దవడి. అత్యంతము.

ఉద్దానము. సం. కట్టు; మరపుట.

ఉద్దాముఁడు. వరుణుఁడు. విణ. కట్టులేనివాఁడు; స్వతంత్రుఁడు.

ఉద్దాలకుఁడు. సం శ్రుతిప్రసిద్ధిగల ఒక [ఋషి.

ఉద్దాలము. సం. విరిగి†

ఉద్దాలు. బ. చెప్పులు.

ఉద్ది. జత; గూడలు మొదలగువానితోఁ జల్లు నీళ్లు పాఱెడు కాలువ మొదట వచ్చిక పెళ్లలు మొదలగువానిచే నేర్పఱుపఁబడినమిట్ట; సస్యవిశేషము. విణ. సమానము. బ. ధాన్యవిశేషము.

ఉద్దించు. స.క్రి. జతపఱచు; పోలు.

ఉద్దికాఁడు. జతయైనవాఁడు; చెలికాఁడు.

ఉద్దితము. సం. విణ. కట్టఁబడినది.

ఉద్దివము. సం. పట్టపగలు.

ఉద్దియ. యత్నము.

ఉద్దిష్టము. సం. విణ. ఉద్దేశింపఁబడినది.

ఉద్దీఁడు. ఉద్దికాఁడు.

ఉద్దీపకము సం. కొండచీమ. విణ. వెలిఁ [గించునది.

ఉద్దీపనము. సం. వెలుఁగుట; విభావభేదము. (ఆలంబనగుణము మొ)

ఉద్దీపితము. సం. విణ. వెలిగింపఁబడినది.

ఉద్దెసించు. స.క్రి. ఉద్దేశించు, గుఱించు; అనుకొను.

ఉద్దేశము. సం. గుఱి; ఎత్తైన ప్రదేశము; అభిప్రాయము

ఉద్దేశించు. సం. స.క్రి. గుఱించు.

ఉద్దేశ్యము. సం. విణ. గుఱింపఁదగినది.

ఉద్ద్యోతించు. సం. అ. క్రి. ప్రకాశించు, వెలుఁగు.

ఉద్ద్రావము. సం. ఊడఁబోక.

ఉద్ద్రుతము. సం. విణ. ఊఁడబోయినది.

ఉద్ధతము. సం. విణ. గర్వించినది.

ఉద్ధతి. సం. గర్వము.

ఉద్ధతుఁడు. సం. విణ. దుడుకువాఁడు; అసహనశీలుఁడు.

ఉద్ధరణము. సం. పెకలించుట; మీఁదికెత్తుట; వాంతియొత్తిన అన్నము.

ఉద్ధరణి. సం. ఉద్ధరిణె.

ఉద్ధరించు. సం. స.క్రి. పెల్లగించు; మీఁదికెత్తు; గట్టెక్కించు.

ఉద్ధరిణె. ఆచమనాదులయందు ప్రయోగించు లోహపాత్ర (గరిఁటె) విశేషము.

ఉద్ధర్త. సం. విణ. ఉద్ధరించువాఁడు.

ఉద్ధర్షము. సం. వివాహాది-ఉత్సవము; పండుగ.

ఉద్ధవము. సం పండుగ; యజ్ఞవహ్ని.

ఉద్ధవుఁడు. సం. శ్రీకృష్ణుని మంత్రి.

ఉద్ధానము. సం. ప్రొయ్యి.

ఉద్ధారకుఁడు. సం విణ. ఉద్ధరించువాఁడు

ఉద్ధారణము. సం. ఉద్ధరించుట.

ఉద్ధారము. సం. ఉద్దరువు; పైకెత్తుట; లేవనెత్తుట.

ఉద్ధురము. సం. విణ. దుర్ధరము, బరువైనది; దట్టమైనది; నిలుకడైనది.

ఉద్ధూతము. సం. మీఁదికి కదలింపఁబడినది.

ఉద్ధృతము. సం. విణ. పైకెత్తఁబడినది; చేదఁబడినది; పెల్లగించఁబడినది; అనుభవించి విడువఁబడినది.

ఉద్ధృతి. సం. గర్వము; పైకెత్తుట.

ఉద్ధృతుఁడు. సం. పొలిమేర విషయమును సామంతులవలనవిని దాని అనుభవాదుల నెఱిఁగి యా పొలిమేర నేర్పాటుచేసినవాఁడు. విణ. పైకెత్తఁబడినవాఁడు.

ఉద్బుద్ధము. సం. విణ. తలఁపునకు వచ్చినది; మేల్కొనినది; వికసించినది.

ఉద్బోధకుఁడు. సం. విణ. తలఁపునకుఁ దెచ్చువాఁడు; మేలుకొలుపువాఁడు.

ఉద్బోధనము. సం. తలఁపునకుఁ దెచ్చుట; మేలుకొలుపుట. [వికాసము.

ఉద్బోధము. సం. తలఁపు; మేలుకొలు;

ఉద్భటము. సం. తాఁబేలు విణ. అధికము

ఉద్భటుఁడు. సం. సూర్యుఁడు. విణ. అధికుఁడు.

ఉద్భవము. సం. పుట్టుక, కలుగుట.

ఉద్భవించు } ఉద్భవిల్లు } సం. అ క్రి. పుట్టు, కలుగు.

ఉద్భాసితము. సం. విణ. ప్రకాశితము, వెలిఁగింపఁబడినది.
ఉద్భిజ్జము. సం. విణ. భూమినిభేదించుకొని పుట్టునట్టివృక్షలతాదికము; మొలక
ఉద్భిత్తు } సం. విణ. ఉద్భిజ్జము.
ఉద్భిదము }
ఉద్భిన్నము. సం. విణ. విరిసినది.
ఉద్భూతము. సం. విణ. పుట్టినది; పొడవైనది.
ఉద్భేదము. సం. ఎగఁవచ్చుట; పుట్టుక.
ఉద్భ్రమము. సం. ఉబ్బించుట; ఊర్ధ్వభాగమునుకదలించుట;అవ్యవస్థితచిత్తత; చమత్కారము; అద్భుతము; మీఁద తిరుగుట.
ఉద్భ్రాంతము. సం.విణ. తిరుగుడుపడినది
ఉద్యతము. సం. విణ. యత్నించినది; పైకెత్తఁబడినది.
ఉద్యతి. సం. యత్నము, కడఁక.
ఉద్యతుఁడు. సం. విణ. పురుషార్థముల యందిచ్ఛగలవాఁడు.
ఉద్యమము. సం. ఉద్యతి. [కడఁగు.
ఉద్యమించు. సం. అ. క్రి. యత్నించు,
ఉద్యానము. సం. సర్వసాధారణమైన రాజవనము; ప్రయోజనము; వెడలుట
ఉద్యాపనము. సం. వెడలించుట.
ఉద్యుక్తము. సం. విణ. ఉద్యోగించినది.
ఉద్యోగము. సం. యత్నము, కడఁక; ఉత్సాహము; పెత్తనము.
ఉద్యోగి. సం. విణ. ఉద్యోగము కలవాఁడు; అధికారి. [కడఁగు.
ఉద్యోగించు. సం. అ.క్రి. ఉద్యమించు,
ఉద్యోగిజనము. సం. ఉద్యోగులు, ఉద్యోగముచేయువారు.
ఉద్ద్యోతించు. సం. అ.క్రి. ప్రకాశించు.
ఉద్ద్యోతితము. సం. విణ ప్రకాశితము.
ఉద్రంగము. సం. అంతరమున నిలుచు వస్తువు.
ఉద్రము. సం. నీరుపిల్లి.
ఉద్రిక్తము సం. విణ. ఉద్రేకించినది.
ఉద్రేకము. సం. ఉజ్జృంభణము; అతిశయము. [అతిశయించు; రేకెత్తు.
ఉద్రేకించు. సం. అ. క్రి. విజృంభించు;

ఉద్వర్తనము. సం. ఎగయుట; నలుఁగుపిండి; రాయిడి. విణ. అతిక్రమించిన నడతగలది.
ఉద్వహ. సం. కూఁతురు.
ఉద్వహనము. సం. ఎగఁబట్టుట.
ఉద్వహించు. సం.స.క్రి.ఎగఁబట్టు;మోచు
ఉద్వహుఁడు సం. కొడుకు. విణ. పైకెత్తువాఁడు.
ఉద్వాంతము. సం. మదముతేని యేనుఁగు. విణ. క్రక్కఁబడినది; భేదించుకొని వెలికుతికినది. [చుట.
ఉద్వాసనము. సం. తొలఁగించుట; వధించుట.
ఉద్వాహనము.సం. పెండ్లాడుట;ఉత్కంఠ
ఉద్వాహము. సం. పెండ్లి.
ఉద్వాహిని. సం. రజ్జువు, త్రాడు.
ఉద్విగ్నము. సం. ఉద్వేగము. విణ. వ్యవస్థతప్పినది; వెఱపునొందినది.
ఉద్వీక్షణము. సం. మీఁదుచూచుట.
ఉద్వృత్తము. సం. విణ. గర్వించినది.
ఉద్వృత్తి. సం. ఉద్ధతి, గర్వము.
ఉద్వేగము. సం. కలఁత, పీడ; పోఁకకాయ; వెఱపు; ఉద్భ్రమము.
ఉద్వేగిల్లు. సం. అ.క్రి. భీతిల్లు, వెఱచు.
ఉద్వేజనము. సం. వెఱపు; కలఁత
ఉద్వేజితము. సం. విణ. వెఱపింపఁబడినది; కలఁతపెట్టఁబడినది.
ఉద్వేలము. సం. విణ అగ్గలము.
ఉద్వేష్టనము. సం. చుట్టుకొనుట.
ఉద్వేష్టితము. సం.విణ.చుట్టుకొనఁబడినది
ఉధ్మానము సం. పొయ్యి.
ఉనికి. ఉండుట; స్థితి; స్థానము.
ఉనికిపట్టు. ఇల్లు.
ఉనుకువ. ఉనికి; నివాసము.
ఉనుచు ప్రే. ఉండఁజేయు, ఉంచు.
ఉనుపరి. విణ. స్వతంత్రుఁడు.
ఉన్కి. ఉండుట, ఉనికి.
ఉన్నతము. సం. విణ. పొడవైనది.
ఉన్నతి. సం. ఔన్నత్యము, పొడుగు.
ఉన్నమనము. సం. పైకెత్తుట.
ఉన్నమితము సం.విణ పైకెత్తఁబడినది.
ఉన్నయము. సం. పైకెత్తుట.

ఉన్నరూపు. యథార్థము. [వాఁడు.
ఉన్నవాఁడు. విణ. అన్యుఁడు; ఉండిన
ఉన్నాయము. సం. పైకెత్తుట.
ఉన్నాహము. సం. పుల్లనీళ్లు.
ఉన్ని. గొఱ్ఱెబొచ్చు.
ఉన్నిద్రము. సం. విణ. మేలుకొన్నది; వికసించినది. [అని).
ఉన్నె. ఉండునె, ఉన్నే (చేయకున్నె
ఉన్మంథనము సం. కదలించుట; చంపుట.
ఉన్మంథము. సం. చంపుట; చిలుకుట.
ఉన్మంథితము. సం, విణ. కదలింపఁబడినది
ఉన్మత్తము. సం. ఉమ్మెత్త. విణ. వెఱ్ఱెత్తినది.
ఉన్మత్తుఁడు. సం. విణ. వెఱ్ఱివాఁడు.
ఉన్మదితుఁడు, ఉన్మదిష్ణువు } సం. విణ ఉన్మాదము పట్టినవాఁడు, వెఱ్ఱివాఁడు
ఉన్మని. సం ప్రపంచమును సాక్షిమాత్రుఁడుగానుండి చూచుచు సంకల్పమును న్మూలించుటచేత నేర్పడెడియోగుల యవస్థలలో నొకటి. [వాఁడు
ఉన్మనుఁడు సం. విణ. ఉత్కంఠకల
ఉన్మాథము. సం. బోను; గాలము; వధము.
ఉన్మాథుఁడు. సం. వధించువాఁడు.
ఉన్మాదకుఁడు. సం. విణ. ఉన్మదితుఁడు.
ఉన్మాదనము. సం. ఒక మన్మథబాణము; ఉన్మాదము గలిగించుట విణ. ఉన్మాదము గలిగించునది.
ఉన్మాదము. సం. పిచ్చి, వెఱ్ఱితనము.
ఉన్మానము. సం. తులామానము, తూనిక
ఉన్మార్గము. సం. చెడ్డనడత, తప్పుత్రోవ.
ఉన్మితము. సం. విణ. కొలువఁబడినది; తూఁచఁబడినది.
ఉన్మిషితము. సం. విణ. విరిసినది.
ఉన్మీలనము. సం. వికసించుట; విరియుట; కన్నుతెఱచుట.
ఉన్మీలితము. సం. విణ. విరిసినది.
ఉన్ముఖము. సం. విణ. మీఁదుచూచునది.
ఉన్ముఖుఁడు. సం. విణ. తలయెత్తుకొనినవాఁడు.
ఉన్ముద్రము. సం. విణ వికసినది.
ఉన్మూలము. సం. విణ. వేరుతెగినది; అడుగంటఁ జెడినది.
ఉన్మూలించు. సం. స.క్రి. పెల్లగించు.
ఉన్మూలితము. సం. విణ. పెల్లగింపఁబడినది; అడుగంటఁ జెఱుపఁబడినది.
ఉన్మేషము. సం వికాసము, గెలివి; కన్నువిచ్చుట [దావైనది.
ఉపకంఠము. సం. సమీపము. విణ.
ఉపకరణము. సం కొలిముట్టు, సాధనము.
ఉపకరించు. సం. అ. క్రి. ఒదవు, ఉపయుక్తమగు. [మేలుచేయువాఁడు
ఉపకర్త. సం. విణ ఉపకరించువాఁడు,
ఉపకారము. సం. మేలు; చెదరిన పువ్వులు
ఉపకారి. సం. విణ ఉపకర్త.
ఉపకారిక. సం. డేరా; ఉక్కెఱ; ఉప్పరిగ; ఉపకారము చేసెడు స్త్రీ.
ఉపకార్య. సం. డేరా; ఉప్పరిగ. విణ. ఉపకరింపదగినది,
ఉపకుంచిక. సం. చిట్టేలకి; నల్లజిలకఱ్ఱ
ఉపకుర్వాణుఁడు. సం. స్నాతకుఁడైన బ్రహ్మచారి.
ఉపకుల్య సం. పిప్పలి.
ఉపకృతము. సం. ప్రయోజనము. విణ. ఉపకరింపఁబడినది.
ఉపకృతి. సం. ఉపకారము, మేలు.
ఉపక్రమము సం. మొదలుపెట్టుట; చికిత్స; మంత్రులు మొదలగువారిని పరీక్షించుట; విక్రమము.
ఉపక్రమించు. సం. స.క్రి. ప్రారంభించు.
ఉపక్రోశము. సం. నింద, దూఱు.
ఉపక్షమించు. సం. స. క్రి ఓర్చు.
ఉపగతము సం. విణ. అంగీకరింపఁబడినది.
ఉపగతి. సం ప్రాప్తి, పొందు.
ఉపగమము. సం. అంగీకారము; సమీపించుట. [నది; దాఁచఁబడినది.
ఉపగూఢము. సం. విణ. కౌఁగిలింపఁబడి
ఉపగూహనము. సం కౌఁగిలింత; దాఁచుట
ఉపగ్రహము. సం. అనుకూలించుట; ఉపయోగము; చెఱఁబడ్డది; చెఱ; సూర్యాది గ్రహణము.
ఉపగ్రాహ్యము. సం. కానుక. [ప్రాఁపు.
ఉపఘ్నము. సం. సమీపాశ్రయము,
ఉపచయము. సం. పొడవు; వృద్ధి.

ఉపచరము. సం. వెద, గోమహిష్యాది గర్భధారణము

ఉపచరించు. సం. స. క్రి. సన్మానించు; సేవించు. [వాఁడు.

ఉపచరితుఁడు. సం. విణ సేవింపఁబడిన

ఉపచాయ్యము. సం. యాగాగ్నియందు ఉపయోగింపఁదగిన పేరు.

ఉపచారము. సం. సమ్మానము; సేవ; ఊడిగము; ఉపకారము; లంచము, వాడుక. (పంచోపచారములు - గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, పక్షాంతరమున — స్నానము, పూజ, నైవేద్యము, ప్రదక్షిణము, నమస్కారము. షోడశోపచారములు — ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, అభిషేకము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ప్రదక్షిణము, నమస్కారము. అష్టాదశోపచారములు — ఆసనము, స్వాగతము మొ. చతుష్షష్ట్యుపచారములు — ఆసనారోపణము, సుగంధి తైలాభ్యంగము మొ.

ఉపచితము సం. విణ. కాలినది; కూడఁబెట్టినది; వర్ధిల్లినది.

ఉపచిత్ర. సం. ఎలుక జీడి†. [చువాఁడు

ఉపజాపకుఁడు సం. విణ. భేదము పుట్టిం

ఉపజాపము. సం. భేదోపాయము.

ఉపజిహ్వక. సం. కొండనాలుక.

ఉపజీవి. సం. విణ. ఒకరిననుసరించి జీవించువాఁడు. [జీవించు

ఉపజీవించు సం. అ. క్రి. ఒకరిననుసరించి

ఉపజీవిక. సం. జీవనోపాయము.

ఉపజీవికత్వము. సం. విణ. జీవనము; జీవనాధారము.

ఉపజ్ఞ. సం. ఉపదేశము లేక తనంతట మొదట పుట్టెడు జ్ఞానము.

ఉపతప్త. సం. రోగము.

ఉపతాపము, సం. సంతాపము, పీడ; రోగము; తొందర.

ఉపతాయి. మి. మల్లవిజ్ఞానము.

ఉపత్యక. సం. పర్వతసమీపభూమి.

ఉపద. సం. కానుక.

ఉపదంశము. సం ఊరుఁగాయ; కొఱుకు రోగము. [కొనువాఁడు.

ఉపదర్శకుఁడు సం. తప్పునడవక చూచు

ఉపదర్శనము. సం. పెత్తనము చేయుట; ఉపద్రష్టృత్వము. [వాఁడు; ఉపద్రష్ట

ఉపదర్శి. సం విణ. పెత్తనము చేయు

ఉపదానము. సం. అరణము; కానుక.

ఉపదిష్టము. సం. విణ ఉపదేశింపఁబడినది

ఉపదేశకుఁడు. సం. విణ. ఉపదేశించువాఁడు.

ఉపదేశమగు. సం. అ. క్రి. బోధనయగు.

ఉపదేశము. సం. హితవచనము; ఆజ్ఞ.

ఉపదేశించు. సం. స. క్రి. ఉపదేశము చేయు; పన్ను.

ఉపదేష్ట. సం. విణ. ఉపదేశకుఁడు.

ఉపదేహిక. సం. చెదపురుగు.

ఉపద్రవము. సం. విప్లవము, పోవడి; విపత్తు

ఉపద్రష్ట. సం. కార్యముల విచారించుకొనువాఁడు; యజ్ఞమునందలి ఋత్విగ్యజమానాదుల గుణదోషములు గమనించువాఁడు; సాక్షి.

ఉపధ. సం. ధర్మార్థకామముల చేత మంత్రి మొదలగువారి చిత్తమును పరీక్షించుట. వ్యా. కడపటి యక్షరమునకు ముందటి యక్షరము; కానుక; తలగడ.

ఉపధర్మము సం. పాషండధర్మము.

ఉపధానము. సం. తలగడ; విషము; స్నేహము. [పాఱు.

ఉపధావించు. సం. అ. క్రి. ప్రధావించు,

ఉపధి సం. కపటము; బండికల్లు.

ఉపధూపితము. సం. సమీపించిన అస్తమయము. విణ. చావుసమీపించినది; ధూపము వేయఁబడినది.

ఉపనతము. సం. విణ. కదిసినది.

ఉపనయనము
ఉపన(నా)యము } సం. వడుగు; సమీపమునకు తీసికొనిపోవుట.

ఉపనాహము. సం. తంతిచుట్టెడుబిరడ; పుంటిమీఁద పూసెడు మందు.

ఉపనిధి. సం. చెప్పక చూపక యుంచిన యిల్లడ, వాడిక; దాఁచఁబెట్టినసొమ్ము.

ఉపనిషత్తు. సం. బ్రహ్మవిద్య, బ్రహ్మాకారవృత్తి; ఈశావాస్యాది వేదాంతము వేదాంతగ్రంథము;ధర్మము;ఏకాంతము.
ఉపనిష్క్ర(ష్క్రా)రము. సం ఉక్కళము.
ఉపనీతుఁడు. సం.విణ. వడుగైనవాఁడు; సమీపమునకు తీసికొనిపోఁబడినవాఁడు.
ఉపన్యసించు. సం. స క్రి. ఉనుచు; ఉపన్యాసముచేయు.
ఉపన్యాసము. సం. ఏదేని ఒక విషయమును ఎత్తి విస్తరించి చెప్పుట.
ఉపపట్టణము. సం. పేఁట.
ఉపపతి. సం. జారుఁడు, అంకుమగఁడు; శృంగార నాయకులలో ఒకఁడు.
ఉపపత్తి. సం. కలిమి; అంతము; అర్హత; కారణము; దృష్టాంతము; పుట్టుక; వృత్తాంతము; అనుకూలత. [పుట్టినది
ఉపపన్నము సం. విణ. ఉపపత్తి గలది
ఉపపాదకము సం. విణ కలిగించునది.
ఉపపాదనము సం. కలిగించుట.
ఉపపాదితము. సం.విణ. కలిగింపఁబడినది
ఉపప్లవము. సం. ఉత్పాతము; ఉపద్రవము; రాహువు; గ్రహణము.
ఉపబర్హము. సం. ఉపధానము, తలగడ.
ఉపబృంహణము సం. చక్కఁగా పెరుగుట, సమృద్ధి.
ఉపబృంహితము. సం. విణ. చక్కఁగా పెరిగినది, సంవర్ధితము. [బడినది.
ఉపభుక్తము. సం. విణ. అనుభవింపఁ
ఉపభృత్తు. సం ఒక స్రుక్కు.
ఉపభోగము. సం సుఖదుఃఖముల అనుభవము. [దగినది.
ఉపభోగ్యము సం. విణ. అనుభవింపఁ
ఉపమ. ఉపాయము. సం. పోలిక; ఒక అర్థాలంకారము;పోల్పఁదగిన చంద్రాది విణ. పదాంతమున సమానము.
ఉపమరి. విణ. ఉపాయశాలి.
ఉపమాత సం. దాది. విణ. ఉపమానము చెప్పెడివాఁడు. [చంద్రాది.
ఉపమానము. సం. పోలిక, పోల్పఁదగిన
ఉపమించు. సం. స. క్రి. పోల్చు.
ఉపమితము. సం. విణ. పోల్పఁబడినది.
ఉపమితి. సం. ఉపమానము, పోలిక.
ఉపమేయము. సం. పోలికయందలి విషయము. విణ. పోల్పఁదగినది.
ఉపయమము. సం. వివాహము.
ఉపయాచితకము. సం. అభీష్టసిద్ధికై దేవతలకీయఁబడెడి ద్రవ్యము,మ్రొక్కుబడి.
ఉపయామము. సం. పెండ్లి.
ఉపయుక్తము. సం.విణ. ఒదవుబడియైనది
ఉపయోగము. సం. ఒదవుబడి.
ఉపయోగించు సం. అ.క్రి. ఒదవు, ఉపయోగపడుచు; ఆహారముగాఁగొను.
ఉపరంధ్రము. సం. తొలకు.
ఉపరక్తుఁడు. సం. విణ. రాహువుచేపట్టఁబడిన చంద్రుఁడు లేక సూర్యుఁడు; వ్యసనార్తుఁడు.
ఉపరక్షణము. సం. బెత్తములవారు సందడిలేక తొలఁగించుట; శిబిరరక్షణముకొఱకు చుట్టుపెట్టిన వెలుగుకాపు.
ఉపరతము. సం విణ ఉడిగినది.
ఉపరతి. సం. ఉడుకువ; పురుషాయితము
ఉపరద్య. సం. పుంతదారి, కాలిదారి.
ఉపరాగము. సం. గ్రహణము; అన్యాయము; గ్రహకల్లోలము; వ్యసనము.
ఉపరామము. సం ఉడుకువ.
ఉపరుద్ధము. సం. విణ. అడ్డగింపఁబడినది.
ఉపరోధము. సం. అవరోధము, అడ్డగింత.
ఉపరోధించు. సం. స.క్రి. అడ్డగించు.
ఉపల. సం. కల్పపుగుండు; పాత్రము; మొరపరాయి.
ఉపలంభము. సం. అనుభవము.
ఉపలక్షణము సం. ఒకటినుద్దేశించి చెప్పినది సామాన్య ధర్మముచేత తదితర స్థలములయందును ప్రవర్తించుట. విణ. అది గలది. [తెలియఁబడినది.
ఉపలబ్ధము. సం. విణ. పొందఁబడినది;
ఉపలబ్ధి. సం. బుద్ధి, తెలివి; ప్రాప్తి, పొందు.
ఉపలభ. సం. బుద్ధి.
ఉపలము. సం. రాయి;రత్నము;పిడుక.?
ఉపలాలనము. సం. బుజ్జగించుట.
ఉపలాలించు. సం. స. క్రి. బుజ్జగించు.

ఉపలాలితము. సం. విణ. బుజ్జగింపఁబడినది.
ఉపలింగము. సం. ఉపద్రవము
ఉపలిప్తము. సం. విణ. అలుకఁబడినది.
ఉపలేపనము. సం. అలుకుట.
ఉపవడము. మేలుకొనుట.
ఉపవనము. సం. తోఁట.
ఉపవర్తనము. సం. దేశము, విలాతి; ఇరువది ముప్పది యూళ్లు గల పరగణా
ఉపవనథము. సం. గ్రామము; గృహము?.
ఉపవసించే. సం. అ. క్రి. పస్తుండు
ఉపవస్తము సం. ఉపవాసము. విణ. ఉపవసించినది.
ఉపవాసము. సం. పస్తు; ఒంటిపూట భోజనము చేసినదినము; సమీపమున నుండుట, దేవతాసాన్నిధ్యము.
ఉపవాహ్యము. సం. రాజెక్కెడి ఏనుఁగు.
ఉపవిష. సం. అతివస.
ఉపవిష్టుఁడు. సం విణ. కూర్చుండినవాఁడు
ఉపవీతము. సం. సవ్యముగా వేసికొనిన (ఎడమభుజము మీఁదుగా కుడి పార్శ్వమున వ్రేలెడు) జంధెము.
ఉపవేశనము. సం. కూర్చుండఁబెట్టుట.
ఉపవేశము. సం. కూర్చుండుట.
ఉపశమము. సం. అడఁగుట; ఓర్పు.
ఉపశమించే } సం. అ. క్రి. అడఁగు;
ఉపశమిల్లు } ఓర్చు.
ఉపశయము. సం. మాటు, వలయొడ్డియా చెంత తాను దాఁగి యుండుటకై త్రవ్విన పల్లము. [మాలపల్లె.?
ఉపశల్యము. సం. గ్రామము చేరువ నేల;
ఉపశాంతి. సం. అడఁగుట; ఓర్పు.
ఉపశాయము. సం. వరుస; కావలివారు వరుసక్రమమున పండుకొనుట.
ఉపశోభితము. సం. విణ. ప్రకాశించినది.
ఉపశ్రుతము. సం. విణ. సమ్మతింపఁబడినది, ఒడఁబడినది.
ఉపశ్రుతి. సం. తమ భాషణమప్పుడు డబ్బాటుగఁ గలిగెడి శుభాశుభ సూచకమగు అన్యసంభాషణ శ్రవణము; ఒడఁబాటు.

ఉపసంపన్నము. సం విణ. యజ్ఞార్థముచంపఁబడిన పశువు మొ॥; నీళ్లుపోసి వండినది.
ఉపసంవ్యానము. సం. కట్టుబట్ట.
ఉపసంహరించే. సం స. క్రి. మరలించు; సంహరించు. [హారము.
ఉపసంహారము. సం. మరలించుట; సం
ఉపసరము. సం. ఉపచరము.
ఉపసర్గము. సం. (క్రియాయోగమున ప్ర పర మొ॥; ఉత్పాతము; ఒకానొక రోగము. [మైన దాని తరువాతిది.
ఉపసర్జనము. సం. అప్రధానము, ప్రధాన
ఉపసర్పణము. సం. ఆశ్రయము, ప్రాపు.
ఉపసర్పించే. సం. స. క్రి. ఆశ్రయించు, ప్రాపుగొను.
ఉపసర్య. సం. తొలిచూలావు.
ఉపసూర్యకము. సం. గాలిగుడి, సూర్య పరివేషము.
ఉపస్కరము. సం. సంబారము.
ఉపస్థము. సం. స్త్రీ పురుషుల రహస్యావయవము.
ఉపస్థానము. సం. చేరిక; సేవ.
ఉపస్థితము సం. విణ. చేరినది.
ఉపస్థితి. సం. చేరిక; తోఁచుట.
ఉపస్పర్శము. సం. ఆచమనము; స్నానము; స్పర్శము.
ఉపహతము. సం. విణ. ఉపద్రవము నొందినది; నాశమునొందినది.
ఉపహతి. సం. ఉపద్రవము; నాశము.
ఉపహారము. సం. కానుక.
ఉపహితము. సం. విణ. ఉంచఁబడినది.
ఉపహ్వరము. సం. ఏకాంతము; సమీపము
ఉపాంగము. సం. నుతి పోసెడి తిత్తి; మీమాంస మొ. (ఉ. పురాణము, ధర్మశాస్త్రము, మీమాంస, న్యాయశాస్త్రము.)
ఉపాంతము. సం. సమీపము; మూల. విణ. సమీపించినది.
ఉపాంశు. సం. అవ్య. ఏకాంతము.
ఉపాంశువు సం. పెదవులు కదలి కదలకుండు రీతిని వినఁబడి వినఁబడకుండునట్లు చేయు జపము; రహస్యము.

ఉపాకరణము } సం. సంస్కారపూర్వ
ఉపాకర్మము } కముగా వేదమును గ్రహించుట.
ఉపాకృతము. సం. యజ్ఞమునందు అభిమంత్రించి చంపఁబడిన పశువు. విణ. కుదియింపఁబడినది.
ఉపాఖ్యానము. సం. ఇతిహాసము.
ఉపాగతము. సం. విణ. పొందఁబడినది; వచ్చినది. [అపహరింపఁబడినది.
ఉపాత్తము. సం. విణ. పొందఁబడినది;
ఉపాత్యయము. సం. అతిక్రమణము; తుటూరము.
ఉపాదానము. సం. ఉంచుట; ధరించుట; కప్పుట; ప్రధానకారణము.
ఉపాధి. సం. ధర్మవిచారము; కపటము; కుటుంబమునందు మిక్కిలి యాశ గలవాఁడు; విశేషణము; కుటుంబ పోషణము; శరీరము (అవిద్యోపాధి, మాయోపాధి). [చేసెడు ఆఁడుది
ఉపాధ్యాయ. సం. ఉపాధ్యాయత్వము
ఉపాధ్యాయాని. సం. ఉపాధ్యాయుని పెండ్లాము. [ధ్యాయాని.
ఉపాధ్యాయి. సం. ఉపాధ్యాయ; ఉపా
ఉపాధ్యాయుఁడు. సం. వేదమును చదివించువాఁడు; చదువు చెప్పువాఁడు.
ఉపానహము. సం. పాదరక్ష. రూ ఉపానత్తు.
ఉపాయనము. సం. కానుక.
ఉపాయము. సం. నేర్పు; వెరవు; సాధనము; పొందు. [బ. చతురుపాయములు—సామము, దానము, భేదము, దండము. (నాయకుఁడు నాయిక యెడ ఉపయోగించెడు) ఆఱుపాయములు—సామము, దానము, భేదము, నతి, ఉపేక్ష, రసాంతరము. సప్తోపాయములు—మాయ, ఉపేక్ష, ఇంద్రజాలము, పై చతురుపాయములు.]
ఉపార్జనము. సం. సంపాదనము, గడన.
ఉపార్జించు. సం. స. క్రి. సంపాదించు, గడించు.
ఉపార్జితము. సం. విణ. గడింపఁబడినది.
ఉపాలంభనము. సం. దూషించుట.

ఉపాలంభము. సం. దూషణముతోఁ గూడిన హాస్యము; మర్మముదూఱి పాఱనాడుట. [దూఱిపాఱనాడు.
ఉపాలంభించు. సం. స. క్రి. మర్మము
ఉపాలబ్ధము. సం. విణ. మర్మముదూఱి పాఱనాడఁబడినది.
ఉపావృత్తము. సం. విణ. శ్రమపరిహారార్థము పలుమాఱు నేలఁబొర్లాడినది (గుఱ్ఱము). [కటాలు.?
ఉపాశ్రయము. సం. ప్రాపు; ఆనిక; కట
ఉపాశ్రయించు. సం. స. క్రి. ఆశ్రయించు; సేవించు [బడినది.
ఉపాశ్రితము. సం. విణ. ఆశ్రయింపఁ
ఉపాసంగము సం. అమ్ములపొది.
ఉపాసకుఁడు. సం. విణ. సేవకుఁడు.
ఉపాసన. సం. శరాభ్యాసము; పీఁట; భక్తి, సేవ, కొలువు. [సేవించుట.
ఉపాసనము. సం. ఉపాసన, సేవ;
ఉపాసము. ఉపవాసము.
ఉపాసించు. సం స క్రి. సేవించు, కొలుచు.
ఉపాసిత. సం. విణ ఉపాసించువాఁడు.
ఉపాసితుఁడు. సం. విణ ఉపాసింపఁబడినవాఁడు. [కూర్చున్నవాఁడు.
ఉపాసీనుఁడు. సం విణ. సమీపమున
ఉపాస్తి. సం. ఉపాసన, సేవ.
ఉపాస్యుఁడు. సం. విణ. ఉపాసింపఁదగినవాఁడు. [త్పాతము. విణ. ఆరోపితము.
ఉపాహితము. సం. తోఁకచిచ్చు, అగ్నిక్ష
ఉపాహృతము. సం. విణ. గ్రహింపఁబడినది; పట్టుపడినది.
ఉపేంద్రుఁడు. సం. శ్రీకృష్ణుఁడు, విష్ణువు; వామన భగవానుఁడు.
ఉపేక్ష. సం. అశ్రద్ధ, ఒప్పరికము; తగులమి, ఒక చిత్తశుద్ధి సాధనము.
ఉపేక్షకుఁడు. సం. విణ. ఒప్పరికించువాఁడు
ఉపేక్షించు. సం. స. క్రి. ఒప్పరికించు.
ఉపేక్షితుఁడు. సం. విణ ఉపేక్షింపఁబడినవాఁడు. [వాఁడు; సమీపించువాఁడు.
ఉపేత. సం. విణ. ఉపాయములు పన్ను
ఉపేతము. సం. విణ. కూడుకొనినది.
ఉపోదక(కి). సం. దుంపబచ్చలి†.

ఉపోద్ఘాతము. సం. ఉదాహరణము; భూమిక, పీఠిక.
ఉపోషణము. సం. ఉపవాసము.
ఉపోషితుఁడు సం. విణ. పస్తున్నవాఁడు.
ఉపోష్యము. సం. విణ. పస్తుండఁదగినది.
ఉప్తము. సం. విణ. విత్తఁబడినది(నేల.)
ఉప్తి. సం. విత్తుట. వెదపెట్టుట.
ఉప్పత. ఓర్వలేనితనముచేత ఆడిపోసికొనుట.
ఉప్పతించు. స. క్రి. ఓర్వలేనితనముచేత ఆడిపోసికొను.
ఉప్పతిల్లు. అ. క్రి. పుట్టు, ఉత్పత్తియగు.
ఉప్పఁదనము. ఉప్పన.
ఉప్పన. లావణ్యము, ఒకరసము.
ఉప్పనబట్టెలు. బ. బాలక్రీడావిశేషము.
ఉప్పయనము. యుద్ధప్రయాణమునకై చేయుబస. [కెడు ఖనకజాతి.
ఉప్పర. త్రవ్వియు గోడలు పెట్టియు బ్రతి
ఉప్పరగుడి. ఎత్తయిన పతాక.
ఉప్పరది. ఉప్పరజాతి (ఖనక) స్త్రీ.
ఉప్పరము. ఆకాశము; మీఁదు, ఉపరి.
ఉప్పరవట్టము. ఎత్తయినగుడి.
ఉప్పరవాఁడు. ఉప్పరి, ఖనకుఁడు.
ఉప్పరి. ఖనకుఁడు, ఉప్పరజాతివాఁడు; శూద్ర స్త్రీ పురుషులకు రాక్షస వివాహము వలనఁ బుట్టినవాఁడు.
ఉప్పరించు. స. క్రి. మల్లయుద్ధ క్రియా విశేషము.
ఉప్పరిగ(గె). మిద్దెమీఁదికట్టడము, మేడ.
ఉప్పలము. ఉప్పుతయారుచేయుస్థలము; ఉప్పళము. [నడుము.
ఉప్పలవాయి. బొట్టన జుట్టున వ్రేళ్ళ
ఉప్పలి. కీడు, ఆపద.
ఉప్పవడము. ఉపవడము.
ఉప్పళము. ఉప్పుపండెడు నేల; ఉప్పురాసులుండెడి చోటు.
ఉప్పళించు. స. క్రి. ఉప్పరించు.
ఉప్పి. కుండలి†; మౌక్తిక ఫలము†.
ఉప్పిఁడి. విణ. ఉప్పులేనిది, అలవణము.
ఉప్పిదింత, జ్యోతిష్మతి†.
ఉప్పిళ్లు. ఉప్పుడు.

ఉప్పు. లవణము. స. క్రి. అవిరిపోక యుడికించు. [మాంసఖండము.
ఉప్పుఁగండ. ఉప్పురాచి యెండఁబెట్టిన
ఉప్పుఁగడలి. లవణసముద్రము.
ఉప్పుఁగాయ. ఊరుఁగాయ.
ఉప్పుఁగుండము. బాలక్రీడావిశేషము.
ఉప్పుఁజేప. ఒక చేప; ఉప్పురాచి ఎండఁబెట్టిన మత్స్యము.
ఉప్పుఁబట్టి. తనంతట ఉప్పుపండెడు నేల.
ఉప్పుడు. ఉప్పిళ్ళు. (ఉప్పుడుబియ్యము)
ఉప్పునీళ్లు. బ. లవణోదకము.
ఉప్పునేల, ఉప్పుపట్టి } ఉప్పు పండెడు నేల.
ఉప్పుమడి. ఉప్పు పండించెడు మడి.
ఉప్పుమళ్లు. బ. ఉప్పు పండించుటకు కట్టినమళ్లు. [తోడెడు తేవులు.
ఉప్పురేవులు. బ. ఉప్పుమళ్ళకు నీళ్లు
ఉప్పువాము. ఉప్పుపంటపండెడుచోటు.
ఉప్పుసంద్రము. లవణసంద్రము.
ఉప్పెన. సముద్రోల్బణము; విజృంభణము.
ఉప్పొంగు. అ. క్రి. మిక్కిలి సంతోషించు; మిక్కిలి యుబుకు; విజృంభించు.
ఉబలాటము. జాలి; మిక్కిలి, యభిలాషము; వేడుక.
ఉబుకు. పొంగుట. అ. క్రి. పొంగు.
ఉబుసు. పనిలేని కాలము; వృత్తాంతము.
ఉబ్బ. ఉక్క, ఉష్ణము.
ఉబ్బకము. ఆధిక్యము; ఉత్సాహము.
ఉబ్బడఁగు. అ. క్రి. తక్కువగు.
ఉబ్బతిల్లు. అ. క్రి. ఉబ్బు; పొంగు.
ఉబ్బనీరు. ఉమ్మనీరు.
ఉబ్బరపోవు. అ. క్రి. నివ్వెఱపడు, చేష్టలుడిగి యేమి తోఁచక అట్టె నిల్చు.
ఉబ్బరము. కడుపుబ్బుట; అతిశయము.
ఉబ్బరించు. అ. క్రి. కడుపుబ్బు; అతిశయించు.
ఉబ్బలి. బురద.
ఉబ్బసము. ఊర్ధ్వశ్వాసరోగము; దగ్గు.
ఉబ్బు. సంతోషాదుల అతిశయము; లావగుట; సంతోషము. అ. క్రి. ఉబ్బరించు; పొంగు; లేచు; లావగు; సంతోషించు.

ఉభయము. సం. రెండవయవములుగలది; గుడియుత్సవపుఁగట్టడ.
ఉమ. సం. పార్వతీదేవి; నూనెయగిసె†; కాంతి; పసుపు; యశము.
ఉమాదము. ఉన్మాదము, వెఱ్ఱి.
ఉమాపతి. సం. శివుఁడు.
ఉమి. ఉమ్మి.
ఉమియు. స. క్రి. (ఎంగిలిలోనగువాని) ఉమ్మివేయు, తూపొడుచు.
ఉముక. ఊఁక, పొట్టు, తుసము.
ఉమేజువారు. హిం. ఉద్యోగమునకై కని పట్టియుండువాఁడు.
ఉమ్మ. ఉబ్బ, ఊష్మము.
ఉమ్మగిల్లు. అ.క్రి. ఆవిరిచేనుడుకు.
ఉమ్మడి. పొత్తు; నిత్యపుఁగట్టడ. ద్ర. ఏక కాలమున.
ఉమ్మదము. ఉమ్మ, ఊష్మము.
ఉమ్మనీరు. ప్రసవజలము.
ఉమ్మలము. దుఃఖము; శోకము
ఉమ్మలి. ఉబ్బలి.
ఉమ్మలించు అ క్రి. దుఃఖించు; శోకించు.
ఉమ్మలిక—ము. దుఃఖము, విచారము ; శోకము.
ఉమ్మలికించు. అ.క్రి. దుఃఖించు; శోకించు
ఉమ్మాదము. ఉన్మాదము.
ఉమ్మాయముత్తియము. క్షుద్రమౌక్తికము
ఉమ్మి. ఉమిసెడుఎంగిలి, నిష్ఠీవనము.
ఉమ్మెత. ఉమ్మెత్త†.
ఉమ్మెత్త. ఉన్మత్తము, దుత్తూరము†.
ఉమ్యము. సం.విణ. ఉమలుపండుపొలము
ఉయాల. ఉయ్యాల.
ఉయేల. ఉయ్యాల.
ఉయ్యల. ఉయ్యాల.
ఉయ్యాల. ఊయెల, బిడ్డలను పండఁబెట్టి ఊఁచెడు డోల, ఆందోళిక.
ఉయ్యాలతొట్టి. తొట్ల.
ఉయ్యాలపులుఁగు. సారసపక్షి. రూ. ఊయ్యాలచేలుఁ బులుఁగు.
ఉయ్యాలమంచము. డోలామంచము.
ఉయ్యోల. ఉయ్యాల, డోల.
ఉయ్యేల. ఉయ్యాల.
ఉరంగమము. పాము.?

ఉరక. అవ్య. ఊరక.
ఉరగము. సం. పాము.
ఉరగులు. బ. పాములు.
ఉరడిం(ణిం)చు. అ. క్రి. ఉరవడించు; విజృంభించు.
ఉరణము. సం. పొట్టేలు.
ఉరణాక్షము, ఉరణాఖ్యము } సం. తగిరిస.†
ఉరభ్రము. సం. పొట్టేలు.
ఉరమరిక రమారమి.
ఉరము. సం. ఱొమ్ము. విణ. శ్రేష్ఠము.
ఉరరీకారము. సం. అంగీకారము; విస్తృతము చేయుట.
ఉరరీకృతము. సం. విణ. అంగీకరింపఁబడినది.
ఉరరీకృతి. సం. అంగీకారము.
ఉరలఁద్రోచు. స. క్రి. పడఁద్రోచు.
ఉరలఁబడు. అ.క్రి దొర్లు; (స్వార్థమున) పడు.
ఉరలఁబాఱు. అ. క్రి. చలించు.
ఉరలు. అ.క్రి. దొర్లు; కాఱు; రాలు; విడిపోవు; జాఱు.
ఉరలుకొను. అ. క్రి. పీడు (స్వార్థమున)కొను.
ఉరవడి. మిక్కిలి వేగము; బిగ్గరగా.
ఉరవడించు. అ. క్రి. ఉరవడిగొను ; వేగిరపడు.
ఉరవు. ఔచిత్యము. విణ. అధికము ; ఉచితము.
ఉరశ్ఛదము. సం. కవచము.
ఉరసిలుఁడు. సం. విణ. విశాలమైన ఱొమ్ముగలవాఁడు.
ఉరసుఁడు. సం. విణ. ఉరసిలుఁడు.
ఉరస్సు. సం. ఱొమ్ము.
ఉరస్త్రాణము. సం. కవచము.
ఉరస్యుఁడు. సం. ధర్మపత్నియందుఁ దనకుఁబుట్టిన కొడుకు.
ఉరస్వంతుఁడు. సం. విణ. ఉరసిలుఁడు.
ఉరస్సూత్రిక. సం. ఱొమ్మున వ్రేలెడు ముత్యాలహారము.
ఉరళించు. అ. క్రి. ప్రకాశించు.
ఉరి. ఉచ్చు, వాగుర; మంట.
ఉరిగోల. ఉడుము మొదలగువానిని పట్టుటకై చివర నురిఁబెట్టి కట్టిన కోల.

ఊరిడె. కుమ్మర పురుగు.
ఊరియాట. ఊరియాడుట, ఊఁగులాట; సందేహము. [కంపించు.
ఊరియాడు. అ. క్రి. ఊఁగులాడు;
ఊరియు. అ. క్రి. చలించు; నెరయు; పక్వమగు; పరితపించు; విడిపోవు.
ఊరివిడి వృక్షవిశేషము†.
ఊరివోయు. స. క్రి. ఊరిదీయు.
ఊరీకృతము. సం. విణ ఊరరీకృతము
ఊరు. అ. క్రి. శ్రేష్ఠమగు; తగ్గు.
ఊరుజె. కాలము, ఒక చేఁప.
ఊరుది. బిగ్గర.
ఊరుబూకము. సం ఆముదపుఁజెట్టు†.
ఊరుమ. ఒక చర్మవాద్యము.
ఊరుముంజి. దేశవిశేషము.
ఊరుముడు ఒక వృక్షము†.
ఊరువడు. అ. క్రి. నెఱవేఱు.
ఊరువణించు. స. క్రి. కడకొత్తు.
ఊరువిడి. వస్తుసమూహము; ఉపాయశాలి
ఊరువు. రూపము. విణ. ఉపాయశాలి. స. క్రి. పరిహరించు సం. విరివియైనది; గొప్పది.
ఊరోజము. సం. స్తనము.
ఊర్లఁబడు. ఊరలఁబడు.
ఊర్లు. అ. క్రి. ఊరలు.
ఊర్లుఁబెంజెరలు. పాములలోనొక భేదము
ఊర్వర, సం. భూమి; ఎల్లపైరులచే నిండినభూమి.
ఊర్వారుకము } సం. దోస†.
ఊర్వారువు }
ఊర్వి. సం. భూమి, నేల.
ఊఱడు. స. క్రి. సరకుసేయడు.
ఊఱవు. ఒప్పు, ఔచిత్యము; విస్తారము. విణ. అధికము; ఉచితము
ఊఱి. అవ్య. మతుబర్థము (బలముఱి—బలము కలవాఁడు అని.)
ఊఱిడి. దార్ఢ్యము; స్థైర్యము. విణ. దృఢము; స్థిరము. [ధీరుఁడు.
ఊఱియ. విణ. దిట్టతనముగలవాఁడు;
ఊఱియు. అ. క్రి. ఇల్లులోనగు వానిపై కప్పు చెడి యాద్వారమున నీళ్లుపడు; తగు; తగ్గు; వెనుదీయు; సరకుచేయు.
ఊఱు. ఘనము, గొప్ప. అ. క్రి. శ్రేష్ఠమగు; తగు; తగ్గు. స. క్రి. సరకుచేయు. విణ. కలిగిన
ఊఱుఁద్రాళ్లు. బ. పాలుపిదుకునప్పుడు ఆవుకాళ్లు గట్టుత్రాళ్లు. [పరుగెత్తు.
ఊఱుకు. అ. క్రి. దాఁటు; దుముకు;
ఊఱుకుడుఁగప్ప. ఒకకప్ప.
ఊఱుకుడుబొడ్డు. రోగముచే పెరిగినబొడ్డు, ఊఱుకుబొడ్డు, తుండి.
ఊఱుగొట్టు. అ. క్రి. కోఁతి ఉఱ్ఱుమను.
ఊఱుత. ఉడుత.
ఊఱుపు. ఉఱియుట.
ఊఱుము. గర్జ, మేఘధ్వని; వీరహుంకారము; ఉఱుము. అ. క్రి. మేఘముగర్జించు; ఝుంకారముచేయు.?
ఊఱువు. ఊఱుగొట్టుట.
ఊఱ్ఱటలూఁగు } అ. క్రి. మిక్కిలియూఁగు;
ఊఱ్ఱట్లూగు } చలించు.
ఊఱ్ఱలూఁగు. అ. క్రి. మిక్కిలి వేడుకలంపడు
ఊఱ్ఱు కోతియొక్క వికృతధ్వని.
ఊఱ్ఱుఁద్రాళ్ళు బ. ఊఱుఁద్రాళ్ళు.
ఊఱ్ఱుకట్టు. స. క్రి. పాలు పిండునపుడు ఆవు కాళ్లను కట్టు.
ఊఁఱ్ఱూతలూఁగు. అ. క్రి. ఉఱ్ఱటలూఁగు; మిక్కిలి వేడుకలంపడు.
ఊలంగవము. సం. పెద్దనల్లచీమ, కండ్ర.
ఊలక. విణ. చులుకన, లఘువు.
ఊలకన చులుకన, లాఘవము.
ఊలగరము. ఊలవరము, వాంతియగునట్లుండుట.
ఊలపము. సం. ఒకటితోనొకటి పెనఁగొన్న ద్రాక్షమొ॥; ఒక దర్భ.
ఊలవ. సస్యవిశేషము, కులుత్థము†. బ. ధాన్యవిశేషము.
ఊలవరము. ఊలవరించుట. [యుబుకు.
ఊలవరించు. అ. క్రి. తడిచేత నేల
ఊలి. వడ్రంగి సాధన విశేషము, శంకుల. విణ. నులి, అల్పము.
ఊలింద. ఒక వృక్షము†.
ఊలికిపడు. అ. క్రి. ఆకస్మికముగాఁ గలిగిన భయాదులచేత కంపించు.

ఊలికిపాటు. ఉలికిపడుట.
ఊలిపి } విణ. తులువ, దుర్మార్గుడు.
ఊలిపిగొట్టు }
ఊలిమిడి(రి). వరుణముᐩ.
ఊలిమ్రాను ఖదిరముᐩ.
ఊలియు అ క్రి చలించు; మ్రోయు
ఊలివాఁడు. ఆ. క్రి. చలించు.
ఊలివు. మ్రోఁత; చలనము; ఒప్పు.
ఊలుకు. భయము. అ. క్రి. భయపడు.
ఊలుక్కు. అశ్వగతివిశేషము.
ఊలుచమీను. ఉలూపి, మిక్కిలి చాపల్యముగల చేఁప.
ఊలుచు. స. క్రి. ఊడఁదీయు.
ఊలుప. కానుక; పలుచగా నూఁతిన పుల్ల ఊరుఁబిండి.
ఊలుపఁడు. విణ. శోఫరోగముగలవాఁడు
ఊలుపా. హిం. బహుమానము.
ఊలుపి. విణ. ఉలుపఁడు.
ఊలుపు. శోఫరోగము. స. క్రి. ఉలుచు.
ఊలుము కష్టము.
ఊలూకము. సం గుడ్లగూబ.
ఊలూకుఁడు. సం. ఇంద్రుఁడు.
ఊలూఖలకము. సం. గుగ్గిలపుఁజెట్టుᐩ.
ఊలూఖలము. సం ఱోలు.
ఊలూపి. సం. ఉలుచమీను.
ఊల్క. సం. మంటలేని కట్టెనిప్పు; బొగ్గు; తోఁకచుక్క,
ఊల్టా. హిం. లోతట్టు, అడుగుతట్టు. విణ. వ్యత్యస్తము, వ్యుత్క్రమము.
ఊల్బణము. సం. పొంగు; అతిశయము. విణ ఎక్కువైనది; స్పష్టమైనది.
ఊల్బము. సం. గర్భపిండము; మావి.
ఊల్మకము. సం. కొఱవి.
ఊల్ల. అవ్య చాలదగ్గఱ.
ఊల్లంకి. ఒక పక్షి.
ఊల్లంగి. ఒక చెట్టుᐩ.
ఊల్లంఘనము. సం. అతిక్రమించుట.
ఊల్లంఘించు. సం. స. క్రి. అతిక్రమించు, తుటారించు. [బడినది
ఊల్లంఘితము. సం. విణ. అతిక్రమింపఁ
ఊల్లంఘ్యము. సం. విణ. అతిక్రమింపఁదగినది.
ఊల్లకుట్టు ఉత్ప్రాసము.
ఊల్లడ. వితానము, పందిరి మొదలగువాని లోపల మీఁదఁగట్టెడు. మేలుకట్టు.
ఊల్లము. ఎద. హృదయము, మనస్సు.
ఊల్లఱము. విణ. మనస్సునకు సహింపఁ గూడనిది. [కరణము.
ఊల్లల. ఉదుకుటయందగు ధ్వన్యను
ఊల్లలము. సం. చలనము, కదలిక.
ఊల్లలితము. సం. విణ కదలినది.
ఊల్లసమాడు. స క్రి. మర్మముదూఱిపాఱఁ బరిహసించు; ఉపాలంభించు.
ఊల్లసము. ఉత్ప్రాసము; ఎత్తిపొడుపు మాట, ఉపాలంభము. సం. ఉల్లాసము.
ఊల్లసితము. సం. విణ. ప్రకాశితము.
ఊల్లసిల్లు. సం. అ. క్రి. సంతోషించు; ప్రకాశించు; వికసించు.
ఊల్లాకు. చీటి, ఖండపత్రిక.
ఊల్లాకుఁజేఁప. మత్స్యవిశేషము. [వాఁడు
ఊల్లాఘుఁడు. సం. విణ. రోగము తీఱిన
ఊల్లాపము. సం. కాకువచనము.
ఊల్లాభము. సం. ఉల్లడ, మేలుకట్టు.
ఊల్లాము. ఒక పక్షి
ఊల్లారు. గుఱ్ఱపు పల్లముమీఁది పఱపు.
ఊల్లాసము. సం. సంతోషము; ప్రకాశము.
ఊల్లాసించు. సం. అ. క్రి. సంతోషించు
ఊల్లి. వెల్లుల్లిᐩ; నీరుల్లి, పలాండువుᐩ.
ఊల్లికుచ్చుడము. ఒక చేఁప.
ఊల్లిపాషాణము. సౌవీరము.
ఊల్లుంఠనము. సం. ఉపాలంభము.
ఊల్లూనము. సం. ఒకదర్భ, ఉలపముᐩ.
ఊల్లేఖము. సం. ఒక అర్థాలంకారము; ఉచ్చారణము.
ఊల్లోచము. సం. మేలుకట్టు, చందువా.
ఊల్లోలము. సం. పెద్దయల, కడలు.
ఊవిద. ఆఁడుది.
ఊవ్వ. ఒక చెట్టు.
ఊవ్వపిట్ట ఒకపక్షి, గోలత్తిక.
ఊవ్వలపోటి. బాలక్రీడా విశేషము.
ఊవ్వాయి. వికాసము, ఉత్సాహము.
ఊవ్విళులూరు } అ. క్రి. త్వరపడు; మనసుపడు. రూ. ఉవ్విళ్లూరు.
ఊవ్విళ్లుగొను }

ఉవ్వు. పూనిక. [ముగా, యథావత్తు.
ఉవ్వెత్తు. అవ్య. అడుగుతో, నిశ్చేష
ఉశతి. సం. విణ. అశుభమైన వాక్కు.
ఉశనుఁడు సం. శుక్రుఁడు.రూ.ఉశనస్సు
ఉశీరము. సం. వట్టివేరు†.
ఉషఃకాలము. సం. తెల్లవారుటకుముందు నాలుగు (ఐదు) గడియలకాలము.
ఉష. సం. బాణునికూఁతురు; చేఁదుగల సారత†; రేయి.
ఉషణ. సం పిప్పలి†.
ఉషణము. సం. మిరియము†; సొంటి.
ఉషము. సం. గుగ్గిలపుచెట్టు.
ఉషర్బుధుఁడు. సం. అగ్నిహోత్రుఁడు.
ఉషస్సు. సం. ఉషఃకాలము.
ఉషాపతి. సం. అనిరుద్ధుఁడు.
ఉషితము. సం. చలిది.విణ.కాల్పఁబడినది
ఉష్ట్రము. సం. ఒంటె, లొట్టిపిట్ట.
ఉష్ట్రిక. సం. ఆఁడుఒంటె; ఒకకుండ.
ఉష్ణకము. సం. వేసంగికాలము. [రోగి.
ఉష్ణకుఁడు. సం. విణ. చొరవకలవాఁడు;
ఉష్ణము. సం. ఎండ; వేఁడిమి; వేసంగి కాలము. విణ. వేఁడియైనది; నేర్పుగలది.
ఉష్ణరశ్మి. సం. వేఁడివెలుఁగు,సూర్యుఁడు
ఉష్ణవారణము. సం. గొడుగు.
ఉష్ణాలుఁడు. సం. వేఁడికలవాఁడు.
ఉష్ణించు. సం. అ. క్రి. కాఁకనొందు.
ఉష్ణిక. సం. కాఁపుడు గంజి.
ఉష్ణీషము. సం. కిరీటము; తలపాగ; తల.
ఉష్ణోపగమము. సం. వేసంగికాలము.
ఉసల. తృణవిశేషము†.
ఉసి. పుక్కు కవియుట; నుసి, పొడి.
ఉసికొను. అ. క్రి. పుక్కు కవియు. ప్రే. ఉసికొలుపు.
ఉసిరిక. ఆమలకి†.
ఉసిలిపోవు. అ. క్రి. తప్పించుకొనిపోవు.
ఉసిళ్ళు. బ. రెక్కలువచ్చిన చెదపురుగులు.
ఉసుక. ఇసుక.
ఉసుము. అ. క్రి. ఉదుకు; తుడుచు.
ఉసురసురు. ఉస్సురస్సురు. [జెందు†.
ఉసు(స్సు)రను. అ. క్రి. మిక్కిలి విసుగు
ఉసురు. ఉస్సురు.
ఉసుఱు. ప్రాణము.
ఉసులు. సౌఖ్యము. విణ. సుఖము.
ఉసుళ్ళు. బ. ఇసుళ్లు.
ఉసూరు. ఉస్సురు.
ఉస్రె. వికీరణము†.
ఉస్ర. సం. ఆవు, ఎలుకజీడి†.
ఉస్రము. సం. ఎద్దు; కిరణము.
ఉస్సు. ఉస్సురు.
ఉస్సురస్సురు } తాపమునందగు ధ్వన్యను
ఉస్సురు } కరణము.
ఉహుహు. శీతబాధయందగు ధ్వన్యనుకరణము.
ఉహ్హు. అగ్ని సూఁదుటయందగు ధ్వన్యనుకరణము; ఊర్పు పుచ్చుటయందగు ధ్వన్యనుకరణము;

## ఊ

ఊఁ. అవ్య. అంగీకారమును కోపమును తాపమును ప్రశ్నమును తెలిపెడిని.
ఊఁక. ఊఁగులాట; ఉముక, తుషము.
ఊఁకర. ఊఁకొట్టుట. [ఆదరించు
ఊఁకించు. అ. క్రి. పూను, శంకించు;
ఊఁకు. అ. క్రి. పూను.
ఊఁకువ. పూనిక.
ఊఁకువగు. అ క్రి. పూను.
ఊఁకొట్టు. స. క్రి. ఆకర్ణించు,ఊఁఊఁఅని వృత్తాంతమును విను, హుంకొట్టుట.
ఊఁకొను. స. క్రి. ఊఁకొట్టు, విను.
ఊఁగాడు. అ క్రి. ఊఁగులాడు.
ఊఁగించు. స క్రి. ఊఁగఁజేయు.
ఊఁగు. అ. క్రి. ఊఁగాడు,ఆందోళించు.
ఊఁగులాట.ఊఁగులాడుట, ఆందోళనము
ఊఁగులాడు. అ. క్రి. ఊఁగాడు.

ఊఁచే లేఁతజొన్నకఱ్ఱ; అరఁటిబొంద; ముండ్లదుబ్బు.
ఊఁచేపడు. అ. క్రి. ఊఁచపట్టు; కృశించు
ఊఁచేపోవు. అ. క్రి. కృశించు.
ఊఁచేబియ్యము. లేఁతజొన్నబియ్యము.
ఊఁచేముట్టు. క్రి. విశ. నిశ్శేషము.
ఊఁచే. ప్రే. ఊఁగఁజేయు, ఆందోళితముఁగావించు.
ఊఁటు. స క్రి. దూఁటు, పొడుచు.
ఊఁత. అవలంబము; పై క్రింద లంబయులంగా విడిచి యడుగునుండి మీఁదికి వాటముగా గంపవలె చువ్వలతో అల్లిన మత్స్యగ్రహణ సాధన విశేషము.
ఊఁతకఱ్ఱ. ఊఁతకోల.
ఊఁతకొను. స. క్రి. ఊఁదు, అవలంబించు
ఊఁతకోల. ఊనుకొనెడు కఱ్ఱ.
ఊఁతము. పట్టు, అవలంబము.
ఊఁద. వాఁపు; ఈర్ష్య.
ఊఁదకడుపుది తుందిల, పొట్టపెరిగిన స్త్రీ.
ఊఁదకడుపువాఁడు. తుందిలుఁడు, పొట్టపెరిగినవాఁడు.
ఊఁదబొద్దు ఉలుకుబొద్దు.
ఊఁదర. కాయలు పండుటకును ఎలుకలు మొదలగునవి చచ్చుటకును వేసెడుపొగ.
ఊఁదరపెట్టు. స. క్రి. పొగవేసి జంతువులను తపింపఁజేయు.
ఊఁదు. వాఁపు; చేఁపలఊఁత. అ. క్రి. వాఁచు. స. క్రి. ధ్యానముచేయు; శంఖము మొ॥ ఊఁదు; నిప్పు మొ॥ ఊఁదు; పట్టు; ఆనుకొను; ఉంచు; అదుము; నొక్కు; చేఁపలను ఊఁతతోఁ బట్టు.
ఊఁదుగ్రోవి. అగసాలెవాఁడు కుంపటి యూఁదెడి గొట్టము. [ధూపము.
ఊఁదువత్తి. సాంబ్రాణి వత్తి; వర్తి
ఊఁదువాద్యము. పిల్లనగ్రోవి మొ.
ఊఁదువెండి. శుద్ధమైన వెండి.
ఊఁపు ఊఁచుట. ప్రే. ఊఁగఁజేయు.
?ఊఁపురము. మూఁపురము.
ఊకనబొద్దు. ఒక మందాకుచెట్టు.
ఊచే. అ. క్రి. వ్యాధిచే తల వెండ్రుకలు రాలు.

ఊట. ఊఁరుగాయరసము; మూలగ; చేవ; బలువు; ఊరిన ద్రవము.
?ఊటకల్లు. ధాన్యవిశేషము.
ఊటనీరు. ఊరిన నీళ్ళు.
ఊటిబుడ్డిచెక్క. కట్టడమునకుఁదగిన ఒక దినుసు మ్రాను [అల్లలనాడు.
ఊటాడు. అ. క్రి. సంభ్రమించు; చలించు;
ఊటి. వృక్షవిశేషము†.
ఊటించు. స క్రి. వంచించు.
ఊటు. వానచినుకులచేత కలిగినచెమ్మ.
ఊడ. అవరోహము, మఱ్ఱి మొదలగు వాని కొమ్మనుండి క్రిందికి దిగెడు వేరు.
ఊడనిఁబాడు. అ. క్రి. తొలఁగు; పాఱు.
ఊడి ఒకదినుసు కూరాకు†.
ఊడిగము. పరిచర్య; సేవ; సేవావృత్తి.
ఊడిగీఁడు. పరిచారకుఁడు.
ఊడిగెము. ఊడిగము, పరిచర్య.
ఊడిత. సాలెవాఁడు పడుగుచేయునపుడు అడ్డవాలకుండఁగ్రిందనూఁతగా నిలువున నిలిపెడు కొయ్య.
ఊడియము. ఊడిగము.
ఊడు. అ. క్రి. రాలు; జాఱు; కాఱు; తెగు; పాఱు; వదలు, విడిపోవు.
ఊడుకొను. అ. క్రి. గ్రుచ్చుకొను.
ఊడుగు. అంకోలము†.
ఊడుచు. స. క్రి. చిమ్ము, గృహము మొ॥ సమ్మార్జించు; నాఱునాటు. ప్రే. ఊడఁజేయు, వదలించు.
ఊడుపు. ఊడ్చుట; నాఱునాటుట.
ఊడుపుమడి. నాఱునాటినమడి.
ఊడెము. ఊడియము.
ఊడ్చు. స. క్రి. ఊడుచు.
ఊఢ. సం. పెండ్లాము. విశ. పెండ్లాడినది.
ఊఢము. సం. విశ. వహింపఁబడినది.
ఊఢుఁడు. సం. పెండ్లాడినవాఁడు.
ఊతము. సం. విశ. కుట్టఁబడినవస్త్రము మొ
ఊతి. సం. రక్షించుట; నూదితోఁ కుట్టుట.
ఊతిభము. సం. చకోరపక్షి.
ఊదర. తృణవిశేషము. బ. ధాన్యవిశేషము
ఊదరలు. బ. అణువులు; గడ్డిపంట.
ఊదా. హిం. ఒకరంగు, నీలవర్ణవిశేషము.

ఊధము } ఆవు మొదలగువాని పాల
ఊధస్సు } పొదుగు
ఊధస్యము. సం. పాలు.
ఊనము. సం. విశే. తక్కువైనది.
ఊనిక. ఆనిక; గిటవు.
ఊను. స.క్రి. అవలంబించు; పొందు; వహించు; మొత్తపడు.
ఊన్చు. స.క్రి. వహించు.
?ఊప. అడవిలోని చెట్లగుంపు. [ములు.
ఊపిరి. ఊర్పు; ఉచ్ఛ్వాస నిశ్వాస
ఊపిరికుట్టు. యాకము, ఊపిరిపుచ్చనీక నొప్పించెడు ఒక రోగము. [వాఁడు.
ఊబ. పేడి, నపుంసకుఁడు. రూ. ఊబ
ఊబి. బురద, పంకము.
ఊయల. ఊయెల.
ఊయాల } ఉయ్యాల, అందోళిక, డోల
ఊయెల }
ఊయేల. ఉయ్యాల. [కందు†.
ఊరఁగంద. ఊరియందు పైరు చేసెడు
ఊరఁగుక్క. ఊరియందు తిరుగు కుక్క.
ఊరఁబంది. ఊరియందు తిరుగు పంది, గ్రామ్యసూకరము. [పిచ్చిక, చటకము
ఊరఁబిచ్చి(చ్చు)క ఇండ్లపట్టునఁదిరిగెడు
ఊరఁబోవు. అ. క్రి. తగ్గు.
ఊరక. అవ్య. మిన్నక, ఏదేని ఒకటి లేక (ప్రయత్నములేక), తూష్ణీమర్థము.
ఊరకుండుట. తూష్ణీంభావము, తూష్ణీంస్థితి.
ఊరగోఁగు. తీక్ష్ణవృక్షము†.
ఊరజోగి బిచ్చపుజోగి.
ఊరబీఱ. ఆవడ, ఘోషకము†.
ఊరవ్యుఁడు. సం. వైశ్యుఁడు.
ఊరాఱుచు. స.క్రి. ఊఱడించు, ఓదార్చు రూ. ఊరార్చు.
ఊరించు. స. క్రి. ఊరునట్లుచేయు.
ఊరీకరించు. సం. స. క్రి. అంగీకరించు.
ఊరీకృతము. సం.విశే.అంగీకరింపఁబడినది
ఊరు. ఏఁడికోలలేని నాఁగలి; గ్రామము; దేశము; దేశాంతరము. అ.క్రి. ద్రవించు, స్రవించు, లోపలనుండి జలాదికము వెలికిఁదోఁచు; ఊరుఁగాయఊరు; శరీరములావగు; నాను; తడిగలదియగు; పుట్టు
ఊరుఁగాయ. ఊరఁబెట్టిననిమ్మ మొదలగువానికాయ, ఉపదంశము.
ఊరుఁబచ్చడి. ఊరఁబెట్టిన పచ్చడి.
ఊరుఁబిండి. ఉప్పుకారము మొ|| వేసిచేసి యుంచినపిండి, పచ్చడి, వ్యంజనవిశేషము
ఊరుకొను. స.క్రి. ఆఘ్రాణించు.
ఊరుచు. స.క్రి. ఊపిరివిడుచు; ఆతనంటిన గంధములోనగు దానిని చేతరాఁదీయు. రూ. ఊర్చు.
ఊరుజుఁడు. సం. వైశ్యుఁడు.
ఊరుపర్వము సం. మోఁకాలు.
ఊరుపు శ్వాసము; వ్యంజనవిశేషము. రూ. ఊర్పు.
ఊరువల్లెలు. బ. ఊరు పల్లెయు.
ఊరువు. సం. తొడ.
ఊరేగు. అ.క్రి. మెరవడిపోవు.
ఊర్చు. అ.క్రి. నిట్టూర్పు నిగుడించు.
ఊర్జము. సం. కార్తికమాసము; ఉత్సాహము; బలము; ఊపిరివెలికిఁబుచ్చుట.
ఊర్జస్వలుఁడు } సం. విశే. మిక్కిలిఉత్సాహము (బలము) గల
ఊర్జస్వి } వాఁడు.
ఊర్జితము. సం. దృఢము, గట్టిది.
ఊర్ణ. సం. ఉన్ని; నూలు; కనుబొమ్మల నడిమినుడి. [ఊర్ణనాభి.
ఊర్ణనాభము. సం. సాలెపురుగు. రూ.
ఊర్ణము. సం. భ్రూమధ్యము; మేషాదుల రోమము; దారము.
ఊర్ణాయువు. సం. కంబడి; గొఱ్ఱె; పొట్టేలు; సాలెపురుగు.
ఊర్ధ్వకము. సం. యవమధ్యమువంటి మధ్యముగల మృదంగము.
ఊర్ధ్వజ్ఞువు. సం. విశే. కొంగ కాళ్ల వాఁడు; లేచినవాఁడు.
ఊర్ధ్వము. సం. విశే. పొడవైనది; మీఁదికెత్తఁబడినది; మీఁదిది.
ఊర్ధ్వరేతసుఁడు. సం. ఋషి; శివుఁడు; జితేంద్రియుఁడు. రూ. ఊర్ధ్వరేతుఁడు, ఊర్ధ్వరేతస్సు.
ఊర్ధ్వరేతస్కుఁడు. సం. ఊర్ధ్వరేతసుఁడు.

ఊర్ధ్వాలోచనము. సం. శరభమృగము.
ఊర్పోక. ఉబుసుపోక.
ఊర్పోవు. అ. క్రి. ఉపిరి వెడలు.
ఊర్మి. సం. అల; ? ఉమ్మ్రి; తహతహ; నొప్పి; పరంపర; వస్త్రపు ముడుత; ప్రకాశము; ప్రవాహము; వంకర. (షడూర్ములు — ఆకలిదప్పులు, శోక మోహములు, జరామరణములు.)
ఊర్మిక. సం. అల; ఉంగరము; వస్త్రపు ముడుత.
ఊర్మిమాలి. సం. సముద్రము.
ఊర్మిళ. సం. లక్ష్మణుని భార్య.
ఊర్వశి. సం. ఒకయచ్చర. రూ. ఊర్వసి.
ఊఱట. ఊఱడించుట, ఆశ్వాసనము; ఊరకుండుట; తెఱపి; విరామము. విణ సహాయము.
ఊఱడించు. ప్రే. ఆశ్వాసించు.
ఊఱడించుట. సాంత్వనము.
ఊఱడిలు(ల్లు). అ. క్రి. ఉపశమిల్లు, శాంతిబొందు; చాలించు.
ఊఱడు. అ. క్రి. ఊఱడిల్లు; చాలించు.
ఊఱు. స. క్రి. సరిపోలు.
ఊలమాలగుడుచు. అ. క్రి. తహతహపడు.
ఊవాడు. అ. క్రి. ఊఁగాడు.
ఊవు. అ. క్రి. ఊఁగు.
ఊషణ. సం. పిప్పలి†. | పిప్పలి†.
ఊషణము. సం. మిరియము†; సొంటి;
ఊషము. సం. చవుడు; వేకువ.
ఊషరము. సం. విణ. చవుటి నేల.
ఊష్మకము. సం. వేసంగి, గ్రీష్మఋతువు.
ఊష్మము. సం. ఉమ్మ; వేసంగి. వ్యా. బ. శషసహలు;
ఊష్మలము. సం. విణ. ఉమ్మగలది.
ఊష్మాగమము. సం. వేసంగి.
ఊసరము. చవుటి నేల. విణ. కృశించినది.
ఊసరవెల్లి. మూడువన్నెలుగల తొండ, ముదిసినతొండ, కృకవాకువు.
ఊసరిల్లు. అ. క్రి. చిక్కు, కృశించు.
ఊసివాసము. ఈర్ష్య.
ఊసు. ఉబుసు.
ఊహ. సం. అపోహము పోఁగొట్టెడిబుద్ధి
ఊహము. సం. అపూర్వార్థమునుత్ప్రేక్షించుట; లేనిమాటలు కొన్ని తెచ్చుకొనుట.
ఊహించు సం స. క్రి. ఊహచేయు.
ఊళ. నక్కకూఁత.
ఊళిక. చొంతా, పల్లకి.
ఊళ్లు, బ. గ్రామములు.

## ఋ

ఋక్కు. ఋగ్వేదము; ఒక వేదభాగము.
ఋక్థము. సం. ధనము, విడిముడి.
ఋక్సూక్తి. సం. ఋగ్వేదమందలి సూక్తి.
ఋక్షగంధ. సం. బొద్దికూర.
ఋక్షగంధిక. సం. నల్లనేల గుమ్ముడు†; పాలగుమ్ముడు†.
ఋక్షము. సం. నక్షత్రము; ఎలుఁగుగొడ్డు; ఒకకొండ; దుండిగము†. విణ. గ్రుచ్చఁబడినది.
ఋగామ్నాయము. సం. ఋగ్వేదము.
ఋగ్యజుషము. సం. ఋగ్వేదయజుర్వేదముల సముదాయము.
ఋజీషము. సం. పిండివంటచేసెడు పాత్రము; బూరెలమూకుఁడు.
ఋజుఁడు. సం. విణ. సరళమైన ప్రవర్తన గలవాఁడు.
ఋజుత. సం. నిష్కాపట్యము. [నైనది.
ఋజువు. సం. విణ. తిన్ననిది, చక్క
ఋణము. సం. అప్పు. (ఋణత్రయము— దేవ-ఋణము, ఋషి-ఋణము, పితృ-ఋణము.) [అప్పు.
ఋణార్ణము. సం. అప్పుతీర్చుటకై తీసిన
ఋణి. సం. విణ. అప్పులకాఁపు.
ఋతము. సం. సత్యవాక్కు; శిలోంఛ

వృత్తి; నీళ్లు. విణ. సత్యమైనది; పూజింపఁబడినది; ప్రకాశమొందినది.
ఋతి. సం. త్రోవ; పోటీ; రోఁత; శుభము
ఋతీయ. సం. జుగుప్స; రోఁత.
ఋతుజ్ఞుఁడు. సం. ఋతుధర్మము తెలిసిన వాఁడు.
ఋతుమతి. సం. ముట్టుది.
ఋతువు. సం. ఆర్తవము; వెలుఁగు; రెండు నెలల కాలము; వసంతము మొ. (షడృతువులు — వసంతము, గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము, శిశిరము.)
ఋత్విక్కు. సం. ఋత్విజుఁడు.
ఋత్విజుఁడు. సం. ఒజ్జ, యజమానుని చేత ధనమును పుచ్చుకొని యజ్ఞము చేయించు వాఁడు. (బ. షోడశ-ఋత్విజులు — బ్రహ్మ, ఉద్గాత, హోత, అధ్వర్యువు, బ్రాహ్మణాచ్ఛంసి, ప్రస్తోత, మైత్రావరుణుఁడు, ప్రతిప్రస్థాత, పోత, ప్రతిహర్త, అచ్ఛావాకుఁడు, నేష్ట, అగ్నీధ్రుఁడు, సుబ్రహ్మణ్యుఁడు, గ్రావస్తుతుఁడు, ఉన్నేత.) [పెరిగినది.
ఋద్ధము. సం. విణ. నుఱిచిన ధాన్యము;
ఋద్ధి. సం. సమృద్ధి; గంధద్రవ్యవిశేషము.
ఋభుక్షుఁడు. సం. ఇంద్రుఁడు,
ఋభువు. సం. వేలుపు; ఒక అవధూత.
ఋశ్యకేతువు. సం. మన్మథుఁడు. [పీఁచర†
ఋశ్యప్రోక్త. సం. దూలగొండి†; పిల్ల
ఋశ్యము. సం. అశ్వాకారము గల మూఁడుకొమ్ముల మృగము; మనుఁబోతు.
ఋషభము. సం. ఒక ఓషధి†; తిరుమల; కర్ణరంధ్రము; ఎద్దు; ఒక స్వరము.
ఋషభి. సం. దూలగొండి†; మాచకమ్మ; ముండ. [(పదాంతమున) శ్రేష్ఠుడు.
ఋషభుఁడు. సం. ఒక భగవదవతారము;
ఋషి. సం. ముని, వశిష్ఠుఁడు మొ॥; వేదము; వెలుఁగు. బ. సప్తర్షులు — మరీచి, అత్రి, అంగిరుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, వశిష్ఠుఁడు. క్రమాంతరమున — కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, వశిష్ఠుఁడు, జమదగ్ని.
ఋష్యప్రోక్త. సం. ఒక చిట్టాముదపు చెట్టు†; ఋశ్యప్రోక్త†.
ఋష్యము. సం. ఋశ్యము.

# ఎ

ఎ. మఱియొకదాని లేమిని మఱియొకదాని కలిమిని చూపుటను తనంతట అనువర్థమును ఎక్కువ తక్కువలను దెలిపెడి. అవ్య. ప్రశ్నమును వ్యతిరేకమును మెచ్చుకొనుటను అఁడుదగుటను దెలిపెడి ఇది తర్వాతి యక్షరమునకు ద్విత్వము కల్పించి కిం (యత్) శబ్దార్థకమగును (ఎక్కాలము, ఎద్దేశము అని).
ఎంగిలి. ఉచ్ఛిష్టము.
ఎంగెన. ఒక వనవృక్షము†.
ఎంచు. స. క్రి. లెక్కపెట్టు, గణించు; తలఁచు; ఆక్షేపించు; ప్రశంసించు.
ఎండ. ఆతపము, సూర్యప్రకాశము.
ఎండఁగట్టు. స. క్రి. ఆరఁగట్టు.
ఎండఁగొట్టు. స. క్రి. ఎండఁజేయు.
ఎండఁబెట్టు. స. క్రి. ఎండవేయు.
ఎండదొర. సూర్యుఁడు.
ఎండమావులు. బ. మృగతృష్ణ, మిట్ట మధ్యాహ్నవేళ బయళ్లయందు నీటివలెఁ దోఁచెడి సూర్యకిరణములు. విణ. అనిత్యము.
ఎండఱేఁడు. సూర్యుఁడు.
ఎండాకు. శుష్కపర్ణము.
ఎండు. అ. క్రి. తడియాఱు; నీరింకు; తపించు; శుష్కించు.
ఎండుగులు. బ. ఎండఁబోసిన ధాన్యము.
ఎండుతెవులు. దేహము శుష్కించెడు ఒక వ్యాధి.
ఎండుపుఁదట్టు. ఏదేని యొండఁబెట్టుటకు నెమరుబ్రద్దలు మొదలగువానిచేత అల్లిన తట్ట, దాఁగర, ప్రసేవకము.
ఎండువులు. బ. ఎండుగులు.

ఎండ్రకాయ. కర్కాటకము.
ఎండ్రి. పీత, కుళీరము, కర్కాటకము.
ఎండ్రిక. ఎండ్రకాయ.
ఎంత. స. ఏ కొలఁది; ఏ యుద్దేశ్యపు కొలఁది (కియదర్థకము, యావదర్థకము)
ఎంత కుమతులు. బ. మిక్కిలి దుష్టమతి గలవారు.
ఎంతమంది. బ. ఎందఱు
ఎంతేని. మిక్కిలి.
ఎందనుక. ద్ర. ఎందాఁక.
ఎందఱు. స. బ. ఎంత సంఖ్య గలవారు.
ఎందాఁక. ద్ర. ఎంత పర్యంతము.
ఎందు. ద్ర. ఎచ్చోట; ఎక్కడ.
ఎందులకు. ద్ర. ఎచ్చోటికి; దేనికి.
ఎంప్రెసాఫిండియా. ఇం. హిందూదేశపు చక్రవర్తిని.
ఎంప్రెసు. ఇం. చక్రవర్తిని.
ఎంబన్న. విణ. చేతగానివాఁడు.
ఎంబెఱికము. అసహ్యము. రూ.ఎంబెఱికి
ఎఁడు. పరిమాణార్థకము.
ఎకతాళి. వా. అపహాస్యము.
ఎకదొట్టు. అ. క్రి. అతిశయించు.
ఎకరము. ఇం. 4840 గజముల నేల.
ఎకరా. ఏనుగునుకట్టు మెంగసాల.
ఎకరారు. హిం. ఒప్పుకొనుట
ఎకసకియము. ఎకసక్కెము. [వంగినది.
ఎకసకెము. విణ.వంపుగలది, ఒకప్రక్కకు
ఎకసక్కియము. పరిహాసము.
ఎకసక్కెము. పరిహాసము; వెక్కిరింత; అవమానము; మోసము. విణ వంగినది; అసంగతము.
ఎకసెకి(క్కి)యము, ఎకసెకెము } ఎకసక్కెము.
ఎకసెక్కెము. పరిహాసము.
ఎకాయెకి. హిం. క్రి. విణ అకస్మాత్తు; అతివేగముగా.
ఎకిమీఁడు. ఒడయఁడు, రాజు, ప్రభువు.
ఎకిరింత. ఎక్కిరింత, వాహనము.
ఎకిరింతయెద్దు. వాహనమైనయెద్దు.
ఎక్కటి. స. ఒక్కటి; ఒంటరిగా.
ఎక్కటీఁడు. అసహాయుఁడైన బంటు.
ఎక్కడ. ఏచోటు, ఏ ప్రదేశము.
ఎక్కము గనిమ; ఏకము, ఒకటి. బ ఎక్కాలు, గుణకారపథకము.
ఎక్కలి. ప్రవాహముచే కొట్టుకొని వచ్చి కమ్ముకొనిన యిసుక.
ఎక్కసకియము. ఎకసక్కెము.
ఎక్కసకెము. ఎకసక్కెము.
ఎక్కసకియము, ఎక్కసక్కెము } ఎకసక్కెము.
ఎక్కసెకి(క్కి)యము, ఎక్కసెకె(క్కె)ము } ఎకసక్కెము.
ఎక్కాడు. స.క్రి పురికొలుపు.
ఎక్కించు. ప్రే. ఆరోపించు, ఆరోహణము చేయించు. [చుకొను.
ఎక్కించుకొను. స.క్రి. తనమీఁద నెక్కిం
ఎక్కిడు. స.క్రి. సజ్యమొనర్చు, నారిగల దానినిగాఁజేయు, మోపెట్టు.
ఎక్కిరింత. వాహనము.
ఎక్కిలి. హిక్క, దప్పి మొదలగువానిచేఁ గలిగెడి ఒక వ్యాధి. బ. ఎక్కులు, ఎక్కిళ్లు
ఎక్కు. వింటినారి; ఎక్కిలి; ఎక్కుమనుట. అ.క్రి. అతిశయించు; ఇష్టమగు, సిద్ధించు. స.క్రి. ఆరోహించు. బ. ప్రేరేఁపణ.
ఎక్కుడించు. స.క్రి. హెచ్చించు.
ఎక్కుడు. ఆరోహణము; వాహనము; వింటినారి. విణ గొప్ప, అధికము; శ్రేష్ఠుఁడు; శ్రేష్ఠమైనది.
ఎక్కుడుదీఁగ. మానేరు; జ్యోతిష్మతి†.
ఎక్కుడుపెట్టు స.క్రి. ఎక్కిడు.
ఎక్కుడుమెకము. మహామృగము, ఏనుఁగు
ఎక్కుపెట్టు. స.క్రి. ఎక్కిడు.
ఎక్కులుపెట్టు. స. క్రి. పురికొలుపు, ప్రేరేఁపించు.
ఎక్కువ. ఆధిక్యము. విణ. అధికము.
ఎక్కువది. విణ. శ్రేష్ఠమైనది.
ఎక్కువవాఁడు. విణ. శ్రేష్ఠుఁడు.
ఎగ. ఎగువ శబ్దమునకు వృత్తియందు ఆదేశముగా వచ్చిన రూపము—మీఁదు (ఎగదిగ యని).
ఎగచు ప్రే. ఎగయఁజేయు; తఱుము.
ఎగజేఁపు. పాలురాకుండ మీఁదికి చేఁపు.

ఎగతాళి. గేలి, పరిహాసము.
ఎగదిగ. ఎగువదిగువలుగా.
ఎగపు. గర్వము; మండిపడుట.
ఎగయు. అ. క్రి. ఎగురు, పైకిలేచు.
ఎగయుట ఉత్పతనము; ఉత్థానము.
ఎగవు. ఎగురుట.
ఎగనన. ద్ర. ఎగువగా.
ఎగసిపడు. అ. క్రి. ఎగిరిపడు; మిట్టిపడు, గర్వించు; మండిపడు.
ఎగసిపాటు. ఎగసిపడుట.
?ఎగసిల్లు. అ. క్రి. ఎగయు.
ఎగాదిగ. ద్ర. ఎగదిగ
ఎగు. వృత్తియందు ఎగువ శబ్దమునకును అంత్యవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. [గము చేయు.
ఎగుచే. స. క్రి. తఱుము; బాణ ప్రయో
ఎగుడు. విణ. ఉన్నతము.
ఎగుడుదిగుడు. విణ. సమముకానిది, విష మము; అసంగతము.
ఎగుదల. పై భాగము; వృద్ధి.
ఎగుదు. అ. క్రి. పరువిడు; సరిపోవు.
ఎగుబుజము. ఉన్నతభుజము
ఎగుబోద. ఱెక్కలు మొలచి యెగిరెడు వయసు వచ్చిన పక్షిపిల్ల.
ఎగుమతి. ఓడకు సరకు లెక్కించుట.
ఎగుమతిచేయు. స. క్రి. ఓడకు సరకు లెక్కించు.
?ఎగురు. ఎగురుట. అ. క్రి. మీఁదికిపోవు.
ఎగురులాడు. అ. క్రి. దుముకులాడు.
ఎగువ. మీఁద; మీఁదు; ఆధిక్యము. విణ. ఉన్నతము.
ఎగ్గతము. ఏకాంతస్థలము.
ఎగ్గాడు. స క్రి. దూషించు.
ఎగ్గించే. స. క్రి అనాదరించు.
ఎగ్గు. కీడు, అపకారము; కీడుమాట; అప రాధము; దోషము; అనాదరము. బ. దూషణము. [ఎగ్గుర్తు.
ఎగ్గుఱుతు. విషయసంగ్రహము. రూ.
ఎగ్గులాడు. స. క్రి. నిందించు.
ఎచ్చిరిలు. అ. క్రి. వర్ధిల్లు.
ఎచ్చెఱు. అ. క్రి. ఎచ్చిరిలు; బాగుపడు.
ఎచట. ఎక్కడ.
ఎచేటు. ఎచ్చోటు.
ఎచేరించే. స. క్రి. ఎచ్చరించు.
ఎచోటు. ఎచ్చోటు.
ఎచ్చట. ఎక్కడ.
ఎచ్చటు ఎచ్చోటు.
ఎచ్చరము. ఎచ్చరిక. [ఎచ్చరికచేయు.
ఎచ్చరించే స. క్రి. అవహితమొనర్చు,
ఎచ్చరింత. ఎచ్చరిక.
ఎచ్చరిక. జాగరూకత, అవధానము; సూచన; ప్రోద్బలము.
ఎచ్చరికించే. ఎచ్చరించు.
ఎచ్చు. ఆధిక్యము. విణ. అధికము. అ. క్రి. అధికమగు.
ఎచ్చోట. ఎక్కడ.
ఎచ్చో. ఎక్కడ.
ఎచ్చోట. ఎక్కడ.
ఎచ్చోటు. ఏస్థానము.
ఎట. ఎక్కడ.
ఎటవారె. కుందురుకీ.
ఎటు. అవ్య. ఎట్లు; ఎక్కడకు.
ఎటులు. అవ్య. ఎట్లు, ఏలాగు. [శము.
ఎటువంటి. విణ. ఎట్టి. కీదృశము; యాదృ
ఎటువలె. ద్ర. ఎట్లు.
ఎట్టకునేని. అవ్య. ఎట్టకేని.
ఎట్టకేని. అవ్య. అతిప్రయాసమున.
ఎట్టకేలకు. ద్ర. ఎట్టకేని; చాలానేపటికి.
ఎట్టట. అవ్య. ఎట్టయిన.
ఎట్టపోగు. దండు. [ముందఱ, సమక్షము.
ఎట్టయెదురు. చక్కనియెదురు, మిక్కిలి
ఎట్టి. విణ ఎటువంటి.
ఎట్టిఁడు. విణ. ఎటువంటివాఁడు.
ఎట్టు. అవ్య. ఎట్లు.
ఎట్టులు. అవ్య. ఎట్లు.
ఎట్టువోలె ద్ర ఎట్లు.
ఎట్టూ. అవ్య. ప్రశ్నమును దెలుపును.
ఎట్లు. అవ్య. ఏ ప్రకారము, ఏలాగు.
ఎడ. భాగము, స్థలము, స్థానము; అవ కాశము; దూరము, వ్యవధానము; గడువు; భేదము; విఘ్నము; వ్యవహా

రము; సంధి; హృదయము; దేవతానై
వేద్యవస్తువు? విణ. ఎల్లప్రాయముగలది.
ప్రద. నడుమ. [రూ. ఎడ్డ.
ఎడఁద. హృదయము. అంతరంగము.
ఎడఁబాటు. ఎడఁబాయుట, వియోగము.
ఎడఁబాపు. ప్రే. ఎడఁబాయఁజేయు;
వియుక్తముఁజేయు.
ఎడఁబాయు. స. క్రి. వీడు, వదలు.
ఎడకట్టు. అ. క్రి. ఆరినపుండు మరల
చీముపట్టు. స. క్రి. చేర్చు.
ఎడకత్తియ. కుంటెనకత్తె, దూతిక. రూ.
ఎడకత్తె.
ఎడకాఁడు. తార్చువాఁడు, దూత; విటుఁడు.
ఎడకారు. మాఘమాసము మొదలు జ్యేష్ఠ
మాసములోపల పండించెడు పంట.
ఎడగడ్డ. ఒడ్డు, గట్టు.
ఎడగిల్లు. అ. క్రి. తొలఁగు.
ఎడతాఁకు. అ. క్రి చేరు.
ఎడతీయు. అ. క్రి. ఎడతెగు.
ఎడతెగు. అ. క్రి. ఎడపడు; విడివడు.
ఎడతెఱపి. వ్యవధానము. రూ. ఎడతెర్పి.
ఎడత్రెచ్చు. అ. క్రి. ఎడతెగు.
ఎడదవ్వు. అతిదూరము.
ఎడనీటికాయ. లేఁతటెంకాయ.
ఎడనీరు. లేఁతటెంకాయలోని తియ్యనీరు
ఎడపక. సంతతము.
ఎడపడు. అ. క్రి. ఎడతెగు; పూఁటపడు.
ఎడపదడప. అవ్య. అప్పుడప్పుడు.
ఎడపు. ప్రే. ఎడయఁజేయు, విచ్ఛేదము
చేయు. [కుంటెనతనము సేయు.
ఎడపుచ్చు. స. క్రి. రాయబారము నడుపు,
ఎడపెట్టు. స. క్రి. తొలగించు; మాఱు
వడ్డించుకొనుటకై అన్నమును దగ్గఱ
ఎత్తియుంచు.
ఎడపోవు. అ. క్రి. దౌత్యముచేయు.
ఎడమ. వామభాగము. విణ. సవ్యము.
ఎడమడుగు(వు). వ్యత్యాసము; అభ్యంత
రము; వైషమ్యము. విణ. వ్యత్యస్తము.
ఎడమడుపు పరువడి. మల్లబంధవిశేషము.
ఎడమది విణ. వామము, సవ్యము,
ఎడము. చోటు; అవకాశము, అంతరము

ఎడయిక. ఎడఁబాటు. [వేఱగు.
ఎడయు. అ. క్రి. తొలఁగు; ఎడబాయు;
ఎడరు. ఆపద; భంగము; సందు; వ్యవ
ధానము; సమయము; ఎడారి. అ. క్రి.
భగ్నమగు.
ఎడలు. అ. క్రి. పోవు; వికలమగు; విచ్ఛి
న్నమగు. స. క్రి. విసర్జించు.
ఎడవాఁడు. కడవాఁడు; అన్యుఁడు.
ఎడవు. విణ. దవ్వు, దూరము.
ఎడవోవు. స. క్రి. ఎడపుచ్చు.
ఎడసాల. ప్రత్యేకమైన గది.
ఎడాటము విషయము [భూమి; బయలు.
ఎడారి. చెట్లు చేమలు లేని విశాలపు నిర్జల
ఎడారె. చెప్పులు కుట్టెడు చిన్నసూది.
ఎడ్డ. ఎడఁద.
ఎడ్డమి. ఆపద.
ఎడ్డుము. అడ్డంకి.
ఎడ్డియ. విణ. ఎడ్డె.
ఎడ్డె. విణ. మూర్ఖుఁడు; మూర్ఖురాలు.
ఎడ్డెఁడు. విణ. ఎడ్డ.
ఎడ్డెతనము. మూర్ఖత, మౌర్ఖ్యము
ఎడ్డెన. భోజనపాత్రము నుంచుకొనెడి
ఉన్నతపీఠము.
ఎడ్మ. ఎడమ.
ఎడ్లు. బ. వృషభములు.
ఎతఁడు. స. ఏ పూజ్యుఁడు.
ఎతుబరికాఁడు. దొంగ.
ఎత్తనగోల. గోనెలెత్తియెడ్లమీఁద వేయు
టకు సాధనమైన కఱ్ఱ; ఊఁతగా
నానించిన కోల.
ఎత్తనగోలు. మొదలు; ప్రారంభము.
ఎత్తరము } విణ. ఉన్నతము.
ఎత్తరువు }
ఎత్తళి. కొఱముట్టు, సాధనము.
ఎత్తికొను. అ. క్రి. యత్నించు. స. క్రి. అప
హరించు; వహించు; ఉద్ధరించు.
ఎత్తికోలు. ప్రయత్నము; సంకల్పము.
ఎత్తిపొడుచు. స. క్రి. ఉపాలంభించు,
దోషములెత్తిచెప్పిమర్మము దూఱిపొఱ
నాడు. [ఉపాలంభము.
ఎత్తిపొడుపుమాట. ఉత్ప్రాసము,

ఎత్తిలి. అవ్య. గట్టిగా. [చేయు.
ఎత్తివేయు. స.క్రి. తీసివేయు; అలక్ష్యము
ఎత్తు. చదరంగపు ఎత్తు; ఉన్నతి; ఉపాయము; రెండువీసెలకొలఁది; బలువు, తూనిక; ప్రయత్నము; పుష్పసరము. బ. వలపుకత్తె వలచినవానికిచ్చుధనము. విణ. ఉన్నతము. అ క్రి. కలుగు, పుట్టు; బయలుదేఱు. స.క్రి. అపహరించు; దండెత్తు; పైకెత్తు; గ్రహించు; తీయు; పాటించు; ఆరంభించు; ప్రస్తావించు; వహించు; సంగ్రహించు; ఉద్ధరించు.
ఎత్తుగడ. ఉపాయము; యత్నము.
ఎత్తుగడ్డలు. బ. ఎత్తుడు ప్రొయ్యిగడ్డలు.
ఎత్తుగల్లు. ఎక్కుటకై ఎత్తుగా పెట్టుకొన్నఱాయి.
ఎత్తుగీతియు. ఎత్తుగీతి.
ఎత్తుగున్న. లేఁతయేనుఁగుపిల్ల, కలభము.
ఎత్తుదెంచు. అ.క్రి. దండెత్తివచ్చు.
ఎత్తుపెట్టు. స.క్రి. పురికొలుపు.
ఎత్తుబరికాఁడు. దొంగ, చోరుఁడు.
ఎత్తుభారము. మి. విణ. పాడు, శూన్యము.
ఎత్తువచ్చు. అ.క్రి. సరిపోలు.
ఎత్తువడు. అ.క్రి. చెడు; లేవలేకపడు.
ఎత్తువేయు. స క్రి. తూఁచు.
ఎత్తువోవు. అ.క్రి. చెడు; తగ్గు.
ఎత్తెల. చేఁపలఁబట్టెడి అడ్డువల.
ఎద. పశుఋతువు; మనస్సు; వక్షస్స్థలము; భయము. [విష్ణువు.
ఎదమచ్చగలసామి. శ్రీవత్సలాంఛనుఁడు,
ఎదవడు. అ.క్రి. భయపడు.
ఎదావు. ఆఁబోతుచేర సమయమైనయావు.
ఎది. స. ఏది.
ఎదిరి. విరోధి.
ఎదిరించు. స.క్రి. ఎదురు, ఎదురేగు, అభిగమించు; ఎదుర్కొను, అభ్యవస్కందించు
ఎదుగు. అ.క్రి. పెరుగు, వృద్ధిబొందు.
ఎదుట. ద్ర. ముందఱ, పురోభాగమున.
ఎదుటిది. విణ. ముందఱనున్నది.
ఎదుటివాఁడు: ముందఱనున్నవాఁడు.
ఎదురాడు. అ.క్రి. మాఱాడు.
ఎదురు. ముందఱ, పురోభాగము; ఎదుటివాఁడు; వలపుకత్తె వలచినవానికిచ్చు ధనము. స.క్రి ఎదిరించు. విణ. అన్యుఁడు.
ఎదురుకట్టుల. ద్ర. ఎదుట. [వ్యాధి.
ఎదురుకుత్తుక. అంకిళ్లుపట్టుకొనెడు ఒక
ఎదురుకొనిపించు. ప్రే. ఎదిరింపఁజేయు.
ఎదురుకొను. అ.క్రి. ఎదురగు, అభిముఖమగు. స.క్రి. ఎదిరించు.
ఎదురుకొలుపు. ప్రే. ఎదిరింపఁజేయు.
ఎదురుకోలు. అభిగమనము, పూజ్యులు వచ్చునప్పుడు ఎదురుగాఁబోవుట; వివాహమునందు పడుచింటివారు వరుని కెదురుగాఁబోవుట. రూ. ఎదుర్కోలు.
ఎదురుగడ. మాఱువ్రాసినఒడంబడికము
ఎదురుచు. అ.క్రి. ప్రతికూలమగు. స.క్రి. ఎదిరించు.
ఎదురుచుక్క. విణ. కానిది.
ఎదురుచూచు. వేచు, ప్రతీక్షించు.
ఎదురుపడు. అ.క్రి. ఎదురుగావచ్చు; ఎదురుతిరుగు. రూ. ఎదుర్పడు.
ఎదురుపాటు. ఎదురుపడుట. రూ. ఎదుర్పాటు. [ప్రతిధ్వనించు.
ఎదురుమ్రోయు. అ. క్రి. మాఱుచెలఁగు,
ఎదురుఱొమ్ము. ఉరోమధ్యము.
ఎదురేగు. అ. క్రి. ఎదురుగాఁబోవు, అభిగమించు. [త్తులు.
ఎదురొత్తు. అ క్రి. మాఱొత్తు. బ. మాఱొ
ఎదుర్కొను. ఎదురుకొను.
ఎదుఱు. ఎదురు. [శూన్యము.
ఎద్దడి. దారిద్ర్యము. విణ. దరిద్రము;
ఎద్దడినేల. నిర్జలభూమి, మరుభూమి.
ఎద్దము. పట్టితీరినయంచు.
ఎద్ది. స. ఏది.
ఎద్దు. వృషభము. బ. ఎడ్లు.
ఎద్దునాలుక. గోజిహ్వ†.
ఎద్దుపట్టు. స. క్రి. వట్టగొట్టు, ఎద్దును వృషణహీనముచేయు.
ఎద్దుముట్టె. ఒక దినుసుగడ్డ†.
ఎద్దురాసి. వృషభరాశి.
ఎద్దెస. ఎక్కడ.
ఎద్రుచు. అ. క్రి. ఎదురుచు, ప్రతికూలమగు (ఇచటి ఎ లఘువేయగును).

ఎన. విణ. సమానము.
ఎనమంండ్రుు. స. ఎనిమిదిమంది.
ఎనమందుము. ఎనిమిది తూములు.
ఎనమనూ(న్నూ)ఱు.స.ఎనిమిదెనూఱులు.
ఎనయిక. పొందిక; సామ్యము.
ఎనయు. అ. క్రి. సరిపోలు. స. క్రి. కలియు, పొందు; పోలు.
ఎని. స. ఎన్ని. [దారము.
ఎనిక. ఎన్నిక; నాలుగు పోగుల నూలు
ఎనిమిదవది. విణ. అష్టమము.
ఎనిమిదవవాఁడు. విణ. అష్టముపురుషుఁడు
ఎనిమిది. స. ఏడునొకటి, ఎన్మిది, అష్ట (అష్టకము.) [త్రము.
ఎనిమిదికాళ్లమేక. పూర్వభాద్ర నక్ష
ఎనిమిదికాళ్లమెకము. అష్టపాదము, శరభ మృగము.
ఎనిమిదికాళ్లరిక్క నెల. భాద్రపదమాసము
ఎనియు. అ.క్రి. కలసికొను.
ఎనుచే క్రే. ఎనియఁజేయు, ఎనుపు
ఎనుపతేలు. నల్లతేలు.
ఎనుపమోఁకాలు. ఒకచెట్టు†.
ఎనుపనరము. బఱ్ఱె.
ఎనుపు. క్రే. ఎనియఁజేయు.
ఎనుపుడు. ఎనుపుట.
ఎనుపెంటి. బఱ్ఱె, గేదె.
ఎనుపోతు. దున్న, మహిషము.
ఎనుబండ్రుు. స. ఎనుబదిమంది.
ఎనుబది. స. ఎనిమిదిపదులు, అశీతి.
ఎనుబదిమంది. స. ఎనుబండ్రుు.
ఎనుము. బఱ్ఱె, గేదె, మహిషి.
ఎన్నఁడు. ఎప్పుడు; ఏకాలము;ఎల్లప్పుడు. ద్ర. ఎల్లప్పుడు.
ఎన్నాళ్లు. బ. ఎన్ని దినములు.
ఎన్ని. స. ఎంతసంఖ్య గలవి; అన్ని.
ఎన్నిక. గణనము.
ఎన్నికచేయు / ఎన్నికపెట్టు } స.క్రి. ఎంచు, గణించు.
ఎన్నికమానిసి. ప్రసిద్ధుఁడు;ప్రసిద్ధురాలు.
ఎన్ను. సస్యాదిమంజరి, వరియెన్ను మొ. స.క్రి. ఆక్షేపించు;గణించు,లెక్కపెట్టు
ఎన్నువ. ఆఁడువారేడ్చునప్పుడు అనుభవము నెంచియెంచి పాటగాఁబాడెడు చచ్చినవారి చారిత్రము.
ఎన్నెమ. పురిటిపురుగు.?
ఎన్పది. స. ఎనుబది.
ఎపుడు. ఎప్పుడు, ఏవేళ.
ఎప్డు. ఎపుడు.
ఎప్పటి. అవ్య. అప్పటి, మరల.
ఎప్పుడు. ఏకాలము. ద్ర. ఎల్లప్పుడు.
ఎబ్బె. రోఁతపడుటయందు ఉపయోగింపఁబడుమాట.
ఎబ్బెట్టు. విణ. వికటము, విరసము.
ఎబ్బెర. ఒకపక్షి.? [వాఁడు.
ఎబ్బెరాసి. విణ. రోఁతకలది; రోఁత కల
ఎబ్బెఱికము. రోఁత, అసహ్యము.
ఎమిడిక. ఎమిడికపాము, కడుపులోఁ గలుగు పామువంటి తెల్లని పురుగు.
ఎముక. అస్థి, శల్యము. [వ్యక్తి.
ఎముకలవట్టు. విణ వ్యాధిచే బక్కటిల్లిన
ఎమ్ము. ఎముక.
ఎమ్మిక. ఎముక.
ఎమ్మాట. మూలగ.
ఎమ్మె. మనోహరత్వము; విలాసము.
ఎమ్మెకాఁడు. విణ. విలాసవంతుఁడు.
ఎమ్మెలాఁడి విలాసముగల స్త్రీ.
ఎయిదు. స. క్రి. వెంబడించు; పొందు. రూ. ఎద్దు
ఎయ్యది స. ఏది.
ఎయ్యెడ. ఎక్కడ.
ఎర. మృగాదులను పట్టుకొనటకై వేసెడి మాంసము; ఆహారము; బలి; వ్యసనము; అగ్గము.
ఎరఁగు. అ. క్రి. దిగు; నమస్కరించు.
ఎరఁగుడు. నమస్కారము.
ఎరగలి. కార్చిచ్చు, ప్రాను ఒకటితో నొకటి ఒరసికొనఁగా పుట్టిఅడవినిదహించెడి అగ్ని, దావాగ్ని. [మింగు.
ఎరగొను. అ.క్రి. పరవశముగు. స.క్రి.
ఎరవలి. ఎరగలి, దావాగ్ని.
ఎరవు. తిరుగ ఇచ్చెదనని (ఒకటి రెండు దినములు వాడుకొనుటకై) అడిగి తెచ్చుకొనెడిసొమ్ము, యాచితకము; ఛేదము. విణ. అన్యము.

ఎరియు. అ.క్రి. కాలు, మండు; పరితపించు, దుఃఖించు; అపేక్షించు.
ఎరివు. బాధ; తాపము.
ఎరుపంటి. పంజెచెట్టు†.
ఎరువాటు. ఎరువువైచుట.
ఎరువు. పాంశువు, పైరుకై పెక్కువాళ్లు చేర్చిపెట్టిన పేడ, పశువులు తొక్కిన చెత్త మొ.
ఎరుసు. ఈర్ష్య.
ఎర్క. ఎఱుక.
ఎర్గు. ఎఱుఁగు.
ఎఱ. వానపాము విణ. ఎఱ్ఱనైనది. రూ. ఎఱ్ఱ
ఎఱఁగు. అ.క్రి. పొంగు; దిగు; నమస్కరించు; ఎగయు; మీఁదికినుఱుకు.
ఎఱక. ఱెక్క, పక్షము; భుజము.
ఎఱగందు. లేఁతబిడ్డ, శిశువు.
ఎఱగన్ను. శివునియొక్క అగ్నినేత్రము.
ఎఱగొను. అ.క్రి. కోపగించు.
ఎఱచి. మాంసము.
ఎఱచిదిండి. అసురుఁడు.
ఎఱచిపిడుక. చోరపుష్పి†.
ఎఱబఱికము. రోఁత, అసహ్యము.
ఎఱసంజె. సాయంసంధ్య; ప్రాతస్సంధ్య.
ఎఱుఁగు. స.క్రి. తెలియు.
ఎఱుక. తెలివి, జ్ఞానము; పరిచయము; సోదె; గుఱుతు; జోస్యము.
ఎఱుకత. సోదెచెప్పునది, దైవజ్ఞ.
ఎఱుకచేయు. స. క్రి. తెలియఁజేయు, తెలుపు, విదితమొనర్చు.
ఎఱుకపడు. అ. క్రి. విదితమగు.
ఎఱుకసాని. ఎఱుకత.
ఎఱుకు, ఎఱుకులవాఁడు } కిరాతుఁడు; వ్యాధుఁడు.
ఎఱుకువ. ఎఱుక, తెలివి, జ్ఞానము.
ఎఱుపు. ఎఱ్ఱన, రక్తవర్ణము.
ఎఱ్ఱ. వానపాము, గండూపదము; ఎఱుపు. విణ. ఎఱ్ఱనైనది.
ఎఱ్ఱఁదనము. రక్తిమ.
ఎఱ్ఱగడ్డ. నీరుల్లి, పలాండువు†.
ఎఱ్ఱగన్నేరు. రక్తకరవీరము†.
ఎఱ్ఱగఱువు. ఎఱ్ఱమన్నుగలభూమి.
ఎఱ్ఱగలువ. కోకనదము, రక్తోత్పలము.
ఎఱ్ఱగలిజేరు. రక్తపునర్నవ†.
ఎఱ్ఱగిసె. అతసీవిశేషము†.
ఎఱ్ఱగురిజె. కృష్ణల†.
ఎఱ్ఱగొల్ల. ఒక గొల్లజాతి.
ఎఱ్ఱగోరంట. కురవకము†.
ఎఱ్ఱచీమ. తైలపిపీలిక.
ఎఱ్ఱచేమంతి రక్తసేవంతి†.
ఎఱ్ఱజొన్న. ఒక జొన్న†.
ఎఱ్ఱతుమ్మెద. గంధోలి.
ఎఱ్ఱతెగడ రక్తత్రివృత†.
ఎఱ్ఱదామర. రక్తపద్మము†.
ఎఱ్ఱది. వా. ఎఱ్ఱనిది.
ఎఱ్ఱన. ఎఱుపు, రక్తిమ. విణ. ఎఱ్ఱనిది.
ఎఱ్ఱనిది. విణ. రక్తవర్ణముగలది.
ఎఱ్ఱనివేలుపు. అగ్ని; అరుణుఁడు, సూర్యుఁడు.
ఎఱ్ఱపులుము. కుష్ఠభేదము.
ఎఱ్ఱపెంజేరలు పాములలో నొకభేదము.
ఎఱ్ఱపోతమ్మ. ఒక గ్రామదేవత.
ఎఱ్ఱప్రత్తి. రక్తకార్పాసము†.
ఎఱ్ఱమన్ను. తువరిక.
ఎఱ్ఱమల్లె. రక్తమల్లిక†.
ఎఱ్ఱమీను. రోహితము.
ఎఱ్ఱమునుగ. రక్త శిగ్రువు†.
ఎఱ్ఱలొద్దుగు. పట్టిక†.
ఎఱ్ఱవాఱు. అ.క్రి. ఎఱ్ఱనగు; కోపగిల్లు
ఎల. సాక్షి; ఆకు. విణ. యౌవనముగలది; లేఁతది; స్వల్పము. క్రి.విణ. స్వల్పముగా
ఎలగోలు. కలకలము; దండునకు ముందఱ నడచెడిబలము; ముందునడచుట; మొదటి ప్రసరణము; మొదట పటపటమని వచ్చు వాన. విణ. ముందునడచునది; మొదటిది.
ఎలదోఁట. ఆరామము.
ఎలనాఁగ. యౌవనముగల స్త్రీ; స్త్రీ.
ఎలనీరు. లేఁతటెంకాయలోనితియ్యనినీరు
ఎలమి. వికాసము; సంతోషము.
ఎలమికాఁడు, విణ. వికాసవంతుఁడు.
ఎలయించు స.క్రి. సంతోషపెట్టు.
ఎలయు. అ.క్రి. చేరు; ప్రవేశించు; కలుగు; ఆసక్తిపడు. స.క్రి. పొందు.
ఎలరారు. అ.క్రి. అతిశయించు.

కడికండలు. బ. ఖండ ఖండములు.
కడిగొను. అ.క్రి. కబళించు
కడితము. ఘట్టించిన నీలపటపు లెక్క పుస్తకము, గుడ్డమీఁదజిగురుతోఁగలిపిన మసిపూసి అట్టలుగాఁజేసి వానితో నేర్పఱచిన లెక్కల పుస్తకము.
కడితలవాఁడు. విణ. కేడెముపట్టువాఁడు.
కడితి కణఁతి.
కడిదల. సం. నడుము.
కడిదలుఁగు. చక్రము. [మము; నీపము†
కడిమి. అతిశయము; అధిక్యము; పరాక్ర
కడిమిడి. విణ. పచ్చికగల నేల.
కడియపుటట్టు. భక్ష్యవిశేషము.
కడియము. కటకము, హస్తభూషా విశేషము.
కడిల—ము. కట్లు, శంఖిని†.
కడివోవు. అ.క్రి. చెడు.
కడు. ద్ర. అత్యంతము, మిక్కిలి.
కడుఁదురు. కందురీఁగ.
కడుకొను. అ. క్రి. అతిశయించు; ఉత్సహించు; ఉద్రేకించు.
కడుగు. శోధనము; బియ్యము (మొదలగునవి) కడిగిన నీళ్లు. అ క్రి. ప్రక్షాళించు.
కడుజో. శ్యేనవిశేషము.
కడుదు. శౌర్యము.
కడుపు. గర్భము; గర్భములోని పిండము. కడుపులో చల్లకదలకుండ నుండుట. ఏ ఆయాసము శ్రమ లేకుండ నుండుట.
కడుపుబ్బు. ఉబ్బరము, ఆనాహము.
కడుపుమంట } ఓరువలేనితనము; ఈర్ష్య;
కడుపూఁద } పశువుల కడుపుబ్బరము.
కడుపువెళ్లుట. పాచనము, విరేచనము.
కడుపేడు. మేదరవాఁడు కట్టు కట్టెడు సన్నని వెదురుపేడు. [చిన్న కుండ.
కడుముంత. కడముంత, వాడుకొనెడి
కడురొంపి. మిక్కిలి బురద.
కడువ. కడవ, భాండము.
కడువతీఁటు. తుడుము.
కడువరాసి. కుంభరాశి.
కడువు. అ. క్రి. కడుగు.
కడెము. కడియము.

కడ్గు. అ. క్రి. కడుగు.
కడ్డాయము. బలాత్కారము.
కడ్డి. బలపపు కోఁపు; పడక ; బంగారు మొదలగువాని కడ్డీ, శలాక.
కడ్పు. కుక్షి; గర్భము.
కడ్మి. కడిమి†.
కణ. జీలకఱ్ఱ†; పిప్పలి†.
కణఁక. కడఁక; ఉద్రేకము.
కణఁకు. ఇంగలము, అగ్ని.
కణఁగు. అ. క్రి. కడఁగు; ఉద్రేకించు.
కణఁజము. ధాన్యముంచెడుపాఁతఱ; గరిసె.
కణఁజో. కడఁజో. [ప్రదేశము.
కణఁత. శంఖము, కన్నులకు అవలి శిరః
కణఁతి. కడఁతి.
కణపకలము. కణపకాడతోఁ చేసినకలము.
కణము. నీటిబొట్టు;నూక ;అల్పపరిమాణము
కణసరము. ఒక జాతిడేగ.
కణాతిగోడ. బట్టతో ఏర్పఱచిన గోడ.
కణి. గాడి.
కణిక. సం. గోదుమ రవ; స్వల్పము.
కణిఁతి. మాంసగ్రంథి, రోగవిశేషము; గవయమృగము.
కణిశము. సం. కంకి, వరి మొ|| వెన్ను.
కణుఁదురీఁగ. కందురీఁగ.
కణుఁదురు. కందురీఁగ.
కణుజో. ఒకజాతిడేగ; గోకర్ణ మృగము.
కణుపు. వెదురు మొదలగుదాని పర్వము.
కణ్వము. కొండగొఱ్ఱె.
కణ్వుఁడు. సం. ఒక ముని.
కత. కథ; వృత్తాంతము.
కతకము. సం. చిల్ల†; చిల్లగింజ.
కతనన్. అవ్య. నిమిత్తముచే.
కతపత్రము. మి. ప్రమాణపత్రము.
కతము నిమిత్తము; గుర్తు.
కతిపయము. సం. విణ కొంత.
కతుకు. స.క్రి. గతుకు.
కతుకుక్క. కటుక్క.
కత్తరి. ఒకజలచరము. విణ. నానావర్ణము గలది; వర్ణసాంకర్యముకలది.
కత్తరిగలయు. అ.క్రి. సంకరమగు.

కత్తరిల్లు. అ. క్రి. చలించు.
కత్తలాన(ని) తెల్లనిగొరిజయు తోఁకయు వెంద్రుకలును గల నల్ల గుఱ్ఱము.
కత్తళఁడు. కత్తలాన.
కత్తళము. కవచము.
కత్తళీఁడు. విణ. కవచధారి.
కత్తవ. ఎక్కుము.
కత్తవము. చిన్న మటికి కాలువ.
కత్తి. ఖడ్గము; మంగలి కత్తి, ఛురిక; మల్ల బంధవిశేషము.
కత్తికాసు. వడ్లవాని ఆయుధవిశేషము.
కత్తిపిడక. గవుండ్లవాఁడు కొడవలి మొ॥ ఉంచుకొను బుట్ట. [దమర్చిన కత్తి.
కత్తిపీఁట. కూరగాయలు తఱుఁగుటకు పీఁటయం
కత్తిమందు. కత్తియొఱకు పూయుపదార్థము; కురుపులకు పూయు మందు.
కత్తియ. కత్తె.
కత్తియము. అంకెల అడ్డబంతి.
కత్తిరించు క్రి. వస్త్రము మొ॥ ఛేదించు
కత్తిరిల్లు. అ. క్రి. భిన్నమగు.
కత్తివాతియమ్ము. అర్ధచంద్రబాణము.
కత్తులబోను. కత్తులమర్చిన ఒక విధమైన బోను.
కత్తులుతోమువాఁడు. చికిలివాఁడు, అసిధావకుఁడు. [గసిక; గనిమ.
కత్తువ. గట్లకు మన్ను పెకలించు కొయ్య
కత్తృణము. సం. కామంచిగడ్డి†; నాఁచు.
కత్తె. కత్తియ, స్త్రీప్రత్యయ విశేషము (ఆటకత్తె, చెలికత్తె అని).
కత్తెము. కత్తియము.
కత్తెర. బట్టలు మొ॥ కత్తిరించెడు ఆయుధము, కర్తరి; భరణి మూడు నాలుగు పాదములయందును కృత్తికయందును రోహిణి మొదటి పాదమందును సూర్యుడుండు కాలము; కృత్తికానక్షత్రము
కత్తెరకాలు. అందలపు కాళ్ళకు అడుగున పోటీగా అమర్చెడు మార్పుకాలు.
కత్తెరగాయము. గవాక్షవిశేషము.
కత్తెరచీల. మీటయొక్కయు మునసయొక్కయు చీల వదలిరాకుండ దాని చివర రంధ్రమున అడ్డముగా వేసెడుచీల
కత్తెరమేకు. కృత్తిక.
కత్తెరదొంగ. ఉత్సవాదులలో కత్తిరించుక పోయెడు దొంగ.
కత్తెరనువ్వులు. బ. నువ్వులలో భేదము.
కత్తెరబావిలి. స్త్రీ కర్ణభూషా విశేషము. బ. కొనచెవి భూషణము.
కత్తెరరిక్క నెల కార్తికమాసము.
కత్తెరవంగ. పెద్దవంగ†.
కత్తెరవాసము. ఎదురెదురుగా కత్తెరవలె నుంచెడు వాసము. [అంగము.
కత్రి. జక్కిణి యను ఆటయొక్క ఒక
కత్రించు. స. క్రి. కత్తిరించు.
కద. సం. కత, కద, కాదంబర్యాది రూపమైన ప్రబంధరచన; వాద ప్రతివాద పూర్వకమగు విచారణ; కథనము; పూర్వవృత్తాంతము.
కధకుఁడు. సం. విణ. చెప్పెడివాఁడు; పౌరాణికుఁడు, పురాణకథలు చెప్పెడివాఁడు; నాటకాచార్యుఁడు, నాటకము వర్ణించెడివాఁడు.
కథనము సం. కథ, చెప్పుట.
కథించు. సం. స. క్రి. చెప్పు.
కదితము. సం. విణ. చెప్పఁబడినది.
కద. కత, కథ; వృత్తాంతము. అవ్య. ప్రసిద్ధిని తెలుపును; సమయము చో॥ అనే కార్థకము (చేసితివిగదా, చేయవుగదా అను మొ)
కదంబకము } విణ. మిశ్రము. సం.
కదంబము } ఆవలు; సమూహము; కడిమి†; బాణము. [మిళితముచేయు.
కదంబించు. అ. క్రి. మిళితమగు. ప్రే.
కదకు. కతుకు.
కదథ్వము. సం. చెడ్డత్రోవ.
కదనము. సం యుద్ధము; పాపము; హింస
కదను. హిం. అశ్వగతి విశేషము.
కదము. కదను.
కదరము ఉత్తరేను†. సం. వెలిచంద్ర†; అంపము; ఒక వ్యాధి.
కదరె(రే). అవ్య. సంతాపార్థకము.
కదర్యుఁడు. సం. విణ. అతి లోభి.
కదలడమ్ము. ప్రయాణము.

కదలాడు. అ. క్రి. చలించు.
కదలారతి. ఒకవిధమగు హారతి.
కదలిక. చంచలత్వము; చలనము; యత్నము.
కదలిపోక. ప్రయాణము.
కదలు.కదలిక. అ.క్రి. చలించు; ప్రయాణమగు; పఱుగెత్తు; యత్నించు.
కదలుచు. ప్రే. కదలించు; కదల్చు.
కదలుడు. ప్రయాణము. [కువ.
కదలుతులువు. మల్లయుద్ధములోని మెలఁ
కదలుమొన. మల్లయుద్ధములోఁగట్టుమొన
కదళము. సం. అరఁటి†; కోలపాన్న†
కదళి. సం. అరఁటి†; జండా.
కదళీవంధ్య ఒక్క సంతానముగల స్త్రీ.
కదా. అవ్య. కద, కిలార్థకము; కాదా.
కదించు. ప్రే. కదియించు.
కదియఁబడు. అ. క్రి. కదియు.
కదియించు. ప్రే. కదియఁజేయు.
కదియు. అ. క్రి. సమీపించు; సమానమగు; సక్తమగు. స. క్రి. చేరు; పొందు.
కదుకొను. అ. క్రి. అతిశయించు.
కదుపు. కులము, సజాతీయ పశుపక్ష్యాది సమూహము; గోసమూహము.
కదుము. బొప్పి, ఘాతగ్రంథి; వాచి మోరు కట్టినది. స. క్రి. ఆక్రమించు
కదురు. తర్కువు, తంత్వాధానమూచి అ. క్రి. అతిశయించు; జనించు; విజృంభించు.
క్రదులు. కదురు. [కొంచెము వేఁడిది.
క్రదుష్ణము. సం. కొంచెము వేఁడి. విణ.
కదె. అవ్య. కద, ప్రసిద్ధిని తెలుపునది. రూ. కదే.
కద్దు. ఉన్నది.
కద్దుము. విణ. దట్టము.
కద్రువ. సం. పన్నగుల తల్లి.
కద్రువు. కద్రువ; గోరోజనమువంటి వర్ణము. విణ. అదిగలది.
కద్వదుఁడు. సం. విణ. నిందింపఁదగు మాటలాడువాఁడు
కన. ద్ర. ఇది వాక్యాలంకారముగఁ బ్రయోగింపఁబడును.
కనఁబడు. అ. క్రి. అగపడు, గోచరమగు.
కనకన్. అవ్య. కనుక.
కనకచ్ఛద. సం. గేదఁగి†.
కనకతప్పెట. పటహము.
కనకదండము. సం. బంగారు దుడ్డు; సామ్రాజ్య చిహ్నము.
కనకదండెలు. మి. బ. వస్త్రవిశేషములు.
కనకన. నిప్పునందలి యధిక ప్రకాశము.
కనకనమను } అ. క్రి. (నిప్పు) మిక్కిలి
కనకనలాడు } ప్రకాశించు.
కనకము. సం. బంగారు; ఉమ్మెత్త†; కాంచనము†; నాగకేసరము†.
కనకస్నానము. సం. సువర్ణాభిషేకము.
కనకాక్షి. సం. పయిఁడికంటి పక్షి.
కనపపులు. తెల్లు†
కనరు. కందగడ్డ మొదలగువానియందలి నస; ఒగరు; చేఁదు; వికటగంధము; కోపము. విణ. అహితము.
కనలు. కోపము; మంట. అ.క్రి.కోపించు; మండు; కందు.
కనాతి. హిం. బట్ట; కనాతిగోడ.
కనాతిగోడ. కణాతిగోడ.
కనారిలు. అ. క్రి. కోపగించు.
కనికరము. దయారసము, కరుణ;శోకము
కనికరించు.. అ. క్రి. కరుణించు;శోకించు.
కనికొను. స. క్రి. చూచికొను.
కనిపట్టు. స క్రి. వెదకిపట్టు.
కనిపించు. ప్రే. కనఁజేయు. అ.క్రి. కనఁబడు, ప్రత్యక్షమగు.
కనియ. ఖండము
కనియు. అ. క్రి. మాఁగు, పక్వమగు.
కనిష్ఠ. సం. చిటికెనవ్రేలు; చెల్లెలు. విణ. చిన్నది.
కనిష్ఠము. సం విణ స్వల్పము, చిన్నది.
కనిష్ఠిక. సం. చిటికెనవ్రేలు.
కనిష్ఠుఁడు. సం. తమ్ముఁడు. విణ. స్వల్పుఁడు; చిన్నవాఁడు; హీనుఁడు.
కనిసెరము. ఒక డేగ.
కనీనిక. సం. కంటి నల్లగ్రుడ్డు.
కనీయము. సం. విణ. అధమము; చిన్నది
కనీయసి. సం. చెల్లెలు. విణ. చిన్నది.

కనీయుఁడు. సం. కనిష్ఠుఁడు.
కనీసము. విణ. అధమము, కనీయము.
కను. నేత్రము; చెఱకు మొదలగువాని గనుపు క్రింది గుంట. స.క్రి. చూచు; కనుగొను; పొందు; భాగ్యము పొందు.
కనుంబొమ. కనుబొమ్మ. [తెలిసికొను.
కనుఁగొను. స.క్రి. చూచు, వీక్షించు;
కనుఁబాటు. దృష్టి; దృష్టిదోషము.
కనుఁబ్రాము. స.క్రి. వంచించు, మఱుఁగు పెట్టు.
కనుక. గ్రం. హేతువును దెలుపును; వాక్యాలంకారముగా ప్రయోగింపఁబడును. [విద్యావిశేషము.
కనుకట్టు. చక్షుర్బంధము, ఇంద్రజాల
కనుకని. సంభ్రమము.
కనుకలి చూపు; చూచుటవలని మోహము
కనుకుట్టు. విణ. బాధకుఁడు.
కనుకుట్టుఁదనము. ఈర్ష్య.
కనుకూలి. ధాన్యరూపమైన కూలి.
కనుకొలికి. నేత్రాంతము.
కనుగిలుపు } కనుగిల్పు, కనుసైగ.
కనుగీఁటు }
కనుగుఁజేఁప. మత్స్యవిశేషము.
కనుచీఁకటి. రేఁజీఁకటి, మందాంధకారము
కనుచోటు. రహస్యము; రహస్యస్థలము; ఆఁడుగుఱి.
కనుదురు. కందురీఁగ.
కనుపట్టు. అ.క్రి. చూపట్టు, గోచరమగు.
కనుపాప. కంటిలోని పాప.
కనుపాలవిత్తులు. బ. కుళుత్థాంజనము.
కనుపించు. అ.క్రి. అగపడు, గోచరమగు
కనుపు. పర్వము, వెదురు చెఱకు మొదలగువానియందు ఎడనెడ ఏర్పడియుండు ముడి; కోపము.
కనుపుగొట్టు. స.క్రి. తునక తునకలు చేయు; భంగపఱచు; ఊచముట్టుగాకొట్టు
కనుపులగుండ్లు. బ. మణిమయమైనహస్త భూషావిశేషము. [క్షించు.
కనుపెట్టు. అ.క్రి. ఎదురుచూచు, ప్రతీ
కనుపొట్టలు. బ కంటి పై క్రింది రెప్పలు.
కనుబంటి. జీలుఁగుపక్షి.
కనుబడి ఉత్పత్తి.
కనుబేటము. చూచుటవలనఁగలుగువలపు
కనుబొమ(మ్మ)లు. బ. భ్రూలతలు.
కనుమ. కందరము, రెండుకొండలసందు త్రోవ; నీరు ఎక్కువై తెగిన చెరువుకట్ట; సందు; కాంతారము; గట్టుతెగిపోయిన గండి.
కనుమరి. కమ్మరి.
కనుమఱుఁగు. గంత; వ్యవధానము.
కనుమఱుపడు. అ.క్రి కంటికి మఱుఁగగు; దాఁగుకొను.
కనుమారి. కర్మారేశ్వరము.
కనుము. మకర సంక్రమణ దినము మొదలగు పండుగ మఱునాడు; శరము, తృణ విశేషము†.
కనుమూయు. స.క్రి. వంచించు.
కనుమూసిగంతలు. బ. కన్నులుగట్టి ఆడెడు ఆట, దాఁగుడుమూఁతలు.
కనుమొరగు. అదృశ్యము.
కనుమొఱఁగు. స.క్రి. వంచించు. రూ. కన్మొఱఁగు.
కనురెప్ప. పక్ష్మము.
కనువిచ్చుట. అవబోధము, మేలుకొను.
కనువినికి. చక్షుశ్శ్రవము, పాము.
కనువిప్పు. జాగ్రత్త. [వేఁడిమి.
కనువెచ్చ. విణ. నులివెచ్చ, కొంచెపు
కనుసన్న. సైగ.
కనోజా. కన్యాకుబ్జదేశభాష.
కన్కని. సంభ్రమము.
కన్కసరు. కోపయుక్తనేత్రదోషము.
కన్గంట. గ్రం. ప్రత్యక్షముగా.
కన్గిలు }
కన్గిలుపు } కనుసైగ.
కన్గిల్పు }
కన్గీటు }
కన్గొను. స. క్రి. కనుఁగొను.
కన్న. కంటె, ఒక ప్రత్యయము.
కన్నకొడుకు. ఔరసపుత్రుఁడు.
కన్నగాఁడు. కన్నపుదొంగ.
కన్నడ. ఉపేక్ష.
కన్నడగించు. స. క్రి. ఉపేక్షించు.

కన్నడగౌళ. ఒక రాగము.
కన్నడదేశము. కర్ణాటదేశము.
కన్నడభాష } కార్ణాటి, కర్ణాటదేశీయులు
కన్నడము } మాట్లాడు భాష.
కన్నడి. కర్ణాటదేశస్థుఁడు; అద్దము.
కన్నడించు. స. క్రి. ఉపేక్షించు; కన్నడము లోనికి మార్చు. [కన్నడి.
కన్నడీఁడు. విణ. ఉపేక్షచేయువాఁడు;
కన్నఁడు. కృష్ణుఁడు.
కన్నది. జనని, కన్నతల్లి.
కన్నపుఁగత్తి. కన్నము వేయు కత్తి.
కన్నపుదొంగ. సంధి చోరుఁడు, కన్నము వేయు చోరుఁడు.
కన్నపెట్టు. స. క్రి. కన్నము వేయు.
కన్నపోవు. అ. క్రి. కన్నము వేయఁబడు.
కన్నము రంధ్రము; దొంగ గోడకు వేసెడి సొరంగము.
కన్నయ్య. కృష్ణుఁడు; కన్నతండ్రి.
కన్నఱ. దుఃఖము.
కన్నఱి. దుఃఖితుఁడు.
కన్నవాఁడు జనకుఁడు, పుట్టించినతండ్రి; ద్రష్ట, చూచినవాఁడు.
కన్నవిటి. విణ చీకు; అంధుఁడు.
కన్నళవు. ఉపేక్ష.
కన్నాకు. తములపాకుకట్టయందు మొదట నుండెడి ఆకు. విణ. అగ్రేసరుఁడు; ముఖ్యుఁడు; శ్రేష్ఠుఁడు; శ్రేష్ఠమైనది.
కన్నాత. మల్లబంధవిశేషము. బ. మల్ల విద్యావిశేషము.
కన్నింగలము. కంటిముందగ్ని.
కన్నికగలపులుఁగు. నెమిలి.
కన్నిడు. స. క్రి. ప్రేమించు.
కన్నియ. కన్య; పెండ్లికాని పడుచు; కూఁతురు; కన్యారాశి; ఆఁడుది విణ. క్రొత్త; చిన్న.
కన్నియలేడి. కారండవపక్షి.
కన్నీరు. అశ్రువు, బాష్పము, హర్ష శోకములవలన కన్నులఁ గారెడు నీరు.
కన్ను. నేత్రము; చూపు; జాడ; వెదురు మొదలగువాని కణుపు; ఆణి; బండి చక్రము; వంతెనద్వారము; నెమలిపురి కన్ను; మృదంగాది వాద్య భాండ ముఖమునం దేర్పడిన వృత్త నీల మండలము; వలయందలి రంధ్రము; వ్రణాది రంధ్రము; కపటము.
కన్నుదోయి. నేత్రద్వంద్వము.
కన్నునీరు. కన్నీరు. [వంచించు.
కన్నుమొఱఁగు. స. క్రి. కనుమొఱఁగు,
కన్నులఁగప్పికొను. స. క్రి. దయాదృష్టి జూచు.
కన్నులమండ } చెఱకు, ఇక్షువు†.
కన్నులమ్రాను }
కన్నులవిలుకాఁడు. ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.
కన్నులుగలపక్కి. బర్హి, నెమిలి.
కన్నుపొందు. అ. క్రి. కన్నుమూఁతపడు, నిద్రపట్టు.
కన్నె. కన్నియ, కన్య.
కన్నెకోమలి. ఒక ఓషధి†.
కన్నెగోరుకోఁత. కన్నెకల గోళ్లుతీయువిధి.
కన్నెబావి. నీళ్లులేని బావి; కోనేటివంటి పెద్దబావి.?
కన్నెము. కోడి గుండెకాయ.
కన్నెరాసి. కన్యారాశి.
కన్నెరి(ఱి)కము. కన్యాత్వము; వేశ్యా కన్యాప్రథమసంగమము.
కన్నెఱజేయు. స. క్రి. కోపలక్షణముగపరచు
కన్నెలేడి. కారండవపక్షి.
కన్నోజా. కనోజా.
కన్నోజి. కనూజి ప్రదేశపు భాష.
కన్నోటు. బెదరు, భయము.
కన్పట్టు. అ క్రి. కనుపట్టు, అగపడు.
కన్య. విణ. క్రొత్త. సం. ఎనిమిదేండ్ల చిన్నది; పెండ్లికానిపడుచు; కూఁతురు; కన్యరాశి; స్త్రీ, ఆఁడుది; కలబంద†.
కన్యక. సం. పెండ్లికానిచిన్నది; చెల్లెలు; పెద్దయేలకి† [పొట్ల†.
కన్యాకుబ్జము. సం. ఒకపట్టణము; కొమ్ము
కన్యావాది. సం. కన్యలనుదెచ్చివివాహము చేసి సొమ్ము సంపాదించువాఁడు.
కపటము. సం. వంచన, మర్మ పెట్టుట.
కపటించు. సం. అ క్రి. కపటమొంచు.

కపటుఁడు. సం. విణ. కపటముగలవాఁడు
కపర్దము. సం. శివునిజటాజూటము;గవ్వ.
కపర్ది. సం. శివుఁడు. [వాని పెంచిక.
కపాలము. సం. తలపుర్రె;కుండ మొదలగు
కపాలి. సం. పునుకతాల్పు, శివుఁడు.
కపి. సం. కోఁతి; సూర్యుఁడు.
కపింజలము. సం. కముఁజు.
కపికచ్ఛువు. సం. దూలగొండి†.
కపిచూతము. సం. అంబాళము†.
కపితాను. ఇం. కాప్టెను.
కపిత్థము. సం. వెలఁగ†.
కపిధ్వజుఁడు. సం. అర్జునుఁడు.
కపిల. అగ్ని-మూలయందలి ఆడేనుఁగు; పుల్లావు, కపిలగోవు; రేణుక†
కపిలము. సం. కద్రువు.
కపిలుఁడు. సం. కపిలమహర్షి; సాంఖ్యకారికా కర్తయగు ఒక ముని.
కపిలె. ఎడ్లను కట్టి నీళ్లు తోడు యంత్రవిశేషము, మోట.
కపిలోహము. సం. ఇత్తడి.
కపిశము సం. పసుపుమీఱిన యెఱుపు. విణ. పసుపుమీఱిన యెఱుపు గలది.
కపిశీర్షము. సం. కోటకొమ్మ;గోడపైచివర
కపీతనము. సం. అంబాళము†; కలుజువ్వి†; దిరిసెనము†; రావి†.
కపురపుటనఁటి. ఏడాకులయనఁటి†.
కపురము. కర్పూరము.
కపోణి. సం. మోఁచేయి.
కపోతపాలిక. సం. చోపాస్తంభముల మీఁది శ్రేణి; కోణిగయందేర్పఱిచిన పావురపుగూఁడు.
కపోతము. సం గువ్వ: పావురము.
కపోతాంఘ్రి. సం. గువ్వగుత్తి†.
కపోదా. గొప్పవిల్లు; శిథిల ధనువు.
కపోలము. సం. చెక్కిలి, గండస్థలము.
కప్ప. మండూకము.
కప్పఁబడు. అ. క్రి ఆచ్ఛాదితమగు.
కప్పకుఱుపు. కారకముచే అఱకాలి యందు లేచెడి గుల్ల. [యందలి గుల్ల.
కప్పచిప్ప. జలశుక్తి, ఆలిచిప్ప, నీటి
కప్పడము. చినిఁగిన వస్త్రము; వస్త్రము.
కప్పతాళము. ముద్దబీగము.
కప్పనావురు. చిఱుకప్ప కాటుచేత పసులకు గలిగెడి పాసనపురోగము [ధనము.
కప్పము కరము, ప్రజలు రాజునకిచ్చెడు
కప్పయొలుఁగుపాము. కప్పవలెధ్వనిచేయు సర్ప విశేషము; కృత్తిమస్వభావుఁడు.
కప్పరపడు. అ. క్రి. సంభ్రమపడు.
కప్పరపాటు. కప్పగపడుట.
కప్పరము. తొట్రుపాటు, సంభ్రమము; చిత్రవర్ణము.
కప్పలి. ఓడ, నావ.
కప్పికొను. స. క్రి. ఆచ్ఛాదించుకొను.
కప్పిరి. మందాంధకారము.
కప్పు ఆచ్ఛాదనము; నీలవర్ణము; ఇంటిపైకప్పు; దంతక్షతము; చీఁకటి. అ. క్రి. క్రమ్ము. స.క్రి. ఆచ్ఛాదించు.
కప్పుఁగుత్తుకపుల్గు. నీలకంఠము, నెమలి.
కప్పుటేటిగొంగ. కాళిందీభేదనుఁడు, బలరాముఁడు.
కప్పుటేఱు. యమునానది; కృష్ణానది.
కప్పుటైదువ. కాళి, శ్యామలాదేవి, పార్వతి.
కప్పుటైదువపెనిమిటి. శివుఁడు.
కప్పుడు. కప్పుట, ఆచ్ఛాదనము.
కప్పుతెరవుజోడ
కప్పుత్రోవరి } అగ్ని, కృష్ణవర్త్మ. రూ. కప్పుతెరవుదారి.
కప్పుఁదెరువరి. కృష్ణవర్త్మ, అగ్ని.
కప్పుదెంచు. అ. క్రి. క్రమ్ము.
కప్పుబల్లి. ద్వారముమీఁద గోడుగుబల్ల తన్ను బల్లలకు నడుమనుండెడి పలక.
కప్పుమల. కాటుకకొండ, అంజనాద్రి.
కప్పుమేనిగాము
కప్పుమేనిదంట } కాలుఁడు, శని గ్రహము.
కప్పురగంధి. కర్పూరగంధమువంటి గంధముగల స్త్రీ.
కప్పురపుటనఁటి. కర్పూరకదళి†.
కప్పురపుబెండ. ఒకబెండ, గంధమూల†.
కప్పురపువంగ ఒకవంగ, కూటవార్తాకి†.
కప్పురబోగి. సస్యవిశేషము†.
కప్పురబోగులు. బ. ధాన్యవిశేషము.
కప్పూరము. కర్పూరము.

కప్పుఱాయి. నీలరత్నము.
కప్పెర. మంటిపాత్ర, పునుక, కపాలము.
కప్రము. కర్పూరము.
కప్రములక. కప్పురపువంగ†.
కఫము. సం. తెమడ, శ్లేష్మము.
కఫి. సం. విణ. కఫరోగముగలవాఁడు.
కబంధము. సం. నీరు; శిరస్సులేని మొండెము; తలతెగి త్రుళ్లెడు శరీరము; సముద్రము. [కేతువు.
కబంధుఁడు. సం. ఒక రాక్షసుఁడు;
కబరము. సం. విణ. మిశ్రము, కలసినది.
కబరి. సం. కొప్పు; వాయింట†; ఇంగువ ప్రమాను†.
కబళనము. సం. మింగుట.
కబళము. సం. అన్నపుకడి, గ్రాసము.
కబళించు. సం. స. క్రి. మింగు.
కబాడపెద్దు. గడ్డి చొప్ప మొ॥ బరువు మోసెడి యెద్దు.
కబాడము. ఎడ్లమీఁద వేసి తెచ్చెడు కసవు మొదలగువాని జంట మోపు.
కబాయి (యీ) అంగీ.
కబురు. హిం. సమాచారము.
కబేలా హిం ఇంటిపత్రము. [వాఁడు.
కబ్బపుఁగూరుపరి. కవి, కావ్యమురచించు
కబ్బము. కావ్యము; ప్రబంధము.
కబ్బిలి. కల్లు అమ్మువాఁడు.
కబ్బిలివాఁడు. గమళ్లవాఁడు.
కమండలము. కమండలువు.
కమండలువు సం. సన్న్యాసు లుంచుకొనెడు గిండివంటి మట్టిపాత్రము.
కమటము. అగసాలెవాని కుంపటి.
కమఠము. సం. భిక్షాపాత్రము; తాఁబేలు
కమఠి. సం. ఆఁడుతాఁబేలు.
కమతకాఁడు. ధణీక్రిందను దున్ని ఫల పంచువాఁడు, కమతము చేయువాఁడు, అరకాఁడు. [సేద్యము.
కమతము. కృషి; అనేకులు చేరి చేయు
కమతీఁడు. కమతకాఁడు.
కమనీయము. సం. విణ. ఇంపైనది; మనోహరమైనది. [కుఁడు.
కమనుఁడు. విణ. ఇచ్ఛగలవాఁడు, కాము
కమరు. కాలినకంపు; మొలనూలు. అ. క్రి. కాలు.
కమరుచు. ప్రే. కమరఁజేయు. రూ. కమర్చు
కమల సం. లక్ష్మీదేవి.
కమలము. సం. తామర, పద్మము†; జలము; ఎఱ్ఱతామర†; శివుని చేతియిఱ్ఱి.
కమలచ్ఛదము. సం. రాపులుఁగు.
కమలయోని. సం. బ్రహ్మ.
కమలవల్లభ. పిన్న వరగోఁగు†.
కమలాప్తుఁడు. సం. సూర్యుఁడు; విష్ణువు.
కమలాఫలము. కిచ్చలిపండు.
కమలాసనుఁడు. సం. బ్రహ్మ.
కమలిని. సం. తామరకొలను; తామరతీఁగ.
కమలు. అ. క్రి. ఎండ చేతకందు; కాలు.
కమసాల(లె)వాఁడు. స్వర్ణకారుఁడు.
కమాను. ప్ర యా ణ ము; విల్లు; పదవ నడుపు సాధనము.
కమి. భక్షించుట; పుడిసిలి.
కమికిలి. పుడిసిలి.
కమిచీ. హిం. చబుకు, కమ్చా.
కమిటీ. ఇం. సంఘము.
కమిత. సం. కమనుఁడు.
కమియు. అ. క్రి. నలగు; మాఁగు; వ్యాపించు
కమిషను. ఇం. బేరము చేసినందుకు ఇచ్చు పెచ్చుద్రవ్యము, అడితి.
కముచు. స. క్రి. గ్రహించు; మింగు.
కముఁజు. కపింజలము.
కమ్చా. హిం. కొరడా, గుఱ్ఱముతోలుట కుపయోగించు సాధనము.
కమ్మ. తాటిచెట్టు మొదలగువానికొమ్మ; తాటంకము, స్త్రీకర్ణభూషణము; పత్రిక, జాబు; శూద్రవిశేషము. విణ. పులుసు లేనిది; మధురము; వాసనగలది.
కమ్మకట్టు. వ్రాఁతమూలముగా సేవ చేయుట కొడఁబడినవారు.
కమ్మగాడ్పు. మలయమారుతము.
కమ్మచ్చు. అగసాలెవాఁడు కమ్మితీసెడు కొఱముట్టు.
కమ్మటము. అగసాలెవాని కుంపటి; ఇనుపగోలెము; కమ్మరము.
కమ్మటీఁడు. అగవాలెవాఁడు.

కమ్మతము. కమతము.
కమ్మతీఁడు. కమతకాఁడు; కమ్మరి.
కమ్మఁదనము } మాధుర్యము; కమ్మన;
కమ్మతి } మధురగంధము.
కమ్మనిమ్మ. నిమ్మపండువంటి వర్ణముగల కిత్తలి, తియ్యనిమ్మ†.
కమ్మనీరు. మకరందము.
కమ్మనూనె. సంపెంగ మొదలగువానిని చేర్చి చేసిన తైలము. [తాటంకములు.
కమ్మపంజేలు, బ. పంజాలకమ్మలు; రత్న
కమ్మపిల్లి. పునుఁగుపిల్లి.
కమ్మర. లోహకార (ఇనుముపనిచేసి బ్రతికెడు) జాతి.
కమ్మరత(ది). అయస్కార స్త్రీ.
కమ్మరము. కమ్మటము.
కమ్మరవాఁడు. కమ్మరి, కఱ్ఱు కత్తి మొ॥ పనిచేయువాఁడు.
కమ్మరి. కర్మారుఁడు, కమ్మరీఁడు.
కమ్మరీఁడు కమ్మరవాఁడు; బాణకారుడు
కమ్మరు. మొలనూలు. [నడిమిబిగిబద్ద.
కమ్మరుబొందు. రెండు గాడికమ్మల
కమ్మరేఁగు. కమ్మరేన†.
కమ్మరేను. కశేరుకము†.
కమ్మవిలుకాఁడు } ఇక్షుధన్వుఁడు, మన్మ
కమ్మవిల్తుఁడు } థుఁడు.
కమ్మి. వస్త్రపుకమ్మి; వెదురు మొదలగు వాని కమ్మి; బంగారు మొదలగువాని కమ్మి; రథనేమి, బండికంటి కడగమ్మి; పేముబొద్దు.
కమ్మిబండి. కమ్మి వేసినమ్రానిచక్రపుబండి
కమ్మిరించు. స. క్రి. మాయు.
కమ్ము. స. క్రి. కమ్మిగా చాఁగగొట్టు; మూయు; వేష్టించు.
కమ్మునీరు. ఉపజలము.
కమ్మెచ్చు. కమ్మచ్చు.
కమ్మెరాకు. కారపు నల్లతములపాకు.
కమ్రము. సం. విణ. ఇంపైనది; ఇచ్ఛగలది.
కమ్రుఁడు. సం. స్త్రీ కాముకుఁడు.
కయాధుజుఁడు. సం. విణ. ప్రహ్లాదుఁడు.
కయాహము. గేదెదూడ. [తొండము.
కయి. కై, చేయి, హస్తము; కవి;

కయిక. కైక, కైకేయి.
కయికట్టు. సందర్భము.
కయికానుక. రాజులు మొదలగువారిని చూడఁబోవునపుడు కొనిపోయెడి ఉపహారము. కైకానుక.
కయికొను. అ. క్రి. ఉత్సహించు; గ్రహించు; లక్ష్యపెట్టు.
కయికొలుపు. ప్రే. కయికొనఁజేయు.
కయికోల. గుడ్డలునేసి బ్రతికెడు ఒకజాతి
కయికోలు. సమ్మతి; గ్రహణము.
కయిచాపులు. కృతాంజలి, నమస్కృతి.
కయిజా. పాగను వెనుకకీడ్చుట.
కయిజాఱు. అ. క్రి. ఒఱగు.
కయిజీతము. బత్తెము, భోజనమునకై ఇచ్చెడు ద్రవ్యము.
కయిజే. కపింజలము.
కయిత } కవిత, కవిత్వము.
కయితము }
కయిదండ. కరావలంబము, చేయూఁత.
కయిదు. కపింజలము.
కయిదువు. కత్తి, ఆయుధము.
కయిపదము. సమస్య.
కయిపు. మత్తు, మదము; సౌందర్యము; విధము; విజృంభణము.
కయిముడి. వాద్యవిశేషము.
కయిమోడుపు. కృతాంజలి, నమస్కృతి.
కయిరఁడు. అశ్వవిశేషము.
కయిరవడి. కాఁచువడియము.
కయిలాగు. కయిదండ.
కయిలాటకాఁడు. మాయావి.
కయిలాటము. మాయోపాయము.
కయివడి. ప్రకారము, విధము; ఉపమానము
కయివడిముత్తె. కైవర్తీముస్తకము†.
కయివారము. గనిమయించు; స్తోత్రము.
కయివు. ఉన్మాదము.
కయివ్రాలు. అ. క్రి. ఒఱగు; పక్షులు మొదలగునవి క్రిందికిదిగు; పడు, కాలు.
కయివ్రాలుచు. ప్రే. కైవ్రాలఁజేయు.
కయిసాటిచుక్క. హస్తనక్షత్రము.
కయిసేత. అలంకారము.
కయిసేయు. అలంకరించు; పూజించు.

కయానరుఁడు. కవీశ్వరుఁడు.
కయ్య. మడి, కేదారము; ఊరిదరిని పల్లములలో నీరు నిలిచిన కాలువ.
కయ్యపుఁదిండి. కలహాశనుఁడు, నారదుఁడు
కయ్యము జగడము, యుద్ధము.
కయ్యర. హీనజాతి మాత్రికము.
కయ్యాలక్రచ్చు. కలహశీలుఁడు.
కయ్యాలమెకము. నక్క.
కర. కంచె, కంపఆవరణము; తీరము; తరంగము; మర్యాద. విణ. తీక్ష్ణము.
కరంకము. సం. లోపల ఏమియులేని బొండ్లపుచిప్ప; డొక్క; తల; తాంబూలపు బిడా.
కరంజము. సం. కానుగు†; పులిగోరు†.
కరండము. తరంగము. సం. కత్తి; తేనెతుట్టె; బరిణె; బుట్ట.
కరంభము. పెరుఁగుతో కలిపిన పేలపిండి.
కరఁగించు. ప్రే. కరఁచు, ద్రవింపఁజేయు. [రము మొ॥ ద్రవించు.
కరఁగు. కరఁగుట. అ.క్రి. నెయ్యి బంగా
కరఁగుపడు. అ. క్రి. కరఁగు.
కరఁచు. ప్రే. కరఁగఁజేయు.
కరఁడు. తరంగము.
కరక. హరీతకి†; నివురు, భస్మము.
కరకము. సం. వడగల్లు; గరిగెపిడత; తలపుర్రె; కమండలువు; దానిమ్మ†; ఒక పక్షి. [యించు.
కరకంచు. కరకకాయ నీటితో వ్రాసిన
కరకటి. ఒడ్డు.
కరకణి. వేఁటాడెడు సాధనము.
కరకర. తీక్ష్ణము; వ్రాతయొక్క నమలుటయొక్క ధ్వన్యనుకరణము. రూ. కఱకఱ
కరకరము. అత్యంతము.
కరకరి. క్రూరభావము; ద్వేషము; కోపము; క్షోభము; మాత్సర్యము.
కరకసా. విణ. కఱకు.
కరకొమ్మ. మాత్సర్యము.
కరకాయ. కరక చెట్టుకాయ.
కరగ. సేతువిశేషము.
కరగనము. అంపము; క్రకచము.
కరగోడ. పొడిమట్టితో నేర్పఱచిన గోడ.

కరగ్రహణము. సం. పాణిగ్రహణము, పెండ్లి. [చేతిగోరు.
కరజము. సం. పులిగోరు†; కానుగు†;
కరట. సం. అజ్జి, ప్రయాసముచేత పిదుకఁదగిన ఆవు; కాఁచి†.
కరటము. సం. కాకి; వాద్యవిశేషము.
కరడ కిరాటము, బరణి.
కరడము. తరంగము.
కరడిగ. పుష్పములుంచెడు బుట్ట.
కరడు. కరడిగ; పక్షివిశేషము.
కరిడె. ఉరుము, ఒక చర్మవాద్యము.
కరణకమ్మలు. బ్రాహ్మణజాతివిశేషము.
కరణము. సం. పరమేశ్వరుఁడు; మనస్సు; వైశ్యునకును శూద్రస్త్రీకిని పుట్టినవాఁడు; వ్రాత్యుఁడైన క్షత్రియునకు సవర్ణస్త్రీయందుఁ బుట్టినవాఁడు; గ్రామపులెక్కలు వ్రాయువాఁడు, ఆయవ్యయలేఖనోపజీవి, లెక్కవాఁడు, గణకుఁడు; బవాదికరణము(బవ, బాలవ, కౌలవ, తైతిల, గరజి, వణిక్కు, భద్ర, శకుని, చతుష్పాత్తు, నాగవము, కింస్తుఘ్నము); అసాధారణకారణము, కొలముట్టు; నేత్రాదీంద్రియము; కారణము; క్రియాభేదము; పని; రతిబంధము; శరీరము. (త్రికరణములు — మనస్సు, వాక్కు, శరీరము.)
కరణి. విధము.
కరణికము. కరణమువాని పని.
కరణీయము. సం. విణ. చేయఁదగినది.
కరణుఁడు. సం. కరణము.
కరతలమాణిక్యము. సం. అరచేతిలో మాణిక్యము, అప్పుడే ఫలితమునిచ్చునది.
కరతలము. సం. అఱచేయి.
కరతలామలకము. సం. అరచేతిలోని యుసిరికకాయ (ఒకరు తెలుపనక్కరలేకయే తనంతటనే స్పష్టముగా నున్నదానికిది ఉపమానముగాఁజెప్పఁబడును).
కరతాళము. వా. అఱచేతులు తట్టుట. సం. కంచుతాళము.
కరతాలి. సం. అఱచేతులు తట్టుట.
కరతిత్తి. వస్త్రపుసంచి.

కరతోయ. సం. గౌరీ వివాహకాలమున ఈశ్వరుని హస్తమువలనఁబుట్టినయేఱు.
కరదివి(వ్వె)య / కరదివ్వె } దివ్వటీ, కరదీపిక.
కరదీపిక. సం. దివ్వటీ.
కరపక్క. వన్నె తగ్గిన కెంపు.
కరపత్రము. వా. ప్రకటనపత్రము. సం. అంపము; జలక్రీడ.
కరపాత్రము. సం. జలక్రీడ.
కరపుచ్చ. సోమకర్కటి†.
కరఫలము. గుజ్జమునుతో మెదు గొఅపము
కరబూజా. ఒక ఫలవృక్షము, వృత్తకర్కటి†.
కరభము. సం. మణికట్టు మొదలు చిటికెన వ్రేలి మొదటిదాఁకఁ గల అఱచేతి వెలుపలి చోటు; గాడిద; ఒంటెపిల్ల.
కరభర్జితములు. సం. బ. నానఁబెట్టి వేఁచిన కగ్గిళ్ళు.
కరమర్దము. కలివె†.
కరము. అవ్య. మిక్కిలి; అత్యంతము. సం. చేయి; కిరణము; తొండము; కప్పము, పన్ను.
కరరుహము. సం. చేతిగోరు.
కరవట(డ)ము. బరణి; బుట్ట.
కరవాఁక. శేవు, సముద్రపుగట్టు నోరనుండెడి బురద నేల.
కరవాఁడి. మిక్కిలివాఁడి.
కరవాయి. కంసాలివాని ఒక పనిముట్టు.
కరవాలము. సం. కత్తి; ముప్పది యంగుళముల కత్తి.
కరవాలిక. సం. నిమిచా కత్తి; కత్తి; గదవలెనుండెడి చిన్న చేతికఱ్ఱ.
కరవాలు. మి. చేతికత్తి.
కరవీరము. సం. ఖడ్గము; గన్నేరు†; ఎఱ్ఱగన్నేరు†; వాడగన్నేరు†.
కరశాఖ. సం. చేతివ్రేలు.
కరసాన. రత్నములు మొదలగునవి సానపట్టెడు చక్రాకారమైన సాన.
కరసు. ఈఱతాఱలు, పరుషము.
కరస్థలామలకము. కరతలామలకము.
కరహాటము. సం. తామర దుంప.

కరా. విశ. తీక్ష్ణము; వాఁడిగలది.
కరాచేరకత్తి. ఖడ్గము.
కరాచే(చూ)రి. ఖడ్గము.
కరాటము. కరవటము.
కరాప్పు. లవంగము†.
కరారు. హిం. ఏర్పాటు, నిర్ణయము.
కరారునామా. హిం. ఒడంబడిక పత్రము.
కరాసి. సం. చేతికత్తి. [మిట్టయైనది.
కరాళము. సం. విశ. భయంకరము; ఒడ్డు
కరాళించు. అ. క్రి. బొబ్బరించు; సకిలించు. స క్రి నిందించు.
కరి. దృష్టాంతము; మేర; సాక్షి; వాఁడి బాణము; యోని. సం. ఏనుఁగు.
కరికరి. కలఁత.
కరికలభము. ఏనుఁగుగున్న.
కరిణలు. బ. సాలెవారిలో ఒక తెగవారు
కరిణవాఁడు / కరిణిబత్తుఁడు } తంతువాయ (సాలె) విశేషము.
కరిణి. సం. ఆఁడేనుఁగు.
కరిణీకము. గణికకర్మము.
కరిణీకుఁడు. కరణము.
కరిణెవాఁడు. కరిణిబత్తుఁడు.
కరిది. ఒక చర్మవాద్యము; వీణెకాయ ముఖమందుండునది, కరివె.
కరిపిప్పలి. సం. ఏనుఁగు పిప్పలి†.
కరిమకరము. సం. ఏనుఁగంతటి మొసలి.
కరివె. కకుభము, వీణెకరివె, ఇత్తడి మొదలగు వానితో చేసి వీణాదండమును బొడివికొనియుండునట్లు సొరకాయపై అమర్చెడు తదంగము. [చూచుట.
కరివెద. నేలదున్ని విత్తుటకు వానకెదురు
కరివేల్పు. కృష్ణుఁడు.
కరివేల్పుడాకన్ను. చంద్రుఁడు.
కరిసనము. కృషి, కమతము.
కరిసించు. స. క్రి. ఘర్షణముచేయు.
కరిసె. కాలు పలము; కమతము.
కరిసెనము. కమతము; ఒత్తడి.
కరిసెము. కృషి, కమతము.
కరీరము. సం. వెదురు మొలక; వెణుకురు†.
కరీషము. ఎరువు; ఏరుపిడక; పిడక.
కరుకు. భస్మవిశేషము.

కరుగు. పోతపోసెడి అచ్చు; వరి పొట్ట కట్టు; కరఁగినఘృతాదికము; సువర్ణాదికము
కరుడు. అన్నపుగడ్డ; గట్టిపడినముద్ద; దిన దినము వ్రాసెడు సంకీర్ణపులెక్క.
కరుడుగట్టు. అ. క్రి. గట్టి ముద్దయగు.
కరుణ. సం. దయ, కనికరము.
కరుణము. సం. కరుణరసము; ఒక చెట్టు†. విణ. దయగలది.
కరుణించు. సం. అ. క్రి. కనికరించు.
కరుణుఁడు. సం. దయ గలవాఁడు, భగవత్ప్రియభక్తుఁడు.
కరుదు. పలుకు, భాషితము.
కరుబూజాదోస. వృత్తకర్కటి†.
కరుమల. కమ్మరి.
కరుమలి. కమ్మరి.
కరులు. బ. పద్మకింజల్కములు.
కరువ. కొండ.
కరువలి. గాలి, వాయువు. [అగ్ని.
కరువలిపట్టి. భీముఁడు; హనుమంతుఁడు;
కరువలిరిక్క. స్వాతినక్షత్రము. [లోపించుట.
కరువలివిందు. అగ్ని.
కరువు. కరుగు; గర్భము; మూస; గర్భము
కరుసు. కట్టైవిరుపుమాట; పచ్చి చర్మము.
కరూశము. సం. ఒక దేశము.
కరేటువు. సం. పెద్దకక్కెర.
కరేణువు. సం. ఆఁడేనుఁగు.
కరోటి. సం. తలయెముక, పుఱ్ఱె
కరోడా. పరగణామీఁద తాణెదారుఁడు మొదలగువానిని కనిపట్టువాఁడు.
కర్కంధువు. సం. రేఁగు†; గంగరేఁగు†.
కర్కటకము. సం. కర్కటము.
కర్కటము. సం. పీత, ఎండ్రిఁ; కర్కట రాశి; కక్కెర.
కర్కటి. సం. దోస†.
కర్కటిగర్భము. సం. విణ ఎండ్రిగర్భము దాల్చుట (ఒక న్యాయము).
కర్కము. సం. ఎండ్రి; తెల్లగుఱ్ఱము; అద్దము
కర్కరము. సం. కంకరఱాయి; అద్దము. విణ. కఠినము.
కర్కరి. సం. జారీచెంబు.
కర్కకేటువు. సం. పెద్ద కక్కెర.
కర్కశము. సం. విణ. కఠినము; నొప్పించునది. [యుఁడు.
కర్కశుఁడు. సం. విణ. కఠినుఁడు; నిర్ద
కర్కారుకము. సం. పుచ్చ†.
కర్కారువు. సం. గుమ్మడి†.
కర్కోటకము. సం. దేవయోని సర్ప భేదము; మారేడు†.
కర్కోటకి సం. మట్టుకాఁకర†.
కర్కోటకుఁడు. సం. దుర్జనుఁడు.
కర్చూరము. సం. గంట్లకచోరము†.
కర్జకాయ. సం. భక్ష్యవిశేషము.
కర్జకారుఁడు. సం. నావికుఁడు.
కర్జము. పని, కార్యము.
కర్ణజలూక. సం. చెవిఁజోరుపాము. రూ. కర్ణజలౌకము.
కర్ణధారుఁడు. సం. ఓడ నడుపువాఁడు. విణ. కష్టములనుండి గట్టెక్కించువాఁడు
కర్ణపత్రము. సం. చెవికమ్మ; బంగారపు దుద్దు.
కర్ణపూరము. సం. దిరిసెనము†; కంకేళి†; కడిమి†; నల్లకలువ†; తాటంకము; చెవి కమ్మ.
కర్ణము. సం. చెవి; చుక్కాని.
కర్ణలత. సం. చెవితమ్మె. [పోఁగు.
కర్ణవేష్టనము. సం. కుండలము, చెవి
కర్ణాకర్ణి సం. వినికి వరుస. అవ్య. ఒక చెవినుండి మఱియొకచెవికి అను నర్థమున నిది ప్రయుక్తము. రూ. కర్ణాకర్ణి, కర్ణాపకర్ణి, కర్ణోపకర్ణి.
కర్ణాటకము. కర్ణాటము.
కర్ణాటము. సం. కన్నడదేశము.
కర్ణాతు. మల్లయుద్ధ విన్నాణము.
కర్ణిక. సం. చెవి లక్కాకు, చెవికమ్మ; తామరదుద్దు; బంగారపుదుద్దు; తొండము చివర; చేతి నడిమివ్రేలు.
కర్ణికారము సం. కొండగోఁగు†.
కర్ణీరథము సం. బాల కాదిక్రీడాశకటము ఆఁడేనుఁగులు కట్టిన రథము.
కర్ణేజపుఁడు. సం. విణ. కొండెకాఁడు.
కర్త. సం. సృష్టికర్త, స్వామి, పరమే

శ్వరుఁడు; చిదాభాసుఁడు. విణ. చేయు
వాఁడు. [కుట. విణ. ఛేదించునది.
కర్తనము. సం. కత్తరించుట; నూలువడు
కర్తరి. సం. చూ. కత్తెర.
కర్తలాణము. సం. కత్తలాని.
కర్తవ్యము. సం. విణ. చేయఁదగినది.
కర్తారి. సం. కత్తెరవంగ†.
కర్తారుఁడు. తురుష్కుల దేవుఁడు, అల్లా.
కర్దమము. సం. బురద, అడుసు.
కర్నలు. ఇం. సైనికాధికారులలోనొకఁడు
కర్పటము సం. వస్త్రము; చినిఁగిన వస్త్రము; మాసిన చిన్నగుడ్డ.
కర్పరము. సం. తలపుర్రె; ఒక శస్త్రము, మంటి బొరుసు.
కర్పరాలము. సం. కొండగోఁగు†.
కర్పరి. సం. ప్రమానిపసుపువండిన అంజన విశేషము. [విశేషము.
కర్పూరగంధి. సం. కప్పురగంధి, స్త్రీ
కర్పూరభోగి. సం కప్పురబోగి†.
కర్పూరము సం. కప్పురము.
కర్పూరశిలాజతు. సం. పర్వతధాతుభేదము
కర్బుర. సం. పిక్క†; కలిగొట్టు†.
కర్బురము. సం. నీరు; బంగారు; పాపము; చిత్రవర్ణము. విణ. చిత్రవర్ణముగలది.
కర్బురుఁడు. సం. రాక్షసుఁడు.
కర్మ. కర్మము; పని; జగత్తు.
కర్మంది. సం. సంన్యాసి.
కర్మకరి. సం. దాసి. [కుఁడు.
కర్మకరుఁడు. సం. విణ. పనివాఁడు; సేవ
కర్మకారుఁడు. సం. కమ్మరవాఁడు. విణ. వెట్టికి పనిచేయువాఁడు.
కర్మచండాలుఁడు. సం. జన్మముచేతఁగాక కార్యములచేత చండాలుఁడైనవాఁడు.
కర్మఠుఁడు. సం. కర్మమందాసక్తిగల వాఁడు; నెఱవేఱుదాఁక పనిచేయువాఁడు
కర్మణ్య. సం. కూలి; జీతము.
కర్మధారయ. ఒక సమాసము
కర్మము. సం. కారకవిశేషము; లగ్నమునకు పదవయిల్లు; జగత్తు; మూర్తద్రవ్యము నాశ్రయించిన క్రియారూపమగు పదార్థము; శాస్త్రవిహితమైన అగ్నిహోత్రాది రూపమైన యాగము మొ॥; మనోవాక్కాయముల ప్రవృత్తి; వ్యాపారమాత్రరూపమగు క్రియ, చేఁత, పని, కర్మువు; ఆలు; (పంచకర్మములు — ఉత్క్షేపణము, అపక్షేపణము, ఆకుంచనము; ప్రసారణము; గమనము. షట్కర్మములు — యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము. షోడశకర్మలు — గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, ఆగ్నేయము, వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యకర్మము.)
కర్మయుగము. సం. కలియుగము.
కర్మయోగము. సం. పరమేశ్వరార్పితమై చిత్తశుద్ధిని గలిగించు వైదికకర్మ.
కర్మరంగము సం. ఒక నారింజ (కమలా ఫలము)†.
కర్మసాక్షి. సం. సూర్యుఁడు.
కర్మారము. సం. వెదురు†.
కర్మారీశ్వరము. సం. కర్మహారీశ్వరము, శ్రీశైలస్థల విశేషము.
కర్మారుఁడు. సం. కమ్మరవాఁడు.
కర్మి. సం. కర్మములుగలవాఁడు, యజమానుఁడు; పనిచేయువాఁడు.
కర్మువు. పని, చేఁత; కర్మము.
కర్మేంద్రియములు. సం. బ. వాక్కు పాణి పాదము పాయువు ఉపస్థము.
కర్వలి. వాయువు కరువలి.
కర్షకుఁడు. సం. విణ. ఈడ్చువాఁడు; దున్నుకొని జీవించువాఁడు.
కర్షణము. సం. ఈడ్చుట; దున్నుట; ఒరయుట, ఎండించుట; సేద్యము.
కర్షము. సం. ఆకర్షించుట; 16 మాషముల (20 చిన్నముల) యెత్తు; ఒరయిక; కర్ష మెత్తు బంగారు.
కర్షితము. సం. విణ. ఈడువఁబడినది; దున్నఁబడినది; ఒరయఁబడినది.
కర్షువు. సం. యజ్ఞకుండము; కాలువ; నది; ఊఁకనిప్పు; పిడకనిప్పు.

కర్సనము. సం. కరిసనము, కృషి.
కఱ. వస్త్రమాలిన్యము; నలుపు; మరక.
కఱకంచు. కరకకాయలనీటితో వ్రాసిన అంచు.
కఱకంఠము. ఊరఁబిచ్చిక.
కఱకంఠుఁడు. మి. నీలకంఠుఁడు, శివుఁడు.
కఱకంఠుతలమానికము. చంద్రుఁడు.
కఱకంఠుతలయేఱు. దేవగంగ.
కఱకరి. విణ. కఠినుఁడు.
కఱకఱ. కండుట ప్రొద్దుపోడుచుట ఒరయుట తఱుఁగుట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము.
కఱకలి. బాధ; బలాత్కారము.
కఱకు. వాఁడి, కర్కశత్వము; కాఠిన్యము. విణ. పరుషము, కఠినము.
కఱకులు. బ. పరుషవచనములు.
కఱకుగిలు. అ. క్రి. బిగుసగు.
కఱకుటమ్ము. వాఁడిబాణము.
కఱకుట్లు. బ. శూల్యము, ఇనుపసలాకయందు గ్రుచ్చికాల్చెడి మాంసఖండము.
కఱకుదుమ్ము. ఇసుక.
కఱకెక్కు. అ. క్రి. వాఁడియగు.
కఱచుట. అధ్యయనము, నేర్చుకొనుట; కొఱుకుట, దంశనము,
కఱటి. విణ. వంచకుఁడు; మూర్ఖుఁడు; దుర్జనుఁడు; దుష్టురాలు.
కఱత. చేష్ట; దుశ్చేష్ట; పోకిళ్ళు.
కఱతలాడు. విణ. దుశ్చేష్టుఁడు.
కఱద. బుద్ధి; భాషితము.
కఱదు. వంచనము.
కఱదూపము. గృహధూమము.
కఱనూనె. మ్రానితైలము. [నేర్పుట.
కఱపుట. దుర్బోధన; అధ్యాపనము,
కఱయ. కృష్ణవర్ణము.
కఱవ. ఒక మూలిక †.
కఱవాడు. ఎండిన చేప.
కఱవు. దుర్భిక్షము, క్షామము; పూరియిండ్లుకప్పునప్పుడు ఏర్పఱచుకొనుమితి
కఱి. ఇంద్రుఁడు; పశుయోని. విణ నల్లనిది.
కఱిచిలుకు. బాణవిశేషము.
కఱిచేడియ. కాళి, శ్యామల, పార్వతి.

కఱినేల. ముప్పదిరెండు కుంటల పొలము.
కఱిపక్కము. కృష్ణపక్షము.
కఱిమొన. కఱ్ఱుయొక్క మొన.
కఱిమొలలు. బ. అడ్డను తగిలించు నాగవాసములు.
కఱియ. విణ. కృష్ణవర్ణము.
కఱియావు. కపిలగోవు. [శాకము†.
కఱివేము. కఱివేఁపాకు చెట్టు; కాల
కఱివేలుపు. వెన్నుఁడు, కృష్ణుఁడు.
కఱివేల్పురిక్క. శ్రవణనక్షత్రము.
కఱివేల్పునిల్లాలు. లక్ష్మి.
కఱివేల్పుఱాలు. బ. నీలమణులు.
కఱుకు. శౌర్యము; మందాకు మాడ్చి రాచినపొడి. స. క్రి. రాచు. విణ. తీక్ష్ణము; పరుషము.
కఱుకుటమ్ము. వాఁడిబాణము.
కఱుకుట్లు. బ. కఱకుట్లు. [ణము.
కఱుక్కు. నఱకుటయందగు ధ్వన్యనుకర
కఱుగోల. వాఁతవేసెడు ఇనుపకమ్మి, చూఁడుఁగోడుపు.
కఱుదు. నేర్పు.
కఱుదులాఁడు. విణ. నేర్పరి.
కఱ్ఱు. దారువు, కొయ్య; నలుపు; మఱక.
కఱ్ఱుకుట్లు. బ. కఱకుట్లు.
కఱ్ఱునూనె. కఱ్ఱులవల్ల తీసిననూనె.
కఱ్ఱుమడ. పెల్లగింప నుపయుక్తమగు ఒక ఆయుధము. [వాఁడు.
కఱ్ఱి. అర్జునుఁడు; కృష్ణవర్ణము. విణ. నల్లని
కఱ్ఱినెచ్చెలి. కృష్ణుఁడు.
కఱ్ఱినేల. ముప్పదిరెండు కుంటలపొలము.
కఱ్ఱిమొన. కఱ్ఱుయొక్క మొన.
కఱ్ఱిమొలలు. బ. అడ్డను తగిలించెడు నాగవాసములు.
కఱ్ఱు. కఱ; నాఁగటిమొంప యందమర్చెడి యినుపపాళము, కృషకము; డాగు.
కఱ్ఱుకుట్లు. బ. కఱకుట్లు.
కఱ్ఱుగుద్దలి. తొల్లిక.
కల. స్వప్నము; స్వప్నప్రపంచము. సం. (కళ) ముప్పదికాష్ఠలకాలము; విద్య; ఒక అంశము; చంద్రునిలో పదునాఱవ భాగము; భాగము; స్త్రీరజస్సు;

మొదలుసొమ్ము వడ్డి; శిల్పము. (షోడశకళలు—ప్రాణము, శ్రద్ధ, ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, భూమి, ఇంద్రియము, మనస్సు, అన్నము, వీర్యము, తపస్సు, మంత్రము, కర్మ, లోకము, నామము. చతుష్షష్టికళలు—ఇతిహాసము, ఆగమము, కావ్యము, అలంకారము, నాటకము, గాయకత్వము, కవిత్వము, కామశాస్త్రము, దురోదరము, దేశభాషా లిపిజ్ఞానము, లిపికర్మము, వాచకము, అవధానము, స్వరశాస్త్రము, శాకునము, సాముద్రకము, రత్నశాస్త్రము, రథాశ్వగజకౌశలము, మల్లశాస్త్రము, సూదకర్మము, దోహదము, గంధవాదము, ధాతువాదము, ఖనివాదము, రసవాదము, జలవాదము, అగ్నిస్తంభము, ఖడ్గస్తంభము, జలస్తంభము, వాక్స్తంభము, వయస్స్తంభము, వశ్యము, ఆకర్షణము, మోహనము, విద్వేషణము, ఉచ్చాటనము, మారణము, కాలవంచనము, పరకాయప్రవేశము, పాదుకాసిద్ధి, వాక్సిద్ధి, ఘుటికాసిద్ధి, ఇంద్రజాలము, అంజనము, దృష్టివంచనము, స్వరవంచనము, మణిమంత్ర-ఔషధాదిసిద్ధి, చోరకర్మము, చిత్రక్రియ, లోహక్రియ, అశ్మక్రియ, మృత్క్రియ, దారుక్రియ, వేణుక్రియ, చర్మక్రియ, అంబరక్రియ, అదృశ్యకరణము, దూతీకరణము, మృగయ, వాణిజ్యము, పాశుపాల్యము, కృషి, ఆసవకర్మము, ప్రాణిద్యూతకౌశలము. క్రమాంతరమున—గీతము, వాద్యము, నృత్యము, నాట్యము, ఆలేఖ్యము, విశేషకచ్ఛేద్యము, తండులకుసుమబలి వికారములు, పుష్పాస్తరణము, దశనవసనాంగరాగములు, మణిభూమికాకర్మ, శయనరచన, ఉదకవాద్యము, ఉదకఘాతము, చిత్రాయోగములు, మాల్యగ్రథనవికల్పములు, కేశశేఖరాపీడయోజనము, నేపథ్యయోగములు, కర్ణపత్రభంగములు, గంధయుక్తి భూషణయోజనము, ఇంద్రజాలము, కౌమారయోగములు, హస్తలాఘవము, చిత్రశాకాపూపభక్ష్యవికారక్రియ, పానకరసరాగాసవయోజనము, సూచీవాపకర్మ, వీణాడమరుకసూత్రక్రీడ, ప్రహేళిక, ప్రతిమాల, దుర్వాచకయోగములు, పుస్తకవాచనము, నాటికాఖ్యాయికాదర్శనము, కావ్యసమస్యాపూరణము, పట్టికావేత్రబాణవికల్పములు, తర్కుకర్మలు, తక్షణము, వాస్తువిద్య, రూప్యరత్నపరీక్ష, ధాతువాదము, మణిరాగజ్ఞానము, ఆకరజ్ఞానము, వృక్షాయుర్వేదయోగములు, మేషకుక్కుటలావకయుద్ధవిధి, శుకసారికాప్రలాపనము, ఉత్సాదనము, కేశమార్జనకౌశలము, అక్షరముష్టికాకథనము, మ్లేచ్ఛితకవికల్పములు, దేశభాషాజ్ఞానము, పుష్పశకటికానిమిత్తజ్ఞానము, యంత్రమాతృక, ధారకామాతృక, సంపాట్యము, మానసీకావ్యక్రియ, క్రియావికల్పములు, ఛలితకయోగములు, అభిధానకోశచ్ఛందోజ్ఞానము, వస్త్రగోపనములు, ద్యూతవిశేషము, ఆకర్షణక్రీడ, బాలకక్రీడనకములు, వైనాయికీ విద్యాజ్ఞానము, వైజయికీ విద్యాజ్ఞానము, వైతాలికీ విద్యాజ్ఞానము, వైయాసికీ విద్యాజ్ఞానము.) [నది.

కలంక. కలుషము; దేశము. విణ. కలఁగి

కలంకము. సం. కళంకము.

కలంకారి. వ్రాతపని వస్త్రము.

కలంకు. చిహ్నము; కలంక.

కలంజము. సం. గంజాయి; పొగాకు; విషముపూసిన బాణముచేత చంపఁబడిన మృగము లేక పక్షి.

కలంత. గళంతిక, గరగ.

కలందాను. హిం. కలములుంచుకొను పెట్టె

కలంబము. సం, కూర నార; బాణము.

కలంబి. సం. తీఁగబచ్చలి†.

కలఁక. నీళ్ళు కలఁగుట, ఆవిలత్వము; కలఁగుట; కంటి తెగులు.

కలఁకనీరు. కలుషోదకము.

కలఁకపాటు. కలఁతపడుట.

కలఁకఁబాఱు. అ. క్రి. కలఁతపడు.
కలఁకు. కళ్లము; స్థానము; యుద్ధము; రూ. కలను.
కలఁకువ. కలఁత.
కలఁగఁద్రొక్కుకొను. అ. క్రి. తనకుతాను కలఁతపడి తొట్రుపడు.
కలఁగఁబడు / కలఁగనబాఱు } అ. క్రి కలఁగు, సంక్షోభించు.
కలఁగినది. కలంక.
కలఁగు. అ. క్రి. కన్నునీళ్లుకలఁకఁబాఱు; కలఁకఁబాఱు, కలఁతపడు
కలఁగుడు. కాలుష్యము. రూ. కలగుండు.
కలఁచే. కలుషము.
కలఁచియాడు. స. క్రి. కలఁచు.
కలఁచే. ప్రే. కలఁగఁజేయు, కలఁతపడఁజేయు.
కలఁడు. ఉన్నాడు.
కలఁత. క్షోభము; అపోహము; నీళ్లకలక.
కలఁతపడు. అ. క్రి. సంక్షోభించు; కలఁగు.
కలకంఠకంఠి. సం. అవ్యక్తమధుర ధ్వనితోఁగూడిన కంఠముగల స్త్రీ; స్త్రీ.
కలకంఠము. సం. కోయిల; హంస; పావురము; అవ్యక్తమధురధ్వని.
కలకండ. కండచక్కెర, పటికబెల్లము, ఫాణితము.
కలకటరు. కలెక్టరు.
కలకల. పక్కున, నవ్వుటయందగు ధ్వన్యనుకరణము; హంసాదిధ్వని.
కలకలము. సం. అనేకధ్వనులు కలసినది; గుంపునఁబుట్టిన పెద్దమ్రోఁత, అలబలము
కలకాలము. ఎల్లకాలము.
కలకు. కళ్లము, లగాము.
కలకేతవిద్య. సం. ఇంద్రజాలవిద్య.
కలకేతవేషము. సం. ఐంద్రజాలికుని వేషము.
కలగర. గుంటకలగర†.
కలగలపు. కలుపుఁగోలుతనము; కలుసుకూర. రూ. కలగలుపు.
కలగుండు. కలఁత; కాలుష్యము.
కలగుండుగొను / కలగుండువడు } అ. క్రి. కలఁగు, క్షోభించు.
కలగుండువెట్టు. స. క్రి. కలఁచు.
కలగూర. రెండుమూడు కూరలు కలిపి వండినది; పెక్కుదినుసులు కలసిన కూరాకు, మిశ్రశాకము.
కలగొను. అ. క్రి. క్షోభించు; వ్యాపించు.
కలజువ్వి. కపీతనము†.
కలతెఱఁగు. యథార్థ్యము. కలరూపు.
కలది. ఉన్న వస్తువు.
కలదు. కద్దు అనుట. [మధురధ్వని.
కలధౌతము. సం. వెండి; బంగారు; అవ్యక్త
కలధ్వని సం. అవ్యక్త మధురధ్వని; కోకిల; నెమలి; పావురము. [పొందుట.
కలన. యుద్ధము. సం. ఎఱుఁగుట;
కలనఁజొవరులతెన్ను. సూర్యుఁడు.
కలనతపసి కలహాశనుఁడు, నారదుఁడు.
కలనతపసితల్లి. సరస్వతి.
కలను. కళము; స్థానము; యుద్ధము.
కలనుసెప్పు. స. క్రి. యుద్ధమునకు సిద్ధముగా నుండఁజెప్పు.
కలప. నాఁగటిదుంప; ఇల్లు మొదలగు వానిని కట్టుటకుపయోగించెడు మ్రాను.
కలపకట్టె. కలము, లేఖిని.
కలపడము. ఒకటితో నొకటి కలియుట.
కలపతాల్పు. బలరాముఁడు; శూద్రుఁడు.
కలపనగంప. కలహాశీలుఁడు.
కలపనఁబిండి క్షోభము.
కలపము. కలపుట; యక్షకర్దమము, పరిమళద్రవ్యములనుచేర్చి కలపినచందనము
కలపు. కలయుట. ప్రే. కలయఁజేయు.
కలబంద. ఒక మందు చెట్టు, కన్య†.
కలభము. సం. ఏనుగుపిల్ల.
కలమము. సం. వ్రాసెడు కలము; వరిపైరు; లత్తుక.
కలమరి. ఓడయెక్కి పోవువాఁడు.
కలము. ఓడ; పడవ; పండ్రెండుతూములకొలఁదిగల పరిమాణవిశేషము; కలుపగంధము; వ్రాసెడు కలము, లేఖిని. సం. అవ్యక్తమధురధ్వని; రేతస్సు. విణ. అజీర్ణము.
కలముఁడు. దొంగ.
కలయు. క్రి. అంతట. రూ. కలయఁగ.

కలయంపి ఊడ్చినమీఁద (దుమ్ము అడఁ గుటకై కస్తూరి చందనము మొదలగు సుగంధి ద్రవ్యములఁ గలిపి) చల్లెడు నీళ్లు; కలాఁపి, గోమయజలము
కలయేఁబడు. అ. క్రి. కలయు.
కలయిక. సంగమము
కలయు. స. క్రి. కూడు; సక్తమగు.
కలయుమెలుకువ. మల్లయుద్ధములోని విశేషము.
కలరవము సం. పావురము.
కలరు బ.కలిగినవారు.ఇం.రంగు,వర్ణము.
కలరూపు. యాథార్థ్యము.
కలలము. సం. గర్భపిండము; మావి.
కలవ. కలయుట; కలసిన ఱుసుకయు సున్నమును; కలువ; కలువములగు జలాదులు. విణ. కలసినది.
కలవంటకము. కిచ్చడి, నూవుపొడి మొదలగు వానితో చేసిన అన్నము; చిత్రాన్నము.
కలవడము. కలయంపి.
కలవడు. అ క్రి. కలయు, సక్తమగు
కలవరపడు } అ. క్రి. క్షోభించు, కలఁత
కలవరపోవు } పడు.
కలవరము. క్షోభము. కలఁత; చింత; స్వప్నభాషణము.
కలవరించు. అ. క్రి. మైమఱచిమాటాడు; నిద్రలోమాట్లాడు.
కలవరింత (పు). మైమఱచినమాట; నిద్రలో పరిదేవనము.
కలవలము. కలవరింత. [శక్తుఁడు.
కలవాఁడు. విణ. ఆప్తుఁడు;ధనవంతుఁడు;
కలవింకము. సం. ఊరఁబిచ్చుక.
కలశము. సం. కుండ, చెంబు.
కలశాబ్ధి. సం. పాలసముద్రము.
కలశాబ్ధిజ. సం. లక్ష్మీదేవి.
కలహంస. సం. ధూమ్రవర్ణములైన ముక్కు కాళ్ళు ఱెక్కలును గల హంస; రాజహంస; మధురముగా పలికెడి హంస.
కలహము. సం. యుద్ధము; వివాదము, జగడము, తగవు.
కలహాంతరిత. సం. నాథుని కోపించి పశ్చాత్తాపమును పొందు స్త్రీ.

కలహాశనుఁడు. సం. నారదుఁడు.
కలహించు. సం. అ. క్రి. జగడమాడు.
కలాచి. సం. తమ్మతసుకు. [ద్రుఁడు.
కలాదుఁడు. సం. కంసాలివాఁడు; చం
కలాపకము. సం.ఏనుఁగుమెడ మోకు;ఒకే క్రియయందన్వయించెడి నాలుగు శ్లోకములు.
కలాపన. కలఁత.
కలాపము. కలఁత. సం. ఇరువదిరైదు పేటలుగల స్త్రీల ఒడ్డాణము; నెమలి పింఛము; అమ్ములపొది; అభరణము; సమూహము.
కలాఁపి. కలయంపి.
కలాపి. సం. నెమలి. [బటాణి†.
కలాయము. సం. గుండ్రని సెనగలు;
కలాసము. కుమ్మరివాని ఒక పనిముట్టు.
కలి. పులియఁబెట్టిన కడుగునీరు, ధాన్యామ్లము. సం. కలియుగము; యుద్ధము; జగడము; ఒకవైపు ఒకఅంకెగలపాచిక.
కలింగలు అలుఁగు; పరీవాహము; నదులు చెఱువులు మొదలగువానిలో నెక్కువగా నీరుపోవుటకేర్పరచిన దారి.
కలింజకము. సం. చాఁప.
కలిక. సం. ముదురు; మొగ్గ.
కలికము. శైత్య నివారణార్థము కంటికి వేసెడు మందు [పిట్ట; నెమిలియడుగు†.
కలికారము. సం. కూఁకటిమూఁగ; పచ్చ
కలికి. ఒప్పైన స్త్రీ; స్త్రీ. విణ.మనోజ్ఞము.
కలికికన్నియ. ఒప్పైన స్త్రీ; స్త్రీ.
కలిగొట్టు. పాటల†.
కలితనము. సామర్థ్యము; శూరత్వము.
కలితము. సం. విణ. ఎఱుఁగఁబడినది; పొందఁబడినది.
కలితి. కల్తి, మిశ్రితము.
కలిద్రుమము. సం. తాండ్ర†.
కలిమము. మాంసము.
కలిమారకము. సం. నెమలియడుగు†.
కలిమి. కలుగుట; సంపద; అతిశయము; ఉనికి, స్థానము. రూ. కల్మి.
కలిమిచెలి. లక్ష్మి. రూ.కలిమితొయ్యలి.
కలిమిదండుగ. నేరములేనిదే సొమ్ము గల చోట పుచ్చుకొనెడి దండుగ.

కలియుఁగూడు. స. క్రి. ఒకటిచేయు.
కలియు. స. క్రి. పొందు.
కలిలము. సం. కాలుష్యము విణ. ఎఱుఁగరానిది; చొరరానిది.
కలివడగలు. వీరధ్వజములు.
కలివె. కరమర్దము†.
కలీయము. సం. కల్లెము.
కలు. బండిచక్రము; ఱాయి; మద్యము; మద్యవిశేషము.
కలుఁగానుగు. త్రాయంతి†.
కలుఁగు. బొక్క; ఎలుకలు మొదలైనవి త్రవ్విన బొక్క; గుహ.
కలుఁగులాయపుతేజిబలుసిపాయి. మూషకవాహనుఁడు, వినాయకుఁడు.
కలుఁజే. చెఱువు మొదలగువాని నీళ్ళు పోవుటకు ఱాతితోఁగట్టిన మార్గము.
కలుకోడి. రాతికోడి.
కలుక్రాంత. కలుఁగానుగు†.
కలుక్రానుగు. కారునువ్వు†.
కలుగచ్చు ఒకగచ్చు†.
కలుగానుఁగ. ఱాతిగానుగ.
కలుగు. అ. క్రి. ప్రాప్తమగు; దొరకు; జనించు; పుట్టు; అగు; ఉండు; ఓపు; కూడు. స. క్రి. పొందు. రూ. కల్గు.
కలుచె. దోషము; కలఁత; క్రోధము.
కలుచేపడు. అ. క్రి. కలఁతపడు.
కలుపు. వరిచేలో మొలచిన గడ్డి మొ॥; పెరుగు. ప్రే. కలియఁజేయు; కూర్చు.
కలుపుఁగోలు. అభేదము. రూ. కల్పుగోలు.
కలుపుఁగోలుతనము. ఆనుకూల్యము; అభేదము.
కలుపొన్న. రాతిపొన్న.
కలుబంద. గృహకన్యక.
కలుమరములు. మి. బ. ఱాతిమరములు.
కలుము. కలువగంధము.
కలువ. కల్వ, ఉత్పలము†. ఒక జలపుష్పము; సంగమము. [గల. స్త్రీ; స్త్రీ.
కలువకంటి. కలువరేకులవంటి కన్నులు
కలువకాఁడ. ఉత్పలకాండము.
కలువకాయ. ఉత్పల ఫలాటుపు.
కలువడము. ఉల్లడము; ఉత్సవాదికాలములలో ధ్వజస్తంభము మొదలగు దానియందు ప్రేలఁగట్టెడు బంగారు కలువ పూదండ.
కలువదుంప. ఉత్పలకందము.
కలువము. మందునూఱెడు ఱాయి, ఖల్లము. [చంద్రుఁడు.
కలువరాయఁడు. కుముద బాంధవుఁడు;
కలువఱాకట్టు. శిలాబద్ధ పుష్కరిణి.
కలువఱేకు. కలువపూఱేకు. బ. పిఱుఁదుమీఁది నఖక్షతములు. [వలసూడు.
కలువలవాయ. సూర్యుఁడు. రూ. కలు
కలువలఱేఁడు. కలువరాయఁడు.
కలువలఱేనితోడు. లక్ష్మి. [చంద్రుఁడు.
కలువవిందు. కుముదబాంధవుఁడు,
కలువు కలుగు. [నది, కలఁకఁబాఱేది.
కలుషము. సం. పాపము. విణ. కలఁగి
కలుషించు. స. అ. క్రి. కలఁకఁబాఱు.
కలుసుఁగూర. ఆనుకుగా వండిన కూర.
కలుహారము. కల్హారము. [లాధిపతి.
కలెక్టరు. ఇం. జిల్లాకు అధికారి, మండ
కలేజి. కాలేజి.
కల్కము. సం. కపటము; పాపము; నెయ్యి నూనె మొదలగు వానియందు అడుగున నిలిచినమడ్డి; మలము; తాండ్ర†.
కల్కండ. కలకండ.
కల్కి. కలికి. సం. విష్ణ్వవతారవిశేషము.
కల్గు. కలుగు.
కల్ద్రాగు. స. క్రి. కల్లుత్రాగు.
కల్నేటు. కన్నెలేడి.
కల్పకము. సం. కల్పవృక్షము†.
కల్పన. సం. ఆయత్తము సేయుటకై ఏనుఁగునకుఁ గట్టిన నిడుత్రాడు; కల్పించుట.
కల్పనము. సం. క్లృప్తి; రచన.
కల్పము. సం. నాలుగు వేల యుగముల కాలము, బ్రహ్మదివసము; న్యాయసము; ఉదయకల్పము; లయకల్పము, బ్రహ్మదిన ప్రళయము; వేదాంగమైనవిధి; శాస్త్రము; కల్పవృక్షము†. విణ. సమానమైనది. [వేల్పుమ్రాను.
కల్పవృక్షము. సం. కోరినవస్తువులిచ్చెడు

కల్పాంతము. సం. ప్రళయము, ప్రళయకాలము.
కల్పించు. సం. స. క్రి. కలిగించు; రచించు.
కల్మషము. సం. పాపము; మాలిన్యము; నరకవిశేషము; నలుపు. విణ. నల్లనిది.
కల్మాషము. సం. మిశ్రవర్ణము; నలుపు. విణ. చిత్రవర్ణముగలది; నల్లనిది.
కల్యము. సం. ప్రాతఃకాలము; మద్యము; శుభవాక్యము.
కల్యపాలుఁడు. గవుండ్లవాఁడు.
కల్యవర్తము. సం. ప్రాతరాశ్భోజనము.
కల్యాణము. సం. శుభము; చొక్కపు బంగారు; వివాహము; ఒక పట్టణము.
కల్యాణి. సం. పార్వతీదేవి.
కల్ల. అబద్ధము, అసత్యవచనము; తప్పు; మోసము; పరుషవచనము; తోఁట మొదలగువాని కంచెకోట. విణ. అసత్యము; పరుషము.
కల్లచ్చు. ఒరగల్లు.
కల్లతనము. వంచన; చెడ్డనడత.
కల్లము. మల్లబంధవిశేషము.
కల్లరి. అబద్ధము పలుకువాఁడు; అబద్ధమాడు స్త్రీ; తప్పుచేసినవాఁడు; వంచకుఁడు; దుష్టుఁడు; దుష్టురాలు.
కల్లరీఁడు. విణ. కల్లరి, దబ్బరకాఁడు.
కల్లరుజే. ఒక చేఁప.
కల్లి. కంచెకోట.
కల్లు. కన్ను; బండికన్ను, బండిచక్రము; ఱాయి; తాళనారికేళాదుల మద్యము. బ. కండ్లు.
కల్లుపెంట. కల్లమ్మెడుచోటు.
కల్లుబెల్లము. కల్లువండి చేసిన బెల్లము.
కల్లువడు. అ. క్రి. స్తంభించు.
కల్లువెల్లి. సురాసముద్రము.
కల్లెలుక. పొలములలో కలుగులయందుండెడి యెలుక.
కల్లేడు. ఒకపక్షి.
కల్లేఱు. ఒకనది.
కల్లోలము. సం. పెద్దఅల; సంతోషము.
కల్లోలిని. సం. నది.
కల్వ. కలువ.
కల్వము. ఖల్లము, కలువము, మందునూఱు సాధనము.
కల్వలదొరదారి. పార్వతి.
కల్హారము. వా. కహ్లారము.
కవ. జోడు, యుగళము.
కవకవ. నవ్వుట పలుకుట వ్రాయుట యందగు ధ్వన్యనుకరణము.
కవచము. సం. బొందలము; తప్పెట; కలజావిత్రి.
కవట. పెద్దకొమ్మ. విణ. లేఁత.
కవడె. వాద్యవిశేషము.
కవణకాఁడు. మల్లగమనమును తెలిసినవాఁడు.
కవణము. గుఱ్ఱము మొదలగువానియొక్క ఉలవలు మొదలగు భక్ష్యము; చికిత్సార్థము కన్నులకుఁ గట్టిన కట్టు.
కవను. కసవు.
కవపులుఁగు. చక్రవాకపక్షి.
కవపుల్గుదాయ. చంద్రుఁడు.
కవయుట. రతి, సంగమము.
కవరు. ఇం. కాగితపు సంచి, పైకప్పు.
కవఱలు. బ. పాచికలు.
కవలవారు. కవల బిడ్డలు.
కవలు. బ. యమళశిశువులు; కవలవులు; నకుల సహదేవులు మొ॥; జోళ్ళు. అ. క్రి. కవలుకొను.
కవలుకొను } అ. క్రి. వేదాదిపఠనము
కవలువోవు } నందు కొంత సామ్యముచే ఒకటి విడఁబడి మఱియొకటి వచ్చి కలయుట.
కవాటము. సం. తలుపు. [చొప్ప మొ.
కవాడము. ఎద్దులుమోయు బరువు, గడ్డి
కవాతు. హిం. దండువారుచేయుసాధకము
కవి. సం. కవిత్వముచెప్పువాఁడు; పండితుఁడు; శుక్రుఁడు; వాల్మీకి; జలపక్షి; ఆత్మ, బ్రహ్మము; కళ్లెము; పక్షి.
కవించు. ప్రే. కవియించు.
కవిక. సం. కళ్లెము.
కవిచేయు. అ. క్రి. వ్యాపించు.
కవిడి. చర్మవాద్య విశేషము.
కవిత. సం. కయిత, కవిత్వము.
కవిత్వము. సం. కవిచెప్పిన పద్యాదికము.
కవియు. వ్యాపించు; ఎదుర్కొను.
కవియుదెంచు. అ. క్రి. కవియు.

కవిరి. తాంబూలముతోఁగూడ నుపయోగించుకొనుటకు కాఁచు మొదలగు వస్తువులం చేర్చి చేసిన ఉండ.
కవిరియుండలు. బ. ఖాదిరగుటికలు.
కవిల. కపిలవర్ణము.
కవిలమొదవు. కపిలగోవు.
కవిలియ. కవిలె.
కవిలె. కడితము; ధర్మాధర్మముల లేక ఆయవ్యయాదుల లెక్కలు నానాఁడు వ్రాసి చేర్చిన పత్రముల కట్ట.
కవు. కా (వృత్తియందు కౌను శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము).
కవుఁగిలి. కౌఁగిలి.
కవుఁగిలించు. స.క్రి. ఆలింగనముచేయు.
కవుఁగిలింత(పు). ఆలింగనము.
కవుచు. మాంసము; చేఁపమీఁది పొలుసు.
కవుఁజు. కపింజలము.
కవుడు. కపటము; వంచన.
కవుడువు కయిపడి.
కవును. మధ్యభాగము; ఆకు చెప్పులు; వింటినడుము.
కవురు. రంగు.
కవులు. రాజులోనగువారు ప్రజలకు మొదలగువారి కిచ్చునట్టి ఒడంబడిక.
కవోష్ణము. ఇంచుక వేఁడి. సం. విణ. ఇంచుక వేఁడిగలది, నులివెచ్చనిది.
కవ్యము సం. పితృదేవతల కీయఁదగిన అన్నము.
కవ్వడి. రెండుచేతుల వడి గలవాఁడు, సవ్యసాచి, అర్జునుఁడు.
కవ్వడిచెలి. అర్జునసఖుఁడు, కృష్ణుఁడు.
కవ్వపుఁగొండ } మందరపర్వతము.
కవ్వపుమల }
కవ్వపు మల తరిత్రాడు. శేషసర్పము.
కవ్వము. పెరుఁగు చిలికెడు సాధనము, మంథానము.
కవ్వు. స. క్రి. కబళించు; అపహరించు
కశ. సం. కొరడా, గుఱ్ఱము మొదలగు వానిని కొట్టునట్టి చబుకు.
కశము. సం. పూతి మార్జాలము.
కశిపువు. సం. అన్నము; వస్త్రము; అన్నవస్త్రములు; పఱపు.
కశేరుక. సం. వెన్నెముక.
కశేరుకము. సం. కమ్మ రేఁగు†; కొట్టిగడ్డ సమ్మదుంప†; వెన్నెముక.
కశేరువు సం. తుంగముస్తె†.
కశ్మలము. సం. మూర్ఛ; ఎలుకుల పల్లె.? విణ. మలినము.
కశ్యము. సం. గుఱ్ఱపునడుము; మద్యము. విణ. కశకుఁదగినది.
కషణము. సం. ఒరయిక.
కషము. సం. ఒరగల్లు; సాన.
కషాయము. సం. ఒగరు; కావిరంగు; మనోదోషము; రంగు; పూసికొనెడు చందనాది; చిత్తస్తబ్ధత; రక్తవర్ణము; అనేక వస్తువులం చేర్చి కాఁచిన ఓషధీరసము; చందనాదులపూఁత. విణ. ఎఱ్ఱనిది; వాసనగలది.
కషాయిక. సం. నీరు దోష.
కషికుఁడు. సం. కన్నపు దొంగ.
కషుఁడు. సం. సానపెట్టుట మొదలగు పనులచే జీవించెడు ఒక నికృష్టజాతి వాఁడు.
కష్టపడు. మి. అ. క్రి. దుఃఖపడు.
కష్టపఱచు. సం. స. క్రి. బాధించు, బాధపెట్టు. [కష్టదశ.
కష్టపాటు. మి. కష్టపడుట, దుఃఖపడుట;
కష్టము. సం. దుఃఖము; పాపము; ప్రయాసము. విణ. దుఃఖము గలది; పాపము గలది; చొరరానిది. (అష్టకష్టములు—దేశాంతరగమనము, భార్యావియోగము, ఆపత్కాలమున బంధుదర్శనము, ఉచ్ఛిష్టభక్షణము, శత్రుస్నేహము, పరాన్నప్రతీక్షణము, భంగము, దారిద్ర్యము.)
కసటు కష్టము, పాపము; మాలిన్యము.
కసమస తొట్రుపాటు.
కసము. కక్కసము.
కసరత్తు. హిం. సాధకము, వ్యాయామము.
కసరు. కోపము; నిగ్గు; గాలివాన; పెచ్చు,

లాభము; లజ్జ; శాపము, తిట్టు. అ. క్రి. చలించు. స. క్రి. కోపించు.
కసవు. తృణాది, గడ్డి; చీఁపురు చేత ఊడ్చేడి పెంటపోగు, అవకరము.
కసవుఁగుప్ప. పారకతో ఊడ్చి చేర్చిన పెంటపోగు; గడ్డివామి.
కసాయి. కటిక, మాంసికుఁడు.
కసి. కోపము; దురద; కోరిక.
కసింద. కాసమర్దము†.
కసిఁగాటు. అనిష్టభక్షణము.
కసిడి. విణ అల్పము.
కసిమసఁగు. అ. క్రి. విజృంభించు. స. క్రి. ఖండించు; చంపు; నాశము చేయు
కసిమసి. తొట్రుపాటు.
కసిమిరి. తీఁట. [ఊట గల తావు.
కసియము. కషాయము; నీటియొక్క
కసివారు. సవారీమార్గము.
కసివెంద. కసింద†. [బుట్టలు కట్టుట.
కసీదా(దు). హిం. వస్త్రముమీఁద పూలు
కసీసము. కృష్ణవర్ణము; నీలకలధౌత వస్త్రము. విణ. నల్లనిది.
కసు. వృత్తియందు కసురుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము.
కసుఁగందు. లేఁతబిడ్డ; నలుపు.
కసుగందు. అ. క్రి. పుష్పాదులు వాడిపోవు.
కసుగాయ. లేఁత కాయ.
కసుగు. అ. క్రి. నలఁగు. స. క్రి. నలఁచు; పులుము; బాధించు.
కసుబా. హిం. విణ. అధికారులుండు గొప్ప గ్రామము; తాలూకాలోని ప్రధాన నగరము. [కము.
కసుమాలము. విణ. మలినము; అప్రయోజ
కసురు. లేఁత కాయ.
కసెచేరులు. బ. కుల్లాయ బొందులు.
కసెము. కస్సెము; కషాయము.
కస్టి. దుఃఖము; శోకము; ఆపద.
కస్తురి. కస్తూరి; కుక్క పేరు.
కస్తురిపట్టియలు. బ. పుష్పవిశేషము; ధాన్యవిశేషము.
కస్తురిపసుపు. గంధహరిద్ర†.
కస్తురిపిల్లి. గంధమార్జాలము
కస్తురిమల్లచీర. స్త్రీవస్త్ర విశేషము.
కస్తురివీణియ. మృగనాభి, కస్తూరి ఉండెడి జింకబొడ్డు.
కస్తూరి. కుక్క పేరు. సం. మృగమదము.
కస్తూరినిగరాలు. బ. ధాన్యవిశేషము.
కస్తూరిపట్టెలు. బ ధాన్యవిశేషము.
కస్యము. త్రవ్విన కాలువ.
కస్సెము. నీళ్లు చిద చిద యనెడు నేల; కషాయము. [ధ్వన్యనుకరణము.
కహకహ. సం. రాక్షసహాసనమునందగు
కహారము. సం. నిట్రాడు, గృహ విశేషముయొక్క నడిమికంబము.
కహ్లారము. సం. కొంచెము యెఱుపు తెలుపుగు గలిగి మిక్కిలి పరిమళముగలకలువ†.
కహ్వము సం. బకము, కొంగ.
కళ. శోభ; మూర్ఛ; రెమ్మ. సం. చూ. కల.
కళంకము. సం. చిహ్నము; నింద; ఇనుప చిట్టెము.
కళంకు. కలంకు.
కళత్రము. సం. భార్య; పిఱుఁదు; కోట.
కళపెళ. ఉడుకుటయందగు ధ్వన్యనుకరణము.
కళబట్టుట మూర్ఛ.
కళబుట్టు. అ క్రి. మూర్ఛిల్లు.
కళవరపాటు. సంభ్రమము; కలఁతపాటు.
కళవరము. మల్లబంధవిశేషము.
కళవళపడు. అ. క్రి. క్షోభపడు; సంభ్రమించు.
కళవళము. కలవరము.
కళవళించు. అ. క్రి. కళవళపడు.
కళవసము. చర్మము.
కళాంజి. తమ్మపడిగము.
కళాచిక. బరిణె.
కళానిధి. సం. చంద్రుఁడు. [పూర్ణుఁడు.
కళాప్రపూర్ణుఁడు. సం. కళలయందు పరి
కళాయి. నీలిమందు కాఁచెడు గంగాళము; ఇత్తడిపాత్రలు మెఱుఁగు వానికి పూసెడు సీసపు పూఁత. [వాఁడు.
కళావంతుఁడు. సం. కళలయందారితేరిన
కళావతి. సం. కళలు తెలిసిన ఆఁడుది; తుంబురుని వీణె.

కళాసగందవడి. లేపన విశేషము.
కళాసము. చర్మము.
కళాసిక. కళాంజి.
కళాసించు. అ. క్రి. అలయు.
కళింగ. సం. అండుది.
కళింగము. సం. కొడిసెకాయ; ఒక దేశము; కూకటిమూఁగ పక్షి; నెమిలి యడుగు†.
కళిందజ. సం. యమునానది; కాళింది.
కళుకు. కాంతి; కిరణము; చూర్ణము; ఒక పక్షి.
కళుక్కు. కాంతి; ఒక పక్షి.
కళేబ (వ) రము. సం. శరీరము.
కళ్యము. కల్లెము.
కళ్ళ. కళ్ళె.
కళ్ళము } ఖలము, ధాన్యము నుటిచెడు
కల్లాము } స్థలము.
కళ్ళియము. కల్లెము.
కళ్లె. శైత్యముచే గట్టిపడిన యుమ్మి, కఫము, శ్లేష్మము; కళ్ళెము.
కళ్ళెము. ఖలీనము, గుఱ్ఱమునోటఁ దగిలించునది.

---

# కా

కా. అవ్య. కదా, కిలార్థకము; కాకి అఱచుటయందగు ధ్వన్యనుకరణము. విణ. కుత్సితశబ్దమునకు వృత్తియందు వచ్చెడి ఆదేశము. ద్ర. అవధారణార్థకము. ఇత్యర్థకము.
కాంక్ష. సం. కోరిక.
కాంక్షించు. సం. స. క్రి. కోరు.
కాంక్షితము. సం. విణ. కోరఁబడినది.
కాంచనము. సం. బంగారము; ఆకరువు; ఉమ్మెత్త†; సంపెంగ†; కాంచేనము†; నాగకేసరము†.
కాంచనారము. సం. కాంచనము†.
కాంచని. సం. హరిద్ర, పసుపు†.
కాంచి. సం. ఒంటిపేటగల అండుదాని మొలనూలు; కంచి. ఒక మోక్షపురి.
కాంచనము కోవిదారము†.
కాంచు. స. క్రి. చూచు; పొందు; బిడ్డను కను; భాగ్యముఁబొందు; సక్తమగు.
కాంజికము. సం. ఆరనాళము, కలి. రూ. కాంచికము.
కాండపటము. సం, తెర, పరదా.
కాండపృష్ఠుఁడు. సం. విణ. ఆయుధముల చేతఁ బ్రదుకువాఁడు, శస్త్రాజీవుఁడు.
కాండము. సం. కావ్యపరిచ్ఛేదము; బాణము; జలము; ఆకులం మొదలగువాని యీనె; తామర మొదలగువాని కాఁడ; వరి మొదలగువాని పోఁచ; ముండ్లు మొదలగువాని దుబ్బు; మోదుగు మొదలగువానికఱ్ఱ; చెట్టుబోదె; గుఱ్ఱము; కుత్సితము; ఏకాంతము; సమయము; దండము. [ధరించినవాఁడు.
కాండీరుఁడు. సం. విణ. బాణమును
కాండెకువు. సం. ములంగోలిమిడి†.
కాంద్ర. తృణవిశేషము; అనురుసురు.
కాంద్రము. పులికూయుటయందగు ధ్వన్యనుకరణము. [ (వేంకిణము†.
కాంత. సం. చక్కని స్త్రీ; స్త్రీ;
కాంతము. సం. ఇనుము; సూదంటురాయి. (చంద్రసూర్యాయ శ్శబ్దములకును తత్పర్యాయ శబ్దములకును వెనుక వచ్చునప్పుడు) ఱాయి విణ సుందరము.
కాంతలకము సం. నందివృక్షము†.
కాంతారము. సం. అడవి, పెరడవి; పోరానిత్రోవ; తెలంపుకలసిన పచ్చ చెఱకు†.
కాంతాళపడు. అ. క్రి. ఈర్ష్యపడు.
కాంతాళము. ఈర్ష్య; తాలిమిలేమి; కోపము
కాంతి. సం శోభ, జిగి; కోరిక.
కాంతిముచము. సం. కాంతిని హరించునది.

కాంతుఁడు. సం. పెనిమిటి. విణ. ఒప్పిదము గలవాఁడు.
కాందవము. సం. అట్టు. [చేయువాఁడు.
కాందవికుఁడు. సం. విణ. పిండివంటలు
కాందారి
కాందారిప్రొద్దు } నిశీథకాలము.
కాందిశీకుఁడు. సం. విణ. భయపడి పాఱి పోయెడివాఁడు.
కాంపిల్యము. సం. కంపిల్లము†.
కాంబవికుఁడు. సం. శంకుపూసలు మొదలగునవి చేసి అమ్మెడువాఁడు.
కాంబళము. సం. విణ. కంబళిచేతఁ గప్పఁబడినది. (రథము.)
కాంబోజము. సం. 56 దేశములలో నొకటి; కాంబోజదేశపు గుఱ్ఱము; వెలిచంద్ర†; బండిగురివెంద†. వా. కాంభోజము.
కాంబోగి. సస్యవిశేషము.
కాంబోజి. రాగవిశేషము.
కాంస్యకారుఁడు. సం. కంచరవాఁడు.
కాంస్యము. సం. కంచు; గిన్నె; బంగారు వెండి మొదలగు వానితో చేయఁబడిన పానపాత్రము.
కాఁక. వేఁడిమి; శరీరమందలి ఉష్ణము, జ్వరము; తాపము; తపము; కోపము. విణ. ఉష్ణము.
కాఁకర. కారవేల్లము†.
కాఁకరూటి. సం. పంది.
కాఁకరవత్తి. బాణసంచు విశేషము.
కాఁకవెలుఁగు. ఉష్ణరశ్మి, సూర్యుఁడు.
కాఁగ. ద్ర. హేత్వర్థకము
కాఁగు. నీళ్లుకాఁచుకొనెడికుండ, పెద్ద బాన. అ. క్రి. కోపపడు; నీళ్లు మొ॥ తప్తమగు.
కాఁగుడు. తపించుట, తపనము.
కాఁచర. కాసర†.
కాఁచి. కాకమాచి†.
కాఁచు. ఒకానొక అంగడి దినుసు, ఖాదిరము. ప్రే. నీళ్లుపాలు మొ॥ కాఁగఁ జేయు, తప్తముచేయు.
కాఁచువడియములు. బ. కవిరియుండలు.

కాఁడ. కలువ మొ॥ వానికాఁడ; కూరాకు మొదలగు వానికామ; తొడిమ, వృంతము
కాఁడి. పులియఁబెట్టిన కడుగునీరు; రథయుగము, ఎద్దు మొదలగువాని మెడమీఁద నుంచెడు బండి మొదలగువాని కాఁడి. [హద్దుగా నేర్పఱచిన కట్ట.
కాఁడిగట్టు. ఒక్కరొక్కరి నేలలకు
కాఁడు. బహువ్రీహ్యర్థకము (వన్నెకాఁడు, విలుకాఁడు అని); నిషేధార్థకము (వాఁడు కాఁడు అని). అ. క్రి. నాటు [మూఁదారి.
కాఁదారి. అర్ధరాత్రము. రూ. కాఁదారి
కాఁదారిప్రొద్దు. అర్ధరాత్రము.
కాఁపడము. నొప్పిగలిగినచోటున వేఁడి వస్తువుతో నొత్తుట.
కాఁపత. శూద్రస్త్రీ.
కాఁపు. కాఁపురము; గృహస్థుఁడు; పంట పెట్టువాఁడు; శూద్రుఁడు; నివాసము.
కాఁపుడు. కాఁచుట.
కాఁపుది. కాఁపత.
కాఁపురము. నివాసము; సంసారము.
కాఁపురించు. అ. క్రి. కాఁపురముచేయు; వసించు. [పును).
కాఁబట్టి అవ్య. కనుక (హేతువును దెలు
కాఁబట్టు. అ. క్రి. కావలసియుండు.
కాఁబడు. అ. క్రి అగు. [ననుట.
కాఁబోలు. ద్ర. బోనేమో, అయియుండు
కాక అవ్య. ఆశీరాద్యర్థకము; కాని; పర్యాంతార్థకము; వినార్థకము (అదిగాక యని) తక్క; ఉతార్థకము. సం. కాఁచి†; కాకిదొండ†; కారుకొల్లి†; నక్కమేడి†; వెలమసంధి†.
కాకగుడము సం. నువ్వులు.
కాకచించ. సం. గురిజ†. రూ. కాకచించి.
కాకజంఘ. సం. కాకిదొండ†; వెలమ సంధి†.
కాకజంబుక. సం. కాకినేరేడు†.
కాకతాళీయము. సం విణ. కాకివ్రాలఁగా తాటిపండు పడిన విధమువంటిది, అకస్మికసంభవము, ఒకన్యాయము.
కాకతిందుకము. సం. కాకితుమ్మికి†.

కాకతుండఫల. సం. కాకిదొండ†
కాకతుండము. సం. అగరువు; కాహళ మను వాద్యవిశేషము; బాణవిశేషము.
కాకనాసిక. సం. కాకిదొండ†.
కాకపక్షము. సం. పిల్లజుట్టు, కూఁకటి.
కాకపీలుకము. సం. కాకితుమ్మిక†.
కాకపుష్టము. సం. కోయిల
కాకమల్లి అడవిమల్లె†.
కాకమాచి. సం. కాఁచి†
కాకము. సం. కాకి; కాకులమూఁకి; ఒక చెట్టు†. విణ. అల్పము.
కాకముద్గ. సం. కాకిపెసర†.
కాకరుహము. సం, నవ్వులం.
కాకలము. సం కాగితము. [ధ్వని.
కాకలి. సం. సూక్ష్మమైన అవ్యక్తమధుర
కాకాంగి సం. కాకిదొండ†.
కాకాక్షిన్యాయము. సం. కాకిచూపువలె నేదో నొక ప్రక్క కొఱగుట.
కాకాదని. సం. పెద్దకాఁచి†.
కాకామ. అవ్య. నఞర్థకము.
కాకాహి. సం. కప్ప. [కాకి; కాఁచి†.
కాకి. కాకము. విణ. అల్పము. సం. ఆఁడు
కాకికలువ అల్లిపువ్వు, కాకోత్పలము†.
కాకిచిప్ప. శంబూక, నీటియందలి గుల్ల.
కాకిచెఱకు. చెఱకువంటి తృణవిశేషము†.
కాకిచమ్మలు బ.మూర్ఛావికారవిశేషము.
కాకిచేవు. ఆకస్మికమృతి.
కాకిణి. సం. కర్షమునందు నాలవపాలు; కొలిచెడుకోల; ఒకగవ్వ; తూనిక భాగము; ఎఱ్ఱగురిజ†.
కాకితము హిం. కాగితము. వ్రాయు పత్రవిశేషము, కాకలము.
కాకితిపు మూర్ఛావిశేషము.
కాకితుమ్మికి నల్లతుమికి, కాకతిందుకము†
కాకిదము. కాకితము.
కాకిదొండ. అడవిదొండ, కాకతుండఫల†
కాకినేరేడు. నేలనేరేడు, కాకజంబువు†.
కాకిపెసర. పిల్లపెసర, కాకముద్గ†.
కాకిబంగారు. అభ్రకము; పీతాభ్రకము.
కాకిబాతు. ఒకవిధమైన అడవిబాతు.
కాకిమేడి, కాకోదుంబరిక†.
కాకిఱెక్కలు బ వడ్లలో విశేషము†.
కాకిఱెల్లు. తృణవిశేషము†.
కాకివన్నె. ఒకవన్నెగలపందెపుకోడిపుంజు
కాకివెదురు. గుండ్రము†.
కాకిసొమ్మ. కాకితిపు.
కాకు. గాసి; తిరస్కారము విణ. వ్యర్థము; శూన్యము; శ్రమము.
కాకుఁడు. సం పిచ్చుకకంటు.
కాకుత్స్థుఁడు. సం. శ్రీరామచంద్రుఁడు.
కాకుదము. సం. తాలువు, దౌడ.
కాకున్నె. అవ్య. నిశ్చయమును దెలుపును.
కాకువు. సం. గద్గదస్వరాదికము; పామ నోక్తి. [పము.
కాకృత్యము. సం. అకార్యము; పశ్చాత్తా
కాకేందువు. సం. కాకితుమ్మిక†.
కాకేమి. అవ్య. మఱియొకదాని లేమిని దెలుపును.
కాకోటి. కావడిబద్ద.
కాకోత్పలము. సం. కాకికలువ†.
కాకోదరము. సం. సర్పము, పాము.
కాకోదుంబరిక. సం. కాకిమేడి†.
కాకోలగ్రీవుఁడు. సం. శివుఁడు, విషము కంఠమందుగలవాడు.
కాకోలము. సం. నరకవిశేషము; విష భేదము; బొంతకాకి.
కాకోలి. సం. కారుకొల్లి†.
కాకోలుఁడు. సం. కుమ్మరి.
కాక్షి. సం. అడవితొగరతీఁగె†; తొగరి†; తొగరిమన్ను. [చేతి దివ్వటీ.
కాగడా. కొయ్య లేక గుడ్డతో నేర్పఱచిన
కాగతము. కాగితము.
కాగితము. కాకితము.
కాగిదము. కాగితము.
కాగి. స. మత్స్యవిశేషము.
కాచము. సం. గాజు; ఉట్టి; నేత్రరోగము
కాచస్థాలి. సం. కలిగొట్టు†.
కాచితము. సం. విణ. కావడియుట్టియం దుంచఁబడినది.
కాచే. అ. క్రి. చెట్టుఫలించు; ప్రకాశించు (ఎండ లేక వెన్నెల కాయు.) స. క్రి. బాధలు తొలగించి రక్షించు; ఎదురు

చూచు; సహించు; పోషించు; పశ్వాదులను పాలించు
కాచుమేపరి. మాంసాశనుఁడు.
కాచుమేపరితనము. మాంసాశనత్వము.
కాజా. గుడ్డమునకు పైని వేసినజీను.
కాజి. ఒకానొక చెట్టు; మహమ్మదీయుల ఆచారి.
కాటకము. క్షామము. కఱవు.
కాటా. హిం. పెద్ద త్రాసు.
కాటికాపరి. శ్మశానమందు కాఁపుర ముండువాఁడు.
కాటిగాఁడు. పక్షివిశేషము.
కాటిపాపఁడు. గొల్లవాఁడు.
కాటిపాపలవాండ్లు. బ. హస్తలాఘవము (జాలవిద్య) చేసెడి ఆటవికజనవిశేషము
కాటిఱేఁడు. శ్మశానవాసియగు శివుఁడు.
కాటు. కఱచుట; కఱచిన గాయము; మాఁడి అడుగంటుట.
కాటుక. అంజనము.
కాటుకకొండ } అంజనాద్రి.
కాటుకగుబ్బలి }
కాటుకపట్టు. అ. క్రి. నలుపుసాఱు.
కాటుకపిట్ట. ఖంజరీటము.
కాటుకఱాయి. సౌవీరాంజనము
కాటుకతేకులపాము. పులిపెంజర.
కాటులాడు. అ. క్రి. కలహించు.
కాటువోవు. అ క్రి. మాఁడి యడుగంటు.
కాటెట్టి. ఒకానొక క్షుద్రదేవత.
కాటేరి. కాటెట్టి
కాట్రగడ. కంచెకోట.
కాట్రేఁడు రూ. కాటిఱేఁడు.
కాడు. చితి; శ్మశానము; అడవి; నాశము; విస్మృతి.
కాడుచేయు. స. క్రి. నాశముచేయు.
కాడుపడు. అ. క్రి. కలఁతపడు; స్మృతి తప్పు;కనఁబడక పోవు. ప్రే. కాడుపఱచు
కాడ్పడు అ. క్రి. రూ. కాడుపడు.
కాణము. ఉలవలు మొదలగు గుఱ్ఱము యొక్క భక్ష్యవిశేషము.
కాణయాచి } చిరకాలవాసస్థానము.
కాణాచి }
కాణాదము. సం. కణాదఋషిప్రోక్త న్యాయశాస్త్రము.
కాణి. కాకిణి, డబ్బు.
కాణుఁడు. సం. ఒంటికంటివాఁడు.
కాత. ద్ర. ఆశీరర్థమునందు తద్ధర్మార్థ క్రియల కనుప్రయుక్తమగు శబ్దము.
కాతరిల్లు. ఉత్సహించు.
కాతరుఁడు. సం. విణ. భయపడువాఁడు.
కాతా. హిం. వ్యాపారములోసంబంధము, లెక్క. రూ. ఖాతా.
కాతాళము. కోపము.
కాత్యాయని. సం. పార్వతీదేవి ; సగము వయసు చెల్లి కావిచీరఁగట్టిన విధవ.
కాదంబము. సం. మధురముగా పలికెడి హంస; ధూమ్రవర్ణములైన ముక్కు, కాళ్లు ఱెక్కలును గల హంస; బాణము.
కాదంబరి. సం. ఒకానొక కావ్యము; ఆఁడుకోయిల; గోరువంక; మద్యము; సరస్వతి.
కాదంబిని. సం. మేఘపంక్తి.
కాదా. అవ్య. కదా. [కలుగునది.
కాదాచిత్కము సం.విణ.ఒకానొకప్పుడు
కాదు. అవ్య నఞర్థకము,కాకాదు.రూ. కాదే. [పాము.
కాద్రవేయుఁడు సం. కద్రువ కొడుకు,
కాన అడవి. అవ్య. సంబోధనమున అను ప్రయుక్తమగు శబ్దము. ద్ర. కనుక.
కానఁబట్టు. అ. క్రి. కనఁబడు. [ముఖము.
కాననము. సం. అడవి; ఇల్లు; బ్రహ్మ-
కానని. గ్రుడ్డిది.
కాననివాఁడు. విణ. గ్రుడ్డివాఁడు.
కాననేకువులు. సం. బ. అడవి చెఱకులు†
కానపుంజే. అడవికోడి.
కానరానడుగులు గల మేటి. ఉరగము, పాము. రూ. కానరాని కాళ్ళయది.
కానరానిమేక్క. అభిజిన్నక్షత్రము, బొమ్మరిక్క.
కాని వీసములో నాలుగవ వంతు. అవ్య. వికల్పమును దెల్పును;తక్కననునర్థమును దెలుపును; పర్యంతార్థకము (పోక కాని తీరదు. ఇచ్చినఁగాని పోఁడు అని).

కానిక. కానుక, ఉపహారము; ఉపాయనము. రూ. కానికె.
కానికులము. చండాలజాతి.
కానిపించు అ. క్రి. ప్రత్యక్షమగు.
కానిమాట. ఆడరానిమాట, అభిశాపము.
కానివాఁడు. అప్రయోజకుఁడు.
కానీ. అవ్య వెలిపించుట (మంచిది కానీ అని); అంగీకారమును దెలుపును; వికల్పార్థకము; అభ్యనుజ్ఞార్థకము. (అది అలాగు కానీ అని). రూ. కాని.
కానీనుఁడు. సం. పెండ్లికాని కన్యకకు పుట్టినవాఁడు (వ్యాసుఁడు, కర్ణుఁడు).
కానీరా. వెలిపించెడు మాట.
కాను. చిక్కని మజ్జిగ, నీళ్లుకలియని చల్ల; ఉప్పుగడ్డి†. [ర్థము తెచ్చిన ద్రవ్యము.
కానుక. ఉపాయనము; రాజాది దగ్గరనా
కానుగు. కరంజము†.
కానుగునూనె. కానుగువిత్తుల నూనె.
కానుపించు. అ. క్రి. అగపడు.
కానుపు. ప్రసూతి;వీక్షణము. రూ. కాన్పు
కాన్క. రూ. కానుక.
కాన్పించు. కనిపించు.
కాపంతము. కుక్కను గట్టెడి కొయ్య.
కాపట్యము. సం. కపటము.
కాపథము. సం. నీటివట్టివేరు;చెడ్డత్రోవ.
కాపరి. రక్షకుఁడు. [రక్షించు.
కాపాడు. అ. క్రి. బాధలు తొలఁగించి
కాపి. ఇం. వ్రాఁతనేర్చుటకు పైన పెట్టు వఱువడి; నకలు. [శాస్త్రము.
కాపిలము. సం. కపిలముని ప్రోక్తసాంఖ్య
కాపిశాయనము. సం. మద్యము, కల్లు.
కాపిశేయము. సం. పిశాచము.
కాపు. ఫలించుట, చెట్టు కాయలు కాచుట; కాపాడుట, సంరక్షణము.
కాపుగడ. రక్షణము.
కాపురుషుఁడు. సం. కుత్సితపురుషుఁడు.
కాపేయము. కృపణత.సం.కపిస్వభావము
కాపోతము. సం. కపోతముల సమూహము
కాప్యకారము. సం. మనసున పాపముంచి మాటాడుట.
కాఫి. ఇం. ఒక విత్తినము. రూ. కాఫీ.

కామ. తామర మొదలగు వానికాఁడ; గొడుగు మొదలగువాని దండము; మగగుతి; చూచుకము; దేనిలోనైనను గ్రుచ్చిన కఱ్ఱ (గొడ్డటికామ అని).
కామంచి. కత్తృణము†; కాకమాచి†.
కామంజిక. కామంచిగడ్డి†.
కామకూటము. సం. వేశ్యాస్నేహము; వేశ్యావిభ్రమము.
కామకేళి. సం. సురతము.
కామకోటి. సం. దేవీపీఠ విశేషము.
కామగృహము. సం. ఆఁడుగుఱి.
కామదుఘము } సం. వేలంపుగిడ్డి,
కామధుక్కు } కోరిన వస్తువు లిచ్చెడి
కామధేనువు } వేల్పుటావు.
కామన. సం. ఇచ్ఛ. [గలది; చక్కనిది
కామనము. సం. అశోకము†. విణ. ఇచ్ఛ
కామనుఁడు. సం. విణ. ఇచ్ఛగలవాఁడు; చక్కనివాఁడు.
కామపాలుఁడు. సం. బలరాముఁడు.
కామము. సం. కామ్యము; రేతస్సు;కోరిక. క్రి. విణ. ఇచ్ఛ వచ్చినట్లు.
కామయిత. సం. విణ. కాముకుఁడు.
కామరూపి. సం. కోరిన రూపము ధరించు విద్యాధరాది; ఊసరవెల్లి.
కామల. సం. కామాల.
కామలము సం. కామాల; మరుభూమి; వసంతఋతువు. విణ. కాముకము.
కామలు. బ. చూచుకములు, అంచులు.
కామాంకుశము. సం. నఖము. గోరు.
కామాటము. మోటపని.
కామాటి. విణ. మోటపనిచేయువాఁడు.
కామాల. నేత్రరోగవిశేషము, పసిరిక.
కామి. సం. ఇచ్ఛ; కాముకుఁడు; జక్కవ; పావురము.
కామిని. సం. ప్రియసంగమమునందు మిక్కిలి యాసగల ఆఁడుది; ఆఁడుది; ఆఁడుజక్కవ; ఆఁడుపావురము; బదనిక†.
కాముఁడు. సం. మన్మథుఁడు, మరుఁడు.
కాముకము. సం. ఇరుగుడు†;తినాసము†. విణ. ఇచ్ఛగలది. [ఆఁడుది.
కాముకి. సం. సంభోగమునందు ఇచ్ఛగల

కాముకుఁడు. సం. విణ. ఇచ్ఛగలవాఁడు; స్త్రీ కాముకుఁడు.

కామెల. కామాల, పసిరికరోగము.

కామ్యము. సం. అగ్నిహోత్రాది కామ్య కర్మ. విణ. కోరఁదగినది.

కాయ. చెట్టునఁగాచెడు కాయ; కఠిన వస్తు సంస్పర్శముచే హస్తాదులయందు కాచెడు కాయ, కిణము; నేత్రరోగ విశేషము; పొట్టు, తప్పధాన్యము, పెసలు మొదలగువానిపైతోలు, శింబ; జూదమునందలి (ఆడునట్టి) సారెలోనగు నది; వీణెసొరకాయ; శలాటువు; శాక భేదము†.

కాయకంటి. కుబేరుఁడు.

కాయకన్ను. కాయకాచిన కన్ను.

కాయకన్నెటి. కుబేరుఁడు. [వృత్తి.

కాయకము. జీవనము; జీవనోపాయము,

కాయకూరలు. బ. శలాటుశాకములు†.

కాయజుఁడు. సం. మన్మథుఁడు.

కాయపెండలము. పెండలము దినుసు†.

కాయమానము. సం. పందిరి.

కాయము. బాలింతకిచ్చెడు మందు, సర్మశ్రీ. సం. శరీరము; సమూహము; స్వభావము; గుఱి. విణ. ఋషిదేవతాకము.

కాయలరాసి. తప్పధాన్యపురాసి.

కాయస్థ. సం ఉసిరిక†; కరక†.

కాయస్థుఁడు. సం. కరణమువాఁడు; పరమాత్ముఁడు.

కాయిక. సం నానాఁటివడ్డి.

కాయికము. అసారము. సం. జబ్బు; పని; వృత్తి. విణ. శరీర సంబంధి.

కాయిరా. హిం. నిర్ణయము, విధి.

కాయిలా. హిం. విణ. ఆరోగ్యములేని.

కాయు. అ.క్రి. ఎండ వెన్నెల మొదలగు నది ప్రకాశించు.

కాయువు } అనురాగము; కాంక్ష.
కాయ్వు }

కార సం. చెఱ; చెఱసాల; దూతిక; వీణె కరివె; సువర్ణకారిక.

కారండవము సం. కన్నెలేడిపక్షి. [వాది

కారంధమి. సం, కంచు పనివాఁడు; రస

కారంభ. సం. ప్రేంకణము†. [చేయునది.

కారకము. సం. కర్మాది షట్కము. విణ.

కారకసివింద. కసింద†.

కారగ్గి. దావానలము.

కారడుగు. రెండవకారు; అల్పధాన్యము.

కారణ. సం. యాతన. [వధము.

కారణము. సం. హేతువు; కొలముట్టు;

కారణికుఁడు. సం. విణ. పరీక్షకుఁడు.

కారపుఁజెక్క. ద్రాక్షాత్వక్కు.

కారపుఁబడుగు. గట్టినూలి పడుగు.

కారపుమన్ను. ఊషరమృత్తిక, కారము.

కారము. కటురసము, ఆఱు రుచులలో నొకటి; చవుడు; నూలు తడిపెడి ఒకానొక ద్రవద్రవ్యము; బిడ్డలకుఁ బోసెడి మందు. సం. కప్పము; నిశ్చయము; మంచుకొండ; యత్నము; వధము.

కారయిత. సం. విణ. చేయించువాఁడు.

కారవల్లి. సం. కాఁకరతీఁగె†.

కారవి. సం. ఇంగువప్రమాను†; ఓమము†; నల్లజీలకఱ్ఱ†; సదాప†.

కారవేల్లము. సం. కాఁకర†.

కారాకు. పండుటాకు, జీర్ణపర్ణము.

కారాకూరము. విణ. కలఁగినది.

కారాట వ్యాప్తి.

కారామల్లు. బ. తెల్ల అలచందలు†.

కారించు. సం. స. క్రి. బాధపెట్టు.

కారిక. సం. సూత్రాది వివరణశ్లోకము; యాతన; చేయుట; మంగలి మొదలగు వాని పని; నట్టువుని పెండ్లాము.

కారికము. విణ. చలువచేయని క్రొత్త వస్త్రము, అనాహతము.

కారిజెము. కడుపులో నీరుతిత్తి క్రింద నుండెడు మాంసఖండవిశేషము.

కారిత. సం. అప్పుతీసికొన్నవాఁడు తన అక్కఱకొలఁదిని తానుగా ఏర్పఱచుకొన్న వడ్డి, ఒడఁబాటువడ్డి.

కారియ కృష్ణవర్ణము; బాధ.

కారియము. కార్యము.

కారీషము. సం. కరీషముల సమూహము.

కారు. అడవి; ఎండకాలమున చల్లెడు వరి ధాన్యము; మదిమి; నస; చౌడు;

కాలము; వర్ష కాలము; జ్యేష్ఠమాసము మొదలు నాలుగేసి నెలల కాలము; నలుపు; పట్టుకారు, సందంశము; కృష్ణవర్ణము; చౌటినేల; ఉప్పన. విణ. ముదురు; జీర్ణము. బ. నిషేధార్థకము (రిపులుం కారు అని).

కారుకంద. వనతువరి†.

కారుకొను. అ. క్రి. నల్లఁబారు.

కారుకొమ్ముమెకము. దుప్పి.

కారుకొఱ్ఱి (ల్లి). కాకోలి†.

కారుకోడి. అడవికోడి.

కారుఖానా. హిం. పనిచేయుస్థలము.

కారుగచ్చ. అవల్గుజము†.

కారుచిచ్చు. దావాగ్ని.

కారుచే. ప్రే. కాఁడించు.

కారుతేనము. శణపుష్పిక†.

కారుణికుఁడు. సం. విణ. కనికరము గలవాఁడు, కృపాళువు.

కారుణ్యము. సం. కనికరము, దయ.

కారుదున్న. అడవిదున్న.

కారునీళ్లు. బ. క్షారోదకము.

కారునువ్వు } జర్తిలము†.
కారునూవు }

కారుపెసర. ముద్గపర్ణి†.

కారుపోఁక. శైలపూగము†. [మహిషము.

కారుపోతు. అడవిదున్న, కాసరము, వన

కారుబుడమ. తీవ్రగంధము†.

కారుమినుము. మాషపర్ణి†.

కారుమునగ. వనశిగ్రువు†.

కారుమొసలి. నక్రవిశేషము.

కారువు. సం. కాసెవాఁడు; విశ్వకర్మ. విణ. శిల్పి; చేయువాఁడు.

కారూరు. అడవిపల్లె.

కారె. క్షారతృణము.

కారెనుపోతు. అడవిదున్న.

కారెము. మళ్లకునీళ్లెత్తెడు తాటిదోనె.

కారేలకి. ఏలాపర్ణి†.

కారోత్తమము. సం. కల్లుతేట.

కార్కఠకము. సం. పాలనురుఁగు.

కార్కశ్యము. సం. కఱకుఁదనము.

కార్కొను. అ. క్రి. నల్లఁబారు; సందడించు

కార్చిచ్చు. కారుచిచ్చు.

కార్చు. ప్రే. కారుచు; కాలుచు.

కార్జము. కారిజము.

కార్తవీర్యుఁడు. సం. కార్తవీర్యార్జునుఁడు

కార్తస్వరము. సం. బంగారము.

కార్తాంతికుఁడు. సం. జోస్యుఁడు.

కార్తికము. సం. కార్తికమాసము.

కార్తికములు. బ. వడ్లలో భేదము†.

కార్తికికము. సం. కార్తికమాసము.

కార్తికేయుఁడు. సం. కుమారస్వామి.

కార్తె. కృత్తికానక్షత్రము; సూర్యుఁడుండు నక్షత్రము.

కార్పటికుఁడు. సం. తీర్థమును మోసికొని పోయెడు బాటసారి; కోమటి.?

కార్పణ్యము. సం. లోభము; అజ్ఞానము; దైన్యము. [నేయఁబడిన చీరె మొ.

కార్పాసము. సం. ప్రత్తి. విణ. నూలిచేత

కార్పాసి. సం. ప్రత్తిచెట్టు†.

కార్పారి. కార్యకర్త.

కార్బీఱ. అడవి బీఱ†.

కార్మణము. సం. చిల్లిఁగి, మూలికచేత చేసెడి ఉచ్చాటనాది క్రియ. విణ. నెఱవేఱుదాఁక పని చేయునది.

కార్ముఁడు. సం. విణ. కర్మశీలుఁడు.

కార్ముకము. సం. విల్లు; వెదురు. [నేర్పరి

కార్ముకుఁడు. సం. విణ. పనియందు

కార్మునగ. కారుమునగ†.

కార్యదర్శి. సం. పనిని నిర్వహించువాఁడు

కార్యధార. సం. విణ. కార్యము చేయు విధానము. [జనము.

కార్యము. సం. పని; హేతువు; ప్రయో

కార్యాలయము. సం. ఆఫీసు.

కార్శ్యము. సం. మద్ది†.

కార్షాపణము. సం. పదియాఱుపణముల యెత్తు; కర్షమెత్తు వెండిటంకము.

కార్షికము. సం. కర్షమెత్తు వెండిటంకము.

కార్షుఁడు. సం. దున్నుకొని బ్రతుకు వాఁడు; కాఁపువాఁడు.

కార్ష్ణి. సం. మన్మథుఁడు; శుకుఁడు; ప్రద్యుమ్నుఁడు; పిల్లపీఁచు†.

కార్ష్యము. సం. మద్ది†.

కాఱడవి. దట్టమైన అడవి.
కాఱియ. కందు; కష్టము; బాధ.
కాఱియపడు. అ. క్రి. యాతనపడు.
కాఱియపెట్టు. స. క్రి. యాతనపఱచు.
కాఱు. అజ్ఞానము; కట్టు. విశే. సాంద్రము. అ. క్రి. నీరుకాఱు; స్రవించు; రాలు. బ. అనృతవచనము; వ్యర్థ వచనము; పరుష వచనము; బహువచనార్థకము (వేసుకకాఱు, తెక్కలికాఱుఅని).
కాఱుకొను. అ. క్రి. సందడించు; క్రమ్ముకొను.
కాఱుకోడి. పా. చివేటూడు నొకపక్షి.
కాఱుచు. ప్రే. కాఱఁజేయు.
కాఱొడ్డెము. పరుషోక్తి.
కాల. సం. కలిగొట్టు†; నల్లజిలకఱ†; నల్ల తెగడ†; నీలి†; మంజిష్ఠి†.
కాలకంఠము. సం. పిచ్చుక; నెమిలి; కాటుకపిట్ట; కూకురుగుండఁగి; కేఁగిస†.
కాలకంఠిక. సం. పెద్దమ్మ.
కాలకంఠుఁడు. సం. శివుఁడు.
కాలకము. సం. పుట్టుమచ్చ.
కాలకాలుఁడు. సం. శివుఁడు.
కాలకూటము. సం. సముద్రములో పుట్టిన ఒక విషము.
కాలక్రుద్ధుఁడు. సం. యముఁడు.
కాలక్షేపము. సం. కాలమును వెళ్లఁబుచ్చుట
కాలఖండము. సం. కారిజము.
కాలగోచరుఁడు. సం. మరణించినవాఁడు
కాలజ్ఞము. సం. కోడి; కోయిల.
కాలజ్ఞుఁడు. సం. జ్ఞానవంతుఁడు; జోస్యుఁడు. [రించిన గ్రామము.
కాలటి. శ్రీ శంకర భగవత్పాదు లవత
కాలటుక. కుండలుంచుటకై రెండు మొనలు ఇరుప్రక్కల గోడలయందు పొదిగి ఊఁతగా కాళ్లుఉంచి అడ్డముగా అమర్చిన మ్రాను.
కాలధర్మము. సం. మరణము
కాలపత్రి. గచ్చ†.
కాలపృష్ఠము. సం. కర్ణుని విల్లు; విల్లు; ఒక ఇఱ్ఱి; రాపులుఁగు. [వర్ణము.
కాలము. సం. తఱి, సమయము; కృష్ణ
కాలమేషి. సం. కారుగచ్చ†.
కాలమేషిక. సం. నల్లతెగడ†; మంజిష్ఠి†.
కాలయాపన. సం. కాలవిలంబము, జాగు.
కాలరి కాలిబంటు; నడచువాఁడిచ్చెడి పన్ను; దూత. [కాలారివాఁడు.
కాలరివాఁడు. దారి నడచువాఁడు. రూ.
కాలరు ఇం. చొక్కా మెడపట్టి.
కాలశాకము. సం. కఱివేము†.
కాలశేయము. సం. గోరసము, చల్ల.
కాలసూత్రము. సం. ఒక నరకము.
కాలస్కంధము. సం. చీఁకటిమ్రాను†; తుమికి†; వేఁగిస†.
కాలస్థాలి. సం. కలిగొట్టు†.
కాలాంతకుఁడు. సం. శివుఁడు.
కాలానుసార్యము. సం. ఇరుగుడు†; నల్ల అగరు†; జాతిపువ్వు†.
కాలాయసము. సం. ఇనుము.
కాలారి. జనులమీఁద జముచేయు పన్ను.
కాలికంచెము అందలములు.
కాలిక. సం. కాళిక; ద్రౌపది; బొగ్గు; నలుపు; చీఁకటి; ఆఁడుకాకి; నూఁగారు; పొగసుమి; బంగారునందలి దోషము; మద్యము; క్రొత్తమబ్బు; మబ్బుగుంపు; వైవర్ణ్యము; నెలవడ్డి; జటామాంసి†; తేలుకొండి†; పొట్ల†.
కాలిడు. అ. క్రి. చొచ్చు, ప్రవేశించు.
కాలిత్రోవ } ఒకఁడు నడచి పోఁదగిన
కాలిదారి } మార్గము, ఏకపది.
కాలినడ. పాదాచారము.
కాలిపాదువ. మల్లయుద్ధములోని మెలఁకువ
కాలిపుట్టువు. పాదజుఁడు; శూద్రుఁడు.
కాలిబంటు. పదాతి. [యంత్రము.
కాలిబోను. మృగములను బట్టు కూట
కాలియ. పిశాచము.
కాలీచి. సం. న్యాయ విచారణ స్థలము.
కాలీయము. సం. నల్లఅగరు†. విశే. కాల సంబంధి.
కాలు. పాదము; పాతిక, నాల్గవ వంతు; మంచపు కోడు మొ॥ అ. క్రి. దగ్ధమగు.
కాలుఁడు. సం. యముఁడు; శనైశ్చరుఁడు; శివుఁడు. [కాలఁ గొలుపు.
కాలుకొను. స. క్రి. కాలూఁదు. ప్రే.

కాలుగడియ. పాతిక గడియ.
కాలుగిద్ద. గిద్దలో నాల్గవ వంతు.
కాలుచు. ప్రే. కాలఁజేయు, దహించు.
కాలుదివియ. కాగడా.
కాలుద్రవ్వు. అ. క్రి. కారణము లేక యుద్ధమునకు యత్నించు; కాలితో నేలను త్రవ్వు. [వివాహమగు.
కాలుద్రొక్కు. వివాహము.అ.క్రి కదియు;
కాలుపు. కాల్చుట, దహనము.
కాలుబలము. మి. కాలితో నడచు సేన, పదాతి సేన. రూ. కాల్బలము.
కాలుమడి. మూత్రము. [చేయు.
కాలుమడుచు. అ. క్రి. మూత్ర విసర్జనము
కాలుమానిసి. పదాతి.
కాలువ. నీరు నిలిచిన ఊరుదరి పల్లము; నీళ్లు పాఱుటకు త్రవ్విన మార్గము,కుల్య; పరంపర.
కాలువురు బ. కాల్వురు. కాలిబంట్లు.
కాలుష్యము. సం. కలఁక.
కాలుసేతులు. బ. పాణిపాదము.
కాలేజి } ఇం. కళాశాల.
కాలేజీ }
కాలేయకము సం. గంధకాష్ఠవిశేషము; ప్రానిపసుపు†; కస్తూరిపసుపు†.
కాలేయము. సం. కారిజము. [రాక్షసులు.
కాలేయులు. సం. బ. కాలకేయులనెడి
కాల్క్రొను. కాలుకొను.
కాల్చు. స. క్రి. దగ్ధముచేయు.
కాల్ద్రవ్వు. కాలుద్రవ్వు.
కాల్ద్రొక్కు. కాలుద్రొక్కు.
కాల్నడ. కాలినడ.
కాల్పించు. స. క్రి. దహింపఁజేయు.
కాల్బంటు. పదాతి.
కాల్మడి. కాలుమడి.
కాల్మడుచు. కాలుమడుచు.
కాల్యకము. సం. కచోరము†.
కాల్యకరణీయము. సం. ప్రాతః కాలమున చేయఁదగినపని.
కాల్యము. సం. కల్యము, ప్రాతఃకాలము; కచోరము†. విణ. ఆయాకాలమునకు సంబంధించినది.

కాల్వ. కాలువ.
కాల్వురు. బ. పదాతులు.
కావంచి. కామంచి†. [సమూహము.
కావచికము. సం. కవచము తొడిగినవారి
కావటి సం. కావడి.
కావడి. వివధము, నీళ్లు మొదలైనవి మోసికొని వచ్చుటకై రెండు కొనలయందును ఉట్లు అమర్చిన బ్రద్ద.
కావడించు. స. క్రి. కావడియందు ఎత్తు.
కావడిచేఱులు. ఉట్లత్రాళ్లు.
కావడిబద్ద. విహంగిక.
కావడిముట్లు. బ. ఉట్లయడుగువి.
కావడియుట్లు. బ. శిక్యములు.
కావరము. క్రొవ్వు, మదము.
కావరి. ధూర్తుఁడు.
కావరించు. అ. క్రి. క్రొవ్వు, మదించు.
కావరితనము. ధూర్తత్వము.
కావరుఁడు. విణ. దుర్మదుఁడు.
కావలము. పాపము; మదము.
కావలయు అ. క్రి. ఆవశ్యకమగు; అపేక్ష్యమగు; అగు.
కావలి. రక్షణము.
కావలికాఁడు. కొత్వాలు. విణ రక్షకుఁడు.
కావలిబొట్టు. బిడ్డలకు రక్షగానుంచెడు నల్లని తిలకము.
కావలుఁడు. మత్తుఁడు.
కావా } గుఱ్ఱము నుడితిరుగుట, అశ్వ
కావాకదము } మండలాకారగతి.
కావారి. అకులగొడుగు.
కావి. ఎఱుపు; కాషాయ వస్త్రము.
కావించు. ప్రే. కాఁజేయు; చేయించు.
కావిగొను. అ. క్రి. ఎఱ్ఱనగు.
కావిగోఁచిదారి }
కావితాలుపు } సంన్యాసి.
కావిబట్టలసామి }
కావిరి. నలుపు, పొగ లేకయే పొగవలె ముంచుకొనునది.
కావిరిబొట్టు. కావలిబొట్టు.
కావిఱాయి. ఎఱ్ఱనినుద్దఱాయి, జేగురుఱాయి, రక్తవర్ణపర్వతధాతువు.
కావు. అఱచుట ఏడ్చుట మొదలగు వాని

యందగు ధ్వన్యనుకరణము; పాఁతఱ మొదలగు వానిపైకప్పు; కావలిబొట్టు; బొట్టు.
కావుట. అగుట.
కావుత. ద్ర. కాత, అగుత.
కావున. ద్ర. కనుక, హేతువును దెలుపునది
కావుపాఁతఱ. ధాన్యముంచెడిగుంట.
కావులు. బ. యతిశాటీలు.
కావులుగలాఁడు. సంన్యాసి.
కావేరి. సం ఒకనది; పసుపు; వెలయాలు.
కావేషము. గ్రా. ద్వేషము, పగ.
కావ్యము. కవిరచించిన గ్రంథము; కబ్బము. (పంచ కావ్యములు — రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, భారవి, మాఘము.)
కావ్యుఁడు. సం. శుక్రుఁడు; కవి, కావ్యకర్త
కాశము. సం. రెల్లు; ఒక దేశము.
కాశి. సం. ఒకమోక్షపురి, వారణాసీక్షేత్రము.
కాశ్మరి, కాశ్మర్యము } సం గుమ్ముడు†.
కాశ్మీరజన్మము. సం. కుంకుమపువ్వు.
కాశ్మీరము సం. కుంకుమము, కుంకుమపువ్వు†; మెట్టతామరదుంప; 56 దేశములలో నొకటి.
కాశ్యపి. సం. భూమి; అనూరుఁడు. [గలది.
కాషాయము. సం. కావిబట్ట; కావిరంగు
కాష్ఠ. సం. దిక్కు; పదునెనిమిది రెప్పపాట్లకాలము; మేర; ప్రమాణపసుపు†; అతిశయము.
కాష్ఠతక్షుఁడు. సం. వడ్లవాఁడు.
కాష్ఠపాటలి. సం. తెల్ల కలిగొట్టు†.
కాష్ఠము. సం. కట్టె, కఱ్ఱ.
కాష్ఠీల. సం. కదళి†.
కాస. కాసె.
కాసంత. స్వల్పము.
కాసమర్దము. సం. కసింద†.
కాసము. సం. దగ్గు
కాసర. ఒక చెట్టు† (కాసర కాయలు).
కాసరము. సం. దున్నపోతు.
కాసరవడ్లు. బ. శాలిధాన్య విశేషము.
కాసరవరుగు. ఎండఁబెట్టిన కాసర కాయలు.
కాసా. దాసీపుత్రుఁడు.
కాసారము. సం. కొలను, మడుగు.
కాసించు. స. క్రి. కాసెగా కట్టు.
కాసియ. కాసె.
కాసీఁడు. ఱాతి పనివాఁడు.
కాసీసము. సం. మైలుతుత్తము.
కాసు. టోలి, దుగ్గానిలో నాల్గవ (పదవ) భాగము; ధనము; ఒక బంగారునాణెము
కాసువు. సం. శక్తి - ఆయుధము.
కాసూధరుఁడు. సం కుమారస్వామి.
కాసె. ఱాయి తొలుచు పని; కచ్చ; దట్టి. రూ. కాసియ.
కాసెకోక. లాగుమీఁద కట్టుకొనెడి దట్టి.
కాసెనిల్కడ. మల్లబంధ విశేషము. [కము.
కాసెయులి. ఱాయి తొలిచెడు ఉలి; టం
కాసెవాఁడు. అశ్మకుట్టుఁడు, ఱాతి పని చేయువాఁడు; శిల్పకారుఁడు, వ్యావహారిక స్త్రీ శూద్రజాతుఁడు; దేవాలయ శిలాదారు కర్మోపజీవి.
కాసెవోయు. అ. క్రి. వస్త్రమును గోఁచివలె వెనుక చెక్కు. [అచ్చర.
కాహళ. సం. కాళె, వాద్యవిశేషము; ఒక
కాహళము సం. కోడి; సద్దు. విణ. అసభ్యము; ఎండినది; పెద్దది; పెల్లయినది.
కాహళి. సం. కాళె; యువతి.
కాహళిక. సం. కాహళవాద్యము.
కాహళికుఁడు. కాళె ఊఁదువాఁడు.
కాళంజి. తమ్మపడిగము.
కాళయుక్త. సం. ఒక సంవత్సరము.
కాళాంజి. కాళంజి. [షము.
కాళి. సం. పార్వతీదేవి; దేవీమూర్తి విశే
కాళింగము. సం. ఏనుఁగు; నేలగుమ్మడి†.
కాళింగి. సం. పుచ్చ†.
కాళింగుఁడు. సం. ఒక సర్పము.
కాళింది. సం. యమునానది.
కాళిందీభేదనుఁడు. సం. బలరాముఁడు.
కాళిక. సం. కాళి; నలుపు; కాలిక.
కాళియ. కాహళి.
కాళియుఁడు. సం. ఒక సర్పము.

కాళె. కాహళావాద్యము. [భాగము.
కాళ్లకడ. మంచమున పాదములుంచెడి
కాళ్లకడియములు. బ. హంసకములు.
కాళ్లగొలుసులు బ. రశనలు.?
కాళ్ల(గ్రుచ్చు. స. క్రి. తన్ను.
కాళ్లచెనడచు. స క్రి. కాళ్లను(గ్రుమ్ము.
కాళ్లజెట్టి. ఆధారిక, ఒక విమక్రమి.
కాళ్లను(గ్రుమ్ము. స క్రి. తన్ను.
కాళ్లు. బ. పాదములు.

## కి

కి. షష్ఠీవిభక్తియందువచ్చెడిప్రత్యయము.
కింక. కోపము; పశువులను మెడ(కలను చంపెడు ఒక వ్యాధి.
కింకరి. సం. దాసి.
కింకరుడు. సం. బంటు, జీతగాడు.
కింకిణి. సం. గజ్జె, చిఱుగంట.
కింకిరాట(త)ము. సం. కోయిల; చిలుక; పచ్చగోరింట†; అశోకము†.
కింకిరాతుడు. సం. మన్మథుడు.
కింకిరి. కోపము; రోత; అపవాదము.
కింకిరిపడు. అ. క్రి. కోపగిల్లు, కోపించు; రోతపడు.
కింకిరిపాటు. కోపపడుట; రోతపడుట.
కింగిరి. విణ. అల్పము.
కించిత్తు. సం. అవ్య. ఇంచుక.
కించిద్విలగ్న. సం. కొంచెము (సన్నపు) నడుముగల స్త్రీ.
కించిలికము. సం. ఎఱ్ఱ.
కించులుకము. సం. ఎఱ్ఱ; మీదిగాలి.?
కించె. విణ. అల్పుడు.
కింజ. సం. వింటినారిమ్రోత.
కింజల్కము. సం. కేసరము, అకువు.
కింజుడు. సం. విణ. వ్యర్థజన్ముడు.
కింనరుడు. సం. కిన్నరుడు.
కింనరేశుడు. కుబేరుడు.
కింపచానుడు. సం. విణ. లోభి.
కింపచుడు. సం. విణ. లోభి, పిసినిగొట్టు
కింపాకము. సం. కంజీరము†.
కింపాకుడు. సం. విణ. మూఢుడు నిరర్థకుడు.
కింపురుషము. భారతాది వర్షములలో నొకటి.
కింపురుషుడు. సం. కిన్నరుడు.
కింవదంతి. సం. లోకప్రవాదము, జను లాడుకొనుమాట, నానుడి. [రాపులు(గు.
కింశారువు. సం. బాణము; వరిముల్లు;
కింశుక. సం. మోదుగ†.
కింశుకము. సం. మోదుగ†.
కింస్తుఘ్నము సం. ఒక కరణము. [ణము
కిక(కా)కిక. నవ్వుటయందగు ధ్వన్యనుకర
కికి. సం. చాషము, పాలపిట్ట.
కికింకిరి. కోపవికారము; అసహ్యము.
కికీదివి. స. పాలపిట్ట.
కికురించు. స. క్రి. వంచించు; లాలించు.
కికురింత. వంచన; వంచనకరణము; కికు రింపు.
కికురు. వంచన.
కికురువెట్టు. స. క్రి. వంచించు.
కికురుపొడుచు. స. క్రి. వంచించు.
కిక్కసగడ్డి. క్రోవివంటి నడతృణము†.
కిక్కురించు. స. క్రి కికురించు.
కిక్కురింత. కికురింత.
కిక్కురు. కికురు.
కిక్కురువెట్టు. స. క్రి. కికురువెట్టు.
కిక్కెస. మిక్కిలి కదియిక.
కిఖి. సం. కొంక నక్క, చిన్న నక్క.
కిగ్గాడె. విణ. అంబేద. [న్న విశేషము.
కిచిడీ. నానావస్తువులు చేర్చియుండిన చిత్రా
కిచకిచ. పక్షులు మొదలగువాని కూ(త యందగు ధ్వన్యనుకరణము.
కిచేకిచ కొట్టు. అ. క్రి. కూయు.
కిచ్చడి. కిచిడీ. [యందగుధ్వన్యనుకిరణము
కిటకిట. వీణె మొదలగువానిబిరడ త్రిప్పుట
కిటకిటలాడు. అ. క్రి. క్రిక్కిఱియు.
కిటి. సం. పంది, వరాహము.
కిటికి(కీ). గవాక్షము.
కిటికిటీ. గవాక్షము; దిడ్డివాకిలి.
కిటుకు. కపటము; మర్మము.
కిట్టము. సం. మలసామాన్యము.
కిట్టికోల. ఇఱికించుటకుగా నొక తట్టు కొనల(జేర్చి కట్టి చిన్నకోలలతో చేర్ప అప(బడిన సాధనము.

కిట్టిమము. సం. ఉప్పునీళ్లు. [కూలమగు.
కిట్టు. అ. క్రి. స. క్రి. సమీపించు; అను
కిణము. సం. కఠిన వస్తు సంస్పర్శముచేఁ గాని వింటినారి మొదలగువాని ఒరయిక చేఁగాని కాఁచెడి కాయ.
కిణిహి. సం. ఉత్తరేణు†; తెల్లగినియ†.
కిణ్వము. సం. పాపము; సురాబీజము.
కిత. దేవతార్పణమునకై కళ్లమున నొక దెసఁబోసెడు మూఁడుదోసిళ్ల రాశి.
కితవము. సం. ఉమ్మెత్త†.
కితవుఁడు. సం. జూదరి విణ. మోసకాఁడు
కితాబు. హిం. బిరుదు; పుస్తకము.
కిత్త. చేతనాచేతనాగ్ని.
కిత్తనార. చాఁగనార, మోఁటుగడ్డ.
కిత్తలి. ఒక నారింజ, నాదేయి†.
కిత్తి. కిత్త.
కిదుకు. అ. క్రి. బిడ్డలు నిద్రలేచునపుడు ఆలస్యముచే నొకవిధముగా మూలుగు; తల్లిదండ్రులు మొదలగువారిని ఏదేని కావలసి పీడించుచున్నప్పుడు బిడ్డలు ఒకవిధముగా మూలుగు.
కినియు. అ. క్రి. కోపించు; సమీపించు.
కినుక. అలుక, కోపము.
కినుకకాఁడు. విణ. కోపముగలవాఁడు.
కినుకము. కోపము.
కినుపు. కోపము.
కినువడు. అ. క్రి. కోపపడు.
కిన్క. కినుక, కోపము.
కిన్నర. సం. కిన్నెర.
కిన్నరుఁడు. సం. అశ్వముఖమును నరశరీరమునుగల దేవయోని విశేషము.
కిన్నరేశుఁడు. సం. పైఁడిఱేఁడు, కుబేరుఁడు
కిన్నెర. కిన్నర, తంత్రీవాద్య విశేషము.
కిన్వడు. అ. క్రి. కోపపడు.
కిఫాయతు. హిం. లాభము.
కిముఖాబు. హిం. బంగారుపువ్వులతోఁ గాని, వెండి పువ్వులతోఁగాని కుట్టిన విలువగల యొకవిధమైన పట్టుబట్ట.
కిమురు. విణ. అల్పము.
కిమ్మతు. హిం. వెల. [వేయు.
కిమ్మను. మి. అ. క్రి. ఏమియను, ప్రశ్న

కిమ్మీరము. సం. చిత్రవర్ణము; నారదబ్బ†. విణ. చిత్రవర్ణముగలది.
కిమ్మీరుఁడు. సం. ఒక రాక్షసుఁడు.
కియ్య—ము, కియ్యవడి } ఒక అక్షరము క్రింది యకారము.
కిరణము. సం. వెలుఁగు, సూర్యాదికిరణము
కిరము. సం. పంది.
కిరాటుఁడు. సం. కోమటి.?
కిరాతతిక్తము. సం. నేలవేము†.
కిరాతదేశము. సం. 56 దేశములలోనొకటి.
కిరాతము. సం. అల్పతనువు; నేలవేము†.
కిరాతి. సం. కిరాతస్త్రీ; పార్వతి; గంగ; కుంటెనకత్తె.
కిరాతుఁడు. సం. ఎఱుకువాఁడు, నెమలి పింఛము ధరించి అడవియందు తిరిగెడు బోయ.
కిరానా. హిం. చిల్లర దినుసులు.
కిరాయి. హిం. బాడుగ, కూలి.
కిరి. సం. పంది.
కిరీటము. సం. బోమిడికము, కోటీరము, ఒక విధమైన రాజుల తలపాగ.
కిరీటి. సం. అర్జునుఁడు; కోడి.
కిరీటి పచ్చ. మరకతము; నీలమణి.
కిరుదెన. రొండిలోని వాతరోగము.
కిరుసు. ఇరుప్రక్కల వాదరగలిగిన వాటమైన కత్తి.
కిర్మీరము. సం. కిమ్మీరము
కిర్మీరుఁడు. సం. ఒక రాక్షసుఁడు.
కిర్లి. మల్లబంధ విశేషము.
కిఱకిఱ. రథనేమిధ్వని.
కిఱుఁజెప్పు. రూ. కిఱ్ఱుఁజెప్పు. [నము.
కిఱుకు. వంచనము; భ్రమణము, పర్యట
కిఱుకుపాడుచు. అ. క్రి. సంచరించు.
కిఱుదు. విణ. హీనము.
కిఱుపు. స. క్రి. కన్ను గిఱుపు.
కిఱుపులు. బ. కృత్రిమ బాధలు.
కిఱుమెట్లు. బ. కిఱ్ఱుఁజెప్పులు.
కిఱ్ఱులు. బ. త్రిప్పులు. [తిరుగుబాటు.
కిఱ్ఱు. రథాది ధ్వన్యనుకరణ విశేషము;
కిఱ్ఱుఁజెప్పు. కిఱ్ఱుమను చెప్పు, అకుఁజెప్పు.
కిలకిల. హంసాదులయు నవ్వులయు ధ్వన్యనుకరణ విశేషము.

కిలకిలలాడు. అ. క్రి. కిలకిల ధ్వనిచేయు; కిల కిలఁ బలుకు. [చెలఁగు.
కిలకొట్టు. అ. క్రి. శబ్దించు; మ్రోఁగు,
కిలాతము. గుఱ్ఱము.
కిలారము. పసుల మంద, ఘోషము.
కిలారి. గొల్లవాఁడు.
కిలారించు. అ. క్రి. కిల కిల మని మ్రోఁగు.
కిలారుచు / కిలార్చు } అ. క్రి. కిలకిల మని మ్రోఁగు; బొబ్బరించు.
కిలాసము. సం. సోబె, సిబ్బెము. విణ. సిబ్బెము గలది. [గలవాఁడు.
కిలాసి. సం. విణ. సిధ్మలుఁడు, సిబ్బెము
కిలింజకము. సం. చాఁప.
కిలికించితము. సం. రోషాశ్రుహర్ష భీత్యాదుల సంకర రూపమగు స్త్రీల శృంగార చేష్ట. [చెడ్డవిషము.
కిల్బిషము. సం. పాపము; తప్పు; రోగము;
కిల్లాకు / కిల్లాకు చీటి } ఖండపత్రిక, చీటి.
కిల్లు. అ. క్రి. మరణించు.
కిళాకుచీటి. కిల్లాకు చీటి.
కివకివ. ధ్వన్యనుకరణ విశేషము.
కివ్వు. అ. క్రి. మడియు.
కిశోరము. సం. శిశువు; పిల్ల; గుఱ్ఱపుపిల్ల; తైలపర్ణి†. [యౌవనావస్థ కలవాఁడు.
కిశోరుఁడు. సం. సూర్యుఁడు. విణ.
కిష్కువు. సం. జేన; ముంజేయి; మూర.
కిస. నెమలికూఁత.
కిసమస. వ్యథ, దుఃఖము.
కిసరు. అంటు సోఁకుటవలన పసిబిడ్డలకుఁ గలిగెడి దోషము; కోప వికారము.
కిసలము / కిసలయము } సం. పల్లవము, చిగురు.
కిసాలువ. అనుకరణ ధ్వని.
కిసుమిసు. లఘుద్రాక్ష, నిర్బీజ ద్రాక్ష†
కిస్తీ. హిం. పంతు చొప్పున చెల్లించు ద్రవ్యము, వాయిదా.
కిస్తీ బందీ. హిం. వాయిదాల ఏర్పాటు.
కిస్మసు పండుగ. క్రీస్తు జన్మదినోత్సవము.
కిస్మిసు. హిం. కిసుమిసు.

## కీ

కీఁచేట్లాడు. అ. క్రి. కలహించు.
కీఁచు. శుక మూషకాది ధ్వన్యనుకరణ విశేషము; అశ్రావ్య ధ్వని.
కీఁచుకోళ్ళు / కీఁచుబుఱ్ఱ } అడవిమినపుకు కీఁచుకీఁచను నట్లు లోపల విల్లు పెట్టి కుట్టిన బటువు తెలగడ.
కీచుఁఱాయి. ముదురు కుమ్మరపురుగు.
కీఁచులాడు. అ. క్రి. కలహించు.
కీక. గీఁక, గజ ఘీంకారము; కిస.
కీకటము. సం. గుఱ్ఱము; ఒకానొక దేశము. విణ. పిసినివాఁడు; పేదవాఁడు.
కీకసము. సం. ఎముక; నులిపురుగు.
కీచకము. సం. గాలి తాఁకున మ్రోఁగెడి (బొంగు) వెదురు†.
కీచకుఁడు. సం. ఒక రాక్షసుఁడు.
కీటకము. సం. సామాన్యముగా పురుగు. విణ. కఠినము.
కీటమణి. సం. మెఱుఁగుడు పురుగు.
కీటము. సం. పురుగు.
కీటరాజము. సం. కుమ్మర పురుగు.
కీటు. ఉపేక్ష; గోడ పెట్టునపుడొక తడవ యుంచెడు మట్టిపొడవు.
కీడు. అశుభము; తప్పు; దోషము; పాపము; అపకారము, ఆపద. విణ. అధమము; అశుభకరము; దుష్టము.
కీడుపడు. అ. క్రి. తక్కువపడు.
కీడుపాటు. కొఱతపాటు.
కీడుమేళ్ళు. బ. శుభాశుభములు. [కష్టపడు
కీడ్పడు. అ. క్రి. కీడు పడు; కీడు పొందు;
కీడ్పరచు. స. క్రి. పోఁగొట్టు; తిరస్కరించు; కీడుపొందించు.
కీడ్పాటు. కీడుపాటు; కీడు పొందుట.
కీత. విణ. తక్కువ, నికృష్టము.
కీతు. కొబ్బరియాకు చాఁప.
కీదృశము. సం. విణ. ఎటువంటిది. రూ. కీదృక్కు, కీదృక్షము.
కీనాశుఁడు. సం. యముఁడు; రాక్షసుఁడు. విణ. ఒంటి నున్న చోఁ జంపెడు వాఁడు; దున్నెడు వాఁడు; పిసినివాఁడు; పేద వాఁడు.

కీనీడ. పార్శ్వపు నీడ.
కీనీరునేల. అనూపము.
కీరము. సం. చిలుక; ఒక దేశము.
కీరితి. యశము, కీర్తి.
కీర్ణము. సం. విణ. కప్పఁబడినది; చెదరినది; నొప్పింపఁబడినది. [గానము.
కీర్తనము. సం. స్తుతి, పొగడిక, గుణ
కీర్తనీయము. సం. విణ. పొగడఁదగినది.
కీర్తి. సం. యశస్సు; విరివి; తేట; అడుసు, పంకము, బురద. [గుణగానము చేయు.
కీర్తించు. సం. స.క్రి. నుతించు, పొగడు,
కీర్తితము. సం. విణ. పొగడఁబడినది.
కీల. సం. అగ్నిజ్వాల. [గట్టెడు గూటము.
కీలక. సం. ఒక సంవత్సరము; పసులఁ
కీలకము. మర్మము.
కీలము. సం. గసిక, మేకు; చిల్లకోల; మోఁచేయి; లేశము.
కీలరి. విణ. కీలెఱిఁగినవాఁడు.
కీలారము. పసులమంద.
కీలారి. విణ. గొల్లవాఁడు.
కీలాలము. సం. నీళ్లు; నెత్తురు.
కీలి. సం. అగ్ని.
కీలించు. సం. స. క్రి. తగుల్చు.
కీలితము. సం. విణ. కట్టఁబడినది.
కీలు. సులభముగా ఇటునటు వంగుట తిరుగుట మొదలగువానికి అనుకూలముగా నేర్పఱచిన మఱ లేక సూత్రము; వాడకీలు, ప్రాను మొదలగు వానిపై పూసెడు ఒకానొక ద్రవ్యము; మర్మము; ఉపాయము; కపటము.
కీలుకత్తి. మఱకత్తి.
కీలుకాఁడు. సూత్రధారి. [కీలుకోలు ప్రే.
కీలుకొను. అ. క్రి. తగులు; నాటు; ప్రే.
కీలుగంటు. జాఱుగా ముడిచిన వెండ్రుకల దూముడి, ధమ్మిలము, కేశబంధవిశేషము. రూ. కీల్గంటు,
కీలుపడు. అ. క్రి. తగులు.
కీలుగుఱ్ఱము. మఱగుఱ్ఱము.
కీలుబొమ్మ. మఱబొమ్మ.
కీల్బొమ్మ. స్త్రీవిశేషము.
కీవాడ. ఊరుచుట్టునుండు పాటి పొలము,
కీశపర్ణి. సం. ఉత్తరేను†.
కీశము. సం. కోఁతి. విణ. దిసమొలది.
కీశవల్లి. కీశపర్ణి†.
కీశుఁడు. వానరుఁడు.
కీస. అవ్య. కొంచెము. [విణ. అల్పము.
కీసర. తిత్తి మొదలగు వానిలోపలి పొర.

# కు

కు. అప. షష్ఠీవిభక్తియందు వచ్చెడు ప్రత్యయము. సం.భూమి. విణ. వృత్తియందు కుచ్ఛిత శబ్దమునకు వచ్చు ఆదేశము.
కుంక. విధవాస్త్రీ.
కుంకటి. జుట్టు; పిల్లజుట్టు; విణ. ప్రధానము. రూ. కూఁకటి.
కుంకటివేరు. తల్లివేరు.
కుంకట్లు. బ. ముంగురులు.
కుంకి. విధవ.
కుంకుడు. అరిష్టము, ఫేనిలము†.
కుంకుడుఁబురుగు. ఒకానొక యెఱ్ఱపురుగు. [పము; తిలకవిశేషము.
కుంకుమ. సం. రక్తవర్ణముగల చూర్ణవిశే
కుంకుమపువ్వు } మి. ఒకానొక అంగడి
కుంకుమపూవు } దినుసు, అగ్నిశిఖము.
కుంకుమము. సం. కుంకుమ, కుంకుమపువ్వు.
కుంకుమము. చెందిరము, కుంకుమ; కుంకుమపువ్వు.
కుంచిక. సం. కుంచెకోల.
కుంచితము. సం. విణ. వక్రము; వంకరైనది; ముడువఁబడినది.
కుంచితుఁడు. సం. విణ. వంగువాఁడు.
కుంచిని. చిత్తరువులు వ్రాసెడు కలము.
కుంచియ. కుచ్చు, చిత్రము వ్రాసెడు తూలిక; కుచ్చెయిడిన వస్త్రము; సురటి; నేతకాఁడు పడుగు సరిచేసెడిసాధనము; కుంచె.
కుంచె. కూర్చ, కుంచియ; కుంచిక; గోడకు సున్నము గొట్టెడు మట్ట.
కుంచెకాళంజి. సారి; తమ్మపడిగము.
కుంచెకోల. కుంచిక, బీగము తీసెడువంకర యినుపకమ్మి. [నాలుగు మానికలు.
కుంచెము. నాలుగు సేరులు; బల్ల, బళ్ళ,

కుంచే. స. క్రి. క్రుంగఁజేయు, తక్కువ చేయు, ముడుచు.
కుంజము. సం. పొదరిల్లు; ఏనుఁగు కటు మఱలు; ఏనుఁగుకొమ్ము. [గొట్టు†.
కుంజర. సం. ఆరె†; ఏఱుజాజి†; కలి
కుంజరము. సం. ఏనుఁగు; పెంద్రుక; ఉత్తరపదమైనచో శ్రేష్ఠము.
కుంజరాశనము. సం. రావి, అశ్వత్థము†.
కుంజలము. సం. పులియఁబెట్టిక డిగిననీరు
కుంట. కొలను; పల్లము; చెఱువు; కుంట నేల. చూ. అల్పతటాకము.
కుంటదూలము. కడదూలమునకును గోడ కును అడ్డముగా నుంచు చిన్న దూలము.
కుంటనేల. పదియాఱు బారల పొడవు వెడల్పును గల భూమి.
కుంటముక్కు. మత్స్య విశేషము.
కుంటి. విణ. కాలు లేక చేయి విఱిగిన వాఁడు, ఖంజుఁడు;స్వభావమునఁగాలు లేనివాఁడు, పంగువు.
కుంటికత్తె. కుట్టని, కుంటెనకత్తె.
కుంటిగాము. శనిగ్రహము.
కుంటిది. పంగు స్త్రీ, ఖంజ.
కుంటినకత్తియ } కుట్టని, కుట్టిని.
కుంటినకత్తె }
కుంటు. అ. క్రి. కాలు నేలఁ జక్కగా మోఁపక నడచు. విణ. కాలులేనివాఁడు పంగుత్వము.
కుంటుగించే. అ. క్రి. కుంటు.
కుంటుపడు. అ. క్రి. కుంటియగు; చెడు; తగ్గు; తెగు.
కుంటుపిచ్చుక. విణ. కాలు లేని వాఁడు, పిచ్చుకకుంటు, కుంటి. [పడు.
కుంటువడు. అ. క్రి. కుంఠితమగు, కుంటు
కుంటువాఱు. అ. క్రి. బలహీనమగు.
కుంటెన. విటదూతి; అంటుజోడు; విటీ విటుల సంధానము.
కుంటెనకత్తియ. కుంటెనకత్తె.
కుంటెనకత్తె. కుట్టిని, తార్చెడు స్త్రీ, విటీ విటులను కూర్చెడు దూతిక. [దూతి.
కుంటెనకాఁడు. తార్చువాఁడు, విటవిటీ
కుంటెన కుచ్చెలు. బ. ఈడ్పులసెడు కర్ణ భూషా విశేషము.
కుంటెనముడి. తాటాకులపుస్తకముయొక్క దారము నడుమ నుండెడి ముడి.
కుంటెనీఁడు. కుంటెనకాఁడు.
కుంఠనము. సం. మొక్కపోవుట.
కుంఠము. సం. విణ. మొక్కపోయినది; మొద్దుది. [సోమరి.
కుంఠితము. సం. విణ. మూఢుఁడు;
కుండ. మట్టి పాత్రము; మేడమీఁది కల శము; ఇరుసు తగిలించెడు బండి కంటి నడిమి గుబ్బ; వర్తుల భాండము. బ. ఏనుఁగు కుంభస్థలము.
కుండంగి. గోలాంగూలము.
కుండకీటుఁడు. సం. చెడిపోయిన బ్రాహ్మణస్త్రీయొక్క కొడుకు; దాసిని గామించిన వాఁడు. [నికుఁడు.
కుండగోఁకరి. విణ. వంటవాఁడు, ఔద
కుండగోలదాల్పు. సన్న్యాసి.
కుండపోఁగులు. కుండల విశేషము.
కుండమార్పు. స. క్రి. ఒకటి నిచ్చి మఱి యొకటిని పుచ్చుకొను.
కుండమార్పు. ఒకటిని ఇచ్చి మఱియొక టిని పుచ్చుకొనుట, వినిమయము.
కుండము. సం. వంటకుండ; గుడిలోని గంట; నిప్పుల గుండము; తూనిక గుండు; కొండ.
కుండరాశి. సం. కుంభరాశి. [త్రాడు.
కుండలము. సం. పోఁగులు; గుండ్రన;
కుండలి. సం. పాము; ఉప్పి†; తిప్ప తీఁగ†; కుండలాకారనృత్యము,గొండ్లి; నెమలి; వరుణుఁడు. విణ. పోఁగులు గలవాఁడు.
కుండలించే. సం. స. క్రి. సున్నచుట్టు; వలయాకారమగునట్లు వంచు.
కుండలింద్రుఁడు. సం. విణ. ఆదిశేషుఁడు
కుండలీకరణము సం. సున్న చుట్టుట.
కుండలు. ఏనుఁగు కుంభస్థలము.
కుండానుగు. గోరక్షతుంబి†.
కుండి. సం. కమండలువు, గిండి.
కుండినము. సం. కుండిన నగరము.
కుండుఁడు. సం. మగఁడుండ అంకొక మగ నికిఁబుట్టిన కొడుకు.

కుంద్రుణాచి. సం. తెల్లబల్లి.
కుండె. తంతువు.
కుండెవల. జాలభేదము. గోదుమ†.
కుంతము. సం. ఈఁటె; బల్లెము; అడవి
కుంతలము. సం. తలవెండ్రుక; నాఁగలి; యవలం; ఒకానొక దేశము.
కుంతాలము. సం. శ్రీతాళము†.
కుంతి. సం. గొంతి, పాండురాజు పెండ్లాము; రేణుకయనుగంధద్రవ్యము† గుగ్గిలపుఁజెట్టు†.
కుంతీసుత మధ్యముఁడు. అర్జునుఁడు.
కుంథనము. సం. మూలుఁగు.
కుంద. స్తంభము.
కుందకము. అభ్యంతరము; లోపము.
కుందనము. మేలిమి బంగారము.
కుందము. సం. మొల్ల†; ఒకనిధి; బండి కంటి తిరుగుడు.
కుందారము. సం. వరాహము, పంది.
కుంది. ఱాయి మొదలగువానిచేఁ జేయఁబడిన కుదురు, వ్రీహ్యులూఖలము; దీప పాత్ర విశేషము.
కుందికాళ్ళు. బ. బాలక్రీడా విశేషము.
కుందియన. కుంది.
కుందు. తక్కువ; దుఃఖము, విచారము; శోకము; అ. క్రి. క్రుంగు; చచ్చు; తగ్గు; దుఃఖించు; కాలుచక్కగా కెలనానించక నడచు
కుందుఁడు. సం. వెన్నుఁడు; విష్ణువు.
కుందురుకి. సం. అందుగు†.
కుందురువు. సం. కుందురుష్క మనెడి గంధద్రవ్యము.
కుందుతెల్లు. ఇష్వారిక†. [ద్రవ్యము.
కుందురువు. కుందురుష్క మను గంధ
కుందెన. కుంది; ఱోలగుంట; ఒక చెట్టు†
కుందెనకొమ్ము. కుందేటికొమ్ము.
కుందెనగిఱి } బాలక్రీడావిశేషము.
కుందెనగుడి }
కుందెలు. కుందేలు.
కుందేటికొమ్ము. గడ్డిదినుసు†. విణ. శూన్యము, అత్యంతాభావము గలది.
కుందేటివల. కుందేళ్ళనుపట్టువల.

కుందేలు. చెవులపిల్లి, శశము.
కుంపటి. హసంతి, చలికాఁచుకొనుటకై నిప్పులుంచెడుపాత్ర విశేషము.
కుంపినీ. ఇం. కంపెనీ.
కుంపె. తాంబూలపాత్రము.
కుంపెన. కర్ణభూషావిశేషము.
కుంపెరుఁగు. ద్రప్సము, అడుగుపెరుగు.
కుంపిణీ. ఇం. ఆంగ్లేయప్రభుత్వమువారు.
కుంబ. సం. యూపముచుట్టు; మిక్కిలి దుర్గమముగా నిండిన వెలుగు; యజ్ఞ శాలకుఁ జుట్టునిడిన వెలుగు.
కుంభకము. సం. ఊపిరి బిగఁబట్టుట, ప్రాణాయామవిశేషము, పూరకమునకు ద్విగుణసమయము గాలిని కుంభించి కుక్షిలో నిలుపుట.
కుంభకారుఁడు. సం. కుమ్మరవాఁడు.
కుంభజుఁడు. సం. కుంభసంభవుఁడు.
కుంభము. సం. కుండ; ఏనుఁగు కుంభస్థలము; కుంభరాశి; అన్నపురాశి; గుగ్గిలపుఁజెట్టు†.
కుంభవర్షము. సం. కుండలతోఁ గుమ్మరించినట్లు పడు వర్షము.
కుంభసంభవుఁడు. సం. అగస్త్యుఁడు; ద్రోణుఁడు.
కుంభాండము. సం. గుమ్మడి†.
కుంభాండుఁడు. సం. ఒకరాక్షసుఁడు.
కుంభాభిషేకము. సం. క్రొత్తగా గుడికట్టించి అందుప్రతిష్ఠచేసిన దేవతకు కుంభమునందుదకమునుంచి మంత్రపూతమైన ఆ యుదకముచేత చేయించెడుస్నానము.
కుంభారతి. అలఘారతి.
కుంభి. సం. ఏనుఁగు; కలిగొట్టు†; పినగుమ్ముడు†; కుంభిక, తీఁగపాఁచి; వంటకుండ; కుమ్మరవాఁడు; మొసలి.
కుంభించు. సం. స. క్రి. (ఊపిరి) బిగఁబట్టు, కుంభకముచేయు.
కుంభిక. సం. తీఁగపాఁచి, వారిపర్ణి†.
కుంభిని. సం. భూమి, నేల.
కుంభీనసము. సం. పాము; విషజ్వాలలు గ్రక్కెడు పాము.
కుంభీపాకము. సం. ఒక నరకము.

కుంభీరము. సం. మొసలి, నక్రము.
కుంభుఁడు. సం. వైశికుఁడు; కుంభకర్ణుని కొడుకు. [గలవాఁడు.
కుకరుఁడు.సం.విణ. ఈచఁబోయిన చేయి
కుకీలము. సం. పర్వతము.
కుకుందరము. సం. పిఱుదిమీఁది గుంత.
కుకురము. సం. కుక్క. [కుమ్మ.
కుకూలము. సం. వసివాటిన గుంట;
కుక్క. వేపి, కుర్కురము, శునకము. విణ. కుత్సితము.
కుక్కగొడుగు. పుట్టకొక్కు, ఛత్రాకము.
కుక్కతులసి. మి. ఫణిర్జకము†.
కుక్కపాల. వటపత్రిక†.
కుక్కబూరుగు. బూరుగుదినుసు†.
కుక్కముల్లు. వ్యాధివిశేషము.
కుక్కమూతిపిందె. కా పుడిగినప్పుడు కలిగెడు కుక్క మూతివంటి మూతికలపిందె.
కుక్కమేడి. కాకోదుంబరిక†.
కుక్కవాయింట. పూతిమయూరి, శ్వానబర్బర†. రూ. కుక్కవావింట.
కుక్కి. పల్లము; త్రాళ్ళువదలి పల్లము పడిన మంచము. విణ. లోఁతు.
కుక్కిపడు. అ. క్రి. పల్లముపడు.
కుక్కు. వా. స. క్రి. అణఁచు; త్రోయు.
కుక్కుటధ్వజుఁడు. సం. కుమారస్వామి.
కుక్కుటము. సం. కోడి; కపటము; మిణుఁగురులు; కుక్క.
కుక్కుటాండము. సం. కుక్కుటి గ్రుడ్డు.
కుక్కుటి. సం.ఆఁడుకోడి; అసత్యపునడక
కుక్కుడు. పీడనము. [పులుఁగు.
కుక్కుభము. సం. అలజము, గంప
కుక్కురము. సం. గండివనము†; మాచిపత్రి†; కుక్క.
కుక్షి. సం. కడుపు, ఉదరము.
కుక్షింభరి } సం. విణ. పొట్ట పోసి
కుక్షింభరుఁడు } కొనుటతప్ప వేఱేమియు నెఱుఁగనివాఁడు. [బుజపత్రి†.
కుచందనము.సం.ఎఱ్ఱగంధము†;కుష్ఠము†;
కుచము.సం. స్తనము. [చెప్పెడువాఁడు.
కుచరుఁడు. సం. విణ. పరుల దోషమును
కుచేలము. సం. (భూమికి వస్త్రమైనది) సముద్రము.
కుచోద్యములు. బ. కుచ్ఛితప్రపనులు.
కుచ్చలి. ఘూలి†.
కుచ్చలి గంత } సన్న్యాసులు మొదలగు
కుచ్చలి బొంత } వారు ధరియించెడు బొంత.
కుచ్చి. చిన్న గుడిసె.
కుచ్చితము. విణ. కుత్సితము, నాలి.
కుచ్చితుఁడు. విణ. కుజనుఁడు, చెనఁటి.
కుచ్చిళ్లు. బ. బట్ట కట్టుకొనునప్పుడు ముడిచిన బట్టముడుతలు. [కుచ్చు; కూర్చము.
కుచ్చె. గుచ్ఛము; పట్టు మొదలగువాని
కుచ్చెమీను. గండోలము, మిక్కిలి పుచ్ఛముగల చేఁప.
కుచ్చెలమెకము. చమరీ మృగము.
కుచ్చులు. బ. కొనచెవి నంచుకొనెడి భూషణము; స్త్రీలు జడయందుఁ జేర్చి అల్లుకొనెడి భూషణ విశేషము.
కుచ్చె. వస్త్రభంగము, నెఱి; కచ్ఛభేదము; కెంపులతోఁ జేసినపని.
కుచ్చెతీయు.స. క్రి. సానఁబట్టు.
కుచ్చెల. 64 కుంటలకొలఁది, ఎనిమిది గొఱ్ఱులకొలఁది; కంకులతోడి జొన్న చొప్ప మొదలగువాని ప్రోఁగు; కచ్చు.
కుచ్చెలి. కుచ్చలి, ఘూలి †.
కుచ్చెళ్లు. బ. కుచ్చిళ్లు; అంజె.
కుజ. సం. సీత; పార్వతి. [దొంగ.
కుజంభిరుఁడు సం. చంపిదోఁచుకొను
కుజనుఁడు. సం దుర్జనుఁడు.
కుజము. సం. చెట్టు.
కుజవారము.సం.మంగళవారము.[రుఁడు.
కుజుఁడు. సం. అంగారకుడు, నరకాసు
కుటకము. సం. తరికంబము.
కుటజము. సం. కొడిసె, కొండమల్లె†; తుమ్మి†; అగిసె†.
కుటజుఁడు సం.అగస్త్యుఁడు,ద్రోణుఁడు.
కుటన్నటము. సం. కయివడిముస్తె†; దుండిగము†. [విశేషము.
కుటపము. సం. ఇంటితోఁట; ధాన్యమాన
కుటపుఁడు సం. ఒకముని.
కుటము: సం. కుండ;గుడిసె; చెట్టు;ఇల్లు.

కుటరము. సం. పెరుగుచిలికెడుకంబము, తరిగంబము.
కుటరాజము. సం. సరస్వతిజెట్టి.
కుటాక. పక్షివిశేషము.
కుటి. సం. గుడిసె, బుడిపి; నీళ్ళుమోసెడు పనికత్తె; మురయనెడు గంధద్రవ్యము†.
కుటిక. సం. గుడిసె
కుటిల. సం. ఒకయేఱు.
కుటిలము. సం. విణ. వంకరైనది; వక్రస్వభావముగలది.
కుటిలిక. సం. తండసము, మంగలవాఁడు వెండ్రుకలూడఁదీసెడు సాధనము.
కుటీరము. సం. గుడిసె. [మొదలగువారు.
కుటుంబము. సం పెండ్లాము బిడ్డలు
కుటుంబి. సం. కుటుంబపోషకుఁడైన వాఁడు. [స్త్రీ.
కుటుంబిని. సం. కుటుంబపోషకురాలగు
కుటుఁడు. సం. ఱాతిపనివాఁడు.
కుట్టకుఁడు. సం. విణ. ఛేదించువాఁడు.
కుట్టడము. కుట్టుపని.
కుట్టనము. సం. ఛేదనము.
కుట్టని. సం. కుంటెనకత్తె.
కుట్టమితము. సం. దంతపీడనాదులచే కోపభావమభినయించినను లోపల మిక్కిలి ఆనందము పొందునట్టి స్త్రీల యొక్క శృంగారచేష్టావిశేషము.
కుట్టాకము. సం. విణ. ఛేదించునది.
కుట్టాకుఁడు. సం విణ. కుట్టకుఁడు.
కుట్టారము. సం. పర్వతము, కొండ.
కుట్టారుగలు. బ. కోద్రవవిశేషము†.
కుట్టావలు. బ. సర్షపవిశేషము†.
కుట్టిమము. సం. ఱాతి కట్టడపు నేల; దానిమ్మ†.
కుట్టియ. గుదస్థానము.
కుట్టు. కుట్టుడు; కుట్టుకూల; పొయ్యిలో క్రిక్కిఱిసియుండు బూడిద మొదలగునది; కొంచెపు కడుపునొప్పి. స. క్రి. గ్రుచ్చు; ఆకుకుట్టు; గుడ్డలుకుట్టు; కరచు, చీమ తేలు మొదలగునవి కుట్టు; పొడుచు.
కుట్టుకాఁడ. చెవికట్టుకమ్మ.
కుట్టుడాకు. ఫుల్లియ, విస్తర, పత్రపాత్రము.

కుట్టుడు. ఛేదనము; భేదనము; దంశనము; సీవనము, కుట్టుట.
కుట్టుతేలు. క్షుద్రుఁడు; కంటకము.
కుట్టుపోఁగులు. బ. ఉంగరమువంటి పట్టి పోఁగులు.
కుట్టుపోయు. స. క్రి. కుట్టు. [ప్రాణము.
కుట్టుసురు. కొంచెము మిగిలియున్న
కుట్టె. రూ. కుట్టియ
కుట్మలము. సం. నరకవిశేషము; అరవిరి మొగ్గ; కొంచెము వికసించినమొగ్గ.
కుట్ర. వంచన; విణ. కుత్సితము.
కుట్రపువాఁడు. కుట్టుపనిచేయువాఁడు.
కుఠరము. సం కుటరము.
కుఠారము. సం. గొడ్డలి; గండ్రగొడ్డలి.
కుఠేరకము. సం. నల్లగగ్గెర†.
కుడంగము. సం. పొదరిల్లు; బోడతరము†
కుడక. నారికేళపేశము; గంధము మొదలగునవి ఉంచు పాత్ర.
కుడతా. హిం. చొక్కాయి. [షము.
కుడపము. సం. మానిక. ధాన్యమాన విశే
కుడి. కడుపు. విణ. అపసవ్యము, దక్షిణము.
కుడిచేయి. దక్షిణ హస్తము.
కుడితి. బియ్యము జొన్నలు మొదలగువాని కడుగు నీరు.
కుడిది. విణ. అపసవ్యము, దక్షిణము.
కుడినీరు. త్రాగఁదగిన జలము.
కుడిపి. విణ. కురూపి.
కుడిమిగాఁ(వా)డు. పాములవాఁడు.
కుడియడుగుపరువడి. మల్లబంధ విశేషము
కుడిశము. సం. మత్స్య విశేషము.
కుడుంగము. సం. కుడంగము.
కుడుక. తక్కెడ తట్ట.
కుడుచు. స. క్రి. అనుభవించు; భక్షించు, తిను; త్రాగు, పానముచేయు; పండుచున్న మొ॥ చీఁకు. [భుజించువాఁడు.
కుడుపరి. విణ. అనుభవించువాఁడు;
కుడుపు. తిండి, భోజనము; అనుభవము. ప్రే. కుడుపఁజేయు.
కుడుము. మోదకము, భక్ష్య విశేషము.
కుడుముల తిండికాఁడు. వినాయకుఁడు.
కుడ్చు. స. క్రి. రూ. కుడుచు.

కుడ్యకారుఁడు. సం. గోడపెట్టువాఁడు.
కుడ్యమత్స్య. సం. బల్లి.
కుడ్యము. సం. గోడ; పూఁత.
కుణంజము. సం. కొయ్యతోఁటకూర†.
కుణకము. సం. పిల్ల.
కుణపము సం శవము; దుర్గంధము.
కుణి. సం. నందివృక్షము†. విణ. ఈచఁ బోయిన చేయిగలవాఁడు.
కుణుంజము. సం. వనవాస్తుకము, చెంచలికూర†. [నుకరణము.
కుతకుత. సం. ఉడుకుటయందగు ధ్వన్య
కుతపము. సం. మధ్యాహ్నకాలము; దినముయొక్క ఎనిమిదవ భాగము; వాద్యము; మేఁకతుప్పటికంబళి; దర్భ.
కుతపుఁడు. సం. సూర్యుఁడు; తోడఁబుట్టిన దాని కొడుకు.
కుతస్త్యము. సం. విణ. అసభ్యము.
కుతి. శోకము.
కుతిక. రూ. కంఠము.
కుతికంటు. బంగారురేకుతో పట్టెగా మెడకు అంటి యుండునట్లు చేసియుంచు కొనెడి భూషణము.
కుతికలపాటు. విచారము; దుఃఖము, బాధ.
కుతినీ. కుత్తినీ, ఒక దినుసు పట్టుబట్ట.
కుతిల. బాధ.
కుతిలపడు. అ. క్రి. బాధపడు. ప్రే కుతిలపఱచు.
కుతిలపాటు. కుతిలపడుట.
కుతిలపెట్టు. స. క్రి. బాధపెట్టు.
కుతిలము. శోకము.
కుతుక. కంఠము.
కుతుకము. సం. వేడుక, తమి.
కుతుపము. సం. చిన్న (చేతి) సిద్దె.
కుతువు. సం. సిద్దె.
కుతూహలము. సం. అనుభవింపని కోరిక యందలిఆస, తమి, వేడుక; నాయికకు మనోజ్ఞమైన వస్తువును చూచుటయందుఁ గల లోలత్వము. విణ. ప్రశస్తము.
కుత్తిక. కంఠము.
కుత్తికంటు. కంఠభూషావిశేషము.
కుత్తుక. కంఠము. [శివుడు
కుత్తుకగందువాఁడు. నీలకంఠుఁడు,
కుత్తుకబంటి. కంఠముపర్యంతము.
కుత్స. సం. నింద, దూఱు.
కుత్సనము. సం. కుత్స. [స. క్రి. దూఱు.
కుత్సించు సం. అ. క్రి. రోఁతపడు
కుత్సితము. సం విణ. నికృష్టము, కీడ్పడినది
కుత్సితుఁడు సం. విణ. నికృష్టుఁడు.
కుథము. సం. దర్భ; ఏనుఁగు మీఁదఁ బఱచెడి రెట్టకంబళి.
కుదప. పెరుఁగు గడ్డ; నీళ్లుకట్టి అడుసు గా దున్నుట, రొంపిదుక్కి; పెరుఁగుచిదప.
కుదరము. సం. గుజ్జము. [యిల్లడ.
కుదవ. ఉపనిధి, చెప్పక చూపక ఉంచిన
కుదించు. ప్రే. తగ్గించు, సెనగలు మొ॥ కుదియించు.
కుదికిలఁబడు, కుదికిలు } అ. క్రి. ముఖము పైకెత్తుకొని ముడ్డి నేల మోవ గొంతు కూర్చుండు. [మరలు.
కుదియు. అ. క్రి. అడఁగు; క్రుంగు; తగ్గు;
కుదిర. గుజ్జము.
కుదిరిక. అమరిక; నిలుకడ; నెమ్మది; విధము; సౌందర్యము; పొందిక.
కుదిలిక. కుదులుట.
కుదుకనగోలు. వంచన.
కుదుచు. ప్రే. కుదించు.
కుదుప. దుర్మాంసపిండము; వంచన; పెరుఁగుచిదప.
కుదుపు. విణ. పంగువు.
కుదురు. అమరిక; అగసాలెవాని కుంపటి; నిలుకడ; స్థానము; నెమ్మది; కుండ మొదలగునవి కుదిరికగా నిలుచుట కేర్పఱచిన పీఠము; ఆలవాలము, పాదు; ప్రాపు; సౌందర్యము. అ. క్రి. అమరు; అనుకూలమగు; స్థిరమగు; స్వస్థమగు.
కుదురుకొను. అ. క్రి. కదలక నిలుచు. ప్రే. కుదురుకొలుపు.
కుదురుచు. ప్రే. కుదిరించు.
కుదురునిండు. స. క్రి. వ్యాపించవలసిన చోటు అంతయు వ్యాపించు; సంచరించు
కుదురుపడు అ. క్రి. స్థిరపడు; నెలకొను. రూ. కుదుర్పడు.
కుదురుపాటు. కుదురుపడుట.

కుదుర్చు. స. క్రి. కుదురఁజేయు.
కుదులు. అ. క్రి. చలించు.
కుదువ. ఆధి, తాకట్టు, అప్పు నిమిత్తము ఉంచిన ఆస్తి వస్తువు.
కుదువపెట్టు. స. క్రి. తాకట్టుంచు.
కుద్దాలము. సం. త్రవ్వునట్టి ఒకానొక సాధనము, గుద్దలి; కాంచనము †
కుధరము } సం. పు డ మి తా ల ం పు,
కుధ్రము } కొండ.
కునటి. సం. మణిశిల.
కునస్టి. పంగువు.
కునాశకము. సం. తీఁటకసింద†.
కునికిపడు. అ. క్రి. తూఁగిపడు, నిద్రించు. [నిద్రా వికారము.
కునికిపాటు. తూఁగిపడుట, ప్రమీల,
కునుకు. నిద్ర. అ. క్రి తూఁగు, నిద్రించు
కునుస్టు. పంగువు.
కున్న. రూ. కూన.
కున్నఁడు. బాలుఁడు.
కున్నసము. సం. గాజు చిప్ప; పెద్దకుండ.
కున్నారము. సం. గాజు చిప్ప.
కుపసము. అరచట్ట; నిడుచట్ట; అవిక; పాముయొక్క పైతోలు.
కుపితుఁడు. సం. విణ. కోపపడినవాఁడు.
కుపూయము. సం. విణ. కుత్సితము.?
కుప్ప. రాశి; వరి మొదలగువాని ప్రోఁగు.
కుప్పఁగూర. కుప్పవడుట.
కుప్పగూల. కుప్పలగునట్టు. [గింజలు.
కుప్పదుగు. కుప్పలక్రింద నేలను రాలిన
కుప్పతిలు అ. క్రి. కుప్పఁగూర.
కుప్పతెప్పలుగా. కుప్పలు తేలునట్టు.
కుప్పనఁగూర. కుప్పవడుట.
కుప్పము. గ్రామము; చెంబడివారిపల్లె.
కుప్పవడు. అ. క్రి. కుప్పగాఁజేరు.
కుప్పసము. అవిక. రూ. కుపసము.
కుప్పి. అవాక్పుష్పి†; కాచఘుపకము, పింగాణి చిప్ప [ఊపిరిపట్టు.
కుప్పించు. అ. క్రి. దాఁటునప్పుడు
కుప్పిగంతుకొను. అ. క్రి. దుముకు.
కుప్పిగంతులు. బ. బాలక్రీడావిశేషము.
కుప్పియ. మెడనిడుపుగాఁగల కాచపాత్ర విశేషము; తాంబూల పాత్రము; గొడుగు మీఁది గుబ్బ; ఒక దినుసు మట్టి పాత్ర; ఇత్తడి మొదలగు వానితోఁ జేసి యొద్దు కొమ్మునఁ దగిల్చెడు గుబ్బ; స్త్రీ శిరోభూషా విశేషము; గిండి మొదలగువాని మీఁది మూఁత.
కుప్పిలు. బ. బాలక్రీడా విశేషము.
కుప్పె. రూ. కుప్పియ.
కుప్పెంట. హారితమంజరి†.
కుప్పెకోల. బాణ విశేషము, క్షుద్రకము; రూపగంధ†. [తక్కిన లోహము.
కుప్యము. సం. వెండి, బంగారుఁ దక్క
కుబుసము. సర్పకంచుకము; చొక్కాయి; తలుపునకుఁ గ్రిందుమీఁదుల నుంచెడు కూచము.
కుబేరకము. సం. నంది వృక్షము†.
కుబేరాక్షము. సం. బాలక్రీడా విశేషము.
కుబేరాక్షి. సం. కలిగొట్టు†. [దిగధిపతి.
కుబేరుఁడు. సం. పైడిఱేఁడు, ఉత్తర
కుబ్జ. సం. పొట్ల†; కంసుని దాసి.
కుబ్జము. సం. గజవిశేషము; గొజ్జంగి, ఒక చెట్టు†. [లొమ్మువాఁడు.
కుబ్జుఁడు. సం. విణ. మరుగుజ్జు, బొక్క
కుబ్జిక. సం. గొజ్జఁగ†.
కుమందమన్. కుమందాను.
కుమందరులు. ఇం. కమేండెంట్.
కుమారము. సం. చొక్కపు బంగారు; గుజ్జపు పిల్ల; చిలుక; ఉలిమిరి†.
కుమార్గము. సం. విణ. అపమార్గము, చెడుమార్గము.
కుమారి. సం. కూఁతురు; ఎనిమిదేండ్ల చిన్నది; పార్వతి; ఒక యేఱు; జంబూద్వీపము; నల్లపిచ్చుక; కలబంద†; చేమంతి†; పిన్నగోరంట†; విరజాజి†.
కుమారిక. సం. కుమారి, కూఁతురు.
కుమారిత ఆఁడుపడుచు.
కుమారిలు. అ. క్రి. కుములు.
కుమారుఁడు. సం. కొడుకు; బాలుఁడు; కుమారస్వామి; (నాటోక్తియందు) యువరాజు.
కుమి. కునూలవిశేషము.

కుముటు. ఓకరకైకంఠబిలమున ఎత్తువికారము. అ. క్రి. ఓకరకై కంఠబిలమున వికారమెత్తు; కక్కు-వాయి.
కుముద. సం. గుమ్మడు†; జేగు†.
కుముదబాంధవుఁడు. సం. కలువవిందు, చంద్రుఁడు.
కుముదము. సం. తెల్లగలువ, కలువ† ఎఱ్ఱదామర†; నిర్భతిదిగ్గజము; ఒకపాము.
కుముదిక. సం. పిసగుమ్మడు†.
కుముదిని. సం. తెల్లగలువతీఁగ†; కలువలకొలను. [సుఁడు.
కుముదుఁడు. సం. ఒకకోతి; ఒకరాక్షు
కుముద్వంతము. సం. విణ. తెల్లకలువలు తరచుగాఁగలది (ప్రదేశము).
కుముద్వతి. సం. తెల్లకలువ తీఁగ†; కుశుని పెండ్లాము.
కుములు. అ. క్రి. కుమారిలు, లోలోపల దహించు. [కుముకనిప్పు.
కుమ్మ. నీరుపోసిననిప్పు; జ్వాలలేనినిప్పు;
కుమ్మకు. హిం. సహాయము, తోడు.
కుమ్మర. కుండలు చేసి జీవించెడి (కుంభకార) జాతి. విణ. నలుపు.
కుమ్మరగువ్వ. ఒకపక్షి, ఖుంజరీటము.
కుమ్మరచెట్టు. కృష్ణముంజము†
కుమ్మరత. కుమ్మరది, కులాల(స్త్రీ).
కుమ్మరపురుగు. ఒకానొకపురుగు, యామకీటము.
కుమ్మరపొనిక. కుమ్మరచెట్టు†.
కుమ్మరపోలికచెట్టు. ఒకచెట్టు.
కుమ్మరవాఁడు. ఘటనిర్మాణోపజీవి; శిల్పకార (స్త్రీ)వ్యావహారికజాతుఁడు, కులాలుఁడు.
కుమ్మర సారె. కులాల చక్రము.
కుమ్మరసారె చుక్క. విశాఖ నక్షత్రము
కుమ్మరసారెలు. బ. బాలక్రీడా విశేషము.
కుమ్మరి. కుంభకారుఁడు, కుమ్మరవాఁడు.
కుమ్మరించు. ప్రే. కుమ్మరిలఁజేయు.
కుమ్మరింపు. మల్లబంధ విశేషము
కుమ్మరిలు. అ. క్రి. నీళ్ళు మొదలగునవి కుండ మొదలగు వానియందుండిపడు; రాలు.

కుమ్మి. రూ. కుమి.
కుమ్ము. స. క్రి. నలియఁగొట్టు; పొడుచు; పొట్టు నిప్పు; కుకూలము.
కుమ్ముసుద్ది. సంకేత వృత్తాంతము.
కుమ్మె. పోటు.
కుమ్మెలువోవు. అ. క్రి. గాయమగు
కుయ్యాలించు. అ. క్రి. మొఱ విను.
కుయి. మొఱ; రక్షణము.
కుయ్యి కుయి.
కురంగటి. సమీపము
కురంగమము సం. హరిణము, జింక.
కురంగము. సం. జింక; కోఁతి.
కురంటి. సమీపము.
కురంటక. సం. తుమ్మి †
కురంటకము. సం పచ్చ గోరంట†; పచ్చ చేమంతి † పచ్చ పువ్వులములు గోరంట†; పచ్చ పువ్వుల పెద్ద గోరంట†.
కురండము. సం. అండవృద్ధి, బుడ్డ.
కురపము సం. గుట్టమును దోమెడు గొఱపము. [రోగము.
కురము పశువులకుఁ గలిగెడు శీత
కురరము. సం. లకుముకి పిట్ట; నల్లముక్కు ఎఱ్ఱకాళ్ళును గల హంస.
కురరి. సం. గొఱ్ఱె; ఆఁడు లకుముకి.
కురవ. పర్వత మార్గము.
కురవకపులుఁగు. ఖండనము మందపిచ్చుక.
కురవకము. సం. ఎఱ్ఱగోరంట†; ఎఱ్ఱ చేమంతి†. [దసవస్త్రము.
కురాళము. చప్పరము; ఆశ్వాద్యాచ్ఛా
కురాసాని. ఒక దేశము.
కురాసానియోమము. యవాని†.
కురించి. ద్వితీయావిభక్తి ప్రత్యయము.
కురిచీ. హిం. కుర్సీ, కూర్చుండునట్టి యున్నతపీఠవిశేషము.
కురుచిపీఁట. కుర్చీవలెఎత్తుకాళ్లుగలపీఁట.
కురిడి(డీ). లోపలనీరింకిన కొబ్బరి.
కురిమిడి / కురిమిడిగట్టు } నీళ్లునిలుచుటకై మడిచుట్టు చేసినకట్ట, గనిమ.
కురియు. అ. క్రి. వర్షించు. ప్రే. కురియించు.
కురు. ఊరువు, తొడ.

కురుక. నిద్ర.
కురుంబరము. సం. సమూహము.
కురుజీ. చినకంట్లము.
కురుఁజే. మంచె; వామనుఁడు. బ. ఇంటి శ్రేణీలక్రింద నిలువగానుంచెడి దూలము మీఁది గుజ్జులు.
కురుజే. జున్ను; శ్యేనవిశేషము; బాణపు సంచునగ; ఈఁకలురాల్చినపక్షి; స్థిర రథము.
కురుజేతేనె. క్షౌద్రభేదము.
కురుప. గొఱ్ఱెతుప్పటకంబళి సేయుగొల్ల.
కురుపగొఱ్ఱె. దేహమునందు నిడుపు బొచ్చుగల గొఱ్ఱె.
కురుపు. వ్రణము.
కురుబిస్తము. సం. పలమెత్తుబంగారము.
కురుమ. కురుప.
కురుమగొఱ్ఱె. కురుపగొఱ్ఱె.
కురుమవాఁడు. జాబాలుఁడు, గొంగళ్లు నేయువాఁడు.
కురుమాడు. ఇంటిపార్శ్వములకప్పు.
కురుమాపు. కొంచెపుమాపు.
కురుమిండ. క్షుద్ర జలచరము.
కురులు. బ. ముంగురులు; శిరోజములు.
కురువ. కొండమీఁది కాలిత్రోవ.
కురువడాల్లు. అక్కుళ్లు †.
కురువిందము. సం. కెంపు, మాణిక్య విశేషము; అద్దము; ఇంగిలీకము; నిడుముస్తె; వ్రీహి విశేషము.
కురువు. సం. తొడ; ఒక వర్షము; ఒక రాజు; ఒక దేశము; అన్నము.
కురువేరు. ఒక వేరు, హ్రీబేరము, కేశాంబు నామము†.
కురువేరు దంటనారి. మన్మథుని నల్లవది యగు వింటియొక్క నారి.
కురుళము. సం. ముంగురులు.
కుర్కురము. సం. గండివనము†; కుక్క.
కుర్చీ. కురిచీ.
కుర్దనము. సం. క్రీడ. రూ. కూర్దనము.
కుర్పరము. సం. కూర్పరము, మోఁచేయి.
కుర్వాణుఁడు. సం. పనివాఁడు. విణ. చేయువాఁడు.
కుఱంగట } దగ్గఱ.
కుఱఁగట }
కుఱఁగలి. సమీపము.
కుఱకుఱ. విణ. అల్పము.
కుఱినువ్వులు. బ. తిల విశేషము†.
కుఱు. విణ. కుఱుచశబ్దముయొక్క లుప్త రూపము; హ్రస్వత్వము; కొంచెము; త్వర.
కుఱుకు. రాశి, కుప్ప.
కుఱుకొని. త్వరపడి.
కుఱుగడ దండము.
కుఱుచ హ్రస్వస్వరము; తొడిగికొనుసన్న వస్త్ర విశేషము. బ. నాట్యవిశేషము. విణ. హ్రస్వము.
కుఱుచేఁదనము. కుబ్జత్వము; వామనత్వము
కుఱుచేది. పొట్టిది, హ్రస్వము; హ్రస్వ.
కుఱుచేపడు. అ. క్రి. తగ్గు.
కుఱుచేలు. బ. నాట్యభేదము.
కుఱుచేవాఁడు. పొట్టివాఁడు, వామనుఁడు
కుఱుదూలములు. బ. ఇంటిచిప్ప పెణ కలవేసిన దూలములు.
కుఱునువ్వులు. కుఱినువ్వులు†.
కుఱుపు. కురుపు, వ్రణము.
కుఱుమట్టము. వినమ్రము, వినతము.
కుఱుమాడు. ఇంటి మూలకప్పు.
కుఱువు. కురు.
కుఱువేరు. కురువేరు, హ్రీబేరము†.
కుఱ్ఱ. కోడెయైనపోతు; కొడుకు; శిశువు, బాలుఁడు.
కుఱ్ఱఁడు. కొడుకు; బాలుఁడు; బిడ్డఁడు.
కుఱ్ఱి. పాఁడియావు, ధేనువు.
కుఱ్ఱు. అ. క్రి. కూయు, అఱచు.
కులకము. సం. ఒక క్రియతో ముగిసెడు పద్యముల సమూహము; చేఁదుపొట్ల†; కాకితుమ్మిక†; పుట్ట.
కులకాంత. సం. కులస్త్రీ.
కులకుల. ధ్వన్యనుకరణవిశేషము.
కులకుఁడు. సం. విణ. కులశ్రేష్ఠుఁడు.
కులట. సం. అసతి, అంకుటాలు.
కులదీపకుఁడు. సం. విణ. కులము ను ప్రకాశింపఁజేయువాఁడు.

కులదేవత. సం. ఇలువేల్పు, వంశక్రమముగా ఉపాసింపఁబడెడు దేవత రూ. కులదైవతము.
కులనగము. సం. కులపర్వతము.
కులపతి. సం. మునికులమునకు ప్రభువైన వాఁడు; పదివేల శిష్యుల కన్నవస్త్రము లిచ్చి వేదాధ్యయనము చేయించువాఁడు.
కులపర్వతములు. సం.బ. మహేంద్రము మలయము సహ్యము శక్తిమంతము ఋక్షము వింధ్యము పారియాత్రము.
కులపాలిక. సం. తల్లిదండ్రులచే నిచ్చి పెండ్లిచేయఁబడిన స్త్రీ, కులస్త్రీ.
కులబ్రాహ్మణుఁడు. సం. వంశక్రమముగా వచ్చిన పురోహితుఁడు.
కులభ్రష్టులు. సం.బ. కులముచెడినవారు.
కులము. సం. కొలము, బ్రాహ్మణాది వర్ణము; వంశము; తెగ; ఇల్లు; ఊరు; శరీరము; చేదుపొట్ల†.
కులవిద్య. సం. వంశక్రమాగతమగువిద్య.
కులవిప్రుఁడు. సం. వంశక్రమముగా వచ్చిన పురోహితుఁడు.
కులసంభవుఁడు. సం.విణ. మంచివంశము నందుఁబుట్టినవాఁడు.
కులస్త్రీ. సం. కులపాలిక, మానవతి.
కులహీనులు.సం.బ.కులముతక్కువవారు.
కులాయము. సం. పక్షిగూఁడు; చోటు.
కులాలము. సం. పక్షివిశేషము, గంప పులుఁగు.
కులాయి. హిం. తలమీఁదనుంచు టోపీ.
కులాలి. సం. కనుపాలవిత్తులు.
కులాలుఁడు. సం. కుమ్మరవాఁడు.
కులి. సం. వాఁకుడు†; చేయి.
కులిపి. మేఁకలు కాచుకొనువాఁడు.
కులిరు. చల్లఁదనము.
కులిరుగొను. అ.క్రి. శీతలమగు;చల్లఁబడు.
కులిశము. సం. వజ్రాయుధము; మత్స్య విశేషము. [బుట్టినవాఁడు.
కులీనుఁడు. సం. విణ. మంచికులమునఁ
కులుకు. విలాసము; శృంగారపు కదలిక; వణఁకుట.అ.క్రి. శృంగారముగకదులు. స. క్రి. పూయు, చందనము మొదలగు దానిని అలఁదు; పోయు; వెదచల్లు; వేయు. ప్రే. కదిలించు.
కులుకులాఁడి. కులుకుగలస్త్రీ; స్త్రీ.
కులుప. శోఫ, ఉబ్బడ.
కులుపురాయి. రాజావర్తపురాయి.
కుల్మాషము. సం. పులియఁబెట్టిన కడుగు నీరు; గుగ్గిళ్ళు; గోధుమవిశేషము.
కుల్య. సం. కాలువ; నీళ్లుపోయెడిత్రోవి; తిప్పతీఁగ†.
కుల్యము. సం. ఎముక; తొలిచినకొండ దోన; మాంసము; మానవిశేషము. విణ. మంచికులమునఁబుట్టినది; కులమునకు హితమైనది. [మనుష్యుఁడు.
కుల్యుఁడు. సం. గౌరవింపదగిన
కువ. రూ. కువ్వ. [రేఁగు†; రేఁగుఁబండు.
కువలము. సం. కలువ†; ముత్యము;
కువలయము. సం.కలువ†;భూవలయము.
కువలాయికము. సం.హంసజాతివిశేషము
కువాడము. కపటము. [పలుకువాఁడు.
కువాదుఁడు. సం. విణ. పరులదోషమును
కువాళము. కపటము; వాహనము మొదలగు వానిగవుసెన.
కువిందుఁడు. సం. సాలెవాఁడు.
కువేణి. సం. చేఁపలఁబట్టి వేయుబుట్ట.
కువ్వ. కుప్ప, రాశి.
కువ్వాడము. కాపట్యము.
కుశ. సం. త్రాడు; దర్భ†.
కుశము. సం. నీళ్లు; ఒక ద్వీపము; పలుపు; దర్భ†.
కుశలము. సం. శుభము, క్షేమము; తృప్తి; పుణ్యము. విణ. నేర్పరి. [గలవాఁడు.
కుశలుఁడు. సం. విణ. నేర్పరి; కుశలము
కుశాగ్రీయము. సం. విణ. కుశాగ్రము వంటిది.
కుశాలు. హిం. సంతోషము. [వస్తువు.
కుశి. సం. కఱ్ఱు; ఇనుముతోఁ జేసిన
కుశికము. సం. అయోవికారము.
కుశికుఁడు. సం. విశ్వామిత్రుని తండ్రి.
కుశీలవుఁడు. సం. ఆటపాటలచే జీవించు నట్టువుఁడు; నానాదేశ సంచారకుఁడైన బట్టువాఁడు; వాల్మీకి.

కుశుఁడు. సం. రాముని పెద్దకొడుకు.
విణ. పాపము చేసినవాఁడు; మదించిన
వాఁడు.
కుశేశయము. సం. పద్మము.
కుషీ. హిం. సంతోషము. రూ. ఖుషీ.
కుష్ఠము. సం. వ్యాధివిశేషము, పులుము;
చెంగల్వకోష్టు†; విషభేదము.
కుసి. కూచము; గడియందుఁ జొప్పించు
టకుఁగాను సన్నగాఁజెక్కిన మంచపు
పట్టె మొదలగువాని చివర; దుఃఖము.
కుసిగుంపులు. బ. శ్రమము.
కుసిలించు. అ. క్రి. అతృప్తిచే దుఃఖించు
కుసిలింత. అతృప్తిచే దుఃఖించుట.
కుసిని. వంటయిల్లు.
కుసీదము. సం. వడ్డికిచ్చి జీవనము జేయుట.
కుసీదకుఁడు. సం. విణ. వడ్డికిచ్చి జీవనము
చేయు వాఁడు.
కుసుంబా. కుసుంభపుష్పము.
కుసుంభము. సం. కుసుమపువ్వు; బంగారు;
కమండలువు.
కుసుంభరాగము. సం. బయటికిమాత్రము
విశేషముగాఁ గనఁబడి లోపల బొత్తిగా
లేని అనురాగము.
కుసుమ. ఒక చెట్టు†; సస్యవిశేషము†;
కుసుంభపుష్పము; కుసుంభవర్ణము; ఆర్తవము; పుండునందలి మొలక. బ. శాలి
ధాన్యవిశేషము. [కొప్పు.
కుసుమగర్భము. సం. పువ్వులు ముడిచిన
కుసుమపూవు. కుసుంబా. [విశేషము.
కుసుమపూరాజనాలు. బ. శాలి ధాన్య
కుసుమము. కుసుంభవర్ణము. బ. శాలి
ధాన్యవిశేషము సం. పుష్పము; కంటి
తెవులు; స్త్రీరజస్సు; పండు.
కుసుమేషువు. సం. మన్మథుఁడు.
కుసుమాంజనము. సం. పుష్పాంజనము.
కుసుమాపచయము. సం. పువ్వులు
కోయుట సంగ్రహించుట.
కుసులి. వామనుఁడు.
కుసులు. కొయ్యల నొకదానితో నొకటి
జేర్చియుండు సతుకులు. అ. క్రి. కుసిలించు
కుసూలము. సం. ధాన్యముంచెడు గరిసె.
కుసృతి. సం. నికృతి, కుత్సితభావము.
కుస్టు. కుష్ఠము.
కుస్తరించు. స. క్రి. ఊఱడించు; సమాధానపఱచు; సవరించు; చఱచు.
కుస్తుంబరి } సం. ధాన్యకము,
కుస్తుంబురువు } కొత్తిమిరి†.
కుస్తుభము. సం. సముద్రము.
కుస్తుభుఁడు. సం. విష్ణువు.
కుహకము. సం. వంచన.
కుహకుఁడు. సం. వంచకుఁడు.
కుహాఖుఁడు. సం జారుఁడు, అంకుమగఁడు
కుహన. సం. అర్థాపేక్షచేతనగుకపటచర్య
కుహనము. సం. ఎలుక; పాము. విణ.
ఈర్ష్యగలది.
కుహరము. సం. గుహ; రంధ్రము; ఒకపాము
కుహళ. సం. కాళెవాద్యము.
కుహళి. సం. పోఁకపొత్తి.
కుహాళ. సం. కాళెవాద్యము.
కుహువు. సం. చంద్రకళ కానరాని అమావాస్య; కోకిలధ్వని.
కుహూరటము. సం. కోయిల.
కుహేళిక. సం. ధూమిక, మూడమంచు.
కుళాయి. కుళ్లాయి, కుళాయి.
కుళము కొలను; చెఱువు.
కుళింగము. సం. అడవిపిచ్చుక; కాకి.
కుళీరము. సం. పీత, ఎండ్రకాయ.
కుళుత్థము. సం. ఉలవలు†.
కుళుత్థిక. సం. కనుపాలవిత్తులు.
కుళుపు. ఉంగరమునకుఁ బొదిగెడువిశాలమగు మణివిశేషము.
కుళ్లా—యి. కుళ్లాయి.
కుళ్లాయి. పటరచితమకుటము.
కుళ్లు. అ. క్రి. దుఃఖించు; అవియు; కాల
మతిక్రమించుటచే ఫలాదులు నలుపు
పాఱి చెడు. రూ. క్రుళ్లు.
కుళ్లుపోతు. విణ. క్రుళ్లగించు స్వభావము
గలవాఁడు. రూ. క్రుళ్లుపోతు.

## కూ

కూ. అవ్య. పిలువఁగా పామరజనులెచ్చరించుకొనుటయందు వచ్చును.
కూఁక. అఱపు.

కూఁకట. మయూరశిఖ. [సము
కూఁకటి. జుట్టు; పిల్లజుట్టు. విణ. ప్రథా
కూఁకటికువ్వే పక్షివిశేషము.
కూఁకటిగుడ్డంగి. దాత్యూహము.
కూఁకటిగువ్వ. ఏటిరింత.
కూఁకటిమువ్వ ధూమ్యాటము.
కూఁకటిమూఁగ. కళింగము, ధూమ్యాటము, ఒకపక్షి.
కూఁకటివేరు. కుంకటి వేరు.
కూఁకరించు. అ. క్రి. కూఁకలు వేయు.
కూఁకలు. అతిశయవాగ్ధ్వనులు.
కూఁకవేటులు. బ పాములలో నొకభేదము.
కూఁకు. అ. క్రి. అస్తమించు.
కూఁకురుగుండఁగి } పక్షివిశేషము,
కూఁకురుగుండె } దాత్యూహము.
కూఁత. కూయుట; మృగాదిధ్వని; సరిగమాది స్వరము.
కూఁతకైదువు. శంఖము.
కూఁతనేల. కోసునేల, క్రోశము. రూ. కూఁతపట్టు కూఁతవేటు.
కూఁతు. కూఁతురు, పుత్రిక.
కూఁతు(రి)కూఁతురు. దౌహిత్రి.
కూఁతు(రి)కొడుకు. దౌహిత్రుఁడు.
కూఁతుబిడ్డ. దేవగంగ.
కూఁతురిబిడ్డ. ఆకాశగంగ; దౌహిత్రి.
కూఁతురు. పుత్రిక.
కూఁతురుబుడమ. ఏలావాలుకము†.
కూకిపలుకు. మణితము, రతికాలమునందలి గళరవము.
కూకిలు. బ. పారావతములు.
కూకు. పాలవిరుగుడు.
కూకుదుఁడు. సం. విణ. వరునిసత్కరించి యలంకృతురాలగు కూఁతునిచ్చువాఁడు.
కూకువు. సం. ఎనిమిదేండ్లకన్య.
కూచి. విణ యుద్ధయాత్రకు సైనికులు హెచ్చరికపడుటకై యుద్ధవాద్యములను మ్రోయించుట; హాఁడి.
కూచిమారుఁడు. సం. పురుషజాతులు నాల్గింటిలో నొకజాతివాఁడు.
కూచిసియు. హిం. దండయాత్రవెడలు.
కూచేము. గూటము; స్తంభము; పట్టికాగ్రము.

కూజో. హిం. మృత్పాత్రవిశేషము.
కూటకము. సం. గొడగ, ఏఁడికోలలేని నాఁగలి; వెండ్రుకల కొప్పు.
కూటపాకలము. సం. ఏనుఁగులకు వచ్చెడి ఒక జ్వరము.
కూటమి. కూడిక; రతి, సంగమము.
కూటము. చావడి; కొలువుకూటము. సం. దాగలి; పురద్వారము; అమ్మ; ఆకాశము మొదలగునది; సమ్మెట; మాయ; కపటము; కట్టు; పర్వతశిఖరము; నాగడము; దుఃఖము; రాశి, ప్రోగు; బొంకు; బోను; ఇల్లు; విరిగిన కొమ్ములుగల ఎద్దు; మండపము.
కూటశాల్మలి. సం. కొండబూరుగు†.
కూటస్థము. సం. అక్షరము, మూలప్రకృతి విణ. ఎల్లకాలము నొకరూపమై యుండునది, ఆత్మ, బ్రహ్మము.
కూటస్థుఁడు సం. మూలపురుషుఁడు.?
కూటాకము. సం. సమ్మెట.
కూటాగారము. సం మేడమీఁది ఇల్లు.
కూటాము. రూ. కూటము.
కూటికుండ. కుండము, అన్నము వండుకొనెడి కుండ.
కూటినీళ్లు. బ పుల్లనీళ్లు, పులిగంజి.
కూటిపేద. విణ. తిండిలేనిది; తిండిలేని వాఁడు.
కూటిముత్యము. మనుష్యులచే జేయఁబడునట్టి ఒక దిగుసు ముత్యము.
కూటిసారా. అన్నము చేతఁజేసిన సారా.
కూటు. ధాన్యముంచుటకు వెంటితో నేయఁగచెడు గిడిసె. [కాసీఁడు.
కూటుఁడు. సం. త్రాయి తోలుచువాఁడు,
కూటువ. గుంపు; ప్రోగు, రాశి; చతురంగ బలముగల సేన.
కూటువమూఁక. ప్రోత్సాహపఱచి అక్కడక్కడ వెదకి తెచ్చిన పిఱికి బలము.
కూటువు. గుంపు; ప్రోగు
కూడ. ద్ర. సహితమను నర్థమునుఁ దెలుపునది; సహార్థకము.
కూడఁబడు అ క్రి. చేరు, సమీపించు.
కూడఁబెట్టు. స. క్రి. చేర్చు; తార్చు.

కూడముట్టు. స.క్రి. తెఱుముకొనిపోవు.
కూడలి. రెంటిమూటి కూడిక గలది.
కూడలిదారి. రెండు మూడు త్రోవలు గలసిన దారి.
కూడలిఱాయి. ఎల్లరాయి.
కూడలివాయి. రెండుపంచలు చేరెడుమూల నేర్పరచిన నీటిదారి.
కూడిక. చేరిక, సంయోగము.
కూడు. అన్నము అ.క్రి. తగు. స.క్రి. పొందు, సంగమించు; గుణించు; లెక్కకలియుఁగూడు.
కూడుదల. లాభము.
కూడుసీరలు. బ. అన్నవస్త్రములు.
కూణి. సం.విణ. రూ. కుణి
కూన. శిశువు, పిల్ల, బిడ్డ, కందు; కుక్కపిల్ల; పిల్లిపిల్ల.
కూనగుంత. మీటు మొదలుఅనెడిపల్లము.
కూని. హిం. నరహత్య,ఖూని.
కూపకము. సం. ఓడకంబము; పిరిదిమీఁది గుంత; దొరువు, చెలమ; చేతిసిద్దె.
కూపము. సం. నుయ్యి; చెలమ; ఓడ కంబము; పిరిదిమీఁది గుంత.
కూపారము. సం. సముద్రము.
కూపె. సం. కుప్పె; గాజుకుప్పె.
కూపెట్టు. అ.క్రి. అఱచు; మొఱయిడు, రోదించు. [విణ. మనోజ్ఞము.
కూబరము. సం. బండి (రథము) నొగ
కూబరి. సం. రథము.
కూయి. మొఱ; రక్షణము.
కూయు. అ.క్రి. మొఱపెట్టు;మృగాదులు ధ్వనిచేయు. [వంకాయ మొం†.
కూర వ్యంజనము; శాకము, తోటకూర,
కూరటం. పొరలుట.
కూరపసుపు. కూరలోచేర్చెడు పసుపు.
కూరము. సం. అన్నము, వంటకము.
కూరముక్కు. మత్స్యభేదము.
కూరాడు. కాఁచినకలి.
కూరిచి. అవ్య. ఈ ద్దేశార్థమునందు స్వతీయావిభక్తితో చేరివచ్చునది. రూ.కూర్చి.
కూరిమి. చెలిమి, ప్రేమ.
కూరు. అ.క్రి. కలుగు; దుస్సిపోవు,స.క్రి. పొందు; గొయ్యి మొ॥ కూడు.
కూరుకు. నిద్ర. అ.క్రి. నిద్రించు.
కూరుకుపాటు. నిద్ర.
కూరుకువాఁడు. నిద్రాళువు. [ప్పించు.
కూరుకొను. అ.క్రి. చొచ్చు. ప్రే. చొ
కూరుచు. అ.క్రి. ప్రియపడు. ప్రే.కూడఁబెట్టు.
కూరుచుండు. అ.క్రి. ఆసీనుఁడగు.
కూరుపరి విణ.కూర్పరి,కూర్చునట్టివాడు.
కూరుపు. కూర్పు, ఘటన.
కూరుమొన. యుద్ధసన్నద్ధసేన.
కూర్కు. నిద్ర. అ.క్రి. నిద్రించు.
కూర్కుపాటు. కూర్కు.
కూర్కువాఁడు. కూరుకువాఁడు.
కూర్కొను. కూరుకొను.
కూర్చ. సం.విణ. పెరిగిన గడ్డముమీసము.
కూర్చము. సం. పట్టుకుచ్చు మొం; దర్భపిడికిలి; కనుబొమలనడుము; పెరిగినమీసగడ్డములు; మెచ్చు; మోసము.
కూర్చశీర్షము. సం. జీవకమనెడి గంధద్రవ్యము†.
కూర్చి. తూలిక; కూరిచి.
కూర్చిక. సం. కుంచెకోల;జున్ను;వాగిర; చిత్తరువువ్రాసెడుతూలిక; బొమముడి; మొగ్గ; సూది.
కూర్చినవాఁడు. విణ. గ్రథనమొనర్చినవాఁడు; ఇష్టుఁడైనవాఁడు.
కూర్చు. స.క్రి. యోజించు, రెంటినొక్కటిగాకూర్చు; పొందించు.
కూర్చుండఁబడు. అ.క్రి. కూరుచుండు.
కూర్చుండు. అ.క్రి. ఆసీనుఁడగు.
కూర్చువాఁడు. ఇష్టుఁడైనవాఁడు.
కూర్నిసాతు. హిం. వందనము; సలాము.
కూర్పరము. సం. మోఁచేయి;మోఁకాలు.
కూర్పరి. కూరుపరి; సంధానము చేయునది; మార్వ్యమధ్యతంతుబంధము, అరితోసి.
కూర్పాసకము. సం. అరచట్ట; రవిక.
కూర్పు. గ్రథనము, కూరుపు.
కూర్మము. సం. తాఁబేలు; ఒకయుపవాయువు.
కూర్మి. కూరిమి.
కూలంకష. సం. ఏఱు, నది.

కూలంకషము. సం. సముద్రము.
కూలఁబడు. అ. క్రి. పడు; చదికిలఁబడు.
కూలము. సం. దరి; గుంట; మట్టి మొదలగువానిదిబ్బ; మూఁక వెనుక.
కూలముద్రుజము సం. విణ. ఒడ్డును భేదించునది.
కూలి. కూలివానికిచ్చెడి ద్రవ్యము; వేతనము; పన్ను, భాగధేయము
కూలియాలు. వెలయాలు, వేశ్య.
కూలివాఁడు. వైతనికుఁడు.
కూలు. లవిత్రమూలము. అ. క్రి. చచ్చు; ఇల్లుచెట్టు మొ॥ పడు.
కూలుచు. స. క్రి. చంపు ద్రే. పడఁజేయు. రూ. కూల్చు. [రూపము.
కూలు రూ పు. అమాంతముగా పడినట్టి
కూశ్మాండము. సం. గుమ్మడి.
కూష్మాండము. సం. గుమ్మడి†; పిశాచభేదము; భ్రూణవిశేషము.
కూసముఱపిక బ. తలంపుక్రింద మీఁదను ఉండునవి; స్తంభములకమర్చి బోదెలుం తగిలించునవి. [కుత్సితస్త్రీ; కట్టిడి.
కూళ. విణ. కుత్సితుఁడు; అవివేకి;
కూళతనము. కుచ్చితము.
కూళుఁడు. కుత్సితుఁడు; మూఢుఁడు.
కూళ్ళపిడలు. పిండివంటలలోని భేదము.

## కృ

కృకణము. సం. పక్షివిశేషము, కక్కెర.
కృకము. సం. కంఠనాళము, బొండుగు; ముచ్చిలిగుంటమీఁది బుడిపి.
కృకరము సం. ఒక యుపవాయువు; కక్కెర.
కృకలాసము. సం. ఊసరవెల్లి; తొండ.
కృకవాకువు. సం. ఊసరవెల్లి, మయిలుచాయతొండ; కోడి; నెమలి.
కృకాటిక సం. పెడతల; ముచ్చిలిగుంట.
కృచ్ఛ్రము. సం. కష్టము; పాపము; సాంతపనాది వ్రతము.
కృతకము. సం. విణ. కృత్రిమము.
కృతకర్ముఁడు. సం. విణ. నేర్పరి.
కృతకాద్రి. సం. క్రీడించుటకొఱకు నేర్పఱుపఁబడిన పర్వతము, చేఁతగట్టు.
కృతకృత్యుఁడు. సం. విణ. కృతార్థుఁడు.
కృతఘ్నత. సం. చేసినమేలు మఱచిపోవుట.
కృతఘ్నుఁడు సం. విణ. చేసినమేలు మఱచినవాఁడు. [పోకుండుట.
కృతజ్ఞత సం. చేసినమేలు మఱచి
కృతజ్ఞము. సం. శ్వానము, కుక్క.
కృతజ్ఞుఁడు. సం. విణ. ఒరులుచేసినమేలు మఱవనివాఁడు.
కృతపడు మి. స. క్రి. కడచు; విడఁబడు.
కృతపుంఖుఁడు సం. విణ. గుఱితప్పక వేయువాఁడు.
కృతమాలకము. సం. నల్లగూబ.
కృతమాలము. సం. రేల†.
కృతము. సం. ఉపకారము; కృతయుగము; నాలుగంకెగలపాచిక. క్రి.విణ. పెల్లు విణ. చేయఁబడినది; నొప్పింపఁబడినది.
కృతముఖుఁడు. స. విణ. నేర్పరి.
కృతలక్షణుఁడు. సం. విణ. గుణములచేతఁ బ్రసిద్ధి చెందినవాఁడు.
కృతసాపత్నిక. సం. మొదటి పెండ్లాము.
కృతహస్తుఁడు. సం. విణ. గురితప్పక యేయువాఁడు; నేర్పరి.
కృతాంతము. సం. అశుభకర్మము; భాగ్యము; సిద్ధాంతము.
కృతాంతుఁడు. సం. యముఁడు.
కృతార్థుఁడు. సం. విణ. నెరవేరినపనిగలవాఁడు, ధన్యుఁడు.
కృతి. సం. చేయుట; ప్రబంధము, కావ్యము, గ్రంథము; ఒకఛందస్సు; నొప్పించుట; పండితుఁడు. విణ కృతార్థుఁడు; నేర్పరి.
కృతుఁడు. సం. కడుపుకూటివాఁడు.
కృత్తము. సం. విణ. ఛేదింపఁబడినది; నరకఁబడినది; త్రుంచఁబడినది.
కృత్తి సం. ఒక దేవత; చర్మము; చెట్టుపైపట్ట; బుజపత్రి†.
కృత్తిక. సం. ఒక నక్షత్రము.

కృత్తివాసుఁడు సం. శివుడు.
కృత్య. సం. క్రియ; చేయుట; ముగ్గు; ఒక దేవత.
కృత్యము. సం. పని. విణ. ధనాదులచే భేదింపఁదగినది.
కృత్రిమధూపకము సం. అనేక పరిమళ వస్తువులంకూర్చి చేసిన ధూపము.
కృత్రిమము. సం. ఉప్పుదినుసు; చిల్లమడ్డి. విణ. స్వతఃపుట్టినదిగాక ఒకరిచేఁజేయఁబడినది.
కృత్స్నము సం. కడుపు; నీళ్ళు. విణ. అంతయు, సమస్తము.
కృప. సం. కనికరము, దయ.
కృపణుఁడు. సం విణ. లోభి; కుచ్చితుఁడు; అజ్ఞాని.
కృపాణము. సం. కరవాలము, కత్తి.
కృపాణి. సం. కత్తి; కత్తెర.
కృపాళువు(ఁడు). సం. విణ. దయగలవాడు.
కృపీటము. సం. కడుపు; జలము.
కృపీటయోని. సం. అగ్ని.
కృపుఁడు. సం. ద్రోణుని మఱఁది.
కృమి సం. పురుగు; చెట్టుమీఁది నల్ల పురుగు; లక్క.
కృవి. సం. సాలెవాఁడు.
కృశము. సం. విణ. బక్క; సన్నము.
కృశానువు (ఁడు). సం. అగ్నిహోత్రుఁడు
కృశానురేతస్సుఁడు. సం. శివుఁడు.
కృశాశ్వి. సం. నటుఁడు, నట్టువుఁడు.
కృశించు. సం. అ. క్రి. చిక్కు, బక్కటిల్లు; సన్నగిల్లు.
కృశుఁడు. సం. విణ. చిక్కినవాఁడు.
కృషకము. సం కఱ్ఱు.
కృషకుఁడు. సం. కృషికుఁడు.
కృషాణుఁడు. సం. సేద్యకాఁడు.
కృషి. సం. సేద్యము, దున్ని పండించుట
కృషికము. సం. కఱ్ఱు.
కృషికుఁడు సం. సేద్యకాఁడు.
కృషీవలుఁడు సం. దున్నుకొని జీవించువాఁడు.
కృష్టము. సం. విణ. ఒకసారి దున్నఁబడినది (నేల); ఈడువఁబడినది.
కృష్టి. సం. దుక్కి; చదువరి.
కృష్ణ. సం. కృష్ణానది; ద్రౌపది; ద్రాక్ష†; నీలి†; పిప్పలి†.
కృష్ణకర్ముఁడు. సం. విణ. దురాచారుఁడు.



కృష్ణపాకఫలము. సం. కలివె†.
కృష్ణపాకి. సం. నల్లగురిగింజ†.?
కృష్ణఫల. సం. కారుగచ్చ†.
కృష్ణభేరి. సం. కటుకరోహిణి†.
కృష్ణము. సం. ఇనుము; మిరియము†; నలుపు; కాకి; కోకిల; దున్న; అశుభకర్మ; కృష్ణపక్షము; నల్లని కడుపుగల మండపిచ్చుక. విణ. నల్లనిది.
కృష్ణల. సం. గురిజె.
కృష్ణలోహితము. సం. నలుపుమించఁగలిసినయెఱుపు. విణ. అట్టివన్నెగలది.
కృష్ణవర్త్మ. సం. అగ్ని; దురాచారుఁడు; రాహువు.
కృష్ణవల్లి. సం. కమ్మరాఁకుతీఁగ, నల్లతీఁగ†.
కృష్ణవృంత. సం. కలిగొట్టు†; కారుమినుము†.
కృష్ణసర్పము. సం. నల్లత్రాఁచు.
కృష్ణసారకము. సం. నల్లవెదురు†,
కృష్ణసా(శా)రము. సం. ఇఱ్ఱి; ఇరుగుడు†; జెముడు†.
కృష్ణిక. సం. తవిఁదలు†; నల్లావలు†; నల్లపిచ్చుక.
కృష్ణుఁడు. సం. విష్ణువు; అర్జునుఁడు; వ్యాసుఁడు.
కృసరము. సం. పులగము; శ్రాద్ధమున నిమంత్రితులకుఁ అభ్యంజన కాలమందు కలిపియిచ్చెడు నువ్వులు బెల్లము.

## కౢ

కౢప్తము. సం. విణ. ఏర్పాటు చేయఁబడినది; రచితమైనది; నిర్మితమైనది; కూడుకొనినది; ఛేదింపఁబడినది.
కౢప్తి. సం. ఏర్పాటు; కల్పనము.

## కె

కె. విణ. కెంపు శబ్దము యొక్క లుప్తరూపము. (దీనికి పరుషసరళములు పరమగునప్పుడు) నుమాగమమును తదితరములు పరమగునప్పుడు మీఁదిదానికి ద్విత్వమును వచ్చును; ఒక స్త్రీ ప్రత్యయము (ఆకె, ఈకె అని).

కెం. రక్తవర్ణము.
కెంగట. తాళబీజము.
కెంజాయ. రక్తవర్ణము.
కెంజిగురు. ఎఱ్ఱనిచిగురు.
కెందమ్మి } ఎఱ్ఱదామర, రక్తోత్పలము†.
కెందామర }
కెందొగ. ఎఱ్ఱగలువ, రక్తోత్పలము†.
కెంపు. పద్మరాగమణి; ఎఱుపు; అధర మందలి దంతక్షతము. విణ. ఎఱ్ఱనిది.
కెంపుకనులపులుఁగు } కోయిల.
కెంపుకంటి }
కెంపుగాతు } అంగారకుఁడు, కుజ
కెంపుగాము } గ్రహము.
కెంపురా. అరుణుఁడు, సూర్యుఁడు.
కెంపునవతు. స్వాతినక్షత్రము.
కెడ. పార్శ్వము. రూ. కెడను.
కెడపు. ప్రే. పడఁజేయు; త్రోయు; చంపు.
కెడయిక. పడుట; చావు. [ఉద్దేశించు.
కెడయు. అ. క్రి. చచ్చు; పడు; భేదమగు;
కెడవు. పాటు, పతనము.
కెమ్మోవి. అధరము, పెదవి.
కెమ్మోవిగురి. కప్పు, దంతక్షతము.
కెరకొట్టు. కలకలకూయు.
కెరలియాడు. అ. క్రి. చెలరేఁగు.
కెరలు. అ. క్రి. కోపించు; కూయు; అతిశయించు; విజృంభించు; సంభ్రమించు.
కెరలుచు ప్రే. కెరలఁజేయు.
కెరలువొడుచు. అ. క్రి. వర్ధిల్లు; విజృంభించు.
కెర్జంబు. పక్షిభేదము.
కెర్లు. తాపము.
కెర్లి. మల్లయుద్ధవిన్నాణము.
కెలఁకు. దిక్కు; పార్శ్వము. స. క్రి. కలపెట్టు; పెల్లగించు.
కెలన. సమీపము.
కెలను. పార్శ్వము.
కెలయు. అ. క్రి. విజృంభించు.
కెలవు. అనురాగము; పార్శ్వము.
కెలసము. కోరిక; సంతోషము; ఉత్సాహము; అక్కఱ; పని, కృత్యము.
కెల్లగించు. స. క్రి. పెల్లగించు; రేఁచు.
కెల్లి. మల్లబంధవిశేషము.
కెళకుళి. కేళాకూళి.
కెళగు. ఆర్తవము.
కెళవు. ఎడము; దూరము; పార్శ్వము.
కెళాకుళి } కేళాకూళి.
కెళానుళి }

# కే

కే. ధ్వన్యనుకరణము.
కేక. పెద్దకూఁత. సం. నెమలికూఁత.
కేకయము. సం. 56 దేశములలోనొకటి
కేకరము. సం. కడకన్ను; మెల్లకన్ను.
కేకరించు. అ. క్రి. కేకలువేయు; సకిలించినట్లు శబ్దించు. సం. స. క్రి. కటాక్షించు.
కేకరింత. కేకలువేయుట; గొంతదుపు తీఱుటకు సకిలించినట్లు శబ్దించుట.
కేకరుఁడు. సం. విణ. మెల్లకంటివాఁడు.
కేకలువేయుచుఁ గేలుపట్టినవు. అ. క్రి. చప్పట్లుగొట్టు.
కేకి. సం. నెమలి.
కేకిస. కిస.
కేకిసలు. బ. చప్పట్లు; అంజలులు.
కేకిసల్గొట్టు. అ. క్రి. చప్పట్లుకొట్టుట.
కేజా. పంకము.
కేటత్రాడు. యమపాశము.
కేటాయించు. స. క్రి, వేఱుపఱుచు.
కేడ. విణ. ధూర్తుఁడు.
కేడము. ఖేటకము, డాలు.
కేడములుఁచ. ధూర్తుఁడు.
కేడములుచఁదనము. ధూర్తత్వము.
కేడించు. అ. క్రి. స. క్రి. రూ. క్రేడించు.
కేడెము. డాలు, ఖేటకము.
కేతకి. సం. మొగలి, పచ్చపూమొగలి†.
కేతనము. సం. ధ్వజము, టెక్కెము; గుఱుతు; ఇల్లు; నిమంత్రణము; భూమి; స్థానము.
కేతు. సం. కేతువు, జెండా.
కేతుమాలము. సం. ఒకవర్షము.
కేతువు. సం. కేతుగ్రహము; ధ్వజము, టెక్కెము; గుఱుతు; అగ్ని; కాంతి; ధూమకేతువు.

కేదరము. సం. రూ. కేదారము.
కేదారకంకణము. కేదారకటుక నిర్మితమైన కడియము,
కేదారకటుక. సం. ఒకజాతికటుకరోహిణి†
కేదారము. సం. వరిమడి; కొండ; పాదు; ఒక శివక్షేత్రము.
కేదారుఁడు. సం. శివుఁడు.
కేనము. మోసము; మాయ; కేనోపనిషత్తు.
కేనిపాతక(న)ము. సం. ఓడతెడ్డు.
కేమము. సం. పులిపిరికాయ.
కేయూరము. సం. బాహుపురి.
కేరజేము. ఒకపక్షి.
కేరడము. ఉపేక్ష; తిరస్కారము; తిరస్కారపుమాట; వంకరమాట; విలాసము.
కేరడించు. స.క్రి. వక్రముచేయు.
కేరళము. సం. 56 దేశములలోనొకటి.
కేరించు. అ.క్రి. విజృంభించు.
కేరింత. అలవరింత.
కేరిజేము. ఒకపక్షి.
కేరు. అ.క్రి. ఉత్సహించు; కుతూహలపడు; విజృంభించు. స.క్రి తిరస్కరించు; పరిహసించు; అతిశయముగనవ్వు.
కేరుపు. విజృంభణము.
కేర్జము. కేరిజము.
కేలు. తొండము; చేయి, హస్తము.
కేలుదమ్మి. కరారవిందము, పద్మమువంటి హస్తము.
కేలుమొగుచు. కేల్మొగుచు.
కేలుమొనుపు(వు), కేలుమొగ్గ, కేలుమొడుపు, కేలుమోడుపు, కేలుమోడ్పు — అంజలిబంధము, చేమోడ్పు, నతి, నమస్కారము.
కేల్గలుపు. అ.క్రి. చేతులుంకలుపు.
కేల్పట్టు. పాణిగ్రహణము, వివాహము.
కేల్మొగుచు. నమస్కరించు. రూ. కేల్మొగుడ్చు.
కేల్మొగుచుట, కేల్మొగుపు(వు), కేల్మొగ్గ, కేల్మొ(ల్మో)డుపు, కేల్మొ(ల్మో)డ్పు — ఎరఁగుడు, నతి.
కేవడము. కేడెము.
కేవరి. కేవుపుచ్చుకొనువాఁడు.
కేవలనులు. బ. కేవనిబంటులు, కోటగుమ్మముకాచువారు.
కేవలము. సం. నిర్ణయింపఁబడినది. విణ. అంత; అద్వితీయము, ఒకటి; బొత్తిగా.
కేవలుఁడు. సం. అద్వితీయుఁడు, పరమాత్మ.
కేవ. సమీపము.
కేవు. ఆతరము, ఓడకిచ్చెడుకూలి.
కేశకారము. సం. కరఫలము, గొఱపము.
కేశఘ్నము. సం. బట్టతల; పేనుకొరికెడి రోగము.
కేశపక్షము. సం. కొప్పు.
కేశపద్ధతి. సం. పాపట.
కేశపాశము. సం. కొప్పు, సిగ, చూడ.
కేశబంధము. సం. పువ్వులుముడిచినకొప్పు
కేశమార్జనము. సం. దువ్వెన.
కేశము. సం. తలవెండ్రుక; కురువేరు†.
కేశముష్టి. సం. తేనెమ్రాను†.
కేశవము. సం. పొన్న†.
కేశవుఁడు. సం. విష్ణువు. విణ. ప్రశస్తమైన వెండ్రుకలు గలవాఁడు.
కేశవేశము. సం. కబరి, కొప్పు.
కేశాంబునామము. సం. కురువేరు†.
కేశి. సం. ఒకరాక్షసుఁడు. విణ. కేశికుఁడు.
కేశికుఁడు. సం. విణ. మంచి వెండ్రుకలు గలవాఁడు.
కేశిని. సం. కట్లతీఁగె†; పద్మపుతీఁగె†. విణ. మంచి వెండ్రుకలుగలస్త్రీ; స్త్రీ.
కేశుఁడు. సం. వరుణుఁడు.
కేస. కిస, నెమిలికూఁత.
కేసరము. సం. ఇంగువ; కింజల్కము, అకరువు; జూలు, సింహము మొదలగువాని మెడమీఁది వెండ్రుక; నాగకేసరము†; పొన్న†; పొగడ†.
కేసరి. ఒకానొకమృగము; ఒకదినుసు వరిపైరు†. సం. సింహము; ఒకవానరుఁడు; గుఱ్ఱము; నాగకేసరము†; పొన్న†.
కేసరులు. బ. ఒక శాలిధాన్యము.
కేళకుళి, కేళకూళి — కేళాకూళి,

కేళాకూళి. క్రీడాసరస్సు, నలుచదరముగా నుండి నాలుగువైపుల దిగునది.
కేళి. సం. ఆట; పురుషులు స్నేహమున స్త్రీలు మొదలగువారిని గద్దించుట కొట్టుట పరిహసించుట మొదలుగాఁ గలది; ప్రియునితోడి విహారము నందలి నాయిక యొక్క క్రీడ.
కేళిక. ఆట; నృత్యము.
కేళికిలుఁడు. సం. విణ. నవ్వించువాఁడు.

# కై

కై. చేయి, హస్తము; తొండము. అప. చతుర్థీవిభక్తియందు వచ్చెడు ఒక ప్రత్యయము; హల్లునకు యతి. రూ. కయి.
కైంకర్యము. సం. ఊడిగము; భగవంతునికిని భగవద్భక్తులకును జేసెడి యూడిగము.
కైక. కైకేయి.
కైకట్టు. సందర్భము.
కైకలవాఁడు. కరిణాలు.
కైకానుక. రూ. కయికానుక.
కైకేయి. సం. కేకయరాజు కూఁతురు.
కైకొను. అ.క్రి పూను స.క్రి.గ్రహించు; లక్ష్యపెట్టు.
కైకొలుపు. ప్రే. కైకొనఁజేయు.
కైకోల. రూ. కయికోల.
కైకోలు. అంగీకారము; గ్రహణము.
కైచేఁపులు బ. నమస్కృతి.
కైజీతకాఁడు. శంబలాయుధసేవి.
కైజీతము. బత్తెము. రూ. కయిజీతము.
కైజో. గుఱ్ఱపు ముఖుచేష్ట; వాగెను వెనుకకు ఈడ్చికట్టుట.
కైజామోత. అశ్వశిరఃకంపము.
కైజోరు. అ.క్రి. ఒఱగు.
కైజో. కపింజలము.
కైటభారి. సం. హరి, వెన్నుఁడు.
కైడర్యము. సం. కటిపేము†; పినగుమ్ముడు†
కైత. కవిత్వము.
కైతవము. సం. కపటము; జూదము.
కైతట్టు. శృంగారము.
కైతప్పు. చేపారపాటు.
కైతాళము. చేతవాయించుకంచుతాళము.
కైదండ. రూ. కయిదండ.
కైదార(రి)కము } సం. కేదారముల
కైదార్యము } సమూహము.
కైది. ఖైది.
కైదు. కపింజలము.
కైదువ } ఆయుధము.
కైదువు }
కైపదము. మి. కవిపరిజ్ఞాన పరీక్షార్థము పూరింపనిచ్చెడి పద్యాంతము, సమస్య.
కైపాల. అడపము; కత్తుపాల.
కైపు. లాహిరి; అందము; విజృంభణముకైవిధము.
కైఫీయతి. హిం. ఒక సంగతి వివరము.
కైముడి. వాద్యవిశేషము.
కైమోడుపు. నమస్కృతి. రూ. కైమోడ్పు.
కైరఁడు. పేరుగల గుఱ్ఱము.
కైరవడి. కవిరియుండ.
కైరవము. సం. తెల్లకలువ†.
కైరవిణి. సం. తెల్లగలువల సమూహము; తెల్లగలువలుండు కొలను.
కైరవుఁడు. సం. జూదరి; పగవాఁడు.
కైలాగు కైదండ [పాయముగలవాఁడు.
కైలాటకాఁడు. విణ. నత్తిలుఁడు, మాయో
కైలాటము. మాయోపాయము.
కైలాసము. సం. కుబేరుని యునికిపట్టు; శివుఁడుండెడి వెండికొండ.
కైలు. హిం. పండిన ధాన్యపు కొలఁత.
కైలుదార్లు. బ. నూర్చినధాన్యము కొలిపించువారు.
కైవడి. విధము; పోలిక.
కైవడిముస్తె. తుంగముస్తె†.
కైవర్తము } సం. కైవడిముస్తె†.
కైవర్తి }
కైవర్తుఁడు. సం. పల్లెవాఁడు; చేఁపలఁ బట్టువాఁడు, జాలరి.
కైవల్యము. సం. కేవలభావము, అద్వితీయ స్థితి, మోక్షము.
కైవసము. అధీనము.
కైవళి. కైవడి.
కైవారపు చేతులు. బ. నతివిశేషము.

కైవారము. స్తోత్రము, పొగడ్త; చుట్టు; గనిమయంచు. సం. వందిస్తోత్రము.?
కైవారముచేయు. స. క్రి. స్తుతించు.
కైవారవాక్యములు. మి. స్తోత్రముచేయు వాక్యములు.
కైవారి. సం. వంది.?
కైవు. ఉన్మాదము, కైపు.
కైవ్రాలు. అ. క్రి. రూ. కయివ్రాలు.
కైవ్రాలుచు. ప్రే. కైవ్రాలఁజేయు.
కైశికము. సం. వెండ్రుకల సమూహము.
కైశికి. సం. ఒక కావ్యవృత్తి.
కైశోరము. సం. పదిమొదలు పదునైదేండ్ల వఱకుగల వయస్సు.
కైశ్యము. సం. కైశికము.
కైసన్న. ఆహ్వానము. [గూరుపరి.
కైసరుఁడు. కవీశ్వరుఁడు, కబ్బపుఁ
కైసాటిచుక్క. హస్తనక్షత్రము.
కైసేఁత. అలంకారము.
కైసేయు. స. క్రి. అలంకరించు; పూజించు.

## కొ

కొంకనక్క. చిన్నజాతినక్క, గుంట నక్క, శిఖి.
కొంకర. వంపు.
కొంకరలువోవు. అ. క్రి శైత్యాదులచేతఁ గాళ్లు చేతులు మొదలగునవి బిగిడికొను.
కొంకి. వంపుచీల; దోఁటి. బ. ముచ్చిలి గుంటకు పార్శ్వమున ఉండెడిఎముకలు; మోఁకాలిచిప్పకు లోతట్టు రెండుప్రక్కల నుండెడి ఎముకలు.
కొంకు. భయము; వెనుదీయుట; సంకోచము. అ. క్రి. భయపడు; వెనుదీయు; సంకోచించు. [స్ఖలనము.
కొంకుపాటు. భయపడుట; సంకోచపడుట;
కొంకువోవు. అ. క్రి. కొంకరలువోవు.
కొంగ. బకము, క్రౌంచము.
కొంగకాళ్ళవాఁడు. విణ. నిడుపుమోఁకాళ్ల వాఁడు, ఊర్ధ్వజ్ఞువు.
కొంగవాలు. మాద్రిగకత్తి.
కొంగు. వస్త్రమునకు మొదటను చివరను ఉండెడిది, చెఱగు.
కొంగుమాయు. అ. క్రి. బహిష్ఠయగు.
కొంగోడువడు } అ. క్రి. ఒడ్డిగిల్లు; ఒఱగు.
కొంగోడుపోవు }
కొంచె. క్రౌంచపర్వతము; క్రౌంచపక్షి; కొంగు.
కొంచెగుబ్బలి. క్రౌంచపర్వతము.
కొంచెదీవి. క్రౌంచద్వీపము.
కొంచెమల. క్రౌంచపర్వతము.
కొంచెమలగొట్టినజాణఁడు. క్రౌంచదారణుఁడు, కుమారస్వామి.
కొంచెమొగ్గరము. క్రౌంచవ్యూహము.
కొంచెసారము. క్రౌంచ(మధ్యమ)స్వరము.
కొంచించు. అ. క్రి. సంకోచించు.
కొంచియము. న్యూనత. విణ. అల్పము.
కొంచు. మలినస్వేదము. అ. క్రి. సంకోచించు.
కొంచుఁబోవు. స. క్రి. పట్టుకపోవు.
కొంచువచ్చు. స క్రి. తెచ్చు.
కొంచెకత్తె. విణ అల్పురాలు; సామాన్యురాలు. [న్యుఁడు. రూ. కొంచెగాఁడు.
కొంచెకాఁడు. విణ. అల్పుఁడు; సామా
కొంచెతనము. అల్పభావము. [మగు.
కొంచెపడు. అ. క్రి. తక్కువపడు; సన్న
కొంచెపుది. అల్పము.
కొంచెపువాఁడు. అల్పుఁడు.
కొంచెము. కించిత్తు, అల్పము; న్యూనత.
కొంజు. అ. క్రి. సంకోచించు.
కొంట. కొనుట. [శీలుఁడు; భ్రష్టుఁడు.
కొంటె. విణ. తుచ్ఛుఁడు; అకార్య
కొంటెతనము. తుచ్ఛత్వము.
కొండ. మల, పర్వతము.
కొండకంది. సస్యవిశేషము†. బ. ఆధాన్యము.
కొండకాకి. ఒక దినుసు కాకి.
కొండకాలువ. సెలయేఱు, ఝరము, పర్వతమునుండి పుట్టిన ప్రవాహము.
కొండకొమ్ము. పర్వతశృంగము. [దుర్గము.
కొండకోట. వరణాకారమైన పర్వతము,
కొండకోఁతి. బాలక్రీడావిశేషము.
కొండకోలు. కొద్దియగుట.

కొండఅంగి. కొండముచ్చు.
కొండగీఁడు. కొండెము చెప్పువాఁడు.
కొండగుద్దలి. ఱాళ్లు పెకలించు గుద్దలి.
కొండగుఱుతు. సామాన్యలక్షణము.
కొండగోనుగు. అక్షోటము†.
కొండగొఱి(ఱ్ఱి)యు. కొండగొఱ్ఱె.
కొండగొఱ్ఱె. రోహిషము, గాడిదవంటి మృగవిశేషము.
కొండగోఁగు } కర్ణికారము†.
కొండగోను }
కొండగోల. మృగవిశేషము. [గోనసము.
కొండచిలువ. కొండపాము, అజగరము;
కొండచీమ. ఒకదినుసు చీమ, ఉద్దీపకము
కొండచూలి. పార్వతి. [న్యము.
కొండజొన్న. సస్యవిశేషము†. బ అ ధా
కొండతంగేడు. ఒకదినుసు తంగేడు†.
కొండతేనె. కొండఱాళ్ళనుబట్టిఁన తేనె.
కొండత్రిమ్మరి. కోఁతి, అగచరము.
కొండదిగు. అ. క్రి. కొండమీఁదినుండి దిగు.
కొండనాలుక. అంగిటనుండెడి చిఱు నాలుక, గళశుండిక.
కొండపగతుఁడు. ఇంద్రుఁడు, గోత్రారి.
కొండపలుకు. పర్వతబిలమునందలి ప్రతిధ్వని.
కొండపెండి. వృక్షవిశేషము, నగభేది.
కొండప్రత్తి. ఒకదినుసుప్రత్తి†.
కొండబూరుగు. కూటశాల్మలి†.
కొండబెండ. కచ్ఛుఘ్నము, తస్కరి†.
కొండమల్లయ్య. శివుఁడు.
కొండమల్లె. గిరిమల్లిక†.
కొండమామిడి. కోశామ్రము†.
కొండమారేఁడు. గంధగర్భము†.
కొండము. గుండము.
కొండముచ్చు } గోలాంగూలము, నల్లని
కొండముసువ } మూఁతిగలకోఁతి.
కొండ్రముచ్చు }
కొండయల్లుఁడు. శివుఁడు.
కొండరాచూలి. అమ్మిక, పార్వతి.
కొండఱెక్కలుగొట్టినదంట. గోత్రభిదుఁడు, ఇంద్రుఁడు.
కొండఱేఁడు. నగాధిరాజు, హిమవంతుడు.

కొండల్లము. తృణపుష్పిక, ఒకదినుసు అల్లము†. [వ్యాధజాతివిశేషము.
కొండవారు. కొండయందుండు బోయలు,
కొండవీటిజంగము. కైలాసవాసి, పార్వతీపతి, శివుఁడు.
కొండసికి. పర్వతశృంగము.
కొండాటము. సంతోషము.
కొండాడు. స. క్రి. స్తుతించు.
కొండి. అలము, తేలుకొండి; ఱెక్కతలుపు నంచులయందుఁ గట్టెడు తేలు తోఁకవంటి యినుప గొళ్లెము.
కొండిక. బాలుఁడు; బాలిక. విణ. చిన్న.
కొండికది. బాలిక.
కొండికనాఁడు. బాల్యకాలము.
కొండికవాఁడు. బాలుఁడు.
కొండియ. రాజులు మొదలగువారు మొగము తట్టు వేసికొనెడుముడి, కొండె.
కొఁడియము. కొండెము; పిశునత్వము.
కొండియుఁడు. విణ కొండెకాఁడు.
కొండీఁడు. విణ కొండెకాఁడు.
కొండె. కొండి; కొండియ.
కొండెంగ. కుండంగి.
కొండెకత్తె. విణ. కొండెము చెప్పు స్త్రీ.
కొండెకాఁడు. విణ. పిశునుఁడు, కొండెము చెప్పెడువాఁడు; తంత్రహాది.
కొండెము. చాడి, పైశున్యము.
కొండెవల. చేఁపలఁ బట్టుటకు ఒకఁడు వేసెడు వల. [మతికొంత.
కొండొక. విణ. బాలుఁడు; చిన్న; కొంచెము,
కొంద్ర. మళ్ళించి దున్నినచాలు.
కొంద్రకైదువు. నాఁగలి.
కొంత. ఇంచుక, కొలఁది, కించిత్తు.
కొంతము. కుంతము, ఆయుధవిశేషము.
కొందఱు. బ. కొంతమంది.
కొందలపడు. అ. క్రి. కలఁతపడు.
కొందలపాటు. కొందలపడుట.
కొందలము. విచారము, దుఃఖము; క్షోభము
కొందలించు. అ. క్రి. కలఁతపడు.
కొందాఁక. కొంతవఱకు.
కొందు. స. క్రి. నజ్జుగ నఱకు.
కొంప. ఇల్లు.

కొంపచెఱుపు. అప్రయోజకుఁడు.
కొంపోవు. స. క్రి. తీసికొనిపోవు.
కొంసీలు. ఇం. కవున్సిలు.
కొకిబికి. విశే. చక్కనితిప్పినది [కొక్కెర.
కొక్కరాయి. కొంగ, బకము; బలాక,
కొక్కరించు. అ. క్రి. (కోఁతి) వెక్కిరించు; పక్షులు కాళ్లతో పెల్లగించు.
కొక్కరింత. కొక్కరించుట.
కొక్కి. విశే. హెచ్చు తక్కువైనది.
కొక్కెన. మల్లబంధవిశేషము.
కొక్కు. కొంగ; పందికొక్కు, మూషకము
కొక్కురౌతు. మూషికవాహనుఁడు, వినాయకుఁడు. రూ. కొక్కురవుతు.
కొక్కెర. కొక్కరాయి.
కొక్కెరతొలివేల్పు. బకాసురుఁడు.
కొక్కెస. ఒకచెట్టు †.
కొ క్కొ రొ కో. కోడి కూయుటయందగు ధ్వన్యనుకరణము. రూ. కొక్కొరోకో
కొచ్చెమాటలు. గ్రస్తోక్తి, తొందరమాట.
కొజ్జె. పండుఁడు.
కొజ్జా. హిం. అంగజాల, రాణివాసపు కావలివాఁడు; పండుడు. [చోటు.
కొ టా ర ము. ధాన్యాదిరాసు లుం డెడు
కొటారి. ఉగ్రాణపువాఁడు.
కొటారు. కొటారము; ఉప్పురాసులుండు స్థలము, ఉప్పుకొటారు. [నుఁడు.
కొటిక. గ్రామము, కొట్టిక; లోభి; వామ
కొటికాఁడు. రూ. కొట్టికాఁడు.
కొటికాండ్రు. బ. రూ. కొట్టికాండ్రు.
కొట్టకొన. అన్నిటికిఁగొన, మిక్కిలిచివర.
కొట్టడి. సామగ్రులుంచెడు గది, కోష్ఠము.
కొట్టము. నృత్యవిశేషము; హల్లీసకము; అనుకూలశాల; పసులు మొదలగువానిని గట్టెడుచోటు, కోష్ఠము.
కొట్టరువు. రూ. కొటారు.
కొట్లాడు. అ. క్రి. కలహించు; బాధపడు.
కొట్టాము. ఒక దేశము; పసులు మొదలగు వానిని కట్టెడుచోటు.
కొట్టి. వేగు. రూ. కోటి.
కొట్టించు. స.క్రి. ప్రహరింపఁజేయు.
కొట్టిక. కొటిక.
కొట్టికాండ్రు. వేగరులు.
కొట్టికాఁడు. వేగరి.
కొట్టు. దెబ్బ, ప్రహరణము; సామగ్రియుంచెడి యిల్లు, కోష్ఠము; చతురుపాయములలో నాల్గవది. స.క్రి. ప్రహరించు, ప్రహరణముచేయు.
కొట్టుపడు. అ.క్రి. వ్యయమగు.
కొట్టులాఁడు. అ.క్రి. కలహించు.
కొట్టులాట. కొట్టులాడుట, కలహము.
కొట్టె. మట్టిరెయెఱల యంతటి దళముగల కాఁగు; కసూలవిశేషము
కొట్నము. వడ్లదంపకము; వివాహతంత్ర విశేషము; ఊడిగము.
కొట్ర. వానరుఁడు; పిండి మొదలగువాని నుడుకఁబెట్టుటకుఁ బెట్టెడి యెసరు.
కొట్లమారి. విశే. కొట్లుపడు స్వభావము గలవాఁడు.
కొట్లాట రూ. కొట్టులాట.
కొఠారు. కోష్ఠము.
కొఠే. సాహుకారి ఇల్లు; వర్తకసంఘము.
కొడమ. ముఖభాగమునఁగట్టు లేక నడుమ వలపలె నల్లికగల యూఁతవంటి మత్స్యగ్రహణసాధన విశేషము.
కొడవండ్లు. బ కొడవళ్లు, లవిత్రములు.
కొడవలి. లవిత్రము, గడ్డి వరి మొ॥ కోసెడు సాధనము.
కొడన. కొండమల్లె †.
కొడి. దీపశిఖ.
కొడిద. నికుంచ్య చతురంగుళి.
కొడిది. ఒక చెట్టు. [పుడిసిలి.
కొడిదిలి. వంచినచేర; నికుంచ్యహస్తము,
కొడిమె. పాపము; అబద్ధోక్తి; అపవాదము, అపనింద; కష్టము; కువేణి, చేఁపలబుట్ట; దురవస్థ.
కొడిమెలాఁడు. విశే. పాపాత్ముఁడు.
కొడివె. రూ. కొడిమె.
కొడిస } కుటజము†.
కొడిసె }
కొడిసెపాల } ఇంద్రయవము. రూ.
కొడిసెవిత్తు } కొడిసెప్రాలు.
కొడుకఁడు } కన్నకొడుకు, పుత్త్రుఁడు.
కొడుకు }

కొడుకుకూఁతురు. పౌత్రి.

కొడుకుకొడుకు. పౌత్రుఁడు.

కొడుఁగుచు. దీపముయొక్క చిట్టెము.

కొడుపు. గంట మొదలగునవి వాయించెడు సన్నకొయ్య; బలపము మొదలగువాని కోపు; కోణము, వీణాదులతంతి మీటుటకు బంగారు మొదలగువానితో జేసి వ్రేలికి వేసికొనెడు గోరు; వెదురు కనుపుల నడిమిభాగము.

కొడుము. బిందెవంటి కుండ.

కొడుక్కు. రూ. కొడుకు.

కొడ్డి. రూ. కొడిది.

కొణజో. వాకిటికావలియిల్లు.

కొణత. కుక్కనుఁగట్టెడుకొయ్య; మల్ల పరికర విశేషము.

కొణతము. కంబము. కొణత.

కొణిఁగె. కుప్ప; దిబ్బ.

కొణిగ. మంజూరు. రూ. కొణిగె.

కొణిత. మల్లపరికర విశేషము.

కొణిది. జాతిభేదము.

కొణిదిలి. రూ. కొడిదలి.

కొణిదెఁడు. అరగుప్పెఁడు.

కొణుఁగురు. దీపముయొక్క చిట్టెము.

కొణుజె. పిడుఁజు, పశువులదేహమునందు చేరి రక్తము పీల్చెడు జంతువు.

కొణుదురు. రూ. కొణుఁగురు.

కొతిమిరి. కుస్తుంబురువు. రూ. కొత్తిమెరి†

కొతిమెర, కొతిమెరి. రూ. కొతిమిరి†.

కొతుకు. గ్రస్తము, వర్ణలోపముగలమాట; సంకోచము. అ. క్రి. వర్ణలోపముగా మాటాడు; సంకోచించు.

కొతుకుపడు. అ. క్రి. (మాట) లుప్తవర్ణమగు; సంకుచితమగు.

కొత్తడము. శాలావయవము, బురుజు.

కొత్తడి. స్త్రీ. సమూహము.

కొత్తమిరి. కొతిమిరి, దనియాలపైరు†. బ. దనియాలు.

కొత్తెము. తాటిపండు విత్తులోని కండ.

కొత్తముట్టు. నూలిపోగు అతుకు.

కొత్తళము. బురుజు.

కొత్తి: స్త్రీ.

కొద. న్యూనత, కొదువ.

కొదమ. పశుపక్ష్యాదులపిల్ల; అఁడుమేఁక పిల్ల. విణ. యౌవనము తలచూపినది; దృఢము.

కొదమటేనుఁగు. కరికలభము.

కొదమల్లు. బ. కొత్తిమిరి విత్తులు.

కొదరు. అ. క్రి. అతిశయించు; చెదరు; రేఁగు

కొదవ. కొఱఁత, న్యూనత.

కొదుక. కొదవ. విణ. తక్కువ.

కొదుకు. అ. క్రి. వెనుదీయు.

కొదుగు. పరాఙ్ముఖము.

కొదుపు. స. క్రి. ఏదేని నోటవేసికొని మ్రింగక ఊరక నములు.

కొదువ. కొదవ, తక్కువ. [సూక్ష్మము.

కొద్ది. పరిమితి; కొంచెము, అల్పము,

కొద్దికొద్ది. కొంచెకొంచెము, అల్పార్థకము.

కొద్దికాఁడు. అల్పుఁడు; క్షుద్రుఁడు.

కొద్దిగా వినుట. ఈషచ్ఛ్రవణము.

కొద్దిది. విణ. కొంచెమైనది.

కొద్దిపడు. అ. క్రి. కొంచెపడు.

కొద్దివాఁడు. కొంచెపువాఁడు.

కొన. అగ్రము; చెట్టుకొమ్మ చివర.

కొనకొను. అ. క్రి. యత్నించు.

కొనచెవి. కర్ణోర్ధ్వభాగము, చెవికొణక

కొనటి. రూపహీనుఁడు.

కొనరిక్క. రేవతీ నక్షత్రము.

కొనలిడు, కొనలొత్తు. అ. క్రి. వర్ధిల్లు.

కొనసాగు. అ. క్రి. సిద్ధించు; కొనలొత్తు, వృద్ధిబొందు.

కొని. రూ. కొన్ని.

కొనిపించు. ప్రే. కొనునట్లొనర్చు.

కొనిపోవు. స. క్రి. కొంపోవు, పట్టుకపోవు రూ. కొనుచుఁబోవు.

కొనియాట. నుతించుట; ఆదరించుట; కాపాడుట; కొలుచుట.

కొనియాడు. స. క్రి. స్తుతించు; ఆదరించు; కాపాడు; కొలుచు.

కొనివచ్చు. స. క్రి. తెచ్చు.

కొను. అ. క్రి. నాటు; సరిపడు. స. క్రి. అపహరించు; క్రయము చేయు. వెలకు

దీయు; తీసికొను, పుచ్చుకొను, గ్రహించు, పట్టుకొను; పరిగ్రహించు; లక్ష్యపెట్టు; వ్రేయు. [పించుట.
కొనుగోలు. క్రయము; నట్టువుఁడు కొలి
కొనుచేవచ్చు. స. క్రి. తెచ్చు.
కొనుజో. పిడుఁజు. రూ. కొణుజు.
కొనుట. కొనుగోలు, క్రయము.
కొనుబడి. కొనుట.
కొలుమొదలు. కొనుటకిచ్చిన ధనము.
కొన్నాళ్ళు. బ. కొన్ని దినములు.
కొన్ని. స. (కొంతశబ్దమునకు అమహదర్థక బహువచనాదేశము.) కొంత సంఖ్యగలవి. [రము.
కొపురు. శిఖరము; ఉన్నతి. రూ. కొప్ప
కొప్పరము. శిఖరము; ఉన్నతి; విజృంభణము; విజృంభితము; అంసము. [భించు
కొప్పరించు. అ.క్రి. అతిశయించు;విజృం
కొప్పరింత. అతిశయించుట; విజృంభణము.
కొప్పు. తలయందుదోఁపిన వెండ్రుకల ముడి, కేశబంధము; ఇంటి నడికొప్పు; వింటికొన.
కొప్పువల. ఒగిదిగ, బాలపాశ్య.
కొప్పెర. వెడల్పుముఖము గల పెద్ద పాత్రము,కటాహము; నారికేళ పేశము; కుడక.
కొప్రము. కొప్పరము, శిఖరము.
కొబ్బరి. కుడక, నారికేళము రూ.కొబ్బెర
కొబ్బరికల్లు. నారికేళాసవము.
కొబ్బరికాయ. బొండము ఒలిచిన నారికేళ ఫలము. [కాయలోని గుంజు
కొబ్బరిగుంజు. మొక్క మొలచిన కొబ్బరి
కొబ్బరిచెట్టు. నారికేళము†.
కొబ్బరినూనె. నారికేళతైలము.
కొబ్బరిపువ్వు. మొక్క మొలచిన కొబ్బరికాయలోని పువ్వు. [బెల్లము.
కొబ్బరిబెల్లము. కొబ్బరికల్లువండి చేసిన
కొబ్బరిబొండము. నారికేళఫలము.
కొబ్బరియుండలు. బ. మాండములు, భక్ష్యవిశేషము
కొబ్బెర. కొబ్బరి, చిప్పతీసిన టెంకాయ.

కొబ్బెరకాయ. కొబ్బరికాయ, టెంకాయ.
కొబ్బెరపండు. కొబ్బెరకాయ.
కొబ్బెరయుండ. కొబ్బరియుండ.
కొమ. శాఖ; ఆఁడుది. రూ. కొమ్మ.
కొమరసామి కుమారస్వామి.
కొమరాలు. యౌవనవతి; సౌందర్యవతి.
కొమరిత. కూఁతురు.
కొమరితె. కొమరాలు.
కొమరు. వ్యుత్పత్తియందు కొమిరెశబ్దమునకగు ఆదేశము; సౌందర్యము, మనోజ్ఞత. విణ. మనోజ్ఞము, సుందరము.
కొమరుడాలు. అజ్జవాలు, కోడి.
కొమరుఁడు. కన్నకొడుకు;కుమారస్వామి; పిన్నవయసువాఁడు.
కొమరుఁదనము. ఈడు.
కొమరుఁబాయము. ఈడు.
కొమరులు. బ. ఇంటి వెన్నుపట్టె క్రింది కురుఁజులు; కొడుకులు.
కొమరుసామి. కుమారస్వామి.
కొమరుసామిరథము. మి. కుక్కుటము.
కొమరె. కొమరాలు; పుత్రిక, కుమారి.
కొమారిత. కూఁతురు.
కొమార్త. కూఁతురు.
కొమిరె. యౌవనముగలస్త్రీ; స్త్రీ.
కొమ్మ. కోటకొమ్మ,కపిశీర్షము;శాఖ;స్త్రీ
కొమ్మటెంకిమెకము.శాఖామృగము,కోఁతి
కొమ్మతారుపుగుల్ల. ఎడకత్తియ, దూతిక.
కొమ్మత్రిమ్మరి. శాఖామృగము, కోఁతి.
కొమ్మదాటుమెకము అడవితిరుగుడు,కోఁతి
కొమ్మనఁటి. కదళీవిశేషము†.
కొమ్మనగొత్తిపిండిచెట్టు. పూతిక†.
కొమ్మనగొలిమిడి. మూలఫల†.
కొమ్మనగోర. వృక్షవిశేషము†.
కొమ్మమెకము. శాఖామృగము, కోఁతి.
కొమ్మరఁటి. కదళీవిశేషము†.
కొమ్మి. ఎఱ్ఱగోరంట †.
కొమ్ము. ఉకారాంతముయొక్క రూపాంతర నామము; శృంగము, ఎద్దు మొదలగువాని కొమ్ము; మాదిగవాఁడు క్రొవ్వుంచుకొనెడు పాత్రము; పసుపు మొదలగువాని ఎండిన నిడుపాటి గడ్డ;

చిమ్మసఁగ్రోలి; పల్లకిబొంగు; ఏనుఁగు యొక్క దంతము; పందికోఱ; ఊదెడి సుషిరవాద్య విశేషము; శాఖ; శిఖరము; కొన; ఉత్సాహము; బలము; గవుండ్లవాఁడు బందము తగిలించెడు కత్తిపిడికలోని వంకర కొయ్య; అగ్రము; ఆందోళికోభయ దండము.
కొమ్ముకాఁకర. కారవేల్లవిశేషము †.
కొమ్ముకాటు. వరాహము.
కొమ్ముకాఁడు. వరాహము; అగసాలెవాఁడు; కొమ్మువాఁడు.
కొమ్ముచేఁప. ఒక అఁడు చేఁప, శృంగి.
కొమ్ముటేనుఁగు. మగయేనుఁగు.
కొమ్ముపెసర. సస్య విశేషము †. బ. ఆ ధాన్యము.
కొమ్ముపొట్లతీఁగె. కన్యాకబ్జలత †
కొమ్ముమాచకమ్మ. స్తనములు గలిగి రజోదర్శనము లేని స్త్రీ. [సేయు.
కొమ్ములుసూపు. స. క్రి. అలక్ష్యము
కొమ్మువాఁడు. కొమ్మూఁదెడు మాఁదిగవాఁడు.
కొయుఁగూర. కోయఁదగినపల్లతోఁటకూర†
కొయ్య. కఱ్ఱ, మ్రాను, దారువు.
కొయ్యగాలు. కోఁత కోసినమోడు.
కొయ్యగూట(టా)ము. దున్నిన మంటిగడ్డలు చిదుకఁగొట్టునది.
కొయ్యగూర. కోయుగూర †.
కొయ్యతోఁటకూర. కొయ్యగూర†.
కొయ్యదిప్ప. అడిబండ, దుష్టుఁడు
కొయ్యనగాండ్రు. బ. మూర్ఖులు.
కొయ్యుగూర. కోయుగూర†.
కొరక. అప్రహతభూమి.
కొరడా హిం. జాటీ, చబుక్, కశ.
కొరడు. వంకరగాక సరిగానుండెడి ఇంద్రధనుస్సు; గుడ్లగూబ; మత్స్యభేదము.
కొరద. మత్స్యవిశేషము.
కొరన. కొరక.
కొరవంజి. ఎఱుకవాఁడు; ఎఱుకత.
కొరవి. కడిమి†; ఎఱ్ఱగోరంట†.
కొరవితాల్పు. పిశాచము.
కొరసానిగండు. క్రూరమృగ విశేషము.
కొరి. తెప్పగడిమి వెండ్రుక, అర్మము.
కొర్సవగండు. కొరసానిగండు
కొఱ. కొఱఁత; ప్రయోజనము; మత్స్య విశేషము; శిల్పము; పాఠీనమత్స్యము; కొఱ్ఱ, ప్రియంగువు†; న్యూనత; అప్రయోజనము. విణ. అప్రయోజకము; కొంచెము; యోగ్యము.
కొఱఁకు రూ. కొరను.
కొఱఁత. తక్కువ, న్యూనత.
కొఱఁతనుఱుకు. స క్రి. అకార్యము చేయు. విణ. అకార్యము చేయువాఁడు.
కొఱకచ్చు. కొఱవి.
కొఱకు నిమిత్తము, చతుర్థీవిభక్తియందు వచ్చెడు ప్రత్యయము.
కొఱకొఱ. కోపవికారము.
కొఱకొఱలాడు. అ. క్రి. కోపగించు.
కొఱగానిది. విణ. కొఱమాలినది.
కొఱగానివాఁడు. అప్రయోజకుఁడు.
కొఱగామి. అకార్యము; దుర్లక్షణము; దోషము. [కొరడు.
కొఱడు. ఆయుధవిశేషము; మ్రానిమోడు;
కొఱడుకోల. ఆయుధవిశేషము.
కొఱడుపాఱు. అ క్రి తిమురుపట్టు.
కొఱను. పసులు మేయుటచే, విపీతము; పత్తులెర యేరి తిను చోటు.
కొఱనోము. తక్కువనోము.
కొఱపము. గొఱపము, అశ్వక్రకచాంకము
కొఱప్రాణము. మి. కుట్టుసుఱు.
కొఱప్రాణులు. మి. కొనయూపిరిగలవారు
కొఱమాలినవాఁడు. పనికిమాలినవాఁడు, అయోగ్యుఁడు.
కొఱముట్టు. పనిముట్టు, ఉపకరణము.
కొఱలు. అ క్రి. నిండు; ఉండు; ప్రకాశించు; ఒప్పు. స.క్రి. పొందు.
కొఱవ. ఒక తక్కువజాతి.
కొఱవత. కొఱవది.
కొఱవి. కొంతకాలినకఱ్ఱ, అలాతము.
కొఱవిచీమ. పెద్ద యెఱ్ఱచీమ.
కొఱవిదయ్యము. పిశాచభేదము.
కొఱవోవు. అ.క్రి. మూర్ఛిల్లు.
కొఱసంది. ఆయము, జీవస్థానము.

కొఱు. రూ. కొఱ్ఱు.
కొఱుకు. మేహరోగవిశేషము. స. క్రి. కఱచు, దష్టముచేయు.
కొఱుకుపుండు. కొఱుకు.
కొఱ్ఱు. మత్స్యభేదము; ప్రియంగువు, సస్యవిశేషము†. బ. కంగుధాన్యము.
కొఱ్ఱు. మేకు, శూలము.
కొల. పాపము; హింస; కొలిచినకొల.
కొలఁకు } కొలను, సరస్సు.
కొలకువు
కొలఁది. లోఁతుయొక్క ప్రమాణము; పరిమితి. విశ. శక్యము.
కొలకొల. కలకలధ్వని.
కొలగాఁడు. ధాన్యము కొలుచువాఁడు.
కొలగారము. ధాన్యముకొలతకిచ్చెడుకూలి
కొలత. పరిమాణము; ధాన్యము మొదలగువానిని కొలుచుట.
కొలనిమేఘము మి. వస్త్రవిశేషము.
కొలను. మడుగు, సరస్సు.
కొలము. కులము, సజాతీయప్రాణి సమూహము; వంశము.
కొలవేళులు. బ. వట్టివేళ్లు.
కొలారకము. కొలత.
కొలారము } చతుశ్శాలము, నడుమ బయలును నాలుగు ప్రక్కలఁ గట్టడమును గల యిల్లు.
కొలారు
కొలారుబండి. గంత్రి, ఎడ్లబండి.
కొలి. బిల్లగోడాడునపుడు బిల్లఁబెట్టికొట్టుటకుఁ ద్రవ్విన చిన్న పల్లము.
కొలికి ముక్కునంటినకంటిమూల; హారము మొదలగువానికి తగిల్చెడు వంకరకమ్మి; పరిపాకము; కంఠము. [లించెడు పూస.
కొలికిపూస. హారమధ్యమణి, కొలికి దగి
కొలికిముడి. పదలుముడి.
కొలిపించు అ. క్రి నట్టువుఁడు కొను గోలుచేయు. ప్రే. ధాన్యాదికము కొలువఁ జేయు.
కొలిమి. కమ్మరి నిప్పుంచెడు పల్లము.
కొలిమితిత్తి కొలిమి యూఁదెడు తిత్తి, భస్త్ర, భస్త్రిక.
కొలుచు. ధాన్యము; పరిధాన్యము. స. క్రి. దేవాదులను పూజించు; సేవించు; వస్త్రధాన్యాదికము కొలతచేయు.
కొలుపు గ్రామదేవతకు చేసెడు ఉత్సవము. అ. క్రి. నట్టువుఁడు కొలిపించు; సమ్మతించు; సరిపడు; చెల్లు. ప్రే. పురికొలుపు; పుట్టించు; (కను) గీటు; అను ప్రయుక్తమైన కొను ధాతువునకు ప్రేరణమునందు వచ్చెడి రూపము.
కొలువడి. కొలత
కొలువానములు. మత్స్య విశేషము.
కొలువు. రాజాదిసభ, ఆస్థానము; చాకిరి. సేవ; ఉత్సవవిశేషము.
కొలువుకాఁడు. సేవకుఁడు.
కొలువుకూటము. సభాస్థానము. [హించు
కొలువుగొను. స. క్రి. సేవకునిగా పరిగ్ర
కొలువుడుకాఁడు. సేవకుఁడు. [తెలుపునది
కొలె. ద్ర. మొదలుకొని అను నర్థమును
కొల్ది విశ. రూ కొలఁది.
కొల్ను. రూ. కొలను.
కొల్పుడుచేయి. నతివిశేషము.
కొల్ల. చూఱ, దోఁపుడు, అపహారణము.
కొల్లకత్తె. విశ. కొల్లపెట్టుస్త్రీ.
కొల్లకాఁడు విశ. కొల్లపెట్టువాఁడు.
కొల్లకొట్టు. స. క్రి. అపహరించు; (అధిక లాభముగ) సంపాదించు.
కొల్లగొను. స. క్రి. కొల్లపెట్టు.
కొల్లపెట్టు. స. క్రి. అపహరించు.
కొల్లలాడు. స. క్రి. దోఁచుకొను.
కొల్లవోవు. అ. క్రి. చూఱవోవు.
కొల్లాడు. స. క్రి. కొల్లపెట్టు.
కొల్లాపురి. ఒక పట్టణము.
కొల్లాబండి. గాడి, ఎడ్లబండి.
కొల్లాయగుడ్డ. చిన్న అంగవస్త్రము. రూ. కొల్లాయి.
కొల్లారము } కొలారము; నాలుగిండ్ల బవంతి.
కొల్లారు
కొల్లారుబండి. గంత్రి, ఎడ్లబండి.
కొల్లి. ఒక చెట్టు†.
కొల్వు. కొలువు.
కొల్వుడుకాఁడు. సేవకుఁడు. [స్థలము.
కొళాయి. గొట్టములద్వారా నీరులభించు

కొవ్వు. మేదస్సు, మాంససారము; దర్పము.
కొన. పురితునుక; ఉపయుక్తము కాని తృణాదుల అగ్రాంశము; కొన, చివర, అగ్రము; పట్టికాగ్రము; కేసరము.
కొనగలముత్తెము. కొస ముంతమామిడి వలె నుండు ముత్యము.
కొసరు. కోరిక; ఏదేని ఒక వస్తువుతీసికొన్న దానికిచ్చెడు మెచ్చు; ప్రార్థనము; అనులాపము; సంకోచము; అతిశయము. అ. క్రి. విజృంభించు; సంకోచించు. స. క్రి. మిక్కిలికోరు, ప్రార్థించు.
కొస్సె. దర్భ.

## కో

కో. అఱుపునందగు ధ్వన్యనుకరణము.
కోంకణము. సం. ఆయుధ విశేషము; ఒక దేశము.
కోగిరి. హిం. గుఱ్ఱపుజీను, ఖోగిరి.
కోఁగు. స. క్రి. గొఱుగు; వాప్యాంకురాళి.
కోఁచ. పిఱికి.
కోఁచేవాఱు. అ. క్రి. భయపడు.
కోఁడు. స. క్రి. బియ్యము మొదలగు వానిని చేటలోఁ బోసికొని ప్రక్కవాటుగా నిటునటు త్రిప్పు.
కోఁత. ఛేదించుట, కోయుట; చేనుకోయుట
కోఁతపట్టు. అ. క్రి. కోఁతకోయ నారంభించు.
కోఁతపడు. అ. క్రి. ఖండితమగు.
కోఁతి. వానరము.
కోఁతికొమ్మచ్చి. బాలక్రీడావిశేషము.
కోఁతిపిఱ్ఱమామిడి. రసాలవృక్షవిశేషము†
కోఁతిపుల్లలు. బ. మగ్గపుపలక దారములను మీఁదికిఁదగిల్చెడు పుల్లలు.
కోఁతిమామిడి. అంబాళము, కపీతనము†.
కోఁతివన్నె. కపిశవర్ణము.
కోఁదాడు. తాళవృక్ష విశేషము†.
కోక. వలువ, వస్త్రము; చీర, స్త్రీలు కట్టుకొను వస్త్రము.
కోకనదము. సం. ఎఱ్ఱకలువ †; ఎఱ్ఱ తామర †.
కోకము. సం. చక్రవాకము, జక్కువ; తోఁడేలు; బల్లి; కప్ప; ఈఁదు †.

కోకిలము. సం. కోయిల; చిలుక. రూ. కోకిల.
కోకిలాక్షము. సం. ములుగోలిమిడి †.
కోగట ముండనము.
కోగెల. కోకిల.
కోచ. సందేహము.
కోచించు. సం. అ. క్రి. సంకోచించు; సందేహము లేకుండ మాట్లాడు.
కోజాలు. నీచులు. దయ లేని వారు; మూర్ఖులు.
కోట. సాలము; పట్టణము చుట్టుఁగల ప్రహరీ, దుర్గపురము, (రాజ్య సప్తాంగములలో ఆఱవది)
కోటకొమ్ములు. కోటమీఁది దళములు.
కోటఁడు. గుడ్లగూబ.
కోటము. సం గుడ్లగూబ.
కోటరము. కోడతికము. సం. చెట్టులొట్ట
కోటరింపు పెద్దపులి కూఁత.
కోటరికము. కోటగము.
కోటతికము. కోడతికము.
కోటవి. సం. దిసమొలది.
కోటానఁగోటులు. మి. బ. అసంఖ్యములు.
కోటి. వేగు; కాష్ఠక్రీడ. సం. అంచు; అతిశయము; చివర; వింటికొప్పు; సంఖ్యా విశేషము; సమూహము.
కోటికాఁడు. వేగువాఁడు.
కోటికాండ్రు బ. వేగువాండ్రు.
కోటివర్ష. స . పిక్కచెట్టు †.
కోటిశము. సం. మట్టిగడ్డలు కొట్టెడు కొయ్య రూ. కోటీశము.
కోటీరము. సం కిరీటము.
కోటు. ఇం. చొక్కాయి; కంచుక విశేషము, బొత్తములతో తొడుగుకొనునది
కోటేరు దుక్కి కిపోవునపుడు గాని దుక్కియై మరలివచ్చునపుడు గాని దుంప మీఁదుగా కాఁడికి తగిలించిన నాఁగలి.
కోట్టము. సం. దుర్గపురము.
కోట్టారము. సం. నీటిపల్లము.
కోట్రము, కోడంట్రము, కోడంట్రికము } కోడరికము.

కోడండ్రము } కోడలితనము,
కోడరికము } స్నుషాత్వము.
కోడటికము }

కోఠము. సం. గుండ్రకుష్టు, మండలాకారమైన కుష్ఠము.

కోడలు. స్నుష, కొడుకు యొక్క పెండ్లాము. బ. కోడండ్రు.

కోడాడు. అ. క్రి. బాధపడు.

కోడి. కుక్కుటము; కుక్కుటి.

కోడి.గ. రత్నముల యిరువదింటి సంజ్ఞ.

కోడిగము. విలాసచేష్ట; అపహాస్యము.

కోడిగీఁడు. విణ. కోడిగము చేయువాఁడు.

కోడిటెక్కమువాఁడు. కుక్కుటధ్వజుఁడు; కుమారస్వామి.

కోడిటెక్కమువానన్న. వినాయకుఁడు.

కోడిడేగ. వన్నెకల పందెపు కోడిపుంజు భేదము.

కోడిఁపీట. అనుకర్షము, నొగ చివరక్రింద ఎత్తుగానుంచెడు మోపుడుకొయ్య.

కోడిగెము. ఎగతాళి.

కోడిపందెము. ప్రాణిద్యూతవిశేషము.

కోడిపుంజు. కుక్కుటము, మగకోడి.

కోడిపెట్ట. కుక్కుటి, ఆఁడుకోడి.

కోడిపోరు. ప్రాణిద్యూతవిశేషము.

కోడిబడి. పసిపిల్లలకు చేసి యిచ్చెడు భక్ష్యవిశేషము.

కోడిబుడమలు. బ. ధాన్యవిశేషము.

కోడియ. కోడెదూడ.

కోడీ. కోడిగ; ధ్వజము.

కోడీఁడు. కొమరుఁడు.

కోడు. మంచము మొదలగు వానికంబము; ఊరిదరినీటి పల్లము. [ఎండు.

కోడుతాఱు. అ. క్రి పండినపైరు మిక్కిలి

కోడె. కాఁడిమోవఁదగినగూడ; విటుఁడు. విణ. యౌవనముగలది, తరుణము. రూ. కోడియ. [కొమరుఁడు.

కోడెకాఁడు. విటుఁడు; పడుచువాఁడు,

కోడెత్రాఁచు. పురుషసర్పము; సర్పభేదము.

కోడెదూడ. పాలువిడిచినగిత్త, వత్సతరము

కోడెరవుతు. వృషభవాహనుఁడు, శివుఁడు

కోణంగి. అంగములను వికారముగాఁ జూపి బిచ్చమెత్తెడు దాసరి; హాస్యనాటకుఁడు.

కోణంగివాఁడు. కోణంగి.

కోణాంగి. కోణంగి.

కోణపుఁడు. సం. మూలఱేఁడు, నైరృతుఁడు

కోణము. సం. అంచు; ఇల్లు మొదలగువాని మూల; గంట మొదలగువానిని వాయించెడు కోడుపు; దుడ్డుఁగోల; వాద్యవిశేషము; వీణెకోడుపు.

కోణాశ్వుఁడు. సం. యముఁడు.

కోణుఁడు. సం. శనైశ్చరుఁడు.

కోదండము. బాలురనుదండించుటకై పట్టుకొని వ్రేలాడునట్లు మీఁదగట్టెడు త్రాడు. సం. విల్లు; నాలుగుమూరలవిల్లు; వెదురువిల్లు; కనుబొమ; ఒకానొక దేశము.

కోదండరామములు. బ. ధాన్యవిశేషము.

కోద్రంగము. సం. మంచె.

కోద్రవములు. సం. బ. ఆళ్లు†.

కోన. అడవిలోనుండెడి పల్లె; గోసమూహము; అడవి; కోన; మూల; కొండలయందలి మఱుఁగుచోటు; దేశవిశేషము; ఇఱుకు; శైలదీర్ఘకోణము; అగ్రము.

కోనత్రిమ్మరి } వనచరము, కోఁతి.
కోనమనికి }

కోనఱేఁడు. కోణపుఁడు, నైరృతుఁడు.

కోనెఱు. రూ. కోనేఱు.

కోనేఱు. పుష్కరిణి, నాలుగువైపుల దిగునట్లు నలుచదరముగఁగాని దీర్ఘచతురశ్రముగఁగాని త్రవ్విన జలాశయము.

కోపకత్తె. మి. విణ. కోపన, కోపముగల స్త్రీ

కోపకాఁడు. మి. విణ. కోపనుఁడు, కోపముగలవాఁడు.

కోపగించు } స. క్రి కోపించు.
కోపగిల్లు }

కోపన. సం. కోపస్వభావముగల స్త్రీ

కోపనుఁడు సం. విణ. కోపకాఁడు.

కోపపడు. స. క్రి. కోపించు.

కోపము. సం క్రోధము, కినుక.

కోపి. సం. విణ. కోపముగలవాఁడు.

కోపించు. సం. స. క్రి. కోపపడు.

కోపు. బలపము మొదలగువాని కడ్డీ; కడ్డీ; అందము; వింటికొప్పు; నాట్యము; నిమిత్తము; ఒక వైపు, పార్శ్వము; విధము; సమయము; చేఁపలగుది గ్రుచ్చు నట్టి సూది; మద్యము; నాట్యము తీరు.
కోపుదారుఁడు. సరకులను బైటనుండి తెచ్చి యమ్మెడు వాఁడు. [భేదములు
కోపులు. బ. నమస్కారము; నాట్యగతి
కోపువాఱు. అ. క్రి. అందగించు. [స్త్రీ.
కోమ గోపురమువలె పెరిఁగిన పుట్టచివర;
కోమటి. వైశ్యుఁడు.
కోమలము. సం. నీళ్లు. విణ. మృదువు.
కోమలి. సుందరి, చక్కదనముగల స్త్రీ; స్త్రీ.
కోమలికము. చక్కఁదనము.
కోయ. వ్యాధజాతి విశేషము, బోయ, కోయవాఁడు.
కోయష్టికము. సం. చీకుగొక్కెర.
కోయితోటకూర. కోసినప్పటికి పునః ప్రరోహముగల శాకిక†.
కోయిల. గుడి, ఒకదివ్యస్థలము; కోకిలము.
కోయు. స. క్రి. లవించు, తీగలు మొదలగు వానిని ఛేదించు; పండ్లు పువ్వులు మొదలగు వానిని గిల్లు. [ము; తట్ట.
కోర. గిన్నె; కల్లు త్రాగెడి గిన్నె, చషక
కోరంగి సం. చిట్టేలకి†.
కోరకము. సం. మొగ్గ; అవిరిమొగ్గ; తామరతూఁడు; తక్కోలము†.
కోరకొండె. బిడ్డలు మొదలగువారికి ముఖ పార్శ్వమున వేసెడు కొండె (జడ).
కోరగించు. అ. క్రి. ముకుళించు; మొలకెత్తు
కోరటు. ఇం. కోర్టు. [గోడ, కరగోడ.
కోరడి. ఆవరణముగా వేసిన పొడిమట్టి
కోరదూపములు. సం. ఆళ్లు†.
కోరవాయి. కోష్ఠశీర్షస్థమగు వాయువు.
కోరవోవు. అ. క్రి. కొంకరులు వోవు.
కోరసిగ. కోరకొండె. [(వస్త్రము)
కోరా. విణ. కోరికము, అనాహతము
కోరాడు. స. క్రి. ఏనుఁగు మొదలగునవి కొమ్ములతో నేలఁ బొడిచి దుమ్మెత్తి పైకిఁ జల్లు; పంది ముట్టెతో నేల కెల్ల గించు; దుమ్ము మొదలగువానిని ఎత్తి పైకిఁ జల్లు; క్షతిచేయు.
కోరాడుట. ఉత్ఖాతకేళి.
కోరాబంగారు. మట్టుపుబంగారు.
కోరించు. ప్రే. కాంక్షింపఁజేయు.
కోరింద. లక్కగలిగెడి యొకానొకతీఁగ, జతూక†.
కోరిందపొద. ఆధారిక†.
కోరిక. కాంక్ష, ఇచ్ఛ; కోరుట; వరము. విణ. అభీష్టము.
కోరికి } కాంక్ష
కోరికె }
కోరికెలు. బ. కోరికలు.
కోరు. పండినపంటలో రైతునకు వచ్చెడి పాలు; ధనేతరవస్తురూపమైన కప్పము; తాకట్టు. స. క్రి. కాంక్షించు, ఇచ్ఛించు; కోరాడు. [గాజుపూసలు.
కోరెందపూసలు. బ. ఆటవికులు ధరించు
కోర్కి. కాంక్ష.
కోర్టు. ఇం. న్యాయసభ, న్యాయస్థానము.
కోఱ. దంష్ట్రి, పార్శ్వదంతము; సర్ప దంతము. విణ. పెద్ద.
కోఱడము. బాధ; అపహాస్యము. బ. అప హాస్యవచనములు.
కోఱమీసములు. పెద్దమీసములు.
కోఱుడుపాఱ. అవధారణవిశేషము.
కోల. దండము; బాణము; వంటకట్టె; మగగుఱి. విణ. దీర్ఘము. సం. చవ్యమను గంధద్రవ్యము†; పిప్పలి†. [గము.
కోలంబకము. సం. వీణయొక్క సర్వాం
కోలకంరుఁడు. సం. వరాహమూర్తి, విష్ణువు. [యము†.
కోలకము. సం. ఁకక్కోలపుచెట్టు†; మిరి
కోలక్రోఁతులు. బ. కోఁతికొమ్మంచియను కాలక్రీడావిశేషము.
కోలగగ్గెర. కాళ్లకుదారమును పెనఁచి యెద్దులను మాటుకట్టు గాక ప్రైడుకట్టు.
కోలజొన్న. ఒకదినుసుజొన్న, ఔద్దాలకము
కోలతపేల. ఇత్తడి పాత్రభేదము.
కోలదబ్బ. ఒక దినుసుదబ్బ†.
కోలదివియ } వెలుతురు కట్టెలదివటీ.
కోలదివ్వె }

కోలన. కోల, దైర్ఘ్యము.
కోలనిమ్మ. నిడుపుదినుసునిమ్మ†.
కోలపాల. అర్కపుష్పిక†.
కోలపొన్న. పృశ్నిపర్ణి†.
కోలము. వేషము. సం. తెప్ప; రేఁగుఁబండు; పంది; ఒడి; కౌఁగిలి.
కోలమెఱుఁగు. నిలువు మెఱుఁగు,ఐరావతి
కోలలవారు. బ. వేత్రధరులు.
కోలవల్లి. సం. గజపిప్పలి†.
కోలవస. జటిల†.
కోలాట. కోలాటము.
కోలాటకమ్మ. ఒక దినుసు చెవికమ్మ.
కోలాటము. హల్లీసకము, స్త్రీలుచేతులఁగోలలుంచుకొని యాడెడిఆట.[మోఁత.
కోలాహలము. సం. గుంపునఁబుట్టిన పెద్ద
కోలి. సం. రేఁగు†; గంగరేఁగు†.
కోలు. అనుప్రయుక్తమైన కొనుధాతువునకు భావార్థకరూపకము; కొల్లు. విణ. పెద్ద. క్రి. విణ. మిక్కిలి.
కోలుకాఁడు. నియమించెడి అధికారి; కావలివాఁడు; సుంకరిక్రిందిబంటు.
కోలుకొను. అ. క్రి. ఉత్సహించు; తేలుకొను; వర్ధిల్లు. [(యుద్ధ) సన్నాహము.
కోలుతల. ఎదుటనిలిచి యుద్ధముచేయుట
కోలుపడు. అ. క్రి. చెడు, నశించు; అగపడు. స. క్రి. పోఁగొట్టుకొను; ఓటుపడు. ప్రే. కోలుపఱుచు. [అశుభము.
కోలుపాటు. చేటు; పోఁగొట్టుకొనుట;
కోలుపాక. పోఁగొట్టుకొనుట.
కోలుపోవు. అ.క్రి. చెడు.స.క్రి. పోఁగొట్టుకొను; ఓటుపడు. ప్రే. కోలుపుచ్చు.
కోలుమసగు. అ. క్రి. విజృంభించు.
కోలె. వెన్నుకోసినకాఁడ. ద్ర. అవ్య. మొదలుకొని.
కోలెముక } కశేరుక, వెన్నెముక.
కోలెమ్ము }
కోలెమ్ముక. వెన్నెముక.
కోశంరము సం. గాడిద.
కోల్కొను. అ. క్రి. కోలుకొను.
కోల్తల కోలుతల.
కోల్పడు. కోలుపడు.
కోల్పాటు కోలుపాటు.
కోల్పులి. పెద్దపులి, వ్యాఘ్రము.
కోల్పుచ్చు. స. క్రి. నాశముచేయు.
కోవ. బిడ్డలకు గొంతునందుఁ గలిగెడు వ్యాధి విశేషము, పుట్టకోవ.
కోవరము. ఉక్కళము; కోపురము.
కోవి. సస్యాదినాశము; నాశము.[ర్థ్యము.
కోవిదత. సం. విణ. నైపుణ్యము; సామ
కోవిదారము. సం. కాంచనము†.[సుఁడు.
కోవిదుఁడు. సం తెలిసినవాఁడు; విద్వాం
కోవు. అఱ్ఱునందగు ధ్వన్యనుకరణము.
కోవురము. శత్రువును బట్టుటకై పొంచెడు పొంచు.
కోవెల. కోకిల; దేవాలయము.
కోవెలసారము. పంచమ స్వరము.
కోశకారము. సం. ఒక గినుసు చెట్టు†; పట్టుపురుగు.
కోశఫలము. సం. తక్కోలపు చెట్టు†.
కోశము. సం. కత్తియొఱ; గ్రుడ్డు; జాజికాయ బెరడు; ఒక దివ్యము; పుస్తకము, నిఘంటువు; బొక్కసము; ధనము; కరఁగి పోసిన వెండి బంగారముల ముద్ద; ముకుళము; మొగ్గ. (పంచ కోశములు—అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనంద మయము.) [రేను; పొట్ల†.
కోశాతకి. సం. బీర, ఆవడ†; ఉత్త
కోశామ్రము. సం. కొండమామిడి.
కోషము. సం. కోశము.
కోష్టు. మందుదినుసు, చెంగల్వకోష్టు†.
కోష్ఠము. సం. లోకడుపు; సామగ్రులుంచెడుకొట్టు; గాదె.
కోష్ఠసీమ. సం. సిద్ధుల నివాసస్థానము.
కోష్ణము. సం. ఇంచుక వేఁడి. విణ. ఇంచుక వేఁడిగలది.
కోసము. అవ్య. నిమిత్తమును దెలుపునది.
కోసరము. వా. నిమిత్తము, కోసము.
కోసలము. సం. ఒకదేశము. [గొలఁది.
కోసు. క్రోశము, రెండువేల విండ్లపట్టు
కోసెఁడు. విణ. క్రోశప్రమాణముగలది.
కోస్టు. కోష్టు†.

కోస్తా. ఇం. సముద్రతీరము.
కోహకము. సం. దేహము వంచుకొన్న పిల్లి.
కోహళము. సం. కాహళమను వాద్యము; బజారుమాట.
కోహళి. కుళ్లాయి, టోపి.
కోహళుఁడు. సం. నాట్యశాస్త్ర ప్రవర్తకుఁడైన ఒకముని.
కోహెూ. పరిహాసమునందగు ధ్వన్యనుకరణము.
కోళదళము. సం. నళియనెడు గంధద్రవ్యము†.
కోళై. భయశీలుఁడు. విణ. ఆశ్చర్యము నొందినవాఁడు.
కోళైతనము. భయశీలత్వము.

## కౌ

కౌ. కౌనుశబ్దముయొక్క లుప్తరూపము. రూ. కవు.
కౌంతి. సం. రేణుక†.
కౌంతికుఁడు. సం. విణ. ఈఁటెకాఁడు.
కౌఁగిలి. కవుఁగిలి. భుజాంతరము.
కౌఁగిలించు. స. క్రి. ఆలింగనము చేయు.
కౌఁగిలింత, కౌఁగిలింపు } ఆలింగనము.
కౌఁజు. ఒక పక్షి, కపింజలము.
కౌకృత్యము. సం. అకార్యము చేయుట; పశ్చాత్తాపపడుట.
కౌక్కుటికుఁడు. సం. కపటముకలవాఁడు; చేరువ చూచుచుఁబోయెడివాఁడు.
కౌక్షింభర్యము. సం. పొట్టపోసికొనువానితనము.
కౌక్షేయకము. సం. ఖడ్గము, కత్తి
కౌచు. కవుచు.
కౌటతక్షుఁడు. సం. స్వతంత్రముగా పని చేయు వడ్రంగి.
కౌటికుఁడు. సం. మృగపక్ష్యాదులనుఁజంపి విక్రయించి జీవించువాఁడు.
కౌటిల్యము. సం వంకరతనము, కుటిలత్వము.
కౌడు. కపటము.
కౌణపుఁడు. సం. మూలటేఁడు, నైరృతుఁడు.
కౌతుకము. సం. వేడుక, కౌతూహలము, కోరిక; కంకణము; పెండ్లియందు చేతఁ గట్టుకొనెడు తోరము; పండుగ; స్త్రీపురుషపరిహాసము; పైపైనవచ్చిన మేలు; సంతోషము; పాట మొదలగు సుఖము.
కౌతూహలము. సం. అనుభవింపని కోరికయందలి ఆశ, తమి.
కౌద్రవీణము సం అళ్లుపండునది(పొలము)
కౌను. నడుము; పింటినడుము.
కౌపము. సం. నూతి జలము.
కౌపీనము సం. గోఁచి; అకార్యము; గుహ్యప్రదేశము.
కౌబేరము. సం. చెంగల్వకోష్టు†; ఒక దినుసు పిండివంట.
కౌమారము. సం. ఐదేండ్లవఱకు గల వయస్సు; బాల్యమునకు ఆవలి వయోవస్థ.?
కౌమారి. సం. ఒక మాతృక.
కౌముదము. సం. కార్తికమాసము.
కౌముది. సం. చంద్రిక, వెన్నెల.
కౌమోదకి. సం. విష్ణువుయొక్క గద.
కౌయ. క్షుద్రజలచరము; చేఁపమీఁది పొలుసు.
కౌరు. వర్ణాధిక్యము.
కౌరులు. కోపులు, నతి.
కౌలటినేయుఁడు. సం. భిక్షుకిరైన పతివ్రతయొక్క కొడుకు.
కౌలటేయుఁడు. కౌలటినేయుఁడు; కౌలటేరుఁడు.
కౌలటేరుఁడు. సం. అంకుటాలి కొడుకు.
కౌలవ. సం. ఒక కరణము.
కౌలీనము. సం. గొప్ప వంశమునందలి పుట్టుక; గుహ్యము; పశుపక్ష్యాదుల జగడము; జగడము; నిందింపఁదగినది.
కౌలు హిం. రాజులు మొదలగువారు ప్రజలు మొదలగువారికి ఇచ్చిన ట్టియొడంబడిక; అభయపత్రము.
కౌలేయకము. సం. కుక్క. విణ. మంచి కులమునఁ బుట్టినది
కౌశలము. సం. నేర్పు; పనివానితనము.
కౌశలి. సం. కుశలప్రశ్నము.
కౌశల్యము. సం. కౌశలము.
కౌశికము. సం. గుడ్లగూబ; గుగ్గిలపుచెట్టు; ముంగిస.
కౌశికి. సం. ఒకానొకయేఱు; పార్వతి.
కౌశికుఁడు. సం. ఇంద్రుడు; విశ్వామిత్రుఁడు; నిఘంటువు తెలిసినవాఁడు; పాములవాఁడు.

కౌశేయము. సం. పట్టుబట్ట
కౌసీద్యము. సం. కుసీదభావము; ఆల
స్యము; కునికిపాటు.
కౌసు. మాంసము.
కౌసుమేపరి. మాంసభక్షకుఁడు. [మణి.
కౌస్తుభము. సం. విష్ణువక్షఃస్థలమునందలి
కౌళికుఁడు. సం. కులాచార తంత్రము
ననుసరించినవాఁడు; శ్రీవిద్యాసంప్ర
దాయజ్ఞుఁడు
కౌళుత్థీయము. సం. విణ. ఉలవలు పండు
నది (పొలము).

## క్ర

క్రంగు. క్రోఁగుటయందగు ధ్వన్యను
కరణము.
క్రంచఱ. అవ్య. ద్ర. శీఘ్రముగా.
క్రంత. పెండ్లికొడుకువారు పెండ్లికూఁతు
నకుఁ దీసికొని పోయెడు ప్రధాన
ద్రవ్యము; రచ్చ; సందు త్రోవ;
రంధ్రము; అంగడి.
క్రందనము } సం. ఆర్పు; ఏడ్పు;
క్రందితము } పిలుపు.
క్రందిల్లు. అ. క్రి. క్రోఁగు.
క్రందు. ఎక్కువ; శబ్దము; అతిదారుణ
ధ్వని; సందడి; ఉపద్రవము; క్రంద
నము; తెఱచు. అ. క్రి. శబ్దించు; విలపించు.
క్రందుకయ్యము. దొమ్మియుద్ధము; ఎడ
తెగనికలహము.
క్రందుకొను. అ. క్రి. అతిశయించు;
తెఱచగు. ప్రే. క్రందుకొలుపు.
క్రంప. కంప, ఎండినముండ్లమండ; కంట
కాదిభారము.
క్రకచపత్రము. సం. తేఁకు†.
క్రకచము సం. అంపము; వెణుతురు†.
క్రకచారకము. సం. గుజ్జుపుకొఱపము.
క్రకరము. సం. కక్కెర; అంపము;
వెణుతురు†.
క్రకరుఁడు సం. విణ. దీనుఁడు; బీదవాఁడు
క్రక్కస. విణ. కఠినము.
క్రక్కు. కడుపున వికారమెత్తి తిన్నది
వెడల నుమియుట; వ్యాధి విశేషము.
స. క్రి. కడుపున వికారమెత్తి తిన్నది
వెడల నుమియు.
క్రక్కున. ద్ర. క్రంచఱ.
క్రక్కెర. కక్కెర, క్రకరము.
క్రచ్చ. కాంక్ష.
క్రచ్చఱ. ద్ర. అవ్య. క్రి. విణ. నిష్కల్మష
ముగా; శీఘ్రముగా, క్రంచఱ.
క్రచ్చు. కాంక్ష; మాలిన్యము; పేనిన
తాడు మొదలగు వానియందు ఉప
యుక్తముకాని తృణాదుల అంశము.
స. క్రి. చుట్టుకొను; కాంక్షించు.
క్రచ్చుకొను. స. క్రి. చుట్టుకొను.
క్రతుధ్వంసి. సం. జన్నపుగొంగ, శివుఁడు
క్రతుభుజుఁడు. సం. జన్నపుఁదిండి,
దేవత.
క్రతువు. సం. యజ్ఞము; ఒకానొకఋషి.
క్రథనము. సం. వధ; కొల.
క్రథము. సం. ఒక దేశము.
క్రన్న. ద్ర. క్రి. విణ. అవ్య. పిమ్మట,
పశ్చాదర్థకము; మరల, పునరర్థకము;
శీఘ్రముగా.
క్రన్నన. అవ్య. శీఘ్రముగా.
క్రమణము. సం. అడుగిడుట.
క్రమము. సం. వరుస, శేడుగిడుట; అలు
ముట; బలిమి; వడఁకు. [ఆక్రమించు.
క్రమించు. సం. స. క్రి. అతిక్రమించు;
క్రముకము. సం. పోఁక; తమ్మలము;
పోఁకచెట్టు†; ఎఱ్ఱలొద్దుగు†; గంగరావి†;
నాగముస్తె†; ప్రత్తిచెట్టు†.
క్రమేలకము. సం. ఉష్ట్రము, ఒంటె.
క్రమ్మఱ. అవ్య. ద్ర. మరల, తిరుగ,
పునరర్థకము. రూ. క్రమ్మఱి.
క్రమ్మఱఁబడు }
క్రమ్మఱిలు(ల్లు) } అ. క్రి. మరలు, నివ
క్రమ్మఱు } ర్తిల్లు.
క్రమ్మఱుచు. ప్రే. మరలించు, మరల్చు.
క్రమ్మఱుదెంచు. అ. క్రి. మరలు, మరలి
వచ్చు. [వ్యాపించు.
క్రమ్ము. అ. క్రి. కవియు; పైకొను;
క్రమ్ముదల. క్రమ్ముట.

క్రమ్ముదెంచు. అ. క్రి. క్రమ్ము. [కొనుట.
క్రయము. సం. వెల; (వెలయిచ్చి)
క్రయవిక్రయికుఁడు. సం. (సరకును) కొని అమ్మెడువాఁడు, బేహారి.
క్రయించు. సం. స. క్రి. కొను, విలుచు.
క్రయికుఁడు. సం. కొనువాఁడు.
క్రయ్య. కాలువ.
క్రయ్యఁబడు. అ. క్రి. కలయు.
క్రయ్యము. సం. విణ. కొనుటకు అంగడి యందు పఱపఁబడినది.
క్రయ్యు. అ. క్రి. కలయు.
క్రల్లవడు. అ. క్రి. ఎండు.
క్రవ్యము. సం. మాంసము.
క్రవ్యాత్తు, క్రవ్యాదుఁడు, క్రవ్యాశి } సం. రాక్షసుఁడు. విణ. మాంసముతినువాఁడు.

## క్రా

క్రాంతి. సం. క్రమణము.
క్రాఁక. కాఁక.
క్రాఁగు. అ. క్రి. కాఁగు.
క్రాఁగుడు. కాఁగుడు.
క్రాఁచు. ప్రే. కాఁచు.
క్రాయకుఁడు. సం. కొనువాఁడు.
క్రాయు. స. క్రి. ధ్వనిపూర్వకముగా కళ్లె మొదలగువానిని కంఠమునుండి నోటికిఁ దెచ్చుకొను; క్రక్కు; ఊమియు.
క్రార, క్రారవడి } జడ్డయై యొక అక్షరముతో కలయు రేఫము.
క్రాలు. అ క్రి. (లెక్కము) అల్లలాడు; గిరగిరఁదిరుగు; చెదరు; సంచరించు; సంచలించు; సంభ్రమించు; వర్తిల్లు; ప్రవర్తిల్లు; ఒప్పు, ప్రకాశించు.
క్రాలుగంటి. తరళేక్షణ, చలించునట్టి కన్నులు గల స్త్రీ; స్త్రీ.

## క్రి

క్రి. విణ. క్రిందుశబ్దము యొక్క లుప్త రూపము.

క్రించు, క్రించుఁడు } విణ. అల్పుఁడు; దుష్టుఁడు. దుర్మార్గుఁడు.
క్రింద. అవ్య. అధస్సంజ్ఞ.
క్రిందట. క్రిందను, పూర్వము.
క్రిందటికత. పూర్వపు కథ.
క్రిందటిది. విణ. క్రిందిది.
క్రిందల. క్రిఁదగుతల,
క్రిందిది. విణ. క్రిందనున్నది; పూర్వమునకు సంబంధించినది. [ములు.
క్రిందిలోకములు. బ. మి. అధోలోక
క్రిందు. అధోదేశము, అధోభాగము; గతకాలము, పూర్వకాలము.
క్రిందుపడు. అ క్రి. అడుగుపడు. ప్రే. క్రిందుపఱుచు.
క్రిక్క. బట్టువాఁడు, వంది.
క్రిక్కలు. బ. పాఠకులు, వందిజనము.
క్రిక్కిఱించు. అ. క్రి. క్రిక్కిఱియు.
క్రిక్కిఱియు. అ. క్రి. ఎడములేక వ్యాపించు; సక్తమగు; మిక్కిలికదియు.
క్రిక్కు. కిఱుకు.
క్రితము. పూర్వము; మునుపు. [లక్క.
క్రిమి. సం. పురుగు; చెట్లమీఁదినల్లపురుగు;
క్రిమిఘ్నము. సం. వాయువిళంగము†.
క్రిమిజము. సం. అగురువు, అగలు.
క్రిమినల్. ఇం. విణ. నేరముల సంబంధమైన.
క్రియ. విధము. సం. భ్వాదిధాతువు; పని; చేయుట, చేష్ట, ఆరంభము; పూజ; ఉపాయము; చికిత్స; ప్రాయశ్చిత్తము; వ్యవహారమునందు నిశ్చయమును బుట్టించునట్టి లిఖితము సాక్ష్యము మొదలగునది; శిక్ష.
క్రియాకారము. సం. ప్రతిజ్ఞ.
క్రియాకారుఁడు. సం. క్రొత్తశిష్యుఁడు. విణ. పనులు చేయువాఁడు.
క్రియవంతుఁడు. సం. విణ. పనియందు పూన్కి గలవాఁడు.
క్రియ్యు. అ. క్రి. కృశించు.
క్రియ్యాట. క్రిందియాట.

## క్రి

క్రి. క్రిందు శబ్దముయొక్క లుప్తరూపము
క్రీఁగడుపు. పొత్తికడుపు.
క్రీఁదొడ. తొడకు లోపలి భాగము.
క్రీడ. సం. పరిహాసము; దూఱు; విహారము; ఆట.
క్రీడాదురము. సం ఆచ్చనగాయలాట.
క్రీడి. కిరీటి, అర్జునుఁడు.
క్రీడిచెలితేరు. విష్ణురథము, గరుత్మంతుఁడు
క్రీడించు. సం. స క్రి. ఆటాడు.
క్రీతము. సం. విశే కొనఁబడినది.
క్రీనీరు. కీనీరు (అర్ద్రిము).
క్రీవాడ. పాటిపొలము.

## క్రు

క్రుంకు. మునుక, మజ్జనము, స్నానము; అస్తమానము. అ. క్రి. తగ్గు; మునుఁగు; అస్తమించు; చచ్చు.
క్రుంకుకొండ. అస్తాద్రి.
క్రుంకుడు అస్తమయము.
క్రుంకుడుగట్టు, క్రుంకుమల, క్రుంకుమెట్టు } అస్తపర్వతము, అస్తాద్రి.
క్రుంగఁబడు. అ.క్రి. క్రుంగు.
క్రుంగిలు. అ.క్రి. క్రుంగు.
క్రుంగు. అ.క్రి. క్రిందికి అడఁగు; దిగఁబడు
క్రుంచము. సం. క్రౌంచపక్షి.
క్రుక్కి. వంచనము.
క్రుక్కిదము. విశే. నిండినది; పూడినది.
క్రుక్కు. స. క్రి. పేలు మొదలగువానిని చేతి బొటనవ్రేలితో చదుపు; అడఁచు; తుఱుగు; బలవంతమున లోపల వేసి క్రుక్కు.
క్రుక్కుడు. క్రుక్కుట.
క్రుధ. సం. కోపము.
క్రుద్ధుఁడు. సం. విశే. కోపపడినవాఁడు.
క్రుమ్మరిలు, క్రుమ్మరిల్లు, క్రుమ్మరు } అ. క్రి. సంచరించు.
క్రుమ్ము. (కొమ్ముల) పొడుపు. స. క్రి. పొడుచు.
క్రుమ్ముడు. క్రుమ్ముట.
క్రుమ్ముడుపడు. అ. క్రి. పోటుపడు.
క్రుమ్ములాడు. అ. క్రి. క్రుమ్మకొని పోట్లాడు.
క్రుయ్యఁబాఱు. అ. క్రి. క్రుయ్యు.
క్రుయ్యు. అ. క్రి. కృశించు; అయిదుపడిచేయు; వెనుదీయు.
క్రుష్టము. సం. ఏడుపు; సద్దు.
క్రుళ్లగించు. అ. క్రి. (మనస్సులో) దుఃఖించు.
క్రుళ్లగింత. (మనసులో) దుఃఖించుట.
క్రుళ్లు. అ. క్రి. అంగలార్చు; అవియు; (కాలమతిక్రమించుటచే ఫలాదులు) నలుపుపాఱి చెడు.
క్రుళ్లుపోతు. విశే. క్రుళ్లగించుస్వభావము గలవాఁడు.

## క్రూ

క్రూరము. సం. విశే. నొప్పించునది; భయంకరమైనది; గట్టిది.
క్రూరు. విశే. వాఁడి.
క్రూరుఁడు. సం. పరులను పీడించువాఁడు.

## క్రే

క్రే. విశే. క్రేవ శబ్దము యొక్క లుప్తరూపము.
క్రేఁటు. అ. క్రి. గొంతడుపు తీఱుటకు సకిలించినట్లు శబ్దించు; తొట్రుపడు.
క్రేఁటుకొను. అ. క్రి. క్రేఁటు.
క్రేగన్ను. కటాక్షము, కడకన్ను.
క్రేగయి. హస్తాగ్రము; వామహస్తము.
క్రేడి. సంబావుతోఁగలసిన కారు మొదలగు ఎఱ్ఱవడ్లు.
క్రేడించు. అ. క్రి. తొలఁగు. స. క్రి. అలక్ష్యము చేయు.
క్రేడిసేయు. స. క్రి. పరిహాసము చేయు.
క్రేణి. ఉన్నతపదము; పరిహాసము.

క్రేణించు. స. క్రి. అలక్ష్యముచేయు.
క్రేణిసేయు. స. క్రి. పరిహాసముచేయు
క్రేతొట్టు. అ క్రి. గట్టొరయు.
క్రేపు. మేతపట్టినదూఁడ; పర్వతశిఖరము.
క్రేయము. సం. విణ. కొనఁదగినది.
క్రేయో. వెడలఁగొట్టుటయందగు ధ్వన్యను
కరణము.
క్రేవ పార్శ్వము, ఒకవైపు. [కరణము.
క్రేవు. సింహనాదమునందలి ధ్వన్యను
క్రేళ్లు. బ. ఉన్నతి; గంతులు; పరుగులు.
క్రేళ్లుదాఁటు అ. క్రి. ఎగిరిపడు;గంతులిడు.
క్రేళ్లుబ్బు. అ. క్రి. అతిశయించు.
క్రేళ్లువాఱు అ. క్రి. గంతులిడు.
క్రేళ్లుఱుకు. అ క్రి. ఎగిరిపడు; గంతులిడు;
దూఁకు.

## క్రై

క్రైలు. ధాన్యమునుతెచి కొలుచుట,
ఒబ్బిడి.
క్రైలుదారి. క్రైలుచేయించెడి అధికారి
క్రైస్తవుఁడు. ఇం. క్రిస్టియన్, క్రీస్తు
మతస్థుఁడు.

## క్రొ

క్రొ. విణ. క్రొత్తశబ్దముయొక్క లుప్త
రూపము.
క్రొం. నూతనమైనది.
క్రొంకి. కొంకి.
క్రొంచె. కొంచ.
క్రొంజాయ. నూతనకాంతి.
క్రొంజిగురు. లేఁజిగురు. [మన్మథుఁడు.
క్రొంజిగురులవిల్కాఁడు. పల్లవాస్త్రుఁడు,
క్రొంజిలుఁగుజెల్వ. క్రొత్తసన్నవస్త్రము.
క్రొంజీఁకటి. మునిచీఁకటి.
క్రొందావి. క్రొత్తతావి, నూతనపరిమళము
క్రొందొడిమ. క్రొత్తతొడిమ.
క్రొంబట్టు. క్రొత్తపట్టు.
క్రొంబని. నూతన శిల్పము.
క్రొంబిడి. క్రొత్తపిడి.
క్రొంబువ్వు. క్రొత్తపువ్వు.
క్రొంబులకలు. క్రొత్తపులకలు. [కాఁడు.
క్రొంబూవిలుకాఁడు. క్రొత్త పూ విలు
క్రొంబెరుగు. నూతనదధి.
క్రొంబొగ. క్రొత్తపొగ.
క్రొక్కారము. కొడికూఁత.
క్రొక్కారు. క్రొత్తకారు, వర్షాకాలము.
క్రొత్త. విణ. నూతనము; అపూర్వము.
క్రొత్తడము. కోటబురుజు.
క్రొత్తడి మగనాలు; పతివ్రత.
క్రొత్తముట్టు. వడక నారంభించినప్పుడు
ఏకునుండి ఫురిలేక చాఁగదీసి కదురున
కంటించెడు నూలు; ప్రథమార్తవము.
క్రొత్తళము. క్రొత్తడము.
క్రొత్తావి. క్రొందావి.
క్రొన్ననవిలుకాఁడు. పుష్పధన్వుఁడు.
క్రొన్ననవిలుకానితండ్రి. విష్ణువు.
క్రొన్నెలలు. బ. కపోలోరుకటోపరి
ప్రదేశములయందలి నఖక్షతములు.
క్రొమ్మి. ఎఱ్ఱగోరంట†.
క్రొమ్ముడి. కేశబంధవిశేషము.
క్రొవ్విదము. దుష్కార్యము; ప్రాయము.
క్రొవ్వు. మదము; గర్వము; బొడ్డుక్రింద
నుండెడు పొర మాంసము; బలము;
మెదడు. అ. క్రి. మదించు, దర్పితుఁడగు.
క్రొవ్వగొను. అ. క్రి. మదించు.
క్రొవ్వెద. కబరి, కొప్పు.

## క్రో

క్రోఁత. కోఁతి.
క్రోడము. సం. ఒడి; ఱొమ్ము; పంది.
క్రోడాడు. స. క్రి. కోరాడు. [కరించుట.
క్రోడీకరణము. సం. ఆలింగనము; క్రోడీ
క్రోడీకరించు సం స క్రి. ఒకటిగాచేర్చు.
క్రోడుఁడు. సం. శనిగ్రహము; వరాహ
మూర్తి. [విణ. కోపముఁగలది.
క్రోధన. సం. బెండ†; ఒక సంవత్సరము.
క్రోధనుఁడు. సం. విణ. కోపస్వభావము
గలవాఁడు.
క్రోధము. సం, కోపము; కినుక.

క్రోధి. సం. ఒక సంవత్సరము. విణ. కోపముగలవాఁడు.
క్రోధించు. సం. స. క్రి. కోపగిల్లు.
క్రోయు. స, క్రి. విషమముగా చాఁచు.
క్రోల. క్రోవి.
క్రోలగచ్చు. వాకూచి†.
క్రోలు. క్రోవి. స.క్రి. అనుభవించు; తిను; త్రాగు; గ్రహించు; తామరనాళము.
క్రోలుకనవు తృణవిశేషము†.
క్రోలుచు. అ. క్రి. శబ్దించు. ప్రే. క్రోలఁజేయు. రూ. క్రోల్చు.
క్రోవ. సరము; దర్పాపుయము.
క్రోవి. వెదురుగొట్టము; అనుపోసెడు గొట్టము; పిల్లనగ్రోవి; తుపాకి; బుడ్డి; భూమిలోపల నీళ్లువచ్చుటకు ఏర్పఱచిన మార్గము; మూస; ఎఱ్ఱగోరంట†; కానుగు†; కురవకము†.
క్రోవెముక. కోలెముక.
క్రోశము. సం. కోసు.
క్రోష్టము. సం గనుసు†. [గాడి†.
క్రోష్టుపుచ్ఛిక. సం. కోలపొన్న, పొర్ల
క్రోష్టువిన్న సం. నక్కతోఁకపొన్న†.
క్రోష్టువు. సం. జంబుకము, నక్క.
క్రోష్ట్రి. సం. ఆఁడునక్క; తెల్లనేలగుమ్మడి†; లాంగలి†.
క్రోసు. కోసు, క్రోశము.

## క్రౌ

క్రౌంచదారణుఁడు. సం. కుమారస్వామి.
క్రౌంచము. సం. ఒకకొండ; ఒకద్వీపము; ఒకపక్షి.
క్రౌర్యము. సం. క్రూరభావము.

## క్ల

క్లమథము } సం. బడలిక; వాడిపోవుట.
క్లమము. }

## క్లా

క్లాంతము. సం.విణ. బడలినది; అలసినది.
క్లాంతి. సం. క్లమము, బడలిక.

## క్లి

క్లిన్నము. సం. విణ. తడిసినది.
క్లిశితము. సం. విణ. దారిద్ర్యాదులచేత క్లేశము నొందినది.
క్లిష్టము. సం. ఒక చిత్తవృత్తి; ఒక శబ్ద దోషము. విణ. క్లేశమునొందినది, అసంగతము (వాక్య).

## క్లీ

క్లీతకము. సం. అతిమధురము.
క్లీతకిక. సం. నీలిచెట్టు†. [మము లేనిది.
క్లీబము. సం నపుంసకము. విణ. విక్ర
క్లీబుఁడు. సం. నపుంసకుఁడు; పంద.

## క్లే

క్లేదము. సం. ఆర్ద్రిత, తడి. [సాయము.
క్లేశము. సం. దుఃఖము; కోపము; వ్యవ

## క్లై

క్లైబ్యము. సం. పిఱికితనము; మగతనము లేమి.

## క్లో

క్లోమము. సం. కడుపులో నొకప్రక్క నుండెడి యొఱ్ఱని మాంసము; నీరుతిత్తి.

## క్వ

క్వణనము } సం. వీణె మొదలగువాని
క్వణము } మ్రోఁత.
క్వథితము. సం.విణ. అగ్నిచేత చక్కగా మఱిఁగినది (కాఁగినది).
క్వయినా. ఇం. శీతజ్వరముల కౌషధము.

## క్వా

క్వాణము. సం. వీణాది ధ్వని.
క్వాథము. సం. బాధ; కషాయము.
క్వాథోద్భవము. సం. ప్రాని పసుపున పండిన అంజనవిశేషము.

## క్వి

క్విట్రెంటు. ఇం. మాన్యములమీఁద నీయఁబడు అల్పమైన పన్ను.

## క్ష

క్షంత. సం. విణ. ఓర్పరి, ఓర్పుగలవాఁడు
క్షణద. సం. రాత్రి.
క్షణదము. సం. నీళ్లు.
క్షణదుఁడు సం. జోస్యుఁడు.
క్షణనము. సం. వధము, కొల.
క్షణప్రభ. సం. తటిత్తు, మెఱపు.
క్షణభంగురము. సం. విణ. త్రుటిలో నశించునది.
క్షణము. సం. పది విగడియలకాలము; ఉత్సవము, తిరునాళ్ల; పండుగ; వ్యాపారలేమి; సమయము.
క్షణిక. సం. మెఱపు.
క్షణియించు. సం. స. క్రి. భోజనార్థము వరించు. రూ. క్షణించు.
క్షతజము. సం. నెత్తురు.
క్షతము. సం. గాయము. విణ. గాయము నొందినది; నాశమునొందినది.
క్షతి. సం. గాయము; నాశము.
క్షత్త. సం. క్షత్రియస్త్రీయందు శూద్రునకుఁ బుట్టినవాఁడు; దాసీపుత్రుఁడు; సారథి; ద్వారపాలకుఁడు; బ్రహ్మ.
క్షత్రబంధువు. సం. విణ. స్వధర్మములేక క్షత్రియునకు బంధుమాత్రుఁడైనవాఁడు
క్షత్రము. సం. శరీరము; క్షత్రియజాతి.
క్షత్రియ, క్షత్రియాణి } సం. రాచది, క్షత్రియస్త్రీ
క్షత్రియి. సం. రాచవాని పెండ్లాము.
క్షత్రియుఁడు. సం. రాచవాఁడు.
క్షత్తుఁడు. సం. క్షత్రియుఁడు.
క్షప. సం. రాత్రి.
క్షపణకుఁడు. సం. బౌద్ధమతస్థుఁడు.
క్షపణము. సం. అశుచిభావము. విణ. సిగ్గులేనిది.
క్షపాకరుఁడు. సం. చంద్రుఁడు.
క్షపాత్యయము. సం. ప్రాతఃకాలము.
క్షమ. సం. ఓర్పు; భూమి.
క్షమము. సం. విణ. యుక్తము; సమర్థము.
క్షమి. సం. ఓర్పరి, ఓర్పుగలవాఁడు.
క్షమించు. సం. క్షమియించు. స. క్రి. ఓర్చు, మన్నించు.
క్షమిత. సం. విణ. క్షమి.
క్షమియించు. సం. స. క్రి. మన్నించు; శమింపఁజేయు; అడఁచు.
క్షముఁడు. సం. విణ. శక్తుఁడు; హితుఁడు
క్షయ. సం. ఒకసంవత్సరము; ఒకరోగము.
క్షయము. సం. అఱుదెవులు; తగ్గుదల; నాశము; ప్రళయము; ఇల్లు. [నశించు.
క్షయించు. సం. స. క్రి. క్షీణించు; తగ్గు;
క్షయ్యము. సం. విణ. క్షయింపఁదగినది.
క్షరపురుషుఁడు. సం. క్షరుఁడు.
క్షరము. సం. నీళ్లు; మబ్బు; సమస్తభూత సముదాయము. విణ. నాశముగలది.
క్షరియించు. అ. క్రి. నశించు; స్రవించు కాఱు; పుట్టు.
క్షరుఁడు. సం. క్షరపురుషుఁడు, నశించు స్వభావముగల సమస్త భూత సముదాయము.
క్షవథువు. సం. తుమ్ము; దగ్గు.
క్షవము. సం. తుమ్ము; నల్లావలు†.

## క్షా

క్షాంతము. సం. విణ. ఓర్వఁబడినది.
క్షాంతి. సం. క్షమ, ఓర్పు.
క్షాత్రము సం. క్షత్రధర్మము. [కృశము.
క్షామము. సం. దుర్భిక్షము, కఱవు. విణ.
క్షారకము. సం. కసుగాయ; (పక్షులు, మత్స్యములు మొదలగువానిని బట్టి వేసెడి) బుట్ట; లేఁతమొగ్గ; మొగ్గలగుమి.
క్షారణము. సం. తిట్టు.
క్షారము. సం. ఉప్పు; కారణము; గాజు; బూడిద; ఉమ్మెత్త.
క్షారాబ్ధి. సం. ఉప్పుసముద్రము.
క్షారితము. సం. విణ. కాఱినది.
క్షారితుఁడు. సం. విణ. పరస్త్రీగమనాది దోషములచేత దూఱఁబడినవాఁడు.

క్షారోదము. సం. క్షారాబ్ధి.
క్షాళనము. సం. కడుగుట.
క్షాళితము. సం. విణ. కడుగఁబడినది.

## క్షి

క్షితి. సం. భూమి; ఉనికి; చిటిక వేయునంత కాలము; నాశము; సంఖ్యా విశేషము, ఒకటి.
క్షితిధరము. సం. నేలతాలుపు, పర్వతము
క్షితిపతి. సం. నేలఱేఁడు.
క్షిప. సం. క్షేపణము, ప్రేరేఁపించుట.
క్షిప్తము. సం. విణ. త్రోయఁబడినది; ఉంచఁబడినది; వైవఁబడినది.
క్షిప్నువు. సం. విణ. తిరస్కరించువాఁడు.
క్షిప్రము. సం. క్రి. విణ. వేగము, శీఘ్రము; వడిగలది.
క్షిప్రశ్యేనము. సం ఏట్రింత.
క్షియ. సం. క్షయము, తగ్గుదల.

## క్షీ

క్షీణము. సం. విణ. తగ్గిపోయినది.
క్షీణించు. సం. అ. క్రి. క్షీణమగు.
క్షీబము. సం. విణ. మత్తిల్లినది.
క్షీబుఁడు సం. విణ. క్రొవ్విన వాఁడు; సురాపానాదిమత్తుఁడు.
క్షీరకంఠము. సం. హంస.
క్షీరకాకోలి. సం. పిన్నపాల†.
క్షీరగ్రాహి. సం. నీలరత్నము; హంస.
క్షీరము. సం. పాలు, నీళ్ళు,
క్షీరమోరట. సం. చేఁగొణద†.
క్షీరవిదారి. సం. నల్లనేలగుమ్మడు†.
క్షీరశుక్ల. సం. తెల్లనేలగుమ్మడు†.
క్షీరాకరము. సం. క్షీరాబ్ధి
క్షీరాబ్ధి. సం. పాలసముద్రము.
క్షీరాబ్ధితనయ. సం. లక్ష్మీదేవి.
క్షీరావి. సం. చిఱుపాల†.
క్షీరాశము. సం. హంస.
క్షీరిక. సం. పాలచెట్టు.
క్షీరోదకన్యాయము. సం. నీళ్ళును పాలును గలసి నట్లొక్కటిగాఁ గలసియుండు ధర్మము.
క్షీరోదకముపట్టు. మి. వస్త్రవిశేషము.
క్షీరోదజ. సం. లక్ష్మీదేవి.
క్షీరోదము. సం. పాలసముద్రము.

## క్షు

క్షుణ్ణము. సం. విణ పొడిచేయఁబడినది; గుణింపఁబడ్డది.
క్షుణ్ణుఁడు. సం. విణ. వ్యుత్పన్నుఁడు.
క్షుతము. సం. తుమ్ము.
క్షుతాభిజననము. సం. నల్లావలు.
క్షుత్తు. సం. ఆఁకలి.
క్షుద్ర. సం. ఈఁగ; తేనెటీఁగ; వేశ్య; అంగహీనురాలు; నాట్యమాడెడుస్త్రీ; హింసించెడుస్త్రీ; పులిచింత†; వాఁకుడు†
క్షుద్రకము. సం. కసవుకోల, బాణ విశేషము.
క్షుద్రము. సం. విణ. అల్పము; తుచ్ఛము
క్షుద్రమూలకము. సం. పిన్నముల్లంగి†,
క్షుద్రశంఖము. సం. నత్తగుల్ల.
క్షుద్రుఁడు. సం. విణ నీచుఁడు, అధముఁడు; అల్పుఁడు; లోభి; హింసకుఁడు
క్షుధ. సం. ఆఁకలి.
క్షుధితుఁడు. సం. ఆఁకలిగొన్న వాఁడు.
క్షుపము. సం. కుఱుచకొమ్మలును ఊడలునుగలచెట్టు†.
క్షుబ్ధము } క్షుభితము } సం. విణ. కలఁతపెట్టఁబడినది.
క్షుమ. సం. నీలిచెట్టు†; నూనె అగిసె†.
క్షురకము. సం గొలిమిడి†; పల్లేరు†; బొట్టుగు†.
క్షురకుటి. సం మంగలిపొది.
క్షురప్రము. సం. అర్ధచంద్రబాణము.
క్షురము. సం. మంగలికత్తి; గొలిమిడి†; పల్లేరు†.
క్షురి. సం. మంగలి.
క్షురిక. సం. మంగలికత్తి. [నీచము.
క్షుల్లకము. సం. నత్తగుల్ల. విణ. అల్పము;
క్షుల్లకుఁడు. సం. విణ. నీచుఁడు; కొంచెపు వాఁడు; పేద.

## క్షే

క్షేత్రజుఁడు. సం. మగని ఆజ్ఞచేత అన్యునకుఁ బుట్టిన కొడుకు.
క్షేత్రజ్ఞుఁడు. సం. జీవుఁడు; ఆత్మ.
క్షేత్రపాలుఁడు. సం. భైరవుఁడు.
క్షేత్రము. సం. పొలము; పరిమడి; గణిత శాస్త్రవిశేషము; భార్య; శరీరము; పుణ్యభూమి; సిద్ధస్థానము. బ. ఏనుఁగుయొక్క హస్త వదన దంత శిరో నయన కర్ణ గ్రీవా గాత్రోరః కాయ మేఢ్ర పాదములు.
క్షేత్రాజీవుఁడు. సం. విణ. దున్నుకొని బ్రదువాఁడు.
క్షేత్రియము. సం. విణ. మడియందుఁ బుట్టినది. (తృణము)
క్షేత్రియుఁడు. సం. విణ. పరదారరతుఁడు.
క్షేపణము. సం. ప్రేరేఁపించుట; చిమ్ముట; త్రోయుట.
క్షేపణి. సం. ఓడనడుపు గడ; ఒక వల.
క్షేపము. సం. చిమ్ముట; త్రుళ్లు; తిరస్కారము; కడపుట; దూఱు; పూఁత; ప్రేరణము.
క్షేపిష్ఠము } సం. మిక్కిలి వడిగలది.
క్షేపీయము }
క్షేమ. సం. పార్వతి.
క్షేమంకరుఁడు. సం. విణ. మేలుచేయువాఁడు.
క్షేమకారి. సం. విణ. క్షేమము కలిగించువాఁడు; గరుత్మంతుఁడు.
క్షేమతండులములు. సం. బ. త్రోవకు కట్టిన బియ్యము.
క్షేమము. సం. కలిగినది చెడకుండుట; శుభము; బలురక్కెసి†.
క్షేమ్యుఁడు సం. గరుత్మంతుఁడు.

## క్షై

క్షైత్రము. సం. క్షేత్రముల సమూహము.

## క్షో

క్షోణి. సం. భూమి; ముంజతృణముచే నల్లిన బ్రహ్మచారి మొలత్రాడు; సంఖ్యావిశేషము; ఒకటి.
క్షోణీజము. సం. చెట్టు†.
క్షోణీరథుఁడు. సం. శివుఁడు.
క్షోదము. సం. నూఱుట; పొడి.
క్షోదిష్ఠము } సం విణ. మిక్కిలిక్షుద్రము.
క్షోదీయము }
క్షోభము. సం. కలఁత, దోఁపుడు; అలజడి.
క్షోభించు. సం. స. క్రి. కలఁతపడు.
క్షోభితము. సం. విణ. కలఁతపెట్టఁబడినది.

## క్షౌ

క్షౌద్రము. సం. తేనె; నీళ్లు.
క్షౌమము. సం. తెల్ల పట్టువస్త్రము; నారచీర; నూనెయగిసె నారచీర; కుందేటి త్రుప్పటిచీర; తెల్లచీర; యుద్ధార్థము కోటవాకిటి మండపముమీఁదగాని కొత్తళముమీఁదగాని యేర్పఱచిన గది.
క్షౌరము. సం. గొఱుగుట, మంగలిపని.
క్షౌరికుఁడు. సం. మంగలవాఁడు.

## క్ష్ణు

క్ష్ణుతము. సం. విణ. వాఁడిచేయబడినది.

## క్ష్మ

క్ష్మ. సం. భూమి; స్థానము; నిద్ర; ఒకటి యను సంఖ్య.
క్ష్మాజము. సం. చెట్టు†.
క్ష్మాపాత్రుఁడు. సం. రాజు.
క్ష్మాభృత్తు. సం. కొండ; రాజు.

## క్ష్వి

క్ష్వింక. సం. ఎఱ్ఱనిమొగముగల ఆఁడుకోఁతి.
క్ష్వింకము. సం. ఎఱ్ఱనిమొగముగల మగకోఁతి.

## క్ష్వే

క్ష్వేడ. సం. వెదురుసలాక; పెడబొబ్బ, సింహనాదము.
క్ష్వేడము. సం. ఆవడపువ్వు; ఎఱ్ఱజిల్లేడుకాయ; చెవుడు; మ్రోఁత; విషము. విణ. పొందరానిది; వంకరైనది.
క్ష్వేడితము } సం. సింహనాదము.
క్ష్వేళ }
క్ష్వేళము. సం. విషము.
క్ష్వేళితము. సం. సింహనాదము.

# ఖ

ఖంగు. కంఠఘంటాది ధ్వన్యనుకరణము.
ఖంగుఖింగు. ఆయుధము లొకటితో నొకటి తాఁకినప్పుడు కలిగెడు ధ్వన్యను కరణము.
ఖంజ.సం. ఛందోవిశేషము. విణ.కుంటిది.
ఖంజనము. సం. మందపిచ్చుక.
ఖంజపాదము సం. బాలక్రీడావిశేషము.
ఖంజరి. సం. వాద్యవిశేషము.
ఖంజరీటము సం.తుమ్మెద; కాటుకపిట్ట
ఖంజుఁడు. సం. కుంటివాఁడు.
ఖండ.సం.గర్భాధానాది విధి ప్రతిపాదక గ్రంథము; వేదములో నొక భాగము.
ఖండకము. సం గోఁచి
ఖండనము. సం. నఱకుట.
ఖండపరశువు(ఁడు). సం. శివుఁడు; పరశు రాముఁడు; రాహువు; సున్నము పూయు వాఁడు; ఖండాలకమనెడు మందు.
ఖండము. సం. తునుక; పులకందము; రత్నదోషము.
ఖండశర్కర. సం. పులకండము.
ఖండా. పెద్ద కత్తి.
ఖండించు. సం. స క్రి. తునుకలు చేయు, నఱకు; ఇట్టిదియని నిష్కర్షగా చెప్పు
ఖండిక } చిన్న పల్లె.
ఖండ్రిక }
ఖండికము. సం. ధాన్యవిశేషము.
ఖండిత. సం. నాయకుఁడు రాత్రి మఱి యొక దాని యింటికి పోయి ఆ చిహ్న ములతో రాఁగా చూచి కోపమునొందిన నాయిక. [నిష్కర్ష చేయఁబడినది.
ఖండితము. సం. విణ. నఱకఁబడినది;
ఖండీ. హిం. పుట్టి.
ఖండీరము. సం. పచ్చపెసలు.
ఖండువా. పై వస్త్రము.
ఖంబు. సం. ఆకాశము; స్వర్గము; అభా వము; ఇంద్రియము; తెలివి; పట్టణము; పరిమడి; సుఖము; సున్న.
ఖగము సం. పక్షి; బాణము; గ్రహము.
ఖగుఁడు. సం. సూర్యుఁడు; వేలుపు.
ఖగేశ్వరుఁడు. సం. గరుత్మంతుఁడు.
ఖచరము. సం. పక్షి; మేఘము; గాలి.
ఖచరుఁడు. సం. దేవుఁడు; సూర్యుఁడు
ఖచించు. సం. స. క్రి. కూర్చు, చెక్కు, పొదుగు. [పొదుగఁబడినది.
ఖచితము సం. విణ. చెక్కఁబడినది,
ఖజపము, సం. మిల్లి; కొయ్యతెడ్డు.
ఖజాక. సం. గరిటె.
ఖజానా. హిం. ధనాగారము.
ఖటము సం. పిడికిలి.
ఖటిక } సం. బలపము.
ఖటిని }
ఖట్టి. సం పాడె.
ఖట్టిక. సం. గద్దియ; పాడె.
ఖట్టికుఁడు. సం. వేఁటకాఁడు.
ఖట్వా. సం. మంచము.
ఖడ్గము సం. ముప్పదియాఱంగుళముల కత్తి; ఖడ్గమనెడుమృగము; ఖడ్గమృగము కొమ్ము.
ఖడ్గాఖడ్గి. సం. అవ్య. ఒండొరులుకత్తు లతోఁ చేయు యుద్ధము. [వాఁడు.
ఖడ్గి. సం. ఖడ్గమృగము. విణ. కత్తిగల
ఖతమాలము. సం. పొగ; మబ్బు.
ఖతలము. సం. ఆకాశము.
ఖతిలకము. సం. సూర్యుఁడు.
ఖత్తు. హిం. రీతి; దస్తూరి.
ఖదిర. సం. ముడుఁగుఁ దామర†.
ఖదిరము. సం. చంద్ర†.
ఖదిరుఁడు. సం. ఇంద్రుఁడు.
ఖద్దరు. ఖాదీ, నూలువడికి నేసిన వస్త్రము
ఖద్ది. బలము.
ఖద్యోతము సం. మెఱుఁగుడుఁ బురుగు.
ఖద్యోతుఁడు. సం. సూర్యుఁడు.
ఖనకము. సం. ఎలుక; పందికొక్కు. రూ. ఖానకము.
ఖనకుఁడు. సం. ఉప్పరవాఁడు; కన్నపు దొంగ. విణ. త్రవ్వెడువాఁడు.
ఖనము. సం. అత్యుష్ణము.
ఖని. సం. గని, రత్నాదులు పుట్టెడు చోటు. రూ. ఖాని.
ఖనిత్రము. సం. గడ్డపాఱ; గుద్దలి.

ఖనిత్రి. సం. పాఱ.
ఖపుటుఁడు. సం. అన్నము ఆకులోఁ
బెట్టుకొనక చేతఁ బెట్టుకొని భుజించు
వ్రతము గలవాఁడు.
ఖపురము. సం. పోఁకజబర; పోఁక చెట్టు;
మ్రానిబంక; నాగముస్తె†. [త్సరము.
ఖర. సం. డావరడంగిచెట్టు; ఒక సంవ
ఖరకరుఁడు. సం. సూర్యుఁడు.
ఖరకుటి. సం. మంగలి యిల్లు.
ఖరక్వాణము. సం, తీతువుపిట్ట.
ఖరడా. అధికారి.
ఖరణసుఁడు. స. విణ. వాఁడి ముక్కు
వాఁడు, గద్ద ముక్కువాఁడు.
ఖరదండము. సం. జలపుష్పము; కమల
ము; ఆయుధము; ఖరనాళము.
ఖరపుష్ప. సం. వాయింట†.
ఖరమంజరి. సం. ఉత్తరేను†.
ఖరము. సం. గాడిద; ఎండుపోఁక; వాఁ
డిమి; వేఁడిమి. విణ. వాఁడిమిగలది;
వేఁడిమిగలది.
ఖరాగా. హిం. క్రి.విణ. సరిగా, స్థిరముగా.
ఖరాబు. హిం. చెడ్డవాఁడు; చెడ్డది.
ఖరారము. సం. కోఅపము.
ఖరాశ్వ. సం. ఓమము†. [జూదము.
ఖరిఖలము. సం. పందెము వేసి ఆడెడు
ఖరీదు. హిం. వెల, మూల్యము.
ఖరుఁడు. సం. ఒక రాక్షసుఁడు.
ఖరువు. సం. గర్వము; గుఱ్ఱము; పల్లు;
శివుఁడు. విణ. తెల్లనిది; వాఁడిమిగలది.
ఖర్చు. హిం. వ్యయము.
ఖర్జువు. సం. దురద; ఒక పురుగు; చిట్టీఁదు†
ఖర్జూరము. సం. వెండి; తేలు; పేరీఁతు,
ఫలవృక్షవిశేషము†. బ ధాన్యవిశేషము.
ఖర్జూరి. సం. చిట్టీఁదు†. [తలపుర్రె.
ఖర్పరము. సం. బిచ్చమెత్తెడు కప్పెర;
ఖర్పరి. సం. పాలతుత్తము.
ఖర్పరుఁడు. సం దొంగ.
ఖర్వటము. సం, పాలెము; సన్నాఱు
ఊళ్లకసుబా; కొండదాన నాశ్రయించి
యుండెడు పల్లె.
ఖర్వము. సం. ఒకనిధి; సంఖ్యావిశేషము.
విణ. అధమము; పొట్టిది.

ఖర్వాటుఁడు. సం. విణ. బట్టతలవాఁడు.
ఖర్వుఁడు. సం. విణ. పొట్టివాఁడు.
ఖలతి. సం. విణ. బట్టతలవాఁడు.
ఖలపువు. సం. విణ. కళ్లమూడ్చువాఁడు.
ఖలము. సం. కళ్లము; చోటు; నేల;
పాపము. విణ. అధమము; క్రూరము;
నీచము.
ఖలినము. సం. కళ్లెము.
ఖలిని. సం కళ్లములసమూహము; ఖలుంల
సమూహము; మురయనెడు గంధ
ద్రవ్యము†.
ఖలీనకము } సం. గుఱ్ఱపు కళ్లెము.
ఖలీనము }
ఖలుఁడు సం. దుర్జనుఁడు.
ఖల్య. సం. కళ్లములసమూహము; ఖలుంల
సమూహము.
ఖల్లము. సం. తోలు; పల్లము; వస్త్ర
విశేషము; వానకోయిల.
ఖల్వాటము. సం. బట్టతల.
ఖసూచి. సం. విణ. ఆకాశము చూపు
వాఁడు, మందమతి.
ఖస్థసము. సం. గసగసా†.
ఖళూరిక. సం. సాముకూటము, గరిడీసాల

## ఖా

ఖాండవము. సం. ఇంద్రునియొక్క ఒక
వనము.
ఖాటి. సం. పాడె. రూ. ఖాటిక.
ఖాణము } గుఱ్ఱము మొదలగువానియొక్క
ఖాణా } యులవలు మొదలుగాఁగల
భక్ష్యము. [ఉలవలు.
ఖాణాదిను. హిం. అశ్వాదులకుఁ బెట్టెడు
ఖాతకము. సం. అగడ్త. రూ. ఖాతిక.
ఖాతము. సం. పుష్కరిణి, కోనేఱు.
ఖాతకుఁడు. సం. విణ. త్రవ్వెడువాఁడు;
అప్పుతీసెడువాఁడు.
ఖాతిరు. హిం. లక్ష్యముచేయుట.
ఖాదకుఁడు. సం. విణ. తిను వాఁడు;
అప్పుతీసెడువాఁడు.
ఖాదనము. సం. తినుట; తిండి; పల్లు.
ఖాదితము. సం. విణ. తినఁబడినది.

ఖాదిరము. సం. కవిరియుండ.
ఖాదీ. ఖద్దరు. [తినఁదగినది.
ఖాద్యము. సం. తినఁదగిన ఖండము. విణ.
ఖాను } హిం. తురుష్క ప్రభువు.
ఖానుఁడు }
ఖాన్నిఘాలు. బ. భయముగొల్పు పనులు.
ఖాన్మహాలు. ఖానుని స్వంత సిబ్బంది.
ఖామందు. హిం. యజమాని. [గట్టిగా.
ఖాముఖా. హిం. క్రి.విణ. అగత్యముగా,
ఖాయము. హిం. విణ. స్థిరము.
ఖాయిదా. హిం. కాయిదా.
ఖాయిలా. హిం. విణ. కాయిలా.
ఖారి. సం. పుట్టి; ఇద్దుము.?
ఖారీకము. సం. విణ. పుట్టెఁడు విత్తులు విత్తఁదగినది. (పొలము)
ఖాళి } హిం. విణ. ఆక్రమింపఁబడని, ఉత్త.
ఖాళీ }
ఖావందు. హిం. ఖామందు.
ఖ్వాందు. హిం. ఖామందు.
ఖాసా. హిం. విణ. స్వంత.

## ఖి

ఖిన్నము. సం. విణ. ఖేదమునొందినది.
ఖిన్నుఁడు. సం. విణ. అవమానపడి యూరకున్న వాఁడు
ఖిరదారు. కృషి; వ్యవసాయము లెక్క.
ఖిలము. సం. దున్నని బీటినేల. విణ. చెడినది.
ఖిలీభవించు. సం. అ.క్రి. చెడు.

## ఖు

ఖుదా. హిం. దేవుఁడు; స్వయంభువు.
ఖుద్దున. హిం. క్రి. విణ. స్వంతముగా.
ఖురణసుఁడు. సం. విణ. బుఱ్ఱముక్కు వాఁడు. [గంధద్రవ్యము†.
ఖురము. సం. డెక్క, గొరిజ; నఖము నెడు
ఖురముఖము. సం. బూరగొమ్ము.
ఖురళి. సం. సాము; గరిడీశాల.
ఖురాకము. సం. మృగవిశేషము.
ఖురాలకము. సం. ఇనుపబాణము.
ఖుర్దనము. సం. వనవిహారాదిక్రీడ, ఆట.

ఖులాసా. హిం. సౌఖ్యము, నెమ్మది.
ఖుల్లకము. సం. విణ. క్షుల్లకము, అల్పము
ఖులసు. హిం. వివరము.
ఖుసి. హిం. సంతోషము.
ఖూని. హిం. నరహత్య, కూని.
ఖూబు. హిం. సెబాసు, బళీ.

## ఖే

ఖేంఖాణము. సం. గుఱ్ఱము.
ఖేచరము. సం. మృగవిశేషము.
ఖేచరుఁడు. సం. వేలుపు. విణ. ఆకాశమునఁ సంచరించువాఁడు. [విశేషము.
ఖేటకము. సం. డాలువాలు; [గ్రామ
ఖేటము. సం. పాలెము; పంటకాపు లుండెడుపల్లె; డాలువాలు; కఫము. విణ. అధమము; ఆకాశమున సంచరించెడి గ్రహాది.
ఖేటాయించు. కేటాయించు.
ఖేటించు. స.క్రి. విడిచిపెట్టి.
ఖేదము. సం. శోకము, దుఃఖము.
ఖేదిల్లు. సం. అ. క్రి. దుఃఖించు. రూ. ఖేదించు. [గట్టిన అనకట్ట.
ఖేయము. సం. అగడ్త; నీళ్లు పాఱుటకు
ఖేల. సం. క్రీడ. ఆట. రూ. ఖేలనము.
ఖేవిహారుఁడు. సం. ఆకాశవిహారి.

## ఖై

ఖైదీ. హిం. కైది, చెఱలో నుంచఁబడిన వాఁడు.
ఖైదు. హిం. కైదు, చెఱ, కారాగృహము

## ఖో

ఖోగిరి. హిం. గుఱ్ఱపు జీను, కోగిరి.
ఖోడుఁడు. సం. విణ. కుంటివాఁడు.
ఖోలకము. సం. వల్లాయి, పోఁకచిప్ప; పుట్ట.

## ఖ్యా

ఖ్యాతము. సం. విణ. ప్రసిద్ధము, వాసికెక్కినది.
ఖ్యాతి. సం. ప్రసిద్ధి, వాసి.

# గ

గంగ. విణ. పూజ్యము; పెద్ద. సం. గంగా నది (పంచగంగలు — కావేరి, తుంగభద్ర, కృష్ణవేణి, గౌతమి, భాగీరథి).
గంగచిప్పలు. బ. దృఢకర్పరములు.
గంగడోలు. సాస్న, గోవు మెడక్రింద వ్రేలాడు తోలు.
గంగనమ్మ. ఒక గ్రామదేవత.
గంగమయిలావు. నలుపును పసుపును కలసిన చాయగల ఆవు.
గంగమ్మ. ఒక గ్రామదేవత.
గంగరావి. బ్రహ్మదారువు†.
గంగరేగు } బదరీభేదము, పెద్ద రేగు,
గంగరేను } లికుచము†.
గంగాజలములు. సం. బ. ధాన్యవిశేషము. [శివుఁడు.
గంగాధరుఁడు. సం. మిన్నువాక తాలుపు,
గంగానమ్మ. ఒక గ్రామదేవత.
గంగాళము. ఇత్తడి రాగి మొదలగు వానితోఁ జేసిన నీళ్ళ కొప్పెర.
గంగి. విణ. పూజ్యము. యజ్ఞియము; బిచ్చపు దాసరులు శృంగారించి తీసికొని వచ్చెడి ఎద్దు, గంగెద్దు.
గంగిరెద్లవాఁడు. బ. గంగెద్దులను ఆడించువాఁడు.
గంగిరెద్దు } ఆట నేర్చిన ఎద్దు.
గంగెద్దు }
గంగెద్దులాట. బాల క్రీడావిశేషము.
గంజ. సం. కల్లు ఉండెడి యిల్లు, మద్యశాల; గని.
గంజము. సం. బండాలము; తిరస్కారము
గంజె. కృషికి యోగ్యమైన భూమి.
గంజేన } ఖంజపాదక్రీడ.
గంజేనగాలు }
గంజా. గాంధారి†; గంజాయి.
గంజాయి. కలంజము, గంజావి†; గంజాయిపత్రితో చేసినపదార్థము, బంగు
గంజావి. గంజా, కలంజము.
గంజి. అన్నరసము.
గంజిగుల్ల. నీటి బుగ్గవలె లేచెడి బొబ్బ.
గంజితొరక. గంజిమీఁది మీఁగడ.
గంజిఫాచీట్లు. పేకాటవంటి ఒక యాట.
గంజో. బజాఱు.?
గంట. గడ్డిదుబ్బు; కంచుగంట, వాద్యవిశేషము; కాలవిశేషము, ఘంట.
గంటకట్టు. అ. క్రి. గంట ఏర్పడినదియగు.
గంటకట్టి. సస్యగుచ్ఛము.
గంటము. అయోలేఖని, తాటాకు వ్రాయుటకు ఉపయుక్తమైన యుక్కు సాధనము
గంటమొలనూలు. కింకిణీమేఖల.
గంటలమ్మ. ఒక గ్రామదేవత.
గంటవేఁట వేఁటలో భేదము.
గంటి. క్షతము, గాయము; దుఃఖము.
గంటిపోట్లాటలు. బాలక్రీడావిశేషము.
గంటీలు. కర్ణవేష్టనవిశేషములు.
గంటు. గనుపు; ముడి; రూకలముడి; వెండ్రుకలముడి; క్రోధము; కణుపు; క్షతి. స. క్రి. గాయముచేయు. [చెట్టు†
గంటుబారంగి. భార్గి, ఒకానొక మందు
గంటువెట్టు. స. క్రి. (కోపముచే మొగము) ముడుఁచు.
గంటె. గరిఁటె; సజ్జపైరు†.
గంటెలు. బ. సజ్జలు.
గంటెకామ. ఒక చెట్టు.
గంటెనేల. సజ్జలు పండెడి భూమి.
గంటెనము. అస్ఖలితోక్తి.
గంట్లకచోరము. మద్గ్రంథిక†.
గంట్లకానుగు. మద్గ్రంథము†.
గంట్లము. గర్భిణులకోరిక, దోహదము.
గండ. మ్రొక్కుబడి. [గండండ్రు.
గండఁడు. శూరుఁడు; ధీరుఁడు. బ.
గండకత్తెర. మెడకత్తిరించెడి యొకదినుసు కత్తెర.
గండకము. సం. ఖడ్గమృగము; చేఁపపిల్ల; జ్యోత్స్యము; భేదము; విఘ్నము; సంఖ్యావిశేషము.
గండగొడ్డలి. పరశువు.
గండగొడ్డలితాలుపు. పరశురాముఁడు.

గండడఁగు. అ.క్రి. పరాక్రమహీనుఁడగు; చచ్చు.
గండదల. దేవతాప్రార్థన.
గండదీపము. మి. మొక్కుబడినిమిత్తము పెట్టుదీపము.
గండపెండరము, గండపెండారము, గండపెండియరము } బిరుదు అందె, శూరులు కవులు మొదలగువారు కాలను బిరుదముగా ధరించు నందె.
గండపెండెము, గండపెండెరము, గండపెండేరము } బిరుదుఅందె.
గండభేరుండము. సం ఏనుఁగులను తన్నుకొనిపోవు రెండుతలల పక్షి.
గండమాల. సం. మెడచుట్టు గడ్డలు లేచెడు వ్యాధివిశేషము.
గండము. సం. చెక్కిలి; ఏనుఁగుచెక్కిలి; అపాయము, ఒక గ్రహయోగము; ఖడ్గమృగము; గండ్రాయి; గుఱుతు; గుజ్జుపుసొమ్ము; పుండు; పొక్కు; నీటిమీఁది బుగ్గ; ప్రమాదము.
గండమృగము. సం. ఖడ్గమృగము.
గండరగండఁడు. శూరులకెల్లశూరుఁడు.
గండరించు. అ. క్రి. ఆవిర్భవించు, పుట్టు. ప్రే. పుట్టించు.
గండరులు. బ. తునుకలు, చెక్కులు. రూ. గండ్రలు.
గండరువు. పడియచ్చు.
గండవడము. తెర.
గండశైలము. సం. కొండనుండిజాఱిపడిన పెద్దఱాయి; కోయిల; నొసలు.
గండాడు. రమించు
గండారు. చెఱసాల.
గండాలి. సం. తీఁగ గఱిక†.
గండి, గండిక } జలాతిశయముచేత తెగిన చెఱువుకట్ట సందు; సందు; రంధ్రము; బిలము.
గండిటొంగ. కన్నపుదొంగ.
గండివనము. గ్రంథిపర్ణము†.
గండీరము. సం. చిట్టికూర†; ఏఱువంగ†; తురుజికూర†.
గండీరి. సం. చిట్టికూర†శములుజెముడు†
గండు. పరాక్రమము; పౌరుషము; బలము; పశుజాతియందు మగది; కష్టము; తిర్యక్పుమర్థమందు నౌపచారికము. అసాధ్యము.
గండుఁగోయిల. పొగరుఁగోయిల.
గండుఁజీమ. ఉలంగవము† ?
గండుఁడు. సం. శూరుఁడు.
గండూపదము. సం. కించులికము; ఎఱ్ఱ.
గండూపది. సం. శిలి, ఆఁడు ఎఱ్ఱ.
గండూషము. సం. పుక్కిలింత; పుడిసిలి; తొండముచివర.
గండూషించు. స. స. క్రి. పుక్కిలించు.
గండె. చేఁపపిల్ల
గండోలము. సం. కుచ్చులమీను.
గండోలి. సం. ఎఱ్ఱతుమ్మెద; కణుదురీఁగ
గండ్ర. విణ. అభేద్యుఁడు; ధృష్టుఁడు; పెద్దది; (గండ్రచీమ మొ॥) చెఱువు మొదలగువాని ఖండము. బ. ఖండములు, పరుషము.
గండ్రగత్తెర. గండకత్తెర.
గండ్రగొడ్డలి. పరశువు.
గండ్రచీమ. పెద్ద నల్లచీమ, గండుఁజీమ.
గండ్రనూకలు. బ. తండుల ఖండములు, అర్ధ తండులములు.
గండ్రిక. ఖండము.
గండ్రించు. స. క్రి. ఖండించు.
గండ్రికలు. అరవరలు.
గంత. మెత్తగాఁ బఱచుకొనుటకై ప్రాత గుడ్డలనుఁ జేర్చి దట్టముగాఁ గుట్టిన బొంత; కందళము; ఎద్దు మొదలగు వానిమీఁద వేసెడు గంత. సం. విణ. పోవువాఁడు.
గంతవ్యము. సం. విణ. వెళ్ళఁదగినది.
గంతవ్యుఁడు. సం. విణ. పోఁదగినవాఁడు
గంతు ఎగిరిదాఁటుట, దుముకు; ప్లుతగతి భేదము.
గంతుకొను. అ. క్రి. దుముకు; చచ్చు.
గంత్రి. సం. గాడీబండి, ఎడ్లబండి.
గందకము. గంధకము.
గందపటక. చందనలేపనము.
గందపట్టె. గందపటక; స్కంధపట్టిక, బలముకోసము తలంపునకమర్చుడు అడ్డకొయ్య.

గంధపుకుడక. చందనముంచుకొను పాత్రము.
గంధపుఁగొండ. చందనాచలము, మలయ [పర్వతము.
గంధపుఁగొండలెంకి. వాయువు.
గంధపుపొడి. బుక్కా.
గంధపుమ్రాను. చందనవృక్షము.
గంధపుఁబొడి. కొన్ని గంధద్రవ్యములఁ జేర్చి చేసిన చూర్ణము.
గందపొడి. గందపుఁబొడి.
గంధము. చందనము, మంచిగంధము; పరిమళము. [బలము.
గందరగోళము. అభాసు; అలికిడి; అల
గందవొడి. గందపొడి.
గందసరులు. ధాన్యవిశేషము.
గందపట్టె. గందపటక; స్కంధపట్టిక.
గంధకము. సం. అంగడి మందుదినుసు.
గంధకారి. సం. ముడుఁగుఁదామర†.
గంధకుటి. సం. మురయనెడు గంధద్రవ్యము†.
గంధగజము. సం. మదపుటేనుఁగు.
గంధగర్భము. సం. కొండమారేడు†.
గంధనము. సం. ఎఱిఁగించుట; నలుగిడుట; నొప్పించుట; వెలిగించుట.
గంధనాకులి. సం. సర్పాక్షి†.
గంధపిండీతకము. సం. వెలికి†.
గంధఫలి. సం. ప్రేంకణము†; సంపెఁగ మొగ్గ.
గంధమాదనము. సం. ఒకకొండ; ఒక కోఁతి; మగతుమ్మెద; మదపుటేనుఁగు.
గంధము. సం. చందనము; వాసన; గంధకము; గర్వము; లేశము; సంబంధము
గంధమూలము. సం. అడవికచోరము†; కొండబెండ†.
గంధమూలి. సం. గంట్లకచోరము†.
గంధమూషి. సం. చుంచు, చుచుందరి.
గంధమృగము. సం. కస్తురిపిల్లి; పునుఁగు పిల్లి.
గంధరసము. సం. బోళము, గోపము.
గంధరాజము. సం. ఒక గంధద్రవ్యము†
గంధర్వనగరము. సం. ఆకాశమున నగరాకారముగా గోచరించు మేఘచిత్రములు.
గంధర్వము. సం. మృగవిశేషము; గుఱ్ఱము; అంతరపిశాచము; మగకోయిల.
గంధర్వహస్తకము. సం. ఆముదపుచెట్టు†
గంధర్వుఁడు. సం. ఒకదేవతాజాతి; పాటపాడువాఁడు.
గంధలేశిక. సం. జవ్వాదిపిల్లి.
గంధవతి. సం. కల్లు; వ్యాసునితల్లి; నేల; వాయుపట్టణము.
గంధవహ. సం. నాసిక.
గంధవహము. సం. వాయువు; నాసిక.
గంధవహుఁడు. సం. వాయువు.
గంధవాహము, గంధవాహుఁడు } సం. వాయువు.
గంధసారము. సం. చందనము.
గంధాఖువు. సం గంధమూషిక, చుంచు.
గంధాశ్మము. సం. గంధకము
గంధిక. సం. గంధకము.
గంధిని సం. గంధకుటి†.
గంధిలము. సం. పెద్దజాతినక్క, వఱడు. విశే. వాసనగలది.
గంధోత్తమ. సం. మద్యము, కల్లు.
గందోళి. సం కందురీఁగ.
గంప. కండోలము.
గంపపులుఁగు. కుక్కుభముపక్షి.
గంబుర, గంబురము, గంబురా } కర్పూరము.
గంబూరరాజనాలు. ధాన్యవిశేషము.
గంబూరు. గంబుర.
గంభారి. సం. గుమ్మడు†.
గంభీరము సం. విశే. లోఁతుగలది.
గంభీరవేది. సం. తోలు దోఁగునట్లును నెత్తురు కాఱునట్లును కండ యూడునట్లును బరి గోలలతోడను అంకుశముల తోడను పొడిచి ఎంత బాధపెట్టినను ఒళ్ళెఱుఁగకుండునట్టి మదపుటేనుఁగు.
గంభీరిమ. సం. గంభీరభావము.
గగననిమ్నగ. సం. ఆకాశనది. [శము.
గగనము. విశే. దుర్లభము. సం. ఆకా
గగురు. పులకాంకురము, భయహర్షాదుల చేత మేని వెండ్రుకలు నిక్కపొడుచుకొనుట, రోమాంచము.

గగురుపాటు. రోమాంచము కలుగుట.
గగురుపొడుచు. అ.క్రి. రోమాంచితమగు
గగురుపొడుపు } గగురుపాటు.
గగుర్పాటు }
గగుర్పు. గగురు.
గగుర్పొడుపు. గగుర్పాటు.
గగ్గు. అ. క్రి. సంకోచించు; సంతోషాదులచేతఁ గలిగెడు గొంతడుపు, గద్గదిక
గగ్గురు. రూ. గగురు. [సమూహము.
గగ్గులకాఁడు. ధాన్యమురాల్చిన కంకుల
గగ్గులు. బ. గింజలురాల్చిన కంకులు.
గగ్గెర. కఠింజరము, ఒక చెట్టు†.
గగ్గెరగడ్డ. కఠింజరముదుంప.
గగ్గోలు. క్షోభము, కలఁత; భయము.
గగ్గోలుపడు. అ. క్రి క్షోభించు.
గచ్చ. గ్రచ్చ, యక్షాక్షి†.
గచ్చకాయ. యక్షాక్షిఫలము.
గచ్చకాయయాట. బాలక్రీడా విశేషము.
గచ్చపొద. యక్షాక్షి†.
గచ్చు. కాంతి; పూఁత; గారపూఁత; దంభము; గ్రస్తోక్తి. విణ. గ్రస్తము. వర్ణలోపము గాని పదలోపము గాని కలిగినది.
గచ్చుకొను. స. క్రి. పట్టుకొను, వాయురోగము మొదలగువానిచేత బిగిసికొను.
గచ్చులాఁడి. దాంభికురాలు, బయటకు యోగ్యురాలివలె నటించునట్టి స్త్రీ.
గచ్చువిచ్చగు. అ.క్రి. కార్యవైకల్యమగు.
గచ్చువిచ్చు. అటుమాఁడు, వ్యత్యస్తము.
గజకర్ణము. సం. ఏనుఁగు చెవివంటి ఒక దినుసు విసనకఱ్ఱ.
గజత. సం. గజసమూహము. [షము.
గజదంతము. సం. అభినయహస్త విశే
గజనిమీలనము. సం. కపటము.
గజనిమీలిక. సం. లేదని ఉడాయించుట.
గజనిమ్మ. లకుచము†. [పిప్పలి†.
గజపిప్పలి. సం. ఏనుఁగుపిప్పలి, పెద్ద
గజభక్ష్య. సం. అందుగు†.
గజము. సం. ఏనుఁగు; సంఖ్యావిశేషము, ఎనిమిది.

గజయాన. సం. ఏనుఁగు నడకవంటి నడకగల స్త్రీ; స్త్రీ.
గజరిపువు. సం ఏనుఁగుగొంగ, సింహము
గజస్నానము. సం. ఒక న్యాయము, ఏనుఁగుచేసెడి స్నానమువలె వ్యర్థము (నిష్ఫలము)
గజాననుఁడు. సం. వినాయకుఁడు.
గజిబిజి. చిక్కు; కలఁత; నలఁగుడు; సందడి; క్షోభము; పీడనము. విణ. కలఁగినది; నలఁగినది.
గజిబిజించు. అ. క్రి. కలఁగు.
గజిబీజి. గజిబిజి, కలవరము.
గజిముచ్చు. పెద్దదొంగ.
గజ్జి. తీఁటకురుపు, పామ, కచ్ఛువు.
గజ్జియ. గజ్జి.
గజ్జెలు బ కింకిణులు.
గజ్జెగొలుసు. స్త్రీపాదాభరణ విశేషము.
గజె. విణ. పెద్ద.
గజెగజె. వణఁకుటయందగు అనుకరణము.
గజెనిమ్మ. లకుచము†.
గజను. కపటము.
గజెము. తుపాకికి మందుగట్టించెడి ఇనుప సలాక; వాస్తుమానములలో నొకటి; రెండు మూరల కొలఁది.
గజ్జలు. బ. తొడసంధులు, వంక్షణములు.
గజ్జు. మదము.
గజ్జురము. ఖర్జూరము†.
గటక. పిండితోఁజేసిన జావ.
గట్ట. సిద్దెనోటికి వేసి గట్టించెడు బిరడ.
గట్టన. గట్టించుట, ఘట్టనము.
గట్టి. కాఠిన్యము; దృఢత్వము; శౌర్యము. విణ. కఠినము; గట్టిది, దృఢము; ఉచ్చైర్నాదముకలది.
గట్టించు. స. క్రి. గట్టనచేయు.
గట్టిడెందమువాఁడు. ధీరుఁడు.
గట్టినబోది. బాలక్రీడావిశేషము.
గట్టివ. ధూర్తుఁడు.
గట్టివయసుది. ప్రౌఢ.
గట్టివా. గట్టిగా మాటలాడువాఁడు గట్టిగా మాటలాడునది; ధూర్తుఁడు; ధూర్తస్త్రీ.

గట్టివాచేన. జారస్త్రీ.
గట్టివాఁడు. విణ. సమర్థుఁడు, గడుసువాఁడు
గట్టివాతనము. ధూర్తత.
గట్టివాయి. గయ్యాళి, ధూర్తస్త్రీ.
గట్టివాయితనము. స్త్రీధూర్తత.
గట్టివాల్బోటులు. బ. పుష్పలావికలు.
గట్టివాలు. సైరంధ్రి.
గట్టు. పర్వతము; ఘట్టము; నద్యాది తీరము; చెఱువుకట్ట; మళ్ళకుకట్టినగట్టు.
గట్టుఁద్రిమ్మరి. అగచరము, కోఁతి.
గట్టుతాలుపు. నగధరుఁడు, విష్ణువు, కృష్ణుఁడు.
గట్టుదాయ. నగవైరి, ఇంద్రుఁడు.
గట్టుపట్టి. పార్వతి; మైనాకుఁడు.
గట్టురాకొమరునిఁ గాచిన నేర్పరి సముద్రుఁడు.
గట్టురాచూలి. హైమవతి, పార్వతి.
గట్టురాపట్టి. పార్వతీదేవి; మైనాకుఁడు.
గట్టులఱేఁడు. నగాధిరాజు, హిమవంతుఁడు.
గట్టులరాయఁడు. గట్టులఱేఁడు.
గట్టువా. గట్టివా.
గట్టువాలు. సైరంధ్రి, విచ్చలవిడియై ఒకరి ఇండ్లనుండి శృంగారించుట మొదలగు పనులు చేయునట్టి స్త్రీ.
గట్టువిలుకాఁడు. } మేరుధన్వుఁడు;
గట్టువిలుతుఁడు } శివుఁడు. రూ. గట్టువిల్తుఁడు, గట్టువిల్దారి.
గట్రాచూలి. గట్టురాచూలి.
గట్లయెకమీఁడు. గట్టులఱేఁడు.
గట్లయేలికమనుమఁడు. కుమారస్వామి.
గట్లరాయఁడు. కొండఱేఁడు, గట్లయెకిమీఁడు.
గట్లఱేనిబిడ్డ. హైమవతి, పార్వతి.
గట్లసూడు. నగవైరి, ఇంద్రుఁడు.
గడ. గణనము; నిడుపాటి కోల; సమూహము; ఓడకంబము; కంబము; ఇక్ష్వాది కాండము; వెదురుగడ.
గడగడ. వణఁకుటయందగు అనుకరణము. వా. గళగళ.
గడగడలాడు. అ. క్రి. వణఁకు, కంపించు.
గడచీల. ఏతపు బానయందు అమర్చియుండెడు దండెపుఁ బీఁటలు తగులుచుటకు గడతలనుండు చీల.
గడన. అర్జనము; లెక్క; లక్ష్యము; ఎన్నిక; స్తోత్రము.
గడనకత్తె } గణిక, భోగముది, వేశ్య.
గడనపడఁతి }
గడనములు. బ. సమూహము.
గడప. వాకిటి క్రిందిభాగము, దేహళి.
గడబడ } అల్లరి, అతితొందర.
గడబిడ }
గడము. కుండ మొదలగువాని మూఁత. సం గండెచేఁప; విఘ్నము.
గడమంచె } హిం. మూఁటలక్రింద నుంచునది.
గడవంచె }
గడసాదన. వ్యాయామము.
గడసె. అటుక. [షము; బలము; మరియాద.
గడి. సీమ, ఎల్ల; గడము; వాప్యాంకుర విశే
గడించు. స. క్రి. సంపాదించు, కల్పించు.
గడించుపడఁతి. గణిక; వేశ్య.
గడికాళ్ళువేయు. స. క్రి. (రెండు రెండు పశువులను) ఒక్కొక్క కాలు చేర్చి లంకె వేయుట.
గడితపడు. అ. క్రి. గట్టిపడు.
గడితము. తఱచు; ముదుగు, లావు; మడతబట్ట; సాంద్రవస్త్రము. విణ. తఱచైనది; ముదుగైనది.
గడిత్రాసు. గడికాళ్లు వేయు బంధము.
గడిదేఱు. అ. క్రి. సమర్థుఁడగు; (స్త్రీ) ప్రౌఢయగు.
గడిదొంగ. కన్నగాఁడు; గొప్ప దొంగతనములు చేయువాఁడు.
గడిపోతు. విణ. ఆఁబోతు.
గడిమెకము. వేటునకు చిక్కని మెకము.
గడియ. ఘటిక, ఇరువదినాలుగు నిమిషముల కాలము; విష్కంభము; తలుపును లోపల బంధించెడి గడెమ్రాను.
గడియారము. కాలపరిమాణమును దెలుపునట్టి ఒక యంత్రము.
గడివడ. కఠినముగానుండునట్టి వడియము.
గడివాఁడు: ఎల్లలవద్ద కాఁపున్నవాఁడు.

గడివోతు. ఉడుప కుక్క.
గడి. గడి; దుర్గము, కోట.
గడు. దారువిశేషము.
గడుచు. వా. అతిక్రమించు. ప్రే. గడుపు
గడులుఁడు. సం. విణ. బొక్కి బోమ్మ వాఁడు. [మించఁబడు.
గడువఁబడు. అ. క్రి. మిగులఁబడు;
గడువు. వాయిదా, నిర్ణయకాలము; మర్యాద. స. కంతి, కణితి.
గడుసరి. అసాధ్యుఁడు; కఠినుఁడు; ధైర్యముగలవాఁడు; శూరుఁడు.
గడుసు. కాఠిన్యము; ధైర్యము; కుత్సితుఁడు; కుత్సితస్త్రీ. విణ. కఠినము; అసాధ్యము.
గడుసుమాట. కుత్సితప్రౌఢోక్తి.
గడుసురాలు. గడుసుతనముగల స్త్రీ.
గడుసువడు. అ. క్రి. ధీరుఁడగు.
గడె. గడియ.
గడెకారి బల్లెముగలవాఁడు; పోకిరి.
గడ్డ మూలము, దుంప; మంటిపెల్ల, లోష్టము; కురుపు, వ్రణము; ద్వీపము.
గడ్డపలుగు } గుంటకపలుఁగు, నేల పెల్ల
గడ్డపార } గించెడు సాధనవిశేషము, ఖనిత్రము. [పొయ్యి.
గడ్డప్రొయ్యి. గడ్డలంగా ఏర్పఱచిన
గడ్డము. చిబుకము; చిబుకముమీఁది వెంట్రుకలు, శ్మశ్రువు. [గడ్డి.
గడ్డి. కసవు, తృణము; వరి మొదలగువాని
గడ్డిపరక. తృణవిశేషము.
గడ్డిపాము. ఒకవిధమైన పాము
గడ్డిపిట్ట. పక్షివిశేషము.
గడ్డిబొద్దు. చుట్టకుదురు.
గడ్డిమొలత్రాడు. మౌంజి.
గద్దు. బలాత్కారము; పయాసము. విణ. దుర్లభము; అసాధ్యము; మిక్కలి.
గద్దుకొను. అ. క్రి. అతిశయించు,
గడ్డనబొద్దు. బాలక్రీడా విశేషము
గణకుఁడు. సం. జోస్యుఁడు; కరణము వాఁడు; క్షత్రియస్త్రీయందు బ్రాహ్మణునకు పైశాచ వివాహమువలనఁబుట్టి జాబులు మోయు వృత్తిగలవాఁడు.
గణగణ. ఘంటాది ధ్వన్యనుకరణము.

గణన. సం. ఎన్నిక; లెక్కపెట్టుట; పరవా.
గణనీయము. సం. విణ. ఎంచఁదగినది.
గణపతి. సం. వినాయకుఁడు.
గణము. సం. సమూహము; ప్రమథుల సమూహము; సేనావిశేషము.
గణరాత్రము. సం. పెక్కు రాత్రుల సమూహము.
గణరూపము. సం. జిల్లేడు†. [రక్కస†.
గణహాసకము. సం. నల్లకచోరము†; బలు
గణాధిపతి. సం. గణపతి.
గణాధిపుఁడు. సం. వినాయకుఁడు; శివుఁడు
గణి. సం. సాంగముగా వేదాధ్యయనము చేసినవాఁడు; వర్ణాకరస్త్రీయందు రజకునకుఁ బుట్టి హీనజాతులకు తిథివార నక్షత్రములను తెలియఁజెప్పువాఁడు.
గణించు. సం. స. క్రి. లెక్కపెట్టు, ఎంచు; లక్ష్యపెట్టు.
గణిక. సం. వేశ్య; ఆఁడేనుఁగు; అడవి మొల్ల†; నెల్లి†.
గణికారిక. సం. నెల్లి†.
గణితము. సం. విణ. ఎంచఁదగినది.
గణిల్లు. ఎద్దు అంకెవేయుట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము.
గణుతి. ఎన్నిక; స్తోత్రము; లక్ష్యము.
గణుతించు. స. క్రి. ఎంచు; స్తోత్రము చేయు; లక్ష్యముచేయు.
గణుతిచేయు. స. క్రి. ఎంచు.
గణెము. వేసగాండ్లు ధరించెడి లక్కసొమ్ము (భూషణసామగ్రి).
గణేయము. సం. విణ. ఎంచఁదగినది.
గణ్యుఁడు. సం. విణ. ఎంచఁదగినవాఁడు.
గతపడు. అ. క్రి. కడచు; చచ్చు
గతము. సం. పోక. విణ. గతించినది, పోయినది; తెలియఁబడినది.
గతి. విధము. సం. మార్గము; శరణము; ఉపాయము; పోక, గమనము; జ్ఞానము; నారిపుంటి కంటిత్రోవ; బాల్యము మొదలగు దశ.
గతించు. సం. అ. క్రి. కడచు; చచ్చు.
గతుకు. ఎంగిలి తినుట; కుక్కతిండి. స. క్రి. ఎంగిలి తిను; కుక్క గతుకు.

గత్తె. ఎరువు. రూ. గత్తము.
గత్తర. ఉపద్రవము (కలరావ్యాధి).
గత్తు. మూత్రగంధము. [బాణా.
గద. సం. గుదియ, బారెడు ఇనుప
గదమాయించు. స. క్రి. గద్దించు.
గదము. సం. తెవులు, రోగము.
గదరు. దుర్గంధము. [కృష్ణుడు.
గదాగ్రజుడు. సం. గదునియన్న,
గదాధరుడు. సం. విష్ణువు.
గది. శయనగృహము; ఇంటిలోపలి అఱ; రెండు దూలముల మధ్యప్రదేశము. సం. గదను ధరించినవాడు, విష్ణువు. విణ. తెగులుగలవాడు.
గదుడు. కృష్ణుని తమ్ముడు.
గదుకు. రూ. గతుకు.
గదుగుడు. గళనము, జాఱుడు.
గదుము. స. క్రి. గద్దించు.
గదుముకొను. స. క్రి. గదుము.
గదురు. చెడుకంపు. స. క్రి. పొందు.
గదురుకొను. స. క్రి. గద్దించు; దప్పించు.?
గద్గదము. సం. కంఠమూలమున పలుకునట్టి వాక్కు. విణ. డగ్గుత్తిక పడినది (మాట).
గద్గదస్వరము. సం. ఎనుపోతు; డగ్గుత్తిక పడిన (కంఠ) స్వరము.
గద్గదిక. సం. డగ్గుత్తిక.
గద్ద. గృధ్రము, పక్షివిశేషము.
గద్దకాడు. గడుసువాడు.
గద్దగోరు. చోరసాధనవిశేషము.
గద్దన. గద్దింపు. [వాడు, ఖరణసుడు.
గద్దముక్కువాడు. విణ. వాడిముక్కు
గద్దఱి. విణ. దిట్టతనము కలది.
గద్దఱికాడు. విణ. గడుసువాడు, దిట్టతనము కలవాడు, ధీరుడు.
గద్దించు. అ. క్రి. కోపమున అదలించు; ధిక్కరించు.
గద్దియ. కుర్చీ మొ॥ ఉన్నత పీఠము; సింహాసనము; పీఠము; ఎఱుక.
గద్దువ. గడ్డము, చిబుకము.
గద్దె. కుర్చీ; సింహాసనము; పరపు; సోది
గద్దెకాళులది. అరజుట్టు.
గద్దెనగరులు. బ. లింగధారులు ధరించు లింగము నిల్పుకడగాన్నుండు పేటిక; సజ్జ.

గద్దెపొంకము. పరువునకుదగిన గౌరవంపు మాట
గద్య. సం. వచనకవిత్వము, గద్యము.
గద్యము. సం. వచనము. విణ. చెప్పదగినది. [వాణెము.
గద్యాణము. సం. వరహా, ఒక బంగారు
గనగన. తపించుట యందగు ధ్వన్యనుకరణము; మండుటయందగు ధ్వన్యనుకరణము.
గనప. విణ. పెద్ద. [ముల్కులు.
గనపరాకులు. గన్నేరాకుల వంటి
గనము. అధికము.
గనయము. పోక ముడి; వింటికొప్పు.
గని. ఖని, బంగారు మణులు ధాతువులు మొదలగునవి పుట్టుచోటు; బిలము.
గనిమ. మడికిజుట్టు నేర్పఱచిన గట్టు, సేతువిశేషము.
గనిమె. గట్టు.
గనియ. ఖండము; ఇక్ష్వాది ఖండము.
గనిబు. ఒఱ.
గనుపు. వెదురు చెఱకు మొదలగువాని యందు ఎడనెడ నేర్పడియుండు ముడి, పర్వము.
గనె. రూ. గనియ [గల బాణవిశేషము.
గన్నెరాకమ్ము. గన్నేరాకువంటి యలుగు
గన్నెర } కరవీరము†.
గన్నెరు
గన్నేరు
గపటిక. సం. వరిగ పైరు. [మాటలు.
గప్పాలు. హిం. జంభాలు, అతిశయపు
గబగబ. త్వర.
గబాలున. హఠాత్తుగా.
గబీలు. మంటయందగు ధ్వన్యనుకరణము.
గబ్బ. కపటము. [యైనది.
గబ్బాటు. కలత. విణ. వెల తక్కువ
గబ్బి. గాంభీర్యమునుబట్టి పక్కకియ్యదగిన పేరు; కపటము. విణ. గర్వి, గర్వము కలవాడు.
గబ్బిడము } గబ్బిలము.
గబ్బిడా
గబ్బిడాయి

గబ్బిరాయి
గబ్బిలము } పరోష్ణి, తైలపాయిక.
గబ్బిలాయి
గబ్బిలి. పిడికిలి.
గబ్బిన. ఒకానొకమూలిక. రూ. గబ్బిసి.
గబ్బు. గర్వము; దుర్గంధము; మదము; గంధము; కుక్కుభము.
గబ్బుచీఁకటి గాఢాంధకారము.
గబ్బుచెంపమెకము. ఏనుఁగు.
గబ్బుపులుఁగు. ఒక శకునపక్షి.
గభస్తి. సం. అగ్ని పెండ్లాము; సూర్య కిరణము; సూర్యుఁడు.
గభీరము సం. విణ. లోఁతుగలది.
గభీరిమ. సం. గాంభీర్యము.
గభోళి. సం. ఒఱగుదిండు.
గమకము. యత్నము. విణ. అధికము; మనోజ్ఞము; స్థూలము. సం. సంగీత శాస్త్రమునందు స్వరవిన్యాస భేదము. విణ. తోఁపఁజేయునది.
గమకించు. అ. క్రి. యత్నించు.
గమగమ. వాసనకొట్టుటయందగు అను కరణము. [వాసనకొట్టు.
గమగమించు. అ. క్రి. గమగమ యని
గమనము. సం. గతి, నడక, పోక; ప్రయాణము; తలఁపు.
గమనించు. సం. అ. క్రి. పోవు; తలఁచు.
గమనిక. విధము. సం. నడపు.
గమము. సం. పోక; ప్రయాణము; త్రోవ.
గమల్లవాఁడు. క్షత్రియస్త్రీకి శూద్రునకుఁ బుట్టి అయిదు విధముల సారాయి అమ్ము వాఁడు; పుల్కసుఁడు.
గమాయించు. అ. క్రి. గమగమించు.
గమి. సమూహము. విణ. తఱచు.
గమించు. సం. అ. క్రి. పోవు.
గమికత్తె. అంతఃపురమునందు కావలి యుండెడు స్త్రీ.
గమికాఁడు అధిపతి; అల్పసేనాధిపతి; ముఖ్యజనుఁడు; దళపతి.
గమికొను. అ. క్రి. ప్రోగువడు.
గమ్మత్తు. హిం. వేడుక; చమత్కారము.
గమ్ము. వాసనకొట్టుటయందగు అనుకర ణము.
గమ్యము. సం. విణ. పొందదగినది.
గయ. సం. తీర్థవిశేషము, ఒక మోక్షపురి.
గయము. సం. పశువు.
గయాళము. గయ్యాళము.
గయాళి. విణ. గయ్యాళి.
గయాళించు. అ. క్రి. గయ్యాళించు.
గయాళు. సేద్యముచేయుటకుఁ దగని పొలము.
గయుఁడు ఒక చక్రవర్తి.
గయ్యాళము. ధిక్కారపు మాట.
గయ్యాళి. విణ ధిక్కరించిమాటాడునది, ధూర్తస్త్రీ. [మాటాడు.
గయ్యాళించు. అ. క్రి. ధిక్కరించి
గర. గడ్డ, ముద్ద. విణ. బరుసు.
గరకట్టు
గరకొను } అ. క్రి. ముద్దకట్టు, గడ్డకట్టు.
గరగ చిన్నకుండ, నీళ్ళుత్రాగుట మొద లగు వాని కుపయోగించెడు చిన్న పాత్రము, కళంతిక.
గరగడ. నూనె మొదలయినవి చిన్ననోరు గల పాత్రములలోఁబోయుటకు అడుగున ఆఁదోఁకవలె క్రోవిఅమర్చి చేసిన విశాల ముఖపాత్ర విశేషము.
గరగర. విణ. నిర్దోషము, నిర్మలము.
గరగరనివాఁడు. మేదురుఁడు.
గరగరిక. నైర్మల్యము; అందము; శృంగా రము; నేర్పు; తెలివి; జాగరూకత.
గరజి. సం. ఒక కరణము.
గరదుఁడు. సం. విణ. విషముపెట్టు వాఁడు, ఆతతాయి విశేషము.
గరము. సం. ఒక కరణము; విషము; కృత్రిమ విషము.
గరవడు. అ. క్రి. గడ్డకట్టు. [కొఁలది.
గర్ళము. సం. విషము; కసవుప్రోగు;
గరాగరి. సం. డావరడంగి†. రూ. ఖరాగరి
గరాసు. విణ. దుష్టుఁడు; కుత్సితుఁడు; కుత్సిత స్త్రీ; రాక్షసి.
గరాసులు. బ. రాక్షసులు.
గరింటె, గరిటె.

గరిటె. గంటె, ఇనుముతోఁగాని ఇత్తడితోఁ గాని కఱ్ఱతోఁగాని చేసిన తెడ్డు, కంచి.
గరి. వాఁడి; బరువు; బాణము ఱెక్క.
గరిగె. గరగ.
గరిడి. గరడి, సాము; సాముకూటము; చోటు; సమీపము; గరిడీలు.
గరిడిముచ్చు. మంచివానివలె దగ్గఱకుఁ జేరియుండి సమయము చూచి దొంగిలించెడు దొంగ.
గరిడియ. బుట్ట, కరండిక.
గరిడీ. గరిడి.
గరిడీసాల. సాముచేసెడి యిల్లు.
గరిత. స్త్రీ; ఇల్లాలు; పతివ్రత.
గరిమ. సం. గొప్పతనము; బలువు; గురుత్వము. రూ. గరిమము.
గరిమిడి. దూర్వాతృణము; ఎల్లెలుక.
గరిమిడికొక్కు. పందికొక్కు.
గరియ. అర్బుదఫలి†.
గరివడి / గరివడియము } ఖాదిరవటకము.
గరివించు. అ. క్రి. గర్వపడు.
గరిష్ఠము. సం. విణ. మిక్కిలి గురువు. మిక్కిలి బలువైనది.
గరిష్ఠుఁడు. సం. విణ. మిక్కిలి గురువు; మిక్కిలి బలువైనవాఁడు.
గరిసె. కుసూలము, ధాన్యముంచెడు కొట్టు, మానవిశేషము.
గరిసెబావి. మెల్లెలతో గరిసెవలె నల్లి భూమిలోపలికి కుంచి ఎత్తెడు నూయి.
గరీబు. హిం. బీదవాఁడు.
గరీబులు. హిం. బీదవారు; పరాయివారు.
గరు. రోమాంచము, పులకాంకురము.
గరుగు. గరియ.
గరుజ్షా. హిం. అగత్యము, అక్కర.
గరుటామంతుఁడు / గరుటాల్మమంతుఁడు } మి. గరుత్మంతుఁడు
గరుటి. గరుడి.
గరుడఁడు. అరజుట్టు. [స్తంభము.
గరుడకంబము. మి. (గుడియందలి) గరుడ
గరుడధ్వజుఁడు. సం. విష్ణువు.
గరుడపచ్చ. మి. గారుత్మతమణి, మరకతము. [ధాన్యవిశేషము.
గరుడసరులు. మి. బ. మేలయిన శాలి
గరుడాగ్రజుఁడు. సం. అనూరుఁడు, గరుత్మంతుని అన్న.
గరుడారతి. ఆరాత్రికా విశేషము.
గరుడి గరుత్మంతుఁడు.
గరుడిరవుతు గరుడవాహనుఁడు, విష్ణువు
గరుడుఁడు. సం. గరుడి, గరుత్మంతుఁడు.
గరుత్తు. సం. పక్షము, ఱెక్క.
గరుత్మంతము సం. పక్షి.
గరుత్మంతుఁడు. సం. గరుడుఁడు.
గరుదాల్పు. రోమాంచము. [గల భూమి.
గరుపనేల. ఇసుకయు ఱాతిమొరమును
గరుపాటు. గగురుపాటు.
గరుపాటుమొన. పందిమూతి ముట్టె.
గరుపొడు. అ. క్రి. రోమాంచితమగు.
గరుము. విణ. గులకఱాలచేత గట్టియైనది.
గరులు. బ. ఱెక్కలు.
గరువతనము. నియతి; శృంగారగర్వము.
గరువము గర్వము; గౌరవము; బిరిబి; శృంగారగర్వము
గరువు. చెంప; గరువము; గరుపనేల.
గరుసు. మర్యాద, మేర; ముఖభీతి; తోలు. విణ. గరుము. [కుండ.
గర్గరి. సం. తరిగడవ, పెరుగుతరిచెడు
గర్జ. సం. ఊలుము; (మేఘము లోనగువాని) ధ్వని; సింహనాదము.
గర్జనము. సం. (మేఘము లోనగువాని) ధ్వని; కోపము.
గర్జించు. సం. అ. క్రి. (మేఘము మొదలగునవి) ధ్వనించు; కోపించు.
గర్జితము సం. ఊలుము; ఏనుఁగు ఘీంకారము; మదపుటేనుఁగు.
గర్తము. సం. పిఱుఁదులమీఁది గుంతలు; త్రిగర్తదేశవిశేషము; గొయ్యి; పల్లము; బొక్క.
గర్తాటము. సం. ఎలుక; పందికొక్కు.
గర్దభము. సం. తెల్లగలువ; గాడిద; గంధవిశేషము.
గర్దభాండము. సం. కలజువ్వి†.
గర్ధనము. సం. విణ. ఇచ్చగలది, గృధ్నువు.

గర్ధనుఁడు. సం. విణ. ఇచ్ఛగలవాఁడు.
గర్పాదు. అ. క్రి. తిండితిను.
గర్భకము. సం. వెండ్రుకలలోపల ముడుచుకొన్న పూదండ.
గర్భము. సం. కడుపు; కడుపులోని పిండము; బిడ్డ; ఒక నాటకసంధి.
గర్భాగారము. సం. లోపలిగది, ఓవరి; శయనగృహము.
గర్భాశయము. సం. మావి; గర్భమును చుట్టుకొనియుండెడు సంచి.
గర్భిణి. సం. చూలాలు, కడుపుతోనున్న స్త్రీ. [తలగడ
గర్భోణి. సం. అర్ధచంద్రాకారమైన
గర్ముత్తు. సం. చామలు మొ॥ గడ్డిపంట; ఎండఁబెట్టిన వరుగులు; గంటె, తృణసస్యవిశేషము†. [మదము.
గర్వము. సం. దర్పము, అహంకారము,
గర్వి. సం. విణ. గర్వముకలవాఁడు.
గర్వించు. సం. అ. క్రి. గర్వపడు, క్రొవ్వు
గర్వితుఁడు. సం. విణ. గర్వించినవాఁడు.
గర్హణము. సం. నింద.
గర్హించు. సం. స. క్రి. నిందించు.
గర్హితము. సం. విణ. నిందింపఁబడినది.
గర్హ్యవాది. సం. విణ. కద్వదుఁడు, నిందితమైన మాటలుగలవాఁడు.
గర్హ్యము. సం. విణ. పనికిమాలినది.
గర్హ్యుఁడు. సం. విణ. అధముఁడు; నిందింపఁదగినవాఁడు.
గఱగఱ. భక్ష్యములు నమలుటయందగు ధ్వన్యనుకరణము; కాఠిన్యము. [మ్రోఁగు.
గఱగఱలాడు. అ. క్రి. గఱగఱ అని
గఱగొఱ. తక్కువ, వెలితి, న్యూనత.
గఱి. పక్షి ఱెక్క; బాణము ఱెక్క.
గఱిఁటె. గంటె.
గఱిక (కె). దూర్వ, ఒక దినుసు కసవు†.
గఱికచెక్క
గఱికచెక్కు } పచ్చికతోడి మంటి పెల్ల.
గఱికపూజలమెచ్చు గబ్బివేల్పు. వినాయకుఁడు.
గఱికపిష్ట. గఱిబద్ద.
గఱిచిప్ప. ముత్యపుఁజిప్ప.

గఱిబద్ద. గఱుసుతోడి తాటాకుబద్ద.
గఱి యీఁక. విహంగపక్షము.
గఱిసె. వెదురు లోనగువాని బద్దలతో కట్టఁబడి మూడుపుట్లు ధాన్యము పట్టెడి గాదె, కసూలము; మూడుపుట్ల ప్రమాణము.
గఱుకు. కొడవలి మొదలగువాని కక్కు.
గఱుగు. గరియ, ఒక వృక్షము.
గఱువ. పెద్ద. విణ. గొప్పవాఁడు.
గఱువు. పృథువు; ఘనుఁడు.
గఱ్ఱు. త్రేఁచుటయందగు ధ్వన్యనుకరణము
గఱ్ఱె. మత్స్యములఁబట్టెడు సాధనవిశేషము
గలఁతియ. గిండిచెంబు, కళంతిక.
గలగల. కదలుటయందగు ధ్వన్యనుకరణము; అందెలు మువ్వలు మొ॥ భూషణములు మ్రోయుటయందగు ధ్వన్యనుకరణము.
గలజర. గలిజేరు.
గలతరించు. అ. క్రి. శరీరము జల్లుమను.
గలపడింపు. అప్రయోజకుఁడు.
గలబ. కలఁత; అల్లరి; గందరగోళము.
గలబరించు. అ. క్రి. కలఁగు.
గలబా
గల్బా } హిం. కలఁత; తాఱుమాఱు.
గలామ. కళ్లెము.
గలిజర
గలిజెరు } పునర్నవ†.
గలిజేరు
గలిబిలి. సందడి; శబ్దము; దొమ్మి.
గలీబు. హిం. ఒఱ, తలగడ మొదలగువానితొడుగు; కత్తియొఱను తొడుగు గానెన. [వేసెడి చట్టి.
గల్ల. పొల్ల; మాదిగవాఁడు తోలు నాన
గల్లము. సం. చెక్కిలి; కంఠము.
గల్లు. భూషణములు మ్రోయుటయందగు ధ్వన్యనుకరణము.
గవక } దుర్గముపురద్వారము.
గవఁకు } రూ. గవను.
గవతము. కసవు.
గవని
గవను } దుర్గముపురద్వారము.

గవయము. సం. కణితి, అడవిగోవు, గురుపోతు.
గవర. జూదపు పాచిక.
గవరన. ఎఱుపు. [మైన.
గవరన్మెంటు. ఇం. విణ. ప్రభుత్వ సంబంధ
గవర్నమెంటు. ఇం. ప్రభుత్వము వారు.
గవర్నరు. ఇం. దేశప్రభువు, రాష్ట్ర ప్రభువు. [బోతు.
గవలము. సం. గేదకొమ్ము; నల్లయెనుఁ
గవలవాఁడు. గమళ్లవాఁడు.
గవాక్షము. సం. కిటికి.
గవాక్షి. సం. పిన్నపాపర†; బుడమ†.
గవాక్షుఁడు. ఒక కోఁతి. [పెద్దపాఁపర†.
గవాదని. సం. పసులుమేయుకంచె;
గవి. గుహ; పల్లము.
గవిని. గవక. [పెడువిత్తులు.
గవితెములు. బ. గంధములోఁదాచి కలి
గవిసె కుసూలము.
గవిసెన. వీణె మొదలగు వానితొడుగు.
గవీదము. సం. విణ. అంతకముందు ఆవులుమేసినది ఉండినది (చోటు).?
గవుండ్లవాఁడు. ఈండ్రవాఁడు.
గవుఁడు. సారాయి అమ్మువాఁడు; కాఁపువారి పట్టపు పేరు.
గవుకు. దుర్గముపురద్వారము.
గవుడనరము. స్త్రీ భూషావిశేషము.
గవుద. కపోలము.
గవుర. వర్తకుఁడు.
గవురు. కపటము; ఏనుఁగు; కాళియ.
గవులు. దుర్గంధము; గంధము.
గవుళి. శకునములు తెలుపు బల్లి.
గవుసెన. వీణె మొదలగువాని యొఱ.
గవేధుక, గవేధువు } సం. అడవి గోదుమలు, వట్టి వడ్లు. [వెదకుట.
గవేషణ. సం. ఆమంత్రణార్థము వెదకుట;
గవేషించు. సం. వెదకు, అరయు.
గవేషితము. సం. విణ. అన్వేషితము, వెదకఁబడినది.
గవ్య. సం. ఆవులమంద.
గవ్యము. సం. అల్లెత్రాడు; రాగద్రవ్యము విణ. ఆవుపాలు మొ॥; ఆవువల్ల హితవైనది. [పంచగవ్యములు—(ఆవు యొక్క) పాలు, పెరుఁగు, నేయి, పంచితము, పేఁడ.]
గవ్యూతి. సం. రెండుక్రోసుల దూరము.
గవ్వ. శంఖముదినుసు, కపర్దకము, వరాటకము.
గవ్వచౌకము. వెలిగారము.
గవ్వము. క్షుద్రజలచరము.
గవ్వనరులు. ధాన్యవిశేషము.
గశికము. సం. గసి.
గస. ఉబ్బసము.
గసగసలు, గసగసాలు } నల్లమందు విత్తులు, అహిఫేన బీజములు.
గసి. మేకు; ఘృతాది కల్కము.
గసిక. కొయ్యమేకు, త్రవ్వుటకనువుగా కొనచెక్కిన కొయ్య; శలాక; బాణము.
గసిబిసి. సందడి. విణ. గజిబిజి.
గసిరా. ప్రవాళము.
గస్తాలు. మల్లవిద్యాభేదము.
గస్తీలు. బ. కావలివారు; రైతులను మహసూలు దార్లను కనిపట్టువాండ్లు.
గస్తు. (రాత్రివేళ దొంగతనము మొదలగునవి జరుగకుండుటకై) కావలివారి నగరి శోధన, ఊరు తిరిగి కాచు కావలి.
గహనము. సం. అడవి; గుహ; దుఃఖము; అశక్యము. విణ. నిబిడము; దుష్ప్రవేశము; చొరరానిది; పొందరానిది.
గహరము. సం. పొయికిఁబెట్టెడు కట్టె.
గహ్వరము. సం. అడవి; గుహ; నెపము; పొదరిల్లు.
గహ్వరి. సం భూమి.
గళంతక సం. గిండిచెంబు; గరిగెపిడత.
గళకంబళము. సం. గంగడోలు, సాస్న.
గళకత్తెర. సం. మల్లబంధ విశేషము.
గళగండము. సం. గండమాల.
గళగళ. సం. చెప్పుటయందగు ధ్వన్యనుకరణము. వా. త్రాగుటయందగు ధ్వన్యనుకరణము.
గళగ్రాహి. సం. విణ. గొంతుకపట్టుకొను వాఁడు, శత్రువు; ఎదుటవారి గళధ్వని విని మరలకూయునది, కోయిల; వెంటనే గ్రహించువాఁడు.

గళచుళిక. సం. ఉపజిహ్వక.
గళనము. సం. జాఱుట.
గళము. సం. కంఠము, కుత్తుక; సజ్జగసము.
గళశుండి. సం. గొంతుకపోక.
గళశుండిక. సం. కొండనాలుక.
గళాంకురము. సం. అ గిటిముల్లు.
గళితము. సం. విణ. జాఱినది; తినఁబడినది.
గళ్య. సం. కంఠముల సమూహము; పోట గళముల సమూహము.
గళ్ల. కళ్ల.
గళ్లుగళ్లు. కింకిణ్యాదిధ్వని.
గళ్లెము. పాలమీఁగడవంటి లేఁతకొబ్బెర.

## గా

గాంగము. సం. విణ. గంగది.
గాంగుఁడు. సం. గాంగేయుఁడు.
గాంగేయము. సం. బంగారు; ఒక చేఁప.
గాంగేయుఁడు. సం. కుమారస్వామి; భీష్ముఁడు.
గాంగేరుకము. సం. బలుసు†.
గాంగేరుకి. సం. బీఱు†.
గాంజె. గంజా.
గాండివము. సం. గాండీవము.
గాండివి. గాండీవి. సం. అర్జునుఁడు.
గాండీవము. సం. అర్జునుని విల్లు.
గాండీవి. సం. అర్జునుఁడు.
గాంద్రించు. అ. క్రి. (ముఖము) ఉబ్బు; పులి గాంద్రుమని అఱచు.
గాండ్ల. నూనె అమ్మి జీవించెడు జాతి.
గాండ్లవాఁడు తిలఘాతకుఁడు.
గాంధర్వము. సం. కన్యావరులు పరస్పరేచ్ఛచేతఁ జేసికొను వివాహము; దినము యొక్క ఏడవభాగము; సంగీతము.
గాంధర్వుఁడు. సం. గంధర్వుఁడు.
గాంధారము. సం. సప్తస్వరములలో నొకటి; సిందూరము; 56 దేశములలో నొకటి.
గాంధారి. సం. గంజాయి; ధృతరాష్ట్రుని భార్య.
గాంభీర్యము. సం. గంభీరభావము.
గాఁపెర. ఒకానొక దుంప.
గాఁడి. తొలిచికాని త్రవ్వికాని నిడుపుగా నేర్పఱచిన పల్లము; పసులు నీరు త్రాగుటకు గాఁడి యేర్పడ జాతితోఁ గట్టిన తొట్టి; పసులఁగట్టుచోటఁగసవు వేయుటకుఁబలకలు మొదలగువానితోఁ గాఁడి నేర్పఱచిన స్థానము; కట్టుకు చేసిన గాఁడి.
గాఁడికమ్మి. బల్లగోడకు నడుమ నమర్చెడు కమ్మి.
గాఁడిగడుగు. స. క్రి. సంచయనముచేయు.
గాఁడిప్రొయ్యి. గాఁడి త్రవ్వి ఏర్పఱచిన ప్రొయ్యి.
గాఁడు. నీచార్థకము (అచ్చిగాఁడు, సుబ్బిగాఁడు అని). గుదము; కామమదము. స. క్రి. గ్రుచ్చు; నాటు.
గాక. (ద్రుతపూర్వకము) ఆశీరర్థము (ఇచ్చుఁగాక అని); కాక.
గాగర. స్త్రీలు కట్టుకొను పావడ.
గాజె. కుసూలము, ధాన్యము పోయుటకు మట్టియొరలచే నేర్పఱచిన గాదె.
గాజాపరుఁజు. రూ. పరుఁజు.
గాజు. కాచము; ఒకదినుసుమన్ను. బ. కాచ (గాజుమట్టితోఁ జేసిన) వలయములు; సువర్ణకటకభేదములు, హస్తభూషావిశేషములు.
గాజుకప్పెరలు. బ. ధాన్యవిశేషము.
గాజుగిన్నె. కాచపాత్రము.
గాజుప్పు. ఒకఉప్పు, కాచము, గాజు వండినమడ్డి, కాచలవణము.
గాజుకాయి. హాలాకు.
గాజులగాఁడు. ఒకపందెపు కోడిపుంజు.
గాజులవాండ్రు. గాజులమ్మెడు బలిజెలు, శూద్రులలో నొక తెగవారు.
గాజువాఱు. అ. క్రి. కాంతిహీనమగు.
గాటము. కాఠిన్యము, విణ. అధికము; అతిశయము; సాంద్రము.
గాటు. కారము.
గాడి. రథవిశేషము; ప్రొయ్యి.
గాడిద. గాడిదె.
గాడిదకాళ్లవాఁడు. విణ. గాడిదకాళ్ల వాఁడు.
గాడిదగడపర. గాడిదె గడపరు†.
గాడిదగ్రుడ్డులు. బ. ఖరనందన సంవత్సరములు (వ్యంగ్యముగా తెలుఁగులో వాడుక).

గాడిదపిల్ల కోమలము. మి. మొదట మనో
 హరము గానుండి తరువాత పాడైనది.
గాడిదపులి. దుమ్ములగొండి, ఒక పులి.
గాడిదె. గార్దభము. [మోఁకాళ్లవాఁడు.
గాడిదెకాళ్లవాఁడు. విణ. సంజ్ఞావు, ముట్టు
గాడిదెగడపర. పిండీతకము† [వాహనము.
గాడీ. హిం. బండి, ఎడ్లనుకట్టి యెక్కుడి
గాడు. కాడు, చేటు, హాని.
గాడుపు. గాలి, వాయువు.
గాడుపుకొడుకు, గాడుపుచూలి, గాడుపుపట్టి } వాయుపుత్రుఁడు. (భీముఁడు, హనుమంతుఁడు.)
గాడుపుమేపరి. పవనాశనము, సర్పము.
గాడుపుసంగడీఁడు. వాయుసఖుఁడు,
 అగ్ని.
గాడ్డ. గాడిద.
గాడ్పు. గాడుపు, వాయువు.
గాడ్పుకొడుకు. గాడుపు కొడుకు.
గాడ్పుటరదపుదొర. మన్మథుఁడు.
గాడ్పుపట్టి. గాడుపు కొడుకు.
గాఢము. సం. క్రి. విణ. అతిశయము,
 పెల్లు. విణ. అధికము.
గాణ. గాయనుఁడు, పాటకాఁడు;
 గాయని, పాటకత్తె. బ. గాణలు.
గాణాపత్యము. సం. ఒక మతము.
గాణి. గాయని, పాటకత్తె.
గాణిక్యము. సం. గణికల సమూహము,
 వేశ్యాబృందము.
గాణీ. గాణి.
గాణు. గాడు, కాడు, చేటు, హాని.
గాణుఁడు. గాయనుఁడు, పాటకాఁడు.
గాణేయము. సం. విణ. గణనీయము.
గాత. దెబ్బ (ద్రుతపూర్వము, ద్రుతాంతము) ఆశీర్వాదము (అవుసు గాత అను).
గాత. సం. విణ. పాటపాడెడివాఁడు.
గాతము. పల్లము.
గాతి. తిండి.
గాతుకలఁగు. అ క్రి. భేదిల్లు.
గాత్ర. సం. ఏనుఁగుయొక్క ముందటి
 పిక్కలు మొదలగుచోటు.
గాత్రము. విణ. స్థూలము.
గాత్రము. సం. శరీరము; అవయవము;
గాత్ర. విణ. గాయకసంబంధి.
గాత్రవాలు. ఆస్కందితము.
గాత్రసంకోచి. సం. తొండ; పిల్లి.
గాథ. సం. పద్యము; పాట; చక్కఁ
 బఱపఁబడని భాష; పూర్వులైన పుణ్యా
 త్ముల చరిత్రము; వాక్యము.
గాథకుఁడు. సం. పాటకాఁడు.
గాద. చెమటకాయల తఱచు.
గాదము. జొన్న మొ॥ మెరకచేలలో
 మొలచినగడ్డి, పైరులోని కసవు; అసు;
 తృణము; కదుము.
గాదిలి. ప్రేమ; బంధువు.
గాదె. గాజె, గతిసెకంటె చిన్నదియగు
 పాణక, కుసూలము.
గానము. సం సంగీతము.
గానిగ. నూనెతీసెడి యంత్రము, గానుఁగ.
గానుఁగ. గానుఁగు.
గానుఁగపిండి. తిలకల్కము.
గానుఁగు. గానిగ, తిలయంత్రము.[పిండి.
గానుఁగుపిండి. తెలికపిండి. రూ గాన్గ
గానుఁగెద్దు. గానుఁగు త్రిప్పెడి ఎద్దు.
గాబ. తృణవిశేషము. రూ. గాబము.
గాబరా. హిం. భయము, తొందర, కల
 వరము.
గాబు. కొప్పెర.
గామ. పిపీలికావిశేషము.
గామము. ఊరు.
గామికాఁడు. గామిడికాఁడు.
గామిడి. విణ. శ్రేష్ఠుఁడు.
గామిడికాఁడు. ధృష్టిగజోకుఁడు.
గాము. (సూర్యాది) గ్రహము; పిశాచము
గాముగానాలు. గ్రామవారిలెక్కలు.
గాముల్లఱేఁడు. గ్రహపతి, సూర్యుఁడు.
గాములఱేనిపట్టి. అర్కజుఁడు, శని.
గాయకము ప్రియము; గూఢము; మర్మము.
గాయకుఁడు. గ్రహణశక్తిగలవాఁడు,
 గ్రాహకుఁడు సం. పాటపాడువాఁడు.
 (బ్రాహ్మణ స్త్రీ పురుషులకు గాంధర్వ
 వివాహమువలనఁబుట్టి నృత్తగీతవాద్య
 ములు వృత్తిగాఁగల ఒకజాతి.)

గాయత్రి. సం. వేదమాత; మంత్రవిశేషము; యజ్ఞోపవీతము; ఒకఛందస్సు; చంద్రక†.
గాయని. సం పాటపాడునది.
గాయనుఁడు. సం. పాటపాడువాఁడు.
గాయమానము. శస్త్రవిద్యావిశేషము.
గాయము. అఘువు, ఈర్మము; కత్తి మొదలగువాని తాఁకుడు, క్షతి.
గార. సున్నపుబెందడి, గోడ మొదలగువాని పూఁతకై యినుకఁజేర్చి దంచిన సున్నము; ఇంగుది†; మణిదోషవిశేషము.
గారకాఁడు. సున్నమును లేపనముచేయువాఁడు. [నము.
గారడము. విషమంత్రము; మాయ; వంచ
గారడి. పాములవాఁడు.
గారడివాఁడు కనికట్టుగాఁడు; మాయాజీవి
గారడీఁడు. పాములవాఁడు. [వము.
గారము. చిన్నవాండ్లయందలిప్రేమ; గార
గారవము. గౌరవము, గొప్పతనము; ప్రీతి, ప్రేమము; మిత్రభావము.
గారవించు. స క్రి. గౌరవపఱచు, ఆదరించు; ప్రీతిచేయు.
గారవింపు. ప్రేమము; గరువము.
గారవిలు(ల్లు). అ. క్రి. గౌరవపడు.
గారాబము. గౌరవము, గొప్పతనము; ప్రేమము; చిన్నవాండ్లయందలి ప్రేమ.
గారాబు } గౌరవము; చిన్నవాండ్లయందలి ప్రేమ.
గారాము }
గారియ. ఘారిక.
గారు. అప. పూజ్యత్వమును దెలుపునది (అయ్యగారు అమ్మగారు అని).
గారుడము. సం. మరకతము, గరుడపచ్చ; విషమంత్రము. విణ. గరుడునిది.
గారుడికుఁడు. సం. పాములవాఁడు.
గారుత్మతము. సం. పచ్చ, మరకతమణి.
గారె. మాషాపూపము, అచ్చము మినుపపప్పువడ.
గార్దభము. సం. గాడిద, రాసభము.
గార్దభికము. సం. తెల్లికలువ.
గార్భిణము. సం. గర్భిణుల సమూహము.
గార్హపత్యము. సం. ఒక శ్రౌతాగ్ని.
గార్హస్థ్యము. సం. గృహస్థధర్మము.
గాలకాఁడు. చేఁపలనుపట్టువాఁడు.
గాలకురాలు. ప్రౌఢ.
గాలము. చేఁపలఁ బట్టుటకు ఉక్కు కమ్మితో వంకరగాఁజేసిన సాధనము, బడిశము.
గాలవము. సం. లొద్దుగు†.
గాలవుఁడు. సం. ఒక ముని.
గాలాము. రూ. గాలము. [పిశాచము.
గాలి. వాయువు; మృగముల దేహవాసన;
గాలించు. స. క్రి. బియ్యము మొ॥ నీళ్లలోఁ పోసి రాళ్లు లేక శోధించు; వెదకు.
గాలింపు. శోధనము, నీళ్లుపోసి బియ్యము మొ॥ గాలించుట.
గాలికుంటు. పశువులకు గొరిజలయందు పుండు పడెడు వ్యాధి.
గాలిగాఁడు. గాడిద.
గాలిగుడి. పరివేషము, సూర్యచంద్రాదులకుఁ జుట్టుఁ గేర్పడెడు మండలము.
గాలిగొను. అ. క్రి. గాలిపాఱు.
గాలిగ్రుడ్డు. విణ. పేద. [తుఁడు.
గాలిచూలి. అగ్ని; భీముఁడు; హనుమం
గాలితండ్రి. ఆకాశము.
గాలితేరెక్కుమన్నీఁడు. మన్మథుఁడు.?
గాలిదిండి. పవనాశనము, సర్పము.
గాలినెచ్చెలి. వాయుసఖుఁడు, అగ్నిదేవుఁడు, అగ్ని.
గాలిపంట. నిర్ణయములేని పంట.
గాలిపటము } ఒక బాలక్రీడా సాధనము, గాలిలో నెగురవేసెడు ధ్వజము.
గాలిపడగ }
గాలిమాట. లోకప్రవాదము.
గాలిమేఁతరి } గాలిదిండి, పాము.
గాలిమేపరి }
గాలివాన. ఝంఝూవాతము, గాలితోడి వాన.
గాలివేఁత. గాలికొట్టుట; జ్వరభేదము.
గాలిసూడు. మేఘము.
గావ. ఒక పక్షి.
గావు. బలి.
గావుకోడి. ఒక మూలిక.

గావుత. (ద్రుతపూర్వకము, ద్రుతాంతము) అశిరర్థము (చేయుఁ గావుత అని).
గావుపట్టు. గట్టిపట్టు. స. క్రి. చంపు; నాశము చేయు.
గానటబీనట. సలక్షణము గాని చదువు.
గానము. గ్రాసము, ఆహారము.
గాని. శ్రమము; దుఃఖము, బాధ.
గానిఁబడు. అ. క్రి. బాధపడు.
గానిఁబెట్టు. స. క్రి. బాధించు.
గాని చేయు. స. క్రి. నాశము చేయు.
గానియగు. అ. క్రి. నాశమగు.
గానిలు } గానిల్లు } అ. క్రి. బాధపడు; శ్రమపడు; కోపపడు. ప్రే. గానించు.
గాహనము సం. స్నానము.
గాహము. స్నానము.
గాహితము. సం. మునిఁగినది.
గాళకుఁడు. ధీరుఁడు; ప్రౌఢుఁడు.
గాళ్లవాఁడు. గాండ్లవాఁడు.

## గి

గి. అప. నిందయందు ప్రహస్వాదియైన ఆమ్రేడితశబ్దము యొక్క ఆద్యక్షరమునకు వచ్చెడి ఆదేశము.
గింగురు. వింటినారినుండి బాణము వెడలుట యందగు ధ్వన్యనుకరణము.
గింజె. బీజము, విత్తు. బ. ధాన్యము.
గింజెలేఱుమనికి. ఉంఛవృత్తి.
గింజుకొను. బిడ్డలు వెలికిలఁబండుకొని యేడ్చునప్పుడు కాళ్లు విదిలించు; ఆపదచేత కాళ్లు చేతులు లాగికొను.
గింటెన. దింటెన†.
గింటెము. జంటనేఁతవస్త్రము.
గిండి. సన్నపు మెడగల చెంబు, భృంగారము.
గిచ్చు. స. క్రి. గోళ్లను అదుము; గీచు.
గిజిగాఁడు. పచ్చపిట్ట.
గిజ్జిగాఁడు. బండారుపిచ్చుక, గిజిగాఁడు.
గిజెగిజె. తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము.
గిజెగిజెగొను } గిజెగిజెలాడు } అ. క్రి. సంభ్రమించు.
గిజెరు. గింజ; గుజ్జు.

గిటక. వామనుఁడు.
గిటగిట. పండ్లుకొఱుకుటయందగుధ్వన్యనుకరణము.
గిటగిటన. విణ. అల్పము; కృశము; సూక్ష్మము.
గిటగిటమను. అ. క్రి. వడఁకు.
గిట్ట. ఖురము, పశువుల కాలిగోరు; బాణము
గిట్టమి. విరోధము.
గిట్టించు. అ. క్రి. గిట్టుబడియగు. ప్రే. చావఁజేయు.
గిట్టింపు. గిట్టుబడి; చావు
గిట్టు. అ. క్రి. అనుకూలించు; నశించు; చచ్చు; తాఁకు.
గిట్టుబడి. అమ్మకమునందలి లాభము.
గిడస. విణ. పొట్టి.
గిడిగి. మడువు, పటహవిశేషము.
గిడిగిళ్లు. బ. నమస్కారము.
గిడిబిడి. చర్మవాద్యవిశేషము.
గిడియ. రూ. గిడిగి.
గిడుగు. కామలేని గొడుగు.
గిడ్డ. పొట్టివాఁడు; పొట్టిది. బ. కుఱుచవాండ్లు.
గిడ్డంగి. అవ్య. చెఱసాల; సామగ్రియుంచెడి యిల్లు.
గిడ్డతనము. కుఱుచదనము.
గిడ్డది. పొట్టిది.
గిడ్డవాఁడు. పొట్టివాఁడు.
గిడ్డి. వామనుఁడు; గోవు; వామనగవి.
గిడ్డు. శ్యేనవిశేషము, డేగ.
గిత్త. ఎద్దుపట్టనికోడె; వృషభము.
గిత్తతత్తడిజోఁడు. వృషభ వాహనుఁడు, శివుఁడు.
గిద్ద. సోలలో నాలుగవ వంతు.
గిద్దు. శ్యేనభేదము.
గిద్దె. గిద్ద.
గినియ. కటభి†.
గినుమాడు. స. క్రి. వంచించు.
గినుము. వంచన.
గిన్నియ. గిన్నె.
గిన్నె. పాత్రము; చషకము.
గిబ్బ అచ్చువేసిన ఆఁబోతు, వృషభము
గిబ్బటీఁడు ఆఁబోతు, వృషభము.
గిబ్బరౌతు. వృషవాహనుఁడు, శివుఁడు.
గిబ్బరౌతుసకుఁడు. త్ర్యంబక సఖుఁడు, కుబేరుఁడు.

గిర. సం. వాక్కు.
గిరక. నూతిరాట్నము; పొట్టివాఁడు; [పొట్టిది.
గిరకతనము. కుబ్జత్వము.
గిరకత్రాడి. హింతాలము†.
గిరకది. పొట్టిది.
గిరకలు. బ. పొట్టివారు.
గిరకవాఁడు. పొట్టివాఁడు.
గిరగిర. వలయాకారముగ తిరుగుటయందగు ధ్వన్యనుకరణము.
గిరణము. సం. మ్రింగుట.
గిరదా. హిం. జుట్టును చుట్టియుండు వెంట్రుకలు. విణ. గుండ్రని.
గిరవు కుదువ, తాకట్టు.
గిరన. విణ. పిరికి. [మైన, మహార్ఘము.
గిరాకి. హిం. విణ. ప్రియమైన, వెల అధిక
గిరాట్టువేయు. (ఊయి) అవ్వు.
గిరి సం. మ్రింగు; పర్వతము; అచ్చనగాయలు; నేత్రరోగ విశేషము. విణ. పూజ్యము.
గిరిక. సం. పార్వతి; చిట్టెలుక; జలగ; వసురాజు భార్య; విధవ; అడవిమల్లె†.
గిరికము. సం. బొంగరము.
గిరికర్ణి. సం. దింటెన†. [కంచుతాళము.
గిరిగిటలు. బ. ఆడునప్పుడువాయించెడు
గిరిజ. సం. పార్వతీదేవి; మాదిఫలము†.
గిరిజము. సం. అభ్రకము; లోహము; సిలాజిత్తు; విణ.కొండయందుఁబుట్టినది.
గిరిధరుఁడు. సం. విష్ణువు, కృష్ణుఁడు.
గిరిభిత్తు. సం. వజ్రాయుధము.
గిరిమల్లిక. సం. కొండమల్లె†.
గిరియకములు. సం. బ. అచ్చనగాయలు
గిరిశుఁడు. సం. శివుఁడు.
గిరిసింగన్నవృత్తి. బాలక్రీడావిశేషము.
గిరిసెము దిరిసెము, శిరీషము†.
గిరిస్తని. సం. భూమి. [బృహస్పతి.
గిరీశుఁడు. సం. శివుఁడు; హిమవంతుఁడు;
గిర్గిటలు. బ. రూ. గిరిగిటలు.
గిఱక. నూతిమీఁద నమర్చిన నీళ్లుతోడుకొనెడి రాట్నము. విణ. గిటక.
గిఱకతాడు. హింతాలము†.
గిఱి. వలయాకార రేఖ.
గిఱికొను. స. క్రి. చుట్టుకొను;కుప్పగొను.
గిఱిపిల్లాఁడి. స్త్రీలు కాలధరించెడి మూడవ వ్రేలి పిల్లాణి
గిఱుకు. తుడుపు. స. క్రి. అక్షరములు బటువుగా నేర్పడ వ్రాయక వంకరకొంకరగా గీచు; తప్పువ్రాతను తుడుచు.
గిఱుక్కు.మరలుంటయందగు అనుకరణము
గిఱువు. స. క్రి.(కన్ను)త్రిప్పు; కదలించు.
గిఱ్ఱున. వలయాకారముగా తిరుగుటయందగు అనుకరణము.
గిఱ్ఱుపురుగు. చెట్లయందుండి యెల్లప్పుడు గిఱ్ఱుమని కూయునట్టి ఒకపురుగు
గిలక. గిలగిలమ్రోఁగు బాలక్రీడా సాధనము; గిలగిలమని మ్రోఁగెడి యినుపతగటి బిల్ల; ఘంటారవ†; గిఱక, నూతినుండి నీరు చేదుటకు త్రాడు క్రిందికి మీఁదికి దిగుట కనువైన సాధనము.
గిలకచెట్టు. ఘంటారవ†.
గిలకబండి. చిన్నచక్రముల బండి.
గిలకరించు. స. క్రి. గిలకొట్టు; చిలుకు, మథించు; మ్రోఁగు, శబ్దించు.
గిలకొట్టు. స. క్రి. । కేళ్ళతో కలఁచు; కుదిలించు; కేళ్ళతో పుణుకు.
గిలగింతచెట్టు } గిలకచెట్టు.
గిలగిచ్చ }
గిలగిల. గిలగిచ్చ†. వా. బాధయందగు అనుకరణము.
గిలాబు. హిం. గచ్చువేయుట.
గిలి. భయము.
గిలిగించు. స. క్రి. గిలిగింత పెట్టు.
గిలిగింత. చక్కిలిగింత.
గిలిగింతచెట్టు. గిలకచెట్టు.
గిలిగిచ్చ. గిలిగింతచెట్టు.
గిలిగిట్ట. గిలిగిచ్చ.
గిలిగిలి. గిలిగిలింత.
గిలిగిలింత. చక్కిలిగింత.
గిలుక. క్రూర; శణపుష్పి†.
గిలుకు. శబ్దము; మెట్టెలు మొదలగువానియందగు ధ్వన్యనుకరణము.
గిలుకుపలుకు. కూకిపలుకు.
గిలుగాడు. స. క్రి. దొంగిలించు.
గిలుగిచ్చ. గిలక, శణపుష్పి†.

గిలుపు. స. క్రి. (కన్ను) గిఱుపు.
గిలుబాడు. స. క్రి. దొంగిలించు.
గిలుబు. అపహరణము, చౌర్యము.
గిలుబుకొను. స. క్రి. దొంగిలించు.
గిలుబుకోలు. చౌర్యము.
గిలుబుసేయు. స. క్రి. దొంగిలించు.
గిలువు. గిలుబు, చౌర్యము.
గిల్లకన్ను. మెల్లకన్ను.
గిల్లచూపు. మెల్లచూపు.
గిల్లాలాట. బాలికాక్రీడావిశేషము.
గిల్లాలు. బాలికా క్రీడాసాధనవిశేషము.
గిల్లు. నఖక్షతము. స. క్రి. నఖక్షతము చేయు; ఆకులు మొదలగువానిని కోయు
గిల్లుడు. నఖక్షతము; పత్రపుష్పాద్యపచయము.
గివుఱు. స. క్రి. గీఱు; ఛేదించు.
గిసరి. కేసరి.
గిళనము. సం. తినుట, మ్రింగుట. [బడ్డది.
గిళితము. సం. విణ. తినఁబడినది, మ్రింగఁ

## గీ

గీ. అప. నిందయందు దీర్ఘాదియైన ఆమ్రేడిత శబ్దముయొక్క ఆద్యక్షరమునకు వచ్చెడి ఆదేశము.
గీఁక. ఏనుఁగుకూఁత, ఘీంకారము.
గీఁకు. స. క్రి. గోకు; కత్తి మొదలగు వానితో గీచు. [గిఱుపు; చిమ్ము.
గీఁటు. స. క్రి. (పండ్లు) కొఱుకు; (కన్ను)
గీఁత. గీటు, రేఖ.
గీఁతకట్టియ. వడ్లవాఁడు గీఁతలు గీయుట కుపయోగించెడి పలక. రూ. గీఁత కట్టె.
గీచు. స. క్రి. గీటుగీచు; గోళ్ళను గిచ్చు.
గీటడఁగు. అ. క్రి. చచ్చు.
గీటడఁచు. స. క్రి. చంపు.
గీటనఁబుచ్చు. స. క్రి. అనాదరించు.
గీటు. గీఁత, రేఖ; ఉపేక్ష (గీటునం బుచ్చు అని).
గీట్లబద్ద. రేఖలు వ్రాసెడి బద్ద, కాగితములు మొదలగు వానియందు గీట్లు వేయుట కుపయోగించెడి కోల. రూ. గీట్లబ్రద్ద.
గీత. సం. భగవద్గీత. [పలుకఁబడినది.
గీతము. సం. సంగీతము, పాట విణ.
గీతి. సం. పాట, సంగీతము; ఒకపద్యము.
గీపెట్టు. అ. క్రి. ఏనుఁగుకూయు; మొఱపెట్టు; శబ్దించు; ఆర్తరవము.
గీము ఇల్లు, గృహము.
గీయు. స. క్రి. గీఁత గీయు.
గీరణగింజెలు } బ. అచ్చనగాయలు.
గీరనగింజెలు } రూ. గీరనం గింజలు.
గీర్ణి సం. మ్రింగుట.
గీర్వాణము. సం. దేవభాష.
గీర్వాణుఁడు సం. దేవుఁడు, దేవత.
గీఱ. గీఁత
గీఱు. స. క్రి. గోఁకు; ఛేదించు; పండ్లతో గీఱు; బాణములు వేయు; కొట్టు.
గీఱుగాజులు. బ. ఒకవిధమైన గాజులు.
గీఱుడు. గోఁకుడు; ఛేదనము.
గీఱునామము. గీఱ గలిగిన నామము.
గీలు. అ. క్రి. స్రవించు.
గీలుకొను. అ. క్రి. అభిముఖమగు.
గీలుకొలుపు. స. క్రి. పొందించు, పుష్పాదుల ధరించు.
గీల్కొను అ. క్రి. గీలుకొను.
గీల్కొలుపు. స. క్రి. గీలుకొలుపు.
గీవు. తాకట్టు. రూ. గిరవు.
గీష్పతి. సం. బృహస్పతి. రూ. గీర్పతి.
గీసినమామిడికాయ. గీసి యూఁటఁబెట్టిన మామిడికాయ.

## గు

గుంఛము. సం. పువ్వులగుత్తి.
గుంజ సం. పూసగురివెంద; గురిజ†; అవ్యక్త మధురధ్వని; ఉప్పు పండెడి భూమి, ఉప్పళము; తిప్పట.
గుంజిలిపెట్టు. స. క్రి. గోపనముసేయు.
గుంజిళ్ళు. బ. దండనవిశేషము, చేతులు కట్టుకొని రెండు కాళ్ళు చేర్చిపెట్టి కూర్చుండి లేచుట; నతి. [కుఁడు.
గుంజిళ్ళుపెట్టించుకొనువేల్పు. వినాయ
గుంజె. స్తంభము; కట్టుగొయ్యి.

గుంజెనుసుఁగు. స. క్రి పరిహాసముచేయు; ఎలుఁగుగొడ్డాట.
గుంజౌటన. వ్యసనము.
గుంజె. తాడు ఈఁదు మొదలగువాని మోపు మొదలు; తాటితేగ మొనయందు బుట్టలోనుండెడి గిజురు. స. క్రి. లాగు; ఈడ్చు; ఉదుకు.
గుంజెలాడు. స. క్రి. పెనఁగొను.
గుంట. కొలను; గొయ్యి, పల్లము; భూ పరిమాణ విశేషము; చెఱువు; అల్ప తటాకము; కొండ్ర; పిటిదిమీఁదిగుంట.
గుంటక. దున్ని విత్తులు చల్లినవెనుక నేల సవరచేయు సాధనము.
గుంటకగుజ్జులు. బ. గుంటక యడ్డను పండ్లవలె నుండునవి.
గుంటకపలుగులు. బ. గుంటకగుజ్జులకు వేయఁబడి నేల గీచుకపోవునవి.
గుంటకయడ్డ. గుంటకకు అమర్చిన అడ్డ.
గుంటకబగర. భృంగరాజము†.
గుంటక్రోవ ఒక దినుసు పిరంగి.
గుంటగలగర } భృంగరాజము†.
గుంటగలిజేరు }
గుంటచేల్లు. బ. బాలక్రీడావిశేషము.
గుంటదూలము. గృహవిశేషములయందు కడయొత్తుల మీఁదనుండి గుజ్జులనడిమికిఁ జొప్పించెడి చిన్న దూలము.
గుంటనక్క. చిన్న జాతినక్క. [పోయి.
గుంటప్రొయ్యి. గుంటత్రవ్వి యేర్పఱచిన
గుంటి. చేనిభాగము; దున్నుట మొదలగు వానికేర్పఱచుకొన్న భాగము(పొలము)
గుంటుగు. గుంటక.
గుంఠితము సం. విణ. మాయఁబడినది; (ధూళి మొదలగువానిచే) కప్పఁబడినది.
గుండ. గుడ్డ; పొడి. ద్ర. పంచమీవిభక్తి ప్రత్యయము.
గుండంగి } నీరుకోడి, జలకుక్కుటము.
గుండఁగి }
గుండఁగొయ్య. విణ. దుష్టుఁడు.
గుండఁడు. దానుఁడు.
గుండకము. సం. దుమ్ము; నూనెపాత్రము; అవ్యక్తమధురధ్వని.
గుండతుంగ. దీర్ఘ రాజము†. [గర్తము.
గుండము. నిప్పులగుంట; గొయ్యి,
గుండా. విణ. ధీరుఁడు.
గుండిగ. వెడల్పు నోరుగల లోహ పాత్రము; నీరుపోసికొనెడియిత్తడిపాత్ర.
గుండియ. గుండె.
గుండిలము. సం. మద్దెల ( మోఁత.
గుండీ. బరణి; బొత్తాము.
గుండు. గోళము, గుండ్రని వస్తువు; గుండ్రపుటాయి; తూనికటాయి; పిరంగి గుండు; కపిలెగుండు; పెద్దటాయి; పర్వతము; గుల్మము; అశ్మము.
గుండుకొను. స. క్రి. వేష్టించు, చుట్టుకొను.
గుండుగిలు. అ. క్రి. చుట్టుపడు.
గుండుగుత్త. సమస్త స్వాతంత్ర్యముతోడ నిచ్చెడు గుత్త.
గుండుచెల్ల. పెద్దగంప [పాత్ర.
గుండుతపేల. నీళ్ళుపోసికొనెడి ఇత్తడి
గుండుపులుఁగు. చక్రవాకము.
గుండుములుపుగాఁడు. పక్షివిశేషము.
గుండె. హృదయము; మనస్సు.
గుండెకాయ. హృదయము.
గుండెకుల్లు. అప్రయోజకుఁడు.
గుండెతల్లడము. భయంకరము.
గుండ. గుండ్రముయొక్క ఉత్తరరూపము. విణ. గుండ్రనిది.
గుండ్రతనము. వర్తులత. [ముస్త.
గుండ్రతుంగ. దీర్ఘనాళము; ఒక దినుసు
గుండ్రదనము. గోళత్వము; వలయాకారము.
గుండ్రన. వర్తులత, గుండ్రదనము.
గుండ్రనిది. విణ గోళాకారమైనవస్తువు.
గుండ్రము. విణ. వర్తులము.
గుండ్రలు. బ. పిండికొట్టి చెరుగఁగా వెనుక నిలిచినఉండలు; చెఱకురాట్నపు కంబములు. [కూయు.
గుండ్రలుకొలుపు. అ. క్రి. గుడ్లగూబ
గుండ్రా. గుండతుంగ.
గుండ్రాయి. పాత్తరము; పచ్చడి మొ॥ నూరెడు టాయి; చట్రాయి.
గుండ్రించు. అ. క్రి. కడుపుత్రిప్పు.

గుంౘడింపు. గుంౘడించుట. [గుంట.
గుంత. పల్లము; పిటేదిమీఁది గుంట. రూ.
గుంౘద. సం. నాగముస్తె†; ౘపేంకణము†.
గుంౘదము. సం. కాకిచెఱకు†.
గుంథము. సం. గుంజ. [మించు
గుంపించు. స. క్రి. కుప్పవేయు; అతిక్ర
గుంపు. సమూహము, ప్రాణిసమూహము; చతురంగబలయుతసేన.
గుంపెన. ఒకానొకచెట్టు; విజృంభణము.
గుంఫనము. సం. మాటలు మొదలగు వానిని కూర్చుట.
గుంఫము. సం. కూర్చుట; మాటలు మొదలగు వాని కూర్పు; బాహుభూషణము.
గుంఫించు. సం. అ. క్రి. గుంఫితమగు. స. క్రి. పుష్పాదులుకూర్చు.
గుంఫితము. సం. విణ. కూర్పఁబడినది.
గుంబము. రూ. గుమ్మము.
గుగ్గిలపుఁజెట్టు. గుగ్గులువృక్షము.
గుగ్గిలము. గుగ్గులువృక్షపు బంక.
గుగ్గిళ్లు. ఉడుకవేసిన సెనగలు మొదలగు నవి, అభ్యాసము.
గుగ్గులువు. సం. కౌశికము, గుగ్గిలపుఁజెట్టు.
గుచ్చలి. కుచ్చలి.
గుచ్ఛకము. సం. పూగుత్తి; నెమలిపురి; పొద; ముప్పదిరెండుమణులు గ్రుచ్చిన హారము.
గుచ్ఛపుష్ప. సం. బంతిచెట్టు.
గుచ్ఛఫలిక. సం. ద్రాక్ష†.
గుచ్ఛము. సం. పూగుత్తి; ముప్పదిరెండు పేటల ముత్యాలహారము; సమూహము.
గుజరాష్ట్రముపట్టు. మి. వస్త్రవిశేషము.
గుజేస్తా. హిం. విణ. కడచిపోయిన.
గుజారతు. హిం. వశము.
గుజిరీఅంగడి. బజారు స్థలము; సాయంత్రము తెఱచు అంగడి, దొంగబజారు. రూ. గుజరి, గుజిరి, గుజిలీ.
గుజ్జెనగూళ్లు. బ. గుజ్జనగూడు.
గుజెగుజె. విణ. పీడితము.
గుజెగుజెఱేకులు. బ. బాలక్రీడావిశేషము
గుజెగుజెలాడు. అ. క్రి. ౘత్రొక్కటపడు.
గుజెగుజెలు. బ. గుసగుసలు.
గుజెగుజెవోవు } అ. క్రి. సంకటపడు.
గుజెగుజెలువోవు }
గుజెరాతి. ఘూర్జరదేశము; ఘూర్జరభాష; నాట్యవిశేషము. [సమర్పించు.
గుజెరానుపఱచు. హిం. స క్రి. ఇచ్చు;
గుజెరాయించు. గుజరానుపఱచు.
గుజేరి. సంతచోటు.
గుజేరీ. ఘూర్జరదేశము.
గుజోఱి. విణ. ధనవంతుఁడు.
గుజారు. రూ. గిజారు.
గుజ్జెనగూడు. పిల్లలవంట, బాలికలాడు కొనుచప్పుడు గురుగులతో వండిన వంటకము.
గుజ్జెరాతి. రూ. గుజరాతి. [దేశమువారు.
గుజ్జెరాతులు. బ. ఘూర్జరులు; గుజరాతి
గుజ్జెరి. ఘూర్జర దేశము.
గుజ్జెరివాఁడు. ఘూర్జరుఁడు.
గుజ్జె. చిక్కని రసము; అనుకగు రస ద్రవ్యము; కుబ్జత్వము; పొట్టిరెద్దు; గుంటకగుజ్జు; దూలపుగుజ్జు; బండి పఱపు గుజ్జు; పాపటపుగుజ్జు. విణ. పొట్టివాఁడు; పొట్టిది.
గుజ్జెతనము కుఱుచఁదనము, కుబ్జత్వము.
గుజ్జెది. పొట్టిది. [గల పొట్ల.
గుజ్జెపొట్ల. కర్కాటకబ్జము; పొట్టికాయలు
గుజ్జెమామిడి. రాజామ్రము, పొట్టిదినుసు మామిడి†.
గుజ్జెవాఁడు. పొట్టివాఁడు.
గుజ్జెవేలుపు. వినాయకుఁడు.
గుజ్జెవేలుపుతండ్రి. శివుఁడు.
గుజ్జెనయిదోడు. కుమారస్వామి.
గుజ్జెనగూళ్లు. బ. గుజ్జనగూళ్లు.
గుటక ఒకతూరి నోటఁబోసికొని మింగెడు నీళ్లు మొదలగువాని కొలఁది.
గుటగుట. అన్నముడుకుట నీళ్లుత్రాగుట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము; పందికూఁత. బ. పెద్దతిక పుమాటలు
గుటుకు. రూ. గుటుక్కు.
గుటుక్కను. అ. క్రి. చచ్చు.

గుటుకుగుటుకు } మ్రింగుటయందగు ధ్వ
గుటుక్కు } న్యనుకరణము.
గుట్ట. చిన్నకొండ; రాశి; కొండ.
గుట్టు. మర్మము; గాంభీర్యము; తాత్ప ర్యము బయలుపుచ్చుమి. [పడుట.
గుట్టుఁబేడు. రాజమంత్రము బయలం
గుట్టుసాకిరి. విణ. వాది తన వ్యవహారము గెలుచుటకొఱకు రప్పింపఁగా వచ్చి డాఁగియుండి ప్రతివాదియొక్క మాట లన్నియుఁ జక్కఁగా విన్న సాక్షి.
గుడ. సం. గుళిక; జెముడు†; ద్రాక్ష†.
గుడక. టెంకాయబుఱ్ఱ మొందలగునది; పాలడ.
గుడత్వక్కు } సం. లవంగపుఁ బట్ట.
గుడత్వచము }
గుడపుష్పము. సం. ఇప్ప†.
గుడఫలము. సం. గోనుగు†. [కవచము.
గుడము. సం. బెల్లము; గోలి; ఏనుఁగు
గుడాక. సం. నిద్ర. [చిన పొగాకు.
గుడాకు. మి. బెల్లముతోఁ జేర్చి మర్దిం
గుడాకేశుఁడు. సం. అర్జునుఁడు; శివుఁడు.
గుడారము. పటగృహము, డేరా, వస్త్రముచేత నేర్పఱచిన యిల్లు.
గుడారు. గుడారము.
గుడారులు } గుడారములు, ఎఱ్ఱపట్టు
గుడార్లు } గుడారములు.
గుడి. ఇకార రూపాంతరనామము; పరి వేషము; వలయాకారరేఖ; దేవాలయము
గుడిక. సం. గుళిక. [యెల్లల యేర్పాటు
గుడికట్టు. గ్రామము నాలుగు దిక్కుల
గుడికొను. అ.క్రి. క్రమ్ము [వస్త్రకవచము.
గుడిగి. మోఁకాలివఱకుఁ దొడిగికొను
గుడిగుడి. విణ. అల్పము.
గుడిగుడిగుంజెము. బాలక్రీడావిశేషము.
గుడిగుడీ. హుక్కాగొట్టము.
గుడిచేట్టు. పరివేషము; చంద్రసూర్యు లకుఁ జుట్టు నేర్పడు మండలాకారము.
గుడిజెల్ల. మత్స్యవిశేషము.
గుడిదిరుగు. అ. క్రి. గుండ్రముగాఁదిరుగు.
గుడిసె. కుటి, కుటీరము, గట్టి తాటాకులం వేసి గుండ్రముగా చేసినది, స్తంభములం గోడలం నుంచక మెల్లెలునాటి తృణా దులతో నేర్పఱచిన చిన్నయిల్లు; ఒక విత్తు చింతపడు.
గుడిసెవాటు. కులట.
గుడిసెవాటుది కువేశ్య.
గుడుక్కు. గుటుకు.
గుడుగుడు. చిన్నహుక్కా; పరుగెత్తుట యందగు ధ్వన్యనుకరణము. [షము.
గుడుగుడుగుంచేములు. బ. బాలక్రీడావిశే
గుడుగురావిలము. పక్షివిశేషము.
గుడుప ఇనుప దుడ్డు.
గుడుసరి. కపటముగలవాఁడు.
గుడుసు. పరివేషము. విణ. వలయాకార మైన వస్తువు, గుండ్రము; గుడిసె.
గుడుసుకయిదువు. విష్ణుచక్రము.
గుడుసుపఱచు. స. క్రి. కొంచెముసేయు, కొంచెపఱచు.
గుడుసువడు. అ. క్రి. గుండ్రమగు.
గుడుసువాలు. చక్రాయుధము.
గుడూచి సం. తిప్పతీఁగ.
గుడెము. బోయపల్లె.
గుడ్డ. వస్త్రము; కర్పటము, బట్టతునుక.
గుడ్డము } చేను, క్షేత్రము; చేనుతునుక.
గుడ్డాము }
గుడ్డి. గుడ్డివాఁడు, అంధుఁడు; గుడ్డిది; అట్టచెమ్మ ఆటలో వెలికిలఁబడు ఒంటి కాయ.
గుడ్డికన్ పాదుసా. కుబేరుఁడు
గుడ్డికొక్కురాయి } కోయష్టికము. రూ.
గుడ్డికొక్కెర } గుడ్డి కొక్కురాయి.
గుడ్డితనము. అంధత్వము.
గుడ్డిది. అంధురాలు.
గుడ్డివాఁడు. అంధుఁడు.
గుడ్డు అండము.
గుడ్లగుబ్బలి. ఘూకము.
గుడ్లగూబ. ఉలూకము.
గుణకము. సం. పెంచెడు లెక్క.
గుణనిక. సం. వల్లెవేయుట, అభ్యాసము; అనేకమైన రెట్లుగలది.
గుణపడు. మి. అ. క్రి. చక్కఁబడు.
గుణము. సం. ఐశ్వర్యాది (షడ్గుణ ములు—ఐశ్వర్యము, వీర్యము, యశము,

శ్రీ, జ్ఞానము, వైరాగ్యము); శౌర్యాది; త్రాడు; వడము; వింటినారి; నూలిపోగు; మడుఁగు; శబ్దాది (భూత గుణములు—శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము); నీలపీతశుక్లాది; సంధ్యాది (ఇవి ఆఱు—సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, ఆశ్రయము); సత్త్వాది (ఇవి మూడు—సత్త్వము, రజస్సు, తమస్సు); ఇంద్రియము; అప్రధానము; అలవాటు; కావ్య గుణములు—శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థదీపనము, ఔదార్యము, కాంతి, ఓజస్సు, సమాధి అని పది.

గుణలయని. సం. డేరా.

గుణవంతుఁడు. సం. సుగుణములుఁగల [పురుషుఁడు.

గుణవతి. సం. గుణవంతురాలు, సుగుణములుఁగల స్త్రీ.

గుణవృక్షకము. సం. ఓడకంబము, ఓడ [నడిమికంబము.

గుణాలయము. సం. కుఠారము.

గుణి. సం. విల్లు విణ. గుణముగలవాఁడు.

గుణించు. సం. స. క్రి. గుణకముచేయు, రెట్లుచేయు.

గుణితము. సం. హల్లులతో అచ్చులను హల్లులను జేర్చి చెప్పుట. విణ. గుణింపఁబడినది, రెట్లుచేయఁబడ్డది.

గుణుఁడు. సం. భీముఁడు. విణ. వంట[వాఁడు.

గుణోత్కర్షము. సం. గుణాతిశయము.

గుణ్యము. సం. విణ. గుణింపఁదగినది.

గుత్త. వస్త్రము; ఫలప్రదమైన యొకి సొత్తును ఆ సొత్తుగలవానికి తత్ఫలార్థము తగిన ధనమిచ్చి అనుభవమున నుంచుకొనుట, ఇజారా.

గుత్తకాఁడు. గుత్తకారుఁడు, గుత్తయెత్తిన [వాఁడు.

గుత్తగ. ఇజారా.

గుత్తగొను. స. క్రి. గుత్తయెత్తు.

గుత్తము కచ్చితము; బిగువు.

గుత్తవ. గుత్తగ, ఇజారా.

గుత్తి. పుష్పాదుల గుచ్ఛము; చీలమండ.

గుత్తికగువ్వ. గువ్వగుత్తిక†.

గుత్తికవ్వము. గుత్తిగాఁగట్టిన కవ్వము, వెదురుకొయ్య చివరను చీల్చి దారముతోఁగట్టి యేర్పఱచిన కవ్వము.

గుత్తిపండ్లు. బ. గుత్తులు గుత్తులుగ పండెడు ఒక విధమైన పండ్లు.

గుత్తిమల్లెలు. బ. ధాన్యవిశేషము.

గుత్తులుగుత్తులు }
గుత్తులు } బ. గుత్తిమల్లెలు.

గుత్తివడు. అ. క్రి. ముడుఁగు.

గుత్సకము. సం. పూగుత్తి.

గుత్సము. సం. వరి మొదలగువానిగంటు; పూగుత్తి; ముప్పదిరెండు మణులు గ్రుచ్చిన హారము; గండివనము†.

గుదగుదలాడు. అ. క్రి. దగ్గుత్తికతో నేడ్చు.

గుదము. సం. పాయువు, మూడి, మల ద్వారము.

గుది. ఆకులు మొదలగువాని గ్రుచ్చిన సరము; గుత్తి, గుచ్ఛము; పశుబంధన రజ్జువు.

గుదికాలు. చీలమండకు దిగువనుండు [పాదము వెనుకటి భాగము.

గుదికూర్పు. గుంఫనము.

గుదిగట్టె. దుష్టమగు ఆవు మొదలుగాఁగల వానికి మెడను గట్టెడు కొయ్య; త్రాడు మెడకుఁ గట్టునది.

గుదిగాలు రూ. గుదికాలు.

గుదిగుంజెలు. బ. పసులదొడ్డి మొదలగు వాని ద్వారమందు నిలువుగాఁ బాతిన కంబములు.

గుదిగొను. అ. క్రి. అతిశయించు; దట్టమగు; మూటకట్టుగాఁ గూలఁబడు.

గుదిత్రాడు మూడకాలికి కట్టిపెట్టెడి త్రాడు.

గుదిత్రోయు. స. క్రి. కాళ్ళుకట్టిత్రోయు

గుదియ. గద; దండము, నాలుగుమూరల నిడివిగల దండము; తడకట్టునది, గుదిగట్ట; ఇనుపదుడ్డు.

గుదియకఱ్ఱలు. బ. గుదిగుంజల కడ్డముగా జొప్పించెడు కఱ్ఱలు, పశువులదొడ్డి ద్వారమునకు అడ్డముగా వేసిన కఱ్ఱలు.

గుదియతాలుపు. దండధరుఁడు; యముఁడు

గుదియించు. స. క్రి. నిలుపు.

గుదివడు. అ. క్రి. కట్టువడు.

గుదె. రూ. గుదియ.
గుదెవాల్పు. దండధరుఁడు; యముఁడు.
గుద్ద. కుట్టియ, గుదము.
గుద్దలి. కుద్దాలము, నేలత్రవ్వెడి సాధనము, వేళ్ళు మొదలగునవి పెల్లగించెడు సాధనము. బ. గుద్దండ్లు.
గుద్దలించు. స. క్రి. నేలత్రవ్వు; గుద్దలితోఁ బెల్లగించు; వెదకు.
గుద్దు. ముష్టిఘాతము. స క్రి పిడికిటగుద్దు.
గుద్దులాట. ముష్టిముష్టి; కరేకరము.
గునకలు. బ తృణధాన్యభేదము.
గునగున. వేగముగా నడచుటయందగు ధ్వన్యనుకరణము.
గునపనకోడి. అడవికోడి.
గునపము. గడ్డపాఱ. [సూత్రవిశేషము
గునామొలనూలు. బిడ్డలుకట్టుకొనెడుకటి
గునియు అ. క్రి. నర్తించు; కులుకు.
గునిసాడు. అ క్రి. గునియు.
గునిసె. వామనుఁడు.
గునుక. అల్పధావనము. [పసవెత్తు
గునుకు. అంటిస; గునుక. అ. క్రి. కొద్దిగా
గునుకుఁడు. గునుక.
గునుకులు. బ. తృణధాన్యవిశేషము.
గునుగుడు గునుక.
గునుగుపరుగు గునుక, కొంచెపు పరుగు.
గునుపము ఇనుపదుడ్డు.
గునుపు. విలాసవిశేషము.
గున్న. పిల్ల; వామనుఁడు; కరికలభము; క్షుపము, కురుచచెట్టు.
గున్నంగి. పక్షివిశేషము.
గుపారము. అంజమొడపట్టు.
గుపాసు. ఉప్పత.
గుప్త. సం. వైశ్యుని ఉపపదము.
గుప్తకేళి. దాఁగిలిమూఁతలు, దాగుఁడుమూఁతలాట. [దాఁచఁబడినది.
గుప్తము. సం. విణ. రక్షింపఁబడినది;
గుప్తరాగము, సం. మొగలి†.
గుప్తి. సం. కాపాడుట; దాఁచుట; చెఱసాల; పాఁతఱ.
గుప్పవగూర. చిందరవందర.
గుప్పళించు స. క్రి. వస్త్రము మొదలగువానిని ఊనుము; ఫుక్కిలించు; ఊంచు.
గుప్పించు. స. క్రి. (బాణాదులను) ప్రయోగించు; కురియు.
గుప్పిలి. పిడికిలి, ముష్టి.
గుప్పు. స. క్రి. విస్తరించివేయు; ఊంచు; చల్లు; (దూడ పాలుత్రాగు నప్పుడు తలతో) పొడుఁగును పొడుచు; గుప్పించు, బాణాదులను ప్రయోగించు; విసరివైచు; ఎగయుటయందును ప్రోయుటయందును వాసనకొట్టుట యందును వైచుటయందుననగు అనుకరణము. [ముగా.
గుప్పున. క్రి. క్రి. విణ. దబ్బున, శీఘ్ర
గుప్పెఁడు. పిడికెఁడు.
గుబ. కొరడు.
గుబక. తలుపుగందపట్టెమీఁది గుబ్బ.
గుబగుబ. కోకిల ధ్వన్యకరణము. బ. ధ్వనితోఁగూడిన పరుగులు.
గుబారము. మల్లయుద్ధ విశేషము.
గుబాలు. రూ. గుబేలు.
గుబాలున. క్రి. క్రి. విణ. దబ్బున. [శించు
గుబాళించు. అ. క్రి. వాసనకొట్టు; ప్రకా
గుబిలి. ఒక శకునపక్షి; గులిమి, కర్ణమలము
గుబుకు. స. క్రి. రూ. గుముకు.
గుబురు. దట్టము; సమూహము; వృక్షవిటపము, చెట్టువిరివి.
గుబులు. గుప్పని కొట్టువాసన; భయము, గుండెకొట్టుకొనుట.
గుబులుకొను. అ క్రి. గుప్పనివాసనకొట్టు
గుబుసు. కిటుకు, [ధ్వన్యనుకరణము.
గుబేలు. పగులుట, పడుటయందగు
గుబ్బ. కుచము; గొడుగుమీఁదిగుబ్బ; తలుపు గందపట్టెమీఁదిగుబ్బ; బాణము నలుఁగుక్రిందిగుబ్బ. విణ. గుండ్రమైనది.
గుబ్బకాయ. వీణాగ్రశలాటువు.
గుబ్బటిలు(ల్లు). అ. క్రి. తిరుగుడువడు.
గుబ్బతిలు(ల్లు). అ. క్రి. ఉప్పొంగు, అతిశయించు.
గుబ్బన. క్రి. క్రి. విణ. శీఘ్రముగా.
గుబ్బపేట. క్రేపు, కొండచరియ.
గుబ్బమేకులు. బ. గంధపట్టెలకు వేసెడి మేకులు.

గుబ్బ్రమాను. కుండలంచేయు సాధనము.
గుబ్బలాఁడి. యౌవనముగల స్త్రీ.
గుబ్బలి. పర్వతము.
గుబ్బలికాఁడు. ఒక శకునపక్షి.
గుబ్బలిదొర. నగాధిరాజు, హిమాద్రి.
గుబ్బలిపట్టి. పార్వతి.
గుబ్బలిపట్టిగుఱ్ఱము. సింహము.
గుబ్బలివిలుకాఁడు. శివుఁడు, మేరుధన్వుఁడు. [ములు
గుబ్బలు బ. చూచుకములు; స్త్రీ కుచ
గుబ్బసరము. పెక్కు దినుసు మణులు గ్రుచ్చిన సరము.
గుబ్బిక. ఉచ్చు.
గుబ్బిరి. ఒక చెట్టు.
గుబ్బిలికాఁడు. గుబ్బలికాఁడు.
గుబ్బు. గుండె అదురుటయందగు ధ్వన్యనుకరణము.
గుబ్బుమను } అ. క్రి. గుండె గుబ్బనియదురు.
గుబ్బురను }
గుబ్బెత. యువతి.
గుమగుమ. గుమ గుమ యను వాస-; వాసనకొట్టుటయందగు అనుకరణము.
గుమాను. హిం. అనుమానము.
గుమాస్తా. హిం. క్రింది ఉద్యోగస్థుఁడు
గుమి. పోగు, గుంపు; కుమి.
గుమికాఁడు. కాకి.
గుమితి. ఆయుధవిశేషము.
గుమిలి. ఒక శకునపక్షి.
గుముకు. స.క్రి. పిడికిటితో పొడుచు.
గుముడు. రూ. గుమ్ముడు.
గుమురు. రూ. గుబురు.
గుమ్మ. క్షీరధార, పాలు పిండునప్పుడు వచ్చెడు ధార; స్త్రీ; గాజువంటి బొట్ట.
గుమ్మఁడు. విణ. అలంకరించుకొనువాఁడు
గుమ్మటము. దీపము ంచెడు కాగితపు గూఁడు.
గుమ్మడి. కూష్మాండము†. [సొమ్ము.
గుమ్మతీలు. బ. చెవితమ్మల నుంచెడు
గుమ్మము. వాకిలి, ద్వారము.
గుమ్మాళి. పాదరక్ష.
గుమ్మి. కుసూలము, గాజె.
గుమ్మితి. ఆయుధవిశేషము.

గుమ్ము. పిడికిటిపోటు; వాసనకొట్టుటయందగు అనుకరణము. స.క్రి. పిడికిటితోఁ బొడుచు.
గుమ్ముడు. కాశ్మర్యము, శ్రీపర్ణి†.
గుమ్మెట. వాద్యవిశేషము.
గుమ్మెత. గుమ్మెట; కుంభవాద్యము; అల్పపటగృహము. [వాఁడు.
గుమ్మెతకాఁడు. గుమ్మెత వాయించు
గుమ్మెతము. తుడుమువాద్యము.
గురగుర. పందికూఁత, ఘుర్ఘురధ్వని; కంఠధ్వనివిశేషము.
గురణము. సం. యత్నము.
గురపిడి. అడవిగోవు.
గురపోతు. మగ గవయము.
గురికొచ్చె. తెలివి. [పిడత.
గురిగి. ఆఁడుపడుచులు ఆడుకొను చిన్న
గురిగింటె. గురిజపూస.
గురిజె. గుంజ, గురిగింజ; గుంజాలత; శ్రీహస్తినీలత.
గురిమాని. కైజీతకాఁడు.
గురియ. రూ. గురిగి.
గురువెంద. గుంజె†.
గురు. మృగవిశేషము, గవయము.
గురుఁడు. సం. గురువు.
గురుక. నిద్ర.
గురుకు పశువ్యాధిభేదము.
గురుగింజ. గురిగింజ. [చెట్టు.
గురుగు. శ్రీహస్తిని, ఒకదినుసుకూరాకు
గురుగుకూర. ఒకానొక శాకము.
గురుగుపల్లిక. గురుచ, శ్రీహస్తిని†.
గురుచె. గురుగుపల్లిక. [చెట్టు.
గురుజె. ఉత్తండి, ఒకదినుసుకూరాకు
గురుజౌ. వజ్రము.
గురుతు. చిహ్నము.
గురుదా. కత్తి.
గురుపోతు. గురపోతు.
గురులు సం. బ. తలిదండ్రులు.
గురువారము. సం. బేస్తవారము, లక్ష్యవారము, బృహస్పతివారము.
గురువు. వేగపుపరుగు. సం. విద్యచెప్పినవాఁడు, ఉపాధ్యాయుఁడు; మంత్రము

చెప్పినవాఁడు; తత్త్వము నుపదేశించువాఁడు; బృహస్పతి; కులముపెద్ద; తండ్రి; తండ్రితోఁడఁబుట్టినవాఁడు; తాత; అన్న; మామ; మేనమామ; రాజు; కాపాడువాఁడు; గుర్వత్తురము, అలఘువు. విణ. ఘనము, గొప్పది; బలువు, భరింపఁగూడనిది.

గురువుదేఱు. అ. క్రి. జిఱ్ఱున చిప్పిలు.

గురువులు. బ. పరుగులు.

గురువులువాఱు. అ. క్రి. వేగపుపరువుగా పాఱు; అతిశయించు.

గురువెంద. గురిగింజ.

గురుసు. జీవస్థానము; మేగ; శౌర్యము; పశువుల తోఁకచివర పొడుగు వెండ్రుకలు మొలుచుట కాధారముగా నుండు తావు.

గురుసులు. బ. కేశమూలములు.

గుర్గురించెమెకము. పంది.

గుర్గురింత. పంది.

గుర్తించె. స. క్రి. గుఱుతుపట్టు.

గుర్తు చిహ్నము, గుఱుతు.

గుర్విణి. సం. చూలాలు, గర్భిణీ స్త్రీ.

గుర్వు. విణ. అధికము.

గుర్వెట్టు. అ. క్రి. గుఱకపెట్టు.

గుఱక. నిద్రయందలి ధ్వని; నిద్ర.

గుఱగుఱ ఒకవిధమైన దురద; కంఠధ్వని విశేషము.

గుఱాలగోచె. అశ్వపాలకుఁడు.

గుఱి. లక్ష్యము; గుఱుతు; దృష్టాంతము; నిర్ణయము; మితి; బాణాదుల లక్ష్యము; పరిహద్దు; వాయిదా.

గుఱించె. స. క్రి. ఉద్దేశించు; నిర్ణయించు.

గుఱికట్టు. అంచు; మితి.

గుఱికాఁడు. విణ. కృతహస్తుఁడు.

గుఱికొండి. మర్మము, ఆయము; న్యూనత.

గుఱికొను. స. క్రి. లక్షించు.

గుఱిచి. అవ. కూరిచి, కూర్చి.

గుఱుకొను. అ. క్రి. ఉద్యోగించు, యత్నించు. [కరణము.

గుఱుగుఱు. ఒఱలుటయందగు ధ్వన్యను

గుఱుతు. ఆనవాలు, చిహ్నము; మేర.

గురుపెట్టు
గుఱుపొడుచె } అ. క్రి. గుఱకపెట్టు.

గుఱుములు. బ. గింజలు, విత్తులు.

గుఱువెట్టు. అ క్రి. గుఱకయిడు.

గుఱ్ఱపుఁజెక్క. అశ్వినీనక్షత్రము.

గుఱ్ఱపుఁజొంగ. హాలాహలము.

గుఱ్ఱపుఁబీటలు. బ. ద్వారబంధముమీఁద నుంచెడు గుఱ్ఱపుమూతి కొయ్యలు.

గుఱ్ఱపుపెరజాలు. బ. పాములలో నొకభేదము.

గుఱ్ఱపుమూతివారు. బ. కింపురుషులు.

గుఱ్ఱపుమోమువేల్పు. కింపురుషుఁడు.

గుఱ్ఱపుసారము. ధైవతస్వరము.

గుఱ్ఱపెకుఁడు. అందలములు.

గుఱ్ఱము. అశ్వము.

గుఱ్ఱు. కోపము; కోపమునందగు అనుకరణము; నిద్రాధ్వని; నిద్రయందగు ధ్వన్యనుకరణము.

గులక
గులకఱాయి } ఒక దినుసుఱాయి.

గులకరించె. అ. క్రి. రమ్యమగు.

గులకరింత. క్షుద్రజలచరము.

గులగుల. పుట్టలను కోరాడుటయందగు అనుకరణము. బ. చూర్ణము; నలఁగుడు; దురద.

గులప. గుఱ్ఱపువాఁడు.

గులాబి. హిం. పుష్పవృక్ష విశేషము, లాక్షాపుష్పము†. [బిచ్చము.

గులాము. దాసుఁడు; దాసురాలు;

గులి. సం. గోలీ; తీఁటగుల్ల.

గులిబి(మి). తోక్కము, కర్ణమలము.

గులిమికదురు. గులిమితీసికొనెడు వెండి మొదలగువానిపుల్ల.

గుల్పము. సం. చీలమండ.

గుల్మము. సం. తుప్ప, బోదలేని చెట్టు; కడుపులోని పిత్తజమాంసగ్రంథి, వ్యాధి విశేషము; సేనావిశేషము; సైన్యరక్షణము; పురాభిముఖమైన రాజమార్గము.

గుల్మి. గుబిలి, గులిమి. [ఉలపము; పొదరు

గుల్మిని. సం. దట్టముగాఅల్లుకొనెడితీఁగె,

గుల్ల. కప్పచిప్ప, క్షుద్రశంఖము. విణ.

అల్పము; బోలు, లోపల ఏమియు లేనిది; బొబ్బ, తెల్లవ్రణము.
గుల్లకాఁడు. విణ. ఏమియు లేనివాఁడు.
గుల్లపడు. అ. క్రి. అవమానపడు.
గుల్లపుటికె. చిన్నగంప.
గుల్లాము. గులాము; గుఱ్ఱాలవాఁడు.
గువాకము. సం. పోఁక చెట్టు. రూ. గూవాకము.
గువ్వ. కపోతపక్షి; అడవిపావురము; పక్షి.
గువ్వతిరిగొను. స. క్రి. చుట్టుకొను.
గువ్వకుత్తుక. (ఆఁకటిచేతఁగలుగు) హీనస్వరము. [హీనస్వరమగు.
గువ్వకుత్తుకపడు. అ. క్రి (ఆఁకటిచేత)
గువ్వకోలుకొను, గువ్వకోల్కొను } స. క్రి. చుట్టుకొను.
గువ్వగుత్తి, గువ్వగుత్తుక } ఒక గడ్డి, కపోతాంఘ్రి†
గుసగుస. రహస్యవాక్యముల చప్పుడు.
గుసగుసలువోవు. అ. క్రి. గుసగుస యని మాటలాడు.
గుహ. సం. కొండగవి, కొండయందు తొలువఁబడిన గొప్పబిలము; పల్లము; నక్కతోఁకపొన్న†.
గుహారు. అపవాదము. [ఎలుఁగుమంటి.
గుహాశయము. సం. సింహము; పెద్దపులి;
గుహుఁడు. సం. కుమారస్వామి; ఒక వ్యాధుఁడు, శ్రీరాముని చెలికాఁడు.
గుహ్యకుఁడు. సం. మణిభద్రాది దేవయోని విశేషము.
గుహ్యకేశ్వరుఁడు. సం. కుబేరుఁడు.
గుహ్యతమము. సం. విణ. మిక్కిలి రహస్యమైనది.
గుహ్యము. సం. ఏకాంతము; ఉపస్థము. స్త్రీపురుషులగుఱి; తాఁబేలు; నెపము. విణ. దాఁచఁదగినది, రహస్యము.
గుళిక. సం. ఉండ, రసమణి మొ.
గుళిగ. గుళిక.
గుళుంచము. సం. వికసించిన పూగుత్తి.
గుళుచ్ఛము. సం. పువ్వు మొదలగువాని గుత్తి.
గుళూచి. సం. తిప్పతీఁగె; గుగ్గులువృక్షము
గుల్లు జ. కుందెనగుడియను బాలక్రీడా విశేషము.

## గూ

గూండ్ర గుడ్లగూబకూఁత.
గూండ్రించు. అ. క్రి. (గుడ్లగూబ)కూయు.
గూఁటి పంది, ఘృష్టి.
గూఁటిగువ్వ. ఈఁకలు రాల్చిన పక్షి.
గూఁడు. కులాయము, పిట్టగూడు; గోడయందు త్రవ్విన గూడు; గోడయందు దీపముంచుట కేర్పఱచిన చోటు; (పెంపుడు చిలుకలు మొదలగునవి యుండు) పంజరము; ఆకుగుడిసె.
గూఁడుకానుపు. పక్షి.
గూఁడుబండి. చాఁప కట్టిన బండి.
గూటము, గూటాము } ఉలిమీఁదఁ గొట్టెడి వడ్లవానియొకానొక కొఱముట్టు; గుంజ; మేకు; మందిగవాని ఒక కొఱముట్టు
గూడ. వానకు తలమీఁద వేసికొనుటకై యల్లిన జమ్ముగూడ; తిరుపగూడ, తిరువారాధనయుంచునది; నీళ్లు చల్లెడు వెదురుబుట్ట; పూవులు మొదలగునవి యుంచెడుబుట్ట; మత్స్యములను బట్టెడి సాధనవిశేషము; దొప్ప. [యుద్దకట్టు.
గూడకట్టు. కచ్ఛములేక కట్టిన ధోవతి
గూడపాల. మామెన, శారిబ†.
గూడబాతు. బకవిశేషము.
గూడారము, గూడారు } రూ. గుడారము.
గూడెము [గ్రామసమీపమున నుండెడి చిన్న పల్లె; కొండదొన నాశ్రయించి యుండెడు బోయపల్లె. [పాము.
గూఢపాత్తు. సం. కానరాని కాళ్లు గలది,
గూఢపురుషుఁడు. సం. వేగువాఁడు.
గూఢమణి. సం. బాలికాక్రీడావిశేషము.
గూఢము. సం. రహస్యము; స్త్రీపురుషుల గుఱి. విణ. దాఁగియున్నది; దాఁచఁబడినది.
గూఢసాక్షి. సం. విణ. గుట్టుసాకిరి.
గూథము. సం. పురీషము, మలము.
గూద. క్రిందికి దిగిన గుదము, వ్యాధివిశేషము.

గూన. పెద్దకుండ.
గూనిది. కుబ్జ.
గూనివాఁడు విణ. కుబ్జుఁడు.
గూను. వంగిన నడుము; నడుముమీఁది వంపు; కుబుసఁదనము.
గూనుఁడు సం విణ. ఏరిగిన వాఁడు.
గూనుగిల్లు. అ.క్రి. గూను కలుగు.
గూబ. కర్ణమూలము; కొఅడు; గుడ్లగూబ, ఉలూకము.
గూబతడ. మహాబలసి.
గూబరి. మాదిగవాఁడు.
గూబు. అశ్వవిశేషము.
గూవనాలు. బ. బాలక్రీడావిశేషము.
గూహనము. సం. గోపనము.

## గృ

గృంజనము. సం. విషము తిన్న పశువుయొక్క మాంసము; వెల్లుల్లి.
గృధ్నువు. సం. విణ. ఇచ్ఛగలవాఁడు.
గృధ్రము. సం. గద్ద విణ. పిసినివాఁడు.
గృధ్రసి. సం. కిరుదెసనీ. [తీఁగ; పంది ?
గృష్టి. సం. తొలి యీఁత యావు; పాఁచి
గృహకచ్ఛపము. సం. (నూరెడు) సన్నెకల్లు.
గృహగోధిక. సం. బల్లి.
గృహద్రుమము. సం. ఊఁకు; పాలఊఁకునీ
గృహపతి. సం. గృహస్థు; మంత్రి; విడువక యిచ్చువాఁడు.
గృహభూదారము. సం. పందికొక్కు.
గృహమణి. సం. దీపము.
గృహము. సం. ఇల్లు; పెండ్లాము.
గృహమృగము. సం. శునకము.
గృహమేధి. సం. గృహస్థుఁడు.
గృహస్థు. సం. భార్యగలవాఁడు, గృహస్థుఁడు.
గృహస్థుఁడు. సం. భార్యను పరిగ్రహించి ధర్మార్థకామములనడపుచు వేదపాఠము వైశ్వదేవాదిహోమము అతిథిపూజ పితృతర్పణము బలియు నసెను పంచయజ్ఞములనుజేయుచు ప్రవర్తించువాఁడు
గృహస్థూణము. సం. ఇంటి నడిమికంబము
గృహావగ్రహణి. సం. దేహళి, గడప,
గృహి. సం. గృహస్థు.
గృహిణి. సం. భార్య, ఇల్లాలు; ఎట్టితుమ్మెద; కణుఁదురీఁగ.
గృహీతము. సం. విణ. గ్రహింపఁబడినది.
గృహీతి. సం. గ్రహింపఁజాలిన బుద్ధి.
గృహ్యకము. సం. పెంచిన మృగపక్షులు. విణ. పరాధీనము.
గృహ్యా. సం. పేఁట, శాఖానగరము.
గృహ్యము. సం. కర్మబోధక గ్రంథము; పెంపుడు మృగము మొ. విణ. స్వాధీనము; పరాధీనము; గ్రహింపఁదగినది.

## గె

గెంగెటు. కెంగటు.
గెంజాయి. గ-జా.
గెంటనము. పరుషవచనము; కంటకము.
గెంటించు. అ. క్రి. చలించు.
గెంటు. అ. క్రి. చలించు; తొలఁగు. స.క్రి. ద్రొబ్బు, త్రోయు; ప్రయోగించు.
గెంటువడు. అ.క్రి. తప్పు. [దట్టము.
గెంటెము. జంట నేఁత వస్త్రము. విణ.
గెండ. గండకము; పౌరుషము.
గెండె. గండె.
గెగ్గలు. గేలి.
గెచ్చు. గచ్చు.
గెజ్జె. అంబుపక్కెర.
గెట్టి. గుజ్జుపొడ్డు.
గెడ. జతి; సమీపము; పేఁటకుఁ దగిన యొకానొక సాధనము.
గెడ్డలు వా. బ. లోష్టములు.
గెనయు. అ. క్రి. పుట్టియగు.
గెనను. మధ్యాలువుసి.
గెనుసుదుంప. గెనసు, చిలగడదుంప.
గెబ్బు. స. క్రి. అపహరించు; గ్రహించు; గర్వము.
గెఱ. రేఖ. [యొక్కయు గుత్తి.
గెల. గొల, పండ్లయొక్కయు కాయల
గెలిపించు. స. క్రి. జయింపఁజేయు.
గెలివి. సంతోషము.
గెలివికాఁడు. రవణుఁడు.
గెలివిడి. సంతోషము; యుద్ధజయము.

గెలుచు. అ. క్రి. పోవు; పోఁజేయు. స. క్రి. జయించు. ప్రే. పుచ్చు.
గెలుపము జయము.
గెలుపు. జయించుట; జయము.
గెలుపుకాఁడు. విణ. జయశీలుఁడు.
గెలుపుకొను. స. క్రి. జయించు.
గెలుపుపేరుగలాఁడు. విజయుఁడు, పార్థుఁడు.
గెలుపుబాసయొడయఁడు. పార్థుఁడు.
గెలువము. జయము.
గెలువుమను. స. క్రి. పంపు.
గెల్పు. గెలువము, జయము.
గెల్పుకొను. స. క్రి. గెలుచు.
గెల్లి. ఉప్పురాశి.
గెల్లు. కలకలధ్వని.
గెల్వాడి. ఓరుపు.

## గే

గేందుకము. సం. చెండు, బాలుర ఆడుకొనెడుబంతి (గుడ్డతోలు చెండు).
గేడించు. కదకొత్తు.
గేడెకాళ్లవాఁడు. విణ. దొంగకాళ్లవాఁడు.
గేదఁగి. కేతకి, పచ్చపూమొగలి, బంగారువన్నె మొగిలి†.
గేదె. పడ్డ; బఱ్ఱె, మహిషి.
గేదెచెలప. మూఁడేండ్ల ఎనుపదూడ.
గేదెదూడ. ఏఁడాదిలోపల గేదెదూడ.
గేదెపడ్డ. నాలుగేండ్ల గేదపడ్డ.
గేదెపెయ్య. రెండేండ్ల గేదెదూడ.
గేమ్సు. ఇం. ఋ. ఆటలు. [నది, పాడునది
గేయము. సం. పాట. విణ. పాడఁదగి
గేరంజము. సం. కేరజము.
గేలి. పరిహాసము, అపహాస్యము.
గేలికొట్టు. స. క్రి. పరిహసించు.
గేస్తు. ఇంటికాఁపు, గృహస్థు.
గేస్తుఁడు. గృహస్థుఁడు.
గేస్తురాలు. ఇల్లాలు; గృహస్థురాలు.
గేహము. సం. ఇల్లు, గృహము.
గేహళి. సం. దేహళి.?
గేహి. సం. గృహస్థుఁడు.
గేహిని. సం. ఇల్లాలు.
గేహేనర్ది. సం. ఇంటిలోనుండి ప్రగల్భములు పలుకువాఁడు.

## గై

గైరికము. సం. జేగుఱు, పర్వత ధాతు విశేషము; బంగారు.
గైరేయకము. సం. కారుపోఁక†.
గైరేయము. సం. సిలాజిత్తు.
గైసేత. వా. అలంకరించుట.

## గొ

గొ. అవ్య. చూపుటయందు వచ్చును.
గొంగ. సహజశత్రువు, గర్భశత్రువు.
గొంగడి. కంబళి, ఉన్నితో నేసినదుప్పటి
గొంగడికాఁడు. పక్షివిశేషము.
గొంగళి. కంబళి.
గొంగళిపురుగు. కంబళిపురుగు.
గొంజె గొడ్రాలు.
గొంటరి. విణ. కుత్సితుఁడు; కఠినుఁడు.
గొంటి. విణ. దుష్టురాలు.
గొంటు. విణ. దుష్టుఁడు; బందనలేనివక్ష కుత్సితుఁడు; కుత్సితురాలు; కుత్సితము.
గొంటుకాఁడు. విణ. కఠినుఁడు.
గొంటుతనము. గడుసుతనము.
గొంటుపోఁక. క్రముకభేదము, గొట్టువక్క
గొంట్రు. గొండ్రు. [నృత్యము.
గొండిలి. మండలాకార నృత్యము; నర్తకి;
గొండీలు. బ. నతి. [రూ. గొండిలి.
గొండ్లి. ఉత్సవము; గానము; కేళి, క్రీడ.
గొండెము. గొండ్లెము.
గొండ్లెము. తలుపుచిలుకు. [స్త్రీ.
గొంతి. కుంతీదేవి, పాండురాజు భార్య;
గొంతు. కంఠము; కంఠధ్వని.
గొంతుకూర్చొనుట. కుక్కుటాసనము.
గొంతుక. కంఠము.
గొంతుకపోఁక. కంఠము ముందటిప్రక్క పోఁకపలె నుండెడి యెముక.
గొంతుకోలు. కంఠనాశము.
గొంతుక్రోవి. గొంతుకోలు.
గొంతుపోఁక. కంఠము ముందటిపోఁక.
గొంతుమాఱు. మల్లబంధవిశేషము.
గొంతుముడి. గొంతుపోఁక. [గోరుట.
గొంతెమకోరిక. కోరఁదగని కోరికలను

గొంతెమగోరు. ప్రసారణి†.
గొంది. మూల; సంది; పరత్వముయొక్క అత్యల్పకోణము.
గొంల్లి. క్రీడ. [అరమ్యమా క్తికము.
గొగ్గి విణ. ఎచ్చుతక్కువైనది; కరస్త్రము;
గొగ్గిట. బర్బరత్వము.
గొగ్గిపండ్లవాఁడు. బర్బరదంతుఁడు.
గొజ్జెఁగ. కుబ్జకము, ఒకపూఁజెట్టు. బ. గొజ్జంగిపూలు.
గొజ్జెంగి. కుబ్జకము†.
గొజ్జెంగినీరు. హిమాంబువు, పన్నీరు.
గొజ్జెంగిపువ్వు. పన్నీరు పువ్వు.
గొజ్జెఁగ. గొజ్జంగి†.
గొజ్జెఁగిబ్రాలు. ధాన్యవిశేషము.
గొజ్జే. ఇగిరిన పులుసు కూరము.
గొటగొట. గోండ్రించుట మొదలగువాని యందగు ధ్వన్యనుకరణము.
గొట్టపుతాళము. తలుపు గొళ్లెము తగిలించి వేసెడి ఒక తాళము.
గొట్టము. క్రోవి; వెదురుగొట్టము.
గొట్టి. ఒగదినుసు గడ్డ, కశేరుకము.
గొట్టికాండ్రు. బ. కోటిగాండ్రు.
గొట్టు. దార్ఢ్యము; విరోధ. విణ. కఠినము; దుర్లభము; దుష్టము.
గొట్టె. ఘోటజటి†.
గొట్లియ. బదరి†.
గొట్లె. రేఁగుచెట్టు.
గొడఁగు. స. క్రి. గొణఁగు.
గొడగ. ఏఁడికోల లేని నాఁగలి.
గొడగర. చెప్పులుకుట్టి జీవించెడు (చర్మకార) జాతి. [స్త్రీ కులాల జాతుఁడు.
గొడగరవాఁడు. చర్మకారుఁడు; క్షౌరక
గొడగరి. మాదిగవాఁడు, చర్మకారుఁడు.
గొడవ. ఆపద; తప్పు; దుఃఖము; అడ్డి; కలఁత, క్షోభము; కులకలహము; కలహము.
గొడారి } గొడగరి, చర్మకారుఁడు
గొడారివాఁడు }
గొడిగ. గులకతాయి.
గొడియ. అందలముయొక్క ఒక అవయవము
గొడివె. కష్టము; ఆపద; ఉపద్రవము.
గొడుగు. ఎండచాటుపుట్టువు, ఆతపత్రము, ఛత్రము.
గొడుగుగడ్డి. గుడ్డి కామంచి, అతిచ్ఛత్రము†
గొడుగుపావలు. బ. పాదుకలు.
గొడుగుజల్ల. తలుపుమీఁది కుబుసము తిరిగెడు పట్టె; ద్వారముమీఁది చెక్క.
గొడుగుమెట్టెలు. బ. వాటము పెట్టి ఓరలు సన్నముగా దీర్చిన వెడలుపు మెట్టెలు.
గొడువు. గొడుగు.
గొడె. రూ. గొడియ. [సైనవాఁడు.
గొడ్డ. బిఱుసు; బిఱుసుమాట. విణ. బిఱు
గొడ్డంటిచిప్ప. గొడ్డలియొక్క చిప్ప.
గొడ్డగము. విణ. బాధించునది.
గొడ్డతనము. మూఢత్వము. [నము.
గొడ్డలి. కుఠారము, చెట్లు నఱకెడు సాధ
గొడ్డలు. బ. బిఱుసుమాట.
గొడ్డావు. వంధ్యగోవు.
గొడ్డు. పశువు; వంధ్యత్వము; వంధ్యాత్వము, గొడ్రాలితనము; ఈనని పశువు; గొడ్రాలు. విణ శూన్యము.
గొడ్డుఁగొఁకర. కర్కటకి†.
గొడ్డుఁబోతు. విణ. వంధ్యపురుషుఁడు, నిష్ప్రయోజకుఁడు.
గొడ్డుచెట్టు. కాయని వృక్షము.
గొడ్డురాలు. బిడ్డలు కనని స్త్రీ.
గొడ్డువోవు. అ. క్రి. వ్యర్థమగు.
గొడ్డెఱు. స. క్రి. గుత్తయెత్తు.
గొడ్రాలు. గొడ్డురాలు, వంధ్యాస్త్రీ.
గొడ్లు. బ. పశువులు.
గొణఁగు. అ. క్రి. మాట వెడలనీక నోటను గొణగొణయను.
గొణగ. రూ. గొడగ. [కరణము.
గొణగొణ. గొణఁగుటయందగు ధ్వన్యను
గొణగొణలాడు. అ. క్రి. గొణగొణయను.
గొణిగలు. బ. నతి.
గొణిపె } తలుపు గ్రందగిలించెడి
గొణిద } యినుపచీల.
గొణ్ణెము. గొండెము; తలుపుబైట బంధించునది.
గొతుపు నీలమణి విశేషము.
గొత్తడి. సాధ్వి. [కంపు; గుచ్ఛము.
గొత్తు. వెన్న మొదలగునవి పాచి పోయిన

గొద. ఆఁకలి; కోపము. [పడు; విజృంభించు.
గొదకొను. అ. క్రి. అతిశయించు; త్వర
గొదగొద. వైరము.
గొనకొని. అవ్య. ఒప్పుగా. [గొనకొలుపు.
గొనకొను. అ. క్రి. యత్నించు. ప్రే.
గొనను. వామనుఁడు.
గొనప. అఱిగిన నాఁగేలు. విణ. పొట్టి.
గొనపు. విలాసము.
గొనబ. వామనుఁడు. [మనోజ్ఞము.
గొనబు. విలాసము; మనోజ్ఞత. విణ.
గొనబుకాఁడు. విణ. సుందరుఁడు.
గొనబుపాట. సంచుపాట.
గొనమ. రూ. గొనప.
గొనము. గుణము, శౌర్యాదిగుణము; మంజులము; వింటినారి; మడుఁగు.
గొనయము. వింటినారి; వింటికొప్పు
గొనిసె వామనుఁడు.
గొనుగు. గుడఫలము†.
గొప్ప. లావు, స్థౌల్యము. విణ. అధికము, ఘనము, పెద్ద; పృథువు.
గొప్పగుడారము. మహాపటగృహము.
గొప్పది. విణ. ఘనమైనది; స్థూలమైనది.
గొప్పబొజ్జగలాఁడు. లంబోదరుఁడు, వినాయకుఁడు.
గొప్పమెయిప్రోడ. వినాయకుఁడు.
గొప్పబొజ్జమెకము } మహామృగము,
గొప్పయజ్జమెకము } ఏనుఁగు.
గొప్పయెద్దు. మహోక్షము.
గొప్పవాఁడు. ఘనమైనవాఁడు.
గొప్పలు. బ. వరిమడి మెండలగువాని యందు కొంచెము పాడవుగానుండు చోట్లు; గోపానసి.
గొబ. గుహ; గొంది.
గొబడి. పక్షివిశేషము.
గొబ్బండు. పెద్ద పండు.
గొబ్బరము. ఎరువు.
గొబ్బి. ధనుర్మాసదినముల సాయంకాల సమయములందు గడపలముందు బాలికలు పాటలుపాడి చేతులుతట్టుచుఁ జుట్టి వచ్చి జరపించెడు నొక వేడుక; సమర్తాడి నప్పుడు బాలికలు పాటలుపాడి చేతులు తట్టుచుఁ జుట్టివచ్చి జరపించెడి ఒక వేడుక; కోకిలాక్షము, ఇక్షురకము†.
గొబ్బికాయలు. ధాన్యవిశేషము.
గొబ్బిళ్లు. బ. బాలక్రీడావిశేషము; బాలికాక్రీడావిశేషము; నమస్కారము; అల్లోనేరెళ్ళు. [సహాసార్థకము.
గొబ్బున. ద్ర. క్రి. విణ. వేగముగా. అవ్య.
గొయ్యి. పల్లము, గర్తము.
గొరక. ఇనుపబాణము; మృగవిశేషము; అల్పకుంతము; గొరగ.
గొరకకట్టె అలుఁగుగల చేతికఱ్ఱ; గొంక.
గొరంకి. శారిక.
గొరగ. మైలారును గొలిచెడి ఒకానొక మతస్థుఁడు; శైవభిక్షుకుఁడు.
గొరగొర. వేగము.
గొరవంక గోరంకి, శారిక.
గొరవంకతెగదబి. మన్మథుఁడు.
గొరవక. గోరంకి.
గొరిజియ }
గొరిజె } అశ్వాది పశుజాతి ఖురము,
గొరిడే } పశువుల కాలి గిట్ట.
గొరిసె }
గొరిసెగాలి. పశువుల గొరిసెల నడుమ పుండై పురుగులు పడెడి ఒక వ్యాధి.
గొరువంక. రూ. గోరువంక.
గొఱకకట్టె. అలుఁగుగల చేతికఱ్ఱ.
గొఱకు. విణ. నీచుఁడు.
గొఱగొఱ. గొణగొణ.
గొఱపము. గుఱ్ఱమును ద్రోమెడుసాధనము
గొఱబోతు. గవయమృగము.
గొఱిడే. గుడారము.
గొఱియ గొర్రె.
గొఱియలసూడు. అడవికుక్క.
గొఱుగు స. క్రి. క్షౌరముచేయు.
గొఱుగుట. కోఁగుట.
గొఱె. రూ. గొర్రె.
గొత్తికఱ్ఱలు. గొత్తిపట్టెలకు వేయుకఱ్ఱలు
గొత్తినేల. గొఱ్ఱు, ముప్పదిరెండు కుంటల వొలము. [లించునది.
గొత్తినొగలు. బ. అడ్డముకేసి కాఁడికిఁ దగి

గొత్తిపట్టెలు. గొత్తిఅడ్డను వేసి తగిలించెడు పట్టెలు. [నాగవాసములు.
గొత్తిమొలలు. బ. గొత్తికట్టులను వేసెడి
గొత్తియడ్డ గొత్తికి పండ్లుతగిలించెడియడ్డ.
గొత్తియడ్డపట్టె. నాగలు పైనవేసి గొత్తిపండ్ల మొలలకుఁ గట్టునది.
గొఱ్ఱియ. గొఱ్ఱె.
గొఱ్ఱు. ముప్పదిరెండు కుంటల కొలఁది; దున్నిన పొలముమీఁద దున్నెడు యంత్రము.
గొఱ్ఱె. మేషము; మేషి.
గొఱ్ఱెనుచ్చు. గొఱ్ఱెపెండ్రుకలు.
గొల. పండ్ల, కాయల గెల.
గొలక. కలకలధ్వని. బ. తాటిచన్నులు
గొలకు. సేనాదుల కలకలధ్వని [శబ్దము.
గొలగొల. కలకలధ్వని; ధ్వన్యనుకరణము;
గొలిమిడి. కోకిలాక్షము, ఇక్షురకము†.
గొలివె. తృణవిశేషము. బ. తృణధాన్య విశేషము.
గొలుగు. గొనుగు, పేలుపు†.
గొలుసు చేత ధరించెడి యొక సొమ్ము; ఏనుఁగుకాలుగట్టెడు నిగళము; సంకెల; తీగెలతో అల్లినది; పురుషులు కంఠమందు ధరించునట్టి బంగారపు గొలుసు.
గొలుసుకట్టు } విడివిడిగా లేక గొలుసు
గొలుసుమోడి } వలె నొకటితో నొకటి పెనఁగొన్న వ్రాలు.
గొల్మిడి. గొలిమిడి.
గొల్ల. ద్వారపాలకుఁడు; ధనపాలుఁడు, పశువులను మేపియు పాలు పెరుఁగు అమ్మియు జీవించెడు (గోపాలక) జాతి.
గొల్లఁడు. గొల్లవాఁడు, గోపాలకుఁడు.
గొల్లకి(కీ)లారి. గొల్లఁడు.
గొల్లజిడ్డు. కూలిని†.
గొల్లత(ది). గోపిక, గోపాలస్త్రీ.
గొల్లదొండు. మత్స్యవిశేషము.
గొల్లపల్లె. ఘోషము.
గొల్లమాట. గ్రామ్యోక్తి.
గొల్లవాఁడు. గోపాలకుఁడు, ఆవులు గేదెలు కాయువాఁడు; వైశ్యస్త్రీ శూద్రజాతుఁడు; పాలుపెరుగు అమ్మెడి నాలుగు వర్ణములను మోసెడి వృత్తి గలవాఁడు.
గొల్లము. లోఁతుగల పల్లము.
గొల్లియన గొల్లెన. గుడారము.
గొల్లు. కలకలధ్వని, కోలాహలము.
గొల్లెత. గొల్లత.
గొల్లెన. చిన్నడేరా, గుడారము.
గొల్లెనబండి. గాడీ.
గొవరు. తాపము.
గొవరువోవు. అ. క్రి. తపించు.
గొహారు. ఉపద్రవము.
గొష్ఠి. గానము; క్రీడ. [చునది.
గొళ్లెము. గొండెము, తలుపుబైట బంధించునది.

## గో

గో. అవ్య. చూపుటయందు వచ్చును.
గోండుఁడు. సం. పామరజాతివాఁడు. విణ. ఉఱుకుడుబొడ్డువాఁడు. [కూయు.
గోండ్రించు. అ. క్రి. పులికూయు; ఎలుఁగు
గోండ్రిలు(ల్లు). అ. క్రి. పులికూయు.
గోండ్రు. అంగలార్చుటయందగు ధ్వన్యనుకరణము.
గోండ్రుకప్ప. పెద్దకప్ప.
గోందు. హిం. తుమ్మజిగురు.
గోఁకు. స. క్రి. గీఁచు, గీఱు, గోళ్లనుగోఁకు.
గోఁకుడు. పాలుకాఁచినప్పుడడుగు నంటి కొనిన దాని సత్త్వము.
గోఁకుడుపాలు. దోఁకుడుపాలు.
గోఁగడి. పక్షివిశేషము.
గోఁగు. కర్ణికారము†. రూ. గోను.
గోఁగుట. కోగట, ముండనము.
గోఁగునారపట్టా. గోగునారచేత చేసినగోనె
గోఁగువిత్తులు. బ. కర్ణికారబీజములు.
గోఁచి. కౌపీనము.
గోఁచికట్టు బ్రహ్మచారి.
గోఁచికాఁడు. బ్రహ్మచారి. విణ. నిర్ధనుఁడు
గోఁచిబాఁపఁడు. బ్రహ్మచారి.
గోఁజాట. గోజాడుట.
గోఁజాడు. స. క్రి. పీడించి యడుగు.
గోఁజె. గోఁజాట; గోఁజు. స. క్రి. గోఁజాడు
గోఁటు. కోకయంచున చేర్చికుట్టెడుసన్నని

సతిగపట్టె; రవికలమీఁద చేయునది; ఒయ్యారము; రేఖ; సువర్ణకటకభేదము. బ. గోఁట్లు.
గోఁటుగత్తె. విణ. ఒయ్యారము గలది.
గోఁటుకాఁడు. విణ ఒయ్యారము గల వాఁడు.
గోఁదు. బంధన, గోందు.
గోఁదురు. పెద్దకప్ప. రూ. గోఁదురుకప్ప
గోకంటకము. సం. పల్లేరు†; ఏనుఁగు పల్లేరు†; గోవులకోరిసె.
గోకర్ణము. సం. కడితిమృగము; జాత్తె; కంచరగాడిద; పాము.
గోకర్ణి సం. చాఁగ†.
గోకర్ణుఁడు. సం. ప్రమథగణవిశేషము.
గోకిలము. సం. రోఁకలి; నాఁగలి.
గోకులము. సం. ఆవులమంద.
గోకులికము. సం, అడుసునఁబడిన యెద్దు.
గోక్షురకము. సం. పల్లేరు†; ఏనుఁగుపల్లేరు.
గోగంధనము సం. ఎదురుగాలి.
గోగ్రంథి. సం. పసుల కొట్టము; ఏటు పిడక; బెండ†.
గోచరము. సం. ఇంద్రియముల కగపడునది; ఇంద్రియార్థము, విషయము.
గోచరించు. సం. అ. క్రి. అగపడు. ప్రే అగపఱచు.
గోచారము. సం. సూర్యాదిగ్రహముల యొక్క మేషాదిరాసులలో సంచారము.
గోజిహ్వ. సం. ఎద్దు నాలుకచెట్టు, బెండ.
గోటదొర్లుడుకాయ. బాలక్రీడావిశేషము.
గోటరింపు. వ్యాఘ్రధ్వని.
గోటాపన. పక్షియాఁక; విజృంభణము.
గోటినాటులు } బ. నఖక్షతములు.
గోటినొక్కులు
గోటిమొన. నఖాగ్రము.
గోడ. కుడ్యము.
గోడకాలు. కరగోడ.
గోడగము. బాధాకరము, దుఃఖకరము.
గోడగించు. అ. క్రి మాటాడు; శబ్దించు. స. క్రి. తిరస్కరించు.
గోడచెర్పు. విణ. జడుఁడు.
గోడదొల్కులప్రోడ. ఎలుక.
గోడపురుగు. నల్లి, మత్కుణము.
గోడము. గుడెము.
గోడవాడము. యుద్ధము.
గోడా. గుఱ్ఱము, ఘోటకము.
గోడాడు అ. క్రి. దుఃఖించు.
గోడి. అణఁగుడు; వంపు.
గోడిగ(గె). ఆఁడుగుఱ్ఱము, ఘోటిక.
గోడిపట్టెలు. బాలక్రీడావిశేషము.
గోడిపెట్టు నెత్తిమీఁద కొట్టు దెబ్బ.
గోడిపడు. అ. క్రి. అణఁగు; వంపగు.
గోడివెట్టు. స. క్రి. వంచు.
గోడు. దుఃఖము; రోదనము. [కరణము.
గోడుగోడు. ఏడ్చుటయందగు ధ్వన్యను
గోడెము. కొండదాన నాశ్రయించి యుండెడు బోయపల్లె.
గోణము. గోవణము, కౌపీనము.
గోణముదారి. సన్న్యాసి.
గోణాము. కౌపీనము.
గోణి ఎద్దు. సం. గోనె.
గోతము. జనపనార సంచి; మల్లులు సాధనకొఱకు జాళ్ళు నించి యుంచుకొనెడు గోనె.
గోతముఁడు సం. ఒక ముని. [గోనెసంచి.
గోతాము. గోతము; డబ్బులు పోసికొనెడి
గోతి. ఆఁడుది. [బుడమ†.
గోతుంబ. సం. పిన్నపాఁపర†; పుచ్చ†;
గోత్ర. సం. నేల, భూమి; గోవుల గుంపు.
గోత్రభిత్తు } సం. ఇంద్రుఁడు.
గోత్రభిదుఁడు
గోత్రము. సం. వంశము; పేరు; గొడుగు; అడవి; బలిమి; వరిమడి; కొండ. [వాఁడు
గోత్రుఁడు. సం. విణ. గోవులఁగాచు
గోద. ఎద్దు. సం. ఆండాళమ్మ, గోదాదేవి.
గోదము. సం. మస్తిష్కము, మెదడు.
గోదరి. చర్మకారుఁడు.
గోదారణము. సం. హలము.
గోదారి. వెన్న కాఁచిన మడ్డి.
గోదావరి. సం. ఒకనది.
గోదు. హిం. తుమ్మ జిగురు.
గోదుమ. గోధూమము, సస్యవిశేషము. బ. ధాన్యవిశేషము. [విశేషము.
గోదుమపూసలు. బ. స్త్రీ కంఠ భూషా

గోధ. సం. ఉడుము; అల్లెత్రాటిదెబ్బ తాఁకకుండుటకై యుడుముతోలుతోఁ గుట్టి చేతికిఁ దొడిగికొన్న కవచము.
గోధనము. సం. ఆవుల మంద.
గోధాపది. సం. చెప్పుతట్ట†.
గోధి. సం. నొసలు, నుదురు.
గోధిక. సం. ఉడుము; నీరుడుము.
గోధుహుఁడు. సం. గొల్లవాఁడు.
గోధూమఘరట్టుఁడు బిరుదవాచకము (తిరుగలిలో గోదుమలు విసిరినట్లు శత్రువులను నురుమాడువాఁడు).
గోధూమము. సం. గోదుమ†; నారదము†
గోధూమములు. సం. బ. యవలు.
గోనర్దము. సం. కయివడిము స్త్రై†; బెగ్గురుపక్షి.
గోన(నా)సము. సం. కొండచిలువ.
గోనియ. గోనె.
గోను. గోఁగుచెట్టు.
గోనె. అడ్డముగా నడుమఁగుట్టుపోసి ధాన్యము నించి యెద్దుమీఁద వేసెడు జనుపనారపట్టలసంచి; ఎద్దుమీఁదికి పట్టాలు కూర్చి కుట్టినది; ముత్తుము ధాన్యాదులు పట్టునది.
గోనెయెద్దు. ధాన్యపుగోనెలు మోసెడియెద్దు
గోనెసంచి. గోతము, పట్టాలుకుట్టిచేసినది.
గోనెపటము. పురితో నేసిన పట్టాలు కుట్టి పరుచుకొనునది.
గోనెపరదా. అడ్డము కట్టెడి గోనె.
గోపతి. సం. ఆఁబోతు; స్వర్గాధిపతి, ఇంద్రుఁడు; రాజు; శివుఁడు; సూర్యుఁడు.
గోపనము. సం. దాఁచుట; కాపాడుట.
గోపము. సం. బోళము.
గోపానసి. సం. చూరుపట్టె, చూరుకమ్మి.
గోపాయితము. సం. విణ. కాపఁబడినది.
గోపాలుఁడు. సం. గొల్లవాఁడు; విష్ణువు; రాజు.
గోపి. సం. గొల్లది, మామెన†.
గోపిక. సం. గొల్లది.
గోపీచందనము. సం. ఒకదినుసునుద్దమన్ను.
గోపీతము. సం. ప్రభాతము, వేకువ.
గోపీథము. సం. సోమపానము; తీర్థము; కాపాడుట; నీటిదొన; ప్రభాతకాలము; నూతివద్దగాడి.
గోపు. దుష్టుఁడు.
గోపుఁడు. సం. గొల్లవాఁడు; రాజు; గోవులకధిపతి; అనేకగ్రామాధికారి. విణ. రక్షించువాఁడు; దాఁచువాఁడు.
గోపుచ్ఛము. సం. కోఁతి; ఆవుతోఁక.
గోపురము. సం. గవను, పట్టణద్వారము; వాకిలి; కైవడిము స్త్రై†.
గోప్యము. సం. విణ. దాఁచఁదగినది; కావఁదగినది.
గోప్యుఁడు. సం. ఊడిగపువాఁడు. విణ. కావఁదగినవాఁడు.
గోమంతుఁడు. సం. గోవులకొడయుఁడు.
గోమయచ్ఛత్రము. సం. కుక్కగొడుగు.
గోమయము. సం. పేఁడ; ఆవు పేఁడ.
గోమాయువు. సం. నక్క.
గోమారి. చిక్కపిడుఁజు, పశువులకుఁ బట్టెడి ఒక పురుగు.
గోమి. సం. గోవులకొడయుఁడు; నక్క. విణ. గోవులు గలవాఁడు.
గోమించు. స. క్రి. గోము చేయు.
గోమిని. సం. లక్ష్మి.
గోము శ్రమమెఱుఁగనితనము; మృదువు; గారవము.
గోముఖము. సం. అలుకుట, గోముఖాకారముగా ఇల్లు అలుకుట; మొసలి; వాద్యవిశేషము; సురంగవిశేషము.
గోమేదము. సం. గోమేదికము.
గోమేదికము. పసుపువన్నెగల రత్నము, నవరత్నములలో నొకటి.
గోమేదము. సం. ఒక యజ్ఞము.
గోయి. గర్తము.
గోర. గోరువంక; కదళీకేసరాగ్రవృంతాంశము.
గోరంక, గోరంకి, గోరఁకి } శారికాఖగము.
గోరంకువు. సం. గోరువంక; దిసమొలవాఁడు; బట్టువాఁడు.
గోరంట. కురంటవృక్షము.
గోరంత. స్వల్పపరిమాణము.
గోరఁట. కురంటకము†.
గోరక్షకుఁడు. సం. గోపాలకుఁడు.

గోరక్షము. సం. గోరక్షణము; రాజ(స్త్రీ) సంరక్షణము; భరతశాస్త్రోపజీవనము
గోరక్షుఁడు. సం. క్షత్రియపురుష వైశ్య (స్త్రీ) జాతుఁడు, మాహిష్యుఁడు.
గోరగింత. భయంకరత్వము.
గోరచనము. గోరోచన.
గోరజము. గోరచనము.
గోరడము. అపహాస్యము.
గోరతనము. దౌష్ట్యము.
గోరప. గట్టిమోఁతి.
గోరపడు. అ. క్రి. అసహ్యపడు.
గోరపన. అపవాదము.
గోరము. దేహముయొక్క అస్వాస్థ్యము; ఆపద; రోఁత. విణ. రోఁతగలది; భయంకరము, ఘోరము.
గోరవంక. గోరంకి.
గోరసము. సం. ఆవుపాలు; ఆవుపెరుఁగు; ఆవుమజ్జిగ (చల్ల).
గోరి. హిం. కట్టిన సమాధి.
గోరింక. గోరఁకి, శారిక.
గోరించు. అ. క్రి. ఎగయు. ఉత్పతనమగు.
గోరింపు. ఎగపు; గర్వము.
గోరిక. సం గోరఁకి
గోరీ. హిం. తురకల సమాధి.
గోరు. నఖము; తంతి మీటుటకు బంగారు మొదలగు వానితోఁజేసి వ్రేలికి వేసి కొనెడు ప్రతినఖము; అరఁటిపువ్వు లోపలనుండు వస్తువిశేషము. విణ. అల్పము. [సాధనములు.
గోరుగండ్లు. బ. గోళ్లు మొదలైనవి తీయు
గోరుగల్లు. నఖనికృంతనము, (మంగలి గోళ్లుతీసెడి) యినుప సలాక.
గోరుగాలము. చేఁపలనుబట్టుటకు ఉక్కు కమ్మితో వంకరగాఁ జేసిన గాలము, బడిశము.
గోరుగొండి. గోరుగల్లు రూ. గోర్గొండి.
గోరుచిక్కుఁడు. చిన్న దినుసుచిక్కుడు†.
గోరుచిరణము. గోటివలె కొనయందు వంపుగల ఉలి. [ఒకదినుసుగడ్డ.
గోరుచుట్టు. గోటిచుట్ట లేచెడు పుండు,
గోరుపథము. కంబళి.
గోరుపిల్లాడు } స. క్రి. పుట్టచెండాడు;
గోరుపులాడు } ఎగురవేయు.
గోరుముద్ద. గోటిమీఁదికితీసికొని పిల్లలకుఁ బెట్టు అన్నపుముద్ద.
గోరులు } బ. గోళ్లు.
గోర్లు }
గోరువంక. గోరంకి.
గోరువంకలు. బ. గోటినాటులు
గోరువెచ్చ. ఇనుమంత కాఁక, మందోష్ణము.
గోరొత్తు. నఖక్షతము.
గోరోచన. సం. గోరోజనము.
గోరోజనము. ఆవులకడుపులోనుండి యెత్తెడి ఒక వస్తువు.
గోర్దము. సం. (శిరస్సులోనుండెడి) మెదడు
గోర్పడము. ఏనుఁగుమీఁద పఱచెడి ఒక ఎఱ్ఱని కంబళి; కంబళి.
గోర్పిల్లాడు. గోరుపిల్లాడు.
గోర్మోపు. స. క్రి. గోరు మోపు.
గోర్వంక. గోరువంక. బ. గోటినాటులు.
గోర్వెచ్చ. గోరువెచ్చ.
గోఱజము. గోరోజనము; మృగవిశేషము.
గోఱడము. అపహాస్యము.
గోల. కోలాహలము; గొప్పదియైన ఆర్త ధ్వని; ఉపశాఖ; (స్త్రీ). విణ. ముగ్ధుఁడు; ముగ్ధ(స్త్రీ). సం. కాఁకి; గోదావరి; మణిశిల.
గోలకము. సం. కాఁకి; గోలీ.
గోలకొండ. ఒక పట్టణము. [పిట్ట.
గోలత్రిక. సం. ఆఁడుమఁదపిచ్చుక, ఉవ్వ
గోలాంగూలము సం. కొండముచ్చు; కోఁతి.
గోలించు. స. క్రి. చమురుపోసి వేఁచు.
గోలియము. పెద్దబాన.
గోలిహము. సం. మొక్కపుఁజెట్టు.
గోలీ. గోలకము, బాలురాడుకొను చిన్న జాతియుండ; తురకల సమాధి.
గోలు. వేము బొద్దునకు ప్రక్క నేర్పఱచెడు సన్నని వేము బొద్దు. [ణము.
గోలుగోలు ఏడ్చుటయందగు ధ్వన్యనుకర
గోలురించు. అ. క్రి. (పులి) కూయు.
గోలె. నుండి, ఆరంభకాల నిశ్చయార్థమందు వచ్చు నిపాతము.

గోలెము. కటాహము; కాఁగు; నీళ్లు పోసెడి మంటిపాత్ర.
గోలోమి. సం. తెల్లగఱిక†; మరులుజేడ†; వస†; చేల గొలిమిడి†.
గోల్గోలు. రూ. గోలుగోలు.
గోవ గవయమృగము; యౌవనము. విణ. మనోజ్ఞము, అందము.
గోవందిని. సం. ప్రేంకణము†.
గోవణము. కౌపీనము. రూ గోణము.
గోవమొలత్రాడు. మగవాని మొలనూలు.
గోవావు. సాధువుకాని యావు.
గోవాళ్లు. బ. పడుచువాఁడు; విటుఁడు.
గోవిందగంతులు. మి. గోవింద గోవింద యని గంతులు వేయుట.
గోవిందద్వాదశి. సం. పుష్యనక్షత్రముతోఁ గూడిన ఫాల్గున శుద్ధ ద్వాదశి.
గోవిందములు. అల్లోనేరెళ్లు
గోవిందుఁడు. సం. విష్ణువు, కృష్ణుఁడు; గోవులకొడయఁడు; బృహస్పతి.
గోవిందభగవత్పాదులు. సం. శ్రీ శంకర భగవత్పాదుల గురువు.
గోవిట్టు. సం. గోమయము.
గోవు. సం. ఆవు; కన్ను; దిక్కు; బాణము; భూమి; వాక్కు; నీళ్లు; ఎద్దు; కిరణము; స్వర్గము; చంద్రుఁడు; వజ్రాయుధము.
గోవృషము. సం. ఆఁబోతు.
గోశాల. సం. పశువుల కొట్టము. [నము.
గోశీర్షము. సం. పసుపువన్నెగల చంద
గోశ్రేణి. సం. తంగేడు†.
గోషా. హిం. అంతఃపురము.
గోషుపేషు పాగామీఁద సొగసుగా కట్టుకొనఁబడిన వస్త్రము.
గోష్ఠము. సం. పశువుల దొడ్డి, గోవుల మంద యుండు చోటు.
గోష్ఠశ్వుఁడు సం. విణ. తానుండెడుచోట నుండుకొని పరులను ద్వేషించువాఁడు.
గోష్ఠి సం. సభ; పరస్పరసల్లాపము.
గోష్పదము. సం. గోవుపాదము; గోవు యొక్క అడుగుకొలఁది; గోవు గొరిసె యిడిన గుంట; గోవులు తిరిగెడిచోటు.
గోసంఖ్యుఁడు. సం. గొల్లవాఁడు.

గోసంగి. మాలవాఁడు. [భేదము.
గోసంగివాండ్లు. బ. మాదిగవాండ్లలో
గోసఁగి మాలవాఁడు.
గోసడుచు. స. క్రి. నిందించు.
గోసన. చాటించుట, ఘోషణ.
గోసము. సం. బోళము, వేకువ.
గోసర్గము. సం. ప్రభాతము; వేకువ.
గోసాయి. గోస్వామి, చైతన్యమత మవలంబించిన సన్న్యాసి.
గోసు. అపదూఱు; దూఱు; దోషము.
గోసున. చాటించుట.
గోస్తనము. సరి. నలువది పూసల సరము.
గోస్తని. సం. ద్రాక్ష†.
గోస్వామి. సం. గోవుల కొడయుఁడు; (నాట్య పరిభాషయందు) ఇతర రాజు యొక్క కొడుకు; గోసాయి. [వాఁడు.
గోహత్యగాఁడు మి. విణ. గోహత్య చేసిన
గోహరి. సం. పరాక్రమము.
గోళకుఁడు. సం. విధవకు ఱంకుమగని యందు పుట్టిన కొడుకు.
గోళము. సం. మండలము; ఉండ; బొక్కె.
గోళి. కూరాకు దినుసు.
గోళులు. బ. నఖములు. [షము.
గోళ్ళకుతికంటు. స్త్రీ కంఠభూషా విశే
గోళ్ళగొండి. తృణవిశేషము. బ. తృణధాన్య విశేషము.
గోళ్ళు. బ. నఖములు.

## గౌ

గౌండ్లవాఁడు. రూ. గవుండ్లవాఁడు.
గౌఁడు. సారా యమ్మువాఁడు; కాఁపు వారి పట్టపుపేరు. [కర్త.
గౌడపాదులు. సం. మాండూక్యకారికా
గౌడము. సం. ఒక దేశము.
గౌడలి. వృద్ధాంగన.
గౌడసరము. స్త్రీ భూషావిశేషము.
గౌడి. సం. పద్యములయొక్క యొక రీతి.
గౌడిగేదె. ఒకజాతి గేదె.
గౌణము. సం. విణ. అముఖ్యము.
గౌతమి. సా. గోదావరి, నదీవిశేషము.
గౌతముఁడు. సం. ఒక ముని; జినుఁడు.

గౌద. చెంప, గవుద.
గౌధారము } సం. ఉడుముయొక్క పిల్ల.
గౌధేయము } రూ. గౌధేరము.
గౌపుచ్ఛికము. సం. సంగడి; ఏఱుదాఁటు నది. విణ. గోపుచ్ఛముచేత కొనఁబడినది; గోపుచ్ఛముచేత దాఁటించునది.
గౌర. బేహారి, వర్తకుఁడు.
గౌరము. సం. ఆకరువు; తెల్లావలు; తెలుపు; పచ్చన; పాటలవర్ణము. విణ ఎఱ్ఱనిది; తెల్లనిది; పసుపుపచ్చనిది; స్వచ్ఛమయినది. [వినయము.
గౌరవము. సం. గొప్పతనము; గురుత్వము;
గౌరవించు. సం. స. క్రి. గొప్పపఱుచు.
గౌరి. సం. పార్వతి; సమర్తాదని కన్యక; పదియేండ్ల కన్యక.
గౌరికుంకుమలు బ ధాన్యవిశేషము.
గౌరిగనయము. మి. వస్త్రవిశేషము.
గౌరీకుంకుమలు. సం.బ. వడ్లలోభేదము.
గౌరీపాషాణము. సం. పాషాణములలో భేదము. [కాళియ; గృహగోధిక.
గౌరు. పార్వతి; కపటము; ఏనుఁగు;
గౌరుఁడు. సం. చంద్రుఁడు.
గౌర్నరు. ఇం. గవర్నరు.
గౌలు. దుర్గంధము; గంధము
గౌలేయకము. సం. కారుపోఁక†.
గౌష్ఠీనము. సం. అంతకుముందు గోవుల మంద యున్నచోటు.
గౌసెన. వీణె మొదలగువానిమీఁదియొఱ.
గౌళదేశము.సం. 56 దేశములలోనొకటి.
గౌళి. శకునములు చెప్పెడు బల్లి.

## గ్ర

గ్రంత. కందరము. [లయము.
గ్రంథకుటి. సం వ్రాసెడి గది; గ్రంథా
గ్రంథనము. సం. రచన.
గ్రంథము. సం. శాస్త్రము; కావ్యము; ముప్పదిరెండక్షరముల శ్లోకము;ధనము.
గ్రంథి. సం. కంతి; కణుపు; ముడి; గండి వనము†.
గ్రంథిక. సం. కట్లతీఁగ.
గ్రంథికము. సం. పిప్పలి వేరు; గండి వనము†; గుగ్గిలపుఁజెట్టు; వెణుతురు†.
గ్రందికుఁడు. సం. జోస్యుఁడు; యుధిష్ఠిరుని కడగొట్టు తమ్ముఁడు.
గ్రంథితము. సం. విణ. కూర్పఁబడినది.
గ్రంథిపర్ణము. సం. గండివనము†; పచ్చాకు†; మాచిపత్రి†.
గ్రంథిపొత్తు. సం. లొట్టిపిట్ట.
గ్రంథిలము. సం. ములువెలఁగ†; వెణుతురు†. విణ గనుపులు గలది.
గ్రందె. దారబంధము మొదలగువానిని విలువలయందు బిగఁగొట్టిన చీలలకు తగిలించెడి తలుపులయందలి యినుప పట్టె.
గ్రక్కతిల్లు. అ. క్రి. బెదరు.
గ్రక్కదలు. అ. క్రి. మిక్కిలి కదలు.
గ్రక్క(కు్క)న. ద్ర.క్రి. విణ. శీఘ్రముగ.
గ్రగ్గులకాఁడు. పలాయితుఁడు; భయక్రాంతుఁడు.
గ్రచ్చ. కాలపత్రి†.
గ్రచ్చకాయలు. బాలక్రీడావిశేషము.
గ్రచ్చు. విణ. గ్రస్తము,వర్ణలోపముగాని పదలోపముగాని కలిగినది (మాట).
గ్రథనము. సం. కూర్పు,గద్యపద్యాదులు కూర్చుట; పుష్పాదులు గ్రుచ్చుట.
గ్రథితము. సం. విణ. కూర్పఁబడినది; గ్రువ్వఁబడినది.
గ్రద్ద. గృధ్రము, గద్ద.
గ్రద్దగోరు. చోరసాధనవిశేషము.
గ్రద్దన. ద్ర. క్రి. విణ. శీఘ్రముగా.
గ్రద్దముక్కువాఁడు. గద్దముక్కువాఁడు.
గ్రమ్మన. ద్ర. క్రి. విణ. శీఘ్రముగా.
గ్రసించు } సం. స. క్రి. కప్పు; తిను;
గ్రసియించు } మింగు; లోఁగొను.
గ్రసిష్ణువు. సం. విణ. తినువాఁడు; మ్రింగువాఁడు. [మ్రింగబడినది; గ్రచ్చు.
గ్రస్తము. సం. విణ. తినఁబడినది;
గ్రస్తు. ఇంటికాఁపు, గృహస్థు.
గ్రహచారము. సం. గ్రహములయొక్క తిరుగుదల; ఒకానొకయవస్థ.
గ్రహణము. సం. రాహువు సూర్యచంద్రులను బట్టుట; పుచ్చుకొనుట, గ్రహిం

చుట; ఆదరించుట; చెఱనిడిన ప్రాణి; చేయి; బుద్ధి, జ్ఞానము.
గ్రహణి. సం. అతిసారరోగము.
గ్రహపతి. సం. సూర్యుఁడు.
గ్రహము. సం. సూర్యాది; గ్రహించుట; అనుగ్రహము; చెఱ; రాహువు సూర్య చంద్రులను బట్టుట; పిశాచము, పూత నాది; ఊర్ధ్వాకారమైన యజ్ఞపాత్ర విశేషము; యుద్ధప్రయత్నము; రాహువు.
గ్రహయాళువు. సం. విణ. గ్రహించు [వాఁడు.
గ్రహరాజు. సం. సూర్యుఁడు; చంద్రుఁడు; బృహస్పతి.
గ్రహించు. సం. స. క్రి. పుచ్చుకొను; తెలిసికొను; రూ. గ్రహియించు.
గ్రహిళుఁడు. సం. విణ. గ్రహించువాఁడు.
గ్రహీత. సం. విణ. గ్రహించువాఁడు.
గ్రహీనుఁడు. సం. విణ. గాలి సోఁకిన వాఁడు.

## గ్రా

గ్రాంధికము. సం. విణ. గ్రంథమునది.
గ్రాంజె. ఒకానొక చెట్టు.
గ్రాప. కదుము.
గ్రామటిక. సం. పల్లె, కుగ్రామము.
గ్రామణి. సం. మంగలి. విణ అధికారి, గ్రామాధిపతి; ముఖ్యుఁడు.
గ్రామత. సం. గ్రామముల సమూహము.
గ్రామతక్షుఁడు. సం. గ్రామమున కధీనుఁడైన వడ్లంగి.
గ్రామదేవత. ఊరిని రక్షించు శక్తి.
గ్రామధానము. సం. పాలెము.
గ్రామము. ఊరు; పల్లెటూరు; షడ్జాది స్వరము; సమూహము.
గ్రామసింహము. సం కుక్క.
గ్రామసూకరము. సం. ఊరఁబంది.
గ్రామాంతము. సం. మాలపల్లె.
గ్రామీణ. సం. నీలిచెట్టు; వేశ్య. విణ. ఊరిది. [తము.
గ్రామ్యధర్మము. సం. సంగమము; సుర
గ్రామ్యము. సం. ఒక అర్థదోషము; ఒక శబ్దదోషము; రతిబంధ భేదము. విణ. అసభ్యమైనది (మాట); పామరము; గ్రామమందు పుట్టినది.
గ్రావము. సం. పర్వతము; ఱాయి.
గ్రాసము. కబళము. [నది.
గ్రాహకము. సం. డేగ. విణ. గ్రహించు
గ్రాహము. సం. గ్రహించుట; చెఱ; నెగడు, ఒకనీటిపాము; మొసలి; పంది.
గ్రాహి. సం. వెలఁగ.
గ్రాహ్యము సం. విణ. గ్రహింపఁదగినది.

## గ్రి

గ్రిక్కుర. ఓకర.

## గ్రీ

గ్రీటు. బలవంతము.
గ్రీవ. సం. కంఠము; మెడ; మెడనరము.
గ్రీవము. సం. కిరణము.
గ్రీవాదఘ్నము. సం. విణ. కుత్తుకబంటి.
గ్రీష్మము. సం. ఎండ వేఁడిమి; వేసంగి, గ్రీష్మఋతువు.

## గ్రు

గ్రుక్క. మ్రింగుట; ఊపిరి; నోటినిండుగా, నోరెఁడు; కుంభకము, ఊపిరిపట్టుట.
గ్రుక్కగొను. స. క్రి. మ్రింగు, కబళించు.
గ్రుక్కలుమ్రింగు. అ. క్రి. అపేక్షపడు; సంకోచించు.
గ్రుక్కిలి. గ్రుక్క.
గ్రుక్కిళ్లుమ్రింగు. గ్రుక్కలు మ్రింగు.
గ్రుక్కుమిక్కను } అ. క్రి. మాటాడ
గ్రుక్కుమిక్కుమను } నోరెత్తు.
గ్రుక్కెఁడు. నోరెఁడు.
గ్రుచ్చికౌఁగిలించు. స. క్రి. చిక్కఁబట్టి ఆలింగనము చేయు.
గ్రుచ్చు. అ. క్రి. నాటు; కౌఁగిలించు. ప్రే. నాటించు; తూర్చు.
గ్రుడ్డి. విణ. అంధకుఁడు; అంధభావము
గ్రుడ్డింగిలాయి. ఇంగిలాయిభేదము.

గ్రుడ్డికామంచి. గొడుగుగడ్డి
గ్రుడ్డికొక్కెఱాయి. కోయష్టికము
గ్రుడ్డివాటు. దైవికము.
గ్రుడ్డు. గుడ్డితనము; కనుగ్రుడ్డు; పక్షి మొదలగువాని అండము.
గ్రుడ్డుకానుపు. అండజము, పక్షి; సర్పము.
గ్రుడ్లగూబ. ఘూకము. [పొడుచు.
గ్రుద్దు. పిడికిటిపోటు. స. క్రి. పిడికిడితో
గ్రుద్దులాట. గ్రుద్దులాడుట, నియుద్ధము.
గ్రుద్దులాడు. అ. క్రి ఒకరినొకరు గ్రుద్దుచు పోట్లాడు.
గ్రువ్వకరి. గువ్వలగుంపు.

## గ్రే

గ్రేటు. గద్గదకంఠసాధుధ్వని.
గ్రేళి. పరిహాసము, అపహాస్యము.

## గ్రై

గ్రైవము. సం. మెడనుగిట్టెడి త్రాడు.
గ్రైవేయకము. సం. మెడను బెట్టెడు సొమ్ము స్త్రీలుకంఠమునధరించెడితీఁగె, నాను మొ.
గ్రైవేయము. సం. గ్రైవము; గ్రైవేయకము

## గ్రొ

గ్రొచ్చు. గుద్దలి మొదలగువానితో పల్లము చేయు; త్రవ్వు.
గ్రొప్పించు. ప్రే. త్రవ్వించు.
గ్రొయ్యి. అ. క్రి. పల్లము పడు.

## గ్రో

గ్రోవులు. భూషణవిశేషము.

## గ్ల

గ్లహము. సం. పందెము; జూదమునందలి పందెము.

## గ్లా

గ్లాని. సం. శ్రమ, బడలిక, శ్రమముచేతఁ గలిగిన దౌర్బల్యము; పీడ; రోగాదుల చేతఁగలుగు అలపు.
గ్లానుఁడు. సం. విణ. తెవులుగొంటు.
గ్లాసు. ఇం. అద్దము.
గ్లాస్నువు. సం. విణ తెవులుగొంటు.

## గ్లౌ

గ్లౌ. సం. చంద్రుడు.

## ఘం

ఘంట. సం. గంట, కాలపరిమాణవిశేషము; రాగవిశేషము; మొక్కపుఁజెట్టు; వాయించెడిగంట.
ఘంటాపథము. సం. పదిబారలు వెడల్పు గల రాజమార్గము; మల్లినాథకృతమగు కిరాతార్జునీయవ్యాఖ్య.
ఘంటారవ. సం. గిలగిచ్చ†. [ఘటనము.
ఘట. సం. సమూహము; ఏనుఁగులగుంపు;
ఘటము. సం. ఎళనీరుకాయ; కుండ; ఏనుఁగుకుంభస్థలము; శిఖరము; పాడు నుయ్యి; ఊపిరి లోనికిఁదీసి నిలుపుట.
ఘటకుఁడు. సం విణ. ఘటిల్లఁజేయువాఁడు. [యింతి.
ఘటదాసి. సం. విటీవిటులను తార్చెడి
ఘటన. సం. కూర్పు, కూర్చుట.
ఘటయంత్రము. సం. నూతి గిరక.
ఘటయోని. సం. కుంభసంభవుఁడు.
ఘటశాసి. సం. తార్కికుఁడు.
ఘటి సం. చిన్నకుండ.
ఘటించు } సం. స. క్రి. కూర్చు;
ఘటియించు } పొందించు.
ఘటిక. సం. గడియ, ఇరువదినాలుగు నిమిషముల కాలము; గడె్రమాను.
ఘటిల్లు. సం అ. క్రి. కలుగు; సమకూరు; పొందు.
ఘటీకారము. సం. గడియారము.
ఘటీకారుఁడు. సం. కుమ్మరవాఁడు.
ఘటీయంత్రము. సం. ఏతము, నీళ్లు చేఁదెడు రాట్నము; నూతిమీఁదగిరక.
ఘట్టన. సం. గట్టించుట.
ఘట్టము. సం. తీరము; సుంకము పెండలైనవి తీయుచోటు; వనగిరిప్రాయదేశము; స్థానము; పరిస్థితి.

ఘట్టితము. సం. విణ. గట్టింపఁబడినది.

ఘనంపఱచు. మి. స. క్రి. స్థిరపఱచు; గొప్పసేయు.

ఘనము. సం. నృత్యాదిమధ్యమానము; కంచుతాళము మొదలగు వాద్యము; నడిమిపెరుగు; తుంగముస్తె†; దిటవు; మబ్బు, మేఘము; దట్టన, తఱచు; గొప్ప; విరివి; సమ్మెట. విణ. దట్టమైనది; దిటవుగలది.

ఘనరసము. సం. మునగచెట్టు; నీళ్లు; కర్పూరము; గుళిక; వెట్టుబంక; మజ్జిగ; చాఁగ†. విణ. దట్టమైనది.

ఘనశ్రేణి. సం. భూమి,

ఘనసారతరువు. సం. కర్పూరపగఁటి†.

ఘనసారము. సం. కర్పూరము.

ఘనాఘనము. సం. వర్షించెడి మేఘము; హింసించెడి మదపుటేనుఁగు.

ఘనాఘనుఁడు. సం. ఇంద్రుఁడు.

ఘనాత్యయము. సం. శరత్కాలము.

ఘనీభవించు. సం. అ. క్రి. ముద్దకట్టు, గడ్డకట్టు.

ఘనుఁడు. సం. విణ. గొప్పవాఁడు; మేఘుఁడు.

ఘనోపలము. సం. వడగల్లు.

ఘరట్టము. సం. తిరుగలి, తిరుగల్లు.

ఘర్ఘరము. సం. గుడ్లగూఁబ; కొండవారి; వాకిలి; కడుపులో ధ్వని.

ఘర్ఘరి. సం. చిఱుగంట; వీణావిశేషము; స్వరభేదము.

ఘర్ఘరీకము. సం. గుడ్లగూఁబ.

ఘర్మము. సం. ఎండ; చెమట; ఏనుఁగు హృదయమునందలి మదము; వేఁడిమి; వేసంగికాలము; ఎండవేఁడిమి.

ఘర్షణము. సం. ఒరయిక.

ఘర్షణాలము. సం. పాత్రము.

ఘర్షించు. సం. క్రి. రాయిడిచేయు.

ఘస్మరుఁడు. సం. విణ. తిండిపోఁతు; చంపినవాఁడు.

ఘస్రము. సం. దినము. విణ. నొప్పించునది.

## ఘా

ఘాంటికుఁడు. సం. వేకువను రాజులనిద్ర మేల్కొలిపెడువాఁడు.

ఘాట. సం పెడతల.

ఘాటు. ఇం. సంరక్షక భటుల సముదాయము.

ఘాతకుఁడు. సం. విణ. చంపువాఁడు.

ఘాతము. సం. దెబ్బ; బాణము.

ఘాతించు. సం. స. క్రి. చంపు.

ఘాతిని. సం. విణ. చంపునట్టి స్త్రీ.

ఘాతుకుఁడు. సం. విణ. చంపువాఁడు; నొప్పించువాఁడు.

ఘారిక. సం. అప్పము, భక్ష్యవిశేషము, గారె.

ఘాసము. సం. లేఁతపచ్చిక, గడ్డి.

## ఘి

ఘిరాయించు. హిం. స. క్రి. చుట్టడించు.

## ఘీ

ఘీంకారము. సం. ఏనుఁగు గీఁక.

ఘీంకృతి. సం. ఘీంకారము.

## ఘు

ఘుటము. సం. చీలమండ.

ఘుటి. సం. మడమ.

ఘుటిక. సం. కాలిగుత్తి, చీలమండ; ఉండ; బద్ధమయిన పాదరసపు ఉండ.

ఘుణము. సం. మ్రాను తొలుచు పురుగు, నుసిపురుగు.

ఘుణాక్షరన్యాయము. సం. మ్రానియందు నుసిపురుగు తొలువఁగా నేర్పడిన యక్షరముయొక్క న్యాయము.

ఘుర్ఘురము. సం. అడవిపంది కూఁత.

ఘుర్ఘురించు. సం. అ. క్రి. (పంది) కూయు.

ఘుర్మురము. సం. కుమ్మరపురుగు.

ఘుష్టము. సం. విణ. చాటింపఁబడ్డది.

ఘుసృణజలము. సం. కాశ్మీరనీరము.

ఘుసృణము. సం. కుంకుమపువ్వు.

# ఘూ

ఘూకము. సం. గుడ్లగూఁబ.
ఘూర్జరము. సం. ఒకానొక దేశము.
ఘూర్ణనము } సం. తిరుగుడు, తిరుగుట,
ఘూర్ణి } గిరగిర తిరుగుట.
ఘూర్ణితము. సం. విణ. తిరుగుడుపడినది; కూరుకుపాటు పడినది; త్రిప్పఁబడ్డది.
ఘూర్ణిల్లు. సం. అ. క్రి. తిరుగుడుపడు; మ్రోఁగు.

# ఘృ

ఘృణ. సం. దయ, కనికరము; రోఁత.
ఘృణి. సం. కిరణము.
ఘృతకోశాతకి. సం. నేతిబీఱ†.
ఘృతము. సం నెయ్యి; నీరు. విణ. వెలిఁగినది.
ఘృతస్పృక్కు. } సం. అగ్ని,
ఘృతస్పృశుఁడు. } అగ్నిహోత్రుఁడు.
ఘృతాచి. సం. ఒక దేవతావేశ్య.
ఘృతేళిక. సం. ఎఱ్ఱచీమ.
ఘృతోదము. సం. నేతిసముద్రము.
ఘృష్టి. సం. పాఁచితీఁగ; పోటి; రాయిడి; కిరణము; పంది.

# ఘో

ఘోంట. సం. పోఁక†; రేఁగు†.
ఘోటకము. సం. గుఱ్ఱము.
ఘోటజటి. సం. గొట్టెచెట్టు.
ఘోటము. సం. గుఱ్ఱము.
ఘోటి } సం. ఆఁడుగుఱ్ఱము.
ఘోటిక. }
ఘోట్టాణము. సం. గుఱ్ఱము; ఒకానొక దేశము.
ఘోణ. సం నాసిక, ముక్కు.
ఘోణి. సం. ఏనికదోమ; పంది.
ఘోర. సం. గుఱ్ఱపుముక్కు. ?
ఘోరదర్శనము. సం. పెద్దపులి.
ఘోరము. సం. నక్క. విణ. భయంకరము.
ఘోరుఁడు. సం. శివుఁడు. విణ. భయంకరుఁడు.
ఘోలి. సం. గోళి, ఒకదినుసుకూరాకు.
ఘోష. సం. సదాప†; ధ్వని.
ఘోషకము. సం. చేఁతిబీఱ†.
ఘోషణ. సం. చాటించుట; చాటింపు.
ఘోషము. సం. గొల్లపల్లె; ఆవులమంద; ఉఱుము; కంచు; చేఁతిబీఱ†.
ఘోషవతి. సం వీణె; పార్వతివీణె.
ఘోషా. హిం. గోషా, రాణివాసము, స్త్రీలు పరులకు కనఁబడకుండుట.
ఘోషించు. సం. అ. క్రి. మ్రోయు. స. క్రి. ధ్వనిచేయు; చాటు.
ఘోషుఁడు. సం. గొల్లవాఁడు.
ఘోళము. సం. చెల్ల.

# ఘ్రా

ఘ్రాణతర్పణము. సం. విణ. మంచివాసన గలది. [న చూచుట.
ఘ్రాణనము. సం. మూర్కొనుట, వాస
ఘ్రాణము. సం. ముక్కు. విణ. మూర్కొనఁబడినది.
ఘ్రాణించు. సం. స. క్రి. అఘ్రాణించు.
ఘ్రాతము. సం. విణ. మూర్కొనఁబడినది.

---

# చ

చంకరము. సం తేరు; చెట్టు.
చంక్రమణము. సం. దాఁటుట.
చంగము. సం. విణ. నేర్పరి; చక్కనిది.
చంచ. సం. చాఁప; కసవుతోఁజేసినబొమ్మ.
చంచరీకము. సం. తుమ్మెద.
చంచల. సం. మెఱుపు; లక్ష్మి.
చంచలము. సం. గాలి; మందపిచ్చుక. విణ. చలించునది, కదలునది.

చంచలించు. సం. అ. క్రి. చలించు.
చంచలుఁడు. సం. విణ. కాముకుఁడు, చపలచిత్తుఁడు.
చంచుఁడు. సం. చెంచువాఁడు.? [చెట్టు.
చంచువు. సం. పక్షిముక్కు; ఆముదపు
చండ. సం. నల్లకచోరము†; బలురక్కెస†
చండకము. సం. వ్యాఘ్రము.
చండము. సం. చింతచెట్టు. విణ. మిక్కిలి కోపముగలది; తీవ్రము.
చండాంశువు. సం. సూర్యుఁడు.
చండాతకము. సం. వేశ్యల చల్లడము, చెల్లాడము.
చండాతము. సం. గన్నేరు†.
చండాలుఁడు. సం. మాలవాఁడు, బ్రాహ్మణస్త్రీ శూద్రజాతుఁడు; మలోత్సారణజీవి. రూ. చాండాలుఁడు.
చండి. సం. పార్వతి; కోపముగల స్త్రీ; మిక్కిలి ప్రేమగల స్త్రీ; చంపునట్టి స్త్రీ
చండించు. సం. అ. క్రి. మిక్కిలికోపించు స. క్రి. బ్రద్దలు చేయు.
చండిక. సం. పార్వతి; కోపముగల స్త్రీ.
చండిమ. సం. వాఁడిమి.
చండిలము. సం. వాస్తూకము†.
చండిలుఁడు. సం. మంగలి; శివుఁడు.
చండుఁడు. సం. ఒకరాక్షసుఁడు; యమకింకరుఁడు. విణ. మిక్కిలికోపము గలవాఁడు; వాఁడిమిగలవాఁడు.
చందన. సం. మామెన†. [గంధము†.
చందనము. సం. కుంకుమపువ్వు; మంచి
చందనాచలము } సం. మలయపర్వతము
చందనాలయము }
చంద్రకము. సం. నెమలిపురికన్ను.
చంద్రకాంతము. సం. కపటము; చలువ ఱాయి; చంద్రకాంతమణి.
చంద్రకి. సం. నెమలి; కవుఁజు.
చంద్రకితము. సం. విణ. నెమలిపురికన్నులవంటి జాడగలది.
చంద్రగోళి. సం. వెన్నెల.
చంద్రచ్ఛందము. సం. వేయిపేటల ముత్యాలహారము.
చంద్రజ్యోతి. సం. పగలువత్తి.
చంద్రబాల. సం. పెద్దయేలకి†.
చంద్రబీజము. సం. వెండి.
చంద్రభాగ. సం. ఒకానొకయేఱు.
చంద్రము. సం. కర్పూరము; నీళ్లు; బంగారు; కంపిల్లము†
చంద్రముఁడు. సం. చంద్రుఁడు.
చంద్రవంకలు. మి. ధాన్యవిశేషము; గోటిసాటులు. [యిల్లు.
చంద్రశాల. సం. పైమేడ; వెన్నెల; మిద్దె
చంద్రశేఖరుఁడు. సం. శివుఁడు.
చంద్రసంజ్ఞము. సం. కర్పూరము.
చంద్రహాసము. సం. కత్తి; రావణుని కత్తి; కుబేరుని ఖడ్గము.
చంద్రాతపము. సం. వెన్నెల; మేలుకట్టు.
చంద్రాపీడుఁడు. సం. చంద్రశేఖరుఁడు.
చంద్రాలోకము. సం. వెన్నెల; ఒక అలంకారగ్రంథము.
చంద్రిక. సం. వెన్నెల; కుసుమపువ్వు.
చంద్రికవన్నె. మి. కౌసుంభ వస్త్రము.
చంద్రుఁడు. సం. చందమామ.
చంద్రోదయము. సం. ఉల్లెడ, మేలుకట్టు; ఔషధవిశేషము.
చంపకము. సం. సంపెఁగ, సంపంగి†.
చంపువు. సం. గద్యపద్యములు గల కావ్యము.
చకారగుళ్ళు. బ. చీవాట్లు ఏక. చకారగుడి. ("చీవాట్లు" లోని చకారమునకు గుడి యిచ్చినచో యగును)
చకితము. సం. భయము; నాయికకు దేని చేతనైనను ప్రియుని ఎదుట కలిగెడు భయసంభ్రమము.
చకితుఁడు. సం విణ. భయపడినవాఁడు.
చకోరకము } సం. వెన్నెల పులుఁగు.
చకోరము }
చకోరాశ. సం. వెన్నెల.
చక్రకారకము. సం. పులిగోరు†.
చక్రడోల. సం. అంకులరాట్నము.
చక్రధరము. సం. సర్పము. [హితుఁడు.
చక్రధరుఁడు. సం. విష్ణువు; గ్రామపురో
చక్రపక్షము. సం. హంస.
చక్రపాణి. సం. విష్ణువు.
చక్రబంధుఁడు. సం. సూర్యుఁడు.

చక్రమర్దనము. సం. తగిరసః†.
చక్రము. సం. ఆయుధవిశేషము; విష్ణు సుదర్శనము; గానుగు; జక్కవ, చక్రవాకము; బండికల్లు; గుంపు; దండు; రాష్ట్రము; గ్రామ పౌరోహిత్యము; కుమ్మరిసారె; నీటిసుడి; చిన్న నాణెము.
చక్రయాగము. సం. మధుపాన గోష్ఠి; మండలార్చనము.
చక్రల. సం. వట్రువము స్త్రీ†
చక్రవర్తి. సం. రారాజు, సప్తద్వీపములు ఏలినరాజు.
చక్రవర్తికూర. వాస్తూకము†.
చక్రవర్తిని. సం. సార్వభౌమురాలు; కోరింద†.
చక్రవాకము. సం. జక్కవపక్షి.
చక్రవాళము. సం. చుట్టుగొండ; చక్రవాళపర్వతము; గుంపు; మండలము; గుండ్రనిది.
చక్రవృద్ధి. సం. వడ్డికి వడ్డి.
చక్రాంగము సం. జక్కవ; హంస.
చక్రాంగి. సం. ఆఁడుహంస; కటుకరోహిణి†.
చక్రాలత్రిప్పుడు. మి. బాలక్రీడావిశేషము.
చక్రి. సం. విష్ణువు; జక్కవ; పాము; రారాజు; కుమ్మరి.
చక్రీవంతము. సం. గార్దభము.
చక్షువు. సం. నేత్రము
చక్షుశ్శ్రవము. సం. కనువినికి, పాము.
చక్షుష్య. సం. కనుపాల; అందకత్తె.
చక్షుష్యము సం. మెంగలి†; పుండరీకము†. విణ. కంటికి హితమైనది.
చక్షుస్సు. సం. నేత్రము.
చటక. సం. ఆఁడుపిచ్చుక; ఆఁడుపిచ్చుకపిల్ల; పిప్పలివేరు.
చటకము. సం. ఊరఁబిచ్చుక,
చటకారి. ఈ దేశమునఁబుట్టిన ఆంగ్లేయ సంతతివాఁడు.
చటకాశిరము. సం. పిప్పలివేరు.
చటాకు. హిం. సేరులోపదునారవవంతు.
చటులము. సం. విణ. చంచలము, చలించునది.
చణకము. సం. సెనగ†

చణకములు. సం. బ. సెనగలు.
చణుఁడు. సం. విణ. నేర్పరి. [రంగము.
చతురంగము. సం చదరంగము; చదు
చతురంగుళము. సం. రేల†.
చతురంత. సం. భూమి.
చతురంతము. సం. పాలకీ.
చతురంతయానము. సం. పల్లకి.
చతురము. సం. గజశాల; అభినయహస్త విశేషము. విణ. నేర్పరి.
చతురశ్రము. సం. నాలుగుమూలలుకలది
చతురశ్రికము. సం. ములువెలఁగ†.
చతురస్రము. సం. విణ. చదరము.
చతురాననుఁడు. సం. బ్రహ్మ, నలువ.
చతురిమ. సం. నేర్పరితనము.
చతురుఁడు. సం. విణ. నేర్పరి; సమర్థుఁడు.
చతురుపధాశుద్ధుఁడు. సం. విణ కామరహితుఁడు.
చతుర్గతి. సం. తాఁబేలు.
చతుర్థము. సం. విణ. నాలుగవది.
చతుర్థి. సం. చవితి. [దిగ్గజము.
చతుర్దంతము. సం. ఐరావతము, ఇంద్ర
చతుర్దశము. సం. విణ. పదునాలుగవది.
చతుర్దశి. సం. పక్షమునందు పదునాలవ తిథి; పదునాలుగుతంతులుగల వీణ, పరివాదిని. [మోక్షములు.
చతుర్భద్రము. సం. ధర్మార్థకామ
చతుర్భుజుఁడు సం. విష్ణువు.
చతుర్ముఖుఁడు. సం. బ్రహ్మ. [ములు.
చతుర్వర్గము. సం. ధర్మార్థకామమోక్ష
చతుర్విధకవిత. సం. విణ నాల్గువిధములైన తెలుఁగు కవిత్వము. [లైనది.
చతుర్విధము. సం. విణ. నాలుగు విధము
చతుర్హాయణి. సం. నాలుగేండ్ల ఆవు.
చతుశ్శాల } సం. నాలుగిండ్ల బవంతి.
చతుశ్శాలము } [నాలుగు.
చతుష్కము. సం. చదుకము; చవిక,
చతుష్కి. సం. పెద్దకోనేఱు; దోమతెర; నాలుగుపేటలుగల హారము.
చతుష్టయము. సం. స. నాలుగు.
చతుష్పథము. సం. చదుకము, నాలుగుత్రోవలు కలసినదారి; మంచివిశేషము.
చతుష్పథుఁడు. సం. బ్రాహ్మణుఁడు.

చతుష్పదము. సం. ఒక కరణము, చతుష్పాత్తు; నాలుగు కాళ్ల జంతువు, చతుష్పాదము. [దము.
చతుష్షష్టి. సం. అఱువది నాలుగు; ఋగ్వే
చత్వరము. సం. ఇంటిముంగిలి; వ్రతము పూనినవానికి పండుకొనుటకు చక్కఁబఱచిన భూమి; నాలుగుత్రోవలు కలసినదారి; అగ్నిహోత్రము నుంచుటకై సంస్కరించిన స్థానము. [విధవాస్త్రీ.
చత్వరి. సం. శ్రవణక్షమమైన బుద్ధి;
చత్వరిక. సం. బాలవిధవ. [మాంద్యము.
చత్వారము. నలుబదియేండ్లకువచ్చు దృష్టి
చత్వారింశత్తు. సం. స. నలుబది.
చత్వారింశము. సం. విణ. నలుబదవది.
చపల. సం. మెఱుపు; లక్ష్మి; అంకుటాలు; పిప్పలి.
చపలత. సం. చాపల్యము, రాగద్వేషాదులచే పనులయందుఁగల తబ్బిబ్బు.
చపలము. సం. కోఁతి; చేఁప; చేలువ ఱాయి; వేగము; పాదరసము. క్రి.విణ త్వరితము. విణ. కదలునది; నిలుకడలేనిది; వడిగలది.
చపలుఁడు. సం. చంచలుఁడు.
చపేటము. సం. చాఁచినవ్రేళ్లుగల అఱచేయి (హస్తము); చెంపకాయ రూ. చపటము.
చమత్కారము. సం. నేర్పు; అద్భుతము
చమత్కృతి. సం. చమత్కారము.
చమరము. సం. వింజామర; సవరము; సవరపుమెకము.
చమరి. సం. చమరీమృగము; చిగురుకొమ్మ.
చమరికము సం. కాంచనము†.
చమరీమృగము. సం. ఆఁడుసవరపుమెకము
చమనము. సం. చతురస్రమైన యజ్ఞపాత్రము; పక్షిపిల్ల.
చమసి. సం. సోఁపుపిండి.
చమువు. సం. 729 రథములును అన్నియేనుఁగులును 2187 గుఱ్ఱములును 3645 గురు కాల్బలురునుగల సేన; సేన.
చమూరువు. సం. కలదులేదనుతోఁకగలిగి తెల్లగానైనను నల్లగానైనను నానావర్ణములు గలదిగానైన నుండెడు మృగవిశేషము.
చయము. సం. సమూహము; పుట్టకోట; కోటకొఱడు; సంగ్రహము.
చరకము. సం. చరకసంహిత, ఒక వైద్యశాస్త్రము; కూర్చిన రెండువస్త్రములు.?
చరకుఁడు. సం. చరకసంహితా ప్రణేతయగు ఒకముని.
చరణము. సం. తినుట; తిరుగుట, సంచారము; నడవడిక; పాదము; వేరు; ఋగ్వేదాది; కులము.
చరణాయుధము. సం. కోడి.
చరమక్రియ. సం. అంత్యకర్మము.
చరమధాతువు. సం. వీర్యము.
చరమము. సం. విణ. కడపటిది, చివరది; పడమటిది.
చరమాద్రి. సం. అస్తపర్వతము.
చరము. సం. ఒకానొకజూదము. విణ. కదలునది; తిరిగెడుప్రాణి.
చరాచరము. సం. జగత్తు. విణ. తిరుగునదియుఁ దిరుగనిదియునైనది. [చేయు.
చరించు. సం. అ. క్రి. తిరుగు. స. క్రి.
చరిత, చరితము } సం. నడవడి.
చరిత్రము. సం. నడవడి. రూ. చరిత్ర.
చరిష్ణువు. సం. విణ. తిరుగునది. [కుఁడు.
చరుఁడు. సం. వేగువాఁడు; అంగార
చరువు. సం. హోమయోగ్యాన్నము; హవ్యము; హవ్యము వండెడి కుండ.
చర్చ. సం. విచారణ, తర్కించి విచారించుట; చర్చిక్యము.
చర్చరి. సం. చప్పట్లు.
చర్చించు. సం. స. క్రి. విచారించు.
చర్చిక్యము. సం. చేతనిడిన కుంకుమము మొ॥; గంధాదులమైపూఁత.
చర్పటము. సం. చాఁచినవ్రేళ్లుగల అఱచేయి; ఒక మందుచెట్టు.
చర్పటి. సం. ఒబ్బట్టు.
చర్మకష, చర్మకారము } సం. సంబరేను†.
చర్మకారుఁడు. సం. మాదిగవాఁడు, గోడారువాఁడు.

చర్మకీలము. సం. కంతి.
చర్మచటక. సం. చీకురువాయి.
చర్మణ్వతి. సం. ఒకానొకయేఱు; అరఁటి†
చర్మప్రసేవిక. సం. కొలిమితిత్తి.
చర్మభేదిక. సం. ఆరెసూది.
చర్మము. సం. తోలు; కేడెము.
చర్మి. సం. కేడెముధరించినవాఁడు; భుజ
పత్రము†. [ర్తనము.
చర్య సం. నడచుట; ఆచారము; ప్రవ
చర్వణ. సం. ఈఁగ.
చర్వణము. సం. నమలుట, భక్షణము.
చర్వితచర్వణము. సం. నెమరు; ఒక
న్యాయము.
చర్వితము. సం. విణ. తినఁబడ్డది.
చర్షణి. సం. అంకుటాలు.
చల. సం. లక్ష్మి, సిరి.
చలచ్చంచువు సం. చకోరము.
చలదళము. సం. రావి†.
చలద్గళము. సం. కప్ప.
చలనము. సం. కదలుట; తిరుగుట; చల్ల
డము. విణ. కదలునది.
చలమంచము. సం. తూఁగుమంచము.
చలము. సం. పణఁకు. విణ. వణఁకుగలది;
కదలునది.
చలాకి. హిం. విణ. చుఱుకైన. [నిది
చలాచలము. సం. విణ. కదలునది కదల
చలానా. హిం. ఆయా వస్తువుల పట్టి.
చలామణి హిం. విణ. వాడుకలోనుండు.
చలాయించు. హిం. అ. క్రి. జరిగించు;
పాఱిపోవు.
చలావణీ. హిం. విణ రూ. చలామణి.
చలించు. సం. అ. క్రి. కదలు.
చలితము. సం. విణ. కదలింపఁబడినది.
చలియించు. సం. అ. క్రి. కదలు.
చవిక. సం. చవ్యము†.
చవ్య. సం. వస†.
చవ్యము. సం. ఒక మందుదినుసు.
చషకము. సం. కల్లు త్రాగెడి గిన్నె;
గిన్నె; గిండి; ఒకదినుసు కల్లు.
చషాలము. సం. యూపస్తంభ శిరోభాగ
ము నందలి దారుమయమైన కడియము.

## చా

చాంగేరి. సం. పులిచింత†.
చాంచల్యము. సం. చపలత్వము.
చాండాలిక. సం. మాలవీణ.
చాందిని. హిం. మేలుకట్టు.
చాందీ. హిం విణ, మెఱుఁగులేని.
చాంద్రమానము. సం. చంద్రుని గతినిబట్టి
యేర్పడెడు కాలపరిమాణము.
చాంద్రాయణము. సం. భుజింపఁదగిన
ముప్పదిరెండు కబళములలో చంద్రుని
యొక్క క్షయవృద్ధుల ననుసరించి క్రమ
మున కృష్ణపక్షమందు ఒక్కొక్కకడిగా
తగ్గించుచు శుక్లపక్షమునందు ఒకొక్క
కడిగా హెచ్చించుచు భుజించి యాచ
రించెడి ఒక వ్రతము.
చాంద్రి. సం. వెన్నెల.
చాంపేయము. సం. బంగారు; అకరువు;
నాగకేసరము†; సంపెఁగ†; సంపెంగ
మొగ్గ. [శముగలిగి యుండుట.
చాకచ(చి)క్యము. సం. ఉజ్జ్వలత, ప్రకా
చాకోరము. సం. చకోరపక్షుల గుంపు.
చాక్రికుఁడు సం. వేకువను రాజుల నిద్ర
మేల్కొలిపెడివాఁడు; గాండ్లవాఁడు,
తెలికలవాఁడు. [పిల్ల.
చాటకైరము. సం. ఏట్రింత; పిచ్చుకమగ
చాటుకారము సం. బంగారు పూస లు
గ్రుచ్చిన ఒంటిపేటహారము,
చాటువు. సం. ప్రియమైన మాట.
చాతకము. సం. వానకోయి(వె)ల.
చాతురి. సం. చతురత్వము, నేర్పు.
చాతుర్జాతము. సం. ఏలకులు లవంగము
ఆకుపత్రి నాగకేసరము.
చాతుర్మాస్యము. సం. ఒక యజ్ఞము;
ఆషాఢశుద్ధ ద్వాదశి మొదలు కార్తిక
శుద్ధ ద్వాదశి వఱకు (నాలుగునెలలు
చేసెడి యొక వ్రతము.
చాతుర్యము. సం. చాతురి.
చాతుర్వర్ణ్యము. సం. బ్రాహ్మణాది చతు
ర్వర్ణములు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య
శూద్రులు.

చాదస్తము. గ్రా. వెఱ్ఱితనము.
చాదస్తుఁడు. గ్రా. వెఱ్ఱివాఁడు.
చాపము. సం. ధనుస్సు, విల్లు.
చాపలము } సం. చాంచల్యము.
చాపల్యము }
చామరపుష్పము. సం. పోఁక చెట్టు; మామిడి†; మొఁగలి†; తెల్లు†.
చామరము. సం. వింజామర, సురటి.
చామీకరము. సం. బంగారు.
చాముండ. సం. ఒకమాతృక.
చారటి. సం. మెట్టదామర†.
చారణుఁడు. సం. నెరవిద్య మొ॥ ఆటవాఁడు; నానాదేశ సంచారకుఁడైన నట్టువుఁడు; నానాదేశ సంచారకుఁడైన బట్టువాఁడు; ఒకజాతి ఖేచరుఁడు.
చారము. సం. చెలు; నడ; చోఁ†?
చారవాయువు. సం. పడమటిగాలి.
చారిత్రము. సం. చరిత్రము; నడవడి.
చారిమము. సం. ఒప్పిదము.
చారుఁడు. సం. వేగువాఁడు, హర్కారా.
చారువు. సం. బృహస్పతి. విణ. ఒప్పిదమైనది, సుందరము.
చార్చిక్యము. సం. చేతనిడిన కుంకుమము మొ॥; గంధాదులమైపూఁత.
చార్మణము. సం. చర్మములసమూహము.
చార్వాకుఁడు. సం. ఒకానొక (నాస్తిక) మతము వాఁడు; ఒకరాక్షసుఁడు.
చార్జి. ఇం. నేరస్థాపన.
చార్వి. సం. ఊహాపోహాత్మకమైనబుద్ధి.
చాలనము. సం. చలింపఁజేయుట; జల్లెడ
చాలని. సం. జల్లించెడు జల్లెడ.
చాలాకి. హిం. విణ. చురుకైన.
చాషము. సం. పాలపిట్ట.

## చి

చింక. చిన్న కాలువ. బ. రెల్లలలోనుండు జొన్నలు.
చింకలిక్క. ఎఱ్ఱని మొగముగల కోఁతి.
చింగు. కచ్ఛ భేదములు.
చింగోటి. ఆయుధవిశేషము.
చించ. సం. చింత†.
చించే. ప్రే. చినుఁగఁజేయు; ఖండించు.
చింత. తింత్రిణీవృక్షము. సం. తలఁపు; వగపు; ఇష్టానిష్టకార్యవిచారము.
చింతకుఁడు. సం. విణ. చింతించువాఁడు
చింతగుల్ల. బరడుతోనుండు చింతపండు.
చింతన. సం. పలుమాఱు తలఁచుట.
చింతనీయము. సం. విణ. చింతింపఁదగినది.
చింతపండు బరడూడ్చిన తింత్రిణీ ఫలములముద్ద, తింత్రిణీకము.
చింతాకు. తింత్రిణీదళము.
చింతాకుచేఱుదు. బాలక్రీడావిశేషము.
చింతామణి. సం. కోరికలనిచ్చెడు దేవతారత్నము. [వగచు. రూ. చింతిల్లు.
చింతించు. సం. అ. క్రి. చింతచేయు;
చింతితము. సం. విణ. చింతింపఁబడినది.
చింతిలు. అ. క్రి. చింతిల్లు.
చింత్యము. సం. విణ. చింతింపఁదగినది.
చింద. చీపరపిట్ట, ఆతాయిపక్షి.
చిందము. శంఖము.
చిందర. తునుక; చీదర.?
చిందరవందరలు. బ. తునుకతునుకలు ?
చిందఱ. విజృంభణము; తూఁటు; ఖండము; కోపము.
చిందఱగొను. అ. క్రి. విజృంభించు.
చిందఱరేఁగు. అ. క్రి. ఆవేశమెత్తు.
చిందఱవందఱ. తునుక; కలగుండు. విణ. కలగుండు పడినది. అవ్య. కణశోర్థకము.
చిందఱవందఱచేయు. స. క్రి. ఖండించు.
చిందఱవోవు. అ. క్రి. తూఁటువోవు.
చిందఱసేయు. స. క్రి. ఛేదించు. రూ. చిందఱలుసేయు.
చిందాడు. అ క్రి. చిందులుద్రొక్కు.
చిందియ. చింద.
చిందిలి. విణ. చలించినది.
చిందిలిపడు. అ. క్రి. సంభ్రమించు.
చిందిలిపాటు. వేగిరపాటు.
చిందిలు. అ. క్రి. చలించు.
చిందు. గీత ప్రబంధవిశేషము; నాట్యము; మాతంగనాట్యము; కోపము; చిందిన బిందువు. అ. క్రి. నీళ్లు పాత్రమునుండి తొనఁకిపడు; రాలు; వ్యాపించు. స. క్రి. వెచ్చముసేయు. విణ. చెదరినది.

చిందుగ. వృక్షవిశేషము.
చిందుద్రొక్కు. అ. క్రి. నర్తనముచేయు.
చిందుపరువు. బాలక్రీడావిశేషము.
చిందులుద్రొక్కు. అ.క్రి. నర్తించు.
చిందువ. చిన్నపెట్టె; వృక్షవిశేషము.
చిందువందు. విణ. చెదరినది.
చిందువందుచేయు. స.క్రి. చెదరఁగొట్టు.
చిందువాలు. చిందు.
చిందె. జట్లకల్లాయ.
చింపి. జీర్ణవస్త్రము. విణ. చినిఁగినది.
చింపిలి. నిప్పసోఁకినట్లుండు కొనలుగలిగి చిరుసిక్కైన చిన్న వంకరవెండ్రుకలు.
చింపు. ప్రే. చించు, బ్రద్దలుచేయు.
చింబు. మేఁక. [పోతు.
చింబోతు. మేఁకపోతు; ముదురు మేఁక
చికటారి. రూ. చిన్నకటారి.
చికమక. చిక్కు.
చికలిలము. సం. బురుద.?
చికిచికి. విణ. చిన్న.
చికిత్స. సం. (రోగమునకుఁజేయు) ప్రతిక్రియ, వైద్యము.
చికిత్సకుఁడు. సం. వైద్యుఁడు; క్షత్రియ స్త్రీ బ్రాహ్మణులకు ప్రాజాపత్య వివాహమువలనఁబుట్టి శస్త్రదాహ వైద్యము భూతవైద్యము చేయువాఁడు.
చికిత్సించు. సం. అ.క్రి. చికిత్సచేయు.
చికినము చికినివక్క.
చికిని. చాయవక్క.
చికిలి. తుడిచి చక్కఁజేయుట.
చికిలికాఁడు. శస్త్రమార్జకుఁడు.
చికిలిచేయు. స. క్రి. తుడిచిచక్కచేయు.
చికిలిచూపు. వాఁడిచూపు; చంచలదృష్టి.
చికిలివాఁడు. (కత్తులు మొదలైన వానిని) చికిలిచేయువాఁడు.
చికిలు. అ క్రి చనవుచే నేడ్చు. [యిచ్ఛ
చికీర్ష. సం. చేయనిచ్ఛ, చేయవలెననెడి
చికీర్షితము. సం. విణ. చేయనిచ్ఛింపఁబడినది.
చికీర్షువు. సం. విణ. చేయునిచ్ఛగలవాఁడు
చికురము. సం. వెండ్రుక, తలవెండ్రుక; కొండ; పక్షివిశేషము; పాము; ముంగిస; వృక్షవిశేషము. విణ. కదలునది.

చిక్క. సం. పోఁకకాయ; పోఁకచెట్టు.
చిక్కంటు. కంకతిక, తలచిక్కు తీసికొనెడి సాధనము. [దువ్వెన.
చిక్కంటె. తలచిక్కు దీసికొనెడు నిడుపు
చిక్కఁదనము. సాంద్రత.
చిక్కటారి. చిన్నకటారి.
చిక్కణబిళ్ల. బాలక్రీడావిశేషము.
చిక్కణము. సం. చికినివక్క; ఏనుఁగు హృదయమదము; పోఁక. విణ. చిక్కనిది; తఱచైనది; నునుపైనది.
చిక్కన. తఱచు; బలము; దార్ఢ్యము; సాంద్రత; మృదువు; స్నిగ్ధత.
చిక్కనాబిల్లలు. బ. బాలక్రీడా విశేషము
చిక్కనిది. విణ చిక్కణము.
చిక్కపట్టు. నిర్ణయము.
చిక్కమన్ను. బంకమన్ను.
చిక్కము. ఉట్టి; తీఁగలు మొదలగు వానితో నల్లి పసుల మూతికిఁ దగిలించెడు బుట్ట; దారముతో నల్లిన సంచి సం. చుంచెలుక. [యవలపిండి.
చిక్కసము. నలుగుపిండి; హారిద్ర. సం.
చిక్కినది. కుష్కించినది. గుఁడు.
చిక్కినవాఁడు. (రోగాదులచేత) కుష్కాం
చిక్కు. కష్టము; సంకటము; మెలి. అ. క్రి. (శరీరము) కృశించు; తప్పు; తగులు; దొరకు; మిగులు; స్వవశమగు; పట్టువడు; పరిహరించు; మాను.
చిక్కుఁజేయు. స. క్రి. వంచించు.
చిక్కుడు. క్షుద్రశింబీలత.
చిక్కుతాళము. మి. తలుపు గొళ్ళెముతగిలించి వేసెడి ఒకదినుసు బీగము.
చిక్కుపడు. అ. క్రి. చిక్కగు; పట్టువడు; సంకటపడు.
చిక్కుపాటు. సంకటపాటు.
చిక్కువడు. అ. క్రి. చిక్కగు; సంకటపడు; పట్టువడు; దారముకార్యము మొ॥ చిక్కుబడు; స్వాధీనత తప్పు.
చిక్కొట్టు. స. క్రి. ఛీ ఛీ యను.
చిక్కొల. చిక్కంటు.
చిక్రోడము. సం. ఊడుత.
చిగిరించు. అ. క్రి. పల్లవించు.
చిగిరింత. తృణవిశేషము.

చిగిర్చినది. పల్లవితము.
చిగిలింత. తృణభేదము.
చిగిలికాఁడు అందగాఁడు.
చిగురాకు. పల్లవము, చిగురనునన్న ఆకు.
చిగురాకుదిండి. పికము.
చిగురాకువిలుకాఁడు. మన్మథుఁడు.
చిగురు. పల్లవము, దంతములకు చుట్టు నుండు సూక్ష్మ మాంసము. విణ. లేఁత.
చిగురుఁగొమ్మ. చిగిరించిన లేఁతకొమ్మ.
చిగురుఁబోఁడి. చిగురువలె మనోజ్ఞురాలగు స్త్రీ; స్త్రీ.
చిగురుఁబోణి. ఆఁడుది.
చిగురుకొను. అ. క్రి. చిగిరించు.
చిగురుచు. అ. క్రి. చిగిరించు; ఎఱ్ఱనగు.
చిగురుటంబలి. లేఁజిగుళ్లతో వండిన యంబలి.
చిగురుటాకు. చిగురాకు.
చిగురుటల్లె. కురువేరుదంట నారి.
చిగురుడు. అల్పమండలకము.
చిగురువిలుకాఁడు } చిగురువిల్తుఁడు } మన్మథుఁడు.
చిగురొత్తు. అ. క్రి. చిగురుచు; అనురక్తమగు.
చిగుర్చు. అ. క్రి. ఇగిరించు, (చెట్టు) పల్లవించు.
చిగుళ్లు. బ. పల్లవములు; దంతములకు పట్టుగానుండెడి చిగుళ్లు.
చిచ్చఱ. విణ. అగ్నిమయము.
చిచ్చఱకంటి. ముక్కంటి, శివుఁడు.
చిచ్చఱకోల. ఆగ్నేయాస్త్రము.
చిచ్చఱతోరణము. జ్వాలాతోరణము.
చిచ్చి } చిచ్చీ } అవ్య. శిశువులకు జోలపాడునపుడు పీడాపరిహారార్థము చెప్పఁబడుమాట.
చిచ్చు. అగ్ని, చేతనా చేతనాగ్ని; తాపము.
చిచ్చుబుడ్డి. ఒకవిధమైన బాణసంచు.
చిచ్చుబుడ్లు. బ. బాణసంచుభేదము.
చిచ్చుఱ. విణ. అగ్నిమయము.
చిటకము. విలాసము.
చిటచిట. కాఁగిననూనెయందు నీటిబొట్లు పడగాఁగల్గునట్టిధ్వన్యనుకరణము; మిడుఁగురులు చెదరుట మండుటయందగుధ్వన్యనుకరణము; పరితాపము; కోపము.
చిటచిటమను } చిటచిటలాడు } అ. క్రి. మండిపడు.
చిటపొట. ఈర్ష్యచేఁ గలిగెడు స్త్రీయొక్క కోపము; ఆకులందినుట చినుకులుపడుట కాయలురాలుట నిప్పుమండుట మొదలైనవాని యందగు ధ్వన్యనుకరణము.
చిటాలు. ధ్వన్యనుకరణము.
చిటి. విణ. చిన్న; సన్నము. రూ. చిట్టి.
చిటిక. త్రుటి; అంగుళిస్ఫోటనము, నడిమి వ్రేలిని పెద్దవ్రేలితోఁ గూర్చి ధ్వనింపఁ జేయుట; నడిమివ్రేలిని పెద్దవ్రేలితోఁ గూర్చి ధ్వనింపఁజేయునంత కాలము. బ. వాద్యవిశేషము.
చిటిక(కి, కె)న బొద్దులు. బ. పాదకనిష్ఠికాభరణములు.
చిటికనవ్రేలు. కనిష్ఠిక.
చిటికరించు. అ. క్రి. చిటిక వేయు.
చిటికరింత. చిటిక.
చిటికలాట. బాలక్రీడావిశేషము.
చిటికాఁడు. పొట్టిగానుండుటచేత కుక్కకీయబడిన పేరు. విణ. చిన్నవాఁడు.
చిటికెన } చిటికెనవ్రేలు } కనిష్ఠిక.
చిటిగాఁడు. ఈంద్రవాఁడు.
చిటిగొట్టె. చిన్నజాతి గొట్టెచెట్టు.
చిటితాళము. మి. మ్రానితోఁజేసిన తాళవిశేషము; చిటితాళము; ఒక కంచుతాళము.
చిటిపొటి. విణ. అల్పము.
చిటిబొద్దులు. బ. చిటికెనబొద్దులు.
చిటిముత్తెములు } చిటిముత్యాలు } బ. ధాన్యవిశేషము.
చిటిలింగఁడు. చిన్న లింగమువలె నుండుటచే కుక్కకీయఁబడిన పేరు.
చిటివ్రేలు. చిటికెనవ్రేలు.
చిటుకను. అ. క్రి. రూ. చిటుక్కను.
చిటుకు. స. క్రి. చిటికెలు వేయు; చిటుకుపొటుకు.
చిటుకుపొటుకు. వాన వెలిసిన పిమ్మటఁ

జెట్టుమీఁదనుండి బొట్లు పడునపుడు కలుగు ధ్వన్యనుకరణము. [అనురుసుదు.
చిటుకుపాటుకుమను. అ. క్రి. పలుకు,
చిటుకురను } అ. క్రి. చిటుక్కని
చిటుక్కను } మ్రోఁగు.
చిటులు. అ. క్రి. చిట్లు; మిక్కిలికోపించు
చిట్ట. చిన్నపొద; ఆశ్చర్యము. విణ. కల్పితము.
చిట్టంటుచేఁతలు. బ. విలాసము.
చిట్టంటులు. బ. నఖదంతక్షతాది.
చిట్టకము. కపటము; శృంగారచేష్ట; లీల.
చిట్టచివర. విణ అన్నిటికిచివర; అత్యగ్రము
చిట్టడవి. కాఱడవి.
చిట్టడుగుకత్తెర. మల్లయుద్ధగతి భేదము.
చిట్టతుమికి. రావణవృక్షము.
చిట్టమిడుచు. అ. క్రి. చిటికవేయు.
చిట్టము. చిట్టెము.
చిట్టలు. బ అక్కజము; కల్పితము.
చిట్టా. దినపులెక్క, చిర్తా.
చిట్టాడు. అ. క్రి. చలించు; సంచరించు; ప్రసరించు; తప్పటడుగులిడు; క్రీడించు.
చిట్టాముదపుఁజెట్టు. బల, ఏరండవిశేషము
చిట్టాముదము. చిట్టాముదాలనూనె. బ. చిట్టాముదపువిత్తులు.
చిట్టాస. పొదమాటు.
చిట్టి. గిద్ద, సోలయందు నాల్గవభాగమైన మానవిశేషము. విణ. చిన్న.
చిట్టియ. చిట్టె.
చిట్టియము. చిట్టెము.
చిట్టివ్రేలు. చిటికనవ్రేలు.
చిట్టీఁదు. ఖర్జూరి†.
చిట్టీడ. క్షుద్రరక్తనాఁగము†.
చిట్టీతచెట్టు. చిట్టీఁదు. [తవుడు కలిసినది.
చిట్టు. తవుడుకలిసిన సన్ననూక, ఊముక
చిట్టుడుకునీళ్ళు. బ. అన్నముడుకుచుండఁగా తీసిన జలము, పొంగునీళ్లు.
చిట్టుములు. బ. గర్భిణికిఁ గలిగెడి యొకానొక లక్షణమైన ఉమ్మలం.
చిట్టె. వస్త్రముల యంచులయందు వేసెడు చిన్న కమ్మి; వెదురుగనుపు; చిత్రపటము; తంత్రము.
చిట్టెము. లోహకిట్టము, ఇనుము కాఁచునప్పుడు వచ్చెడు మఱికి.
చిట్టెలుక. చిన్నజాతి యెలుక, గిరిక.
చిట్టేలకి. ఉపకుంచిక†.
చిట్లపొట్లకాయ. బాలక్రీడావిశేషము,
చిట్లు. వృత్తాంతము. అ. క్రి. పగుల్లువాఱు; మిక్కిలి కోపించు. [గలవాఁడు.
చిట్లుకట్టియ(కట్టె). విణ. మిక్కిలికోపము
చిర్తా. హిం. రోజువారి లెక్క.
చిడిపి. విణ. అల్పము; చిన్నది; పగుపము.
చిడిముడి. కోపము; తొట్రు, తొందర.
చిడిముడిపడు అ. క్రి. తొట్రుపడు.
చిడిముడిపాటు. తొట్రుపాటు.
చిడుగు. విణ. అల్పము
చిడుగుడు. బాలక్రీడావిశేషము.
చిడుము. తీఁటకురుపు; ఒకవిధమైనగజ్జి.
చిత. సం. సొద; ప్రోగు. విణ. కప్పఁబడినది; చేర్పఁబడినది.
చితి. సం. సొద; ప్రోగు. [నలఁగు.
చితుకు. అ. క్రి. కురుపు మొదలగునవి
చిత్త. ఒక కార్తె పేరు, చిత్తానక్షత్రము.
చిత్తగించు. అ. క్రి. మనస్కరించు. స. క్రి. తలఁచు; యోజించు. [ఋతువు.
చిత్తడి. మిక్కిలి తడి; వర్షము; వర్ష
చిత్తడినేల. నీరు కొంచెముగల పట్టి.
చిత్తము. సం. మనస్సు.
చిత్తర. అంబుపక్కెర.
చిత్తరువు. చిత్రము, ఆశ్చర్యము; పటమునందు రూపము వ్రాయుట; చిత్రము, బొమ్మ, పటమునందు వ్రాసినరూపము.
చిత్తఱి. వర్షఋతువు.
చిత్తసమున్నతి. సం. గర్వము.
చిత్తాభోగము. సం. చిత్తపరిపూర్తి.
చిత్తిని. స్త్రీజాతి విశేషము.
చిత్తు. దిద్దిచక్కపఱపని మొదటవ్రాసిన వ్రాత; మొదటగుణించుకొను లెక్క. సంజ్ఞానము, అవిలుప్తస్వప్రకాశము.
చిత్యా. సం. సొద.
చిత్యము. సం. గోరీ.
చిత్ర. సం. చిత్తనక్షత్రము; మాయ; ఎలుకజీడి†; గుమ్మడి†; పిన్నపాఁపర†; బుడమ†.
చిత్రకంఠము. సం. కపోతము, గువ్వ.

చిత్రకము. సం. బొట్టు; చిఱుతపులి; ఆముదపుఁజెట్టు; గుమ్మడి†; చిత్రమూలము†.
చిత్రకవిత్వము. సం. చతుర్విధకవితలలో నొకటి, బంధకవిత్వాదిరచన.
చిత్రకాయము. సం. చిఱుతపులి;
చిత్రకారుఁడు } సం. ముచ్చి, చిత్తరువు (బొమ్మలు) వ్రాయువాఁడు.
చిత్రకుఁడు
చిత్రకృత్తు. సం తినాసము†.
చిత్రగుప్తుఁడు. సం. యముఁడు; యముని కరణము, యమునివద్ద లెక్క వ్రాయువాఁడు.
చిత్రతండుల. సం. వాయువిడంగము†.
చిత్రదండము. సం. కంద†.
చిత్రపక్షము. సం. కవుఁజు; నెమలి.
చిత్రపర్ణి. సం. కోలపొన్న†.
చిత్రబింబము. సం. ఊసరవెల్లి, కామరూపముగలతొండ.
చిత్రభాను. సం. ఒక సంవత్సరము.
చిత్రభానువు(ఁడు). సం. అగ్ని; సూర్యుఁడు
చిత్రము. సం. ఆశ్చర్యము; బొమ్మ, చిత్తరువు; నానావర్ణము; బొట్టు విణ. ఆశ్చర్యకరమైనది; నానావర్ణములు గలది. [నామకము, ఒక ఓషధి.
చిత్రమూలము. సం. చిత్రకము, అగ్ని
చిత్రరథుఁడు. సం. ఒకగంధర్వుఁడు; ఒకానొక విద్యాధరుఁడు; సూర్యుఁడు
చిత్రరేఖ. సం. ఒకయచ్చర; ఉష-చెలికత్తె
చిత్రవాలము. సం. పాలపిట్ట.
చిత్రశిఖండిజుఁడు. సం. బృహస్పతి.
చిత్రశిఖండులు. సం. బ. మరీచ్యాది సప్తమహర్షులు.
చిత్రించు. సం. స. క్రి. చిత్రము వ్రాయు.
చిత్రిత. త్రోపుడు, మ్రాను నునుపు పఱచెడి వడ్లవాని ఒక కొఱముట్టు.
చిత్రిణి. సం. చిత్తిని.
చిత్రితము. సం. విణ. చిత్రింపఁబడినది.
చిదంబరము. సం. ఒక క్షేత్రము; చిదాకాశము.
చిదక. విణ. చప్పట.
చిదకముక్కవాఁడు. అపటీటుఁడు.
చిదగొద. వ్యత్యాసము; కలహము.
చిదాకాశము. సం. ఆకాశము వలె వ్యాపకమగు చిత్తు, పరబ్రహ్మము.
చిదియు. అ. క్రి. సలఁగు.
చిదుకు. అ. క్రి. చిప్పిలు.
చిదుగు. సమిధ, ఎండిన చిన్న పుల్ల.
చిదుపు. ప్రే. చిదియఁజేయు.
చిదుము. చిగురు. స. క్రి. గిల్లు; హింసించు; చంపు; పువ్వులు మొదలగువానినిగోయు; త్రుంచు; వైచు.
చిదుముట. హింస.
చిదురలు
చిదురుపలు } బ. సూక్ష్మ ఖండములు; సూక్ష్మ భాగములు.
చిదుర్పలు
చిద్రుపలు
చిన. చిన్న, అల్పము, కనిష్ఠము.
చిని. చిన్న; మనోజ్ఞము.
చినుఁగు. అ. క్రి. వస్త్రాదికము ఛిన్నమగు
చినుకు. వర్ష బిందువు; అల్పవర్షము అ. క్రి. కాఱు. అం. ప్రే. కార్చు.
చినుకుఁబూస. ముత్యము.
చిన్కు. చినుకు.
చిన్న. విణ. అల్పము; కనిష్ఠము; చిహ్నము; బాలుఁడు; కనిష్ఠుఁడు; కనిష్ఠురాలు.
చిన్నకారు. బాల్యము, అలరుపాయము
చిన్నజెమ్మి } శమీరము†.
చిన్నజెమ్మితుప్ప
చిన్నటనాడు. బాల్యము.
చిన్నతనము. అలరుపాయము, బాల్యము; సూక్ష్మత్వము; అవమానము. [నది.
చిన్నది. కన్యక, బాలిక; విణ చిన్నదైన
చిన్ననాడు. బాల్యము.
చిన్నపాఁపర. గోతుంబి†.
చిన్నబోవు. అ. క్రి ఖిన్నుఁడగు.
చిన్నము. నాలుగు గురిగింజలయెత్తు; నాల్గు గురిగింజలయెత్తుగల బంగారునాణెము.
చిన్నరిపొన్నరి. విణ. మనోజ్ఞము.
చిన్నఱికము. చిన్నతనము.
చిన్నవాఁడు. బాలుఁడు. విణ. చిన్నదైన వాఁడు. [పుచ్చు.
చిన్నవోవు. అ. క్రి. ఖిన్నుఁడగు. ప్రే. చిన్న

చిన్నారి } విశే. మనోజ్ఞము,
చిన్నారిపొన్నారి } సుందరము.
చిన్ని. విశే. చిన్న; మనోజ్ఞము, సుందరము.
చిన్నిదము. చిన్నిపువు; బంగారు.
చిన్నిది. విశే. చిన్నది; సుందరము.
చిన్నిపువు (వ్వు). భూషావిశేషము. బ. నమస్కృతి.
చిన్నిపూతేకు. చిన్నిపువ్వు.
చిన్నియ. చిహ్నము; విలాసము.
చిన్నియెలుక చిట్టెలుక.
చిన్నిరామ. మి. చిన్నభార్య.
చిన్నె. చిహ్నము; విలాసము.
చిన్నెలాఁడి. విశే. విలాసవతి, శృంగారచేష్టలుగల స్త్రీ.
చిన్నెలాఁడు. విశే. విలాసవంతుఁడు, శృంగారచేష్టలుగల పురుషుఁడు.
చిన్నెలాండ్రు. బ. విలాసవతులు; విలాసవంతులు.
చిపిటము. సం. అటుకులు. విశే. చప్పటముక్కువాఁడు. బ. అటుకులు; కొబ్బరికాయచిప్ప మొ.
చిప్ప. కప్పచిప్ప; కల్లుత్రాగెడిగిన్నె; టెంకాయచిప్ప; తాఁబేటివీపుచిప్ప; భూగోళమునందర్ధభాగము; పుత్తెపుఁజిప్ప; మోఁకాటిచిప్ప; తునుక; తలపుఱ్ఱె; చేఁపమీఁదిపొలుసు; చిప్పకసవు. విశే. అల్పము. [మోటకత్తి.
చిప్పకత్తి. చెట్లు మొదలైనవి నఱకెడు
చిప్పకసవు. చిప్పగడ్డి.
చిప్పకుంకటి } కాకపక్షము, పిల్ల
చిప్పకూఁకటి } జుట్టు.
చిప్పగడ్డి. మాలాతృణము.
చిప్పగుద్దలి } చెట్లు నరుకు గొడ్డలి
చిప్పగొడ్డలి } (గుద్దలి).
చిప్పపెడ(ఱ)క. ఇంటిపార్శ్వ భాగముల కప్పు.
చిప్పము. బట్టలు మొదలగువానిమూట.
చిప్పముత్తె(త్య)ము. కృత్రిమ మౌక్తికము
చిప్పమూతి. కళాహీనమగు ముఖము.
చిప్పర. చిప్ప.
చిప్పిలు(లు) అ. క్రి. ఒడ్డగిల్లు, ఉద్గమించు, నీటిబొట్టు మొ|| లోపలనుండి పైకుబుకు.
చిప్పెము. చిప్పము.
చిప్పె } దర్జీ, వస్త్రసీవనోపజీవి;
చిప్పెవాఁడు } చర్మకార స్త్రీ బ్రాహ్మణ జాతుఁడు.
చిబుకము. సం. గడ్డము.
చిబుకు. స. క్రి. చప్పరించు. [కరణము.
చిమచిమ. గాయపుమంటయందగు అను
చిమట. రూ. చిమ్మట, ఝిల్లిక.
చిమటా. ఖడ్గముష్టి సంగ్రాహ్యతలపులోని చీలపట్టున నలుగు నమర్చుటకుపయోగ్యమగుతావు; కేశోత్పాటిని.
చిమిటా. వెండ్రుకలూడఁదీసెడితండసము
చిమిడిక. చిమిడిన యన్నము.
చిముటాలు. బ. క్షౌరముప్పుడు తండసముతో వెండ్రుకలూడఁదీయుడ.
చిముటు. స. క్రి. సైఁగకుకన్నుమూసి తెఱచు
చిముడు. అ. క్రి. అన్నము మిగులనుడుకు, పాకముచెడు. [చిముడ్చు.
చిముడుచే. ప్రే. చిముడఁజేయు. రూ.
చిమ్ని. ఇం. పొగగొట్టము, పొగగూడు.
చిమ్మ. జలకణసమూహము.
చిమ్మచీఁకటి. గాఢాంధకారము.
చిమ్మట. ఈలపురుగు, ఝిల్లిక.
చిమ్మటబుఱ్ఱు. శబ్దము.
చిమ్మదిరుగు. అ. క్రి. గిరగిరఁదిరుగు.
చిమ్మనగొట్టము } జలక్రీడయందు నీళ్లు
చిమ్మనగ్రోవి } చిమ్మెడు గొట్టము.
చిమ్మనము. చిమ్ముట.
చిమ్మఱాయి. బాలక్రీడావిశేషము.
చిమ్మిట. చిమ్మట, ఝిల్లిక.
చిమ్మిరి. నువ్వులును బెల్లమును కొట్టి చేసెడియుండ.
చిమ్మిరేఁగు అ. క్రి. మిక్కిలివిజృంభించు.
చిమ్మిలి. చిమ్మిరి.
చిమ్ము. సంమార్జనము; పాడుచుట; పైచుట. స. క్రి. మీటు; పైచు; సంమార్జించు.
చిమ్ముడు. చిమ్ముట.
చిమ్ముబిల్లులు. బ. బాలక్రీడావిశేషము.
చిమ్ములాట. చిమ్ములాడుట.

చిమ్ములాడు. స. క్రి. ఒకరిమీఁద నొకరు చిమ్ముకొను.
చిమ్మెట. చిమ్మట, ఝిల్లిక.
చియ్య. కండ, మాంసము. [వాఁడు
చిరంజీవి. సం. విణ. చిరకాలముజీవించు
చిరంటి. సం. జేవరాలు; పేరంటాలు.
చిరంతనము. సం. విణ. ప్రాఁతది; పురాతనము. [జాగుచేయువాఁడు.
చిరక్రియుఁడు. సం. విణ. పనిలో చాల
చిరగడము. తియ్యకంద†; చిరిగిపోవుట.
చిరజీవి. సం. కాకి. విణ. చిరకాలము జీవించువాఁడు.
చిరత్నము. సం. విణ. చిరంతనము.
చిరమర. భేదము.
చిరము. సం. అవ్య. బహుకాలము; ఆలస్యము, కాలవిలంబనము. [కాలము.
చిరరాత్రము. సం. పెక్కురాత్రులు, చాల
చిరాకు. కోపము. [విణ. చిరజీవి.
చిరాయువు. సం. బూరుగు†. వేలంపు.
చిరి. సం. చిలుక.
చిరిక. సం. పురాతనమలము.?
చిరిపి. తైలమార్జకము.
చిరిబిల్వము. సం. కానుగు†.
చిరిమిడి. భక్ష్యవిశేషము.
చిరివేరు. బట్టకు సెత్తురంగువేయుటకు నుపయోగపడుమూలము. [ఛిన్నమగు.
చిరుఁగు అ. క్రి. చినుఁగు, వస్త్రాదికము
చిరుక. సం. చిమ్మట.
చిరుకు. అల్పము.
చిరుగడము. తియ్యకంద†.
చిరుగు. అ. క్రి. చినుఁగు. [గుండకుస్తు.
చిరుగుడు. వ్యాధివిశేషము, కోరము,
చిరుత. కామక్రీడ.
చిరుతరి. వ్రీహిభేదము.
చిరుతలుకవియు } అ. క్రి. మిఱుమిట్లుగొను
చిరుతలుగ్రమ్ము } రూ. చిరుతలువాఱు.
చిరునామ. జాబులమీఁదను, లెక్కలమీఁదను వ్రాయు వ్రాఁత.
చిరువడము. తియ్యకంద†.
చిరువాలు. ఆనవాలు.
చిర్నగవు } చిఱునవ్వు.
చిర్నవ్వు }

చిర్పటము. సం. నక్కదోస†.
చిఱ్ఱుచిఱ్ఱు. కోపవికారము.
చిఱచిఱలాడు. అ. క్రి. మండిపడు, కోపవికారముచూపు.
చిఱి. స్వల్పము; చిత్రికూర.
చిఱికూర. చిత్రికూర.
చిఱికొండి. చిన్నసిగ.
చిఱితాళము. చిట్టితాళము. [లలో భేదము.
చిఱిసెనగలు. బ. మసూరములు, సెనగ
చిఱు. చిఱుతశబ్దముయొక్క లుప్తరూపము. విణ. అల్పము, స్వల్పము.
చిఱుకప్పలు. బ. కప్పలలో భేదము.
చిఱుగంట. గజ్జె, కింకిణి
చిఱుగాలి. మందమారుతము.
చిఱుగూబ. పైడికంటి పిట్ట.
చిఱుచేఁప. క్షుద్రాండజము.
చిఱుత. చిన్నపులి; సాముచేసెడివారు త్రిప్పెడుచిన్నకోల; బాలుఁడు, శిశువు; అల్పము; దారుఖండము. విణ. చిన్న.
చిఱుతకట్టె. చేతెడుకఱ్ఱ.
చిఱుతగండు. చిఱుతపులి.
చిఱుతగూబ. కనకాక్షి, చిఱుగూబ.
చిఱుతనగోడు. బాలక్రీడావిశేషము.
చిఱుతనబిల్లలు. బాలికాక్రీడావిశేషము.
చిఱుతపట్టా. సిద్దెలను కట్టెడి పట్టా.
చిఱుతపులి. చిఱుత, చిత్రకాయము.
చిఱుతమారుతము. మి. మందమారుతము.
చిఱుతుక చిన్నవయసుగలస్త్రీ.
చిఱుతేఁకు. పంజెచెట్టు, భార్గి.
చిఱుదిండి. భక్ష్యము.
చిఱుదొడ. పిక్క, లోఁదొడ.
చిఱుద్రాక్ష. లఘుద్రాక్ష.
చిఱునవ్వు. స్మితము, మందహాసము.
చిఱునామ శిరోనామా.
చిఱునాలుక. కొండనాలుక; ఒకవ్యాధి.
చిఱుపాల. క్షీరావి†.
చిఱుపులి. చిఱుత. [పసుపుచాయ.
చిఱుబంతిపసుపు. పూసికొను పసుపు,
చిఱుబొద్ది } పాఠ, ఏకాష్ఠీల†.
చిఱుబొద్దికూర }

చిఱుమీలు. బ. పోతాధానము. [చిన్న
చిఱుము. అ. క్రి. విజృంభించు. స. క్రి
చిఱువడ్లు. బ. అణువు, శాలిధాన్యవిశేషము
చిఱువాలు. ఇవురఁగాఁచిన పాలు; అన
వాలు. [యుక్తమైన రెయొకానొక వేరు.
చిఱువేరు. ఎఱ్ఱచాయ వేయుటకు ఉప
చిఱువేరుపోడు. చిఱువేరు పైరగు నేల.
చిఱుసెనగలు. బ. చిన్న జాతి సెనగలు, మసూరము.
చిఱ్ఱ. కోపము; చింపిలి.
చిఱ్ఱచిఱ్ఱ. తొట్రుపాటు.
చిఱ్ఱలువోడుచు. అ. క్రి. సంభ్రమించు.
చిఱ్ఱి. చిఱ్ఱికూర.
చిఱ్ఱికూర. తండులీయము†.
చిఱ్ఱిపట్టె. బాలక్రీడావిశేషము.
చిఱ్ఱు. కోపము.
చిఱ్ఱుద్ది. చిన్న ఉద్ది.
చిఱ్ఱుబుఱ్ఱు. చిరచిర; బాలక్రీడా విశేషము
చిఱ్ఱుమను. అ. క్రి. కోపించు; బుసకొట్టు.
చిఱ్ఱుముఱ్ఱాడు. అ. క్రి. చిఱచిఱలాడు; పెనఁగులాడు. స. క్రి. భేదించు.
చిలక. శుకము.
చిలకకూర. హిలమోచిక†.
చిలకకొయ్య. నాగదంతము.
చిలకలు } చిలకత్రాడుగట్టు కొయ్య.
చిలకడ }
చిలకదత్రాడు. ఎద్దుమీఁది కందళము, గంత బిగించెడి త్రాడు.
చిలకత్రాడు. చిలుకనుగట్టు రజ్జువు.
చిలకలకొలికి. స్త్రీ. [త్రాడు.
చిలగత్రాడు. ఎద్దుమీఁది గంత బిగించు
చిలచిల. ఫట్టుటయందగు అనుకరణము.
చిలవ. నీరకోడి.
చిలికించు. స. క్రి. చల్లు.
చిలిచిమము. సర్. కిక్కిసకసవునందుండెడి తేలువంటి చేఁప. [డు.
చిలిపి. విణ. అల్పము; నికృష్టము; దుష్టుఁ
చిలిమిడి(ద). అక్షోడము†.
చిలివిలివోవు. అ. క్రి సందడించు.
చిలుక. శుకము; రథాక్షసంధానితకీలము.
చిలుకకూర. హిలమోచిక†.
చిలుకకొయ్య. నాగదంతము, వస్త్రములు మొదలైనవి యుంచుటకుగాను గోడయందుఁ గొట్టిన చిలుకవంటి ఆకారము గల కొయ్య; మంటిగోడకు వేసిన మెుంకె.
చిలుకడ. పగ్గము మొదలగువాని కొసకు వేసెడి కొలికిముడి [పదకపు బిళ్ళ
చిలుకతాళి. జోడుచిలుకలుగా చేసిన
చిలుకత్తు. కవచవిశేషము.
చిలుకత్రాడు. చిలకత్రాడు.
చిలుకతోఁటకూర. ఒకదినుసుతోటకూర.
చిలుకముక్కు. శుకనాస†. బ. ధాన్య విశేషము.
చిలుకమ్ము. దుష్కంటకశరము.
చిలుకయారె. ఒకదినుసు మాదిగనూది.
చిలుకరవుతు } మన్మథుఁడు.
చిలుకరౌతు }
చిలుకరించు. స. క్రి. చల్లు.
చిలుకలకొలికి. చిలుకకొలికివంటి కొలుకులుగల స్త్రీ; స్త్రీ.
చిలుకు. కొలికి; గొండ్లెము; బాణము; బాణముయొక్క అలుఁగు; శేషము. అ. క్రి. చిందు; ప్రసరించు; మీఱు; స. క్రి. చల్లు; త్రచ్చు.
చిలుకుట. మథనము; దధిమథనము.
చిలుకుడు. చిలుకుట.
చిలుకుటమ్ము. చిలుకమ్ము.
చిలుకుమార్చు. స. క్రి. చంపు.
చిలుగు. దీర్ఘయష్టిక†. [విణ అల్పము.
చిలుప. కొంచెముగఁజేరి నిలిచిన నీళ్లు.
చిలుపచిలువ. కొంచెము కొంచెము, మిక్కిలి కొంచెము.
చిలుము. తామ్రాదిమాలిన్యము; విషము.
చిలుముగులియలు. బ. పాములలో నొక భేదము. [త్రుప్పుపట్టిన కత్తి.
చిలుమువాలు. విణ. తులువ; క్షుద్రుఁడు;
చిలువ. పాము.
చిలువకన్నియ. నాగకన్యక.
చిలువటెంకి, వల్మీకము, పుట్ట. [ణుఁడు.
చిలువతాలుపు. శివుఁడు, ఉరగభూష
చిలువతిండి. పన్నగాశనుఁడు, గరుత్మంతుఁడు; నెమలి.

చిలువదొర. సర్పరాజు.
చిలువమేత. వాయువు.
చిలువమేతరి. చిలువతిండి.
చిలువఱేఁడు. సర్పరాజు.
చిలువానము. కూడఁబెట్టిన ధనము.
చిలువాయనము. విణ. చిల్లర; క్షుద్రము.
చిలువాలు రూ. చిలువాలు.
చిల్క. చిలుక; చిలుకకూర.
చిల్కడ. రూ. చిలుకడ.
చిల్కు. రూ. చిలుకు. [మడ్డి.
చిల్ల. కతకము†. శల్యము; సిల్హాము, చిల్ల
చిల్లకోల. తోమరము.
చిల్లగింజె. ఇందుగు, కతకము.
చిల్లగొండి. విణ. కలహకారి.
చిల్లగోలు. భిందివాలము.
చిల్లతర్కంబులాడు. అ.క్రి. తగవులాడు.
చిల్లపెంకు, చిల్లపెంచు } పగిలినకుండయొక్క చిన్నపెంకు.
చిల్లమడ్డి. సిల్హాము. అందుగుబంకతోఁ జేసిన ధూపద్రవ్యము.
చిల్లము. హుక్కాకు నిప్పుపెట్టుకొనెడు పాత్రము. సం. చీపరపిట్ట; తడికన్ను. విణ. తడికంటిది.
చిల్లర. చింతపండు మిరపగాయలు మొదలగు సరకు; కొంచెముపాటి నాణెము. విణ. క్షుద్రము; కొంచెపుది.
చిల్లరకాఁడు. విణ. క్షుద్రుఁడు, అల్పుఁడు
చిల్లరవాఁడు. సందడికాఁడు.
చిల్లాడ(ణ)ము. ఆయుధవిశేషము.
చిల్లాబుఁడు. సం బందిపోటుదొంగ.
చిల్లి. రంధ్రము, తూఁటు; కందరము. సం. చిల్లికూర†. [క్రియ
చిల్లింగి. కార్మణము, ఉచ్చాటనాది
చిల్లు. చిమ్ముట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము.
చిల్లుపొల్లు. సంక్షోభము.
చిల్లులువోవు. అ.క్రి. తూఁట్లుపడు.
చిల్లోటి. ఒక దినుసు డాలువాలు.
చిల్లోటికేడెము. ఖేటకభేదము.
చిల్వ; చిలువ, సర్పము.
చివఁగి, చివ్వఁగి, సివంగి.
చివక. సన్నని చిన్ననిడుపాటికొమ్మ.
చివచివ. గమనాదులయందగు అనుకరణము
చివర. అగ్రము; ఉపశాఖ.
చివికిపోవు. అ. క్రి. తడియుటచే సారహీనమగు; సారహీనమగు; నశించు.
చివికివెలమ. కాకజంఘ†.
చివుక. పావులా; జతుక.
చివుకపట్టు. ఒకదినుసు గబ్బిలము.
చివుకపిల్లి. ఒకదినుసు మార్జాలము.
చివుకు. ఎగయుట మొదలగు వానియందగు అనుకరణము. అ. క్రి. తడియుటచే సారహీనమగు; సారహీనమగు. విణ. సారములేనిది. రూ. చివుక్కు.
చివుక్కు. దాఁటుట మొదలగువానియందగు అనుకరణము.
చివుక్కురుమను. అ. క్రి. (తన్నెవరేని ఒకమాట చెప్పినను మర్మము బయటపడినను) మనస్సుకలఁగు.
చివురాకు. నవదళము.
చివురు. చిగురు, పల్లవము. విణ. లేఁత.
చివురుటాకు. నవదళము.
చివ్వ. కలహము; సన్నని చిన్ననిడుపాటి కొమ్మ; కుంతము; యుద్ధము. జ. బాణపుసంచువగ.
చివ్వంగి. చివఁగి, సివంగి.
చివ్వఁగి. సివంగి.
చివ్వన. ద్ర. తటాలున.
చివ్వలాఁడి. విణ. కలహశీలురాలు.
చివ్వు. స. క్రి. చెక్కు.
చివ్వున. ద్ర. క్రి. విణ. శీఘ్రముగ.
చిహ్న. సం. చిహ్నము. [తెక్కెము.
చిహ్నము. సం. లాంఛనము, గుఱుతు;
చిళ్ల. అగ్రము; పంగ.
చిళ్లచెట్టు. కతకము†.

## చీ

చీ. అవ్య. ధిగర్థకము, తిరస్కారవాక్యము
చీఁకటి. అంధకారము, తిమిరము.
చీఁకటిగాము రాహువు.
చీఁకటిగుండెదిగులు, చీఁకటిగొంగ } తమిస్రహ, సూర్యుఁడు.
చీఁకటిచెట్టు. తమాలము.

చీఁకటితప్పు. జారత్వము.
చీఁకటిమిత్తి. చంద్రుఁడు.
చీఁకటిమొటికిళ్లు.బ. బాలక్రీడావిశేషము
చీఁకటిమ్రాను. చీఁకటిచెట్టు.
చీఁకటియాఁగ. చిన్నదోమ.
చీఁకటిరేయి తమిస్ర, తమోరాత్రి.
చీఁకటివేరువిత్తు. చంద్రుఁడు.
చీఁకటులదొంగ. తమిస్రహా, సూర్యుఁడు.
చీఁకిలి. చీఁపురుఁగట్ట.
చీఁకు. గ్రుడ్డితనము. స.క్రి. కుడుచు; చప్పరించు; చుంబించు. అ.క్రి. కొయ్య మొ|| తడిసి చివుకు. విణ. అంధుఁడు;చివికినది
చీఁద. ఆతాయి, చిందపక్షి.
చీఁదఱ. ఉపద్రవము; తూఁటు; అపహ్యము; విజృంభణము; క్షోభము.
చీఁదఱగొను. అ. క్రి. ఉపద్రవపడు; ఆవేశమెత్తు; తూఁటువోవు.
చీఁదఱరేఁగు. అ. క్రి ఆవేశమెత్తు.
చీఁదఱలువోవు. అ క్రి. తూఁటువోవు.
చీఁదు. స.క్రి. చీమిడి బయలుపుచ్చు.
చీఁదుడు. చీఁదుట, నాసామలపరిహృతి.
చీఁపురు. సమ్మార్జని, శోధని, చీఁపురుఁగట్ట.
చీకటి. అంధకారము.
చీకాకు. చివికిన ఆకు; శ్రమము; విణ. శ్రమమునొందినది.
చీకాకుపడు. అ.క్రి. బలహీనమగు; శ్రమపడు; చీదరపడు.
చీకిరేను. ఒక చెట్టు.
చీకిలించు. అ.క్రి. మిఱుమిట్లుగొను.
చీకిలిమాకిలి. విణ. కొక్కిరిబిక్కిరి.
చీకు. విణ. అంధము; నిస్సారము; గుడ్డివాఁడు; గుడ్డిది.
చీకుకొక్కెర. గుడ్డికొక్కెర.
చీకురాయి. జతుక.
చీకురించు. అ.క్రి. అంధమగు.[పురుగు.?
చీకురువాయి. చీకురాయిపిట్ట; కుమ్మర
చీకువాయి. చీకురాయి.
చీకువాలు. చీఁకటి, తిమిరము.
చీకొట్టు. స.క్రి. ధిక్కరించు.

చీటి. పత్రిక; ఖండపత్రిక, స్వల్పలేఖ.
చీటికిమాటికి. క్రి. అవ్య. మాటికిమాటికి.
చీడ. సస్యాదులను చెఱచెడి ఒక పురుగు; రోగము; సస్యరోగము.
చీడపురుగు. ఒక సస్యకీటము.
చీడు. పుంజముతక్కువయగు వార.
చీడుదబ్బ. నూలిచీడుతగిలించుటకు వెదురుబద్దలతో గుమ్మటమువలెఁ గట్టఁబడిన సాలెవాని సాధనము.
చీతలవ. పక్షివిశేషము.
చీనము. అల్పదారుచ్ఛేది. సం. బంగారు; ముప్పదిఅంగుళములపొడవుగలిగి నువ్వువన్నె కలిగిన జింక; ఒక దేశము; ధాన్యవిశేషము; నూలు; వస్త్రవిశేషము, గుజ్జుపుపల్లమునకు క్రిందవేసెడు మెత్త.?
చీనాము. చీనము.
చీపర. ఆతాయిపక్షి.
చీపు. అరఁటిగెలయందలి ఒకభాగము.
చీమ. పిపీలిక.
చీమచిటుకు. ఇంచుకంత చప్పుడు.
చీమిడి. నాసామలము, సింఘాణము.
చీము. పూయము, చెడితెల్లనైన నెత్తురు. నెత్తురువిఱిగి ఐనట్టిది.
చీముంత. చెంబు.
చీర. వస్త్రము; కోక.
చీరచింపు. మత్స్యవిశేషము.
చీరణము. చిన్నయులి.
చీరపిట్ట. చీరపేను.
చీరపేను. శ్వేతయూకము, గుడ్డనంటికొనియుండు తెల్లని పేను.
చీరపోతు. చీరపేను.
చీరము. సం. కాపీనము; రేఖ; జిలుగువ్రాఁత;నలువదిపూసలుగ్రుచ్చిన సరము; వల్కలవస్త్రము; సీసము.
చీరి. లక్ష్యము. సం. ఈలపురుగు.
చీరిక. చీలిక, చీలినబద్ద, శకలము; చింపిగుడ్డ. సం. చిమ్మెట.
చీరికి. లక్ష్యము, పరవా.
చీరికిగొననిది. లక్ష్యపెట్టఁబడనిది.
చీరు. స.క్రి. పిలుచు;చీల్చు,బద్దలుచేయు
చీరుక. సం. ఈలపురుగు.
చీరుడు. చీలుట; పిలుపు.

చీరె. వస్త్రము, కోక.
చీర్ణము. చిన్నయులి.
చీఱు. స. క్రి. గీఱు; చీల్చు; పెలుచు.
చీఱుడు. చీల్చుట.
చీల. కీలము, మేకు.
చీలమండ. గుల్ఫము, ఘుటిక, కాలిమడమ కిరుప్రక్కలనుండు కీలు.
చీలి. మార్జాలము, పిల్లి.
చీలిక. పాయ; బ్రద్ద.
చీలు. అ. క్రి. విదారితమగు.
చీలుచు. ప్రే. చీలఁజేయు, బ్రద్దలు చేయు
చీల్చు. ప్రే. విదారించు.
చీవరము. సం. భిక్షుకుని (సంన్యాసి) [వస్త్రము.
చీవాట్లమారి. నిందితుఁడు.
చీవాట్లు. బ. గద్దింపుమాటలు.

## చు

చుంబకము. సం. త్రాసుముల్లు; సూదంటుఱాయి.
చుంబకుఁడు. సం. పెక్కు గ్రంథముల యందు ఇంచుకించుక చదివినవాఁడు; ముద్దుపెట్టుకొనువాఁడు; మోసకాఁడు.
చుంబనము. సం. ముద్దు.
చుంబించు. సం. స. క్రి. ముద్దుపెట్టుకొను
చుక్రము. సం. చింతపండు; పులికడుగు; పులుసు; పుల్లప్రబ్బ†; చుక్కకూర†.
చుక్రిక. సం. పులిచింత†.
చుచుందరి. సం. చుంచెలుక.
చుబుకము. సం. గడ్డము, గద్దువ.
చులుకము. సం. చేర; పుడిసిలి; ముంత; చిఱుతపులి.
చుల్లము. సం. తడికన్ను. విణ. తడికంటిది.
చుల్లి. సం. ప్రొయ్యి; సొద.

## చూ

చూచుకము. సం. అంచు; చనుమొన.
చూడ. సం. సెమలిజొట్టు; జొట్టు, శిఖ; చూరు; బాహుపురి. [తీయుట.
చూడాకర్మము. సం. పుట్టు వెంట్రుకలు
చూడామణి. అలంకారార్థము తలయందుంచుకొనెడు రత్నము; కిరీటాగ్ర రత్నము; గురిగింజ.

చూడాల. సం. ఒకయోగిని; వర్తుపము స్త్రీ†
చూడాలుఁడు. సం. విణ. జొట్టుగలవాఁడు.
చూతము. సం. మామిడి†. [పొడిచేయుట.
చూర్ణకము. సం. పేలపిండి; ఒకగద్యము;
చూర్ణకుంతలములు. సం. బ. ముంగురులు.
చూర్ణము. సం. బుక్కా. గందవొడి; సున్నము; దుమ్ము; పొడి.
చూర్ణిక. సం. వచనకవిత్వ(గద్య)భేదము; గ్రంథభేదము; పేలపిండి.
చూలిక. సం. పిల్లజొట్టు; ఏనుఁగుచెవి మొదలు; ఒకనాటకాంగము. [మోకు.
చూష. సం. ఏనుఁగునడుమునఁగట్టెడుతోలు
చూషకము. సం. సరిగాలి. ?
చూషణము. సం. పీల్చుట.

## చె

చె. విణ. చెన్నుశబ్దముయొక్క లుప్త రూపము.
చెం. రక్తవర్ణము.
చెంక. చెంప.
చెంగఁగొట్టు స. క్రి. ఓడించు.
చెంగట. సమీపము.
చెంగనలు } బ. నతి; అపజయము;
చెంగనాలు } బాలకేళి; లంఘనము.
చెంగలి. విణ. సమీపము; రక్తతృణము.
చెంగలించు. అ. క్రి. అతిశయించు; ప్రకాశించు; విజృంభించు; హసించు.
చెంగలింపు. చెంగలించుట.
చెంగలికోష్ట. పారిభావ్యము†.
చెంగలువ. హల్లకము, ఎఱ్ఱఁగలువ; ప్రియముచే నుక్కకియ్యఁబడిన పేరు.
చెంగలువనెచ్చెలి. కుముదబాంధవుఁడు, చంద్రుఁడు.
చెంగల్వ. ఎఱ్ఱఁగలువ.
చెంగల్వకోష్ఠు. పారిభావ్యము†.
చెంగావి. చంద్రిక; మనోజ్ఞమైన ఎఱుపు.
చెంగావిపుట్టము. చెంగావిచీర.
చెంగు. కొంగు, చెఱఁగు; చిటుకు; కచ్చు; వాద్యవిశేషము. అ. క్రి. విడిపోవు; తొలఁగు; వెనుదీయు.
చెంచిమల. చెంజిమల, జింజీదుర్గము.

చెంచెత. శబరకాంత.
చెంచడము. శ్యేనవిశేషము.
చెంచలి } కణుంజము, వితున్నకము
చెంచలికూర } ఒక దినుసుకూరాకు.
చెంచు. శబరుఁడు; వ్యాధజాతివిశేషము. గంధమూషికము.
చెంజి. చెంచియల.
చెండాడు. స. క్రి. ఖండించు.
చెండి. చండి, పార్వతి.
చెండిపోతు. కుజనుఁడు.
చెండు. కందుకము; పూబంతి; బాలక్రీడావిశేషము. స. క్రి. ఖండించు.
చెండుచెండాడు. స. క్రి. ఖండించు. రూ. చెండుచెండాడు.
చెండుదానిమ్మ. కాయలులేక పూవులు మాత్రము చెండువలెఁ బూచెడి యొక దినుసు దానిమ్మ†.
చెంత. సమీపము.
చెందమ్మి. ఎఱ్ఱదామర. రూ. చెందామర.
చెందలలు. చెంబుతలవలె నున్ననైనది
చెందామర. ఎఱ్ఱదామర.†
చెందించు. ప్రే. పొందించు.
చెందిరము. సిందూరము, కుంకుమము.
చెందిరిక. కమ్మపై దుద్దు; సిందూరము; కుసుంభ పుష్పము; కుసుంభవర్ణము.
చెందు. అ. క్రి. కలుగు. స. క్రి. పొందు.
చెందుప్పు. ఇందుప్పు, సైంధవము.
చెందొగ } ఎఱ్ఱదామర; †ఎఱ్ఱగలువ
చెందొవ }
చెంద్రము. సిందూరము.
చెంద్రవంకలు. బ. ధాన్యవిశేషము.
చెంద్రిక. తాటాకుజాబులమీఁది వలయము; నీరుకావివర్ణము. రూ. చెందిరిక.
చెంద్రిమ-ము. సిందూరము.
చెంద్రెము. కుంకుమము, సిందూరము.
చెంప. చెక్కిలి, కపోలము; పార్శ్వము.
చెంపకల్లి. స్త్రీభూషావిశేషము.
చెంపకాయ. చెంపదెబ్బ, చపేటిక.
చెంపకొప్పు. ప్రక్కకొరగించి వేసినకొప్పు
చెంపదెబ్బ. చపేటిక.
చెంపసరులు. బ. స్త్రీభూషావిశేషము.

చెంబడివాఁడు. నావిదుఁడు.
చెంబు. కలశము, వాడుకొనెడి చేపాత్ర.
చెంబుతల. బట్టగట్టిన తల.
చెకడా. శకటవిశేషము; వస్తువులం దెచ్చుటకు రెండెడ్లు కట్టినది.
చెకపికలాడు. స. క్రి. బాధపెట్టు.
చెకము. వస్త్రము మొదటిబద్దె.
చెకముకిరాయి. వా. నిప్పుపడెడు రాయి.
చెకుముకి నిప్పులుకలుగుటకైయొకదినుసు జాతితోఁ దాఁకించెడి యుక్కుతునుక.
చెకుముకితుపాకి. చెకుముకిరాయితో చేసిన తుపాకి. [శిల.
చెకుముకిజా(రా)యి. అగ్నిశిల, నిప్పుబడు
చెక్క. మ్రాను మొదలగువాని పలుచని ఖండము; బద్ద, శకలము; త్వక్కు; దారుభేదము.
చెక్కకొఱుజో } చెక్కపిడుఁజు.
చెక్కకొఱుదురు }
చెక్కచెట్టు. ఎఱ్ఱచాయ వేయుటకు ఉపయోగించెడి చెక్కగల యొకదినుసుచెట్టు
చెక్కడము. (రత్నములను) పొదుగుట.
చెక్కతాపి. బేలుదారి గోడ మొదలగువానిమీఁద పూసిన గారను తాచి మట్టుపరచెడు వీఁపున పిడియమర్చిన గుండ్రనిడుపు జేనెఁడు చిన్నపలక.
చెక్కపిడుఁజు. పశువుల మేని రక్తముఁ బీల్చెడి యొక దినుసు పిడుఁజు.
చెక్కలు. పూగభాగములు, పోఁక చెక్కలు. [లోని నేయి.
చెక్కియము. మస్తిష్కము, ఎముకల
చెక్కిలి. కపోలము, గండస్థలము.
చెక్కిళ్ళు. బ. కపోలములు.
చెక్కు. ఖచనము, చెక్కడము; చెక్కిలి. స. క్రి. (రత్నములను) పొదుఁగు; ఖచించు, చెక్కలుచేయు. ఇం. హుండీ
చెక్కుచెదరు. అ. క్రి. పాలిపోవు, వికృతినొందు.
చెక్కుచెమర్చు. అ. క్రి. అలయు, బడలు.
చెక్కుచెమర్పు. శ్రమము.
చెక్కుటద్దము. అద్దమువంటి కపోలము.
చెక్కుడుపాలు. దోఁకుడు పాలు, గడ్డి తోఁకెడు పాలు.

చెక్కులు. బ. కపోలములు;చిన్నముక్కలు
చెక్కెము. రూ. చెక్కియము.
చెచ్చెర. క్రి. వి. సులభముగ; శీఘ్రముగ
చెట్ట. అశుభము, కీడు; చేయి. (చెట్టపట్టె నని.) విణ. దుష్టుఁడు; మంచిది కానిది.
చెట్టపుమెకము. ఒత్తెడుపిల్లి.
చెట్టపట్టు. పెండ్లి. స. క్రి. పెండ్లియాడు
చెట్టు. గుల్మము; వృక్షము; ఓషధి.
చెట్టుఁద్రిమ్మరి. శాఖామృగము, కోఁతి.
చెట్టుగట్టు. అ. క్రి. చెట్టుగా చేర్పడు.
చెట్టునట్టు. వానరము.
చెట్టుప. టెక్కు.
చెట్టుపడు. అ. క్రి. స్తంభించు.
చెట్లకట్టె. రూ. చిట్లుకట్టియ.
చెట్లకరివి. ఆట్లఁడు, ఖలుఁడు.
చెడగరము. విణ. క్రూరము; క్రూరుఁడు.
చెడనాడు. స. క్రి. నిందించు.
చెడమి. చెడకపోవుట.
చెడిపి. అశుభము; ఆపద.
చెడిప(పె). అంకుటాలు, జారస్త్రీ.
చెడీ. చల్లడము.
చెడు. అ. క్రి. కనఁబడక పోవు; కొల్ల పోవు; నశించు; కార్యవైకల్యమగు.
చెడుకంపు. పూతిగంధము, దుర్గంధము.
చెడుగఁడు. క్రూరుఁడు.
చెడుగు. అశుభకార్యము. విణ. దుష్టురాలు; ధూర్తుఁడు; కుచ్చితుఁడు;కుత్సితస్త్రీ; క్రూరము.
చెడుగుడు. చిడుగుడు. [అశుభకరము.
చెడ్డ. కీడు. విణ. మంచిదికానిది; దుష్టము;
చెడ్డతొయ్యలి. కులట, జారస్త్రీ.
చెడ్డమాట. దుర్వచనము.
చెడ్డి. మోఁకాలి వఱకుఁదొడిగికొను గుడిగి
చెడ్డు. స. క్రి. తొడచఱచు.
చెణకు. స. క్రి. అంటు.
చెణగరము. రూ. చెడగరము.
చెణుకు. అల్పము, లేశము.
చెతురు. సామర్థ్యము; ద్వంద్వార్థము (పలుకు).
చెత్త. గడ్డి మొ॥ చెత్త, అవకరము.
చెద. చెదపురుగు.
చెదపురుగు. వల్మీకకీటము.
చెదరఁబడు. అ. క్రి. చెదరు.
చెదరు. చెదరుట;కలఁత,క్షోభము. అ.క్రి. కొదరు, విడిపోవు; ఎగసి ప్రసరించు.
చెదలు. బ. పుట్టపెట్టు చీమ; భూమిని పుట్టలుపెట్టు చెదపురుగులు.
చెదవట్టు. అ. క్రి. చెదలుపట్టు.
చెదారము. తృణలేశము, చెత్త; అంటిస.
చెనఁగి. పొట్టి టెంకాయచెట్టు.
చెనఁగులు. బ. ధాన్యవిశేషము.
చెనఁటి. విణ. కుత్సితుఁడు; కుత్సితస్త్రీ; వ్యర్థము; శూన్యము; అల్పము.
చెనకు. ఎదిరించుట; తాఁకుట;గోటినొక్కు. స. క్రి. ఎదిరించు; తాఁకు. [సోలు.
చెనయు. స.క్రి. ఎదిరించు; అంటు,తాఁకు;
చెనుపరి. విణ. గ్రామ్యము.
చెన్నఁగి. చెనఁగి.
చెన్నగులు. బ. ధాన్యవిశేషము.
చెన్నఁటి. రూ. చెనఁటి.
చెన్నఁటిబోవు. అ. క్రి. వ్యర్థమగు.
చెన్నచెర్ల. లాంగలి, విశల్యా†.
చెన్నచెఱకు. అగ్నిశిఖ.
చెన్నపట్టణము. ఒక పట్టణము.
చెన్ను. అందము; కాంతి; సౌందర్యము; విధము. విణ. సుందరము.
చెన్నుఁడు విణ. అందకాఁడు.
చెప్పించు. ప్రే. చెప్పునటులఁజేయు.
చెప్పు. పాదరక్ష. స.క్రి. పలుకు, వచించు.
చెప్పుడుమాట. ఒకరు చెప్పినట్టిమాట.
చెప్పుతట్ట. గోధాపది†.
చెమట. స్వేదము.
చెమటకాయ. ఎండవేఁడిమిచేత దేహము నందుఁ గలిగెడు చిన్నగుల్ల. [వాఁడు.
చెమటగొట్టు. విణ. మిక్కిలి చెమటగల
చెమటపట్టు. } అ.క్రి. చెమటగలదియగు
చెమటపోయు. }
చెమటియావు. చిత్రగవము.
చెమరకాయ. చెమటకాయ.
చెమరించు. అ. క్రి. చెమటపోయు.
చెమరు. చెమట; చెమరుఁగాకి.
చెమరుఁబోతు. విణ. చెమటగొట్టు.

చెమరుచు. అ. క్రి. చెమటపోయు; ఆవిరిల్లు; ఆర్ద్రమగు, చెమ్మగిల్లు.
చెమరు (ట) నెత్తురు. అతిగారబము, ప్రేమ.
చెమర్కాకి చెమరుఁగాకి.
చెమర్చు. అ. క్రి. రూ. చెమరుచు.
చెమికలు. బ. నేయునప్పుడు తెగిననూలుం ఆదికడు నూలితునుకలు.
చెముడు. సింహుండము†.
చెమురుకాకి. ఆళ్ళకోస, కురుకము.?
చెమ్మ. విశే. ఆర్ద్రత, తడి; శింబి†
చెమ్మగిల్లు. అ. క్రి. తడి గలదియగు.
చెమ్మట. రూ. చెమట.
చెమ్మటిలు. అ. క్రి. ఆర్ద్రమగు.?
చెమ్మయిలుకు } అ. క్రి. చెమరుచు.
చెమ్మరించు }
చెయి. హస్తము; కరికరము; తొండము; రెండుమూరల ప్రమాణము.
చెయిదము } పని, కృత్యము, చేష్ట, కర్మము.
చెయిది }
చెయువు }
చెయువులసాకిరి. కర్మసాక్షి, సూర్యుడు.
చెయ్దము } రూ. చెయిదము, చెయిది, పని.
చెయ్ది }
చెయ్యి. రూ. చెయి.
చెయ్యెత్తుపొడువు. పురుషప్రమాణము.
చెయ్వు. రూ. చెయువు
చెరఁగు. అంచు; బట్టకొంగు.
చెరఁప. చెంప.
చెరపఁజాట. జాల్ముఁడు.
చెరచెర ద్ర. క్రి. విశే. శీఘ్రముగా
చెరమ. నాసాపుటము.
చెరలాటము. విహారము.
చెరలాడు. అ. క్రి. విహరించు; వ్యాపించు; సంచరించు.
చెరవ } వంటకును నీళ్ళు కాఁచుటకును ఉపయుక్తమయిన యిత్తడి పాత్రము, చరువు.
చెరవము }
చెరి. చెఱి, పరస్పరము; పుస్తము.
చెరికి. విశే. ధూర్తుఁడు.
చెరుగు. స. క్రి. బియ్యము మొదలగు వానిని చేటతో చెరుగు.

చెరువు. చెక్కటు; తటాకము. స. క్రి. చెక్కు; గుచ్చు. [కట్టి.
చెర్వుకోల. ఎడ్లను కొట్టెడి చబుకు కట్టిన
చెర్వము } రూ. చెరవ.
చెర్వి }
చెఱ. చారము, కారాగృహము; కయిదు; నిర్బంధము; ప్రగ్రహము.
చెఱఁగు. అంచు; కొంగు; దిక్కు.
చెఱఁగుమాయు. అ. క్రి. బహిష్ఠయగు.
చెఱఁగుమాసినది. ఋతుమతియైన స్త్రీ.
చెఱకడము. బెల్లము.
చెఱకు. ఇక్షువు.
చెఱకుగడ. ఇక్షుదండము.
చెఱకుతోఁట. ఇక్షువణము.
చెఱకునేల. చెఱకుపండెడు భూమి.
చెఱకుపందెము. పందెములలో భేదము.
చెఱకుపానకము } ఇక్షురసము.
చెఱకుపాలు }
చెఱకువిలుకాఁడు. ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు, [మొదటిది.
చెఱకువిల్లు. మన్మథ ధనుస్సులలో
చెఱగొను. స. క్రి. చెఱపట్టుకొను.
చెఱచు. ప్రే. చెడఁజేయు; పోఁగొట్టు.
చెఱచెఱలాడు. అ. క్రి. కోపమున మండు.
చెఱపట్టు. స. క్రి. నిర్బంధము చేసి పట్టు.
చెఱపనచేటు. విశే. నాశకుఁడు; నాశకురాలు; జాల్ముఁడు.
చెఱపు. అశుభము. ప్రే. చెఱచు.
చెఱపోవు. అ. క్రి నిర్బంధము చేత పట్టువడు.
చెఱమ. నాసాపుటము.
చెఱలాట. అసివారు.
చెఱలాడు. అ. క్రి సంచరించు.
చెఱవడు. అ. క్రి. చెఱపోవు. [కొను.
చెఱవెట్టుకొను. అ. క్రి. స్వాధీనము చేసి
చెఱసాల. చారశాల, బందిఖానా.
చెఱి. అవ్య. ఒక్కొక్కనికి; పరస్పరము.
చెఱియుంత. తలాయంత; ఒకరొకరు ఇట్లింత చొప్పున.
చెఱిసగము. పరస్పరము సగము సగము.
చెఱుక. అవ్య. చెఱి.
చెఱుకు. చెఱకు.

చెఱుచు. ప్రే. నశింపఁజేయు; పని భగ్నముచేయు.
చెఱుపరి. విణ. నాశకుఁడు. [చెఱుచు.
చెఱుపు. అశుభము; భంగము. స. క్రి.
చెఱుము. స, క్రి. ఊచు.
చెఱువు. తటాకము; సత్రము.
చెలఁగు. అ. క్రి ఉత్సహించు; శబ్దించు; సంతోషించు; ఒప్పు; ప్రకాశించు; బొబ్బరించు; వికసించు.
చెలఁది. సాలెపురుగు.
చెలఁదితెర. సాలెపురుగు నేసిన జేఁత.
చెలఁదిబల్లి. సాలెపురుగు.
చెలక. క్షేత్రము.
చెలగము. సాలెపురుగు.
చెలగాటము. విహారము.
చెలగు. స. క్రి. ఖండించు.
చెలది. త్వగ్గత వ్యాధి భేదము.
చెలపాది. మాత్సర్యశీలుఁడు.
**చెలమ.** కూపకము, దొరువు, ఎండిపోయిన ఏఱు మొదలగువానియందు నీళ్ళకొఱకు త్రవ్వెడు పల్లము. [చిమ్మ.
చెలయు. అ. క్రి. విజృంభించు. స క్రి.
చెలరేగు. అ. క్రి. మిక్కిలి విజృంభించు.
చెలవు. స. క్రి. ఖండించు; విజృంభించు.
చెలామణి. చెల్లుబడి, పనికివచ్చుట.
చెలి. స్త్రీ. విణ. స్నేహితుఁడు; స్నేహితురాలు; రాజ్యసప్తాంగములలో మూడవది
చెలిక. బీటి నేల.
చెలికత్తియ. } విణ. స్నేహితురాలు,
చెలికత్తె. } సఖి.
చెలికవెలుఁగు. కాకజంఘ†.
చెలికాఁడు. విణ. సఖుఁడు, స్నేహితుఁడు
చెలికారము. స్నేహము.
చెలికె. పరిగ నేరినపొలము. [గము.
చెలిది. చెలఁగ; చర్మరోగము; మేహరో
చెలిపి. కపోలము.
చెలిమరి. విణ. స్నేహితుఁడు; సఖి.
చెలిమి. స్నేహము; ప్రేమము.
చెలిమికత్తియ } విణ. చెలికత్తె, స్నేహి
చెలిమికత్తె } తురాలు.
చెలిమికాఁడు. విణ. చెలికాఁడు.
చెలిమిచుక్క. అనూరాధ నక్షత్రము.
చెలిమిడి. జలతండులీయవిశేషము†.
చెలియ. ఆఁడుది; సఖి.
చెలియకట్ట. వేల, సముద్రతీరము.
చెలియలు. చెల్లెలు.
చెలువ. స్త్రీ; అందముగల ఆఁడుది; మనోహరమైన నోరుగలది. [సౌందర్యము.
చెలువనేత్రవిలాసము. మి. స్త్రీ కన్నుల
చెలుపము } కాంతి; అందము, సౌంద
చెలువు } ర్యము.
చెలువుఁడు. ప్రియుఁడు; విటుఁడు; సుందరపురుషుఁడు.
చెల్క. రూ. చెలిక.
చెల్గు. స. క్రి. రూ. చెలగు.
చెల్ది. చెలది.
చెల్మి. ప్రేమము; మిత్రభావము.
చెల్ల. } ద్ర. అయోగ్యయనుట,
చెల్లఁబో. } సంతాపార్థకము.
చెల్లచెదరు. విణ. మిక్కిలి చెదరినది.
చెల్లరె (రే). అవ్య. సంతాపార్థకము.
చెల్లాచెదరు. రూ. చెల్లచెదరు.
చెల్లి. చెల్లెలు.
చెల్లించు. స క్రి. జయించు.
చెల్లియ-లు. చెల్లెలు.
చెల్లు. అ. క్రి. అయిపోవు; కడచు; మరణించు; సిద్ధించు; తగు; శక్యమగు; దీర్ఘమగు; చేరు; సాగు. విణ. చేరినది.
చెల్లుబడి. అధికారము. విణ. సిద్ధిఁబొందినది.
చెల్లె. చెల్లెలు.
చెల్లెలు. అనుజ, సోదరి.
చెల్వ. రూ. చెలువ.
చెల్వు. రూ. చెలువు.
చెవాకు కర్ణపత్రము.
చెవి. శ్రోత్రము; రాట్నము మొదలగు యంత్రములయందుఁగల తదవయవవిశేషము; తాళపుచెవి.
చెవికెలు. గట్టి నూలుపోఁచలు.
చెవికొణక. కొనచెవి.
చెవిచొరుపాము. కర్ణజలూక.
చెవిటి. విణ. చెవిటివాఁడు.
చెవిటితనము. బాధిర్యము.

చెవిటిమూఁగ. విణ. చెవుడును మూఁగతనమును గలవాఁడు, ఏడమూకుఁడు.
చెవిటివాఁడు. విణ. బధిరుఁడు. [పాలిక.
చెవితమ్మె. పోగులుంచుకొను తావు, కర్ణ
చెవిదోరఁబెట్టు స. క్రి. శ్రుతమగు.
చెవియాకు. లక్కాకు; కమ్మ.
చెవియొగ్గు. } స. క్రి. ఆలకించు,
చెవివాలఁబెట్టు. } ఆకర్ణించు.
చెవుడు. బాధర్యము.[ప్రే. చెవుడుపఱచు.
చెవుడుపడు. అ. క్రి. చెవుడు గలదియగు,
చెవుడుపాటు. చెవిటితనము.
చెవుడ్పడు. రూ. చెవుడుపడు.
చెవుడ్పాటు. చెవిటితనము.
చెవులపిల్లి } శశకము, కుందేలు.
చెవులపోతు }
చెవులపోవులు. బ. కర్ణభూషావిశేషము.
చెవ్వ. శిశువులకు పుట్టినతోడనే కలుగు వ్యాధి విశేషము.
చెవ్వకాయలు. చెవ్వ.
చెవ్వాకు. కర్ణపత్రము; తాటంకము.

## చే

చే. హస్తము (చేసంజ్ఞయని); తొండము. అవ. తృతీయా విభక్తియందు వచ్చు ప్రత్యయము.(రామునిచే,ధనముచే అని).
చేఁత. చేయుట; కృత్యము. విణ కృత్రిమము.
చేఁతకాఁడు. విణ. క్రియావంతుఁడు.
చేఁతగట్టు. కృతకాద్రి. [చెట్టు.
చేఁతరా(లా)సి. ఝురసి, ఒకానొక కూర
చేఁతరికము. వైరము.
చేఁతఱికము. కీడు. [కేరి†
చేఁతిదొండ. చేఁదుగలదొండ, తిక్తతుండి
చేఁతిదోస. చేఁదుగలదోస, తిక్తకర్కటి†
చేఁతినీళ్లు. తిక్తోదకము.
చేఁతిపుచ్చ. తిక్తకాళింగి†.
చేఁతిపొట్ల. చేఁదుగలపొట్ల, పటోలిక†.
చేఁతిబీఱ. చేఁదుగలబీఱ, కటుకోశాతకి†
చేఁతియానుగు. తిక్తాలాబువు†.
చేఁతిసొర. చేఁదుగలసొర, కటుతుంబి†.
చేఁద్రాడు. నీళ్లుచేఁదునట్టి త్రాడు.
చేఁద. నీళ్లుచేఁదునట్టి పాత్రము.
చేఁదు. తిక్తము, షడ్రసములలో నొకటి; వికటగంధము. అ. క్రి. ఆకర్షించు; నూతిలో నీళ్లులాగు.
చేఁప. మత్స్యము.
చేఁపరాసి. కడరాసి, మీనరాశి.
చేఁపు. పాలు ఉప్పతిల్లు. స. క్రి. పాలు ఉప్పతిల్లఁజేయు.
చేపుఁడు. చేఁపుట.
చేకట్లు. బ. హస్తభూషావిశేషము.
చేకత్తి. చిన్నకత్తి, కరవాలిక.
చేకము. వస్త్రము యొక్క బద్ది.
చేకానుక. రాజులు మొదలగువారిని జూడఁబోవునపుడు కొనిపోయెడి యుపహారము
చేకుఱు. అ. క్రి. లభించు, ప్రాప్తమగు; సిద్ధించు, అనుకూలమగు.
చేకూడు. అ. క్రి. హస్తగతమగు.
చెకూరు (ఱు). అ. క్రి. చేకూడు.
చేకూరుచు. ప్రే పొందఁజేయు.
చేకొఱడ. క్షీరమోరట†. [చెదలు.
చేకొఱుజో (దు). శిథిలి, పచ్చవర్ణముగల
చేకొను. స. క్రి. పట్టుకొను, గ్రహించు; ఆదరించు; జయించు. ప్రే. చేకొలుపు.
చేకొలుపు. ప్రే. చేకొనఁజేయు.[వృక్షము.
చేగ. చేవ; దృఢము; బలము; మధురసా
చేగలమెకము. కరి, హస్తి, ఏనుఁగు.
చేగలవాఁడు. వదాన్యుఁడు.
చేగోడి. భక్ష్యవిశేషము.
చేచేమురు. ఆజ్యము. [భకరము.
చేట. శూర్పము, చెరిగెడుసాధనము; అశు
చేటకుఁడు. సం. భృత్యుఁడు.
చేటకొల్లారు. త్రిశాల, మూడు వైపుల మూడిండ్లుకలిపి కట్టిన కట్టడము.
చేటగోళ్లబోటి. శూర్పణఖ.
చేటచెవులమెకము. శూర్పకర్ణము, ఏనుఁగు
చేటచెవులవేలుపు. శూర్పకర్ణుఁడు, వినాయకుఁడు. [కట్టు.
చేటచేఱు. ఆఁడువారి ఒకవిధమైన కోక
చేటరిక్క. విశాఖ నక్షత్రము
చేటరిక్కనెల. వైశాఖ మాసము.
చేటపీనుల దణి. శూర్పకర్ణుఁడు, వినాయకుఁడు.

చేటసవతురిక్క. విశాఖ నక్షత్రము.
చేటి. సం. దాసి; పనికత్తె. రూ. చేటిక.
చేటు. నాశము; అశుభము; కీడు; ఆపద.
చేటుఁడు. సం. పనివాఁడు; నర్మసచివుఁడు; శృంగారనాయకునియొక్క ఒకానొక సచివుఁడు. విణ. నికృష్టుఁడు.
చేటుపాటు. అశుభము; ఆపద.
చేటుమునుఁగు } కీడుపొందు.
చేటుమూడు }
చేట్పాటు. అశుభము; ఆపద.
చేట్లకొఱవి. విణ. నిర్భాగ్యుఁడు.
చేడి. అశుభము.
చేడిది. అశుభము; ఆపద.
చేడియ. స్త్రీ. రూ. చేడె. [కీడుపొందు.
చేడ్పడు. అ. క్రి. బాధపడు; చలించు;
చేడ్పాటు. బాధ; కీడు పొందుట.
చేత. చే (ప్రత్యయము.)
చేతకి. సం. కరక†.
చేతడియాఱకుండ. వ్యవధి లేకుండ.
చేతన. సం. బుద్ధి; బుద్ధివృత్తి, తెలివి; జ్ఞానము.
చేతనము. సం. మనుష్యాది ప్రాణి; జీవుఁడు; ఆత్మ; పరమాత్మ; విణ. ప్రాణముగలది.
చేతనుఁడు. మనుష్యుఁడు.
చేతప్పిచను. అ. క్రి మన యధీనతనుండి తప్పిపోవు.
చేతముకు. చిన్నతముకు. [యగు.
చేతరించు. అ. క్రి. చైతన్యము కలది
చేతవులు. అ. క్రి చేకులు; నష్టివచ్చు.
చేతస్సు. సం. హృదయము, మనస్సు, చిత్తము; జ్ఞానము.
చేతాఁకు. సాహసము.
చేతిపాదువ. మల్లయుద్ధములోని మెలఁకువ.
చేతిబిడ్డ. పసిబిడ్డ.
చేతివ్రాలు. బ. హస్తరేఖలు; సంతకము, హస్తాక్షరములు.
చేతులప్పళించు. అ. క్రి. లోఁపఱచు.
చేతెఁడు. హస్తప్రమాణము.
చేతోజగీతములు. సం. బ. మన్మథగేయములు; శృంగారపదములు.
చేతోభవుఁడు. సం. మన్మథుఁడు.
చేత్రాళ్లు. బ. నీళ్లుతోడునట్టిత్రాళ్లు; మల్లయుద్ధాయుధము.
చేదండ. హస్తావలంబము.
చేదర్పనము. చేకానుక.
చేదిదేశము. సం. 56 దేశములలో నొకటి
చేదివియ. దివ్వటీ, కరదీపము.
చేదోడు. విణ. కార్యసహాయుఁడు; కార్యసహాయురాలు.
చేను. పంటనేల, క్షేత్రము; వరి మొదలగు పైరు; అడవి.
చేపట్టు. అవలంబము; అనుగ్రహము; స్థానము; వివాహము; హస్తగ్రహణము. స. క్రి. అవలంబించు; గ్రహించు; పెండ్లియాడు.
చేపట్టుకుంచెము విణ. ఎవ్వరేదికోరినను దానిని నెరవేర్చువాఁడు. [లభించు.
చేపడు. అ. క్రి. చిక్కు; పట్టువడు;
చేపల్లటీ. అంతరపల్లటీ.
చేపెట్టె. చిన్నపెట్టె, మంజూష.
చేబ. మల్లబంధవిశేషము. [దీసిన అప్పు.
చేబదులు. చేతిఅప్పు, అల్పకాలమునకుఁ
చేబాడిస (సె). చిన్నబాడిస.
చేబోడి. విణ. నిర్ధనుఁడు.
చేమ. చేమకూర†; కందమూలవిశేషము†
చేమంతి. చేమంతిక†. [శతపత్రిక†.
చేమంతిక. సం. ఒకానొక పూఁజెట్టు,
చేమంతిపువ్వు. స్త్రీ భూషావిశేషము.
చేమటియావు. చిత్రవర్ణముగలగోవు.
చేమపూరాజనములు. బ. శాలి ధాన్యవిశేషము. [మజ్జిగ మిడుచుట.
చేమిరి. ఆతంచనము, పేరుటకై పాలలో
చేమోడుచు } అ. క్రి. నమస్కరించు,
చేమోడ్చు } మొక్కు.
చేమోడుపు } నమస్కారము.
చేమోడ్పు }
చేయమ్ము. చేతితో ప్రయోగించెడు బాణము.
చేయలఁతి. విణ. సమీపము.
చేయి. హస్తము; కిరణము†; కరిహస్తము, తొండము; పక్షము; పట్టు; రెండుమూరలకొలఁది.

చేయిదోడు. విణ. చేదోడు.
చేయివీచు. స.క్రి. యుద్ధానుజ్ఞసంజ్ఞచేయు
చేయు. స. క్రి. సలుపు, ఒనర్చు; నిర్వహించు. ప్రే. చేయించు.
చేర. ప్రసృతి, ఇంచుకవంచఁబడినచేయి.
చేరిక. కూడిక; చేరుట; సమీపము; రతి.
చేరు. మిరియము మొదలగు సంబారములం చేర్చి కాఁచిన చింతపండురసము; సమీపము; పుష్పమాలిక; సరము; త్రాడు; కట్టు, యూపము; గొలుసు, అ. క్రి. ఒదుగు, ఆనుకొను; సమీపించు. స. క్రి పొందు ప్రవేశించు.
చేరుకోల. చేఱుకోల.
చేరుగడ. సమీపము; దిక్కు, విణ. సమీపమైనది.
చేరుగొంటె. చేరివచ్చిన పెండ్లాము. విణ. చేరివచ్చినది; దుష్టము [దులం ధరించు.?
చేరుచు. ప్రే. చేరఁజేయు స క్రి. పుష్పా
చేరుచుక్క. పాపటబొట్టు.
చేరుడుబియ్యము. అక్షుణ్ణతండులములు.
చేరుడులు. బ. తెల్లగా దంచని బియ్యము మొ.
చేరువు, చేరుబడి } సమీపము, రూ చేర్వు.
చేరుళ్లు. బ. చేరుడు బియ్యము.
చేరువ. వర్గము; సమీపము; సేన, చతురంగ బలయుత సేన. విణ. సమీపమైనది.
చేరువకాఁడు. ఒక సమూహమున కధిపతి; సేనాధిపతి; కావలివాఁడు.
చేరువయగు. అ.క్రి. సమీపించు.
చేర్కోల. రూ చేఱుకోల. [శపెట్టు
చేర్చు. ప్రే. చేరఁజేయు; పొందించు; ప్రవే
చేర్చుక్క. పాపటబొట్టు.
చేర్లకోల. రూ. చేరుకోల.
చేర్వ. రూ. చేరువ.
చేఱ. ప్రసృతి, చులుకము.
చేఱు. రూ. చేరు.
చేఱుకోల. కశ, బండిగుఱ్ఱములు దుక్కి ఎద్దులు మొదలగువానిని గొట్టెడుజాతి.
చేఱుచుక్క. జడబిల్ల.
చెఱుబొంద. కొట్టెడు తోలుపట్టెడ.
చేఱులకోల. చేఱుకోల.
చేతెఁడు. రెండుపిడికిళ్ళ పరిమాణము.
చేల. వస్త్రము.
చేలని. సం. జూదమునందలి సారె.
చేలము. సం. వస్త్రము. విణ. అధమము.
చేలు. బ. పైరుపండు పొలములు.
చేవ. వృక్షాదులబలము; సారము; స్థైర్యము; శక్తి; దృఢము. రూ. చేగ.
చేవట్టికాలు(దొరుకు). వివాహము.
చేవలంతి విణ. అధీనము.
చేవాఁడి. చౌర్యము. [దొంగ.
చేవాఁడికాఁడు. చేచుఱుకు గలవాఁడు,
చేవాటు. విణ. సమీపము.
చేవిచ్చు. అ. క్రి. దండము పెట్టు.
చేవిప్పు. దండము, నతివిశేషము.
చేవెలుఁగు. దివటీ, కరదీపము.
చేవ్రాలు. బ. సంతకము, హస్తాక్షరములు
చేష్ట. సం. వ్యాపారము.
చేష్టించు. సం. అ. క్రి. చేష్టలుచేయు.
చేష్టితము. సం. గతి; చేష్ట.
చేసన్న. సంజ్ఞ; అభినయము. [ములు.
చేసన్నగుఱుతులు బ. అభినయ హస్త
చేసన్నాయి. ఊఁదు వాద్యవిశేషము.
చేసాఁచు. అ. క్రి. బాహాటముగా చెప్పు.
చేసి. అవ్య. తృతీయావిభక్త్యర్థకము, చేత ననుట (వచ్చుటంజేసి యని). [అప్పుడే.
చేసేత. క్రి. ఒకరొకరి చేతిమీఁదుగా;

## చై

చైతన్యము. సం. తెలివి; ప్రాణము; చేతనభావము; (ప్రధానవాది మతమున) ప్రకృతి; చేతనము, మహదాదిస్తంబపర్యంతమైన సమస్తప్రపంచమునకు అధిష్ఠానముగానుండెడి ప్రకాశము, పరబ్రహ్మము
చైత్యము. సం. కట్టడము; గుడి; యజ్ఞశాల; బౌద్ధుల మఠము; జైనుల సభ; బౌద్ధాలయము; సొద; రచ్చమ్రాను; జనులు విశ్రమించెడి చోటు; బుద్ధ విగ్రహము.
చైత్రము. సం. గుడి; గోరీ; చైత్రమాసము

చైత్రరథము. సం. కుబేరుని ఉద్యానము.
చైత్రసఖుఁడు. సం. మన్మథుఁడు.
చైత్రసారథి. సం. మన్మథుఁడు.
చైత్రి. చైత్రమాసపూర్ణిమ; చైత్రమాసము.
చైత్రికము. సం. చైత్రమాసము.
చైదము. రూ. చెయిదము.
చైది. రూ. చెయిది.
చైవులు. బ. చెయివు.

## చో

చోక్షము. సం. విణ. తీక్ష్ణము; పరిశుద్ధము; మనోజ్ఞము; సమర్థము.
చోచము. సం. కొబ్బరిబొండము; లవంగపుపట్ట; భుజించి విడిచిన యన్నము మొ.
చోదకుఁడు. సం. విణ. త్రోలువాఁడు; ప్రేరేపించువాఁడు.
చోదనము. సం. త్రోలుట; ప్రేరేపించుట.
చోదము. సం. లవంగపుపట్ట.
చోద్యము. సం. వింత, అద్భుతము; ప్రశ్నము, పూర్వపక్షము. విణ. త్రోలఁదగినది; ప్రేరేపింపఁదగినది; ఆక్షేపింపఁదగినది.
చోరపుష్పి. సం. కట్లతీఁగ; పద్మపుతీఁగ.
చోరము. సం. గంధద్రవ్యవిశేషము.
చోరితము. సం. విణ. దొంగిలింపఁబడినది
చోరీ. హిం. దొంగతనము.
చోరుఁడు. సం. దొంగ.
చోలము. సం. కుప్పసము; చొక్కా; అవిక.
చోవుదారు. హిం. వెండిబెత్తపువాఁడు.
చోషము. సం. పీల్చుట.
చోష్యము. సం. పులుసు. విణ. పీల్చఁదగినది.
చోళదేశము. సం. 56 దేశములలో ఒకటి.

## చౌ

చౌరము. సం. చోరపుష్పి†.
చౌరిక. సం. దొంగతనము.
చౌరుఁడు. సం. దొంగ.
చౌర్యము. సం. దొంగతనము.
చౌలము. సం. ఒకసంస్కారము, పుట్టువెండ్రుకలుదీయుట, చూడాకర్మము.

## చ్యు

చ్యుతము. సం. విణ. జాఱినది; కాఱినది
చ్యుతి. సం. జాఱుట; కాఱుట.



## చే

చేంక. బాహుమూలము, కక్షము.
చేంకతాళి. చేంకనుదగిలించుకొనుమాట.
చేంకిలి. చేంక.
చేంగలించు. అ. క్రి. చలించు.
చేంగు. దాఁటుటయందగు అనుకరణము.
చేంగున. ద్ర. అవ్య. గొబ్బున.
చేంచేఁతము. అడుజా.
చేంటిపాప. స్తనంధయి, లేక స్తనంధయుఁడు. స్తన్యపానము చేసెడు బిడ్డ.
చేంటిపాపఁడు. స్తనపుఁడు.
చేంటిపిల్ల. స్తనప.
చేంటివాఁడు. స్తనంధయుఁడు, పాలుగుడిచెడి శిశువు.
చేండ. చండి, పార్వతి. విణ. మూర్ఖపుఁబట్టుగలవాఁడు; క్రూరుఁడు; తీరనికోపముగల యాఁడుది.
చేండితనము. సోమరితనము; మొండితనము
చేండిపోతు. విణ. మూర్ఖపుఁ బట్టుగల స్వభావముగలవాఁడు.
చేండ్ర. ఖదిరము†.
చేండ్లు. ఎద పుట్టువులు. [కము.
చేందమామ. చంద్రుఁడు; శ్రేష్ఠ వాచకము.
చేందమామ గ్రుక్కిళ్లు. బ. అథరామృతము. రూ. చందమామ గుటకలు.
చేందమామపక్కె. మత్స్య విశేషము.
చేందమామ పులుఁగు. చకోరము.
చేందము. ఛందస్సు; విధము.
చేందరిక. వెన్నెల, చంద్రిక ?
చేందా. కానుక, ఉపహారము.

చెందిరిక. వెన్నెల, చంద్రిక.
చెందిరుఁడు. చంద్రుఁడు. ?
చెందు. చంద్రుఁడు; అందము; నెల. విణ. అందమైనది; యోగ్యమైనది.
చెందుగు. వృక్షవిశేషము; చందుగుపెట్టె
చెందుకాపెట్టె } సొమ్ములు మొదలగువాని
చెందుగుపెట్టె } నుంచుకొనెడుచిన్నపెట్టె
చెందునయి. సముద్రుఁడు.
చెందురకావి. సిందూరవర్ణము. [వత్తి.
చెందురజోతి. బాణపు సంచువగ, పగలు
చెందురపూవు. కసుంభ పుష్పము.
చెందురమామ. చంద్రుఁడు.
చెందురము. సిందూరము, కుంకుమ.
చెందురా. చంద్రకాంతము.
చెందురుఁడు. చంద్రుఁడు.
చెందురుకావి. చందురకావి.
చెందురుకావి పుట్టము. అరుణ వస్త్రము.
చెందురుకూనలు. బ. గోటినాటులు.
చెందురుజోతులు. బ. ప్రకాశించెడి బాణ సంచు, ఒకవిధమైన బాణసంచు.
చెందురు వంక. స్త్రీలు ధరించెడి ఒక భూషణము. బ. నఖక్షతములు.
చెందువ(వా). మేలుకట్టు, ఉల్లడ.
చెందువాచేఁప. ఒక చేఁప.
చెంద్రకావి. సిందూరవర్ణము.
చెంద్రము. సిందూరము.
చంపు. ప్రే. చావఁజేయు. స. క్రి. వధించు
చెంపుడు హింస, మారణము.
చెంపుడుగట్టు. వధస్థానము.
చెకచెక. పర్వుటయందును పాఱుటయందును అగుననుకరణము. [బుజావు.
చెక్క. సౌందర్యము. విణ సుందరము;
చెక్కఁగా. ద్ర. అవ్య. తిన్నగా.
చెక్కఁజేయు. స. క్రి. సవరించు; పాడు చేయు; ముగించు. [భావము
చెక్కఁదనము. సౌందర్యము; బుజా
చెక్కఁబడు. అ. క్రి. సరిపడు.
చెక్కఁబెట్టు. స. క్రి. సరచేయు, సవరించు నాశము చేయు.
చెక్కటి. కార్యము; దిక్కు; వైపు; భాగము; స్థానము; ఆర్జవము; న్యాయము. విణ. సరి.
చెక్కట్టు. చక్కటి.
చెక్కడఁగు. అ. క్రి. చచ్చు.
చెక్కడుచు. స. క్రి. ఖండించు; చంపు.
చెక్కన. అందము, సౌందర్యము, మంజులము; సరి.
చెక్కనయ్య. మన్మథుఁడు; అందగాఁడు.
చెక్కని. విణ. అందమైన, సుందరమైన; సరియైన.
చెక్కరవరితి. చక్రవర్తి.
చెక్కా. అవ్య. ఊరక.
చెక్కాట. హింస.
చెక్కాడు. స. క్రి. ఖండించు; చంపు.
చెక్కి. వాద్యవిశేషము; సమీపము; పార్శ్వము; భాగము; స్థలము.
చెక్కియ. పార్శ్వము.
చెక్కిలము. శష్కులి, భక్ష్యవిశేషము.
చెక్కిలి. చంక.
చెక్కిలిగింత. అన్యకర స్పర్శము చేతఁ గలిగెడు చంక మొదలైన అంగముల సంకోచము; సంతోషకరము. [యగు.
చెక్కిలిగింతలువోవు. అ. క్రి. చక్కిలిగింత
చెక్కిలిగిలి. చక్కిలిగింత. [మంచము.?
చెక్కీ. పల్లకిలోని అడుగుచట్టము; చిన్న
చెక్కీపంచదార. గడ్డగానుండెడి తెల్లని పంచదార.
చెక్కు. శల్కము, ముక్క; ఆఱు.
చెక్కుచేయు. స. క్రి. ఖండించు.
చెక్కుపగడ. ఆఱునొకటి, ఏడు.
చెక్కెర. శర్కర, పంచదార; కలకండ.
చెక్కెరకేళి. శర్కరాకదళి, ఒక అఁటి†
చెక్కెరతిండి. చిలుక.
చెక్కెరతిండిపులుఁగు. చక్కెరతిండి.
చెక్కెరబుగడ. భక్ష్యవిశేషము.

చెక్కెరవింటివాఁడు } ఇక్షుధన్వుఁడు,
చెక్కెరవిలుకాఁడు } మన్మథుఁడు. రూ. చక్కెరవిల్తుఁడు.

చెగడు } చవుడు.
చెగ్గుడు }

చెచ్ఛ్వుకము. విణ. సరియైన చౌకము. రూ. చచ్చౌకము. [నొందు.

చెచ్చు. అ. క్రి. కాలముచేయు, మృతి

చెచ్చుడి. చండాలజాతిభేదము. [భేదము.

చెచ్చుడివాండ్లు. బ. పాకివాండ్లలో

చెచ్చుడు. విణ. చచ్చినది.

చెటాలు } వ్రేయుటయందగు ధ్వన్యనుకరణము.
చెటిల్లు }

చెటులువడు. అ. క్రి. మొక్కవోవు.

చెట్ట. కొంచెము ధాన్యముపోసిన చిన్న గోనె; తొడను వెలుపలి భాగము; కవచము; చెట్టుపట్టు; చొక్కాయ, అంగరేకు; పూఁత.

చెట్టన. అవ్య. ద్ర. క్రి. విణ. శీఘ్రముగ.

చట్టపుమెకము. ఒత్తెడుపిల్లి.

చెట్టము, పునుఁగుచట్టము; న్యాయశాస్త్రము; మంచము మొదలగువానిపట్టెల చేరిక; పిండివంటలు ఎత్తి తీసెడిచిల్లులు గల యినుపగరిఁటె.

చెట్టలుచీరు. స. క్రి. చంపు.

చెట్టలవాపు స. క్రి. నాశముచేయు.

చెట్టి. అటిక, వెడల్పునోరుగల చిన్న మట్టిపాత్రము. [త్రుఁడు, శిష్యుఁడు.

చెట్టు. చాప ఱాయి; రాయి; కొండ; ఛా

చెట్టుప. ఱెక్క, పక్షము.

చెట్టుపురుగు. సర్పము.

చెట్టువ. దారుహస్తము.

చెట్టువము. గరిఁటె; త్రెడ్డు; చట్టువ.

చెట్రాయి. చోఁపరాయి, విశాలమైన నల్ల ఱాయి.

చెడికి. మల్లబంధవిశేషము.

చెతికిలఁబడు. అ. క్రి. కూలఁబడు.

చెతికిలు అ. క్రి. పిఱ్ఱలు నేలగాను.

చెతుకుపడు. అ. క్రి. కూలఁబడు.

చెత్త. ఱెత్త.

చెత్తరి. ఱెత్త.

చెదను. సమభూమి. [రాను.

చెదర. కూర్చుండెడి తడిక; చిన్నవిస్త

చెదరంగపుపలక. అష్టాపదము.

చెదరంగము. ఒకానొక యాట.

చెదరము. చతురశ్రము, సమమైన నాలుగు మూలలుంగలది. విణ. సమానమైనది; కొఱంతలేనిది. బ. ఇంటి కురుఁజోలమీఁది బిగువుపట్టెలు.

చెదరు. అశ్రద్ధ; రాజాదిసభ.

చెదలతేజి ఉచ్చైఃశ్రవము.

చెదలము. సైన్యము; దండువిడిసినచోటు

చెదలయేనుఁగు. ఐరావతము.

చెదలు. ఆకాశము; స్వర్గము. [దేవతలు.

చెదలుకాఁపు. వేలుపు. బ. దివిషదులు,

చెదలుకెంపురాయి. సూర్యకాంత శిల.

చెదలుతొడుకు. కామధేనువు.

చెదలుమానికము. ద్యుమణి, సూర్యుఁడు.

చెదలేఱు. వియద్గంగ, ఆకాశగంగ.

చెదికిలఁబడు. చతికిలఁబడు.

చెదికిలు. అ. క్రి. రూ, చతికిలు.

చెదియ. నలఁగుడు.

చెదియు అ. క్రి. నలఁగు.

చెదిరిక. కూర్చుండెడి తడిక.

చెదివించు. ప్రే. చదువఁజేయు; వివాహాదులయందు బంధువులు మొదలగువారు ఉపహారముగానిచ్చెడు వస్త్రాదికమును తమ పేరును పుచ్చుకొనువారి పేరును లోనుగా పురోహితునిచే చెప్పించు.

చెదుకము. చతుష్పథము, నాలుగుమార్గములు కలయుదారి.

చెదుకు. బురద, పంకము. [(నేల)

చెదును. సమప్రదేశము. విణ. సమము.

చెదుపు. ప్రే. చదియఁజేయు; చావఁజేయు స. క్రి. కొట్టు; చంపు.

చెదుము. స. క్రి. గ్రుద్దు; చంపు.

చేదుర. విణ. చతుర, సమర్థురాలు.
చదురంగపుసారెలు. బ. చతురంగపు కాయలు.?
చేదురంగము. చతురంగక్రీడ.?
చేదురడుచు. అ. క్రి. పరిహాసమాడు.
చేదరాలు. సమర్థురాలు.
చేదురు. సభ; వివాహోదుత్సవములయందు జరిగించు ఆటకచ్చేరి; నేర్పు; చతురోక్తి
చేదురుఁడు. విణ. చతురుఁడు.
చేదువరి. విణ విద్యావంతుఁడు.
చేదువు. బ్రహ్మాయజ్ఞము; పఠనము; విద్య. స. క్రి. పఠించు.
చేదువులదేవర. బ్రహ్మదేవుఁడు.
చేదువులపడఁతి. సరస్వతి.
చేదువులపులుఁగు. చిలుక.
చేదువులబడి. పాఠశాల.
చేదువులముదుకఁడు. బ్రహ్మ.
చేదువులయ్య. ఉపాధ్యాయుఁడు; విద్వాంసుఁడు.
చేదువులవెలఁది. సరస్వతి.
చేదువులు. బ. వేదములు.
చేదువులవేలుపు, చేదువువేలుపు } బ్రహ్మదేవుఁడు.
చేద్ది. చలిది, పర్యుషితాన్నము.
చేనవరి. విణ. చనవుగలవాఁడు, ఆప్తుఁడు
చేనవు. అధికారము; అనురాగము; కోరిక కాంక్ష; చెల్లుబడి.
చేనవురాలు. విణ. చేనవుగలది.
చేను. చన్ను. అ. క్రి. మరణించు; వెళ్ళు; చెల్లు; తగు, యుక్తముగు; కడచు. స.క్రి. పొందు.
చేనుఁగవ్వ. అవిక.
చేనుఁగొనలు బ. చూచుకములు.
చేనుఁబాల. ఓషధీవిశేషము.
చేనుకట్టు. ఆవిక; పొడుగు
చేనుట. యాత్ర.
చేనుదెంచు. అ. క్రి. వచ్చు; పోవు.
చేనుదేర. క్రి. రాఁగా.
చేనుదేరుట. యాత్ర.
చేనుప. మార్గము; బాటసారులగుంపు.
చేనుపకగంధి. మి. చంపకగంధియగు స్త్రీ.
చేనుపకము. చంపకము, సంపెఁగ.
చేనుమఱి. చను మొన చుట్టుగల నల్లని చోటు; వక్షము.
చేనుమఱువు. అవిక.
చేనుముక్కులు, చేనుమొనలు, చేనుమోములు } బ. కుచాగ్రములు. చూచుకములు.
చేనులు బ ఎదపుట్టువులు.
చేనువాఁడు. విణ చెల్లుబడిగలవాఁడు.
చేనువు ప్రేమము, అతిప్రీతి.
చేన్కట్టు. అవిక.
చేన్దోయి. చన్నుదోయి.
చేన్నీళ్ళు. బ శీతోదకము.
చేన్ను. వక్షోజము, స్తనము; మొంగలి యూడ; తాటిచుండు (చన్నులు).
చేన్నుఁగవ్వ. అవిక.
చేన్నుదోయి. స్త్రీ స్తనద్వంద్వము.
చేన్నులు. బ. ఎదపుట్టువులు.
చేన్నె. తగునా. రూ. చన్నే.
చేపారము. కాయమాన విశేషము.
చేప్డు. రూ. చప్పుడు. [చట్ట.
చెప్ప. విణ. రసహీనము; భుజము; ముద్ర
చెప్పఁదనము అలవణత; రసాభావము.
చెప్పట. చపేటము, చఱపు; చక్కఁగా చాఁచిన వ్రేళ్లతోఁగూడిన యఱచేయి.
చెప్పటించు. స. క్రి. చఱచు.
చెప్పట్లు. బ. కరతాళములు.
చెప్పన. చప్పఁదనము.
చెప్పనిది. విణ. అలవణము; రసహీనము.
చెప్పరమంచము. చెప్పరకోళ్ళ మంచము.
చెప్పరము మీఁద పందిరివలె నేర్పఱచిన నలుచదరపు వ్రానిచట్టము; చౌకము తీర్చి వేసిన పందిరి; కరాళము; గుడారము; ఛందిరి. [చవిచూచు.
చెప్పరించు. స. క్రి. నాలుక పైనిడుకొని

చేప్పరించుమెకము. పంది.
చేప్పరింత. పంది; చప్పరించుట.
చేప్పి. విణ. లోపలికి అణఁగినది.
చేప్పిడి. విణ. చప్పనిది, అలవణము.
చేప్పుడించు. అ.క్రి. చప్పుడుచేయు.
చేప్పుడు. అచేతనవస్తువులు ఒకటితో నొకటి తాఁకుటచేఁగలుగు ధ్వని, శబ్దము. రూ. చప్పు.
చేప్రము. రూ. చప్పరము.
చేబుకు. హిం. చేఁబుకోల, కశ.
చేబుకుసేయు. స. క్రి. చబుకుతో కొట్టు.
చేమరు. స. క్రి. అఱచేతకొట్టు; చంపు.
చేమురు. నెయ్యి నూనె మొ. స. క్రి. రాచు; లేపనముచేయు [ఒప్పగ.?
చేయ్యన. ద్ర. క్రి. విణ. శీఘ్రముగ;
చేరచేర. ధ్వన్యనుకరణము.
చేరలాట. క్రీడ
చేరలాటమాడు. అ. క్రి. క్రీడించు.
చేరలాటము. క్రీడ.
చరలాడు. అ. క్రి. క్రీడించు.
చేరికుండ. సాలెవాని గంజికుండ.
చేరుక. పశురోగవిశేషము.
చేరుగుడు. ఈడిక, ఒక బండి. [రాచు.
చేరుము. స. క్రి. వాద్యమును చేఱచు
చేర్లాట. క్రీడ.
చేర్లాటమాడు. అ. క్రి. క్రీడించు.
చేర్లాటము. క్రీడ
చేఱచు. స. క్రి. అఱచేతకొట్టు, ఆస్ఫాలనముచేయు; అడఁచు; అఱచేతతట్టు; కొట్టు; ఆక్రమించు; తుడుచు, తడిపోవనొత్తు.
చేఱపు. ఆస్ఫాలనము; ఆచ్ఛాదనము.
చేఱపుఁబిడక. గోడనుతట్టిన పిడక.
చేఱి } తటము, ఉన్నతమైన పర్వతశిఖరము క్రింది చోటు.
చేఱియ }
చేఱుపు ఆస్ఫాలము, చఱపు.?
చేలచేలన. ద్రవరూపము.
చేలది. ప్రచ్ఛర్ది, డోఁకు.
చేలపకారము. మాత్సర్యము.
చేలపకారి. విణ. మాత్సర్యశీలుఁడు.
చేలపట్టు. అ. క్రి మాత్సర్యముగొను.
చేలపాది. విణ. మాత్సర్యశీలుఁడు.
చేలపాడుచు. అ. క్రి. మాత్సర్యముగొను.
చేలపోరు. అ. క్రి. చేలముపట్టి పోరాడు.
చేలమరి. విణ. మాత్సర్యశీలుఁడు.
చేలము. మాత్సర్యము.
చేలముకొను. అ. క్రి. చేలపట్టు.
చేలవ. చల్లదనము.?
చేలవాది. చావుసమాచారము చెప్పువాఁడు
చేలాడము. చల్లదము.
చేలి. శీతము; శీతబాధ.
చేలికాఁపు. కప్ప.
చేలికారు. శిశిరఋతువు.
చేలికి. మల్లబంధ విశేషము.
చేలికొండ } శీతనగము, హిమవత్పర్వతము.
చేలిగట్టు }
చేలిగరువు. మీఁద ఇసుకగల జాతిపారునేల; పైనియిసుక లోపల రాగిడి గలనేల
చేలిగాలి. శీతవాయువు.
చేలిగొండ. చలికొండ.
చేలిచీమ. పిపీలికా భేదము.
చేలితఱి. శిశిరఋతువు.
చేలిదాయ. సూర్యుడు, ఉష్ణరశ్మి.
చేలిది. చద్ది, పర్యుషితాన్నము.
చేలిదిమూట. చిట్టామునము.
చేలినట్టు. గాలి, వాయువు.
చేలినెల. మాఘమాసము; పాల్గునమాసము
చేలిపందిరి(లి). దాహమునకు నీళ్లుపోసెడుచోటు, పానీయశాల.
చేలిపని. శైత్యోపచారము.
చేలిపిడుగు. కొన్ని దేశములయందు కాలవిశేషమున ఆకాశమునందుండి పడెడు చెడగఱపు మంచుగడ్డ.
చేలిమల. హిమాద్రి. [పిండి.
చేలిమిడి. కూరాకుదినుసు; బెల్లముకలిపిన

చేలిమిడియుండలు. బ. చేలిమిడిముద్దలు.
చేలిమిపందిలి. చలిపందిరి.
చేలిమిరి. శీతము, చలువ. విణ. చల్లనిది.
చేలిమిరిమల. హిమవత్పర్వతము.
చేలియిక్క. వాయువు.
చేలియిసుక. కర్పూరము.
చేలివాపు. స. క్రి. బుజ్జగించు.
చేలివాలు. ఆనవాలు, చిహ్నము.
చేలివిందల. చలిపందిరి.
చేలివిడి. చలిమిడి.
చేలివెలుఁగు } చంద్రుఁడు, శీతకరుఁడు.
చేలివెల్గు
చేలువ. చోఁపటాయి; టాయి.
చేలుపు. క్రి. చేయు, ఒనరించు; కడపు.
చేలువ. శీతము; జాడ్యమువలని శైత్యము; ధౌతవస్త్రము. బ. శైత్యోపచారము.
చేలువగట్టు. హిమాద్రి.
చేలువగుజ్జము. గాడిద. [కించియుదకు.
చేలువచేయు. స. క్రి. చేవుటినీళ్లలో నుడి
చేలువజోతి. చంద్రుఁడు, హిమాంశువు.
చేలువడి. శైత్యము, శీతము.
చేలువబట్ట. ధౌత వస్త్రము.
చేలువమిరియము. తోఁకమిరియము.
చేలువఱాయి. చంద్రకాంతము.
చేలువఱేఁడు. చంద్రుఁడు.
చేలువలమల. హిమగిరి.
చేలువలఱేఁడు చంద్రుఁడు.
చేలువలు. బ. చలిపని.
చేల్ది. చల్దిది, చద్ది.
చేల్మిరి. శైత్యము.
చేల్ల. మజ్జిగ, తక్రము. విణ. శీతము.
చేల్లకడి. మెంతిమజ్జిగ.
చేల్లకము. చేల్లటి.
చేల్లగడ్డ. శతమూలి†. [క్షేమముగా.
చేల్లఁగా. క్రి. శీతమానట్టుగా; మెల్లగా;
చేల్లగాలి. మలయమారుతము.
చేల్లచేరు. చల్లలోపిండివేసి కాఁచిన చేరు.
చేల్లచేవ్వాడు. విణ. జడుఁడు.
చేల్లజెంపు. విణ. భయంకరుఁడు.
చేల్లడము. సగముతొడలవఱకుఁ దొడిగి కొనెడు గుడిగి (లాగు), చండాతకము.
చేల్లఁదనము. శైత్యము. [శీతము.
చేల్లన. శైత్యము; క్షేమము; మెల్లన. విణ.
చేల్లనితెలిదిబ్బ. హిమాద్రి.
చేల్లనిది. విణ. శీతము.
చేల్లపందిలి. చలిపందిరి.
చేల్లపడు. అ. క్రి. చల్లనగు.
చేల్లపిట్ట; పక్షివిశేషము.
చల్లరాఁడు. తరిగంబము, కుటురము.
చేల్లవడియము. వటకవిశేషము.
చేల్లసేయు. స. క్రి. చల్లపఱచు.
చేల్లాడము. అర్ధోరుకము, చేల్లడము.
చేల్లాణము. వక్రశస్త్రము.
చేల్లారు. అ. క్రి. ఉపశమిల్లు.
చేల్లు. స. క్రి. ప్రోక్షించు, (నీళ్లు) చేల్లు; విత్తులుచల్లు.
చేల్లుపోరాట. జలక్రీడ.
చేల్లుపోరు. కొలఁకులయందుదిగి యొకరిమీఁదనొకరు నీళ్లు చల్లుకొనెడియాట.
చేల్లులాడు. అ. క్రి. చేల్లుపోరొనర్చు.
చేల్వ. రూ. చలువ.
చేల్వాలు. బ. చలిపని.
చేవటినేల ఊషరపృథివి. ?
చేవడు. ఊషరము. ?[పావులో సగము.?
చేవలము. వరహాలో ఎనిమిదవ భాగము;
చేవి. రుచి; గసము; అమృతము; ఘోటీగర్భము; మాక్తికాదిభారము.
చేవిక. } చతుష్కము, చతుస్సమము
చేవికము. } గానుండి నాలుగు వైపుల
చేవికె. } తెఱపిగలయిల్లు, మండపము.
చేవిగొను. స. క్రి. రుచిచూచు.
చేవిరె. చవిక.
చేవిలివాఁడు. గర్భిణీహస్తగత శిశువు.

చెవిలె. నాలుగు డబ్బులు.
చెవిలెవాఁడు. చవిలివాఁడు.
చెవు. అడ్డ, నాలుగు.
చెవుక. వెలతక్కువ; తక్కువ.
చెవుకటు(ట్టు)లు.బ. నాలుగుముత్యములు చేర్చికట్టిన పోగులు.
చెవుకము. చదరము; నిడుపు వెడల్పు సరిగాఁగల తుండుగుడ్డ; అశ్వగతివిశేషము. స. నాలుగు, చతుష్కము.
చెవుకసేయు. స. క్రి. తక్కువపఱచు.
చెవుకళి. ఆఁడువారికోకలనేతయందునూలిపోగులచేత నేర్పడిన చచ్చౌకపుటిల్లు.
చెవుకళించు. అ. క్రి. నాలుగుకాళ్లు పైకెత్తి దాఁటు. [గతివిశేషము
చెవుకళింత. చౌకళించుట; వల్గితము, అశ్వ
చెవుకాఁడిగుదియ. నాలుగుప్రక్కల తీరిన యినుప దండము.
చెవుకారము. కారము, సబ్బు. [గలపీఁట.
చెవుకాలిపీఁట. నాలుగుకాళ్లు ఎత్తుగాఁ
చెవుకి. సుంకరి మెట్టు.
చెవుకు. పంకము; కళ.
చెవుగంటి. శరభమృగము; అగ్ని దేవుఁడు.
చెవుటినేల. ఉప్పన.
చెవుటుప్పు. రొమకము.
చెవుడు. ఉప్పన; కారపుమన్ను.
చెవుడోలు. అంబారి.
చెవుతా. ఉయాల.
చెవుతి. చతుర్థి, పక్షమందు నాలవతిథి.
చెవుతు. వస్త్రమునట భేదము.
చెవుదంతి. ఇంద్ర దిగ్గజము.
చెవుదంతియెకిమీఁడు. ఇంద్రుఁడు.
చెవుదరి. శూద్రుఁడు.
చెవుపదము. నాలుగుమూలలు.
చెవుపుటము. నాలుగుకాళ్లుపైకెత్తి దాఁటెడిదాఁటు.
చెవురు. చవి; తీపితోకలిసినయించుకఉప్పు
చెవులు. బ. ముత్తెపుకాంతి; ముత్యములు తూనికయొత్తులు.?

చెవుషష్టి. వి. స. చతుష్షష్టి, అఱువది నాలుగు.
చెవుసాల. కొలారము.
చెవుసీతి. స. ఎనుబదినాలుగు, చతురశీతి.
చెవ్వ. విణ. రూ. చప్ప.
చెవ్వంచ. స. అయిదు.

## చే

చేంగణ. మల్లబంధవిశేషము.
చేంగుబళీ. అవ్య. ప్రశంసార్థకము.
చేఁగ. చాఁగదుబ్బు, మోరటు†.
చేఁగఱ. నాశము.
చేఁగఱగొట్టు. స. క్రి. చంపు.
చేఁగఱగొను. స. క్రి. కొట్టు; ఖండించు.
చేఁగఱలాట. హింస.
చేఁగఱలాడు. స క్రి. నాశముచేయు.
చేఁగిలింత. నమస్కృతి.
చేఁగిలు(ల్లు). అ. క్రి నేలకువ్రాలు.
చేఁగు. అ. క్రి. దీర్ఘమగు; అవనతమగు; దండాకారముగ నేలకువ్రాలు అవ్య. ప్రశంసార్థకము.
చేఁగురె (రే). అవ్య. ప్రశంసార్థకము.
చేఁచు. ప్రే. చాఁగఁజేయు, పొడుగుచేయు, ప్రసరింపఁజేయు, విస్తరింపఁజేయు
చేఁచేలు. బ. ఎడపుట్టువులు; చూచుకములు.
చేఁదు. బొట్టుపెట్టుకొనుటకు పూయు నల్లనిద్రవద్రవ్యవిశేషము; కాలునపుడు కాష్ఠమునందు ద్రవించెడు ద్రవము; కాటుక. స. క్రి. చమురు, రాచు.
చేఁప. కటము, క్రిందఁబఱచు కొనెడుచాఁప; తెరచాఁప; ఊఁత; ఒకదినుసువల.
చేఁపకట్టు. చాఁపపఱపువంటి పఱపు.
చేఁపకట్టువడు. అ. క్రి. చేఁపపఱచినట్టగు
చేఁపగద్ద. కుందేళ్లను బట్టెడియొకదినుసు డేగ. [పిండివంట.
చేఁపట్టు. అప్పడమువంటి యొకదినుసు
చేఁపఱాయి. ఫలకాకారమైన సానువు.
చేఁపలు. బ. చిక్కులు.?

చాఁపు. చాఁచుట; పడుగుకొలఁదివస్త్రము; అధోంశుకద్వయము. క్రి. చాఁచు.
చాకట్టు. ధనము.
చాకల. రజకజాతి.
చాకలత / చాకలది } రజకి, రజకస్త్రీ.
చాకలపిట్ట. భరద్వాజము, ఏట్రింత.
చాకలవాఁడు / చాకలి } రజకుఁడు; వస్త్రక్షాళనోపజీవి; తంతువాయు స్త్రీ స్వర్ణకారజాతుఁడు.
చాకి. చాకలి.
చాకిత. రజకి, చాకలది.
చాకిబాన. బాలక్రీడావిశేషము; పక్షివిశేషము.
చాకిమూట. బాలక్రీడావిశేషము.
చాకిరి. పరిచర్య.
చాకీ. కంచము.
చాకెత. చాకలది.
చాగకాఁడు. కుబేరుఁడు. విణ. దాత, త్యాగశీలుఁడు.
చాగము. త్యాగము, ఈగి.
చాగరతనము. చింతామణి
చాగరాడి / చాగర(లా)డివెలికి } గాడిదగడపర†.
చాగవాఁడు. కుబేరుఁడు.
చాగి. విణ. త్యాగి, త్యాగశీలుఁడు.
చాగు. అ. క్రి. పోవు; ప్రద్దిల్లు; యత్నించు.
చాగుబడిక. పూజ, అర్చన.
చాచి. స్తనము.
చాచివేత. ఆలస్యము.
చాచే. గంధద్రవ్యము.
చాటడుగుమెయిన. మల్లయుద్ధములో గట్టుమెయిన
చాటించు. స. క్రి. తుడుముమొదలగునవి వ్రేయించి ఊరివారికందఱికి విషయమును తెలుపు.
చాటింపు. చాటించుట, ఘోషణ.
చాటు. మఱుఁగు, వ్యవధానము. స. క్రి. చాటించు, ఎఱుకచేయు, విశదపఱచు.
చాటుపడు. అ. క్రి. మఱుఁగుపడు, తిరోహితమగు.
చాటుబోటులబావ. చంద్రుఁడు.
చాటువ. చాటించుట; ఉదాహరణము.
చాడి (డీ). కొండెము, నేరములుచెప్పుట, పైశునము.
చాడీకోరు / చాడీగొట్టు } కర్ణేజపుఁడు, పిశునుఁడు, కొండెకాఁడు.
చాడుపు / చాడ్పు } విధము.
చాతనివాఁడు / చాతాని } శిఖాయజ్ఞోపవీతములం ధరింపనివైష్ణవుఁడు, సాతాని. బ. కులమక్కఱలేని వైష్ణవులం ?
చాతు. స. క్రి. ధరించు.
చాన. ఇంతి, స్త్రీ
చానకి (పి). కలయంపి.
చానరి. కుఱుచలు,
చాపరువు. చచ్చునంతటిపరుగు.
చామ. ఒక దినుసుపడవ; యువతి; స్త్రీ; నలుపు; సస్యవిశేషము. బ. శ్యామాకధాన్యము.
చామనచాయ. శ్యామలవర్ణము.
చామనము. నలుపు. విణ. నల్లనిది.
చాయ. ఛాయ, కాంతి; ఛాయాదేవి, సూర్యుని భార్య; నీడ; ప్రతిబింబము; వర్ణము; వైపు; జాడ; పోలిక; సమీపము; ఋజుభావము. బ. కత్తియొక్క కాంతులు.
చాయకొడుకు. ఛాయాపుత్రుఁడు, శని.
చాయచెక్కచెట్టు. చాయ వేయుటకు ఉపయుక్తమైన చెక్కగల ఒకానొక చెట్టు
చాయపట్టి. ఛాయకొడుకు.
చాయపెనిమిటి / చాయమగఁడు } సూర్యుడు, ఛాయాదేవీపతి.
చాయవారు. అ. క్రి. పోలు.
చారిక. తిలకవిశేషము.
చారు. సున్నముకలిసినకల్లు; చేరు, రసము. స. క్రి. పారకకట్టయడుగుతో నుఱిచిన కళ్ళమునూడ్చు, ఊడుచు.
చారె. చేర.
చాఱ. రేఖ; చారమీను; జీడిమామడి†; చాఁగ† వ్యాఘ్రపువర్ణము; బహువల్లము.?
చాఱకంద. మీఁదచాఱలుగల యొకదినుసు కంద, పిండాలువు†.
చాఱగలాడు. స. క్రి. చంపు.
చాఱపప్పు. జీడిమామిడిగింజలోని పప్పు; చాఱబియ్యము.
చాఱబియ్యము. చాఱపప్పు

**చాఱమీను.** మత్స్య విశేషము.

**చాఱమెకము.** } పులి, వ్యాఘ్రము,
**చాఱలమెకము.** } చిత్రకాయము.

**చాఱిక.** రేఖ; పత్తిరిబొట్టు; చాఱ, వ్యాఘ్ర వర్ణము.

**చాఱికె.** చాఱ, వ్యాఘ్రవర్ణము.

**చాఱు.** చేరు, రసము.

**చాల.** విస్తారము, బహుళము.

**చాలఁడు.** అనర్హుఁడు; సమర్థుఁడు కాఁడు.

**చాలమి.** అశక్తి

**చాలా.** చాల.

**చాలాసేపు.** ఆలస్యము.

**చాలించు.** ప్రే. పని నిలుపుదల చేయు; శక్తముగఁజేయు.

**చాలిక.** సామర్థ్యము.

**చాలు.** సీత, నాఁగటి మార్గము, దున్నునపుడు కఱ్ఱుచే నేర్పడిన రేఖ; ధార; పర్యాప్తి; వరుస, వృక్షాది పంక్తి. బ. చాళ్ళు. అ. క్రి. కావలసినంతయగు, పర్యాప్తమగు; ఓపు.

**చాలును.** అలమర్థము.

**చాలుపు.** వరుస.

**చాలుపేరింటి పూఁబోఁడి.** సీతాదేవి.

**చాలుబడి.** సామర్థ్యము.

**చాలుమానిసి.** శూరుఁడు; సమర్థుఁడు.

**చాలుమాసి.** విణ. పరాధీనుఁడు.

**చాలువాఁడు.** విణ. శక్తుఁడు; సమర్థుఁడు.

**చాలువాఱు.** అ. క్రి. వరుసతీరు; పుష్కలమగు.

**చాల్పడు.** వరుసగు, చుట్టువడు.

**చాల్పు.** వరుస.

**చాల్పుకుత్తుకలవాఁడు.** పంక్తికంఠుఁడు, [రావణుఁడు.

**చావఁజూచు.** స. క్రి. చంపు.

**చావడి.** కొలువుకూటము, సభ; సత్రము, చవికె, మండపము, శాల ?

**చావు.** మరణము.

**చాళియ.** మల్లబంధ విశేషము. రూ. చాళై.

# చు

**చుంగు.** అంచు, కచ్చ భేదము.

**చుంగుడు.** నిలువయగు చిల్లర ద్రవ్యము.

**చుంగులు.** బ. వస్త్రము కుచ్చెకొనలు.

**చుంచు.** కాక పక్షము, పిల్లజుట్టు; చుంచెలుక; నెమిలి జుట్టు; శిఖ.

**చుంచుకురులు.** కుంకటి.

**చుంచుమిద్దె.** గోపురమువలె పొడుగుగా కట్టిన కట్టడము.

**చుంచుఱాయి** మేడలమీఁద కప్పెడి ఱాతి పలకవంటి ఒక దినుసు ఱాయి.

**చుంచెలుక.** చుచుందరి.

**చుండి.** } అవ్య. నిశ్చయార్థక బహు
**చుండీ.** } వచనము.

**చుండు.** కంపెలుక; తలమీఁద ఉప్పు పూఁచినట్లు పూఁచెడు వ్యాధివిశేషము. అ. క్రి. ఉడుకు మొ॥ సెగచే శుష్కించు.

**చుండెలుక.** చుంచెలుక.

**చుంగ్రాళ్లు.** బాలక్రీడా విశేషము.

**చుంయి.** } నిప్పు నీళ్ళు చేరునప్పుడు
**చుఁయ్యి.** } కలుగు ధ్వన్యనుకరణము.

**చుఁడి.** } చూడుఁడి. అవ్య. నిశ్చయార్థక
**చుఁడీ.** } బహు వచనము.

**చుఁడు.** చూడుఁడు.

**చుక్క.** శుక్రుఁడు; నక్షత్రము; చుక్కకూర†; తిలక భేదము, చుక్కబొట్టు; బొట్టు, జలాదుల బిందువు.

**చుక్కకాఁడ.** ఆమ్ల వేతసము, మాగాణి పొలముల యందు మొలచెడి యొక దినుసు చెట్టు.

**చుక్కకార.** మత్స్య విశేషము.

**చుక్కకూర.** ఆమ్ల వేతసము, చుక్రశాకము †

**చుక్కచేరు.** లలాటిక, నుదుట వ్రేలాడ నుంచుకొనెడు భూషా విశేషము; చుక్కల చాలు.

**చుక్కనుదుటి పిట్ట.** గరుత్మంతుఁడు.

చుక్కపిల్ల. మత్స్య విశేషము.
చుక్కపిల్లి. మార్జాల విశేషము.
చుక్కబొట్టు. మండలాకార తిలక విశేషము. [ప్రతికూలము.
చుక్కయెదురు. విణ. ఎదురుచుక్క,
చుక్కలగమికాఁడు. చంద్రుడు, నక్షత్రేశుఁడు.
చుక్కలతెరువు. ఆకాశము, తారాపథము
చుక్కలదొర, చుక్కలరాజు } నక్షత్రేశుఁడు, చంద్రుఁడు రూ. చుక్కలరాయఁడు, చుక్కలఱేఁడు.
చుక్కలి. ఒకానొక చెట్టు.
చుక్కవాలు. చుక్కయెదురు.
చుక్కాని(ను). అరిత్రము, ఓడనడపు చుక్కాని.
చుచ్చు. మేఁక; సంతాపమునందుఁ గలిగెడు ధ్వన్యనుకరణవిశేషము.
చుచ్చుకొట్టు. అ. క్రి. సంతాపముచేత చుచ్చుఅను.
చుచ్చుఱుకు. విశా. మిక్కిలితీక్ష్ణము.
చుట్ట. గుండుగా చుట్టినచుట్ట; తలమీఁద నుంచుకొనెడు చుట్ట; పొగచుట్ట; మిత్రుఁడు.
చుట్టకుదురు. కుండలు కుదిరికగా నిలుచుటకై వానిక్రిందనుంచెడు వెంటిమొదలగువానిచుట్ట, ఆధారకుండము.
చుట్టచుట్టుకొనెడిదిట్ట. కుండలి, సర్పము.
చుట్టతనము. బంధుత్వము.
చుట్టపక్కములు. బ. బంధువులు.
చుట్టము. బంధువు; సంబంధి; మిత్రుఁడు; బంధుత్వము. [స్నేహము.
చుట్టఱికము. బంధుత్వము; సంబంధము;
చుట్టలు బంధువు.
చుట్టలుఁగు. చక్రాయుధము. రూ. చుట్టలుగు
చుట్టాలు. బ. బంధువులు.
చుట్టికొను. స. క్రి. పెనగొను.
చుట్టిరాఁ. పరివేష్టించి వచ్చుచుండఁగా.
చుట్టిల్లు. చుట్టును గుండ్రముగా గోడ పెట్టి నడుమనిట్రాడు నాఁటి దూలములు లేక కట్టినయిల్లు. [ష్టించు.
చుట్టివచ్చు స. క్రి. ప్రదక్షిణించు; పరివే
చుట్టు. చుట్టిరాఁజేయుట; అఁడు దానికాలిజుట్టనవ్రేలి యుంగరము అనామికాభరణము. ౨ స. క్రి. వేష్టనముచేయు; చుట్టగాఁజుట్టు; తిరిగిరాఁజేయు. విణ చక్కఁగాఁ గాక తిరిగితిరిగి పోఁదగినది (మార్గము); వలయాకారమయినది. క్రి. నాలుగుప్రక్కలను.
చుట్టుంగొల్లారు. చతుశ్శాలము.
చుట్టుఁగైదువజోదు. విష్ణువు, చక్రి. [నము.
చుట్టుఁగైదువు. చక్రాయుధము, సుదర్శ
చుట్టుఁగొండ. చక్రవాళాద్రి.
చుట్టుఁబట్టు. నలుప్రక్క. [చుట్టుఁబుల్గు.
చుట్టుఁబులుఁగు. చక్రవాకము. రూ.
చుట్టుకుదురు. చుట్టకుదురు.
చుట్టుకొను. స. క్రి. పరివేష్టించు.
చుట్టుకొల్లారము, చుట్టుకొల్లారు } కొల్లారము, చతుశ్శాలము.
చుట్టుగుల్ల, చుట్టుడుగుల్ల } వృత్తశంఖము, శంఖజాతి జలచర విశేషము.
చుట్టుదల. చుట్టుట. [చుట్టుమాలె౨
చుట్టుమాలియ. చుట్టుకొల్లారము. రూ.
చుట్టుముట్టు. స. క్రి. చుట్టుకొను.
చుట్టుపాఱు. స. క్రి. చుట్టుకొను, వేష్టించు రూ. చుట్టువాఱుకొను.
చుట్టువాలు. చక్రాయుధము.
చుట్టువాలుజోదు, చుట్టువాలుదారి } విష్ణువు, చక్రి.
చుట్టువు. గొడుగు.
చుట్టువేడెము. గుఱ్ఱముయొక్క మండలగతి
చునాయించు. స. క్రి. బట్టలు మడతపెట్టు
చుప్పన(నా)క, చుప్పనాతి } శూర్పణఖ.
చుబ్బనచూఱ. మిక్కిలి చూఱ.
చుమి. చూడుమి. అవ్య. నిశ్చయార్థకము. రూ. చుమీ.

చుము. చూడుము. [రూ. చుమ్మీ.
చుమ్మ. వేదన; చూడుమా; శోకము.
చుమ్మచుట్లు. బ. కడుపులోఁ గలుగు వేదన.
చుమ్మలుచుట్టు } అ. క్రి. వేదనపడు.
చుమ్మలువాఱు }
చుమ్మి } చుమీ. అవ్య. కాదన్నె.
చుమ్మీ }
చుమ్ము. చూడుము.
చుయ్యంకి. వాద్యవిశేషము, తాళము.
చుర } చిన్నకత్తి.
చురకత్తి }
చురచుర వోవు. అ. క్రి. మండు.
చురి } చురకత్తి, చిన్నకత్తి.
చురియ }
చుఱచుఱ. కాలుటయందగు ధ్వన్యనుకరణము [కాలం.
చుఱచుఱకాలు. అ. క్రి. తీవ్రముగా
చుఱుకరి విణ చొరవగలవాఁడు.
చుఱుకు. వాఁడి; వేఁడి; వేగము; చుఱుక్కు. విణ. వాఁడిగలది; వేఁడిగలది.
చుఱుక్కు. నాటుట నిప్పుసోఁకుట మొదలగువానియందగు అనుకరణము.
చుఱువుచ్చు స క్రి. దగ్ధముచేయు.
చుఱ్ఱు. కాలుట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము.
చుఱ్ఱుకొను. స. క్రి. కాల్చు.
చుఱ్ఱుచుఱ్ఱు. మిక్కిలి వేఁడిగా.
చులకన. లాఘవము. ?
చులకనిది. విణ. లఘువు. ?
చులుకపాటు. ఉలకన.? [సులభముగా.
చులుక. ద్ర. క్రి. విణ. లాఘవముగా;
చులుకఁజేయు. స. క్రి. లాఘవపఱచు.
చులుకన. లాఘవము; ఉలకన, సౌలభ్యము. విణ లఘువు; సులభము.
చులుకపాటు. చులకన.
చుల్క. ద్ర. క్రి. విణ. చులుక.
చుల్కన. చులుకన, ఉలకన.
చుల్కపాటు. చులుకన.
చుల్లి. చుల్లి. [గడ్డ.
చుల్లజెండు. మొటిమవంటి చిన్న నెత్తురు
చుల్లరము. కోడెవయసుగల పంది.
చుల్లి. మగగుఱి, శిశ్నము.
చువక } మెత్తని సన్నని నిడుపాటి చిన్న రెమ్మ, ఉపశాఖ.
చువ్వ }
చువ్వే. అవ్య. కాదన్నె; చూడుమీ. రూ. చువ్వే.

## చూ

చూ. అవ్య చూడుఁడు; చూడుము.
చూఁడి. పశుగర్భము.
చూఁడు. వాఁత. స. క్రి. కాల్చు.
చూఁడుఁగొడుపు. పశువులకు వాఁత వేసెడి యినుపకోల.
చూకురు. శోకము.
చూకురుపడు. అ. క్రి. శోకించు.
చూచాయ. జాడ; తేలిక, లాఘవము. [చు.
చూచు. స. క్రి. వీక్షించు. అ. క్రి. యత్నించు.
చూటిక్క. దృష్టి. [రుఁడు.
చూడగలవాఁడు. అందగాఁడు, సుందరుఁడు.
చూడమి. చూడకపోవుట
చూడికి } చూపు, కన్ను.
చూడిక్క }
చూపట్టు. అ. క్రి. గోచరమగు.
చూపరి. విణ చక్కనివాఁడు; చక్కనిది.
చూపఱు. బ. విణ. చూచువారు, ద్రష్టలు. రూ. చూపఱులు.
చూపించు. స. క్రి. అగపఱచు.
చూపు. చూచుట; దృష్టి. ప్రే. చూపించు
చూపుగుల్లము. విణ. పనికి ఉపయోగము కానివాఁడు. రూ. చూపుడు గుల్లము.
చూపుడుఁబూఁట. విణ. దృశ్యములు చూప నొప్పకొన్న పూఁటకాఁపు.
చూపుడు వ్రేలు. తర్జని.
చూపెట్టు. స. క్రి. కనుపెట్టు, ప్రతీక్షించు.

చూపోపమి. చూడసహింపమి.
చూపోపు అ. క్రి. చూడసహించు.
చూర / చూరకత్తి } చిన్నకత్తి, అసిపుత్రిక.
చూరణసలుకు. ఖడ్గయుద్ధములోని వ్రేటు భేదము.
చూరి. రూ. చురి. [యావు.
చూరియావు. ఒకవిధమైన వన్నెగల
చూరీ. రూ. చురి.
చూరు. ఇంటిపెణక (ఇంటిమీఁది కప్పు) చివర, వలీకము; పొడి, చూర్ణము. అ. క్రి. (పొగ) తగులు. [ఎత్తుగా వేసినకమ్మి.
చూరుకమ్మి. ముంజూరున పెండెకంటె
చూరుకుట్టు. ఇంటిమీఁద కప్పు వేయునప్పుడు పూరిపఱచి యీఁతమెల్లలు మొదలగు వానిని పెండెవలె మీఁదనుంచి కట్టుటకై నారతో కుట్టెడుకుట్టు.
చూరుకుట్టుదబ్బ. చూరుకుట్టునకు నారగ్రుచ్చెడు దబ్బనమువంటి కొయ్యదబ్బము.
చూరుపట్టె. చూరుకమ్మి.
చూరుమొగ్గ. చూరుకమ్మియందు వాసమునకు సరిగా మొగ్గవలె చేర్పఁబడినది.
చూరె(రే). చూడుఁడు.
చూరెలుక. ఒకదినుసు చిన్న యెలుక.
చూర్పు. ఇంటికప్పు క్రిందికప్పు.
చూఱ. కొల్ల; దోఁపుడు.
చూఱకాఁడు. చోరుఁడు, కొల్లపెట్టువాఁడు
చూఱకారుఁడు. మి. గ్రా. విణ. కొల్లపెట్టినవాఁడు, చోరుఁడు.
చూఱకొను. స. క్రి. కొల్లపెట్టు, అపహరించు
చూఱకోలు. అపహరించుట.
చూఱలాడు. స. క్రి. అపహరించు.
చూఱవోవు. అ. క్రి. కొల్లపోవు
చూఱాడు. స. క్రి. అపహరించు
చూలాలు. గర్భిణీస్త్రీ.
చూలి. బిడ్డ, అపత్యము. రూ. చూలీ.
చూలు. గర్భము; బిడ; గర్భస్థపిండము.
చూలుకొను / చూలునిలుచు / చూలువడు } అ. క్రి. చూలు గలది యగు, గర్భమగు.
చూవె. చూడుమీ. రూ. చూవే.

## చొ

చొంగ. లాల; పొగత్రాగు గొట్టము.
చొంగణ(ణి). మల్లబంధ విశేషము.
చొక. మంజులము, అందము.
చొకా. చొక్కా. విణ. స్వచ్ఛమయినది
చొకాటము. విణ. మిక్కిలిస్వచ్ఛము.
చొకాయ. చొక్కాయ.
చొకాయి. చొక్కాయి.
చొకారము. మిక్కిలిస్వచ్ఛత. విణ. మిక్కిలిస్వచ్ఛమైనది.
చొక్క. విణ. చొక్కముయొక్క సంక్షిప్త రూపము; స్వచ్ఛము.
చొక్కటము. విణ. అందము; స్వచ్ఛము.
చొక్కణి. శీతల†. [చ్ఛము.
చొక్కతరము. మి. విణ. మిక్కిలి స్వ
చొక్కము. అధికకాంతిగల రత్నము. విణ. అందము; స్వచ్ఛము.
చొక్కా. పురుషుఁడు తొడుగుకొనెడి కంచుకము, చొక్కాయ. విణ. చొక్కాటముయొక్క సంక్షిప్తరూపము; మిక్కిలి స్వచ్ఛమైనది.
చొక్కాకులు. బ. ఎండాకులు. [నది.
చొక్కాటము. విణ. మిక్కిలి స్వచ్ఛమై
చొక్కాయ / చొక్కాయి } చొక్కా, కంచుకము.
చొక్కారము. మిక్కిలి స్వచ్ఛత. విణ. మంజులము.
చొక్కిడు. స క్రి. మోసపుచ్చు.
చొక్కిలి. చొట్ట. విణ. చొట్టపడినది.
చొక్కిల్లువోవు. అ. క్రి. చొట్టపడు.
చొక్కు. పారవశ్యము; చొక్కుపొడి; మత్తు; మూర్ఛ; మోహము, యువయువతీసంభృతప్రేమ. విణ. ఎండినది. అ. క్రి. పరవశమగు, మత్తుగొను; చచ్చు.?

చొక్కునీరు. మద్యము, కల్లు.
చొక్కుపెట్టు. స. క్రి. చొక్కునట్లుచేయు
చొక్కుపొడి } మీఁదఁజల్లినచో పర
చొక్కుమందు } వశముగఁజేయు భస్మ విశేషము
చొగా. చొక్కా.
చొచ్చిలు (ల్లు). అ. క్రి. ప్రవేశించు.
చొచ్చు. అ. క్రి. ప్రవేశించు; ఆరభించు.
చొట చొట. కాఱుట వడియుట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము.
చొట్ట. చెంబు మొదలగునవి క్రిందఁబడుట మొదలగువానిచే అగు నొక్కు; దేహము నందు వ్యాధి మొదలగువానిచేతఁ గలిగిన పల్లము (వంకర). విణ. వ్యాధి మొదలగు వానిచేత వంకరైనది.
చొట్టకాలు. ఎండిపోయిన కాలు.
చొట్టు. అణఁగిన నొక్కు. [నుకరణము.
చొడ చొడ. చిప్పిల్లుటయందగు ధ్వన్య
చొత్తెంచు. అ. క్రి. ప్రవేశించు.
చొదుగు. చెమ్మ, ఆర్ద్రత.
చొదుము. ఎండిన అఁటి పట్ట.
చొనుపు. ప్రే. ఖచించు; చొప్పించు; బాణములు ప్రయోగించు
చొన్పు. ప్రే. రూ. చొనుపు.
చొప్ప. జొన్న మొదలగువాని దంటు.
చొప్పకాఁడి. రెండెడ్లను కట్టి తోలెడు దిండువంటి చొప్పమోపు.
చొప్పడు. అ.క్రి. సరిపడు; కలుగు;నొరకు
చొప్పరి. విణ. త్రోవ తెలిసినవాఁడు.
చొప్పరించు } ప్రే. చొప్పడఁజేయు.
చొప్పఱచు }
చొప్పించు. ప్రే. చొరఁజేయు. స. క్రి. గుచ్చు.
చొప్పిల్లు. అ. క్రి. తగు; ప్రకాశించు.
చొప్పు. జాడ; మార్గము; విధము.
చొబలము. గుఱ్ఱము గర్భమందున్న పిండము.
చొరఁబడు } అ. క్రి. చొచ్చు, ప్రవేశించు
చొరఁబాఱు }
చొరపోఁత. విణ. నిరంతరము.
చొరవ. ప్రవేశము; బుద్ధికుశలత; అన్నము మీఁది యిచ్ఛ; సాహసము.
చొరవకత్తియ } విణ. చొరవగల స్త్రీ.
చొరవకత్తె }
చొరవకాఁడు. విణ. చొరవకలవాఁడు; సాహసికుఁడు.
చొరు. స. క్రి. ప్రవేశించు.
చొరుగు(వు). చొక్కాకు, ఎండాకు.
చొఱ. చొఱచేప, రాజీవము. విణ. బాలుడు
చొఱచొఱ. వడియుట జొబ్బిలుటయందగు ధ్వన్యనుకరణము.
చొఱిగాఁడు. కిరాతుఁడు, బోయ.
చొఱ్ఱి. చొఱ్ఱిచేఁప.
చొలయు. అ. క్రి. మూర్ఛపోవు; వెను దీయు; వైముఖ్యము నొందు; వైరస్యము నొందు.
చొల్లు. జొల్లు, చొంగ, లాల.
చొల్లియము. జడతో చుట్టినచుట్టు.
చొల్లు. చొల్లు.
చొల్లుమాట. తుంపురులమాట.
చొల్లెము. రూ. చొల్లియము.

## చో

చో. కాలము; స్థలము. [పము; అప్పుడు.
చో. ద్ర. చోటుశబ్దముయొక్క లుప్తరూ
చోట. ద్ర. భాగమున; స్థలమున.
చోటు. తావు, స్థానము, స్థలము.
చోడి. సస్యవిశేషము. బ. చోళ్లు.
చోడు. సోడు. బ్రహ్మరంధము; చోడ శబ్దము ప్రథమావిభక్తి రూపము.
చోడుము } కష్టము.
చోద }
చోద్యము. ఆశ్చర్యము.
చోపు. కలఁత, క్షోభము. స. క్రి. కలఁచు; త్రోలు, నడపించు; తరుము.
చోపుడు. కలఁత, క్షోభము.

చోపుడుఁగట్టె } చోపుపెట్టుకోల.
చోపుడుఁగోల }
చోపుదారు. హిం. వెండిబెత్తపు వాఁడు
చోపుదారుఁడు. హిం. వేత్రధరుఁడు.
చోర. బాలుఁడు.
చోరుగస్తి. గస్తితిరుగువాండ్రపై విచారణచేయు ఉద్యోగస్థుఁడు బ. గస్తీలు; పైగస్తీలు మొదలగువారిని అందఱినికని పట్టిపరగణా అంతటను తిరిగెడివాండ్లు.
చోఱ. చోఱచేఁప; బాలుఁడు.
చోఱబుడుత. చోఱమీనుపిల్ల; చేఁపల వంటికన్నులుగల యాఁడుది.
చోఱవాఁడు. విణ. బాలుఁడు.
చోలా. చొక్కాయ. ? [పిండి.
చోవి. బూరెలమీఁద మూఁతగా పెట్టెడు
చోళ్లు. బ. ఒకదినుసుతవిఁదెలు, రాగులు

## చౌ

చౌ. స. నాలుగు. విణ. చౌకముయొక్క లుప్తరూపము.
చౌక. విణ. అగ్గువ; వెలతక్కువ; న్యూనత; తిరస్కారము; అర్ఘము. ?
చౌకట్టులు } బ. నాలుగుముత్యములు చేర్చి
చౌకట్టులు } కట్టిన పోఁగులు; దోరణపుఁ బట్టెమీఁద కపిలెబిల్లను ఆధారముగా ఇరుప్రక్కలనమర్చెడుగుజ్జెలు; చేట్టము
చౌకము. రూ. చవుకము.
చౌకలింత. రూ. చవుకళింత.
చౌకసేయు. స. క్రి. తక్కువపఱచు.
చౌకళము. చవుకళింత.
చౌకళి. రూ. చవుకళి.
చౌకళించు. రూ. చవుకళించు. [షము.
చౌకళింత. చవుకళించుట; అశ్వగతివిశే
చౌకళింపు. చవుకళించుట.
చౌకాఁడిగుదియ. రూ. చవుకాఁడిగుదియ
చౌకారము. కారము, సబ్బు; కారము.

చౌకాలిపీఁట. నాలుగుకాళ్లుగలయెత్తుపీఁట
చౌకి. కంచము.
చౌకి. సుంకరిమెట్టు.
చౌకు. పంకము; కశ.
చౌకుచెట్టు. ఒకానొకవిదేశీయవృక్షము.
చౌగంటి. అగ్నిదేవుఁడు; శరభమృగము.
చౌగండ్లమెకము. శరభమృగము.
చౌట. ఊషరపృథివి; గూఁడు.
చౌటుప్పు. రొమకము.
చౌడ. కారపుమన్ను [మన్ను, చౌటిమన్ను.
చౌడు. చౌటినేల, ఊషరపృథివి; కారపు
చౌడోలు. ఏనుఁగువీఁపుమీఁద కూర్చుండుటకమర్చినతొట్టి, అంబారి, హవాదా.
చౌతా. డోలి, ఉయ్యాల.
చౌతి. చతుర్థి. రూ. చవుతి.
చౌతు. ఒకవిధమైన కుళ్లాయి.
చౌదంతి. ఇంద్రునియేనుఁగు, ఐరావతము.
చౌదంతియెకిమీఁడు. ఇంద్రుఁడు.
చౌదంతిరౌతు. ఇంద్రుఁడు.
చౌదరి. శూద్రుఁడు, గ్రామమునకైనను పరగణాకైనను పెత్తనకాఁడగుకాఁపు.
చౌపదము. నాలుగు మూలలు.
చౌపుటము. రూ. చవుపుటము.
చౌరు. తీపుతో కలసిన యించుక ఉప్పు.
చౌలు. బ. రూ. చవులు.
చౌలూరు. చవులూరు, రుచులుపుట్టు; మనోహరముగానుండు.
చౌవంచ. స. అయిదు. [శరుఁడు.
చౌవంచతూపులజోదు. మన్మథుఁడు, పంచ
చౌవంచి. స. అయిదు.
చౌషష్టి. రూ. చవుషష్టి.
చౌసాల. చుట్టుకొల్లారు.
చౌసీతి. స. ఎనుబది నాలుగు, చతురశీతి.
చౌసీతిబంధములు. బ. మి. చతురశీతి బంధములు, ఎనుబది నాల్గు కామశాస్త్ర గ్రథిత బంధములు.

## ఛ

ఛందము. సం. ఛందస్సు; అభిప్రాయము; వశము; లక్షణశాస్త్రము; ఇచ్ఛ.
ఛందస్సు. సం. (పద్యలక్షణముఁ జెప్పెడు) లక్షణశాస్త్రము; వేదము; యథేచ్ఛ; ఇచ్ఛ. (చందస్సులు ఇరువది యారు— ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్పు, బృహతి, పఙ్క్తి, త్రిష్టుప్పు, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అభికృతి, తఉత్కృతి.)
ఛగల. సం. బొద్ది † [పిడకనిప్పు.
ఛగలము. సం. నీలిరంగు; మేఁకపోతు;
ఛగలాండి. సం. గాడిద గడపర †.
ఛట సం. వరుస, సమూహము.
ఛడాయించుట. గ్రా. ఎచ్చు వేయుట.
ఛడి. హిం. చువ్వ, బెత్తము.
ఛత్ర. సం. గుడ్డికామంచి †; అడవిసదాప † కొత్తిమిరి †; పుట్టగొడుగు.
ఛత్రభంగము. సం. రాజుపోవుట; రాజ్యనాశము; అస్వాతంత్ర్యము; ముండమోపితనము. [ఆకులుంగల చెట్టు.
ఛత్రమహీరుహము. సం. ఛత్రమువలె
ఛత్రము. సం. గొడుగు.
ఛత్రాకము. సం. పుట్టగొడుగు.
ఛత్రాకి. సం. సర్పాక్షి †.
ఛత్రాకువు. సం. పుట్టకొక్కు.
ఛత్రాతిచ్ఛత్రము. సం. గొడుగుగడ్డి.
ఛదనము. సం. ఆకు; ఈఁక; ఱెక్క; కప్పు.
ఛదము. సం. ఆకు; ఈఁక; ఱెక్క; గండివనము †; చీఁకటిమ్రాను †.
ఛది. సం. ఇంటికప్పు.
ఛద్మము. సం. నెపము; కపటము; మోసము.
ఛన్నము, సం. విశే. ఏకాంతము; కప్పఁబడ్డది.
ఛర్దనము. సం. వమనము; వేము †.
ఛర్ది. సం. వాంతి రోగము.
ఛలము సం. నెపము, మిష; వెనుదీయుట; ఛలోక్తి, ఒక అభిప్రాయముతో చెప్పిన పదమునకు మఱియొక అభిప్రాయము తీసికొని యుత్తరము చెప్పుట.
ఛవి. సం. కాంతి; కిరణము.

## ఛా

ఛాందసము. వా. వేదజడత్వము; లోకజ్ఞానము లేమి.
ఛాందసుఁడు. వా. వేదజడుఁడు; లోకజ్ఞానము లేనివాఁడు. సం. వేదము చదివినవాఁడు.
ఛాందోగ్యము. సం. ఒకానొక ఉపనిషత్తు.
ఛాగము. సం. మేఁకపోతు.
ఛాగలకము. సం. మేఁకపోతు.
ఛాగి. సం. మేఁక, ఆఁడుమేఁక.
ఛాతము. సం. విశే. ఛిన్నము.
ఛాత్రము. ఒక తేనె.
ఛాత్రుఁడు. సం. శిష్యుఁడు.
ఛాదనము. సం. ఛదనము.
ఛాదితము. సం. విశే. కప్పఁబడ్డది.
ఛాయ. సం. నీడ; కాంతి; పోలిక; రీతి; శోభ; వర్ణము; ప్రతిబింబము; ఛాయాదేవి, సూర్యుని భార్య; రక్షణము; లంచము; వరుస; ఇంచుక.
ఛాయాకరుఁడు. సం. గొడుగుపట్టువాఁడు. విశే. నీడను గలుగఁ జేయువాఁడు.
ఛాయా గ్రహణము. సం. ఫోటో తీయుట
ఛాయా గ్రహము. సం. రాహువు; కేతువు; అద్దము; ఫోటోతీయు యంత్రము
ఛాయా తరువు సం. సురపొన్న; నీడ చేతనే మిక్కిలి ఉపయోగకరముగా నుండెడు పెద్దచెట్టు
ఛాయా దేవి. సం. సూర్యపత్ని.
ఛాయా పుత్రుఁడు. సం. శని.
ఛాయా ప్రియుఁడు. సం. సూర్యుఁడు.

## ఛి

ఛిద. సం. నఱకుడు. [భాగించునది.
ఛిదురము. సం. విశే. ఛేదించునది;

ఛిద్రము. సం. రంధ్రము; దూషణము, తప్పు. [బడ్డది.
ఛిద్రితము. సం. విణ. రంధ్రము వెయ్యఁ
ఛిన్న. సం తిప్పతీఁగ.
ఛిన్నము. సం. విణ. నఱకఁబడ్డది.
ఛిన్నరుహా. సం. తిప్పతీఁగ.

## ఛు

ఛురిక. సం. మొలనుంచుకొనెడిచూరకత్తి

## ఛె

ఛెయిర్మను. ఇం. అధ్యక్షుఁడు.

## ఛే

ఛేకము. సం. పెంపుడు మృగము పక్షి మొ. విణ. నాగరకము.
ఛేకానుప్రాసము. సం. రెండేసి వ్యంజనాక్షరములు జతజతగా ఎడనెడఁజెప్పఁబడు అనుప్రాసభేదము.
ఛేత్త. సం. విణ. ఛేదించువాఁడు.
ఛేత్తవ్యము. సం. విణ. ఛేదింపఁదగినది.
ఛేదనము. సం. కోయుట; చీల్చుట; త్రుంచుట; నఱకుట.
ఛేదము. సం. నఱకుడు; తునుక; భిన్నాంకమునందు క్రింది సంఖ్య.
ఛేదించే. సం. స. క్రి. నఱకు; త్రుంచు; కోయు; చీల్చు; తునుకలు చేయు.
ఛేదితము సం. విణ. ఛేదింపఁబడినది.
ఛేదితవ్యము. సం. విణ ఛేదింపఁ దగినది.
ఛేద్యము. సం. విణ. ఛేదితవ్యము.

## ఛో

ఛోటిక. సం. చిటిక.



## జ

జంగమము. సం. విణ. సంచరించెడి మనుష్య పశుపక్ష్యాది ప్రాణి.
జంగముఁడు. సం. జంగమువాఁడు.?
జంగలము. సం. మాంసము. విణ. జనము లేనిది (చోటు).
జంఘ. సం. పిక్క.
జంఘాకరికుఁడు. సం. దూరముగా సమాచారము తీసికొనిపోయి వచ్చి చెప్పి జీవించువాఁడు. విణ. శీఘ్ర గమనము గలవాఁడు. [ముగా నడచువాఁడు.
జంఘాలుఁడు. సం. విణ మిక్కిలి వేగ
జండా. హిం. ధ్వజము.
జంతుఫలము. సం. మేడి†.
జంతువు. సం. జన్మించు స్వభావము గల ప్రాణి; పశువు పక్షి మొ||; దేహాభిమాని యగు జీవుఁడు.
జంత్రము. సం. యంత్రము.
జంద్రాలు. ఇం. జనరల్.
జంపతులు. సం. దంపతులు.
జంబాలము. సం. పాఁచి; బురద.
జంబీరము. సం. నిమ్మ†; ఫురుపము†. రూ. జంభీరము.
జంబుకము సం. నక్క.
జంబుకుఁడు. సం వరుణుఁడు; నీచుఁడు.
జంబువు. సం. నేరెడుపండు; నేరెడు చెట్టు; నేరెడుదీవి; నేరెడులు.
జంభభేది సం. ఇంద్రుఁడు. [దంభము.
జంభము. సం. నిమ్మ†; పల్లు; తిండి;
జంభలము. సం. నిమ్మ†.
జంభలుఁడు. సం జినదేవుఁడు
జంభారి. సం. ఇంద్రుఁడు; వజ్రాయుధము
జంభుఁడు. సం. ఒకానొకరాక్షసుఁడు.
జగచ్చక్షువు. సం. సూర్యుఁడు.
జగతి. సం. లోకము; జనము; భూమి; ఒక ఛందస్సు.
జగత్తు. సం. ప్రపంచము; గాలి. విణ. తిరుగునది.
జగత్ప్రాణుఁడు. సం. వాయువు. రూ. జగత్ప్రాణము.
జగన్నాదము. సం. ఒక క్షేత్రము.
జగన్నాథుఁడు. సం. విష్ణువు, జగన్నాథ స్వామి.
జగన్మాత. సం. లక్ష్మి; పార్వతి.

జగము. సం. జగత్తు.
జగముకన్ను. } జగచ్చక్షువు,
జగముచుట్టము. } లోకబాంధవుఁడు, సూర్యుఁడు.
జగముతల్లి. మి. జగన్మాత. [బ్రహ్మ
జగములఁబుట్టించుజాణఁడు. విశ్వస్రష్ట
జగలము. సం. మంగ†; మద్యపిష్టము. విణ. మోసకాఁడు.
జగ్ధము. సం. విణ. తినఁబడినది.
జగ్ధి. సం. భోజనము, తినుట. [లము.
జఘనము. సం. మడికట్టు; మొల, కటిస్థ
జఘనేఫల. సం. బమ్మమేడి†.
జఘన్యజుఁడు. సం. శూద్రుఁడు. విణ. తమ్ముఁడు.
జఘన్యము. సం. మగగుఱి; తోఁక; గొరిసె. విణ. తక్కువది; వెనుకటిది; దూఱఁదగినది
జట. సం. వెండ్రుకల జడ, చెట్టుఊడ; జటామాంసి†.
జటామాంసి. సం. ఒక ఓషధి.
జటాయువు. సం. గుగ్గిలపుచెట్టు; ఒక గృధ్రము, సంపాతితమ్ముఁడు.
జటాలము. సం. విణ. జడలుగలది.
జటావల్లి. సం. రుద్రజడ†.
జటి. సం. జువ్వి†; మఱ్ఱి†. విణ. జడలు ధరించినవాఁడు.
జటిల. సం. జటామాంసి†; పిప్పలి†.
జటిలము. సం. సింహము. విణ. జడలు గలది; పెనఁగొనినది.
జటిలుఁడు. సం. జటాధారి.
జటులము. సం. పుట్టుమచ్చ.
జఠరము. సం. కడుపు. విణ. ముదిసినది; కఠినమైనది.
జడ. సం. మరదగొండి†.
జడత. సం. మనస్సును అంగమును చేష్టలు ఉడిగియుండుట.
జడధి. సం. జలధి, సముద్రము.
జడము. సం. జలము. విణ. చల్లనిది; తెలివి లేనిది; మూఁగది; సంచరింపనిది.
జడిమ. సం. జడత్వము. రూ. జడిమము.
జడుఁడు. సం. విణ. తెలియని మందుఁడు.
జడులము. సం. పుట్టుమచ్చ.
జడ్జి. ఇం. న్యాయాధిపతి. రూ. జడ్జీ.

జతుక. సం. చివుకపిట్ట, చీకురువాయి; లక్క.
జతుకము. సం. లక్క; ఇంగువ.
జతుకి. స. సురళితీఁగె.
జతుకృత్తు. సం. కోరింద†.
జతువు. సం. లక్క.
జతూక. సం. కోరింద†; చివుకపిట్ట.
జత్రువు. సం. మూఁపులయొక్క సంధి యెముకలు, కొంకులు. [లుఁడు.
జనంగముఁడు. సం. మాలవాఁడు, చండా
జనకుఁడు సం. తండ్రి; ఒక రాజర్షి.
జనత. సం జనసమూహము.
జననము. సం. పుట్టుక; వంశము.
జనని. సం. తల్లి; దయ; కోరింద†.
జనపదము. సం. దేశము; గ్రామము, పల్లెటూరు.?
జనపదుఁడు. సం మనుష్యుఁడు.
జనము. సం. ప్రజ, మనుష్యసమూహము; ఒకానొక లోకము. విణ. పామరుఁడు.
జనముద్దు. మి. విణ. అందఱును మనోహరము గానుండు.
జనయిత. సం. తండ్రి.
జనయిత్రి. సం. తల్లి.
జనశ్రుతి. సం. జనులు చెప్పుకొనెడు వృత్తాంతము, లోకవార్త.
జనాంతము. సం. దేశము.
జనాంతికపదము. సం. అంతఃపురము.
జనాభా. హిం. జనసంఖ్య.
జనార్దనుఁడు. సం. హరి, విష్ణువు.
జనాశ్రయము. సం. మండపము. జనులు చేరియుండునట్టి చోటు.
జని. సం. ఆఁడుది; పెండ్లాము; కోడలు; కోరింద†; జన్మము.
జనుఁడు. సం. మనుష్యుఁడు.
జనులు. సం. బ. మనుష్యులు.
జనువు. సం. పుట్టుక. రూ. జనుస్సు.
జనుషాంధుఁడు. సం. విణ. పుట్టుగ్రుడ్డి
జన్మము. సం. పుట్టుక.
జన్మి. సం. జంతువు, ప్రాణి.
జన్య. సం. తల్లి చెలికత్తె; తోడిపెండ్లి కూఁతురు; సుఖము. [దూఱు.
జన్యము. సం. విణ. యుద్ధము; అంగడి;

జన్యుఁడు. సం. తండ్రి; తోడిపెండ్లికొడుకు. విణ. పుట్టఁదగినవాఁడు; పుట్టించువాఁడు. [బ్రహ్మ.
జన్యువు. సం. జంతువు, ప్రాణి; అగ్ని;
జప. సం. దాసనము†. [యనము.
జపము. సం. మంత్రావృత్తి; వేదాధ్య
జపాపుష్పి. సం. దాసనము†.
జపించు. సం. స. క్రి. జపముచేయు.
జప్యము. సం. విణ. జపింపఁదగిన గాయత్ర్యాదిమంత్రము.
జబరు } హిం. బలాత్కారము.
జబరుదస్తి }
జమాఖర్చు. హిం. ఆయవ్యయములు.
జమాదారు. హిం. రైతులపైయధికారి
జముకాణము. కూర్చుండుటకై ముతకనూలుతో నేసి క్రిందపఱచెడి ఆస్తరణము.
జముదాడి. హిం. నిడుపైనపిడిగల కటారి
జయ. సం. పార్వతి; పార్వతియొక్కచెలికత్తె; తిథివిశేషము; కరక†; తక్కిలి†; నెల్లి†; జయవత్సరము.
జయంతి సం. ఇంద్రుని కూఁతురు; పార్వతి; టెక్కెము; తక్కిలి†.
జయంతుఁడు. సం. ఇంద్రునికొడుకు; భీముఁడు; శివుఁడు. [విశేషము.
జయఘంట. సం. జేగంట, ఘంటా
జయనము. సం. జయించుట; గుఱ్ఱము మొదలగువానికవచము. [దీవించు.
జయపెట్టు. మి అ. క్రి. జయజయఅని
జయము. సం. గెలుపు; భారతము.
జయవారము. సం. మంగళవారము.
జయించు. సం. స. క్రి. గెలుచు.
జయిల్‌ఖానా, హిం. చెఱసాల.
జయుఁడు. సం. ఇంద్రునికొడుకు; యుధిష్ఠిరుఁడు.
జయ్యము. సం. విణ. గెలువశక్యమైనది.
జర సం. ముసలితనము
జరఠము. సం. విణ ముదిసినది; కఠినమైనది; గట్టిదైనది; పసుపు కలిసిన తెలుపువర్ణము గలది.
జరఠుఁడు. సం. ముసలివాఁడు.
జరతారు. హిం. జలతారు; సరిగ.
జరద్గవము. సం. ముసలియెద్దు.
జరబాబు. హిం. బంగారుబట్ట, సాదరా.
జరాభీరువు(ఁడు). సం. మన్మథుఁడు.
జరాయుజములు. సం. బ. మావితోఁగూడ బుట్టునవి, మనుష్యపశ్వాదులు.
జరాయువు సం. మావి; జటాయువు.
జరిత్రము సం. స్తోత్రము.?
జరుఁడు. సం. విణ. ముసలివాఁడు.
జర్జరము. సం. పాఁచి; ఇంద్రధ్వజము. విణ. శిథిలమైనది.
జర్జరితము. సం. విణ. శిథిలమైనది.
జర్జరీకము. సం. విణ. పెక్కు తూఁట్లు గలది; శిథిలమైనది.
జర్తిలము. సం. అడవినువ్వులు.
జర్మనిలు. ఇం. బ. జర్మనుదేశీయులు.
జలచరము. సం. జలమునందు సంచరించెడు జంతువు. విణ. హంసాదిపక్షులు.
జలజము. సం. పద్మము, తామర; శంఖము.
జలతస్కరుఁడు. సం. సూర్యుఁడు.
జలతారు. జరతారు
జలదము. సం. ముస్తె; మేఘము.
జలదస్యుఁడు. సం. సూర్యుఁడు.
జలద్రోణి. సం. పడవలోని నీరు తోఁడి పోసెడి కొయ్యపాత్ర; నూతివద్దిగాడి.
జలధరము సం. మేఘము.
జలధి. సం. సముద్రము.
జలనిధి. సం. సముద్రము.
జలనిర్గమము. సం. నీళ్లువెలికిఁబోవుట కేర్పఱచినతూము మొ.
జలనీలి. సం. శైవాలము, పాఁచి.
జలము. సం. ఉదకము; కురువేరు. విణ. జడము. [జలముచము.
జలముక్కు. సం. మేఘము. రూ.
జలరాగము. సం. శ్వేతవర్ణముగల కెంపు.
జలలిపి. సం. నీటిమీఁది వ్రాఁత, అప్పుడే నశించునది.
జలవల్లి. సం. నీరుగొలిమిడి†.
జలశుక్తి. సం. కప్పచిప్ప.
జలసూచి. సం. జలగ; మొసలి.
జలసూత్రము. సం. ఒక పాత్రలోనుండి మఱియొకపాత్రలోనికి నీరుపడుటకై

రెండుకొనలను గొట్టములుకట్టి ఆ పాత్రలలో ఉంచిన దారము.
జలహస్తి సం. నెగడు; నీటియేనుఁగు.
జలాక్షరము. సం. జలలిపి.
జలాధారము. సం. జలాశయము.
జలారము. సం. నీటిగుత్తము.?
జలారి. జలదారి. సం. జలద్వారము.
జలార్ణవము. సం. వర్ష ఋతువు.?
జలాశయము. సం. నీటిటెంకి, మడుగు; వట్టివేరు.
జలూక. సం. జలగ; అంతరదామర.
జలోచ్ఛ్వాసము. సం. అలుఁగు; చెరువు తూము.
జలౌకసము. సం. జలగ; జలజంతువు.
జల్దీ. హిం. విణ. త్వరయైన.
జల్పనము. సం. ఉపయుక్తము కాని పెక్కుమాటలాడుట.
జల్పము. సం. పరమత నిరసన పూర్వకముగా స్వమతమును స్థాపించుటగల ఒక వాదము.
జల్పాకుఁడు. సం. విణ. ప్రేలరి.
జల్పితము. సం. ప్రేలుఁడు. విణ. చెప్పఁబడినది.
జవ స. దాసనము†. [వడిగలది.
జవనము. సం. వడి; వడిగలగుఱ్ఱము. విణ.
జవనిక. సం. తెరచీర, యవనిక.
జవము. సం. వడి, వేగము. విణ. వడిగలది.
జవాది. సం. జవ్వాది, సంకుమదము.
జవాను. హిం. బలశాలి; బంట్రౌతు.
జవాబు. హిం. ప్రత్యుత్తరము.
జహ్నుతనయ. సం. గంగానది.
జహ్నువు. సం. ఒకానొక రాజర్షి; విష్ణువు.

## జా

జాంగలము. సం. ఆవడ, బీఱకాయ; కవుఁజు; మెరక నేల; నిర్జల దేశము.
జాంగలి. సం. విషముఁబోగొట్టువిద్య; దూలగొండి†.
జాంగులికుఁడు. సం. విషవైద్యుఁడు.
జాంఘికుఁడు. సం. జంఘాకరికుఁడు.
జాంపత్యము. సం. దాంపత్యము.
జాంబవతి. సం. శ్రీకృష్ణుని ఒక భార్య.
జాంబవము. సం. నేరెడుపండు; బంగారు.
జాంబూనదము. సం. బంగారము; ఉమ్మెత్త†.
జాగర. సం. మేలుకొనుట, జాగారము.
జాగరణము. సం. జాగారము.
జాగరము. సం కవచము; మేలుకొనుట.
జాగరించు. సం. అ క్రి. మేలుకొను.
జాగరిత. సం. జాగరూకత. విణ. మేలుకొనియుండువాఁడు.
జాగరిల్లు. సం. అ. క్రి. మేలుకొను
జాగరూకుఁడు. స. విణ. మేలుకొనియున్న వాఁడు.
జాగర్య. స. మేలుకొనియుండుట.
జాగా. హిం. స్థలము. [నిచ్చుభూమి.
జాగీరు. హిం. రాజుబహుమానముగా
జాగ్రత్త. సం అప్రమత్తత.
జాగ్రత్తు. సం. జాగ్రదవస్థ.
జాఠరము. సం, విణ. జఠరసంబంధమైనది; మౌక్తికమణిదోషము.
జాడీ. ఇం. బుడ్డివంటిచెంబు.
జాడ్యము. సం. జడత్వము, జడ్డు.
జాతకర్మము. సం. పుట్టినపుడు చేయు సంస్కారవిశేషము.
జాతకుఁడు. సం. విణ. పుట్టినవాఁడు.
జాతము. సం. సమూహము; సామాన్యము; పుట్టుక. విణ. పుట్టినది.
జాతరూపము. సం. బంగారు; ఉమ్మెత్త† పుట్టినరూపము; పుట్టినప్పటిరూపము.
జాతవేదుఁడు సం. అగ్నిహోత్రుఁడు,
జాతాపత్య. సం. బాలెంతరాలు.
జాతి. సం. కులము; పుట్టుక; సామాన్యము; ఒకఅర్థాలంకారము; పద్యభేదము; ప్రాయిక్య; కాంతి; జాజికాయ; జాజి†; ఉసిరిక†; కంపిల్లము†; (పురుషజాతులు నాలుగు—భద్రుఁడు, దత్తుఁడు, కూచిమారుఁడు, పాంచాలుఁడు. స్త్రీజాతులు నాలుగు—పద్మిని, హస్తిని, శంఖిని, చిత్రిణి. పదునెనిమిది జాతులు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, వ్యావహారిక, గోరక్షక, శిల్పక,

పంచాణ, కుంభాకార, తంతువాయ, క్షౌరక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకార తిలఘాతక, లుబ్ధక, చండాల, మాతంగ జాతులు.)
జాతికోశము. సం. జాజికాయ.
జాతినాగు. మి. పాములలో భేదము.
జాతిపత్రి. సం. జాపత్త్రిరి; జాజిపత్రి.
జాతివారు. మి. ఇంగ్లీషువారు; శ్వేతముఖులు. [వాండ్లు.?
జాతివార్తలవాండ్లు. సం. బ. నెరవిద్దె
జాతీఫలము. సం. జాజికాయ.
జాతుషము. సం. విణ. జతువు (లక్క) వలనఁ గలిగినది.
జాతోక్షము సం. కాలుపట్టిన యెద్దు.
జాత్యము. సం, విణ మంచికులమందుఁ బుట్టినది; చక్కనిది; మేలైనది.
జానకి. సం. సీతాదేవి.
జానపదము. సం. జనము; దేశము. విణ. జనపద సంబంధి; గ్రామము ?
జానపదుఁడు. సం. జనుఁడు.
జానకీజాని. సం. సీతాపతి.
జానువు. సం. మోఁకాలు.
జాపకము. సం. కాలేయకము.
జాపకుఁడు. సం.విణ.జపము చేయువాఁడు
జాపము. సం. జపము; వేదాధ్యయనము.
జాప్యము. గ్రా. జాగు.
జాఫరా.హిం ఒకరంగు; రక్తవర్ణవిశేషము
జాబాలము. సం. ఒక ఉపనిషత్తు.
జాబాలి. ఒక ముని; ఒక ఉపనిషత్తు.
జాబాలుఁడు. సం. కురుమవాఁడు; సత్యకాముఁడు; ఒకముని.
జాబితా. హిం. పట్టి.
జామదగ్న్యుఁడు. సం. జమదగ్నిశిష్యుఁడు.
జామదగ్నీయుఁడు. సం. పరశురాముఁడు
జామాత. సం. అల్లుఁడు; ప్రభువు; ప్రొద్దుతిరుగుడు†. [జామ†?. విణ. సోమరి.
జామి. సం. కులకాంత; తోఁడఁబుట్టినది;
జాయ. సం. భార్య, (అగ్నిసాక్షిగా పెండ్లాడిన). పెండ్లాము.
జాయమానము. సం.విణ కలుగుచున్నది.
జాయా: హిం.నష్టము,చెఱుపు [గాఁడు.?
జాయాజీవుఁడు. సం. నట్టువుఁడు; మేళ

జాయువు. సం. మందు.
జార } జారస్త్రీ, వ్యభిచారిణి.
జారిణి }
జారీ. హిం. నెఱవేర్పు, అజ్ఞయగుట.
జారుఁడు. సం. ఉపపతి, వ్యభిచారి.
జాలకము. సం. తెల్లమొగ్గ; కసుగాయ; తెల్లమొగ్గల గుత్తి; వల; పక్షిగూడు; కపటము; మునగకాయ; కిటికి.
జాలపాదము. సం. బాతు; హంస.
జాలము సం. కిటికి; వల; సమూహము; మొగ్గ; కపటము; మాయ; కడిమి†.
జాలి. సం. పొట్ల†.
జాలిక. సం. వలవంటి నేఁతగల వస్త్రము; ఇనుపకవచము; విధవ.
జాలికము. సం. సాలెపురుగు.
జాలికుఁడు. సం. చెంబడివాఁడు; బోయవాఁడు; వలచేత జీవించువాఁడు. విణ. మోసకాఁడు.
జాలిని. సం. బీఱ†; చిత్రశాల; వాగఱ.?
జాల్ముఁడు. సం. ఆలోచింపక పనిచేయువాఁడు; క్రూరుఁడు; నీచుఁడు; పామరుఁడు.
జావంకము. మి. జామచిహ్నము.
జాస్తి. హిం. విణ. ఎక్కువ.
జాహ్నవి. సం. గంగ.

## జి

జింక. లేడి, హరిణము; న్యంకువు.
జింక గుఱ్ఱము వలంతి. వాయువు, హరిణవాహనుఁడు.
జింకతల చుక్క. మృగశీర్ష నక్షత్రము.
జింకతల చు(రి)క్క నెల. మార్గశీర్ష మాసము.
జింకతాలుపరి } మృగధరుఁడు, శివుఁడు;
జింకతాలుపు } మృగాంకుఁడు, చంద్రుఁడు. రూ. జింకతాల్పు.
జింకపొక్కిలి. మృగనాభి, కస్తూరి.
జింకరవుతు. వాయువు, హరిణవాహనుఁడు. రూ. జింకరౌతు.
జింకిలీకము. మృగవిశేషము.
జింగి. సం. మంజిష్ఠ†.

జింగిణి వామనుఁడు.
జంజిరీ. గొలుసు.
జిగట. స్నిగ్ధము; నిర్యాసము, బంక.
జిగటాలు. బ. దీపము.
జిగమిష. సం. పోవనిచ్ఛ.
జిగమిషువు.సం.విణ.పోవనిచ్ఛగలవాఁడు.
జిగి. సుషమ; కాంతి; వర్ణము.
జిగిని. హిం. మెడనుధరించెడి ఒక భూషణము.
జిగిమానము. గ్రా పిసినితనము.
జిగిలి. విణ. చిక్కనైనది.
జిగిలికాఁడు. విణ. అందగాఁడు.
జిగీష. సం. జయింపనిచ్ఛ; ప్రయత్నము; అతిశయము.
జిగీషువు సం విణ. గెలువనిచ్ఛగలవాఁడు.
జిగురు. స్నిగ్ధము; జిగురుపూసిన దారము; పక్షులను బట్టుటకై కోలనుఁగాని దారమునుఁగాని చమిరెడు బంధన, నిర్యాసము.
జిగురుకొను అ. క్రి. జిగటగలదియగు.
జిగురుగండె. పక్షులను పట్టెడు సాధనము.
జిఘత్స. సం. ఆఁకలి.
జిఘత్సువు. సం. విణ. ఆఁకలిగొన్నవాఁడు. రూ. జిఘత్సుఁడు.
జిఘాంస. సం. చంపనిచ్ఛ.
జిఘాంసువు(ఁడు). సం. శత్రువు. విణ. చంపనిచ్ఛగలవాఁడు.
జిఘృక్ష. సం. గ్రహింపనిచ్ఛ.
జిఘృక్షువు సం.గ్రహింపనిచ్ఛగలవాఁడు.
జిహ్ముఁడు.సం.విణ. మూర్కొనువాఁడు
జిజ్ఞాస. సం. తెలియనిచ్ఛ. [వాఁడు.
జిజ్ఞాసువు. సం. విణ. తెలియనిచ్ఛగల
జిట్ట. ప్రాదేశము; పెదురుయొక్కయెన్ను ఒకదినుసు పక్షిజాతియొక్క సాధారణమైన పేరు; జేన; శరము; గుల్మము.
జిట్టకము. కోడిగము.
జిట్టెఁడు. ప్రాదేశమాత్రము.
జిడికిరింత. మోసపుమాట.
జిడ్కడలి. జిడ్డుకడలి.
జిడ్డ. క్షోభము, కలఁత. ?
జిడ్డి. మోటుగుడ్డ. విణ. మోటైనది.
జిడ్డు. స్నిగ్ధము; నేయి మొదలగువాని జిగురు; వృక్షవిశేషము.
జిడ్డుకడలి. పాలసముద్రము, క్షీరాబ్ధి.
జిడ్డుకడలిబిడ్డ. లక్ష్మి, క్షీరోదజ.
జిడ్డుకొను అ. క్రి. జిడ్డగు.
జిడ్డునీర్వామి. జిడ్డుకడలి. [చినవాఁడు.
జితకాశి. సం. విణ. యుద్ధమునందుజయిం
జితపడు అ. క్రి. స్థిరపడు; వాడుకపడు; అనుకూలపడు. [నది.
జితము. విణ. స్థిరము. సం. జయింపఁబడి
జితించు. అ. క్రి. జితపడు.
జితేంద్రియుఁడు. సం. విణ. ఇంద్రియనిగ్రహముగలవాఁడు.
జిత్తు. యుక్తి; కపటము, మాయ.
జిత్తులకత్తె. విణ. మాయలాఁడి.
జిత్తులమారి, జిత్తులవాఁడు } విణ. వంచకుఁడు, జిత్తులు చేయువాఁడు.
జిత్య. సం. గొత్తినాగలి ?
జిత్వరుఁడు. సం. విణ. జయశీలుఁడు.
జిద్దు. కోపము; కలహము.
జిన. పిట్టగుడ్డు సొన.
జినిసేదిసు. ఒక విధమైన ఫిరంగి.
జినుఁగు. సూక్ష్మవస్త్రము; సూక్ష్మము; మందము.
జినుఁడు. సం. బుద్ధదేవుఁడు, జినదేవర; విష్ణువు విణ. ముసలివాఁడు;జయశీలుఁడు
జిన్న. వృక్షవిశేషము
జిపె. జిడ్డుగల నేల.
జిబిలిక. ఒక బీఱ్.
జిబువాయి జవాజి.
జిబ్బటీ, జిబ్బడాయి } గబ్బిలము.
జిమిడిక. ఒక చర్మవాద్యము.
జిమ్ము. విణ. అధికము. [వెలికుబుకు
జిమ్ము. అ క్రి. ( ద్రవ వస్తువు ) జిఱ్ఱున
జియ్య. జనకుఁడు; రాజు; దేవుఁడు.
జియ్యరు. వైష్ణవ సన్న్యాసి.
జియ్యలు. బ. దేవతలు.
జిరా. కవచము; బాణము.
జిరాకెంపుటంబారీ. ఎఱ్ఱని పట్టు అంబారీ.
జిరాగుజ్జము. జీనుగట్టిన గుజ్జము.
జిరాయతి. కృషి.

జిరాయి. కవచము; బాణము.
జిరాయితి. కృషి ?
జిరిమితి. పిండివంటలోని భేదము. [షము
జిరుకుజాతిదాబాటలు. బాలక్రీడా విశే
జిఱ. తిరుగుట త్రిప్పుటలయందగు ధ్వన్యనుకరణము.
జిఱకొట్టు. అ. క్రి. జిఱ్ఱుఁదిరుగు.
జిఱజిఱ. రూ. జిఱ.
జిఱ్ఱ. రూ. జిఱ.
జిఱ్ఱత్రాడు పిరియెక్కించిన త్రాడు.
జిఱ్ఱు. చిమ్ముటకూఁత; చీఁదుటయందగు ధ్వన్యనుకరణము.
జిఱ్ఱున. ద్ర. క్రి విణ. తటాలున, త్వరగా
జిఱ్ఱుత్రాడు. రూ. జిఱ్ఱత్రాడు.
జిల. కండూతి, దురద.
జిలకఱ, జిలకఱ్ఱ } జీలకఱ్ఱ, జీరకము†.
జిలకఱరాజనాలు. బ. ధాన్యవిశేషము.
జిలగరి. ఒకానొక క్షుద్రజాతి.
జిలమ. ఒకదినుసు వరిపైరు.
జిలమలు. బ. శాలిధాన్యవిశేషము.
జిలిబిలి. విణ. అల్పము; మందము; సూక్ష్మమై అవ్యక్తమధురమైనది; శృంగారప్రయుక్తమైనది. [పట్టుచీర.
జిలిబిలిచీర. చిన్నచిన్న మళ్ళుగల సన్నని
జెలిబిలిజెల్లి. పాపటబొట్టు.
జిలిబిలిపలుకు. కలధ్వని.
జిలుఁగు. సూక్ష్మవస్త్రము. విణ. సూక్ష్మము; మందము; అల్పము.
జిలుగు. స్వర్ణపుష్పి†; గొలుసు మోడి వ్రాఁత; చిక్కు. అ. క్రి. గొలుసు మోడిగా వ్రాయు.
జిలువు. జినుఁగు.
జిలే. జిల్లాలు.
జిలేబీలు. బ. మధురభక్ష్యవిశేషము.
జిల్లు. జిలువు; సూక్ష్మము; అల్పము.
జిల్ల. బిల్లగోడుటయందలి బిల్ల.
జిల్లా. హిం. కలెక్టరువంటి గొప్పయుద్యోగస్థుని అధీనముననుండు ప్రదేశము, రాజకీయవిభాగము, మండలము.
జిల్లి. హిం. మాంసముపైనుండు సన్నని చర్మము.
జిల్లు. శైత్యాధిక్యమును తెలుపుటయందును కాఱుటయందును అగు అనుకరణము.
జిల్లెడు. జిల్లేడు†.
జిల్లేడు. అర్కపర్ణము†.
జిల్లేడుకాయ. జిల్లేడుచెట్టుయొక్క కాయ. బ. భక్ష్యవిశేషములు.
జివుక ఒకదినుసుగబ్బిలము.
జివురు. జిగురు, బంక.
జివ్వు. ఎండ ఎండుట మొదలగువాని యందగు అనుకరణము.
జివ్వున. ద్ర. క్రి. విణ. శీఘ్రముగా.
జివ్వురు. చిముడుటయందగు అనుకరణము.
జిష్ణువు(ఁడు). సం. ఇంద్రుఁడు; అర్జునుడు. విణ. జయశీలుఁడు.
జిహాస. సం. విడువనిచ్ఛ. [వాఁడు
జిహాసువు. సం. విణ. విడువనిచ్ఛగల
జిహీర్ష. సం. హరింపనిచ్ఛ. [వాఁడు
జిహీర్షువు. సం. విణ. హరింపనిచ్ఛగల
జిహ్మగము. సం. పాము. విణ. వంకరగాఁ బోవునది; మెల్లగాఁబోవునది.
జిహ్మము. సం. కపటము; తగరవృక్షము. విణ. మందము; కలఁగినది; వంకరయైనది.
జిహ్మయంత్రము. సం. గాలము.
జిహ్వ. సం. నాలుక.
జిహ్వామూలీయము. సం. ~, క ఖ లకు పూర్వము ఊర్ధ్వాధోముఖముగా నుంచెడు అర్ధచంద్రాకృతి విసర్గము. (ఇట్లే, ఉపధ్మానీయము—పఫలకు పూర్వముంచఁబడు అర్ధ విసర్గము.)

## జీ

జీంఢము. దురవస్థ. విణ. తుచ్ఛసంభాషణము; తుచ్ఛము, నీచము.
జీగురు. నిర్యాసము, జిగురు.
జీగురుగండె. రూ. జిగురుగండె.
జీడి. భల్లాతకి†; మామిడి మొదలగువాని తొడిమయందలి పాలు, సొన; మామిడి టెంకలోని పప్పు
జీడిమామిడి. మోరటి†; జీడిపప్పుగల కాయలు ఫలించెడి ఒక మామిడి†.

జీడియ. భక్ష్యవిశేషము, జీడె.
జీడె. జీడియ. బ. బెల్లము (చక్కెర) పాకముపట్టి నువ్వులద్దినవి.
జీతగాఁడు. విణ. (జీతముతీసికొని పని చేయు) కూలివాఁడు.
జీతనాతములు. జీతము బత్తెము.
జీతము. వేతనము, నెల నెలకు ఈయుటకై నిర్ణయముచేసికొనిన ద్రవ్యము.
జీనపటము. దట్టి.
జీనము. గుఱ్ఱపుజీను.
జీని. గుఱ్ఱపు పల్లము. విణ. నాణెమైనది,
జీనిగిరివాఁడు. చిత్రకారుఁడు.
జీనిపని. సున్నితమైన నగిషీపని.
జీనిసరులు. ధాన్యవిశేషము.
జీను. గుఱ్ఱపుపల్లముమీఁదిమెత్త; లంగరు.
జీనుగ్రోవి. పాములవాడు ఊఁదెడిబుఱ్ఱ.
జీనుఁడు. సం. విణ. ముసలివాఁడు.
జీనువ. పక్షివిశేషము.
జీనువముక్కులు. ధాన్యవిశేషము.
జీనువాయి. జీనువపక్షి.
జీబిలిక. రూ. జిబిలిక†.
జీబు. చీర; పీచు; ఆకులమెత్త. విణ దట్టము; గహనము.
జీబుకొను. అ క్రి తఱుచగు.
జీబులుకు. బీఱు†.
జీమూతము. సం. మేఘము; పర్వతము; [డావరడఁగి†
జీర. రేఖ, గీఱ.
జీరకము. / జీరణము. / జీరము. } సం. జీలకఱ్ఱ.
జీరా. కవచము.
జీరాడు. / జీరియాడు. } అ క్రి. వస్త్రముకొంగు మొ|| నేలఁబడిపొరలు.
జీరు. అ. క్రి. జాఱు; నేలకురాయు. స. క్రి. గీఱు.
జీరుకాఁడు. అ. క్రి; జీరాడు.
జీరుకు. ఊరియాట; జాఱుట; జరుగుడు. బ. జరుగుడాట. విణ. జరుగునది.
జీరుకుపాటు. ఊరియాట.
జీరుకుబండ. జీరుకులాడెడుబండ. బ. జీరుకుబండాట.
జీరుకుమన్ను. నీరుతీసినపిమ్మట పేరిన [మన్ను.
జీరుగు జీలుగు†.
జీరులాడు. అ. క్రి. జీరాడు.
జీరువాఱు. అ. క్రి. జరుగు; తొలఁగు; [వ్యాపించు.
జీర్కు. రూ. జీరుకు.
జీర్కులు బ జరుగుడాట.
జీర్కుబండ రూ. జీరుకుబండ.
జీర్కుబండలు. బ జరుగుడాట.
జీర్ణ. సం. జిలకఱ.
జీర్ణము. సం. జీలకఱ్ఱ. విణ. అఱిగినది; చినిఁగినది; ప్రాఁతది.
జీర్ణవృంతము. సం. తెల్లలొద్దుగు†.
జీర్ణి. సం. జీర్ణమగుట; ముదిమి.
జీర్ణించు. సం. అ. క్రి. జీర్ణమగు, అఱుగు; శిథిలమగు.
జీర్ణుఁడు. సం. విణ. ముదిసినవాఁడు.
జీలకఱ / జీలకఱ్ఱ } జిలకఱ†.
జీలుగు. బొందుబెండు, సితవీర్య†.
జీవ. సం. వీణ మొదలగువాని తంతి చక్కఁగా మ్రోఁగుటకు గాను దానిక్రింద నుంచెడు కంబళిపీస మొ||; పాలకూర; వింటినారి; వస; భూమి; ఆభరణధ్వని.
జీవంజీవము. సం. చకోరము; వృక్షవిశేషము.
జీవంతి. సం. జమ్మి†; తిప్పతీఁగ; పాల [కూర; బదనిక†,
జీవకము. సం. వేఁగిస†.
జీవకుఁడు. సం. ప్రాణి. విణ. జీవించువాఁడు; వడ్డిచేత బ్రతుకువాఁడు; కొలువుడుకాఁడు; పిసినివాఁడు; పాములవాఁడు.
జీవగఱ్ఱ. మి. గ్రా. జీవనౌషధము.
జీవచ్ఛవము. సం. మనుపీనుఁగు, జీవన్మృతుఁడు.
జీవదంతము. సం. ఏనుఁగు జీవించియుండఁగా కోసి ఎత్తిన దంతము.
జీవదుఁడు. సం. వైద్యుఁడు; శత్రువు. విణ. జీవమునిచ్చువాఁడు.
జీవధనము. సం. గోవులు మొ.
జీవన. సం. పాలకూర. [ఉదకము.
జీవనము. సం. బ్రతుకు; బ్రతుకుతెరువు;

జీవని } పాలకూర.
జీవనీయ }
జీవనీయము. సం. ఉదకము.
జీవనోపాయము. సం. బ్రదుకుఁదెరువు.
జీవనౌషధము. సం. బ్రదుకఁజేసెడుమందు.
జీవన్ముక్తి. సం. జీవించియుండఁగనేకర్తృత్వభోక్తృత్వ సుఖిత్వ దుఃఖిత్వాది బంధము లేకుండునట్టిస్థితి.
జీవన్ముక్తుఁడు. సం. బ్రహ్మాకారవృత్తిచేత అజ్ఞానము బాధితమై తద్ద్వారా తనకు స్వరూపమేయై అఖండముగా నుండు బ్రహ్మము సాక్షాత్కరింపఁబడి అజ్ఞానముతోఁ బాటు అజ్ఞానకార్యమైన సంచితాది కర్మయు సంశయ అసంభావన విపరీతభావనలును బాధితములు కాఁగా జీవించియుండియే సకల బంధరహితుఁడు గానుండెడి బ్రహ్మనిష్ఠుఁడు. విష్ణుసంబంధమైన ప్రేమభక్తిగలవాఁడు, గీతోక్తఅద్వేష్టృత్వాదిలక్షణలక్షితుడు
జీవన్మృతుఁడు. సం. విణ. వైశ్వదేవము అతిథి భోజనము మొ॥ లేక నిత్యకార్యములు చేయనందున బ్రతికియు చచ్చినవానితో సముఁడైయుండువాఁడు.
జీవము. సం. ప్రాణము; తత్త్వము; స్వరూపము; పరమాత్మ; విలంబితనృత్యము; బ్రతుకుతెరువు; వేఁగిస†.
జీవరత్నము. సం. శ్రేష్ఠరత్నము.
జీవవృత్తి. సం. గోవులు గుఱ్ఱములు మొ॥ వానిని కాపాడి బ్రదికెడు బ్రదుకు.
జీవశాకము. సం. తోఁటకూర.
జీవసువు. సం. బ్రదికియున్న బిడ్డలుగల ఆఁడుది. [చిత్రకూర.
జీవాంతకము. సం. కొయ్యతోఁటకూర;
జీవాంతకుఁడు. సం. పిట్టవేటకాఁడు.
జీవాతువు. సం. జీవగఱ్ఱ; బ్రతుకు; వంటకము.
జీవాత్మ. సం. దేహి, జీవుఁడు.
జీవి. సం. ప్రాణి. విణ. జీవించువాఁడు.
జీవించు. సం. అ. క్రి. బ్రదుకు.
జీవిక. సం. జీవనోపాయము.
జీవితకాలము. సం. ఆయుస్సు.
జీవితము. సం. ప్రాణము; బ్రదుకు.
జీవితేశుఁడు. సం. ప్రియుఁడు; యముఁడు.
జీవుఁడు. సం. ప్రాణి; బృహస్పతి; అంతఃకరణము అంతఃకరణమునందలి చిదాభాసము అంతఃకరణాధిష్ఠానచైతన్యము అనునీమూడింటి కూడిక; అవిద్యోపాధికుఁడైనఆత్మ; చిదాభాసము; త్వంపదార్థము.
జీవుక. చీకురువాయి.

## జుం

జుంగము. సం. బొద్దికూర.
జుంజురుందలకిరాతుఁడు. మి. చింపిరి జుట్టుగల కిరాతుఁడు.
జుగుప్స. సం. రోఁత; నింద; అవమానము.
జుష్టము. సం. ఎంగిలి. విణ. సేవింపఁబడినది; అనుభవింపఁబడినది.
జుష్యము. సం. విణ. సేవింపఁదగినది.
?జుహురాణము. సం అశ్వము; వాయువు
జుహురాణుఁడు సం. చంద్రుఁడు. విణ. కుటిలము గావించువాఁడు.
జుహువు. సం. స్రుగ్భేదము.
జుహూరాణుఁడు. అగ్నిహోత్రుడు; అధ్వర్యుఁడు; చంద్రుడు.

## జూ

జూటము. సం. జడ; ముడి; చుట్టచుట్టిన జడలు.
జూటా. హిం. విణ. అబద్ధమైన.
జూతి. సం. శీఘ్రగమనము.
జూర్ణము. సం. జొన్నపైరు.
జూర్తి. సం. జ్వరము.

## జృ

జృంభము. సం. ఆవులింత; ఒళ్ళు విఱుచుకొనుట; వికాసము. [చూట.
జృంభణము. సం. జృంభము; విజృంభిం
జృంబించు. సం. అ. క్రి. విజృంభించు; ఆవులించు. నది; [నది; వికసించినది.
జృంభితము. సం. ఆవులింత. విణ. పెరిగి

## జె

జెండా. హిం. టెక్కెము, ధ్వజము.
జెండాకుచ్చులు. బ. ఆచోలములు.
జెండాగుడ్డ. పతాక.
జెంత. ధూర్తురాలు, దుష్టప్రౌఢస్త్రీ.
జెగ. గొప్ప.
జెగిలెకాఁడు. రథికుఁడు; రౌతు.
జెజాయిాలు. ఒకవిధమగు ఫిరంగులు.
జెట్టి. పందెపు కోడిపుంజు పేరు; మల్లుఁడు; శూరుఁడు; వేటకుక్కలలో భేదము. విణ. శ్రేష్ఠుఁడు; ధీరుఁడు; దిట్ట.
జెట్టిపట్లు. బ. మల్లుఁడుపట్టెడిపట్లు.
జెట్టిపెనకువ. మల్లయుద్ధము.
జెట్టీ. మల్లుఁడు.
జెడ్డ. అక్షరద్విత్వము.
జెన. రూ. జిన.
జెబర. ఉపశాఖ
జెముడు. చెముడు, సింహుండము†.
జెయిలు. ఇం. కారాగృహము.
జెఱభి. రంకుటాలు; ముసలిది; వేశ్య.
జెఱి. జెట్టి.
జెఱిపోతు. జెట్టిపోతు.
జెట్టి. కాళ్ళజెట్టి.
జెట్టిపోతు. సర్పవిశేషము.
జెల. భూమిలోపలినుండి వైకురికిపడు సంతతజలధార, బుగ్గ, ఉత్సవము.
జెలగ. జలూక, జలగ.
జెలాకంటె. డేగ.
జెల్ల. మత్స్యవిశేషము.
జెవ. శక్తి.
జెష్ట. గ్రా. పెద్దమ్మ.

## జే

జే. జయయనుదీవన; నమస్కారము.
జేంద్ర. నేతనేసిజీవించెడిఒకానొకజాతి
జేంద్రవాఁడు. కరిణలు, తంతువాయ భేదము.
జేగంట. జయఘంట, గెలుపుమొదలగు సమయములందు కొట్టెడుపెద్దఘంట.
జేగురు. గైరికము.
జేగుఱించు. అ. క్రి. ఎఱ్ఱవాఱు, ఎఱ్ఱనగు.
జేగుఱు. ఎఱుపు, విణ. ఎఱ్ఱనిది.
జేగుఱుఁబురువు. ఇంద్రగోపము.
జేజె. వేలుపు. బ. దేవతలు.
జేజే. జయ జయ యనుదీవన, సర్వోత్కర్షచేత నుండుమని మంగళముచేయుట; నమస్కారము; ఇంద్రుఁడు; దేవుఁడు; దేవత.
జేజేగట్టు. సురాలయము, మేరుపర్వతము
జేజేగిడ్డి. కామధేనువు.
జేజేపట్టు. త్రిదశాలయము, స్వర్గము.
జేజేరేని యరదము., ఇంద్రవాహనము, మేఘము.
జేజేలఁగట్టు. రూ. జేజేగట్టు.
జేజేలపట్టు } రూ. జేజేపట్టు.
జేజేలపాలెము } రూ. జేజేపట్టు.
జేజేల మానికము. దివ్యరత్నము, చింతామణి.
జేజేలు. బ. దేవతలు.
జేడియ } బురద నేల.
జేడె } బురద నేల.
జేత సం. విణ. జయించువాఁడు.
జేతవ్యుఁడు. సం. విణ. జయింపదగినవాఁడు
జేన. పంద్రెండు అంగుళముల కొలఁది, వితస్తి.
జేనేఁడు. విణ. ద్వాదశాంగుళప్రమాణము
జేపెట్టు. స. క్రి. దీవించు.
జేబ. మల్లబంధ విశేషము.
జేబు. చీరె. హిం. చొక్కాయి సంచి.
జేమనము. సం. భోజనము.
జేయుఁడు. సం. విణ. జయింపదగినవాఁడు.
జేరుదస్తు. హిం. దుర్బలమైన.
జేరుబందు. హిం. చబుకు.
జేర్బందు. హిం. సవారి గుఱ్ఱము ముఖపట్టమునకు టంగువారును కట్టునది.
జేవురించు. అ. క్రి. ఎఱుపగు. [జేగురించు.
జేవురు. జేగురు.
జేవుఱించు. అ. క్రి. ఎఱ్ఱవారు. రూ.
జేవుఱు. జేగుఱు.
జేవుఱుగండ్లు. బ. కోటలోనుండి తుపాకులు కాల్చెడు రంధ్రములు.
జేవుఱుఁబురువు. ఇంద్రగోపము.

## జై

జైత్రము. సం. ఇంద్రరథము. విణ. జయశీలమైనది.
జైత్రుఁడు. సం. విణ. జయించువాఁడు.
జైనము. సం. ఒకానొకమతము.
జైనుఁడు. సం. జైనమతమువాఁడు.
జైవాతృకము. సం. బ్రదికించెడి యౌషధము
జైవాతృకుఁడు. సం. చంద్రుఁడు, పంటకాఁపు; వైద్యుఁడు. విణ. దీర్ఘాయుష్మంతుఁడు.

## జో

జోంగకము. సం. అగురుచందనము, అగురు†
జోటి. సం. దుప్పటి.
జోటింగుఁడు. సం. శివుఁడు.
జోనళము సం. జొన్నపైరు, రక్తవర్ణాధిక కృష్ణవర్ణము. విణ. ఆవన్నెగలది.
జోనాళము. సం. జొన్నపైరు. బ. జొన్నలు.

## జ్ఞ

జ్ఞపితము. సం. విణ. చంపఁబడినది; తెలుపఁబడినది;
జ్ఞప్తము. సం. విణ. తెలుపఁబడినది.
జ్ఞప్తి. సం. జ్ఞానము; బుద్ధి; తలఁపు; చంపుట; స్తుతి; సంతోషపెట్టుట.

## జ్ఞా

జ్ఞాత. సం. విణ. తెలియువాఁడు; అహంకారాదులఁ బ్రకాశింపఁజేయు చైతన్యము; చిదాభాసయుక్తమైన అహంకారము.
జ్ఞాతము. సం. విణ. తెలియఁబడినది.
జ్ఞాతవ్యము. సం. విణ. తెలియఁదగినది.
జ్ఞాతి. సం. దాయాదుఁడు, తనగోత్రమువాఁడు; తండ్రి.
జ్ఞాతేయము. సం. జ్ఞాతిత్వము.
జ్ఞానము. సం. తెలివి; సామాన్యజ్ఞానము; విశేషజ్ఞానము; బుద్ధి; శాస్త్రజ్ఞానము; వేదము; నేత్రాది ఇంద్రియములద్వారా బయలువెడలి రూపాదివిషయములలోఁ బ్రసరించెడి బుద్ధివృత్తి; సమ్యక్ జ్ఞానము; దేవతాధ్యానము మొ॥ (ఉపాసన); పంచవింశతితత్త్వజ్ఞానము; జీవుఁడు ఈశ్వరుఁడు జగత్తు-అనెడి భేదభ్రాంతికి అధిష్ఠానమైనదియు నిత్యమును స్వయంప్రకాశమును సచ్చిదానంద స్వరూపమును అద్వితీయమును పారమార్థిక సత్యమునైన బ్రహ్మచైతన్యము; శ్రుతియుక్తులచేఁ గలిగిన ఆత్మనిశ్చయము; జ్ఞానసాధనములైన అమానిత్వము మొ॥ ఇరువది గుణములు; ఏకాత్మదృష్టి; బ్రహ్మాకారవృత్తి; స్వస్వరూపస్ఫూర్తి; జ్ఞానాజ్ఞానములను మీఱిన జ్ఞానము, సృష్టిస్థితిలయముల భానములేని జ్ఞానము.
జ్ఞానముద్ర. సం. చిన్ముద్ర.
జ్ఞాని. సం. జ్ఞానముగలవాఁడు; చతుర్విధభక్తులలో నొకఁడు.
జ్ఞానేంద్రియములు. సం. బ. తెలిసికొనెడి ఇంద్రియములు, శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము.
జ్ఞాపకము. సం. విణ. తెలియఁజేయునది.
జ్ఞాపనము. సం. తెలియఁజేయుట.
జ్ఞాపితము. సం. విణ. తెలుపఁబడినది.

## జ్ఞు

జ్ఞుఁడు. సం. విణ. తెలిసినవాఁడు.

## జ్ఞే

జ్ఞేయము. సం. విణ. తెలియఁదగినది; తెలిసికొనఁదగిన బ్రహ్మపదార్థము; శబ్దాది విషయము.

## జ్యా

జ్యా. సం. వింటినారి; భూమి; తల్లి.
జ్యాచక్రము. సం. భూచక్రము; భూమి.

జ్యాని. సం. ముదిమి; హాని; ఏటు; జీర్ణ మగుట.
జ్యాయుఁడు. సం. విణ. మిక్కిలివృద్ధుఁడు; మిక్కిలి శ్రేష్ఠుఁడు; అగ్రజుఁడు.

## జ్యే

జ్యేష్ఠ. సం. జ్యేష్ఠానక్షత్రము; నాయకుఁడు మిక్కిలి ప్రేమించిన నాయిక; జ్యేష్ఠాదేవి; అప్ప.
జ్యేష్ఠము. సం. ప్రాణము; జ్యేష్ఠమాసము.
జ్యేష్ఠాంబువు. సం, పులికడుగు.
జ్యేష్ఠి. సం. బల్లి.
జ్యేష్ఠుఁడు. సం. విణ. అగ్రజుఁడు; మిక్కిలివృద్ధుడు, మిక్కిలిశ్రేష్ఠుఁడు.

## జై

జైష్ఠము. సం. జ్యేష్ఠమాసము.

## జ్యో

జ్యోతి. సం. వెలుఁగు; నక్షత్రము; అగ్ని; సూర్యుఁడు; చంద్రుఁడు; నేత్రాదీంద్రియము.
జ్యోతిరింగణము. సం. మిడుఁగుఱుఁ[బురువు
జ్యోతిర్లత. సం. మానేరుతీఁగ.
జ్యోతిశ్చక్రము: సం. సూర్యచంద్రాది గ్రహ నక్షత్ర మండలము.
జ్యోతిషము. సం. జోస్యము.
జ్యోతిషికుఁడు. } సం. జోస్యుఁడు.
జ్యోతిష్కుఁడు. }
జ్యోతిష్మతి. సం. మానేరుతీఁగ.
జ్యోతిస్సు. సం. రూ. జ్యోతి.
జ్యోత్స్న. సం. వెన్నెల.
జ్యోత్స్నాప్రియము. సం. చకోరము.
జ్యోత్స్ని. సం. వెన్నెలరేయి.
జ్యోత్స్నిక. సం. వెన్నెల.

## జ్యౌ

జ్యౌతిషికుఁడు. సం. జోస్యుఁడు.
జ్యౌత్స్ని. సం. వెన్నెలరేయి.

## జ్వ

జ్వరము. సం. జూర్తి, వేఁకి. [వాఁడు
జ్వరితుఁడు. సం. విణ. జ్వరముగల
జ్వలనము. సం. మంట; అగ్నిహోత్రము.
జ్వలించు. సం. అ. క్రి. మండు; ప్రకాశించు. [శించినది.
జ్వలితము. సం. విణ. మండినది; ప్రకా

## జ్వా

జ్వాలము. సం. మంట, అగ్నిజ్వాల.
జ్వాలాజిహ్వుఁడు. సం. అగ్ని; పార్వతి యొక్క దూత.
జ్వాలానృసింహస్వామి. సం. నృసింహమూర్తివిశేషము.

—oo:o:oo—

## జె

జెంకించు. స. క్రి. బెదరించు; జడిపించు.
జెంకు. భయము; సంకోచము. అ. క్రి. భయపడు; సంకోచపడు.
జెంకె } బెదరింపు.
జెంకెన }
జెంకెయొనర్చు. స. క్రి. బెదరించు.
జెంగ. జంఘ, పిక్క; దాఁటు; ప్లుతగతి భేదము.
జెంగగంతు. ప్లుతగతిభేదము.
జెంగగొను. అ. క్రి. దుముకు. స. క్రి. దాఁటు.
జెంగనడక(పు). కాలుచాఁచిపెట్టి నడచు నడక.
జంగపిల్లి. అడవిపిల్లి. [లేని శైవుఁడు.?
జంగము. జంగమువాఁడు; కులముకట్టు
జెంగాళము. విణ. నిడువాలు.
జెంగి. అగ్నిప్రసారణము.
జెంగియ. ఒక దినుసుగజ్జె.

విత్తుటకుపయోగించెడి యంత్రవిశేషము; మదము.
జడ్డు జాడ్యము; తగులము; జోలి.
జడ్డుఁదనము. తగులము, కాంతి.
జడ్డువడు. అ. క్రి. మందమగు.
జత జంట; జోడు; సామ్యము.
జతన. యత్నము.
జతనపడు. అ. క్రి. యత్నపడు.
జతనము. యత్నము; త్రిశక్తులలో రెండవది; ఉత్సాహము; ఉపాయము. విణ పదిలము.
జతను. జతనము.
జతనుపడు. అ క్రి. యత్నపడు, సిద్ధమగు. ప్రే. జతనుపఱచు. [జతపఱచు.
జతపడు. అ. క్రి సరిపడు; సిద్ధించు. ప్రే.
జతి. గాన నాట్య యోగ్య శబ్ద సంతతి.
జతిగెలు. బ. ఎద్దుల మెడను తగిలించి కాఁడికిఁ గట్టెడు పట్టెడలు.
జత్తిగె. జడ్డిగము.
జద్దు. కఠిన హృదయత్వము. [వైర
జనము. శణము, భంగ, ఒక విధమైన
జనుపనార. జనుమునుండి తీసిన నార.
జనుపనారపట్టా. జనుపనార పురితో నేసిన గోనె.
జనుపవిత్తులు. బ. శణబీజములు.
జనుము. రూ. జనము.
జన్న. భూజంబువుf. [శివుఁడు
జన్నంపు వేఁటకాఁడు. క్రతుధ్వంసి,
జన్నఁడు. ఒకానొక గుఱ్ఱపు పేరు.
జన్నపుఁజుక్క. మఘానక్షత్రము.
జన్నపుఁదిండి. క్రతుభుక్కు, వేలుపు.
జన్నపుగొంగ. క్రతుధ్వంసి, శివుఁడు.
జన్నపుటొజ్జ. ఋత్విక్కు.
జన్నపురిక్కనెల. మాఘమాసము.
జన్నము. యజ్ఞము.
జన్ని. సన్నిపాతము.
జన్నిగట్టు. బ్రహ్మ, యజ్ఞార్థములైన నియమముల నడపు బ్రాహ్మణుఁడు.
జన్నిదము. యజ్ఞోపవీతము
జన్నియ. దేవతాదుల నుద్దేశించియుంచిన వస్తువు; దేవతార్థము చేసిన నియమము; దేవతాదుల నుద్దేశించి యథేచ్ఛముగా విడిచిన గోవు (ఎద్దు); వ్రతము.
జన్నియపట్టు. స. క్రి. దేవతాదులను ఉద్దేశించి యేదేనొకవస్తువు నెత్తియుంచు.
జన్నియవిడుచు. స. క్రి. దేవతాదులను ఉద్దేశించి యెద్దుమొదలగువానిని యథేచ్ఛముగా విడుచు.
జన్నియావు. హోమధేనువు.
జన్నె రూ. జన్నియ.
జప్తి. హిం జపు.
జప్తిదారుఁడు. జపుచేయువాఁడు.
జప్తు హిం. రాజాజ్ఞచే సొత్తునుబలవంతముగా పట్టుకొనుట.
జబర. పోఁకమీఁది నార; ఉపశాఖ.
జబురుజంగి. ఒకవిధమగు ఫిరంగి.
జబ్బ. భుజము; తొడ పెలిమీఁదిభాగము.
జబ్బు. రోగము. విణ. మందము; నీరసము.
జబ్బుపడు. అ. క్రి. మందమగు; రోగయుక్తమగు.
జమ. } హిం. రాఁబడి.
జమా. }
జమట. జంట.
జమటపాఁత. దేగను చేతనుంచుకొనునపుడు దానిగోళ్లుగ్రుచ్చుకొనకుండ వేసికొనెడు మడత గుడ్డ
జమలి. విణ. జంట.
జమలించు. స. క్రి. రెట్టించు.
జమలిక. చర్మవాద్య విశేషము.
జమలిముకాలి. షట్పదము, తుమ్మెద.
జమళిగ. ఒక చర్మవాద్యము;
జమాబందీ. హిం. సిస్తుఏర్పాటుచేయుట
జమిడపిచ్చోపు. వింజామర.
జమిడి } ద్వంద్వము; ద్వికము.
జమిలి }
జమిలిక(కె). ఒక చర్మవాద్యము.
జమిలిముకాలి. షట్పదము, తుమ్మెద.
జమిలిముకాలివిలుకాఁడు. మన్మథుఁడు
జమిలిముత్తల. షణ్ముఖుఁడు, కుమారస్వామి.
జమీను. హిం. భూమి.

జమీన్దారి. హిం. జమీన్ దారు క్రింద నుండు భూమి.
జమీన్దారు. రాజునకు సిస్తుకట్టు ఒక అధికారి.
జముఁడు. యముఁడు.
జముకాణము. క్రిందవేసి కూర్చుండెడి ముతకనూలితో నేసిన పట్టు.
జముతండ్రి. సూర్యుఁడు.
జముదళము / జముదాడి } నిడుపుపదుఁనుగల కత్తి.
జమున. యమునానది.
జమునగొంగ. బలరాముఁడు, కాళిందీ భేదనుఁడు.
జమునతోఁబుట్టు. యమునాభ్రాత, యముఁడు.
జమునయ్య. సూర్యుఁడు.
జమునసైదోఁడు. యముఁడు.
జమునెక్కిరింత. దున్న, మహిషము.
జముపట్టి. ధర్మరాజు, యుధిష్ఠిరుఁడు.
జములు. బ. ద్వంద్వము.
జమ్మి. శమి.
జమ్ము. తృణవిశేషము ; జంబువు.
జమ్ముఖాణము. జముకాణము.
జమ్మేఱు. జంబూనది.
జర. కత్తి పిడి, త్సరువు.
జరగు. ప్రాఁకుడు. అ. క్రి. ఓమ్ముతో ప్రాఁకు; జాఱు; జీవనము నడచు ; ప్రవర్తిల్లు; కడచు; ఉఱుకు; పోవు; మెల్లగా పోవు.
జరత. జలతారు
జరపు. ప్రే. జరగఁజేయు.
జరపోసు. జలతారు.
జరబాజు. విణ. వెండి జలతారుతో నేసిన వస్త్రము.
జరబు. పేలపిండి.
జరి / జరీ } వెండి బంగారములతో మొలాము చేసిన నూలిపోఁగు; వెండి బంగారముల మొలాము,
జరిమానా. హిం. జుల్మానా.
జరీన / జకీలున } ద్ర. క్రి. విశే. శీఘ్రముగ.
జరుగు. అ. క్రి. రూ. జరగు.
జరుగుఁబాటు. జీవనము.
జరుగుడాట. జీరుకుబండాట.
జరుగుడు. జాఱుడు, గళనము.
జరుగుబడి. జీవనము.
జరుపు. ప్రే. జరపు.
జరుపుడు. దినములను జరుపుట.
జరూరు. హిం. విణ. అగత్యమైన.
జఱజఱ. ఈడ్చుట జాఱుటమున్నగువాని యందగుధ్వన్యనుకరణము; శీఘ్రము.
జఱఛి. అసతి, కులట.
జఱభుఁడు. విణ. పాపి; దుష్టుఁడు.
జఱ్ఱున. ద్ర. క్రి. విణ. శీఘ్రముగ, దబ్బున
జలకట్టియ / జలకట్టె } ఒకానొకడేగ.
జలకమాడు. అ. క్రి. స్నానముచేయు. ప్రే. జలకమార్చు.
జలకము. ఉదకము; స్నానము.
జలగ. నెత్తురు పీల్చెడి యొకానొక జలజంతువు.
జలగంటె. వేఁటపులుఁగు.
జలగడుగు. స. క్రి. బంగారురవ్వలు మొదలగునవి వెదకియెత్తుటకుఁగాను ఇసుకను నీళ్లలోఁబోసి గాలించు.
జలగడుగువాఁడు / జలగరి } మన్నుగడిగి ద్రవ్యార్జనముచేయువాఁడు.
జలజల. ప్రవహించుట రాలుట వడిసోకుట ఉరలుట కాలుట చల్లుట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము; శీఘ్రము.
జలతారు. వెండి బంగారములనీరు పూసిన నూలుపోఁగు; బంగారుతీఁగె.
జలదరము. కంపము.
జలదరించు. అ. క్రి. కంపించు.
జలదరింపు. భయము.
జలదారి. ఇంటిలోని మురికినీరుపోవుటకు కట్టడపు కాలువ.
జలపరించు. అ. క్రి. కంపించు.
జలపోఁత. జరీ.
జలపోసనము. జరీ.
జలుబు. శైత్యము.
జలుబుకారు. వర్షఋతువు.
జలువు. జలుబు.
జలేరి. పానవట్టము.
జల్దారి. జలదారి.
జల్ల. మోఁతబండిమీఁదిగూడు, బండిజల్ల; పెద్ద గంప.

జేల్లను. అ. క్రి. జల్లుమను.
జల్లి. చామరము; కుచ్చు; జాలరు; జడ బిల్ల; అసత్యవచనము; జల్లెడ; వర్షము; ఇటికపొడి ఱాళ్ళు. విణ. అసత్యము.
జల్లించు అ. క్రి. కాఉ. స. క్రి ధాన్యాదులను జల్లెడలోఁబోసి గుండ్రముగా త్రిప్పు; శోధించు.
జల్లికాఁడు. కల్లరి.
జల్లిపెండెము. పాదభూషావిశేషము.
జల్లిమూకుడు. సగమువఱకు చిల్లులుంగల మూకుడు.
జల్లితోకమెకము } చమరీమృగము.
జల్లిమెకము
జల్లివాలుమెకము
జల్లివేరు. వేళ్లకొనను కుచ్చువలె నుండెడు వేరు.
జల్లు. ఉమియుట రాలుట మొదలగు వానియందగు ధ్వన్యనుకరణము; వర్షము; వర్షము పడునపుడు చెదరిపడు నీళ్లు; ధారావర్షము. [జల్లుమను.
జల్లుమను. అ. క్రి. భయాదులచే గుండె
జల్లెడ. చాలని, జల్లించెడు సాధనము; చామరము.
జవ. జడబిల్ల మొదలగువానికి చుట్టు నేర్పఱచెడి అంచు; యంత్రభేదము.
జవజవ. వణకుటయందగు అనుకరణము.
జవట. తాటిమట్టకు అడుగుననుండెడి పంగ, తాటిగెలను పొదిగియుండెడిది.
జవదాఁటు. స. క్రి. మీఱు, అతిక్రమించు.
జవనిక. తెరచీర, యవనిక.
జవర. జవట. ? విణ. మృదువు; ఋజువు.
జవరన. మృదుత్వము; ఋజుభావము.
జవరము. తరచుదనము.
జవరాలు. యౌవనస్త్రీ.
జవలి. వేదిక ?
జవలు. బ. ధాన్యవిశేషము, యవలు.
జవళి. అమ్మఁదగిన క్రొత్తవస్త్రము.
జవాజి. } జవ్వాజి.
జవాది.
జవాదిపిల్లి. సంకుపు, వేదముఖ్య.
జవాబు. హిం. ప్రత్యుత్తరము.
జవాబుదారి. హిం. ఉత్తరవాదము.
జవాహిరి. రూ. జావాహిరి.
జవిలె. వేదిక. [మెత్తగిల్లు.
జవుకు. పంపకము. అ. క్రి. మిక్కిలి
జవుజవ్వు. పాదుటయందును క్రుంగుటయందునగు ధ్వన్యనుకరణము
జవురు. తుపాకి. స. క్రి. కొట్టు; చేతులు కుప్పచేసియెత్తు.
జవ్వనము. యౌవనము, ప్రాయము.
జవ్వని. జవరాలు.
జవ్వాజి. సంకుమదము.
జవ్వాజిపిల్లి. సంకుపు.
జవ్వాజివంకెలు. బ. ధాన్యవిశేషము.
జవ్వాడు. అ. క్రి. చలించు.
జవ్వాది } జవ్వాజి.
జవ్వాదు
జవ్వు. దుర్మదజలము; సౌందర్యము.
జళిపించు క్రే. జడియఁజేయు.
జళుకు. బెదరు.
జళ్లు. బ. జడులు, వర్షములు.

## జొ

జొంఁడ. తంతువాయ భేదము.
జోగా. విణ. గొప్ప. [జాగరము
జోగారము. రాత్రి మేలుకొని యుండుట,
జోగిడు. ఆలస్యము చేయు.
జోగిలంబులమిత్తి. వరాహము.
జోగిలము. పంది మొదలగువానిని బట్టెడు వేఁటకుక్క; కుక్క.
జోగిలు. నమస్కరించు.
జోగు. ఆలస్యము.
జోగుచేయు. అ. క్రి. ఆలస్యము చేయు.
జోజెము. పాలికలయందుఁ బోసిన నవధాన్యముల నారు.
జోజెర. వంచన.
జోజెరకాఁడు. తస్కరుఁడు; వంచకుఁడు.
జోజెరపాటలు. బ. జాదరపాటలు.
జోజెము. రూ. జాజము.
జోజెలపాలికలు. బ. మి. వివాహాదులయందు ధాన్యాదులంకురించుటకు నుంచిన మూకుళ్లు, పంచపాలికలు.
జోజి. జాతి†.

జాజికాయ. జాతీఫలము.
జాజిపత్తిరి. జాజిపత్రి.
జాజిపత్రి. జాతిపత్త్రిక.
జాజిరాజనములు. బ. ధాన్యవిశేషము.
జాజె. ఎఱుపు; కావిరంగు.
జాజెవాఱు. అ. క్రి. ఎఱ్ఱనగు.
జాటి. కళ, బండిగుఱ్ఱములు దుక్కి ఎద్దులు మొదలగు వానిని గొట్టెడు చేఱుకోల.
జాడ. అడుగుల గుఱుతు, పాద విన్యాసము; సైఁగ; పోలిక; త్రోవ; విధము.
జాడకాఁడు. త్రోవగుర్తెఱిఁగినవాఁడు.
జాడా. క్రి. విణ. అమూలముగా.
జాడాచేయు. స. క్రి. నాశముచేయు.
జాడి. ఒకదినుసుమట్టి పాత్రము.
జాడించు. స. క్రి. కంపమొందఁజేయు; గుడ్డలునీళ్ళలోవేసి అటునిటు పొర్లించి యెత్తు.
జాడీ. రూ. జాడి.
జాడు. గింజపట్టుని జొన్నకఱ్ఱ.
జాణ. విణ. నేర్పరి. (నేర్పుగలవాడు, నేర్పుగలది).
జాణఁడు. విణ. జాణయగువాఁడు.
జాణెత. విణ. ధూర్తురాలు.
జాతర. గ్రామదేవతోత్సవము; ఉత్సవము
జాదర. జాదర జాదరఅనువిధమైన పల్లవి గల పాట.
జాది. రూ. జాజి†.
జాదిలి. బుడుబుడుక్కలవాఁడు.
జాదు. ఎఱుపు; కావిరంగు.
జాదుకాను. అ. క్రి. తఱుచుకొను.
జాదురజాదురంబు. అవ్య. మిక్కిలిచాతుర్యము.? [చెడు నిప్పుముట్టించుత్రాడు.
జానకి. కర్ణాటకపుతుపాకుల చెవియందుం
జానము. గుఱ్ఱపుపల్లము మీఁదిమెత్త.
జాను. అందము; సౌందర్యము.
జానుగు. చెవి.
జానువు. అందము; సౌందర్యము.
జాప. వస్త్రమకుటభేదము.
జాపత్తిరి } జాతిపత్రిక.
జాపత్రి }
జాపిరము } అలసత్వము.
జాప్యము }

జాబిలి. చంద్రుఁడు.
జాబిలితాలుపు } చంద్రశేఖరుఁడు,
జాబిలితాల్పు } శివుఁడు.
జాబిలిమేపరి. రాహువు, విధుంతుదుఁడు.
జాబిలిరిక్క. మృగశీర్షనక్షత్రము.
జాబిలిఱాయి. చంద్రకాంతము.
జాబిల్లి. చంద్రుఁడు.
జాబిల్లికెసాన. ఒకానొకవస్తువు.
జాబిల్లిపట్టి. బుధగ్రహము.
జాబిల్లిరిక్క. జాబిలిరిక్క.
జాబిళ్ళు. బ. బాలికాక్రీడావిశేషము.
జాబు. పత్రిక, లేఖ.
జాబుర(రా). ఒకానొకచెట్టు; తావిగట్టిన గంధపు చొక్కపొడి.?
జామ. ఒకఫలవృక్షము. [వస్త్రము.
జామారు. సెల్ల, అంచుకమ్ములులేని తెల్ల
జామీను. హిం. పూఁట, ప్రతిభూత్వము.
జామీనుదారుఁడు. హిం. పూఁటపడు వాఁడు; ప్రతిభువు. [కాలము†.
జాము. యామము, ఏడున్నర గడియల
జారీ. గిండి; కమండలువు.
జారు } గళనము.?
జారుడు }
జారుముడి. కేశబంధవిశేషము.?
జార్చు. ప్రే. రూ. జాఱుచు.
జాఱు. జాఱుడు. అ. క్రి. జరగు; ఊఱు; వదలు; స్ఖలించు; స్రవించు.
జాఱుచు. ప్రే. జాఱఁజేయు.
జాఱుడు. గళనము.
జాఱుపాటు. స్ఖలనము, స్ఖాలిత్యము.
జాఱుపు. జాఱుడు; కొండచఱి.
జాఱువాఱు. అ. క్రి. జారు.
జాల. జాలము; చేఁపలనుబట్టువల; కిటికీ; ఏనుఁగుసిబ్బెము.
జాలకట్టు. నల్లఱాతియందు బెజ్జములేర్పఱచి యుంచిన కిటికి. [జాలరి.
జాలకాఁడు. విణ. ఆలస్యముచేయువాఁడు;
జాలంచేలవిడిది. దేవగంగ.
జాలము. ఆలస్యము.
జాలములుసేయువాఁడు. బిరుసులు గల వాఁడు. [జలగడుగువాఁడు.
జాలరి. ధీవరుఁడు, చేఁపలఁబట్టువాఁడు;

జాలరివాఁడు. పల్లెవాఁడు.
జాలరు. గొడుగు మొదలగువాని కొసను చుట్టు వ్రేలెడు జల్లి మొ. [తట్టు.
జాలవల్లిక. చిత్రపుపనిచేసిన తమలపాకుల
జాలారి. హింస్రస్త్రీ; జలదారి.
జాలి. ఖేదము; మనఃఖేదము; విచారము; కారుణ్యము; శ్యేనభేదము.
జాలికాఁడు. లూత.
జాలిఁబడు. అ. క్రి. జాలిగొను.
జాలిపెట్టు. స. క్రి. దుఃఖపెట్టు. [పడు.
జాలిగొను. అ. క్రి. దుఃఖపడు; విచార
జాలియ. జాలె.
జాలియము. జాలెము.
జాలీ. జాలరు.
జాలు. ఏఱు; చిన్నకాలువ; నీళ్లు మెల్లగా పాఱుట; జలము, జాముయొక్క బహువచనము.
జాలుకొను. అ. క్రి. ప్రవహించు.
జాలుదొడుకు. మేఘము. [తము.
జాలుపుట్టువు. ఉచ్చైశ్శ్రవము; ఐరావ
జాలువా. అపరంజి.
జాలువాఱు. అ. క్రి. ప్రవహించు.
జాలువు. రూ. జాలు.
జాలె. ఒకజాతిడేగ; వరాలుపోసెడియొక దినుసుసంచి; బొంగరపుత్రాడు.
జాలెత్రాడు. మల్లుని యుపకరణవిశేషము.
జాలెము. అశ్వగతివిశేషము.
జాల్గొను. అ. క్రి. ప్రవహించు.
జాల్పుట్టువు. రూ. జాలుపుట్టువు.
జాల్మొలక కల్పవృక్షము.
జావ. నూకలు, యవాగువు, పిండి మొదలగువానిని జేర్చి పలుచగాఁ గాఁచినగంజి
జావడము, అపౌరుషము; పిఱికితనము; గుజ్జుపుతట్టు; ఒకజాతిడేగ.
జావడి. చాకలవాఁడు.
జావళము. గుజ్జుపుతట్టు.
జావళి. గీతవిశేషము.
జావాహిరి. రత్నపుసొమ్ము.
జాళించు స. క్రి. రూ. జాడించు.
జాళియ. రేచితము, అశ్వగతి విశేషము.
జాళియము. జాళియ; వరహాలు పోసెడి సంచి.

జాళువ / జాళువా } అపరంజి.
జాళి. రూ. జాళియ.
జాళిము. జాళియము.
జాళ్వా. రూ. జాళువా.

## ఝ

ఝం. తావివీచుట మొదలగువాని యందగు ధ్వన్యనుకరణము; తుమ్మెదల మొదలగునవి మ్రోయుటయందగు ధ్వన్యనుకరణము.
ఝంఝము / ఝంఝాము } దీపావళిపండుగనాటిరాత్రి బాలురు కాల్చి త్రిప్పెడు తెల్లు విడవలి మొదలగువాని నిడుపాటి సన్నకట్ట; కరదీపము.
ఝంఝం. ఝం; భ్రమరాది ధ్వని.
ఝంఝాఱు. చింపిటిజుట్టు; ఝంఝాఱుకట్ట.
ఝంఝాఱుకట్ట. వెలుతురు పుల్లలు మొదలగువానితో ఏర్పరచిన దివటీ.
ఝంటితేనె. ఝంటీఁగలు కూర్చిన తేనె.
ఝంటీఁగ. తేనెటీఁగ.
ఝజాఱు. గుబురు.
ఝజాఱుకొను. అ. క్రి. గుబురుకొను.
ఝట్ట. ప్రాదేశము, ఝట్టిలి.
ఝట్టనవ్రేలు / ఝట్టవ్రేలు } చూపుడువ్రేలు, తర్జని.
ఝట్టిలి. చాఁపఁబడిన బొట్టనవ్రేలి చూపుడువ్రేలి నడిమికొలత.
ఝట్టు. మయూరశిఖ; శిఖ.
ఝట్టుబులుఁగు / ఝట్టుపక్కి / ఝట్టుపిట్ట } నెమలి, శిఖి.
ఝట్టుపిట్టతాలుపు. శిఖివాహనుఁడు, కుమారస్వామి.
ఝట్టువు. అజశృంగి.
ఝట్టె. ఝట్ట.
ఝట్టెనవ్రేలు. చూపుడువ్రేలు.
ఝడుఁగు. వంచనము; పరాఙ్ముఖము. అ. క్రి. భయాదులచేబెదుఁగు; డాఁగు; వెనుదీయు.

ఝేఱుఁగు. అ. క్రి. జాఱుఁగు.
ఝేఱుఁగుఁడు. వంచనము.
ఝేత్త. గోకర్ణము, ప్రసృతాంగుష్ఠానామికా పరిమాణము.
ఝేత్తనవ్రేలు, జుట్టనవ్రేలు.
ఝేత్రిలి, ఝేత్రె } రూ. జుట్టిలి.
ఝేత్రెఁడు. ద్వాదశాంగుళప్రమాణము.
ఝేన్ను. నవప్రసూత గోక్షీరము వండి చేసినది, జున్నుఁబాలు; జున్నుగడ్డ; తేనె తెట్టె; తేనె.
ఝేన్నుఁబాలు. బ. ఈనినతరువాత వారము రోజులలోఁగా పిదికినపాలు; ధాన్యవిశేషము.
ఝేన్నుగడ్డ. కాఁగిగడ్డకట్టినజున్నుఁబాలు.
ఝేబ్బ. బాహుపురి.?
ఝేబ్బన. దబ్బున [పట్టు.
ఝేమాయించు. స. క్రి. (వాగెను) ఈడ్చి
ఝేమికీలు. బ. స్త్రీకర్ణభూషావిశేషము; పుష్పవిశేషము.
ఝేమ్మ. పక్షివిశేషము.
ఝేమ్మఁడు, ఝేమ్మకాఁడు } విటుఁడు.
ఝేఱకు. ఉఱుము.
ఝేఱకులు. బ. చెట్లయందుండు చీమలు.
ఝేఱుకు. నెత్తురు మొదలగునవి లోపల నుండి పైకి వేగముగా వచ్చుటయందగు ధ్వన్యనుకరణము.
ఝేఱ్ఱు. చూషణము, పీల్చుట యందగు ధ్వన్యనుకరణము. స. క్రి. పీల్చు.
ఝేలిమి. దౌష్ట్యము.
ఝేలుము. దుండగము.
ఝేల్మానా. హిం. అపరాధము; దండుగ.
ఝేవ్వ. ఉచ్చ.?
ఝేవ్వరించు. అ. క్రి. విజృంభించు.
ఝేవ్వి. ప్లక్షము†.
ఝేవ్విదీవి. ప్లక్షద్వీపము.
ఝేవ్వు. వైచుటయందును ఇంకుటయందు నగు ధ్వన్యనుకరణము.

## ఝో

ఝోఁక. తత్తఱపాటు.
ఝోఁకించు. అ. క్రి. తత్తఱపడు.
ఝోజకత్తియ. జూదమాడెడి స్త్రీ.
ఝోజకాఁడు, జూదకాఁడు.
ఝోజము. జూదము; మోసము.
ఝోజరి. జూదరి.
ఝోజి. దూతిక.
ఝోఝేగులు ఘటవిశేషము.
ఝోటాడు. స. క్రి. మోసముచేయు.
ఝోటు. వంచకుఁడు; జాలం; మోసము.
ఝోటుఁదనము. మోసము.
ఝోద. అసత్యము.
ఝోదకత్తియ, ఝోదకత్తె } విణ. జూదమాడెడు స్త్రీ.
ఝోదకాఁడు. విణ. జూదరి.
ఝోవము ద్యూతము. [ద్యూతకారుఁడు.
ఝోవరి. విణ. జూదమాడెడువాఁడు,
ఝోలు. సింహము మొదలగువాని మెడ మీఁది వెండ్రుకలు; ఏనుఁగుమీఁదఁ బఱచెడి యొత్తు కంబళి.
ఝోవరము. సంతాపము; వ్యగ్రత.

## ఝొ

ఝొంపము. ఆకులు కొమ్మలు మొదలగు వాని గుంపు; రెమ్మ; నిరంతరధార. విణ. నిరంతరము; ఝల్లరి.
ఝొంపు. కొండయందలి యూట నీరు.
ఝొగు. భిక్షము. రూ. ఝొగ్గు.
ఝొటఝొట. వడియుట కురియుట మొదలగువాని యందగు ధ్వన్యనుకరణము.
ఝొతుకు. పంకము, అడుసు.
ఝొత్తిలు(ల్లు). అ. క్రి. ఎఱ్ఱవాఱు; రంజిల్లు
ఝొత్తు. ఎఱుపు. [బిడ్డ
ఝొత్తుపాప. మేననెత్తురు దేఱుచున్న లేఁత
ఝొన్న. జూర్ణము, సస్యవిశేషము. బ. దేవధాన్యము. [ఉప్పతిల్లు.
ఝొబ్బిలు(ల్లు). అ. క్రి. స్రవించు; నిండారు;
ఝొట్టిఁగ. రూ. ఝొట్టెఁగ.

జొల్లి. చిన్న యేఱు.
జొల్లు. చొంగ, లాల.
జొల్లెము / జొళ్లెము } కబరీ విశేషము.
జొహారు-వు. నమస్కారము.

## జో

జోక. సామ్యము; బాగు; జత; విధము; ఉత్సాహము; వర్గము, మొత్తము; స్వరూపము; స్వభావము; సౌందర్యము. విణ. మంజులము; సమానము; స్వాధీనము; యుక్తము.
జోకచేయు. స. క్రి. సంపాదించు; సిద్ధపఱచు
జోకపడు. అ. క్రి. జతపడు. ప్రే. జోకపఱచు.
జోకపఱచు. ప్రే. జతపఱచు.
జోకు. శాపము; అసత్యము; ఓడ; తిట్టుట. స. క్రి. తిట్టు; శపించు.
జోకొట్టు. స. క్రి. బిడ్డలు నిద్రపోవుటకుఁగాను జోజోయని చేత వీఁపున మెల్లగా తట్టు; చఱచు.
జోగపట్టియ / జోగపట్టె } యోగపట్టము.
జోగము. యోగము.
జోగి. భిక్షుకుఁడు; యోగి.
జోగిణి. యోగిని, ఒకానొక స్త్రీ దేవత; సోదకత్తె.
జోగిపట్టియ. యోగపట్టము.
జోగు. భిక్షము, జనులెక్కి పోయెడియోడ
జోగురాలు. భిక్షుకురాలు; యోగిని.
జోజో. అవ్య. సుఖముగానుండుమని చేసెడి మంగళము.
జోటి / జోటిక } యోషిత్తు, స్త్రీ.
జోటికత్తియ. చెలికత్తియ. రూ. జోటికత్తె
జోటిపని. మిథునకృత్యము. [వేఁటకుక్క.
జోడఁగి. మిక్కిలి వేగముగా పరుగెత్తెడి
జోడగించు. స. క్రి. జోడననడతో నడిపించు
జోడన. అశ్వగతివిశేషము.
జోడమ్ము. చేయమ్ము.
జోడాలు. బ. నతివిశేషము.
జోడించు. స. క్రి. జతచేయు, చేర్చు.
జోడింపు. మల్లబంధవిశేషము.
జోడు. కవచము; జత, ద్వయము. విణ. సమానము.
జోడుకోడియ / జోడుకోడె } విణ. జత; సమానము; సమానుఁడు.
జోడువెల్పులరిక్క. విశాఖనక్షత్రము.
జోణఁగి రూ. జోడఁగి.
జోత-ము / జోతాము } నమస్కారము.
జోతి. జ్యోతి, కాంతి; దీపము.
జోదాలు / జోదిళ్ళు } బ. నతివిశేషము.
జోదు. యోధుఁడు, దిట్ట.
జోనఁగి. ఒకజాతి కుక్క.
జోనడ. రూ. జోడన.
జోబిళ్ళు బ. నతి, నమ్రత.
జోరావరి. బలాత్కారము.
జోరు. కురియుటయందగు ధ్వన్యనుకరణము; బలాత్కారము.
జోఱీఁగ. పశుమక్షిక.
జోఱుటీఁగ. జోఱీఁగ.
జోఱు. ధ్వన్యనుకరణము. [పాట.
జోల. బిడ్డల నిద్దురపుచ్చునప్పుడు పాడెడు
జోలి. సంగతి, సంబంధము; వృత్తాంతము; ప్రయోజనము; నిమిత్తము; రీతి.
జోలియ. జోలె.
జోలె. కక్షపాల, చౌకపుగుడ్డ నాలుగంచులను జతజతగాఁ జేర్చి ముడివేసి కట్టి చంకను వ్రేల వేసికొనెడు సంచి.
జోవ. రూ. జోల.
జోసి. జోస్యుఁడు, జ్యోతిష్కుఁడు.
జోస్యము. జ్యోతిశ్శాస్త్రము, జ్యోతిషము
జోస్యుఁడు. జ్యోతిషము తెలిసినవాఁడు; జోస్యము చెప్పెడివాఁడు.
జోహారు-వు. నమస్కారము.

## జౌ

జౌకు. బురద. అ. క్రి. మిక్కిలి మెత్తగిల్లు.
జౌచెప్పు. పాఱుటయందగు ధ్వన్యనుకరణము; క్రుంగుటయందగు అనుకరణము
జౌరు. స. క్రి కొట్టు; చేతులతో కుప్ప చేసియెత్తు.

## ఝు

ఝుంకరణము. సం. ఝుంకారము; ఝుంకరించుట. [చేయు.
ఝుంకరించు. సం. అ. క్రి. ఝుంకారము
ఝుంకారము, ఝుంకృతము, ఝుంకృతి } సం. తుమ్మెదరొద (ధ్వని).
ఝుంఝ. సం. గాలివాన; ధ్వనివిశేషము.
ఝుంప. సం. జంపెతాళము; దూఁకుడు.
ఝుట. సం. నేలయుసిరిక†.
ఝురము. సం. సెలయేఱు, కొండకాలువ
ఝురసి. చేఁతరాసి†.
ఝురి. సం. సెలయేఱు.
ఝుర్ఝరము, ఝుర్ఝరి } కయిముడి, జేగంట.
ఝుల్లరి. సం. ఉడుక; వాద్యవిశేషము; గొడుగుజాలరు.
ఝుష. సం. బీఱ†.
ఝుషకేతుఁడు, ఝుషధ్వజుఁడు } సం. మన్మథుఁడు.
ఝుషము. సం. చేఁప; మొసలి; అడవి.
ఝుషలోచన. సం. స్త్రీ; మచ్చెకంటి.

## ఝూ

ఝూటము. సం. సమూహము; కంచె; అడవి; పొద; చీఁపురుకట్ట.
ఝూటలము, ఝూటలి } సం. మొక్కపుచెట్టు.
ఝూబుకము. సం. సన్నపాకులపక్కె†

## ఝి

ఝింటి. సం. నల్లపూవులగోరంట†; పచ్చపూవులచులుగోరంట†; ములుగోరంట†.
ఝిల్లి, ఝిల్లిక } సం. చిమట, ఈలపురుగు; ఎండజిగి; పుండుతుడిచెడుగుడ్డ

## ఝీ

ఝీరుక. సం. ఈలపురుగు.

## ట

ట. భావార్థము. (రక్షించుట, పోషించుట అని).
టంకకము. సం. వెండినాణెము.
టంకణము. సం. వెలిగారము.
టంకము. పదియారుడబ్బుల బంగారు నాణెము. సం. వెలిగారము; గడ్డపాఱ; గర్వము; రాళ్లుచులిచెయులి; నల్లవెలగ†; కత్తి; పిక్క; ధనకోశము; ఇరువదిగురిగింజలయెత్తు. [మ్రోయించు.
టంకరించు. సం. స. క్రి. టంఅని నారిని
టంకవాటు. ఒకానొకబంగారునాణెము.
టంకశాల. సం, టంకసాల. వి } నాణెములు ముద్రించెడుచోటు.
టంకసాలవాటు. ఒకబంగారు నాణెము.
టంకారము. సం. వింటినారిధ్వని; ఆశ్చర్యము; ప్రసిద్ధి.
టంకు. విణ. మాయావి; ధూర్తుఁడు; నాగరికతగలవాఁడు; డాంబికుఁడు.
టంకృతము, టంకృతి } సం. వింటినారిధ్వని.
టంగణ. అశ్వములలో నొకజాతి.
టంగనా. మట్టసపు గుఱ్ఱము.
టంగు., టంగువాఱు. } గుఱ్ఱములమీఁది గంతి జాఱకగిగఁగట్టెడువారు.
టంటం. వింటినారి మొదలగువాని అనుకరణధ్వని.
టకటంకు. మాయావి.
టకటొంకు. మాయావి. విణ. కుత్సితము.
టక్కరి. విణ. కుత్సితుఁడు, దగాకోరు; కుత్సితురాలు; వంచకుఁడు; వంచకురాలు.
టక్కరికాఁడు. విణ. మోసకాఁడు.
టక్కియము.. ధ్వజము.

టక్కు. అసత్యము; వంచన, దగా.
టక్కుబాజీతనము. టక్కరితనము.
టక్కులాఁడి. విశే. మాయలాఁడి.
టక్కులాఁడు. విశే. మాయావి.
టక్కెము. ధ్వజము.
టపా-లు. హిం. అంచె.
టపాకాయ. బాణసంచావిశేషము. [ధ్వని.
టప్పుటప్పు. తుపాకులు మొదలగువాని
టలాయించు. క్రి. అటునిటు తిరుగు.
టవటవ } అసత్యము.
టవలి }
టవళి అసత్యము;ధూర్తుఁడు;ధూర్తత్వము
టవళిక కపటము.
టవళికాఁడు. ధూర్తుఁడు; కల్లరి.
టస్సా. హిం. రీతి.
టుఱ్ఱు. అపానవాయుధ్వని.

## టా

టాంగను. అశ్వములలో నొకజాతి.
టాకనా. హిం. మట్టసపుగుఱ్ఱము.
టాకు. ఉంగరము మొదలగునది జాఱి రాకుండ బంగారు మొదలగువానితో చేసి వేసికొనెడుసన్నని సాదా ఉంగరము; ఓర.
టాటోటు. కపటము; కుజనుఁడు; కుత్సిత స్త్రీ; తబ్బిబ్బు.
టాటోటుకత్తె. చెడుగు; కుచ్చితురాలు.
టాటోటుకాఁడు. విశే. కుచ్చితుఁడు, దగాకోరు; వంచకుఁడు.
టాపు. ఇం. ఇల్లు బండి మొ॥ వానిపైకప్పు.
టాలాటోలితనము. గ్రా. టక్కరితనము.

## టి

టింగణా. వామనుఁడు. [డు.
టింగణాసామి. గుజ్జువేలుపు, విఘ్నేశ్వరు
టికము. త్రికము, మడ్డిపూస.
టికాణా. హిం. స్థానము, ఉండుచోటు.
టికెట్టు. ఇం. రైలు అధికారులు ప్రయాణికులకిచ్చు చీటి.
టిట్టిభము. సం. లకుముకిపిట్ట.
టిప్పణము. సం. లఘుటీక.
టిట్టి. మోసెడు జంతువు; దున్నుచున్న యెద్దులలో వలపలి యెద్దు.

## టీ

టీక. సం. వ్యాఖ్యానగ్రంథము.
టీకము. ఒరగల్లు.
టీకా. ఒకదినుసు పతకము; స్ఫోటకము పొడిపించుట.
టీకు. నడచుటయందలి నిక్కు.
టీచరు. ఇం. ఉపాధ్యాయుఁడు.
టీపు. మంచినడవడికకు పూటగాఁగట్టిన ధనము.
టీవి. విలాసము.

## టూ

టూకి. సంగ్రహము.
టూకించు స. క్రి. సంగ్రహించు.

## టె

టెంక. మామిడికాయలోని విత్తు.
టెంకణదేశము. మి. 56 దేశములలో నొకటి.
టెంకణము. నతి.
టెంకాణాలు బ. నతివిశేషము.
టెంకాయ. నారికేళఫలము.
టెంకాయచెట్టు. నారికేళము†.
టెంకి. స్థానము; తాటాకులకు బెజ్జము వేసెడు సాధనము; గృహము.
టెంకియ } మాదిగవాఁడు రంధ్రములు
టెంకె } వేసెడు సూది.
టెక్కి. దాసరికుల్లాయి.
టెక్కియము. టెక్కెము.
టెక్కు. (యౌవనాదుల వలనఁ గలుగు) గర్వచేష్ట; విలాసము; మల్లయుద్ధములోని మెలఁకువ.
టెక్కులాఁడి. విశే. టెక్కులుగల స్త్రీ.
టెక్కులాఁడు. విశే. టెక్కులుగలవాఁడు.
టెక్కువ. టెక్కు.
టెక్కెపుగాము. కేతుగ్రహము.
టెక్కెము ధ్వజము.
టెక్కెమెగురఁగొట్టు. అ. క్రి. మరణించు.
టెక్యము. జెండా.

## టే

టేంకణము. సం. ఒకానొక దేశము.
టేఁకి. మత్స్యభేదము.
టేఁకు. గృహద్రుమము, శాఖోటము†.
టేఁకుదీవి. శాకద్వీపము.
టేపు. ఇం. నాడా.
ట్రేమాను. కొబ్బరిచెట్టు.
టేవు. పండుటయందగుధ్వన్యనుకరణము.

## టై

టైము. ఇం. కాలము.
టైలరు. ఇం. దర్జీ, కుట్టుపనివాఁడు.

## టో

టోకు. మొత్తము; జెట్లు భుజముతో భుజము తాఁకించుట; సమీపము.
టోపి } పట్టు మొదలగువానితో నేర్పర
టోపీ } చిన కిరీటము; కుళ్ళాయి.
టోలా. హిం. గుంపు.
టోలి. హిం. పైసలో ఎనిమిదవభాగము.

## ఠ

ఠంగన. వామనుఁడు; పొట్టిది.
ఠంగుఠింగు. ఖంగుఖింగు.
ఠక్కుఁడు. సం. విణ. మోసకాఁడు.
ఠక్కురుఁడు. సం. దేవత. [తిఱుఁగు.
ఠలాయించు. హిం. అ. క్రి. అటునిటు
ఠవఠవ. శ్రమము; అసత్యము; అడ్డంకి.
ఠవణించు. క్రి. కావించు.
ఠవణిల్లు. అ. క్రి. ప్రవర్తిల్లు; ఒప్పు.
ఠవర. విణ. నేర్పరి; నేర్పుగలది; ధూర్తస్త్రీ
ఠవళి. కపటము.
ఠవళికత్తె. కుత్సితురాలు.
ఠవళికాఁడు. విణ. మాయావి; వంచకుఁడు, కుత్సితుఁడు.
ఠవిణ (ణె). ఢక్క.

## ఠా

ఠాకురు. గ్రా. దేవత; అధిపతి; తండ్రి. వా. గురువు.
ఠాణము. స్థానము.
ఠాణా. హిం. కావలిస్థలము; జమిందారీ యుద్యోగస్థులకచ్చేరి.
ఠాణియ } గృహము; స్థానము.
ఠాణె }
ఠాణెదారు. పరగణామీఁదినిఘావాను.
ఠాన. తమి.?
ఠాయము } గ్రా. స్వరస్థాయి.
ఠాయి }
ఠాము. గాబరా; గొప్ప.
ఠావు. స్థానము; గృహము.

## ఠి

ఠింగణా. విణ. బాలుఁడు; వామనుఁడు.
ఠికానా. హిం. ఆశ్రయము.

## ఠీ

ఠీవి. వైభవము; ఉదారత్వము.

## ఠే

ఠేవ. ఒప్పిదము; విధము; ప్రాభవము.

## ఠో

ఠోలా. తెగ, సమూహము.

## డ

డంక. విణ. దిట్ట; ఢక్క.
డంకా. ఢక్క.
డంగి. ఎఱ్ఱపగడ†.
డంగు. అ. క్రి రూ. దంగు.
డంగురము. చర్మవాద్యవిశేషము.
డంచు. ప్రే. దంచు.
డంబము. స్థితికిమించినవేషము; ప్రతిష్ఠ; కపటము.
డంబరము. సం విజృంభణము.
డంబు. ప్రకాశము; గర్వము; దంభము; విధము. విణ. అధికము.
డంభము. సం. దంభము.
డక్క. ఢక్క.
డక్కి, డక్కి } ఢక్క; డమరుకము.
డక్కు. అ. క్రి. రూ. దక్కు.
డక్కొను. అ. క్రి. రూ. దక్కొను.
డగర. పిశాచము. విణ. గండు; సమీపము
డగరము. అశుభము.
డగ్గర. దగ్గఱ.
డగ్గఱ. విణ. దగ్గఱ; సమీపము.
డగ్గఱించు, డగ్గఱు } అ. క్రి. సమీపించు.
డగ్గు. దగ్గు.
డగ్గుత్తిక. గద్గదిక.
డజను. ఇం. పండ్రెండు.
డప్పి. దప్పి; శ్రమ.
డప్పు. తప్పెట.
డబడబ. ఉద్ధతి.
డబ్బ. అసత్యము; ధరణి; పాసీలు పెట్టె.
డబ్బఱ. దబ్బఱ.
డబ్బా. తుపాకిమందు మొదలగునవి యుంచుకొనెడు తోలుపెట్టె; సత్తు డబ్బా. [అకస్మాత్తుగ.
డబ్బాటు. అకస్మికము. క్రి. విణ. అవ్య.
డబ్బాటుసాకిరి. విణ. డబ్బాటునవచ్చి యొల్లకార్యములు తెలిసికొనినసాక్షి.
డబ్బి. డబ్బ, ధరణి.
డబ్బు. బొంకు; కర్షమెత్తు రాగిముద్ర; రెండుదుగ్గానుల రాగినాణెము; ధనము; దబ్బరయున్ను; ఒకానొక శకునపుఁబక్షి; డంబము, స. క్రి. బొంకాడు. విణ. అసత్యమైనది.
డబ్బుగలవాఁడు. ధనికుఁడు.
డబ్బుడుబ్బు. ఖంగుఖింగు.
డబ్బుర. వెడలుపాటి నోరుగల లోహపాత్రవిశేషము; గిన్నె. [ద్రవము.
డమరము. సం. కొల్ల మొదలగు దేశోప
డమరుకము. సం. డమరుగము.
డమరుగము. చర్మవాద్యవిశేషము.
డమరువు. సం. డమరుగము, డక్క; చమత్కారము.
డమామి, డమాయి, డమారము } డిండిమము; చర్మవాద్యవిశేషము.
డమాను. హిం. తెఱచాప.
డమ్మను. అ. క్రి. చచ్చు.
డమ్మారము. ఒక చర్మవాద్యము.
డయనము. సం. బాలకాదుల క్రీడాశకటము; పక్షిగతి, పక్షి మింటికెగయుట.
డయ్యు. అ. క్రి. అలయు; బలహీనమగు; కృశించు; ఉపశమిల్లు.
డలాయతు. హిం. బిళ్ళబంట్రౌతు.
డల్లి. హిం. ముద్ద. [పట్టె.
డవాలీ. హిం. బంట్రౌతు బిళ్ళ తగిలించు
డవిఱ. ఢంకా; డమామి.
డవులు. మదింపు, రీతి. స. క్రి. ఇంతయని వెల మొదలగువాని నూహించు.
డస్సిన. విణ. అలసిన.
డహువు. సం. గజనిమ్మ†.

## డా

డా. విణ. ఎడమ.
డాండాం. నగారాయొక్క పిరంగుల యొక్క ధ్వని.
డాంబికుఁడు. ఇంద్రజాలాది మాయలు చేయువాఁడు. [డాఁకోలుపు.
డాఁకొను. అ. క్రి. దాఁగుకొను. ప్రే

# డే

డేఁగురు జయఘంటిక, జేగంట
డేక్చా. హిం. పెద్దవంటపాత్ర.
డేగ. శ్యేనము, సాధారణపక్షులను కుంచేలు మొదలగు స్వల్పమృగాలను వేఁటాడెడు ఒకదినుసుపక్షి.
డేగాట. పెండ్లిఅయినదవసాడు చేసెడి ఒక యుత్సవము. (సమీపబంధువులు పెండ్లికొడుకును, పెండ్లికూఁతును మూఁపుల మీఁద నెత్తుకొని వారిచేమాలలుమార్పింప డేగలవలె ఎగిరియాడెడిఆట.)
డేగిశా. వా. డేక్చా.
డేరా. గుడారము, పటమంటపము.

# డై

డైరీ. ఇం. దినచర్య.
డైలీ. ఇం. ప్రతిదినము.

# డొ

డొంక. నడిచిపల్లముగా నేర్పడిన కాలిదారి; పొద; కోన.
డొంకవల. జాలభేదము. [అడఁగు; తగ్గు.
డొంకు. వంకర. అ. క్రి. ఇంకు; ఎండు;
డొంకెన వంకరఅలుఁగుగల యీఁటె.
డొంగ. దొంగ. [తిరోహితమగు.
డొంగు. చెట్టులోనితొఱ్ఱ. అ.క్రి. దాఁగు,
డొకారము. లోను; అంతరాళము.
డొకారముసొచ్చు. అ. క్రి. లోనగు, లోపడు.
డొక్క. కంకాళము, ఒడలి యెముకలగూఁడు; అరగడము; కడుపు; నారికడపు బొండపుచెక్క.
డొక్కబుఱ్ఱ. తేగపాటిపీడిన తాటివిత్తు.
డొక్కరము. మల్లబంధవిశేషము.
డొక్కు. అ. క్రి. ముదియు. విణ. ముదిసినది
డొగరు. అపరాధము; నింద.
డొప్ప. దొప్ప.
డొలుచు. ప్రే. డొల్లఁజేయు, రూ.డొల్చు
డొల్ల. బుఱ్ఱ; చేటవలె మూఁడుప్రక్కల యందు అడ్డుపలకగల బల్లమొదలగునది.
డొల్లు. అ. క్రి. పొర్లు; పడు.

# డో

డోఁకు. ఓకిలింత. అ. క్రి. ఓకిలించు. స. క్రి. దోఁకు.
డోఁగాడు. } అ. క్రి. దోఁగాడు.
డోఁగియాడు. }
డోఁగు. అ. క్రి. దోఁగు.
డోకడా. (రూపాయలో) నూఱవపాలు.
డోరము. సం. వ్రతసూత్రము, తోరము.
డోరములు. బ. కత్తిమీఁదిచారలు.
డోరియా. హిం. చీర. రూ. డోర్యా.
డోల. సం. ఉయ్యేల; డోలి, చాతా; నీలిచెట్టు.
డోలనము. సం. ఊఁపు; ఊఁచుట.
డోలము. సం. అభినయహస్తవిశేషము.
డోలా. డోలు.
డోలాబ్జము. సం. కలువపువ్వు.
డోలి. ఉయ్యాలవంటి అందలము, డోల.
డోలిక. సం. డోలి. [షము.
డోలు. హిం. ఢోలము, చర్మవాద్య విశే
డోసు. ఇం. మద్యపానము; ఔషధ పరిమాణము.
డోసుగాఁడు. త్రాఁగుబోతు.

# డౌ

డౌలు. మదింపు, రీతి.

# డ్రె

డ్రెస్సరు. ఇం. సహాయవైద్యుఁడు.

## ఢ

ఢంకము. ఆఁబోతు.
ఢంకా. డంకా, యశఃపటహము.
ఢక్క. ఢంకా.
ఢక్కాముక్కి. హిం. సంకటము, ఇబ్బంది
ఢమామిక. సం. డమాయి.

### ఢా

ఢాక. ఔద్ధత్యము.
ఢాలము. సం. డాలువాలు, ఫలకము.

### ఢి

ఢిల్లీ. హస్తినాపురము, భారతీయులరాజధాని.

### ఢుం

ఢుండి. సం. గణపతిమూర్తి విశేషము.
ఢులి. సం. ఆఁడుతాఁబేలు.

### ఢో

ఢోలము. సం. డోలు.

### ఢౌ

ఢౌకనము. సం. కానుక.

---

## త

త. అప, ఇది జాతివాచకమగు స్త్రీ ప్రత్యయము (కమ్మరత, కుమ్మరత, చాకలత అని); ఆశీరర్థము (చేయుత, కావుతఅని)
తంకర. తుచ్ఛధాన్యము
తంగు. రూ. టంగు.
తంగువాలు. రూ. టంగువాలు.
తంగె(గే)డు. గోశ్రేణి†.
తంట. తంటా.
తంటలమారి. తంటాలమారి.
తంటనము. చిమటా, కేశోత్పాటిని.
తంటా. కలహము; చాడీ; శ్రమము; అప్పు; మోసము; అధర్మము.
తంటాలమారి. కలహకారి; చాడీగొట్టు, పిశునుఁడు.
తంటియము, తంటెము } నీలిగూనలలో వేసెడి విత్తుల చెట్టు, తగిరిస†.
తంపకము. మిద్దెటింటికి అడ్డముగా వేసెడి దంతె; వృత్తివిశేషము.
తండసము. చిమటా, మంగలవాఁడు వెంట్రుక ఊడఁబెఱికెడు సాధనము. సం. కమ్మరికొలిమి.
తండా. లంబాడీల సమూహము; సరకు నింపిన గోనెల సమూహము.
తండిరి. తండ్రి. [పోయి అడుగు.
తండు. స. క్రి. (ఇయ్యవలసిన ధనమును)
తండుఁడు. సం. నందికేశ్వరుఁడు.
తండుగోల. చేఁపలఁబొడిచెడు చిల్లకోల, మండము. [బొబ్బరలు.
తండురీణము. సం. కడుగునీరు; పురుగు;
తండులము. సం. బియ్యము; వాయువిడంగము†.
తండులీయము. సం. ధాన్యము; చిత్రికూర.
తండువు. సం. నందికేశ్వరుఁడు; త్రెడ్డుకొయ్య. [పెత్తనము చేయువాఁడు.
తండె(డే)లు. నావికుఁడు, ఓడమీఁద
తండ్రి. జనకుఁడు, కన్నవాఁడు.
తండ్రితండ్రి. పితామహుఁడు, తాత.
తండ్రితల్లి. నాయనమ్మ, పితామహి.
తండ్రిసైదోడు. తండ్రితోడఁబుట్టిన వాఁడు; మేనత్త.
తంతి. తంత్రి, వీణె మొదలగు వానికి వేసెడు ఉక్కుకమ్మి.
తంతియ. సోపానము. బ. మెట్లు.

డాఁగనమ్రుచ్చులు }
డాఁగిలిమూఁతలు } బ. దాఁగుడు మూఁతలు.
డాఁగిలిమ్రుచ్చులు }
డాఁగు. అ. క్రి. అదృశ్యమగు, దాఁగు.
డాఁగుడుమూఁతలు. బ. దాఁగుడు మూఁతలు.
డాఁగురించు. ప్రే. దాఁచు; వంచించు.
డాఁగురింత. దాఁచుట; వంచించుట. బ. దాఁగుడుమూఁతలు.
దాఁగురుమూఁతలు. బ. దాఁగుడు మూఁతలు.
డాఁచు. ప్రే. దాఁచు.
డాఁపు. ప్రే. దాఁపు.
డాక. విజృంభణము; శౌర్యము; పక్షము.
డాకడ. ఎడమపార్శ్వము; ఉత్తర పు దిక్కు.
డాకలి. దాగలి.
డాకల్లు. బండికంటి కడకమ్మి.
డాకిని. సం. పిశాచస్త్రీ.
డాకురు. స. క్రి. కాళ్లు తేలగిల వేయు.
డాకొను. అ. క్రి. సమీపించు.
డాక్టరు. ఇం. పెద్దవైద్యుఁడు; పండితుఁడు
డాగు. గుఱుతు; వాఁత; మఱక.
డాత్కూటము. సం, చేఁదుగలచేఁప.
డాపల. ఎడమభాగము.
డాపలించు. అ. క్రి. ప్రదక్షిణమగు.
డాపలి. విణ. ఎడమ.
డాపు. సమీపము; భయము విణ. దాపైనది.
డాపురము. ప్రాప్తి. విణ. దాపురము.
డాబ. పక్షివిశేషము; జందెమువలె వేసికొనెడులోలుపట్టె.
డాబా. బోడిమిద్దె; అపవాదము.
డాబు. దినుసులపట్టిక; డంబము.
డామరము. సం. దేశోపద్రవము; శివోక్త తంత్రవిశేషము.
డాయి. దాగలి.
డాయు. అ. క్రి. కదియు, సమీపించు.
డాల్. రూ. డాలు.
డాలించు. స. క్రి. డాలుతాల్చు.
డాలు. కాంతి; ధ్వజము; వర్ణము; ఖేటకము.
డాలుకాఁడు. డాలుచేఁబట్టినవాఁడు.
డాలువాఱు. డాలు, కేడెము.
డావర }
డావరడంగి } ఎఱ్ఱపగడ, దేవతాళము†.

## డి

డింకవేయు }
డింకాకొట్టు } అ. క్రి. మరణించు.
డింకీలు. బ. మల్లవిద్యావిశేషము.
డింకు. అ. క్రి. చచ్చు.
డింగరీఁడు. సేవకుఁడు; భక్తుఁడు.
డింగరుఁడు. సం. సేవకుఁడు, భృత్యుఁడు.
డింగిల్లు. బ. నమస్కార విశేషము.
డించు. ప్రే. దించు, క్రిందికిదించు.
డిండి. గొప్పపాములలో భేదము.
డిండిమము. సం. ఢమామిక, రాయడి గిడిగిడి, ఒక వాద్యము.
డిండీరము. సం. సముద్రపు నురుఁగు.
డిందు. అధఃకరణము; న్యూనత; అడఁకువ. అ. క్రి. అడఁగు; ఇంకు; క్రుంగు; చచ్చు; మ్రొగ్గు
డిందుపడు. అ. క్రి శమించు; సమాధానపడు; భ్రమగొను; బలహీనమగు; ప్రే. డిందుపఱచు.
డిందుపాటు. ఉపశాంతి.
డింపు. దింపు.
డింబము. సం. కొల్లలు మొదలగు దేశోపద్రవము; భయము; పక్షిగ్రుడ్డు; ఉోమ్మునందు ఎడమప్రక్క నుండెడు మాంసగోళము; కడుపు నెడమప్రక్కనుండెడు మలాశయము.
డింభము. సం. పిల్ల; శిశువు; గ్రుడ్డు.
డింభుఁడు. సం. విణ. వెలికిలఁదిరిగిపరుండినవాఁడు (బిడ్డ); చిన్న వాఁడు; మూర్ఖుఁడు.
డిగఁద్రావు. అ. క్రి. దిగు స. క్రి. విడుచు.
డిగఁబడు. అ. క్రి. దిగఁబడు.
డిగనాడు. స క్రి. దిగనాడు.
డిగనుఱుకు. అ. క్రి. దిగువకు దుముకు.
డిగియ. నడబావి, దీర్ఘిక.
డిగు. అ. క్రి. దిగు; తగ్గు.
డిగుడు. దిగుడు.
డిగువ. విణ. దిగువ.

డిగ్గఁదాఁటు. అ. క్రి. దిగువకు దుముకు.
డిగ్గఁద్రావు. అ.క్రి. దిగు. స.క్రి. విడుచు.
డిగ్గన. క్ర. క్రి. విణ. దిగ్గన, తటాలున.
డిగ్గనాడు. స. క్రి. దిగనాడు.
డిగ్గనుఱుకు. అ. క్రి. దిగువకు దుముకు.
డిగ్గి. అగ్ని.?
డిగ్గియ. నడబావి, దీర్ఘిక, బొడ్డనబావి.
డిగ్గు. తక్కువ. అ. క్రి. దిగు.
డిగ్గుడు. దిగుడు.
డిగ్గువడు. అ. క్రి. తక్కువపడు
డిమము. సం. రూపకభేదము.
డిమ్మరి. దిమ్మరి.
డిమ్మి. ఇం. ఒకవిధమైన కాగితము.
డిల్లపడు. అ. క్రి. (భయాదులచే) సత్వహీనమగు; నిశ్చేష్టుఁడగు.
డిల్లపాటు. డిల్లపడుట.
డిల్లపోవు. అ. క్రి. డిల్లపడు. [మైనది
డిల్లము. విణ. (భయాదులచే) సత్వహీన
డిస్ట్రిక్టు. ఇం.కలెక్టరుక్రిందనుండు దేశము, జిల్లా.

## డీ

డీ. అవ్య. తలతో పొడుచుట.
డీకు. ప్రే. రేఁపణ.
డీకొను. అ.క్రి. పురికొను; కవియు. స.క్రి. ఎదిరించు. ప్రే. డీకొలుపు.
డీకోలు. డీకొనుట. [కెగయుట.
డీనము సం. మీఁదికెగురుట; పక్షి మింటి
డీలించు. ప్రే. సడలించు.
డీలు. అ. క్రి. డిల్లపడు. విణ. డిల్లము.
డీలుపడు. అ. క్రి. డిల్లపడు; బలహీనమగు. ప్రే. డీలుపఱచు.
డీలుపాటు. డీలుపడుట.

## డు

డు. అప. ప్రథమైకవచనము (రాముఁడు, శంభుఁడు అని); ఆశీరర్థము (చేయుఁడు అని) మరియు నిది క్రియలయందువచ్చును
డున్ అప. అవ్య. ఆనంతర్యార్థమునందు వచ్చును (కొట్టుడున్, తిట్టుడున్ అని) ఆశీరర్థము(అయ్యెడు, అగుఁగాకయని).

డుంకు. అ. క్రి. తగ్గు.
డుండుకము. సం. దుండిగము†.
డుండుకుఁడు. సం. విణ. అల్పుఁడు; క్రూరుఁడు. [తలలపాము.
డుండుభము. సం. ఇరుదలపాము, రెండు
డుక్కు. హుండుక్కు.
డుక్కు. అ. క్రి. మఱుఁగుపడు. [యని)
డును. ఆశీరర్థము (అయ్యెడును, అవుగాక
డుబుడక్కు. బుడుబుడుక్కు, ఊడుక.
డుబుడక్కవాఁడు. బుడుబుడుక్కులవాఁడు, వేషమువేసికొని డుబుడక్కను వాయించుచు మేలుకీళ్ళను దెలిపెడి యొకజాతి బిచ్చపుజోగి
డుయ్యు. అ. క్రి. స. క్రి. దుయ్యు; విప్పు.
డుల్ఱుచ్చి. అవ్య. యుద్ధమునకు పిలుచుట యందు పయోగింపఁబడునది, యుద్ధాహ్వానము. [ణము.
డుల్డుల. డుల్లుటయందగు ధ్వన్యనుకర
డులి. అఁడుతాఁబేలు.
డులుచు. ప్రే. పడవేయు; వదలించు.
డుల్లు. అ క్రి. పడు; ఊడు.

## డూ

డూయు. అ. క్రి. దూయు.

## డె

డెంకణము. నతివిశేషము.
డెందము. హృదయము, మనస్సు.
డెందమ్ముచూలి. మనసిజుఁడు, మన్మథుడు.
డెక్క. ఖురము, పశువుల కాలిగిట్ట.
డెక్కి. వస్త్రముకుటభేదము. [యించు.
డెక్కు. స. క్రి. నివారించు, అటకా
డెక్కొను. అ. క్రి. నెలకొను.
డెప్ప. నెత్తము.
డెప్పరము. ఆపద. విణ అశక్యము, దుర్లభము; దుస్సహము.
డెప్పరించు. అ. క్రి. అశక్యమగు.
డెప్పు. స. క్రి. దెప్పు.
డెబ్బండ్రు. స. డెబ్బదిమంది,
డెబ్బది. స. సప్తతి, ఏడుపదులు.
డెబ్బదిమంది. స. డెబ్బండ్రు.

తజిబీ(వీ)జు. హిం. ఆలోచన; తీర్పు, పరిష్కారము; ఊహ; తలఁపు.
తటకా. నిశ్చేష్టత
తటకాపడు. అ. క్రి. చేష్టలుంతక్కు.
తటకాపాటు. ఆశ్చర్యము; తటకాపడుట.
తటతట. గుండెలదరుట మొదలగు వాని యందలి ధ్వన్యనుకరణము.
తటమట. మోసము. విణ. మోసముగలది; కలఁతనొందినది. [కలఁచు.
తటమటించు. స. క్రి. మోసపుచ్చు;
తటము. సం. వరిమడి; దరి, ఏటిఒడ్డు; ప్రదేశము; కొండచఱియ, పర్వతశిఖరముక్రింది మెరక.
తటవట. రూ. తటమట.
తటవటచేయు. స. క్రి. మోసపుచ్చు.
తటస్థము. సం. విణ. సమీపమునందున్నది; ఒనఁగూడినది. [గూడు.
తటస్థించు. సం. అ.క్రి. సమీపించు;ఒనఁ
తటస్థుఁడు. సం. విణ. న్యాయస్థుఁడు.
తటాక(గ)ము. సం. చెఱువు.
తటాన. ద్ర. క్రి. విణ. తటాలున.
తటాయించు. స. క్రి. అడ్డగించు.
తటారించు. అ. క్రి. ప్రవేశించు.
తటాలు. తటతట. [దబ్బున.
తటాలున. ద్ర. క్రి. విణ. అతిశీఘ్రముగ,
తటి. సం. దరి, ఏటిఒడ్డు; ప్రదేశము.
తటిత్తు. సం. మెఱపు.
తటిత్పతి. సం. మేఘుఁడు.
తటిత్వంతము. సం. మేఘము.
తటిని. సం. నది.
తటుకు(క్కు)న. ద్ర. క్రి. విణ. తటాలున
తటుకుపాటు. ఆశ్చర్యము.
తట్ట. వెదురుబద్దలు మొదలగువానితో నల్లిన పళ్లిక; ఇత్తడి లోహముతో చేసిన తబుకు; చిన్నగంప.
తట్టగిల్లు. అ. క్రి. తట్టయగు.
తట్టము. టంగువాఱు.
తట్టస. ధైర్యము.
తట్టాడు. స. క్రి. ఇట్టట్టు (అడుగులు) ఇడు.
తట్టి. కంచెము; వేఁటతెర.
తట్టు. శబ్దదోషములలో నొకటి; సద్యాది తీరము, దరి; పార్శ్వము. అ.క్రి. కలుగు; తోఁచు. స. క్రి. కొట్టు, చఱచు, హిం. పొట్టి గుఱ్ఱము.
తట్టుచేయి. కోటకొమ్మమీఁది అవయవ విశేషము. [పునుఁగు.
తట్టుపునుఁగు. తట్టి రొ త్తిన మేలైన
తట్టుముట్టాడు. స. క్రి. (దారిద్ర్యము) చుట్టుకొను.
తట్టువ. గుఱ్ఱము, కుత్సితాశ్వము.
తట్టువడు. అ క్రి. బాధపడు.
తట్టువము. రూ. తట్టువ.
తట్టువా. అశ్వము.
తట్టువిఱుగఁబడు. అ. క్రి. ఆనతమగు.
తట్ర. స్వర్ణకారజాతి.
తట్రవాఁడు. స్వర్ణకారుఁడు
తడ. అడ్డి; కడ; ధన్వము †.
తడఁబడు. అ. క్రి. తొట్రుపడు; వ్యత్యాసపడు; చలించు. ప్రే తడఁబఱచు.
తడఁబాటు. వ్యత్యాసము; చలనము.
తడక. గుడిసెకు తలుపుగా వేయునట్టిది. రూ. తడిక.
తడకట్టు. అడ్డగింత. స. క్రి. అడ్డగించు.
తడక ద్రోపరి. తడిక త్రోసివేసి గుడిసెలలో దొంగిలువాఁడు. [కడుపు.
తడకవాటుతెరడొక్క. అంటుకొనిపోయిన
తడకాలు. మల్లబంధ విశేషము.
తడగము. రూ. తణగము.
తడ. ధన్వ వృక్షము.
తడప. పట్టగానుండు నార.
తడపెట్టు. స. క్రి. తడఁబఱచు.
తడయు. అ. క్రి. ఆలస్యము చేయు; తడవులాడు ?
తడవ. తేప, ఆవృత్తి (ఒక తడవ అని).
తడవాడు. అ. క్రి. దోఁగాడు; తడఁబడు.
తడవియాడు. అ. క్రి. దోఁగాడు.
తడవిల్లు. తడబ్రద్దలతోఁ జేసిన విల్లు.
తడవు. ఆలస్యము; చిరకాలము. అ. క్రి. చేతులతో అట్టిట్టు ప్రాకులాడు; దోఁగాడు; స. క్రి. నిమురు; వెదకులాడు; ప్రస్తావించు; విచారించు; రక్షించు.
తడవుఁగనినపట్టిఁగన్నయ్య. శివుఁడు.
తడవుట. అన్వేషణము.

తడవుడు. వెదకుట; విమర్శ.
తడవుదాల్పు. ఒంటిజందెపువాఁడు.
తడవులనిడుపఁడు. శేషుఁడు.
తడి. ఆర్ద్రిత, తేమ; నీరు. విణ. తేమ గలది, ఆర్ద్రము.
తడిక ఆకులు వెదురుబద్దలు మున్నగు వానితోఁ జాఁపవలెఅల్లి దడి తలుపు మున్నగువానివలె ఉపయోగించుకొను సాధనము; పక్షులను వేటాడువాఁడు మఱుఁగుగానుంచుకొను సాధనము.రూ. తడక.
తడికట్రోపరి. తడకట్రోపరి.
తడిపొడి. విణ. కొంచెముతడిగలిగి పొడిగా నుండునది.
తడియు. అ. క్రి. ఆర్ద్రమగు.
తడియొత్తు. తడితుడుచుకొను గుడ్డ.
తడుక. తడక.
తడుకు. తోఁటమొదలగువానిచుట్టు నేర్పఱచెడు వెలుగు; బొండెము.
తడుకున. ద. క్రి. విణ. తటుకున. [బట్ట.
తడుపంచ. భుజశిరమునందు వైచుకొను
తడుపు. గోఁచి; చిన్నవస్త్రము; ఆర్ద్రిత్వము; తడుపంచె. విణ. తడిసినది. ప్రే. తడియఁజేయు.
తడుపుదాలుపు. బ్రహ్మచారి, కౌపీనదారి.
తడుము. అ. క్రి. ఆలోచించు. స, క్రి. నిమురు.
తడువు. తడవు ?.
తడువుతీర్పు. విలంబితము ?
తడువులనిడుపఁడు. శేషుఁడు.
తణగ(గా)ము. ఎద్దుమీఁద నీళ్లుతెచ్చెడి తోలుసంచి (తోలుబరువు).
తణగామెద్దు. నీళ్లుతెచ్చెడి యెద్దు.
తతకము సం. వాయువు.
తతచ్ఛదము. సం. అఱటి†
తతము. సం. వీణ మొదలగు వాద్యము. గాలి. విణ. విస్తృతము, విరివియైనది; వ్యాపించినది.
తతి. సమయము. సం. సమూహము.
తతిమ్మా. హిం. విణ. మిగత, మిగిలిన.
తత్తడి. గుఱ్ఱము. [వాహనుఁడు.
తత్తడినెక్కుడంట. కుబేరుఁడు, అశ్వ

తత్తబడ పరివారము.
తత్తరపాటు. సంభ్రమము.
తత్తరము. సంభ్రమము.
తత్తఱ. తొట్రుపాటు, సంభ్రమము.
తత్తఱపడు. అ. క్రి. తొట్రుపడు.
తత్తఱపాటు తత్తఱపడుట, సంభ్రమము.
తత్తఱపెట్టు. స. క్రి. తత్తఱపఱచు.
తత్తఱము. స్ఖలనము; సంభ్రమము.
తత్తఱించు. అ.క్రి. సంభ్రమించు;చలించు
తత్తఱిలు(ల్లు). అ. క్రి. తొట్రుపడు.
తత్తళి. తత్తడి, గుఱ్ఱము.
తత్తాదృక్కు. సం. సాటిలేనిది.
తత్తెర. సారాపోసెడు తిత్తి.
తత్పరుఁడు. సం. విణ ఆసక్తుఁడు.
తత్పురుష. సం. ఒక సమాసము.
తత్రత్యము. సం. విణ. అక్కడ కలిగినది.
తత్త్వజ్ఞుఁడు. సం. విణ. తత్త్వము తెలిసిన వాడు.
తత్త్వము. సం. పరమాత్మ; స్వరూపము; స్వభావము; నృత్యాదివిలంబితమానము.
తత్సమము. సం. సంస్కృతముతోసమమై తెనుఁగు విభక్తిగల శబ్దము.
తత్సము. సం. మృగపక్షుల కోసము వేసిన యెర మాంసము ?
తథాగతుఁడు. సం. బుద్ధదేవుఁడు.
తథ్య. తథ్యము. ప్రథమావిభక్తి ప్రత్యయ లోపము. [విణ. సత్యమైనది.
తథ్యము. సం. యథార్థము, సత్యము.
తదాత్వము. సం. ఆకాలము. [తిథి.
తదియ. తృతీయ, పక్షమునందు మూడవ
తదీయము. సం. తత్సంబంధమైనది.
తద్గుణము. సం. ఒక అర్థాలంకారము; ఆ గుణము.
తద్ద, తద్దయు } ద్ర. అవ్య. ఎంతయు, అత్యంతము.
తద్దినము. సం. ఆదినము. వా. మృతి బొందిన దినము, ఆబ్దికము.
తద్దె. ఒక పండుగ.
తద్ధర్మము. సం. భూతభవిష్యద్వర్తమానములనుచెప్పెడి క్రియ.
తద్భవము. సం. సంస్కృత శబ్దమునుండి కలిగిన శబ్దము.

తంతివాద్దెము. తంత్రీవాద్యము.
తంతిపు. సంభ్రమము.
తంతు. ఉత్సవవిశేషము; తంత్రము, ఉభయార్థసాధనకమైన ఉపాయము; వివాహాదులలోఁజేయు కార్యవిశేషము.
తంతుకాష్ఠము. సం. సాలెవానినాడె; నూలువడికెడు కదురు.
తంతుకీటము. సం. పట్టుపురుగు.
తంతునాగము. సం. నెగడు, సర్పాకారమైన జలజంతు విశేషము.
తంతునాభము. సం. సాలెపురుగు.
తంతుభము. సం. ఆవాలు.
తంతువాయము. సం. సాలెపురుగు.
తంతువాయుఁడు. సం. సాలెవాఁడు.
తంతువు. కుండె, నూలు. సం. నూలిపోఁగు; తంతునాగము.
తంతె. తంతియ. బ. వీణెమెట్లు.
తంత్రకము. సం క్రొత్తబట్ట.
తంత్రము. సం. ఒరులఆశయము ననుసరించిపోవుట; అధినము; సైన్యము; ఉభయార్థసాధకమైనఉపాయము; వంశము; ఇల్లు; సాలెపురుగు; దారము; ధనము; ప్రబంధము; రాష్ట్రము; శపథము; శైవాదిశాస్త్రము; సామాన్యవిధి; స్వరాష్ట్రచింత; సిద్ధాంతము; వ్యాకరణశాస్త్రము; కుటుంబవ్యాపారము; ఉత్తమమైనఔషధము; ప్రధానము; సాలెవానిమగ్గము; నూలిపడుగు; పరివారము; ఒకానొక వేదశాఖ; హేతువు; ఈలాగు చెయ్యవలెననెడి విచారము. [నరము.
తంత్రి. సం. తంతి; వీణెతీఁగె; తిప్పతీఁగె;
తందనము. మాటిమాటికి తానశబ్దపూర్వకముగా చేసెడు రాగాలాపము.
తందర. తంద్ర, తూఁగు; తత్తరపాటు.
తంద్ర<br>తంద్రి } సం. తూఁగు, కునికిపాటు; అలసత్వము.
తంపర. తామరగుంపు.
తంపి. దాలిగుంట; కలహము; చెత్తయు ముకపోసి నీళ్లు కాఁచుకొనెడిగుంట.
తంబ. తమ్మ, ఒకానొకతీఁగ.
తంబలవాఁడు. తంబళవాఁడు.
తంబళి. శివార్చనచేసి బ్రతికెడుజాతి.
తంబళవాఁడు<br>తంబళి<br>తంబిగ } శివార్చకుఁడు.
తంబు. తమ్ముఁడు.
తంబుగ. మెడ నిడుపుగానుండెడు చెంబు
తంబుర(రా) తంబుఱ.
తంబుఱ(ఱా). పాటపాడువారు శ్రుతికైయుంచుకొనెడు తంత్రీవాద్యవిశేషము.
తకతక. తాళమునందగు ధ్వన్యనుకరణము.
తకపికలాడు. అ. క్రి. ఇట్టట్టుచలించు.
తకరారు. హిం. వివాదము,
తకావి. హిం. సేద్యముచేయుటకై సహాయముగా నీయఁబడుసొమ్ము. [యని)
తక్క. అవ్యవినార్థకము(వినా, అదిదక్క
తక్కటి. మూడుముఖములుగల దీపారాత్రికపు పళ్లెము; ఇతరము.
తక్కటె. ఇతరము.
తక్కన. విసర్జనము.
తక్కరి. విణ. టక్కరి.
తక్కలి. తక్కిలి, తర్కారి.†
తక్కిడి. తర్కారి†; మోసము.
తక్కిడికాఁడు. విణ. మోసకాఁడు.
తక్కినది. విణ. మిగిలినది; అన్యమైనది.
తక్కినవాఁడు. మిగిలినవాఁడు; అన్యుఁడు
తక్కిలి. తర్కారి. †
తక్కు మిగులు; న్యూనత; టక్కు; అసత్యము. అ. క్రి. తప్పు; టక్కుచేయు. స. క్రి. మానుకొను; విడుచు. విణ. ఇతరము.
తక్కుడు. తక్కుట.
తక్కులాఁడి. విణ. టక్కులాఁడి.
తక్కులాఁడు. విణ. టక్కులాఁడు.
తక్కువ. న్యూనత.
తక్కువకంటి. బకము.
తక్కువగు. అ. క్రి. అల్పతనొందు.
తక్కువది. విణ. హీనమయినది.
తక్కువపడు. అ. క్రి. కొఱఁతపడు
తక్కువపాటు. కొఱఁతపాటు.
తక్కువవాఁడు. విణ, హీనుఁడు,

తక్కె. రెండువీసెలయెత్తు; తక్కిలి†
తక్కెడ. తుల, తూఁచెడి సాధనము, పేముతట్టలుగ్రుచ్చి వ్రేలవేసినత్రాసు; తరాక్కిరి†
తక్కెడు. రెండువీసెల యెత్తు.
తక్కెఅ. విణ. స్వల్పము.
తక్కెల. తక్కిలి. † [తక్కెడ.
తక్కేడ (ల). తక్కిలి. తరాక్కిరి † రూ.
తక్కొను. అ. క్రి. యత్నించు.
తక్కోలకము } కక్కోలకము, కోశ
తక్కోలము } ఫలము†.
తక్తు. హిం. సింహాసనము. [చల్ల.
తక్రము. సం. పాతికెపాలు నీళ్ళు కలసిన
తక్రాటము. సం. కవ్వము.
తక్సీరు. హిం. నేరము; అపరాధము.
తక్షకుఁడు. సం. దేవయోనిసర్పవిశేషము; వడ్లవాఁడు, వడ్రంగి.
తక్షణము. సం. (మాను) చెక్కుట.
తక్షణి. సం. బాడిస, (మాను) చెక్కెడి సాధనము.
తక్షుఁడు. సం. వడ్లవాఁడు.
తగటి(టీ). విణ. సరిగది, జలతారుగలది.
తగటు. సరిగ, జలతారు.
తగడు. బంగారు మున్నగువాని రేకు.
తగనివాఁడు. చాలఁడు.
తగరము. రంగము, వంగలోహము; పొట్టేలు. సం. నందివర్ధనము.
తగరు. పొట్టేలు, గొఱ్ఱెపోతు.
తగరుబాబాస్వామి. అగ్ని.
తగరురవుతు } అగ్ని, మేషవాహనుఁడు.
తగరురౌతు }
తగవరి. న్యాయాధిపతి.
తగవు. తగుట; న్యాయము; ధనాది నిమిత్తమైన జగడము; పెండ్లప్పుడు పెండ్లి కూఁతునకు తల్లిదండ్రులిచ్చెడు బహుమానము. విణ. తగినది.
తగవుగోరి. విణ. సంధిచేయువాఁడు.
తగాదా. హిం. దావా, వ్యాజ్యము.
తగినది. విణ. యోగ్యమైనది.
తగినవాఁడు. విణ. యోగ్యమైనవాఁడు.
తగిరవ } ప్రపున్నాటము†.
తగిరిన }
తగిలించు. ప్రే. అంటించు; పొందించు; తగులఁజేయు, తగుల్చు. [మగు.
తగు. అ. క్రి. అర్హమగు; ఒప్పు; యుక్త
తగుకత్తి. సాధనకుపయుక్తమైన ఆయుధ విశేషము.
తగునది. విణ. యోగ్యమగునది.
తగులఁగట్టు. స. క్రి. తగిలించు.
తగులఁబడు. అ. క్రి. తగులు; కాలు, దగ్ధమగు. [దహించు.
తగులఁబెట్టు. స. క్రి. తగిలించు; కాల్చు,
తగులము. అడ్డపాటు; ఆసక్తి, కాంక్ష; వలపు. [సంగిని.
తగులాటకత్తె. తగులాటము గల స్త్రీ,
తగులాటము. బంధము, సంగము.
తగులు. ఆసక్తి; అభిలాష; వలపు; కాంక్ష; తగులాటము. అ. క్రి. చిక్కు, పట్టువడు; పట్టు; తాఁకు; పొందు, సక్తమగు; అంటు; పొసఁగు. స. క్రి. కూడపోవు, వెంబడించు. ప్రే. తగుల్చు.
తగులుకొను. అ. క్రి. రగులుకొను. స. క్రి కామించు.
తగులుకోలు. తగులుకొనుట.
తగులుగొండి. విణ. తగులుకొనునట్టిది.
తగులుచే } ప్రే. తగులఁజేయు.
తగుల్చు }
తగులుడు } తగులుట.
తగులుదల }
తగులుబడి. పట్టుబడి.
తగులువడు. అ. క్రి చిక్కు.
తగులువాటు. తగులువడుట.
తగుల్పడు. అ. క్రి. పట్టువడు.
తగువరి. వా. తగువులు తీర్చెడివాఁడు.
తగువాఁడు అర్హుఁడు;యోగ్యమైనవాఁడు
తగువు. వా. తగవు; ఉచితప్రకారము.
తగ్గు. తక్కువ, న్యూనత; త్రివర్గమునందొకటియగుక్షయము. అ. క్రి. తక్కువగు; వెనుకకుఁదీయు; తెగిపడు.
తగ్గుదల. తక్కువ.
తగ్గురవలి. మంద్రధ్వని.
తచ్చన. కపటము; పరిహాసము; తంత్రము?
తచ్చనలాడు. అ.క్రి } పరిహసించు.
తచ్చనసేయు. స.క్రి }

తనకలి. చిక్కు. విణ. చిక్కుగలది; చిక్కులఁబెట్టువాఁడు.
తనఖా. హిం. దత్తపత్రము, తాకట్టు.
తనఖీ. హిం. విమర్శ
తనంతగలయతఁడు. స్వయంభువు, బ్రహ్మ
తనంతగలయది. బ్రహ్మము, స్వయంప్రకాశము.
తనదు. స్వసంబంధి
తనదుపలుకు. తనమాట.
తనధర్మము. మి. స్వధర్మము.
తనము. అప. భావార్థమునందువచ్చెడు ఒక ప్రత్యయము (పెద్దతనము, చిన్నతనముఅను వెం).
తనము. సం. చందనము; చిత్తముగి.
తనయ. సం. పుత్రిక, కూఁతురు.
తనయుఁడు. సం. పుత్రుఁడు, కొడుకు.
తనరారు. అ. క్రి. ఉన్నతమగు; అతిశయించు. [విజృంభించు; ఒప్పు.
తనరు మంజులము. అ. క్రి. అతిశయించు;
తనరుచు. అ. క్రి. రూ. తనరు. ప్రే. తనరఁజేయు.
తనరుపు. అతిశయము; పొడవు; విశాలము.
తనర్చు. రూ. తనరుచు.
తనర్పు. తనరుపు; వెడలుపు; సంతోషము.
తనాబి. స్తంభములమీఁది గోడకు క్రింద వేసెడు పెద్ద కొయ్య దూలము.
తని. విణ. అల్పము; సూక్ష్మము.
తనిఖీ. హిం. విమర్శ. [శరీరత.
తనిమము. సం. కార్శ్యము; విస్తారము;
తనియు. అ. క్రి. తృప్తిపడు.
తనివి, తనివు } తృప్తి.
తనివెచ్చ. ఇసుమంత కాఁక.
తనివోవు, తనిసను } అ. క్రి. తృప్తిపడు.
తను. విణ. తనువు శబ్దము యొక్క లుప్త రూపము. వా. స. తాను.
తనుకు. తాపము. అ. క్రి. కలుగు, ప్రాప్తించు; జ్వలించు; ప్రకాశించు; తపించు.
తనుత్రము, తనుత్రాణము } సం. కవచము, బొందలము.

తనుధర్మము. సం. దేహధర్మము; జననమరణాది. [పడు.
తనుపారు. అ. క్రి. చల్లనయగు; తృప్తి
తనుపు తర్పణము, తనివి, తృప్తినొందించుట; శైత్యము; శైత్యోపచారము; పితృయజ్ఞము; తడి; సంతోషము; వజ్రకాంతి. ప్రే. తనియఁజేయు. రూ. తన్పు. [స్త్రీ
తనుమధ్య. సం. సన్ననినడుముగల స్త్రీ;
తనుయాత్ర సం. శరీర యాత్ర.
తనువడు. అ. క్రి. చల్లఁబడు.
తనువు. సం. దేహము; తోలు. విణ. చిన్న; బక్క; సన్నము.
తనువెచ్చ. ఇసుమంత కాఁక.
తనూజుఁడు సం. కొడుకు.
తనూనపాత్తు. సం. అగ్నిహోత్రుఁడు.
తనూభవుఁడు. సం. కొడుకు.
తనూరుహము. సం. వెండ్రుక; ఱెక్క. రూ. తనురుహము.
తన్కు. తనుకు. [నిచ్చు.
తన్నిడు. అ. క్రి. స్వాధీనమగు; తన్నుదా
తన్ను. పాదఘాతము. స. క్రి. కాళ్లగ్రుచ్చు, పాదముతో తాడనముచేయు; ఒరయు. [కోల.
తన్నుఁగోల. ఏటవాలుగా పోటి పెట్టిన
తన్నుబల్ల. ద్వారముయొక్క అరిగాళ్ల మీఁద వేసెడు పలక.
తన్నుబిల్ల. బాలక్రీడావిశేషము. [కొను.
తన్నులాడు. అ. క్రి. ఒకరినొకరు తన్ను
తన్మయము. సం. తత్స్వరూపమైనది.
తన్మాత్రము. సం. శబ్దాది. (పంచతన్మాత్రములు—పంచమహాభూతములు— శబ్దతన్మాత్రము, స్పర్శతన్మాత్రము, రూపతన్మాత్రము, రసతన్మాత్రము, గంధతన్మాత్రము. [గల స్త్రీ; స్త్రీ.
తన్వి. రూ. తనివి. సం. పలుచని శరీరము
తపతప. ఱెక్కలు కొట్టుకొనుటయందగు ధ్వన్యనుకరణము. [తపించు.
తపతపలాఁడు. అ. క్రి. ఆఁకలిచే ప్రాణము
తపన. వా. తపనము.
తపనము. సం. తాపము; నాయికను

ప్రియవియోగకాలమందు మన్మథావేశ
ముచే కలిగెడు చేష్ట; వేసంగికాలము;
నరకవిశేషము; జీడి†.
తపనీయము. సం. బంగారు.
తపనుఁడు. సం. సూర్యుఁడు.
తపము. సం. వేసంగికాలము; కాయశోష
ణము, ఉపవాసాదిరూపమైన తపస్సు;
ఒకలోకము; చాంద్రాయణాది వ్రతము;
శిశిరఋతువు; మాఘమాసము; ఆలో
చన; గీతోక్తమైన త్రివిధమగు తపస్సు.
తపమువడు. సం. స. క్రి తపస్సుచేయు.
తపసి. ఋషి, తపస్వి; గార†.
తపసి కన్నుపు. అత్రి నేత్ర జుఁడు,
చంద్రుఁడు.
తపస్య. సం. వ్రతచర్య.
తపస్యము. సం. ఫాల్గునమాసము.
తపస్వి. సం. తపస్సుచేసెడిముని. విణ.
కనికరింపఁదగినవాఁడు.
తపస్విని. సం. తాపసురాలు; కటుక
రోహిణి†; జటామాంసి†.
తపస్సు. సం తపము
తపారము } ఒకదినుసు కుల్లాయి.
తపారు }
తపాలా. అంచెలద్వారా జాబులంపుట.
తపాలాకచ్చేరి. పత్రాలయము.
తపించు. సం. అ క్రి. ఎండు; కాలు;†
జ్వరాదులచే తాపమునొందు; తపస్సు
చేయు. రూ. తపియించు.
తపేల. వండుకొనెడి యిత్తడిపాత్ర.
తపోధనుఁడు. సం తపస్సేధనముగాఁగల
వాఁడు, ఋషీశ్వరుఁడు.
తప్తము. సం విణ కాఁచఁబడ్డది; కాల్పఁ
బడ్డది; ఎండించఁబడ్డది.
తప్తవాలుకము సం. నరకభేదము.
తప్ప. గింజపట్టని ధాన్యము అవ్య. వినా
ర్థకము, తక్క. [కించు, పారిఁజూచు.
తప్పకనుజూచు. స. క్రి. నిదానించి విలో
తప్పకాయ. విత్తుపట్టనికాయ.
తప్పట. పప్పెట.
తప్పఁద్రొక్కుట. అసన్మార్గప్రవర్తనము;
ఆజ్ఞోల్లంఘనము చేయుట.
తప్పనదారి. తప్పుత్రోవ. [ధాన్యములు.
తప్పలు. బ. కొంత గింజపట్టిన సకల
తప్పిదము. తప్పు
తప్పు. అపరాధము, నేరము, దోషము.
అ. క్రి తప్పుచేయు; తక్కు. స. క్రి.
అతిక్రమించు; పరాకగు.
తప్పుడు. తప్పుట.
తప్పుడుగాయి. పక్షివిశేషము.
తప్పుడువడు అ. క్రి. తప్పుపడు; సరితప్పు
తప్పుత్రోవ. పెడదారి, అపమార్గము
తప్పుపల. తప్పుట.
తప్పుదారి. అపథము, తప్పుత్రోవ.
తప్పుదెబ్బలు. బ బళ్లయందు ప్రౌఢ్దెక్కి
వచ్చినఁదులకై వచ్చిన క్రమమును పట్టి
బాలురను ఉపాధ్యాయులు కొట్టెడు
ఒకటి రెండు మొదలగు దెబ్బలు.
తప్పెట. పటహవాద్యము; పనసతుత్తము†
తప్పేల. తపేల, వంటగిన్నె. రూ. తప్పేలా
తఫావతు. హిం. భేదము.
తఫసీలు. హిం. వివర్ణము.
తబక తుచ్ఛధాన్యము.
తబము. తపస్సు.
తబిసి. ఋషి
తబిసీళ్ళు. తేడా.
తబుకు. తాంబూల పాత్రము; పాత్రము
తబుసు. తపస్సు.
తబేలా. హిం. అశ్వశాల.
తబ్బిబ్బు. విపర్యము; తొట్రుపాటు. బ.
నిలుకడలేని రచనలు
తబ్సీలు. హిం. మార్పు.
తమంగము. సం. మంచె.
తమకపడు అ. క్రి. సంభ్రమించు, త్వర
పడు; మోహపడు.
తమకము. త్వర; మోహము; ప్రేమము.
తమకి. విణ. త్వరగలవాఁడు; మోహము
గలవాఁడు.
తమకించు. అ. క్రి. త్వరపడు; చలించు.
తమకు. విధము. అ. క్రి. చలించు; వెను
దీయు.
తమగము. మంచె; మంటపము.
తమట. జ్వాల.

తమటము. తప్పెట.
తమమయము. మీ మయము.
తమము. సం. చీఁకటి; ఒకగుణము; శోకము; రాహుగ్రహము.
తమరకము / తమరము } సం. తగరము.
తమరు. తాము.
తమలపాకుతీఁగె. నాగవల్లి†.
తమలపాకులు. బ. నాగవల్లీదళములు
తమలము. తాంబూలము.
తమస్విని. సం. రాత్రి.
తమస్సు. సం. చీఁకటి; తమోగుణము; అజ్ఞానము, మోహము.
తమాము. హిం. విణ. అంత, పూర్తిగా.
తమాయించు. అ. క్రి. శమించు, స్తిమిత పడు.
తమాలపత్రము సం. బొట్టు; మకరికా పత్రము; చీఁకటిచెట్టు.
తమాలము. సం. బొట్టు; కత్తి; ఉలిమిరి†; చీఁకటిచెట్టు.
తమాషా. హిం. వేడుక.
తమి. త్వర; కుతూహలము; అపేక్ష; వలపు. సం. రాత్రి. చీఁకటి.
తమిఁద. రాగిపైరు.
తమిఁద(దె)లు. బ. రాగులు, చోళ్లు.
తమికొను. అ. క్రి. త్వరపడు; కుతూహలపడు; అపేక్షపడు; మోహపడు. ప్రే. తమికొలుపు.
తమిదెలు. బ. చోళ్లు.
తమిరె. కాఁడినడిమిచీల.
తమిస్ర. సం. చీఁకటిరాత్రి; చిమ్మచీఁకటి
తమిస్రము. సం. చీఁకటి; కోపము.
తముకు. తుడుమువాద్యము.
తములపాకు. నాగవల్లీదళము.
తములపుటాకు. తములపాకు.
తములము. తాంబూలము.
తమోపహుఁడు. సం. సూర్యుఁడు; చంద్రుఁడు; అగ్నిహోత్రుఁడు.
తమోమణి. సం. మెఱుఁగుడుఁబురుగు.
తమ్మ. చర్వితము (నమలిన) తాంబూలము; శింబి. తంబ†.
తమ్మంటు కుండలము.
తమ్మకఱ. తాంబూలపు మఱక.
తమ్మటము. తప్పెట.
తమ్మతినుకు / తమ్మపడిగము } పతద్గ్రహము, తాంబూలము ఉమియు పాత్రము.
తమ్మలము. తాంబూలము.
తమ్మళి. తంబళి.
తమ్మళి తంబళవాఁడు.
తమ్మి. పద్మలత; పద్మము; పద్మవ్యూహము.
తమ్మికంటి. పద్మాక్షి, కమలము వంటి కన్నులుగల స్త్రీ; స్త్రీ; కమలాక్షుఁడు, విష్ణువు.
తమ్మికెంపు. పద్మరాగమణి.
తమ్మికేలు. కరకమలము, పద్మము వంటి హస్తము.
తమ్మిగద్దియ దళవాయి / తమ్మిగద్దియసామి } బ్రహ్మ, కమలాసనుఁడు.
తమ్మిచక్కిలిగింత / తమ్మిచుట్టము } సూర్యుఁడు, పద్మినీవల్లభుఁడు.
తమ్మిచూలి. బ్రహ్మ, పద్మభవుఁడు.
తమ్మిచెలి. సూర్యుఁడు, కమలాప్తుఁడు.
తమ్మిదీవి. పుష్కర ద్వీపము
తమ్మిదొర. పద్మినీవల్లభుఁడు, సూర్యుఁడు
తమ్మిపగతుఁడు. అబ్జారి, చంద్రుఁడు.
తమ్మిపుట్టు. బ్రహ్మ, పద్మభవుఁడు.
తమ్మిబిడారంపు గరితమిన్న. లక్ష్మి, పద్మాలయ.
తమ్మి మోహరము. పద్మ వ్యూహము.
తమ్మియ. చెవితమ్మె; పలుపుతమ్మె.
తమ్మియింటిగరిత. పద్మాలయ, లక్ష్మి.
తమ్మిజాయి. కెంపు, పద్మరాగము.
తమ్మివాల్గంటిమగఁడు. సూర్యుఁడు, పద్మినీవల్లభుఁడు.
తమ్ము. తమ్ముఁడు.
తమ్ముఁడు. అనుజుఁడు, కనిష్ఠభ్రాత.
తమ్ములపగవాఁడు. చంద్రుఁడు, అబ్జారి.
తమ్ములము. తాంబూలము.
తమ్ములవిందు. సూర్యుఁడు, కమలాప్తుఁడు.
తమ్ములవాఁడు. తమ్ముఁడు.
తమ్మె. చెవియొక్క అడుగుభాగము; పలుపుయొక్క ముందుభాగము.
తయారు. హిం. విణ. సిద్ధమైన.
తయినాతి. హిం. కాచికొనియుండుట.

తయిరు. దధి, పెరుగు.
తరంగ. తరంగము.
తరంగము. సం. అల, కరడము.
తరంగిణి. సం. నది.
తరండకము. సం. ఏరుదాఁటెడిపుట్టి.
తరండము. సం. ఓడ; పుట్టి; గాలపు దారముకట్టినకొయ్య ము.
తరఁగ. అల. బ. తరంగములు.
తరకటించు. అ. క్రి తర్కించు.
తరకటింపు. తర్కము.
తరకసము / తరకసా } అమ్ములపొది.
తరక్షము / తరక్షువు } సం. సివంగి.
తరగంపియ / తరగంపె } ఒకదినుసుఅంపము.
తరగతి. మి. గ్రా. తరమును దెలిపెడు భాగము. [కొలెడి సొమ్ము.
తరగతిగుండ్లు. మి. గ్రా. బ. మెడనుకట్టు
తరటు. కళ; అశ్వాదుల శీఘ్రలంఘనము; తోలుసారి.
తరణము. సం. దాఁటుట; ఓడ.
తరణి. సం. ఓడ; దాఁటుట; పిన్నగోరంట†; సూర్యుఁడు; సముద్రము.
తరణికాంతము. సం. సూర్యకాంతశిల.
తరతర. ప్రప్రథమము.
తరతరము. అవ్య క్రి. విశే. క్రమముగా; నానాటికి; పరంపరగా.
తరపణ్యము. సం. రేవు, ఓడనడపువాని కిచ్చెడు కూలి.
తరపు స. క్రి. హరించు, పోఁగొట్టు.
తరపు. హిం. పక్షము; వైపు.
తరబడి. తరము; మానము; సామ్యము; వరుస; వస్తువు.
తరబియ్యతు. హిం. నేర్పు.
తరమిడి. శీఘ్రము; అత్యంతము.
తరము. పురుషాంతరము; సమూహము; మానము; సామ్యము; వరుస; దినుసు. విశే. శక్యము; శక్తము; సమానము; సంభ్రమము; శ్రేష్ఠము; ఇద్దరుమోయు బలువు. సం. దాఁటుట,

తరలిక. యాత్ర. [బయలు వెడలు.
తరలు. అ. క్రి. ప్రయాణమగు, కదలు,
తరలుడు. యాత్ర.
తరవరి / తరవలి } పట్టాకత్తి. రూ. తరవళి.
తరవాణి. పుల్లనీళ్లు, పులిసినగంజి.
తరవాయి. సమయము; ఉపక్రమము; వరుస, అనుక్రమము; తడవ; మిగిలినది.
తరవారి. సం. కత్తి; పట్టాకత్తి.
తరవు. శీఘ్రము.
తరసము. సం. మాంసము.
తరస్వి. స. విశే. వేగముగ నడుచువాఁడు; బలిమిగలవాఁడు
తరస్సు. సం. బలిమి; వడి.
తరహా. హిం. విధము, రీతి.
తరళము. సం. హారమధ్యరత్నము; గంజి. విశే. చలించునది; అనురాగముగలది; ప్రకాశించునది.
తరళితము సం. విశే. చలించినది.
తరళేక్షణ. సం. క్రాలంగంటి.
తరాజు / తరాసు } త్రాసు, తుల.
తరి. త్రచ్చుట; వెన్న. సం. ఓడ; పొగ; మబ్బు; మాగాని.
తరించు. సం. స. క్రి. (సముద్రము మొదలగువానిని ఓడ మొదలగు సాధనములచే) దాఁటు.
తరికంబము. చల్లరాడు.
తరికాఁడు. విశే. త్రచ్చువాఁడు.
తరిగంబము. కుటరము.
తరిగట్టు. కవ్వపుమల, మందరగిరి.
తరిగట్టుత్రాడు శేషఫణి.
తరిగట్టుదారి. విష్ణువు, కూర్మమూర్తి.
తరిగడవ. మంథని. [ఆవు.
తరిగలావు. చాలవెన్న వచ్చెడి పాలిచ్చు
తరిగొండ. మంథాద్రి, మందరాద్రి.
తరిగొజ్జు. ఒకదినుసుకూరాకు, విశల్య.
తరిగోల. కవ్వము, మంథానము.
తరిమెట్టు. స. క్రి. పెరుగుని వేదనముచేయు
తరిటి. రెండుపెండెలు బిగించెడు గోనె పట్టు. రూ. తరిటీ.

తరితీపు ఉపేక్ష; అపేక్ష; ఆలస్యము; గర్వము; ప్రీతి. [ఉపేక్షించు.
తరితీపుసేయు. అ. క్రి. గర్వించు. స. క్రి.
తరిత్రాడు. కవ్వపుత్రాడు, మంథానరజ్జువు
తరిదాలుపు. మందరధరుఁడు. రూ. తరిదాల్పు.
తరిపిదూడ. తఱపిదూడ.
తరిపియావు. తఱపి యావు.
తరివట్టు. స. క్రి. (దేవతల నుద్దేశించి పెరుగును) త్రచ్చక నిలుపు.
తరివె. ప్రామ చిలుకుట.
తరు. చెట్టు, తరువు.
తరుచు. మథించు, చిలుకు.
తరుచుట. చిలుకుట, మథనము.
తరుణము. సమయము. సం. కుబ్జపుష్పము, ఆముదపుఁ జెట్టు. విణ. యౌవనము గలది; క్రొత్తది; లేఁతది. రూ. తలునము.
తరుణి. సం. చేమంతి †; యౌవనము గల స్త్రీ; స్త్రీ.
తరుణిమ. సం. యౌవనము.
తరుణియ. మి. యౌవనవతి. [వాఁడు.
తరుణుఁడు. సం. విణ. యౌవనము గల
తరుపండులు. మి. చెట్లపండ్లు.
తరుపు. తఱుచుట; ?తరిపిదూడ; ముదురు తోరమల్లి; దృఢము.
తరుమ. తరువు.?
తరులు. బ. వళులు.
తరువడి. తరిమెన.
తరువాత. అనంతరము.
తరువాయి. తరువాత.
తరువు. ఈయవలసిన ధనాదికము నిమ్మని చేయు నిర్బంధము. సం. చెట్టు.
తరువుకత్తె. విణ తరువు వచ్చినది.
తరువుకాఁడు. విణ. తరువు వచ్చినవాఁడు.
తర్కము. సం. తర్కించుట; ఊహ, అధ్యాహారము; కారణము; కోరిక; తర్కశాస్త్రము.
తర్కారికము. సం. కాకిగూడు.?
తర్కించు. సం. అ. క్రి తర్కము చేయు.
తర్కుటము. సం. (నూలు) వడుకుట.
తర్కులాసకము. సం. నూలువడుకునపుడు కదురు క్రిందనుంచుకొనెడు చిప్ప.
తర్కువు. సం. (నూలువడకెడు) కదురు.
తర్చు. స. క్రి రూ. తరుచు.
తర్జనము. సం. అదలుపు, చెదరించుట.
తర్జని. సం. జుట్టనవ్రేలు.
తర్జించు. సం. స. క్రి. అదలించు.
తర్జుమా. హిం. అనువాదము.
తర్దువు. సం. త్రెడ్డు.
తర్ణకము. సం. అప్పుడుపుట్టినదూడ.
తర్దనికము. కాకిగూడు.?
తర్పణము సం. తృప్తి; తృప్తిచేయుట; పితృయజ్ఞము.
తర్మము. సం. యూపస్తంభపుకొన.
తర్లు. అ. క్రి. రూ తరలు.
తర్లెర. ఏరు. ?
తర్వాత. అవ్య. అనంతరము.
తర్షణము. సం. దప్పిగొనుట.
తర్షము. సం. దప్పి; ఇచ్ఛ; అత్యాదరము.
తర్షితుఁడు సం. విణ దప్పిగొన్నవాఁడు
తఱక. గింజెపట్టని ధాన్యము. బ. కాయధాన్యము మేలురాశి కాఁగా మిగిలినది.
తఱచు. బాహుళ్యము. విణ. బహుళము; అధికము.
తఱటు. కళ; మూర్ఖ్యము. స. క్రి. కొరడాతోఁ గొట్టు విణ. మూర్ఖము.
తఱటుగొను } స. క్రి. కొరడాతోఁ
తఱటుసేయు } గొట్టు.
తఱతఱ. తత్తఱ.
తఱతఱలాడు. అ. క్రి. తత్తఱపడు.
తఱపి. బష్కయము, ఆఱునెలలదూడ; తారుణ్యము. విణ. తరుణము.
తఱపియావు. బష్కయణి, బహుకాలము నను ముందీనిన యావు
తఱలు. అ. క్రి. చలించు; బయలువెడలు; సంభ్రమించు; భయపడు?. స. క్రి. విడుచు
తఱలుచు. ప్రే. తఱలఁజేయు. రూ. తఱల్చు
తఱి కాలము, సమయము; సమీపము; త్రాడు మొదలగువాని యొత్తుడు రేఖ; తఱి మెన శబ్దముయొక్క లుప్తరూపము; వళి. రూ. తరి.
తఱిగొను. అ. క్రి. యత్నించు.
తఱిగొల్పు. స. క్రి. ప్రేరేపణచేయు.?

తఱిపివెన్నెల. పండువెన్నెల.?
తఱిమిడు. స. క్రి. గిఱగిఱ త్రిప్పు.?
తఱిమెన. ప్రమానుచిలుకుట.
తఱిమెనఁబెట్టు. స. క్రి. ప్రమానుచిలుకు.
తఱియఁబడు. అ. క్రి. తఱియు.
తఱియు. అ. క్రి. సమీపించు. స. క్రి. అతిక్రమించు; దాఁటు.
తఱివడు. అ. క్రి. ఒత్తుడుపడు.
తఱుఁగు. తగ్గు. అ. క్రి. అల్పతనొందు.
తఱుగరి. తఱుగుబేరకాఁడు, బేరము పొందించెడివాఁడు, దలాలీకాఁడు.
తఱుగాకు. కాయగూరకు.
తఱుగు. అమ్మెడువానికిని గొనెడువానికిని ఒకసరకును వెలకుదిర్చి తీసియిచ్చి వారివద్ద నూటికింతయని తీసికొను ద్రవ్యము. స. క్రి. ఖండించు; చించు. అ. క్రి. తగ్గు.
తఱుచు. తఱచు, సాంద్రత్వము.
తఱుపు. ఏఁడాదివయసుచెల్లిన దూడ; మణివిశేషము.
తఱుము. అ. క్రి. కవియు; త్వరితపడు. స. క్రి. వెంబడించి పరుగెత్తించు. బలాత్కరించు; తఱిమెనఁబెట్టు; ఉచ్చాటనముచేయు.
తఱుముకపోవు అ. క్రి. వెనుతగులు.
తఱులమెకము } వలీముఖము,
తఱులమోరమెకము } కోఁతి.
తఱులు. బ. తరంగములు; వఱులు.
తఱువు. అ. క్రి. తగ్గు. స. క్రి. ఖండించు.
తఱుసరి. విశే. ఉద్ధతుఁడు; ఉద్ధతురాలు.
తఱ్ఱి } విశే. నీచుఁడు.
తఱ్ఱు }
తల. శిరస్సు; శిరసువెండ్రుకలు; కొన; పూనిక; ఎత్తు; ముందుభాగము; మొత్తము; ఎడ; సమయము; చోటు; రంగము; పక్షము. విశే. మొదలు, ఆది; స్మృతి విశేషము.
తలంచు. తలఁచు.
తలంటు. అభ్యంగము. అ. క్రి. తలయంటు.
తలంపు. తలఁపు. [జేయు.
తలఁకించు. అ. క్రి. చలించు. ప్రే. తలఁక
తలఁకు. చలనము; భయము. అ. క్రి. చలించు; భయపడు [గించు, పోఁగొట్టు.
తలఁగు. అ. క్రి. తొలఁగు. ప్రే. తొలఁ
తలఁగుడు. తొలఁగుట.
తలఁచు. స. క్రి. ఎంచు; ధ్యానించు, స్మరించు; విచారించు.
తలఁడు. భయము; చలనము.
తలపించు ప్రే. స్మరింపఁజేయు.
తలఁపు. తలఁచుట, స్మరణము; అభిప్రాయము; కోరిక; చింత; జ్ఞప్తి; హృదయము.
తలఁపుకేళాకూళి. మానససరస్సు.
తలఁపుకేళాకూళి పులుగురౌతు. హంసవాహనుఁడు, బ్రహ్మ.
తలఁపుచేయు. అ. క్రి. ఎంచు.
తలఁపుచూలి. మన్మథుఁడు, మనసిజుఁడు.
తలఁపుమిన్న. చింతామణి. రూ. తలఁపురతనము.
తలఁపుఱాయి. చింతామణి
తలఁపుఱాయినంతరించినదొర. ఇంద్రుఁడు. రూ. తలఁపుమానికము గలాఁడు.
తలఁపుసాకిరి. విశే. ఈ కార్యము నీ వెఱిఁగియుండుమని పలుమాఱు వాదిచే తెలిపింపఁబడిన సాక్షి.
తలఁబ్రాలు. అర్ద్రాక్షతలు, వివాహకాలమందు దోసెళ్లతో తలమీఁద బోయునక్షతలు.
తలకట్టు. అకారముయొక్క రూపాంతరనామము; కిరీటము; పాగకట్టుట; పాగ విశే. ముఖ్యము; శ్రేష్ఠుఁడు; శ్రేష్ఠురాలు
తలకడచు. స. క్రి. అతిక్రమించు; ముందఱికివచ్చు.
తలకప్ప. జలచర విశేషము.
తలకపాల్లు తుచ్ఛధాన్యము.
తలకాఁడి. బరువు అధికమైరెండెద్దులకంటె హెచ్చుగ కట్ట వలసినప్పుడు సంతన చేసి మొదటికాఁడికి ముందుకట్టెడు మఱియొక కాఁడి, ప్రాసంగము.
తలకాయ. తల. [కూర్చు.
తలకూడు. అ. క్రి. సిద్ధించు, ప్రే. తల
తలకెడవు. విశే. తలక్రిందు.

తలకొట్లమారి. శిరశ్ఛేదనము పొందిన వాఁడు; అవినీతుఁడు.
తలకొని. అత్యంతము.?
తలకొను. అ. క్రి. కలుగు; యత్నించు స. క్రి. తాల్చు. ప్రే. తలకొల్పు.
తలకొనుదెంచు. అ. క్రి. తలకొను.
తలకొఱవి. దహనసంస్కారమున శవము తలకడనుంచెడు కొఱవి; గూఢశత్రువు.
తలకోల. సాధువుకాని యావును పిదుకునపుడు కొనను త్రాడుకట్టి దానికొమ్ములకు తగిలించి పట్టుకొనెడు కోల.
తలకోలు. తలకొనుట. [విలోమము.
తలక్రిందు. విణ. అధోముఖమైనది;
తలక్రిందుజోగి. బిచ్చగాఁడు.
తలగడ (పండుకొనునపుడు) తలయుంచుకొనెడు దిక్కు; ఉపధానము, తలక్రింద ఎత్తుగా నుంచుకొనెడు నిడుపాటి దిండు.
తలగడుగు. తలంటు, అభ్యంగము.
తలగాము. రాహువు.
తలగుంజె. నిట్టాడు.
తలగొట్లమారి. శీర్షచ్ఛేద్యుఁడు.
తలచీల. మీటను మునసను (నిట్టాడును ఏతపుఁగదురును) జేర్చి బిగించెడు చీల.
తలచేమురు. తలకు రాచికొనెడి నూనె.
తలచేవడి. తలవాకిటి (ఇంటి ముందటి) చావడి.
తలచుట్ట. పాగ, ఉష్ణీషము.
తలచుట్టు. పాగకట్టుట; పాగ.
తలచూపు. అ. క్రి. తోఁచు.
తలజులు. పన్నులు.?
తలడిల్లు. అ. క్రి. రూ. తల్లడిల్లు.
తలడించు. అ. క్రి. చలించు.
తలతంత్రము. సం. మార్గమున ఉపద్రవములు లేకుండ చూచుటకై యుద్ధమునకు ముందు నడచెడి సైన్యము.
తలతల. అవ్య. మనుష్యునికి మనుష్యునికి.
తలతలము. తొలఁగు తొలఁగుము.
తలత్రాడు. ఎద్దు కొమ్ములకుఁ గట్టెడు కుచ్చుల తోలుత్రాడు.
తలదువారము. తలవాకిలి. [లెండుట.
తలనట్టు. వేరుపురుగు కొరికి మోపు
తలనిలువు. తల పొడవు.
తలపడు. అ. క్రి. ప్రారంభించు; ఏర్పడు. స. క్రి. ఎదుర్కొను; తాఁకు.
తలపాటు. ప్రారంభము; ఎదిరించుట.
తలపాలు. కరోటి, తలపుర్రె.
తలపెట్టు. అ. క్రి. ప్రారంభించు. ప్రే. ఎదిరింపఁజేయు. స. క్రి. ప్రస్తావించు.
తలపొలము. పొలిమేర వెంబడి నున్న పొలము.
తలపోఁత. చింత; ఆలోచన.
తలపోఁయు. అ. క్రి. తలఁచుకొను; చింతించు; విచారించు.
తలబీకనకాయ. విణ. కలఁతనొందినది.
తలబుదారు. బ. రహితులను దివాణపు చాకర్లను పిలువవచ్చినవారు.?
తలమాటు. చేటు, నాశము.
తలమానికము. అలంకారార్థము శిరమునందుంచుకొనెడు రత్నము. విణ. శ్రేష్ఠము.
తలమాను. తలమీఁద నంటుకొన్న మావి.
తలమించు. అ. క్రి. ముందుమించు.
తలమిగులు. అ క్రి. ముందుమిగులు, ముందటికివచ్చు.
తలమీఱు. అ. క్రి. ముందుమీఱు.
తలము. ఏతము; స్థానము విణ. శక్యము.
తలము. సం. వింటిదెబ్బ తగులకుండ చేతికి తొడుగుకొనెడి అత్తెము; అడవి; కారణము; పాతాళలోకము; స్వరూపము; క్రిందిభాగము; కాళ్ళ చేతుల క్రిందిభాగము; తాటిచెట్టు; చాఁచినవ్రేళ్ళుగల అఱచేయి; కత్తియొక్కపిడి; ఎడమచేతి తంతిమీటు.
తలముదప్పు అ. క్రి. అశక్యమగు.
తలమునుక. శిరస్స్నానము; శిరఃప్రమాణము. రూ. తలమునక.
తలముళ్ళు. బ. వేఁటకాని సాధనము; దొంగయొక్క సాధనము.
తలయంటు. అభ్యంగము. అ. క్రి. తలమీఁద (నూనెపెట్టి) రాచు.
తలయంపి. తలగడ, మంచమునకు తలవైపు. రూ. తలాఁపి.
తలయెత్తు. అ. క్రి. వర్ధిల్లు; మొలచు.

తలయేరు. తలనొప్పి.
తలయేఱు. ఆకాశగంగ.
తలరు. భయము. అ. క్రి. చలించు; చింతించు; కలఁగు; సంభ్రమించు; ఒప్పు
తలవంపు తలవంచుట; అవమానము.
తలవరి. తలారివాఁడు.
తలవాకిలి. ఇల్లు మొదలగువాని మొదటి ద్వారము, ప్రహరిద్వారము.
తలవాడి. ఇక్ష్వగ్రము.
తలవాడు } తలవాడి.
తలవాడె
తలవిడి. తలనఱికిన తాటిచెట్టు మొదలగు తృణద్రుమముయొక్క తలకుండు.
తలవీడు. పురఃప్రదేశము, సమీప ప్రదేశము.
తలవు. అ. క్రి. తొలఁగు. ప్రే. తొలఁగించు. రూ. తలఁగు
తలసాల. ఇంటి తలవాకిలి.
తలా. అవ్య క్రి విణ. చెటి.
తలాఁడు. తలగడ.
తలాఁపి. తలయంపి.
తలాఁపు. తలగడ.
తలాటము. పికిలిపిట్ట మొక్క లం మొదలగువానిచే నేర్పఱచి గుఱ్ఱముకెత్తిని నిలువుగా నమర్చెడు తురాయి.
తలాటి. ఆనుడుబిల్ల.
తలాడ. రూ. తలగడ.
తలాయింత. తలాకొంచెము.
తలారి. ఆరెకుఁడు, కొత్వాలుబంట్రౌతు, రాత్రులయందు దొంగతనము లేకుండునట్లు కావలికాచు దొరతనపుబంటు.
తలారించు. అ. క్రి. మరలు.
తలారిదొర. కొత్వాలు.
తలి. రూ. తల్లి.
తలికె. అవ్య. ముందు.
తలిమము. సం. దూదివేసినపఱుపు; మేలుకట్టు; జాతికట్టడపుసేల; కత్తి.
తలియ. భోజనపాత్రము.
తలిరు. చిగురు, పల్లవము.
తలిరుఁబోఁడి. చిగురుఁబోఁడి.
తలిరుచు. అ. క్రి. పల్లవించు, చిగురించు; సంతోషించు;అతిశయించు.రూ.తలిర్చు
తలిరుపానరి. దాసరివాండ్రలో భేదము.
తలిరుదిండి. కోయిల.
తలిరుపు. తలిరుచుట. రూ. తలిర్పు.
తలిరుమేఁతరి. కోకిలము.
తలిరువిలుతుఁడు. మన్మథుఁడు. రూ. తలిరువిల్తుఁడు.
తలిమము. శయ్య.
తలుకు రూ. తళుకు.
తలుగు. పలుపు.
తలునము సం. తరుణము.
తలుని. సం. తరుణి.
తలుపు. కవాటము.
తలేరు. తలనొప్పి.
తలోదరి. సం. కృశోదరియగు స్త్రీ; స్త్రీ.
తల్గడ. రూ తలగడ.
తల్గు అ క్రి. రూ. తలఁగు. రూ. తలుగు.
తల్చు. స. క్రి రూ. తలఁచు.
తల్పము. సం. దూదిపఱుపు; అట్టడి; భార్య; శయ్య.
తల్పు. తలుపు.
తల్లఁడి. రూ. తలాఁపి.
తల్లకెడవు } విణ. తలక్రిందు.
తల్లక్రిందు
తల్లజము. సం. ప్రశస్తవాచకము, శ్రేష్ఠతను దెలుపునది.
తల్లజుఁడు. సం. ప్రశస్తమైనవాఁడు.
తల్లడకుఁడుచు. అ. క్రి. తలడించు.
తల్లడపడు. అ.క్రి.చలించు;వ్యాకులపడు.
తల్లడపాటు. అ. క్రి. చలనము; వ్యాకులత.
తల్లడపెట్టు. స. క్రి. చలింపఁజేయు; బాధపెట్టు.
తల్లడము. చలనము; వ్యాకులత.
తల్లడించు. అ. క్రి. చలించు; వ్యాకులపడు.
తల్లడింపు. భయము; తల్లడపాటు.
తల్లడిలు } చలించు, వ్యాకులపడు.
తల్లడిల్లు
తల్లి. జనని. విణ. మొదటిది; ముఖ్యము. సం. యువతి.
తల్లిబుఱము. మి. మాతృఋణము.
తల్లికొండ్ర. మొదటికొండ్ర.
తల్లిగోడ. ఇంటికి ముఖ్యమైనప్రక్క గోడ.
తల్లితండ్రి. మాతామహుఁడు.

తల్లితల్లి. అమ్మమ్మ, మాతామహి; శ్రీదేవి; అమ్మలఁగన్నయమ్మ.
తల్లిదండ్రులు. జననీజనకులు, మాతాపితరులు.
తల్లియొఱ. నూతిపై యొఱ.
తల్లివేరు. ముఖ్యమైన వేరు.
తల్లివేసటఁబాపినదంట. గరుత్మంతుఁడు.
తల్లిసైదోడు. మేనమామ, మాతులుఁడు; తల్లితోడఁబుట్టినది, మాతృష్వస.
తవకీరి. త్వక్క్షీరి.
తవన. క్షామ కాలము.
తవనిది. మి. తపోనిధి.
తవరము. తగరము.
తవరాజము. సం. యవాస శర్కర.
తవరాజు. తపోరాజు.
తవళి. అపత్యము; తస్కరుఁడు.
తవాయి. యుద్ధము; తల్లు.
తవిఁద. రాగిపైరు.
తవిఁదలు. బ. చోళ్లు, రాగులు.
తవు. అ. క్రి. తగు, యుక్తమగు.
తవుకోల. కోరుడు పాఱ.
తవుటిపాము. మలుఁగు చేఁప.
తవుడు. ఫలీకరణము, బియ్యము మీఁది మెత్తని పొట్టు.
తవులఁబడు. అ. క్రి. తగులఁబడు.
తవులు. అ.క్రి.స.క్రి. తగులు.
తవులుకొను. అ.క్రి.స.క్రి. తగులుకొను. క్రియాపే. తవులు కొలుపు.
తవులుచు. క్రియాపే. తగులుచు. రూ. తవుల్చు.
తవులుపడు. అ. క్రి. తగులుపడు.
తవెల. నూరు వెడల్పుగా నుండు కుండ వంటి లోహపాత్రము.
తవ్వ. సేరు, మానికలో సగము.
తవ్విఁద. రూ. తవిఁద.
తవ్వుగోల. కోఱుడు పార.
తష్టము. సం. విణ. వాడిస మొదలగు వానిచే చెక్కఁబడినది.
తసి. దట్టమగు నాలుపరుస. [తసిలీము.
తసిర(లీ)ము. హిం. బహుమానము. రూ.
తసుకు. అసత్యము; వంచనము; క్రియాపేము కలిగినట్లు చేయు చేష్ట. అ. క్రి. క్రియాపేము కలిగినట్లు చేష్టించు.
తసుకులాఁడి. తసుకులు గలది.
తస్కరించు. సం. స. క్రి. దొంగిలించు.
తస్కరుఁడు. సం. దొంగ.
తస్స. దుర్మాంసము.
తహతహ. వ్యసనము, వేగిరపాటు, సంభ్రమము; శ్రమము, ఆయాసము; కుతూహలము.
తహతహపడు. అ.క్రి. కుతూహలపడు.
తహతహపెట్టు స.క్రి. కుతూహలపఱచు.
తహస్సీలు. హిం. శిస్తు.
తహశ్శీలుదారు. హిం. వరహాలు వసూలు చేయు (సిస్తు వ్యవహారము చూచు) ఉద్యోగస్థుఁడు.
తళతళ. మిరుమిట్లు కొలుపు కాంతి; మెఱయుట యందగు అనుకరణము; తగరము ?
తళిగ. } కంచము; భగవన్నివేదనార్థమైన యన్నము.
తళియ. }
తళుకు. మిక్కిలి ప్రకాశము; కిరణము; శ్యేన భేదము; అఁకు డేగ.
తళుకొత్తు. అ. క్రి. మిక్కిలి ప్రకాశించు.
తళుక్కు. మెఱయుట యందగు అనుకరణము.
తళ్లు. బ. చెరువు మొదలగు వానియందు గాలిచేత ఉబికి దరిని మోఁదెడు చిన్న చిన్న అలలు.

## తా

తా. స. తాను అను దానికి ప్రాతిపదికము.
తాండవము. సం. నృత్యము, పురుషుఁడు చేయు నృత్యము, ఉద్ధతమైన నృత్యము; తృణవిశేషము. [నృత్యము చేయు.
తాండవించు. సం. అ. క్రి. ఉద్ధతముగా
తాండ్ర. తాఁడి, విభీతకము†.
తాండ్రపురుగు. లూత.
తాండ్రబెత్తు. బెత్తువలెనుండు తాండ్రబెత్తు, తాఁడిబిళ్ళ.
తాంతము. సం. విణ. బడలినది; వాడినది.
తాంతి. సం. బడలిక.

తాంత్రికుఁడు. సం. సిద్ధాంతము నెఱిఁగిన వాఁడు; విషవైద్యుఁడు.
తాంబాళము. తాంబూలము మొదలగునవి యుంచుకొనుటకు ఉపయుక్తమగు పెద్ద పళ్లెము పిండి మొ|| కలిపెడి యిత్తడి పాత్ర. [పోఁక.
తాంబూలము. సం. వక్కాకు,తమలము;
తాంబూలవల్లి } సం. తమలపాకుల తీఁగ.
తాంబూలి }
తాఁకించు. స.క్రి. శ్రమపఱచు. ప్రే. తగిలించు, తాఁకఁజేయు.
తాఁకు. తాఁకుట అ. క్రి మూర్కొను. స.క్రి. స్పృశించు, అంటు; (యుద్ధమున) ముట్టు.
తాఁకుడు. స్పర్శము [జ్వరము.
తాఁకుడువేఁకి. వరుస మేరకు వచ్చెడి
తాఁకుదల. యుద్ధప్రారంభము.
తాఁగలి. పల్లపుమడి.
తాఁచు. స. క్రి. తన్ను.
తాఁట. త్వక్కు, చెట్టుపై పట్ట; మోసము
తాఁటకత్తె. మోసకత్తె.
తాఁటదమ్మఁడు. జీవనార్థము సన్న్యాసి వేషము ధరించినవాఁడు
తాఁడి. విభీతకము.†
తాఁపు. తన్ను.
తాఁబేలు. కూర్మము.
తాకట్టు. ఆధి, నమ్మకమునకై అప్పుతీసికొన్న వానివద్దనుంచెడి ఆస్తి (వస్తువు).
తాకత్తు. హిం. బలము.
తాకు. కాలిటాకు.
తాఖీదు. హిం. ఆజ్ఞాపత్రము.
తాగడించు. నిర్బంధించు.
తాగాఁడి. } పీనాహము, నూతి మీఁద
తాగాణి. } అడ్డముగా వేసెడి దూలము.
రూ. తాగాడు, తాగాడె.
తాగు. స.క్రి. (నీళ్లుమొదలగునవి) త్రాగు.
తాగుఁబోతు. విణ. మద్యపాయి, మద్యపానముచేయు స్వభావముగలవాఁడు.
తాచు. స. క్రి. చెక్కు; తోలుచు; అవలంబించు; స్థాపించు.
తాజా. హిం. నాణ్యమైనది.
తాజో. హిం. క్రొత్త.
తాజీము. బహుమానము.
తాజో. కుల్లాయి.
తాటంకము. సం. చెవికమ్మ.
తాటాకుచెక్కెర. బాలక్రీడావిశేషము.
తాటాదూటము. విణ. చక్కనతప్పినది.
తాటించు. స. క్రి. కొట్టు.
తాటికట్టెడ. తాటిగిఱిపాము.
తాటికల్లు. తాటిచెట్టునుండితీసినమద్యము
తాటిగిఱిపాము. తాటిచెట్టుమీఁదనుండెడి పాము.
తాటిచెట్టు. తాళవృక్షము.
తాటిచెన్నులు. బ. తాటిచెట్టువెన్నులు.
తాటిపడగవాఁడు. తాళాంకుఁడు, బలరాముఁడు; తాళధ్వజుఁడు, భీష్ముఁడు.
తాటిబెల్లము తాటికల్లువండిచేసినబెల్లము
తాటిరిక్క. జ్యేష్ఠానక్షత్రము.
తాటిరిక్కనెల. జ్యేష్ఠమాసము.
తాడనవతుచుక్క(రిక్క). తాటిరిక్క.
తాటోటు. మోసము; అసత్యము. విణ. అనృతమాడువాఁడు; వంచకుఁడు.
తాడఘ సం. సుత్తె.?
తాడనము. సం. కొట్టుట.
తాడించు. సం. స. క్రి. కొట్టు.
తాడి. తాళవృక్షము.
తాడితము. సం. విణ. కొట్టఁబడినది.
తాడితుఁడు. సం. విణ. కొట్టఁబడినవాఁడు
తాడిబిళ్ళ. తాండ్రబెత్తు.
తాడు. త్రాడు; తాటిచెట్టు.
తాడె తాండ్ర†.
తాత. పితామహుఁడు; మాతామహుఁడు; బ్రహ్మ. సం. తండ్రి. విణ. కనికరింపఁదగినవాఁడు.
తాతతల్లి. లక్ష్మి.
తాతపనఁటివెల్లి. గంగ.
తాత్పర్యము. సం. అభిప్రాయము.
తాదృశము. సం. విణ. అటువంటిది.
తాదృశుఁడు. సం. విణ. అటువంటివాఁడు
తానకము. జెట్లు నిలుచుండుట యందలి భేదము; స్థానము.
తానదీవియ. సం. స్థానదీపిక.

తానము. స్నానము; స్థానము. సం. తన్న కారముతో పాడెడి పాట.
తానవము. సం. తనుత్వము.
తాను. ఆత్మ.
తాప. నిచ్చెన; మెట్టు, సోపానము.
తాపము. సం. సంతాపము; బాధ; తపించుట. (తాపత్రయము-ఆధ్యాత్మికము; అధిభౌతికము, అధిదైవికము.)
తాపథము. సోపానము.
తాపసతరువు. సం. గారచెట్టు. [ఋషి.
తాపసుఁడు. సం. తపస్సుచేయువాఁడు,
తాపి. ఆణి, మర్మము; జాడ; బేలుదారి; బేలుదారి గోడపెట్టునపుడు గారను అడుసును ఎత్తివేసి తాళ్ళనుపెట్టి సరిపఱిచెడు కొయ్యపిడివేసిన మట్టాకువంటి ఒక యినుప పనిముట్టు; చెక్క-తాపి.
తాపించు. స.క్రి. నిలుపు; చెక్కు; మోఁదు.
తాపింఛము. సం. చీఁకటిమ్రాను.
తాపికత్తియ. సంధానముచేయునది; రూ. తాపికత్తె.
తాపికాఁడు. సంధానము చేయువాఁడు; మర్మమెఱిఁగినవాఁడు.
తాపిత(తా). మేలైనపట్టువస్త్రము.
తాపితము. సం.విణ.తపింపఁజేయఁబడినది.
తాపీ. రూ. తాపి.
తాపు. అవలంబము. స. క్రి. చెక్కు.
తాబందు. స్త్రీలుకట్టుకొను పావడ.
తాబు. తావు, కాగితము.
తాబేదారు. హిం. తక్కువపనివాఁడు, క్రిందియుద్యోగస్థుఁడు. [వ్యాధి.
తామర. పద్మలత; పద్మము; ఒకచర్మ
తామరకాఁడ. మి. పద్మకాండము, నాళము
తామరగింజ. పద్మబీజము.
తామరచెలి. సూర్యుఁడు, కమలాప్తుఁడు.
తామరతంపము. తామరతంపర.
తామరతంపర. తామరల సమూహము; అభివృద్ధి.
తామరతూఁడు. బిసము, మృణాలము.
తామరతూపరి. మన్మథుఁడు, పద్మసాయకుఁడు.
తామరతేఁగ. పద్మమూలము.
తామరదుంప. కరహాటము.
తామరదుద్దు. కర్ణిక.
తామరపాకు. పద్మపత్రము.
తామరపూసలు. బ. పద్మబీజములు.
తామరపొక్కిలివాఁడు పద్మనాభుఁడు, విష్ణువు.
తామరబావి. పద్మాకరము.
తామరరేకు. పద్మదళము, తామరపూరేకు
తామరసము. సం. తామర; బంగారు; రాగి.
తామరఱాయి. పద్మరాగమణి.
తామరాకు. పద్మపత్రము.
తామలకి. సం. నేలయుసిరిక†.
తామసము. ఆలస్యము. సం. పాము. విణ. తమోగుణముగలది.
తామసి. సం. మహాకాళి; చీఁకటిరేయి. విణ. తమోగుణముగలవాఁడు.
తామసించు అ. క్రి. ఆలస్యముచేయు.
తామసుఁడు. సం. తామసమనువు. విణ. తమోగుణముగలవాఁడు; దుష్టుఁడు.
తామిస్రము. సం. చీఁకటి; చీఁకటిమయమయిన ఒక నరకము.
తాము. బ. తమరు.
తామెర. తామర.
తామేలు. తాఁబేలు. [వాఁడు; కంచరి.
తామ్రకుట్టకుఁడు. సం. రాగిపనిచేయు
తామ్రచూడము. సం. కోడి; అభినయహస్తవిశేషము.
తామ్రపర్ణి. సం. ఒకానొకయేఱు; పడమటిదిక్కునందుండెడు ఆఁడేనుఁగు, వరుణదిగ్గజభార్య. [ఎఱ్ఱనిది.
తామ్రము. సం. రాగి; ఎఱుపు. విణ.
తామ్రాక్షము. సం. కోయిల.
తాయత. తాయెతు.
తాయము. అరుదగు వస్తువు.
తాయి. తల్లి.
తాయించు. తాయించు.
తాయిత. కేయూరము.
తాయిత్తు, తాయెత, తాయెతు, తాయెత్తు } తాయిత, తల్లిబిడ్డలకుఁగట్టెడు రక్షాబంధము.

తార. సుషిరవాద్యవిశేషము. సం. తారాదేవి, ఒకమహావిద్య;బృహస్పతిభార్య; వాలి (సుగ్రీవ) భార్య.
తారక. సం. కంటినల్లగ్రుడ్డు; నక్షత్రము.
తారకజిత్తు. సం. కుమారస్వామి.
తారకము. సం. కన్ను.
తారకాణ-ము. దృష్టాంతము.
తారకాణించు. స. క్రి. తార్కాణించు.
తారకుడు. సం. తారకాసురుడు;మాలిమికాడు; విణ. దాటించువాడు.
తారణ. స-. ఒకసంవత్సరము. విణ. తిరింపజేయునది. [ఎచ్చుతగ్గులు.
తారతమ్యము: సం. తరతమభావము,
తారపీట. ఎద్దువెన్నుపై వేయుపీట.
తారమాక్షికము. మాక్షికభేదము.
తారము. నాలుగుకానులనాణెము. సం. దేవీప్రణవము;ప్రణవము;ఊర్ధ్వస్వరము; వెండి; పులుగడిగినముత్తెము; ముత్తెము పులుగడుగుట; కనుగ్రుడ్డు; నక్షత్రము.
తారసము. సమీపము; తలపాటు. విణ. సమీపించినది.
తారసించు. అ. క్రి. తారసిల్లు.
తారసిల్లు. అ.క్రి. సమీపించు; వ్యాపించు . రూ. తారసిలు.
తారాడు. అ.క్రి. తిరుగులాడు; జీరాడు.
తారాపథము. సం. ఆకాశము.
తారాపీట. ఎద్దువెన్నుమీదవేసెడుపీట
తారి. ఆటాడించెడు సూత్రధారి.[దినము.
తారీఖు. హిం. ఆంగ్లేయ మాసములోని
తారు. బ. తమరు అ. క్రి. సంచరించు; పోవు; కదియు; పొంచు.?
తారుకాణము. తార్కాణము.
తారుకొను., స. క్రి. కదియు. ప్రే. తారుకొలుపు.
తారుచు. ప్రే. తార్చు.
తారుణ్యము. స. యౌవనము.
తారుపు. తార్చుట; బరణి.
తారుపుకత్తియ. } తార్పుకత్తె
తారుపుకత్తె }
తారుమారగు. అ. క్రి. వ్యత్యస్తమగు, విపర్యాసమగు.
తారుమారు. వ్యత్యయము.
తారేయుడు. సం. అంగదుడు;బుధుడు
తార్కాణ-ము. దృష్టాంతము, నిదర్శనము
తార్కాణముసేయు. స. క్రి. పత్యమని చూపు, రుజువుచేయు. [నిరూపించు.
తార్కాణించు. స. క్రి. దృష్టాంతపఱచు,
తార్కికుడు. సం. తర్కశాస్త్రజ్ఞుడు.
తార్కొను. స. క్రి. కదియు. ప్రే. తార్కొలుపు. [రుడు.
తార్క్ష్యుడు. సం. గరుత్మంతుడు; అనూ
తార్చు. ప్రే. తారజేయు, కదియించు.
తార్పు. తార్చుట, పొందించుట.
తార్పుకత్తియ } తార్చెడి స్త్రీ, కుంటెన
తార్పుకత్తె } కత్తె.
తార్పులాడు. పెంపుడు పొట్టేలు కోడి మొ॥ జగడమాడు.
తార్యము. సం. విణ. తరింపదగినది.
తాఱు. అ. క్రి. అడగు; మఱుగుపడు; డాగు; ? పరుగెత్తు; కనుపెట్టు; మారించు. [స్తము.
తాఱుమాఱు. వ్యత్యాసము. విణ వ్యత్య
తాఱుమాఱుపడు. అ. క్రి. వ్యత్యస్తమగు.
తాలకి. సం. తాటికల్లు.
తాల(ళ)ధ్వజుడు. సం. బలరాముడు; భీష్ముడు. [ద్రవ్యము †
తాల(ళ)పర్ణి. సం. మురయను గంధ
తాల(ళ)ము. సం. హరిదళము; జేన.
తాలాం(ళాం)కుడు. సం. బలరాముడు.
తాలి. మంగళసూత్రము. సం. నేల యుసిరిక † [బోయు.
తాలించు. స.క్రి. కూర మొ॥ తిరుగ
తాలింపు. సంస్కారము, వ్యంజనసాధ్యంగము, తిరుగబోత; తాలించిన కూర.
తాలిక. మెలిక. [సూత్రపు బొట్టు.
తాలిబొట్టు. మంగళ సూత్రము; మంగళ
తాలిమి. క్షమ; ధైర్యము.
తాలిమికత్తియ. } విణ. క్షమావంతు
తాలిమికత్తె. } రాలు.
తాలిమికాడు. విణ. క్షమావంతుడు.
తాలీశివ. సం. నేల యుసిరిక †

తాలీ(ళీ)స పత్త్రిము. సం. తాళిస పత్రి; నేల యుసిరిక †
తాలు. ఎన్ను తీసి ఎండిపోయినపైరు; కొంతగింజెపట్టిన ధాన్యము.
తాలుచు. స. క్రి. ధరించు; (నూలు) పిరి పెట్టు; తిరికలుచేయు; దారము మొద లగువానిని పేను; పిండిమొదలగు వాని యందు మెతికలు మొదలగు వానిని చేటతోఁతట్టియెత్తు.
తాలుజిహ్వము. సం. కారుమొసలి [స్త్రీ.
తాలుపరి. విణ. ధరించినవాఁడు; ధరించిన
తాలువు. సం. దవుడ, దౌడ.
తాలూకా. హిం. జిల్లాలో నొకభాగము.
తాలూకు. సంబంధము.
తాల్చు. స. క్రి. రూ. తాలుచు.
తాల్మి. రూ. తాలిమి.
తాపకాళ్లు బ. ఏతమెత్తువాఁడు కాళ్లుంచు కొనుటకు నమర్చినపట్టెలు.
తావకీనము. సం. విణ. త్వదీయము, నీది.
తావకోళ్లు. బ. తావకాళ్లు.
తావడము. రుద్రాక్షలు మొదలగునవి గ్రుచ్చినపేరు (హారము); చెండు.
తావరము. విణ. స్థావరము, ఒక్కచోట నుండునది. [గృహము, నివాసము.
తావలము. ఆధారము; స్థానము,
తావళము, రూ. తావడము.
తావారము. తాళ్వారము.
తావి. పరిమళము; కలమధాన్యవిశేషము.
తావిగట్టు } మలయపర్వతము, చంద
తావిగుబ్బలి } నాలయము.
తావితోఁబెనచినది. సంస్కృతమైన శాక పాకాది.
తావినూనె. అత్తరు.
తావిమోపరి. గంధవహుఁడు, గాలి.
తావివిలుకాఁడు. మన్మథుఁడు.
తావీజు. కేయూరము.
తావు స్థానము, గృహము; కాగితము.
తావుకొను. అ. క్రి. స్థిరపడు.
తావేలువేయుట. హిం. పోల్చిచూచుట.
తాశ్శీళ్ళు. హిం. భయము.
తాహతు. హిం. శక్తి.
తాళకము. సం. పర్వతధాతువిశేషము, హరిదళము; హరితాళభేదము; తొగరి మన్ను; చిన్నబీగము.
తాళగించు. అ. క్రి. తాళమువేయు.
తాళగిరి. తాళమువేయువాఁడు.
తాళపత్రము. సం. తాటాకు; చెవ్వాకు.
తాళపత్రిక. సం. కై తాళము. ?
తాళము. మల్లబంధవిశేషము; బీగము, బంధించుటకై తలుపునకు వేయునట్టిది, సం. పాడునపుడు చేతులతోఁచఱచెడి చఱపు; తాటిచెట్టు; పరుఁజు; పాడున పుడుజరిగెడు కాలపరిమాణము; తాళము వేసెడుకంచువాద్యము.
తాళముచెయ్యి } తాళము వేయుటకు
తాళముచెవి } తీయుటకు తగిన సాధ నము.
తాళమూలిక. సం. నేలతాడు†.
తాళవృంతము. సం. విసనకఱ్ఱ.
తాళాలు. బ. మల్లవిద్యా విశేషములు.
తాళి. పతకము, పదకపుబిళ్ళ; హారవిశే షము; అలంతికావిశేషము. సం. స్త్రీ తాళము†.
తాళించు. స. క్రి. జూదమాడునపుడు క్రిందవేయుటకై పాచికలనుచేతనుంచు కొని యిటునటుత్రిప్పు.
తాళిక. క్షమ. విణ. క్షమము.
తాళితాకు. అ. క్రి. మూర్ఛిల్లు.
తాళిమి. ఓర్పు. [తాళిసపత్రి.
తాళినపత్త్రిరి. ఒకానొకమందుదినుసు.రూ.
తాళీ. రూ. తాళి. [వాఁడు.
తాళీకుఁడు. విణ. కార్యమును ముగించు
తాళీనపత్రి. తాళిసపత్రి.
తాళు. అ. క్రి. తాళికయగు; సహించు; నిదానించు. [సహించు.
తాళుకొను. అ. క్రి. తాళు, ఓర్చుకొను,
తాళ్ళపాము. బాలక్రీడా విశేషము.
తాళ్వారము. స్తంభముల మీఁదికి దించిన చోపా.

## తి

తింటి. తినుట, భక్షించుట.
తిండి. భోజనము; ఆహారము.

తిండికత్తియ. విణ. మిక్కిలితినునట్టిస్వభావము గలది. రూ. తిండికత్తె.
తిండికాఁడు. విణ. మిక్కిలితినునట్టి స్వభావముగలవాఁడు.
తిండిపోతు. విణ. తిండికాఁడు; తిండికత్తె
తిండీఁడు. విణ. తిండికాఁడు.
తింతిడి, తింత్రిణి } సం. చింతచెట్టు.
తింతిడీకము, తింత్రిణీకము } సం. చింతపండు.
తిందుకము. సం. తుమ్మికి†
తికమక. కలఁత; తొట్రుపాటు; అంగములయొక్క అస్వాధీనత.
తికమకగొను. అ. క్రి. తొట్రుపడు; (అంగములయొక్క) అస్వాధీనతను పొందు.
తికమకలాడు. తికమకగొను.
తికము. టికము.
తిక్క. ఉన్మాదము.
తిక్కగొను. అ. క్రి. వెఱ్ఱెత్తు.
తిక్కటమక్కట. క్షోభము.
తిక్కడి. నూలువడికెడి చిప్పకదురు.
తిక్కణిక. సం. ఇటికపగడము.
తిక్త. సం. కటుకరోహిణి†.
తిక్తము. సం. చేఁదిపొట్ల†; చేఁదు. విణ. చేఁదైనది.
తిక్తశాకము. సం. ఉలిమిరి†; చెంద్ర†.
తిగ. స. త్రికము, మూఁడు.
తిగకంటి. శివుఁడు, త్ర్యంబకుఁడు.
తిగకాల్లదేవర. అగ్ని, త్రిపాత్తు.
తిగప్రోలుదాయ. త్రిపురారి, శివుఁడు.
తిగవంచ. స. నాలుగు.
తిగియు, తిగుచు } స. క్రి. ఆకర్షించు.
తిగుచుకొను. స. క్రి. పట్టుకొను, పుచ్చుకొను, తీసికొను.
తిగుళ. ద్రవిడదేశము.
తిగ్మము. సం. వేఁడిమి. విణ. వేఁడిమికలది
తిట్ట. రాశి, గడ్డిరాశి.
తిట్టాట. తిట్టాడుట.
తిట్టాడు. స. క్రి. తిట్టు. [నిందించు.
తిట్టు. శాపము; నింద. స. క్రి. శపించు;
తిట్టుపాటు. అపవాదము; నింద.
తిట్టువడు. అ. క్రి. నిందింపఁబడు.
తిట్టువాటు. అపవాదము.
తిడిమ్మి. రథము పాఱునప్పటి యందగు ధ్వన్యనుకరణము.
తిణేఁగి. మల్లబంధ విశేషము.
తితఉవు సం. జల్లెడ.
తితిక్ష. సం. క్షాంతి, ఓర్పు.
తితిక్షువు(ఁడు). సం. విణ. క్షమించునట్టి స్వభావము గలవాఁడు.
తిత్తి. ఒలిచి కొలిమి యూఁదుటకు అనువుగా నేర్పరచిన మేఁకతోలు; మృగముల తోలు; ఒలిచి సుతిపోయుట కేర్పఱచిన తోలు; ఒలిచి సారాయి కొనిపోవుటకు అనువుగా నేర్పఱచిన మేఁకతోలు; తోలు సంచి; సంచి.
తిత్తికాఁడు. విణ. తిత్తిపోయువాఁడు.
తిత్తిరి. సం. తీతువు పిట్ట [దినము.
తిథి. సం. పాడ్యమి మొదలయినది; శ్రాద్ధ
తినాసము. తినిశము †
తినిశము. సం. నెమ్మి †
తిను. స. క్రి. భక్షించు, భుజించు. ప్రే. తినిపించు, భుజింపఁజేయు.
తినుకు. ముక్కి ముక్కి విష్ఠించుట. అ. క్రి. ముక్కి ముక్కి విష్ఠించు.
తిన్న. విణ. మనోజ్ఞము; యుక్తము, యోగ్యము; స్వస్థము; ఋజువు; సౌమ్యము.
తిన్నదనము. తిన్నన.
తిన్నన. మనోజ్ఞత; యుక్తత; యోగ్యత; స్వస్థత; సౌమ్యత; ఋజుత్వము.
తిన్నియ. తిన్నె.
తిన్నె. వేదిక, అరుఁగు.
తిపిరి. సొరకాయ.
తిపిరికిన్నెర. సొరకాయచే రచించిన వాద్య విశేషము.
తిప్పరుకట్టు. అ. క్రి. వ్యాపించు.
తిప్ప. చిన్నకొండ; కొండ; దిబ్బ.
తిప్పకాయ. విణ. ఆకతాయ, పెంకె.
తిప్పతీఁగ. గుడూచీలత. [చిలువ.
తిప్పత్రిమ్మరి. కోఁతి, అగచరము; కొండ
తిప్పతెల్లు. ఇక్షుకము†.

తిప్పసత్తు. తిప్పతీఁగసారము.
తిబిరి. మాఱుపాటు. విణ. అల్పము.
తిబ్బె. ముందటికిపట్టుపోనిచ్చుచు వెనుకకు మరలించి మరలించికట్టెడు గట్టికట్టు.
తిమి. సం. నూఱామడపొడుగు చేఁప.
తిమింగిలము. సం. తిమినిమ్రింగెడి చేఁప.
తిమిడి. రూ. తిడిమ్మి.
తిమితము. సం. విణ. తడిసినది. [షము.
తిమిరము. సం. చీఁకటి; నేత్రరోగవిశే
తిమిరి. రూ. తిమ్మిరి.
తిమిరిమీను. ఒకదినుసుచేఁప.
తిమురు. తిమ్మిరి; గర్వము. అ. క్రి త్వరపడు; ఉద్రేకించు; ఒళ్లువిఱుచు; గర్వించు.
తిమురుకొను అ. క్రి. ఆగ్రహముతో పెనఁగులాడి వదలించుకొను.
తిమ్మ. విణ. స్వస్థము.
తిమ్మఁడు. కోఁతి.
తిమ్మదియ్యము. రత్యతృప్తి.
తిమ్మన. స్వస్థత; మంజులము; బాగు.
తిమ్మనము. మజ్జిగపులుసు; పాలుపిండి బెల్లమువేసి వండినది ?
తిమ్మప్పఁడు. వేంకటేశ్వరస్వామి
తిమ్మవడు. అ. క్రి. స్వస్థపడు. [షము.
తిమ్మిరి. స్పర్శము తెలియని వ్యాధి విశే
తిమ్ము. స. క్రి. దీవించు.
తియ్య. విణ. మధురము.
తియ్యఁదనము. కమ్మన, మాధుర్యము.
తియ్యఁబోఁడి. చెఱకువలె మనోజ్ఞురాలగు స్త్రీ; స్త్రీ.
తియ్యకంద. మి. కసరులేనికంద.†
తియ్యగూర. పులుసుచేరని కమ్మగూర.
తియ్యదానిమ్మ. తియ్యనివిత్తులుగల దానిమ్మ.†
తియ్యన. మాధుర్యము.
తియ్యనిమ్మ. కమ్మనిమ్మ, శర్కరాంకము†
తియ్యమాను ఇక్షువు.†
తియ్యమామిడి. ఎలమావి, రసాలవృక్షము
తియ్యము. ప్రియవచనము; ప్రియము, ఇష్టము; మంజులము.
తియ్యమునగ. మధుశిగ్రువు†.
తియ్యమ్రాను. చెఱకు†

తియ్యవిలుకాఁడు. మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు రూ. తియ్యవిల్కాఁడు.
తిరగలి. ఘరట్టము.
తిరపడు. అ. క్రి. స్థిరపడు.
తిరము. విణ. స్థిరము.
తిరశ్చీనము. సం. విణ. అడ్డముగాఁబోవునది. [చేయు.
తిరస్కరించు. సం. స. క్రి. అనాదరము
తిరస్కరిణి. సం. తెరచీర.
తిరస్కారము. సం. అనాదరము.
తిరస్కృతము. సం. విణ. తిరస్కరింపఁబడినది.
తిరస్క్రియ. సం. తిరస్కారము.
తిరస్తు. రాష్ట్రము, రాజ్యసప్తాంగములలో నొకటి.
తిరి. జట; సుడి.
తిరిక. మెలిక; దీపము.
తిరిగివచ్చు. అ. క్రి. ప్రదక్షిణమగు. స క్రి. పరివేష్టించు.
తిరితీపులాడు అ. క్రి. పెనఁగులాడు.
తిరిపగాఁడు. బిచ్చమెత్తుకొనువాఁడు, భిక్షుకుఁడు. [మెత్తువాఁడు.
తిరిపగొట్టు. విణ. విరక్తుఁడుకాక భిక్ష
తిరిపము భిక్షము. విణ. భిక్షుకుఁడు.
తిరిపరి. విణ. తిరిపగాఁడు.
తిరిపె, తిరిపెగాడు } భిక్షుకుఁడు.
తిరిపెము. భిక్షము.
తిరియు. స. క్రి. భిక్షమెత్తు.
తిరిర. మత్స్యవిశేషము. [ద్రొక్కుకొను.
తిరివడు. అ. క్రి. కలఁతపడు, కలఁగఁ
తిరివెట్టు. స. క్రి. కలఁతపఱచు.
తిరీటము. సం. కిరీటము. లొద్దుగు†.
తిరు. విణ. శ్రీప్రదము.
తిరుఁడు. విణ. స్థిరుఁడు. [రము.
తిరుకాపు. భగవంతునియొక్క అలంకా
తిరుకొలను. పుష్కరిణి.
తిరుకొళము. కోనేఱు.
తిరుగ. మరల.
తిరుగఁబడు. అ. క్రి. ఎదిరించు; తిరుగు; మరలు; విపరీతమగు; కలతపడు, ?

తిరుగఁబోఁత. తాలింపు.
తిరుగఁబోయు. అ. క్రి. తాలించు.
తిరుగడ. మఱపెట్టినగొట్టము.
తిరుగలి. పిండిమెందలైనవి విసరెడుశిలాయంత్రము, ఘరట్టము; భ్రమ, భ్రాంతి.
తిరుగాడు. అ. క్రి. సంచరించు. రూ. తిరుగులాడు.
తిరుగు. తిరుగుట; అపజయము. అ. క్రి. సంచరించు; పరిభ్రమించు; వెనుకకు మరలం; మరలివచ్చు; స. క్రి. పరివేష్టించు.
తిరుగుఁబోతు. విశ. విటుఁడు, వ్యభిచారి, తిరుగునట్టి స్వభావము గలవాఁడు; వ్యభిచారిణి, తిరుగునట్టిస్వభావము గలది.
తిరుగుడు. తిరగుట; మాఱుపాటు; మఱ; చక్రము; సంభ్రమము. [-చీల.
తిరుగుడుచీల. తిరుగుడు నొక్కులుంగల
తిరుగుడుత్రాడు. పశువులనుబట్టెడుసాధన విశేషము.
తిరుగుడునొక్కు. తిరుగుడుమర.
తిరుగుడుపడు. అ. క్రి. పరిభ్రమించు.
తిరుగుడుపాటు. తిరుగుడుపడుట.
తిరుగుడుబిల్ల. స్త్రీలశిరోభూషణ విశేషము. బ. బాలక్రీడావిశేషము.
తిరుగుడువడు. అ. క్రి. కలఁగఁద్రొక్కికొను. ?
తిరుగుదల. మరలుట. [విముఖము.
తిరుగుమొగము. విశ. అభిముఖము;
తిరుగువాఱు. స. క్రి. పరివేష్టించు.
తిరుచిన్నము. వాద్యవిశేషము.
తిరుచు. స. క్రి. తిరియు, దీనవృత్తిని యాచించు.
తిరుచూర్ణము. మి. పసుపుబియ్యముచేర్చి చేసివైష్ణవులు నొసటనుంచుకొనెడిపొడి.
తిరునాళ్ళ, తిరునాళ్ళు } దేవోత్సవము.
తిరునీఱు, శైవులు నొసటనుంచుకొనెడు గోమయభస్మము.
తిరుపగూడ. వైష్ణవులు తిరుమణిపెట్టె మొదలైనవియుంచి చేంకను దగిలించుకొనెడు తాటాకులబుట్ట.
తిరుపతి. వేంకటాద్రి.
తిరుపు. తిరుగుట.
తిరుపులుగట్టు. అ. క్రి. వ్యాపించు.
తిరుమజ్జనము. మి. భగవంతుని అభిషేకము. [కొనెడు ధవళమృత్తిక.
తిరుమణి. వైష్ణవులు నొసటనుంచు
తిరుమణిపడము మి. తామరపూసలదండ
తిరుమన్ను. తిరుమణి.
తిరుమల. వేంకటాచలము, తిరుపతి.
తిరుమాళిగ. గృహము.
తిరుముడి. వైష్ణవుఁడు.
తిరువడికోల. దాసరివాని దీపస్తంభము.
తిరువరంగములు. బ. శాలిధాన్యభేదము
తిరువారాదనము. మి. వైష్ణవపరిభాషలో దేవతార్చన.
తిరువీది. దేవుడూరేగువీథి.
తిరువు. అ. క్రి. స. క్రి. రూ. తిరుగు.
తిరోధానము. సం. మఱుఁగుపాటు; అగపడకపోవుట.
తిరోభావము. సం. మఱుఁగుపడుట.
తిరోహితుఁడు. సం. విశ. మఱుఁగుపడినవాఁడు; డాఁగియున్నవాఁడు.
తిర్గు. రూ. తిరుగు.
తిర్నీఱు. తిరునీఱు, విభూతి.
తిర్యక్కు. సం. విశ. అడ్డముగాఁ బోవునది; అడ్డముగా నున్నది.
తిర్లిక. దీపము.
తిర్వళిక. దీపము. [వర్తి.
తిఱి. మెలి; కర్ణరంధ్రాలలోఁ ద్రిప్పెడు
తిఱికి. మత్స్యవిశేషము.
తిఱిపగొట్టు. తిరిపగొట్టు.
తిఱుగఁబోఁత. తాలింపు; అభిఘారము.?
తిఱుగల్లు. ఘరట్టము, తిరుగలి.
తిఱుగు. అ. క్రి. గిరగిర తిరుగు.
తిఱుగుడు. తిరుగుడు; పర్యటనము; తిరిగాడి మఱ.
తిఱ్ఱి. బుట్టవలె తాటి ఈనలతో నల్లిన మత్స్యగ్రహణ సాధన విశేషము.
తిఱ్ఱిగొట్టు. తిరిపగొట్టు.
తిలకంఠము. ఊరఁబిచ్చిక.
తిలకము. సం. సౌవర్చలమనెడి యుప్పు; కడుపులో కుడిప్రక్కనుండెడు ఎఱ్ఱని

మాంసము; నల్ల గుఱ్ఱము; పుట్టుమచ్చ; బొట్టు; బొట్టుగు †; పొట్లి†. విణ. శ్రేష్ఠము.
తిలకాలకము. సం. పుట్టుమచ్చ.
తిలకించు. అ. క్రి. ప్రకాశించు; ప్రసన్నత నొందు. స. క్రి. చూచు.
తిలమాతుకుఁడు. సం. తెలికలవాఁడు.
తిలతండులన్యాయము. సం. నువ్వులును బియ్యమును గలసిన విధము.
తిలతండులకము. సం. ఆలింగన విశేషము.
తిలపర్ణి. సం. రక్త చందనము †.
తిలపేజము. సం. పొల్లునువ్వులు. రూ. తిలపింజము. [గానుగు.
తిలయంత్రము. సం. తెలికలవాని
తిలలు. సం. బ. నువ్వులు.
తిలిత్సము. సం. కొండ చిలువ. రూ. తిలిత్సము. [(పొలము).
తిల్యము. సం. విణ. తిలలు పండునది
తిల్వము. సం. లొద్దుగు †
తివ. తిగ, మూడు.
తివాసి. మేలైన చిత్రాసనము, రత్న కంబళము రూ. తివాసీ.
తివియు. స. క్రి. రూ. తిగియు.
తివుచు. స. క్రి. తిగుచు.
తివుట. కోరిక; శీఘ్రము.
తివురు. అ. క్రి. త్వరపడు; కుతూహలపడు; యత్నించు; మోఁగు; కోపపడు. స. క్రి. కోరు.
తివ్వ. తీఁగె.
తిష్యఫల. సం. ఉసిరిక †.
తిష్యము. సం. పుష్య నక్షత్రము; పుష్యమాసము; కలియుగము.

## తీ

తీ. వృత్తియందు తిగ శబ్దమున కగు ఆదేశము; త్రిసంఖ్య.
తీంట్రము. దురద. [చురుకు.
తీండ్ర. ప్రకాశము; వేఁడిమి; తేజము;
తీండ్రము. విణ ప్రచండము.
తీండ్రించు. అ. క్రి. ప్రకాశించు; జ్వలించు. రూ. తీఁడిరించు.

తీఁగ. లత; స్త్రీలు మెడను ధరించెడి బంగారు పట్టెడ; మొలనూలు; వీణె మొదలగువాని తంతి.
తీఁగఁబోడి. లతాతన్వి; స్త్రీ.
తీఁగకానుఁగు. మర్కటి †.
తీఁగగఱిక. గండాలి†.
తీఁగజాజి. ఒకదినుసుజాజి†.
తీఁగతుమడి. దీర్ఘమూల†.
తీఁగపాల. క్షీరావి†. [భార్య.
తీఁగపేరికల్కి. వల్లి, కుమారస్వామి
తీఁగఁపేరికల్కిమగఁడు. కుమారస్వామి.
తీఁగబచ్చలి. కలంబి†. [షము.
తీఁగమల్లియ. తీఁగమల్లె†. బ. ధాన్యవిశే
తీఁగమల్లె. ఒకమల్లె.
తీఁగమెఱుఁగు. ఉఱుములేని మెఱపు; ప్రొద్దుతిరుగుడుచెట్టు.
తీఁగమోడి. వ్రాఁతపని.
తీఁగయిల్లు. పొదరిల్లు.
తీఁగయెలుఁగు. హీనస్వరము.
తీఁగలువాఱు. అ. క్రి. వ్యాపించు.
తీఁగవిలుకాఁడు. మన్మథుఁడు.
తీఁగనరులు. బ. ధాన్యవిశేషము. రూ. తీవసరులు.
తీఁగసాఁగు. పరిల్లు.
తీఁగియ. రూ. తీఁగ.
తీఁగె. తీఁగ, లత.
తీఁగెకాఁనుగు. లతాకరంజము†.
తీఁగెగఱిక. గండదూర్వ, తీఁగగఱిక†.
తీఁగెపాల. క్షీరిక, చిఱుపాల†.
తీఁగెబచ్చలి. కలంబి, అల్లుబచ్చలి†.
తీఁగెఁబోఁడి. తీఁగవలెమనోజ్ఞమైనది, లతాతన్వి; స్త్రీ. [విశేషము.
తీఁగెమల్లియ. తీఁగమల్లె†. బ. ధాన్య
తీఁగెమెడనూలు. కంఠభూషావిశేషము.
తీఁగెమోడి. జిలుగు.
తీఁగెయిల్లు. నికుంజము.
తీఁగెయెలుఁగు. హీనస్వరము.
తీఁగెనరులు. బ. ధాన్యవిశేషము.
తీఁట. ఒకవిధమైన గజ్జి; కండువు, దురద

తీఁటకసింద
తీఁటకసివింద
తీఁటకసివెంద
తీఁటకోవెల } కేగడిదూల, కచ్ఛురి†

తీఁడ. తీండ్ర †

తీఁడిరించు. అ. క్రి. ప్రకాశించు.

తీఁపురము. ఆగడము.

తీక్ష్ణకంటక. సం. కందారి†.

తీక్ష్ణగంధ. సం. ఓమము†; నల్లావలు†.

తీక్ష్ణగంధము. సం. మునగ;† పెద్దకుమ్మి† నెరవెంద†.

తీక్ష్ణతుండము. సం దోమ.

తీక్ష్ణము. సం. వేఁడిమి; విషము; పోరు; ఇందుపప్పు; ఇనుము; ఉక్కు; ఉప్పు; గాజుపప్పు. [చుఱుకైనది; వాడియైనది.

తీగ. తీఁగె; చెఱువు క్రింది పొలము విణ.

తీడు. స. క్రి. వాఁడిచేయు.

తీతువు. తిత్తిరిపక్షి.

తీన్‌తేరగా. హిం. క్రి.విణ. తారుమారుగా.

తీనియ
తీనె } తిన్నియ.

తీపారు. అ క్రి. మనోజ్ఞమగు.

తీపి. మాధుర్యము; ఇచ్ఛ. విణ. మధురము.

తీపు. మాధుర్యము; నొప్పి. విణ. మధురము; కదళీఫలగుచ్ఛాంశము.

తీపుద్రాడు. పేఁటాడుటకుఁ దగిన సాధన విశేషము.

తీమునుగ. ఎఱ్ఱమునుగ†.

తీయ
తీయన } మధురము.

తీయము. తియ్యము.

తీయమునుగ. తీమునుగ†

తీయు అ. క్రి. తొలఁగు; స్పృశించు; తగ్గు. స. క్రి. ఈడ్చు; తీసికొను; వెల యిచ్చికొను; వేయు.

తీయువాఁడు. గ్రహయాళువు.

తీరమిగండి. అవకాశము. ?

తీరము. సాదృశ్యము. సం ఒడ్డు; తీగరము

తీరు. చక్కన; విధము; న్యాయము; శరము; మంజులము. సౌందర్యము సంధి. అ. క్రి. చక్కఁబడు; శక్యమగు మరణించు; యుక్తమగు.

తిరుకులు. నాట్యగతివిశేషములు.

తిరుచు. ప్రే. తీర్చు.

తిరుపరి. తీర్పరి.

తిరుపు తీర్పు.

తిరువ. కాఁపులు ధాన్యము మొదలగునవి పంటపెట్టి తీసికొనిపోవునపుడు నేలయొక్క స్వాతంత్ర్యమునుబట్టి రాజునకు చేరవలసిన భాగమునకిచ్చెడు ధనము

తీర్చు. తీర్పుచేయు; దిద్దు; నృత్తగీతవాద్యములు సమముకావించు; నాశముచేయు; పాపు. రూ. తీఱుచు.

తీర్ణము సం. విణ. దాటఁబడినది.

తీర్థమాట. మి. స్నానము.

తీర్థమాడు. మి. అ. క్రి. తీర్థములలో స్నానముచేయు. ప్రే. తీర్థమార్చు.

తీర్థము. సం. మహర్షులు స్నానముచేసిన పుణ్యోదకము; పుణ్యనది; రేవు; నూతిరొడ్డితొట్టి; జలము; పుణ్యక్షేత్రము; పుణ్యస్థలము, యజ్ఞము; శాస్త్రము; ఉపాయము; పాత్రము; స్త్రీరజస్సు; ఉపాధ్యాయుఁడు; మంత్రి.

తీర్థములాడు తీర్థమాడు.

తీర్థవాసి. సం. విణ. తీర్థసేవచేయువాఁడు.

తీర్పరి. న్యాయాధిపతి; చారుఁడు. విణ. అధికారి; కార్యనిర్వాహకుఁడు.

తీర్పు. న్యాయము; చక్కఁబాటు; తాళమానలయ, నృత్తగీత వాద్యములు సమమగుట.

తీఱమి. అక్కఱ; కర్తవ్యకార్యము.

తీఱిక. పనిలేక యూరకుండుట; అవకాశము; దిద్దుట. [అవకాశపడు.

తీఱు. స. ధి. అ. క్రి. నశించు; పాయు;

తీఱుగడ ముగియుట; తీరిక.

తీఱుచు. ప్రే. నశింపఁజేయు; పాపు.

తీఱుదల. ముగియుట.

తీఱుపడు. అ. క్రి. నశించు.

తీఱుపాటు. తీఱిక.

తీఱుపు. ప్రే. తీఱుచు. రూ. తీర్పు.

తీఱుబడి. అవకాశము.

తీలగు. అ.క్రి. అగఁగు.
తీలు. అడకము.
తీలుపడు. అ.క్రి. అడఁగు.
తీవ. రూ. తీఁగ.
తీవంచె. స. నాలుగు. [నుఁడు.
తీవంచె మోములదిట్ట. బ్రహ్మ, చతురాన
తీవరపడు. అ.క్రి. త్వరితపడు.
తీవరపాటు. త్వరితపడుట.
తీవరము. త్వరితము, త్వర.
తీవరించు. స.క్రి. త్వరితపఱచు.
తీవరుఁడు. సం. చేఁపలఁ బట్టువాఁడు; సముద్రుఁడు; వ్యాధుఁడు.
తీవియ. రూ. తీఁగియ, లత.
తీవిరము. తీఁట.
తీవె. రూ. తీవియ, లత.
తీవెనరులు. బ. ధాన్య విశేషము.
తీవ్ర. సం. నల్లావలు†; కటుక రోహిణి†; తీఁగ గతిక†
తీవ్రగంద. సం. ఓమము†
తీవ్రగంధము. సం. కారుబుడమ†.
తీవ్రము. సం. క్రి. విణ. అతిశయము; వేఁడిమి. విణ. అధికము; మిక్కిలివేఁడి మిగలది; కారముగలది.
తీసివేఁత. వ్యవకలనము.
తీసివేయు. స. క్రి. ఖండించు; ఎత్తివేయు

## తు

తుంగ. తృణవిశేషము. సం. జమ్మి†.
తుంగగడ్డి. తుంగకసవు.
తుంగభద్ర. సం. ఒకనది.
తుంగభద్రము. సం. మదపుటేనుఁగు.
తుంగము. సం. కొండ; పొన్న†. విణ. పొడవైనది, ఉన్నతమైనది.
తుంగి. సం. వాయింట†.
తుంట. తునుక; చెఱకు†. విణ. దుష్టుఁడు.
తుంటరి. విణ. దుష్టుఁడు, తుచ్ఛుఁడు; తుచ్ఛగాలు.
తుంటవిలుకాఁడు, తుంటవిలుతుఁడు } మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు.
తుంటి. రొండి. బ. (తుంట్లు). కటియొక్క కీళ్లు.
తుంటికూర. రూ. తూఁటికూర.
తుండము. ఖండము. సం. పక్షిముక్కు; నోరు; మొగము.
తుండి. సం. ఏనుఁగు; ఉబుకుబొడ్డు; పక్షిముక్కు; మొగము; పక్షి. [ఖండించు.
తుండించు. స. క్రి. తునకలు చేయు,
తుండికేరి. సం. దొండ†; ప్రత్తి†.
తుండిభుఁడు, తుండిలుఁడు } సం. విణ. ఉబుకుబొడ్డు వాఁడు.
తుండీరము. సం. దొండపండు, బింబ ఫలము.
తుండు, తుండెము } ఖండము, తునుక.
తుంతుభము. సం. ఆవలు.
తుంతుర్వని. చల్లనినీటి బిందువులు.
తుందపరిమృజుఁడు. సం. సోమరి, విణ. బొజ్జనిమురుకొను వాఁడు.
తుందము. సం. కడుపు.
తుంది. సం. కడుపు; ఉబుకుబొడ్డు విణ. బొజ్జకడుపువాఁడు,
తుందిభుఁడు, తుందిలుఁడు } సం. విణ. బొజ్జకడుపు వాఁడు; ఉబుకుబొడ్డు వాఁడు.
తుందుడుకు. సంతాపము; విచారము; కలఁత; మనోవ్యథ; అనాలోచిత కారిత్వము. విణ. యోజింపక త్వరపడి చేయువాఁడు.
తుందునుకలు. బ. చిన్న చిన్న ఖండములు.
తుంపర. శీకరము, గాలిచేత చెదరిపడు నీరు మొదలగువాని బొట్టు.
తుంపిళ్లు. బ. జడి.
తుంపురు. తుంపర.
తుంపురుమాట. అంబూకృతము.
తుంపెసలాడు. అ.క్రి. చలించు; ఊగాఁడు నర్తించు.
తుంపెసలు. చలనము. [లాఁడు.
తుంపెసలుగునియు. అ. క్రి. తుంపెస
తుంబ. సం. వీణసొఱ†.
తుంబకము. సం. విణ. నంగిమాట.?
తుంబము. సొఱ†.
తుంబి. సం. అనుగు†. తుమ్మి.?

తుంబిక. సం. సొఱ†? బండిచక్రము నడిమి రంధ్రము; తూము.
తుకతుక. సంతాపము; కోపము; అన్నము మొ॥ ఉడుకుటయందగు ధ్వన్యనుకరణము; కాఁగుటయందగు ధ్వన్యనుకరణము. [మడి.
తుకము. విత్తనాల చల్లకపు అంచున; నారు
తుకాటము. మిక్కిలి ప్రాఁతది.
తుక్కు. విణ. అల్పము; లోహ దోషము, త్రుప్పు; పనికిమాలిన గడ్డి మొ. [రము.
తుక్కుడు. విణ. పనికిమాలినది, నిస్సా
తుకారము. సం. గుజ్జము.
తుఖరము. సం. బాణము. ?
తుచ్ఛ. సం. నీలి †.
తుచ్ఛము. సం. నీలి†; పొల్లు. విణ. శూన్యము, వట్టిది; అప్రియము; అల్పము; అధమము. [మందుఁడు.
తుచ్ఛుఁడు. సం. విణ. అల్పుఁడు;
తుజాలకము. సం. ఆరుదొండ †.
తుజేగు. విణ. త్వరపడువాఁడు.
తుటము. సేన. ?
తుటాయించు. స. క్రి. అలక్ష్యపఱచు.
తుటారము. దిట్టతనము; పరుషవచనము.
తుటారి. విణ. దిట్టతనముగల స్త్రీ; పారుష్యముగల స్త్రీ.
తుటారించు. స. క్రి. తిరస్కరించు.
తుటారికత్తియ }
తుటారికత్తె } విణ. తుటారి.
తుటారికాఁడు విణ. దిట్టతనముగలవాఁడు పారుష్యము గలవాఁడు. [అనుకరణము.
తుటుక్కు. గుండెలు అదరుట యందగు
తుటుము. సమూహము; సేన; మల్లుర ఉపవీత విశేషము.
తుట్టతుద. కేవలము తుద, మిక్కిలిచివర.
తుట్టమర. అవ్య. క్రి. విణ బొత్తిగా.
తుట్టియ. తుట్టె, సమూహము.
తుట్టు. నష్టి. విణ. నాశకుఁడు.
తుట్టె. అట్ట; సమూహము; తేనెపెర.
తుట్టెగట్టు. అ. క్రి. ఉండగట్టు.
తుట్టెపురుగు. సర్పభేదము; సర్పము.
తుట్టెపురుగుగుంపుగొంగ. పన్నగాశనుఁడు, గరుత్మంతుఁడు. [కుప్ప. ?
తుట్ర. మంచువంటితూరవాన; ఊడ్చిన
తుడుచు. స. క్రి. తడిపోవనొత్తు; నిమురు; ఊడ్చు, కసువు మొ॥ అవలికి నెట్టు.
తుడుపు. తుడుచుట; తప్పువ్రాలను గిటికిన గిఱుకు. [తుటుము.
తుడుము. మద్దువు, వాద్యవిశేషము;
తుడ్చు. స. క్రి. రూ. తుడుచు.
తుతె. సోపానము.
తుత్తి. కంగునీపత్రము †.
తుత్తినాగము లోహవిశేషము.
తుత్తిరి. తుత్తి†.
తుత్తుంభిక. సం. వాద్యవిశేషము.
తుత్తునియలు. బ. చిన్న చిన్న తునుకలు.
తుత్తుమురు. మిక్కిలితుమురు (పొడి).
తుత్తుఱుగొను. అ. క్రి. చిలుము వలె కలంషితమగు.
తుత్థ. సం. చిట్టేలకి†; నీలి†.
తుత్థము. సం. అగ్ని; మ్రానిపసుపున వండిన అంజనవిశేషము. [తుత్తము.
తుత్థాంజనము. సం. తుత్థము, మయిలు
తుద. అగ్రము. అంతము, చివర.
తుదకులమునేర్పరి. శూద్రుఁడు.
తుది. అంతము; మరణము.
తుదిదిక్కుటెంకి. ఈశానుఁడు.
తుదిముట్టు. అ. క్రి. చెచ్చు.
తుదిరేయి. కల్పాంతము.
తుదివాఁడు. విణ. కడపటివాఁడు.
తునక. ఖండము.
తునికోల. తూఁచునట్టికోల.
తునికోలదుద్దు. గవ్వలవాఁడు కల్లుబుడ్డి తగిలించుకొని పోయెడు తునికోలవంటి దుద్దుకోల.
తునియ. ఖండము.
తునియు అ. క్రి. ఖండితమగు.
తునుఁగు. అ. క్రి. తునియు.
తునుక. తునియ, ఖండితము.
తునుమాడు }
తునుము } స. క్రి. చెంపు తునుకలు చేయు.
తునె. ఖండము.

తున్నకము. సం. నందివృక్షము. [వాఁడు.
తున్నవాయుఁడు. సం. బట్టలు కుట్టెడి
తున్మాడు } స క్రి. తునుము.
తున్ము }
తుపర. తుంపర.
తుపాకి. హిం. ఇనుపక్రోవి, మందుగుండు
వేసి గట్టించికాల్చెడు ఇనుపగొట్టముగల
యుద్ధసాధన విశేషము, అగ్న్యస్త్రము.
తుపాకీలు. తుపాకులు. [వాతము.
తుపాను. హిం. గాలివాన, ఝుఝూ
తుపారము. వస్త్రముకోటభేదము.
తుభాసి. ద్విభాషి, ఒకభాషను మఱియొక
భాషలో చెప్పెడువాఁడు. [కరణము.
తుపుక్కు. ఉమియుటయందగు ధ్వన్యను
తుప్ప. నేలనంటియుండెడి చిన్నపొద.
తుప్పటిల్లు అ. క్రి తనియు.
తుప్పర. తుంపర.
తుప్పలుదూలు. అ. క్రి. మిక్కిలిచలించు.
తుప్పు. లోహమలము; ఉమియుటయం
దగు ధ్వన్యనుకరణము.
తుభము. సం. మేఁకపోతు, భాగము.
తుమిక(కి). తిందుకము†.
తుమురు. సూక్ష్మఖండము; ధూళి.
తుములము. సం. సంకులము; దొమ్మి
యుద్ధము; తాంద్ర†. విణ. వ్యాకుల
మైనది.
తుమ్మ. బర్బూరము.
తుమ్మి. ద్రోణము†.
తుమ్మిక } తుమిక, తిందుకము.
తుమ్మికి }
తుమ్మిపూరాజనాలు. బ. ధాన్యవిశేషము.
తుమ్ము. క్షుతము. అ. క్రి క్షుతముచేయు.
తుమ్మెద. పూఁదేనెఁద్రావెడి యొకదినుసు
నల్లరెక్కలపురుగు, చంచరీకము.
తుమ్మెదకంటు. సం పెఁగ†.
తుమ్మెదమామిడి కోశామ్రము†.
తుమ్మెదమల్లె మన్మథుని మొదటిదియగు
వింటియొక్క నారి
తుమ్మెదరేపుడు. బాలక్రీడావిశేషము.
తురంగమము } సం అశ్వము, గుఱ్ఱము.
తురంగము }
తురక. తురకవాఁడు, తురుష్కుఁడు.
తురకదొగ్గలి. ఒకదినుసు దొగ్గలి†.
తురకపిక(గి)లి. ఒకదినుసుపిక(గి)లిపిట్ట.
తురకజాయి. బొంతజాయి.
తురకవేము. తృణనింబము†
తురకాణ్యము. గ్రా. తురకప్రభుత్వము;
తురకజనము.
తురగము. సం. గుఱ్ఱము; మనస్సు.
తురము సం. శీఘ్రము.
తురా. రూ. తురాయి.
తురాయణము. సం. అసక్తివాచకము.
తడబడకుండా చదువడము. ?
తురాయి(యీ). పిడుపుకాఁడ పెట్టి కట్టిన
పూబంతి; శిరోభూషావిశేషము.
తురాషా(సా)హుఁడు. సం. ఇంద్రుఁడు.
తురి. సం. కండెలుంచినేసెడుయంత్రము,
నాడె.
తురికి(కీ). టర్కీదేశపు గుఱ్ఱము.
తురితము. అవ్య క్రి. విణ. శీఘ్రము.
తురీన. ద్ర. క్రి విణ. తటాలున.
తురీయము. సం. సర్వాధారము నిరుపా
ధికమునైన బ్రహ్మచైతన్యము. విణ.
నాలుగవది. [హారమును మీఱినది.
తురీయాతీతము. సం. తురీయమనెడి వ్యవ
తురుంభము. సం. పూలదండలు మొద
లగునవి తురిమినకొప్పు. ?
తురుజె. గండీరశాకము.†
తురుఫీ. హిం. } గుఱ్ఱపుదండు, అశ్వ
తురుపు. ఇం. } దళము.
తురుష్కము. సం. చిల్లమడ్డి; ఒకానొక
దేశము.
తురుష్కుఁడు. సం. తురకవాఁడు.
తుర్యతుండి. సం పిండిదొండ†.
తుర్యము. సం. తురీయము. విణ. నాల్గవది.
తుఱఁగలి. ప్రకాశము.
తుఱఁగలించు } అ. క్రి. ప్రకాశించు;
తుఱఁగలిగొను } అతిశయించు.
తుఱుగు. స. క్రి. (బలవంతముగలోపల
వేసి) క్రుక్కు.
తుఱుతు. రూ. తుఱ్ఱు.
తుఱుము. పొడి; కొప్పు. స క్రి. తుఱుము
పీఁటతో పొడిపొడిచేయు; ప్రవా

దులం, ధరించు; (కొప్పుగా) ముడుచు; (కొప్పున) చెరువు.
తుఱుముపీట. తురుముటకనువుగా చివరనుపండ్లేర్పఱచిన వంకరయినుపకమ్మి చెక్కినపీట.
తుఱ్ఱ. తుట్ర.
తుఱ్ఱు. వేగిరపాటు, త్వర. క్రి. విశే. శీఘ్రము.
తుల. సం. తక్కెడ; దూలము; తులారాశి; సమానత్వము; నూఱుపలములకొలఁది [హాలపడు.
తులకించు. అ. క్రి. ప్రకాశించు; కుతూ
తులకింపు. ప్రకాశము. [మూడవభాగము.
తులము రూపాయియెత్తు, పలమునందు
తులసి. సం. తొళసి†.
తులసికోట. మి. గృహమున స్త్రీలు పూజ చేయుటకు పెంచిన తులసిచెట్టుకోట.
తులాకోటి. సం. కాలి అందె.
తులామానము. సం. త్రాసున తూఁచెడు తూనిక. [తూఁచఁబడినది.
తులితము. సం. విశే. సరిపోల్పఁబడినది;
తులుచే. విశే. వేగముగలది.
తులుచేన. వేగము. [రాలు.
తులువ. విశే. కుచ్చితుఁడు; కుచ్చితు
తులువచేరకత్తి. వంపుచురకత్తి.
తుల్యదృశుఁడు. సం. సమదృష్టికలఁవాడు.
తుల్యము. సం. విశే. సమము.
తుల్యుఁడు, విశే. సముఁడు.
తువర. తుంపర. [ఒగరైనది.
తువరము సం. ఒగరు, ఒకరసము. విశే.
తువరి సం. కంది†; అడవికంది†; ఎఱ్ఱమన్ను; తువరిధాన్యము.
తువాల ఇం. తుండుగుడ్డ.
తువ్వర. తుంపర.
తుషము. సం. పొట్టు, ఊముక; తాండ్ర†.
తుషారము. సం. మంచు; మంచుతుంపర. విశే. చల్లనిది.
తుషితుఁడు. సం. గణదేవతావిశేషము.
తుష్టి. సం సంతోషము. [వాఁడు.
తుష్టుఁడు సం. విశే. సంతోషముపొందిన
తుస్సి. విశే. ఒగరైనది (కేల).
తుస్సు. విశే. నీచము.

తుస్సుపెంజెర. పెంజెరభేదము.
తుస్సె. తుస్సి.
తుహినకరుఁడు. సం. చంద్రుఁడు.
తుహినము సం. మంచు.

## తూ

తూ. తూ పొడుచుటయందగు ధ్వన్యనుకరణము.
తూఁగాడు. అ. క్రి. ఊఁగు; చలించు.
తూఁగియాడు. అ. క్రి. తూఁగాడు.
తూఁగు. ఊఁగుట; కూరుకుపాటు. అ. క్రి. ఊఁగు; నిద్రించు, కూరుకు; చలించు; తూనికపడు; నడచు.
తూఁగుటుయ్య(య్యా)ల. ఉయ్యాల మంచేము.
తూఁగుపలక. తాపివాఁడు గోడల మట్టము చూచుటకై జాయిత్రవేలఁగట్టిన నిడుపాటి పలక.
తూఁగుమంచేము. ఉయ్యాల మంచేము.
తూఁచు. క్రి. తూనిక వేయు.
తూఁటి. తునుక విశే. దుష్టుఁడు.
తూఁటకట్టు. అ. క్రి. ఖండితముగు.
తూఁటరి. విశే. దుష్టుఁడు. [జేయు.
తూఁటాడు. స. క్రి. వేధించు. తూట్లుపడ
తూటి. తూటికూర.
తూఁటికూర. నళి†.
తూఁటిగానపుతేజీగలబోటి. సరస్వతి
తూఁటు. చిల్లి, రంధ్రము.
తూఁటుకట్టు. అ. క్రి తూఁటుపడు, చిల్లిపడు.
తూఁడరి. విశే. దుష్టుఁడు.
తూఁడు. బిసము, మృణాళము.
తూఁడుదిండి. హంస.
తూఁడునూలునారి. మన్మథుని మూడవది యగు వింటియొక్కనారి.
తూఁడువిల్తుఁడు. మన్మథుఁడు.
తూఁతకొమ్ము. మురళి.
తూకము తూనిక.
తూకు. రూ, తూకము.
తూకొను. అ. క్రి. పూను; ప్రవేశించు.
తూడికూర. వారిపర్ణి†.

తూణము } సం. అమ్ములపొది.
తూణీరము }
తూదము. సం. గంగరావి†.
తూనరతుక్కము. బాలక్రీడా విశేషము.
తూనిక. ఉన్మానము, తూఁచుట.
తూనికకోల. త్రాసుదండె.
తూనికవేయు. స. క్రి. తూఁచు
తూనిఁగ. తూనీఁగ.
తూనిఁగతానిఢ. బాలక్రీడా విశేషము.
తూనీఁగ. పతంగిక.
తూనెకొట్లాట. బాలక్రీడా విశేషము.
తూపరము. రంధ్రము.
తూపరాణ—ము } జలనిర్గమము, జలదారి.
తూపరాణి }
తూపి. గుడిలోమూల విగ్రహము ఉండెడు చోటికి మీఁద విమానమువలె ఎత్తుగా కట్టినకట్టడము.
తూపు. బాణము.
తూపురాసి. జలదారి.
తూపురిక్క. శ్రవణనక్షత్రము.
తూపురిక్కనెల. శ్రావణమాసము.
తూపోడుచు. స. క్రి. ఉమియు.
తూబరము. సం. కాలమున కొమ్ములు మొలవని పశువు.
తూబరుఁడు. సం. ప్రాయమున గడ్డము మీసము రానిమగవాఁడు; అంతఃపురపు కావలివాఁడు.
తూము. బండిచక్రము నడిమిరంధ్రము; జలనిర్గమము; నీళ్లుబయటికి వచ్చునట్లు ద్వారమేర్పఱచిన కట్టడము; ఆఢకము నాలుగుకుంచముల కొలఁది; నూడిబెజ్జము
తూమెఁడునేల. కుంట, తూమెఁడు విత్తులు విత్తెడిపొలము. [తుంపర.
తూర వానబొట్టు; మత్స్యవిశేషము;
తూరజెల్లు. ధారావర్షము.
తూరనగోలలు } బ. బాలక్రీడావిశేషము.
తూరనతుంకములు }
తూరనడుకాక్క. బాలక్రీడావిశేషము.
తూరి. ఆవృత్తి. [తూరపడు.
తూరు తుచ్ఛధాన్యము అ. క్రి. (సన్నగ)
తూరుపాఱ. పవనము, తుచ్ఛధాన్యోత్క్షేపణము.
తూరుపాఱఁబట్టు. స. క్రి. గల్లపట్టు మొదలగునవి యెగిరిపోవునట్లుగాచేట మొదలగువానితో ధాన్యము మొదలగు వానిని పైకెత్తి క్రిందుగాఁబోయు. రూ. తూర్పాఱఁబట్టు.
తూరుపు. ప్రాగ్దిశ. రూ. తూర్పు. [తము
తూరుపుఁగొండ. ఉదయము, పూర్వపర్వ
తూరుపుదణి } ఇంద్రుఁడు.
తూరుపుతేఁడు. }
తూరుపెత్తు. స. క్రి. ధాన్యాదికమును ఎత్తి తూరుపుగాలికివిడుచు; ఏదేని గాలి వాటముగా ఎత్తివిడుచు; వెంద్రుకలు పాయఁదీసి అడ్డముగా మీఁదికెత్తిపట్టు. రూ. తూర్పెత్తు.
తూర్చు ప్రే. రూ. తూరుచు.
తూర్ణము. సం. క్రి. విణ వేగము. విణ. వడిగలది. [బట్టు.
తూర్పాఱఁబట్టు. స క్రి. తూరుపాఱఁ
తూర్పాఱ. తూరుపాఱ.
తూర్పిడి తూరుపాఱఁబట్టుట.
తూర్పు. సూర్యుఁడుదయించెడు దిక్కు.
తూర్పుకొండ. ఉదయాద్రి.
తూర్పెత్తు. స. క్రి. తూరుపెత్తు. [మ్రోఁత.
తూర్యము. సం. వాద్యము; వాద్యపు
తూఱఁబడు. అ. క్రి. తూఱు.
తూఱు. అ. క్రి. చొచ్చు.
తూఱుచు. ప్రే. తూఱఁజేయు.
తూల. పండుదేఁప. [తొలఁగు.
తూలఁబాఱు అ. క్రి. తూలు; చలించు;
తూలనాళిక. సం. దూదిచుట్ట, ఏకు.
తూలపోవు. మి, అ. క్రి. చిన్నపోవు. ప్రే. తూలపుచ్చు. [దూది.
తూలము. సం. గంగరావి†; ఆకాశము;
తూలాడు. అ, క్రి. తూలు.
తూలి. చేఁపలనుబట్టిజీవించెడు యొకానొకజాతివాఁడు. సం. తూలిక.
తూలిక. మాల్యగ్రంథి. సం. చిన్నయీఁక; వ్రాసెడు కలము; కుంచె, చిత్రమువ్రాసెడు వాగరా.
తూలికాఁడు. తూలి.
తూలించు. స. క్రి. చంపు; బలహీనముగావించు; ఆవలికి తొలఁగించు.

తూలిని. సం బూరుగు†.
తూలియాడు. అ. క్రి. చలించు.
తూలు. అ. క్రి. చలించు; తొలఁగు; అడఁగారు. [మాటలం.
తూలు. హిం. తిట్లు, పెంచిచెప్పిన తూలు
తూలుచు. ప్రే. చలింపఁజేయు; తొలఁగించు. రూ. తూల్చు.
తూష్ణీకుఁడు. సం విణ. మాటలాడక ఊరకుండు వాఁడు.

## తృ

తృటి. సం. అల్పకాలము; ఏలకి†.
తృట్కాముఁడు. సం. విణ. దాహము (మజ్జిగ) త్రాగు కోరికగలవాఁడు.
తృట్టు. సం. దప్పి; ఇచ్ఛ.
తృణగ్రాహి. సం. మరకతము.
తృణజలూక. సం. గడ్డిజలగ, తృణముల యందు సంచరించెడి యొక దినుసు పురుగు.
తృణజ్యోతి సం. మానేరుతీగ; జ్యోతిష్మతి
తృణత. సం. తృణభావము; విల్లు.
తృణద్రుమము. సం. తాటిచెట్టు; టెంకాయ†; ఈఁదు†; పోఁక†.
తృణధాన్యము. సం. విత్తక పండెడు గునుకు నివ్వరి దూసరి మొ.
తృణధ్వజము. సం. వెదురు.
తృణపుష్పిక. సం. కొండయల్లము†.
తృణప్రాయము. సం. విణ. గడ్డిపోచతో సమానమైనది; అల్పమైనది.
తృణము. సం. గడ్డి, కిక్కిస మొదలగు గడ్డి; గంటె చామ మొదలగు పైరు.
తృణరాజము. సం. తాటిచెట్టు; గిలక తాటిచెట్టు; టెంకాయచెట్టు.
తృణశూన్యము. సం. మల్లె. (రూ. తృణశూల్యము)†; మొగలిపండు. విణ. తృణములేనిది. [చేయు.
తృణీకరించు. సం. స. క్రి. అలక్ష్యము
తృణ్య. సం. గడ్డిమోపు.
తృతీయము. సం. స. మూడవది.
తృతీయాకృతము. సం. విణ. మూడుచాళ్లు (ముమ్మాఱు) దున్నిన పొలము.
తృతీయాప్రకృతి. సం. నపుంసకుఁడు. రూ. తృతీయప్రకృతి.
తృప్తము. సం. పురోడాశము. విణ. తృప్తిపొందినది.
తృప్తి. సం. తర్పణము, తనివి.
తృప్తుఁడు సం. విణ. తనిసినవాఁడు.
తృష. సం. దప్పి; ఇచ్ఛ; అత్యాదరము.
తృషితుఁడు. సం. విణ. దప్పిగొన్న వాఁడు; ఇచ్ఛగలవాఁడు.
తృష్ణ. సం. ఇచ్ఛ; దప్పి; ఆశ.
తృష్ణక్కు. సం. విణ. తృషితుఁడు.

## తె

తెంకాయ. రూ. టెంకాయ.
తెంకాయచెట్టు. కొబ్బరిచెట్టు.
తెంకి. స్థానము; గృహము. రూ. టెంకి.
తెంచు. ప్రే. తెగఁజేయు. రూ. త్రెంచు.
తెండు. అ. క్రి. పరుండు, నిద్రించు.
తెందెప్పలు, తెందేపలు } బ. విణ. అపారము.
తెంపరి. విణ. సాహసికుఁడు; శూరుఁడు.
తెంపి. విధవాస్త్రీ; తెంపు, తెగువ.
తెంపు. తెగువ, సాహసము, చొరవ; తెగుట. ప్రే. తెంచు.
తెకతెక. ఉడుకుట కాఁగుట యెగయుట యందగు ధ్వన్యనుకరణము.
తెకతేర. విణ. బొత్తిగా సంబంధములేనిది; అప్రయత్నముగా.?
తెక్కరము. విలాసము.
తెక్కలి. దొంగతనము; వంచన; ప్రమాదము. విణ. వంచకము.
తెక్కలికాఁడు. దొంగ. విణ. వంచకుఁడు. బ. తెక్కలికారు.
తెక్కలిపాటు. విపత్తు.
తెక్కు. రూ. టెక్కు, విలాసము.
తెగ. సజాతీయ సమూహము; సమూహము; విధము; పక్షము; (ఎక్కుపెట్టిన) అల్లెత్రాడు; (అల్లెతాటిని) ఎక్కుపెట్టుట; నిడుపు. క్రి. నిశ్శేషముగా; ఖండితముగా; జత, సమానము.?
తెగఁగొట్టు. స. క్రి. నఱకు.

దసెన. ఆయుధవిశేషము.?
దస్క్రతు. హిం. చేవ్రాలు.
దస్తరము. హిం. వ్రాసిన కాగితాలకట్ట. రూ. దస్త్రము.
దస్తా. హిం. ఇరువదినాలుగు తావులకాగితములు; ఇరువదినాలుగు బాణములకట్ట
దస్తావేజు. హిం. వ్రాతపూర్వకమైన సాధనము.
దస్తు. హిం. వసూలయినసొమ్ము; ధనము
దస్తూరి. హిం. చేతివ్రాఁత.
దస్యుఁడు. సం. శత్రువు; దొంగ.
దస్రాభోగములు. బ. వడ్లలో భేదము.
దస్రులు. సం. అశ్వినీదేవతలు.
దహనము. సం. కాల్చుట; అగ్ని; చిత్రమూలము†; జీడి†. [దుష్టుఁడు.
దహనుఁడు. సం. అగ్నిహోత్రుఁడు. విణ.
దహనోపలము. సం. చెకుముకిఱాయి.
దహరము. సం. హృదయము.
దహరాకాశము. హృదయగుహ.
దహించు. సం. స. క్రి. కాల్చు. రూ. దహియించు.
దళకొను, దళగించు } అ. క్రి. అధికమగు; దట్టమగు.
దళనము. సం. ఖండించుట; భేదించుట.
దళమెత్తు. స. క్రి. యుద్ధప్రయత్నము చేయు.
దళము. ఆధిక్యము. విణ. అధికము; తఱచు; దట్టము. సం. ఆకు; సేన; పూరిదళము; భాగము; బద్ద.
దళముకొను. అ. క్రి. అధికమగు. ప్రే. దళము కొలుపు.
దళవరి. ధాన్యవిశేషము; సేనాధిపతి.
దళవాయి. సేనాధిపతి; సుంకరికి సహాయుఁడైన యుద్యోగస్థుడు.
దళసంచు. దళముజాతి.
దళసరి. ఘనత. విణ. తరచు; మందము.
దళించు. సం. స. క్రి. ఖండించు; భేదించు.
దళితము. సం. విణ. ఖండింపఁబడినది; బద్దలు చేయఁబడ్డది; వికసించినది.

# దా

దా. విణ. రూ. డా.
దాంతి. సం. ఇంద్రియనిగ్రహము.
దాంతుఁడు. సం. విణ. అడపఁబడినవాఁడు ఇంద్రియనిగ్రహముగలవాఁడు.
దాంపత్యము. సం. దంపతిభావము.
దాంభికుఁడు. సం. విణ. దంభముగలవాడు
దాఁక. ద్ర. పర్యంతము, దనుక.
దాఁకొను. అ. క్రి. మఱుఁగుపడు.
దాఁగన్రముచ్చులు. బ. దాఁగిలిమూఁతలు
దాఁగర. ఒరుగులు మొదలగునవి యెండఁబెట్టు తట్ట, ప్రసేవము. [మైనది.
దాఁగలి. కమ్మరవాని పనులకు ఆధార
దాఁగిలి మూఁతలు, దాఁగిలి ముచ్చులు } బ. బాలక్రీడావిశేషము.
దాఁగు, దాఁగుకొను } అ. క్రి. అదృశ్యమగు, మఱుఁగుపడు.
దాఁగురించు. స. క్రి. దాఁచు; వంచించు.
దాఁగురింత. దాఁగురించుట. బ. దాఁగురుమూఁతలు.
దాఁగురు మూఁతలు. బ. దాఁగిలిమూఁతలు
దాఁచు. ప్రే. దాఁగఁజేయు, గుప్తముచేయు.
దాఁటడుగు పరువడి, దాఁటడుగు మొన } మల్లబంధవిశేషము.
దాఁటు. లంఘనము; సమూహము; నద్యాదితరణము; సేన. అ. క్రి. లంఘించు. స. క్రి. తరించు; ఉల్లంఘించు.
దాఁటుకట్టు. అ. క్రి. గుంపుగూడు.
దాఁటుకొను. అ. క్రి. లంఘించు.
దాఁటుడు వల. జాలవిశేషము.
దాఁపన. దాఁచుట, గోపనము.
దాఁపరము. దొంగిలించుట.
దాఁపరించు. స. క్రి. దొంగిలించు.
దాఁపరీఁడు. దొంగ.
దాఁపటికము. గోపనము.
దాఁపు. ప్రే. దాఁచు.
దాఁపుడు. దాఁచుట, గోపనము.
దాఁపురము. దాఁచుట; గోపనము; దాఁచిన సొమ్ము. [ద్రాక్ష†.
దాక. పెడలువు నోరుగల యటిక; బోగిణి;

దాకలి. దాగలి; కాఁచి సాగఁ గొట్టెడు ఇనుము బంగారు మొదలగువానికి ఊఁతగా క్రిందనుంచెడు యినుప ముద్ద మెం.
దాకల్లు. బండి కంటి కడకమ్మి, నేమి.
దాకొను. అ. క్రి. సమీపించు; చేరు.
దాక్షాయణి. సం. సతీదేవి; దేవి; పార్వతీదేవి; రోహిణీ నక్షత్రము; అశ్విన్యాది నక్షత్రము; భూమి.
దాక్షిణాత్యుఁడు. సం. దక్షిణ దేశస్థుఁడు.
దాక్షిణ్యము. సం. మొగమోటము; పర కార్యము నిర్వహించెడిశక్తి. [వాఁడు.
దాక్షిణ్యుఁడు. సం. విణ. దక్షిణకు తగిన
దాఖలా. హిం. రుజువు, నిదర్శనము.
దాగలి. రూ. దాకలి, కూటము.
దాటరి. కప్ప.
దాట్రాయి. బాలక్రీడా విశేషము.
దాడి. దండయాత్ర, శత్రు జయార్థము దండెత్తి పోవుట, ధాటి; గడ్డము.
దాడింబ. దానిమ్మ.
దాడింబము. సం. దానిమ్మ. [వాఁడు.
దాడికాఁడు. వేగులవాఁడు; దండెత్తు
దాడిచేయు. అ. క్రి. దండెత్తు, యుద్ధ ప్రయత్నము చేయు.
దాడినిమ్మ. దానిమ్మ†.
దాడిమ పుష్పకము. సం. ములు మోదుగు†.
దాడిమము. సం. దానిమ్మ†; ఏలకి†.
దాడిమ్మ. దానిమ్మ†.
దాడియాడు. స. క్రి. మార్కొను.
దాఢ. సం. కోఱపల్లు; సమూహము.
దాణా. గుఱ్ఱపు ఆహారము, ఉలవలు మెం.
దాణము. సుంకము.
దాత. సం. విణ. ఇచ్చువాఁడు.
దాతికట్టు. ఉద్ఘనము. [వానకోయిల.
దాత్యూహము. సం. కూకురు గుండఁగి;
దాత్రము. సం. కొడవలి.
దాదాపు. మిక్కిలిసమీపము.
దాది-లి. పాలిచ్చి పెంచు స్త్రీ, ఉపమాత.
దాదినిజొన్న. జొన్నలలో భేదము.
దాదుంగ. దాతికట్టు, ఉద్ఘనము.
దానము. సం. ఈవి, ఇచ్చుట; ఏనుఁగు కపోలమదము; పాలనము; ఛేదనము; శుద్ధి; చతురుపాయములలో నొకటి. (దశదానములు — గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, ఆజ్యదానము, వస్త్రదానము, ధాన్యదానము, గుడదానము, రౌప్యదానము, లవణదానము. షోడశమహాదానములు— గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, రత్నదానము, విద్యాదానము, కన్యాదానము, దాసీదానము, శయ్యాదానము, గృహదానము, అగ్రహారదానము, రథదానము, గజదానము, అశ్వదానము, ఛాగదానము, మహిషీదానము.)
దానవారి. సం. దేవత; విష్ణువు.
దానవుఁడు. సం. దనుజుఁడు.
దానశౌండుఁడు. సం. విణ. వదాన్యుఁడు, చాలాయిచ్చెడివాఁడు.
దాని. సం. దాత; ఏనుఁగు.
దానిమ్మ. దాడిమవృక్షము. [చుట.
దాపనము. సం దండుగగొనుట; ఇప్పిం
దాపరము. ప్రాప్తి.
దాపరించు అ. క్రి. ప్రాప్తించు.
దాపల. ఎడమ, వామభాగము.
దాపలించు. అ.క్రి. ప్రదక్షిణమగు. స.క్రి. ఎడమవైపు న నుంచు; ప్రాప్తింపఁజేయు
దాపించు. అ. క్రి. సమీపించు; గుప్తము చేయించు ? [వాఁడు.
దాపితుఁడు. సం. విణ. దండుగగొనఁబడిన
దాపు. సమీపము; ఆధారము; భయము. స. క్రి. చేర్చు; చెక్కు.
దాపురమగు. అ. క్రి. ప్రాప్తించు.
దాపురము. ప్రాప్తి.
దాప్యము. సం. విణ. దండుగగొనఁదగినది.
దామని. సం. దామెనత్రాడు.
దామము. సం. (పసులఁగట్టెడు) పలుపు; ఉఱిత్రాడు; దండ.
దామర. ఉరిత్రాడు; మండలాకారవస్త్రము
దామెన. పదియిరువది యెడ్ల మెడలకు కట్టెడి నిడివిత్రాడు.
దామెర. మండలాకారవస్త్రము.
దామోదరుఁడు. సం. విష్ణువు.
దాయ. జ్ఞాతి; శత్రువు.

దాయఁగట్టు. స. క్రి. ఉజ్జుకట్టు.
దాయకుఁడు. సం. విణ. ఇచ్చువాఁడు.
దాయము. పాచికలు గవ్వలు మొదలైన వానియందలి పందెము; గవ్వలాట; విపత్తు. సం. పంచుకొనఁదగిన తండ్రి సొత్తు; ఈవి; అరణము; కట్నము, ఉల్ల కుట్టుమాట.
దాయాదుఁడు. సం. జ్ఞాతి; పుత్రుఁడు.
దాయి. దాగలి. సం. విణ. ఇచ్చువాఁడు.
దాయు. అ. క్రి. సమీపించు.
దార. నీటిచాలు; దానము; క్రమము; కత్తి యంచు. సం.బ. అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్య.[సారథి.విణ చీల్చువాఁడు·
దారకుఁడు. సం. బాలకుఁడు; కృష్ణుని
దారణ. వెల.
దారణము. సం. చీల్చుట. [ఇంగిలీకము.
దారదము. సం. విషభేదము; పాదరసము
దారబందము. ద్వారబంధము.
దారము. నూలిత్రాడు, సూత్రము.
దారి. మార్గము. విణ. ధరించువాఁడు.
దారించు. సం. స. క్రి. చీల్చు.
దారితము. సం. విణ. చీల్పఁబడినది; బ్రద్దలు చెయ్యఁబడ్డది.
దారిద్ర్యము. సం. బీదతనము.
దారుకీటము. సం. ఘుణము.
దారుణము. సం. భయానకరసము. విణ భయంకరమైనది.
దారున. ద్ర. క్రి. విణ తటాలున.
దారువు. సం.కఱ్ఱ, కొయ్య; దేవదారువు† ఇత్తడి.
దారుహరిద్ర సం. మ్రానిపసుపు.
దారుహస్తకము సం. కొయ్యతెడ్డు.
దారోగా. హిం. పైయధికారి.
దార్ఢ్యము. సం. దిటవు.
దార్దురికుఁడు. సం. కుమ్మరవాఁడు.
దార్వాఘాటము. సం. వడ్లంగి పిట్ట.
దార్వి. సం. మ్రానిపసుపు†; బెండ†.
దార్వీక. సం. బెండ†; మ్రానిపసుపున వండిన అంజన విశేషము.
దాలి. పాలు కాఁచుట మొదలగువానికిఁ జేర్చిన పిడకల ప్రోగు
దాలిగుంట. పిడకలు ఉమ్మకవేసి పాలు మొదలగునవి కాఁచుగుంట.
దాల్చిని. హిం. గుడత్వక్కు, సుగంధి ద్రవ్య విశేషము.
దావ. దావా, వ్యాజ్యము.
దావంతము. దుఃఖము.
దావము సం. అడవి; కార్చిచ్చు.
దావరడంగి. రూ. డావరడంగి†.
దావరము. చౌర్యము.
దావరి / దావరీఁడు } విణ. వీరుఁడు.
దావా. హిం. వ్యాజ్యము, అభియోగము.
దావికము. సం. విణ. దేవికానది యందుఁ బుట్టినది.
దాశపురము. సం. కైవడిముస్తె†.
దాశరథి. సం శ్రీరామచంద్రుఁడు; భరతుఁడు; లక్ష్మణుఁడు; శత్రుఘ్నుఁడు.
దాశార్హుఁడు. సం. కృష్ణుఁడు.
దాశుఁడు. సం. బెస్తవాఁడు, జాలరి.
దాసనము. జప†.
దాసరయ్య. తాఁబేలు.
దాసరి. విష్ణుసేవకుఁడైన శూద్రుఁడు.
దాసరికొయ్య. మత్స్యవిశేషము.
దాసరిగాఁడు. తాఁబేలు.
దాసరివాఁడు. విష్ణుదాసుఁడు, దాసరి.
దాసరిపాము. సర్పవిశేషము.
దాసి. సం. వెలకుఁగొన్న పనికత్తె, పరిచారిక; కాకిదొండ†; నల్లగోరంట†.
దాసుఁడు. సం.వెలకుఁగొన్న పనివాఁడు, భృత్యుఁడు; శూద్రుఁడు; జ్ఞాని; జాలరి, చేఁపలఁ బట్టువాఁడు.
దాసేయి. సం. వ్యాసుని తల్లి.
దాసేయుఁడు. సం. దాసీపుత్రుఁడు;జాలరి
దాసేరకము. సం. లొట్టిపిట్ట, ఒంటె.
దాసేరుఁడు. దాసీపుత్రుఁడు; జాలరి; శూద్రుఁడు.
దాస్తికము. అధికారమునందలి దిట్టతనము.
దాస్యము. సం. సేవ.
దాహకుఁడు. సం. విణ. కాల్చువాఁడు.
దాహము. కాలుట; దప్పి.
దాహరి. రూ. దాసరి.
దాళా. పడియొక్క పొచ్చుతక్కువ

నెయ్యి నూనె మొ॥ తీయుపాత్రములను గాని అవియుంచియున్న పాత్రములను గాని సరియెత్తు టొలనుదడతట్టనుంచి తూఁచుట. [వాని పప్పు.

దాళి. సం. బేడలు, సెనగలు మొదలగు

దాళింబ } దానిమ్మ†.
దాళిమ్మ }

దాళీకుఁడు. విణ. కార్యకర్త.

దాళు. వర్ణలేశము.

దాళువ. దౌడ.

దాళువాపంట. శరదృతువు మొదలుకొని నీరాసరాను పండెడు పల్లపుపంట.

## ది

ది. అప. సంబంధమును దెలుపునది. (నాది, నీది మొ.)

దింకము. ఈరు.?

దింకలు. మల్లవిద్యావిశేషము.

దించు. ప్రే. క్రిందికిదిగఁజేయు, అవతరింపఁజేయు.

దింటెన. గిరికర్ణి†. [దారువు.

దింపడ. నాఁగలికి అడ్డముగా నమర్చిన

దిండీఁడు. విణ. కాసెకట్టినవాఁడు.

దిండీరము. నురుగు, ఫేనము.

దిండు. నిడుపాటి గుండ్రపుతలగడ, ఉపధానము; నిడుపాటి గుండ్రపుతలగడవలె చెక్కఁబడినమ్రాను; మెఱుఁగు బిళ్ల మొదలగునవి యంటించెడు ఔాల్లపని వాని సానతిరుగుడుకొయ్య; కాసె; అతిశయము.

దిందిం. మృదంగాదివాద్యధ్వనివిశేషము

దింపు. లంబనము, వ్రేలుట. స. క్రి. దించు.

దింపులువోవు. అ. క్రి. వ్రేలాడు.

దిక్కుమొకములు } కాందిశీకులు,
దిక్కు(క్కా)మొగములు } భయముచేత దిక్కునకొకరుగా పాఱినవారు.

దిక్కు. సం. దిశ; దెస; శరణ్యము, ప్రాపు

దిక్కుచెడు. అ. క్రి. దిక్కులేకపోవు.

దిక్కులంధరము. సం. విణ. దిక్కులను ధరించినది. [కులు.

దిక్పతి. దిక్పాలకుఁడు. బ. అష్టదిక్పాల

దిగ. అప. దిగుపశబ్దమునకు వృత్తియందు ఆదేశముగా వచ్చిన రూపము.

దిగంబరుఁడు. సం. శివుఁడు; భైరవుఁడు. విణ. దిస్సమొలగలవాఁడు.

దిగఁదీయు. స. క్రి. దిగఁదుడుచు.

దిగఁదుడుచు. స. క్రి. (దృష్టిదోషము మొదలైనవానికి ఉప్పు మిరపకాయ మొదలగు వానిని) చుట్టివేయు.

దిగఁదుడుపు. దిగఁదుడుచుట.

దిగఁద్రావు. అ. క్రి. దిగు. స. క్రి. విడుచు

దిగఁబడు. అ. క్రి. దిగు; అడఁగు; క్రుంగు; జాఱు.

దిగదిగ. వచ్చుట పోవుట విసరుట మెఱయుట మొదలగువానియందగు అనుకరణము.

దిగనాడు. } స. క్రి. విడుచు.
దిగవిడుచు. }

దిగసన. ద్ర. క్రి. విణ. దిగువగా.

దిగాలుపడు. అ. క్రి. తెల్లబోవు.

దిగు. అ. క్రి. మీఁదనుండి క్రిందికి వచ్చు, అవతరించు; దిగుమతియగు; ప్రయాణమై పోవునపుడు దారిలో విడియు; దిగఁబడు

దిగుచు. ప్రే. దించు.

దిగుడు. విణ. ఆనతము; తక్కువ.

దిగుదల. అడుగు, క్రిందిభాగము.

దిగుమతి. ఓడ మొదలగు వానిలో నున్న సరకును దించుట.

దిగులు. గుండెయదరు, భయము.

దిగులుపడు. అ. క్రి. దిగులొందు.

దిగులుపాటు. దిగులుపడుట.

దిగువ. క్రిందు. విణ. క్రిందైనది.

దిగువాటు. దిగువ.

దిగువాయి. విణ. తక్కువ. [పడు; కాఱు

దిగువాఱు. అ. క్రి. మీఁదనుండి క్రిందకు

దిగ్గజములు. బ. అష్టదిగ్గజములు.

దిగ్గన. ద్ర. క్రి. విణ. తటాలున, శీఘ్రముగ

దిగ్గనాడు. స. క్రి. విడుచు.

దిగ్గియ. రూ. డిగ్గియ. [రూ. దిగు.

దిగ్గు. స. క్రి. భయమునందగు అనుకరణము

దిగ్గుడు. విణ. రూ. దిగుడు.

దిగ్గున. ద్ర. క్రి. విణ. రూ. దిగ్గన.

దిగ్గురను. అ. క్రి. భయముచే హ్రూక యము దిగ్గుమను.
దిగ్గోలు. కోయు పైరునకు ముందు పైరు.
దిగ్ధము సం. విషము పూసిన బాణము, విణ. పుయ్యఁబడ్డది.
దిగ్బంధము. సం. మంత్రముచే కట్టెడు దిక్కుల కట్టు; సాలెపురుగు.
దిగ్భ్రమ—ము. సం. దిక్కుల తబ్బిబ్బు. వా. భ్రమ.
దిగ్వాసుఁడు. సం. విణ దిక్కులు వస్త్రము గాఁ గలవాఁడు, దిగంబరుఁడు.
దిచ్చేరి. కులట.
దిచ్చుమొగము. విణ. అదృశ్యము.
దిట. శక్తి. [దృఢము.
దిటము. అతిశయము; ధైర్యము. విణ.
దిటవరి. ధీరుఁడు.
దిటవు. శక్తి. విణ. దృఢము.
దిట్ట. శక్తి. విణ. దార్ఢ్యము గలవాఁడు; ధీరుఁడు; ధైర్యము గలవాఁడు;సామర్థ్యము గలవాఁడు.
దిట్టఁడు. విణ. ధైర్యము గలవాఁడు.
దిట్టపడు. అ.క్రి.అలముకొను. [ధైర్యము
దిట్టము. నిర్ణయము; శక్తి. దృఢత్వము;
దిట్టరి. దిట్ట; ధీరుఁడు.
దిడ్డి. గవని మొదలగు వాని ప్రక్కనుండు చిన్న వాకిలి; పల్లకి మొదలగు వానికి వేయు తెర; చిన్న వాకిలి.
దిడ్డిగంత. దిడ్డికన్నము. [ద్వారము.
దిడ్డి వాకిలి. పెరటి గుమ్మము; పక్ష
దిడ్డివైచు. స. క్రి. పాలకీలు మొదలైన వాని వాకిలికి పరదా యమర్చు.
దితము. సం. విణ. నఱకఁబడినది.
దితి. సం. అసురుల తల్లి; నరకుఁడు.
దితిసుతుఁడు. సం.దైత్యుఁడు,అసురుఁడు.
దిద్దిం. ధిం ధిమ్మను ధ్వన్యను కరణము.
దిద్దు స. క్రి. శిక్షించు; సవరించు.
దిద్దుగడ, దిద్దుడు, దిద్దుపాటు, దిద్దుబడి. } శిక్షించుట; సవరించుట.
దిదృక్ష. సం. చూడనిచ్ఛ.
దిదృక్షువు. సం.విణ.చూడనిచ్ఛగలవాఁడు
దిధక్ష. సం. కాల్పనిచ్ఛ.
దిధక్షువు. సం.విణ. కాల్పనిచ్ఛగలవాఁడు
దిధిషువు. సం. మాఱు మనువుది; మాఱు మనువుదాని మగఁడు.
దినకరుఁడు. సం. సూర్యుఁడు.
దినగోల. దినబత్తెము.
దినచర్య. సం. ప్రతి దిన కార్యక్రమము; దినచర్య వ్రాయు పుస్తకము.
దినదినగండము. సం.ప్రతి దినమువచ్చెడి అపాయము. [నిచ్చెడి కూలి.
దినబత్తెము. మి. దిన భృత్య, దినదినము
దినమణి. సం. సూర్యుఁడు.
దినము. సం. పగలు ; అఱువది గడియల కాలము, రోజు; తిథి; ప్రతిదినము.
దినవెచ్చము. మి. ప్రతి దినము చేసెడి వ్యయము.
దినసరి. సస్య విశేషము.
దినసరులు. బ. ప్రతి దిన కార్యక్రమము; శాలిధాన్య విశేషము.
దినాంతము. సం. సాయంకాలము.
దినారి. దీనారము.
దినుసు. రకము,విధము;వస్తువు;సామ్యము
దినుస్సు. రూ. దినుసు.
దిన్నె. వృక్షవిశేషము. రూ. దిన్న.
దిబదిబ. అనుకరణ ధ్వని. [కుప్ప.
దిబ్బ. ద్వీపము; కొండ; ఉన్నత భూమి;
దిబ్బడము. రూ. దబ్బడము.
దిబ్బు. బల్లలు మొదలగువాని చప్పుడు ?
దిబ్బె. దీపము. [ణము చేయు.
దిబ్బెమెత్తు. అ. క్రి. దీప మెత్తి ప్రమా
దిబ్బెము. దీపము.
దిమాకు. హిం. అధికారము; గర్వము.
దిమిదిమి దిందిం.
దిముకు. దిందిం.
దిమ్మ. తెలివి; దిబ్బ; భ్రమము ; వర్గము ; మంచపు కోడు మొదలగువాని క్రింద నుంచుతాయి; కంసాలి బంగారు మొ॥ సాఁగఁగొట్టుట కుపయోగించెడి ఇనుప ముక్క; ఇటుక మొదలగు వానితోఁ గట్టెడి చిన్న స్తంభము.
దిమ్మరి. మత్తుగలవాఁడు; మత్తుగలది.

దిమ్మరీఁడు. విణ. మత్తుకలవాఁడు.
దిమ్మిస. నేలచదును. [మైన నొప్పి.
దిమ్ము. వర్గము; భ్రమ; మత్తు; ఒక విధ
దిమ్ముపట్టు } అ. క్రి. భ్రమగొను; మత్తు
దిమ్ముపడు. } కొను.
దిమ్మె. తామరపూవ్వులోనిదుద్దు; కొయ్యమొద్దు; త్రాళ్ళు మొదలగువానితో నేర్పఱచిన చిన్నమిట్ట.
దిమ్మెస. కాసెవాని ఒకకొలముట్టు.
దిరదిర. ద్ర. గిరగిర తిరుగుటయందగు అనుకరణము.
దిరిసెన—ము. } శిరీషము†.
దిరిసెము. }
దిర్దిర. ద్ర. రూ. దిరదిర.
దిలాసా. హిం. హెచ్చరిక; ధైర్యము
దిలీపుఁడు. సం. ఒకరాజు. [చెడి దీపము.
దివటీ. ఇనుపసలాకను గుడ్డలుచుట్టిముట్టిం
దివము; సం. స్వర్గము; ఆకాశము; పగలు
దివసము. సం. దినము.
దివస్పతి సం. ఇంద్రుఁడు.
దివాంధము. సం. గుడ్లగూబ.
దివాకరుఁడు. సం. సూర్యుఁడు.
దివాకీర్తి. సం. మంగలవాఁడు; మాలవాఁడు, చండాలుఁడు.
దివాణము. రాజుకొలువుకూటము; కొలువుకూటము; రాజగృహము.
దివాను. హిం. మంత్రి. [కొలను.
దివాభీతము. సం. గుడ్లగూబ; కలువ
దివాభీతుఁడు. సం. దొంగ.
దివాలా. హిం. వ్యవహారమునందలి నష్టముచే సర్వసంపద పోవుట, చేసిన అప్పులు చెల్లించలేనిస్థితి.
దివి. సం. ఆకాశము; స్వర్గము; పాలపిట్ట
దివిజుఁడు. సం. దేవత.
దివిదారికొమ్ము. రెండిట్టికొమ్ములను ఇరుప్రక్కల మొనలుగా జతపఱచి ఏర్పఱచిన మల్లసాధనవిశేషము.
దివియ. దీపము; దివటీ.
దివియకంబము. దీపస్తంభము.
దివియకోల. దివటీ.
దివిషదుఁడు. సం. దేవత.
దివు. అ. క్రి. రూ. దిగు.
దివె. దీపము; దివటీ.
దివెకంబము. దీపస్తంభము.
దివెదారికొమ్ము. దాసరుల దీపస్తంభము.
దివో(వౌ)కసము. సం. పక్షి; చాతకపక్షి.
దివో(వౌ)కసుఁడు. సం. దేవత.
దివ్య. దీపము; దివటీ. సం. ఉసిరిక†.
దివ్యచక్షువు. సం. కండ్లజోడు; సుగంధవిశేషము; దివ్యదృష్టి. విణ. దివ్యదృష్టి గలవాఁడు; మంచికన్నులుగలవాఁడు; గ్రుడ్డివాఁడు.
దివ్యము సం. లౌకిక సాక్ష్యాదిప్రమాణములు సరిగాలేనపుడుచేసెడి ఒక పరీక్ష, గంగోదకాదులను తాఁకిచేసెడి శపథవిశేషము, ప్రమాణముచేయుట; లవంగము; ఉత్పాతవిశేషము. విణ. అప్రాకృతము; దివియందుఁ బుట్టినది; ఒప్పునది; మనోహరము; ప్రకాశించునది. (పంచదివ్యములు — తులాదివ్యము (పరీక్ష), అగ్నిదివ్యము, జలదివ్యము, విషదివ్యము, కోశదివ్యము.)
దివ్యాఉపుఁబువ్వు. దివ్వెయార్పుమిడుత.
దివ్యులు. సం. బ. దేవతలు.
దివ్యోపపాదుకుఁడు. సం. విణ. అయోని సంభవదేవాది.
దివ్వటీ. రూ. దివటీ.
దవ్విటి } రూ. దివటీ.
దివ్విటీ }
దివ్వియ. దీపము; దివటీ.
దివ్వియకంబము. దీపస్తంభము.
దివ్వియకోల. దివటీ.
దివ్వె. దీపము.
దివ్వెకంబము. దీపస్తంభము.
దివ్వెకోల. దివటీ.
దివ్వెచమురు. ఆముదము.
దివ్వెటీ. అగ్గిబాడి, దివటీ.
దివ్వెయార్పు. దివ్వెయార్పుమిడుత.
దివ్వెసుడి. గోటయందు దీపముపెట్టుటకై అమర్చిన గూడు.
దిశ. సం. దెస, దిక్కు.
దిశి. దిక్కు.
దిశ్యకరుఁడు. సం. సూర్యుఁడు.
దిశ్యము. సం. విణ. దిక్కునందుఁబుట్టినది.

దిష్టము. సం. భాగ్యము; కాలము. విణ. ఉపదేశింపఁబడినది.
దిష్టాంతము. సం. మరణము.
దినంతడుచు. స. క్రి. దూఱు.
దినంతు. నింద. [దినంతులుకొట్టు.
దినంతుకొట్టు. స. క్రి. నిందించు. రూ.
దినమొల. వస్త్రహీనమైనమొల.
దినమొలవాఁడు. విణ. దిగంబరుఁడు, దిగ్వాసుఁడు, అంబరాంబరుఁడు.
దినమొలవేల్పు. శివుఁడు; కాలభైరవుఁడు
దిన్నమొల. రూ. దినమొల.
దిన్నమొలవాఁడు. విణ. దిగంబరుఁడు.
దిన్నమొలవేల్పు. రూ. దినమొలవేల్పు.
దిన్ను. పాముబుసకొట్టుట యందగుధ్వన్యనుకరణము.

## దీ

దీ. అవ్య. రూ. డీ.
దీకు. రూ. డీకు. [ర్కొను.
దీకొను. అ. క్రి. స. క్రి. డీకొను, ఎదు
దీకోలు. రూ. డీకోలు.
దీక్ష. సం. యజ్ఞాది క్రియారంభమునందు అనుష్ఠింపఁబూనుకొనెడు ఆచారనియమము; వ్రతాదులయందు నియమము చేయుట.
దీక్షించు. సం. అ. క్రి. దీక్షవహించు.
దీక్షితుఁడు సం. సోమముగల యజ్ఞమునందు దీక్షవహించినవాఁడు.
దీటు. స. క్రి. సరిచేయు; సామ్యము; ఆక్రమణము. విణ. సరి, సమానము.
దీటుకట్టు. అ. క్రి. దీటుకొను.
దీటుకొను. అ. క్రి. నిండుకొను స. క్రి. సవరించు; సరిపోలు. ప్రే. దీటుకొలుపు
దీదివి. సం. అన్నము; బృహస్పతి.
దీధితి. సం. వెలుఁగు, కిరణము.
దీన. సం. ఎలుక. విణ. దీనురాలు.
దీనారము. సం. పైఁడినాణెము, మొహరి.
దీనుఁడు. సం. విణ. దరిద్రుఁడు; దర్పముడిగినవాఁడు. భయపడినవాఁడు.
దీపకము. సం. ఒక అర్థాలంకారము; ఓమము; దీపము; దీమము. విణ. వెలిఁగించునది.
దీపకిట్టము. సం. దీపపు కొణుఁగురు.
దీపగంబము మి. దీపస్తంభము.
దీపధ్వజము. సం. దీపస్తంభము.
దీపనము. సం. ప్రకాశింపఁజేయుట; రగులుకొలుపుట; జఠరాగ్నిని వృద్ధిచేయుట.
దీపని. సం. ఓమము; మెంతులు.
దీపము. సం. దివ్వె; తీఁగ; బయిరవాసము; మయూరశిఖి†.
దీపపాదపము. సం. దీపస్తంభము.
దీపవల్లి సం. దీపప్రవర్తి.
దీపవృక్షము, సం. దీపస్తంభము.
దీపశిఖ. సం. దీపపుకొడి.
దీపాంధము. సం. పందికొక్కు. ?
దీపావళి. నరకచతుర్దశి మఱునాటిపండుగ
దీపించు. సం. అ. క్రి. ప్రకాశించు.
దీపిక. సం. దీపము.
దీప్తము. సం. విణ. వెలిఁగినది; కాలినది; మండినది; ప్రకాశించినది.
దీప్తి. సం. కాంతి; ప్రకాశము.
దీప్యకము. సం. ఓమము; యవలబియ్యము; నెమిలిజుట్టు†.
దీప్యము. సం. ఓమము; జీలకఱ్ఱ.
దీమము. పక్షిమృగాదులను పట్టుటకై వేఁటకానిచేఁ బెంపఁబడిన పక్షి మృగము మొదలగునది; గృహము.
దీమసము. ధైర్యము; ఉపాయము.
దీము. రూ. దీమము. [లను పిలిచెడిపిట్ట.
దీముపిట్ట. తాను పెంచబడి స్వజాతి పక్షు
దీర్ఘకోశిక. సం. ఏనుఁగుజెలగ.
దీర్ఘజంఘము. సం. ఒంటె; కొంగ; బెగ్గురుపక్షి; విణ. నిడుపాటి పిక్కగలది.
దీర్ఘదర్శి. సం. విద్వాంసుఁడు; గద్ద. విణ. దేశకాల లక్షణములు తెలిసినవాఁడు, దూరపు యోచన కలవాఁడు.
దీర్ఘదేహి. సం. పందికొక్కు.
దీర్ఘనిద్ర. సం. పెద్ద నిదుర, మరణము.
దీర్ఘపత్రము. సం. తెల్ల గలిజేరు†.
దీర్ఘపృష్ఠము. సం. సర్పము.
దీర్ఘము. సం. విణ. ఆయతము, నిడుద, నిడుపైనది.
దీర్ఘమూల. సం. తీఁగతుమడి †.
దీర్ఘవృంతము. సం. దుండిగము†.

దీర్ఘసూత్రుఁడు. సం. విణ. చిరక్రియుఁడు
దీర్ఘాయువు. సం. కాకి; మార్కండే యుఁడు; బూరుగు†; జీవక మను గంధ ద్రవ్యము విణ. పెక్కేండ్లు బ్రదుకు వాఁడు.
దీర్ఘిక. సం. బొడ్డన బావి.
దీర్ణము. సం. విణ. చీల్పఁబడినది; భయ పడినది; గాయము. ? [రూ. డీలు.
దీలు. అ. క్రి. డిల్లపడు. విణ. డిల్లము.
దీలుపడు. అ. క్రి. రూ. డీలుపడు.
దీవటి. కరదీపము.
దీవన. ఆశీర్వాదము.
దీవనబ్రాలు. అక్షతలు, సేసలు.
దీవనము. ధైర్యము; ఉపాయము; ఆలో చన; అభిప్రాయము.
దీవి. జలమధ్య మందుండెడి ద్వీపము.
దీవించు. స.క్రి. ఆశీర్వదించు.
దీవియ. దీపము.
దీవియ కంబము. దీప స్తంభము.
దీవె రూ. దీవియ.
దీవెన. ఆశీర్వచనము.
దీవెనకోల. నమస్కారము.
దీవెనబ్రాలు. మంత్రాక్షతలు.

# దు

దు. సంబంధార్థమందు యుష్మదస్మచ్ఛబ్ద ములకు వికల్పముగానగు ఆగమము (నీదు సొమ్ము నాదు సొమ్ము మొ)
దుంకము. రంధ్రము.
దుంగ. మ్రాని మొద్దు.
దుండగము. దౌష్ట్యము; కీడు; అపరా ధము; ధూర్తత. [అపరాధి.
దుండగీఁడు విణ. దుష్టుఁడు; ధూర్తుఁడు;
దుండరికము. దుండగము.
దుండి. దొరసాని.
దుండిగము. శోణకము†.
దుండిలము. } దుండిగము †.
దుండుకము. }
దుండుబలి. విణ. సోమరి.
దుండుబలితనము. సోమరితనము.
దుండెకాఁడు. ధూర్తుఁడు?; అపరాధి?
దుంత. మహిషము, దున్నపోతు.
దుంతరవుతు. మహిషవాహనుఁడు. యముఁడు.
దుందిలము } దుండిగము†.
దుందుకము }
దుందుడుకు. గర్వము; మిక్కిలి తొందఱ; మిక్కిలి తడఁబాటు; కష్టము.
దుందుభి సం. పాచికయందలి ఇత్తిగ; భేరి; వరుణుఁడు; ఒక సంవత్సరము; ఒక రాక్షసుఁడు.
దుందుము చక్రాకారపు దివటీ.
దుందుఱు. రూ. జుంజుఱు.
దుంప. కందము, గెనుసు మొదలగువాని గడ్డ; నాఁగేటి గొడగ; మూలము.
దుంపకూర. కందమూలము.
దుంపబచ్చలి. ఉపోదక†.
దుంపరాష్ట్రము. సువహా, రాస్నా విశే షము, ఒక మందు దినుసు.
దుంబాలా. హిం. పన్నులేక ఈనాముగా ఇచ్చిన భూమి. [సున్నని కూర పిండి.
దుంబొడి. (మెంతి, జిలకఱ చేర్చి చేసిన)
దుఃఖపడు. మి. అ. క్రి. దుఃఖించు, నొగులు. ప్రే. దుఃఖపఱుచు.
దుఃఖపాటు. మి. దుఃఖపడుట.
దుఃఖపెట్టు మి. స. క్రి. దుఃఖపఱుచు.
దుఃఖము. సం. బాధ, కష్టము; ఖేదము.
దుఃఖించు. సం. అ. క్రి దుఃఖిల్లు.
దుకాణము. అంగడి, ఆపణము.
దుకూలము. సం. తెల్లవస్త్రము; పట్టు వస్త్రము; సన్నవస్త్రము.
దుక్కి. దున్నుట; నాఁగేటిచాలు; దుక్కి మునుఁగుటకుఁ దగిన వర్షము.
దుక్కిటెద్దు. హాలికము, దున్నుటకుపయోగించెడి యెద్దు.
దుక్కిపొలము. దున్నినపొలము.
దుక్కిముచ్చు. కర్షకుఁడు.
దుక్కివాలు. హలము, నాఁగలి.
దుక్కివాలుదాలుపు. హలాయుధుఁడు, బలరాముఁడు.
దుగ. స. రెండు, ద్వయము.
దుగపదిరూపులదుండగీఁడు. ద్వాదశాత్మ, సూర్యుఁడు.

దుగపుట్టుక. ద్విజుఁడు; బ్రాహ్మణుఁడు.
దుగమొగములపులుఁగు } గండభేరుండ
దుగమొగంబులపుల్గు } పక్షి.
దుగమోములవేల్పు } ద్విశీర్షుఁడు, అగ్ని
దుగమోములయ్య } రూ. దుగమోము
దుండగీఁడు.
దుగలము. పావులా.
దుగానా. నమస్కారము.
దుగినుఁడు. బ్రహ్మ, ద్రుహిణుఁడు.
దుగుణము. స. దుగ. విణ. రెండింతలు.
దుగులము రూ. దుగలము.
దుగ్గ. కాళి; పార్వతి; దుర్గ
దుగ్గతండ్రి హిమవంతుఁడు.
దుగ్గాని. ఏగాని.
దుగ్గి. పార్వతి, దుర్గ.
దుగ్గికన్నయ్య హిమవంతుఁడు.
దుగ్గు. తొక్కు, మార్ణ శాకము. విణ.
రూపము చెడినది (తృణము .
దుగ్ధ వా అసూయ; ద్వేషము.
దుగ్ధతుంబి సం. పాలానుగు†.
దుగ్ధపాషాణము. సం. పాలఱాయి.
దుగ్ధము. సం. పాలు. విణ పిదుకఁబడినది;
నింపఁబడినది.
దుగ్ధిక సం. చిఱుపాల†.
దుట్టుపు(వు). జుట్టుపు†.
దుడిదుడి గునగున.
దుడుకఁడు. బాలకుఁడు. విణ. దుష్టుఁడు.
దుడుకు. దౌష్ట్యము; ఉద్ధతి; అపరాధము.
విణ. దుష్టము; ఉద్ధతము; ఉద్ధతుఁడు;
ఉద్ధతురాలు. [విణ. మోటుకాఁడు.
దుడ్డు. ధనము, డబ్బు; దండము; గద.
దుడ్డుఁగఱ్ఱ } దండము, పరిఘము, లావు
దుడ్డుఁగోల } కఱ్ఱ.
దుడ్డె. బాలకుఁడు. విణ. ధూర్తుఁడు;
ధూర్తురాలు.
దుడ్లు. ఏగాని. [ప్రాదేశము.
దుత్త. పాలకుండ, చిన్న మూతికుండ;
దుత్తాయి. చిన్న చొక్కా, కూర్పాసము
దుత్తూరము. కపటము. సం. ఉమ్మెత్త†.
దుద్దు. కర్ణిక, తామరపువ్వు మొదలగు
వానిలోని దిమ్మె; తాటాకుజాబుమీఁది
చంద్రిక. బ. కర్ణాభరణ విశేషము లం.
విణ. అసత్యము.
దుద్దెక్కు. అ. క్రి. అతిశయించు.
దుద్రుమము. సం. పచ్చ నీరుల్లి†.
దునియు. స. క్రి. కృషి చేయు, దుక్కి
చేయు, దున్ను.
దునీఁడు. శూరుఁడు; ప్రభువు.
దును. స. క్రి. దున్ను.
దునుకు. బాధ. [ధరించినవాఁడు.
దునె(నే)దారి. విణ. శూరుఁడు; కత్తి చేత
దున్న. మహిషము; మగపశువు.
దున్నపోతు దున్న; నిందార్థకము.
దున్ను. స. క్రి. కృషిచేయు, దుక్కిచేయు
దుప్పటము వెలగల సన్నపాటి వెడల్పు
వస్త్రము; కవచము; ఉత్తరీయము;
నిచోళము.
దుప్పటి. దుప్పటము; నిచోళము, పక్క
మీఁదఁ బరచుట కుపయోగించు మూతక
బట్ట. రూ. దుప్పటీ. [షము.
దుప్పి. పృషతము, రురువు, మృగ విశే
దుబారా హిం. విణ. చెట్టింపు; వ్యర్థము.
దుబాసి హిం. ద్విభాషి, భాషాంతరము
చేయువాఁడు. రూ. దుబాసీ.
దుబ్బ. అడుగుజతి; పాత్ర విశేషము.
దుబ్బు. గడ్డి మొదలగువాని గంట, తృణ
మూలము.
దుమగతికేతు. ధూమకేతువు.
దుమదుమ. విణ. మిక్కిలి తడిగలది.
దుమా. క్రాయుట యందగు ధ్వన్యను
కరణము.
దుమారము. దుమ్ము.
దుమాలు. విణ. సమూలము.
దుము. రూ. దుమ్ము.
దుముకు ఉత్ప్లవనము, గంతు. అ. క్రి.
ఉఱుకు; గంతువేయు.
దుముకులాడు. అ. క్రి. గంతులువేయు.
దుముక్కు. ఉఱుకుట యందగు ధ్వన్యను
కరణము.
దుముదారి. ఉక్కడీఁడు.
దుముదారు దండు, సేన.
దుముదుములాడు. అ. క్రి. దుమ్ము లు
రేఁగు; నిప్పులు రేఁగు.

దుమ్ము. ధూళి, పరాగము; ఎముక.
దుమ్ముధూళి. విణ. నుగ్గు.
దుమ్మురేచు. స. క్రి. కోరాడు.
దుమ్ములగొండి. కొర్నవగండు, మృగ విశేషము.
దుయుముడి. రూ. దూయుముడి.
దుయ్యు. అ. క్రి. రూ. దూయు.
దురంగి హిం. రెండువన్నెలు గలిగినది.
దురంతము. సం. విణ. అంతము లేనిది.
దురతిక్రమము. సం. విణ. అతిక్రమింపఁ గూడనిది.
దురత్యయము. సం. విణ. చేటులేనిది.
దురద. కండూతి, జిల; కసరు.
దురద కంద మహాకందము†.
దురదగొండి } దూలగొండి,
దురదగోవెల } కండూర†.
దురదుర. ద్ర.క్రి. విణ. శీఘ్రముగా.
దురదృష్టము. సం. దౌర్భాగ్యము.
దురధిగమము. సం. విణ. కష్టముచేత పొందఁదగినది; కష్టముచేత చదువఁ దగినది; కష్టముచేత ఎఱుఁగఁ దగినది
దురధ్వము. సం. చెడ్డత్రోవ.
దురపిల్లు. అ. క్రి. దుఃఖించు, శోకించు; తపించు; కలఁగు.
దురపుటొరెపు దానరి తండ్రి బ్రహ్మ.
దురభిగ్రహము. సం. ఉత్తరేను†. విణ. గ్రహింపఁగూడనిది.
దురము యుద్ధము; వేగము.
దురవాపము. సం. విణ. పొందఁగూడనిది.
దురా. రూ. దురాయి. [అకృత్యముగా.
దురాకృతము. సం. అకృత్యము. క్రి. విణ.
దురాచారము. సం. చెడ్డ నడవడి. విణ. చెడ్డ నడవడి కలది. [కలవాఁడు.
దురాచారుఁడు. సం. విణ. చెడ్డ మనస్సు
దురాడము. ఒఱగుదిండు.
దురాత్ముఁడు. సం. విణ. చెడ్డ మనస్సు గలవాఁడు. [స్కరింపఁ దగనిది.
దురాధర్షము. సం. తెల్లావలు. విణ. తిర
దురాధర్షుఁడు. సం. విణ. తిరస్కరింపఁ దగనివాఁడు.
దురాపము. సం. విణ. పొందఁగూడనిది.
దురాయి. ఆజ్ఞ, ప్రతిఘటించు శక్తి.
దురారోహ. సం. ఖూరుగు†.
దురారోహము. సం. తొండ. విణ. ఎక్కఁ గూడనిది. [పనిది.
దురాలభ. సం. తీఁటకసింద†. విణ. లభిం
దురాలాపము. సం. చెడుమాట.
దురాలోకము. సం. విణ. చూడఁగూడనిది.
దురాశ. సం. వ్యర్థమైన ఆశ.
దురాసదము. సం. విణ. పొందఁగూడనిది.
దురితము. సం. పాపము.
దురుసు. కాఠిన్యము. విణ. కఠినము. క్రి. విణ. శీఘ్రము. [దీపకాంతి.?
దురోణము. సం. కలశము; యాగశాల;
దురోదరము. సం. జూదము; పందెము.
దురోదరుఁడు. సం. జూదరి.
దుర్గ సం. పార్వతీదేవి; నల్లపిచ్చుక; నీలి చెట్టు. [విణ. గబ్బుగలది.
దుర్గంధము. సం. గబ్బు, చెడువాసన.
దుర్గతి. సం. నరకము; బీదతనము.
దుర్గతుఁడు. సం. విణ. దరిద్రుఁడు.
దుర్గమము. సం. విణ. పోఁగూడనిది; పొంద శక్యముగానిది. [నిది.
దుర్గము సం. ఖిల్లా, కోట. విణ పోఁగూడ
దుర్గి. సం. దుర్గ.
దుర్గుణి. సం. విణ. దుష్టబుద్ధిగలవాఁడు.
దుర్ఘటము. సం. విణ. ఘటింపనిది.
దుర్జనత. సం. దుర్జనత్వము.
దుర్జనుఁడు. సం. విణ. దుష్టుఁడు, కుజనుఁడు. [వాఁడు.
దుర్జయుఁడు. సం. విణ. గెలువఁగూడని
దుర్జాతి. సం. విణ. దుర్జనుఁడు.
దుర్జ్ఞేయము. సం. విణ. ఎఱుఁగఁగూడనిది.
దుర్ణయము. సం. దుర్నీతి.
దుర్దాంతము. సం. విణ. అణఁపఁబడనిది.
దుర్దినము. సం. మేఘముచేత సూర్యుఁడగ పడని దినము.
దుర్దురూటుఁడు. సం. నాస్తికుఁడు.
దుర్ధరము. సం.విణ. ధరింపశక్యముగానిది.
దుర్ధర్ష. సం. నల్లయుప్పి†. [గానిది.
దుర్ధర్షము. సం. విణ. తిరస్కరింపశక్యము
దుర్నయము. సం. దుర్ణయము. [వ్యాధి
దుర్నామ. సం. ఏనుఁగు జలగ; మూల

దుర్నామము. సం. మూలవ్యాధి. [గానిది
దుర్నిరీక్ష్యము. సం. విణ. చూడశక్యము
దుర్నివారము. సం.విణ. నివారింపరానిది
దుర్బలుఁడు. సం. విణ.బలములేనివాఁడు
దుర్బిణి. హిం. దూర (సూక్ష్మ) వస్తు దర్శనయంత్రము.
దుర్భగుఁడు. సం. విణ. దురదృష్టవంతుఁడు. [గానిది.
దుర్భరము. సం. విణ. భరింపశక్యము
దుర్భాగ్యుఁడు. సం. విణ. దుర్భగుఁడు.
దుర్భిక్షము. సం. క్షామము, కఱవు.
దుర్మతి. సం. ఒక సంవత్సరము. విణ. దుర్బుద్ధి కలవాఁడు.
దుర్మరణము. సం. (విషభక్షణాదులచేత వచ్చెడు) చెడ్డచావు.
దుర్మాని. సం. విణ మర్యాదలేనివాఁడు.
దుర్ముఖి. సం. ఒక సంవత్సరము.
దుర్ముఖుఁడు. సం. ఒక రాక్షసుఁడు. విణ అసంబద్ధవచనములాడువాఁడు. [గానిది
దుర్లభము. సం. విణ. పొందశక్యము
దుర్లోకము. సం. విణ. చూడనలవిగానిది.
దుర్వర్ణము. సం. వెండి; నూఁగుదోసt. విణ. చెడ్డవర్ణముగలది.
దుర్వహము. సం. విణ. మోయరానిది.
దుర్విధుఁడు. సం. విణ దరిద్రుఁడు; దుర్జనుఁడు.
దుర్వినీతుఁడు. సం. విణ. వినయము లేనివాఁడు; అవినీతుఁడు. [గలవాఁడు.
దుర్వ్యసని. సం. విణ. చెడు వ్యసనములు
దుర్హృదుఁడు. సం. పగవాఁడు. విణ. చెడ్డమనస్సు కలవాఁడు.
దులదుల. సంభ్రమము.
దులాబి. హిం. దూబరదిండి.
దులి. సం. ఆఁడుతాఁబేలు; ఒక ముని.
దులుపు. స. క్రి. (ప్రక్కల నంటుకొని యుండు గింజలను) రాల్చు; విదిలించు.
దువ. రూ. దుగ.
దువారము. వాకిలి; రంధ్రము.
దువాళము } వేగముగ అంతమేరయు
దువాళి } సమముగా పాఱెడి యశ్వ
ధార. [చేయించు; ప్రసరింపఁజేయు.
దువాళము చేయు. స. క్రి. దువాళము
దువాళించు. అ. క్రి. ప్రసరించు; వేగము నొందు; ప్రకాశించు. ?
దువ్వ. తువర; దుమ్ము; ధూళి; పుప్పొడి; కణము.
దువ్వగాలింమేజాణ. వాయువు.
దువ్వటము. దుప్పటము.
దువ్వలువ. దుప్పటము; కట్టుకోక.
దువ్వల్వ. నిచోళము.
దువ్వి. పులి; చిఱుత పులి.
దువ్వు. పులి; చిఱుతపులి. స.క్రి. (దువ్వెనతో తల) చిక్కుదీయు; నిమురు.
దువ్వెన. దువ్వుట కుపయుక్తమైన సాధనము, కంకతిక.
దుశ్చ్యవనుఁడు. సం. ఇంద్రుఁడు. [గానిది
దుష్కరము. సం. విణ. చేయశక్యము
దుష్కృతము. సం. పాపము. విణ. దుష్టముగా చేయఁబడినది.
దుష్టము. సం. విణ చెడ్డది.
దుష్టు. అవ్య. దుష్టము.
దుష్టుఁడు. సం. విణ. చెడ్డవాఁడు.
దుష్టుపుతీఁగె. యుగ్మఫలికt.
దుష్పత్రము. సం. నల్లకచోరముt; బలురక్కసt. [మార్గము.
దుష్పథము. సం. అధర్మము; చెడు
దుష్పర్శ. సం. తీఁట కసిందt.
దుష్పర్శము. సం. విణ. స్పృశింపరానిది.
దుష్పధర్షిణి. సం. ములకt.
దుష్ప్రభ. సం. మైలచాయ తొండ.
దుష్ప్రాపము. సం. విణ. దురాపము.
దుష్పూరుషుఁడు. సం. దుష్టుఁడగు పురుషుఁడు. [కొను
దుసికిలు(ల్లు) అ. క్రి. జాఱు; తప్పించు
దుస్తరము. సం. విణ. దాఁటరానిది.
దుస్తు. వస్త్రము; అందము.
దుస్త్యజము. సం. విణ. విడువరానిది.
దుస్రా. హిం. విణ. ఇతరమైన.
దుస్సర. రూ. దూసరిt.
దుస్సేనుఁడు. దుశ్శాసనుఁడు. [గానిది.
దుస్సహము. సం. విణ. సహింపశక్యము
దుస్సాధము } సం. విణ. సాధింపరానిది
దుస్సాధ్యము }
దుస్సిర. దుస్సరt.

దుష్థ్సుఁడు. సం. కష్టములో నున్న వాఁడు; నిలుకడ లేనివాఁడు.
దుహిత. సం. కూఁతురు.
దుహిలీ. హస్తాభరణ విశేషము.
దుహ్యము. సం. విణ. పిదుకఁదగినది.

## దూ

దూఁకలి. బాధ
దూఁకు. అ. క్రి. దుముకు.
దూఁకుడు. విణ. ఎగుడుదిగుడు.
దూఁకొను. స. క్రి. ఆస్వాదించు; పొందు; లోపలికి చొచ్చు.
దూఁట. అరఁటి యూఁచ.
దూఁటు. స. క్రి. పొడుచు.
దూఁటుకొను. అ. క్రి. ఎగురు.
దూబఱదిండి. విణ. మిగులఁ బెట్టక యెంత యున్నను అంతయు వెచ్చించి తిను వాఁడు
దూఁబిడి. నూలు తోఁడునపుడు చీడు కలిగించుటకు నిలిపెడు పీఠమమర్చిన కొయ్య.
దూగర. తుంపర; ధాన్యాదిపరాగము.
దూగఱ. కఱుదూపము.
దూడ. పశుశిశువు, లేఁగ.
దూడపాల. శారిబ†. [రూ. దూతుఁడు.
దూత. సం. రాయబారి; కుంటెనకాఁడు.
దూతి-క. సం. కుంటెనకత్తె.
దూత్యము. దూతభావము దూతకర్మము.
దూది. తూలము, విత్తుతీసినప్రత్తి
దూదిదబ్బ. దళసరిగానుండెడు దబ్బ†.
దూదినిమ్మ. మాతులుంగకము†.
దూదేకులవాఁడు. తురుష్క విశేషము.
దూనము. సం. విణ. తపింపఁజేయఁబడినది,
దూప. దప్పి. [పించు.
దూపటిలు(ల్లు) అ. క్రి. దప్పిగొను; పరిత
దూపము. ధూపము. [త్తె.
దూపార్తి. దూపమువేసెడి పాదముపెట్టిన
దూపించు } అ. క్రి. దప్పిగొను; పరితపించు,
దూపిలు(ల్లు) }
దూపె. ఉపస్థ; అవలక్షణము.
దూబ. అధముఁడు; మందుఁడు; అప్రయోజకుఁడు; ఖాతవిశేషము.
దూబూచి బాలక్రీడా విశేషమునందగు అనుకరణము. బ. బాలక్రీడా విశేషము.
దూముడి. రూ. దూయుముడి.
దూయు. అ. క్రి. పాఱు; ప్రవేశించు; బాణము నాటి వెడలు. స. క్రి. పిడికిటితో ఆకులు మొదలగు వానినూడఁదీయు; తీయు
దూయుతీఁగ. దూసర†.
దూయుముడి. సులభముగా నూడఁదీయు నట్లు మెలవడిచి వేసిన ముడి.
దూరదర్శి. సం విద్వాంసుఁడు; గద్ద. విణ. దూరాలోచన కలవాఁడు.
దూరదృక్కు. సం. దూరదృష్టి కలవాఁడు.
దూరము. సం. విణ. దవ్వు.
దూర్చు. స. క్రి. దూఱఁజేయు.
దూర్వ. సం. గఱిక†.
దూఱు. నింద, ఉపాలంభము. స. క్రి. నిందించు. ప్రే. దూర్చు, ఖచించు.
దూఱుదుంకెన. బాలక్రీడా విశేషము.
దూఱువడు. అ. క్రి. నిందింపఁబడు.
దూల కండూతి, దురద.
దూలగొండి } దురదగొండి, ప్రావృషాయణి†.
దూలగోవెల }
దూలపోతు. ఎప్పుడును దురద గలవాఁడు
దూలము. ఇంటి కురుఁజుల కాదరువుగా నమర్చెడి మ్రాను.
దూషణము. సం. దోషము; దూషించుట
దూషణుఁడు. సం. ఒక రాక్షసుఁడు.
దూషించు. సం. స. క్రి నిందించు, దూఱు.
దూషిక. సం. కంటిపుసి; వాగర; సాలెపురుగు. [తోలు మోకు.
దూష్య. సం. ఏనుఁగునడుమునఁ గట్టెడు
దూష్యము సం. గుడారము, డేరా; వస్త్రము. విణ. దూషింపఁదగినది.
దూసర. సుదర్శనలత.
దూసరి. తృణవిశేషము; అపవాదు.
దూసరులు. బ. తృణధాన్య విశేషము.

## దృ

దృక్కు. సం. కన్ను; చూపు, దృష్టి; బుద్ధి. విణ. చూచువాఁడు.
దృగాయుధుఁడు. సం. శివుఁడు.

దృగ్ధము. సం. విణ. కూర్పఁబడినది.
దృఢదంశకము. సం. కారుమెుసలి.
దృఢము. సం. క్రి. విణ. అత్యంతము; అతిశయము; బిగి. విణ. అధికము; దిటవుగలది; కఠినము; బలిసినది. [నది.
దృతము. సం.విణ. ఆదరింపఁబడినది;-చీలి
దృతి. సం. తిత్తి.
దృన్భువు. సర్పవిశేషము.
దృప్తుఁడు. సం. విణ. దర్పముగలవాఁడు.
దృబ్ధము. సం. విణ. గ్రువ్వఁబడినది.
దృశ్. సం. దృక్కు, దృష్టి, చూపు.
దృశి సం. దృష్టి; ఆత్మ.
దృశ్యము. సం. విణ. చూడఁదగినది.
దృషత్తు. సం. జాయి; సన్నెకల్లు.
దృషత్పుత్రి. సం. కల్వపుగుండు.
దృష్టము. సం. రాజునకు తన బలము వలనను పగవారివలనను పుట్టినభయము. విణ. చూడఁబడ్డది.
దృష్టరజ. సం సమర్తాడిన పడుచు.
దృష్టాంతము. సం. ఉదాహరణము; ఒక అర్థాలంకారము; శాస్త్రము; చావు, ప్రత్యక్షము.? [రించు.
దృష్టాంతీకరించు. సం. స. క్రి. ఉదాహ
దృష్టి.సం. చూపు;కన్ను;బుద్ధి. బ.దృష్టు.
దృష్టించు. సం. స. క్రి. చూచు.

## దె

దెంచేనము. పెద్దపిరంగి.
దెందము హృదయము, మనస్సు.
దెత్తి. పిశాచము. [కృత్రిమ లక్ష్యము.
దెప్పము. బాణాదుల కెదుట నిల్పిన
దెప్పర. అశక్యము; అశుభము.
దెప్పరము. ఆపద; విణ. అశక్యము; దుస్సహము; అశుభము. బ. దుస్సహ వచనములు.
దెప్పరిలు(ల్లు) అ క్రి. ఆపదనొందు.
దెప్పతికము. దుస్సహత్వము.
దెప్పు. స. క్రి. (ఒకడు చేసిన కీడును మేలును) ఎదుటచెప్పు, ఎత్తిపొడుచు; ఉపాలంభించు.
దెప్పుడు. దెప్పుట, ఉపాలంభము.
దెబ్బ. కొట్టు, తాడనము.
దెబ్బసరులు. బ. ధాన్యవిశేషము.
దెబ్బాటు. బలిష్ఠమైనవాన.
దెస. దిక్కు, దిశ; అవస్థ; దురవస్థ; పార్శ్వము; కాపు; ఆశ్రయము.
దెసచెడు. అ.క్రి. దిక్కులేకపోవు.

## దే

దేంద్ర. జేంద్ర.
దేంద్రవాఁడు. తంతువాయ భేదము.
దేఁకు. స. క్రి. ముడ్డితోఁ రాచు; కూర్చుండి జరుగు.
దేకీచ. హిం. పెద్దవంటపాత్ర.
దేబె. విణ దేవురుగొట్టు; దీనుఁడు.
దేయము. సం. విణ. ఇయ్యఁదగినది.
దేరిజే—ము } ఒకవిధమైన గుడారము.
దేరీజా } రూ. దేరీజ.
దేవకము. సం. పాచిక.
దేవకాంచనము. సం. కోవిదారవృక్షము.
దేవకి. సం. శ్రీకృష్ణుని తల్లి.
దేవకినందనుఁడు. సం. శ్రీకృష్ణుఁడు.
దేవకుసుమము. సం. లవంగము.
దేవఖాతకము. సం. అఖాతము.
దేవచ్ఛందము సం. నూఱు పేటల ముత్యాలహారము.
దేవజగ్ధకము. సం. కామంచి గడ్డి.
దేవత. సం. దేవి; దేవుఁడు.
దేవతరువు. కల్పవృక్షము.
దేవతాడి. దేవతాళము†.
దేవతాళము. సం. డావరడంగి†.
దేవత్వము. సం. దేవతాస్వరూపము.
దేవదత్తము. సం. ఒక ఉపవాయువు; అర్జునుని శంఖము.
దేవదారి. దేవదారువు†.
దేవదారువు. సం. ఒకానొక వృక్షము.
దేవదాసి. వా. వేశ్య.
దేవదేవుఁడు. సం. శివుఁడు.
దేవద్ర్యఙ్కు. సం. విణ. దేవతలనుగూర్చి పోవువాఁడు; దేవపూజకుఁడు.
దేవనము. సం. క్రీడ; జూదము; గెలువ నిచ్ఛ; స్వప్నము; వ్యవహారము; పాచిక.

దేవనాళము. సం. అడవికిక్కిస కసవు†.
దేవభూయము. సం. దేవత్వము.
దేవమణి. సం. కౌస్తుభము; చింతామణి; ; గుఱ్ఱపుమెడ సుడి. శివుఁడు. [దేశము.
దేవమాతృకము. సం. వానలచేత పండెడి
దేవమాసము. సం. గర్భాష్టమమాసము.
దేవయజ్ఞము. సం. హోమము, వైశ్వదేవము.
దేవయానము. సం. దేవతావిమానము; అర్చిరాదిమార్గము.
దేవర. ప్రభువు; దేవత.
దేవరింపు. పరిదేవనము.
దేవరుఁడు. సం. మగనితోఁడబుట్టినవాఁడు
దేవలుఁడు. సం. తంబళవాఁడు; నంబివాఁడు; కూలికి దేవపూజ చేయువాఁడు రూ. దేవలకుఁడు.
దేవవర్ధకి. విశ్వకర్మ.
దేవవల్లభము. సం. పొన్న†.
దేవసరులు. బ. ధాన్యవిశేషము.
దేవసాయుజ్యము. సం. దేవత్వము.
దేవళము. దేవాలయము.
దేవళ్ళు. బ. దేవతలు.
దేవాంగులు. బ. జేంద్రవారు.
దేవాంబరముపొత్తి. మి. వస్త్రవిశేషము.
దేవాజీవి. } సం. దేవలుఁడు.
దేవాజీవుఁడు. }
దేవానాంప్రియము. సం. మేఁక.
దేవానాంప్రియుఁడు. సం. విణ. మూర్ఖుఁడు
దేవాలయము. సం. గుడి.
దేవి. సం. పార్వతీదేవి; రాజభార్య; చాఁగ†; పిక్కి†.
దేవిడీ. హిం. కోటవాకిలి; రాజనగరు.
దేవు. స. క్రి. నీళ్ళు మొదలగువానియందుండి తడవియెత్తు; వెదకు.
దేవుఁడు. సం. దేవత; మేఘుఁడు.
దేవురించు. అ. క్రి. దీనవృత్తినియాచించు.
దేవురింపు } దేవురించుట, దైన్యము.
దేవురు }
దేవురుగొట్టు. విణ. దేబె, దీనుఁడు.
దేవులాడు. స. క్రి. వెదకులాడు.
ధేవృఁడు. సం. మగనితోఁడబుట్టినవాఁడు

దేవె(వే)రి. దొరసాని; రాజపత్ని.
దేశము. సం. అనేకపట్టణములుంగల గొప్ప భూభాగము, అంగవంగకళింగాది; ప్రదేశము; చోటు; భాగము.
దేశరూపము, సం. న్యాయము, పాడి.
దేశాహీ. దేశాయి, పెద్ద.
దేశాహీమిరాశి. దేశాయీలమిరాశి.
దేశి, సం. సంగీతవిశేషము. [వాఁడు; పెద్ద.
దేశికుఁడు. సం. గురువు; దేశము తిరుగు
దేశీయము సం. విణ. దేశమునఁ బుట్టినది.
దేశ్యము. సం విణ. దేశమునకుఁ దగినది; దేశమునఁ బుట్టినది.
దేసము. ద్వేషము.
దేహము. సం. శరీరము. [చావు.
దేహయాత్ర. సం. తిండి, జీవనోపాయము;
దేహరము. నివాసము.
దేహళి. సం. (ఇంటి) కడప.
దేహాయ. సేల శిస్తు. [జీవుఁడు.
దేహి. సం. విణ. దేహముకలవాఁడు,

## దై

దైతేయుఁడు. సం. దితి సుతుఁడు.
దైత్యగురువు(ఁడు). సం. శుక్రుఁడు.
దైత్యారి. సం. విష్ణువు; వేలుపు.
దైత్యుఁడు సం. దితి సుతుఁడు, అసురుడు
దైన్యపడు. మి. అ. క్రి. దీనత్వమునొందు.
దైన్యపాటు మి. దైన్యపడుట.
దైన్యము సం. దారిద్ర్యాదులచేతగలుగు, దురవస్థ, దీనత్వము.
దైర్ఘ్యము. సం. నిడుపు.
దైవజ్ఞ. సం. సోదెకత్తె; బల్లి.
దైవజ్ఞుఁడు. సం జోస్యుఁడు, జ్యోతిష్కుఁడు
దైవతము. సం. దేవత. విణ. దేవతది.
దైవప్రశ్నము. సం. ఉపశ్రుతి.
దైవము. సం. దేవత; అదృష్టము; భాగ్యము; జ్యోతిష్టోమాదియజ్ఞముప్రారంభింపఁబడినప్పుడు యథావిధిగా తత్కార్యము నడపిన ఋత్విజుని నలంకరించి కన్యనిచ్చి చేయు వివాహము. విణ. దేవతలకు సంబంధించినది.

దైవాఱు. అ. క్రి. అతిశయించు; పొరలి పాఱు; ఒప్పు; ఉప్పతిల్లు.
దైవికము. సం. విణ. దైవమువలనఁగలిగినది; దేవతలకు సంబంధించినది.

## దొ

దొంకెన. రూ. డొంకెన.
దొంగ. చోరుఁడు; అరఁటిపువ్వులోని వస్తువిశేషము; తేగలోని యొక పదార్థము. విణ. వంచకము. [యన్నము.
దొంగకూడు. దొంగతనముగా తినెడి
దొంగతనము. చౌర్యము.
దొంగపని. దొంగతనము.
దొంగబీగము. మాఱుబీగము.
దొంగయిసుక. క్రింది నీళ్ళు తెలియకుండ మీఁద వ్యాపించియుండెడి యిసుక.
దొంగరేయి. అర్ధరాత్రము.
దొంగఱికము. దొంగపని.
దొంగలమిండగీఁడు. ఊడుపకుక్క.
దొంగసొమ్ము. దొంగిలినసొమ్ము.
దొంగిలించు } స. క్రి. ఒకరిసొత్తు నపహరించు.
దొంగిలు }
దొంగు. అ. క్రి. డాఁగు.
దొండ. బింబికాలత.
దొండి. రంధ్రము.
దొండు. మీనభేదము. [పరగా వచ్చునది.
దొంతర. పరంపర; దొంతి. విణ. పరం
దొంతరముద్దు. చుంబన విశేషము.
దొంతి. ఎత్తువరుస, ఒకటిమీఁదనొకటిగా నుంచిన కుండలు మొదలగువాని వరుస; వరుస. విణ. దొంతిగానుండునది.
దొందడి. సందడి, సమ్మర్దము. [ర్దమగు.
దొందడించు. అ. క్రి. సందడించు, సమ్మ
దొందము. ద్వంద్వరోగము, వాతపిత్తశ్లేష్మములలో నేరెంటి ప్రకోపము వలననైననుగలిగిన రోగము. [స్థూలము.
దొందు. జత. విణ. స్థూలకాయుఁడు;
దొంపు. మళ్ళవరుస, తలనట్టు.
దొంబులిగొట్టు. పిఱికి, భీరువు.
దొగ్గలి. రక్తబాష్పము†.
దొట్టి. తీఁగ.

దొడదొడ. కాఱుట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము.
దొడవ. విణ. కురూపి; నీచుఁడు.
దొడ్డ. విణ. గొప్ప, గొప్పది.
దొడ్డచిక్కణము. మిక్కిలి దట్టమైనది.
దొడ్డతనము. గొప్పతనము; మంచితనము; భాగ్యము.?
దొడ్డయెద్దు మహోక్షము.
దొడ్డవయసు. పెద్దవయసు.
దొడ్డవాఁడు. విణ. గొప్పవాఁడు.
దొడ్డి. పసులుమేయుకంచె; పసులకొట్టము; పెరడు; ఇంటివెనుక స్థలము.
దొడ్డికట్టు. నాలుగిండ్లు కలిపి కట్టిన బవంతి
దొడ్డికాళ్ళవాఁడు. విణ. పంగటికాళ్ళవాఁడు [ప్రజ్ఞుఁడు.
దొడ్డికాళ్ళు. బ. ఎడముగానుండుకాళ్ళు.
దొడ్డివల ఒక దినుసువల.
దొడ్డివాకిలి. పెరటి ద్వారము.
దొడ్డు. విణ. రూ. దొడ్డ.
దొడ్డువాఱు. అ. క్రి. అధికమగు.
దొత్త. విణ. క్రేలాడునది.
దొద్ద. కొల్ల, దోఁపిడి.
దొద్దకత్తె. విణ. దోఁపిడికత్తె.
దొద్దకాఁడు. విణ. దోఁపిడికాఁడు.
దొద్దకొను. స. క్రి. కొల్లగొట్టు.
దొద్దవోవు. అ. క్రి. కొల్లపోవు.
దొద్దు. విణ. బొజ్జపెట్టినవాఁడు.
దొన. కొండమీఁది నీటిపల్లము; అమ్ములపొది; ఇంద్రవాని కత్తులపొది; జలనిర్గమద్రోణము. [కూయు.
దొనదొనమను అ. క్రి. దొనదొనయని
దొనయుప్పు. చాటియుప్పు, రొమకము.
దొనరు. విణ. యోగ్యము.
దొనుకు. దుఃఖము; విచారము.
దొన్నియ. } ద్రోణి, త్రాగుటకుపయుక్తమైన దొప్ప.
దొన్నె. }
దొప్ప. ఆకులతో కుట్టిన దొన్నె.
దొప్పదోఁగు. అ. క్రి. మునుఁగు.
దొప్పదొప్ప కొట్టుకొనుట యందగు ధ్వన్యనుకరణము.
దొబ్బ. మాంసఖండము; ముద్ద; పిండము.
దొబ్బలగొట్టు. అధురుగుండియ.

దొబ్బు. నింద. స. క్రి. సంభోగించు; అపహరించు. స. క్రి. దూషించి బుద్ధిచెప్పు.
దొమ్మ. పశువులయొక్క ఱొమ్మడుపువ్యాధి; అవయవవిశేషము; మూర్ఛవంటి రోగము.
దొమ్మడోలు. అశ్వగంధ†.
దొమ్మర. గడకట్టియాడి జీవనము చేసెడి యొకానొకజాతి.
దొమ్మరి. దొమ్మరవాఁడు.
దొమ్మి. సంకులసమరము, అందఱుకలియఁబడి చేయు యుద్ధము; సందడి; అందఱు కలియఁబడుట. [చేయు; పెనఁగులాడు.
దొమ్ములాఁడు. అ. క్రి దొమ్మియుద్ధము
దొర. రాజు; ప్రభువు సేనానాయకుఁడు; యోధవరుఁడు; సామ్యము. విణ. గొప్పవాఁడు; సమానుఁడు.
దొరఁకుసన్యాసి. నమ్మించి మోసపుచ్చి దొంగిలించికొనిపోయెడు దొంగ.
దొరఁకొను. అ. క్రి. యత్నించు. స. క్రి. ఆరంభించు.
దొరకు. అ క్రి. లభించు. ప్రే. దొరకించు
దొరకువడు అ. క్రి. లభించు. [సిద్ధించు.
దొరకొను. అ. క్రి. లభించు; సంభవించు;
దొరకోలు. దొరకుట; యత్నించుట; ఆరంభించుట.
దొరకోలుసన్యాసి. దొరఁకుసన్యాసి.
దొరగడలు. గొప్పఅల.
దొరతనము. ప్రభుత్వము.
దొరయు. అంటు; సమానమగు; ఒప్పు; కలుగు; జరగు. స. క్రి. పోలు.
దొరలు. అ. క్రి. దొర్లు, పొర్లు; పడు; కలయు; మాఱుకొను. స. క్రి. అనుభవించు
దొరవి. కొలను.
దొరసాని. రాణి, రాజుభార్య.
దొరుగండి. నిండినప్పుడు నీళ్లు వెలుపలికిఁ బోవుటకై ఏర్పఱచినదొరువు తూము.
దొరువు. నడబావి; కొలను; చెలమ.
దొరువుపట్టెడ. గంతయెద్దుల తోఁక క్రిందఁ దగిలించెడు పట్టెడ.
దొర్లు. అ. క్రి. పొర్లు. రూ. దొరలు.
దొర్వు. దొరువు; చెలమ.
దొఱట } కోటరము.
దొఱ్ఱట }
దొఱయు. స. క్రి. పొందు.
దొలుఁపు. ప్రే. దొర్లఁజేయు.
దొసఁగు } పాపము; ఆపద; విఘ్నము;
దొసవు } దోషము.

## దో

దో. సం. బాహువు.
దోఁకిస. దోఁకుట.
దోఁకు. స. క్రి. నేలను ఎదురుగ చెక్కు.
దోఁకుడు. దోఁకుట.
దోఁకుడుఁబాఱ. దోఁకునట్టిపాఱ.
దోఁకుడుబార బాలక్రీడా విశేషము.
దోఁగాడు. అ. క్రి. బిడ్డ నేలఁ జేతులూఁది మోకాళ్ళతో నడచు, దోఁగియాడు.
దోఁగు. అ. క్రి. మేనితో లాలియు; దోఁగాడు
దోఁగురు. దొంగతనము.
దోఁచు. స. క్రి. దొంగిలించు; కొల్లగొట్టు ఆకర్షించు. [బాణము.
దోఁటమ్ము. దోఁటివంపైన ఆలుఁగుగల
దోఁటి. అందనిపండ్లు మొదలగువానిని కోయుటకు ఉపయుక్తముగా వంకర చిల్లదోఁపినకోల, అంకుశి.
దోఁటిముక్కర. దోఁటివంటి ముంగర.
దోఁటు. వా. స. క్రి. ఇచ్చు.
దోఁపరి. దొంగ; కొల్లకాఁడు.
దోఁపిడి. దోఁచుకొనుట; కొల్ల, పశ్యతోహరణము; చౌర్యము. [తోహరుఁడు.
దోఁపిడికాఁడు. దొంగ; కొల్లకాఁడు, పశ్య
దోపు. దోఁచుకొనుట; చూఱ, కొల్ల; పూర్ణాంకము. స. క్రి. చొప్పించు.
దోఁపుకాఁడు. దొంగ; దోఁపిడికాఁడు.
దోఁపుడు. దోఁపిడి.
దోఁపుడుకాఁడు. దోఁపిడికాఁడు.
దోగ్ధ. సం. గొల్లవాఁడు; దూడ; కవిత్వముచెప్పి జీవించెడుకవి. విణ. పాలుపిదుకువాఁడు.
దోగ్ధ్రి సం. పాలిచ్చెడి యావు.
దోణ(ణా)ము. భుజమునకు బలము వచ్చుటకై త్రిప్పెడు జెట్టివాని. యుపకరణ

విశేషము; [మ్రానుసుకరముగా చీలు టకై యక్కడక్కడ చెక్కిన మేకులను దిగఁగొట్టెడి యుపకరణవిశేషము.
దోతి. హిం. దోవతి.
దోదసి. ద్వాదశి.
దోదుమి (ము). రెండంచుల కత్తి.
దోదుముదారి. ఆయుధవిశేషము.
దోదుమ్మి (మ్ము) రెండంచులకత్తి.
దోనము. ద్రోణము.
దోనమ్ము. అల్పశరము. [విణ. అల్పము.
దోని. దోస; దోనె; కాలువతూము.
దోనియ. దోనె.
దోనె. జలగడుగువాని సాధనము; చిన్న రొంద, ద్రోణి; ఒంటికొయ్యపడవ; సాలెవాఁడుచాఁపు చుట్టెడుమ్రాను.
దోమ. మశకము.
దోమటి. అన్నము.
దోమతెర దోమలు చొరకుండ మంచము చుట్టువేయుపలగుడ్డ, చతుష్కి.
దోము. ఆహారము దేహమునపట్టక పశువులు పాలుకొనుట; కసువుపాఁపు ?
దోయి. ద్వయి, జత; కలయిక; సాటి. విణ. తోడు.
దోయికట్టు. అ. క్రి. జతకూడు.
దోయిడి. విణ. శూన్యము.
దోయిలి. దోసిలి.
దోయిలించు. స. క్రి. చేతులనుజోడించు; దోసిలిపట్టు.
దోర. రాశి; దొంతర. విణ. పండఁబాఱినది; ఒఱిగినది.
దోరగలు(ల్లు). ఒడ్డగెడవు.
దోరగలు(ల్లు)పడు. అ. క్రి. ఒడ్డగెడవగు.
దోరగాయ, పండఁబాఱిన కాయ.
దోరగించు. ప్రే. దోరగిల్లఁజేయు.
దోరగిలు(ల్లు). అ, క్రి. ఎఱ్ఱబాఱు; ఒఱగు
దోరణ. తోరణము. [శమ్మి.
దోరణపుఁగమ్మి. ద్వారముమీఁది యడ్డ
దోరణపుఁబట్టె. కపిలెబిల్లక్రింది యడ్డపట్టె.
దోరణపుసాటిరిక్క. అనురాధానక్షత్రము
దోరణము. తోరణము.
దోరపాక. ఓరపాక.
దోరము. ద్వారము.
దోరు. అ. క్రి. మరణించు; ఒఱగు.
దోరుచు. ప్రే. చావఁజేయు; వ్రాల్చు.
దోరువా. పక్షివిశేషము.
దోరెము. డేగలకుఁగట్టెడు త్రాడు.
దోర్చు. రూ. దోరుచు. [ము; మోచేయి.
దోర్మధ్యము. సం. బాహువుల మధ్యభాగ
దోల. సం. రూ. డోల.
దోవతి. పురుషుఁడు కట్టుకునెడి పంచె.
దోష. సం. భుజము; రాత్రి.
దోషకము. సం. దోసె, అట్టు.
దోషకారి. సం. విణ. దోషముచేయువాఁడు
దోషగ్రాహము. సం. ఇందుపుఁజెట్టు.
దోషజ్ఞుఁడు. సం. పండితుఁడు; వైద్యుఁడు. విణ. దోషమునెఱిఁగినవాఁడు.
దోషము. సం. తప్పు; పాపము. (కావ్యదోషములు—పదదోషములు, వాక్యదోషములు, అర్థదోషములు. అందు పదదోషములు — అప్రయుక్తము, అపుష్టార్థము, అసమర్థము, నిరర్థకము, నేయార్థము, చ్యుతసంస్కారము, సందిగ్ధము, అప్రయోజకము, క్లిష్టము, గూఢార్థకము, గ్రామ్యము, అన్యార్థము, అప్రతీతికము, అవిమృష్టవిధేయాంశము, విరుద్ధమతికరము, అశ్లీలము, పరుషము. వాక్యదోషములు — శబ్దహీనము, క్రమభ్రష్టము, విసంధి, పునరుక్తియుతము, వ్యాకీర్ణము, వాక్యసంకీర్ణము, అపూర్ణము, వాక్యగర్భితము, భిన్నలింగము, భిన్నవచనము, న్యూనోపమము, అధికోపమము, భగ్నచ్ఛందము, యతిభ్రష్టము, అశరీరము, అరీతికము, విసర్గలుప్తము, అస్థానసమాసము, వాచ్యవర్జితము, సమాప్తపునరాత్తము, సంబంధవర్జితము, పతత్ప్రకర్షణము, అధికపదము, ప్రక్రమభంగము. అర్థదోషములు — అపార్థము, వ్యర్థము, ఏకార్థము, ససంశయము, అపక్రమము, భిన్నము, అతిమాత్రము, పరుషము, విరసము, హీనోపమము, అధికోపమము, అసమోపమము, అప్రసిద్ధోపమము, హేతుశూన్యము, నిరలంకృతి, అశ్లీలము, విరుద్ధము, సహచరచ్యుతము.)

దోషాకరుఁడు. సం. చంద్రుఁడు. [రుఁడు.
దోషాచరుఁడు. సం. చంద్రుఁడు; నిశాచ
దోషాటుఁడు. సం. రాత్రించరుఁడు, రాక్ష
సుఁడు. [త్ముఁడు.
దోషి. సం. విణ. తప్పుగలవాఁడు; పాపా
దోషించు. సం. అ. క్రి. దోషముపుట్టు.
దోస. కర్కటి†.
దోసకాయ. ఉర్వారుకము.
దోసకారి. విణ. దుష్టుఁడు; దుష్టురాలు; కుచ్చితుఁడు; కుచ్చితురాలు.
దోసము. దోషము, పాపము; తప్పు.
దోసి. విణ. దోషి.
దోసియ. దోసె. [చేరిక.
దోసిలి. అంజలి, వంపఁబడిన రెండుచేరల
దోసిలించు. అంజలి ఘటించు.
దోసె అట్టు, దోషకము.
దోసెఁడు. ప్రసృతి ద్వయము, రెండు చేరల ప్రమాణము.
దోహదము. సం. కోరిక; వేవిళ్ళు, గర్భ చిహ్నము; ఎరువు; అకాలమున తరు గుల్మ లతాదులకు ఫలపుష్పాదులను పుట్టించెడు స్త్రీల పాదతాడనాదిక్రియ ఎరువు చేయుట. [గర్భము
దోహదలక్షణము. సం. స్త్రీలవయస్సంధి;
దోహదవతి. సం. వేవిళ్లుగల స్త్రీ.
దోహనము. సం. పాలుపితుకుట.
దోహరి. మాలవాఁడు.
దోహలము. సం. ఉత్సాహము.

## దౌ

దౌ. దూరము. క్రి. విణ. దూరముగా.
దౌడ. తాలువు, బుగ్గలోపలిభాగము.
దౌడు. జోడన; దండయాత్ర; పరుగు.
దౌత్యము. సం. దూతభావము; దూత కర్మము.
దౌరాత్మ్యము. సం. చెడ్డతనము.
దౌరు. కాంతి.
దౌర్జన్యము. సం. చెడ్డతనము.
దౌర్భాగ్యము. సం. దురదృష్టము.
దౌలతు(త్తు). భాగ్యము; అధికారము.
దౌవారికుఁడు. సం. ద్వారపాలకుఁడు.
దౌవు. దూరము.
దౌష్ట్యము. సం. చెడ్డతనము; అల్లరి.
దౌహిత్రుఁడు. సం. మనుమఁడు, కూఁతురి కొడుకు.
దౌహృదము. సం. దోహదము, వేవిళ్లు.

## ద్యా

ద్యావాపృథువులు సం. మిన్నుమన్ను.

## ద్యు

ద్యుతి. సం. కాంతి; వెలుగు.
ద్యుమణి. సం. సూర్యుఁడు. [క్రమము
ద్యుమ్నము. సం. ధనము; బలము; పరా
ద్యునదుఁడు. సం. దేవత.

## ద్యూ

ద్యూతము. సం. జూదము.

## ద్యో

ద్యోతకము. సం. విణ. ప్రకాశింపఁజేయునది; స్ఫురింపఁజేయునది.
ద్యోతనము. సం. ప్రకాశించుట; ప్రకాశింపఁజేయుట; స్ఫురింపఁజేయుట.
ద్యోతమానము. సం. విణ ప్రకాశించుచున్నది; స్ఫురించుచున్నది.
ద్యోతము. సం. ఎండ; తేజస్సు.
ద్యోతించు. సం. అ. క్రి. ప్రకాశించు; స్ఫురించు.
ద్యోతితము. సం. విణ. ప్రకాశించినది; స్ఫురించినది.

## ద్ర

ద్రఢిష్ఠుఁడు. సం. మిక్కిలి దృఢమయినవాఁడు.
ద్రప్సము. సం. పలుచని పెరుఁగు; తుంపురు?
ద్రబ్బెడ. భక్ష్యవిశేషము.
ద్రవంతి. సం. ఎలుకజీడి†

ద్రవము. సం. తడి; రసము; పరిహాసము; పరుగు; యుద్ధమువలనఁ బాఱుట.
ద్రవించు. సం. అ. క్రి. కాఱు.
ద్రవిడము. సం. అరవదేశము, 56 దేశములలో నొకటి. [మము; సామర్థ్యము.
ద్రవిణము. సం. ధనము; బంగారు; పరాక్ర
ద్రవ్యము. సం. ఇత్తడి; పూఁత; మందు; మద్యము; లక్క; ధనము; గుణవత్తు; పృథివ్యాది. (ఇవి తొమ్మిది—పృథివి, అప్పు, తేజము, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు.) విణ భవ్యము; ద్రవికారము.
ద్రష్ట. సం. చిదాభాసయుక్తమైన అహంకారము, చూచువాఁడు; సాక్షి, ప్రకాశింపఁజేయువాఁడు.

## ద్రా

ద్రాక. ద్రాక్ష†.
ద్రాక్ష. సం. ఒకలత.
ద్రాఘిష్ఠము. సం. విణ. మిక్కిలి దీర్ఘము.
ద్రాబ. విణ. అసారము; అసారుఁడు; అసారోక్తి; అధమము; అధముఁడు.
ద్రావకము. సం. రసగంధక పాషాణాదులయందు తీసెడు రసవిశేషము; బరువైన ఱాయి.
ద్రావకుఁడు. సం. విణ. నేర్పరి; మోసకాఁడు
ద్రావిడము. సం. ద్రవిడభాష; కచోరము†.
ద్రావిడుఁడు. సం. విణ. ద్రవిడదేశమునందు బుట్టినవాఁడు.

## ద్రి

ద్రిండు. దిండు. [వాఁడు.?
ద్రిమ్మరి. సంచరించునది;? సంచరించు
ద్రిమ్మరీఁడు. సంచరించువాఁడు.?
ద్రిమ్మరించు. స. క్రి. భ్రమ్మరించు.

## ద్రు

ద్రుంగు. అ. క్రి. తక్కువగు.? [గొడ్డలి.
ద్రుఘణము. సం. ఇనుపగుదియ; గండ
ద్రుఘణుఁడు సం. బ్రహ్మ.
ద్రుడ్డు. రూ. దుడ్డు. [తుమ్మెద; తేలు.
ద్రుణము. సం. కత్తి; విల్లు; ఒక దినుసు
ద్రుణి. సం. ఆఁడుతాఁబేలు.
ద్రుతము. సం. వేగము; ద్రుతలయకాలము; నకారము. క్రి. విణ. త్వరితము. విణ. వడిగలది; కరఁగినది; చీలినది.
ద్రుపదము సం. బొండకొయ్య.
ద్రుమము. సం. చెట్టు; పారిజాతము†.
ద్రుమామయము. సం. లక్క.
ద్రుముఁడు. సం. ఒక కింపురుష ప్రభువు.
ద్రుమోత్పలము. సం. కొండగోఁగు†.
ద్రువయము. సం. త్రాసు మూరతూము మొ॥ మానము.
ద్రువు. సం. వృక్షము.
ద్రుహిణుఁడు. సం. బ్రహ్మదేవుఁడు.

## ద్రూ

ద్రూణము. సం. తేలు.

## ద్రె

ద్రెక్కొను, స. క్రి. ఎదిరించు.?
ద్రెయ్యు. అ. క్రి. తెగు.?

## ద్రొ

ద్రొబ్బు. స. క్రి. పడఁద్రోయు.

## ద్రో

ద్రోణకాకము. సం. బొంతకాకి.
ద్రోణదుఘ. సం. తూమెఁడుపాలిచ్చెడిఆవు.
ద్రోణము. రూ. దోణము. సం. తూము; నల్లుము; ఒకకొండ; తుమ్మి†; బొంతకాకి; జలాశయవిశేషము; తేలు.
ద్రోణాము. రూ. దోణాము.
ద్రోణి. సం. దోనె; పసులుమేయు కంచె; రెండుకొండలనడిమి; దొన్నె; జలగడుగువాని సాధనము; దేశవిశేషము; నీలి.†
ద్రోణుఁడు. సం. ద్రోణాచార్యుఁడు.

ద్రోవది. ద్రౌపది.
ద్రోహము. సం. చంపనిచ్ఛ; కీడుతలఁపు.
ద్రోహి. సం. విణ. ద్రోహముచేయువాఁడు

## ద్రౌ

ద్రౌణికము. సం. విణ. నల్తుము విత్తులు విత్తఁదగినది (పొలము).
ద్రౌపది. సం. పాండవుల భార్య.

## ద్వ

ద్వంద్వము. సం. స్త్రీ పురుషుల జత; ఇద్దఱొకరితోనొకరు చేయు యుద్ధము; రహస్యము; శీతోష్ణాది; సుఖదుఃఖాది; రెండు.
ద్వయము. సం. జత; రెండు.
ద్వయాతిగుఁడు. సం. రజస్తమోగుణ రహితుఁడు; ద్వైతరహితుఁడు.
ద్వయి. సం. రెండు.

## ద్వా

ద్వాదశకము. సం. స. పండ్రెండు.
ద్వాదశము. సం. విణ. పండ్రెండవది.
ద్వాదశాంగుళము. సం. జేన.
ద్వాదశాత్ముఁడు సం. సూర్యుఁడు.
ద్వాదశి. సం. పక్షమునందు పండ్రెండవ తిథి.
ద్వాపరము. సం. ద్వాపరయుగము; సంశయము.
ద్వారపాలకుఁడు, ద్వారపాలుఁడు } సం. వాకిటి కావలివాఁడు.
ద్వారబంధము. సం. వాకిట నిరుప్రక్కలను క్రిందుమీఁదుల నమర్చిన ప్రాని చట్టము.
ద్వారము స. వాకిలి; ఉపాయము.
ద్వారయంత్రము. తలుపుతాళము.
ద్వార(రా)వతి. ద్వారకానగరము.
ద్వాస్థి(స్థి)తుఁడు., ద్వాస్థ(స్థ)ుఁడు. } సం. ద్వారపాలకుఁడు.

## ద్వి

ద్వికము. సం. కాకి; జక్కవ. స. రెండు ద్రవ్యము.
ద్విగుణాకృతము. సం విణ. రెండుచాళ్లు దున్నినది (పొలము).
ద్విజ. సం బారంగి†; రేణుకయను గంధ
ద్విజన్మము. సం పక్షి; పల్లు.
ద్విజన్ముఁడు. సం. బ్రాహ్మణుఁడు; క్షత్రియుఁడు; వైశ్యుఁడు.
ద్విజము. సం. పక్షి; పల్లు; పాము.
ద్విజరాజు. సం. చంద్రుఁడు; గరుత్మంతుఁడు; శేషుఁడు.
ద్విజాతి. సం. ద్విజము; ద్విజుఁడు.
ద్విజిహ్వము. సం. సర్పము.
ద్విజిహ్వుఁడు. సం. విణ కొండెగాఁడు.
ద్విజుఁడు. సం. బ్రాహ్మణుఁడు; క్షత్రియుఁడు; వైశ్యుఁడు.
ద్వితయము. సం. జత, రెండువస్తువులు.
ద్వితీయ. సం. భార్య; విదియ; ద్వితీయా విభక్తి.
ద్వితీయము. సం. విణ. రెండవది.
ద్వితీయాకృతము. సం. విణ. రెండు చాళ్లు దున్నినది (పొలము).
ద్వితీయుఁడు. సం. కొడుకు. విణ. రెండవ వాఁడు.
ద్విధాగతి. సం. ఎండ్రకాయ; మొసలి.
ద్విపటి. సం. దుప్పటము; కప్పుడుదుప్పటి.
ద్విపద. సం. ఒకబుక్క.
ద్విపది. సం. ఒకఛందస్సు.
ద్విపము. సం. ఏనుఁగు.
ద్విపాద్యము. సం. తగిన దండుగకంటె యినుమడియగు దండుగ.
ద్విభాషి. సం. రెండుభాషలు తెలిసిన వాఁడు.
ద్విరదము. సం. ఏనుఁగు.
ద్విరసనము. సం. పాము.
ద్విరేఫము సం. తుమ్మెద.
ద్వివర్ష. సం. ద్విహాయని.
ద్విషత్తు. సం. శత్రువు.
ద్విషుఁడు. సం. శత్రువు.
ద్విసంధాగ్రాహి. సం. విణ. రెండుమాఱులు స్మరింపఁగానే ధారణచేయఁగలవాఁడు.

ద్విసీత్యము } సం. విశే. రెండుచాళ్లు
ద్విహల్యము } దున్నినది (పొలము).
ద్విహాయని. సం. రెండేండ్ల ప్రాయముగల పెయ్య.

## ద్వీ

ద్వీపము. సం. పులితోలు; పులి; నీళ్ళ నడుమనున్న దీవి. (సప్తద్వీపములు— జంబువు, ప్లక్షము, కుశము, క్రౌంచము, శాకము, శాల్మలి, పుష్కరము.)
ద్వీపవతి. సం. నది. [ద్రము.
ద్వీపి. సం. పెద్దపులి; చిఱుతపులి; సము

## ద్వే

ద్వేషణుఁడు. సం. శత్రువు.
ద్వేషము. సం. పగ, శత్రుత్వము.
ద్వేషి. సం. ద్వేషముగలవాఁడు.
ద్వేషించు. సం. స. క్రి విరోధించు; ఏవగించు
ద్వేష్ట. సం. విశే. ద్వేషించువాఁడు; పగగలవాఁడు. [గొంటగినవాఁడు.
ద్వేష్యుఁడు. సం. పగవాఁడు. విశే. పగ

## ద్వై

ద్వైతము. సం. జీవాత్మ పరమాత్మలకు భేదముచెప్పెడి యొకమతము; ఒకానొక వనము.
ద్వైతీయీకము. సం. విశే. రెండవది.
ద్వైధము. సం. షడ్గుణములలో నొకటి.
ద్వైపము. సం. విశే. పులితోలుచేత కప్పఁబడినది (రథము); ద్వీపసంబంధమైనది; ద్వీపిసంబంధమైనది.
ద్వైపాయనుఁడు. సం. వేదవ్యాసుఁడు.
ద్వైమాతురుఁడు. సం. వినాయకుఁడు.

## ద్వ్య

ద్వ్యష్టము. సం. రాగి.

---

## ధ

ధగిడీ హిం. నీచస్త్రీ.
ధట—ము సం. తక్కెడ.
ధటి. సం. దట్టీ; గోఁచి.
ధటిని. సం. నూలిమొలత్రాడు.
ధట్ట. సం. సేన; సమూహము.
ధట్టము. సం. సమూహము.
ధత్తూరము. సం. ఉమ్మెత్త.
ధనంజయము. సం. ఒక ఉపవాయువు; సర్పవిశేషము; మద్దిచెట్టు.
ధనంజయుఁడు. సం. అర్జునుఁడు; అగ్ని.
ధనదుఁడు. సం. కుబేరుఁడు విశే. ధనదాత.
ధనము. సం. విత్తము; ఆవుల మంద.
ధనవంతుఁడు. సం. ధనముగలవాఁడు.
ధనహారి. సం. బలురక్కెస; చోరనామక గంధద్రవ్యము.
ధనాధిపుఁడు. సం. కుబేరుఁడు.
ధని. సం. విశే. ధనముగలవాఁడు. [స్త్రీ.
ధనిక. సం. సాధ్వి; యౌవనముగల స్త్రీ;
ధనికము. సం. దనియాలు.
ధనికుఁడు. సం. విశే. ధనముగలవాఁడు; వర్తకుఁడు; అప్పులవాఁడు.
ధనిష్ఠ. సం. ధనిష్ఠానక్షత్రము.
ధనుఃపటము సం. మోరటిచెట్టు.
ధనుర్ధరుఁడు. సం. విశే. విలుకాఁడు.
ధనువు. సం. విల్లు; ధనూరాశి; నాలుగుమూరల కొలఁది; మోరటిచెట్టు. విశే. విలుకాఁడు.
ధనుశ్శ్రేణి. సం. చాఁగచెట్టు.
ధనుష్మంతుఁడు. సం. విలుకాఁడు.
ధనుస్సు. సం. విల్లు; ధనూరాశి.
ధన్వాసరి. తెన్నాసరి దేశమునకు సంబంధించినది.
ధన్య. సం. ఉసిరికచెట్టు; దాది; ధన్యాకాలు.
ధన్యుఁడు. సం. విశే. పుణ్యవంతుఁడు; కృతార్థుఁడు.
ధన్వంతరము. సం. వింటిపట్టు.

ధన్వంతరి. సం. దేవవైద్యుఁడు; సూర్యుఁడు; మహేశ్వరుఁడు.
ధన్వము. సం. మెట్టనేల; విల్లు; నిర్జలభూమి
ధన్వయనము. సం. తీఁటకసింద†.
ధన్వి. సం. ఏఱుమద్ది†; అర్జునుఁడు. విణ. విలుకాఁడు; నేర్పరి.
ధమనము. సం. కిక్కిసకసవు†.
ధమని. సం. నరము; నఖమనెడు గంధద్రవ్యము; మెడ; గొట్టము; అగసాలెవాని గొట్టము; గువ్వగుత్తిక†.
ధమనుఁడు. సం. అగ్ని. విణ. కొలిమితిత్తి నూఁదువాఁడు; క్రూరుఁడు.
ధమ్మిల్లము. సం. కీలుగంటు, కొప్పు; ముత్తెములు పూలు మొదలగునవి ముడిచిన కొప్పు.
ధర. వెల. సం. భూమి; మావి; మెదడు.
ధరణము. సం. ధరించుట; ఉన్మాన విశేషము.
ధరణి. సం. భూమి.
ధరణీధరము. సం. కొండ.
ధరణీధరుఁడు సం. విష్ణువు; శేషుఁడు; రాజు.
ధరణీశ్వరుఁడు. సం. రాజు; శివుఁడు.
ధరము. సం. కొండ; ఆదికూర్మము; దూది.
ధరాధరము. కొండ; ఆదివరాహము; ఆదిశేషుఁడు.
ధరామరుఁడు. సం. బ్రాహ్మణుఁడు.
ధరావత్తు. హిం. నిలువయుంచుసొమ్ము.
ధరించు. సం. స. క్రి. తాల్చు; మోయు. రూ. ధరియించు.
ధరిత్రి. సం. భూమి.
ధర్త. సం. విణ. ధరించువాఁడు.
ధర్తవ్యము. సం. విణ. ధరింపఁదగినది.
ధర్తూరము. సం. ఉమ్మెత్త†.
ధర్మకవిలె. మి. ధర్మము గొనుటకు కవిలె కెక్కినవాఁడు; దానపాత్రుఁడు.
ధర్మకాహళ. సం. యుద్ధవిరామ సూచకముగా ఊఁదెడి బాకా.
ధర్మజ్ఞుఁడు సం. విణ. ధర్మమెఱిఁగినవాఁడు.
ధర్మదార. మి. ధర్మకాహళ.
ధర్మధ్వజి. సం. తాఁటదమ్ముఁడు.
ధర్మపుత్రుఁడు. సం. ధర్మరాజు.
ధర్మపత్తనము. మిరియము.

ధర్మము. సం. పుణ్యము; న్యాయము; సామ్యము; స్వభావము; ఆచారము; ఉపనిషత్తు; యజ్ఞము; విల్లు; ఆత్మ; సత్సహవాసము; ఏకదేశవృత్తి; ధారణపోషణములు చేయునది; అభ్యుదయనిశ్శ్రేయస హేతువగు వేదోక్తకర్మ విశేషము; సత్యము శౌచము దయ దానము అనునవి నాలుగు పాదములుగా గలది; బ్రహ్మచర్యము అహింస దానము మొదలగునవి
ధర్మరాజు. సం. యుధిష్ఠిరుఁడు; యముఁడు; బుద్ధదేవుఁడు.
ధర్మసంహిత. సం. స్మృతి, మన్వాదిధర్మశాస్త్రము.
ధర్మాత్ముఁడు. సం. విణ. పుణ్యాత్ముఁడు.
ధర్మాధికరణము సం. న్యాయవిచారణ స్థలము.
ధర్మాధికృతుఁడు. సం. న్యాయము విచారించువాఁడు.
ధర్మాసనము. సం. విణ. ధర్మాధికారి కూర్చుండు పీఠము.
ధర్మి. సం. విణ. ధర్మముగలది.
ధర్ముఁడు. సం. యముఁడు; సోమయాజి; ఒకవసువు; బుద్ధుఁడు; ధర్మదేవత.
ధర్మువు. ధర్మము.
ధర్మ్యము. సం. విణ. ధర్మమువలన తొలఁగనిది.
ధర్షణము. సం. తిరస్కరించుట.
ధర్షణి. సం. జారస్త్రీ.
ధర్షించు. సం. స. క్రి. తిరస్కరించు.
ధర్షుఁడు. సం. అంతఃపురపాలుఁడైన ఖొజ్జావాఁడు.
ధవము. సం. ఒక ఫలవృక్షము.
ధవళ. సం. ఆవు.
ధవళచామర. సం. విణ. వింజామర.
ధవళము. సం. తెలుపు; ఆఁబోతు. విణ. తెల్లనిది; చక్కనిది.
ధవళములు. గ్రా. ఒకదినుసు పాట.
ధవళాంగి. సం. సరస్వతీదేవి.
ధవళిమము. సం. తెలుపు.
ధవిత్రము. సం. యాగమునందు అగ్నిని ప్రజ్వలింపఁజేయుటకు కృష్ణాజినముతో చేయఁబడిన విసనకఱ్ఱ
ధవుఁడు. సం. మగఁడు; మనుష్యుఁడు; అధిపతి; మోసకాఁడు.

# ధా

ధాటి. సం. దాడి, దండయాత్ర; ముట్టడి వేయుట.
ధాత. సం. బ్రహ్మదేవుఁడు; ఒక ఆదిత్యుఁడు; ఒక సంవత్సరము. విణ. ధరించువాఁడు; రక్షించువాఁడు.
ధాతకి. సం. ఆరె†.
ధాతుపుష్పిక. సం. ఆరె†.
ధాతువు. సం. వాతాది (త్రిధాతువులు — వాతము, పిత్తము, శ్లేష్మము); రసాది (సప్తధాతువులు—రసము, అసృక్కు, మాంసము, మేదస్సు అస్థి, మజ్జ, శుక్లము); మణిసిల మొదలగు శిలావికారము; గైరిక ధాతువు; పృథివి మొ॥; శబ్దము మొ॥; త్వక్కు మొ॥; భూ ధాతువు మొ.
ధాత్రి. సం. భూమి; దాది; తల్లి; ఉసిరిక†.
ధాత్రేయి. సం. దూతికావిశేషము; భూమి
ధాన. సం. దనియాలు; మొగ్గ. బ. బొంగులు.
ధానుష్కుఁడు. సం. విలుకాఁడు.
ధాన్యము. సం. దనియాలు; కొలంచు, వడ్లు మొ. (నవధాన్యములు—వడ్లు, గోదుమలు, యవలు, పెసలు, సెనగలు, కందులు, బొబ్బరలు, నువ్వులు, మినుములు, ఉలవలు.)
ధాన్యసారము, మినుములు.
ధాన్యాకము. సం. దనియాలు.
ధాన్యామ్లము. సం. పులియఁ బెట్టిన కడుగు నీరు.
ధామనిధి. సం సూర్యుఁడు
ధామము. సం. గృహము; చోటు; కిరణము; కాంతి; తేజస్సు; ప్రభావము; పుట్టువు; శరీరము.
ధామార్గవము. సం. ఆవడ†; ఉత్తరేను†.
ధాయ్య. సం. యాగమునందు అగ్నిని ప్రజ్వలింపఁ జేయునపుడు పఠించెడు ఋక్కు.
ధార. సం. పైనుండి పడు నీరు మొదలగు వాని చాలు; కత్తి మొదలగు వాని వాదర; కుండ మొదలగువాని చిల్లి; దంతు ముందటిభాగము; ప్రవాహము; పరంపర; ధారానగరము; వర్షధార; అశ్వధార(గతి) (అశ్వగతి విశేషములు- ఆస్కందితము, ధౌరితకము, రేచితము, వల్గితము, ప్లుతము).
ధారణ. క్రయము, ధర. సం. భగవంతుని దప్ప మఱియొకటి నెఱుఁగమి; మేర; జ్ఞప్తి యందుంచుకొనుట.
ధారణము. సం. ధరించుట. [చేయు.
ధారనిలుపు మి. స. క్రి. ప్రస్తుతించునట్లు
ధారపోయు. మి. స. క్రి. చేత నీళ్ళు పోసి కొని దత్తముచేయు.
ధారము. సం. అప్పు; పర్వతవిశేషము.
ధారాకదంబము. సం. నీరుకడిమి†.
ధారాటము. సం. గుఱ్ఱము; వానకోయిల.
ధారాధరము. సం. మేఘము; ఖడ్గము.
ధారాసంపాతము. సం. ఎడతెగని వాన.
ధారాళము. సం. విణ. ధారగలది; అడ్డపాటు లేనిది.
ధారిక. సం. చెవి చొరు పాము; జెఱ్ఱి.
ధారుణి. సం. భూమి. [గల హంస.
ధార్తరాష్ట్రము. సం. నల్లనిముక్కు కాళ్లు
ధార్తరాష్ట్రుఁడు. సం. ధృతరాష్ట్రుని కొడుకు; సర్పవిశేషము.
ధార్మపత్తనము. సం. తకోలము†.
ధార్మికుఁడు. సం. విణ. ధర్మాత్ముఁడు; విలుకాఁడు.
ధార్య. సం. ధాయ్య; కోరింద†.
ధార్యము. సం. విణ. ధరింపఁదగినది.
ధార్ష్ట్యము. సం. దిట్టతనము.
ధావనము. సం. పరుగు; ఉదుకుట; కడుగుట; తోముట.
ధావని. సం. పక్కతోఁకపొన్న†.
ధావళ్యము. సం. తెలుపు.

# ధి

ధిక్కారము. సం. తిరస్కారము.
ధిక్కృతుఁడు. సం. విణ. తిరస్కరింపఁబడిన వాఁడు.
ధిక్క్రియ. సం. ధిక్కారము.
ధిషణ. సం. బుద్ధి..

ధిషణుఁడు. సం. బృహస్పతి.
ధిష్ణ్యము. సం. గృహము; స్థానము; బలము; నక్షత్రము.
ధిష్ణ్యుఁడు. సం. శుక్రాచార్యుఁడు.

## ధీ

ధీ. సం. మతి, బుద్ధి. [మనస్సు.
ధీంద్రియము. సం. జ్ఞానేంద్రియము;
ధీమంతుఁడు. సం. విద్వాంసుఁడు; బృహస్పతి. విశే. బుద్ధిమంతుఁడు.
ధీమతి. సం. బుద్ధిమంతురాలు; విదుషి.
ధీర. సం. వ్యంగ్యముగా కోపప్రకాశము చేయు నాయిక; ధీరురాలు.
ధీరము. సం. కుంకుమ పువ్వు.
ధీరలలితుఁడు. సం. ధీరుఁడు కళాసక్తుఁడు నైన నాయకుఁడు, చతుర్విధ నాయకులలో నొకఁడు.
ధీరశాంతుఁడు. సం. ధీరుఁడు శాంతుఁడు నైన నాయకుఁడు, చతుర్విధ నాయకులలో నొకఁడు.
ధీరాధీర. సం. వ్యంగ్యావ్యంగ్యముగా కోపప్రకాశము చేయు నాయిక.
ధీరుఁడు. సం. విద్వాంసుఁడు. విశే. ధైర్యము గలవాఁడు; స్వాతంత్ర్యము గలవాఁడు; మనోవికార కారణము లుండియు మనోవికారమును పొందనివాఁడు.
ధీరోధాత్తుఁడు సం. చతుర్విధ నాయకులలో నొకఁడు, ధీరుఁడు ఉదాత్తుఁడు నైన నాయకుఁడు.
ధీరోద్ధతుఁడు. సం. చతుర్విధ నాయకులలో నొకఁడు, ధీరుఁడు ఉద్ధతుఁడు నయిన నాయకుఁడు.
ధీవరుఁడు. సం. జాలరి, పల్లెవాఁడు.
ధీసచివుఁడు. సం. కార్యాలోచన యోగ్యుఁడగు మంత్రి.

## ధు

ధుంధుమారము. సం. ఇంద్రగోపము; పట్టుపురుగు. [విడువఁబడినది.
ధుతము. సం. విశే. కదలింపఁబడినది;
ధుని. సం. నది, ఏఱు.
ధుర సం. బరువు. [యెద్దు గుఱ్ఱము మొ.
ధురంధరము. సం. విశే. బరువు మోసెడి
ధురంధరుఁడు. సం. విశే. బరువు మోయువాఁడు; శ్రేష్ఠుడు.
ధురి. సం. బరువు.
ధురీణము. సం. విశే. ధురంధరము.
ధురీణుఁడు. సం. విశే. ధురంధరుఁడు.
ధురీనన్ } (ద.ఒక్కమ్మడి, యుగపద్దర్థకము.
ధురీలునన్ }
ధుర్యము. సం. విశే. ధురీణము.
ధుర్యుఁడు. సం. విశే. ధురంధరుఁడు.
ధుస్తు(స్తూ)రము. సం. ఉమ్మెత్త†

## ధూ

ధూతము. సం. విశే. కదలింపఁబడ్డది; ఎగురఁగొట్టఁబడ్డది.
ధూననము. సం. కదలించుట.
ధూపటము. సం. ధూమరూప పటము.
ధూపము. సం. పరిమళించెడి గుగ్గిలము మొదలైనవాని పొగ; ధూపసాధనము లైన అగురువత్తి మొ.
ధూపాయితము } సం. విశే. ధూపము చేయఁబడినది; తపింపఁ జేయఁబడినది.
ధూపితము }
ధూమకేతువు. సం. తోఁకచుక్క, ఉత్పాతవిశేషము; అగ్ని.
ధూమధ్వజుఁడు. సం. అగ్నిహోత్రుఁడు.
ధూమపానము. సం. పొగత్రాగుట.
ధూమము. సం. పొగ.
ధూమయోని. సం. మేఘము; అగ్ని.
ధూమలము. సం. నలుపు మించఁగలసిన యెఱుపు. విశే. నలుపు మించఁగలసిన యెఱుపు గలది.
ధూమిక. సం. పొగమంచు.
ధూము. హిం. కలఁత; జాడ్యము.
ధూమ్య. సం. ధూమ సమూహము.
ధూమ్యాటము. సం. కూఁకటిమూఁగపిట్ట.
ధూమ్రకము. సం. ఒంటె.
ధూమ్రపత్ర } సం. పొగాకు†.
ధూమ్రపత్రిక }

ధూ్రమము. సం. ధూమలము.
ధూర్జటి. సం. శివుఁడు. [ఉమ్మెత్త†.
ధూర్తము. సం. ఒకదినుసు ఉప్పు;
ధూర్తుఁడు. సం. విటుఁడు; జూదరి. విశ మోసకాఁడు.
ధూర్వహము. సం. విశ. ధురంధరము.
ధూర్వహుఁడు. సం. విశ. ధురంధరుఁడు.
ధూళి. సం. దుమ్ము.
ధూళికుట్టిమము. సం. దున్నిన పొలము.
ధూళిగుచ్ఛకము సం. గందవొడి, బుక్కా.
ధూళిజంఘము. సం. కాకి.?
ధూళిధ్వజుఁడు. సం. వాయువు.
ధూళీకదంబము. సం. నెమ్మి†; కడిమి†; ఉలిమిరి†. [విశ. బూడిదవర్ణము గలది.
ధూసరము. సం. గాడిద; బూడిదవర్ణము.

## ధృ

ధృతము. సం. విశ. ధరింపఁబడ్డది.
ధృతరాష్ట్రుఁడు. సం. దుర్యోధనుని తండ్రి; నాగసర్పవిశేషము; రాజు.
ధృతి. ధరించుట; ధైర్యము; సౌఖ్యము; ఒక రోగము; ఒకఛందస్సు; యజ్ఞము; ప్రీతి.
ధృవ సం. ముయ్యాకుపొన్న†.
ధృష్టుఁడు. సం. శృంగార నాయకులలో నొకఁడు. విశ. దట్టతనము గలవాఁడు; ధూర్తుఁడు.
ధృష్టత సం. విశ. దిట్టతనము; ప్రతిభ.
ధృష్ణువు. సం. విశ. దిట్ట; ప్రతిభగలవాఁడు

## ధే

ధే. గుఱ్ఱమును తోలుటయందగు ధ్వన్యను కరణము.
ధేనుక. సం. తేఁగటియావు; ఆఁడేనుఁగు; ఆఁడుగుఱ్ఱము; చిన్నకత్తి; పార్వతి.
ధేనుకము. సం. చీరపేను.
ధేనుకుఁడు. సం. ఒక రాక్షసుఁడు.
ధేనువు. సం. తేఁగటియావు.
ధేనుష్య, సం, ఋణమువ పెట్టిన యావు.

## ధై

ధైనుకము. సం. ఆవుల మంద.
ధైర్యము. సం. ధీరత్వము, దీమసము.
ధైవతము. సం. సప్తస్వరములలో ఆఱవది

## ధో

ధోరణము. సం. వాహనము.
దోరణి. సం. పద్ధతి; పంక్తి; పరంపర.
దోరితకము. సం. ధౌరితకము, ధౌరితము.

## ధౌ

ధౌతము. సం. విశ. ఉదుకఁబడ్డది; కడుగఁబడ్డది, తోమఁబడ్డది.
ధౌతి. సం. హఠయోగ షట్క్రియలలో నొకటి.
ధౌరంధర్యము. సం. ధురంధరత్వము
ధౌరితకము. సం. ధౌరితము, అశ్వగంతిత మున కంటె నధికమై చతురమైన గుఱ్ఱపు యశ్వధార (పరుగు)
ధౌరేయము. సం. దురంధరము.
ధౌరేయుఁడు. సం. విశ. ధురంధరుఁడు.
ధౌర్త్యము సం. ధూర్తత్వము.

## ధ్మా

ధ్మాతము. సం. విశ. ఊఁదఁబడినది.

## ధ్యా

ధ్యాత. సం. విశ. ధ్యానించువాఁడు.
ధ్యాతము. సం. విశ. ధ్యానింపఁబడినది.
ధ్యాతవ్యము సం. విశ. ధ్యానింపఁదగినది
ధ్యానము. సం. తలఁపు; తలఁచుట; మనసు నిల్పి దేవుని చింతనచేయుట; మనస్సు నిర్విషయము గా నుండుట.
ధ్యానించు. సం. స. క్రి. ధ్యానము చేయు.
ధ్యామము. సం. చిప్పకవ్రపు†; దవనము†. విశ. నల్లనిది.

## ధ్యే

ధ్యేయము. సం. విణ. ధ్యానింపఁదగినది.

## ధ్రు

ధ్రువ. సం. గీతివిశేషము; స్రుగ్భేదము; గుజ్జుపుసుడి; గుజ్జుపుసుడియుండుచోటు; చాఁగటి; ముయ్యాకుపొన్నటి.

ధ్రువము. సం. ఊహ; నిశ్చయము; మఱ్ఱి; మోడు; గసిక; ఉత్తర ధ్రువము; దక్షిణధ్రువము; గ్రహయోగ విశేషము; తాళవిశేషము. విణ. ఎడ తెగనిది; కదలనిది; నిలుకడ గలది.

ధ్రువుఁడు. సం. ఒక భాగవత శ్రేష్ఠుఁడు; ఒకవసువు; విష్ణువు; శివుఁడు; నక్షత్ర రూపమున నుండెడి ధ్రువుఁడు.

## ధ్వ

ధ్వంసనము. సం. నాశము; నాశనము; చంపుట. విణ. నశింపఁజేయునది.

ధ్వంసము. సం. నాశము.

ధ్వంసితము. సం. విణ. ధ్వంసముచెయ్యఁబడ్డది.

ధ్వజద్రుమము. సం. తాటిచెట్టు.

ధ్వజము. సం. టెక్కెము, జెండా; టెక్కెపుకంబము; గుఱుతు; మగ గుఱి; గర్వము.

ధ్వజమెత్తు. సం. స. క్రి. పోరాటము సాగించు; కత్తిగట్టు.

ధ్వజిని. సం. సేన.

ధ్వజుఁడు. సం. కల్లమ్మెడువాఁడు.

ధ్వని. సం. చప్పుడు; వ్యంగ్య ప్రధాన శబ్దము.

ధ్వనించు. సం. అ. క్రి. శబ్దించు.

ధ్వనితము. సం. విణ. మ్రోసినది; వ్యంజితము.

ధ్వస్తము. సం. విణ. నశించినది; జాఱినది.

## ధ్వా

ధ్వాంక్షము. సం. కాకి; కొక్కెర.

ధ్వాంక్షి. సం. అడవికాకి.

ధ్వాంతము. సం. చీఁకటి.

ధ్వానము. సం. ధ్వని.

---

# న

న. అప. సప్తమ్యేకవచనమందు వచ్చెడి ఒకానొక ప్రత్యయము (వనమున, పుర పురమున అని). సం. లేమిని తెలుపునది

నంకు. ఉపవాసము స. క్రి. నేలనుకోరాడు

నంగ. విణ. నంగనాచి.

నంగనాచి. వద్లచిలుక. విణ. దిట్టతనము కలిగియు బయటికి ఏమియు తెలియని దానివలె నుండెడి స్త్రీ.

నంగి } ముక్కున నొత్తి పలికెడి
నంగిమాట } మాట.

నంగు. అ. క్రి. ముక్కుతో మాటాడు.

నంజె. ఉపసేచనము; నంజుకొనువస్తువు; ఊడుపుమడి.

నంజు. విషము; నెత్తురుచచ్చి తెల్లపాఱుట స. క్రి. ఉపసేచనముగొను, ఊరుగాయ మొ॥ తిను.

నంజేడు. మాంసము.

నంజేడుదిండి. క్రవ్యాదుఁడు, రాక్షసుఁడు. విణ. మాంసభక్షకుఁడు.

నంజేవాఱు అ. క్రి. నెత్తురుచచ్చి తెల్లపాఱు

నంటు. స్నేహము. విణ. స్నేహితుఁడు.

నంటుకత్తె. విణ. స్నేహితురాలు.

నంటుకాఁడు. విణ. స్నేహితుఁడు.

నంద్రకాయ. ఎంద్రకాయ.

నంద. సం. తిథి విశేషము; ముంత; కలిమి; ఒక దుర్గామూర్తి.

నందకము. సం. విష్ణుఖడ్గము. విణ. సంతోషపెట్టునది.

నందన. సం. కూఁతురు; ఒక సంవత్సరము

నందనము. సం. ఇంద్రుని యుద్యానవనము. విణ. ఆనందింపఁజేయునది.

నందనుఁడు. సం. కొడుకు. విణ. సంతోష పెట్టువాఁడు.
నందసుతుఁడు. సం. శ్రీకృష్ణుఁడు.
నంది. సం. శివుని వాహనము; నందికేశ్వరుఁడు; నందిచెట్టు; ధవవృక్షము; కలువ†.
నందించు. సం. అ. క్రి. సంతోషించు.
నందికేశ్వరుఁడు. సం. నంది, శివుని వాహనము; శివపార్శ్వచరుఁడు; శివుని ద్వారపాలకుఁడు
నందిని. సం. కామధేనువు కూఁతురు.
నందిముఖి. సం. నక్కతోఁక బియ్యము
నందివర్ధనము. నంద్యావర్తము†; పూర్ణిమ; అమావాస్య.
నందుఁడు సం శ్రీకృష్ణుని తండ్రి.
నంద్యావర్తము. సం. పడమటఁదక్కఁ దక్కిన మూఁడు దిక్కుల వాకిళ్ళు గల రాజగృహము; నందివర్ధనము†.
నంబరు. ఇం. సంఖ్య; వ్యాజ్యము.
నంబి. విష్ణుపూజకుఁడు; దేవలకుఁడు.
నంబెరుమాళ్ళు. బ. శ్రీరంగనాయకులు.
నకనకఁబడు } అ. క్రి కృశించు; వాడు;
నకనకలాడు } ఆఁకలిచే బాధనొందు.
నకనకలు. బ. కార్శ్యము.
నకనకలుగుడుచు. అ క్రి. కృశించు.
నకలు. హిం. ఒకదానిని చూచి వ్రాసినది
నకారగుళ్ళు. బ. నియోగి. [నకాసి.
నకాష్. హిం. రంగుపని చేయువాఁడు. రూ
నకాసి(సీ). విణ. నకిషీపని చేసినది.
నకాసుతివాసు. చిత్రకంబళ విశేషము.
నకిషి. హిం. అలంకారపుపని; చెక్కడపు పని
నకీబు. వేత్రధరుఁడు, చోపుదారుఁడు.
నకులము. సం. ముంగిస.
నకులుఁడు. సం. పాండవులలో నొకఁడు.
నకులేష్టి. సం. సర్పాక్షి†
నక్క. జంబుకము. విణ. క్షుద్రము.
నక్కకొమ్ము. చిఱుతపులి గోళ్లు†.
నక్కతోఁక కసవు. సింహపుచ్ఛి†.
నక్కతోఁకపొన్న. క్రోష్టువిన్న†.
నక్కతోఁకబియ్యము. ధాన్యవిశేషము.
నక్కదోస. చిర్భటము†.
నక్కనరము. ఒకదినుసు వేరు.
నక్కనేరేడు. కాకినేరేడు†.
నక్కమోరు. కుదురని కంతి.
నక్కరేఁగు కమ్మరేఁగు†. రూ. నక్కరేను
నక్కవిరిగి. క్షుద్ర శేలువు†.
నక్క. హిం. మోటుజరీ.
నక్కిళ్ళు బ. పక్కపండ్ల కీళ్లు.
నక్కు. క్రమానియుతుకు; బంగారుతునక; బంగారు నలుకఁగా నడుమఁ గనుపట్టెడు నిగ్గు; వాఁగటికల్లు. అ. క్రి. ఒదుఁగు; అపసరిల్లు.
నక్కెరి. కంజ†.
నక్కెలు. కమ్మరేఁగు†.
నక్తంచరము. సం. గుడ్లగూబ.
నక్తంచరుఁడు. సం. రాక్షసుఁడు.
నక్తందివము. సం. రేపగలు.
నక్తకము. సం చినిగినబట్ట; మాసినబట్ట; బట్ట; నల్లగూబ.
నక్తమాలము. సం కానుఁగు†
నక్తము. సం. రాత్రి; నక్తవ్రతము.
నక్తవ్రతము. సం. పగలు ఉపవసించి రాత్రి భోజనము చేయుటగల వ్రత విశేషము.
నక్రము. సం. అడ్డకమ్మి, త్రొక్కుడుఁ గమ్మి; మొసలి
నక్షత్రమాల. సం. ఇరువదియేడు ముత్యములు గ్రుచ్చిన యొంటిపేట హారము; ఇరువదియేడు పద్యములుగల కవితా విశేషము.
నక్షత్రము. సం. చుక్క; అశ్విన్యాది. (అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనురాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి.)
నక్షత్రేశుఁడు సం. చంద్రుఁడు.
నఖంపచము. సం. విణ గోరు వెచ్చనిది.
నఖము. సం. గోరు; గంధద్రవ్యవిశేషము.
నఖముఖాల. సం. క్రి. విణ. అన్నిదిక్కుల
నఖరము. సం. నఖము. [సింహము.
నఖరాయుధము. సం. కుక్క; పులి;

నఖోత్పాటని. సం. గోరుగల్లు.
నగ. భూషణము; లోహపాత్రము; పోగాకు దూది మొదలగువాని కంట్లపు మూట; సిద్దెలజోడు;ఉన్మత్తము.అంగి.
నగదు. హిం. ధనము;చేతివెల,రొక్కము
నగధరుఁడు. సం. విష్ణువు.
నగము. సం. కొండ; చెట్టు
నగరము. సం. పట్టణము.
నగరి. సం. పట్టణము.
నగరు. రాజగృహము; దేవగృహము.
నగవరి. విణ. నవ్వుగలవాఁడు.
నగవు. నవ్వు.
నగవైరి. సం. ఇంద్రుఁడు.
నగాధిపుఁడు. సం. హిమవంతుఁడు.
నగారా. హిం. పెద్దఢంకా.
నగాసు. హిం. చిత్రము. [అపహసించు.
నగు. హాసము. అ. క్రి. నవ్వు, హసించు;
నగుఁబాటు. అపహాసము.
నగౌకసము. సం. పక్షి; సింహము; శరభము. రూ. నగౌకము.
నగ్గు. చూర్ణము, నుగ్గు.
నగ్నంకరణము. సం. విణ. దిసమొలవానినిగా చేయుటకు సాధనమైనది
నగ్నహువు. సం. నానా ద్రవ్యములచేత చేయఁబడిన సురాబీజము.
నగ్నిక. సం. దిసమొల యాఁడుది;సమర్తాడని పడుచు.
నగ్నుఁడు. సం. బుద్ధదేవుఁడు; బట్టువాఁడు. విణ. దిసమొలవాఁడు.
నచ్చిక(గ). నమ్మిక.
నచ్చినవాఁడు.ఆప్తుఁడు,విశ్వాసపాత్రుఁడు
నచ్చు. బాధ; ఆలస్యము. స.క్రి. నమ్ము.
నచ్చుకాఁడు. విణ. అలసుఁడు;బాధకుఁడు
నచ్చుకుప్ప, నచ్చుగొట్టు } విణ. బాధించువాఁడు.
నచ్చుపెట్టు. స. క్రి. బాధించు. [నుఁడు.
నజీబు. విణ. హిం. ఉత్తముఁడు; కులీ
నజీరానా. హిం. అపరాధము, దండము.
నజరు. హిం. సముఖము; సౌందర్యము; కానుక.
నజ్జు. అణువు. విణ. మిక్కిలి నలఁగినది,
నజ్జునజ్జు. క్రి. విణ. విడకయుండు తునకతునకలు.
నటన. సం. కపటప్రవర్తనము.
నటనము. సం. నాట్యము; నటన.
నటమండనము. సం. హరిదళము.
నటము. సం ఇరుగుడు†; దుండిగము†.
నటవాలు. రేచితము, అశ్వగతివిశేషము.
నటి. సం. వేశ్య; నట్టువుని పెండ్లాము; నాట్యకత్తె; కాకిదొండ†; గువ్వగుత్తిక
నటించు. సం. అ.క్రి. నర్తించు; కపటముగా ప్రవర్తించు. రూ. నటియించు.
నటుఁడు.సం.అభినయము తెలిసినవాఁడు; నాట్యము చేయువాఁడు.
నటుపైద్దు. ఇం. విణ. సొమ్ము చెల్లింపకుండ టప్పాద్వారా పంపఁబడినది.
నట్ట. పాచిక.
నట్టకడుము. నడినడుము.
నట్టకోఁతి. బాలక్రీడా విశేషము.
నట్టడవి. అరణ్యమధ్యము.
నట్టనడుము. మిక్కిలి మధ్యము.
నట్టాడు అ. క్రి. వర్తించు; చలించు.
నట్టిల్లు. గర్భగృహము; గృహమధ్యము.
నట్టు నివాసస్థానము; గృహము,స్థానము; ఆలస్యము; ఆటంకము; సస్యరోగ విశేషము; నటుఁడు.
నట్టుక. ఆటక.
నట్టుకొట్టు. అ క్రి. ఆలస్యము చేయు.
నట్టుకొను అ. క్రి. కుదురుకొను.
నట్టుగుఁడు. నటుఁడు, నట్టువుఁడు.
నట్టుపులుఁగు. లాసకము, నెమలి.
నట్టువ. ఆట; ఆటకాఁడు.
నట్టువకాఁడు. ఆటకాఁడు.
నట్టువచావడి. నాటకశాల.
నట్టువడు. అ. క్రి. అడ్డిపడు.
నట్టువపిట్ట, నట్టువపులుఁగు } లాసకము, నెమిలి.
నట్టువము నాట్యము, ఆట.
నట్టువాఁడు. నటుఁడు.
నట్టువాలు. బాలక్రీడా విశేషము.
నట్టువుఁడు. నటుఁడు.
నట్టువొజ్జ. నాట్యోపాధ్యాయుఁడు.
నట్టేఱు. నదీమధ్యము.

నట్టొట్లు. బ. అట్లొట్లు.
నట్వాలు. రూ. నటవాలు.
నడ. నడక.
నడక. గమనము; ప్రవర్తనము; వృత్తి.
నడగఁడు. గుఱ్ఱము.
నడఁగొండ. సంచరించెడి కొండ.
నడగొట్టు. అ. క్రి. నిలుచు.
నడచు. అ. క్రి. గమనించు; ప్రవర్తించు.
నడజోడు. పదాతి; కాలిబంటు.
నడత. ప్రవర్తనము, నడవడి. [రించు.
నడతెంచు. అ. క్రి. వచ్చు; పోవు; సంచ
నడదివియ. కరదీపము.
నడపీనుఁగు. జీవచ్ఛవము.
నడపు గమనము; ప్రవర్తనము; వృత్తి
ప్రే. నడపఁజేయు. [ర్పఱచిన బావి.
నడబావి. దీర్ఘిక, నడచిపోవుటకు మెట్లే
నడము. సం. కిక్కిసకసవు†. రూ. నళము
నడయాడు. అ. క్రి. సంచరించు; చలించు.
నడవ. సేతువిశేషము; మార్గము; అళిందము; తలవాకిటికిని నడిమి వాకిటికిని నడిమి చోటు. [త్రము; వృత్తి.
నడవడి-క. నడత; ప్రవర్తనము; చరి
నడి. నడిమిశబ్దముయొక్క లుప్తరూపము; మధ్యము. విణ. మధ్యమము.
నడికట్టు. కటిబంధము, బిగువునకై నడుమునఁ గట్టెడు కట్టు. [గట్టెడు త్రాడు.
నడికట్టుత్రాడు. కక్ష్య, ఏనుఁగునడుమునఁ
నడికిరేయి. అర్ధరాత్రము. బ. నడికిరేలు.
నడికొప్పు. ఇంటి నడికొప్పు.
నడితి. నడత.
నడినెత్తి. బ్రహ్మరంధ్రస్థానము.
నడిమి. నడి; మధ్యమము. [మధ్యవాఁడు.
నడిమివాఁడు. అన్నదమ్ములమధ్యవాఁడు;
నడిమిప్రేలు. నడిప్రేలు.
నడిప్రేలు. మధ్యమ.
నడిరేయి. నిశీథము, నడికిరే.
నడు. నడుము శబ్దముయొక్క లుప్తరూపము, మధ్యము. విణ. మధ్యమము.
నడుఁకు. కంపము. అ. క్రి. కంపించు.
నడుకొన. మధ్యభాగము.
నడుకొను. అ. క్రి. కంపించు.
నడుగుంట. బ్రహ్మరంధ్రము.
నడుచు. అ. క్రి. రూ. నడచు.
నడుచుతఱి. వర్తమానకాలము.
నడుచొచ్చు. అ. క్రి. నడుమ ప్రవేశించు.
నడుతీర్పు. మధ్యమ లయ.
నడుదింపు. మాంసవిశేషము.
నడుదిన్నె. ద్వీపము.
నడునడు. నడఁకుటయందగు అనుకరణము
నడునెత్తి శిరోమధ్యభాగము.
నడుపు. జరుపు, నడపు.
నడుప్రాయపుది. ప్రౌఢస్త్రీ.
నడుమంతరము. మి. కవును; మధ్యకాలము. విణ. మధ్యకాలమునఁ గలిగినది. రూ. నడుమంత్రము.
నడుము. కటిప్రదేశము; మధ్యభాగము, మధ్యప్రదేశము; మధ్యకాలము.
నడుముకట్టు. అ. క్రి. సిద్ధపడు.
నడురాతిరి, నడురేయి } అద్దమరేయి, నిశీథము.
నడువడి. రూ. నడవడి.
నడువీది. రాజవీథి.
నడ్డి. పూర్వకాయము వెనుకను వంగియుండుట; నడుము వెనుక క్రిందిభాగము. విణ. చప్పట. [గుంత.
నడ్డిగుంట. కుకుందరము, పిఱుఁదిమీఁది
నడ్డిముక్కుగలాఁడు, నడ్డిముక్కువాఁడు } విణ. అవటీటుఁడు, చిదుకముక్కువాఁడు.
నడ్తి. నడత.
నడ్ము. రూ. నడుము.
నడ్య. సం. కిక్కిసవామి.
నడ్వంతము, నడ్వలము. } సం. విణ. కిక్కిసకసవు అధికముగఁగల దేశము.
నతము. సం. విణ. వంగినది; వంకరైనది; లోఁతైనది.
నతి. సం. నమస్కారము; వంపు; వంగుట
నతిజోబిల్లు. బ. ఒకవిధమైన పాటలు.
నతుఁడు. సం. వంగినవాఁడు; నమస్కరించినవాఁడు.
నత్త. గుల్లయందుండు పురుగు.
నత్తగుల్ల. క్షుద్రశంఖము.
నత్తగొట్టు. పక్షిభేదము.

నత్తి. తడఁబడుచు మాట్లాడెడు వ్యాధి విశేషము. [లుఁడు.
నత్తివాఁడు. విణ నత్తిగలవాఁడు, లోహ
నత్తు. హిం. నాసాభరణ విశేషము; ముక్కుపోఁగు. అ. క్రి. తడఁబడుచు మాటాడు.
నదము. సం. ప్రవాహము; సముద్రము; శోణము సింధువు దామోదరము బ్రహ్మపుత్రము మొ.
నదరు నజరు.
నది. ఏఱు, అమడకు మీఱి పాఱెడు ఏఱు, గంగ గోదావరి మొ.
నదీకాంతుఁడు. సం. శివుఁడు; సముద్రుఁడు
నదీజారుఁడు. సం. శివుఁడు.
నదీమాతృకము. సం. ఏటి ఆసరాను పండెడి దేశము.
నదీసర్జము. సం. ఏఱు మద్దిగి.
నద్ధము. సం. విణ. కట్టఁబడ్డది.
నధ్రి. సం. టంగువాఱు.
నన. పుష్పము; మొగ్గ; చిగురు; మొలక.
ననంద. మగనితోడఁబుట్టినది, ఆఁడుబిడ్డ
ననఁబోఁడి. పూఁబోడి; స్త్రీ.
ననకారు. వసంతఋతువు, కుసుమాకరము.
ననసీరు. పుష్పరసము.
ననయు. అ. క్రి. పుష్పించు; చిగురించు
ననవిలుకాఁడు. పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.
ననవిలుకానన్న బ్రహ్మ. [ననవిల్తుఁడు.
ననవిలుతుఁడు. ననవిలుకాఁడు. రూ.
ననాంద. సం. రూ. ననంద.
ననుఁబ్రాయి. చక్కఁగా ఊడుకనిబియ్యము.
ననుఁబ్రాయివడు. అ. క్రి. ననుఁబ్రాయి యగు.
ననుచు. అ. క్రి. ననయు; మొగ్గయెత్తు; అనురాగమొందు; అతిశయించు; ఇంపగు. [ఇంపు.
ననుపు. అనురాగము; అతిశయము;
ననుపుకత్తె. విణ. ప్రియురాలు; జారస్త్రీ.
ననుపుకాఁడు. విణ. ప్రియుఁడు; విటుఁడు.
ననుపువడు. అ. క్రి. స్నేహపడు.
నన్న. విణ. కలుచ
నన్నూఱు. స. చతుశ్శతి.
నన్పుకాఁడు. రూ. ననుపుకాఁడు.
నన్బ్రాయి. రూ. ననుఁబ్రాయి.
నపీరు. ఊఁదు వాద్యవిశేషము.
నపుంసకుఁడు. సం. మగతనములేనివాఁడు.
నప్త. సం. కొడుకు; మనుమఁడు; మునిమనుమఁడు. [రాలు.
నప్త్రి. సం. మనుమరాలు; మునిమనుమ
నప్పు. బాలకుఁడు.
నఫరు. హిం. ఆసామి.
నఫా. హిం. లాభము.
నఫిరి. హిం. బాకా; బాకా ఊదువాఁడు
నబాబు. హిం. మహమ్మదీయ ప్రభువు.
నభము. సం. ఆకాశము; శ్రావణమాసము మేఘము; వర్షాకాలము; బిసతంతువు; తమ్మపడిగము; ముక్కు.
నభవుఁడు. సం. పుట్టుకలేనివాఁడు.
నభశ్చరుఁడు. సం. దేవుఁడు; విద్యాధరుఁడు; మేఘుఁడు.
నభసంగమము. సం. పక్షి.
నభస్యము. సం. భాద్రపదమాసము.
నభస్వంతుఁడు. సం. వాయువు.
నభస్వత్తు. సం. వాయువు.
నభోగిర. సం. ఆకాశవాణి.
నమనము. సం. వంగుట; నమస్కరించుట
నమలు. స. క్రి. చర్వణముచేయు.
నమలి. నెమిలి. [వాఁడు.
నమసితుఁడు. సం. విణ. పూజింపబడిన
నమస్కరించు. సం. స. క్రి. చేమోడ్చు
నమస్కారము. సం. వంగి చేతులు జోడించుట.
నమస్కారి. సం. ముడుఁగుఁదామర†.
నమస్కృతి. సం. నమస్కారము.
నమస్య. సం. పూజ. [వాఁడు.
నమస్యితుఁడు. సం. విణ పూజింపఁబడిన
నమస్సు సం. నమస్కారము.
నమించు. సం. స. క్రి. నమస్కరించు.
నమితము. సం. విణ. వంగినది.
నమిలి. నెమిలి.
నముగాములు. బ. మంచిచెడ్డలు.
నముచి. ఒకరాక్షసుఁడు.
నముచిసూదనుఁడు. సం. ఇంద్రుఁడు.
నమూదు. హిం. విణ. కనబఱచఁబడినది.

నమూనా. హిం. మాదిరి.
నమేరువు. సం. సురపొన్న †.
నమోదు. హి. రూ. నమూదు.
నమ్మకము. విశ్వాసము.
నమ్మదుంప. కశేరుకము †. [క్షతములు.
నమ్మలు. బ. వీఁపుమీఁదఁ జేయు నఖ
నమ్మి. నెమిలి.
నమ్మిక(గ). నమ్మకము. [-చిన వాఁడు.
నమ్మినవాఁడు. విణ. ఆప్తుఁడు; విశ్వసిం
నమ్ము. స. క్రి. విశ్వసించు; ఆశ్రయించు.
నమ్ముకవాఁడు. అప్తుఁడు; విశ్వసించు వాఁడు.
నమ్రత. సం. వినయము.
నమ్రము. సం. విణ. వంగినది.
నమ్రుఁడు. సం. విణ. వినయముగలవాఁడు.
నయ. అందము.
నయగారము. మనోజ్ఞత; విలాసము; మృదుత్వము; మృదువచనము. విణ. కృత్రిమము; అనుకూలము.
నయగారి. విణ. మనోజ్ఞము; మృదుత్వము గలవాఁడు; మృదువచనము గలవాఁడు.
నయనము. సం. కన్ను; పొందించుట.
నయము. లాభము; నునుపు; మృదుత్వము; అందము. విణ. చౌక; నునుపైనది; మేలైనది; మృదువైనది; అందమైనది. సం. నీతి; పొందించుట; ద్యూతవిశేషము.
నయించు. సం. స. క్రి. పొందించు.
నర. పలితము, ముదిమిచే వెండ్రుకల యందుఁ గలుగు తెలుపు; ముదిమిచే తెల్లబాఱిన వెండ్రుక.
నరకఁడు. విణ. నీచుఁడు; మోటువాఁడు
నరకము. సం. దుర్గతి; పాపఫలము ననుభవించెడి స్థానము (నరకములు — తామిస్రము, లోహశంకువు, మహానిరయము, శాల్మలి, రౌరవము, కుంభలము, పూతిమృత్తికము, కాలసూత్రము, సంఘాతము, లోహితోదము, సవిషము, సంప్రపాతనము, మహానరకము, కాకోలము, సంజీవనము, మహాపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, అసిపత్రవనము, తాపనము మొ.)
నరకాంతకుఁడు. సం. కృష్ణుఁడు.
నరకుఁడు. సం. ఒక యసురుఁడు.
నరగ—జేము. నగారా.
నరదేవుఁడు } సం. రాజు, ప్రభువు.
నరపాలుఁడు }
నరపు. పలితము.
నరభోజనుఁడు. సం. రాక్షసుఁడు.
నరము. నాడి. సం. రామకర్పూరము †.
నరయు. అ. క్రి. పలితమగు; ముదిమిచే వెండ్రుకలు తెలుపగు.
నరవ. కొండతోవ.
నరవాహనుఁడు. సం. కుబేరుఁడు.
నరసింగఁడు. నరసింహస్వామి.
నరసింగము. మల్లబంధవిశేషము; నరసింహము.
నరాజి(జీ). కత్తి.
నరిగి. గొఱ్ఱెలశరీర వర్ణవిశేషము.
నరిడి. గుండెయుబ్బరపు పశురోగము.
నరియుఁడు. నక్క.
నరియు. రూ. నరయు.
నరుఁడు. సం. మనుష్యుఁడు; మగవాఁడు; అర్జునుఁడు; నరఋషి; పరమాత్మ.
నరుజే. గుడ్డు తెత్తుక వెలికి పుట్టలోనికి సాగు చీమల చాలు. [తలు.
నరులుగనని పెద్దలు. బ. నిర్జరులు, దేవ
నరుపు నరయుట, పలితము.
నరేంద్రుఁడు. సం. ప్రభువు; భూతవైద్యుఁడు; విషవైద్యుఁడు.
నర్తకి. సం. నాట్యమాడెడి స్త్రీ; ఆఁడేనఁగు; గువ్వగుత్తిక †. [వాఁడు.
నర్తకుఁడు. సం. నట్టువుఁడు. విణ. ఆడెడు
నర్తనప్రియము సం. నెమిలి.
నర్తనము. సం. ఆట; నృత్యము.
నర్తించు } సం. అ. క్రి. నృత్యము
నర్తిలు(ల్లు) } చేయు.
నర్మరుఁడు. సం, విటుఁడు; పరిహాసకుఁడు
నర్మద. సం. ఒక నది.
నర్మదుఁడు. సం. వేడుక చెలికాఁడు.
నర్మము సం. పరిహాసము.
నర్మిలి. ఆపేక్ష.
నఱకు. నఱకుడు. స. క్రి. ఖండించు.
నఱకుడు. ఖండనము.
నఱకుడుపడు. అ. క్రి. ఖండితమగు.

నఱమ. విణ. కపటముగల.
నఱవ. అఱవ.
నఱుకు. నఱకు; గాయము.
నఱుకుడు. నఱకుడు; గాయము.
నఱుకుపరువడి. శస్త్రవిద్యాభేదము.
నఱుకుబియ్యము. నను(బ్రాయి.
నఱుకులాడు. స. క్రి. ఒకరినొకరు నఱుకు
కొను. [కరణము.
నఱుకు౛. దిగులుపడుట యందగు అను
నఱుజె. అణువు; సూక్ష్మము.
నఱుమాడు. స. క్రి. పొడిచేయు.
నఱుము. పొడి స. క్రి. పొడిచేయు.
నఱ్ఱ. అఱ్ఱ, పెంకెయావు; పెంకెయెద్దు.
నఱ్ఱాడు. అ. క్రి. సంచరించు. ?
నల. విణ. నల్లనిది.
నలఁక } తాపము; వ్యాధి; శ్రమము;
నలఁకువ. } బాధ.
నలఁగు. అ. క్రి. నలియగు; పీడితమగు;
చెడు; శ్రమపడు.
నలఁగుడు. పీడనము.
నలఁగుడువడు. అ. క్రి. పీడితమగు.
నలఁగుడువెట్టు. స. క్రి. పీడించు.
నలఁచు. ప్రే. నలఁగఁజేయు.
నలకూబరుఁడు. సం. కుబేరుని కొడుకు.
నలదము. సం. వట్టివేరు; పూఁదేనె.
నలమేనిదొర. కృష్ణుఁడు
నలవడు. అ. క్రి. నలఁగు.
నలి. రోగము. నలుసు; చూర్ణము. విణ.
నలఁగినది; సన్నము. ద్ర. అత్యంతము.
ద్ర. క్రి. విణ. యోగ్యముగా. సం.
గువ్వగుత్తిక †.
నలికండ్లపాము రక్తపుచ్ఛిక, బ్రాహ్మణి.
నలికము. సన్నదనము, తనుత్వము.
నలికిరి(లి) } నలికఁడ్లపాము.
నలికీఁచు }
నలిగులి. విణ. మిక్కిలి నలఁగినది.
నలిగొట్టు. విణ. మిక్కిలి సన్నమగునది.
నలితిండి. చిఱుదిండి.
నలితిండికాఁడు. విణ. తిండిపోతు; సోమరి.
నలినము. సం. పద్మము; నీరు.
నలిని. సం. తామర; తామరకొలను;
తామరతీఁగ; తామరతంపర; మిన్నేఱు

నలియు. అ. క్రి. నలఁగు
నలిరేఁగు. అ. క్రి. విజృంభించు. [ము.
నలు. నాలుగున కాదేశముగా వచ్చురూప
నలుఁగు. ఉద్వర్తన ద్రవ్యము, స్నాన
మప్పుడు మేనరాచుకొనుటకు కొన్ని
గంధ ద్రవ్యములుచేర్చి నూరెడుపిండి;
ఉత్పాదనము, స్నానమప్పుడు పెండ్లి
కూఁతునకును పెండ్లికొడుకునకును మేన
నలుఁగుపిండి పెట్టి నలఁచుట. అ. క్రి.
నలియగు.
నలుఁగుడు. రూ. నలగుఁడు.
నలుగుఁబిండి. ఉద్వర్తనము.
నలుఁడు. సం. నలచక్రవర్తి; ఒకవాన
రుఁడు; ఒక పితృదేవత.
నలుకువ. రోగము; బాధ.
నలుగడ. నాలుగుదిక్కులు.
నలుగురు. స. నలువురు; అందఱు.
నలుచదరము. చతురస్రము.
నలుచు. ప్రే. నలియఁజేయు.
నలుతుము. చతురాఢకి, నల్తుము.
నలుతుమునేల. నల్తుము విత్తులు విత్తెడి
భూమి.
నలుదెసలు. మి. ఋ. నాలుగు దిక్కులు.
నలుపలము. చతుఃపలము.
నలుపు. కళంకము; నీలిమ, కృష్ణవర్ణము
విణ. కృష్ణవర్ణముగలది. ప్రే. రూ. నలుచు.
నలుబది. స. నాలుగుపదులు, చత్వారిం
శత్తు.
నలుమడి. నాలుగురెట్లు, చతుర్గుణము.
నలుమాఱు. నాలుగావృత్తులు.
నలుమూల. నాలుగు మూలలు.
నలుప. చతుర్ముఖుఁడు, బ్రహ్మ.
నలువంద్రు. స. నలుబగిమంది.
నలువతేజి. హంస.
నలువది. స. నలుబది.
నలువపడతి. బ్రాహ్మి, సరస్వతీదేవి.
నలువు. విధము; సౌందర్యము, సామర్థ్యము
విణ. ఒప్పిదమైనది.
నలువురు. స. నలుగురు.
నలుసంత. అల్పప్రమాణము.
నలుసాల. చతుశ్శాలము.
నలుసు. రేణువు; తృణాదిలేశము.

నల్గురు. చ. నలుగురు.
నల్చదరము. నలుచదరము.
నల్తిగ. చ. పండ్రెండు.
నల్తుము. నలుతుము, చతురాఢకి.
నల్పలము. నాలుగుపలములు.
నల్బది. చ. నలుబది.
నల్మోముదేవర. చతురాననుఁడు, బ్రహ్మ.
నల్ల. నెత్తురు; రక్తవిశేషము; నలుపు, కృష్ణ వర్ణము; నీలవర్ణము; హరిద్వర్ణము; బొగ్గు. విశే. నలుపైనది.
నల్లకచోరము. చోరము†.
నల్లకలువ. ఇందీవరము†.
నల్లగగ్గెర. కఠింజరము†.
నల్లగఱిక. బాలతృణము.
నల్లగింటెన. నీలపుష్పి†.
నల్లగినియ. కటభి†.
నల్లగిసియ. అతసి†.
నల్లగురిగింజ, నల్లగురిజ } కృష్ణపాకి†.
నల్లగూబ. కృతమాలకము†.
నల్లగోలిమిడి. నీలదూర్వ†.
నల్లగోరంట. ఆర్తగళము†.
నల్లగ్రుడ్డు. కంటిలోని నల్లనిగ్రుడ్డు.
నల్లగ్రోలునట్టిటెంకి. నిరృతి.
నల్లచీమ. పిపీలిక.
నల్లచెన్నఁగులు బ. ధాన్యవిశేషము.
నల్లచెఱకు. అనిక్షువు†.
నల్లచేమ. కృష్ణాలుకము†.
నల్లచ్చిగాఁడు ఏట్రింత, భరద్వాజపక్షి.
నల్లజీడి. జీడి, భల్లాతకి†.
నల్లజీలకఱ్ఱ. బహుగంధ†.
నల్లతీఁగ. సర్పాక్షి†.
నల్లతుమికి. శితిసారకము†.
నల్లతెగడ. కాలమేషిక†.
నల్లతోఁటకూర. కాలమారిషము†,
నల్లత్రాఁచు. కృష్ణసర్పము.
నల్లఁదనము. నీలిమ, చామనచాయ.
నల్లదానరిగాఁడు. తాఁబేలు.
నల్లదింటెన. నీలపుష్పి, నల్లగింటెన†.
నల్లదిరిసెనము. ఇరుగుడు†.
నల్లదోమ. తీక్ష్ణతుండము.
నల్లద్రాగుడు అంబాఱుపిడుజా.
నల్లద్రావుఁడు. అస్రపుఁడు, రాక్షసుఁడు.
నల్లద్రావువాఁడు. నిఘృణి.
నల్లద్రావెడువాఁడు. రాక్షసుఁడు.
నల్లన. నీలిమ, నలుపు.
నల్లనయ్య. శ్రీకృష్ణుఁడు.
నల్లనయ్యరవాలు. గరుత్మంతుఁడు.
నల్లనాగు. నల్లత్రాఁచు.
నల్లనేల. రేగటినేల.
నల్లనేలగుమ్మడు. క్షీరవిదారి†.
నల్లనైదువ. కాళి, పార్వతి.
నల్లనైదువగేస్తు. శివుఁడు, ఉమాపతి.
నల్లపిచ్చుక. పోతకి.
నల్లపులుగుడు. కృష్ణకాంభోజి.
నల్లపూస. ముత్తయిదువలు గ్రుచ్చి మెడను గట్టుకొనెడు చిన్న నల్లగాజుపూస.
నల్లపెసలు. శింబికములు.
నల్లప్రజ. నల్లమంది.
నల్లబుడమలు. బ. ధాన్యవిశేషము.
నల్లబుడునర కాకమాచి†.
నల్లమంది. ఆటవికసంఘము; గడిసీమనివసించువారు; పల్లకులు మోయు బోయీల జాతివారు.
నల్లమందు. అభిని.
నల్లమడుఁగు. మిక్కిలిలోఁతుగలమడుగు.
నల్లమద్ది. అశ్వకర్ణము.
నల్లయారెలు. బ. ధాన్యవిశేషము.
నల్లయిరుగుడు. కృష్ణశింశప†.
నల్లయుప్పు. దుర్ధర్ష†.
నల్లయుమ్మెత్త. హేమికి†.
నల్లయురగ. పందెపు కోడిపుంజులలో భేదము.
నల్లరఁటి. కదళీభేదము, పచ్చరటి†.
నల్లవడు. నల్లనగు.
నల్లవలువదాల్పు. నీలాంబరుఁడు, బలరాముఁడు.
నల్లవావిలి శేఫాలిక†.
నల్లవిష్ణుక్రాంత స్థూలపుష్పి.
నల్లవొ(వో). అవ్య. ఔరా; అయ్యో.
నల్లవెదురు. కృష్ణసారము†.
నల్లసుగంధిపాల. శారిబాలత.
నల్లావలు. రాజిక†.
నల్లి. పఱుపులయందుండి నెత్తురుత్రాగెడు పురుగు, మత్కుణము.
నల్లిండ్లు. బ. అగ్రహారము.

నల్లిక. నలికండ్ల పాము.
నల్లె. జేన.
నల్లెరు. నల్లేరు†.
నల్లేరు. ఒక దినుసు తీఁగ, వజ్రవల్లి.
నల్వజక్కి. హంస.
నల్వది. స. నలువది.
నల్వము. సం. నన్నూఱు మూరలదూరము
నల్వురు. స. నలుగురు.
నల్వరాణి. బ్రాహ్మి, సరస్వతి
నవ. కండూతి, జిల.
నవఁత. నవయుట; దుఃఖము; క్షయము.
నవకము. మృదుత్వము. సం. తొమ్మిది; నూతనమయినది.
నవక్షారము. సం. నవాసారము
నవగోజీ. గొప్ప గుడారము.
నవటాకు హిం. సేరులో ఎనిమిదవవంతు
నవతి. సం. తొంబది.
నవనము. సం. స్తోత్రము. [యెత్తిన వెన్న
నవనీతము. సం. వెన్న, అప్పుడు చిలికి
నవమము. సం. విణ. తొమ్మిదవది.
నవమాలిక. సం. విరజాజి†. [తిథి.
నవమి. సం. పక్షమునందు తొమ్మిదవ
నవము. సం. స్తోత్రము. విణ క్రొత్తది.
నవయు. అ. క్రి. కృశించు; శుష్కించు.
నవరంగము. సం. గృహవిశేషము.
నవరు. రూ. నగరు. [కల్పన
నవల. స్త్రీ; కుడుపము, మానిక; ప్రబంధ
నవలా. స్త్రీ.
నవాతు. మిక్కిలి తెల్లని గడ్డ చక్కెర.
నవారు. హిం. మంచమున కల్లు నూలుపట్టె
నవాసాగరు } నవక్షారమను ఒక దినుసు
నవాసారము } ఉప్పు.
నవి. కరగోడ పెట్టుటకు నిడుపున త్రవ్వి
యెత్తిన మట్టి పల్లము.
నవీనము. సం. విణ. క్రొత్తది.
నవు. నవ్వు.
నవుకరి. హిం. కొలువు, సేవ.
నవుకరు. హిం. కొలువుకాఁడు, సేవకుఁడు
నవుకు. అంగన్యూనత. విణ. నిమ్నము, పల్లము. [భ్రమించు.
నవుడుకొట్టు. అ. క్రి. ఏమియు తోఁచక
నవుబత్తు. నౌబత్తు.
నవురు. విణ. మృదువు.
నవ్యము. సం. క్రొత్తది; నుతింపఁదగినది.
నవ్వ. బాలకుఁడు.
నవ్వు. హాసము; వికాసము ; పరిహాసము. అ. క్రి. హసించు; వికసించు. స. క్రి. పరిహసించు; అపహసించు.
నవ్వుఁబాటు. ఎగతాళి, అపహాసము.
నవ్వుటాల. రూ. నవ్వులాట.
నవ్వులబండి. నవ్వెడు స్వభావముగలది.
నవ్వులాట. పరిహాసము.
నశించు. సం. అ. క్రి. నాశమగు.
నశ్వరము. నశించునది. [గు పడినది.
నష్టము. సం. నాశము నొందినది; మఱుఁ
నష్టి. సం నాశము, నష్టము.
నస. దురద; ఉపద్రవము. సం. నాసిక.
నసగూఁటి. జారుఁడు; జారిణి.
నసగూఁడు. కామోద్రేకము
నసిమిరి. దురద.
నసుకు. అసత్యపుమాట. విణ. అసత్యము.
నసుగు. అస్ఫుటవాక్కు. స. క్రి. అస్పష్టముగాఁజెప్పు.
నసువు. అంకురము.
నస్తితము. సం. ముకుద్రాడు కట్టినయెద్దు
నస్తోతము. సం. నసితము. రూ. నస్యోతము.
నహి. సం. అవ్య. అభావార్థకము, లేమిని దెలుపునది.

# నా

నా. స. నేను అనుదానికి ప్రాతిపదికము.
నాంచారు. ఒకదేవత.
నాంది. ప్రారంభము. సం దేవతలు బ్రాహ్మణులు మొదలగువారు చేయునట్టి ఆశీర్వాదము; నాటక ప్రారంభమునందు జరపెడి మంగళము; భేరి.
నాందీకరుఁడు. సం. విణ ఆశీర్వాదము చేయువాఁడు; భేరివాయించువాఁడు.
నాందీవాది. సం. విణ. నాందీకరుఁడు.
నాఁగటిచాలుకూర. తఱిగొఱ్ఱ, లాంగలి†.
నాఁగటిచాలుపేరియతివ. సీతాదేవి.
నాఁగటిచిప్ప. (నాఁగటి) పణాత, నిరీషము.
నాఁగటిజోదు. హాలి, బలరాముఁడు.

నాఁగటిదుంప } గొడగ, నాఁగటిచిప్ప
నాఁగటియారు } రూ. నాఁగటిపణశ.
నాఁగటిచీల. ఏడికోల జాఱకుండుటకై బిగించినచీల. [లము, దున్నెడిసాధనము.
నాఁగలి. సర్వావయవములుఁగల లాంగ
నాఁగలివాల్జోదు. బలరాముఁడు, హాలి.
నాఁగు. ధాన్యమునకువడ్డిగానిచ్చుధాన్యము
నాఁగురు గొల్లజిడ్డు†.
నాఁగెలు. నాఁగలి.
నాఁగేలు. నాఁగలి.
నాఁచికోలు. అపహరించుట.
నాఁచు. వారిపర్ణి, తీఁగపాఁచి; దొంగ. స. క్రి. అపహరించు.
నాఁచుడు. ఒక క్షుద్రజలచరము. [దశ.
నాఁడు. ఆకాలము; ఆదినము; కాలము,
నాఁడెకత్తె. నాణెము గలది.
నాఁడెకాఁడు. నాణెము గలవాఁడు.
నాఁడెము నాణెము.
నాఁపఱాయి విసశిల.
నాకబలి. సం. నాగవల్లి.
నాకము. సం. స్వర్గము; ఆకాశము.
నాకిని. సం. దేవతా స్త్రీ.
నాకు. స. క్రి. లేహనము చేయు.
నాకులి. సం. సర్పాక్షి†
నాకువు. సం. పుట్ట; కొండ; ముని.
నాకేశుఁడు. సం. ఇంద్రుఁడు.
నాక్రము. సం. నక్రముయొక్క ముఖము వంటి ముఖముఁగల నక్క.
నాగ. విశ. పూజ్యము; పెద్ద.
నాగఁడు. శేషుఁడు.
నాగకంకణుఁడు. సం. శివుఁడు.
నాగకేసరము. సం. ఒకానొక చెట్టు.
నాగకేసరులు బ. ధాన్యవిశేషము.
నాగగన్నేరు. ఒక దినుసు గన్నేరు†.
నాగచెముడు స్నుహీభేదము†
నాగజిహ్వక. సం. మణిశిల.
నాగదంతకము. సం. గొండ్లెము తగిలించెడు నాగవాసము; చిలుకకొయ్య.
నాగదంతి. మకాలకము†. సం. గురుగు†; ఏనుఁగు తుమ్మి†.
నాగఝాళి. ఒక దినుసు ముండ్లచెట్టు.

నాగనేరెడు. పెద్ద నేరేడు†. [విశేషము.
నాగపడగలదండ మి. స్త్రీ కంఠభూషా
నాగపడగలు. మి. బ. పాము-పడగవలె నేర్పడియుండు కర్ణభూషావిశేషము.
నాగపసాని. నాగవల్లి నడపెడు ముత్తైదువ
నాగపాశము. సం. నాగాస్త్రము; వరుణుని యాయుధము; ఒక రతిబంధము.
నాగపెంజెర. ఒక దినుసు పెంజెర (సర్పము)
నాగప్పసాని. రూ. నాగపసాని.
నాగబంధము. చిత్రకవిత్వములోని సర్పాకార బంధము.
నాగబలి. సం. బీఱ†. [మైన చిన్న పేము.
నాగబెత్తము. పొన్ను వేసిన మంత్రపూత
నాగభూషణుఁడు. శివుఁడు.
నాగమల్లె. అష్టపత్రిక†.
నాగమల్లెలు. బ ధాన్యవిశేషము.
నాగమసాని నాగపసాని.
నాగము. సం. సత్తు; సీసము; తగరము; రతిబంధ విశేషము; పాము; ఏనుఁగు; కొండ; గ్రహము; గొండ్లెము తగిలించెడు నాగవాసము; మబ్బు; ఒక ఉపవాయువు; ముస్తె†; నాగకేసరము†; పొన్న†; (ఉత్తరపదమైనపుడు) శ్రేష్ఠము. (అష్టనాగములు—అనంతుఁడు, వాసుకి, తక్షకుఁడు, శంఖపాలుఁడు, కులికుఁడు, పద్ముఁడు, మహాపద్ముఁడు; కర్కోటకుఁడు).
నాగముస్తె. భద్రముస్తకము†.
నాగరంగము. సం నారింజ†.
నాగరకత. సం. నాణెము; నైపుణ్యము.
నాగరకుఁడు. సం. దొంగ; ప్రవీణుఁడు; శిల్పి; చిత్రకారాని; కుచ్చితుఁడు. విశ. పట్టణమునఁ బుట్టినవాఁడు.
నాగరము. ఆఁడువారి శిరోభూషావిశేషము. సం. సొంటి; ముస్తె†; నాగరాకురము; గోరఁట†. విశ. నగరమునకు హితమైనది; నగరమునఁబుట్టినది.
నాగరి. సం. నిపుణురాలు; నాగరిలిపి.
నాగరికుఁడు. సం. నగరాధ్యక్షుఁడు.
నాగరుఁడు. సం. మగని తోఁబుట్టువు.
నాగలోకము. సం. పాతాళము.
నాగవము. సం. ఒకకరణము,

నాగవలి. నాగవల్లి.
నాగవల్లి. పెండ్లిలో నాలవనాడు జరుగు శుభకార్యము. సం. తములపాకుతీఁగె.
నాగవారికుఁడు. సం. గరుత్మంతుఁడు.
నాగవాసము. గొండ్లెము తగిలించెడు రెండుకొనలం వంచిన యినుపకమ్మి; వేశ్యాసమూహము; ఆటమేళము. సం. పాతాళలోకము.
నాగసంభవము. సం. సిందూరము.
నాగసరము. నాగస్వరము.
నాగసుగంధ. సం. సర్పాక్షి†.
నాగస్వరము. సం. పాములవాఁడుఊఁదెడు బుఱ్ఱ; సన్నాయి.
నాగసొరము. నాగస్వరము.
నాగా. హిం. శూన్యము, సున్న, విడిచి పెట్టఁబడినది.
నాగాంతకుఁడు. సం. గరుత్మంతుఁడు.
నాగిని. లోకాంతరము పొంది దేవతాత్వము వహించిన ముత్తయిదువ. సం. గొల్లజిడ్డు†.
నాగు. పాము.
నాగుఁబాము. త్రాఁచు, నాగము.
నాగులు. బ నాగుఁబాము; నాగములు.
నాగువు. నాగుఁబాము.
నాగోదము. సం. ఉదరత్రాణము.
నాచి. స్త్రీ.
నాజోకు. హిం. విణ. నాజూకైన; [సున్నితమైన.
నాట. సం. రాగవిశేషము.
నాటకము. నాట్యప్రధానమై గద్యపద్యాత్మకమైన గ్రంథవిశేషము; నాటకగ్రంథముయొక్క నాట్యము.
నాటకసాల. నాట్యశాల.
నాటనము. నాటుట.
నాటిక. సం. క్లృప్తవృత్తముగల నాటకవిశేషము; ఆటకత్తె.
నాటు. నాటుట. అ. క్రి. గ్రుచ్చుకొను; స. క్రి. (నేలను) నాటు మొదలగునది గ్రుచ్చు. ప్రే. గ్రుచ్చు. [కొలుపు.
నాటుకొను. అ. క్రి. నెలకొను. ప్రే. నాటు
నాటుపురము. పల్లెటూరు.
నాట్నము. నారుమొదలగువానిని నాటుట
నాట్యము. సం. నృత్యము; నృత్తగీతవాద్యముల కూడిక.
నాడా. హిం. సన్నని నూలుపట్టె.
నాడి. సం. నరము; ఇడాపింగళాసుషుమ్నాది; గడియకాలము; గొట్టము; నారికుఱుపు; ఈనె; కాఁడ; తెల్లగలిక; మోసకాని నడక.
నాడింధముఁడు. సం. అగసాలెవాఁడు.
నాడిక. దేశము. సం. గడియకాలము.
నాడీవ్రణము సం నారికుఱుపు.
నాడు. దేశము; జనపదము. అ. క్రి. నాటు. స. క్రి స్థాపించు.
నాడె. తురి, నడుమ నూలి కండెనుంచి నేసెడు సాలెవాని సాధన విశేషము.
నాడెము. విణ. నాణెము.
నాణకము. సం. నాణెము, రూపాయి మొ.
నాణము. మాంసరసము.
నాణెకత్తె. నాణెముకల స్త్రీ.
నాణెకాఁడు. నాణెము కలవాఁడు; వైశ్యుఁడు. రూ. నాణెగాఁడు.
నాణెము. ముద్రింపబడిన రాగి వెండి బంగారముల బిళ్ళ; ఇచ్చి పుచ్చుకొనుటయందలి యోగ్యత; మంజులత; ద్రవ్యము; నాగరకత. విణ. మంజులము; శ్రేష్ఠము.
నాతము. బత్తెము.
నాతి } స్త్రీ.
నాతుక } స్త్రీ.
నాథము. సం. ముకుత్రాడు.
నాథవంతుఁడు. సం. విణ. పరాధీనుఁడు.
నాథుఁడు. సం. ఖామందు; ప్రభువు; భర్త
నాదము. సం. ధ్వని. [గల; చిక్కన.
నాదారు. దారిద్ర్యము. హిం. విణ లేమిడి
నాదించె. సం. అ. క్రి. మ్రోఁగు.
నాదు ధ్వని. [మ్రేల్చు.
నాదుకొల్పు. స. క్రి. ధ్వనింపఁ జేయు;
నాదేయము సం. కైవడిముస్తె†. విణ. నదీ సంబంధమైనది.
నాదేయి. సం. కిత్తలి†; నారదము†; తక్కిలి; దాసనము†; నీరుప్రబ్బ†; కాకినేరేడు†; నేలనేరేడు†.
నాధుఁడు. సం. నాథుఁడు.

నాన. సిగ్గు.
నానఁబ్రాలు. నానబియ్యము.
నానగఁడ. విణ. సిగ్గుమాలినవాఁడు.
నానబియ్యము. లాజము, నానఁబెట్టిన చేరుడు బియ్యము. [గలది.
నానారూపము సం. విణ. పలుదెఱఁగులు
నాను కంఠాభరణ విశేషము. అ క్రి. ద్రవ ద్రవ్యము సోఁకున బహుకాలముండు.
నానుకోవి. నాను (౨౫).
నానుచు. ప్రే. నానఁజేయు. రూ. నాన్చు
నానుడి. కింవదంతి; సామెత.
నానుడు. విణ. తడిసినది.
నానుడువాన. విడువక కురిసెడు పొడిపొడి చినుకల వర్షము.
నానుపు. ప్రే. చలువచేయు.
నానుబోర. మాంసముగల బొమ్మ.
నానొడి. కింవదంతి. [పిండికాఁడ.
నాన్తె జంతికలు వత్తుచున్నప్పుడు జారెడి
నాన్తెల జంతికలలో భేదము.
నాపసాని. రూ. నాగపసాని.
నాపితుఁడు. సం. మంగలవాఁడు.
నాభి. సం. కస్తూరి; బొడ్డు; వసనాభి; బండికంటినడిమితూము; తిలకము; క్షత్రియుఁడు; చక్రవర్తి.
నాభిజన్ముఁడు. సం. బ్రహ్మ.
నాభిదఘ్నము } సం. విణ. బొడ్డెత్తుగలది;
నాభిద్వయసము } బొడ్డుబంటి (లోఁతు).
నామకరణము. సం. బిడ్డలకు పేరుపెట్టుట గల యొక సంస్కారము.
నామకా. గ్రా. క్రి. విణ. పేరుకు.
నామగుంట. గళగర్తము.
నామగోప్యము. సం. పేరుగుప్తముచేయుట కవితా చమత్కారములలో నొకటి.
నామధేయము. సం. పేరు.
నామమడఁచు. మి. స. క్రి. చంపు.
నామము. నొసటఁబెట్టుకొనెడు బొట్టు, ఊర్ధ్వపుండ్రము సం. పేరు.
నామరులు. బ. పాచికలు.
నామర్దా. హిం, విణ. పిరికివాఁడు, పుంస్త్వములేనివాఁడు.
నామా. హిం. వ్రాఁతపూర్వకమైనది.
నాము. జొన్న మొదలగువాని కొయ్యగాలున చిగురించిన మొలక. [యూషి.
నాముషి. హిం. అవమానము. రూ. నా
నాముకా. గ్రా. క్రి. విణ. పేరుకు.
నాయఁకరము. ఆధిపత్యము.
నాయఁకవాడి(లి). సేద్యపు పనులను పరామరిక చేసెడు దివాణపు బంటు.
నాయఁడు. ప్రభువు; బలిజెలు మొదలగు వారి పట్టపుఁబేరు. [మధ్యమణి.
నాయకము. సం. మేరువుపూస, హార
నాయకుఁడు. సం. అధిపతి. (సాధారణ నాయకులు నలుగురు—ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీరశాంతుఁడు.) శృంగార రసాలంబన పురుషుఁడు. (వీరు నలుగురు—అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు.) విణ. శ్రేష్ఠుఁడు. [(వత్సా—నాయనా అని).
నాయన. తండ్రి; కోమలామంత్రణము
నాయము. విణ. న్యాయయుక్తము. సం. నీతి; పొందించుట.
నాయి. కుక్క.
నాయిక. సం. శృంగారరసాలంబన స్త్రీ. (త్రివిధ నాయికలు — స్వీయ, పరకీయ సామాన్య. అష్టవిధ నాయికలు—స్వాధీన పతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషిత భర్తృక, అభిసారిక.)
నార. చీల్చిన తాటిమట్ట మొదలగునది; జనుము మొదలగువాని పీఁచు; కూర మీఁదిపీఁచు; తాడు మొదలగువానిపీఁచు. బ. చెట్టుపట్ట, వల్కలము.
నారంగము. సం. నారింజ; అమడబిడ్డ; పిప్పలిరసము.
నారంగుఁడు. సం. విటుఁడు.
నారకము. సం. నరకము. [వస్త్రములు.
నారచీరలు. బ. వల్కలములు, మును
నారట్టము. సం. బీటికనేల.
నారణపక్కి. నారాయణపక్షి.
నారదబ్బ. ఒకదినుసు దబ్బ.
నారదము. సం. నారింజ; మేఘము.
నారదుఁడు. సం. ఒక దేవర్షి. [వస్త్రము.
నారమడి. ఒకదినుసు నారతో నేసిన మడి

నారము. సం. నరులసమూహము; జ్ఞానము ; అప్పుడుపుట్టిన దూడ. బ. జలము. విణ. నరసంబంధమైనది. [బాణము.
నారసము. నారాచము, అచ్చు యినుప
నారాచము. నారసము; నెగడు, నీటి ఏనుఁగు; గంటము.? [మైన ద్రాసు.
నారాచి. సం. చిరునారసము; లోహమయ
నారాజి(జీ). కత్తి.
నారాయణఋషి. సం. ముముక్షువులననుగ్రహించుటకై బదరికాశ్రమమున తపమొనర్చుచుండు పరమహంస పరమగురువు.
నారాయణపక్షి. సం. నారణపక్కి.
నారాయణము. సం. ఒక ఉపనిషత్తు: ఒక వేదభాగము; నారాయణతైలము.
నారాయణి. సం. దుర్గ, పార్వతి; లక్ష్మి; గంగ; పిల్లపీచుగ†.
నారాయణుఁడు. సం. విష్ణువు, సర్వాంతర్యామియగు భగవంతుఁడు. [అఁడుది.
నారి. వింటినారి; నాడి. సం. భార్య;
నారింజ. నారంగము, నారదము†.
నారికడము. నారికేళము†.
నారికాయ. అల్లెత్రాటి తాఁకుడువలన చేతఁగలిగిన కిణము.
నారికుఱుపు. సెలపుండు, నాడీవ్రణము.
నారికెడము. కొబ్బరి†.
నారికేళము. సం టెంకాయచెట్టు.
నారుచే. క్రి. నాటఁజేయు రూ. నార్చు.
నారు. నాట్లు మునుఁగాను దఱచుగా విత్తులుపోసి మొలచిన మొలకలు.
నాలకి. హిం. పల్లకి. [వేయు ఇనుపబిల్ల.
నాలము. హిం. లాడము, గుఱ్ఱపుగిట్టలకు
నాలవకొలము. శూద్రకులము
నాలవకొలమువాఁడు. శూద్రుఁడు.
నాలాయకు. హిం. విణ. తగని.
నాలి. వత్సితపుపని. విణ. వత్సితము; మందము; వంచకము.
నాలిక. రూ. నాలుక.
నాలికచేఱు. తృణవిశేషము; నాలిక చేర్లు తినుటవలన పసులకు నాలికయందు ముండ్లవలె గలిగెడు వ్యాధివిశేషము.
నాళికి, హిం. పల్లకి. రూ. నాల్కి.
నాలిగాలి. మందమారుతము. [రాలు.
నాలిబూతము. విణ. వత్సితుఁడు; వత్సిత
నాలిముచ్చు. విణ. వత్సితుఁడు.
నాలుక. జిహ్వ. బ. సర్పజిహ్వకలు; అగ్నిజ్వాలలు. [చకము.
నాలుగు. స. మూఁడునొకటి, చతుర్వా
నాలుగుకంబాలాట. బాలక్రీడావిశేషము.
నాల్క. రూ. నాలుక.
నాల్గు. నాలుగు.
నాల్గుకన్నులవేల్పు. అగ్ని, ద్విశీర్షుఁడు.
నావ. సం ఓడ.
నావి. సస్యరోగము.
నావికుఁడు. సం. ఓడనడుపువాఁడు.
నావుడు. అనవుడు.
నావురు. నాగిని, గొల్లజిడ్డు†. [నది.
నావ్యము. సం. విణ. నావచే దాఁటఁదగి
నాశము. సం. చేటు; కనఁబడమి; అనుభవములేమి; నశించుట.
నాశిలు(ల్లు). సం. అ. క్రి. నవయు.
నాస. సం. ముక్కు; అడ్డకమ్మి, లక్ష్మికమ్మి.
నాసత్యులు. సం. అశ్వినీదేవతలు.
నాసాపుటము. ముక్కురంధ్రము.
నాసామణి సం. ముక్కర.
నాసి. పిల్లి విణ నికృష్టము.
నాసికము. సం. ముక్కు.
నాసిల్లు. అ. క్రి. నశించు.
నాసీరము. సం. నాయకునకు ముందఱ నడిచెడిసేన; సేనకు ముందటి భాగము.
నాసీరుఁడు. సం. విణ. అగ్రేసరుఁడు.
నాస్త హిం. ఉపాహారము. [దృష్టి.
నాస్తికత. సం. నాస్తికభావము; మిథ్యా
నాస్తికుఁడు. సం. వేదములను నిందించెడువాఁడు. బ. చార్వాక మాధ్యమిక యోగాచార సౌత్రాంతిక వైభాషిక దిగంబరులు.
నాస్తిక్యము. సం. నాస్తికత.
నాళము. లాడము. సం. తామర మొదలగువాని కాఁడ; గ్రోవి; గొట్టము; చిన్నన గ్రోవి. అగసాలెవాని ఊఁదుఁ గ్రోవి.
నాళి. సం. కూరయొక్క నాగ.

నాళికేరము. సం. నారికేళము.†
నాళీకము. సం. తామరః; తామరతంపరః; బాణము; బాణపు ములికి.
నాళీకాసనుఁడు. సం. బ్రహ్మ.

## ని

ని. అప. ద్వితీయైకవచనమందు వచ్చెడు ఒక ప్రత్యయము. (రాముని, శంభుని అని)
నింకు. అ. క్రి ఇఁకు, నశించు
నింకెఱ. అవ్య. క్రి. విశ. శీఘ్రము.
నింగి. ఆకాశము.
నింగిచూలి. ఆకాశజుఁడు, వాయువు.
నింగిమిరి. సువర్చల†.
నింగివడు. అ క్రి. అస్తమించు.
నింగిసిగ. వ్యోమకేశుఁడు, శివుఁడు.
నించు. ప్రే. నిండఁజేయు.
నింజిలి. మనోవ్యథ.
నింట. జలపూరము. [నిండుకొను.
నింతఁబడు. అ. క్రి. నిండు, నిండారు,
నిండారు. అ. క్రి. నిండు.
నిండు. పూర్ణత. అ.క్రి. పూర్ణమగు. విశ. పూర్ణము. [కొలుపు.
నిండుకొను. అ. క్రి. నిండు. ప్రే. నిండు
నింద. సం. దూఱు; అపదూఱు.
నిందించు. సం. స క్రి. దూఱు.
నిందితుఁడు.సం.విశ.దూఱఁబడినవాఁడు.
నింద్యుఁడు. సం.విశ.దూఱఁదగినవాఁడు.
నింపాది. విశ, సమృద్ధము.వా.సుఖితము.
నింపారు. అ. క్రి పూర్ణమగు.
నింపిరి. మలము, ముఱికి. [చేయు.
నింపు. సమృద్ధి. ప్రే. నించు, పూర్ణము
నింబతరువు. సం. మందారము†; వేము†.
నింబము. సం. వేము, వేఁపచెట్టు.
నికటము. నిర్బంధము. సం. సమీపము. విశ. సమీపమైనది.
నికము. నిక్కము.
నికరము విశ. త్రోపుడుపోఁగా మిగిలినది, సారభూతము. సం. సమూహము; నిధి; సారము. విశ. శ్రేష్ఠము.
నికర్షణము. సం. పట్టణాదులకు వెలుపల నుండెడి మైదానము; వాసయోగ్యమైన భూమి; దున్ననినేల.
నికష. సం. రాక్షసులతల్లి.
నికషము. సం ఒరగల్లు, బంగారము ఒరసెడి ఱాయి; సాన.
నికషాత్మజుఁడు సం నిరృతి.
నికామము. సం. క్రి. విశ. కోరినట్లు.
నికాయము. సం. లక్ష్యము;సమూహము, తెగ; గృహము; పరమాత్మ.
నికాయ్యము. సం. గృహము.
నికారణము. సం. కొల, వధము.
నికారము. సం. అపకారము; తిరస్కారము; ధాన్యమును తూర్పెత్తుట; బెదరించుట. [నము.
నికాశము సం. నిశ్చయము. విశ. సమా
నికుంచకము. సం. సోల.
నికుంజము. సం. పొదరిల్లు.
నికుంభము. సం. దంతి†.
నికుంభుఁడు. సం. కుంభకర్ణునికొడుకు.
నికురుంబము. సం. సమూహము.
నికృంతనము. సం. ఖండనము, నఱకుడు.
నికృతము. సం. విశ. దూఱఁబడినది; వంచింపఁబడినది; త్రోపుడు చేయఁబడినది.
నికృతి. సం. బెదరుమాట; వంచన; త్రోపుడు.
నికృత్తము. సం. విశ. నఱకఁబడినది.
నికృష్టము. సం. విశ. అధమము.
నికృష్టుఁడు. సం. విశ. హీనుఁడు.
నికేతనము. సం. గృహము.
నికేతము. సం. గృహము.
నికోచకము. సం. ఊడుగు†.
నిక్కచ్చి. నిర్బంధము; శ్రమము; సంకటము; సారము.
నిక్కపుజేగమేలు నేర్పుకాఁడు. బ్రహ్మ, సత్యలోకాధిపతి.
నిక్కము. నిర్ణయము; యాథార్థ్యము; సత్యము. విశ. సత్యమైనది; సార్థకము.
నిక్కల. కన్నది యనుభవమునకు తెచ్చెడు కల.
నిక్కవుడు. నిష్కాపట్యము.
నిక్కవొడుచు. అ. క్రి. నిక్కననిలుచు.
నిక్కాఁక. మిక్కిలికాఁక.

నిక్కు. ఉన్నతి; గర్వము; విలాసము
అ.క్రి. ఉన్నతమగు; గర్వించు; అతిశ
యించు; వర్ధిల్లు; దీర్ఘమగు.
నిక్కుఁబోతు. విశే. గర్వి.
నిక్కుడు. ఉన్నతి.
నిక్కువము. నిక్కము.
నిక్కువీనులజెక్కి } ఉచ్చైశ్శ్రవము;
నిక్కువీన్వావురము } ఇంద్రుని గుఱ్ఱము.
నిక్కువీనులజెక్కినెక్కురౌతు. ఇంద్రుఁడు
నిక్వణము } సం. వీణ మొదలగువాని
నిక్వాణము } మ్రోఁత, మ్రోఁత.
నిక్షేపము. సం. పాఁతిపెట్టినసొమ్ము, నిధి;
చెప్పి చూపియుంచిన యిల్లడ; ఉంచుట
నిక్షేపించు. సం. స.క్రి. పాఁతు, పూడ్చు;
ఉంచు.
నిఖా. హిం. దీర్ఘదృష్టితో విచారణచేయుట
నిఖాతము. సం. విశే. త్రవ్వఁబడినది.
నిఖిలము. సం. విశే. సమస్తము.
నిగడము. రూ. నిగళము
నిగణము. సం. హోమధూమము.
నిగదము. సం. స్పష్టముగా చెప్పుట.
నిగదించు. సం. స.క్రి. స్పష్టముగా చెప్పు.
నిగనిగ. మెఱయుటయందగు అనుకరణము;
కాంతివిశేషము.
నిగమము. సం. వేదము; అంగడివాడ;
మార్గము; పట్టణము.
నిగమాశ్వుఁడు. సం. శివుఁడు.
నిగముఁడు. సం. వణిజుఁడు, బేహారి.
నిగరణము. సం. మ్రింగుట; కంఠము.
నిగరము. పెల్లిక. విశే. శ్రేష్ఠము. సం.
మ్రింగుట. [సంకెల.
నిగళము, సం. ఏనుగుకాలి సంకెల;
నిగా. హిం. దృష్టి; విచారణ. రూ. నిఘా.
నిగాదము. సం. స్పష్టముగా చెప్పుట.
నిగారము. కాంతివిశేషము. విశే. శ్రేష్ఠము.
సం. మ్రింగుట, తినుట. [చోటు.
నిగాళము. సం. గుఱ్ఱపు మెడసమీపపు
నిగిడారు. అ. క్రి. వ్యాపించు.
నిగిరిక. హా విస్మయము ?
నిగుడు. అ. క్రి. వ్యాపించు; నిక్కు;
సాగు; పఱగు; విజృంభించు; బిగిర
పడు; కవియు; చక్కఁబడు; చిప్పిల్లు.

నిగుడుచు. ప్రే. నిగుడఁజేయు. రూ.
నిగుడ్చు.
నిగుడుపెంచు. అ. క్రి. నిక్కు.
నిగుఱు. నిప్పులమీఁది బూది.
నిగూఢము. సం. విశే. మఱుఁగుపుచ్చినది.
నిగూహనము. సం. మఱుఁగుపుచ్చుట.
నిగ్గడి. విశే. కఠినము.
నిగ్గు. ఉత్కృష్టకాంతి; వర్ణలేశము;
సారము. అ. క్రి. నిర్వహిల్లు. విశే.
త్రోపుడుపోఁగా మిగిలినది.
నిగ్రహము. సం. త్రోపాడుట; బెదరు
మాట; చెఱ; మేర; నిరోధించుట;
సంహరించుట.
నిగ్రహించు. సం. స. క్రి. త్రోపాడు.
నిఘంటువు. పదపదార్థములను తెలియఁ
జేసెడు గ్రంథము; వేదనిఘంటువు.
నిఘమ. చదరపువస్తువు.
నిఘనము. సం. భోజనము.
నిఘాతిక. సం. దాఁగలి. [ఁబడినది.
నిఘ్నము. సం. విశే. అధీనమయినది; గుణించ
నిఘ్నుఁడు. సం. విశే. అధీనుఁడు.
నిచయము. సం. గుమి, సమూహము.
నిచితము. సం. విశే. పఱవఁబడ్డది.
నిచులము. సం. ఎఱ్ఱగన్నేరు; కప్పడు
దుప్పటి. [దుప్పటి.
నిచోళము. సం. గవుసెన; కప్పడు
నిచ్చెన. నిశ్రేణి, పైకెక్కఁదగిన సాధనము
నిచ్చెనపంజా. దివిటీకమ్ములమర్చిన నిచ్చెన
వంటి సాధనము.
నిచ్చ, అవ్య. సదా; ప్రతిదినము.
నిచ్చయము నిశ్చయము.
నిచ్చలము. నిశ్చయము. విశే. నిశ్చలము;
నిర్దోషము; నిరంతరము.
నిచ్చలు. నిశ్చయము. అవ్య. సదా.
నిజము. సం. స్వభావము. విశే. తనది;
శాశ్వతమైనది.
నిజాయతీ. విశే. న్యాయమైన.
నిజేమరి విశే. సత్యశీలుఁడు.
నిజేము. సత్యవచనము; నిశ్చయము. విశే.
సత్యము, యథార్థము. [ప్రభువు.
నిజాం. నిజాము, ఒక మహమ్మదీయ
నిజోగి. మంత్రి.

నిటలము. సం. నుదురు.
నిటలాక్షుఁడు. సం. శివుఁడు.
నిటాలము. సం. రూ. నిటలము.
నిట్ట. ప్రవాహము; స్తంభము; స్థానము; నిక్కు; పార్శ్వము. విణ. నిక్కినది; సరియైనది.
నిట్టకనిలుచు. అ. క్రి. నిట్టనిలుచు.
నిట్టకనిలువు. సరినిలువు. రూ. నిట్టకనిల్వు.
నిట్టగ్రమ్ము. అ. క్రి. ఉప్పొంగు; రోమాంచితమగు; విజృంభించు.
నిట్టనిలుచు. అ. క్రి. సరిగా నిలుచు.
నిట్టనిలుచుండు. అ. క్రి. సరిగా నిలుచుండు
నిట్టపంట. నిష్కారణము.?
నిట్టరాడు. కపోతము, దూలములేనియింటి నడిమిపొడవు కంబము. [అధికము.
నిట్టలము. నిశ్చయము; నిలుకడ. విణ
నిట్టవొడుచు. అ. క్రి. ఉప్పొంగు; రోమాంచితమగు; విజృంభించు. [శుష్కము.
నిట్టు. ఉపవాసము; క్షామము. విణ.
నిట్టుపానము. శుష్కోపవాసము.
నిట్టూరుచు. అ. క్రి. నిట్టూర్పు విడుచు. రూ. నిట్టూర్చు. [నిట్టూర్పు.
నిట్టూరుపు. దీర్ఘనిశ్వాసము. రూ.
నిట్రం. నిలువు. రూ. నిట్రము.
నిట్రాడు. రూ. నిట్టరాడు.
నిట్రాయి. పొడువుఱాయి.
నిట్రించు. స. క్రి. నిలువుగానుంచు.
నిట్రిల్లు. అ. క్రి. ఉపవాసముండు.
నిట్రు. ఉపవాసము. విణ. శుష్కము. రూ. నిట్టు.
నిట్రుపానము. నిర్జలోపవాసము.
నిడికుడకలు. పిండివంటలలో భేదము.
నిడివి. దైర్ఘ్యము, ఆయామము. విణ దీర్ఘము.
నిడు. నిడుదశబ్దముయొక్క లుప్తరూపము
నిడుచేను. అ. క్రి. చాఁగు.
నిడుద. దైర్ఘ్యము. విణ. దీర్ఘము.
నిడుదవెన్ను } దీర్ఘపృష్ఠము, సర్పము,
నిడుపఁడు } పాము.
నిడుపకమ్ములు. ద్వారశాఖలు, కడపకు ఇరుప్రక్కలనుండు నిలువులు.
నిడుపడుపాన్పువేల్పుఁడు. విష్ణువు, శేషశాయి
నిడుపు. దైర్ఘ్యము; నిడివి. విణ. నిడివియైనది, దీర్ఘము.
నిడుముసై. తుంగ†.
నిడువాలు విణ. దీర్ఘము.
నిడువెండ్రుక. రోమాంచము. [మగు.
నిడువెండ్రుకపెట్టు. అ. క్రి. రోమాంచిత
నిడుసు. ఎడపెట్టు; చదువునప్పటి దీర్ఘాదుల ఉచ్చారణ ధ్వని.
నిడ్డ. దెబ్బ.
నితంబము. సం. పిఱుదు; స్త్రీయొక్క కటి వెనుక భాగము; మొల; కొండనడుము; మూఁపు; దరి. [స్త్రీ.
నితంబిని. సం. గొప్పపిఱుఁదులుగల స్త్రీ;
నితాంతము. సం. క్రి. విణ. అత్యంతము, పెల్లు, అతిశయము. విణ. అధికము.
నిత్తెమల్లె. మల్లికావిశేషము.
నిత్తెము. విణ. నిత్యము.
నిత్యనేమము. మి. నిత్యనియమము.
నిత్యపసి. మి. నిత్యమువచ్చు ప్రసాదము.
నిత్యపెండ్లికొడుకు. మి. ఎల్లప్పుడు పెండ్లికొడుకువలె నుండువాఁడు.
నిత్యము. సం. క్రి. విణ. ఎల్లప్పుడు. విణ. ఎడతెగనిది. [లంకారము.
నిదర్శనము. సం దృష్టాంతము; ఒక అర్థా
నిదాఘము. సం. గ్రీష్మఋతువు, వేసవి; వేఁడిమి; చెమట.
నిదానము. ఆత్రపడక విచారించుట. సం. ఆదికారణము; పెయ్యపలుపు; రోగనిర్ణయము.
నిదానించు. అ. క్రి. ఆత్రపడక విచారించు
నిదిగ్ధము. సం. విణ. పెంపఁబడినది.
నిదిగ్ధిక. సం. వాఁకుడు†.
నిదిధ్యాసనము. సం. ఆత్మచింతనము, ధ్యానము. రూ. నిదిధ్యాసము.
నిదుర. నిద్ర. [స్వభావము కలవాఁడు.
నిదురపోతు. విణ. నిద్రాళువు, నిద్రపోవు
నిదురపోవు } అ. క్రి. నిద్రించు.
నిదురించు }
నిదేశము. సం. చెప్పుట; దాపు; ఆజ్ఞ.
నిదేష్ట. సం. ఆజ్ఞాపించువాఁడు.

నిద్దము. విణ. స్నిగ్ధము, నునుపుగలది; స్నేహము కలది.
నిద్దా. నునుపుగలది.
నిద్దుర. నిద్ర.
నిద్దురపోతు. నిద్రాళువు. [తలు.
నిద్దురలేనట్టి పెద్దలు. అస్వప్నులు, దేవ
నిద్దురపోవు. అ.క్రి. నిద్రించు,
నిద్ర. సం. కూర్కు, నిద్దుర; తత్త్వాజ్ఞానము, స్వరూపాజ్ఞానము; మూఢవృత్తి ఏమియును తోఁపకుండుట.
నిద్రపోవు. మి.అ.క్రి. నిద్రించు [వాఁడు.
నిద్రాణుఁడు. సం. విణ. నిద్రించుచున్న
నిద్రాళువు(ఁడు). సం. విణ. నిదురపోతు.
నిద్రించు. సం. అ. క్రి. నిద్రపోవు.
నిద్రిలు(ల్లు). సం. అ. క్రి. నిద్రించు
నిధనము. సం. కులము; చావు; చేటు; నైధనతార. [దాఁచుకొన్న సొమ్ము
నిధానము. సం. ఉంచుట; పాతఱ;
నిధి. సం. పద్మాది [నవనిధులు — పద్మము, మహాపద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము (ఖర్వము) అనెడి అర్ధదేవతారూపములైన రత్న విశేషములు]; వేదపాఠము; ఆధారము; సముద్రము; పాతఱ; విష్ణువు
నిధీశుఁడు. సం. కుబేరుఁడు.
నిధువనము. సం. వడఁకు; రతి.
నిధ్యానము. సం. దర్శనము, చూపు.
నినంసా. నమింపనిచ్ఛ
నినదము } సం. ధ్వని, మ్రోత.
నినాదము }
నిన్. అవ్య. మఱియు, చార్థకము
నినుచు. ప్రే. నించు.
నినుపారు. అ. క్రి. పూర్ణమగు.
నినుపు. రూ. నింపు.
నిన్న. గతదినము, పూర్వదినము.
నిపఠము. సం. పాఠము, చదువు.
నిపతించు. సం. స. క్రి. నిపాతముచేయు.
నిపము. సం కుండ, కలశము.
నిపాఠము. సం. పాఠము, చదువు.
నిపాతనము. సం. పడఁద్రోయుట,
నిపాతము. సం. పడుట; (వ్యాకరణమునందు) సాధారణవిధికి సంబంధింపక విధింపఁబడిన శబ్దము; అవ్యయము.
నిపాతించు. సం. స.క్రి. పడఁద్రోయు.
నిపానము. సం. పసులు మొదలగునవి నీళ్లు త్రాగుటకై నూతివద్ద ఱాయి మొదలగు వానితో నేర్పఱచిన తొట్టి.
నిపుణుఁడు. సం. విణ. నేర్పరి.
నివ్వచ్చ–రము. నాశము; దారిద్ర్యము. విణ. శూన్యము; దీనము; బలహీనము.
నిప్పటి } అకులంగప్పి నిప్పులో వేసి
నిప్పట్టు } కాల్చెడు భక్ష్య విశేషము.
నిప్పస్తు. నిర్జలోపవాసము.
నిప్పు. అగ్ని. బ. అంగారములు.
నిప్పుదిండి. పక్షివిశేషము, చకోరము.
నిప్పుక. అగ్ని. బ. అంగారములు.
నిప్పులనుమ్రింగుపులుఁగు. నిప్పుదిండి.
నిప్పువన్నెగుత్తులకానుగు అంగారవల్లరి†.
నిబంధన. సం. గ్రంథము.
నిబంధనము. సం. ఏర్పాటు; కట్టు; హేతువు; వీణె శంతులు గట్టెడి బిరడ. విణ కూర్పఁబడ్డది మొ.
నిబంధము. సం. గ్రంథవృత్తి; మలమూత్రములు స్తంభించుట; బంధము; ఏటేటఁ గాని నెల నెలకుఁ గాని ఇచ్చునట్లంగీకరింపబడిన వేతనము మొ. [గించు.
నిబంధించు. సం. స.క్రి. బంధించు; అడ్డ
నిబద్ధి. విణ. నిజము, సత్యము.
నిబద్ధించు } స.క్రి. నిజపఱచు; రుజావు
నిబద్ధిలించు } చేయు. [అడ్డగింపఁబడినది
నిబద్ధము. సం. విణ. బంధింపఁబడినది;
నిబర్హణము. సం. చంపుట.
నిబర్హితము. సం. విణ. చంపఁబడినది.
నిబిడము. సం. విణ. దట్టమైనది.
నిబిడీకరించు. సం. అ. క్రి. దట్టముచేయు
నిబిడీకృతము. సం. విణ. నిబిడముగాఁ జేయఁబడినది.
నిబిరీసము. సం. విణ. దట్టమైనది.
నిబోధనము. సం. గ్రహించుట; బోధించుట.
నిబ్బద్ధి. విణ. సత్యము.
నిబ్బరము. అశ్వగతివిశేషము. క్రి. విణ. అతిశయము, పెల్లు. విణ. అధికము; నిశ్చలము.

నిబ్బరించు. అ. క్రి. అతిశయించు; నిదానించు.
నిబ్బరికము. కరుణ. [ఉపొంగు.
నిబ్బరికించు. అ. క్రి. కరుణించు;
నిభము. సం. సైపము. విణ. సమానము.
నిభాయించు హిం. స. క్రి. సహించు, తాళు
నిభృతము. సం. విణ. తీర్పఁబడినది.
నిమంత్రణము. సం. శ్రాద్ధ భోజనాదులయందు తగిన వారిని నియమించుట.
నిమంత్రించు. సం స. క్రి. నిమంత్రణము చేయు.
నిమంత్రితుఁడు. సం. విణ. నిమంత్రింపఁబడినవాఁడు. [లీనమగుట.
నిమజ్జనము. సం. మజ్జనము, మునుఁగుట;
నిమటాయి ఒకదినుసు తీఁగె. [మాఱకము.
నిమయము. సం. వినిమయము, వస్తువుల
నిమాజు. హిం. ప్రార్థన రూ. నమాజు.
నిమితకాఁడు. బరువుమోసెడి పనివాఁడు; యుద్ధమునకు నియోగింపఁబడినవాఁడు; మందుపట్టడవలన జీవించువాఁడు.
నిమితము. నియమనము; బరువుమోసెడి వృత్తి; యుద్ధమునకు నియోగింపఁబడుట మందుపట్టడవలన జీవించుట. [గుఱుతు.
నిమిత్తము. సం. హేతువు; శకునము; గుఱి;
నిమిషము. సం కనుఱెప్ప వాల్చుట; ఱెప్ప వేయునంత కాలము.
నిమీలనము. సం. కన్నుమూయుట; చావు
నిముకళా. కైలుచేసిన కళ్ళమునందలి యడుగుధాన్యము; కొఱత.
నిముడు. స. క్రి. పాలు కుడుచు.
నిమురు. స. క్రి తిగియు, ఆకర్షించు; తడవు, ప్రేమతో శరీరమునుస్పృశించు, వాత్సల్యముతో రాచు; ఆవరించు.
నిమునము. నిమిషము; నిమేషము.
నిమే. నేమము, సగము.
నిమేషము. సం నిమిషము.
నిమ్నగ. సం. నది. [నీచము; పల్లము.
నిమ్నము. సం. క్రింద. విణ. లోఁతైనది;
నిమ్మ. జంబీరము†.
నిమ్మళము. విణ. నిశ్చింతము; స్వస్థము; నిష్కళంకము; శాంతము.
నిమ్మళి. శాంతము ?. [మగు; శాంతించు.
నిమ్మళించు. అ. క్రి. నిశ్చింతమగు; స్వస్థ
నియంత. సం. రథసారథి. విణ. నియమించువాఁడు; నడపువాఁడు.
నియంతవ్యుఁడు. సం. విణ. అడ్డగింపఁదగినవాఁడు; ఆజ్ఞాపింపఁదగినవాఁడు.
నియంత్రణ సం అడ్డగింత. [నది.
నియంత్రితము స. విణ. అడ్డగింపఁబడి
నియతము. సం. విణ. నియమముగలది; నిత్యమైనది; నిగ్రహింపఁబడినది.
నియతి. సం. నియమము; భాగ్యము.
నియమనము. సం. నియమించుట.
నియమము. సం. ఏర్పాటు; నిశ్చలబుద్ధి; కట్టు; పసుపు; ప్రతిజ్ఞ; శరీరముకంటె భిన్నములైన మృజ్జలాదులు సాధముగాఁగలిగి నిత్యముగా నాచరింపఁదగిన ఒక యోగాంగము. (దశనియమములు— తపము, సంతోషము, ఆస్తిక్యము, దానము, భగవదర్చన, సిద్ధాంతవాక్య శ్రవణము, లజ్జ మతి, జపము, హోమము (వ్రతము). పంచనియమములు—శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము. పక్షాంతరము—కోపములేమి, గురుసేవ, శౌచము, మితాహారము, అప్రమత్తత.)
నియమించు. సం. స. క్రి ఆజ్ఞాపించు.
నియమితము సం. విణ. నియమింపఁబడినది; కట్టఁబడినది. [దగినది.
నియమ్యము సం. విణ. నియమింపఁ
నియాతనము. సం. పడఁద్రోయుట.
నియామకుఁడు. సం. ఆరకాటి; తండేలు. విణ నియమించువాఁడు.
నియామము సం. నియమము. [వాఁడు.
నియుక్తుఁడు. సం. విణ. నియోగింపఁబడిన
నియుతము. సం. లక్ష.
నియుద్ధము. జెట్టీలపోట్లాట, బాహుయుద్ధము. [దగినది.
నియోక్తవ్యము. సం. విణ. నియోగింపఁ
నియోగము. సం. ఆజ్ఞ; నియమించుట.
నియోగి. సం. విణ. నియోగముగలవాఁడు; నియోగి; రాజకీయ కార్య నియుక్తుఁడు.

నియోగించు. సం. స. క్రి. ఆజ్ఞాపించు.
నియోగ్యుఁడు. సం. విణ. ప్రభువు.
నియోజనము. సం. పనుపు, ఆజ్ఞ.
నియోజ్యుఁడు. సం. పనివాఁడు; భృత్యుఁడు
నియోద్ధ. సం. విణ. బాహుయుద్ధము చేయువాఁడు.
నియోగి. మంత్రి; ఒక తెగ బ్రాహ్మణుఁడు
నిరంకుశము. సం. విణ. అడ్డములేనిది; నివారింపరానిది.
నిరంజన. సం. పున్నమ.
నిరంజనము. సం యజ్ఞమునకుఁదగిన చిత్రవర్ణహరిణము. విణ. కాటుకలేనిది; లోపములేనిది; అజ్ఞానములేనిది; బ్రహ్మము.
నిరంజనుఁడు. సం. శివుఁడు.
నిరంతరము సం. విణ దట్టము; ఎడతెగనిది; ఎడములేనిది; తఱచు.
నిరకు హిం. నిర్ణయముచేసిన వెల [వాఁడు.
నిరక్షరకుక్షి. సం. పొట్టలో అక్షరములేని
నిరతము. సం. విణ. మిక్కిలి ఆసక్తిగలది.
నిరతి. సం. మిక్కిలి ఆసక్తి.
నిరత్యయము. సం. విణ. నాశములేనిది.
నిరపరాధుఁడు. సం. విణ. అపరాధములేనివాఁడు
నిరపాయము. సం. విణ. అపాయములేనిది.
నిరపేక్షము. సం. విణ. అపేక్షలేనిది; దేనిపైనను ఆధారపడనిది, ఆత్మ, బ్రహ్మము.
నిరయము. సం దుర్గతి, నరకము.
నిరర్గళము. సం విణ అడ్డములేనిది.
నిరర్థకము. సం. విణ వ్యర్థమైనది.
నిరవగ్రహుఁడు. సం విణ. అడ్డుపాటులేనివాఁడు, స్వతంత్రుఁడు.
నిరవధికము సం విణ. మేరలేనిది.
నిరసనము. సం. తిరస్కారము; కాదనుట; ఆక్షేపము; వధము; ఉమియుట.
నిరసించు సం. స. క్రి. తిరస్కరించు; విడుచు; చంపు; ఉమియు.
నిరస్తము. సం. విణ. త్వరితము గాఁ జెప్పబడినది (మాట); తిరస్కరింపఁబడినది; విడిచిపెట్టఁబడ్డది; వెడలఁగ్రక్కఁబడినది; ప్రయోగింపబడినది (బాణము); నిరాకృతము.

నిరాకరణము. సం. తిరస్కారము.
నిరాకరిష్ణువు. సం. విణ. తిరస్కరించువాఁడు. [శము; వాయువు; బ్రహ్మము.
నిరాకారము. సం. తిరస్కారము; ఆకా
నిరాకారుఁడు. సం. విష్ణువు; శివుఁడు; పరమాత్మ. విణ. ఆకారములేనివాఁడు.
నిరాకృతము. సం. విణ. న్యాయముచే త్రోయఁబడినది,
నిరాకృతి. సం. తిరస్కారము. విణ. రూపములేనివాఁడు; వేదము చదువనివాఁడు. [బడ్డవాఁడు.
నిరాకృతుఁడు. సం. విణ. తిరస్కరింపఁ
నిరాఘాటము. సం. విణ. కొలఁదలేనిది; మేరలేనిది. [వ్యాధిలేనిది.
నిరాతంకము. సం. విణ. భయములేనిది;
నిరాపనింద. మి. గ్రా. అపదూఱు
నిరాబారి. ముని [రోగములేనిది
నిరామయము సం. రోగములేమి. విణ.
నిరాయాసము సం. విణ. ఆయాసములేనిది.
నిరాయుధము. సం. విణ ఆయుధములేనిది.
నిరాలంబము. సం. బ్రహ్మము; ఒక ఉపనిషత్తు. విణ. అవలంబములేనిది.
నిరాశము. సం. విణ. ఆశలేనిది.
నిరాసకము. సం. విణ. నిరసించునది.
నిరాసనము. సం. నిరసనము.
నిరాహారము. సం. విణ. ఆహారములేనిది.
నిరీక్షణము. సం. చూపు.
నిరీక్షించు. సం. స. క్రి. చూచు
నిరీక్షితము. సం. విణ. చూడఁబడినది.
నిరిషము. సం. గొడగ, కఱ్ఱు ఏడికోల లేని నాఁగలి.
నిరు. అవ్య. గతార్థకము; అభావార్థకము.
నిరుకడము. ఒకానొక చెట్టు.
నిరుకళము. విణ. నిరర్గళము.
నిరుకు. నిరకు; నిశ్చయము.
నిరుక్తము. సం. ఒక వేదాంగము, వేదనిఘంటువు విణ. చెప్పఁబడినది.
నిరుక్తి. సం. అర్థనిర్వచనము; అలంకారవిశేషము.
నిరుడిమావియావు. సృష్టి.
నిరుడు. గత సంవత్సరము. [వాఁడు.
నిరుద్యోగి. సం. విణ. ఉద్యోగము లేని

పాఁతఱికము ఎఱుక.
పాఁతు. పూడుపు, నిఖననము; భూమి మొదలగు వానిలోపల దిగినట్టిపర్వతము మొదలగువాని అధోభాగము. స. క్రి. పూడుచు
పాఁపడేగము. నాగలోకము.
పాఁపజన్నిగట్టు వినాయకుఁడు, నాగయజ్ఞోపవీతి.
పాఁపతూపు. నాగాస్త్రము.
పాఁపతొడవులవేలుపు. శివుఁడు, ఉరగభూషణుఁడు.
పాఁపమీను. ఒకజాతి ఆఁకుచేఁప, శృంగి.
పాఁపమేపరి } పన్నగాశనుఁడు,
పాఁపమేపుడు } గరుత్మంతుఁడు; నెమిలి.
పాఁపర. గోతుంబి†.
పాఁపరమ్ము. నాగాస్త్రము.
పాఁపఱేఁడు. శేషుఁడు, సర్పరాజు.
పాక. దూలములుంచక కట్టినయిల్లు.
పాకనాడు. దేశవిశేషము.
పాకపుటి. సం. కుమ్మరావము.
పాకము. సం. పంట; వంట; నర; పిల్ల. (త్రివిధపాకములు - ద్రాక్షాపాకము, నారికేళపాకము, కదళీపాకము.)
పాకలము. సం. చెంగల్వకోష్టు†; గుజ్జము; గజమునకుఁ గలుగు పిత్తజ్వరము.
పాకశాసని. సం. ఇంద్రుని కొడుకు, జయంతుఁడు.
పాకశాసనుఁడు. సం. ఇంద్రుఁడు.
పాకాన్నము. సం. పాకెన.
పాకారి. సం. ఇంద్రుఁడు.
పాకి. మఱుఁగుపెరటి కుప్పయెత్తెడువాఁడు. రూ. పాకీ.
పాకు. పాఁగు, పాకము.
పాకుఁడు. సం. శిశువు; ఒక అసురుఁడు.
పాకెన } పెండ్లియందు మూఁడవనాటి
పాకెన్న } బువ్వము.
పాక్యము. సం అట్టుప్పు; యవక్షారము.
పాక్షికము. సం. విణ. పక్షమునఁగలిగినది.
పాఁగ. ఉష్ణీషము, తలకట్టు; అశ్వశాల. బ. పావకోళ్లు.
పాఁగడము. పాదములందు ఒంకెలుగాఁ జేసియుంచెడి భూషణము.

పాఁగా. తలపాఁగ, తలను చుట్టుకొనునది; అశ్వశాల; అశ్వసమూహము. బ. పావకోళ్లు. [గుడపాకము.
పాఁగు. బెల్లము కాఁచఁగానగుద్రవత్వము,
పాచకుఁడు సం. వంటవాఁడు; అగ్ని.
పాచనము. సం. ప్రాయశ్చిత్తము; పులుసు; చింతపండు. విణ. పక్వము. చేయునది.
పాచని. సం. కరక†.
పాచిక. జూదమాడెడి అడ్డసాళ్లు; దాసి. సం. వంటలక్క. [చేయఁబడినది.
పాచితము. ప్రాయశ్చిత్తము. సం. పక్వము
పాచేనము. రూ. పాసనము.
పాచు. ప్రేతోలఁగించు; చిక్కడఁగించు.
పాచ్చా. పాదుషా. [సొంటి.
పాట. సంగీతము; పదము; విధము; అగలు
పాటకము. స్ఫోటకము. సం. పట్టాకత్తి; వాద్యము; నద్యాదితీరము; అక్షాదిచాలనము; సేనానివేశము; పాఁగడము.
పాటకచ్చేరి. గానసభ.
పాటకత్తె. గాయిక.
పాటకాఁడు. గాయకుఁడు. [వాఁడు.
పాటకుఁడు. స్తుతిపాఠకుఁడు; వంది, బట్టు
పాటచ్చరుఁడు. సం. దొంగ. [ఆదరణము.
పాటన. అలంకారము; సంస్కారము;
పాటనము. సం. చీల్చుట.
పాటపాట. విణ. కొంచెము కొంచెము.
పాటపొలము. చిఱువేరుపైరయ్యెడు నేల.
పాటబండి. రథవిశేషము, గాడీ.
పాటము. కెంపుల నాణెము చూచుటకు తగిన యెండ.
పాటల. సం. కలిగొట్టు†.
పాటలము. సం. కలిగొట్టుపువ్వు; ఎఱ్ఱవన్నె తెలుపుమించిన యెఱుపు, గులాబివన్నె విణ. తెలుపుమించిన యెఱుపుగలది.
పాటలి. సం. మొక్కపుఁజెట్టు; కలిగొట్టుచెట్టు. [శక్తత; తీక్ష్ణత.
పాటవము. సం. ఆరోగ్యము; నైపుణ్యము
పాటి. సామ్యము; ప్రమాణము. విణ. సమానము; సామాన్యము; న్యాయము; కొలఁదిది.
పాటించు. స. క్రి. ఆదరించు; విచారించు; ప్రతీక్షించు; ధరించు; పొందు,

పాటిగొను. స. క్రి. సరిచేయు.
పాటితము. సం. విణ. చీల్చఁబడినది.
పాటినేల. ఊరు ఎత్తుపడిపోయి పాడుబడ్డ నేల.
పాటిరేవు. దిగినడచిదాఁటిపోఁదగిన రేవు
పాటిలు (ల్లు) అ. క్రి. కలుగు.
పాటీనము. కొఱ్ఱ, పాఠీనము.
పాటీరము. సం. చందనము; వెదురుచేవ; జల్లెడ; వరిమడి; మబ్బు; ముల్లఁగి†.
పాటీలు. బ. స్త్రీహస్తభూషావిశేషము.
పాటు. పడుట; శ్రమము; ఆపద; సముద్ర జలోల్బణ శమనము; కష్టము; విధము.
పాటునఁబడు. అ. క్రి. యథాస్థితికివచ్చు.
పాటుపడు. అ. క్రి. శ్రమపడు.
పాటుమానిసి. పాటుపడు మనుష్యుఁడు.
పాట్లని. విణ. దుష్టుఁడు.
పాట్లమారి. విణ. మిక్కిలి శ్రమపడు స్వభావము గలవాఁడు.
పాఠ. సం. చిఱుబొద్ది†. [వాఁడు.
పాఠకుఁడు. సం. వేదపాఠము చదువు
పాఠము. సం. చదువు; వేద పాఠ ము, బ్రహ్మయజ్ఞము; అధ్యాపనము.
పాఠశాల. సం. బాలురు చదువుచోటు.
పాఠి. సం. చిత్రమూలము†; పాఠకుఁడు.
పాఠీనము. సం. కొఱ్ఱ, వేయికోఱలచేఁప.
పాఠ్యము. సం. విణ. పఠింపఁదగినది.
పాడగము. స్త్రీపాద భూషావిశేషము.
పాడఱు. అ. క్రి. పాడుపడు. [శాల.
పాడలి. గోడకు క్రిందుగా నిర్మించిన చిన్న
పాడి. ధర్మము; వ్యవహారము; న్యాయము; స్వభావము; సదృశము.
పాడు. పాటినేల; పల్లె. అ. క్రి. పాట పాడు. విణ. శూన్యము.
పాడునుయ్యి. కసవు మొదలగువానిచేఁ గప్పఁబడిన ముఖభాగముగల కూపము, అంధకూపము.
పాడుమాట. అశుభవాక్కు, దుశతి.
పాడువడు } అ. క్రి. శూన్యమగు.
పాడువాఱు }
పాడె. శవవాహనము.
పాడెగట్టు. దుష్టుఁడు.
పాడ్యమి. పక్షమందు మొదటితిథి.

పాణసి. మాల.
పాణి. ముత్తెపుసీరు. సం. మనికట్టు మొదలుకొని వ్రేళ్లతోఁగూడిన చేయి.
పాణింధమము. సం. కొలిమితిత్తి; చీఁకటి; వాద్యవిశేషము.
పాణిక. సం. తెడ్డు.
పాణిగృహీతి. సం. అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము, యజ్ఞాధికారముగలభార్య
పాణిగ్రహణము. సం. పెండ్లి.
పాణిముఁడు. సం. చేతులతో తాళము వేయువాఁడు.
పాణిపీడనము. సం. పెండ్లి.
పాణివదము. అమ్ములపొది.
పాణివాదనము. కరతాళము వేయుట.
పాణివాదుఁడు. సం. పాణిఘుఁడు.
పాణౌకృతి. సం. పెండ్లి.
పాత. సం. విణ. కాచువాఁడు.
పాతకము. సం. పాపము; మహాపాపము; (ఇవి అయిదు-స్వర్ణస్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నీగమనము, ఇవిచేయువారితోడిసహవాసము.)
పాతనము పడవేయుట.
పాతము. సం పతనము; పాటు; రాహువు. విణ. కావఁబడినది.
పాతరకత్తె. ఆటకత్తె.
పాతరలాడు. అ. క్రి. నర్తించు, ఆటాడు.
పాతరలు. బ. ఆటకత్తె; ఆట.
పాతరి. ఆటకత్తె.
పాతాళము. సం. క్రిందిలోకము; బడబాగ్ని.
పాతిక. ఒకటిలో నాలుగవభాగము. రూ. పాతిక.
పాతివ్రత్యము. సం. పతివ్రతాత్వము.
పాతుకుఁడు. సం. విణ. పడునట్టి స్వభావముగలవాఁడు.
పాత్ర. సం. నాట్యమాడేస్త్రీ.
పాత్రము. సం. రెండు దరుల నడుము; భుకుంసాది; మంత్రి; యోగ్యము; యోగ్యుఁడు; యోగ్యరాలు; స్రువాదిః గిన్నె
పాత్రలాడు. అ. క్రి. రూ. పాతరలాడు.
పాథస్సు. సం. జలము; అన్నము.
పాథేయము. సం. అన్నము బియ్యము మొదలగు దారిబత్తెము.

పాదోధి. సం. సముద్రము.
పాదోనిధి. సం. సముద్రము.
పాదక. సం. పాతిక.
పాదకటకము. సం. అందె.
పాదకి. అప్ర. దాసి.
పాదగ్రహణము. సం. అభివాదనము.
పాదచారి. సం. కాలిబంటు. విణ. నడచి పోవువాఁడు.
పాదజుఁడు. సం. శూద్రుఁడు.
పాదట్టు. ఇండ్లలోపలి వాసములకు పట్టెలకు పట్టెడుబూజు.
పాదత్రాణము. సం. పైజారు.
పాదప. సం. పావకోళ్లు.
పాదపట్టము. సం. కాలిదుందె. [పీఁట.
పాదపము. సం చెట్టు; కాళ్లుంచుకొనెడు
పాదబంధనము. సం. ఊలుఁద్రాడు; పసుల కాళ్లకుఁ గట్టెడి త్రాడు.
పాదము. సం. అడుగు; కాలు; కిరణము; చెట్టువేరు; పద్యమునందలియొకచరణము; పాతిక, నాలవపాలు; కొండతటితిప్ప.
పాదరసము. పారదము, రసము.
పాదటి. విణ. అధముఁడు.
పాదలి. ఓరపాక. విణ. అధముఁడు.
పాదశాఖలు. సం. బ. కాలివ్రేళ్లు
పాదసరము. సం. గజ్జెగొలుసు.
పాదస్ఫోటము. సం. కాళ్లు పగుళ్లుపాఱెడు వ్యాధివిశేషము. [రము.
పాదాంగదము. సం. అందె; బిరుదుపెండె
పాదాంద్రపురుగు. సాలెపురుగు
పాదాగ్రము. సం. మీఁగాలు.
పాదాతము. సం. పదాతుల సమూహము.
పాదాతికుఁడు. సం. పదాతి, కాలిబంటు.
పాది. ఏఱువాఁడెడి యొకానొక సాధన విశేషము; పాదివేఁట.
పాదిక. సం. పాతిక; చిన్నకంబము.?
పాదిగువ్వ. పాదివేఁట కుపయుక్తమయిన పెంపుడుపిట్ట.
పాదిరి(లి). కలిగొట్టు†.
పాదివేఁట. కర్కర కొఁజా కౌజుకోడి పూరేడు మొదలగు పెంపుడుపిట్టలను పైకి విడిచి పిట్టలను పట్టెడు ఒకానొక వేఁట.



పాదు. ఆలవాలము, చెట్టుమొదలగువానికి నీళ్లుపోయుటకై క్రింద కుదురుగాఁజేసిన పల్లము; క్రిందు; నిలుకడ.
పాదుక–లు. సం. పావకోళ్లు.
పాదుకము. సం. ముచ్చె.
పాదుకొను. అ. క్రి. నెలకొను; నిలుచు. ప్రే. పాదుకొలుపు. [పాదునిలుపు.
పాదునిలుచు. అ. క్రి. పాదుకొను ప్రే.
పాదువు. సం. పావకోళ్లు; చెప్పులు.
పాదుషహా
పాదుషా–హా } రాజు, ప్రభువు
పాదుషాహు
పాదుసా. రాజు.
పాదుసాహి. రాజు.
పాదూకృత్తు. సం. మాదిగవాఁడు.
పాదూవాహుఁడు సం. పావకోళ్లు(లేక) చెప్పులు తెచ్చువాఁడు.
పాదొట్టు. పాదట్టు, బూజు.
పాదొట్టుపురుగు. సాలెపురుగు.
పాద్యము. సం. విణ. పాదముకొఱకైన ఉదకము.
పానకము. బెల్లము మొదలగువానినికలిపి యేలకులపొడి మొదలైనవిచేర్చి చేసెడి పానీయము. సం. ఫలరసాదులు చేర్చి చేసెడు పానీయము, మరబతు.
పానగోష్ఠిక. సం. పదిమంది చేరి మద్యపానము చేయుట; అనేకులు చేరి మద్యపానము చేసెడిచోటు.
పానము. పానవట్టము సం. ప్రాణము, నిట్టూర్పు; త్రాగుడు; త్రాగునుగిన్నె; కాపు, రక్షణము; త్రాగెడి జలము మద్యము మొ.
పానలు. బ. సందేహము.
పానవట్టము. లింగపీఠము.
పాననము. వంటయిల్లు.
పానసీఁడు. వంటలవాఁడు.
పానారము. పండుపోఁక.
పానీయము. సం. జలము. విణ. త్రాఁగఁదగినది; కావదఁగినది.
పానీయశాలిక. సం. చలిపందిలి. [పాన్పు.
పానుపు. మంచము; పఱపు, శయ్య. రూ.

పాప. బిడ్డ; శిశువు; తారక, కంటి నల్లగ్రుడ్డులోని ప్రతిఫలనము.
పాపఁడు. బాలుఁడు; బిడ్డఁడు.
పాపచేలి. సం. అగలుసొంటి†.
పాపట. సీమంతము, కేశవీథి; వృక్షవిశేషము
పాపటగుజ్జెలు. బ. పాపటపద్దకు పండ్లవలె నుండునవి. [అ సెడి భూషణము.
పాపటచేఱు. పాపటబొట్టు. బ. బిందీలు
పాపటనొగలు. బ. పాపటపద్దకు వేసి కాడిఁ కిగట్టినవి.
పాపటపద్ద. పయిరుమీఁద దున్ను సాధనమునకు వేసెడి అడ్డకఱ్ఱ.
పాపటపలుగులు. బ. పాపటగుజ్జులకు నేల గీచుక పోవునట్టు వేయునవి.
పాపటపొన్నులు. బ. పాపటగుజ్జులకు వేయు పొన్నులు.
పాపటబొట్టు లలాటిక, పాపటకు సరిగా నుదుట వ్రేలెడు చేఱుచుక్క.
పాపటము. గుంటక, పైరుమీఁద గాదము పోవదున్నెడు సాధనము.
పాపటవుచ్చు. ౙ్రే. దారివిడిచితొలఁగించు
పాపటవోవు. అ. క్రి. దారివిడిచి తొలఁగు.
పాపనము. గుంటక.
పాపము. సం. దుష్కృతము, విణ దుష్కృతముగలది.
పాపరిండ్లు. బ. పాములకిరవులు.
పాపలగనుతావు. ఉపస్థ.
పాపాత్ముఁడు. సం. పాపచిత్తుఁడు.
పాపాలముద్ద. పాపాత్ముడు.
పాపి. సం. విణ. పాపముగలవాఁడు.
పాపిష్ఠి. సం. మిక్కిలి పాపాత్మురాలు.
పాపిష్ఠుఁడు. సం. విణ. మిక్కిలిపాపి.
పాపు. ౙ్రే. పోఁగొట్టు, పాయఁజేయు; దున్ను. [అధముఁడు.
పాపుఁడు. సం. విణ. పాపి; హింసకుఁడు;
పాపోసు. ముచ్చె.
పాప్మ—ము. సం. పాపము.
పామ—ము. సం. గజ్జి.
పామనుఁడు. సం. విణ. గజ్జిగలవాఁడు.
పామరుఁడు. సం. విణ. తెలియనివాఁడు; నీచుఁడు.

పాము. సర్పము. స. క్రి. రుద్దు, రాచు.
పాముదొండ. చేఁతిదొండ†.
పాముమేఁత. వాయువు.
పాములనారిగాఁడు. పక్షివిశేషము.
పాములబిడారు. పుట్ట.
పాములమేఁత. వాయువు. [శనుఁడు.
పాములమేఁతరి. గరుత్మంతుఁడు, పన్నగా
పాములవాఁడు. పాములనుబట్టియాడించి జీవించువాఁడు, వ్యాళగ్రాహి, అహితుండికుఁడు.
పాములవేఁటకాఁడు. గరుత్మంతుఁడు.
పాయ. చీలిక; ఒకనదిలోనుండి చీలి పాతినది; ఖండము; చర్మము పెండలగువాని ఖండము; మునుము; ముస్మ.
పాయఁబాఱు. అ. క్రి. అన్నము పెం॥ పాయు
పాయకట్టు. ఒకముఖ్యగ్రామముతోఁ జేరిన యుపగ్రామముల సమూహము, జనపదము. [త్యము లేని రైతు.
పాయకారి. భాగప్రకారము భూస్వాతం
పాయకుఁడు. కాల్బలము; కాల్బలమునకధిపతి.
పాయఖానా. హిం మఱుగుదొడ్డి.
పాయగిలు (ల్లు). అ క్రి. తొలఁగు.
పాయగొమ్మ. పంగలకొమ్మ.
పాయపోసు. ముచ్చె. [కాలము.
పాయము. ఈడు; యౌవనము; జీవిత
పాయవట్టము. కాలియందె.
పాయవడు. అ. క్రి. చీలు; తొలఁగు; దారివిడిచి తొలఁగు; వెలివడు.
పాయవాఱు. అ. క్రి. తొలఁగు.
పాయసము. సం. పాసెము, పరమాన్నము; దేవదారుబంకతోఁ జేసినభూపద్రవ్యము
పాయి. పాలు. సం. త్రాగుఁబోతు.
పాయికుఁడు. సం. కాలిబంటు.
పాయిఖానా. పాయఖానా.
పాయు. అ. క్రి. తొలఁగు; చిక్కడలు; పక్వపదార్థము కాలాతిక్రమణముచే మెత్తబడి చెడు. స. క్రి. విడుచు.
పాయువు. సం. ముడ్డి, గుదస్థానము.
పాయ్యము. సం. పరిమాణము, త్రాసు పెం॥ జలము; త్రాగుట. విణ. నిందింపదగినది.

పారంగతుఁడు. సం. విణ. ఉత్తీర్ణుఁడు, గట్టెక్కినవాఁడు, కృతార్థుఁడు.
పారంపరి. సం. పారంపర్యము.
పారంపర్యము. సం. పుత్రశిష్యపరంపర. విణ. పరంపరనుండి వచ్చినది.
పారగుఁడు. సం. విణ. పారంగతుఁడు.
పారడ. రూ. పాలడ.
పారణము. సం. ఉపవసించిన మఱువాడు విహితకాలమునచేయు భోజనము.
పారతంత్ర్యము. సం. పరాధీనత, ఒకరికి లోఁబడియుండుట. [మైనది.
పారత్రికము. సం. విణ. పరలోకసంబంధ
పారదము. సం. పాదరసము. రూ. పారతము
పారదారికుఁడు. సం. పరదారరతుఁడు, వ్యభిచారి. [వ్యభిచారము.
పారదార్యము. సం. పరదారగమనము,
పారదేశికుఁడు. సం. విణ. అన్యదేశస్థుఁడు, దారి నడచువాఁడు.
పారమార్థికుఁడు. సం. విణ. పరమార్థబుద్ధి గలవాఁడు; ముముక్షుఁడు.
పారము. మల్లబంధవిశేషము. సం. ఆవలిదరి; సమీపము; అంతము. [మైనది.
పారలౌకికము. సం. విణ. పరలోకసంబంధ
పారవములు. బ. పావురములు.
పారవశ్యము. సం. పరవశత, పరాధీనత.
పారశవుఁడు. సం. పరస్త్రీయందుఁ బుట్టినవాఁడు; నిషాదుఁడు.
పారశీకము. సం. 56 దేశములలో నొకటి; ఆ దేశమునందు బుట్టిన గుఱ్ఱము.
పారశ్వధికుఁడు. సం. గండగొడ్డలి యాయుధముగాఁ గలవాఁడు. రూ. పారశ్వధుఁడు.
పారసి. పారసీక దేశపు భాష. విణ. పారసీక దేశమునందు గలిగినది.
పారస్త్రైణేయుఁడు సం. పరస్త్రీయందుఁ బుట్టినవాఁడు.
పారా. హిం. కావలి. రూ. పహరా.
పారాణి. పాదములకుఁ జేయు కుంకుమాద్యలంకారము.
పారాణించు. స. క్రి. కుంకుమము మెందలగు వానితోఁ బాదముల నలంకరించు.
పారాయణము. సం. ఆవలితీరము జేరుట; సంపూర్ణముగా వేదాదుల అధ్యయనము చేయుట; మొత్తము. [తుమికి†.
పారావతము. సం. పావురము; కోఁతి
పారావతాంఘ్రి. సం. మాలెరు.†
పారావారము. సం. ఈవలావలిదరులు; సముద్రము. [సంన్యాసి.
పారాశరి. వేదవ్యాసుఁడు; శుకుఁడు;
పారాశర్యుఁడు. సం. వ్యాసుఁడు రూ. పారాశరుఁడు.
పారి. తడవ; మన్ను. సం. గిండి; ఏనుఁగుకాలి గొలుసు; మల్లచిప్ప; నీరుప్రబ్బలి†; పాలుపిదుకుపాత్రము.
పారిక. దానురాలు.
పారికాంక్షి సం. ముని; కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతశీలుఁడు.
పారికాఁపు. పరిచరుఁడు. [నుండుగోడ.
పారిగోడ ప్రహరిగోడ, ఆవరణముచుట్టు
పారిజాతము. సం. ఒక దేవతావృక్షము; కల్పవృక్షము. బ. ధాన్యవిశేషము.
పారిణి. సం. పచ్చయిరుగుడు†.
పారితథ్య. సం. జడబిల్ల; సిగపువ్వు.
పారితోషికము. సం. పసదనము, బహుమానము.
పారిప్లవము. సం. విణ. చలించునది.
పారిభద్రము. సం. దేవదారువు†; పరశము†; వేము†; పారిజాతము; బాడిద†.
పారిభావ్యము. సం. చెంగల్వకోష్టు†.
పారియాత్రకము. సం. ఒకానొకకొండ.
పారివాఁడు. పరిచరుఁడు.
పారివేఁట. పాదివేఁట. [సభ్యుడు.
పారిషదుఁడు. సం. శివానుచరుఁడు;
పారిషద్యుఁడు. సం. సభాయోగ్యుఁడు.
పారిహారికుఁడు. సం. విణ. పరిహారము చేయువాఁడు. [మగుట.
పారిహార్యము. సం. సూడిగము; పరిహార
పారీంద్రము. సం. పెనుబాము; సింహము.
పారీఖత్తు హిం. విభాగపత్రము.
పారీణుఁడు. సం. విణ. పారంగతుఁడు.
పారు. అ. క్రి. పరుగెత్తు; పాచవముచేయు; పక్షుల గతివిశేషము.
పారుకాడు. అ. క్రి. పరుగెత్తు.

పారుడు పాచేనము, ద్రవపులవిసర్జనము.
పారుపత్తెకాఁడు. విణ. అధికారి; పారుపత్తెముగలవాఁడు.
పారుపత్తెము. దొరతనమువారికీయవలసిన ధనమును ప్రజలవలన రాఁబట్టెడి యధికారము; అధికారము.
పారువ. జాడ.
పారువచూచు. స. క్రి. చక్కఁగాఁజూచు.
పారువము } పావురము.
పారువాయ }
పారుష్యము. సం. కాఠిన్యము; పరుసఁదనపుమాట. [ఈడ†.
పారేవతము. సం. ఒకదినుసు ఎఱ్ఱకిత్తలి†;
పార్తెంచు. అ. క్రి. రూ. పాఱుతెంచు.
పార్థక్యము. సం. పృథగ్భావము, వేర్పాటు.
పార్థివ. సం. ఒక సంవత్సరము.
పార్థివము. సం. శరీరము; భూమివికారము
పార్థివుఁడు. సం. రాజు. [త్తువు.
పార్థుఁడు. సం. అర్జునుఁడు; రాజు; మఱము
పార్పత్తెము. పారుపత్తెము.
పార్పొతు. భీరువు, పంద.
పార్వణము. సం. మృగవిశేషము. విణ. పర్వకాలమున విధింపఁబడిన శ్రాద్ధాది కర్మ.
పార్వతి. సం. హైమవతి; గౌరి; ద్రౌపది; ఒక గోపిక; అందుగు†; పాలకూర†
పార్వతీనందనుఁడు. సం. కుమారస్వామి.
పార్వతేయము. సం. ప్రాద్దుతిరుగుడు† విణ. పర్వతమునందు పుట్టినది.
పార్వము. పావురము.
పార్శ్వము. సం. గృహ గ్రామాదిసమీప ప్రదేశము; ప్రక్క; ప్రక్కయెముకలు.
పార్షదుఁడు. సం. శివానుచరుఁడు, సభ్యుఁడు.
పార్ష్ణి. సం. కాలిమడమ; దండువెనుక; వెనుక; పిచ్చిది; గెలుపఁదలఁపు.
పార్ష్ణిగ్రాహుఁడు. సం. దండెత్తిపోవు రాజునకు వెనుకదిక్కున నుండు శత్రువు.
పార్ష్ణిత. సం. మచ్చె. [చుండెడి సేన.
పార్ష్ణిత్రము. సం. వెంటనుండి రక్షించు

పార్సి. పారసీభాష. [త్రము.
పాఱ. త్రవ్వనట్టి యొకసాధనము, ఖని
పాఱఁజూచు. స. క్రి. దృష్టినిగిడ్చిచూచు.
పాఱఁదోలు. స. క్రి. తఱుము.
పాఱఁబోఁతు. పాఱఁబోయుట.
పాఱఁబోయు. స. క్రి. కుమ్మరించు.
పాఱనాడు. అ. క్రి. పోనాడు.
పాఱమ్ము } పాఱయొక్క వాదరవంటి వాదరగల బాణము.
పాఱవాతమ్ము }
పాఱవాతియమ్ము }
పాఱవేయు. } స. క్రి. విసరివేయు; వదలవిడుచు.
పాఱవైచు }
పాఱాడు. అ. క్రి. పాఱు.
పాఱిపోవుట. పలాయనము.
పాఱు. అ. క్రి. ధావనమొనర్చు, పరుగెత్తు; ప్రవహించు; ప్రసరించు.
పాఱుఁడు. బ్రాహ్మణుఁడు.
పాఱుఁబోతు. విణ. పిఱికి.
పాఱుటక్క. బ్రాహ్మణస్త్రీ.
పాఱుటసురర. మి. బ్రహ్మరాక్షసుఁడు.
పాఱుటాకులు. బ. మునులు మెడలగు వారు వస్త్రమునకు మాఱుగా కట్టుకొనెడు యొకదినుసు ఆకులు.
పాఱుడు. ప్రవాహము; పాఱుట.
పాఱుత. బ్రాహ్మణి. [హించు.
పాఱుతెంచు. అ. క్రి. పరుగెత్తివచ్చు; ప్రవ
పాఱునీరు. ప్రవాహోదకము.
పాఱుపోఁగు. దూరదూరముగా పోయు నూలిపోఁగు.
పాఱుపోతు పిఱికివాఁడు.
పాఱులకెకిమీఁడు. బహ్మ.
పాఱువాఁడు. బ్రాహ్మణుఁడు.
పాఱువేఁట. దేవోత్సవవిశేషము.
పాల. చామము, ఒకపిట్ట; క్షీరిక†. విణ. శ్వేతము; పాటలము.
పాలంకి ఒకకూర†.
పాలంక్య. సం. కుందురుష్కము†.
పాలంక్యము. సం. పాలంకికూర†.
పాలకడల్లుఁడు. విష్ణువు.
పాలకడలి. క్షీరాబ్ధి,
పాలకడలివెన్న. చంద్రుఁడు.

పాలకన్ను. ధాన్యవిశేషము.
పాలకాయ. భక్ష్యవిశేషము.
పాలకి (కీ). పల్లకి, పల్యంకిక, శిబిక.
పాలకిబొంగురిక్క (చుక్క). మఘా నక్ష
త్రము.
పాలకుఁడు సం. విణ. పరిపాలించువాఁడు.
పాలకుప్ప. పయోరాశి. క్షీరోదము.
పాలకూర. జీవంతి, మధుస్రవ†
పాలకొడిస. శ్వేతకుటజము†.
పాలకొయ్య. యూపము, యజ్ఞమునందు
పశు బంధనార్థమై నాటిన పైపట్టలేని
కొయ్య. [నము
పాలగచ్చు. సన్న సున్నపుపూఁత, లేప
పాలగరువు. మీఁద ఇసుకగల జాతిపాలు
నేల (రేగడి నేల).
పాలగార. పాలగచ్చు.
పాలగుంజె. యూపము.
పాలగుమ్మ. పాలపిట్ట.
పాలగుమ్ముడు. క్షీరవిదారి†.
పాలగొలిమిడి పయస్విని†.
పాలగోకుఁడు. గోఁకి యెత్తిన పాలకుండ
లోని యడుగంటు.
పాలఘ్నము. సం. గుడ్డికామంచి†.
పాలచేఁప. ఒకదినుసు తెల్లచేఁప.
పాలచేరులు. బ. గజసరము.
పాలచోఱ సముద్రమునుండి మనుష్యు
లను భక్షించెడి తెల్లని చోఱ మీను.
పాలటేఁకు. గృహద్రుమము. [శంఖము.
పాలడ. బిడ్డలకు పాలుపోసెడు చిన్న
పాలతుత్తము. ఒక అంగడి మందుదినుసు,
ఖర్పరి.
పాలతేఁకు గృహద్రుమము†.
పాలతో తలయంటు. పాలతోఁ తలయంటి
బాసచేయు, ప్రమాణము చేయు.
పాలనము. సం. రక్షణము, పరిపాలించుట
పాలపండ్లు. బ. పుట్టుదంతములు.
పాలపాప. పాలుత్రాగెడు శిశువు, స్తనప.
పాలపాపఁడు, స్తనపుఁడు.
పాలపిట్ట. కికీదివి, చాషము.
పాలపూస. తెల్లని గాజుపూస.
పాలబుగ్గలు. బ. పాలంటిన బుగ్గలు.
పాలబుడుత. పాలపాపఁడు.
పాలబుద్ధులు. పాలుత్రాగునాటి బుద్ధులు;
చిన్నతనపు బుద్ధి.
పాలమన్ను. ధవళమృత్తిక, సుద్ద.
పాలమీఁగడలు. బ. ధాన్యవిశేషము.
పాలము. సం. కొయ్యపడిగము; మడ్డు.
పాలమున్నీఁటి కూఁతురు. లక్ష్మి, క్షీర
సముద్రరాజతనయ. [పతి.
పాలమున్నీటియల్లుఁడు. విష్ణువు, శ్రియః
పాలమున్నీరు. క్షీరసముద్రము.
పాలలోఁబడినబల్లి. ఒక న్యాయము. (పాల
లోఁబడిన బల్లి యటునిటుకొట్టుకలాడు
చుండును )
పాలవంటి కులము. నిర్మలమైన వంశము.
పాలవంటి వయసు. అచ్ఛమైన యౌవన
ముతో నున్న వయస్సు.
పాలవన్నె. పయ్య, పాటలవర్ణము.
పాలవాఁగు. క్షీరాబ్ధి.
పాలవిఱుగుఁడు. విఱిగినపాలు, క్షీరవికృతి
పాలవెల్లి } క్షీరాబ్ధి.
పాలసంద్రము }
పాలసత్రాళ్లు. బ. గుఱ్ఱముకాళ్ళకట్టుత్రాళ్లు
పాలసుఁడు. రాక్షసుఁడు, పలాశి. విణ.
మూర్ఖుఁడు; దుర్జనుఁడు.
పాలసున్నము. పాలగచ్చు. [దుష్టురాలు.
పాలసురాలు. రక్కసి; మూర్ఖురాలు;
పాలాడు. స. క్రి ఖండించు.
పాలానుగు. దుగ్ధతుంబి†. [పాలార్చు.
పాలారుచు. స. క్రి. ఉపేక్షించు. రూ.
పాలావు. పయస్విని, మిగుల పాలిచ్చెడి
యావు. [పచ్చనిది.
పాలాశము. సం. ఆకుపచ్చన. విణ. ఆకు
పాలాసత్రాళ్లు. రూ పాలసత్రాళ్లు.
పాలించు. స క్రి. కాపాడు.
పాలిండ్లు. బ. పయోధరములు, స్త్రీస్తన
ములు. రూ. పాలిండులు.
పాలిక. సం. అంకురారోపణ సంస్కార
యోగ్యమైన (నవ ధాన్యములు నాఱు
పోసెడు) శరావవిశేషము; పాలకురాలు
పాలికాఁపు. విణ. భాగస్థుఁడు, ధణిక్రింద
పండించిన పంటలో పాలుపుచ్చుకొను
వాఁడు.

పాలిమేట్టము. పాలివాఁడు.
పాలితము. సం. పెద్దయేఁతు†. విణ. రక్షింపఁబడినది. [వాఁడు.
పాలితుఁడు. సం. విణ. పెంచుకొనఁబడిన
పాలిని. సం. నల్లతెగడ†. విణ. పాలించునది.
పాలివాఁడు. జ్ఞాతి; పాలేరువాఁడు. విణ. భాగస్థుఁడు.
పాలియ. పాలిక, శరావవిశేషము.
పాలు. భాగము; వంతు; పంటలో రైతువంతు వచ్చినభాగము; వశము; పక్షము; విషయము; సమీపము; గవాదులక్షీరము; జెముడు మఱ్ఱి మొదలగు చెట్లయందుఁ గలిగెడు తెల్లనిరసము. అ.క్రి. తెల్లబాఱు.
పాలుగొను. స. క్రి. పంచుకొను. రూ. పాల్గొను.
పాలుడు. పాండురోగము.
పాలునీరును వెలిఁజేయుపక్కి. హంస.
పాలుపడు. అ.క్రి. పూనుకొను; స్వాధీనమగు
పాలుపుచ్చు. ప్రే. విభాగించు; నిర్ణయించు
పాలుపుచ్చుట. భాగాహారము.
పాలుపోవు. అ.క్రి. విభక్తమగు; నిర్ణీతమగు.
పాలుబాన. ఉభయరాసిరైన అంబారములో కాఁపువానికి చేరవలసిన వర్తన ధాన్యము. [శకుంటితి.
పాలుమాలిక. ప్రాలుమాలిక, బద్ధకము
పాలుమాలు. అ.క్రి. రూ. ప్రాలుమాలు.
పాలుపెట్టు. స క్రి. భాగించు; నిర్ణయించు
పాలెగాఁడు. చిన్నజమీన్‌దారుఁడు.
పాలెము. గొల్లపల్లె; ప్రధానగ్రామసమీపమందుండెడి చిన్నపల్లె.
పాలెలు. బ. బిల్లల మొలత్రాటియందలి వెండిబంగారముల బిల్లలు.
పాలేరు. మేఁడిపాలికి దున్నెడు మడఁక; పాలేరువాఁడు. [మడకవాఁడు.
పాలేరువాఁడు. విణ. మేఁడిపాలికిదున్నెడు
పాలేఱు, క్షీరనది; క్షీరాబ్ధి.
పాల్కడలి. రూ. పాలకడలి.
పాల్కడలికాన్పు. కామధేనువు.
పాల్కడలిపట్టి. చంద్రుఁడు.
పాల్గొను. స. క్రి. రూ. పాలుగొను.
పాల్పడు. అ.క్రి. పాలుపడు; అభిముఖముగా సిద్ధమగు.
పాల్మాలిక. రూ. పాలుమాలిక.
పాల్మాలు. అ. క్రి. రూ. పాలుమాలు.
పావంచె. మెట్టు, సోపానము. రూ. పావంచా.
పావకము. సం. చిత్రమూలము†; జీడి†; నెల్లి†.
పావకుఁడు. సం అగ్నిహోత్రుఁడు; సూర్యుఁడు; మంచినడవడికలవాఁడు. విణ. పవిత్రము చేయువాఁడు.
పావకోళ్లు. బ. కొయ్యతో చేసిన పాదరక్షలు, పాదుకలు.
పావటీలు. బ. మెట్లు.
పావడ. స్త్రీలు మొలకుఁ గట్టుకొనెడు వస్త్రవిశేషము; ధౌతవస్త్రము; వస్త్రము.
పావడము. కానుక.
పావనము. సం. సాంతపనాదివ్రతము; జలము; గోమయము; రుద్రాక్షము; అందుగుబంకతోఁజేసిన ధూపద్రవ్యము; పచ్చగుంటగలిజేరు†. విణ. పవిత్రము; పవిత్రముచేయునది.
పావని. సం. ఆవు; గంగ; తులసి†; భీముఁడు; హనుమంతుఁడు. విణ. పవిత్రురాలు; పవిత్రముచేయుస్త్రీ.
పావనుఁడు. సం. పవిత్రుఁడు; పవిత్రము చేయువాఁడు.
పావలి. చిన్నజాతిగోళికూరాకు, విచిల్లిక†
పావలు. బ. పావకోళ్లు.
పావళము. పక్షిభేదము.
పావాడము. రూ. పవాడము.
పావాలు. బ. రూ. పాగాలు.
పావి. పాపి.
పావిలి. పావలి†. [నాలుగవ వంతు.
పావు. పాదము, నాలవభాగము; వరాలో
పావుకోళ్లు. వా. బ. అడిగట్టులు.
పావుపావులు. మల్లవిద్యాభేదము.
పావురపుఁబలుకు. కూకీపలుకు.
పావురము. పావురాయి, పారావతము.
పావురాపలుకు. కూకీపలుకు.
పావురాయి. పావురము.

పావురాలు. బ. పావురములు.
పావులా. పాదరూప్యకము, రూపాయిలో నాల్గవభాగము. [నాల్గవభాగము.
పావుసేరు. ఆఱు తులములు; సేరులో
పాశకము. సం. పాచిక.
పాశము. సం. త్రాడు; కేశ శబ్దపర్యాయము లకు పరమైనచో వానిసమూహము; కర్ణ శబ్దపూర్వకమైనప్పుడు సుకర్ణము; ఛత్ర పూర్వకమైనప్పుడు సత్సితచ్ఛత్రము.
పాశి. సం. వరుణుఁడు; యముఁడు; వ్యాధుఁడు. విశ. పాశధరుడు.
పాశుపతము. సం. విశ. పశుపతి యధిదైవతము గాఁగల అస్త్రము పావిస్సు మొ॥; పశుపతిమతము; ఒక పుష్పము.
ఒక దర్శనము.
పాశుపతుఁడు సం. విశ. శైవుడు.
పాశుపాల్యము. సం. గవాశ్వాదిరక్షణవృత్తి
పాశ్చాత్యుఁడు. సం. విశ. పడమటివాఁడు; వెనుకటివాఁడు; వెనుకఁబుట్టినవాఁడు.
పాశ్య. సం. పాశముల సమూహము, త్రాళ్ళు
పాషండము. సం. ఒక మతము.
పాషండి. సం. } వేదబాహ్యుఁడు. రూ.
పాషండుఁడు } పాఖండుఁడు, పాఖండి.
పాషాణదారకుఁడు. సం. కాసీఁడు, ఱాయి తొలుచు పనివాఁడు. [యులి.
పాషాణదారణము. సం. టంకము, కాసె
పాషాణము. సం. ఱాయి.
పాసంగు } శాలిధాన్యవిశేషము.
పాసఁగు }
పాసనము. విరేచనములగుట.
పాసిక. రూ. పాచిక.
పాసియము } పాయసము, క్షీరాన్నము.
పాసెము }
పాళ. పోఁకమొదలగువానికప్పుడుతోఁడి పూగుత్తి, కుహాళి.
పాళము. విధము; సమయము; బంగారు మొదలగువాని కడ్డి; కొలఁది.
పాళా. బంగారు మొదలగువాని కడ్డి.
పాళి. పాళె; సారెలపోఁత; కలముచివర నుండు వ్రాతసాధనము. సం. అంచు; గుఱుతు; చోటు; వరుస; చెవితమ్మె; కొండసె త్తము; మీసములుంగల ఆఁడుది; పేను; తొడ; ? ప్రదేశము ?
పాళియ. పాళె.
పాళియము. పాళెము.
పాళీ. కలముపాళీ; పాళె. బ. జూదము.
పాళె. జూదమాడెడు పలక.
పాళెంబుదిగు. అ. క్రి. దండు విడియు.
పాళెగాఁడు. పాళెముపట్టుదొర.
పాళెము. కావలి; పాళెగానిపట్టణము; చిన్నపట్టణము; దండు; దండువిడియు చోటు. [విడిసిన స్థలము.
పాళెముపట్టు. పాళెగానిరాజ్యము; దండు

## పి

పింగ. సం. పార్వతి; గోరోజనము; ఇంగువ; కాఁడ.
పింగము. సం. కురువేరు; గోరోజనపు వన్నె; ఆ వన్నెగలది.
పింగలి. విశ. వెనుకటిది; వెనుకటివాఁడు
పింగలించు. అతిశయపుమాటలాడు.
పింగళ. సం. దక్షిణపుదిక్కునందలి ఆఁడేనుఁగు; ఒక నాడి; మైఁడికంటి; ఒక వేశ్య; ఒక సంవత్సరము.
పింగళము. సం. కోఁతి; ఒక పాము; ముంగిస; ఒక నిధి, గోరోజనమువంటివన్నె. విశ. ఆ వన్నెగలది.
పింగళి. ఒక వన్నెగల కోడిపుంజు.
పింగళుఁడు. సం సూర్యునిప్రక్కనుండు వారిలో నొకఁడు; అగ్ని; శివుఁడు.
పింగాణి. ఒకదినుసు తెల్ల మట్టిపాత్రము.
పించియము } నెమిలిపురి.
పించెము. }
పించెము. మదము, గర్వము.
పించు. కఱోటి విశేషము.
పించుమన్నిగొను. స. క్రి. చంపు.
పించను. ఇం. చిరకాలము పని చేసినందుకై యిచ్చు మనవర్తి.
పించము. సం. నెమిలిపురి; శ్రీకృష్ణుని శిరోభూషణము.
పింజ. సం. హింస; దూది; పసుపు.

పింజనము. సం. దూదేకు విల్లు.
పింజము. సం. బలము; హింస. విణ. కలఁత చాఁటినది.
పింజరము. సం. బంగారు; బోను; రక్త పింజర; అస్థిపంజరము; హరిదళము; ఎఱుపు మించిన పసుపువన్నె. విణ. ఆ వన్నెగలది.
పింజలము. సం. దర్భ; హరిదళము; పసుపువన్నె; మిక్కిలి కలఁతపాఱిన సేన
పింజించు. స. క్రి. పింజెపోయు; నీళ్లు చిలుకరిలఁజిమ్ము.
పింజిక. సం. నూలిచుట్ట.
పింజూషము. సం. గులిమి.
పింజె. కచ్ఛభేదము; ముందు చెక్కుకొనెడి వస్త్రపుకుచ్చె; వెనుకఁ జెక్కుకొనుదోవతికొంగు; కుచ్చిళ్లు.
పింజె. దూదేకువిల్లు; బాణపుంఖము.
పింజెకొండ. పింజ.
పింజెనగ్రోవి. చిన్నసగ్రోవి. [తుచ్ఛురాలు
పింజారి. దూదేకువాఁడు; తుచ్ఛుఁడు;
పింఠ. సం. విటజన సమాశ్రయము.?
పిండపుష్పము. సం. తామరపూవు; అశోకపుఁబువ్వు; దాసనపుఁబువ్వు; నంది వర్ధనపుఁబువ్వు; మెట్లనూయి.?
పిండము. సం. బదుకుఁదెరువు; ఇనుము; పితృదేవతలకిచ్చెడిఅన్నపుముద్ద; శరీరము శరీరమునందు ఏకదేశము; గృహమునందు ఏకదేశము; చెండు; గజకుంభము; బోళము, బలము; దట్టము; చిల్లమడ్డి; దాసనపుఁబువ్వు; కవళము; ముద్ద; కడుపులోని పిండము; సమూహము.
పిండలి. ముద్ద.
పిండాభ్రము. సం. వానతూర.
పిండాలువు. సం. చారకంద†.
పిండి. పిష్టము, పొడి. సం. సమూహము; మంగ†; సార†; పిండము; పిండఖర్జూరము
పిండిక. సం. బంటికంటి నడిమితూము; పిక్కయందలిమాంసము; వేదిక, దేవతా విగ్రహాదులను ప్రతిష్ఠించెడి పీఠస్థానము.
పిండికూడు. సంకటి.
పిండికూర. ఒకదినుసుకూరాకు†.
పిండికొండ. కొండపిండి†.
పిండితము సం. అందుగుబంకతోఁజేసిన ధూపద్రవ్యము. విణ. దట్టము; గుణింపఁబడినది; ఎంచఁబడినది; చేర్పఁబడినది.
పిండిదొండ తుర్యతుండి†.
పిండివీచు. మర్దనము.?
పిండిపోఁకలు. బ. గుడపిండములు.
పిండిబండ-దుబ్బు పాషాణభేది†.
పిండిమిరియము. పలుచగా వండిన వ్యంజనవిశేషము.
పిండిలము. వంతెన.
పిండివంట. పిష్టకము. (అప్పము మొదలగు అపూపము, చక్కిలము మొదలగు భక్ష్యము
పిండివడియము. పిండితోఁజేసినవడియము
పిండివించు. అ. క్రి. పొడిపొడిగాఁజేయు.
పిండీకృతము. సం. విణ. ముద్దగాఁజేయఁబడినది.
పిండీతకము. సం. మంగ†; మరువము†.
పిండు. గుంపు. స. క్రి. పాలుపితుకు; రసముపిడుచు సం. చెండు.
పిండుకొను, పిండుగట్టు } అ. క్రి. గుంపుగూడు.
పిందియ, పిందె } రత్నాలపోఁగులు మొదలగు వానియందు జవచుట్టు నేర్పఱచెడు తదవయవవిశేషము; నవ శలాటువు, కాయయగుటకు ముందటిది.
పింపిణీ. స్త్రీల వేణీవిశేషము.
పింపిసలాడు. అ. క్రి. పింపిళ్లుగూయు.
పింపిసలు. బ. పింపిళ్లు.
పింపిళులు. బ. పెదవిమీఁదుగా నొక విధమైన ధ్వనికలిగించుచు నర్తించెడి బాలికాక్రీడా విశేషము.
పింపిళ్లాడు. అ. క్రి. నర్తించు.
పింపిళ్లు. బ. ఉత్సాహము; నతివిశేషము; గంతులు; పింపిళులు.
పింపిళ్లుగూయు. అ. క్రి. బాలకులు బాలికలును పెదవిమీఁదుగానొక విధమైన ధ్వని కలిగించుచు నర్తించు; నర్తించు.
పికపికలు. బ. విణ. చెల్లాచెదరు.
పికము. సం. కోయిల.
పికవర్ధనము. సం. కాకి.

పికిలి. పక్షివిశేషము.
పికిలిపువ్వు. పికిలిపిట్టతోఁక క్రింది ఱెక్క
పిక్క. జంఘ; స్పృక్క, ఒకానొక చెట్టు
పిక్కటిలు(ల్లు). అ. క్రి. నిండు; అతిశయించు; వ్యాపించు; పిగులు; వర్ధిల్లు.
పిక్కారు. దాళువా పంట.
పిక్కిలి. పికిలిపిట్ట.
పిక్కు. కపటము, వంచన; మర్మము; క్రొత్తబట్ట మడతలో నున్న తక్కువ చెంగు. అ. క్రి. వెతుదీయు. స. క్రి. దగాచేయు, వంచించు.
పిక్కుమెకము. వంచకము, నక్క.
పిగిలి. పిగిలిపిట్ట. [ముందుండు కుచ్చు.
పిగిలికుచ్చు. పిగిలిపిట్టయొక్క పృష్ఠభాగ
పిగిలిపిట్ట. పిగిలి. [బిగువుచే చినుఁగు.
పిగులు. అ. క్రి. వస్త్రము మొదలగునవి
పిచండము. సం. కడుపు; పశువు. [వాఁడు
పిచండిలుఁడు. సం. విణ. పెద్దకడుపు
పిచిండము సం. కడుపు; పశువు-అవయవము.
పిచిండిలుఁడు. సం. బొజ్జగలవాఁడు.
పిచుమందము / పిచుమర్దము } సం. వేము, వేఁపచెట్టు.
పిచులము. సం. నీరుకాకి; గన్నేరు†; పక్కె†; దూది. [ఒక రాక్షసుఁడు.
పిచువు. సం. దూది; కుష్ఠభేదము; మాడ;
పిచ్చటము. సం. సత్తు; తగరము; సీసము; కంటితెవులు.
పిచ్చి. ఉన్మాదము, వెఱ్ఱి.
పిచ్చిక. ఊరబిచ్చిక, చటకము.
పిచ్చికకుంటు. / పిచ్చికుంటు. } అనూరుఁడు. విణ. పంగువు, కాళ్లులేనివాఁడు
పిచ్చిలు / పిచ్చిల్లు } అ. క్రి. చిప్పిలు, ఉప్పొంగు.
పిచ్చివాఁడు. విణ. ఉన్మత్తుఁడు, వెఱ్ఱివాఁడు
పిచ్చె. పిచ్చు, చింతవిత్తు.
పిచ్చె. ఉన్మాదము విణ. హీనము.
పిచ్చెపట్టు. ఉద్ధత్వము.
పిచ్చెపెసలు. బ. ఒకదినుసు పెసలు.
పిచ్చెలించు. అ. క్రి. అతిశయించు; భయపడు. స. క్రి. ప్రశంసించు.

పిచ్చె. చింతవిత్తు; జంతువులకడుపులోని పిత్తకోశము.
పిచ్చెక. పిచ్చిక, చటకము.
పిచ్చెకకాలు. తృణవిశేషము, పర్పాటము.
పిచ్చెకకుంటు. / పిచ్చెకుంటు. } రూ. పిచ్చికకుంటు.
పిచ్చెకకోళ్ళు. బ. ధాన్యవిశేషము.
పిచ్చెగుంట. కుంటి, ఖంజుఁడు.
పిచ్చెగుంటివాఁడు. బ. కమ్మవారిని అడిగికొని జీవించువాఁడు.
పిచ్ఛ. సం. అరఁటి; ఒఱ; గుఱ్ఱపుకాలి పుండు; గుంపు; పోఁక; పాముయొక్క జోల్లు; బూజుగుబంక; వరుస; గంజి మీఁదిమీఁగడ.
పిచ్ఛందకము. సం. రాజగృహరచన.
పిచ్ఛము. సం. నెమలిపురి; సిగ; తోఁక.
పిచ్ఛిల. సం. ఇరుగుడు†; బూరుగు†.
పిచ్ఛిలము. సం. విణ; రసవంతమైనది; పేరినది; మీఁగడకట్టినది.
పిటకము. సం. చిన్నపెట్టె; చిన్నగంప; చెముటపొక్కు; కురుపు.
పిటము. సం. గంప.
పిట్ట. పులుఁగు, పక్షి.
పిట్టపిడుగు. క్రి. విణ. అనివార్యము.
పిట్టబాణములు. బాణసంచులోనిభేదము.
పిట్టు. వాసెనమీఁదఉడుకఁబెట్టినపిండి.
పిఠరము. సం. కవ్వపుకోల; ముస్తె†; వంటకుండ.
పిఠరి. సం. కుండ, [చరము.
పిడక. వా. పిడుక, ఏరుపిడక; ఒక జల
పిడకమొసలి. శిశుమారము.
పిడచే. వా. పిడుచ.
పిడచేపాఁత. అలంకుఁజుట్టు.
పిడత. వా. పిడుత.
పిడప. పిడిచినబట్ట. [అఁడుమృగము.
పిడి. పిడికిలి, ముష్టి; త్సరువు, కత్తిపిడి;
పిడికట్టు / పిడికిటికట్టు } వింటినడుము.
పిడికిలి. గుప్పిలి, ముడువఁబడిన వ్రేళ్లుగల అఱచేయి, ముష్టి.
పిడికిలించు. స. క్రి. పిడికిటఁబట్టు.

పిడికిలింత. నతి. [గల తండులాదికము.
పిడికెఁడు. గుప్పెఁడు, ముష్టిపరిమాణము
పిడికోల. నాఁగేలు మొదలగువాని మేఁడి.
పిడిగంట. నిడుపు పిడిగలగంట.
పిడిగుద్దులు. బ. బాలక్రీడా విశేషము; పిడికిటిపోట్లు, ముష్టిఘాతములు.
పిడిగొట్టు. స. క్రి. ఎద్దువట్టలుగొట్టు.
పిడిమూర. ముడువఁబడిన వ్రేళ్ళుగల మూర, రత్ని.
పిడియము. బాఁకు.
పిడియేనుఁగు. ఆఁడేనుగు, హస్తిని.
పిడివాటు పనకట్టలను చేతికొలఁది ఏత్తి గింజలు రాలఁగొట్టుట; ఒడంబడిక.
పిడివాదము. మూర్ఖవాదము.
పిడివేయు. అ.క్రి.కత్తులకు పిడితయారుచేసి అమర్చు; పనులకతిలో చేయిడి త్రిప్పు
పిడిసాన. ఆస్ఫోటని, వడ్లవాఁడు కొయ్యలకుఁగాని ఔాళ్లపనివాఁడు రత్నముల కుఁగాని రంధ్రములు వేసెడిసాధనము.
పిడుఁజో } పసువుల దేహమందు చేరి రక్త
పిడుఁదు } ముపీల్చెడు ఒక పురుగు;
పిడుక. పిసికి పిడుచగాచేసి తట్టి ఎండఁబెట్టిన పేఁడ, కరీషము.
పిడుకమొసలి. శిశుమార భేదము.
పిడుగు. అశని.
పిడుగుకైదువు. వజ్రాయుధము. [శము.
పిడుచ. అన్నము మొదలగువానిముద్ద,కబ
పిడుచపోఁత. అలుకుచుట్టు, అలుకుగుడ్డ.
పిడుచు.స.క్రి.రసము మొద.వానిని పిండు.
పిడుత. మిక్కిలిచిన్నకుండ. [పఁజేయు.
పిడువరించు. అ. క్రి పిడుగువలె శోషిం
పిడెము. పిడియము, బాఁకు.
పిడ్గు. పిడుగు.
పిణ్యాకము. సం. తెలికపిండి; ఇంగువ; చిల్లమడ్డి; కుంకుమపువ్వు.
పిత. సం. తండ్రి. (తండ్రులైదుగురు-కన్న వాఁడు, వడుగుచేసినవాఁడు, చదువు చెప్పినవాఁడు, అన్నముపెట్టినవాఁడు, వెఱపుదీర్చికాపాడినవాఁడు.)
పితర. తండ్రి.
పితరదొర. యముఁడు, పితృపతి.
పితరుఁడు. తండ్రి. బ. మృతిపొందిన పితృవర్గమువారు, పితృదేవతలు.
పితరులచుక్క. మఘానక్షత్రము.
పితరులదణి } యముఁడు, పితృపతి.
పితరులఱేఁడు }
పితరులు. బ. పితాళ్లు.
పితలబుట్టించినదొర. బ్రహ్మ.
పితలాటము. మోసము రూ.పితలాటకము.
పితామహి. సం. తండ్రితల్లి, నాయనమ్మ.
పితామహుఁడు. సం.తండ్రితండ్రి;బ్రహ్మ.
పితాళ్లు. బ. పితరులు.
పితుకు. స. క్రి. పాలుపిండు. [కుట్ర.
పితూరి హిం.రాజద్రోహము;కలహము;
పితృతిథి. సం. అమావాస్య.
పితృపతి. సం. యముఁడు.
పితృప్రసువు. సం. సాయంసంధ్య.
పితృయజ్ఞము. సం. పితృతర్పణము.
పితృవనము. సం. స్మశానము.
పితృవ్యుఁడు. సం. పినతండ్రి; పెదతండ్రి.
పిత్తము. సం. ధాతువిశేషము, పైత్యము.
పిత్తడి. ఇత్తడి.
పిత్తల. సం. నీరుపిప్పలి.†
పిత్తలము. ఇత్తడి. విణ. పిచ్చగలది.
పిత్తు. అపానవాయువు. అ. క్రి. అపాన వాయువు విడుచు.
పిత్ర్యము. సం. విణ. తండ్రినుండిలభించి నది;పితృసంబంధి(తీర్థము, శ్రాద్ధము మొ)
పిత్సంతము. సం. పక్షి. విణ. పడఁగోరు చున్నది. [టిది; తక్కువ, నీచము.
పిదప. తరువాత, వెనుక. విణ. వెనుక
పిదపిద. విణ. అనుకు; మృదువు.
పిదపిదన. అనుకుఁదనము; మృదుత్వము; విణ. అనుకు; మృదువు.
పిదుకు. స. క్రి. పితుకు. [కప్పుట.
పిధానము. సం. తిరోధానము, మఱుఁగు;
పిన. విణ. పిన్న.
పినగుమ్మడు. ఱేఁకు†. [వ్యుఁడు.
పినతండ్రి. తండ్రితమ్ముడు, (కనిష్ఠ) పితృ
పినతల్లి. తల్లిచెల్లెలు, (కనిష్ఠ) మాతృష్వస
పినద్ధము. సం.విణ.కట్టఁబడినది(వస్త్రము); తొడుగబడినది. (కవచము.)

పినాకము. సం. శివునివిల్లు; త్రిశూలము.
పినాకి. సం. శివుఁడు.
పినాకిని. సం. ఒకనది; ఒకవీణె.
పినుఁగు. పీనుఁగు. విణ. లుబ్ధుఁడు.
పిన్న. బాలుఁడు. విణ. చిన్న.
పిన్నకక్కెర. కృకణపక్షి.
పిన్నగోరఁట. సహా†.
పిన్నగ్రద్ద. ఆతాయి.
పిన్నజెమ్మి. నేలజమ్మి, శమీరము†.
పిన్నటనవ్వు. చిఱునవ్వు.
పిన్నటనాడు. పిన్ననాడు.
పిన్నతనము. బాల్యము.
పిన్నతుముకి. కాకితుముకి†.
పిన్నది. చిన్నది.
పిన్నదూలగోవెల. కందూర†.
పిన్ననాడు. బాల్యదశ.
పిన్ననుదురు. ఏనుఁగునోసటిబుడిపి.
పిన్ననెల్లి. క్షుద్రాగ్నిమంథము†.
పిన్ననెరేడు. కాకినేరేడు†.
పిన్నపాప. కన్యక.
పిన్నపాఁపర. గోతుంబ†.
పిన్నపాల. చిఱుపాల, క్షీరావి†.
పిన్నములక. నేలములక, కంటకారిక†.
పిన్నముల్లంగి. క్షుద్రమూలకము†.
పిన్నమ్మ. తల్లిచెల్లెలు.
పిన్నయిప్ప. మధూళిక, గౌరీవాసము†.
పిన్నయేలకి. ఉపకుంచిక.
పిన్నయ్య. పినతండ్రి.
పిన్నఱికము. పిన్నతనము.
పిన్నవరగోఁగు. కమలవల్లభ†.
పిన్నవాఁడు. బాలుఁడు.
పిన్ని. పిన్నమ్మ.
పిపాస. సం. నీరుద్రావనిచ్ఛ, దప్పి.
పిపాసితుఁడు, పిపాసువు } సం. విణ. దప్పిగొన్నవాఁడు.
పిపీలకము. సం. చీమ.
పిపీలిక. సం. ఆఁడుచీమ.
పిప్పల. సం. పిప్పలి†.
పిప్పలము. సం. జలము; బాతు; రావి†.
పిప్పలాశనము. సం. ఏనుఁగు.
పిప్పలి. సం. ఊషణము†; రావి†.
పిప్పల్లు. సం. ఊషణము.
పిప్పి. రసమంతయు పీల్పఁగామిగినది; నిస్సారమైనది; నలిచి రసము పిండిన ఆకుమొ.
పిప్పిక. సం. పండ్లపాఁచి.
పిప్పిరి. పిప్పి.
పిప్లువు. సం. పుట్టుమచ్చ.
పిమ్మట. మనోవ్యథ. క్రి. అనంతరము, తరువాత; పరోక్షము.
పియ్యి. మలము.
పిర. కానిలో నాలవభాగము.
పిరంగి. సిపాయిలు యుద్ధమప్పుడుమందుగుండువేసి గట్టించి కాల్చెడి యినుపక్రోవి, శతఘ్ని; ఖడ్గము; అరజాట్టు;? అనుమంతిగాఁడు.?
పిరంగిచెక్క. ఏలాపర్ణి.
పిరంగీ. పిరంగి.
పిరంగు. పిరంగి.
పిరి. మెలి; వెంటి; గోనెలు మొదలగునవి కట్టెడు త్రాడు.
పిరిగొను. అ. క్రి. పెనఁగొను, చుట్టుకొను. స. క్రి. మెలిపెట్టు.
పిరువీఁకు. పీఁకులాట; బాధ.
పిరువీఁకులాడు. అ. క్రి. పెనఁగులాడు,
పిరువీఁకుసేయు. స. క్రి. పీఁకులాడు; బాధించు.
పిర్వీఁకు. రూ. పిరువీఁకు.
పిఱ. రూ. పిర.
పిఱికి. విణ. భీరువు, పంద.
పిఱికికండ. అధైర్యము.
పిఱికిమెకము. లేడి; జింక.
పిఱు. పిఱుఁదుశబ్దముయొక్క లుప్తరూపము
పిఱుఁదు. మొలకు వెనుకటిభాగము, నితంబము; వెనుక.
పిఱుఁదుకొను. స. క్రి. వెంబడించు.
పిఱుతివియు, పిఱుతివుచు, పిఱుదీయు } అ. క్రి. వెనుదీయు, పరాఙ్ముఖమగు.
పిఱుము. పరుషభావము. విణ. పరుషము
పిఱువడు. అ. క్రి. వెనుదీయు; భయపడు.
పిఱువెట్టు. స. క్రి. అనాదరించు.

పిఱువోవు } అ. క్రి. వెనుదీయు.
పిఱుసను }
పిఱ్ఱి. పిఱుఁదు, శ్రోణి.
పిలక. కందగడ్డలోనగువాని మొలక; కొద్దిగానుంచుకొనినజుట్టు; పిలుక.
పిలపిల. మూఁగుటయందును వచ్చుటయందును పోవుటయందును బిక్కిరించుటయందునగు అనుకరణము.
పిలుఁగు. విణ. రూ. పినుఁగు.
పిలుక. పక్షి మొదలగువానిపిల్ల.
పిలుకు గర్వము.
పిలుకుమారు. అ. క్రి. చచ్చు; నాశమొందు. రూ. పిల్కుమారు.
పిలుకుమార్చు. ప్రే. చంపు; నాశముచేయు.
పిలుకుమాలు. అ. క్రి. చచ్చు; నాశమొందు. రూ. పిల్కుమాలు.
పిలుకుమాలుచు. ప్రే. చంపు; నాశముచేయు. రూ. పిలుకుమాల్చు.
పిలుచు. స. క్రి. ఆహ్వానించు. రూ. పిల్చు.
పిలుపు } పిలుచుట, ఆహ్వానము.
పిలుపుడు }
పిల్క. రూ. పిలుక.
పిల్ల. పక్షి మొదలగువానిసంతతి; బాలిక, ఆఁడుపడుచు. విణ. చిన్న. బ. బిడ్డలు.
పిల్లఁగ్రోలు } మురళి.
పిల్లఁగ్రోవి }
పిల్లకాయ. బాలుఁడు.
పిల్లగడ్డము. నడుమమాత్రము కొంచెము వెండ్రుకలుంగల గడ్డము.
పిల్లగాఁడు. బాలుఁడు.
పిల్లగిఱులు. బ. బాలక్రీడావిశేషము.
పిల్లజొట్టు. బాలుర ముందటి సిగ, కాకపక్షము.
పిల్లదీపు. బాలక్రీడావిశేషము.
పిల్లదేవి. బాలక్రీడావిశేషము.
పిల్లనగ్రోలు } ఊదుటకనువుగా బెజ్జములు వేసిన వెదురుగొట్టము, మురళి.
పిల్లనగ్రోవి }
[రూపకము.
పిల్లనూయి. నూతిలోపలి చిన్ననూయి,
పిల్లపీఁచెఱ. చల్లగడ్డ, నారాయణి, శతావరి†.
పిల్లపెసర. కాకిపెసర, ముద్గపర్ణి†.

పిల్లము. సం. తడికన్ను. విణ. తడికన్ను గలది. [గంతు.
పిల్లమొఱము. తలక్రిందుగా వేసెడుగంతు;
పిల్లవ్రేలు. చిటికెనవ్రేలు.
పిల్లలఁగలిగించువేరు కాము.
పిల్లాఁడి. పిల్లాణి.
పిల్లాకము. సం. పక్షిపిల్ల.?
పిల్లాణి. స్త్రీలకాలి నాల్గవవ్రేలినగ.
పిల్లి. మార్జాలము.
పిల్లికన్నతనము. వైడూర్యము.
పిల్లిగడ్డ. పునుఁగుచట్టము.
పిల్లిశీలము. మి. కపటవర్తనము.
పిల్లు. కసవు.
పిల్లెరుగంతు. పిల్లమొఱము.
పిశంగము. సం. గోరోజనపువన్నె. విణ. గోరోజనపువన్నెగలది.
పిశాచకి. సం. కుబేరుఁడు. [దయ్యము.
పిశాచము. సం. దేవయోనివిశేషము; పిల్లి;
పిశాచి. సం. పిశాచస్త్రీ; జటామాంసి†.
పిశిత. సం. జటామాంసి†.
పిశితము. సం. మాంసము.
పిశున. సం. పిక్క†; కొండబెండ†.
పిశునము. సం. కాకి; కుంకుమపువ్వు.
పిశునుఁడు. సం. నారదుఁడు. విణ. కొండెకాఁడు; క్రూరుఁడు; నీచుఁడు.
పిష్టకము. సం. నూఁబొడి; పిండివంట; నేత్రరోగవిశేషము. [మూఁకుడు.
పిష్టపచనము. సం. బాణలి, బూరెల
పిష్టము. సం. పిండి; సీసము. విణ. పొడిచేయఁబడినది; నూఱఁబడినది; రుబ్బినది.
పిష్టాతము. సం. వస్త్రములకు వాసనకట్టెడు బుక్కా.
పిస. అవివేకము.
పిసక. తలవెండ్రుకలయందు చెమటచే బందనగొను మఱికి.
పిసరు. కడిగినధాన్యములో త్రోపుడుపడినది; లేశము; విన్దు.
పిసాసి. పిశాచి; పిశాచము.
పిసాళము. ప్రకాశము; వికసనము; పరిహాసము; వ్యాపనము; దొంగయెత్తు.
పిసాళి. మూఢుడు; కుత్సితస్త్రీ; కుత్సి

తుఁడు. విణ. ప్రకాశముగలది; వ్యాపనముగలది; దొంగిరెుత్తుగలది.

పిసాళించు. అ. క్రి. ప్రకాశించు; పరిమళించు; వ్యాపించు; పరిహాసములాడు. దొంగరెుత్తువేయు. స. క్రి. పరిహసించు

పిసి. తొలియందు బిగఁగొట్టుటకై చెక్కిన స్తంభము పట్టె మొదలగువాని చివర.

పిసికిళ్ళు. బ. జొన్నలు మొదలగువాని యూఁచబియ్యము; పిసుకుటలు.

పిసిడి
పిసినారి
పిసిని
పిసినిగొట్టు } విణ. పిసినివాఁడు, లోభి.

పిసుకు. స. క్రి. పిండి మొదలగువానిని చేతమర్దించు; పాదములు మొదలగు వానినొత్తు.

పిస్తోలు. ఇం. పిస్టల్.

పిహితము. సం. ఒక అర్థాలంకారము; కనుఱెప్పమూఁత. విణ. కప్పఁబడినది.

పిళ్ళ. కొన్ని జాతుల పేరునకు చేర్చెడు పదము.

పిళ్ళారి. వినాయకుఁడు.

పిళ్ళు. బ. దూడలను కుడువనీని యావులను దూడలుచచ్చిన యావులను మరలం కొలుపుటకై తద్యోనిద్వారమునఁ జొప్పించిలాగెడు తోరపుకుఱుచకసవువెంటి.

## పీ

పీఁకు. స. క్రి. పెఱుకు; తీసివేయు.

పీఁకులాట. పీఁకులాడుట.

పీఁకులాడు అ. క్రి. పెనఁగులాడు.

పీఁకుపీఁకాడు. అ. క్రి మిక్కిలి పెఱుకులాడు

పీఁకె. నాగస్వరము మొ॥ వాద్యముల ముఖమునఁ జొప్పించెడు క్రోవి పుల్ల; కాలివలెఁజుట్టిన చిన్న అరచుట్ట; త్రాగి మిగిలిన పొగచుట్ట.

పీఁకెవాఱు. అ. క్రి. చప్పటయగు; కృశించు

పీఁచమడఁపు. హింస.

పీఁచమణఁచు. స. క్రి. చంపు.

పీఁచము. మదము.

పీఁచెర. నారాయణి. పిల్లపీఁచర†.

పీఁచు. గూఁడువలెఁ బెనఁచుకొనియుండు నార.

పీఁట. పీఠము, కూర్చుండెడుపలక.

పీఁటముడి దట్టముగా వేయబడినముడి.

పీఁటవెట్టు. అ. క్రి. లేవక యొకచోటనే పాదుకొనియుండు

పీఁటవెట్టుమెకము. ఘృష్టి, పంది.

పీగద్ద. పీతిరిగద్ద.

పీఠమర్దుడు. సం. నర్మదుఁడు, శృంగార నాయక సచివులలో నొకఁడు. విణ. ధృష్టుఁడు.

పీఠము
పీఠి } సం. కూర్చుండెడి ఆసనము, పీఁట; మంత్రసిద్ధినిగూర్చెడి జపస్థానవిశేషము; దేవతాస్థానవిశేషము

పీఠిక. సం. గ్రంథము మొదట వ్రాసెడు దాని పుట్టుపూర్వోత్తరము, ఉపోద్ఘాతము, భూమిక; క్రమము.

పీడ. సం. బాధ, దుఃఖము; సిగదండ; సరళవృక్షము. [బాధపెట్టుట.

పీడనము. సం. పరులచేఁ గలుగురాయిడి

పీడించు. సం. స. క్రి. బాధించు.

పీడితము. సం. విణ. బాధపెట్టఁబడ్డది; పిసుకఁబడినది [చున్నది.

పీడ్యమానము. సం. విణ. పీడింపఁబడు

పీత. ఎండ్రకాయ; కుళీరము. సం. పసుపు

పీతదారువు. సం. దేవదారువు†; సరళవృక్షము; మ్రానిపసుపు†. [వృక్షము.

పీతద్రువు సం. మ్రానిపసుపు†; సరళ

పీతనము. సం. కుంకుమపువ్వు; దేవదారువు†; అంబాళము†; హరిదళము.

పీతముండము. సం. పచ్చతలపిచ్చుక, బండారుపిచ్చుక.

పీతము. సం. పుష్పరాగము; పసుపువన్నె. విణ. పసుపువన్నెగలది; త్రాగఁబడినది.

పీతసాలకము. సం. వేఁగిస†.

పీతాంబరము. సం. పచ్చవలువ; పసుపువన్నెగల పట్టుబట్ట; మాయ.

పీతాంబరుఁడు. సం విష్ణువు. విణ. పచ్చవలువదాల్పు.

పీతి. సం. పానము; గుఱ్ఱము.

పీతిగోరువంక. విట్శారిక.

పీతిరిగద్ద. పీఁగద్ద.
పీతిరిగుంట. ముటికిగుంట.
పీతోలు. పైనుండుసన్ననిచర్మము.
పీనము. సం. సంతోషము; చెమట. విణ. లావైనది.
పీనస. సం. దోస†.
పీనసము. సం. పడిసెము.
పీనస్కంధము. సం. దున్న.
పీనాహము. సం. నూయివాయికట్టు.
పీనుఁగు. ప్రాణముపాసినబొంది, శవము.
పీనుఁగుఁదిండి. పిశాచము
పీనుఁగుపెంట. దురవస్థ; కష్టము; పీనుఁగులప్రోఁగు.
పీనోధ్ని. సం. పెద్దపొదుఁగుగలయావు.
పీన్గు. పీనుఁగు.
పీయి. మలము.
పీయూషము. సం. అమృతము; పాలు; జున్నుపాలు; జున్నుగడ్డ.
పీరు. గుమ్మ, క్షీరధార. అ.క్రి.రూ.పీలు. హిం. మహమ్మదీయ భక్తుల జ్ఞాపకార్థమైన చిహ్నము; తురకలు వారి పండుగలో పూజించు చేతివంటి ఆకారముగల విగ్రహము.
పీరుచు. స.క్రి. పీలుచు. రూ. పీర్చు.
పీర్లపంజా. తురకల యుత్సవములోని చిహ్నము.
పీల. విణ. బక్క, కృశము
పీలి. పికిలి పక్షి; ఓడకు దారి చూపెడు చుక్కను.
పీలిక. వస్త్రాదుల పేలిక.
పీలికాఁడు. ఓడచుక్కానుత్రిప్పెడువాఁడు.
పీలితొంగళ్ళు. నెమిలి యీఁకలకుచ్చులు.
పీలిదండలు. పందిట నుంచుకొను కుచ్చుమాలికలు.
పీలు. అ.క్రి. రూ. పిగులు.
పీలుకము. సం. పక్షిపిల్ల.
పీలుచు. (ఫలరసాదుల) జుఱ్ఱు; (నీరు గాలి పొగ మొ||) పీల్చు.
పీలుపర్ణి. సం. చాఁగ†; దొండ†.
పీలువు. సం. గోలుఁగుచెట్టు; ఏనుఁగు; పరమాణువు; తాటిచెక్క; పుష్పము; భాణము.
పీవము. సం. విణ. పీనము.
పీవరము. సం. తాఁబేలు. విణ. క్రొవ్వినది; లావుది, బలిసినది.
పీవరి. సం. పెద్దపీఁచర†.

## పు

పుంఖము. సం. బాణము—పిడి; డేగ; ప్రశస్తాచరణము.
పుంఖానుపుంఖము. సం. శుభాశుభరూపమయినయది; శరపరంపర.
పుంగవము. సం. ఎద్దు; ఋషభము†.
పుంగవుఁడు. సం. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠుఁడు
పుంగుఁడు. తెల్లపొడల కుష్ఠము; పులిపిరి?
పుంజము. సం. రాశి, సమూహము.
పుంజి. సమృద్ధి; వరి మొదలగు పైరు; రాశి. విణ. సమృద్ధము.
పుంజికొను. అ.క్రి. గుబురుకొను.
పుంజీ. నాలుగు.
పుంజీభవించు. సం. అ.క్రి. ప్రోఁగువడు, రాశివడు.
పుంజె. ఎద్దడి నేల.
పుంజెము. ముప్పది యొనికల నూలు.
పుంజోలదండ. స్త్రీకంఠాభరణవిశేషము.
పుంజు. మగకోడి, కుక్కుటము.
పుంజుదాలుపు. కుమారస్వామి, కుక్కుటధ్వజుఁడు.
పుంజులపేరువిత్తు. పందెపు కోడిపుంజు.
పుంట. సంధ్యాకాలము. రూ. పుంటె.
పుండరీకము. సం. తెల్లదామర†; తెల్లగొడుగు; ఒకతీర్థము; ఒక గంధద్రవ్యము; ఆగ్నేయ దిక్కునందలి ఏనుఁగు; కప్ప; తియ్యమామిడి†; తెల్లపొడల కుష్ఠము; పులి.
పుండరీకాక్షుఁడు. సం. విష్ణువు.
పుండరీకుఁడు. సం. ఒకపరమభాగవతుఁడు
పుండలించు. అ. క్రి. అభూత కల్పనము చేయు.
పుండాకోరు. తంటాకోరు.
పుండు. వ్రణము.
పుండ్రము. సం నలుపుగలసిన యెఱ్ఱచెఱకు†; తెల్లదామర†; నుదుటితిలకము;

పురగు; పువ్వులగురివెంద†; ఒక దేశము; ఇక్షువిశేషము.
పుంత. కాలిదారి; పశువులునడిచెడిదారి.
పుంభావము. సం. పురుషత్వము.
పుంశ్చలి. సం. జారస్త్రీ.
పుంసవనము. సం. గర్భధారణమైన రెండవ (మూడవ) మాసమున పురుషప్రజగా పుట్టవలెనని చేసెడి సంస్కారవిశేషము; పాలు.
పుకారు. హిం. కేకలు; అల్లరి; వదంతి.
పుకిలించు. స.క్రి. రూ పుక్కిలించు.
పుకిలింత. రూ. పుక్కిలింత.
పుక్క. రూ. బుగ్గ.
పుక్కిలి. బుగ్గలోపలి భాగము,
పుక్కిలించు. స.క్రి. నీళ్లు మొదలగువానిని గండూషించు.
పుక్కిలింత. పుక్కిలించుట, గండూషము
పుచ్చికోలు. ప్రతిగ్రహము, పుచ్చికొనుట.
పుచ్చె. తలపుర్రె; టెంకాయబొండ్లము మొ.
పుచ్ఛ. కాళింగము†.
పుచ్ఛేడిక. లజ్జ.
పుచ్ఛేడీక. సిగ్గరి; లజ్జగలవాఁడు; లజ్జగలది.
పుచ్ఛేడీకతనము. సిగ్గు.
పుచ్చు. అముదపుమడ్డి. అ.క్రి. పుప్పిపట్టు, కాయ్య మొదలగునది పుచ్చిపోవుట. స.క్రి. గ్రహించు, తీసికొను; పెఱుకు; నియోగించు. ప్రే. పోఁజేయు.
పుచ్చుకొను. స.క్రి. గ్రహించు.
పుచ్చుకోలు. పుచ్చుకొనుట. [వేయుట.
పుచ్ఛటి. సం. నెటికవిఱుచుట; చిటిక
పుచ్ఛము. సం. తోఁక; వెనుకప్రక్క.
పుట. సం. పుస్తకములోనిపత్రముయొక్క యొకవైపు, పేజి; పొరట.
పుటతేనె. కురుజుతేనె.
పుటపుట. అదురుటయందగుఅనుకరణము.
పుటపుటన. విణ. అధికము; ప్రవృద్ధము.
పుటపుటనగు. అ.క్రి. ప్రవృద్ధమగు.
పుటభేదము. సం. పట్టణము; చతుర్విధవాద్యము; ఏటివంపు.
పుటభేదనము. సం. పట్టణము.
పుటము. అశ్వగతివిశేషము. సం. గుజ్జుపుగిట్ట ఔషధము పక్వముచేయు డిప్పలజంట; మూఁత; ఒండొంటికలయిక.
పుటముబ్బు. అ.క్రి. మీఁదికుబ్బు.
పుటమెగయు. అ.క్రి. మీఁదికెగయు; దాఁటు.
పుటి. సం. దొప్ప; మూఁత; గోఁచి.
పుటిక. చిన్నగంప; చిన్నతట్ట. సం ఏలకి†.
పుటికె పుటిక.
పుటితము. సం. దోసిలి; దొప్పవలెకూర్పబడిన రెండుచేతులు. విణ. కుట్టఁబడినది; దొప్పగాఁజేయఁబడినది. [ణము.
పుటుక్కు. తెగుటయందగు ధ్వన్యనుకర
పుట్ట. వల్మీకము; చిన్నపొద; జన్మస్థానము, ఆకరము; రాశి.
పుట్టకాఁపరి. సర్పము.
పుట్టకాఁపు. ఎలుఁగుబంటి; సర్పము.
పుట్టకాలివాఁడు. విణ బోదకాలుగలవాఁడు
పుట్టకాలు. బోదకాలు, పుట్టవలెదుర్మాంసము పెరిగినకాలు, వల్మీకపాదము.
పుట్టకూటిమెకము ఎలుఁగుగొడ్డు.
పుట్టకూడు. చీమగ్రుడ్లతోఁగలసిన పుట్టమట్టిముద్ద. [కూడుమేపుడు.
పుట్టకూడుదిండి. ఎలుఁగుబంటి. రూ. పుట్ట
పుట్టకూడుమెక్కుమెకము. ఎలుఁగుబంటి.
పుట్టకొక్కు. కుక్కగొడుగు; పుట్టయందు తెల్లగా మొగ్గవలె మొలచునది, శిలీంధ్రము. [బయట పెట్టినపెద్ద మట్టితిన్నె.
పుట్టకోట. కోటకు బలముకోసము కోట
పుట్టకోవలు. బ. పుట్టమీఁది శిఖరములు.
పుట్టగొడుగు. గోమయచ్ఛత్రిక; పుట్టయందు తెల్లగా గొడుగువలె మొలచునది, పుట్టకొక్కు.
పుట్టగోఁచి. పెద్ద కౌపీనము.
పుట్టమాలు. వల్మీకభవుఁడు, వాల్మీకి.
పుట్టచెండు. ఎగురఁగొట్టి యాడెడు వస్త్రాదికృతమైన బంతి. బ. బాలక్రీడావిశేషము.
పుట్టచెమ్మ. వల్మీకశింబి†.
పుట్టచేర్పు. పుట్టకొక్కు.
పుట్టతమ్మ. ఒకదినుసు తమ్మ†.
పుట్టతేనె పుట్టలోపెట్టిన పెరతేనె.
పుట్టతేలు. మండ్రగబ్బ.

పుట్టదిట్ట. సర్పము.
పుట్టపుట్టువు. రూ. పుట్టచూలు.
పుట్టపెట్టెనట్టు } సర్పము, పాము.
పుట్టమనెడుగబ్బి }
పుట్టము. వస్త్రము.
పుట్టి. ఖారి, ఇరువదితూములప్రమాణము; ఇరువది మణుగుల యెత్తు; పేములతో పెద్దగంపవలె అల్లి మీఁద తోలుకప్పి కుట్టఁబడిన యేఱుదాఁటెడు సాధనవిశేషము; కరడిగ.
పుట్టించు. ప్రే. లేనిది కలుగఁజేయు.
పుట్టిక. రూ. పుటిక. [వా. పుట్టిల్లు.
పుట్టినిల్లు. జన్మస్థానము, మాతృగృహము
పుట్టు జన్మము. అ. క్రి. జన్మించు.
పుట్టుక. జన్మము. [శువు.
పుట్టుకచెలవజోతి. చంద్రుఁడు. హిమాం
పుట్టుకల్లరి. విశే. పుట్టుక మొదలు కల్లలాఁడువాఁడు.
పుట్టుగట్టు. ఉదయాద్రి, తూరుపుఁగొండ
పుట్టుగు. జన్మము.
పుట్టుగొడ్డు. విశే. పుట్టుక మొదలు గొడ్డుతనముగలది, వంధ్య; వంధ్యము.
పుట్టుగ్రుడ్డి } విశే. పుట్టుక మొదలు గుడ్డి
పుట్టుచీకు } వాఁడైనవాఁడు, జనుసాంధుఁడు. [చెయ్వు
పుట్టుచెయువు. జాతకర్మము. రూ. పుట్టు
పుట్టుపాప. విశే. వ్యాధిచే తెల్లఁబాఱిన దేహముగలవాఁడు.
పుట్టుపునుఁగు. లోమశమృగమదము.
పుట్టుపూర్వములు మి. పూర్వచరిత్రము.
పుట్టుబడి. పుట్టుక ఉత్పత్తి.
పుట్టుమచ్చ. జడులము, పుట్టుక మొదలు దేహమునందు కలిగిన నల్లబొట్టు.
పుట్టుమూఁగ. పుట్టుక మొదలు మూఁగయైనవాఁడు.
పుట్టుమొండి విశే. పుట్టుక మొదలు మొండివాఁడు, పంగువు, కుంటి.
పుట్టువడుగు. పుట్టుక మొదలు బ్రహ్మచారియైనవాఁడు, విష్ణువు.
పుట్టువు. జన్మము. [వాఁడు.
పుట్టువెట్టి. పుట్టుక మొదలు వెట్టివాఁడైన
పుట్టెఁడు. పుట్టిప్రమాణము.
పుట్టెఁడునేల. ఇరువదికుంటల భూమి
పుట్టిల్లు. రూ పుట్టినిల్లు.
పుడక. వా. పుల్ల; కట్టెపుల్ల.
పుడకవేయు. స క్రి. మనస్సును త్రిప్పు, మనస్సును పాడు చేయు.
పుడమి. నేల, పృథివి.
పుడమితాలుపు. శేషుఁడు; రాజు; కొండ
పుడమితేరెక్కువాఁడు. శివుఁడు, క్షోణీరథుఁడు.
పుడమిపట్టి. రూ. నేలపట్టి.
పుడమిపుఁడు. మి. రాజు.
పుడమిపుట్టు. చెట్టు, భూజము; సీత, భూమిజ.
పుడమిముద్దియకోక } సముద్రము.
పుడమిమొలనూలు }
పుడమిరా విష్ణువు.
పుడమిఱేఁడు. భూపతి, రాజు. [వుఁడు.
పుడమివేలుపు. బ్రాహ్మణుఁడు, భూదే
పుడమీశుఁడు. మి. రాజు, భూపతి.
పుడికిరించు. స క్రి. రూ. పుణికిరించు.
పుడికిరింత రూ పుణికిరింత.
పుడికిళ్లు. బ. రూ. పుణికిళ్లు.
పుడిగ. త్యాగము. [ప్రసృతి.
పుడిసిలి నుదియఁబట్టిన చేరలో సగము,
పుడిసిలించు. స క్రి. (జలము మొదలగువానిని) పుడిసిటఁబట్టు.
పుడిసిలింత. పుడిసిలించుట.
పుడిసెఁడు. చేరలో సగము.
పుడుఁకులు. బ. రూ. పుణుఁకులు.
పుడుక. పుల్ల; కట్టెపుల్ల.
పుడుకబావిలి. స్త్రీకర్ణభూషావిశేషము.
పుడుకు. ఈవి, ఇచ్చుట స. క్రి. కొంచెముగా ఇచ్చు; ఇచ్చు; (అయిదువ్రేళ్ళతో) గ్రహించు; చీఁకటిలో తడవు.
పుడుకుఁగల్లు. చింతామణి, ఈవులరతనము
పుడుకుఁదొడుకు. కామధేనువు, ఈవుల మొదవు [మ్రాను.
పుడుకుమ్రాను. కల్పవృక్షము, ఈవుల
పుడుగ త్యాగము
పుణికిరించు. స. క్రి. కొంచెముగా ఇచ్చు (సన్నిపాత జ్వరదోషముచేత ఐదు వ్రేళ్లతో) గ్రహించు.

పుణికిరింత. పుణికిరించుట.
పుణికిళ్ళు. బ. బాలక్రీడా విశేషము.
పుణుంగులు. బ. భక్ష్య విశేషములు, గుండ్రని ఒక పిండివంట.
పుణుకు. రూ. పునుకు.
పుణ్య. సం. గంగ; తులసి; పుణ్య (స్త్రీ).
పుణ్యకము పుణ్యము; ఒక వ్రతము.
పుణ్యజనుఁడు. సం. నిరృతి; యక్షుఁడు; రాక్షసుఁడు; సుజనుఁడు.
పుణ్యజనేశ్వరుఁడు. సం. కుబేరుఁడు.
పుణ్యభూమి. సం. ఆర్యావర్తము.
పుణ్యము. సం. ధర్మము, సుకృతము. విణ. పవిత్రము; సుందరము; పవిత్రము చేయునది.
పుణ్యమొన. మల్లయుద్ధమునఁగట్టు మొన [భేదము.
పుణ్యవంతుఁడు } సం.విణ. ధార్మికుఁడు,
పుణ్యాత్ముఁడు } సుకృతి.
పుణ్యాహము. సం. పుణ్యదినము, పవిత్రమైన దినము.
పుణ్యాహవాచనము. సం. దైవాది కర్మప్రారంభమునందు మంగళార్థము పుణ్యాహమను శబ్దమును మూడుమాఱులు చెప్పెడు ఒక శుద్ధికర్మము.
పుతపుత. చలనమునందగు అనుకరణము.
పుతపుతపోవు. అ.క్రి. వివశమగు.
పుత్త. పృష్ఠము, వీఁపు.
పుత్తడ. నూలుకండె.
పుత్తడి. అపరంజి, బంగారము; పుత్తళిక.
పుత్తడికాసు. మత్స్యభేదము.
పుత్తడిచూపుల మగువ. లక్ష్మి.
పుత్తము. క్రి. పంపుదమనుట.
పుత్తళి. రూ. పుత్తడి.
పుత్తళి-క. సం. బొమ్మ, పాంచాలిక.
పుత్తిక. సం. చిట్టీఁగ; ఒక తేనెటీగ.
పుత్తెంచు. ప్రే. పుచ్చు, పంపించు; ఆజ్ఞాపించు. [యాగము
పుత్రకామేష్టి. సం. పుత్రప్రాప్తికై చేసెడు
పుత్రకుఁడు. సం. పుత్రుఁడు.
పుత్రజీవము. గార చెట్టు— ఆకులవంటి ఆకులు గలిగి సంతానము గలుగఁజేసెడి ఒక ఓషధి, గర్భదాత్రి.

పుత్రి. సం. పుత్రిక, కూఁతురు.
పుత్రిక. సం. కూఁతురు; పుత్తళిక, బొమ్మ; లక్కదూది.
పుత్రుఁడు. సం. కొడుకు. (పుత్రులు పన్నిద్దఱు— ఔరసుఁడు, భార్యయందు తనకుబుట్టి కొడుకు; క్షేత్రజుఁడు, ఏదేని యొక కారణమున సంతాన విచ్ఛిత్తి కలుగఁగా పెద్దల యనుజ్ఞచే తన భార్యయందు దేవరుఁడు మొదలగు వారికిఁ బుట్టిన కొడుకు; దత్తుఁడు, దత్తు తీసికొన్న కొడుకు; కృత్రిముఁడు, గుణజ్ఞుఁడని యభిమానించి పెంచుకొన్న కొడుకు; గూఢోత్పన్నుఁడు, అంకుమగనికిఁ బుట్టిన కొడుకు; అపవిద్ధుఁడు, తల్లిచేతఁగాని తండ్రిచేతఁగాని ఉభయుల చేతను కాని విడువఁబడగా తెచ్చి పెంచుకొన్న కొడుకు; కానీనుఁడు, కన్యాత్వమున రహస్యముగా ఇతరునికిఁ బుట్టిన కొడుకు; సహోఢజుఁడు, గర్భిణిగానుండ తెలిసికాని తెలియక కాని వివాహముచేసికొన్న భార్యయందుఁ బుట్టినకొడుకు; క్రీతుఁడు, తలిదండ్రుల వద్ద వెలయిచ్చికొన్న కొడుకు; పౌనర్భవుఁడు, పునర్భువునందుఁబుట్టిన కొడుకు; స్వయందత్తుఁడు, తలిదండ్రులు లేక కాని తలిదండ్రులచేత అకారణముగ విడువఁబడికాని తనంతట నేను నీకుఁ బుత్రుఁడ నయ్యెదనని వచ్చిన కొడుకు; జ్ఞాతిరేతుఁడు, జ్ఞాతికొడుకు.)
పుదియబొట్టు. ఊర్ధ్వపుండ్రము.
పుదీనా. హిం. పొదీనా, సువాసనగల ఒక దినుసు మొక్క.
పుద్గలము. సం. శరీరము; ఒకపదార్థము, ద్వ్యణుకాది; రూపాదులుగలది. [రుఁడు
పుద్గలుఁడు. సం. జీవుఁడు; సుందరాకా
పునర్నవము. సం. గోరు.
పునర్నవ. సం. గలిజేరు.
పునర్భవ. సం. చంద్రకళ.
పునర్భవము. సం. గోరు; పునర్జన్మ. విణ. తిరుగఁబుట్టునది.
పునర్భువి. సం. జీవుఁడు.

పునర్భువు. సం. మారుమనువుది.
పునర్వసు. సం. ఒక నక్షత్రము.
పునర్వసువు. సం. విష్ణువు; శివుఁడు; కాత్యాయనముని.
పునస్సంధానము. సం. విచ్ఛిన్నమై పోయిన యగ్నిని మరల హోమకుండమునందుఁ గూర్చుట.
పునస్సంస్కారము. సం. రెండవసారి చేసెడి ఉపనయనాది సంస్కారము.
పునాది. బలమునకై గోడ కడుగున భూమిలో లోఁతుగా త్రవ్వి పెట్టెడు గోడ.
పునాసలు. బ. పునర్వసువు, సూర్యుఁడు పునర్వసు నక్షత్రమందుండఁగా విత్తిన ధాన్యము, సజ్జలు కొఱ్ఱలు బొబ్బెలు మొ.
పునాసాటకడాలు బ. పునాసలు.
పునిస్త్రీ. గ్రా. భర్త బ్రదికియున్న యాఁడుది, పుణ్యస్త్రీ.
పునీతుఁడు. సం. విణ. పవిత్రుఁడు.
పునుఁగు. మార్జారికవలనఁగలుగు గంధద్రవ్యము; కలమధాన్యవిశేషము
పునుఁగుచెట్టము బిడాలకము; పునుఁగు ఉండునట్టి కోశము.
పునుఁగుపిల్లి. మార్జారి, రోమశము.
పునుఁగురాజనాలు బ. మిక్కిలి వాసనగల శాలిధాన్యవిశేషము. [యొముక
పునుక. కపాలము, పుఱ్ఱె, తలచిప్ప,
పునుకకంచెమువాఁడు } శివుఁడు, కపాలభృత్తు.
పునుకతాలుపు
పునుకదారి
పునుకకంచెమువానివిల్లు. మేరునగము.
పునెము. రూ. పున్నెము.
పుర్క. పునుక, కరోటి.
పున్గుఁబిల్లి పునుఁగుపిల్లి.
పున్న. విణ పిన్న. [సేనపతిథి.
పున్నమ. పూర్ణిమ; శుక్లపక్షమునందుపదు
పున్నాగము. సం. సురపొన్న; ఇంద్రుని యేనుఁగు; పురుషశ్రేష్ఠుఁడు; తెల్లగలువ; జాజికాయ
పున్నియము } పుణ్యము; సుకృతము. విణ. సుకృతముగలది.
పున్నెము

పుప్పము. పువ్వు, పుష్పము.
పుప్పి. వ్యాధిచేత పురుగుపడి గోరు మెందలగునది పుచ్చుట.
పుప్పించు. ప్రే. పుచ్చు; పంపించు.
పుప్పిపురుగు. నుసిపురుగు.
పుప్పు పశువులగోరిజలు ప్రసన్నిపురుగులు పడెడు వ్యాధి. [పరాగము.
పుప్పొడి. పుష్పములయందలిధూళి, పుష్ప
పుబ్బ. ఒకనక్షత్రము. [గాఁడు.
పుమాంసుఁడు. సం. మనుష్యుఁడు, మగ
పుయిలోట సంకోచము; లజ్జ; భయము; అధైర్యము; ముఖప్రీతి. [మోమోటము.
పుయిలోటము. వెనుదీయుట, సంకోచము,
పుయిలోడు. అ. క్రి. వెనుదీయు; ఖిన్నుడగు.
పురంట. సంధ్యాకాలము.
పురందరుఁడు. సం. ఇంద్రుఁడు.
పురంధ్రి. సం. పెనిమిటికొడుకులు పెద్ద కుటుంబమునుగల స్త్రీ; స్త్రీ.
పురఁట. సంధ్యాకాలము.
పురడించు } అ. క్రి. వర్ధిల్లు; విజృంభించు; తిరస్కరించు; ఎదురించు.?
పురణించు
పురతకీశులు. ఇం. పోర్చుగీసు దేశము.
పురపుర. పొక్కుటయందగు అనుకరణము.
పురపురఁబొక్కు. స. క్రి. మిక్కిలి వెతనొందు. [పడు.
పురపురలాడు. అ. క్రి మిక్కిలియపేక్షు
పురము. సం. పట్టణము; శరీరము; ఇల్లు; మేడ; మూడు; గుగ్గిలపుచెట్టు.
పురశ్చరణము } సం. మంత్రసిద్ధికై శాస్త్రము విధించిన సంఖ్యననుసరించి నడిపెడి జపహోమతర్పణ— అభిషేక బ్రాహ్మణ భోజనములు.
పురశ్చర్య
పురశ్ఛదము. సం. దర్భ.
పురస్కరించు. సం. స. క్రి. ముందిడుకొను; పూజించు.
పురస్కారము. సం. ముందిడుట; పూజనము; సన్మానము; పరిగ్రహించుట; తడుపుట; శత్రువాక్రమించుట; అపదూరుపడుట.
పురస్కార్యము. సం విణ. పురస్కరింపఁదగినది. [గలది.
పురస్కృతము. సం. విణ. పురస్కారము

పురస్కృతి. సం. పురస్కారము. రూ. పురస్క్రియ. [గలవాఁడు.

పురస్కృతుఁడు. సం. విశ. పురస్కారము

పురస్సరుఁడు. సం. విశ. ముందు నడచు వాఁడు. [కుఁడు.

పురహరుఁడు. సం. శివుఁడు, త్రిపురాంత

పురాకృతము. సం. విశ. పూర్వజన్మమందుఁ జేయఁబడిన శుభాశుభకర్మము.

పురాణదంపతులు. సం. బ. పార్వతీపరమేశ్వరులు.

పురాణభట్టు. సం. పురాణము చెప్పువాఁడు.

పురాణము. సం. సర్గ ప్రతిసర్గాది పంచ లక్షణములతోఁగూడిన బ్రాహ్మాది (అవి పదునెనిమిది—బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మకైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కౌర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము) పదునెనిమిది; కార్షాపణము. విశ. అనాదియయినను నూతనముగనే యుండెడి ఆత్మ, బ్రహ్మము; ప్రాఁతది.

పురాణించు. అ. క్రి. వర్ధిల్లు; విజృంభించు. సం. స. క్రి. పురాణము చెప్పు.

పురాతనము. సం. పరమాత్మ. విశ. అనాది గురు పరంపరచే వచ్చినట్టిది; ప్రాఁతది.

పురాతని. దేవి, దుర్గ; మాయ, ప్రకృతి.

పురాయించు. అ. క్రి. వర్ధిల్లు, విజృంభించు.

పురారి. సం. శివుఁడు.

పురావృత్తము. సం. తొల్లిటికథ.

పురి. పురికొస (త్రాడు); మెలి; నెమిలి పింఛము; ఆక్రమణము; ధాన్యము పోసి యుంచుటకు పాణకవలె గడ్డితోఁగట్టిన కూటు. సం. పట్టణము.

పురికొను. అ. క్రి. కవియు, క్రమ్ము; విజృంభించు; ఎచ్చరికదెచ్చుకొను.? ప్రే. పురికొలుపు. ఆజ్ఞాపించు; ప్రేరేపించు; రేగఁజేయు; కవియఁజేయు. రూ. పురికొల్పు.

పురిటిల్లు. వా. సూతికాగృహము.

పురిడి. పక్షివిశేషము.

పురిపిట్ట
పురిపులుఁగు } బర్హి, నెమిలి.

పురిలోము. రూ. పురులోము.

పురివిచ్చు. అ. క్రి. వేఱుపడు, విడిపోవు; వెనుదీయు.?

పురివిదుర్చు పిట్ట. నెమిలి.

పురివిప్పియాడెడు పులుఁగు. నెమిలి.

పురీతత్తు. సం. అంత్రము, ప్రేగు.

పురీషము. సం. మలము.

పురుగు. క్రిమి, కీటకము. [రూ. పురుటాలు

పురుటియాలు. ప్రసూతిక, బాలెంతరాలు.

పురుటిల్లు. అరిష్టము, సూతికాగృహము.

పురుడించు. అ. క్రి. పోలికయగు. స. క్రి. పోలు. [యము. విశ. సమానము.

పురుడు. జాతాశౌచము; జాతాశౌచసమ

పురుదము. సం. బంగారము.

పురులోము. స. క్రి. క్షాత్రము మెఱయించు.

పురువు. పురుగు. సం. ఒక నది; ఒక రాజు; స్వర్గము; పరాగము. విశ. మిక్కుటము.

పురుషకారము. సం. పురుషప్రయత్నము.

పురుషదఘ్నము
పురుషద్వయసము } సం. నిలువెఁడు.
పురుషమాత్రము

పురుషము. సం. క్రియలమీఁది విభక్తుల సంజ్ఞ (ఇవి మూడు—ప్రథమపురుషము, మధ్యమపురుషము, ఉత్తమపురుషము); సురపొన్న†; నిలివెండు; శాస్త్రము.?

పురుషమృగారతి. మి. ఆరాత్రికా విశేషము.

పురుషార్థములు. సం. బ. ధర్మము అర్థము కామము మోక్షము ప్రేమభక్తి.

పురుషుఁడు. సం. మగవాఁడు; మనుష్యుఁడు; జీవుఁడు; పరమాత్మ.

పురుషోత్తముఁడు. సం. విష్ణువు, కృష్ణుఁడు; ప్రత్యగాత్మ, పరమాత్మ.

పురుహము
పురుహువు } సం. విశ. మిక్కుటము.

పురుహూతుఁడు. సం. ఇంద్రుఁడు.

పురూరవుఁడు. సం. ఒక రాజు.

పురె. అవ్య. ప్రశంసార్థకము. రూ. భళరే.

పురోగముఁడు
పురోగామి
పురోగుఁడు } సం. విణ. అగ్రేసరుఁడు, ముందు నడచువాఁడు.
పురోడాశము. సం. యజ్ఞార్థమైన అపూపము; సోమలతారసము; హుతశేషము.
పురోణి. చిన్నయుత్తరము, చీటి.
పురోధ-సుఁడు. సం. పురోహితుఁడు.
పురోభాగి సం. విణ. ఎప్పుడును ఒరుల తప్పులే వెదకువాఁడు.
పురోహితుఁడు. సం. సాంగవేదాధ్యాయియు జపహోమములననుష్ఠించువాఁడును ఆశీర్వదించువాఁడును శాంతిక పౌష్టిక కర్మలను చేయించువాఁడునైన పురోధస్సు.
పుర్జా. లక్క-చిట్ట.
పుర్వు. పురుగు.
పుఱియ. పుఱ్ఱె.
పుఱ్ఱ. విణ. ఎడమ, వామము.
పుఱ్ఱచెయి
పుఱ్ఱచెయ్యి } వామహస్తము, ఎడమ చెయ్యి.
పుఱ్ఱియ. పుఱ్ఱె. [పలుచని బుఱద.
పుఱ్ఱు. పలుచని మలము; పలుచని పేడ;
పుఱ్ఱె. కరోటి, పునుక; తలచిప్ప ఎముక.
పుల. విణ. పసుపుమించిన తెలుపువన్నె కలది.
పులకండము. కండచక్కెర.
పులకము. సం. గగుర్పాటు; ఏనుఁగున కిచ్చెడి అన్నపుకబళము; ఒక పురుగు; మణిదోష విశేషము, మణులయందలి చీలిక; వజ్రమణి; హరిదళము; కడప†; పులగము ? [జ్వరము.
పులకరము. పులకము, గగుర్పాటు;
పులకరించు. అ.క్రి. గగుర్పొడుచు.
పులకలు. సం. బ. పులకాంకురములు పొడుచుట.
పులకాంకురము. సం. గరుపొడుచుట.
పులకించు. సం. అ.క్రి. గగుర్పాటుగలది యగు.
పులకోద్గమము సం. గరుపొడుచుట.
పులగము. పొంగలి, పెసరపప్పు చేర్చి వండిన యన్నము, కృసర,

పులగలి. ధాన్యామ్లము, పులికడుగు.
పులప. కందగాని నల్లేరుగాని రొయనిపి పెట్టిన పులుసు.?
పులపొడుచు. అ.క్రి. ఉప్పవేయక మాఁచు.
పులము. సం. గగుర్పాటు. విణ. విపులము.
పులస. మీనభేదము. [గిన పుల్లఁదనము.
పులసరము. పాకము చెడుటవలనఁ గలి
పులసరి. గర్విష్ఠుఁడు. [దుఃఖపడు.
పులసిలు(ల్లు). అ.క్రి. విషణ్ణమగు; కలఁగు;
పులస్తి. పులస్త్యుఁడు. [సంక్షేపము.
పులాకము. సం. పొల్లు; అన్నపు మెతుకు;
పులావు. హిం. ఒక విధమైన వంటకము.
పులి వ్యాఘ్రము; విణ. పులిసినది.
పులికడుగు. పులిసిన కడుగునీరు, ధాన్యామ్లము.
పులికూడు. పులిసినయన్నము; భిక్షాన్నము
పులికోచె. పులిముఖమువంటి ముఖము కలిగిన సాలెపురుగువంటి యొక పెద్దపురుగు.
పులిగంజి. పుల్లనీళ్లు, ఆరనాళకము.
పులిగాయము. ఆఱిన గాయపు మచ్చ.
పులిగోరు. నడుమ వ్యాఘ్రనఖమును పతకమునకు మాలగాఁ గూర్చిన హారము; వ్యాఘ్రనఖము†.
పులిగోళ్ళవంకెలు. బ. ధాన్యవిశేషము.
పులిచించలము
పులిచింత
పులిచెంచేలి } చుక్రిక†.
పులిచెవులాకు. ఒక దినుసు మందుచెట్టు.
పులిజూదము. ఒకానొక ఆట.
పులిత్రేఁపు. అజీర్ణపుత్రేఁపు.
పులితోలు. వ్యాఘ్రచర్మము.
పులినము. సం. ఇసుకతిన్నె.
పులినీరు. రక్తము విఱిగి గాయము మొదలగువానియందుండి కాఱెడునీరు.
పులిపిరి-కాయ. కిణము, మాంసగ్రంథి, దేహమునందు మిరియమువలె పెరిఁగెడు దుర్మాంస విశేషము.
పులిపులి. పులిపిరి. విణ. పీడితము.
పులిపులికాయ. పులిపిరి.
పులిపెంజెర. కాటుకరేకుపాము.
పులిమల. పుంగుడు. [కగా పోనిచ్చు.
పులిమిపుచ్చు. స.క్రి. (విషయమును) తేలి

పులిమీనల నుయ్యాల లూగు. అ. క్రి. సాహసకార్యము చేయు.
పులిమెకము. మత్స్యవిశేషము.
పులిమెట్టు. తేర్చినకడుగుయొక్క యడుగుది.
పులిమేర. సీమాస్థలము.
పులియ. విస్తరాకు; ఎంగిలి విస్తరి.
పులియఁడు. పులివలె నుండుటచే కుక్కకీయఁబడిన పేరు.
పులియఁబాఱు, పులియు. అ. క్రి. పుల్లనగు.
పులియాట. బాలక్రీడావిశేషము.
పులియోర. పులిహోర.
పులిరుసు. రూ. పుల్లిరుసు.
పులివరుగు. పులియఁబెట్టినవరుగు.
పులినరి. పులుగుడు†.
పులిహోర. హరిద్రాన్నము, పులుసుకలిపిన అన్నము. వా. చిత్రాన్నము.
పులు. రత్నాదులమాలిన్యము; గడ్డి. విణ. అల్పము.
పులుఁగు. పక్షి. [విష్ణువు
పులుగుతత్తడిరౌతు. గరుడవాహనుఁడు,
పులుఁగుపిట్ట. గుడ్లగూబ.
పులుఁగుబొల్లఁడు. గరుత్మంతుఁడు, కుందేందు ధవళుఁడు.
పులుఁగుఱాయి. పచ్చ, గరుడపచ్చ.
పులుఁగుఱేఁడు, పులుఁగులదొర. గరుత్మంతుఁడు; ఖగేశ్వరుఁడు.
పులుకండము. కండచక్కెర.
పులుకాసిపురువు. పచ్చనెక్క పురుగు; అల్పుఁడు.
పులుకాసిపులుఁగు. చిలుక.
పులుకుపులుకు. ఱెప్పలు మూసి మూసి తెఱచుచు చూచుటయందగు అనుకరణము. రూ. పుల్కుపుల్కు.
పులుగరి. విణ. జాడయెఱిఁగినవాఁడు.
పులుగాకు. ఉపద్రవము.
పులుగు. గుఱుతు; జాడ.
పులుగుడు. వాతఘ్ని†
పులుచు. మత్స్యవిశేషము. [స్వామి.
పులుచూలి. శరవణభవుఁడు, కుమార
పులుచూలితాత. హిమాద్రి.
పులుచూలిసవతితల్లి. గంగ.
పులుదిండిఱాయి. ఇంద్రనీలమణి. రూ. పులుఁదిండిచలుప. [బిండి.
పులుప. పలుచగా నూఱిన పుల్లయూరుఁ
పులుపు. పుల్లన, ఆమ్లరసము.
పులుమానిసి. అల్పమనుష్యుఁడు.
పులుము. కుష్ఠరోగము. స. క్రి. రుద్దు; నలుపు; పూయు; ఊనుము; కొట్టు.
పులుముడు. పులుముట. [ద్రుమము.
పులుమ్రాను. తాళనారికేళాది తృణ
పులుసు. ఒకరసము, ఆమ్లము; చింతపండు రసము, చోష్యము. [కూర.
పులుసుఁగూర. పులుసుపెట్టి వండిన ఆకు
పులోజా. చక్కెర.
పులోమజ. సం. శచీదేవి, ఇంద్రాణి.
పులోమజిత్తు. సం. ఇంద్రుఁడు.
పుల్కలు. గగురు.
పుల్కసుఁడు. సం. బోయవాఁడు; మాలవాఁడు. విణ. అధముఁడు. రూ. పుక్కసుఁడు.
పుల్కుపుల్కు. రూ. పులుకుపులుకు.
పుల్గము. పులకము.
పుల్గరి. విణ రూ. పులుఁగరి.
పుల్పిరి. రూ. పులిపిరి.
పుల్పొడుచు. అ. క్రి. రూ. పులకపొడుచు.
పుల్ల. పుడక; సమిధ; పొయ్యినిడుకట్టె. విణ. పుల్లనిది; పసుపుమించిన తెలుపు వన్నెగలది.
పుల్లంటుఱాయి. ఇంద్రనీలమణి.
పుల్లకంద. ఒకదినుసుకంద†.
పుల్లగిలు(ల్లు). అ. క్రి. భయపడు.
పుల్లగూర. పులుసుఁగూర.
పుల్లగోరక. నీరుకోడి. [కోల.
పుల్లతి. సాదనకాండ్రు గుఱికి నాటెడు
పుల్లతీఁగ. తిప్పతీఁగ, సోమలత.
పుల్లదానిమ్మ. ఆమ్లదాడిమము†. [గలది.
పుల్లన. ఆమ్లరసము, పులుసు. విణ. పులుసు
పుల్లనీళ్ళు. బ. పులిగంజి, కూటినీళ్లు, అరనాళకము.
పుల్లప్రత్తి. ఒకదినుసుప్రత్తి.
పుల్లప్రబ్బ. ఆమ్ల వేతసము†.

పుల్లబచ్చలి. అత్యమ్లపర్ణి†.
పుల్లమామిడి. కొండమామిడి, కోశామ్రము†. [యుసిరిక†.
పుల్లయుసిరిక. కొండయుసిరిక†; రాచ
పుల్లరి. పసులు కసవు మేయుటకై యిచ్చెడు పన్ను.
పుల్లరుజే. మత్స్యవిశేషము
పుల్లవడు. అ.క్రి. స్తంభించు, నిశ్చేష్టమగు.
పుల్లవావిలి. తెల్లవావిలి, శ్వేతసురస†.
పుల్లవెలఁగ. ఒక దినుసు వెలఁగ†.
పుల్లసిలు (ల్లు). అ.క్రి. విశీర్ణమగు; క్షోభపడు
పుల్లాకు. రూ. పుల్లె.
పుల్లావు. కపిలగోవు.
పుల్లియ. రూ. పుల్లె.
పుల్లిరుసు. తొండపు త్రాటికి ఆనువుగా నమర్చిన చిన్న యిరుసు.
పుల్లు. తృణము, కసవు. విణ. అల్పము.
పుల్లుడి. ఒకానొకప్పుడు సేద్యమున కుపయోగించెడి నేల.
పుల్లుటుకుపాము. సర్పవిశేషము.
పుల్లె. విస్తరాకు; ఎంగిలి విస్తరి.
పుల్లెన. ఒకానొక మందుచెట్టు.
పువు. పువ్వు.
పువుఁబోఁడి. రూ. పువ్వుఁబోఁడి.
పువ్వాటు. ముందు వెనుకల నుయ్యెలవలె నూఁగడుట.
పువ్వార. ఈఁదు కొబ్బరి తాడు మొదలగు వానివంటి చెట్లయొక్క పూఁత.
పువ్వారుఁబోఁడి. పువ్వుఁబోఁడి
పువ్విలుకాఁడు. } మన్మథుఁడు, పుష్పధన్వుఁడు.
పువ్విలుతుఁడు.
పువ్వు పూవు, పుష్పము. [లతలు.
పువ్వుఁదీవెలు. బ. పూఁదీఁగెలు, పుష్ప
పువ్వుంబోఁడి. పువ్వుఁబోఁడి. [యాఁడుది.
పువ్వుఁబోఁడి. పువ్వువలె అందమైన
పువ్వుటెత్తు. చిత్రము వ్రాసెడు పాగర.
పువ్వువేనె. పుష్పరసము, మకరందము.
పువ్వుదోయిళ్ళు. బ. పుష్పాంజలులు.
పువ్వులపొట్లము. చిత్రము వ్రాసెడు పాగర.
పువ్వుల ముడుపు సీమంతోన్నయనము.
పుషితము. సం. విణ. పోషింపఁబడినది.
పుష్కర. సం. మెట్టతామర†

పుష్కరము. సం. ఆకాశము; జలము; తెల్లతామర; మెట్టతామరదుంప; ఏనుఁగు తొండము చివర; వాద్యముల ముఖము; కత్తివాదర; బాణము; చెంగల్వకోష్టు†; పుష్కరతీర్థము; ఒక యోగము; బెగ్గురు పక్షి; ఒక సర్పము; పుష్కరద్వీపము; ఒక మేఘరాజము. [గల స్త్రీ.
పుష్కరాక్షి. సం. తామరలవంటి కన్నులు
పుష్కరాహ్వము సం. బెగ్గురుపక్షి.
పుష్కరి సం. ఏనుఁగు.
పుష్కరిణి. సం. నలుచదరముగా త్రవ్విన కోనేరు; తామర కొలను; ఆఁడేనుఁగు.
పుష్కరుఁడు. ఒక యక్షుఁడు; వరుణుని కొడుకు. [ద్ధము, నిండారు.
పుష్కలము. సం. విణ. శ్రేష్ఠము; సమృ
పుష్టము. సం. విణ. పోషింపఁబడినది; బలిసినది.
పుష్టి. సం. పోషణము; బలుపు; సమృద్ధి.
పుష్పంధయము సం. తుమ్మెద, మధుపము.
పుష్పకము. సం. కుబేరుని విమానము; కుసుమాంజనము, రత్నకంకణము; కుంపటి; కృష్ణుని తేరిగుఱ్ఱములలో నొకటి.
పుష్పకేతువు. సం. కుసుమాంజనము; మన్మథుఁడు. [నందలి యేనుఁగు.
పుష్పదంతము. సం. వాయవ్య దిక్కు
పుష్పదంతుఁడు. సం. ఒక విద్యాధరుఁడు
పుష్పధన్వుఁడు. సం. మన్మథుఁడు.
పుష్పపుటము. సం. అభినయహస్తవిశేషము
పుష్పఫలము. సం. వెలగ†. [విశేషము.
పుష్పమంజరి. సం. పూగుత్తి. బ. ధాన్య
పుష్పము. సం. పూవు; ముట్టురక్తము; గండివనము†; మాచిపత్రి†
పుష్పరథము. సం. పూలతేరు, విహార యోగ్యమగు రథము.
పుష్పరాగము. సం. పీతమణి, పచ్చ.
పుష్పరసము. సం. పూఁదేనె.
పుష్పలావిక. సం. పూలుకోసెడి స్త్రీ; పూలబంతులు సరములు మొ॥ గుచ్చి అమ్మెడు ఆఁడుది.
పుష్పలిహము } సం. తుమ్మెద.
పుష్పలోలుపము
పుష్పవంతులు. సం. సూర్యచంద్రులు.

పుష్పవతి. సం. రజస్వల.
పుష్పవాటిక. సం. పూలతోఁట.
పుష్పశరుఁడు. సం. మన్మథుఁడు.
పుష్పసమయము. సం. వసంతఋతువు.
పుష్పాయుధుఁడు. సం. మన్మథుఁడు.
పుష్పించు. సం. అ. క్రి. వికసించు.
పుష్పిక. సం. గద్య; దంతమలము; లింగ మలము.
పుష్పిణి. సం. రజస్వల.
పుష్పితము. సం. విణ. పూచినది.
పుష్యమి. పుష్యనక్షత్రము.
పుష్యము. సం. పుష్యమి; పుష్యమాసము; కలియుగము.
పుష్యరథము. సం. పుష్పరథము.
పుసలాయించు. స. క్రి. బుజ్జగించు.
పుసి. నేత్రమలము, దూషిక.
పుసుకు. తుమ్ముటమొదలగువాని యందగు ధ్వన్యనుకరణము.
పుస్తక భండారము. సం. గ్రంథాలయము.?
పుస్తక భాండాగారము. గ్రంథాలయము. రూ. పుస్తకభాండారము.
పుస్తకము. సం. లిఖిత పత్ర సంపుటము.
పుస్తము. సం. శిల్పము, శిల్పుల పని ; పుస్తకము; మాంసపుచక్కలము;? సాలెవాఁడు పడుగు చేయుట.?
పుస్తు. దుర్గంధము.
పుస్తె. తాళిబొట్టు, మంగళ సూత్రము; మంగళసూత్రమున గ్రుచ్చెడు బంగారు బిళ్ళ.
పుస్తెముడుపు. కంఠెబొట్టు; రెండవ వివాహమైన స్త్రీ, మారుమనువుది.
పుళిందము. సం. 56 దేశములలో నొకటి.
పుళిందుఁడు. సం. (ఇతర భాష తెలియక అడవియందు వాసము చేయుచు మిక్కిలి జీవహింసాపరుఁడై తిరిగెడు) ఒక జాతి మ్లేచ్ఛుఁడు ( బోయవాఁడు ) ; చెంచువాఁడు ?

## పూ

పూ. పుష్పము.
పూంచు. ప్రే. రూ. పూనుచు.
పూఁచీ. పూఁట, బాధ్యత, జబాబుదారీ
పూఁచు. అ. క్రి. పూను.
పూఁజేప. మత్స్యవిశేషము.
పూఁట. సంధ్య; దినము ; కాలము ; పగటిలో సగము; ఒకఁడు చేయవలసినపనిని నేను చేసెదనని మఱియొకఁడు పూనుట, ప్రతి భూత్వము. విణ పూఁటకాఁపు
పూఁటకాఁడు. విణ వంటవాఁడు.
పూఁటకాఁపు విణ. ప్రతిభువు, ఒకఁడు చేయవలసిన పనిని నేను చేసెదనని పూఁచీ పడువాఁడు.
పూఁటకూళ్లమ్మ. వెల తీసికొని వేళ వేళకు అన్నము వండి పెట్టెడు వంటలక్క.
పూఁటకూళ్ల యిల్లు. పూఁటకూళ్ళు వండి పెట్టెడు గృహము
పూటకూళ్లవాఁడు వెల తీసికొని పూఁట పూఁట అన్నము పెట్టువాఁడు.
పూఁటకూళ్లు. బ. వెలతీసికొని వేళ వేళకు పెట్టెడు అన్నము.
పూఁటపడు. అ. క్రి. పూఁచీపడు.
పూఁటపాటు. పూఁచీపడుట.
పూఁటపెట్టు. ప్రే. పూఁచీపెట్టుట.
పూఁడులు. విణ. బ. అనేక సంవత్సరములు. రూ. పూండ్లు.
పూఁత. పూయుట, చర్చ ; గంధాదులు ; సున్నపుగచ్చు.
పూఁదఱి. వసంతఋతువు, పుష్పసమయము.
పూఁదేనియ. పుష్పరసము, పూఁదేనె.
పూఁపు. ఉద్యమము, పూనిక ; శక్తి ; శౌర్యము.
పూఁబాళ· పూగుత్తి. జ. ధాన్య విశేషము.
పూఁబిందె. మిక్కిలి లేఁత పిందె. రూ. పూఁబిందియ.
పూఁబోఁడి. పువ్వుఁబోఁడి.
పూగము. సం. ప్రోగు, సమూహము; పోఁక మ్రాను; గంగరావి†.
పూగీఫలము. సం. పోఁకకాయ.
పూగుత్తి. పుష్పమంజరి.
పూచి-గ. తృణభేదము; బాధ్యత, పూఁచీ
పూచినది. పుష్పితము.
పూచినమావు. మచ్చలుగల గుఱ్ఱము.
పూచీ. గ్రా. జబాబుదారీ, పూఁచీ.

పూచెండు. పుష్పకందుకము.
పూచే. అ. క్రి. పుష్పించు; తప్పనుల్లు పొడుము; నిస్సారమగు.
పూజ. సం. అర్చన, దేవతాదులకు చేసెడి పరిచర్య, అర్ఘ్యపాద్యాద్యుపచారము; బహుమానము.
పూజకుఁడు. సం. విణ. అర్చకుఁడు.
పూజనము. సం. అర్చన, పూజచేయుట.
పూజనీయుఁడు. సం. విణ. పూజింపఁదగిన వాఁడు.
పూజించే. సం. స. క్రి. అర్చించు, పూజ [చేయు.
పూజితవ్యుఁడు. సం. విణ. పూజనీయుఁడు
పూజితుఁడు. సం. కేలం పు. విణ పూజింపఁబడ్డవాఁడు.
పూజె. ఘటాదుల మీఁది చిత్రము.
పూజెకుండలు } బచ్చెనపని చేసిన పెండ్లి
పూజెగులు } కుండలు.
పూజెసేయు. స. క్రి. ఘటాదులను చిత్రించు. [దగినవాఁడు.
పూజ్యుఁడు. సం. మామ. విణ. పూజింపఁ
పూజే అర్చన, పూజ.
పూజేరి. అర్చకుఁడు. రూ. పూజారి.
పూటము. బరువు.
పూడ. గుదము, ముడ్డి.
పూడిక. నూయి మొదలగు వానియందు అడుగునపూడిన మన్ను.
పూడు. పూడిక. అ. క్రి. మట్టి మొదలగు వానిచే పల్లము నిండు; నిండు.
పూడుఁబాము. డుండుభము, మట్టి లో పూడియుండు ఇరుదలలపాము.
పూడుచే. ప్రే. పూడఁజేయు; పాఁతు. రూ. పూడ్చు.
పూడుపు. పూడ్చుట; నిక్షేపము.
పూత. వికసనము, పూచుట.
పూతక్రతాయి. సం. శచీదేవి.
పూతక్రతువు (ఁడు). సం. ఇంద్రుఁడు.
పూతన. సం. ఒక రాక్షసి; కరక†; బాలగ్రహవిశేషము.
పూతనము. సం. గజవిశేషము.?
పూతము. సం. విణ. తూర్పెత్తినది; పరిశుద్ధమయినది; వడియఁబోసినది; పవిత్రమైనది.

పూతిక. సం. పునుఁగుపిల్లి.
పూతికము. సం. నెమిలడుగుచెట్టు. విణ. దుర్గంధముగలది.
పూతికరజము. సం. నెమిలడుగుచెట్టు.
పూతికాష్ఠము. సం. దేవదారువు† ; సరళవృక్షము.
పూతిగంధము. సం. దుర్గంధము; గంధకము
పూతిగంధి. సం. విణ. దుర్గంధము గలది.
పూతిదారువు దేవదారువు†.
పూతిఫలి. సం కారుగచ్చ†.
పూతిపునుఁగు మి. తట్టుపునుఁగు.
పూత్యండము. సం. కస్తూరి మెకము; కంపు గల ఒక పురుగు.
పూదె. బంగారుపూస. రూ. పూదియ
పూదెగట్టు. అ. క్రి. బంగారు పూసగా నేర్పడు.
పూనిక } ఉద్యమము, పూనుట ; శపథము.
పూనికి }
పూనిగొల్లలు. బ. గొల్లలలో నొక తెగవారు
పూనీరు. పన్నీరు.
పూను. అ క్రి. కడగు, ఉద్యమించు. స. క్రి. ధరించు; వహించు.
పూనుచే. ప్రే. పూనఁజేయు రూ. పూన్చు.
పూనూక. మిక్కిలి సన్న నూక.
పూనూనె. సం పెంగ నూనె.
పూనె. బరణి.
పూన్కి. రూ. పూనికి.
పూన్కికాఁడు. విణ. పూనిక గలవాఁడు.
పూన్చు. ప్రే. పూంచు.
పూప. శిశువు; మిక్కిలి లేఁత కాయ; కంటి పాప. విణ. లేఁత.
పూపము. సం. భక్ష్యము; పిండివంట.
పూపళిక. సం. పోళీలు, ఒక పిండివంట.
పూబంతి. పూలచెండు, పుష్పకందుకము.
పూబోడి. పూఁబోఁడి.
పూమేను. మత్స్యవిశేషము.
పూమొగ్గ. ముకుళము, అరవిరి.
పూయము. సం. విఱిగిన నెత్తురు, చీము ; జూదము;? పీనుఁగు. ?
పూయు. స. క్రి లేపనము చేయు, చందనము మొదలగువానిని అలఁదు; మన్ను మొదలగువానిని మెత్తు.

పూరకము. సం. మాదిఫలము†; గాలిని మెల్లఁగా లోపలికిఁ బీల్చుట.
పూరకుఁడు. సం. విణ. నించువాఁడు, పూరించువాఁడు.
పూరగించే. స. క్రి. నెఱవేర్చు; కడపు
పూరగిల్లు } అ. క్రి. నిండు, పూర్ణమగు
పూరటిల్లు }
పూరణము. సం. నించుట; గుణించుట; కుడుము మొదలగు పిండివంట లోపల బెల్లము వేసి నూఱిన పప్పుముద్ద మొ॥; కైవడిముస్తె†; బూరగు†; గలిజేరు†; విణ. నించునది. [బూరుగు†.
పూరణి. సం. వాపతంతువు, పేక;
పూరము సం. ప్రవాహము; జలప్రవాహము; భక్ష్యము; పూరీ; వ్రణసంశుద్ధి; అగలువత్తి; గలిజేరు†.
పూరా. హిం. విణ. సంపూర్ణమైన.
పూరి. మృగముల చనుపాలు; తృణము, గడ్డిపఱక.
పూరించే. సం. స. క్రి. పూరగించు; నించు
పూరిక. సం. పూరీ; బూరె. [బడ్డది.
పూరితము సం. విణ. నింపఁబడ్డది; గుణింపఁ
పూరిల్లు. గడ్డిల్లు, తృణకుటి.
పూరీ. సం. అపూపవిశేషము, మండకము.
పూరుదొన్నె. ఒకానొక చెట్టు.
పూరుషుఁడు. సం. పురుషుఁడు.
పూరెడు. పూరేడుపిట్ట.
పూరేకు. పుష్పదళము. బ. ధాన్యవిశేషము
పూరేడు. పక్షివిశేషము.
పూర్ణ. సం. తిథివిశేషము. [కుడుములు.
పూర్ణగర్భములు. సం. బ. బూరెలు;
పూర్ణపాత్రము. సం. తండులాది యాగద్రవ్య పూర్ణమైన పాత్రము; హోమాంతమున నిచ్చెడి బ్రహ్మదక్షిణ; జలపూర్ణమైన పాత్రము; పుత్రజన్మోత్సవాదుల యందు అధిపతి శరీరమునుండి సేవకులు సంతోషముతో దోఁచుకొనెడి వస్త్రాభరణాదులు.
పూర్ణమాసము. సం. పున్నమనాటి యాగము. రూ. పౌర్ణమాసము.
పూర్ణమాసి. సం. పున్నమ.

పూర్ణము. సం. విణ. నిండినది; నిండు; శక్తిగలది; సమస్తము; వింటినారిని చెవి దాఁక తిగుచుట.
పూర్ణానకము. సం. పుత్రజన్మాద్యుత్సవ కాలమునందు సేవకులు సంతోషముచే అధిపతి శరీరమునుండి దోఁచుకొనెడి వస్త్రాభరణాదికము; తప్పెట; పాత్రము; పూర్ణపాత్రము.
పూర్ణిమ. సం. పున్నమ. [మగు.
పూర్ణీభవించే. సం. అ. క్రి. నిండు, పూర్ణ
పూర్తము. సం. బావిని చెఱువును కుంటను త్రవ్వించుట గుడికట్టించుట తోఁట పెట్టించుట అన్నసత్రము పెట్టుటయనెడి స్మార్తకర్మ; పాలనము. విణ. నింపఁబడినది; కప్పఁబడినది; పాలింపఁబడినది.
పూర్తి. సం. పూరణము, నింపుట; నిండారుట; పర్యాప్తము.
పూర్ణము. కుడుములు మొదలగు పిండివంటలలోపలఁ బెట్టెడు బెల్లము వేసి నూఱిన పప్పుముద్ద. మొ.
పూర్వ. సం. తూర్పు, తొలిదిక్కు.
పూర్వకము. సం. విణ. మొదటిది.
పూర్వగంగ. సం. నర్మదానది.
పూర్వజ. సం. అక్క. విణ. మొదట పుట్టినది. [పుట్టినవాఁడు.
పూర్వజుఁడు. సం. అన్న. విణ. మొదట
పూర్వదేవులు. సం. బ. తొలివేల్పులు.
పూర్వపక్షము. సం. శుక్లపక్షము; చోద్యము, శంక.
పూర్వపర్వతము. సం. తూర్పుకొండ.
పూర్వఫల్గుని. సం. పుబ్బ, ఒక నక్షత్రము
పూర్వభద్రపదము } సం. పూర్వాభాద్ర, ఒక నక్షత్రము.
పూర్వభాద్రపదము }
పూర్వమీమాంస. సం. ధర్మసూత్రములు.
పూర్వము. సం. విణ. మొదటిది, మొదటి దిక్కుది; మొదటిచోటిది; మందటి కాలముది. అవ్య. మొదట.
పూర్వరంగము. సం. నాటకమునకు మొదలుచేసెడి నాందీపాఠము మొ.
పూర్వరాగము. సం. శ్రవణమువలనఁగాని దర్శనమువలనఁగాని నాయికానాయ

కలకలయికకు ముందేర్పడెడి అనురాగ
విశేషము. [రాత్రి.
పూర్వరాత్రము. సం. ముందటి దినము
పూర్వాషాఢ.సం.ఒకనక్షత్రము.[భాగము.
పూర్వాహ్ణము. సం. పగటియొక్క మొదటి
పూర్వులు. సం. స. బ. ముందటివారు.
పూర్వోత్తర. సం. ఈశాన్య దిగ్భాగము.
పూఱెక్క / పూఱేకు } పుష్పదళము.
పూలకము. సం. గడ్డిపిడికిలి; గడ్డివామి.
పూలగురివెంద. వాసంతి†.
పూలమట్టి. మత్స్యవిశేషము.
పూలము. సం. గడ్డివామి; గడ్డియున్న
పిడికిలి. [పుష్పధారణము.
పూలముడుపు. గర్భిణికి చేయించెడు
పూలమ్మువాఁడు. మాలకరి.
పూలవరహా. ఒక నాణెము. [ధన్వుఁడు.
పూలవిలుతుఁడు. మన్మథుఁడు, పుష్ప
పూలి. ఒకానొక చెట్టు; పూలవరహా.
పూవత్తి. బాణసంచు విశేషము.
పూవింటి—వాఁడు / పూవిలుకాఁడు / పూవిలుతుఁడు } పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.
పూవు. పుష్పము; కాఁకరవత్తి మొదలగు
వాని యందలి పువ్వు; కంటియందు
పడెడి పువ్వు; సౌందర్యము.
పూవుఁబోఁడి. రూ. పువ్వుబోఁడి.
పూవుగట్టు. అ. క్రి పూవుగలదియగు.
పూవుటెత్తు / పూవులపొట్లము } చిత్రము వ్రాసెడి వాగెలు.
పూష. సం సూర్యుఁడు. [నొకఁడు.
పూషుఁడు. సం. ద్వాదశాదిత్యులలో
పూస. వ్రేలు మొదలగువాని కీలు;పూదె;
రంధ్రము కలిగిన మణి. [హారము.
పూసకట్టెము. భక్ష్య విశేషము, మణి
పూసకామంచి. తృణవిశేషము†.
పూసగురుగింజే. గురిజ, గుంజాలత.
పూసగురువెంద. గుంజాలత.
పూసయొముక. కశేరుక, వెన్నుపూస.
పూసలగురివెంద. గుంజాలత.
పూసలవాఁడు. మణికారుఁడు, రత్నములు
సానపెట్టువాఁడు.

# పృ

పృక్క. సం. పిక్క.
పృక్తము. సం. విణ. కూడుకొన్నది.
పృక్తి. సం. స్పర్శము.
పృచ్ఛ. సం. ప్రశ్నము, అడుగుట.
పృచ్ఛించు. సం. పశ్న చేయు, ప్రశ్నించు
పృతన. సం. సేన; సేనావిశేషము. (243
ఏనుఁగులు, 243 రథములు, 729 గుఱ్ఱ
ములు, 1215 మంది కాల్బలము గల
సేన). [పృతనాషాహుఁడు
పృతనాషాట్టు సం. ఇంద్రుఁడు. రూ
పృథ. కుంతీదేవి.
పృథక్పర్ణి. సం. కోలపొన్న†.
పృథగ్జనుఁడు. సం. నీచుఁడు; మూర్ఖుఁడు;
పాపి. [ములు గలది.
పృథగ్విధము. సం. విణ. పెక్కు విధ
పృదివి. సం. భూమి. [థము†.
పృథివీపతి. సం. రాజు; యముఁడు; వృష
పృధుకంరము. కుమ్మరి పురుగు.
పృథుకము. సం. అడుకులు; శిశువు.
పృథురోమము. సం. చేఁప. విణ. పెద్ద
వెంట్రుకలు గలది. [గొప్పది.
పృథులము. సం. విణ. విరివియైనది,
పృథువు. సం. నల్లజీలకఱ్ఱ. ఇంగువ ప్రమాను;
అగ్ని;ఒకరాజు.విణ గొప్పది,విరివియైనది
పృథ్వి. సం. పుడమి, భూమి; ఇంగువ
ప్రమాను; నల్లజిలకఱ. విణ. విరివియైనది.
పృథ్వీక.సం.ఏలకి†; నల్లజిలకఱ†; ఇంగువ
ప్రమాను. [పులి; చిఱుతపులి; చెట్టు
పృదాకువు సం. ఏనుఁగు; పాము; తేలు;
పృశ్ని. సం. కిరణము; బోయవాఁడు.
విణ. అలిపిరి.
పృశ్నిపర్ణి. సం. కోలపొన్న†.
పృషతము. సం. దుప్పి; నీటితుంపురు.
విణ. బ్రహ్మబిందువుతోఁ గూడినది.
పృషత్కము. సం. బాణము.
పృషత్తు. సం. రూ. పృషతము.
పృషదంశకము. సం. పిల్లి.
పృషదశ్వుఁడు. సం. వాయువు.

పృషదాజ్యము. సం. పెరుఁగుతోఁ గలపఁబడిన నేయి.
పృష్టము. సం. విణ. అడుగఁబడినది.
పృష్టి. సం. తాఁకుడు; కిరణము.
పృష్ఠచక్షువు. సం. ఎలుఁగుబంటి; ఎండ్రకాయ. [కడచినపనికి చింతించుట.?
పృష్ఠమాంసాదనము. సం. కొండెము;
పృష్ఠమాంసాదనుఁడు. సం. విణ. కొండెకాఁడు.
పృష్ఠము. సం. వీఁపు; వెనుకప్రక్క; యజ్ఞసంబంధి స్తోత్రవిశేషము; పుట, పేజీ
పృష్ఠ్యము. సం. పృష్ఠములనెడి యజ్ఞసంబంధి స్తోత్రవిశేషముల సమూహము; మోపుమోసెడు గుఱ్ఱము.
పృష్ణి. సం. సూర్యుఁడు; కాలిమడమ; నాఁచు; కిరణము ?

## పె

పె. పెనుపుశబ్దముయొక్క లుప్తరూపము; ఒక స్త్రీప్రత్యయము. (ఆపె, ఈపెయని.)
పెంకి. ఒకానొకతీఁగ.
పెంకు. ఇంటికి కప్పెడు ఓడుబిల్ల; కుండ మొదలగువాని పెంచిక; కరోటివిశేషము
పెంకె. విణ. మొండికట్టె; మూర్ఖుఁడు.
పెంకెపురుగు. ధాన్యమునకుఁ బట్టెడు ఒక దినుసు పురుగు.
పెంచి. పించు.
పెంచిక. కుండ మొదలగువాని పెంకు.
పెంచెము. పించియము.
పెంచు. రూ. పెనుచు.
పెంచుకొను. స. క్రి. దత్తుతీసికొను.
పెంచులబేరి. బాలక్రీడా విశేషము.
పెంజీకఁటి. కటిక చీఁకటి, గాఢాంధకారము; అవ్యక్తము, అజ్ఞానము.
పెంజెర. ఒకదినుసుకొండచిలువ.
పెంట. చీఁపురుకట్టచేత తుడిచిన ప్రోగు, చెత్త, అవకరము; ఎరువుకుప్ప; సమూహము; ఆవులమంద ముందున్న చోటు.
పెంటగట్టు. అ. క్రి. పెంటకైమందగట్టు.
పెంటపట్టు. పసులు మొదలగు వానిదొడ్డి.
పెంటి. పశుపక్ష్యాదులలో ఆఁడుది.
పెంటిక. ఉండ ఉండగా వేసెడు మేఁక మొదలగువాని పేఁడ
పెంటికరడు. చిన్న అల.
పెంటిజింక. ఆఁడుజింక.
పెంటిపడు. అ. క్రి. కవగూడు.
పెంటిపెంజర. పాములలో భేదము.
పెంటిపెనపరి. ఆఁడుదానితో పెనఁగులాడువాఁడు.?
పెంట్రిక } మేకలు మొదలగు దాని
పెంట్రుక } పెంటిక.
పెండ. పేఁడ.
పెండరము. గండపెండేరము. [రము†.?
పెండలము. ఒక జాతి దుంప†; గండీ
పెండారము. గండపెండేరము.
పెండారిమూక. దండు తాలూకు అల్లరి జనము.
పెండియము. పెండేరము; దొడ్డి మొదలైనవాకిటికిఁ బెట్టెడు పెండెము.
పెండిలి. వివాహము. [హముగు.
పెండిలియగు. స. క్రి. పెండ్లియగు, వివా
పెండిలియాడు. స. క్రి. పెండ్లియాడు, వివాహమగు.
పెండిలిసేయు. స. క్రి. పెండ్లిచేయు, పెండ్లాడు. ప్రే. పెండ్లాడఁజేయు.
పెండె. ఇంటివాసములమీఁద అడ్డముగా వేసి కట్టెడు కొయ్య; పాగాను మొదలైనవాని నగయందు నగము.
పెండెకట్లు. బ. పెండెలవలె పట్టెలుగాఁ దీర్చిన విభూతి రేఖలు.
పెండెము. రూ. పెండియము.
పెండెరము. పెండేరము.
పెండేరము. రూ. పెండారము, అందె.
పెండ్లము. పెండ్లాము.
పెండ్లాడు. స. క్రి. పెండ్లియాడు.
పెండ్లాము. అగ్నిసాక్షిగా వివాహమైన భార్య.
పెండ్లి. వివాహము. బ. పెండ్లిండ్లు.
పెండ్లికుండలు. బ. పూజలుపెట్టి పెండ్లియందుపయోగించెడు కుండలు.
పెండ్లికూఁతురు. వివాహదీక్షితురాలు, వధువు; కోడలు.

పెండ్లికొడుకు. వివాహ దీక్షితుఁడు, వరుఁడు; అల్లుఁడు.
పెండ్లిగుమ్మడి. వివాహాది శుభదినముల యందు ఉపయోగించెడు గుమ్మడి, బూడిదగుమ్మడి†.
పెండ్లినడక. పెండ్లియందువలె తిన్నగా నడచు నడక.
పెండ్లియరుఁగు. వివాహవేదిక, పెండ్లి యందు వధూవరులు కూర్చుండుటకై ప్రేలెఁడు ఎత్తున చాకముతీర్చి వేసెడు తిన్నె.
పెండగడియ. ధ్వజము.
పెందలకడ } ద్ర. క్రి. విణ. ప్రొద్దుపోక
పెందలాడ } మునుపు.
పెందిరువడి. (వైష్ణవ పరిభాషయందు) గరుత్మంతుఁడు.
పెందెరువు. రాజమార్గము.
పెందొడ. ఊరుమూలము.
పెంద్రోవ. ముక్తి.
పెంపగు. అ. క్రి. వర్ధిల్లు.
పెంపరలాడు. స. క్రి. చంపు. [చెందు.
పెంపారు. అ. క్రి. గొప్పయగు, పెంపు
పెంపు. వృద్ధి, సమృద్ధి; నాశము; అతిశయము; గౌరవము; మహత్వము. ప్రే. చంపు; నాశముచేయు.
పెంపుజెందు. అ. క్రి. వృద్ధిబొందు.
పెంపుడు. విణ. పెంపఁబడినది.
పెంపుడుకొడుకు. పెంచుకొన్న కొడుకు.
పెంపుడుగున్న. కోయిల.
పెంపుడుచిలుక. పెంచిన చిలుక.
పెంపుడుతల్లి. పెంచుకొన్నతల్లి.
పెంపుమీఱు. అ. క్రి. అతిశయించు.
పెకలించు. ప్రే. పెకల్చు.
పెకలు. అ. క్రి. పెల్లగిల్లు; ప్రయాణమగు.
పెకలుచే. ప్రే. పెకలించు.
పెక్కండ్రు. స. బ. అనేకులు.
పెక్కణము. అభినయముతోడి నృత్యము; మల్లరంగము.
పెక్కలి. ఒకానొక చెట్టు.
పెక్కు. స. అనేకము.
పెక్కుర. స. బ. అనేకులు.
పెక్కువ. వర్ధనము; ఆధిక్యము.
పెగడ. రూ. ప్రెగడ.
పెగలు. అ. క్రి. పెకలు.
పెగలుచే. ప్రే. పెకల్చు.
పెగ్గడ. మంత్రి. [గుమ్మడు†.
పెగ్గుమ్మడు. కాశ్మర్యము, పెద్ద
పెగ్గురు. బెగ్గురుపక్షి.
పెచ్చూరి. విణ. మూర్ఖుఁడు.
పెచ్చు. అక్క అనుబట్టి నాణెములమార్పు మొదలగు వానియందు అధికముగా నిచ్చెడు ధనము; ఫలాదులపైనుండు తోలు. విణ. అధికము. [విజృంభించు.
పెచ్చుపెరుగు. అ. క్రి. వృద్ధిఁబొందు;
పెటపెట. పండ్లు కొఱుకుట మొదలగు వానియందగు ధ్వన్యనుకరణము; కొయ్య మొ॥ ప్రబ్బలగు ధ్వని.
పెటపెటమను } అ. క్రి. పెటపెట అను
పెటపెటలాడు } ధ్వని కలది యగు.
పెటిలు. అ. క్రి. పెట్లు.
పెటుకు. విణ. విరసము.
పెటులు. పెట్లుఁగ్రోవి. అ. క్రి. పెట్లు.
పెట్ట. కుక్కుటి, ఆఁడుకోడి; పెంటి.
పెట్టపోలి }
పెట్టమారి } ఆఁడు కోడివలెనుండు పుంజు
పెట్టియ. పేటిక. రూ. పెట్టె.
పెట్టు. దెబ్బ; ఈవి, దానము, త్యాగము; మాఱు; అవృత్తి. అ. క్రి. కలుగు. స. క్రి. నిక్షేపించు, ఉంచు; పక్షులు మొ॥ గర్భమునుండి గ్రుడ్లను వెలిపుచ్చు; గ్రుడ్లు పొదిఁగి పిల్లనుచేయు; ధరించు; దానము చేయు; ఇచ్చు; మోపు; గోడ మొదలగు వానిని లేపు; నాటు; కొట్టు.
పెట్టుఁజెట్టు. కల్పవృక్షము.
పెట్టుకొను. స. క్రి. ఉంచుకొను.
పెట్టుకోలు. పెట్టుకొనుట.
పెట్టుడు. ఈవి, త్యాగము.
పెట్టుబడి. మూలధనము, దేనికేని వెచ్చము నకై మొదట పెట్టిన ధనము.
పెట్టుమందు. వశ్యౌషధము.
పెట్టువడు. అ. క్రి. దెబ్బతిను.
పెట్టె. పేటిక, సొమ్ములు మొదలగునవి

యుంచెడు పెట్టె; పల్లకి నడిమి పెట్టె; బండిపరముమీఁది పెట్టె; పాము చుట్టుకొను చుట్ట. [ర్చిన బండి.
పెట్టెబండి. పరముమీఁద బెట్టెపలె నమ
పెట్టెఱుఁగుఁబ్రమాను. కల్పవృక్షము.
పెట్టెవెట్టు. అ.క్రి. (పాము) చుట్టుకొను.
పెట్టకొలికికట్టు. స. క్రి. పెడ ఱెక్కలు విఱిచికట్టు.
పెట్లకంబము. అదురువేటు గొట్టము.
పెట్లదిమ్మె. అదురువేటు గొట్టము; చేలయందు పక్షులను తోలుటకై పర్వాకారముగా చేసి పట్టుకొని యుండెడు చేరు. [గలవాఁడు.
పెట్లమారి. విణ. దెబ్బలంతిను స్వభావము
పెట్లాఁగు. మల్లబంధ విశేషము.
పెట్లు. కాలి ధ్వని పూర్వకముగ బ్రద్దలగు; (చర్మము మొ॥ బ్రద్దలగు.
పెట్లుఁగ్రోవి. అదురువేటు గొట్టము.
పెట్లుప్పు. ఒక దినుసు ఉప్పు.
పెఠిల్లు. దెబ్బ తగులుట పిడుగు పడుట మొదలగువాని యందగు ధ్వన్యనుకరణము. [రీతము.
పెడ. వెనుక. విణ. పెద్ద; వెనుకటిది; విప
పెడఁబాయు. స.క్రి. ఎడఁబాయు.
పెడక. కత్తివెనుక భాగము; ఆకు వెనుక భాగము.
పెడకంటి. కాఁపువారి జాతి విశేషము.
పెడకట్టె. విణ. మూర్ఖుఁడు; మూర్ఖురాలు.
పెడకట్టెమాట. విపరీత వాక్యము.
పెడకట్లు. బ. చేతులను వెనుకకు విఱిచి కట్టుట.
పెడకేలు. వెనుకకు త్రిప్పిన భుజము.
పెడగాలు. వెనుకకు మడిచిన కాలు.
పెడచెయ్యి. చేతివెనుకటి భాగము, కరపృష్ఠము.
పెడచెవి. చెవి వెనుకటిభాగము.
పెడచెవిపెట్టు. స. క్రి. వినకపోవు.
పెడచేయి. రూ. పెడచెయ్యి.
పెడతల. కృకాటిక, తల వెనుకటిభాగము
పెడదారి. కాపథము, తప్పుత్రోవ.
పెడనెల. అ ప్ర. తీర్పరి. [ములు.
పెడప్రాయ్యి. ప్రాయ్యిప్రక్కప్రాయ్యి.
పెడబొబ్బ. సింహనాదము, యుద్ధమునందుత్సాహముచే చేయుధ్వని; విపరీత ధ్వని.
పెడమరలు } వెనకకు తిరుగుట. అ. క్రి.
పెడమర్లు } వెనుకకు తిరుగు.
పెడమఱు. అ. క్రి. వెనుకకు మరలు. ప్రే. పెడమరించు.
పెడమల్లె. ఒకజాతి పెద్దమల్లె.
పెడము } వెనుకకు తిరిగిన ముఖము.
పెడమొగము }
పెడమొగమువెట్టు. అ.క్రి. విముఖతనొందు
పెడమోము. పెడమొగము.
పెడమోమువడు. అ. క్రి వెనుకకుతిరిగిన మొగముగు, విముఖత నొందు.
పెడరేచు. ప్రే. పురికొలుపు.
పెడలు. పెగడు. [రాలు.
పెడసరకట్టె. విణ. మూర్ఖుఁడు; మూర్ఖు
పెడసరము. మూర్ఖ్యము.
పెడిసె. అ ప్ర. పక్షివిశేషము.
పెడుచేఁడు బాలుఁడు.
పెడులు. అ. క్రి. పెట్లు.
పెడ్డ. మట్టిపెల్ల, లోష్టము.
పెణక. ఇంటియొక్క ఒక భాగపుకప్పు.
పెతరులచుక్క. పైత్రము, మఘానక్షత్రము
పెతరులసామి. యముఁడు, పితృపతి.
పెతరులు. బ. పితరులు, పితృదేవతలు.
పెత్తనగాఁడు. విణ. అధికారి.
పెత్తనము. అధికారము; పెద్దతనము, వార్ధక్యము.
పెద. విణ. రూ. పెద్ద.
పెదతండ్రి. జ్యేష్ఠ పితృవ్యుఁడు.
పెదవి. ఓష్ఠము.
పెద్ద. విణ. వృద్ధుఁడు, పెద్దవాఁడు, జ్యేష్ఠుఁడు; జ్యేష్ఠురాలు; గొప్పవాఁడు; పెద్దది; గొప్పది; అధికము; శ్రేష్ఠము; దీర్ఘము. క్రి. విణ. అత్యంతము.
పెద్దకక్కెర. కర్కరేటువు.
పెద్దకాఁకర. మహాకారవెల్లము†.
పెద్దకాఁచి. కాకాదని†.
పెద్దకాఁపు. విణ. గ్రామాధికారి, ఊరి

పెద్దకాలము. మి. చాలకాలము.
పెద్దకూఁకటిమ్రాఁగ. కళింగవిశేషము.
పెద్దకొంగ. బలాక.
పెద్దగళిక. గండాలి†.
పెద్దగుమ్మడి. పెండ్లిగుమ్మడి†.
పెద్దగుమ్ముడు. శ్రీపర్ణి†.
పెద్దగోరంట. కురంటకము†.
పెద్దచేఁతరాసి. ఝురసి†.
పెద్దచేమంతి. మహాసహా†.
పెద్దజిలకఱ. సోపు, జీరకవిశేషము†.
పెద్దజెల్లిమెకము. సృమరము.
పెద్దతనము వృద్ధత్వము; గొప్ప; గౌరవము. [నడిపించువాఁడు.
పెద్దతల. విణ. పెద్దగానుండి కార్యముల
పెద్దతుమ్మి. మహాద్రోణము†.
పెద్దది. విణ. గొప్పది.
పెద్దదవనము. దమనక విశేషము†.
పెద్దదుప్పి. రామమృగము.
పెద్దదూలగోవెల. ఒక దూలగోవెల†.
పెద్దదోన. రాజకర్కటి†.
పెద్దనిదుర. మరణము.
పెద్దనిదురవోవు. అ. క్రి. చచ్చు.
పెద్దనిద్దుర. దీర్ఘనిద్ర, చావు.
పెద్దనీలి. మహానీలి†.
పెద్దనెల. జ్యేష్ఠమాసము.
పెద్దనేరేడు మహాజంబువు†.
పెద్దపల్లేరు పీనుఁగుపల్లేరు†.
పెద్దపాఁపర. ఇంద్రవారుణి†.
పెద్దపీఁచర. పీవరి†.
పెద్దపులి. పులి, వ్యాఘ్రము.
పెద్దపులుఁగు. గుడ్లగూబ.
పెద్దపొదుగావు. పెద్ద పొదుగుగల యావు; పీనోధ్ని.
పెద్దపాల. గోమాంసము.
పెద్దబీఱ. రాజకోశాతకి†.
పెద్దబోడతరము. మహాముండిని†.
పెద్దమానేరు. మహాజ్యోతిష్మతి†.
పెద్దముత్తవపులగము. అతిబల†.
పెద్దములక. మహావార్తాకి†.
పెద్దముల్లంగి. మహామూలకము†.
పెద్దమ్మ. జ్యేష్ఠాదేవి, పెదతల్లి.
పెద్దమ్రాను. ఢుండుకము†.
పెద్దయీఁత. స్వర్ణపారేవతము†.
పెద్దయేలకి. ఏలకి†.
పెద్దయ్య. పెదతండ్రి.
పెద్దరోగము. మి. దేహము తెగ దినెడు వ్యాధి, కుష్ఠురోగము.
పెద్దఱికము. పెద్దతనము.
పెద్దలు. బ. విణ. తెలిసినవారు; జ్యేష్ఠులయిన స్త్రీ పురుషులు.
పెద్దవరగోఁగు. బృహత్పీలువు†.
పెద్దవాఁడు. జ్యేష్ఠుఁడు.
పెద్దవాకిలి. గోపురద్వారము.
పెద్దవారము. మి. బుధవారము.
పెద్దవారు. పెద్దలు.
పెద్దవిన్నపము. చెవుడు, బధిరత్వము.
పెద్దవిన్నపముది. చెవిటిది.
పెద్దవిన్నపమువాఁడు. విణ. చెవిటివాఁడు
పెద్దవిరి. మహానీలి†.
పెద్దవీది. రాజమార్గము, రాజవీథి.
పెద్దవేలుపు. బ్రహ్మ.
పెద్దవ్రేలు బొటనవ్రేలు, అంగుష్ఠము.
పెద్దాకుచెట్టు. ఒకానొక అడవిచెట్టు.
పెద్దాపురి. పెద్దాపురమునందు చేయఁబడు చక్కెర.
పెద్దింటమ్మ. ఒక గ్రామదేవత.
పెన్. విణ. పెను, పెద్ద, గొప్ప.
పెన. మెలిక; బంధము; రెండు పశువులను జేర్చి బంధించెడు బంధము.
పెనఁకువ. పెనఁగులాట; చుట్టుకొనుట; మేళనము;యుద్ధము;వివాదము;కలయిక.
పెనఁకువలుగొను. అ. క్రి. మెలివడు.
పెనఁగఁబడు. అ. క్రి. పెనవేసికొను.
పెనఁగాడు, పెనఁగియాడు } అ. క్రి. పెనఁగొను
పెనఁగు. పెనఁకువ. అ. క్రి. పెనఁగొను; చుట్టుకొను; కలయు; యుద్ధము చేయు; మాఱాడు.
పెనఁగులాట. పెనఁగులాడుట. [కొను.
పెనఁగులాడు. అ. క్రి. మల్లాడు, చుట్టు
పెనఁగువడు. అ. క్రి. చేరు.
పెనఁగొను. అ. క్రి. మెలిగొను; చేరు.

పెనఁచే. ప్రే. పెనఁగఁజేయు.
పెనపరి. విణ. వివాదశీలుఁడు; భేదశీలుఁడు. [పెనఁచు.
పెనపు. వివాదము; భేదము. ప్రే. కలపు;
పెనము. కందువు, స్వేదని, దోసెలు పెం॥ కాల్చెడు గుండ్రని యినుపతగడు
పెనయు. అ. క్రి. కలయు; పెనఁగు.
పెనవెట్టు. స. క్రి. మెలివెట్టు.
పెనవేయు. స. క్రి. మెలివెట్టు; పశువులను ఒకటితో నొకటిచేర్చి ముడివేయు.
పెనిమిటి. భర్త.
పెను. విణ. పెనుపుశబ్దముయొక్క లుప్త రూపము. [శాఖ.
పెనుఁగొమ్మ. చెట్టుమొదటికొమ్మ, స్కంధ
పెనుఁబాము. అజగరము.
పెనుకాకరాజోదు. చంద్రుఁడు.
పెనుచే. ప్రే. పెంచు.
పెనుపంజో. కరదీపము.
పెనుపడు. అ. క్రి. అతిశయిల్లు; వర్ధిల్లు.
పెనుపరి. విణ. వృద్ధిఁబొందించువాఁడు.
పెనుపారు. అ. క్రి. పెంపారు.
పెనుపు. పెంచుట; వృద్ధి; ఆధిక్యము; మహాత్త్వము. [క్షేత్రము.
పెనుమసనము. మహాశ్మశానము, కాశీ
పెనుమినుకులు. బ. వేదములు.
పెనుమీనువేఁటరి. గాలకాఁడు.
పెనుమ్రాను. దుండిగము†; పెద్దమ్రాను.
పెనువెల్లి. ప్రళయకాలము నందలియేకార్ణవము.
పెనువ్రేలు. అంగుష్ఠము, బొటనవ్రేలు.
పెన్న. పినాకినీనది.
పెన్నడపులుఁగు. కురరపక్షి.
పెన్నింట. విణ. అధికమైనది; ఉప్పొంగినది; పూర్ణముగానున్నది.
పెన్నిదుర. పెద్దనిద్ర, మరణము.
పెన్నుద్ది. విణ. సరిసమానుఁడు.
పెన్నెరు. పెన్నెరు†. [ములు కలవాడు.
పెన్నెరులవాఁడు. కేశి, సాంద్రశిరోజ
పెన్నేరు. అశ్వగంధ†.
పెన్నొసలు. విశాలఫాలము.
పెన్మిటి. పెనిమిటి.
పెమ్మె. పెద్దతీకము. [దూడ; ఆవు.
పెయ్య. పాలువిడిచిన ఆఁడుదూడ;
పెయ్యదూడ. పెయ్య.
పెర. తేనెతెట్టె; పరము, అన్యము.
పెరండు. పెరడు.
పెరఁడు. పెరడు.
పెరక. పెంకు.
పెరజేలు. పర్వవిశేషములు.
పెరటిచెట్టు. పెరటిలోనున్న చెట్టు; అందుబాటులోనున్నది; తత్క్షణమే ఉపయోగపడు వస్తువు.
పెరడు. ఇంటివెనుక భాగము, దొడ్డి.
పెరతేనె. తేనెలో నొక భేదము. రూ. పెరదేనె.
పెరయీఁగ. ఒక దినుసు తేనెటీఁగ.
పెరయు. స. క్రి. అంటు.
పెరరేచు, పెరరేపు } స. క్రి. ప్రేరేపణచేయు.
పెరవణి. పేరణి యాట.
పెరసు. మాంసము.
పెరిమ. ప్రేమ.
పెరిమె. పెద్దతీకము.
పెరుఁగాకు. పెరుఁగుతోఁటకూర.
పెరుఁగు. దధి. అ. క్రి. వర్ధిల్లు; ఎదుగు. విణ ఏండ్లు చెల్లినవాఁడు; ఏండ్లు చెల్లినది, వృద్ధిపొందినది.
పెరుఁగుడు. వృద్ధి; వృద్ధినొందుట.
పెరుఁగుతోఁటకూర. శాకిని†.
పెరుఁగుసంద్రము. దధిసముద్రము.
పెరుగు. అ. క్రి. తెగు. స. క్రి. తెగిపోవు.
పెరుమాకోయిల. కాంచీపురము.
పెరుమాళ్ళుడుగుబుగ్గ. గంగ, విష్ణుపది.
పెరుమాళ్ళు. బ. విష్ణువు.
పెరువు. రూ. పెరుఁగు.
పెర్క. అ. క్రి. రూ. పెఱుకు.
పెర్గు. అ. క్రి. రూ. పెరుఁగు.
పెర్వు. రూ. పెరువు.
పెఱ. స. అన్యము, మఱియొకటి,
పెఱగాయి. విణ. మత్సితుఁడు.
పెఱపురాళి. మి. ఇతర పురములు.
పెఱమగఁడు. జారుఁడు, పరపురుషుఁడు.

పెఱయది. అన్యమైన స్త్రీ.

పెఱిక. ఎద్దు మొదలగువానిమీఁద వేసి మోయించెడు గోనెమూట.

పెఱికాటము. ఎద్దు దున్నలు మొదలగు వానిచే ధాన్యాదులు మోయించుట.

పెఱుకు. స.క్రి. పీఁకు; పెల్లగించు; మోయు. ప్రే. మోయించు.

పెఱుగు. అ. క్రి. ఉద్యమించు; విజృంభించు.

పెలరు. అ.క్రి. కంపించు.

పెలుకుఱు అ. క్రి. భయాదులచేత అంగములు విలవిలపోవు, అదిరిపడు.

పెలుచ. అతిశయము; ఆగ్రహము; ఆధిక్యము; కాఠిన్యము. విణ. అత్యంతము. ద్ర. క్రి. విణ. ఉచ్చైర్ధ్వకము, గట్టిగా.

పెలుచన. అతిశయము; ఆటోపము; ఆగ్రహము; ఆధిక్యము; కాఠిన్యము; ఉచ్చైర్నాదము.

పెలుఁకుఱు. రూ. పెలుకుఱు.

పెల్చ. రూ. పెలుచ.

పెల్చన. రూ. పెలుచన.

పెల్ల. ఎండి పెల్లగిలిన పలుచని మంటిగడ్డ, లోష్టము.

పెల్లగించు. ప్రే. పెల్లగిలఁజేయు, ఉన్మూలించు, ఉత్పాటించు.

పెల్లగిలు(ల్లు). అ. క్రి. పాదు ఊడిలేచు, ఉన్మూలమగు; పాఱు.

పెల్లాటకత్తె. వేశ్య.

పెల్లిదము. అతిశయము, అధికము.

పెల్లు. అతిశయము; ఆధిక్యము. క్రి. విణ. మిక్కిలి, అత్యంతము. విణ. అధికము.

పెల్లుకొను. అ. క్రి. అతిశయిల్లు.

పెసర. ముద్గము, సస్యవిశేషము.

పెసలు. బ. పెసరధాన్యము, ముద్గములు.

పెళపెళ. చెట్లుకొమ్మలు విఱుగుట విఱుచుట మేఘములు ఉఱుముట మొదలగు వానియందగు ధ్వన్యనుకరణము; ధ్వనివిశేషము.

పెళపెళయను. అ. క్రి. తోలు మొదలగునవి పెళపెళయని ధ్వనించు.

పెళుచ. విణ. మూర్ఖుఁడు; విరసము.

పెళ్లప్రమాను. దున్నినపిమ్మట మిట్టపల్లములు సరిపడ మీఁదనీడ్చెడు పలక.

పెళ్లు. వృక్షశాఖాదులు విఱుగుట విఱుచుట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము; దొడ్డి.

పెళ్లెము. మద్యముచేయుట కనేకవస్తువులు చేర్చి చేసినముద్ద, మేదకము.

## పే

పేఁట నగరము; శాఖానగరము.

పేఁటు. బీఁటిక, చీలిక, పగులు.

పేఁడ. గోమయము.

పేఁడగువ్వ. పారావతవిశేషము.

పేఁడపురుగు. పేఁడయందుండు ఒకదినుసు ఱెక్కలపురుగు, గోమయకీటకము.

పేఁను. స. క్రి. త్రాడు(లేక) దారము పేను

పేఁపపొద. వేత్రగుల్మిని.

పేక. చీట్లపేక; బట్టనేఁతయందలి అడ్డనూలు, వితానము.

పేగు. రూ. ప్రేగు.

పేచకము. సం. గుడ్లగూబ; ఏనుఁగుతోఁక మొదటిచోటు.

పేచకి. సం. ఏనుఁగు.

పేచి. భారము; తంటా; పేచీ.

పేచిక. ఒకానొక చెట్టు.

పేచీ. ధనాదుల విషయమైన తగాదా; పేచి.

పేచీఖోరు. తంటాలమారి.

పేజి. ఇం. పుట.

పేట. హారములో నొక సరము.

పేటకము. సం. పెట్టె.

పేటనఁబెట్టు. అ. క్రి. యత్నించు.

పేటము. సం. పెట్టె.

పేటాడు. అ. క్రి. ఖేదించు; సంచరించు.?

పేటి. నడికట్టు. సం. చిన్నపెట్టె.

పేటిక. సం. చిన్నపెట్టె; సమూహము.

పేటీ. రూ. పేటి.

పేటు. సరిగ మొదలగు వానితో నేసిన పట్టె; పర్వతశిఖరము.

పేడి. నపుంసకుఁడు.

పేడు. సన్నచెక్క; కట్టెపేడు.

పేడె. విణ. గడ్డము మీసము లేనివాఁడు; పెట్టె; గడ్డము మీసము లేనిది. (మాతి.)

పేడెత్తు. అ. క్రి. విచ్చు, తొలఁగు.

పేడెవాఁడు. పేడె.

పేణి. భక్ష్యవిశేషము. రూ. పేణీ.
పేద. భటుఁడు. విణ. పిఱికి; దరిద్రుఁడు; దరిద్రురాలు; అసమర్థుఁడు; అశక్తుఁడు.
పేదరాలు. దరిద్ర.
పేదర్కి. దారిద్ర్యము.
పేదఱికము. దరిద్రత, దారిద్ర్యము.
పేదఱిమి. దారిద్ర్యము; పిఱికితనము.
పేదవడు. అ. క్రి. దారిద్ర్యమునుపొందు; దైన్యమునుపొందు.
పేదవాఁడు. దరిద్రుఁడు.
పేనా. ఇం. కలము.
పేను. యూకము, తలయందు పట్టెడు జంతువిశేషము. స. క్రి. దారము పేఁడు.
పేనుగొఱుకుట. ఇంద్రలుప్తము.
పేనుగ్రుడ్డు. లిక్ష, ఈపి.
పేనుపిల్ల. లిక్ష.
పేన్నీళ్లు. బ. కలయంపి చల్లను పేఁడ కలిపిన నీళ్లు, గోమయోదకము.
పేపర. పక్షివిశేషము.
పేపరు. ఇం. పత్రము; పత్రిక.
పేము వేత్రము†.
పేముబొద్దు. గోడయంచులయందు పేము వలె ఏర్పఱచెడిబొద్దు.
పేయ. రూ. పెయ్య.
పేయగంజి. మెతుకులు గలగంజి.
పేయము. సం. నీళ్లు; పాలు; అచ్చము తేట; కాఁపుడుగంజి. విణ. త్రావఁదగినది
పేరంగి. ఖడ్గము.
పేరంటము. రూ. పేరఁటము.
పేరంటాలు. పేరంటమునకు వచ్చిన ముత్తయిదువ; మృతసువాసిని.
పేరంట్రము. పేరఁటము.
పేరఁటము. పేరంటము, వివాహాదిశుభకార్యముల నడపుటకు ముత్తయిదువలు ఇరుగుపొరుగు ముత్తయిదువులను రమ్మని పిలుచుట; వివాహాది శుభకార్యముల యందు ఇరుగుపొరుగు ముత్తయిదువలు వచ్చిచేయు తత్సంబంధమైన కార్యము.
పేరఁటలు. బ. పేరంటాలు.?
పేరఁటాలికూర. ఒక దినుసు కూరాకు.
పేరఁటాలు. రూ. పేరంటాలు.
పేరడవి. మహారణ్యము.

పేరణము } అంగీ; భాండోపరినృత్యము;
పేరణి } కవచము.
పేరము. పరుగు; గుఱ్ఱపు పరుగు.
పేరాముదపుఁజెట్టు. రక్తైరండము†.
పేరాముదము. రక్తైరండతైలము.
పేరాముదాలు. బ. పేరాముదపు విత్తులు.
పేరి. ఇం. ఒక ఫలవృక్షము.
పేరిణి. పెరవణి.?
పేరిమ. గాంభీర్యము. [స్నేహము.?
పేరిమి. గౌరవము; అతిశయము; ప్రేమ,
పేరిమికాఁడు. విణ. గొప్పవాఁడు.
పేరివము. శైత్యము.
పేరీఁదు. ఖర్జూరము, పరూషము†.
పేరు. నామము; కీర్తి; ప్రాలంబిక, దండ. విణ. పెద్ద, గొప్ప; గొప్పది, అధికము. అ. క్రి. ఘనీభవించు; సాంద్రమగు; అతిశయించు. [ఉంగరము.
పేరుంగరము అంగుళిముద్రి, పేరుచెక్కిన
పేరుకొను. స. క్రి. పేరుపెట్టి పిలుచు; పిలుచు; ఉచ్చరించు; స్తుతించు; నెయ్యి మొ॥ ఘనీభవించు.
పేరుకొనుట. నామగ్రహణము.
పేరుకోలు. పేరుకొనుట.
పేరుగలవాఁడు. విణ. ప్రతిష్ఠపొందిన వాఁడు. [చెప్పు.
పేరుగ్రుచ్చు. స. క్రి. పేరుపెట్టి పిలుచు;
పేరుచు. అ. క్రి. అతిశయించు; విజృంభించు. స. క్రి. ఒకటిమీఁద నొకటి పెట్టు; ఒకటిమీఁదనొకటిగా పెట్టి ఏర్పఱచు. రూ. పేర్చు.
పేరుటుంగరము. పేరుంగరము.
పేరుటురము విశాల†.
పేరుడు. పేరుట, ఘనీభవించుట.
పేరుపడ్డవాఁడు విణ. ప్రతిష్ఠ పొందిన వాఁడు. [కుండపెంకు.
పేరుపు. ఒకటిమీఁద నొకటి పెట్టుట;
పేరె. అడ్డ పేడెము.
పేరెద. విశాల†.
పేరెము. గుఱ్ఱపుపరుగు, పరుగు.
పేరెమువాఱు. అ. క్రి. పరుగెత్తు.
పేరైనవాఁడు. దొర.
పేరొజెము. మరకతమణివిశేషము.

పేరోజము. సం. విషాదిదోషముల విఱి చెడి ఒక ఉపరత్నము. రూ. పేరజము.
పేరోదనము. పేరోజము.
పేరోలగము. నిండుసభ.
పేర్కొను. రూ. పేరుకొను.
పేర్కొనుట. పేరుకొనుట.
పేర్కోలు. రూ. పేరుకోలు.
పేర్చు. రూ. పేరుచు.
పేర్పు. రూ. పేరుపు.
పేర్మి. రూ. పేరిమి.
పేర్మించు. మట్టెలీవలకుర సీనిత్రాడు.
పేలపిండి. సక్తువు, పేలాలు పసరిచేసినపిండి
పేలలు. బ. లాజలు.
పేలవము. సం. విణ. పలచనిది; మెత్తనిది.
పేలా. నీళ్ళుత్రాగెడు ఒకదినుసుపాత్ర.
పేలాలు. వా. బ. లాజలు.
పేలిక. చింపిగుడ్డ. రూ. పేలిక.
పేలు. అ.క్రి. సెగచేత వేఁగియుబుకు.
పేలుచు. ప్రే. పేలఁజేయు. రూ. పేల్చు.
పేవు. రూ. పేగు.
పేశలము. సం. కోయిల; రోఁకలి. విణ. కోమలము; నేర్పుగలది; చక్కనిది.
పేశి. సం. గ్రుడ్డు; కత్తియొఱ; మాంసపు ముద్ద.
పేశీకోశము. సం. గ్రుడ్డు.
పేషణము. సం. నూఱుట.
పేషణి. సం. నూఱెడుఱాయి; సన్నెకల్లు.
పేష్కసు. హిం. జమీఁదారులు ప్రభుత్వమువారికి కట్టుపన్ను.
పేష్కారు. హిం. అమల్దారు క్రింది యుద్యోగస్థుఁడు; తవజేదారునిక్రిందలెక్క వ్రాసెడువాఁడు.?
పేసెము. గుజ్జు, గుంజు.

## పై

పై. పయి, మీఁదు, ఊర్ధ్వభాగము.
పైఁట. రూ. పయఁట, పయిఁట.
పైఁటకొంగు. కొంత ఎడమయెడముగా అడ్డకమ్ములు వాటించిన ఆఁడదాని కొంగు, మైజారు.
పైఁడి. బంగారు; ధనము; ఉంకువ.
పైఁడికంటి. రూ. పయిఁడికంటి.
పైఁడిచూలాలు. వసుగర్భ, భూమి.
పైఁడితామర. మెట్టతామర.
పైఁడినెలఁత. ఇందిర, లక్ష్మి.
పైఁడిప్రత్తి. కార్పాసభేదము. [చేయు.
పైఁడిముడుచు. అ. క్రి. నిశ్చితార్థము
పైఁడిముడుపు. నిశ్చితార్థము, వివాహము నకు ప్రధానము చేయుట.
పైఁడియుమ్మెత్త. కాంచనము†.
పైఁడిఱేఁడు. ధనాధిపతి, కుబేరుఁడు.
పైఁబట్ట. ఉత్తరీయము.
పైఁబు. వ్యర్థోక్తి.
పైకము. రూ. పయికము. సం. పికముల సమూహము, కోయిలలు.
పైకొను. రూ. పయికొను. ప్రే. పైకోలుపు
పైగస్తీలు. బ. గస్తీలను కనిపట్టెడి అధికారులు.
పైజారు. ముచ్చె.
పైజారుమట్ట. మత్స్యవిశేషము.
పైర. సం. ఆఁడువారిపైఁట.
పైఠరము. సం. విణ. కుండలో వండిన పదార్థము.
పైతాణి(ణీ). జలతారు.
పైదాలము. కోపము.
పైతామహము. సం. పితామహుని సొత్తు
పైతృకము. సం. తండ్రిసొత్తు.
పైతృష్వసేయుఁడు, పైతృష్వస్రీయుఁడు } సం. మేనత్త కొడుకు.
పైత్తము. సం. విణ. పిత్తమువలనఁ గలిగినది.
పైత్రము. సం. విణ. పితృసంబంధమైనది.
పైద. పిల్లకాయ.
పైదలి. ఆఁడుది.
పైది. విణ. మీఁదనున్నది.
పైన్. అవ్య. ఊర్ధ్వార్థకము.
పైనము. ప్రయాణము.
పైనిన్. అవ్య. ఊర్ధ్వార్థకము.
పైపడు. అ.క్రి. మీఱు; పైకొను.
పైపాటు. కవియుట.
పైపయిగ. ద్ర.క్రి. విణ. సులభముగా.
పైపెచ్చు. విణ. అదనము.
పైపై. అవ్య. మఱిమఱి.

పైపైగ. ద్ర క్రి. విశ. సులభముగా.
పైబట్ట. ఉత్తరీయము.
పైర. రూ. పయర.
పైరము. ఆవు.
పైరు. సస్యము, వరి మొ. [చంద్రుడు.
పైరులయెకిమీడు. ఓషధీశుండు,
పైరులునులు. మేఘము.
పైలుమాను. హిం. జెట్టివాడు,
పైశాచము. సం నిద్రించియు త్రాగి మై మఱచియు నున్న దానిని రహస్యముగా జేసికొను వివాహము. విశ. పిశాచ సంబంధమైనది.
పైశున్యము. సం. కొండెగానితనము.
పైత్తికము. సం. పిష్టకృతమైన మద్యము. పిష్టముల సమూహము.
పైసరము. రతి.
పైసలా. హిం. తీర్పు.

## పొ

పొ. పొన్ను శబ్దముయొక్క లుప్తరూపము. అవ్య. నిశ్చయమును దెలుపును.
పొంకణము. సంచి; బుట్ట.
పొంకపడు. అ. క్రి. పొందికపడు. ప్రే. పొంకపఱుచు. [అందము.
పొంకము. పొందిక; సౌందర్యము,
పొంకించు. స. క్రి. పొందికపఱుచు.
పొంగటినెల. మార్గశీర్ష మాసము.
పొంగటిపండుగ. మకరసంక్రాంతి.
పొంగట్టు. మేరుపర్వతము.
పొంగరము. ఒకదినుసు పిండివంట.
పొంగలి. పాలుచేర్చి పొంగించునట్టి అన్నము.
పొంగలించు. అ. క్రి. నిక్కు.
పొంగారు. అ. క్రి. ఉబుకు; సంతోషించు; అతిశయించు; విజృంభించు; నిక్కు.
పొంగిలి. పక్షులయాహారము.
పొంగు. ఉల్బణము; సంతోషము; గర్వము; అ. క్రి. ఉబ్బు, ఉల్బణమగు; సంతోషించు; గర్వించు.
పొంగునీళ్ళు. బ. చిట్టుడుకునీళ్లు.
పొంగుప్రాలు. బ. ధాన్యవిశేషము.
పొంగులకట్టు. శరీరమున పొంగువ్యాధిని నివారించు విద్య.
పొంచిక. పొంచు. [డుట.
పొంచెడము. గూఢనివసతి; పొంచియుం
పొంచు. ఏదేనినుద్దేశించి మఱుగుపడి కను పెట్టియుండు.
పొంజు. రూ. పోజు
పొంటె. ద్ర. కోలకు.
పొంత. సమీపము; తీరము.
పొంతకడవ. పొయ్యిదగ్గఱి నీళ్ళకుండ.
పొంతకత్తె. కుంటెనకత్తె.
పొంతకన్ను. నిలుకడగలచూపు.
పొంతనము. గ్రహమైత్రి
పొంతము. పొందు, స్నేహము.
పొందామర. బంగారువన్నె తామర; సువర్ణమయ పద్మము.
పొందామరలపంట. గంగ.
పొందిక. పొంకము; చేరిక; కలయిక.
పొందు. పొందిక; స్నేహము; సంధి; ప్రాప్తి; అభేదము; ఆనుకూల్యము. అ క్రి. (కన్ను) వాలు. స. క్రి. ప్రాప్తించు; కలయు, విశ. స్నేహితుడు.
పొందుకాడు. మిత్రుడు.
పొందుకొను. అ. క్రి. స్థిరపడు.
పొందుపడు. అ క్రి. అనుకూలించు.
పొందుపాటు. అనుకూలించుట.
పొంపిరి. సాంద్రము. విశ. సాంద్రత.
పొంపిరివోవు. అ. క్రి. అతిశయించు; వర్ధిల్లు వ్యాపించు; పుట్టు; సంతోషించు; విజృంభించు; ప్రసిద్ధికెక్కు.
పొంపు. మెడవెనుకటిభాగము; ఒప్పు; ఉత్సాహము; పరాక్రమము.
పొంపెసలారు. అ. క్రి. ఒప్పగు.
పొంబోరవేల్పు. బ్రహ్మ.
పొకారు. అ. క్రి. నాశమగు.
పొకారుచు. ప్రే. నాశముచేయు.
పొకాలు. అ. క్రి. వెడలు; పోవు.
పొక్కడ. మనోవ్యథ. [పెట్టినప్రొయ్యి.
పొక్కలి. ఎత్తుడుప్రొయ్యి; మూడురాళ్లు
పొక్కి. గుఱుతు; ఉపాయము; సమీపము.
పొక్కిపోవడి. జనశ్రుతిభేదము.

పొక్కిలి. బొడ్డు; గుంట, పల్లము; అక్షు రావయవము.
పొక్కిలిచూలి } నాభిజన్ముఁడు; బ్రహ్మ
పొక్కిలిపాపఁడు } దేవుఁడు.
పొక్కు. దుఃఖము; బొబ్బ; ఎండిలేచిన పెల్ల; జనశ్రుతివిశేషము. అ. క్రి. దుఃఖించు బొబ్బలేచు; ఊలుకు.
పొక్కుడు. పొక్కు; ఎండి లేచిన పెల్ల.
పొగ. ధూమము; పొగచెట్టు. [నేత్రము.
పొగకన్ను అగ్ని జనించిన శివుని ఫాల
పొగకట్టి. ఇంటిపైకప్పు సందులయందు పొగచేత చుట్టఁబడి కట్టివలెఁగనఁబడెడు సూర్యకిరణము.
పొగగూఁడు. ఇంటికప్పునందు పొగపోవుటకేర్పఱచిన సందు.
పొగచెట్టు. ధూమపత్త్రి†.
పొగచు. ప్రే. పొగయించు; సాంతాళించు
పొగచుట్ట. పొగాకుచుట్ట.
పొగచూరు. అ. క్రి. పొగపట్టు.
పొగడ. వకుళము†.
పొగడిక. స్తోత్రము.
పొగడికొనుట. ఆత్మస్తుతి.
పొగడికోలు. స్తోత్రము.
పొగడిత. రూ. పొగడ్త.
పొగడు. స్తోత్రము. స. క్రి. స్తుతించు.
పొగడ్త. స్తుతించుట; స్తుతి; కీర్తి.
పొగడ్తపడు. అ. క్రి. స్తుతింపఁబడు.
పొగపు. తాలింపు, సాంతాళింపు, తిరుగఁబోఁత. ప్రే. సాంతాళించు. [పంచు.
పొగబాణము. మి. ఒకదినుసు బాణపు
పొగయు. అ. క్రి. పొగగలదియగు; కుములు
పొగరు. గర్వము; ధైర్యము; తీక్ష్ణగంధము
పొగరుఁగోయిల. గండుగోయిల.
పొగరుఁబోతు. విణ. గర్వశీలుఁడు.
పొగరుపాడ ఏనుఁగుసిబ్బెము.
పొగాకు. ధూమపత్త్రము.
పొగుపు. తాలింపు, తిరుగఁబోఁత?.
పొగులు. అ. క్రి. పరితపించు; కుములు.
పొచ్చెము. న్యూనత; కపటము; కల్మషము. విణ. న్యూనము.
పొట. దొప్ప. [ఉబ్బు; వర్ధిల్లు.
పొటకరించు. అ. క్రి. అతిశయించు;
పొటకళి(ళ్ళి). రూ. పొట్టకళ్ళి.
పొటపొట. రాలుట పడుట కురియుట మొదలగు వానియందగు ధ్వన్యనుకరణము.
పొటమరించు } అ. క్రి. బొబ్బ మొ॥
పొటమరిలు(ల్లు) } లేచు; చిగురు మొ॥ పుట్టు.
పొటము. నాసాపుటము. అ. క్రి. పుట్టు.
పొటి. విణ. పొట్టి.
పొటిపొటి, విణ. అల్పము.
పొటుకు. చెట్టుమీఁదనుండి చినుకులు పడుటయందగు ధ్వన్యనుకరణము; ప్రొద్దుపొడుచుట యందును క్రుంకుట యందును అగు అనుకరణము.
పొటుక్కు. రూ. పొటుకు.
పొటేలు. పొట్టేలు.
పొట్ట. కుక్షి, కడుపు; వరిపొట్ట.
పొట్టకళి. రూ. పొట్టకళ్ళి.
పొట్టకఱుకు ఎన్ను పొట్టపట్టు పరువము.
పొట్టకళ్ళి. బయటికిరాక లోపల బలిసి యుండు ఎన్ను, కలమగర్భము.
పొట్టకూటివాఁడు. విణ. కడుపుకూటికి పనిచేయువాఁడు.
పొట్టకూడు. జీతమునకు మాఱుగా పొట్టకు పెట్టెడి అన్నము. [మదము.
పొట్టక్రొవ్వు. ఆహారమువలనఁ గలిగిన
పొట్టపట్టెడ. టంగువారు.
పొట్టపెంజెర. ఒకదినుసు పెంజెర.
పొట్టపొంగెడుకట్టు. కడుపు ఉబ్బినపుడు దానిని పోఁగొట్టు విద్య.
పొట్టపోసికొను. మానావమానములు ఎంచక కడుపు నించుకొను.
పొట్టపోసికొనువాఁడు. కుక్షింభరుఁడు.
పొట్టము. గోఁచి. [త్కుక్షి.
పొట్టవాఁడు. బొజ్జకడుపువాఁడు, బృహ
పొట్టి. విణ. వామనుఁడు; వామనము.
పొట్టింపుచీరణము. ఒకదినుసు చిన్న ఉలి.
పొట్టికాఁకర. పొట్టికాయలుగల కాఁకర, కర్కోటకి†.
పొట్టిత్రివిక్రముఁడు. మి. హ్రస్వస్వరూపుఁడైన త్రివిక్రముఁడు.
పొట్టిపిట్ట. పక్షివిశేషము.

పొట్టయ. తేలు.
పొట్టియావు. వామని.
పొట్టివడుగు. వామనుఁడు, విష్ణువు.
పొట్టివాఁడు. వామనుఁడు.
పొట్టు. ఊక; కాయధాన్యము మీఁది తోలు; కాయధాన్యముల త్వక్సమూహము.
పొట్టుపొరలగు. అ. క్రి. పీడితమగు.
పొట్టెలు } పొట్టేలు } మేషము, గొఱ్ఱెపోతు.
పొట్రేను. భూబదరిక.
పొట్ల. పటోలిక†.
పొట్లపూరెక్క (రిక్క). పుష్యమి.
పొట్లపూరిక్కనెల. పుష్యమాసము.
పొట్లము. పొటలిక, పువ్వులు మొదలగు వానిని ఆకులు మొదలగువానియందుంచి మడిచిన మడుపు; వస్తువులు చేర్చి పెట్టు చిన్న కాగితపు గుంపు; సేన.
పొట్లు. అ. క్రి. అప్ర. పొఁచిపట్టు.
పొడ. రూపు; చూపు; దేహమునందు పెద్దబొట్టుగా నేర్పడు రేఖ.
పొడక. రూ. పొణక.
పొడకట్టు. అ. క్రి. స్ఫురించు; కనఁబడు; ప్రత్యక్షమగు. [శివుఁడు.
పొడకోకఁగట్టుప్రోడ. కృత్తివాసుఁడు,
పొడకోడి. అడవికోడి.
పొడగను } పొడగాంచు } స. క్రి. చూచు.
పొడగానుపు } పొడగాన్పు } దర్శనము, చూపు.
పొడచూచు. స. క్రి. చూచు. [మగు.
పొడచూపు. అ. క్రి. కనఁబడు; ప్రత్యక్ష
పొడతామర. ఒక చర్మవ్యాధి.
పొడతెంచు. అ. క్రి. ఉదయించు; పుట్టు.
పొడదామర. పొడతామర; ఒక దినుసు పచ్చాకు†. [పొరగా నేర్పడు నీడ.
పొడనీడ. సందులగుండ తోఁచి పొడ
పొడపత్రి. ఒకానొక చెట్టు.
పొడము. అ. క్రి. పుట్టు, జనించు.
పొడమేనుమెకము. దుప్పి.
పొడయెండ. సందులగుండ తోఁచి పొడ పొడగా నేర్పడు ఎండ.

పొడలమెకము. దుప్పి. [శివుఁడు.
పొడలగింటెముదాల్పు. కృత్తివాసుఁడు,
పొడలావు. చిన్న తెల్లమచ్చలు గల ఆవు.
పొడవడఁగు. అ క్రి. చెడు; చచ్చు.
పొడవడఁచు. ప్రే. చెఱచు; చంపు.
పొడవడు. అ. క్రి. కనఁబడు.
పొడవు. రూపు. [పడు.
పొడవుసూపు. అ. క్రి. ప్రత్యక్షమగు; అగ
పొడసుత్తె. చిన్న సుత్తె.
పొడి. చూర్ణము. విణ. ఎండినది.
పొడికాయ. పొడుము కాయ, నశ్యము నుంచుకొను కాయ. [కొట్టు.
పొడిగొట్టు. స. క్రి. చేనియందలి చెట్లు
పొడిచీఁకటి. మసమసకని చీఁకటి.
పొడిపిట్ట. పక్షివిశేషము.
పొడిసేయు. స. క్రి. చూర్ణము చేయు.
పొడుగు. మీఁదు; ఉన్నతి; ఎత్తు. విణ. ఉన్నతము; ఉత్కృష్టము. అ. క్రి. ఉన్నతమగు; వర్ధిల్లు. [దీర్ఘిక.
పొడుగుమడుఁగు. ఆకాశగంగ, సుర
పొడుచు. అ. క్రి. పశువులు పొడుచుకొను, పోట్లాడు; ప్రొద్దు (లేక) చుక్క పొడుచు, ఉదయించు. స. క్రి. కొమ్ములతో పొడుచు; పిడికిలి మొదలగు వానితో గ్రుమ్ము; బల్లెము మొదలగు వాలతోఁ గ్రుచ్చు; వేయు; కుట్టు (ఆన) పెట్టు.
పొడుపు. పొడుచుట; పోటు; ఉదయము.
పొడుపుఁగొండ } పొడుపుగుబ్బలి } ఉదయాద్రి, తూర్పు కొండ.
పొడుపువ్రేలు. చూపుడువ్రేలు.
పొడుము. పొడి, చూర్ణము.
పొడువ } పొడువఁడు } విణ. దుర్జనుఁడు.
పొడువు. ఉన్నతి; ఎత్తు; మీఁదు. విణ. ఉన్నతము; ఉత్కృష్టము.
పొడ్ము. అ. క్రి. రూ. పొడము.
పొణక. ఈఁతబ్రద్దలు మొదలగువానితో నల్లినబొట్ట, ధాన్యాదులు పోయు కుసూల విశేషము.
పొణకుకజ్జ. తేలికయైన యొకదినుసుకజ్జ.
పొణిమి. అవధానము.

పొణుకుగడ్డి. తృణభేదము.
పొతము. పొట్లము; గుంపు.
పొతుకు. ధాన్యపురాశిచుట్టుఁగీఁచెడు గిఱి.
పొత్తకము. పుస్తకము.
పొత్తము. పుస్తము; గ్రంథము; కావ్యము.
పొత్తమముత్తో. పుస్తకాభిమానిని యగు ముత్తైదువ, సరస్వతి.
పొత్తర. ఆకులు మొదలగువానికట్ట.
పొత్తరము. నూఱెడు గుండ్రాయి, శిలాపుత్రిక.
పొత్తరముల్లు. ఒకదినుసుపచ్చిక.
పొత్తి. మెత్తని సన్నని పొంతవస్త్రము; చెట్టుమీఁదినార; పోఁక; పూగుత్తిమీఁది పట్ట; విశల్య†.
పొత్తిక. పొత్తి.
పొత్తికడుపు. వస్తి, బొడ్డుక్రిందికడుపు.
పొత్తిగడ్డ. విశల్య†.
పొత్తిచీర. నారచీర†.
పొత్తిదామర. అత్తపత్తి†.
పొత్తినూలికాయ. పొత్తినూలిగూఁడు.
పొత్తినూలు. పట్టుపురుగు నేసెడు పట్టునూలు. [మెత్తని సన్నని వస్త్రము.
పొత్తియ. బాలాచ్ఛాదన వస్త్రము;
పొత్తు. స్నేహము; సంగతి, సంబంధము; అవిభక్తత; ఉమ్మడి. విణ. స్నేహితము; సంగతము; జగ్గి.?
పొత్తుకత్తె. విణ. స్నేహితురాలు.
పొత్తుకాఁడు. విణ. స్నేహితుఁడు.
పొత్తుగుడుపు. 'జగ్గి, సహభోజనము; (ఇరువురు చేసెడి) ఏకపాత్రభోజనము.
పొత్తుటాలు. వేశ్య.
పొత్తువు. సరస్వతి.
పొత్తుసేయు. అ.క్రి. స్నేహించు.
పొత్తె. రూ. పొత్తియ.
పొత్తెము, గరిడీసాలయందు క్రిందపఱచెడి యొల్లమన్ను.
పొత్ర. రూ. పొత్తర.
పొత్రము. రూ. పొత్తరము.
పొద. గుల్మిని, ఒకటితోనొకటి పెనఁగొన్న బోదెలేని చిన్న చెట్లగుంపు; నికుంజము.
పొదక. పెద్దగొంతు, పెద్దయెలుఁగు.
పొదడు. విణ. వామనుఁడు; వామనము.
పొదరిండ్లమకర్ర. పునర్వసు.
పొదరిల్లు. ఇంటివలెనుండు పొద.
పొదరు పొద.
పొదరుటిల్లు. పొదరిల్లు.
పొదలాడు. అ. క్రి. వర్ధిల్లు.
పొదలిక. పెంపు, వృద్ధి.
పొదలు. అ. క్రి. వర్ధిల్లు.
పొదలుకొను. అ. క్రి. పెరుఁగు; బలియు.
పొదవెట్టు. స.క్రి. సూచించు; ఆరోపించు.
పొది. పొదుఁగు; భారము; తూణీరము, అమ్ములపొది; సమూహము; మంగలవాని అడపము, క్షురధానము.
పొదికట్టు. వాకిటిముందటి పంచపాక.
పొదిగిలి. ప్రక్కకు సందిటికిని నడిమి భాగము.
పొదిగొను. అ. క్రి. గుంపుగూడు. స. క్రి. పరివేష్టించు.
పొదిటి. విణ. పొట్టి.
పొదీనా. రూ. పుదీనా†.
పొదుఁగు. ఆవు గేదె మొదలగువానికి పాలుండెడు చోటు, ఊధము.
పొదుఁగుచేయు. అ. క్రి. (ఆవు, గేదె ఈనఁబోవుసమయమున) పెద్ద పొదుఁగు గలది యగు.
పొదుక. పొది, భారము.
పొదుగు. పొత్తిగుడ్డ?. స. క్రి. క్రమ్ము; (రత్నములు మొదలగువానిని) చెక్కు; కప్పు; పక్షులు గ్రుడ్లను ఱెక్కలతో కప్పు.
పొదుగుడు. కప్పుడు.
పొదుగునీళ్లు. బ. బాలక్రీడావిశేషము.
పొదుపు. వృద్ధి.
పొదురు. అ. క్రి. పూచు. ప్రే. పొదిరించు.
పొదువు, రూ. పొదుగు.
పొద్దు. రూ. ప్రొద్దు.
పొన. రూ. పొన్న.
పొనఁటివది. తావితోఁ బెనచినది.
పొనరారు. అ. క్రి. ఒప్పు.
పొనరు. రూ. ఒనరు. [రూ. పొనర్చు.
పొనరుచు. ప్రే. కావించు; పొసఁగించు.
పొనరువడు. అ. క్రి. పొందువడు.
పొనలు. అ. క్రి. దగదగమందు.

పొనిక. ముంజిగడ్డి†. [జము; పొట్టి.
పొనుఁగు. తృణవిశేషము. విణ. నిస్తే
పొనుఁగుఁజేఁప. మత్స్యవిశేషము.
పొనుఁగువడు, పొనుపడు } అ. క్రి. నిస్తేజమగు; ఉడుగు; నశించు; శూన్యమగు.
పొనుపు. విణ. పరాక్రమము. [మైనది.
పొన్న. పున్నాగము†. విణ. దృగ్గోచర
పొన్నంగి. పక్షివిశేషము.
పొన్నగంటి. ఒకదినుసుకూర, మత్స్యాక్షి†
పొన్నశ్రీరాజనాలు బ. ధాన్యవిశేషము.
పొన్నట్టు. అబక; చట్టువము.
పొన్నరి. మనోజ్ఞము.
పొన్నాడ. ఒక దినుసు చిఱుతపులి.
పొన్నారి. విణ. మనోజ్ఞము; స్వర్ణకారుఁడు.?
పొన్నికొమ్మ. అంచయాన.
పొన్ను. బంగారు; కోఁకలి మొదలగు వాని మొనను వేసెడు లోహవలయము.
పొన్పడు. రూ. పొనుపడు.
పొమ్ము. క్రి. నిశ్చయమును దెలుపునది.
పొయి. పొయ్యి. [తల, దొంగతల.
పొయితల. అసలుతలను బోలిన అబద్ధపు
పొయ్యి. ప్రొయ్యి, అధిశ్రయణి.
పొర. అరఁటి ఉల్లి మొదలగువాని పైని పొర; కంటిపొర, నేత్రరోగవిశేషము; పాముయొక్క కుబుసము; కుచ్ఛితము; మడత; ప్రమాదము, అపోహ.
పొరంబోకు. పోరంబోకు.
పొరఁటినది. తావితోఁ బెనచినది.
పొరఁటు. స. క్రి. కూరాకు నీళ్లిగుర పొర్లించివండు. [-చీఁపురుకట్ట.
పొరకే. గడ్డిపోఁచ; ఈనపుడుక;
పొరకచేఁప. మత్స్యవిశేషము.
పొరకటి. వాకిటి చేరువ గోడ.
పొరకసుడి. ఎద్దులు మొదలగువానిమీఁది తప్పుసుడి. [ధనాదికము.
పొరచి. చేబదులుగా అడిగితెచ్చుకొన్న
పొరట. పుట, పేజి, పృష్ఠము.
పొరతెరవు. తప్పుత్రోవ.
పొరపడు. అ. క్రి. ప్రమాదపడు.
పొరపాటు. ప్రమాదము, పొరపడుట.
పొరపు. భేదము. విణ. భిన్నము.
పొరపొచ్చెము. కల్లకపటము. [నెక్కు
పొరపోవు. అ. క్రి. నీళ్లు మెం॥ పొరదారి.
పొరయు. అ. క్రి. కలుగు; పొంచు. స. క్రి. పొందు. ఫలముఁజెందు.
పొరలఁబడు. అ. క్రి. పొరలు.
పొరలాట. పొరలాడుట, లంఘనము.
పొరలాడు. అ. క్రి. పొరలు.
పొరలించు. స. క్రి. పొరలు౧.
పొరలిక. పొరలుట, లంఘనము.
పొరలియాడు. అ. క్రి. పొరలాడు.
పొరలు. పొరలిక. అ. క్రి. పొర్లు; ప్రవర్తిల్లు.
పొరలుచు. ప్రే. పొరలించు. [దండము.
పొరలుదండము. పొరలుచు పెట్టెడు
పొరలువెట్టు. అ. క్రి. పొరలు.
పొరల్చు. ప్రే. పొరలించు.
పొరి. లాభము; నష్టము; బలి, మరణము. ద్ర. క్రి. విణ. అత్యంతము; దృఢముగా; క్రమముగా; మాటికి.
పొరిగొను. స. క్రి. చంపు; నాశముచేయు
పొరిచూపు. క్రూరదృష్టి; భేదదృష్టి.
పొరిమారుచు. ప్రే. చంపు. రూ. పొరిమార్చు.
పొరిమాలు. అ. క్రి. చచ్చు.
పొరిమాలుచు, పొరిమాల్చు, పొరివుచ్చు } ప్రే. చంపు.
పొరివోవు. అ. క్రి. చచ్చు.
పొరుగు. పార్శ్వము, ప్రక్క; ప్రాతివేశ్యకత, ఇరుగునకుప్రక్క; సమీపము.
పొరుగూరు, పొరుగునూరు } ప్రక్కనున్న గ్రామము.
పొరువు, పొర్గు } రూ. పొరుగు.
పొర్లాడు. అ. క్రి. పొరలాడు.
పొర్లిక. రూ. పొరలిక. [కూడు.
పొర్లు. అ. క్రి. పొర్లాడు; పశుమిథునము
పొర్లుకట్ట. వెల్లువ పొరలిరాక అడ్డముగా వేసెడుకట్ట.
పొర్లుగాఁడి. క్రోష్టుపుచ్ఛిక†.
పొర్లుట. పొరలుట; త్రొక్కుట.

పొఱడు. గూను.
పొఱడువోవు. అ. క్రి. గూనుపడు.
పొఱయు. స. క్రి. పొందు.
పొఱివుచ్చు. ప్రే. కలఁచు.
పొఱివోవు. అ. క్రి. కలఁగు.
పొల. పొలసు. విణ. అల్ల.
పొలఁకు. తృణశ్రేణి†.
పొలతి } స్త్రీ.
పొలతుక }
పొలకు. అ ప్ర. దుండిగపు ఫలము.
పొలకువ. పోబడి, జాడ.
పొలదిండి. రాక్షసుఁడు., క్రవ్యాదుఁడు.
పొలపము. వ్యాప్తి; వాసన; ప్రకాశము. విణ. వ్యాప్తము.
పొలపరి. విణ. జాడ తెలిసినవాఁడు; తెరువాటుకాఁడు.
పొలపొల. పొక్కుటయందగు అనుకరణము.
పొలమరి. పొలముకాఁపు. విణ. జాడ తెలిసినవాఁడు.
పొలమారు. అ క్రి. ప్రమాదపడు.
పొలమార్చు. ప్రే. పొలమారఁజేయు.
పొలము. కృషియోగ్యభూమి; పసులు మేయు కంచె; అడవి; ప్రదేశము; ఊరు; జాడ; విధము.
పొలముపాటు. పైరుపెట్టుట, కృషి.
పొలయలుక. ప్రణయకోపము. రూ. పొలయల్క.
పొలయిక. సంచారము; వ్యాప్తి.
పొలయు. అ. క్రి. సంచరించు; వ్యాపించు; సమీపించు; ప్రవేశించు.
పొలస. అ. ప్ర. మత్స్య విశేషము.
పొలసాడు. అ. క్రి. సంచరించు. రూ. పొలసియాడు.
పొలసు. మాంసము; మాంసపు దుర్గంధము; శల్కము, చేపమీఁది పొట్టు.
పొలసుదిండి. రూ. పొలదిండి.
పొలి లాభము; నష్టము; బలి, మరణము.
పొలికలను. యుద్ధభూమి.
పొలితి. స్త్రీ.
పొలిమేర-సమ. మి. సరిహద్దుప్రదేశము; గ్రామద్వయ మధ్యప్రదేశము; ఎల్ల, సరిహద్దు.
పొలియక. నాశము; మరణము.
పొలియు. అ. క్రి. చెడు; చచ్చు.
పొలివుచ్చు. ప్రే. పొలిపోవఁజేయు.
పొలివెట్టు. గుడికేర్పఱచిన స్థితి.
పొలివోవు. అ. క్రి. చచ్చు; చెడు; వ్యర్థమగు; ఉడుగు; భంగపడు.
పొలు. మాంసము.
పొలుచు. అ. క్రి. ప్రత్యక్షమగు; కనఁబడు; ఒప్పు; స్థిరమగు. రూ. పొల్చు.
పొలుతుక. స్త్రీ.
పొలునోరు వంకరనోరు.
పొలుపారు. అ. క్రి. ఒప్పారు. రూ. పొల్వారు.
పొలుపు. ఒప్పు; విధము; విలాసము; సౌందర్యము; స్థైర్యము. విణ. స్థిరము; మంజులము. రూ. పొల్పు.
పొలుపువోలె. ద్ర. ఇవార్థముపై ఇవార్థము.
పొలువ. విణ. దుర్జనుఁడు.
పొలువడు. అ. క్రి. తఱుఁగు, క్షయించు.
పొల్తి } స్త్రీ.
పొల్తుక }
పొల్ల. బొత్తిగా గింజపట్టని ధాన్యము. విణ. అబద్ధము; వ్యర్థము; లోపుడైనది; వ్యర్థుఁడు.
పొల్లకట్టు. తుచ్ఛధాన్యము; బొత్తిగా గింజపట్టని ధాన్యసమూహము.
పొల్లతనము. అపజయము; అపౌరుషము.
పొల్లవడు. అ. క్రి. వ్యర్థమగు; క్షయించు.
పొల్లవుచ్చు. ప్రే. పొల్లవోవఁజేయు.
పొల్లవోవు. అ. క్రి. పొల్లవడు.
పొల్లు. పొల్ల; నిరర్థకశబ్దము. విణ. వ్యర్థము; అసత్యము.
పొల్లుఁదనము. అపౌరుషము.
పొల్లువడు. రూ. పొల్లవడు.
పొవ. పొగ.
పొవడ. పొగడ†.
పొవయు. రూ. పొగయు.
పొవరు. రూ. పొగరు.
పొవులు. రూ. పొగులు.
పొసఁగ. తుందిలుఁడు.
పొసఁగు. అ. క్రి. అనుకూలించు; లభించు; చక్కఁబడు; పొందుపడు; ఒప్పు.
పొసఁగుడు. అనుకూల్యము; ప్రాప్తి.

పానపాన. క్రి. విణ. అప్ర. త్వరితముగ.
పానరాకు. దగ్గుకై మూచూచెడి ఒకానొక ఆకు.
పాళవు. వీణాదండము.
పాళ్ల. పాట్లు†.

## పో

పో. నిశ్చయమును దెలుపునది; అనాదరమును దెలుపునది. రూ. పొమ్మి.
పోఁక. పూగవృక్షము; పూగఫలము, వక్కకాయ.
పోఁకగఁజి. కాఁచు.
పోఁకపేరు. భక్ష్యవిశేషము.
పోఁకబంతిపువ్వు. ఒకానొక పువ్వు.
పోఁకముడి. స్త్రీ కటివస్త్రబంధము, నీవి.
పోఁకు. మంచు కవిసిన గడ్డి.
పోఁకొత్తు. అడ కత్తెర.
పోఁగు. తంతువు, నూలిపోఁగు; పోఁగుఁద్రాడు; నాసాభరణము. బ. పురుష కర్ణాభరణము. [నేర్పుఅచెడు త్రాడు.
పోఁగుఁద్రాడు. వేఁటాడుచోట చుట్టిరా
పోఁగుపోఁత. పాఁగుపోయుట.
పోఁగుపోయు. స. క్రి. సంతనకై తిన్నగా పోఁగు పాతించు కుట్టు. [పాతించు.
పోఁగువాఱు. ఆవరించుకొను; పోఁగు
పోఁగుల్లు. బ. పోఁగులు.
పోఁగొట్టు. స. క్రి. పోకడపెట్టు.
పోఁచి. మనికట్టు మీఁది చోటు.
పోఁచీ. పోఁచి. బ. ఆఁడువారి హస్తాభరణ విశేషము.
పోఁచే. గడ్డి మొదలగువాని పరక.
పోఁచేవాఁడు. విణ. దుష్టుఁడు.
పోఁజే. స. క్రి. నార మొదలగువాని నలుసులు వాయ సన్నముగాఁ దీయు.
పోఁడి. ఒప్పు. విణ. ఒప్పిదము. [విధము.
పోఁడిమి. ఒప్పు; సంపద; సౌఖ్యము;
పోఁత. పోయుట.
పోఁపు. పోఁకుగడ్డి.
పోక. పోవుట, గమనము; షడ్గుణములలో మూడవది; యాత్ర. బ. నడత, ప్రవర్తనము; కపట ప్రవర్తనము.
పోకడ. పోవుట గమనము; గతి; నడత, ప్రవర్తనము; నాశము.
పోకడపెట్టు. స. క్రి. పోఁగొట్టు; విక్రయించు.
పోకమాను. రొంపిమాను.
పోకలాఁడి. విణ. కపటప్రవర్తనముగల స్త్రీ.
పోకలాఁడు. విణ. కపట ప్రవర్తనము గలవాఁడు.
పోకారు. అ. క్రి. నశించు. [రూ. పోక్కారు.
పోకారుచే. ప్రే. పోఁగొట్టు; పోఁగొట్టుకొను.
పోకాలు. అ. క్రి. పోవు. [గలవాఁడు.
పోకిరి. విణ. దుర్మార్గ ప్రవర్తనము
పోకిళ్లు. బ. దుర్మార్గ ప్రవర్తనము.
పోకు. నడవడి; నష్టి.
పోగండుఁడు. సం. విణ. వికలాంగుఁడు; ఐదు మొదలు పదేండ్లలోపలి వయస్సు గలవాఁడు. [పనిముట్టు.
పోగర. కమసాలవాఁడు చిత్రించెడు
పోగు. రూ. ప్రోగు.
పోగుదూబరతిండి. దూబరతిండి.
పోచిళ్లు. బ. శకునము చూచుటకై ఇరుగు పొరుగు ఇండ్లమీఁద అక్షతలు నీళ్లు చల్లుట. [ఆఁడుది; దాసి.
పోట. విణ. పెద్ద. సం. మిాపముగల
పోటకందులు బ. తెల్లకందులు.
పోటకత్తి. అడవి నఱకెడు కత్తి.
పోటకము. స్ఫోటకము, దేహమంతయు బొబ్బలు బొబ్బలుగా లేచెడు వ్యాధి విశేషము. [తెల్లు†; చేఁప.
పోటగళము. సం. కిక్కసకసవు†;
పోటనబంతి. పుట్టచెండు.
పోటముంజి. పుట్టగోఁచి.
పోటరి. విణ. శూరుఁడు.
పోటలిక. సం. పొట్లము; మూట.
పోటాపోటి. నాకంటె నాకని పైఁబడుట.
పోటి. స్పర్ధ; పోటుఁగంబము. విణ. మాఱు.
పోటిగాఁడు. విణ. పోటిగలవాఁడు.
పోటు. పొడుపు; నొప్పి; యుద్ధము; సముద్రోల్బణము; శౌర్యము. [దికము.
పోటుగంబము. ఊఁతగానిలిపిన స్తంభా
పోటుగలుపు. రెండవసారితీయుకలుపు.
పోటుఁగోల. పోటుఁగంబము.

పోటుకాఁడు
పోటుబంటు
పోటుమగఁడు
పోటుమానిసి } విణ. శూరుఁడు.
పోటుముట్టు. యుద్ధసాధనము.
పోటులాడు. రూ. పోట్లాడు.
పోటొగ్గు
పోటొడ్డు } అ. క్రి. యుద్ధప్రయత్నము చేయు.
పోటోగ్రాపు. ఇం. ఫొటోగ్రాఫి, ఛాయా చిత్రము.
పోట్టలిక సం. పొట్లము; మూట.
పోట్లాట. పోట్లాడుట, యుద్ధము; కలహము
పోట్లాడు. రూ. పోటులాడు. [యాపు.
పోట్లావు. చండి, పాడిచెడి స్వభావముగల
పోట్లాడు. (ప్ర)అ. క్రి. యుద్ధముచేయు; పోరు.
పోడు. చిఱువేరు పైరగు నేల.
పోథము. సం. పండుపోఁక.?
పోణి. విణ. ఒప్పిదము.
పోణిమి. రూ. పోఁడిమి.
పోతము. సం. పిల్ల; శిశువు; పదేండ్ల యేనుఁగు; మనుజాశిక్కిపోయెడి ఓడ; ఇంటిచోటు; వస్త్రము.
పోతరము. క్రొవ్వు, మదము; గర్వము.
పోతరాజు. మి. ఒక పురుషదేవత.
పోతరి. ఒకానొక చెట్టు. [గర్వించు.
పోతరించు. అ. క్రి. క్రొవ్వు, మదించు;
పోతవణిజుఁడు. సం. ఓడబేరగాఁడు. రూ. పోతవణిక్కు. [వాఁడు
పోతవాహుఁడు. సం. తండేలు, ఓడగడపు
పోతాధానము. సం. చేఁపపిల్లల గుంపు.
పోతు. మగది, పశుపక్ష్యాదులలో పురుషజాతి; మహిషము; వృషభము. అప. తాచ్ఛీల్యమునందు వచ్చెడు ఒక ప్రత్యయము.
పోతుకరడు. పెద్దఅల, కల్లోలము.
పోతుకాఁడు. పక్షి విశేషము.
పోతుగంట రాజనములు. బ. ధాన్యవిశేషము. [వాహనుఁడు.
పోతుగుఱ్ఱముగలాఁడు. యముఁడు, మహిష
పోతుటీఁగ. మగయీఁగ.
పోతుటేనుఁగు. మగయేనుఁగు.
పోతుపిల్లి. మగపిల్లి.

పోతురాజు. మి. పోతరాజు. [యముఁడు.
పోతురౌతు. మహిషవాహనుఁడు,
పోతులరాజు. మి. పోతురాజువలె నుండుటచే కుక్కకియ్యఁబడిన పేరు.
పోతువు. సం. కొలత పాత్రముల శుద్ధి పఱచువాఁడు.
పోత్రము. సం. పందిముట్టె మొన; నాఁగటి దుంపమొన; వజ్రము; వస్త్రము; ఒక ఓడ.
పోత్రి. సం. పంది, వరాహము.
పోనాడు స. క్రి. పోఁగొట్టు; నిందించు.
పోని విణ. పోలిన.
పోపడు. అ. క్రి. పోవు.
పోవరి. తెరువాటుకాఁడు.
పోపిట్ట. పక్షివిశేషము.
పోబడి. జాడ.
పోబెట్టు అనురాగమువలనఁబుట్టిన ధ్వని.
పోయు. అ. క్రి. చెమటమొ॥ పుట్టు. స. క్రి (జలాదికము) విడుచు; (నాఱు) విడుచు (ఉరి) తగులుచు; (బాణము) సంధించు.
పోరంబోకు. హిం. సాఁగుబడికిరాని నేల.
పోరచి. కానుక. విణ. వ్యర్థము; నిస్సారము.
పోరాట-ము. కలహము; యుద్ధము; మల్లాడుట. [చేయు; మల్లాడు
పోరాడు. అ. క్రి. కలహించు; యుద్ధము
పోరాని. విణ. అప్తమైన.
పోరామి. అప్తత; స్నేహము; సంకటము.
పోరితమాడు అ. క్రి. పోరాడు; మల్లాడు.
పోరితము. యుద్ధము; కలహము; స్పర్ధ.
పోరు. కలహము; యుద్ధము; షడ్గుణములలో రెండవది. అ. క్రి. కలహించు; యుద్ధముచేయు.
పోరుకట్టు. కలహము.
పోరుదిండి. నారదుఁడు, కలహాశనుఁడు.
పోరుపెట్టు. అ. క్రి. బిడ్డ ఊడుగక గట్టిగా ఏడ్చు.
పోరువ. సెల్లా; పార.
పోరోగిరంపుదంట
పోరోగిరపుఁదిండి } నారదుఁడు, కలహాశనుఁడు.
పోర్మిహిషుఁడు. మి. యుద్ధరంగమందలి మహిషాసురుఁడు. [వాఁడు.
పోఱఁడు. విణ. పిల్లవాఁడు, పడుచు

పోటి. విణ. బాలిక, పడుచుది.
పోటిగాఁడు. విణ. బాలుఁడు.
పోలఁడు. విణ. బాలుఁడు.
పోలకమ్మ. ఒక గ్రామదేవత.
పోలానిగంటలు. బ. ఏనుఁగు మెడను గట్టెడు గంటలు.
పోలి. సం. పోళి, పోశె.
పోలిక. సామ్యము, ఉపమ. సం. పోళీ, పోశె.
పోలిక. పోలిక, సామ్యము.
పోలిగాఁడు. ఏట్రింత.
పోలియిసు, పోలిసు } పోలీసు.
పోలీసు. ఇం. పురజన సంరక్షక భటుఁడు.
పోలు. ఒప్పు. అ.క్రి. ఒప్పు; యుక్తమగు; శక్యమగు. స.క్రి. సరిపోలు.
పోలుగ. పక్షి విశేషము.
పోలుగఱ్ఱ. బండినొగమీఁది తొట్టికి ఈవలావల అమర్చిన కొయ్య.
పోలుచు. ప్రే.పోలఁజేయు. రూ.పోల్చు.
పోలుపొందు. సంగతి, వృత్తాంతము.
పోలువ. పోలుఁగపిట్ట.
పోలె. వాసనకఁడుము. ద్ర. వలె.
పోలెవాఁడు. దుష్టుఁడు.
పోలేటమ్మ. ఒక గ్రామదేవత.
పోల్కి. పోలిక.
పోవడి. పోబడి
పోవు. అ.క్రి. అగు;సమీపమునుండి దూరమున కరుగు;ఆరంభించు;కడచు;కలయు; చెడు; చచ్చు.
పోవుదెంచు. అ.క్రి. పోవు.
పోషకుఁడు. సం. విణ. పోషించువాఁడు
పోషణము. సం. పోషించుట,రక్షించుట; పుష్టి.
పోషించు. సం. స.క్రి.రక్షించు,కాపాడు
పోష్ట. సం. విణ. పోషించెడివాఁడు.
పోష్యము. సం. విణ. పోషింపఁదగినది.
పోసనము. పాలు; కాంతి; పైపూఁత.
పోసనాలు. క్షీరము.?
పోసరము. క్రొవ్వు; గర్వము.
పోసరించు. అ.క్రి. క్రొవ్వు; గర్వించు.
పోసతెక్కె. మత్స్యవిశేషము.
పోసూటు. పాపోసు.?
పోస్టాఫీసు. ఇం. తపాలా కచ్చేరి, వార్తాలయము.
పోస్టు. ఇం. టపా, అంచె.
పోస్టుపోను. ఇం. కొంతకాలమువఱకు వెనుకబెట్టు.
పోస్తకాయ. హిం.గసగసకాయపై బెరడు.
పోహణ. కూర్పు; నేర్పు.
పోహణించు. స.క్రి. కూర్చు.
పోళి, పోళె } ఒక దినుసు పూరీ; ఒబ్బట్టు.

## పౌ

పౌండర్యము. సం. పుండరీకమను గంధద్రవ్యవిశేషము.
పౌండ్రదేశము.సం. 56 దేశములలోనొకటి
పౌఁజు. బారు; దండు, సేన, రాజ్యసప్తాంగములలో ఏడవది. [తీర్చు.
పౌఁజుతీరు. అ.క్రి. బారుతీరు. ప్రే.పౌజు
పౌజుదారు. హిం. సేనానాయకుఁడు.
పౌఁజులకమ్మలు. బ. రత్నతాటంకములు.
పౌఁజులుతీరు. అ.క్రి. బారుతీరు. ప్రే. పౌజులుతీర్చు.
పౌఁజులుసేయు. స.క్రి. పౌజులుతీర్చు.
పౌగండుఁడు. సం. ఐదేండ్లు మొదలు పదేండ్ల లోపలివాఁడు.
పౌతవము. సం. త్రాసు మూర తూము మొదలగు మానము; పరిమాణము.
పౌత్తికము. సం. నేతిచాయగల తేనె.
పౌత్రి. సం. కొడుకుకూఁతురు; కూఁతురికూఁతురు. [మఁడు
పౌత్రుఁడు. సం. కొడుకుకొడుకు, మను
పౌనఃపున్యము. సం. మరలమరల.
పౌనర్భవుఁడు. సం. మాఱుమనువుదాని కొడుకు. [నందు పుట్టినది.
పౌరము. సం. కామంచిగ. విణ. పురము
పౌరస్త్యము. సం. విణ. మొదటిది; మొదటి దిక్కుది. [వాఁడు.
పౌరాణికుఁడు. సం. పురాణము తెలిసిన
పౌరుఁడు. పురజనుఁడు. బ. పురజనము.

పౌరుషము. సం. మగతనము; పురుషప్రయత్నము; పరాక్రమము. విణ. నిలివెడు.
పౌరుషేయము. సం. పురుషుడు చేసిన పని. విణ. పురుషుఁడు చేసినది.
పౌరోగవుఁడు. సం. విణ. వంటయింటి అధికారి. [మయినది.
పౌరోహితము. సం. పురోహితునకు ధర్మశ్రీ
పౌరోహిత్యము. సం. పురోహితుని కృత్యము
పౌర్ణమాసి / పౌర్ణమి } సం. పూర్ణిమ, పున్నమ.
పౌలస్త్యుఁడు. సం. కుబేరుఁడు; రావణుఁడు.
పౌలి. సం. గుగ్గిళ్లు
పౌలు. అ. క్రి. పగులు.
పౌలోమి. సం. శచీదేవి.
పౌషము. సం. పుష్యమాసము.
పౌషి. సం. పుష్యమితోఁగూడిన పున్నమ
పౌష్కరము. సం. చెంగల్వ కోష్టు†
పౌష్పకము. సం. కుసుమాంజనము.
పౌష్పము. సం. విణ. పుష్పములచే చేయఁదగినది; పుష్పసంబంధమైనది.
పౌళి. సం. గుగ్గిళ్లు.

## ప్ర

ప్ర. సం. ఉప. ప్రకర్షార్థకము.
ప్రంగ. సంగ. ఎడముగా చాఁగినశాఖ.
ప్రండి. కన్యాశుల్కము.
ప్రకంపనము. సం. పెనుగాలి.
ప్రకటనము. సం. ప్రకటించుట.
ప్రకటము. సం. విణ. వెల్లడి, స్ఫుటము.
ప్రకటించు. సం. స. క్రి. వెల్లడిచేయు.
ప్రకటితము. సం. విణ. ప్రకటింపఁబడినది.
ప్రకరణము. సం. ప్రస్తావము; గ్రంథభాగము; నాటకభేదము. [చెదరిన పువ్వు
ప్రకరము. సం. అగరు; సమూహము;
ప్రకర్షము. సం. అతిశయము, మేలు.
ప్రకాండము. సం. చెట్టునడిమి నిడుఁగాన్ను; స్కంధము, చెట్టుబోదె. విణ. ప్రశస్త వాచకము.
ప్రకామము. సం. క్రి.విణ. ఇచ్ఛవచ్చినట్లు.
ప్రకారము. సం. పోలిక; భేదము.
ప్రకాశము. సం. ఎండ; వెలుఁగు; తళయాడించుచు నవ్వేడు నవ్వు. విణ. మిక్కిలి ప్రసిద్ధము; బయలుపడినది.
ప్రకాశించు. సం. అ. క్రి. వెలుఁగు; మెఱయు.
ప్రకీర్ణకము. సం. వింజామరము, సూరటి; విరివి; గుఱ్ఱము. [చల్లఁబడినది.
ప్రకీర్యము. సం. సెమలియడుగు†. విణ.
ప్రకృతము. సం. విణ. చక్కఁగా చేయఁబడినది; ప్రకరణము వలన పొందఁబడినది, ప్రస్తుత విషయము.
ప్రకృతి. సం. ప్రత్యయము రాకముందున్న శబ్దస్వరూపము; ఉపాదాన కారణము; ఒక ఛందస్సు; పౌరవర్గము, ప్రజలు; ప్రధానము, సత్త్వాదిగుణ సామ్యావస్థ; స్వభావము; స్వామ్యాది (సప్త ప్రకృతులు—స్వామి, అమాత్యుఁడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము); అవ్యక్తాది. (అష్టప్రకృతులు—అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు.)
ప్రకృష్టము. సం. విణ. ప్రకర్షముగలది.
ప్రకోపము. సం. ముమ్మరము.
ప్రకోపించు. సం. అ. క్రి. ముమ్మరించు.
ప్రకోష్ఠము. సం. తొట్టికట్టు; ముంజేయి, మోఁచేయి మణికట్టు వీని మధ్యభాగము.
ప్రక్క. పక్క, పార్శ్వము; పక్షము.
ప్రక్కి / ప్రక్కె } పక్కి, పిచులము†.
ప్రక్రమము. సం. క్రమము; ఉపక్రమము, కార్యారంభము; అవసరము; తరవాయి.
ప్రక్రాంతము. సం. విణ. ఆరంభింపఁబడినది; అతిక్రమింపఁబడినది; కడవఁబడినది
ప్రక్రియ. సం. అధికారము; ప్రకరణము; మేలైన కార్యము; శబ్దరూపము కలిగిన విధము.
ప్రక్వణము / ప్రక్వాణము } సం. వీణాధ్వని
ప్రక్షాళకుఁడు. సం. విణ. చక్కఁగా కడుగువాఁడు.
ప్రక్షాళనము. సం. చక్కఁగా కడుగుట.
ప్రక్షాళించు. సం. స. క్రి. చక్కఁగా కడుగు. [బడినది.
ప్రక్షాళితము. సం. విణ. చక్కఁగా కడుగఁ

ప్రక్షిప్తము. సం. విణ. చక్కఁగా విసరి వేయఁబడ్డది; చేర్పఁబడ్డది.
ప్రక్షీణము. సం. విణ. మిక్కిలి క్షయించినది. [రూ. ప్రక్షేపణము.
ప్రక్షేపము సం. చక్కఁగా విసరివేయుట.
ప్రక్షోభించు. సం. అ. క్రి. మిక్కిలి కలఁతపడు. [సము.
ప్రక్ష్వేడనము. సం. ఇనుపబాణము, నారసము.
ప్రఖరము. సం. గుఱ్ఱపు పక్కెర; కంచరగాడిద; కుక్క. విణ. మిక్కిలి కఱకైనది. [కెక్కినది.
ప్రఖ్యాతము. సం. విణ. మిక్కిలి ప్రసిద్ధి
ప్రఖ్యాతి. సం. మిక్కిలి ప్రసిద్ధి.
ప్రఖ్యాతుఁడు సం. విణ. ప్రసిద్ధుఁడు.
ప్రఖ్యుఁడు. సం. విణ (ఉత్తర పదమైనచో) తుల్యుఁడు.
ప్రగండము. సం. దండచేయి.
ప్రగతజానుకుఁడు. సం. విణ దొడ్డికాళ్లవాఁడు. [నది; ఎడము గలది.
ప్రగతము. సం. విణ. బొత్తిగా పోయి
ప్రగల్భ. సం. స్వీయాంతర్భేద విశిష్ట నాయికా విశేషము, ప్రౌఢ నాయిక.
ప్రగల్భత, ప్రగల్భత్వము } సం. ప్రతిభ.
ప్రగల్భుఁడు. సం.విణ. ప్రతిభగలవాఁడు
ప్రగాఢము. సం. క్రి. విణ. పెల్లు. విణ. అధికము; దృఢము.
ప్రగుణము. సం.విణ. ఋజువు. సరియైనది
ప్రగ్గ. రూ ప్రంగ.
ప్రగ్గడ. మంత్రి.
ప్రగ్గము. పగ్గము.
ప్రగ్రహము. సం. చెఱ, ఖైదు; చెఱఁబడ్డది; బంగారు; నియమనము; భుజము; ప్రమానిపసుపు†; కిరణము; ప్రగ్రాహము
ప్రగ్రాహము, సం. త్రాసు తూనిక కోల మొదలైనవాని త్రాడు; గుఱ్ఱము మొదలగువానిని గట్టెడు పగ్గము.
ప్రగ్రీవము. సం. మెడ; ప్రాసాదమునందలి కిటికీ; ఒఱగుదిండు; కలశము.?
ప్రఘణము. సం. ఇనుపగుదియ; రాగిబిందె; ప్రఘాణము.

ప్రఘాణము. సం. తలవాకిటికి ప్రక్కనుండెడు చిన్నగది.
ప్రఘారము. సం. లెస్సగా తడుపుట; జలాదిధార ? [గలది.
ప్రఘూర్ణము. సం.విణ. మిక్కిలితిరుగుడు
ప్రచండము. సం. తెల్లగన్నేరు†. విణ. చేరరానిది; వాఁడిమిగలది; సాధ్యము గానిది; సహింప శక్యము గానిది.
ప్రచండుఁడు. సం. విణ. ప్రతాపశాలి; ఎదిరింపరానివాఁడు.
ప్రచక్రము. సం. ప్రయాణమైన సేన.
ప్రచయము. సం. గుంపు; ప్రసంగము; అభివృద్ధి; పూలుకోయుట; దొంగతనముతో ఫలపుష్పాదుల త్రుంచుట; సమూహము; అనుదాత్తస్వర విశేషము.?
ప్రచలాకము. సం. నెమిలిపింఛము.
ప్రచలాకి నెమిలి.
ప్రచలాయితుఁడు. సం. విణ. కునికిపాటుగలవాఁడు.
ప్రచారము. సం. సంచారము; వ్యవహారము; ప్రవేశనిర్గమమార్గము;? సంగతి;? కులాచారము.?
ప్రచురము. సం. విణ. అధికము.
ప్రచేతసుఁడు. సం. వరుణుఁడు; ఒకముని విణ. గొప్ప మనసుకలవాఁడు. రూ. ప్రచేతుఁడు, ప్రచేతస్సు.
ప్రచోదనము. సం. ప్రేరేపించుట.
ప్రచోదని. సం. వాఁకుడు† [నది.
ప్రచోదితము. సం. విణ. ప్రేరేపింపఁబడి
ప్రచ్ఛదపటము. సం. నిచోళము.
ప్రచ్ఛదము. సం. కప్పడు.
ప్రచ్ఛన్నము. సం. లోపలిద్వారము. విణ కప్పఁబడ్డది.
ప్రచ్ఛర్దిక. సం. వాంతిరోగము.
ప్రచ్ఛాదనము. సం. ఉత్తరీయము;ఆచ్ఛాదనము.
ప్రచ్ఛాదించు. సం. స.క్రి. కప్పు.
ప్రచ్ఛాదితము. సం విణ. కప్పఁబడినది.
ప్రజ. సం. సంతానము; జనము.
ప్రజననము.సం.పుట్టుక;యోని; ప్రజనము
ప్రజనము. సం. గర్భముధరించుట; పశువులు చూలుకట్టుకాలము; జన్మము;

అఁడుపశువును మగపశువుచూలు సేయఁ బ్రవర్తించుట; ఆవు ఎనుము మొదలగు వాని తొలిచూలు;? చూలు.?
ప్రజవి. సం.విణ. మిక్కిలివడిగలవాఁడు.
ప్రజాత. సం. బాలెంతరాలు.
ప్రజాపతి.సం బ్రహ్మ; విశ్వకర్మ; కశ్యప ప్రజాపతి; దక్షాదిప్రజాపతి; ఒకసంవత్సరము. [ల్లాము.
ప్రజావతి. సం. తోడఁబుట్టినవాని పెం
ప్రజ్ఞ. సం. ఎఱుక; ఆత్మ, బ్రహ్మము; ప్రాజ్ఞురాలు; బుద్ధి. బ. సామర్థ్యమును దెలిపెడి మాటలు.
ప్రజ్ఞానము సం. కూటస్థజ్ఞానము; బుద్ధి; గుఱుతు, ఆనవాలు; దేనిచేత సమస్తము నెఱుఁగుట సంభవించుచున్నదో అట్టి బ్రహ్మచైతన్యము.
ప్రజ్ఞాపత్రిక సం. పుస్తకమునందు గుఱుతుకు వేసిన కాగితము.
ప్రజ్ఞుఁడు. సం. పండితుఁడు. విణ. పంగటి కాళ్లవాఁడు.
ప్రజ్ఞువు. సం. విణ. పంగటి కాళ్లవాఁడు.
ప్రజ్వలనము. సం. మండుట; ప్రకాశించుట. [ప్రకాశించు.
ప్రజ్వలించు. సం. అ. క్రి. మండు;
ప్రజ్వలితము. సం. విణ. మండినది; ప్రకాశించినది.
ప్రడీనము. సం. పక్షి వేగముగా వాలుట; పక్షి పైకెగయఁ బ్రయత్నించుట.
ప్రణతి. సం. నమ్రత; నమస్కారము.
ప్రణతుఁడు. సం.విణ. నమ్రుఁడు, వంగినవాఁడు; మిక్కిలి నమ్రతగలవాఁడు; నమస్కరించినవాఁడు;స్తోత్రము చెయ్య బడ్డవాఁడు.
ప్రణమిల్లు. సం. అ. క్రి. నమస్కరించు.
ప్రణయకోపము. ప్రేమముయొక్క కుటిల ప్రచారమువలన కారణము లేకయే నాయికానాయకులకుఁ గలిగెడు కోపము.
ప్రణయము. సం. ప్రేమ, స్నేహము; ప్రార్థన; వినయము; విశ్వాసము; పరిచయము; మంచిమాటలాడుట.
ప్రణయించు. సం. అ. క్రి. ప్రకాశించు. స. క్రి. జ్వలింపఁజేయు.?
ప్రణయిని. సం. ప్రియురాలు. విణ. ప్రేమగల స్త్రీ.
ప్రణవము. సం. ఓంకారము.
ప్రణాదము. సం. అనురాగమువలనఁ బుట్టినధ్వని; గట్టిమ్రోఁత; చెవుడు.
ప్రణామము. సం. నమస్కారము.
ప్రణాళి. సం. నీళ్లు పోవుదారి; నీళ్లు పోవుటకు భూమిలో పాఁతిన తూము. రూ. ప్రణాళిక, ప్రణాళము. [ప్రార్థన.
ప్రణిధి. సం. వేగులవాఁడు, హర్కారా;
ప్రణిపత్తి. సం. ప్రణిపాతము.
ప్రణిపాతము. సం. అభివాదనము.
ప్రణిహితము. సం. విణ. ఒప్పగింపఁబడినది; ఉంచఁబడినది; పొందఁబడినది.
ప్రణీత. సం. యజ్ఞపాత్ర విశేషము.
ప్రణీతము. సం. మంత్రముచేత సంస్కరింపఁబడిన అగ్ని. విణ. చేయఁబడినది; చొప్పింపఁబడినది; త్రోయఁబడినది; నీళ్లుపోసి వండఁబడినది. [బడినది.
ప్రణుతము. సం. విణ. మిక్కిలి పొగడఁ
ప్రణుతి. సం. మిక్కిలి పొగడిక.
ప్రణుతించు. సం.స.క్రి. మిక్కిలిపొగడు.
ప్రణేయము. సం.విణ.వశ్యము, అధీనము.
ప్రతతి. సం. తీఁగె; విరివి, విస్తారము; సమూహము.
ప్రతనము. సం.విణ.పురాతనము,ప్రాఁతది
ప్రతలము. సం. పాతాళ విశేషము; చాఁచిన వ్రేళ్లుగల అఱచేయి.
ప్రతాపము. సం. కోశబలముల వలనఁ గలిగిన ప్రభావము; వేఁడిమి;
ప్రతాపనము. సం. తెల్లజిల్లేడు†.
ప్రతాపించు సం.అ.క్రి.ప్రతాపముచూపు.
ప్రతారకుఁడు. సం. విణ. మోసపుచ్చువాఁడు.
ప్రతారణము.సం.మోసపుచ్చుట వంచన.
ప్రతారించు సం. స.క్రి. మోసపుచ్చు.
ప్రతారితుఁడు. సం. విణ. మోసపుచ్చఁబడినవాఁడు.
ప్రతి. సం. అవ్య. సమానము; మాఱు.
ప్రతికర్మము. సం. వస్త్రాద్యలంకరణము.

ప్రతికారము. సం. మాఱుచేఁత.
ప్రతికూలము. సం. విరుద్ధాచరణము. విణ. అనుకూలము కానిది, వ్యతిరిక్తము.
ప్రతికృతము. సం. విణ. మాఱు చేయఁబడినది. [మాఱుచేఁత.
ప్రతికృతి. సం. ప్రతిమ; మాఱురూపు;
ప్రతికృష్టుఁడు. సం. విణ. దురాచారము చేత నిందింపఁబడినవాఁడు.
ప్రతిక్రియ. సం. ప్రతీకారము, మందు.
ప్రతిక్షిప్తుఁడు. సం. విణ. ఆక్షేపింపఁబడినవాఁడు; అడ్డగింపఁబడినవాఁడు; పంపఁబడినవాఁడు. [తీసికొనఁబడినది.
ప్రతిగృహీతము. సం. విణ. దానముగా
ప్రతిగ్రహము. సం. పుచ్చుకొనుట; దానము పుచ్చుకొనుట; దానద్రవ్యము; సేనకు వెనుకటిబలము; తమ్మపడిగము; గ్రహ భేదము. [పుచ్చుకొను.
ప్రతిగ్రహించు. సం. స. క్రి. దానము
ప్రతిగ్రహీత. సం. విణ. దానము పుచ్చుకొనువాఁడు. [గ్రహించుట.
ప్రతిగ్రాహము. సం. తమ్మపడిగము; ప్రతి
ప్రతిగ్రాహ్యము. సం. విణ. పుచ్చుకొనఁదగినది.
ప్రతిఘటనము. సం. మాఱొడ్డుట.
ప్రతిఘటించు. సం. అ. క్రి. మాఱొడ్డు.
ప్రతిఘము. సం. కోపము; మూర్ఛ; ప్రతిఘాతము.
ప్రతిఘాతము. సం. ప్రతిబంధము; మాఱుదెబ్బ; పగతీర్చుకొనుట; వధము.
ప్రతిఘాతనము. సం. వధము.
ప్రతిఘాతి. సం. విణ. పగతీర్చుకొనువాఁడు; వధించువాఁడు.
ప్రతిచ్ఛాయ. సం. పోలిక; ప్రతిబింబము.
ప్రతిజాగరము. సం. ముందువెనుకలాలోచించుట; ఎచ్చరిక.
ప్రతిజోక. మి. నాట్యములలోనొక భేదము.
ప్రతిజ్ఞ. సం. ఏదేనొకపనిని తప్పక చేసెదనని దృఢముగా చెప్పుట; ప్రతిన, చేసెదను చెప్పెదను అను మొ॥; శబ్దము నిత్యము పర్వతము వహ్నిమంతము అను మొ॥; అంగీకారము [ప్రతిజ్ఞ చేయఁబడ్డది.
ప్రతిజ్ఞాతము. సం. విణ. అంగీకరింపఁబడ్డది;
ప్రతిజ్ఞాతవ్యము. సం. విణ. ప్రతిజ్ఞచేయఁదగినది; అంగీకరింపఁదగినది.
ప్రతిజ్ఞానము. సం. అంగీకారము.
ప్రతిజ్ఞేయము. సం. విణ. ప్రతిజ్ఞ చేయఁదగినది; అంగీకరింపఁదగినది.
ప్రతిదానము. సం. వస్తువుల మారకము; దాఁచుకొన్న సొమ్ము తిరుగనిచ్చుట.
ప్రతిదారణము. సం. యుద్ధము.
ప్రతిదినము. సం. ప్రతిరోజు.
ప్రతిధ్వని, ప్రతిధ్వానము } సం. మాఱుమ్రోఁత
ప్రతిన. పంతము; ప్రతిజ్ఞ.
ప్రతినిధి. సం. ప్రతిమ; బదులు, మాఱు; ముఖ్యసమము; ముఖ్యునకు సమానుఁడు.
ప్రతినివిష్టము. సం విణ. పట్టుపట్టఁబడినది
ప్రతినివిష్టుఁడు. సం. విణ. దురభినివేశము గలవాఁడు.
ప్రతినివేశము. సం. అక్కఱ, పట్టు.
ప్రతిపక్షి. సం. శత్రుఁడు. [సమానుఁడు.
ప్రతిపక్షుఁడు. సం. శత్రువు; ప్రతివాది;
ప్రతిపత్తి. సం. గౌరవము; తెలివి; నేర్పు; ప్రవేశము; ప్రాప్తి; పదప్రాప్తి.
ప్రతిపత్తు. సం. పాడ్యమి; బుద్ధి.
ప్రతిపన్నము. సం. విణ. అంగీకరింపఁబడినది; తెలియఁబడినది.
ప్రతిపాదకము. సం. విణ. ఇచ్చునది; కలిగించునది; తెలుపునది; నిరూపించునది.
ప్రతిపాదనము. సం. ఇచ్చుట; కలిగించుట; తెలుపుట; నిరూపించుట.
ప్రతిపాదించు. సం. స. క్రి. కలిగించు; తెలుపు; నిరూపించు; ఇచ్చు.
ప్రతిపాదితము. సం. విణ. ప్రతిపాదింపఁబడినది. [దగినది.
ప్రతిపాద్యము. సం. విణ. ప్రతిపాదింపఁ
ప్రతిపాలకుఁడు. సం. విణ. రక్షకుఁడు.
ప్రతిపాలనము. సం. రక్షణము.
ప్రతిపాలించు. సం. స. క్రి. రక్షించు.
ప్రతిఫలనము. సం. ప్రతిబింబించుట, మాఱురూపము తోఁచుట; పోలిక.
ప్రతిఫలించు. సం. అ. క్రి. మాఱురూపము తోఁచు.

ప్రతిఫలితము. సం. విణ. ప్రతిఫలించినది
ప్రతిబంధకము. సం. విణ. అడ్డగించునది.
ప్రతిబంధము. సం. అటకావు. అడ్డగింత; అడ్డగించుట.
ప్రతిబంధించు. సం. స. క్రి. అడ్డగించు.
ప్రతిబద్ధుఁడు. సం. విణ. అడ్డగింపఁబడినవాఁడు; మనసు చెడినవాఁడు.
ప్రతిబింబము. సం. ప్రతిఫలనము; ప్రతిమ, పోలిక.
ప్రతిబింబించు. సం. అ. క్రి. ప్రతిఫలించు
ప్రతిబింబితము. సం. విణ. ప్రతిఫలించినది
ప్రతిభ. సం. అప్పటప్పటికి వికసించెడు బుద్ధి; జ్ఞానమునకు బీజముగా నుండెడి ఒక సంస్కారము; దీప్తి.
ప్రతిభటుఁడు. సం. శత్రువు.
ప్రతిభయము. సం. భయానకరసము. విణ భయంకరము, భయానకరసము గలది.
ప్రతిభావంతుఁడు. సం. విణ. బుద్ధి ప్రకాశము గలవాఁడు. [దారుఁడు.
ప్రతిభువు. సం. పూఁటకాఁపు, జామీను
ప్రతిమ. సం. శిలాదినిర్మితవిష్ణ్వాదిదేవతామూర్తి; ఏనుఁగుదంతములకట్టు; ఏనుఁగు దంతముల నడిమిచోటు; ఏనుఁగు కుంభస్థలము క్రింది భాగము; ప్రతిబింబము; పోలిక; బొమ్మ. [తడగట్టెడి ఒద్దిక.?
ప్రతిమానము. సం. ప్రతిబింబము; ప్రతిమ;
ప్రతిమాల. సం. అంతాదిగ్రంథము.?
ప్రతిముక్తము. సం. విణ. ధరింపఁబడినది.
ప్రతిముఖము. సం. ఒక నాటక సంధి.
ప్రతియత్నము. సం. ఇచ్ఛ; ప్రతీకారము; సంస్కారము; అనుకూల్యము.?
ప్రతియాతన. సం. ప్రతిమ; అనురూపమైన బాధ.
ప్రతియోగము. సం. విరోధము.
ప్రతియోగి. సం. విణ. విరోధి.
ప్రతిరోజు. ప్రతిదినము. [చుట; లూటీ
ప్రతిరోధము. సం. ఎదిరించుట; నిరోధిం
ప్రతిరోధి. సం. ఎదిరించువాఁడు; నిరోధించువాఁడు; లూటీ చేయువాఁడు.
ప్రతిలోమము. సం. విణ. అవరోహణ క్రమము గలది.

ప్రతివసథము. సం. గ్రామము.
ప్రతివసించు. సం. అ. క్రి. ఉండు, వసించు
ప్రతివాక్యము. సం. మాఱుమాట.
ప్రతివాది. సం. విణ. విరోధి; వాదికి ప్రతిపక్షమువాఁడు. [పక్షముగా మాటాడు.
ప్రతివాదించు. సం. అ. క్రి. వాదికి ప్రతి
ప్రతివాసి. సం. విణ. ఇరుగు పొరుగుల నుండువాఁడు.
ప్రతివిధానము. సం. మాఱుసేఁత.
ప్రతివిష. సం. అతివస.
ప్రతివేశము. సం ఇరుగు పొరుగు ఇల్లు.
ప్రతివేశుఁడు. సం. విణ. ఇరుగుపొరుగు ఇంటివాఁడు. [పని పంచుట.
ప్రతిశాసనము. సం. సేవకులను పిలిచి
ప్రతిశీర్షకము. సం. అమ్ముట; కొనుట; మాఱకపు వస్తువు; వస్తువుల మాఱకము; కుదువ.?
ప్రతిశ్యాయము. సం. పడిసెము.
ప్రతిశ్రయము. సం. గృహము; ప్రాపు; సభ; యాగశాల.
ప్రతిశ్రవము. సం. అంగీకారము.
ప్రతిషిద్ధము. సం. విణ. నిషేధింపఁబడ్డది;
ప్రతిషేధకుఁడు. సం. విణ. నిషేధించువాఁడు.
ప్రతిషేధము. సం. నిషేధము; అడ్డగింత.
ప్రతిషేధించు. సం. స. క్రి. అడ్డగించు; నిషేధించు. [కాయింపు.
ప్రతిష్టంభము. సం. అడ్డగింత, అట
ప్రతిష్టబ్ధము. సం. విణ. అడ్డగింపఁబడినది.
ప్రతిష్ఠ సం. ఉనికి; భూమి; గౌరవము; నాలుగవ ఛందస్సు; దేవతా విగ్రహాదులకు పూజ్యతను సంపాదించెడి ఒక సంస్కారము; స్థానము నుండి జారకుండుట, స్థైర్యము.
ప్రతిష్ఠాపించు } సం. స క్రి. శాశ్వతముగా
ప్రతిష్ఠించు } నిలుపు.
ప్రతిష్ఠితము. సం. విణ. ప్రతిష్ఠ గలది; శాశ్వతముగ నిలుపఁబడినది.
ప్రతిసరము. సం. ఏనుఁగు కుంభముల క్రిందిచోటు; కంకణము, చేతఁగట్టుకొను తోరము; భూషణము; పూల

దండ, మంత్రవిశేషము; సేన వెనుకటి దిక్కు; వ్రణశుద్ధి. విణ. నియోగింపఁదగినది.

ప్రతిసర్గము. సం. మన్వాదులు చేసెడి సృష్టి. (పురాణలక్షణములలో నొకటి.)

ప్రతిసీర. సం. పరదా, తెరచీర.

ప్రతిసూర్యకము. సం. తొండ.

ప్రతిస్పర్ధ. సం. పోటీ.

ప్రతిస్పర్ధి. సం. విణ. పోటీ పడువాఁడు.

ప్రతిస్పర్ధించు. సం. అ. క్రి. పోటీచేయు.

ప్రతిహతి. సం. అడ్డగింత.

ప్రతిహతుఁడు. సం. విణ. అడ్డగింపఁబడినవాఁడు; మనసు చెడినవాఁడు.

ప్రతిహారకుఁడు. సం. మాయావి. విణ. తీసికొని పోవువాఁడు.

ప్రతిహారి / ప్రతిహారుఁడు } సం. ద్వారపాలకుఁడు.

ప్రతిహాసము. సం. గన్నేరు†.

ప్రతీకము. సం. అంగము; ప్రతిమ. విణ. వ్యతిరేక క్రమముగలది.

ప్రతీకారము. సం. పగదీర్చుకొనుట; చికిత్స.

ప్రతీకాశము. సం. సామ్యము. విణ. సమానమైనది. [ఎదురు చూచుట.
ప్రతీక్షణము. సం. అభిలషితార్థమునకై

ప్రతీక్షించు. సం. అ. క్రి. అభిలషితార్థమునకై ఎదురు చూచు.

ప్రతీక్ష్యుఁడు. సం. పూజ్యుఁడు.

ప్రతీచి. సం. పడమర. [నందు పుట్టినది.
ప్రతీచీనము. సం. విణ. పశ్చిమ దిక్కు

ప్రతీతము. సం. విణ. ప్రసిద్ధికెక్కినది; ఎఱుఁగఁబడినది; ఆదరింపఁబడినది;
సంతోషము నొందినది. [సంతోషము.
ప్రతీతి. సం. ప్రసిద్ధి; ఎఱుక; ఆదరము.

ప్రతీతుఁడు. సం. విణ. ప్రతీతిగలవాఁడు.

ప్రతీపదర్శిని. సం. స్త్రీ.

ప్రతీపము. సం. వామభాగము; ఒక అర్థా
లంకారము. విణ. ప్రతికూలము. [తండ్రి.
ప్రతీపుఁడు. సం. పగవాఁడు; శంతనుని

ప్రతీరము. సం. (నద్యాది) తీరము.

ప్రతీవాపము. సం. నిక్షేపించుట; కరఁగిన లోహములను పొడిచేయుట; జనోపద్రవము.?

ప్రతీహారము. సం. ద్వారము; పూర్వము నేను వీనికి మేలుచేసితినిగాన నిప్పుడు వీఁడు నాకు మేలు చేయునని యెంచిచేయు
నట్టి సంధి. [పాలకుఁడు.
ప్రతీహారి. సం. ద్వారపాలకురాలు; ద్వార

ప్రతీహారుఁడు. సం. ద్వారపాలకుఁడు.

ప్రతున్నము. సం. విణ. మిక్కిలి వ్యథ నొందినది.

ప్రతోదము. సం. కొరడా; ములుకోల.

ప్రతోళి సం. నడువీధి; బజారు. [సము†.
ప్రత్తి. విత్తులలోనుండు దూది; కార్పా

ప్రత్నము. సం. విణ పురాతనము; ప్రాతది

ప్రత్యంతపర్వతము. సం. పెద్దకొండచేరువ
నుండు చిన్నగుట్ట. [ప్రత్యగాత్మ.
ప్రత్యక్కు. సం. పడమర; విలక్షణవస్తువు,

ప్రత్యక్శ్రేణి సం. ఎలుకచెవి†; దంతి†.

ప్రత్యక్పర్ణి. సం. ఉత్తరేను†; ఎలుకచెవి†

ప్రత్యక్పుష్పి. సం. ఉత్తరేను†.

ప్రత్యక్షము. సం. సాక్షాత్కారము. క్రి. విణ. కన్నుల యెదుట. విణ. చక్షురాదీంద్రియ గోచరమైనది.

ప్రత్యక్షవాది. సం. చార్వాకుఁడు.

ప్రత్యగ్రము. సం. విణ. నూతనము; శోధిం
పఁబడినది. [శత్రుసైన్యము; నిమ్నము.
ప్రత్యనీకము. సం. ఒక అర్థాలంకారము;

ప్రత్యనీకుఁడు. సం. శత్రువు; ప్రతివాది.

ప్రత్యయము. సం. సుప్తిఙు మొ||; నిశ్చయము; విశ్వాసము; ప్రసిద్ధి; జ్ఞానము; ఆచారము; శపథము; వశము; హేతువు; అవకాశము;? యుద్ధము ?

ప్రత్యయితుఁడు. సం. విణ. నమ్మఁబడినవాఁడు; ఆప్తుఁడు.

ప్రత్యర్థి. సం. శత్రువు; ప్రతివాది.

ప్రత్యవసానము. సం. భోజనము.

ప్రత్యవసితము. సం. విణ. భుజింపఁబడినది.

ప్రత్యవాయము. సం. కర్మనియమాది లోపముచేత నేర్పడెడి పాపము; ఆచారలోపము.

ప్రత్యహము. సం. అవ్య. ప్రతిదినము.

ప్రత్యాకారము. సం. ఖడ్గాదుల యొఱ.

ప్రత్యాఖ్యాతము. సం. విణ. నిరాకరింపఁబడినది.

ప్రత్యాఖ్యానము. సం. నిరాకరించుట.
ప్రత్యాదిష్టము. సం. విణ. నిరసింపఁబడినది.
ప్రత్యాదేశము. సం. నిరాకరించుట.
ప్రత్యాబ్దికము. సం. ప్రతి సంవత్సరము చేసెడు శ్రాద్ధము.
ప్రత్యామ్నాయము. సం. విణ. ముఖ్యమయినది లేనందున దానికి బదులుగా విధింపఁబడ్డది.
ప్రత్యాలీఢము. సం. విలుకాఁడు ఎడమకాలు ముందఱికి చాఁచి నిలుచుట.
ప్రత్యాశ. సం. అభిలాష.
ప్రత్యాసత్తి. సం. సంగతి, సమీప సంబంధము; సామీప్యము. [చేరిక యైనది
ప్రత్యాసన్నము. సం. విణ. సంగతము,
ప్రత్యాసారము. సం. వ్యూహము వెనుక నుండు మఱియొక వ్యూహము.
ప్రత్యాహారము. సం. విషయముల నుండి ఇంద్రియములను మరలించుట; అంతర్ముఖత; (వ్యాకరణమున) వర్ణసంగ్రహము.
ప్రత్యుత్క్రమము. సం. ప్రయోగము, నాట్యాది ప్రదర్శనము; యుద్ధముకొఱకైన భటుల యుద్యమము.
ప్రత్యుత్తరము. సం. మాఱుత్తరము.
ప్రత్యుత్థానము. సం. అభ్యాగమనము.
ప్రత్యుద్గతుఁడు. సం. విణ. ఎదురేగినవాఁడు
ప్రత్యుద్గమము. సం. అభ్యాగమనము.
ప్రత్యుద్గమించు. సం. అ. క్రి. ఎదురేగు.
ప్రత్యుషము } సం. ప్రాతఃకాలము
ప్రత్యూషము }
ప్రత్యూషుఁడు. సం. ఒక వసువు.
ప్రత్యూహము. సం. చెఱుపు, విఘ్నము.
ప్రత్యేకము. సం. వేఱువేఱు.
ప్రత్యేకించు. సం. అ. క్రి. ప్రత్యేకమగు.
ప్రథ. సం. ప్రఖ్యాతి, ప్రసిద్ధి.
ప్రథనము. సం. విస్తారము.
ప్రథమపురుషము. సం. అన్యుఁడు కర్తగాఁగల క్రియారూపము. [ము, శ్రేష్ఠము.
ప్రథమము. సం. విణ. మొదటిది; ముఖ్య
ప్రథితి. సం. ప్రసిద్ధి.
ప్రథితుఁడు. సం. విణ. ప్రసిద్ధుఁడు.
ప్రథిమ. సం. విరివి. రూ. ప్రథిమము.
ప్రదక్షణము. సం. ప్రదక్షిణము.?
ప్రదక్షిణము. సం. ప్రదక్షిణించుట.
ప్రదక్షిణించు. సం. స. క్రి. వలగొను, దేవతాదుల నుద్దేశించి కుడివైపుగా చుట్టివచ్చు.
ప్రదరము. సం. బాణము; చీలుట; విఱుగుట; ఆఁడు దానికి కలుగు రక్తస్రావరోగము. [చూపువాఁడు.
ప్రదర్శకుఁడు. సం విణ. విశదపఱచి
ప్రదర్శనము. సం. సందర్శించుట; విశదపఱచి చూపుట. [చూపఁబడినది.
ప్రదర్శితము. సం. విణ. విశదపఱచి
ప్రదానము. సం. గొప్ప యీవి.
ప్రదీపనము సం. విషభేదము. విణ. ప్రకాశింపఁజేయునది.
ప్రదీపము. సం. దీపము.
ప్రదేశనము. సం. కానుక. [స్థలము.
ప్రదేశము. సం. దేశము; జుట్టెలి; లాడితెఁడు;
ప్రదేశిని. సం. జుట్టనవ్రేలు. రూ. ప్రదేశని.
ప్రదోషము. సం. మిక్కిలిదోషము; మునిమాపు, రాత్రిమొదలు; సూర్యుఁడస్తమించిన పిదప రెండు గడియలకాలము.
ప్రద్యుమ్నుఁడు. సం. మన్మథుఁడు.
ప్రద్యోతనుఁడు. సం. సూర్యుఁడు.
ప్రద్రావము. సం. పలాయనము, పాఱుట. రూ. ప్రద్రవము. [ధనముగలది.
ప్రధనము. సం. యుద్ధము. విణ. గొప్ప
ప్రధానము. సం. పరమాత్మ; మూలప్రకృతి; బుద్ధితత్త్వము; మంత్రి; సేనానాయకుడు మొ. విణ. ముఖ్యము.
ప్రధానుఁడు. సం. కార్యసహాయుఁడు, సేనానాయకుఁడు మొ. విణ. ముఖ్యుఁడు.
ప్రధావించు. సం. అ. క్రి. పరుగెత్తు.
ప్రధి. సం. బండి కంటికడకమ్మి; గొప్పబుద్ధి. విణ దొడ్డబుద్ధిగలవాఁడు; మిక్కిలి ధ్యానించువాఁడు.
ప్రధ్వంసము. సం. వినాశము.
ప్రన్న. విణ. మనోజ్ఞము, ఇంపైనది.
ప్రన్నన. మనోజ్ఞత, ఇంపు, ఒప్పు.
ప్రప. సం. చలిపందిరి.

ప్రపంచము. సం. లోకము; అవిద్యాకల్పిత జగచ్చిత్రము, సంసారము; శబ్దవిస్తరము; ద్వైతభేద విస్తారము; విరివి; వ్యత్యాసము; మోసపుచ్చుట.

ప్రపంచించు. సం. స. క్రి. విస్తరించు.

ప్రపంచితము. సం. విణ. విస్తరింపఁబడినది.

ప్రపత్తి / ప్రపదనము } సం. భక్తిపరులు చేయు శరణాగతి, స్వప్రవృత్తి నివృత్తి, గతి వేఱులేదని పాదములు పట్టుకొనుట. [పాదము చివర.

ప్రపదము. సం. ముంగాలు, మీఁగాలు,

ప్రపథము. సం. మంచిమార్గము.

ప్రపన్నుఁడు. సం. విణ. ప్రపత్తి చేసిన వాఁడు. [తీరము.

ప్రపాతము సం కొండచఱియ; నద్యాది

ప్రపానము. సం. గుజ్జపు పైపెదవిచోటు

ప్రపితామహి. సం. ముత్తవ్వ, ప్రపితామహుని భార్య.

ప్రపితామహుఁడు. సం. ముత్తాత, పితామహుని తండ్రి; బ్రహ్మ.

ప్రపున్నాటకము. సం తగిరిస†.

ప్రపౌండరీకము. సం. పుండరీకమను గంధద్రవ్యము. [కాఁతురు.

ప్రపౌత్రి. సం. మునుమనుమరాలు, పౌత్రుని

ప్రపౌత్రుఁడు. సం. పౌత్రుని కొడుకు, మునుమనుమఁడు.

ప్రప్పు. శకలము.

ప్రప్రపితామహి. సం. ప్రపితామహునితల్లి.

ప్రప్రపితామహుఁడు. సం. ప్రపితామహుని తండ్రి.

ప్రఫుల్లము. సం. విణ. వికసించినది.

ప్రబంధకల్పన. సం. ఇంచుక సత్యమైన అర్థముగల కాదంబర్యాది రచన.

ప్రబంధము. సం. కావ్యము; రచన; సందర్భము; ప్రవాహము.

ప్రబర్హము. సం. విణ. ముఖ్యము, శ్రేష్ఠము.

ప్రబలము. సం. చిగురు. విణ. మిక్కిలి బలము గలది.

ప్రబలు. అ. క్రి. అతిశయిల్లు; వృద్ధినొందు.

ప్రబుద్ధము. సం. విణ. వికసించినది.

ప్రబుద్ధుఁడు. సం. విణ. మేలుకొన్న వాఁడు; పండితుఁడు; జ్ఞాని.

ప్రబోధనము. సం. సమ్యక్ జ్ఞానము; మేలుకువ; అనుబోధముగల సుగంధిద్రవ్యము కస్తూరి మొ॥; అనుబోధము.

ప్రబోధము. సం. మేలుకువ; జ్ఞానము; యథార్థజ్ఞానము.

ప్రబోధించు. సం. స. క్రి. చక్కఁగా తెలుపు; మేలుకొలుపు.

ప్రబ్బలి. ప్రబ్బలిఁగ, చేతసము†.

ప్రబ్బికోలు. అ. క్రి. ప్రబ్బుకొనుట.

ప్రబ్బు. నింద. అ. క్రి. వ్యాపించు; స్థితినొందు; ప్రబలు. స. క్రి. నిందించు; కలయు. [సూర్యుని భార్య; దుర్గ.

ప్రభ. సం. వెలుఁగు; కుబేరుని పట్టణము;

ప్రభంజనుఁడు. సం. వాయువు. విణ. చక్కఁగా విఱుచువాఁడు.

ప్రభవ. సం. ఒక సంవత్సరము.

ప్రభవము. సం. పుట్టుక; మొదట ప్రకటమగు స్థానము; పుట్టుకకు కారణమైనది; ఎఱుక; పరాక్రమము; జలోత్పత్తిస్థానము.

ప్రభవించు. సం. అ. క్రి. పుట్టు.

ప్రభాకరుఁడు. సం. సూర్యుఁడు; అగ్ని; చంద్రుఁడు; మీమాంసకులలో నొక తెగను చెందినవాఁడు.

ప్రభాతము. సం. ప్రాతఃకాలము.

ప్రభావము. సం. మహిమ; కోశబలముల వలనఁ గలిగిన తేజము; శక్తి.

ప్రభిన్నము. సం. మదపుటేనుఁగు. విణ. మిక్కిలి భేదపడినది.

ప్రభువు. సం. విష్ణువు. విణ. అధిపతి; నిగ్రహానుగ్రహ సమర్థుఁడు.

ప్రభూతము. సం. విణ. అధికము; బయల్వెడలినది. [మొదలగునది.

ప్రభృతి. సం. అవ్య. మొదలు. విణ.

ప్రభ్రష్టకము. సం. కొప్పునవ్రేలెడుదండ.

ప్రమ. సం. ప్రమితి, యథార్థజ్ఞానము.

ప్రమత్తుఁడు. సం. విణ. ప్రమాద పడిన వాఁడు; మిక్కిలి మదించినవాఁడు.

ప్రమథనము. సం. వధము.

ప్రమథాధిపతి. సం. శివుఁడు. [మజ్జిగ.

ప్రమథితము. సం. నీళ్లుపోయక చిలికిన

ప్రమథుఁడు. సం. ఒక శివపార్శ్వదుఁడు; భూతవిశేషము. బ. కైలాసమందుండు శివభక్తులు.

ప్రమద. సం. ఉత్తమస్త్రీ.

ప్రమదము. సం. సంతోషము. విశ. మిక్కిలి మదముగలది.

ప్రమద(దా)వనము. అంతఃపుర యోగ్యమైన రాజోద్యానము

ప్రమనుఁడు. సం. సంతోషము నొందిన మనస్సు గలవాఁడు రూ. ప్రమనస్సు.

ప్రమాణము.సం.ప్రత్యక్షాదిజ్ఞానకరణము, నేత్రము మొదలగు జ్ఞానేంద్రియము; పరిమాణము, కొలత; అంగుళీమానము, జేన మూర మొ॥; నిత్యము; మేర; శాస్త్రము; ఎఱుఁగునది. (ప్రత్యక్షాది ప్రమాణములు ఎనిమిది—ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శాబ్దము, అర్థాపత్తి, అనుపలబ్ధి, సంభవము, ఐతిహ్యము.) [గాఁ జేసికొను.

ప్రమాణీకరించు సం. స.క్రి. ప్రమాణము

ప్రమాత. సం.విశ. ద్రష్ట, జ్ఞాత, ఎఱిఁగెడువాఁడు; లౌకికములు వైదికములు నగు సమస్తవ్యవహారముల యందు జాగరూకుఁడైయుండెడి జీవుఁడు.

ప్రమాతామహి. సం. మాతామహుని తల్లి

ప్రమాతామహుఁడు. సం. మాతామహుని తండ్రి.

ప్రమాథి. సం. ఒక సంవత్సరము.

ప్రమాదము. సం. ఏమఱుపాటు, తప్పుట వా. అపాయము.

ప్రమాది. సం.విశ. ప్రమాదముగలవాఁడు

ప్రమాపణము. సం. వధము.

ప్రమితి. సం. ప్రమ, యథార్థజ్ఞానము.

ప్రమిద. మల్లకము, దీపము వెలిఁగించెడు పాత్రము. వా. ప్రమిదె.

ప్రమీతము. సం. విశ. యజ్ఞమునందు చంపఁబడినపశువు; చచ్చినది.

ప్రమీతుఁడు. సం.విశ చచ్చినవాఁడు.

ప్రమీల. సం. కునికిపాటు.

ప్రముఖము. సం. పున్నాగము†. విశ. మొదలగునది; ముఖ్యము.

ప్రముఖుఁడు. సం. విశ. ముఖ్యుఁడు; మొదటివాఁడు. [వాఁడు.

ప్రముదితుఁడు సం.విశ. సంతోషించిన

ప్రమేయము. సం. విశ. ఎఱుఁగఁబడెడి విషయము, శబ్దాది.

ప్రమోద. సం. ఒక సంవత్సరము.

ప్రమోదము. సం, సంతోషము.

ప్రమోదించు. సం. అ.క్రి. సంతోషించు.

ప్రమ్మిద. ప్రమిద.

ప్రమ్ము. స.క్రి. పరివేష్టించు.

ప్రయతుఁడు. సం.విశ. పవిత్రుఁడు; పరిశుద్ధుఁడు; నియతాత్ముఁడు.[యత్నము.

ప్రయత్నము. సం. యత్నము; మిక్కిలి

ప్రయత్నించు. సం. అ.క్రి. యత్నించు; చక్కఁగా యత్నించు.

ప్రయస్తము. సం.విశ. నేయి మసాలా మొ॥ వానిచేత సాతాళింపఁబడినకూర.

ప్రయాగము. సం.తీర్థరాజము, ప్రయాగ; ధాన్యవిశేషము; ఉత్తమయజ్ఞము; గుఱ్ఱము.

ప్రయాగుఁడు సం. ఇంద్రుడు. [నము.

ప్రయాణము. సం. బయలుదేఱుట, పయ

ప్రయాణించు. సం.అ క్రి. ప్రయాణమగు.

ప్రయాతము. సం, విశ. ప్రయాణమై పోయినది.

ప్రయామము. సం. జయఘంట మొదలుగు వానగుండ ధాన్యాదుల వెలను ప్రసిద్ధపఱచుట; వెలకీయఁదగినవస్తువు; మహార్ఘ్యములైన ధాన్యాదులయందలి జనుల యాదరాతిశయము.

ప్రయాసపడు. మి. అ.క్రి. శ్రమపడు.

ప్రయాసము. సం. శ్రమము.

ప్రయుక్తము. సం.విశ ప్రయోగింపఁబడినది; మిక్కిలి కూడుకొన్నది.

ప్రయుతము. సం. పదిలక్షలు.

ప్రయోక్త. సం.విశ. ప్రయోగించువాఁడు

ప్రయోగము. సం. అనుష్ఠానము, నడపుట అస్త్రశస్త్రాదులఁ బ్రయోగించుట; మంత్రతంత్రాదులను నడపుట; పంపు, అభిచారము; తారకాణము;కర్తృకర్మక్రియలకూడిక.

ప్రయోగించు. సం. అ. క్రి. అనుష్ఠించు; చేయు; నడపు; మంత్ర తంత్రాదులను నడపు; గ్రంథమునందు వాక్యము ను ఉపయోగించు.
ప్రయోజకుఁడు. సం. విణ. ప్రయోగించు వాఁడు; కార్యము నెఱవేర్చువాఁడు.
ప్రయోజనము. సం. కార్యము; హేతువు
ప్రరోహము. సం. మొలక.
ప్రలంబఘ్నుఁడు. సం. బలరాముఁడు.
ప్రలంబము. సం. మిక్కిలి వ్రేలాడుట; కంఠమున వ్రేలెడి ముత్యాలహారము మొ॥; స్తనము; కొమ్మ; గిఱకతాడు;? తగరము.?
ప్రలంబుఁడు. సం. ఒక రక్కసుఁడు.
ప్రలంభము. సం. ప్రాప్తి, చక్కఁగా లభించుట.
ప్రలాపము. సం. ప్రేలడము, (వెఱ్ఱివాఁడు మొదలగువారి) అర్థశూన్యమయినమాట.
ప్రలాపించు. సం. అ. క్రి. ప్రేలు.
ప్రలోభనము. సం. ఆశపెట్టుట; మృగము లను పట్టుటకు పెట్టు మచ్చు.?
ప్రలోభము. సం. మిక్కిలి లోభము.
ప్రలోభించు. సం. స. క్రి. ఆసగొనఁజేయు.
ప్రల్లఁదనము. ప్రల్లదము.
ప్రల్లటీఁడు } విణ. ప్రల్లదుఁడు.
ప్రల్లదకాఁడు }
ప్రల్లదము. పారుష్యము; దుర్భాషణము; దుష్కృత్యము.
ప్రల్లదీఁడు } విణ. దుష్టుఁడు; దుర్భాషణము లాడువాఁడు.
ప్రల్లదుఁడు }
ప్రల్లదురాలు. విణ. దుష్టురాలు; దుర్భాషణములాఁడు స్త్రీ.
ప్రవక్త. సం. విణ. చక్కఁగా మాటలాడు వాఁడు.
ప్రవచనము. సం. వేదము; వేదాంగము; అధ్యాపనము; గొప్పమాట; అర్థాను సంధానపూర్వకముగా మాటలాడుట.
ప్రవచనీయము. సం. విణ. ప్రవచన యోగ్యమైన విషయము.
ప్రవణము. సం. చతుష్పథము. విణ. వాటపు పల్లము; ఆసక్తము.
ప్రవణుఁడు. సం. విణ. ఆసక్తిగలవాఁడు; నమ్రుఁడు; సమర్థుఁడు; ఉదారుఁడు.
ప్రవయుఁడు. సం. విణ. ముదుసలి.
ప్రవరము. సం. గోత్రము; గోత్రప్రవర్తకులైన ఋషుల గణము; అగలు; సంతతి. విణ. శ్రేష్ఠము.
ప్రవరుఁడు. సం. విణ. శ్రేష్ఠుఁడు.
ప్రవర్గ్యము. సం. వేదవిహితమైన ఒకకర్మ.
ప్రవర్తకుఁడు. సం. విణ. ప్రేరకుఁడు; ప్రవర్తింపఁజేయువాఁడు, నడపువాఁడు.
ప్రవర్తనము. సం. నడత, నడపు, నడపుట.
ప్రవర్తించు. సం. అ. క్రి. నడచు. రూ. ప్రవర్తిల్లు. పొందు. ప్రే. ప్రవర్తించు.
ప్రవర్ధిల్లు. సం. అ. క్రి. మిక్కిలి వృద్ధి
ప్రవహణము. సం. మనుష్యులు మోయు వాహనము, పాలకి మొ.
ప్రవహము. సం. బయల్వెడలుట; వాయువు; వాయువిశేషము
ప్రవహించు. సం. అ. క్రి. పాఱు, వెల్లివిరియు
ప్రవహ్లిక. సం. గూఢార్థముగల కవితా విశేషము; సమస్య.
ప్రవాణి. సం. లాక, సాలెవాని సలాక.
ప్రవాదము. సం. కారణము లేకయే కలిగి లోకమునందంతట వ్యాపించిన మాట, బజారుకబురు; సంవాదము; పరంపరగా వచ్చిన వాక్యము.
ప్రవారణము. సం. స్వర్గాది ఫలమును గోరి చేయుదానము; నివారణము; కోరినది యిచ్చుట.
ప్రవాసనము. సం. వధము; వెడలఁగొట్టుట.
ప్రవాసము. సం. పరదేశ నివాసము; పరదేశగమనము; పరస్థలము.
ప్రవాహము. సం. వెల్లువ; ప్రవృత్తి; అవిచ్ఛిన్నముగా ప్రవర్తించుట; వ్యవహారము; పరంపర; పాఱుట.
ప్రవాహిక. సం. గ్రహణి, పాచవాలు.
ప్రవాళము. సం. పగడము; వీణాదండము; చిగురు.
ప్రవిదారణము. సం. పోరు.
ప్రవిష. సం. అతివస.
ప్రవిష్టుఁడు. సం. విణ. ప్రవేశించినవాఁడు
ప్రవీణుఁడు. సం. నేర్పరి.
ప్రవృత్తుఁడు. సం. విణ. ప్రవర్తించిన వాఁడు.

ప్రవృత్తి. సం. నడవడి; వర్తమానము; ప్రవేశము; బ్రతుకు తెరువు.
ప్రవృద్ధము. సం. విణ. పెరిఁగినది; ఆధిక్యముగా పెరిగినది.
ప్రవేకము. సం. విణ. ముఖ్యము.
ప్రవేణి. సం. ఏనుఁగుమీఁద వేయుచెడి ఎఱ్ఱ కంబళి; సర్పాకారముగా అల్లిన జడ.
ప్రవేశనము. సం. ప్రవేశ పెట్టుట; సింహ ద్వారము.
ప్రవేశము. సం. చొచ్చుట, చొరవ.
ప్రవేశించు. సం. అ. క్రి. చొచ్చు.
ప్రవేష్టము. సం. చేయి, భుజము.
ప్రవ్యక్తము. సం. విణ. విస్పష్టము.
ప్రవ్రజితుఁడు. సం. సంన్యాసి.
ప్రవ్రజ్య. సం. సంన్యాసము; వేద బాహ్యమైన రక్తవస్త్రాది.
ప్రవ్వ. కుండ.
ప్రశంస. సం. పొగడిక, స్తోత్రము.
ప్రశంసించు. సం. స. క్రి. స్తోత్రముచేయు
ప్రశస్తము. సం. శుభకార్యము. విణ. నేయి నూనె మొదలగువానిచే పొగడఁబడినది; ప్రశంసింపఁబడినది; శ్రేష్ఠమైనది
ప్రశస్తి. సం. ప్రశంస, స్తుతి.
ప్రశస్యము. సం. విణ. ప్రశంసింపఁదగినది
ప్రశాంతి. సం. మిక్కిలి శాంతి.
ప్రశాంతుఁడు. సం. విణ. మిక్కిలి శాంతి నొందినవాఁడు.
ప్రశ్నము. సం. అడుగుట. [ర్చుట.
ప్రశ్రయము. సం. అనునయము, ఓదా
ప్రశ్రితుఁడు. సం. విణ. వినీతుఁడు
ప్రష్ట. సం. విణ. అడిగెడివాఁడు.
ప్రష్ఠవాహము. సం. పనుపఱచుటకు కాఁడి మోసెడి యెద్దులదాపునఁ గట్టెడి కోడె.
ప్రష్ఠుఁడు. సం. విణ. అగ్రేసరుఁడు, శ్రేష్ఠుఁడు.
ప్రష్ఠౌహి. సం. రూ. పష్ఠౌహి.
ప్రసంగము. సం. తగులాటము; విషయ విస్తరము; ప్రస్తావము, కూటలాడుట.
ప్రసంగించు. సం. స. క్రి. ఏదేని ఒక విషయము విస్తరించి చెప్పు; ప్రస్తావించు.
ప్రసక్తి. సం. ప్రసంగము; ప్రస్తావము.
ప్రసక్తించు. సం. అ. క్రి. ప్రస్తావమునకు వచ్చు.
ప్రసన్న. సం. కల్లు.
ప్రసన్నత. సం. సుముఖత; నిర్మలత.
ప్రసన్నము. సం. విణ. సుముఖమైనది; నిర్మలమైనది.
ప్రసన్నుఁడు. సం. సుముఖుఁడైనవాఁడు.
ప్రసభము. సం. బలాత్కారము.
ప్రసరణము } సం. అంతట సేన వ్యాపించుట; వ్యాపించుట.
ప్రసరణి }
ప్రసరము. సం. వేగము; వ్యాపనము; మార్గము; యుద్ధము; వినయము.?
ప్రసరించు. సం. అ. క్రి. వ్యాపించు. రూ. ప్రసరిల్లు.
ప్రసర్పణము. సం. ప్రసరణము.
ప్రసవబంధనము. సం. ఆకులం మొదలగు వాని తొడిమ. [బిడ్డ; పండు.
ప్రసవము. సం. కానుపు; పువ్వు; పుట్టుక;
ప్రసవించు. సం. స. క్రి. (బిడ్డను) కను.
ప్రసవ్యము. సం. విణ. అనుకూలము; ప్రతికూలము; ప్రసవయోగ్యము; కుడి;? ఎడమ.?
ప్రసహము. సం. బలాత్కారముగా పొడిచి భక్షించెడి పక్షి కాకి గూబ గ్రద్ద మొ. [నము; అన్నము; సేవ.
ప్రసాదనము. సం. తేర్చుట; బహుమా
ప్రసాదన. సం. సేవ.
ప్రసాదము. సం. ప్రసన్నత, నిర్మలత. (రూ. ప్రపత్తి). కావ్యగుణములలో నొకటి; అనుగ్రహము; స్వాస్థ్యము; భగవదర్పితమైన అన్నము మొ.
ప్రసాదించు. సం. స. క్రి. అనుగ్రహించి యిచ్చు. [వేషము, అలంకారము.
ప్రసాధనము. సం. సిద్ధింపఁజేసికొనుట;
ప్రసాధని. సం. దువ్వెన.
ప్రసాధించు. సం. స. క్రి. అలంకరించు.
ప్రసాధితుఁడు. సం విణ. వస్త్రాదులచేత అలంకరింపఁబడినవాఁడు.
ప్రసారణము. సం. చాఁచుట; తెరచుట.
ప్రసారణి. సం. గొంతెమగోరుచి.

ప్రసారము. సం. వ్యాపనము; గడ్డి మొద లగునవి వ్యాపించుట.
ప్రసారి. సం. విణ. వ్యాపించునది.
ప్రసారితము. సం. విణ. చాపఁబడినది; తిగువఁబడినది.
ప్రసితి. సం. బంధించుట; కట్టెడుసాధనము
ప్రసితుఁడు. సం. విణ. తత్పరుఁడు, ఆసక్తుఁడు. [అలంకరింపఁబడినది.
ప్రసిద్ధము. సం. విణ. ప్రసిద్ధి కెక్కినది;
ప్రసిద్ధి. సం. అంతట ఎఱుకపడుట, ఖ్యాతి; అలంకారము.
ప్రసిద్ధుఁడు. సం. విణ. పేరుపడ్డవాఁడు.
ప్రసువు. సం. తల్లి; ఆఁడుగుఱ్ఱము; అరఁటి†; ఒకటితో నొకటి పెనఁగొన్న ద్రాక్షతీఁగ మొ.
ప్రసూత. సం. బాలెంతరాలు.
ప్రసూతము. సం. పువ్వు. విణ. పుట్టినది.
ప్రసూతి. సం. తల్లి; కానుపు; పుట్టుక; బిడ్డ.
ప్రసూతిక. సం. బాలెంతరాలు.
ప్రసూతిజము. సం. బాధ; దుఃఖము.
ప్రసూనము. సం పుష్పము; ఫలము. విణ. పుట్టినది.
ప్రసృత. సం. కాలిపిక్క.
ప్రసృతము. సం. చేర. విణ. కొనసాఁగి పెరిఁగినది; తీర్పఁబడినది; బయల్వెడలినది; వ్యాపించినది.
ప్రసృతి. సం. చేర, పుడిసిలి.
ప్రసేకము. సం. చల్లుట; జాఱుట; కాఱుట.
ప్రసేవకము. సం. కరిది, వీణెకాయ; దాఁగర; దారపు సంచి.
ప్రసేవము. సం. ఎండపుఁదట్ట; దాఁగర; వీణెకాయ; తోలుతిత్తి.
ప్రస్తారము. సం. ఈయి; రత్నము; చిగుళ్లు మొదలగువానిచే ఏర్పఱచిన శయ్య; దర్భల పిడికిలి. [ప్రస్తారముచేయు.
ప్రస్తరించు. సం. స. క్రి. విస్తరించు; ఛందః
ప్రస్తవము. సం. విషయము, ప్రస్తావము
ప్రస్తారము. సం. ఛందస్సులు మున్నగువాని భేదముల (గురులఘువుల) నెఱిఁగించెడి ఒక సంకేతము; పాన్పు; ఆకుల సెజ్జ; పచ్చికయడవి.

ప్రస్తావము. సం. స్తుతి; ముచ్చట; ప్రారంభము; అవసరము; చెప్పుట;?సమయోచితము.? [తెచ్చు.
ప్రస్తావించు. సం. స. క్రి. ప్రస్తావమునకు
ప్రస్తుత. సం. పాడుఁగుచేసిన ఆవు.?
ప్రస్తుతము. సం. విణ. మిక్కిలి స్తుతింపఁబడినది; ప్రసక్తికి తేఁబడినది; చెప్పఁబడినది; ప్రవర్తించినది; సెలవేతినది.
ప్రస్తుతి. సం. స్తోత్రము; (ఎదుట) స్తుతించుట
ప్రస్తుతించు. సం. (ఎదుట) స్తుతించు.
ప్రస్థపుష్పము, సం. మరువము†.
ప్రస్థము. సం. పర్వతముమీఁది ఫలకాకారముయినశిల; తూము, నాలుగుకుంచములకొలఁది; కుంచము, నాలుగుమానికల కొలఁది.
ప్రస్థానత్రయము. సం. ఉపనిషత్తులు భగవద్గీతలు బ్రహ్మసూత్రములు - అను వీని భాష్యరూపముగా (భాష్యటీకారూపముగా) నుండెడి ఉపదేశోపాయములు మూఁడు.
ప్రస్థానము. సం. ప్రయాణము; దండయాత్ర; ఉపదేశసాధనము.
ప్రస్థాపించు. సం. స. క్రి. చక్కఁగా స్థాపనము చేయు, నిలుపు.
ప్రస్థాపితము. సం. విణ. చక్కఁగా స్థాపింపఁబడినది; నిలుపఁబడినది; తరలింపఁబడినది
ప్రస్థితము. సం. విణ. ప్రయాణమై పోయినది.
ప్రస్ఫోటనము. సం. చేట; వికాసనము; ప్రకాశనము; దెబ్బ; చెరుగుట.
ప్రస్రవణము. సం. సెలయూట; చెమట; ప్రవాహము.
ప్రస్రావము. సం. మూత్రము.
ప్రస్వ. బ్రహ్మబిందువు.?
ప్రహతము. సం. విణ. కొట్టఁబడినది; పాడి చేయఁబడినది; విస్తరింపఁబడినది.
ప్రహరణము. సం. యుద్ధము, ఆయుధము; దెబ్బ, కొట్టుట.
ప్రహరము. సం. జాము; దెబ్బ.?
ప్రహరి. ప్రాకారము, ఇంటిస్థలము చుట్టు వేసిన గోడ. సం. గస్తీలు.

ప్రహరించు. సం. స. క్రి. దెబ్బతీయు, కొట్టు.

ప్రహరిచరించు
ప్రహరిచుట్టు
ప్రహరిదిరుగు } అ. క్రి. ప్రదక్షిణించు.

ప్రహరుషము. ప్రహర్షము.
ప్రహర్షము. సం. ఆనందము.
ప్రహసనము. సం. పెద్దనవ్వు; ఆక్షేపము; హాస్యరస ప్రధానమైన ఒక దృశ్య కావ్యము. [ఆక్షేపించు.
ప్రహసించు. సం. స. క్రి. పెద్దగానవ్వు;
ప్రహసితము. సం. శిరఃకంపముతోఁ గూడిన నవ్వు. [అఱచేయి.
ప్రహస్తము. సం. చాఁచిన వ్రేళ్లుగల
ప్రహస్తుఁడు. సం. ఒక రాక్షసుఁడు.
ప్రహారకుఁడు. సం విణ. ప్రహరించువాఁడు
ప్రహారము. సం. దెబ్బ; కొట్టుట
ప్రహారి. సం. విణ. దెబ్బవేయువాఁడు.
ప్రహి. సం. బావి, నుయ్యి.
ప్రహితము. సం. విణ. పంపఁబడినది; ఉంచఁబడినది; విడువఁబడిన బాణము మొ.
ప్రహితుఁడు. సం. విణ. పంపఁబడినవాఁడు. ప్రేరేపింపఁబడినవాఁడు.
ప్రహేళిక. సం. ప్రవహ్లిక. [వాఁడు.
ప్రహ్లన్నుఁడు. సం. విణ. సంతోషించిన
ప్రహ్లాదము. సం. సంతోషము
ప్రహ్లాదుఁడు. సం. పరమభాగవతవిశేషము.
ప్రహ్వము. సం. విణ. నమ్రము; ఆసక్తము; అనుకూలము; మహిమాన్వితము.
ప్రళయము. సం. కల్పాంతము, మన్వంతర ప్రళయము; అపాయము; మృత్యువు; మూర్ఛ; ఒక సాత్త్వికభావము.

## ప్రా

ప్రా. విణ. ప్రాఁతశబ్దముయొక్క లుప్త రూపము.
ప్రాంగణము. సం. ముంగిలి; పణవ వాద్యము. [స్థానము.
ప్రాంతదుర్గము. సం. ఒక నృపాశ్రయ
ప్రాంతము. తీరము; సమీపము. సం. చివర, తుద, కొన, అంచు.
ప్రాంతరము. సం. అడవి; తొఱ్ఱ; దవ్వయిన యొంటరిత్రోవ; పొలిమేర.?
ప్రాంశువు. సం. విణ. ఉన్నతము.
ప్రాఁకు. తీఁగయల్లుటకు సమీపమునఁ నిడు కొయ్య మొ॥; మాలిన్యము. అ. క్రి. ఎక్కు; ఱొమ్ముతో జరగు.
ప్రాఁకుడు. ప్రాఁకుట; పాఁచి, మాలిన్యము.
ప్రాఁకుదెంచు. అ. క్రి. ప్రాఁకు.
ప్రాఁకులాడు. అ. క్రి. ప్రాఁకి యెక్కు.
ప్రాఁకొను. అ. క్రి. పాఁచిపట్టు.
ప్రాఁగబ్బము. వేదము.
పాఁచి. రూ. పాఁచి. [తనువు.
ప్రాఁజేదువులపెట్టె. సూర్యుఁడు, త్రయీ
ప్రాఁజేదువులు. బ. వేదములు.
ప్రాఁత. భృత్యుఁడు; వస్త్రము; జీర్ణ వస్త్రము. విణ. పురాతనము; పూర్వము; జీర్ణము.
ప్రాఁతగిలు(ల్లు). అ. క్రి. ప్రాఁతవడు.
ప్రాఁతపంచాంగము. మి. పూర్వపు వ్యవహారము.
ప్రాఁతబట్ట. పటచ్చరము.
ప్రాఁతవడు. అ. క్రి. ప్రాఁతదియగు.
ప్రాఁపడు. అ. క్రి. ప్రాఁతగిల్లు; అలవడు.
ప్రాఁబలుకు టెంకి. త్రయీతనుఁడు, సూర్యుఁడు. [ప్రాఁబలుకులు.
ప్రాఁబలుకులు బ. వేదములు. రూ.
ప్రాక. రూ. పాక.
ప్రాకటము. విణ. ప్రసిద్ధము.
ప్రాకామ్యము. సం. ఒక ఐశ్వర్యము.
ప్రాకారము. సం. కోట, గుడి మొదలగు వాని చుట్టు గోడ.
ప్రాకృతము. సం. ఒకానొక భాష. (ఇది షడ్విధము—ప్రాకృతము, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికా పైశాచి, అపభ్రంశము.) [నీచుఁడు.
ప్రాకృతుఁడు. సం. విణ. పామరుఁడు,

ప్రాకెన
ప్రాకెన్న } రూ. పాకెన.

ప్రాక్కు. సం. తూర్పు దిక్కు.
ప్రాక్తనము. సం. విణ. పురాతనము.
ప్రాగల్భ్యము. సం. దిట్టతనము; పరుల

నెదుర్కొనఁ గల శక్తి; ప్రతిభా తిశయము; స్త్రీలయొక్క అయత్నమైన ఒక శృంగారచేష్ట; భయరాహిత్యము.

ప్రాగ్భారము. సం. అతిశయము; పర్వత శిఖరము.

ప్రాగ్రసరుఁడు. సం. విణ. అగ్రేసరుఁడు.

ప్రాగ్రహరము } సం. విణ. శ్రేష్ఠము.
ప్రాగ్ర్యము }

ప్రాగ్వంశము. సం. హవిర్గృహమునకు ముందున్న సభాగృహము. [ధార.

ప్రాఘారము. సం. నేయి మున్నగువాని

ప్రాఘూర్ణికుఁడు. సం. అతిథి.

ప్రాచి. సం. తూర్పు; పచ్చారు చెట్టు.

ప్రాచితము. ప్రాయశ్చిత్తము.

ప్రాచీన. సం. చిఱుబొద్ది.

ప్రాచీనతిలకుఁడు. చంద్రుఁడు.

ప్రాచీనబర్హి. సం. ఇంద్రుఁడు; ఒక రాజు.

ప్రాచీనము. సం. కంచెకోట. విణ. పూర్వ దిశయందుఁ గలిగినది; పూర్వకాలము నందుఁగలిగినది. [వేసికొన్న జంధెము.

ప్రాచీనావీతము. సం. అపసవ్యముగా

ప్రాచీనులు. సం. బ. పూర్వులు, పెద్దలు.

ప్రాచుర్యము. సం. ప్రచురత్వము, బాహుళ్యము. [వరుణుని కొడుకు.

ప్రాచేతసుఁడు. సం. వాల్మీకి మహాముని;

ప్రాచ్యము. సం. శరావతి యను నది యెల్లగాఁగల ప్రాగ్దక్షిణముల మధ్యదేశము. విణ. తూర్పుదిక్కునందలిది.

ప్రాజనము. సం. మునికోల.

ప్రాజాపత్యము. సం. సంన్యాసాశ్రమమునకు మొదట చేసెడి ఒక యిష్టి.

ప్రాజాపత్యము. సం. ప్రయాగక్షేత్రము; వివాహవిశేషము; పన్డ్రెండేండ్లు చేసెడి ఒక వ్రతము; సత్యలోకము; తపస్సు. విణ. ప్రజాపతి అధిదేవతగాఁగలది.

ప్రాజిత. సం. సారథి.

ప్రాజ్ఞ సం. బుద్ధి; ప్రాజ్ఞురాలు.

ప్రాజ్ఞి. సం. ప్రాజ్ఞురాలు; ప్రాజ్ఞుని భార్య; సూర్యుని భార్య.

ప్రాజ్ఞుఁడు. సం. కారణదేహాభిమానియగు జీవుఁడు, అవిద్యోపాధికుఁడు. విణ. పండితుఁడు; సమర్థుఁడు; బుద్ధిమంతుఁడు; వేదవేత్త.

ప్రాజ్యము. సం. విణ. అధికము. [ధిపతి.

ప్రాడ్వివాకుఁడు. సం. మునసబు, న్యాయా

ప్రాణగొడ్డము. ప్రాణహింసకము.

ప్రాణదుఁడు. సం. విష్ణువు.

ప్రాణనాథుఁడు. సం. మగఁడు; యముఁడు

ప్రాణము. సం. గాలి; హృదయమందలి గాలి, ఊపిరి; కావ్యజీవము; బలము; బోళము. బ. ఉసురు; అచ్చులు; విణ. నిండింపఁబడినది; (పంచప్రాణములు— ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము). [చెలి.

ప్రాణవయస్య. సం. ప్రాణసమానురాలైన

ప్రాణాచారము. ప్రాయోపవేశము.

ప్రాణాచారముపడు. అ. క్రి. ప్రాయోపవేశము చేయు.

ప్రాణాయామము. సం. ముఖనాసికలయందు సంచరించెడి వాయువును గాయత్రీమంత్రపూర్వకముగా నిరోధించుట, రేచకపూరకకుంభకరూపమైనయది.

ప్రాణి. సం. జీవుఁడు విణ. జీవి, శరీరధారి, ప్రాణము గలది.

ప్రాణిద్యూతము. సం. ప్రాణులజూదము, కోడిపందెము గుఱ్ఱపు పందెము మొ.

ప్రాతికూల్యము. సం. ప్రతికూలముగా నుండుట.

ప్రాతిపదికము. సం. ధాతుభిన్నమును ప్రత్యయభిన్నమును ప్రత్యయాంతభిన్నమునై అర్థము గలిగియుండు శబ్దము.

ప్రాతిభావ్యము. సం. పూఁట, పూఁచీ పడుట; జమీను, పూఁటపడువాఁడిచ్చెడి ద్రవ్యము.

ప్రాతిహార(రి)కుఁడు. సం. మాయావి.

ప్రాథమకల్పికుఁడు. సం. వేదాధ్యయనము చేయ నారంభించిన శిష్యుఁడు; శిక్షాగ్రంథమును చదువువాఁడు.

ప్రాథమికుఁడు. సం. విణ. మొదట అధ్యయనము చేయువాఁడు; మొదట ఏర్పడిన వాఁడు. [ప్రాధాన్యము.

ప్రాథమ్యము. సం. మొదలుగా ఉండుట;

ప్రాధీయపడుట. అ.క్రి. వేడుకొనుట.
ప్రాదుర్భవించు. సం. అ.క్రి. ఆవిర్భవించు.
ప్రాదుర్భావము. సం. ఆవిర్భావము.
ప్రాదుర్భూతము. సం. విణ. ఆవిర్భవించినది
ప్రాదేశనము. సం. దానము.
ప్రాదేశమాత్రము. సం. విణ. లొడితెఁడు.
ప్రాదేశము. సం. జుట్టిలి, చూపుడు వ్రేలిని బొటనవ్రేలిని చాఁచి పట్టిన కొలఁత.
ప్రాధాన్యము. సం. ప్రధానముగా ఉండుట శ్రేష్ఠత్వము. [పొందువాఁడు.
ప్రాపకుఁడు. సం. విణ. ప్రాపించువాఁడు,
ప్రాపణము. సం. ప్రాప్తించుట.
ప్రాపణీయము. సం. విణ. ప్రాపింపఁదగినది.
ప్రాపించు. సం. స. క్రి. పొందు.
ప్రాపు. అశ్రయము, ఆసరా.
ప్రాప్తము. సం. విణ. లభించినది, పొందఁబడినది; కూడుకొన్నది. [రూపరి.
ప్రాప్తరూపుఁడు. సం. విణ. పండితుఁడు;
ప్రాప్తి. సం. శుభోదయము, ధనాద్యభివృద్ధి; అష్టైశ్వర్యములలో ఒకటి; పొందుట.
ప్రాప్తించు. సం. అ. క్రి. కలుగు, ప్రాప్తమగు
ప్రాప్యము. సం. విణ. పొందఁదగినది.
ప్రాబల్యము. సం. ప్రబలుట, ప్రబలముగా ఉండుట.
ప్రాభవము. సం. ప్రభుత్వము, దొరతనము
ప్రాభాతికము. సం. విణ. ప్రాతఃకాలము నందలిది.
ప్రాభృతము. సం. కానుక.
ప్రామాణికము. సం విణ. శాస్త్ర ప్రామాణ్యము గలది.
ప్రామాణికుఁడు. సం. విణ. మేర మీఱనివాఁడు; శాస్త్రము నెఱిఁగినవాఁడు; శాస్త్రము ననుసరించువాఁడు.
ప్రామాణ్యము. సం. ప్రమాణముగా ఉండుట; మూడు కాలములయందు బాధింపఁబడని అర్థము విషయము గలదిగా ఉండుట.
ప్రామిడి. క్రౌర్యము. విణ. క్రూరము.
ప్రామినుకులు. బ. వేదములు. రూ. ప్రామిన్కులు.

ప్రాము. స.క్రి. తాచు; పూయు; కూయు; తుడుచు; అలుకు, పులుము; పీడించు; ఖండించు.
ప్రాముఖ్యము. సం. ప్రాధాన్యము.
ప్రాముడు. పులుముడు.
ప్రాయము. సం. వయస్సు; తపస్సు, వ్రతాదికము; మరణార్థము సర్వసంగపరిత్యాగపూర్వకముగా చేసెడి ఉపవాసము; చావు; బాహుళ్యము; (ఉత్తరపద మైనచో) సమానము.
ప్రాయశ్చిత్తము. సం. పాపపరిహారార్థము చేసెడు కర్మము. [సౌమంగల్యము.
ప్రాయి. పౌరుషము; భాగ్యము;
ప్రాయిఁడి. విణ. దీనుఁడు; పౌరుషహీనుఁడు; దీనము; భాగ్యహీనము.
ప్రాయికము. సం. విణ. తఱచుగాకలుగునది
ప్రాయేలు. సముద్రము.
ప్రారంబము. సం. ప్రయత్నము; ఆరంభించుట; ఆరంభము. [ఆరంభించు.
ప్రారంభించు. సం. అ.క్రి. ప్రయత్నించు;
ప్రారబ్ధము. సం. సుఖదుఃఖాద్యనుభవమునకై వచ్చిన యిప్పటి శరీరమునకు కారణముగా నుండెడి కర్మవిశేషము. (త్రివిధ ప్రారబ్ధము — స్వేచ్ఛా ప్రారబ్ధము, పరేచ్ఛా ప్రారబ్ధము, అనిచ్ఛా ప్రారబ్ధము) విణ. ప్రారంభింపఁబడినది.
ప్రార్థకుఁడు. సం. విణ. అడుగువాఁడు. ? వేఁడువాఁడు. ? [వేఁడికోలు.
ప్రార్థన—ము. సం. అడుగుకొనుట, యాచన,
ప్రార్థనీయము. సం. విణ అడుగుకొనఁదగినది. [వేఁడుకొను.
ప్రార్థించు. సం. స. క్రి. అడుగుకొను,
ప్రార్థితము సం విణ. అడుగుకొనఁబడినది; వేఁడబడినది; శత్రువుచే అడ్డగింపఁబడినది.
ప్రాలంబము. సం. మెడనుండి సరిగా నుఱిమున వ్రేలెడు పూదండ మొ.
ప్రాలంబిక. సం. మెడనుండి బొడ్డువఱకు వ్రేలెడు బంగారు బొట్టుదండ బంగారు గొలుసు మొ. [అక్షతలు.
ప్రాలు. బ. వరిబియ్యము; తలఁబ్రాలు,

ప్రాలుమాలిక. సోమరితనము. రూ. ప్రాల్మాలిక.
ప్రాలుమాలు. అ. క్రి. సోమరితనముపొందు రూ. ప్రాల్మాలు.
ప్రాలేయము. సం. మంచు. [దోషము.
ప్రావ. పద్ధతి. విణ. అనుకూలము; యుక్తము;
ప్రావరణము. సం. పైబట్ట; ముసుఁగు.
ప్రావారము. సం. పైబట్ట; కంబళి; చర్మము.
ప్రావీణ్యము. సం నేర్పు.
ప్రావు. అ. క్రి. వ్యాపించు; పరఁగు.
ప్రావృట్టు. సం. వర్షఋతువు.
ప్రావృతము. సం. విణ. ఆవరించినది; కప్పుకొనిన బట్ట; చుట్టుకొనినబట్ట.
ప్రావృష. సం. వర్షాకాలము.
ప్రావృషాయణి. సం దూలగొండి†.
ప్రావృషిజము. సం. గాలివాన. విణ. వర్షాకాలమునఁ బుట్టినది.
ప్రావృషేణ్యము. సం. కదప†; కొండిసె†. విణ. వర్షాకాలమునఁ బుట్టినది.
ప్రావేలుపు. పూర్వదేవుఁడు, అసురుఁడు. రూ. ప్రావేల్పు.
ప్రాశ్యము. సం. భోజనము.
ప్రాశస్త్యము. సం. ప్రశస్తముగా ఉండుట
ప్రాశించు. సం. స. క్రి. భుజించు; పానము చేయు.
ప్రాశితము. సం. విణ. భుజింపఁబడినది; పానము చేయఁబడినది.
ప్రాశ్నికుఁడు. సం. విణ. సభ్యుఁడు; ప్రశ్న చేయువాఁడు.
ప్రాసంగము. సం. శిక్షణమునకై కోడె మెడమీఁదఁ గూర్పఁబడు రెండవ కాఁడి
ప్రాసంగికము. సం. విణ. ప్రసక్తిని బట్టి వచ్చినది.
ప్రాసంగ్యము. సం. కాఁడిమోసెడి ఎద్దు.
ప్రాసఁగు. సస్యవిశేషము.
ప్రాసము. సం. పద్యపాదమున రెండవ అక్షరము; ఈఁటె.
ప్రాసాదము. సం. దేవళము; నగరు.
ప్రాసికుఁడు. సం. విణ. ఈఁటెకాఁడు.
ప్రాహ్ణము. సం. ఉదయము మొదలు పది గడియలవఱకుఁ గలకాలము, లేఁబగలు.

## ప్రి

ప్రిదులు. అ. క్రి. విరియు; సడలు; తగ్గు; ఊడు; జాఱు; తొలఁగు.
ప్రిన్సిపాలు. ఇం. కళాశాలాధ్యక్షుఁడు.
ప్రియ. పిర. సం. ప్రియురాలు.
ప్రియంగువు. సం. కొఱ్ఱలు†; నల్లావలు†; పిప్పలి†; ప్రేంకణము†; కుంకుమము.?
ప్రియంపడు. అ. క్రి. ఇష్టమగు.
ప్రియంవదుఁడు. సం. ఒక ఖేచరుఁడు. విణ. ఇచ్చకమాడువాఁడు.
ప్రియకము. సం. కుంకుమము; చిత్రవర్ణము గలజింక; తుమ్మెద; కడిమి†; ప్రేంకణము†; వేఁగిస†.
ప్రియత. సం. చెలిమి, స్నేహము.
ప్రియదర్శిని. సం. జమ్మి†.
ప్రియపడు. అ. క్రి. ఇష్టపడు.
ప్రియము. విణ. హెచ్చువెలగలది. సం. వృద్ధియనుఓషధి; ఇష్టవస్తుదర్శనముచేఁ గలిగెడు సంతోషము. విణ. ప్రేమపాత్రము; ఆనందదాయకము; శ్రోతకు తత్కాలమున విన నింపైన మాట.
ప్రియవాది. సం. విణ. ఇచ్చకమాడువాఁడు
ప్రియవాదిక. సం. వివాహాది ప్రయుక్త మంగళవాద్యము;? వివాహాది ప్రయుక్త మంగళవాద్యధ్వని.?
ప్రియాల. సం. ద్రాక్షకు†.
ప్రియాలము. సం. మొరలి, మోరటి†.
ప్రియుఁడు. సం. ప్రాణనాథుఁడు; ఇష్టమైనవాఁడు.
ప్రియురాలు. సం. ప్రియమైనది, భార్య

## ప్రీ

ప్రీణనము. సం. తృప్తి, తనివి; తృప్తిఁ బుట్టించుట; సంతోషపెట్టుట.
ప్రీతి. సం. సుఖము, సంతోషము; ప్రేమ, స్నేహము; ఒక గ్రహయోగము; మన్మథుని భార్య.
ప్రీతిదత్తము. సం. అత్తగారిచేతఁగాని మామగారిచేతఁగాని ప్రేమచే నియ్యఁ

బడినదియు పాదవందన కాలము సం
దియ్యఁబడినదియునైన స్త్రీ ధనము.
ప్రీతుఁడు. సం విశే. సంతోషపడ్డవాఁడు.

## ప్రు

ప్రుంగుడు. తెల్లకుష్ఠము.
ప్రుచ్చు. అ. క్రి. పుచ్చిపోవు.
ప్రుప్పి. ప్రుచ్చుట; మణిదోష విశేషము.
ప్రువ్వు. పురుగు.
ప్రుష్టము. సం. విశే. కాల్పఁబడినది.

## ప్రూ

ప్రూవు. పురుగు.

## ప్రె

ప్రెక్కణము. అభినయముతోడి నృత్యము; మల్లరంగము.
ప్రెగడ. ప్రెగ్గడ, మంత్రి.
ప్రెగ్గడ. అమాత్యుఁడు, మంత్రి; ప్రధాన పురుషుఁడు; యువరాజు.
ప్రెగ్గడసాని. మంత్రిభార్య.
ప్రెబ్బ. ప్రబ్బ†.
ప్రెబ్బలి. ప్రబ్బ†.
ప్రెబ్బొత్తి. క్రి. విశే. నిశ్చయము గా.
ప్రెవడ. మంత్రి.
ప్రెసిడెన్సి. ఇం. రాజధాని, రాష్ట్రము.

## ప్రే

ప్రేంకడము
ప్రేంకణము } ప్రియాలము†.
ప్రేంకనము

ప్రేంఖ. సం. ఒక అశ్వగతి; డోల; నృత్యము; సంచారము. [చుట; సంచలనము.
ప్రేంఖణము. సం. ఒకరూపకము; కంపిం
ప్రేంఖితము. సం. విశే. ఊచఁబడినది, కదలింపఁబడినది.
ప్రేంఖోళిక. సం. చాతా?.
ప్రేంఖోళితము. సం. విశే. ప్రేంఖితము.
ప్రేఁపచెట్టు. వేత్రము†.
ప్రేఁపుడు. విశే. అధికుఁడు
ప్రేఁబ్రాలు. బ. ప్రేలగింజలు.
ప్రేక్ష. సం. బుద్ధి; ఆలోచన; చూచుట; నృత్యముచూచుట.
ప్రేక్షణము. సం. నేత్రము; చూచుట.

ప్రేక్షకుఁడు
ప్రేక్షణికుఁడు } విశే. చూచువాఁడు.

ప్రేక్షణీయము. సం. విశే. చూడఁదగినది.
ప్రేక్షాధామము. సం. గరిడీసాల. ?
ప్రేక్షితము. సం. విశే. చూడఁబడినది.
ప్రేగు. అంత్రము.
ప్రేచు. స. క్రి. ప్రేరేపించు.
ప్రేతపురము. సం. యమపట్టణము.
ప్రేతము. సం. నరకమందుండు ప్రాణి; భూతవిశేషము. విశే. పీనుఁగు.
ప్రేతవనము. సం. శ్మశానము.
ప్రేపు. వేకువ.
ప్రేమ. సం. రమ్యమైనవానిని చూడవలెననెడి కోరిక; స్నేహము; యువతీయువకుల భావబంధము; హార్దము.
ప్రేమటము. వేత్రభేదము†.
ప్రేమము. సం. ప్రేమ.
ప్రేము. ప్రేము, వేత్రము†.
ప్రేముడి. ప్రేమ. [బాధపడు.
ప్రేముడించు. అ. క్రి. ప్రియపడు; శోకించు;
ప్రేయసి. సం. ప్రియురాలు. [వాఁడు.
ప్రేరకుఁడు. సం. విశే. ప్రేరేపణ చేయు
ప్రేరణము. సం. ప్రేరేపించుట, నియోగించుట; విధి. [దగినది.
ప్రేరణీయము. సం. విశే. ప్రేరణచేయఁ
ప్రేరించు. సం. స. క్రి. ప్రేరేపించు.
ప్రేరితము. సం. విశే. ప్రేరేపింపఁబడినది.
ప్రేరేచు. స. క్రి. ప్రేరేపించు.
ప్రేరేపకుఁడు. విశే. ప్రేరణచేయువాఁడు.
ప్రేరేపణము. వా. ప్రేరణము.

ప్రేరేపించు
ప్రేరేపు } వా. స. క్రి. ప్రేరించు, ప్రేరణచేయు.

ప్రేలడము. ప్రేలుట, ప్రలాపము.
ప్రేలరి. విశే. వదరుఁబోతు, వాచాటుఁడు.
ప్రేలలు. బ. ప్రేలలు.

ప్రేలిక. ప్రేలిక.
ప్రేలు. అ. క్రి. వదరు,తెలుచుమాట్లాడు. వేఁగు; వేఁగియుబుకు;తుపాకి మొ॥ ప్రేలు
ప్రేలుచు. ప్రే. వేఁచు; తుపాకి మొ॥ ప్రేల్చు. రూ. ప్రేల్చు.
ప్రేలుడు. ప్రలాపము; ప్రేలుట.
ప్రేలువాఁడు. విణ. వాచాటుఁడు.
ప్రేవు. ప్రేగు.
ప్రేషకుఁడు. విణ. పంపువాఁడు.
ప్రేషణము. సం. పంపుట; ప్రేరణము.
ప్రేషణీయుఁడు. సం. విణ. పంపఁదగిన వాఁడు.
ప్రేషము. సం. పంపుట. [వాఁడు.
ప్రేషితుఁడు. సం. విణ. పంపఁబడిన
ప్రేష్ఠము. సం. విణ. మిక్కిలి ప్రియమైనది, ఆత్మ, బ్రహ్మము.
ప్రేష్య. సం. పరిచారిక.
ప్రేష్యుఁడు. సం. భృత్యుఁడు. విణ. పంపఁదగినవాఁడు.

## ప్రై

ప్రైషము. సం. ప్రేషణము; మర్దనము; క్లేశము; ఉన్మాదము.

## ప్రొ

ప్రొద్దు. బ్రధ్నుఁడు, సూర్యుఁడు; కాలము; దినము; పూఁట; ఉషఃకాలము.
ప్రొద్దుఁగల్లు. సూర్యకాంతశిల.
ప్రొద్దుఁగొడుకు, ప్రొద్దుకూన, ప్రొద్దుచూలి } యముఁడు; శనైశ్చరుడు కర్ణుఁడు; సుగ్రీవుఁడు. రూ. ప్రొద్దుపట్టి.
ప్రొద్దుచ్చు. స.క్రి. ప్రొద్దుపుచ్చు, కాలము వెళ్ళఁబుచ్చు.
ప్రొద్దుజేంట, ప్రొద్దుజోఁడు, ప్రొద్దుజోఁడుకోడె } చంద్రుఁడు.
ప్రొద్దుదిరుగుడు. సూర్యావర్తి.
ప్రొద్దునెలకనుదోయి. విష్ణువు.
ప్రొద్దుపట్టు. సూర్యగ్రహణము.
ప్రొద్దురిక్క. ఉత్తరనక్షత్రము.
ప్రొద్దురిక్కనెల. ఫాల్గునమాసము.
ప్రొద్దుఱాయి. సూర్యకాంత శిల.
ప్రొద్దులనెల. ప్రసవమాసము.
ప్రొద్దులు. బ. ప్రసవదినములు.
ప్రొప్రయిటరు. ఇం. యజమాని.
ప్రొయి, ప్రొయ్యి } అధిశ్రయణి.

## ప్రో

ప్రోఁక. సమూహము; ప్రోవు.
ప్రోఁగు. రూ. పోఁగు.
ప్రోఁగులు బ. పోఁగులు.
ప్రోఁజే. రూ. పోఁజు.
ప్రోక. ప్రోగు, రాశి.
ప్రోక్తము. సం. చెప్పఁబడ్డది.
ప్రోక్షణము. సం. (నీళ్లు) చిలుకరించుట, చల్లుట; యజ్ఞమునందు పశువును వధించుట.
ప్రోక్షించు సం. స.క్రి. ప్రోక్షణముచేయు.
ప్రోక్షితము. సం.విణ. చిలుకరింపఁబడినది, చల్లఁబడ్డది; యజ్ఞమునందు వధింపఁబడినది. (పశువు.)
ప్రోగు. రాశి.
ప్రోగ్రాము. ఇం. కార్యక్రమము.
ప్రోదికోలు. బలహీనమైన గవాదికమును కాపాడి యనుభవించుకొనుట. విణ. వ్యర్థము.
ప్రోచిల్లు. రూ. పోచిల్లు.
ప్రోచు. దారము. [లిడి పోషించు.
ప్రోచు. స. క్రి. పాలించు, అన్నపానాదు
ప్రోడ, ప్రోడఁడు } ప్రోఢుఁడు, ప్రౌఢుఁడు.
ప్రోఢి. సం. ప్రౌఢి.
ప్రోఢుఁడు. సం. విణ. ప్రౌఢుఁడు.
ప్రోతము. సం. వస్త్రము. విణ. కుట్టఁబడినది; గ్రుచ్చఁబడ్డది.
ప్రోథము. సం. గుఱ్ఱపుముక్కు; గర్భపిండము; పిఱుఁదు; జీర్ణవస్త్రము. విణ. తెరువరి; ప్రసిద్ధికెక్కినది; స్థాపింపఁబడినది.
ప్రోది. పోషణము; వైభవము.

ప్రోదిగొను } స. క్రి. పోషించు.
ప్రోదిసేయు }
ప్రోపడు. అ. క్రి. పోషింపఁబడు.
ప్రోపరి. విణ. పోషకుఁడు; రక్షకుఁడు.
ప్రోపు. పోషణము; రక్షణము.
ప్రోయాలు. ఇల్లాలు; స్త్రీ; సౌభాగ్యవతి
ప్రోలు. పట్టణము.
ప్రోలుగుడుపు. అప్ర. స.క్రి. ప్రేరేపించు. రూ. ప్రోల్గుడుపు.
ప్రోవడి. ప్రతిష్ఠ.
ప్రోవు. రూ. ప్రోగు.
ప్రోవుకొను. అ. క్రి. రాశిపడు. ప్రే. ప్రోవుకొలుపు. [లుగా పెట్టు.
ప్రోవెట్టు అ. క్రి. ప్రోవుపెట్టు, కుప్ప
ప్రోషము. సం. కాల్చుట.
ప్రోషితభర్తృక. సం. మగఁడు దేశాంతరగతుఁడైయుండ వ్యాకులపడెడి స్త్రీ.
ప్రోషితుఁడు సం.విణ. దేశాంతరగతుఁడు.
ప్రోష్ఠపదము. సం. భాద్రపదమాసము.
ప్రోష్ఠి. సం. ఎగిరియెగిర పడెడు మత్స్య విశేషము.
ప్రోహము. సం. ఏనుఁగుకాలు; పర్వము; గొప్పయూహ; ఏనుఁగు మోఁకాలు;? కూర్పు;? నేర్పు;? విణ. నేర్పరి.?
ప్రోహుఁడు. సం. తార్కికుఁడు.?

## ప్రౌ

ప్రౌఢ. సం. స్వీయాంతర్భేద విశిష్ట నాయికా విశేషము ప్రోడ, ముప్పది యేండ్లకుపైన ఏఁబది యేండ్లకు లోపు వయస్సుగల స్త్రీ.
ప్రౌఢి. సం. ప్రతిభ; ఉద్యమము; ఉత్సాహము; సామర్థ్యము; హేతోక్తి, ప్రౌఢి వాదము.
ప్రౌఢిమ–ము. సం. నేర్పు.?
ప్రౌఢుఁడు. సం. విణ. ప్రోడ, నేగవరి; దిట్ట, ప్రగల్భుఁడు; ప్రవృద్ధుఁడు.
ప్రౌష్ఠపద. సం. పూర్వాభాద్ర; ఉత్తర భాద్ర. రూ. ప్రోష్ఠపద.
ప్రౌష్ఠపదము. సం.విణ. ప్రోష్ఠపదయందుఁ బుట్టినది. రూ. ప్రోష్ఠపదము.

## ప్ల

ప్లక్షము. సం. జువ్వి†; కలుజువ్వి; రావి†; ఒక ద్వీపము.
ప్లవ. సం. ఒక సంవత్సరము.
ప్లవంగ. సం. ఒక సంవత్సరము.
ప్లవంగమము }
ప్లవంగము } సం. కప్ప; కోఁతి.
ప్లవగము }
ప్లవము. సం. కయివడిముస్తె†; గంధ తృణము; పడవ, తెప్ప; కప్ప; కోఁతి; పొట్టేలు; కన్నెలేడు; నీరుకాకి; నీరు కోడి; వాటపుఁబల్లనేల; గంతు, దాఁటు; జువ్వి†; కాకితుమ్మికట్టె†;? ప్లుతస్వరము.?
ప్లవుఁడు. సం. మాలవాఁడు.

## ప్లా

ప్లాక్షము. సం. ప్లక్షఫలము.

## ప్లీ

ప్లీడరు. ఇం. న్యాయవాది.
ప్లీహము. సం. కడుపులో ఎడమ ప్రక్కనుండెడు మాంసఖండము.
ప్లీహశత్రువు. సం. ములుమోదుగు†; రావి†.

## ప్లు

ప్లుతము. సం. వేగమున అంతమేరయు సమముగాఁబోయెడు అశ్వధారా విశేషము, నిబ్బరము; మూడు మాత్రల కాలముగల స్వరము. [కాలినది.
ప్లుష్టము. సం. విణ. కాల్పఁబడినది.

## ప్లో

ప్లోషము. సం. సంతాపము, దహించుట.

## ప్సా

ప్సాతము. సం.విణ. బక్షింపఁబడినది.

## ఫ

ఫంజి—క. సం. బారంగి†.
ఫకీరు. హిం. భిక్షుకుఁడు, బైరాగి.
ఫక్కి. రీతి, ప్రకారము.
ఫక్కిక. సం. పూర్వపక్షము; నిందితమైన వ్యవహారము. [ఉక్తి; ప్రేక్షిత.
ఫక్తు. హిం. క్రి. విణ. మాత్రము; ఊరక;
ఫణ—ము. పాఁప (పాము) పడగ.
ఫణి. సం. పాము; పతంజలిమహర్షి.
ఫణిజ్ఝకము సం. మరువము†; తులసి†; రామతులసి†.
ఫణితల్పగుఁడు. సం. శేషశాయి, విష్ణువు.
ఫణితార సం. ఆశ్లేషనక్షత్రము.
ఫణితి. వాక్కు.
ఫయిసలా. పరిష్కారము. [వారు.
ఫరంగులు. బ. ఫరంగిజాతివారు; ఫ్రెంచి
ఫరదు. పావుతావు కాగితము.
ఫరమానా. హిం. ఆజ్ఞాపత్రము.
ఫరమాయించు. స. క్రి. ఆజ్ఞాపించు.
ఫరుజు. హిం. పిడి. [ఫర్వానా.
ఫర్మానా. హిం. రాజాజ్ఞ, శాసనము. రూ.
ఫర్మాయించు. హిం. అ. క్రి. ఆజ్ఞాపించు.
ఫర్మాయిషీ హిం. ఏదైన నొకపని చేయ నాజ్ఞాపించుట.
ఫలకము. సం. పలక; కేడెము, డాలు; బల్ల.
ఫలపూరము. సం. మాదిఫలము†.
ఫలము. సం. పండు; పంట; ప్రయోజనము; లాభము; జాజికాయ; కోడిసె†; కేడెము; బాణముములికి; నాఁగటికఱ్ఱు; ధనము; చిదాభాసము; త్రిఫల. విణ. నెఱవేఱినది.
ఫలముపాటు. లాభము, ప్రయోజనము.
ఫలవంతము. సం. విణ. పండ్లు గలది; ప్రయోజనము గలది; సఫలము.
ఫలసాయము. పంట.
ఫలాధ్యక్షము. సం. పాల†.
ఫలాధ్యక్షుఁడు. సం. పరమేశ్వరుఁడు.
ఫలానా. హిం. విణ. అముకము; ఒకానొక; అట్టి. రూ. ఫలాని.
ఫలాశనము. సం. చిలుక. [సఫలము.
ఫలి. సం. ప్రేంకణము†. విణ. పండ్లుగలది;
ఫలించు. సం. అ. క్రి. పండు; నెఱవేఱు
ఫలితము. సం. వృక్షము. విణ. ఫలించినది; సిద్ధించినది. [సఫలము.
ఫలినము. సం. విణ. పండ్లుగల చెట్టు;
ఫలిని. సం. తరిగొఱ్ఱి†; ప్రేంకణము†.
ఫలియించు. సం. అ. క్రి. ఫలించు.
ఫలేగ్రహి. సం. విణ. ఫలించునది.
ఫలేరుహ. సం కలిగొట్టు†.
ఫలోదయము. సం. స్వర్గము; లాభము; సంతోషము; ఫలప్రాప్తి.
ఫల్గునుఁడు. సం. అర్జునుఁడు.
ఫల్గువు. సం. కుక్కమేడి†. విణ తుచ్ఛము, వట్టిది; సారము లేనిది.
ఫసందుచేయు. గౌరవించు. [ఒక శకము.
ఫసలీ. హిం. పంట. తురక సంవత్సరము;

## ఫా

ఫాంటము. సం. ఒక కషాయము. విణ. ఆయాసము లేక చేసినది.
ఫాజీ. హిం. స్వల్పమైనది; పనికిమాలినది.
ఫాణితము. సం. కండ చక్కెర; పటిక బెల్లము.
ఫాదరులు. ఇం. బ. క్రైస్తవ దేవాలయములలో నుండువారు, క్రైస్తవ మతబోధకులు. [వడిన.
ఫామేదా. హిం. విణ. చేయి తిఱిగిన, అల
ఫాయిదా. హిం. లాభము; వడ్డి.
ఫారం. ఇం. లెక్కలచిట్టా.
ఫారసి. హిం. ఒక భాష. రూ. పారసి.
ఫారా. హిం. ప్రహరిదిరుగు.
ఫాలనేత్రుఁడు. సం. శివుఁడు.
ఫాలము. సం. నాఁగటికఱ్ఱు. విణ. నూలిచే నేయఁబడినది.
ఫాలుఁడు. సం. బలరాముఁడు; శివుఁడు.
ఫాల్గునము. సం. ఫాల్గున మాసము; ఏఱు మద్ది†.
ఫాల్గునుఁడు. సం. అర్జునుఁడు.
ఫాల్గునికము. సం. ఫాల్గునమాసము.

## ఫి

ఫితూరి. రాష్ట్రసంకులము.
ఫిరంగము. సం. ఒక ద్వీపము.
ఫిరంగి. శతఘ్ని.
ఫిరంగు. కత్తి; కత్తులలో భేదము. బ. సం. ఫిరంగద్వీపవాసులు.
ఫిరాయించు. హిం. స. క్రి. మార్చు.
ఫిర్కా. హిం. ఒక భాగము.
ఫిర్యాది. హిం. వాది. [దావా.
ఫిర్యాదు. హిం. మొఱ, విన్నపము;

## ఫీ

ఫీజు. ఇం. బ. ఈ పనికి ఇంత యిత్తుమని ఒడఁబడిన ద్రవ్యము; జీతము మొ.

## ఫు

ఫురుసత్తు. హిం. అవకాశము.
ఫుల్లము. సం. విణ. వికసించినపుష్పాదికము.
ఫుల్లికము. సం. పాము.

## ఫే

ఫేణి. సం. ఫేణీ, భక్ష్యవిశేషము.
ఫేనము. సం. సముద్రపునురుఁగు; నురుఁగు
ఫేనిక. సం. భక్ష్యవిశేషము, ఫేణీ.
ఫేనిలము. సం. రేఁగుబండు; కుంకుడు†. విణ. నురుఁగు గలది.
ఫేరవము. సం. నక్క.
ఫేరవుఁడు. సం. రాక్షసుఁడు.
ఫేరువు. సం. నక్క.
ఫేలము. సం. ఎంగిలి. రూ. ఫేలి.
ఫేషాణి. మొదటిపంక్తి.

## ఫో

ఫోనోగ్రాపు. ఇం. ధ్వనులను గ్రహించి తిరుగ ఉచ్చరించు యంత్రము.

## ఫ్రా

ఫ్రాంసు ఇం. ఫ్రెంచివారు.

## ఫ్లా

ఫ్లానెలు. ఇం. ఉన్నివస్త్రము.

---

## బ

బంక. నిర్యాసము, చెట్లయందుఁగలిగెడు జిగటుగలవస్తువు; ఒక వ్యాధి.
బంకమన్ను. జిగటుగల ఒక దినుసుమట్టి.
బంకముష్టి. విణ. లోభి, పిసినారి.
బంకు. సందువీథి. విణ. శూరునివలెనటించువాఁడు; కావలివాఁడు; తలవాకిటి పహరా.
బంకెత. విణ. లంబ్డురాలు.
బంకోట. జన్మఖైదు చేయఁబడిన వారిని పంపు ద్వీపాంతరము.
బంగసబయలు. బట్టబయలు.
బంగరము / బంగరు } బంగారము, సువర్ణము.
బంగరుకొండ. రూ. బంగారుకొండ.
బంగరుజూబిలీ. గోల్డెన్ జూబిలీ, సువర్ణోత్సవము.
బంగరుపిచ్చిక. బంగారువన్నెగల ఒకపక్షి
బంగరుపురుగు. క్షుద్రజలచరభేదము.
బంగరువు. బంగారు.
బంగల. కుంపటి.
బంగళా. ఇం. వసతిగృహము.
బంగారము / బంగారు } సువర్ణము. విణ. దుర్లభము.
బంగారుకంటి. కనకాక్షి; గూబ.
బంగారుకడుపువాఁడు. బ్రహ్మ, హిరణ్యగర్భుఁడు [మనోజ్ఞుడు.
బంగారుకుండ. సువర్ణఘటము. విణ.
బంగారుకొండ. హేమాద్రి, మేరుపర్వతము. విణ. మంచివాఁడు; సుకృతి.
బంగారుతామరపంటచేను. ఆకాశగంగ.
బంగారుఁదీగెలు. బ. వడ్లలో భేదము.
బంగారుపూఁత. బంగారు మలాము.

బంగారుబొమ్మ. సువర్ణప్రతిమ; స్త్రీ విశేషము.
బంగారునీరు. సువర్ణోదకము; బంగారు వలె మాఱు పనికివచ్చుటకై కరగినబంగారు
బంగాళదుంప. ఆలుకము†.
బంగాళదేశము. మి. 56 దేశములలో నొకటి, వంగదేశము.
బంగాళము. వా. వంగ దేశము. సం. భైరవరాగపుత్రుఁడు.
బంగాళా. హిం. పెద్దయిల్లు.
బంగాళి. సం. భైరవరాగపత్ని.
బంగి. గంజాయి, భంగ†. హిం. బంగీ.
బంగిముచ్చు. విణ. బంగితాఁగువాఁడు.
బంగీ.హిం టప్పామీఁదవచ్చువస్తువులకట్ట
బంజరు. హిం. బీడునేల.
బంజారి. హిం. లంబాడీవాండ్రు.
బంటి. అప.నీళ్ళకొలఁదిని దెలిపెడుప్రత్యయము; లోఁతుయొక్క ప్రమాణము. (మొలబంటి నీరుఅని)
బంటు. భటుఁడు, సేవకుఁడు, దాసుఁడు భక్తుఁడు. విణ శూరుఁడు.
బంటుమెకము. అడవిపంది.
బంట్రౌతు. బంటు; గుఱ్ఱపురౌతు.
బండ. వెడలుపుఱాయి; ఱాయి; పాన్పు లేని రోఁకలి, రోఁకటి బండ; ఘోర కృత్యములచే బిచ్చమెత్తెడు ఒక నీచ జాతి. విణ. దుష్టుఁడు; మూర్ఖుఁడు; ఆఱి గినది, మొద్దువాఱినది.
బండఁగి. బోను; దీముపిట్ట.
బండఁడు. విణ. బండ.
బండగు. బోను.
బండగుఁడు. విణ. బండఁడు.
బండతల. బట్టతల, వెండ్రుకలు లేని తల.
బండది. బండజాతి స్త్రీ; మూర్ఖురాలు.
బండము. వస్తువు, పదార్థము.
బండరము } బండారము.
బండరువు }
బండఱాయి. అఱిగిన ఱాయి.
బండవలము. సంచిమొదలు;సామర్థ్యము.
బండవాఁడు. ఱాయియెత్తుకవచ్చి అడుగుకొనెడివాఁడు, బండ.
బండాట-ము. బండతనము, ధౌష్ట్యము.
బండారము. బొక్కసము, ఖజానా, సంచికట్టు, భాండారము.
బండారి.భాండారి,బొక్కసమున కధికారి
బండారు. ఱాతిమీఁదఱాచి పూసికొనెడు పసుపు; బండారము.
బండారుఁడు.సం.బట్టలనుకాచువాఁడు?
బండారుపిచ్చి(చ్చు)క. పీతముండము, పచ్చతల పిచ్చుక.
బండాలము. సామగ్రి; సామర్థ్యము.
బండి. శకటము; రథము.
బండికన్ను. నాభి, రథచక్రనాభి.
బండికలు.బాల క్రీడావిశేషము. [మేకు.?
బండికల్లు. రథచక్రము; పదనశిల; చాయ
బండిగిల్లు.అ.క్రి.కడగండ్లువడు, కష్టపడు.
బండిగురి(రు)గింజె. } కాంబోజీలత.
బండిగురి(రు)వెంద }
బండిపేరిపిట్ట. చక్రవాకము.
బండిబాట. రథ్య, ఘంటాపథము.
బండిమొగ్గరము. శకటవ్యూహము.
బండియిరుసు. రథచక్రద్వయమునకు అమర్చిన దూలము.
బండిరిక్క. రోహిణీనక్షత్రము. [సీల.
బండిసీల.బండి పొరలకుండుటకు అమర్చిన
బండు. బండాటు; దుర్వాక్యము.
బంతి. కందుకము, చెండు; పంక్తి; పది; పంక్తి పువ్వుము†.
బంతికట్టు. ధాన్యము నూర్చునపుడు ఎడ్ల వరుసకుఁ గట్టెడు పలుపు.
బంతికుడుపు. అనేకులు చేరి భుజించుట, పంక్తిభోజనము. [పువ్వుము†.
బంతిచెట్టు. ఒకజినుసు చేమంతి, పంక్తి
బంతిదూగులాట. బాల క్రీడావిశేషము.
బంతులుగట్టు.అ. క్రి. వరుసగా నేర్పడు; ప్రత్యేకపంక్తిగా కూడుకొను.
బంతులుసాఁగు. అ. క్రి. వరుసగానుండు, పంక్తులవలె నుండు. [కాగితములు.
బంద. రెండు ధరదులు,రెండు పావురావు
బందకము. తాకట్టు.
బందడము. దొంతికుండ.
బందన. జిగట; బంక; పంకము.
బందనగొను. అ. క్రి. జిగురుకొను,

బందము. దూలముపై గుజ్జులకు బిగువునిమిత్తము లంకెగా నమర్చినపట్టె; గవుండ్లవాఁడు చెట్టెక్కునపుడు రెండుకాళ్లకు తగిలించుకొనెడు త్రాడు; పశువులకు రెండుకాళ్లు చేర్చి కట్టెడుత్రాడు.
బందరము. దొంతికుండ.
బందరు. ఖడ్గభేదము; కత్తి. [కుండ.
బందలము. దొంతికుండ, నోరు వెడలుపు
బందా-కోరు. విణ. చెఱఁబడ్డవాఁడు.
బందారు. ఒకానొక చెట్టు; బాలక్రీడా విశేషము.
బందాలు. బ. బంధింపఁబడియుండువారు.
బంది. నిర్బంధము; చెఱ. సం. విణ. చెఱఁబడ్డవాఁడు; చెఱఁబడ్డది.
బందికాఁడు. బందిపోటుదొంగ.
బందికానా } హిం. చెఱసాల, కారాగృహము.
బందిఖానా }
బందిగము. చెఱసాల.
బందిపట్టు } పదిమంది చేరి నిర్బంధపఱిచి కొట్టి దోఁచుట.
బందిపోటు }
బందియ. చెఱసాల.
బందివాదులమాత. హాడుముండ.?
బందు. బంధము, నిరోధము, కట్టివేత; బోరువపక్షి; ఆవరణము; గోపనము; పెట్టె మొదలగువాని మూలల బిగించెడి యినుము మొదలగువాని తగడు.
బందుకట్టు. జాతి కట్టుపాటు.
బందుగుఁడు. చుట్టము, బాంధవుఁడు.
బందుబస్తు. హిం. బందోబస్తు, భద్రము, జాగ్రత.
బందువు. బంధువు.
బందువుఁడు. బాంధవుఁడు.
బందె. బశువుల చెఱ; పశువుల దండుగ; నిర్బంధము; ఖైదు.
బందెకత్తె. విణ. చెఱలో వేయునది.
బందెకాఁడు. విణ. చెఱలో వేయువాఁడు
బందెకానా. కారాగృహము.
బందెగొను. స. క్రి. చెఱబెట్టు.
బందెడ. శ్వేతసురస†. [గలవాఁడు
బందెలపోతు. విణ. చెఱవేయుస్వభావము
బందెలమారి. తంటాలమారి.

బందోబస్తు. హిం. ఏర్పాటు; భద్రము; పరిష్కారము. [కుదువ.
బంధకము. సం. చెఱసాల; మాఱకము;
బంధకి. సం. జారస్త్రీ; ఆఁడేనుగు; ఆటకత్తె.? [త్కారము.
బంధచ్యుతకము. సం. చిత్రకవితా చమ
బంధనము. సం. కట్టు; కట్టుటకుఁదగిన సాధనము; కట్టుట; ఖైదుచేయుట; కొల; చెఱ; చెఱసాల; కుదువ;? తొడిమ.?
బంధనాలయము. సం. చెఱసాల.
బంధము. సం. కట్టు; చెఱ; కావ్యరచనా విశేషము; సంయోగ విశేషము. (బంధత్రయము — మూలబంధము, ఉడ్యాణ బంధము, జాలంధర బంధము.)
బంధస్తంభము. సం. (ఏనుఁగును కట్టెడు) కట్టుఁగంబము.
బంధించు. సం. స క్రి. కట్టు.
బంధుజీవకము. సం. మంకెన†. రూ. బంధుజీవము.
బంధుత. సం. బంధు సమూహము.
బంధుర. సం. వేశ్య.
బంధురము. సం. మకుటము; కలహంస; బకపక్షి; నూనెమడ్డి; అఁడుగుఱి; మంకెన†. విణ. బంధూరము.
బంధూరము. సం. విణ. వంగినది; మధ్యోన్నతమును పార్శ్వానతమునైనది; రమ్యమైనది.
బంధులుఁడు. సం. అంకుటాలి కొడుకు.
బంధువు. సం. చుట్టము; తనగోత్రమువాఁడు; సంబంధము చేసినవాఁడు; స్నేహితుఁడు; మంకెన†.
బంధూకము. సం. మంకెన†; వేఁగిస†.
బంపు. పండ్లపాఁచి, పాఁకుడు.
బంబ. విణ. స్థూలము.
బంబం. శంఖాది ధ్వన్యనుకరణము.
బంబోతు. విణ. మిక్కిలి బలిసినవాఁడు.
బంభరము. సం. తుమ్మెద. [అత్యధికము.
బంహిష్ఠము. సం. విణ. బహు, తఱచు,
బకదారి. పారావతము; పారావతవిశేషము
బకము. సం. కొంగ, వక్కుకొంగ; బకపుష్పము†.

బకవేషి. సం. విణ. కొంగవలె వేషము వేయువాఁడు; వంచకుఁడు.
బకవైరి. సం. శ్రీకృష్ణుఁడు; భీమసేనుఁడు.
బకాను. చిలువేరు†.
బకానుచెక్క. ఎఱ్ఱచాయచేసెడి చెక్క.
బకాయ. హిం. నిలువసొమ్ము, వెనుకటిబాకి
బకాయి. బాకీయున్న పన్ను.
బకాల్. హిం. కోమటి, మైనపు వత్తు లమ్మువాఁడు.
బకుఁడు. సం. ఒకరాక్షసుఁడు; కుబేరుఁడు.
బకేడా. హిం. కలహము.
బకోటము. సం. బకము; వాలుకొంగ.
బక్క. విణ. బక్కటిల్లినది; బక్కటిల్లినవాఁడు. బ. గని త్రవ్వువారు.
బక్కటిల్లు. అ. క్రి. శుష్కించు; కృశించు.
బక్కనీళ్లు } నీళ్లు అధికముగాఁ జేర్చిన
బక్కమజ్జిగ } మజ్జిగ.
బక్కవాఁడు. విణ. శుష్కాంగుఁడు.
బగబగ. మండుట యందగు ధ్వన్యనుకరణము.
బగలు. హిం. ప్రక్క.
బగళ. సం. దేవీవిశేషము; ఒకమహావిద్య.
బగళంబుసేయు స. క్రి. తొలఁగించు. రూ. బగళము(మ్ము)సేయు.
బగళము. తొలఁగుడు.
బగి. ప్రక్క.
బగిన. వృక్షవిశేషము.
బగిసి. గౌరవము; భాగ్యము. [ణము.
బగీలు. సంతాపమువందగు ధ్వన్యనుకర
బగుతుఁడు. భక్తుఁడు.
బగ్గముపాడు. మిక్కిలి పాడు.
బగ్గరి. విణ. బగ్గని మండిపడువాఁడు.
బగ్గి. బూడిద.
బగ్గీ. గుఱ్ఱపుబండి.
బగ్గు. మండుటయందగు ధ్వన్యనుకరణము
బగ్గుండి. రక్తవర్ణ చూర్ణము, గులాలు.
బగ్గుమను. అ. క్రి. బగ్గునమండు.
బగ్గె. పాడ.
బచ్చెన. పూఁత, వర్ణము. [తీఁగెబచ్చలి†.
బచ్చలి. కలంబి, ఆకుకూరలలో నొకటి,
బచ్చు. వైశ్యుడు; బొక్కసమునకధికారి; వెండి బంగారముల నాణెము చూచువాడు, సరాబు.
బజంత్రీ. హిం. మేళము; మేళగాఁడు. బ. బాజాకారీలు.
బజాయించు. అ. క్రి. బాజా వాయించు.
బజీతు. అవమానము. విణ. భంగముకొందినది.
బజ్జి. ఎనిచి పలుచనగా చేసెడు పచ్చడి.
బజ్జీ. భక్ష్యవిశేషము.
బజెగడుగుది. నిలుకడలేని స్త్రీ.
బజేగేడి. రంగుపూసినబొమ్మ.
బజారము. వ్యభిచారము.
బజారి. ధూర్తస్త్రీ; వ్యభిచారిణి.
బజారించు. అ. క్రి. వ్యభిచరించు.
బజారు. అంగడివీథి; ప్రలాపము.
బజారుమాట. ప్రవాదము.
బజ్జెడి. పాదన్యాసభేదము.
బటాకబయలు. విణ. బట్టబయలు.
బటానీలు బ. గుండ్రసెనగలు, కలాయము.
బటాబయలు. విణ. బట్టబయలు.
బటాబూరము. పెద్దతికము.
బటారము. విణ గొప్ప. [షము.
బటాసాలు బ. ఫేణకములను భక్ష్యవిశే
బటువడిదము. చక్రము.
బటువ్రాలాయుఁడు. ఇంద్రుఁడు.
బటువు. గుండ్రన; గుండ్రని బంగరు ఉంగరము; బటువుబిల్ల. విణ. గుండ్రనిది; దృఢము.
బటువుఁగత్తి } చక్రము.
బటువుఁగైదువు }
బటువుగుబ్బలి. చక్రవాళ పర్వతము.
బటువుగువ్వ. చక్రవాకము.
బటువుబిల్ల. గుండ్రని తలగడ.
బటువువాలు. చక్రము.
బట్ట. పటము, వస్త్రము; పసులదేహము మీఁది తెలుపు మొదలగువాని చాఱ. విణ. కేశశూన్యము. (తల.)
బట్టజడిమి. ధూళికదంబము†.
బట్టగుర్తు. విణ. సిగ్గుమాలినవాఁడు
బట్టతల. ఇంద్రలుప్తకము, వెండ్రుకలు లేని తల. [ఖర్వాటుఁడు.
బట్టతలవాఁడు. విణ. ఇంద్రలుప్తికుఁడు.

బట్టబయలు. శుద్ధాకాశము, నిరావరణ స్థలము, మిక్కిలిబయలు. విణ. మిక్కిలి బయలైనది.
బట్టమేఁక. పక్షివిశేషము.
బట్టావు. పెద్ద తెల్లమచ్చలుఁగల ఆవు.
బట్టి. వాగ్ధోరణి; సమ్మరి ఆవము.
బట్టికాఁడు. చిలుక; గోరువంక. [కట్ట.
బట్టినగోల. ఎడ్లమీఁద గోనెలెత్తివేసెడు
బట్టీ. బట్టి.
బట్టు. బట్టువాఁడు, స్తుతిపాఠకుఁడు.
బట్టె. కాలువ.
బట్లం. శరావవిశేషము.
బట్లు. బ. స్తుతిపాఠకులు.
బట్లె. బట్లం. [యిచ్చుట.
బట్వాడా హిం. కూలి మొ॥ పంచి
బడ. పెద్ద; మిక్కిలి.
బడగులు. అవ్య. నీలగిరులలో నుండు నొక జాతి జనులు, వడగరులు.
బడగొండ. కొండవలె పెద్ద ఆకారము గలిగి నీళ్ళు గలిగిన మేఘము.
బడప. ఆపద; కష్టము.
బడబ. తార్చునది,గితార్చువాఁడు.? సం. ఆఁడుగుఱ్ఱము; బ్రాహ్మణస్త్రీ.
బడబడ. పాఱుట వాగుట మొదలగు వాని యందగు ధ్వన్యనుకరణము.
బడబాగ్ని, బడబానలము, బడబాముఖము } సం. సముద్రములో నుండెడి అగ్ని.
బడరుఁడు. పాములవాఁడు; ఈశ్వరుఁడు
బడలిక. శ్రమము, అలపు.
బడలు. శ్రమము. అ. క్రి. శ్రమపడు.
బడలుపడు. అ. క్రి. బడలు. బలహీనత నొందు.
బడవ, బడవా } తార్చునది; తార్చువాఁడు. వా. ఒక తిట్టు.
బడాయి. హిం. అతిశయము; గర్వము; ఆత్మస్తుతి.
బడాయించు. హిం. అ. క్రి. అభివృద్ధి యగు. స. క్రి. అభివృద్ధి చేయు.
బడాయఖోరు. హిం. అతిశయముగా మాటలాడువాఁడు, ఆత్మస్తుతి గల వాఁడు.
బడి. పాఠశాల; దిట్టము; క్రమము. ద్ర. వెంబడి. అప. భావార్థమునందు వచ్చెడి యొకానొక ప్రత్యయము; గుణార్థము. (ఇబ్బడి, ముబ్బడి యని.)
బడికోడి. చేగోడి.
బడికోలు. పోలిక.
బడిత. పరిఘము, ఇనుపకట్ల గుదియ.
బడితపాఠము. చదివిన పాఠము.
బడితెలు.బ.గోడమీఁదముదురుకట్టునవి.?
బడిద్రిప్పు. స.క్రి. దిగఁదుడుచు.
బడిపనులు. కొలంపుడు పనులు.
బడిపెద్ద. ఉపాధ్యాయులకు సహాయత్వము వహింపఁగల ముఖ్యముగువిద్యార్థి
బడిబడి. మాటిమాటికి.?
బడిమి. బడియుట; భూతబలి; చక్రాకారభ్రమణము.
బడియ. చిన్న దుడ్డుఁగఱ్ఱ; శవయానము.
బడియు. స. క్రి. దిగఁదుడుచు.
బడిలి. రంధ్రము. [పన్ను.
బడివారడి. ప్రతి మనుష్యునకు వేసెడు
బడిశము. సం. చేపలను పట్టెడు గాలము
బడిసివాటు. దిగఁదుడుపు. విణ. దిగఁదీసి వేసినది.
బడుగు. శవము. విణ. కృశము;అశక్తుడు
బడువ. విణ. పల్లపునేల.
బడువు. విణ. బడుగు.
బడె. బడియ.
బడ్డు. మగటుతి. [హము.
బణము. క్రొత్తయిత్తడి పాత్రల సమూ
బతము. వ్రతము.
బతినీ. ఒక దినుసు పట్టువస్త్రము.
బతిమాలడము, బతిమాలిక } పరిదేవనము, దేవరింపు, ప్రసాదనము; బతిమాలుట.
బతిమాలు.స.క్రి.దైన్యముతో వేఁడుకొను
బతిమాలుచు. ప్రే. బతిమాలఁజేయు.
బత్తడిక, బత్తళిక } అమ్మలపొది.
బత్తాయి. బతావియ యనుద్వీపమునుండి వచ్చిన నారింజ†.
బత్తి. భక్తి.
బత్తియము. బత్తెము.

బత్తీసు. హిం. ముప్పదిరెండు.

బత్తుఁడు. కమసాలెవారి వడ్లవారి పట్టపుఁ పేరు; భక్తుఁడు.

బత్తెము. భోజనముకై యిచ్చెడుద్రవ్యము

బదటు. సురతము?. [వా. బదలాము.

బదనామి. హిం. అవమానము; చెడుపేరు.

బదనిక. వంద, బంద. చెట్టుమీఁద మొలచునట్టి ఓషధీ విశేషము.

బదర. పగులు. సం. పాఁచితీఁగ; ప్రత్తి చెట్టు; సన్నరాస్నము†; కారేలకి†.

బదరము. సం. రేఁగుపండు; ప్రత్తికాయ; ప్రత్తిచెట్టు.

బదరి. సం. రేఁగు†; గంగరేఁగు†; ప్రత్తి†.

బదరికము. పెట్టె.

బదలాయించు. హిం. స. క్రి. మార్చు.

బదులు. ప్రతి, మాఱు; చేబదులు; అప్పు, ఋణము.

బదులుమాట. మాఱుమాట, ప్రతివాక్యము

బద్ద. పండు(లేక)కాయయొక్క ఖండము; వెదురు మొదలగువాని ఖండము; చీలిక. విణ. పలుచనిది. రూ. బ్రద్ద.

బద్దకము. పాలుమాలిక; మాంద్యము.

బద్దకించు. అ. క్రి. పాలుమాలు, మందగించు

బద్దకుఁడు. విణ. మందుఁడు, సోమరి; మూర్ఖపుఁ బట్టుగలవాఁడు.

బద్దపరి. పేముఁలతో అల్లిన కెడెము.

బద్దపరికి పలుచని బిళ్ల?.

బద్దర. శకలము.? [చెక్కలు.

బద్దలు. బ. కాయధాన్యముల పప్పులు;

బద్దించు. స. క్రి. (సరిగా ఉన్నదా లేదా అని) కొలిచినది తిరుగ కొలుచు.

బద్దియ. బద్దె.

బద్దుర. అబద్ధము, అసత్యభాషణము.

బద్దె. దశ, వస్తి, వస్త్రము మొదలు; అపరకర్మము చేయునపుడు జందెమువలె వేసికొనెడు వస్త్రఖండము.

బద్ర. పంద్రెండు.

బద్రము. విణ. భద్రము, పదిలము.

బధిరితము. సం. విణ. బధిరముగాఁ జేయఁబడినది.

బధిరుఁడు. సం. విణ. చెవిటివాఁడు.

బద్ధము. సం. విణ. కట్టఁబడినది.

బద్ధుఁడు. సం. విణ. కట్టఁబడ్డవాఁడు.

బధ్యము. సం. నీళ్ళురాకుండ కట్టినకట్ట.?

బనాతు. హిం. ఒక విధమైన ఉన్నిబట్ట.

బనాతుపింజరులు. బనాతు పట్టుకుచ్చులు

బనాయించు. హిం. స. క్రి. కల్పించు.

బనారసు. హిం. వరాణసి, కాశి.

బన్నపడు. అ. క్రి. భంగమునొందు.

బన్నము. భంగము, అవమానము; ఆపద; మోసము. [కారణముగ మాటలాడు.

బన్నములాడు. అ. క్రి. నిందించు; అవమాన

బన్నసరము } నానావిధములైన మణులు
బన్నసరి } గ్రుచ్చిన హారము; పగడముల గుండ్లు గ్రుచ్చిన పేరు.

బభ్రువు. సం. కపిలగోవు; ముంగిస; విష్ణువు; బ్రహ్మ; శివుఁడు; అగ్ని; గోరోజనపువన్నె. విణ. ఆవన్నెగలది.

బమ. భ్రమ, భ్రాంతి.

బమపుర్వు } తుమ్మెద.
బమి }

బమ్మ. బ్రహ్మ. [బమ్మరిలు, బమ్మరిల్లు.

బమ్మరించు. అ. క్రి. భ్రమించు. రూ.

బమ్మచారి. బ్రహ్మచారి, వటుఁడు.

బమ్మతండ్రి } విష్ణువు, ప్రపితా
బమ్మదేవరతండ్రి } మహుఁడు.

బమ్మర. భ్రాంతి.

బమ్మరక్కసి. బ్రహ్మరాక్షసి.

బమ్మాచారి. బ్రహ్మచారి.

బమ్మిడి. వంత, బాధ.

బమ్మెర. భ్రాంతి.

బమ్మెరపోక. భ్రమపడుట.

బమ్మెరపోవు. అ. క్రి. భయపడు.

బయకాఁడు. గాయకుఁడు; వీణకాఁడు; సంగీతోపాధ్యాయుఁడు; భోగము మేళము వెనుక బద్దముఁలఁగొలుపువాఁడు

బయకారము. యౌవనమునందు బయలుపడు శృంగారచేష్ట.

బయకారి. విణ. విలాసవతి [వెలుపల.

బయటన్. అవ్య. బహిరర్థకము, వెలి,

బయలు. వెలి, బాహ్యము, బహిఃప్రదేశము; చెట్టుచేమలేని చోటు; నిరావరణ స్థలము; ఆకాశము. విణ. శూన్యము.

బయలుదామర. మెట్టదామర.

బయలుఛుదేఱు. అ. క్రి. నిర్గమించు.
బయలుపడు. అ.క్రి. ప్రకాశితమగు. రూ. బయల్పడు; [మొనర్చు.
బయలుపఱచు. స. క్రి. ప్రకాశమాన
బయలుమెఱయు. అ. క్రి. బయలుపడు.
బయలువెడలు. అ.క్రి. బయలుదేఱు.
బయలువోవు. అ.క్రి. బయలుపడు.
బయానా. హిం. సంచకరువు, ముందుగా నిచ్చు రూకలు.
బయావారి. హిం. విణ. వివరమైనది.
బయిజే. అజ్ఞానము.
బయిట. గ్ర. బాహ్యము.
బయిటనున్నది. ఋతుమతి.
బయిడాలము. కోపము.
బ్రయిరవాసము. ఉత్తరీయము.
బయిరాగి. బైరాగి.
బయిరి. రూ. బైరి.
బయిలగు. అ. క్రి. బయలగు.
బయిలు. బయలు. [నము.
బయిసణ. వీణె సొరకాయయొక్క బంధ
బయిసి. గౌరవము; భాగ్యము.
బయిసుక. ప్రతిజ్ఞ, నియమనము.
బయ్యంకలు. బ. వేవిళ్లు.
బయ్యఁడు. విణ. మందుఁడు.
బరక. విణ. కఱకైనది.
బరకము. దూదిబరువు.
బరగడ. ధాన్యపు రాశి మొదలగువాని మీఁద వేసెడు మట్టి ముద్ర.
బరగడము. వృక్షవిశేషము.
బరడు. చింత మొదలగువానిపై బెరడు, గఱుకైన పట్ట మొ. [పాత్రము.
బరణి. కాటుక మొ|| యుంచు కొనెడు
బరణిచుక్క. భరణీనక్షత్రము.
బరతరఫు. హిం. ఉద్యోగమునుండి త్రోసి వేయుట.
బరతుపిట్ట. పక్షివిశేషము [భేదము
బరపట. తృణవిశేషము, బ. తృణధాన్య
బరమా. పిడిసాన. [పారవశ్యము.
బరవసము. ధైర్యము; ఉత్సాహము;
బరాతము. హిం. లిఖితపూర్వకమైనఆజ్ఞ
బరాబరి. హెచ్చరిక. విణ. సరియైన.
బరావర్దు. హిం. మదింపు, ఉజ్జాయింపు.

బరి. పార్శ్వము; గతి; బరిగోల; దొంగ; శత్రువు. విణ. బరిగెశబ్దముయొక్క లుప్త రూపము.
బరికట్టె. అలుగులేనియీఁటె.
బరికాఁడు. మావటివాఁడు.
బరికాయ. కొంటె, భ్రష్టుఁడు.
బరికె. గణుపులుగల యొండినతాటిమట్ట. విణ. చింపిరి.
బరిగమ్మి. బరికట్టె.
బరిగి. విణ. ఏమియు లేనిది.
బరిగిరౌతు. పల్లము వేయని గుఱ్ఱముమీఁద నెక్కెడు రౌతు.
బరిగోల. ఏనుఁగు ప్రక్కలు పొడిచి బెదరించుటకై అర్ధచంద్రాకారముగా ఉక్కుతో చేసిన అలుఁగుగల వెదురు దండము; బాణము.
బరిచి } ఈఁటె, కుంతము, పొడిచేడి
బరిచీ } ఒక ఆయుధము.
బరిజోగి. విణ. పాములవాఁడు.
బరిడెగవ్వ. భక్ష్యవిశేషము.
బరిడెపురుగు బొద్దీక
బరిణె. బరణి, భరణి.
బరిణెచుక్క. భరణీనక్షత్రము.
బరిణెపురుగు. బొద్దీక.
బరితము. కోయిల.
బరితోలు. పార్శ్వచర్మము.
బరిదెగినది విణ. విశృంఖలము.
బరిపోటు. మల్లబంధవిశేషము.
బరిమేను. దిగంబరదేహము.
బరివాఁగె. పార్శ్వము; పురోభాగము.
బరివెంక. పక్కిచెట్టు, ఖరపత్రి.
బరిస. ఇనుపకట్ల గుదియ, పరిఘము.
బరిహి. బర్హి, నెమిలి.
బరుకు. స.క్రి. త్రోలు లేచునట్లుగీఱు; గీఱు
బరుజు. కింకిణి, గజ్జెలు.
బరువడి. గ్ర. మరల.
బరువసము. బరవసము. [మొ.
బరువు. భారము; సరకులు నింపిన కంట్లము
బరుసడ్డసరము. అంబష్ఠి.
బరుసు. విణ. కఱకైనది; గణుసు; అమ స్పణము. [పరిహాసము.
బర్కరము. సం. ప్రాయపుపశువు; మేఁక;

బర్బర. సం. వాయింటు†. [నొకటి.
బర్బరదేశము. సం. 56 దేశములలో
బర్బరము. సం. బొరంగి†; బొబ్బరలు†;
బర్బరదేశము. విణ. గజుకులుగలది.?
బర్బరుఁడు. సం. విణ. పామరుఁడు;
మూర్ఖుఁడు.
బర్బూరము } తుమ్మ†.
బర్బూరము }
బర్హపుష్పము. సం. గండిపనము;
పచ్చాకు; మాచిపత్రి. [బర్హాపుష్పము†.
బర్హము. సం. నెమిలి పింఛము; ఆకు;
బర్హి. సం. నెమిలి; దర్భ†.
బర్హిచూడము. సం. నెమిలిజుట్టుచెట్టు.
బర్హిణము. సం. నెమిలి.
బర్హిధ్వజ. సం. పార్వతీదేవి.?
బర్హిపుష్పము. సం. బర్హాపుష్పము†
బర్హిర్బీజము. సం. నల్లజీడి†.
బర్హిర్ముఖుఁడు. సం. దేవత, వేలుపు.
బర్హిష్మష్మ. సం. అగ్నిహోత్రుఁడు. రూ.
బర్హిష్మష్మఁడు.
బర్హిష్కేశుఁడు. సం. అగ్నిహోత్రుఁడు
బర్హిష్ఠము. సం. కురువేరు†.
బర్హిస్సు. అగ్ని; దర్భ†.
బలటు. స. క్రి. గోఁకు; సైఁగగాగోఁకు
బలబల. ఈడ్చుట దాచుటమున్నగువాని
యందగు ధ్వన్యనుకరణము.
బలై. మహిషి, గేదె. [పము.
బల. సం. ముత్తవపులగము†; విద్యావిశే
బలఁగము. పరిజనము, పరివారము.
బలకరము. కావలి. సం. విణ. బలము
గలుగఁజేయునది.
బలకరించు. అ. క్రి. వ్యాపించు;
బలకాయించు. అ. క్రి. అతిశయించు.
బలకొట్టు. అ. క్రి. ఆఁ అనిశ్రుతిపట్టు.
బలకొను. అ. క్రి. అతిశయించు.
బలదేవుఁడు. సం. బలరాముఁడు; వాయువు
బలపడు. అ. క్రి. అధికమగు.
బలపము. ఖటికశిల, పలక వ్రాసెడు
సాధనము; చోరసాధన విశేషము.
బలభద్రిక. సం. కలంక్రాంత†.
బలభద్రుఁడు. సం. బలరాముఁడు.
బలము. విణ. అధికము. సం. బోళము;
రసము; రూపము; సత్తువ; బలుపు; సేన;
కాకి. విణ. బలము గలది.
బలముటి. శరీరబలము కలవాఁడు.
బలయు. స. క్రి. పరివేష్టించు.
బలరాముఁడు. సం. కృష్ణునియన్న.
బలవంతము. బలాత్కారము. క్రి. విణ.
బలాత్కారముగా. సం. విణ. బలముగలది.
బలవంతుఁడు. సం. విణ. బలముకలవాఁడు.
బలవిన్యాసము. సం. వ్యూహమునొడ్డుట.
బలసూదనుఁడు. సం. ఇంద్రుఁడు.
బలా. అవ్య. బళా, ప్రశంసార్థకము.
బలాక. సం. పెద్ద పెంటి కొక్కెర;
పెంటికొక్కెర.
బలాకము. సం. పెద్దకొక్కెర; కొక్కెర.
బలాత్కరించు. సం. స. క్రి. బలత్కా
రము చేయు.
బలత్కారము. సం. ప్రసభము, బలవం
తము, మిక్కిలి నిర్బంధించుట.
బలాదూరు. హిం. దిగఁదుడుపు, చేటును
దూరపఱచుటకు నిచ్చు బలి.
బలానుజుఁడు. సం. శ్రీకృష్ణుఁడు.
బలారా. అవ్య. బళా. రూ. బలారె.
బలారాతి. సం. ఇంద్రుఁడు. రూ. బలారి.
బలాసము. సం. తెమడ, కఫము.
బలాహకము. సం. మేఘము. శ్రీకృష్ణుని
తేరి గుఱ్ఱములలోనొకటి; సర్పవిశేషము;
పర్వతము.
బలి. సం. కప్పము; పన్ను; భూతబలి;
(పూజార్థమైన) కానుక; చామరదండము;
బలిచక్రవర్తి. విణ. బలముగలవాఁడు.
బలిజె. శూద్రజాతి విశేషము.
బలిజెది. బలిజె స్త్రీ.
బలిజెవాఁడు. బలిజె.
బలితము. విణ. బలిష్ఠము; స్థూలము.
బలితుఁడు. కలవాఁడు, బలవంతుఁడు,
లావరి.
బలిధ్వంసి. సం. విష్ణువు, త్రివిక్రముఁడు.
బలిపుష్టము. సం. కాకి; వక్కకొంగ.?
బలిపెట్టు. మి. స. క్రి. చంపు.
బలిభుక్కు. సం. కాకి; ఊరఁబిచ్చుక.
బలిమి. దేహబలము; సత్తువ; బలాత్కా
రము, బలవంతము.

బలిమికాఁడు. విణ. బలవంతుఁడు.
బలియు. అ. క్రి. పెంపుచెందు; స్థూలించు; అధికమగు; చుట్టుకొను.
బలియుఁడు. విణ. బలవంతుఁడు.
బలివారు. మి. స క్రి. చంపు.
బలిష్ఠము. సం. విణ. మిక్కిలిబలముగలది.
బలిసద్మము. సం. పాతాళలోకము.
బలిసినవాఁడు. కలవాఁడు; స్థూలదేహుఁడు.
బలీయము. సం. విణ. మిక్కిలిబలముగలది
బలీవర్దము. సం. ఎద్దు. [రూపము.
బలు. విణ. బలంవు శబ్దముయొక్క లుప్త
బలుఁడు. సం. బలరాముఁడు; ఒక రాక్షసుఁడు. విణ. బలము గలవాఁడు.
బలుగు. ఉపశాఖ. [విశేషము.
బలుగుత్తి. సస్యవిశేషము. బ. శాలిధాన్య
బలునంజెమెకము. స్థూలపాదము, ఏనుఁగు
బలుపు. పుష్టి; బలము, స్థౌల్యము.
బలుపుకొను. అ. క్రి. అతిశయించు.
బలురక్కసి } గణహాసకము†.
బలురక్కెస }
బలువిడి. విధము; ధాటి; కష్టాయము; బలిష్ఠము; బలవంతము; బలాత్కారము తత్క్షణము; అత్యంతము.
బలువిప్పుగళ్ళపొత్తులసద్ది. చంద్రుఁడు.
బలువు. బలము. విణ. గురుపదార్థము; అధికము; పెద్ద. [తుఁడు.
బలువుఁడు. విణ. బలియుఁడు, బలవం
బలుసు. కసింద. గాంగేరుకము†.
బలుహజ్జమెకము. స్థూల పాదము, ఏనుఁగు.
బలె. ద్ర. వలె.
బలే. అవ్య. బళా; చుమా, చూడుమా.
బల్గము. రూ. బలఁగము.
బల్చారలమెకము. పెద్దపులి.
బల్తులమెకము. మహామృగము, ఏనుఁగు.
బల్పు. రూ. బలుపు.
బల్పుకొను. అ. క్రి. అతిశయించు.
బల్బజము. సం. తృణవిశేషము, వెుందవ†.
బల్మి. రూ. బలిమి.
బల్ల. దారు ఫలకము, కూర్చుండుటకై కాళ్ళుమర్చిన యెత్తుపలక; కడుపులోని దుర్మాంసపు బిల్ల; కంచము.
బల్లకట్టు. వెడలుపైన అడుగు గల పడవ.
బల్లగోడ. బల్లలతో కూర్చిన గోడ.
బల్లగోల. పంట్రు.
బల్లాడదట్టీ. ఒక దినుసు కాసె.
బల్లి. పల్లి, గృహగోధిక.
బల్లిదము. విణ. మిక్కిలి బలము గలది.
బల్లిదుఁడు. విణ. మిక్కిలి బలము గలవాఁడు.
బల్లియము. బల్లెము.
బల్లు. తెల్లవాఱుట యందగుఅనుకరణము; విఱుగుటయందగు ధ్వన్యనుకరణము.
బల్లెకోల. కుంతము, బల్లెము.
బల్లెము. భల్లము, బారెఁడు కఱ్ఱకు పెద్ద అలుఁగు వేసిన పొడుచునట్టి ఒకానొక ఆయుధము.
బల్విడి. విధము; తత్క్షణము; కష్టాయము.
బవ. సం. ఒక కరణము
బవంతము. కపటము.
బవంతి. చతుశ్శాలము, నాలుగుప్రక్కల నాలుగిండ్లు కలిపికట్టిన కట్టడము; చిత్రవర్ణము; చిత్రవర్ణము గల చీర.
బవనిక. రూ. బదనిక.
బవరము. యుద్ధము.
బవరి. సాంద్రము.?
బవిని. జాతరయందలి బవినీలనృత్యము.
బవినీఁడు. జాతరయందు సుద్దులుచెప్పుచు బవినియాడువాఁడు.
బవిరలు. బ వర్తులాకారమైన కొనచెవి-భూషణములు.
బవిరి. విణ. గుండ్రము; కేచితము; సాంద్రము; భ్రాంతి.
బవిసనము. బయిసణ. [శుభము.
బవిసి. భాగ్యము, నియతి; గౌరవము;
బవిళి. మూర్ఛ.
బవిసెన. బయిసణ
బవ్రి. బవిరి.
బష్కయణి. సం. తఱపియావు.
బష్కయము. సం. తఱపిదూడ.
బస. విడిది, వాసస్థానము.

బసవఁడు } వృషభము; అచ్చువేసిన
బసవన (న్న) } యాఁబోతు.
బసవన్నాట. బాలక్రీడావిశేషము.
బసివి. కులట.
బసుమము. భస్మము.
బస్తకము. సం. రోమకలవణము.
బస్తము. సం. మేఁకపోతు.
బస్తా. హిం. కట్ట, మూట,
బస్తీ. హిం. పట్టణము.
బహదరు. హిం. గౌరవసూచకమైన బిరుదు. రూ. బహద్దరు.
బహిత్రము. సం నౌకావిశేషము.
బహిరంగము. సం. వెలుపటి అవయవము. విణ. బయలుపడినది.
బహిర్ద్వారము. సం. తలవాకిలి.
బహిర్లాపి సం. ఉత్తరము వేఱుమాటల యందణఁగి యుండునట్లు అడుగునట్టి విషమసమస్య.
బహివడు. అ. క్రి. వెలివేయఁబడు.
బహివెట్టు. స. క్రి. వెలివేయు.
బహిష్కరించు. సం. స.క్రి. వెలివేయు.
బహిష్కరణము } వెలివేయుట.
బహిష్కారము }
బహిష్కృతుఁడు. సం. విణ. వెలివేయఁబడినవాఁడు.
బహుకరి. సం. చీఁపురు.
బహుకరుఁడు. సం. విణ. ఖలపువు.
బహుధా. సం. అవ్య. అనేకవిధముల.
బహుధాన్య. సం. ఒక సంవత్సరము.
బహుపాదము. సం. మఱ్ఱి. రూ. బహుపాత్తు. [కాఁడు.
బహుప్రదుఁడు. సం. విణ. మిక్కిలియీవి
బహుమతి } సం. సమ్మానము.
బహుమానము }
బహురూపధారణము. సం. నాటకములో నొక భేదము [వేషము వేయు.
బహురూపమాడు స.క్రి. నాటకములో
బహురూపము. సం. ఊసరవెల్లి; సజ్జరసము
బహురూపుఁడు. సం. విష్ణువు; శివుడు; మన్మథుఁడు. పెక్కురూపములుకలవాఁడు.
బహువారకము. సం. విరిగి. [లయినది.
బహువిధము. సం. విణ. అనేకవిధము

బహువ్రీహి. సం. ఒక సమాసము.
బహువు. సం. విణ. అధికము; పెక్కు.
బహుసుత. సం. పిల్లపీఁచరి. విణ. పెక్కండ్రు కొడుకులుగాని కూఁతులుగాని కల ఆఁడుది.
బహుళ. సం. ఆవు; పెద్దయేలకి; చిట్టేలకి; నీలిచెట్టు; ఒక దేవి; కృత్తికానక్షత్రము. బ. వ. కృత్తికలు.
బహుళము. సం. ఆకాశము; అగ్ని; కృష్ణపక్షము. విణ. అధికము, విస్తారము; అనేకము.
బహుళుఁడు. సం. అగ్నిహోత్రుఁడు.
బహుళీకృతము. సం. విణ. తూర్పెత్తిన ధాన్యము.
బహూకరించు. సం. స. క్రి. గౌరవించు.
బహూకృతి. సం. బహూకరించుట. రూ. బహూకరణము.
బహూదరు. రూ. బహదరు.
బహ్వాశి. సం. విణ. తిండిపోతు.
బళకరము. రూ. బలకరము.
బళా. అవ్య. మెచ్చుటను తెలుపునది, ప్రశంసార్థకము.
బళాయి. విణ. బలవంతుఁడు.
బళారె(రే). అవ్య. భళా.
బళి. అవ్య. బళీ.
బళిర(రా). అవ్య. బళా.
బళిరయ్య. అవ్య. బళా.
బళిరె(రే) అవ్య. బళా.
బళీ. అవ్య. ప్రశంసార్థకము.
బళిరె(రే). అవ్య. బళీ.

## బా

బాంకా. బాఁకా.
బాంకి. ఇం. ధననిధి, బ్యాంకు.
బాండువ. కుండ, భాండము.
బాండ్లి. గ్రా. వంటచేయుటయందు వాడుకొను లోహపాత్ర.
బాంది. హిం. పనికత్తె.
బాంధకినేయుఁడు. సం. కౌలటేయుఁడు, గుడిసెవాటుదానికొడుకు.
బాంధవము. సం. చుట్టఱికము.

బాంధవుఁడు. సం. చుట్టము; జ్ఞాతి, సగోత్రుఁడు; మిత్రుఁడు; సంబంధము చేసిన వాఁడు.
బాఁకా. వాద్యవిశేషము, బాకా.
బాఁకు. కటారి, మొలలో నుంచుకొనెడి ఆయుధవిశేషము. [అల్పాసి.
బాఁకుదారు. కఱ్ఱలు మొదలగునవి చెక్కు.
బాఁజా. శ్యేనవిశేషము. [గొప్పద.
బాఁతి. ప్రీతి. విణ. ప్రియము; దుర్లభము;
బాఁదు. స.క్రి. కొట్టు, ప్రహరించు.
బాఁదుకొను. స.క్రి. బాఁదు; కొట్టుకొను.
బాఁపఁడు. బ్రాహ్మణుఁడు.
బాఁపత. బ్రాహ్మణస్త్రీ.
బాఁపన. బ్రహ్మకులము.
బాఁపనక్క. బ్రాహ్మణస్త్రీ.
బాఁపనచీమ. వృక్షములయందు గోరోజనపు వర్ణముగల ఒక దినుసు పెద్దచీమ, బ్రాహ్మణి.
బాఁపనది. బ్రాహ్మణ స్త్రీ.
బాఁపనయ్య } బాఁపనవాఁడు } బ్రాహ్మణుఁడు. బాఁపనుఁడు }
బాఁపఱికము. బ్రాహ్మణత్వము.
బాకా. హిం. బాఁకా, కాహళి, ఊదు వాద్య విశేషము.
బాకి. అప్పు. విణ. విస్మృతము.
బాకినోటిమెకము. తెఱనోటి మెకము, పంచాస్యము, సింహము.
బాకిళ్ళమారి. విణ. దుష్టుఁడు.
బాకీ. శేషము; ఋణము.
బాకు. ఆయుధవిశేషము.
బాగములు. బ. వత్తిన పోఁకలు.
బాగరి. విణ. అందగాఁడు, అందగత్తె.
బాగలు. బ. బాగములు.
బాగా. అశ్వపంక్తి.
బాగాలు. బ. బాగములు.
బాగు. క్షేమము; అంగీకారవాక్యము; అందము; విధము. విణ. క్షేమముగలది; అందముగలది; యోగ్యము, సమీచీనము.
బాగుచేయు. స.క్రి. శుభ్రపఱచు, చక్కపఱచు.
బాగుదార. చిన్నకత్తి.
బాగులాఁడి. విణ. అందగత్తె.
బాగెము. భాగ్యము, సుకృతము.
బాగోగులు. బ. మంచిచెడ్డలు; సరిగానున్నది సరిగా లేనిది.
బాజాలు. హిం. బ. డోలు తప్పెట మొదలగు వాద్య విశేషములు.
బాజారు. బజారు, వీథి; అంగడివీథి.
బాజాఱము. చీఁకటి తప్పు.
బాజాఱి. ధూర్తస్త్రీ.
బాజాఱు. బజారు; అంగళ్ళవీథి.
బాజు. విణ. కాంతి; ప్రక్క.
బాజేగస్తు. విణ. మరల ఇచ్చివేయఁబడిన
బాజుబందు. సందిటఁగట్టుకొనెడుభూషణ విశేషము.
బాట. పథము, మార్గము, దారి.
బాటసారి. విణ. దారి నడచువాఁడు, పథికుఁడు. [బడబాగ్ని.
బాడబము. సం. బడబా సమూహము;
బాడబుఁడు. సం. బ్రాహ్మణుఁడు.
బాడబ్యము. సం. బ్రాహ్మణసమూహము
బాడవ. ఆవ, పల్లపునేల.
బాడానువు. సం. బాడిస.?
బాడిగ. అద్దె, ఒకఁడొకని సొత్తు నుపయోగించుకొనుటకై ఆ సొత్తుగలవానికిచ్చెడు ధనము, బండిఅద్దె ఇంటిఅద్దె మొ. రూ. బాడిగె.
బాడిత. బాడిద†. రూ. బాడిస.
బాడిద—ము. పారిభద్రము†.
బాడిస. వాసి, వడ్లవాఁడు కొయ్యచెక్కెడు కొఱముట్టు రూ. బాడిసె.
బాడు. ప్రావరణము, ముసుఁగు.
బాడుగోలు. విణ. మానహీనుఁడు.
బాడుదల. అవమానించుట; ప్రాణముతోనున్న తల, జీవగ్రాహముగా పట్టుకొనుతల.
బాడువ. పల్లపునేల.
బాడె. పంకము, బురద.
బాఢము. సం. ప్రతిజ్ఞ; అతిశయము. క్రి.విణ మెల్లు. విణ. అధికము; దృఢము.
బాణ. సం. బాణమూలము; నల్లగోరంట†.
బాణకఱ్ఱ. బాణాకఱ్ఱ, కొంచెమువలముగా

సుండి కణుపులుఁగలిగిన బలమగు పొడుగు కఱ్ఱ.
బాణపుంఖి. సం వెంపలి†.
బాణము. సం. అమ్ము (మన్మథుని పంచబాణములు— మోహనము, ఉన్మాదనము, సంతాపనము, శోషణము, నిశ్చేష్టాకరణము); ఆవు పొదుఁగు; తెల్లగడ్డికాడ.
బాణలి. వేఁచుట మొదలగువానికి ఉపయుక్తమగు లోహపాత్ర విశేషము.
బాణవిద్య. సం. ధనుర్విద్య.
బాణసంచు. మి. గ్రా. తుపాకిమందుతో చేసి వేడుకకు కాల్చెడు పగలువత్తులుఁ బిరుసులుఁ మొ.
బాణా. దండాయుధము.
బాణారి. సం. శ్రీకృష్ణుఁడు.
బాణాసనము. సం విల్లు.
బాణుఁడు. సం. బాణాసురుఁడు.
బాతళించు అ. క్రి. తత్తఱపడు.
బాతాఖాని. హిం. వదరుఁబోతు.
బాతిని. హిం. రహస్యముగా పంచఁబడు దూతి, వేఁగువాఁడు.
బాతు. శరారి పక్షి. [కలము.
బాతుకలము. బాతుయీకలతో చేసిన
బాతువు. బాతు.
బాద. బాధ.
బాదము. బాదామువృక్షము.
బాదర. జానకిత్రాడుంచెడి కర్ణాటకపు తుపాకిచెవి. సం. ప్రత్తి†.
బాదరము, బాదర. సం. నూలు; ప్రత్తి†. విణ నూలిచే నేయఁబడినది.
బాదరాయణి. సం. వ్యాసుఁడు; శుకుఁడు.
బాదరాయణుఁడు. సం. బదరికాశ్రమనివాసి, వేదవ్యాసమహర్షి.
బాదరించు. అ. క్రి. సమానమగు.
బాదరు. బాదర.
బాదామము. సం. బాదముకాయ.
బాదాము రూ. బాదము.
బాధ. సం. దుఃఖము; కష్టము; పీడ; అన్వయింపమి; ప్రతిబంధకము; అసత్యత్వప్రతీతి;
బాధకము. సం. విణ. బాధించునది.
బాధించు. సం. స. క్రి. బాధచేయు; బాధపెట్టు.
బాధితము. సం. విణ. బాధింపఁబడినది.
బాధిర్యము. సం. చెవుడు.
బాధ్యత. పూఁచీ. సం. బాధ్యత్వము. బాధింపఁదగియుండుట.
బాధ్యము. సం. విణ. బాధింపఁదగినది.
బాన. కడవ; పీతపుకడవ; పెద్దకుండ.
బానగిలు (ల్లు) అ. క్రి. బలాత్కృతమగు.
బానము. వంట; వంటసాల.
బానసీఁడు. విణ. వంటవాఁడు; దాసుఁడు.
బానిస. దాసి. వా. బానిసె.
బానిసము. దాస్యము.
బానిసీఁడు. దాసుఁడు.
బాపనపోటు. బ్రాహ్మణులు యుద్ధముచేయుట, అస్వాభావికము.
బాపు. అవ్య. బళి.
బాపురె } అవ్య. బళి.
బాపురే }
బాబతు. హిం. రీతి; విషయము; పద్దు.
బాబయ్య. తండ్రి; పినతండ్రి; పూజ్యుడు.
బాబా. గుజ్జము. [డు.
బాబారౌతు. అశ్వవాహనుఁడు, కుబేరుఁ
బాబు. తండ్రి; పూజ్యుఁడు; కోమలామంత్రణము. [భంగము; మోసము.
బాము. జన్మము; దుఃఖము; చిక్కు;
బార. వ్యామము, నాలుగుమూరలు, అడ్డముగా చాఁచిన రెండు చేతులతోడి బొమ్మకొలత; పంద్రెండు.
బారంగి. భార్గి, ఒకానొక మందుచెట్టు.
బారకము. బరువు. [స్వామి.
బారకయిపోటరి. షణ్ముఖుఁడు, కుమార
బారకాఁడి. క్రొత్తకోడెలను ఎద్దులతో చేర్చి మరపుటకు కట్టెడు కాఁడి.
బారకాసు. ఇం. సైనికులుండు నివాసము.
బారకించు. అ. క్రి. భారమగు.
బారతసేనలు. బ. ధాన్యవిశేషము.
బారపట్టె. కురుజులమీఁద (లేక) స్తంభములమీఁద అడ్డముగా అమర్చెడు నిడుపాటి పట్టె. [కొలఁది నూలువడుకు.
బారపోయు. స. క్రి. చేయి చాఁగునంత
బారబలావతీలు. హిం. షన్నిద్ధులు. గ్రామ

సేవకులు (నంబి, రెడ్డి, కరణము, పురో హితుఁడు, తలారి, వడ్రంగి, కమ్మరి, కుమ్మరి, చాఁకలి, మంగలి, మాల, మాదిగ).

బారమేనులప్రోడ } ద్వాదశాత్ముఁడు.
బారరూపులవేలుపు }

బారసాల. నామకరణము.

బారసి. ద్వాదశి.

బారా. రూ. బార. [కము.

బారాది. విణ. బహుళము, అధికము; అనే

బారి. ఏనుఁగు కాలు గట్టెడు గొలుసు; నిర్బంధము; హింస; కపిలె యెద్దులకు నిర్బంధముగా నేర్పఱచిన దారి; దుఃఖము; ఉపద్రవము; శత్రుసమ్ముఖము.

బారికాఁడు. పల్లెకాపలావాఁడు.

బారికె. గ్రామమునందు దినబత్తెము లేక వెట్టిపని చేయువాఁడు.

బారిజెము } పారిభద్రము†.
బారిదము }

బారిముద్ర. మి. దీనారభేదము.

బారిసమరు. స. క్రి. హింసించు, చంపు.

బారిసము. వేషము.

బారిస్టరు. ఇం. న్యాయవాదులలో ముఖ్యుఁడు, పెద్దప్లీడరు.

బారీ. బారిగొలుసు.

బారు. సమూహము; పంక్తి, వరుస.

బారుచేపు. పెక్కు మూలలుగల రేకు; చాలా నిడివిగల బట్ట.

బారుచేయు. గ్రా. స. క్రి. తుపాకిలో మందుగుండు వేసి కూరు.

బారుదూలము. నిడుపాటి దూలము.

బారుపట్టె. బారపట్టె.

బారువ. ఇరువది మణుఁగుల కొలఁది.

బారెఁడు. విణ. బారకొలఁది; జిట్టెఁడు.?

బార్హతము. సం. బృహతీఫలము.

బాల. సం. బాలాత్రిపురసుందరి; స్త్రీ; నారికేళము†; పసుపు†; మల్లె†. విణ. పదుహారేండ్ల యువతి; మూర్ఖురాలు; కన్య, ఎనిమిదేండ్ల లోపలిది.

బాలకుఁడు. సం. పిల్లవాఁడు; మూడేండ్ల లోపలిశిశువు. విణ. తెలియనివాఁడు.

బాలతనయము. సం. చంద్ర†.

బాలతృణము. సం. లేఁతకసవు, పచ్చిక.

బాలబందు. హిం. దేవనాగరలిపిని బోలు లిపి విశేషము. [వాలము; కురువేరు†.

బాలము. సం. అయిదేండ్ల యేనుఁగు పిల్ల;

బాలమూషిక. సం. చిట్టెలుక.

బాలవ. సం. ఒక కరణము. [విశేషము.

బాలసంగడము. మి. గ్రా. మల్లసాధన

బాలాజి. తిరుపతి వేంకటేశ్వరులు.

బాలింత-రాలు. వా. పురుటాలు, బాలెంత.

బాలింతబోలు. వా. బాలెంతబోలు.

బాలిక. సం. కన్య; ఆఁడుబిడ్డ; పేఁకె; చెవికమ్మ; ఎనిమిదేండ్లలోపలి చిన్నది.

బాలిశము. సం. తలగడ. [వేకి; శిశువు.

బాలిశుఁడు. సం. విణ. మూర్ఖుఁడు, అవి

బాలీసు. ఒఱగుదిండు. [వాఁడు.

బాలుఁడు. సం. పదునారేండ్ల లోపలి

బాలెంతబోళము. బాలెంతలకిచ్చెడి ఔషధవిశేషము. రూ. బాలెంతబోలు

బాలెంత-రాలు. పురుటాలు, ప్రసూత.

బాలేయము. సం. పిన్నముల్లంగి†; గాడిద. విణ మెత్తనిది; పూజాయోగ్యము.

బాలేయశాకము. సం. బారంగి†.

బాల్యము. సం. చిన్నతనము, మొదటి వయోవస్థ.

బావ. అక్కమగఁడు; మగనియన్న; తనకంటెఁ బెద్దవాఁడైన మేనత్త మేనమామల కొడుకు.

బావంజి. వాకుచి, కారుగచ్చ†.

బావి కూపము; దొరువు; చెఱువు; పల్లము.

బావిడీ. హిం. బావి. [భూషావిశేషము.

బావిలీ ఆఁడుది కొనచెవిని ధరించెడి

బావిలీగొలుసు. మగవాఁడు కొనచెవిని ధరించెడి భూషావిశేషము.

బావుకొను. స. క్రి. అన్నము మొ॥ చేతి నిండయెత్తి నోటనిడుకొను; అనుభవించు.

బావుటా. హిం. జెండాగుడ్డ.

బావురు. మహామార్జాలము. [గండుపిల్లి.

బావురుఁబిల్లి. బావురని కూసెడి పెద్ద

బావురుగడ్డము. పిల్లిగడ్డము; మేఁకగడ్డము.

బావురుగాఁడు. బావురుఁబిల్లి.

బావురుమను. అ. క్రి. (జనశూన్యమగుటచే) బావురుమని మాఱుమ్రోఁత కలదియగు.

బాష్పము. సం. కన్నీరు; తోఁటకూర, కొయగూర; ఆవిరి; ఇనుము.
బాష్పిక. ఇంగువ్రమాను†; తోఁటకూర†
బాస. భాష, సంస్కృతాదిభాష; ప్రమాణము; వ్రతము; సంకేతము; మాట, వచనము; శపథము, ప్రతిజ్ఞ.
బాసట. విణ. సహాయము.
బాసనము. వంటపాత్రము.
బాసము. జాలె. [ముని.
బాసవాలు. గీర్వాణుఁడు, దేవత; ఋషి.
బాసవాలుదిట్టరులు. బ గీర్వాణులు, దేవతలు. [రుఁడు.
బాసవాల్దొర. దేవేంద్రుఁడు; ఋషీశ్వ
బాసాడు. అ. క్రి. మాటాడు, భాషించు
బాసికదండ. లలామకము, తలముందు ప్రక్కనుంచఁబడిన పుష్పహారము.
బాసికపట్టు. పద్మాసనము.
బాసికము. లలాటిక, వివాహకాలమందు వధూవరులకు నొసటఁగట్టెడు ముక్తికాది హారవిశేషము.
బాహ. సం. బాహువు. [నియోగములు.
బాహత్తరినియోగము. మి. డెబ్బదిరెండు
బాహప్పళించు. అ. క్రి. భుజాస్ఫాలనము చేయు. [రంగము.
బాహాటము. విణ. బయలుపడినది; బహి
బాహాస్ఫాలనము. సం. భుజములను చఱచుట. (మల్లయుద్ధమున.) [మార్చిల్లు.
బాహిరపోవు. అ. క్రి. బయలుపడు;
బాహిరము. విణ. బయలుపడినది; వెలియైనది, బాహ్యము.
బాహుజుఁడు. సం. రాచవాఁడు, క్షత్రియుఁడు. విణ. భుజమునందు పుట్టినవాఁడు
బాహుద. సం ఒకయేఱు.
బాహుదము. సం. బాహుపురి. [రము.
బాహుపురి. మి. సందికడియము, కేయూ
బాహుపురులు. బ. ధాన్యవిశేషము.
బాహుమూలము. సం. చంక. [మాసము.
బాహులము. సం. బాహుకవచము; కార్తిక
బాహులేయుఁడు. కుమారస్వామి.
బాహుళ్యము. సం. ఆధిక్యము, విస్తారము.
బాహువు. సం. మోఁచేతి పైభాగము, భుజము; (మొత్తము) చేయి.

బాహ్యము. బయలు. సం. విణ. వెలుపలిది.
బాహ్లికము, బాహ్లీకము } సం. ఇంగువ, కుంకుమపువ్వు; 56 దేశములలో ఒక దేశము; ఆ దేశపుగుఱ్ఱము.
బాహ్లికుఁడు. సం. ఒకరాజు. [రము.
బాళి. కాంక్ష; ప్రేమము; మూర్ఛ; విచా
బాళెలు. బ. పుష్పవిశేషములు.

## బి

బింకము. బిగువు; గర్వము; నిక్కు; గర్వోక్తి; శూరత. [శూరత.
బింకెము. గర్వము; బడాయి, గర్వోక్తి;
బింగిలు బ. చదువుకొను పిల్లవాండ్రకు బడిపంతులు వేయు ఒకశిక్ష.
బింతి. పంక్తి. [సంభేదము; విఱుగుట.
బిందము. బృందము, సమూహము;
బిందియ. రూ. బిందె.
బిందీ. పాపటబొట్టు.
బిందు తంత్రము. సం. చదరంగము; సొత్తపలక; పాచిక.
బిందువు. సం. శివస్వరూపము; నీటిబొట్టు, చుక్క; సున్న; లేశము; శుక్రము; నాదజన్యమైన చిచ్ఛక్తియొక్క అవస్థావిశేషము; భ్రూమధ్యము;? దంతక్షతవిశేషము ?
బిందె. నీళ్లుతెచ్చుకొనెడి యిత్తడిపాత్ర; గొంతు సన్నగా నుండెడి లోహపాత్రవిశేషము.
బింబకము. సం. ఊసరవెల్లి.
బింబము. సం. ప్రతిబింబము; దొండపండు; ప్రతిమ, సమానము; ఊసరవెల్లి; చంద్రసూర్యాదిమండలము; స్వరూపము.
బింబసి. సం. అతిసారరోగము.?
బింబిక. సం. దొండ†. రూ బింబ.
బింబితము. సం. విణ. ప్రతిబింబించినది.
బింబోష్ఠి. సం. దొండపండువంటి పెదవి గలస్త్రీ; స్త్రీ.
బికారి. విణ. భిక్షుకుఁడు; అప్రయోజకుఁడు; దరిద్రుఁడు; వికృతవేషధారి?.
బికాసి. విణ. భిక్షుకుఁడు.
బికిరము. భిక్షము.

బికిరాలమ్మారి. విణ. తిరిపగొట్టు; భిక్షు మెత్తు స్వభావము గలవాఁడు.
బిక్క. విణ. నిరుపేద; ఖిన్నము.
బిక్క. అక్షోటము†.
బిక్కరించు. స.క్రి. నిక్కించు; తిక్కించు.
బిగ. ద్ర. క్రి. విణ. బిగియ.
బిగాది విణ. ధూర్తుఁడు.
బిగి. దృఢత, బిగువు; గర్వము
బిగించు. ప్రే. బిగియించు.
బిగితము. విణ. దృఢము.
బిగిబద్ద. రెండు గాఁడికమ్ములకు నడుమ వేయు బిగువుబద్ద.
బిగియు. అ. క్రి. దృఢమగు, బిగువుచేయు
బిగుచు ప్రే. బిగియఁజేయు, బిగించు.
బిగుతు. విణ. వదులుకానిది. [తాళ్లు.
బిగువాళ్లు. కట్టెలు మోపు కట్టెడు కట్టు
బిగువు. బింకము; బిగిబద్ద; త్రాటితో కాలి చెడు ఒక దినుసు కొలత; శౌర్యము; దృఢము. విణ. పట్టునిది, దృఢము.
బిగువుకొను. అ. క్రి. బిగువగు, దృఢమగు, పట్టుకుండు.
బిగ్గ. ద్ర. క్రి. విణ. రూ బిగ.
బిగ్గర. ద్ర. క్రి. విణ. గట్టిగ; దృఢముగ.
బిచానా. హిం. పడక. [వాఁడు.
బిచ్చగాఁడు. భిక్షుకుఁడు, బిచ్చమెత్తు
బిచ్చప. ఆడుగుళోలు.
బిచ్చము. భిక్ష.
బిజేగు. స. క్రి. బొంకు.
బిటారము. విలాసవిశేషము.
బిటారి. విణ. బిటారము గలది.
బిట్టికి. పలువభార్య.
బిట్టబిగ్గ. మిక్కిలి బిగువు.
బిట్టాడు. అ క్రి. హెచ్చుగా మాట్లాడు.
బిట్టు. అవ్య. శీఘ్రము; శీఘ్రముగా; అతిశయము, మిక్కిలి; దృఢము, దృఢముగ.
బిట్టుదొలఁగు. అ. క్రి. చచ్చు.?
బిట్టుబిల్లు. అవ్య. తటాలున.
బిడ. రూ. బిడ్డ; ఒక స్త్రీ ప్రత్యయము. (ఆబిడ, ఈబిడ అని)
బిడము. సం. అట్టుప్ప [దాని నుంచుట.
బిడాయించు. హిం. ఒక దానిలో మరొక

బిడారము. వాసస్థానము; విడిది.
బిడారు. వాసస్థానము; లంబాడితండ; దండు విడియుచోటు.
బిడాలు. సరకులు నింపిన గోనెలు కట్లములు బరువులు మొదలగువాని సమూహము.? [చట్టము.?
బిడాలకము. సం హరిదళము; పునుఁగు.
బిడాలము. సం పిల్లి; కనుగ్రుడ్డు; నేత్రౌషధ విశేషము.
బిడాలవణము సం. అట్టుప్ప.
బిడియము. సిగ్గు. [కలది.
బిడువు అవకాశము. విణ. అవకాశము
బిడెము. సిగ్గు. [జన్మ.
బిడౌజుఁడు. సం. ఇంద్రుఁడు. రూ. బిడౌ
బిడ్డ శిశువు; కొడుకు; కూఁతురు.
బిడ్డఁడు. మగశిశువు; కొడుకు.
బిడ్డకుట్టు. ఆసన్నప్రసవము, ప్రసవవేదన.
బిడ్డతల్లి. బాలెంతరాలు.
బిడ్డలతల్లి. కుటుంబిని.
బిడ్డె. బిడ్డ.
బిత్తరపోవు. అ. క్రి. చలించు.
బిత్తరము. శృంగారచేష్ట; ప్రకాశము. విణ. చంచలము; సరసము.
బిత్తరములాడు. అ. క్రి. ప్రకాశించు.
బిత్తరి. శృంగారచేష్టలుగల స్త్రీ; స్త్రీ. విణ. ప్రౌఢ, పటుశరీరముగలది.? శృంగారచేష్టకలది.
బిత్తరించు. అ. క్రి. సరసమాడు; ప్రకాశించు; చలించు; ఊఁగాడు.
బిత్తరిజింకతాల్పు. శశి, చంద్రుఁడు.
బిత్తల. దిసమొల. [మొలది.
బిత్తలి. విణ. దిసమొలవాఁడు; దిస
బిత్తెడ. చక్కిలములు మొదలగువానిని వేల్చిరెడు త్రెడు లోహసాధనవిశేషము.
బిద్ద. నగకము.
బిద్దము విణ భిన్నము.
బిద్దు అ. క్రి. చచ్చు.
బిద్దె. నగకము [యొకానొకజాతి.?
బిద్దెమువాఁడు. ఆటపలన జీవించెడు
బిబ్బడించు. అ. క్రి. (పులి) కూయు.
బిబ్బరింత. పులికూఁత.

బిబ్బిలికాయ. ఆఁడుదాని కాలి మూడవ వ్రేలి యాభరణము. [స్త్రీ.
బిబ్బి. తోరణము; తురుష్కులయంతఃపుర
బిబ్బికడుపువేల్పు. వినాయకుడు.?
బిబ్బోకము. సం. నాయికకు గర్వాతిశయముచేత ఇష్టవస్తువునందైన యు కలిగెడు అనాదరము, స్త్రీలయొక్క ఒక శృంగారచేష్ట.
బిభీషిక. సం. భయప్రదర్శనము, బెదరింపు.
బిమ్మిటి. మనోవ్యథ; వివశత; సంకోచము. విణ. వివశము.
బిమ్మిటిగొను } అ. క్రి. వివశత్వము
బిమ్మిటిపోవు } నొందు; మూర్ఛిల్లు.
బియ్యము. తండులము, నిస్తుషధాన్యము.
బిరడ. తంబుర మొదలగువాని తీఁగెలు చుట్టెడు తతిమెనకొయ్య; టెంకాయ బుర్ర మొదలగువాని మూతికి వేసెడు తతిమెన కొయ్యతునుక మొ.
బిరబిర } ద్ర. క్రి. విణ. అతిశీఘ్రముగ.
బిరాన }
బిరికీలు. మెడను కట్టుకొనెడు భూషావిశేషము.
బిరుదము. సం. సామర్థ్యచిహ్నము.
బిరుదరి. } విణ. బిరుదుగలవాఁడు.
బిరుదాయత్తు }
బిరుదు. శూరలాంఛనము; సామర్థ్యచిహ్నము; ప్రతిజ్ఞ. విణ. సమర్థుఁడు; శూరుఁడు; సమర్థము.
బిరుదులాఁడు. విణ. ప్రతిజ్ఞావంతుఁడు.
బిరుసు. కాఠిన్యము. బ. బిరుసుగ్రోవి. విణ. కఠినము.
బిరుసుగ్రోవి. ఒక దినుసు బాణసంచు.
బిఱబిఱ. రూ. బిరబిర.
బిఱాన }
బిఱీన } ద్ర. క్రి. విణ. అతిశీఘ్రముగా, రఘుటిత్యర్థకము
బిఱీలున }
బిఱుబిఱ్ఱు. డోలు మొదలగువాని పఠాట యందగు ధ్వన్యనుకరణము.
బిఱుసు. కాఠిన్యము. బ. బిఱుసుగ్రోవి. విణ. కఠినము.
బిఱ్ఱు. బిగువు; దృఢము.
బిఱ్ఱబిగియు. అ. క్రి. మిక్కిలిబిగిసికొను.
బిఱ్ఱు. వేగము; తడిక బిగువుగా నిలుచుటకై దారముగట్టి ఈడ్చి ఆనించెడు కొయ్య; ఉద్ధతి. అక్రి. బిరుసగు. విణ. ఉద్ధతము; దృఢము.
బిలకము. సం. పల్లిక. [స్రవము.
బిలము. సం. రంధ్రము; గుహ; ఉచ్చ
బిలమెట్లు. బ. ఒకతరహా చెప్పులు.
బిలిబిలి. ముద్దుముద్దు.
బిలుకుమార్చు. స. క్రి. చంపు.
బిలుకురు. ఉడ్డుగుడుచు.
బిలువము. బిల్వము†.
బిలేశయ. సం. ఊడుము; ఏదుపంది.
బిలేశయము. సం. ముంగిస; పాము; ఎలుక.
బిలుక్కుమార్పు. హింస.
బిల్మక్తా. హిం. మొత్తమునిచ్చు గుత్త.
బిల్ల. పలుచని గుండ్రని వస్తువు; గుండ్రపు తలగడ; ఖండము; నీచజాతివారి కర్ణభూషావిశేషము; (సూర్య చంద్రుల) బింబము; కపిలెరాట్నము; త్రాళ్ళుపని వాఁడు దిండున కంటించెడు చక్రము; మెడ మొదలగుచోట్లయందు గుండ్రముగా లేచెడు నెత్తురుగడ్డ. విణ. గుండ్రనిది.
బిల్లకట్టు. అ. క్రి. మెడ మొదలగుచోట్ల యందు నెత్తురుగడ్డకట్టు.
బిల్లకఱ్ఱలు. బ. తమలపాకుల నుండెలకు క్రిందనుమీఁదనుసంతన చేసికట్టెడుకఱ్ఱలు
బిల్లగోళ్ళు. బ. బాలక్రీడావిశేషము.
బిల్లచెప్పులు. బ. తోలుబిల్లల కుచ్చులమర్చిన చెప్పులు.
బిల్లవాలు. చక్రాయుధము.
బిల్లి—క. సూర్యచంద్రుల బింబము.
బిల్లు. శాసనము.
బిల్వపత్తిరి } మి. బిల్వదళము.
బిల్వపత్రి }
బిల్వబిద్దెము. బాలక్రీడావిశేషము.
బిల్వము. సం. మారేడుపండు; మారేడు†; పలమెత్తు.
బిస. యం. తపు కీలు; యంత్రము; ఏతపు మానుక్రింది యరభాగము.
బిసకంఠిక. సం. పెద్ద పెంటికొక్కెర; పెంటికొక్కెర.
బిసజము. సం. పద్మము.

బిసప్రసూనము. సం. పద్మము.
బిసబిస. వేగము. [తీఁగ.
బిసము. సం. తామరతూఁడు; తామర
బిసరుహము. సం. పద్మము.
బిసాతు. హిం. శక్తి; బలము.
బిసి. తడికకు కట్టెడి బిట్టు.
బిసిని. సం. తామరతీఁగ; తామరకొలను; తామరతంపర.
బిసిబిసి. విశే. లగువుబిగువుగలది.
బిసివోవు. అ.క్రి. పట్టువదలు.
బిస్త. నరకము.
బిస్తము. సం. కర్ష మెత్తుబంగారు, మాడ.
బిస్తి. హిం. నీళ్ళు తెచ్చెడి తోలు సంచి.
బిస్సు. వేగమునందగు అనుకరణము.
బిళ్ళ. బిల్ల, పలుచని గుండ్రని వస్తువు.
బిళ్ళకట్టులు. బ. బిల్లకట్టులు.
బిళ్ళకుడుములు. బ. మోదకవిశేషములు, బిళ్ళలుగానుండెడి కుడుములు.
బిళ్ళదున్న. ఋశ్యమృగము.
బిళ్ళు. సోధకము†.

## బీ

బీఁట. పగులు.
బీఁటగిలు(ల్లు) } అ. క్రి. పగులువాఱు,
బీఁటలువాఱు } భేదిల్లు.
బీఁటలువోవు }
బీఁటిక. పగులు, భూమి మొ॥ పగులుట.
బీకము. ఊఁదదగు వాద్యవిశేషము.
బీకర. బీఱ†.
బీగము. తలుపు మొదలగువానికి వేసెడు త్రాళము; తాళపుచెవి.
బీజకోశము సం. తామరదుద్దు.
బీజపూరము. సం. మాదిఫలము†.
బీజము. సం. గింజ, విత్తు; విత్తుట; వృషణము; రేతస్సు; కారణము; బలము.
బీజాకృతము. సం. విశే. విత్తి దున్నిన పొలము. [పుట్టినవాఁడు.
బీజ్యుఁడు. సం. విశే. గొప్పవంశమునందు
బీటినేల. చిరకాలమునుండి దున్నక నిలిపిన పొలము.
బీటినరులు. బ. ధాన్యవిశేషము.

బీడు. దున్నని భూమి; మట్టమైనయినుము. విశే. నికృష్టము.
బీతు. భయము.
బీతుకొను. అ. క్రి. భయపడు.
బీతుకొలుపు. ప్రే. భయపెట్టు.
బీద. విశే. భయము నొందినది; అకించనుఁడు; దరిద్రుఁడు; దరిద్రురాలు.
బీదతనము. దారిద్ర్యము.
బీదలపెనుబాధ. వాయువు.
బీదవాఁడు విశే. దరిద్రుఁడు.
బీభత్సము. సం. ఒక రసము. విశే. వికృతము; రోఁతగలది; నిందితము; క్రూరము; పాపము గలది.
బీభత్సుడు } సం. విబ్బచ్చుఁడు, అర్జునుఁడు.
బీభత్సువు }
బీమా. హిం. కొంతద్రవ్యము నిచ్చుట కొడఁబడు ఒక పద్ధతి, ఇన్సూరెన్సు.
బీర బీఱ†.
బీరగాఁడు వీర్యవంతుఁడు; బలశాలి.
బీరనరము. పీతనాడి
బీరము. వీరరసము; వీర్యము; గర్వము.
బీరాఁజు. స.క్రి. తుడిచి కుప్పచేయు.
బీరిఁగు. ఇం. విశే. నటుపెద్దు.
బీరిజేము. వృషణము.
బీరు. ఇం. ఒక విధమైన సారాయి.
బీరువ. అంతస్తుఅంతస్తుగా అడ్డపలక లమర్చిన నిలువుపెట్టె.
బీఱ. ఒక చెట్టు; ఒక తీఁగె. విశే. పెద్ద, అతిశయమైనది.
బీఱు. విశే. వ్యర్థము.
బీఱువడు } అ. క్రి. వ్యర్థమగు; బలహీనమగు; భంగపడు.
బీఱువాఱు }
బీఱువోవు }

## బుం

బుంగ. చిన్నమూతి గల కుండ; -తాటాకులతో అల్లిన పండ్లు మొ॥ కట్టెడు చిన్నబుట్ట; కంట్లములో సగము.
బుంగనామము. నడుమ ఎడము లేక తీర్చిన తిరుమణి
బుంద్రము. గుడ్లగూబ.

బుక్క. పిష్టాతకము, వస్త్రములకు వాసన గట్టెడి గందవొడి.
బుక్కనము. సం. కుక్కయొక్క మొఱుగు
బుక్కము. సం. శ్రౌతమునందు ప్రసిద్ధమైన మాంసము. [బుక్క.
బుక్కా. పెండ్లిండ్లలోఁ జల్లుకొనునది;
బుక్కాపకీరు. హిం. నిరుపేద.
బుక్కాము. పుప్పొడి; బుక్క.
బుక్కావాఁడు కుంకుమము గందవొడి మొ॥ యమ్మువాఁడు.
బుక్కు. ఇం. పుస్తకము.
బుగడ. ఆఁడువారు కొనచెవిని ధరించెడి భూషావిశేషము. [ధ్వన్యనుకరణము.
బుగబుగ. బుగులుకొనుటయందగు
బుగులు. గుబులు.
బుగులుకొను. అ. క్రి. గుబులుకొను; చిప్పిలు; విజృంభించు; వ్యాపించు.
బుగులుపుచ్చు. క్రే. బయలుపఱచు.
బుగులుపోవు. అ. క్రి. బయలుపడు; ప్రకాశితమగు. [ధ్వన్యనుకరణము.
బుగులుబుగులు. క్రక్కుటయందగు
బుగ్గ. తాలువు, చెక్కిలి; బుద్బుదము, నీటిబుడ్డ; పర్వతాదులయందుండి సంతతధారగా పైకుబికి వచ్చెడు నీరు.
బుగ్గి. బూడిద; ధూళి; మన్ను.
బుచ్చి. విణ. అల్పము, చిన్న.
బుచ్చిగాఁడు. విణ. చిన్నవాఁడు.
బుచ్చివాఱు. అ.క్రి. చిన్నపోవు.
బుజే. కుండలీకరణము, సున్న; భుజము.
బుజేపత్తిరి. భూర్జపత్రము†. రూ. బుజపత్రి.
బుజేము. భుజము. [యుఁడు.
బుజేముపుట్టువు. బాహుజుఁడు; క్షత్రి
బుజ్జగము. బుజ్జగింత.
బుజ్జగించు. స.క్రి. ఉపలాలించు, ఓదార్చు.
బుజ్జగింత, బుజ్జగింపు } ఉపలాలనము; బుజ్జగించుట; సాంత్వనము.
బుజ్జగింపుమాట. సాంత్వనవాక్కు.
బుజ్జవము. బుజ్జగింత.
బుటా. హిం. వస్త్రములమీఁద నేయుపూవు
బుటుకు, బుటుక్కు } మునుఁగుటయందగు ధ్వన్యనుకరణము.

బుట్ట, బుట్టిక } నారలతోఁగాని వెదురుబద్దలతోఁగాని, తాటాకులు మొదలగువానితోఁగాని అల్లినది.
బుట్రేవు. గుడ్లగూబ.
బుడక. స్నానము.
బుడకోడి. నీరుకోడి.
బుడగ. బుగ్గ; బుద్బుదము.
బుడబుడ. చెంబు మునుఁగుట నీళ్ళనుండి వెడలుట మొదలగువానియందగుధ్వన్యనుకరణము. [బ. వా. వ్రీహిభేదము.
బుడమ. ఒకదోస, మృగోర్వారువు†.
బుడము. మొదలు.
బుడికిస్సు. బాలక్రీడావిశేషము.
బుడిగ. ఎద్దుమీఁది యొకవైపు సిద్దె; పిడత. రూ. బుడిగె.
బుడిగి. విణ. పొట్టి.
బుడిపి. పోటుచేత దేహము నందు ఉబ్బుగా లేచెడుబొప్పి; చెఱకు మొదలగువానికణుపు; వ్రానియందలిముడి; బుడ్డి
బుడిబుడి. తొట్రుపాటు. విణ అల్పము.
బుడిబుడుక్క. ఉడుక.
బుడివడు. అ క్రి. తొట్రువడు.
బుడుక. మునుక.
బుడుకు. భక్ష్యవిశేషము.
బుడుగు. విణ. పొట్టి.
బుడుతఁడు. బిడ్డ; బాలుఁడు. విణ. పొట్టి.
బుడుతనెలతాల్పు. ఖండేందుశిఖుఁడు, శివుఁడు.
బుడుబుడుక్క. డుబుడక్క. [వాఁడు.
బుడుబుడుక్కలవాఁడు. డుబుడక్క
బుడుమలు. వ్రీహివిశేషము.
బుడ్డ. కురండము, అండవృద్ధి; నీరుబుగ్గ.
బుడ్డకాఁకర. ఒకకాఁకర†. [కోరాడు.
బుడ్డగించు. అ. క్రి. పంది ముట్టెతో
బుడ్డగింపు. బుడ్డగించుట.
బుడ్డపక్కె. మత్స్యవిశేషము.
బుడ్డపిడుఁదు. పశువులకు పట్టెడు ఒక దినుసు పిడుఁదు.
బుడ్డబుడుసర. ఓషధీవిశేషము.
బుడ్డవాఁడు. విణ. అండవృద్ధిగలవాఁడు.
బుడ్డిగ. చిన్నమూతిగల నిడుపాటి కాచపాత్ర విశేషము; చిన్నమూతి కుండ.

బుడ్డిచెంబు చిన్న చెంబు.
బుడ్డితపేల. చిన్న తపేల.
బుడ్డిపిడత. చిన్న పిడత.
బుడ్డిముంత. చిన్న ముంత
బుడ్పి. రూ. బుడిపి.
బుత్త. ఆఁడుగుఱి.
బుత్తి. భుక్తి, భోగము.
బుదువారము. వా. బుధవారము.
బుదుఁడు. బుధగ్రహము.
బుదువారము. బుధవారము ?
బుద్ది బుద్ధి, తెలివి.
బుద్దిమెకము. నక్క.
బుద్ధము. సం. విణ. తెలియఁబడినది; జ్ఞాన స్వరూపము.
బుద్ధి. సం. అంతఃకరణ వృత్తులు నాలుగింటిలో రెండవది. (పండ, మేధ, చార్వి, గృహీతి, (శౌతి, చత్వారి అని యిది ఆఱు విధములుం గలది.)
బుద్ధిగుణములు. సం. బ. శుశ్రూష శ్రవణము శ్రవణము గ్రహణము ధారణము ఊహము అపోహము అర్థవిజ్ఞానము తత్త్వజ్ఞానము అని యెనిమిది. [షుఁడు.
బుద్ధిమంతుఁడు. సం. విణ. బుద్ధిగల పురు
బుద్ధిమతి. సం. బుద్ధిమంతురాలు.
బుద్ధుఁడు. సం. బుద్ధదేవుఁడు; విద్వాంసుడు. విణ. తెలియఁబడినవాఁడు.
బుద్బుదము. సం. బుడగ; ఒక గర్భావస్థ.
బుధప్రకాశము. (బుధునకు మిక్కిలి ప్రకాశము గలిగిన జగము చీఁకటి యగును) మరల కనపడకపోవుట.
బుధప్రియము. సం. మరకతరత్నము.
బుధవారము. సం. ఒకవారము.
బుధితము. సం. విణ. తెలియఁబడినది.
బుధుఁడు. సం. బుధగ్రహము; పండితుఁడు; దేవత.
బుధ్నము. సం. చెట్టు వేరు; ఊడ.
బుధ్నుఁడు. సం. శివుఁడు.
బుబ్బుదము. బుద్బుదము.
బుభుక్ష. సం. ఆఁకలి, భుజింప నిచ్ఛ.
బుభుక్షితుఁడు, బుభుక్షుకుఁడు } సం. విణ. ఆఁకలిగొన్నవాఁడు. రూ. బుభుక్షువు.
బుభుత్స. సం. తెలియఁగోరిక.
బుమోజా. శర్కరాభేదము.
బుయ్యా. ఆఁడుగుఱి.
బుయ్యారము. చెఱసాల.
బురక. విణ. వామనుఁడు; పొట్టిది.
బురకఁడు. పుత్రుఁడు.
బురకా. హిం. గవిసెన; ముసుఁగు.
బురజలు. బ. మువ్వలు, చిఱుగజ్జియలు.
బురడా అసత్యము.
బురణించు. తిరస్కరించు ?
బురద. అడుసు.
బురదకమ్మి. కడపక్రిందికమ్మి.
బురదగుంట. గేదెలు మొ॥ పొర్లు బాడిగుంట. [పాలము.
బురదదుక్కి. ఊడ్చుటకు సిద్ధము చేసిన
బురదపాము. నీరుపాము.
బురబుర. మజ్జిగ మొదలగునవి పులియునపుడు శరీరమందు దెబ్బతగులునప్పుడు కలిగెడుపొంగు; పొంగుటయందగు అనుకరణము.
బురమా. పిడిసాన.?
బురికి. వామనుఁడు.
బురుంజా. బురుజు.
బురుక. బిడ్డ. విణ. వామనము, పొట్టిది; గుఱ్ఱముతల యందుండెడు తుగాయి.?
బురుకఁడు. బిడ్డఁడు; కోఁటకుక్క. విణ. పొట్టివాఁడు; చిన్నపిల్లవాఁడు.
బురుజా. హిం. సాలావయవము, కోట గోడయందుండు దిబ్బ. బ. మూలకొత్తళములు.
బురుడా. అసత్యవచనము. రూ. బురుడు.
బురుడుఁడు. సం. మేదరవాఁడు.
బురుద. పంకము?
బురుమా. బరమా.
బురుసా. ఎఱ్ఱపట్టు; పట్టు.
బుఱుసు. ఇం. పెండ్రుకలకుంచె.
బుఱటకొమ్ము. చిమ్మనగ్రోవి.
బుఱ్ఱ. కొబ్బరకాయ మొదలైనవాని గుల్ల; ఎండిన సొరకాయ; వీణె మొదలగువానికాయ; పాములవాని నాగసరము; తలపుఱ్ఱె. విణ. పెద్ద. [కత్తి
బుఱ్ఱకత్తి. చెట్లకొమ్మలు నఱకెడు కోట

బుజ్జకాయ. సొరకాయ కమండలువు
బుజ్జకొమ్ము. చిమ్మనగ్రోవి.
బుజ్జగుంజు. డొక్కబుజ్జలోని కొబ్బరి.
బుజ్జటకొమ్ము. చిమ్మనగ్రోవి.
బుజ్జజింక. బుజ్జముక్కుగల జింక.
బుజ్జతలము. బుజ్జయేఁతము.
బుజ్జపిట్ట. పారావత విశేషము.
బుజ్జబాడిస జాళ్లు చెక్కెడు బాడిస.
బుజ్జముక్కు. పెద్దరంధ్రములంగలముక్కు
బుజ్జముక్కువాఁడు. విణ. ఖురణసుఁడు.
బుజ్జి. తలపియావు. [కరణము.
బుజ్జు. పక్షి ఎగురుట యందగు ధ్వన్యను
బులాకి. హిం. నాసాభరణము, ముక్కు
క్రింద నుంచుకొను ఆభరణ విశేషము.
బులియు. అ. క్రి. సుఖించు.
బులుపు. సుఖము; విలాసము, వేడుక.
బుల్లి. మగగుజి.
బువి. భువి, నేల.
బువ్వ. అన్నము.
బువ్వకుడుపు. అన్నప్రాశనము.
బువ్వము— బంతి వివాహమున నాలు
గవనాటి రాత్రి బంధువులయిన మగ
వారు ఆఁడువారు అందఱును ఒకటిగా
కూర్చుండి వేడుకగా భుజించుట.
బుషము. సం. బుసము.
బుస. పాము మొదలైనవాని ఫూత్కా
రము; నిశ్శ్వాసము [కొట్టు; నిట్టూర్చు.
బుసకొట్టు. అ. క్రి. పాము మొ|| బుస
బుసకొట్టుపుట్టువు సర్పము.
బుసబుస. నీళ్ళుపొంగుట మొదలగువాని
యందగు ధ్వన్యనుకరణము.
బుసబుసలాడు. అ. క్రి బుసపెట్టు.
బుసము. సం. ఊక; పెసర మినుము
మున్నగువాని కాఁడ పొట్టు పొల్లు
మొ||; మీఁగడతీసిన పెరుగు;? పిడక.?
రూ. బూసము.
బుసి. నిగులు; ధాన్యముమీఁది పొట్టు.
బుసిపోవు. అ. క్రి. చెడు; భంగపడు.
బుసుకుజొన్న. ఒకదినుసుజొన్న†.
బుస్తము. సం. వేఁచినమాంసము; పనస
మున్నగు పండ్ల చెత్త.
బుస్సు. పాము మొ|| బుసకొట్టుటయం
దగు ధ్వన్యనుకరణము.

## బూ

బూంది. ఒకదినుసు తినుబండము.
బూఁజము. పిశాచము.?
బూఁజు. ఎండసోఁకమిచే తడివస్తువుల
మీఁదఁగలుగు కొంచెముమాసిన తెలుపు.
బూఁజుగులు. అయిరేని.
బూఁజుపట్టు. అ. క్రి. బూఁజుగలదియగు.
బూఁదు. బూఁజు.
బూఁదుపారు. అ. క్రి. బూఁజుపట్టు.
బూక. విణ. బూటకము, మాయ.
బూగర. తమిఁదలు మొదలగు ధాన్యముల
మీఁదిపొట్టు; ఇండ్లవాసములకుఁబట్టెడు
బూసి.
బూగరమండె. నూర్చిన వరి రాశి.
బూగరరాశి. మి. నూర్చిన జొన్నల రాశి.
బూచి. భూతము. [కియ్యఁబడిన పేరు.
బూచిగాఁడు. బూచివలెనుండుటచేతుక్కు
బూచివాఁడు. బూచి.
బూచికన్నులకచ్చె. బాలక్రీడావిశేషము.
బూచెము. భూతము.?
బూమేలయెకిమీఁడు } భూతేశుఁడు,
బూమేలజేఁడు } శివుఁడు.
బూటకము. మాయ; వంచన; అబద్ధోక్తి.
బూటకీఁడు } విణ. మాయావి; వంచ
బూటకుఁడు } కుఁడు.
బూడిద. భస్మము; గోమయ భస్మము;
పిడక కచ్చికల భస్మము.
బూడిదగుమ్మడి. పెండ్లిగుమ్మడి†.
బూడిదపండు. విభూతియుండ.
బూడిదపన్ను. శ్మశానమునందు శవమును
కాల్చుటకై యిచ్చెడుపన్ను.
బూడిదె. బూడిద, విభూతి.
బూద్ద. బూడిద.
బూడ్డి. బూడిద.?
బూతనాదుఁడు. భూతేశుఁడు, శివుఁడు;
కుక్కకియ్యఁబడిన పేరు.
బూతపిల్లి. పూతిక.
బూతము. భూతము, పిశాచము; ప్రాణి.

బూతాటము. బూతులాడుట.
బూతి. బూది; తిండి.
బూతు. పలువమాట; పలువతిట్టు; పలువ తిట్టు తిట్టువాఁడు.
బూతులు. బ. స్తుతి పాఠకులు.
బూద. సొలకండె.
బూది. భూతి, బూడిద.
బూదిచఱచు. అ.క్రి. బూజుపట్టు.
బూదె. చతుర్దశీతిథి; శివరాత్రి.
బూబు. హిం. తురకస్త్రీ.
బూమి. భూమి. [కపటము.
బూమియ. మాఱువేషము; మాయ; వంచన,
బూమె. బూమియ; అబద్ధోక్తి.
బూమెకత్తియ, బూమెకత్తె } విణ. బూమెలుగలది.
బూమెకాఁడు. విణ. బూమెలుకలవాఁడు.
బూమెలాఁడి. విణ. బూమెకత్తె.
బూమెలాఁడు విణ బూమెకాఁడు.
బూర. వాద్యవిశేషము. విణ. స్థూలము.
బూరఁడు. విణ. విజృంభించినవాఁడు.
బూరకాలివాఁడు. విణ. ఏనుఁగు కాలివాఁడు
బూరకాలు. ఏనుఁగుకాలు.
బూరగ. నాగసరమునకు సుతియిచ్చెడు వాద్యవిశేషము; తార.
బూరగడ్డి. తృణవిశేషము.
బూరగొమ్ము. శృంగము, కొమ్మువలె వంకరగా నుండు వాద్య విశేషము; శంఖము. [కృష్ణుఁడు.
బూరగొమ్ముతుపాసి. శంఖి, విష్ణువు,
బూరట. ఉల్బణము.
బూరటించు. ప్రే. బూరటిల్లఁజేయు.
బూరటిలు(ల్లు). అ. క్రి. ఉబ్బు; నిండు.
బూరదిప్పకాయ. భక్ష్యవిశేషము.
బూరా. బూర.
బూరియ. బూరె.
బూరుగ. బూర. వా. బూరుగు†.
బూరుగు. శాల్మలి†.
బూరుగుదీవి. శాల్మలద్వీపము.
బూరుగుదూది. శాల్మలీతూలము.
బూరువు. బూరుగు†.
బూరె. భక్ష్యవిశేషము.
బూరెలమూఁకుడు. బుజీషము, పిండి వంటలు వండుటకు ఉపయుక్తమగు లోహపాత్ర విశేషము. రూ. బూర్లె మూఁకుడు.
బూర్ణిసు. గ్రా. మెత్తని కంబళి.
బూలి. శేఁత త్రాటిమానిలోని పేడు; నిస్సారము.
బూలి. విణ. నిస్సారమైనది.
బూసము. సం. బుసము. [పట్టు.
బూసి. ఇండ్ల వాసములకు పట్టెడు సాలె

## బృ

బృంద. సం. తులసి†; రాధాదేవి.
బృందము. సం. సమూహము.
బృందారకుఁడు. సం. దేవత. విణ. సుందరుఁడు; శ్రేష్ఠుఁడు.
బృందావనము. సం. తులసీవనము; శ్రీ వైష్ణవ క్షేత్రవిశేషము, రాధాకృష్ణుల క్రీడా భూమి; గోలోకమందలి పరమ ధామము. [మయినది,
బృందిష్ఠము. సం. విణ. మిక్కిలి మనోజ్ఞ
బృంహితము. సం. గీఁక, ఏనుఁగు ఘీంకారము.
బృసి. సం వ్రతుల ఆసనము. రూ. బృషి.
బృహతి. సం. వాఁకుడు†; ములక†; ఒక ఛందస్సు; ఉత్తరీయము; విశ్వావసుని వీణ. విణ గొప్పది.
బృహతిక. సం. ఉత్తరీయము; బృహతి.
బృహత్కుక్షి. సం. విణ. పెద్దకడుపు వాఁడు. [బ్రహ్మము.
బృహత్తు. వా. బుడ్డ. సం. విణ గొప్పది;
బృహత్ఫలువు. సం. పెద్దవరగోఁగు†
బృహదెల సం ఏల. పెద్దయేలకి†
బృహద్బీజము. సం. అండవృద్ధి; అంబాళము†.
బృహద్భానువు(ఁడు). సం. అగ్ని.
బృహద్రథుఁడు. సం. ఇంద్రుఁడు.
బృహన్నల. సం. అజ్ఞాతవాసములోనున్న అర్జునుని మాఱుపేరు. రూ. బృహన్నలుఁడు.
బృహన్నలము. సం. పెద్దకిక్కసి†.
బృహన్మరీచము. సం. మిరెపకాయ

మగులు. గోడమీఁది కప్పు. [గోడ.
మగులుగోడ. మగులు పెట్టినగోడ, కప్పుపై
మగువ. స్త్రీ.
మగ్గపుగుంత. సాలెవాఁడు నేయుటకుఁ గూర్చున్నప్పుడు కాలు చాఁచుకొనెడు పల్లము.
మగ్గము. సాలెవాఁడు నేసెడుయంత్రము.
మగ్గరి. సాలెవాఁడు.
మగ్గు. అ. క్రి. ఉక్కచే చెమ్మగిల్లిచెడు.
మగ్గుడు. మగ్గుట.
మగ్గుడుపాఱు. అ. క్రి. మగ్గు.
మగ్దూరు. హిం. అధికారము; శక్తి.
మగ్నము. సం. విణ. మునిఁగినది.
మగ్నుఁడు. సం. విణ. మునిఁగినవాఁడు.
మఘ. సం. ఒకనక్షత్రము. [యజ్ఞము.?
మఘము. సం. ఒక దీవి; ఒక పూవు;
మఘవంతుడు. సం. ఇంద్రుఁడు.
మఘవగోపము. సం. ఇంద్రగోపము.
మఘవుఁడు. సం. ఇంద్రుఁడు.
మఘి. సం. మొక్కజొన్నలు.
మఘోని. సం. శచీదేవి.
మచర్చిక. సం. శ్రేష్ఠవాచకము.
మచ్చిక. ప్రేమ, మోహము; కాంక్ష; ఉపలాలనము. వా. మచ్చికె.
మచ్చికపడు. అ.క్రి. మరులుకొను; మరగు.
మచ్చిగ. రూ. మచ్చిక.
మచ్చెకంటి. మత్స్యాక్షి, చేఁపలవంటి కన్నులుగల స్త్రీ; స్త్రీ.
మచ్చెము. మత్స్యము, చేఁప.
మచ్చ. తిలకము, పుట్టినపుడే దేహము నందుఁ గలిగిన నల్లని (ఎఱ్ఱని) యెఱ్ఱని చుక్క; గాయము మొదలైనవి మానిన పిమ్మట దేహమునం దేర్పడెడు గుఱుతు, కిణము.
మచ్చుమాయు. అ క్రి. నశించు.
మచ్చుము. గుఱుతు.
మచ్చరము. మత్సరము; ద్వేషము.
మచ్చరి. ద్వేషి; చోరుఁడు; మాత్సర్య శీలుఁడు. [ర్యము నొందు.
మచ్చరించు. అ. క్రి. ద్వేషించు; మాత్స
మచ్చరికము. మాత్సర్యము; ద్వేషము; పోటి.
మచ్చరికించు. రూ. మచ్చరించు.
మచ్చరీఁడు. విణ. మత్సరము కలవాఁడు.
మచ్చువెన్నుఁడు. పార్థుఁడు, అర్జునుఁడు.
మచ్చు. మీఁద కట్టడములేని మిద్దెటిల్లు; చొక్కపొడి; మృగాదులు వలలోఁ దగులుకొనుటకై వలను సమీపమున నుంచఁబడు ఆహారము, ప్రలోభనము; వన్నె సరిగానున్నదని చూచుకొనుటకై యగసాలెవాఁ డిచ్చెడు వెండి బంగారముల కమ్మి. బ. వన్నె యొరసి పరీక్షించుటకై యగసాలె మొదలగు వారుంచుకొనియుండెడు వెండి బంగారముల కమ్ములు.
మచ్చుకత్తి. కొమ్మలునరికెడు మోటకత్తి.
మచ్చము. సం. చేఁప. [చెప్పిన, ఈ.
మజుకూరు. అదీనవము. హిం. పైన
మజుబతు. హిం. విణ. గట్టి.
మజూరి. హిం. దినపుకూలి.
మజ్జ. సం. చెట్టుచేవ; ఎముకల యందలి నేయి, కొవ్వువంటి పదార్థము.
మజ్జన బావి. స్నానము చేయు బావి.
మజ్జనము. సం. మునుఁగుట; స్నానము.
మజ్జిగ. చల్ల, తక్రము.
మజే. } మజో. } మజ్జే. } అవ్య. ప్రశంసను తెలుపునది.
మజ్జెరి. చక్కని రూపమును మంచి ప్రాయమును గలిగి సమృద్ధిగ పాలిచ్చెడు యావు.
మజ్జెరె(రే) } మజ్జా } మజ్జారె(రే) } అవ్య. మజో, ప్రశంసార్థకము. రూ. మజ.
మటమట. రూ. మలమల.
మటమటలాడు. అ.క్రి జ్వలించు, మండు.
మటిక. గోరుచిక్కుడు†.
మటుమాయ—ము. మిక్కిలిమాయము.
మటుమాయకాఁడు } మటుమాయలాఁడు } విణ. మిక్కిలి మాయగలవాఁడు
మట్ట. కొబ్బరిచెట్టు తాటిచెట్టు మొదలగు వాని కొమ్మ; ఆవులు మొదలగువాని తోఁక.

మట్టగించు. స. క్రి. తగ్గించు; అడఁచు
మట్టగిడుసు. మత్స్యభేదము.
మట్టపలక. మట్టముచూచెడు పలక.
మట్టమధ్యాహ్నము. మి. పట్టపగలు.
మట్టము కొలఁది. విణ. తక్కువ; పొట్టి; సమము.
మట్టసము. విణ. కుఱుచైనది; పరిమితము.
మట్టసి. విణ. పొట్టివాఁడు. [వ్యాపించు.
మట్టాడు. అ. క్రి. నడచు; సంచరించు;
మట్టి. మృత్తిక.
మట్టిక. గోరుచిక్కుడు†.
మట్టితైలము. మి. మట్టివలన దీసెడునూనె
మట్టియ. మట్టె; మగవాని కాలి రెండవ వ్రేలిమించు బ. ఆఁడుదాని కాలి రెండవ వ్రేలిమెట్టెలు.
మట్టు. త్రొక్కుడు; కుదురు; ప్రదేశము; మితి; పర్యంతము. స. క్రి. త్రొక్కు విణ. తక్కువ; మితము.
మట్టుకాఁకర. కర్కోటిక†.
మట్టుకొను. అ. క్రి. కుదురుకొను ప్రే. మట్టుకొలుపు.
మట్టుచేయు. స. క్రి. తగ్గించు.
మట్టుపడు. అడఁగు అ. క్రి. కుదురపడు. ప్రే. మట్టుపఱుచు.
మట్టుపెట్టు. స. క్రి. చంపు.
మట్టుబచ్చలి. దుంపబచ్చలి, ఉపోదక†.
మట్టుబీఱ. ఒక దినుసుబీఱ†.
మట్టుమిగులు. } అ. క్రి. అతిక్రమించు.
మట్టుమీఱు. }
మట్టె. మగవాని కాలిరెండవవ్రేలిమించు బ. ఆఁడుదాని కాలిరెండవవ్రేలిమెట్టెలు విణ. బట్టచాఱలుగలది.
మట్రె. దున్నునపుడు కొంగ్రతిరుగక నడుమ నిలిచెడు కొంచెము తావు.
మఠము. సం. దేవగృహము;సంన్యాసులు మొదలగువారు ఉండెడుచోటు.
మఠ్యము. సం. తాళభేదము, పదిమాత్రల కాలము.
మడ. ప్రవాహమార్గము.
మడఁక. మడుపు; అరక.
మడఁగు. అ. క్రి. వంగు; మరలు.
మడఁచు. ప్రే. మడఁగఁజేయు.

మడఁతి } స్త్రీ.
మడఁతుక }
మడఁది. స్త్రీ, మడఁగియుండునది.
మడకత్తి. లావుకత్తి.
మడచెట్టు. ఒకానొకచెట్టు.
మడత. వళి, (వస్త్రపు) మడపు; (కడుపు మీఁది) మడుపు; భక్ష్య విశేషము.
మడత్రొక్కు. స. క్రి. తాటాకులుదొంతిగా అణఁగఁద్రొక్కు
మడమ. గుదికాలు, పార్ష్ణి.
మడవ. మళ్ళకు పాదులకు నీళ్లుపాఱెడు కాలువముఖము.
మడవచేఁప. మత్స్యవిశేషము.
మడవు. అ. క్రి. విముఖమగు; నిష్ఫలమగు
మడి. ధౌతవస్త్రము, మడుఁగుబట్ట; కేదారము, వరిపొలము; చౌకపుపాదు; శుద్ధి విణ. పరిశుద్ధము; వృత్తియందు ఉత్తర పదమైనమడుఁగు శబ్దమునకు ఆదేశముగా వచ్చెడి రూపము. (ఇనుమడి, ముమ్మడి యని.)
మడికాసు. వెండి, రజతము
మడికాసుగట్టు కైలాసము, రజతాద్రి
మడికాసుమలజేడు. కైలాసాధిపతి, శివుఁడు.
మడిచేఱు వైష్ణవస్త్రీలు ముందుండి యెత్తి వెనుకకు చెక్కుకొను కోకచేఱు.
మడిపెసలు. బ. మడియందు పైరగు నల్ల పెసలు.
మడిమంచె-ము విణ. బలహీనము.
మడియఁడు విణ. మూఢుఁడు.
మడియాలు చాకలత.
మడియించు. స క్రి. చంపు.
మడియు. అ. క్రి. మరణించు, తునుఁగు.
మడివేలు. చాకలవాఁడు.
మడిసంచి మడుఁగు వస్త్రములుంచు కొనెడు సంచి.
మడిసంది. చంక.
మడుఁగు. గుణము, రెట్టి;హ్రదము;కొలను; పరిశుద్ధి; పరిశుద్ధవస్త్రము; ఎనిమిదిపీసెల కొలఁది;అడఁగువ. బ. ఆకుమడుపు.విణ. పరిశుద్ధము. అ. క్రి. అడఁగు; వంగు.

మడుఁచే. క్రి. మడుఁగఁజేయు.
మడుపు. మడత; మడుఁగువస్త్రము. బ. ఆకుచుట్టలు. స. క్రి. చంపు.
మడువు. రూ. మడుఁగు.
మడువులు. బ. ఆకుమడుపు.
మడ్గు. రూ. మడుఁగు.
మడ్డి. కిట్టము, నూనె మొదలగువానియందు అడుగున నిలిచెడు మురికి. విణ. మూఢుఁడు
మడ్డు. ఇనుపగుండు.
మడ్డుకత్తి. మచ్చుకత్తి, మోటకత్తి.
మడ్డువు. సం. గుమ్మెట, తుడుము.
మణఁగు రూ. మడఁగు.
మణి. సం. పచ్చలాయి మొ||; ముత్యము మొ||; ముంత; మనికట్టు; మేఁక మెడ చన్ను; మగవాని కామ చివర; సర్వవిశేషము.
మణికట్టు. మి. మణిబంధము.
మణికము. సం. కాఁగు, బాన.
మణికారుఁడు. సం. రత్నములను సానపట్టువాఁడు. [మణిగె.
మణిగ. అప్ర. మళిగ, దుకాణము. రూ.
మణిగణనికరము. సం. ఒక వృత్తము.
మణిగము. అధికారము.
మణిగాసనము. సన్న సున్నపు పూఁత.
మణితము. సం. కూకీపలుకు.
మణిపుష్పకము. సం. సహదేవుని శంఖము. [కలిపిన కవిత్వము.
మణిప్రవాళము. సం. రెండు భాషలు
మణిబంధము. సం. చేతి మణికట్టు.
మణిభిత్తు సం. వజ్రము, రవ్వ.
మణిరంజనము. సం. వర్ణపు రేకు.
మణివకాఁడు. విణ. అధికారి.
మణివము. అధకారము.
మణిసరులు. బ. ధాన్య విశేషము.
మణిసిల. కొండమీఁది యొకదినుసు, యెఱ్ఱమన్ను.
మణిహము. వాణిజ్యము.
మణుఁగు. రూ. మడుఁగు.
మణుఁగుఁబూలు. బ. జంతికెలలో భేదము, భక్ష్య విశేషము. రూ. మణుఁగుఁబువ్వులు.

మణుఁచే. క్రి. అణఁచు; వంచు.
మణువు. రూ. మడుఁగు.
మణేదారు. హిం. గ్రామవ్యవహారి.
మతంగజము. సం. ఏనుఁగు. [వాఁడు.
మతంగుఁడు. సం. ఒక ఋషి; మాదిగ
మతకము. మాయ; కపటము.
మతకరి. విణ. మాయావి.
మతము. సం. అభిప్రాయము; సమ్మతి; శాస్త్రము. విణ. సమ్మతము; తెలియఁబడినది; పూజింపఁబడినది. (త్రిమతములు—అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము — వైష్ణవము, మాధ్వము, స్మార్తము. షణ్మతములు — వైష్ణవము, శైవము, శాక్తము, గాణపతము, సౌరము, కాపాలికము.) [తాత్పర్యము,
మతలబు. హిం. విషయము, సంగతి.
మతల్లిక. సం. ప్రశస్తవాచకము, మిన్న.
మతాబు. చంద్రజ్యోతి.
మతి. సం. శాస్త్రచింతనాదులచేఁ గలుగు నర్థ నిర్ణయ జ్ఞానము; యిచ్ఛ; తలఁపు.
మతిమతి. సం. బుద్ధిమంతురాలు.
మతిమంతుడు. సం. బుద్ధిమంతుఁడు.
మత్కుణము. సం. నల్లి; నారికేళము†; కొమ్ములులేని యేనుఁగు. [మగవాఁడు.
మత్కుణుఁడు. సం. గడ్డము మీసములేని
మత్తకాసిని. సం. ఉత్తమ స్త్రీ.
మత్తము. సం. మదముపట్టిన ఏనుఁగు. విణ. మదముపట్టినది.
మత్తవారణము. సం. ఇంటిముంగిలి యావరణము; మదించిన ఏనుఁగు; ఒఱగుదిండు?; గావు తలగడ;? కటకటా.?
మత్తా. హిం. మత్తు.
మత్తాబు. చంద్రజ్యోతి.
మత్తాలంబము. సం. ఇంటిముంగిలి ఆవరణము; కటకటా.?
మత్తి. కామము.
మత్తికాఁడు. విణ. కాముకుఁడు.
మత్తిలు(ల్లు). అ. క్రి. మదించు, మత్తుగొను.
మత్తు. మంపు, మదము, గజాదిమదము.
మత్తుఁడు. సం. విణ. మదించినవాఁడు, *మత్తుగొన్నవాఁడు.

మత్సరము. సం. ఈర్ష్య, ఓర్వలేక పోవుట; క్రోధము. విణ. ఈర్ష్యకలది; క్రోధము గలది. [బెల్లము.
మత్స్యండి. సం. కండచక్కెర, పటిక
మత్స్యధాని. సం. మీలబుట్ట.
మత్స్యపిత్త. సం. కటుకరోహిణి†.
మత్స్యబంధనము. సం. చేఁపల గాలము.
మత్స్యము. సం. చేఁప; 56 దేశములలో నొకటి.
మత్స్యవేధనము. సం. చేఁపలగాలము.
మత్స్యాక్షి. సం. పొన్నగంటికూర; సోమెద కూర; మచ్చెకంటి.
మథనము. సం. త్రచ్చుట.
మథించు. సం. స. క్రి. త్రచ్చు.
మథితము. సం. నీళ్లు కలియని పెరుఁగు త్రచ్చిన మజ్జిగ. విణ. త్రచ్చఁబడినది; ఒరయఁబడినది.
మథుర. సం. మథురానగరము.
మదకలము. సం. మదపుటేనుఁగు. విణ. మత్తుచేత వ్యక్తముకాని మాటలుకలది.
మదట. విణ. మత్తము; మత్తుఁడు; మత్తురాలు.
మదనగంధులు. బ. ధాన్యవిశేషము.
మదనచేతులు. బ. దంతెలు.
మదనము. సం. ఆమని; ఉమ్మెత్త†; మంగ†; మయినము. [పిల్లి.?
మదని. సం. కస్తూరి; మద్యము; జవాది
మదనుఁడు. సం. మన్మథుఁడు.
మదపుటేనుఁగు. మత్తగజము.
మదమడఁచు. మి. స. క్రి. చంపు.
మదము. సం. క్రొవ్వు; ఏనుఁగుక్రొవ్వు; రేతస్సు; ఏనుఁగు రేతస్సు; కస్తూరి; గర్వము; సంతోషము. (త్రిమదములు — విద్యామదము, ధనమదము, కులమదము. అష్టమదములు — అన్నమదము, అర్థమదము, స్త్రీమదము, విద్యామదము, కులమదము, రూపమదము, ఉద్యోగమదము, యౌవనమదము.)
మదల. విణ. దురాగ్రహముగలవాఁడు.
మదలతనము. అలసత్వము.
మదశౌండము. సం. జాజికాయ†. [గడి.
మదస్థానము. సం. మద్యపానము; కల్లం

మదహత్తి. మత్తహస్తి, మదపుటేనుఁగు.
మదావలము. సం. గజము.
మది. హృదయము; మతి.
మదించు. అ.క్రి. తలఁచు. స.క్రి. మదింపుచేయు. సం. అ. క్రి. క్రొవ్వు. రూ. మదియించు.
మదింపు. అంచనా.
మదికొలంకు. మానససరోవరము.
మదికొలంకువులుగు } మానసౌకము,
మదికొలనునెక్కొనుపిట్ట } హంస.
మదిమది. నెమ్మది, నిశ్చింతత.
మదిర. సం. కల్లు. [స్త్రీ; స్త్రీ.
మదిరాక్షి. సం. మదముకప్పినకన్నులంగల
మదీయము. సం. విణ. నాది. [కాలువ.
మదుగు. అనుకు; చేలకు నీళ్లు పారెడు
మదుపు. అనుపచ్చ.
మదుము. రూ. మదుగు. [కమియు.
మదురు. గోడమీఁది కప్పు. అ. క్రి.
మదురుగోడ. మదురుపెట్టినగోడ.
మదురువు. మద్యము; మత్తు.
మదులు. వా. మదురుగోడ.
మదువు. రూ. మదుగు.
మదోత్కటము. సం. మదపుటేనుఁగు, విణ. మిక్కిలి మదించినది.
మద్దతు. హిం. సహాయము.
మద్గురము. సం. బొమ్మిడాయచేఁప.
మద్గువు. సం. నీరు;నీరుకాకి; కన్నెలేడి; ఒకచేఁప ?
మద్దళి. మృదంగము.?
మద్ది. అర్జునము†.
మద్దికాయలు. బ. బాలకుల చెవితమ్మెల నుంచెడు భూషణవిశేషము.
మద్దు. పద్దు.
మద్దెల. చర్మవాద్యవిశేషము, మర్దలము.
మద్దెలరూపుచుక్క (రిక్క). ధనిష్ఠా నక్షత్రము.
మద్దెళన. ముష్టియుద్ధాదిమ గతిభేదము.
మద్యము. సం. సుర, కల్లు. [నొకటి.
మద్రదేశము. సం. 56 దేశములలో
మధుక. అతిమధురము†; తిప్పతీఁగె.?
మధుకము. సం. అతిమధురము; ఒకపక్షి; ఇప్ప†; నెమిలి.?

మధుకరము. సం. తుమ్మెద. [వాఁడు.
మధుకుఁడు. సం. వంశావళిఁ జదువు
మధుక్రమము. సం. మరల మరల సురను గ్రోలుట.
మధుద్రుమము. సం. ఇప్ప†.[గ్రోలునది.
మధుపము. సం. తుమ్మెద. విణ. మధువు
మధుపర్కము. వా. పెండ్లిలో వధూవరులకిచ్చెడు వస్త్రము. సం. షోడశోపచారములలో నొకటి, చక్కెర తేనె పెరుఁగు నెయ్యి నీరు కలసినయది; నెయ్యి పెరుఁగు తేనె; పెరుఁగుతోఁగూడిన తేనె. [నీలిచెట్టు.
మధుపర్ణి. సం. గుమ్మడు†; తిప్పతీఁగ;
మధుమేహము. సం. మూత్రరోగ విశేషము.
మధుయష్టిక. సం. అతిమధురము†.
మధుర. సం. ఒక మోక్షపురి; సదాప†; అడవిసదాప†; పాలకూర.
మధురకవిత్వము. సం. చతుర్విధ కవితలలో నొకటి.
మధురత్రిఫలము. సం. ద్రాక్ష కాశ్మర్య ఖర్జూరఫలములు.
మధురము. సం. బెల్లము; జిలకఱ†; విషము; తియ్యన. విణ. తియ్యనిది; ఇంపైనది. [పాల†; పాల†.
మధురస. సం. చాఁగ†; ద్రాక్ష; పిన్న
మధురాక్కర. మి. అక్కరలలో భేదము.
మధురాలాప. సం. గోరువంక.
మధురిక. సం. అడవిసదాఁప†.
మధురిపువు(ఁడు). సం. విష్ణువు.
మధురిమ–మా. సం. తియ్యన.
మధులిట్టు. సం. తుమ్మెద. రూ. మధులిహము.
మధువారము. సం. మధుక్రమము.
మధువు. సం. పాలకూర; నీరు; పాలు; కల్లు; తేనె; పూఁదేనె; చైత్రమాసము; వసంతఋతువు; ఇప్ప†; ఇప్పపూవుల సారా; అతిమధురము†; గోరంట†.
మధువ్రతము. సం. తుమ్మెద.
మధుశిగ్రువు. సం. ఎఱ్ఱపువ్వుల మునగ†.
మధుశ్రవ. సం. తెల్ల గురిజ†.
మధుశ్రేణి. సం. చాఁగ†.
మధుష్ఠీలము. సం. ఇప్ప†.
మధుసఖుఁడు. సం. మన్మథుఁడు.
మధునస్యకము. సం. ఈఁద†; ఖర్జూరము†.
మధుసారధి. సం. మన్మథుఁడు.
మధుసూదనము. సం. తుమ్మెద.
మధుసూదనుఁడు. సం. విష్ణువు.
మధుస్రవ. సం. పాలకూర.
మధూకము సం. ఇప్ప చెట్టు.
మధూచ్ఛిష్టము. సం. మైనము.
మధూలకము. సం. నీరిప్ప, కొండయిప్ప. విణ. మధురము.
మధూలి. సం. మామిడి†; అతి మధురము†; తియ్యమాదిఫలము† కల్లు.? పూఁదేనె ?
మధూలిక. సం. చాఁగ†; పుప్పొడి.?
మధ్య. సం. ఒక ఛందస్సు; స్వీయాంతర్భేద విశిష్ట నాయికా విశేషము; నడితరముది.
మధ్యదేశము. సం. కురుక్షేత్ర ప్రయాగ హిమాద్రి వింధ్యముల మధ్యదేశము.
మధ్యమ. సం. యువతియై కామము లజ్జయుఁ గల నాయిక; రజస్వల; దుద్దు; నడిమివ్రేలు; బుద్ధియుక్తమై హృదయము నుండి కలిగిన నాదరూపమగు వర్ణము; నడితరముది; మధ్యమ తరగతి స్త్రీ.
మధ్యమ పురుషమము. సం. ఎదుటనున్న వాఁడు కర్తగాఁగల క్రియారూపము.
మధ్యమము. సం. నడుము; మధ్యదేశము; 16 నుండి 70 యేండ్ల వరకుఁగల వయస్సు; ఒక స్వరము. విణ. నడిమిది.
మధ్యమ లోకము. సం. భూలోకము.
మధ్యము. సం. అవకాశము; నడుము; మధ్యప్రదేశము; నృత్తగీతవాద్యముల మధ్యమానము; ఒక సంఖ్య. విణ. నడితరముది; నడిమిది; తక్కువది.
మధ్యముఁడు సం. మధ్యమతరగతి మనుష్యుఁడు. విణ. నడిమివాఁడు; తక్కువవాఁడు.
మధ్యరాత్రము. సం. నడురేయి.
మధ్యరాత్రి. సం. నడురేయి.?

మధ్యలోకము. సం. భూలోకము. రూ. మధ్యమలోకము.
మధ్యవర్తి, మధ్యస్థుఁడు } సం. విణ. నడుమనుండి పక్షపాతము లేక యిరు తెగలవారికి సరిగా న్యాయము చెప్పు వాఁడు; మధ్యముఁడు.
మధ్యాక్కర. మి. అక్కరలలోభేదము.
మధ్యాహ్నము. సం. పట్టపగలు, పగలు రెండుజాముల వేళ; మూఁడుభాగములుగ విభజింపఁబడిన దినమందలిమధ్యభాగము
మధ్వాసవము. సం. ఇప్పపువ్వులకల్లు.
మన. స. మనముఅనుదానికి ప్రాతిపదికము
మనఃప్రభవుఁడు. సం. మన్మథుఁడు.
మననము. సం. ధ్యానము; శ్రవణము చేసిన యర్థమును అద్వితీయముగా ఉపనిషదర్థమున కనుగుణమైన యుక్తులతో అనుసంధించుట.
మనమఁడు. వా. మనుమఁడు.
మనమరాలు. వా. మనుమరాలు.
మనము. స. నీవును నేనును; మీరును మేమును. సం. మనస్సు.
మనవర్తి. వా. మనువర్తి.
మనవి. సం. విజ్ఞాపనము, విన్నపము.
మనశ్శిల. సం. మణిసిల.
మనసన. ఆయుస్సు.?
మనసగు. అ.క్రి. ఇష్టమగు; కోరికపుట్టు.
మనసరి. మి. విణ. బుద్ధిమంతుఁడు; ధీరుఁడు.
మనసిజుఁడు. సం. మన్మథుఁడు.
మనసు. విణ. ఇష్టము. సం. మనస్సు.
మనస్కరించు. సం. అ.క్రి. మనసుంచు.
మనస్కారము. సం. ఏదేనొకవిషయమున మనస్సు స్థిరముగా ఉండుట; మనస్సు సుఖమునందు ఆసక్తిగలదియగుట.
మనస్తాపము. సం. మనస్సులోబాధ.
మనస్వి. సం. విణ. మంచిమనస్సుగలవాఁడు.
మనస్సు. సం. మానసము, హృదయము.
మనాయించు. గ్రా. స.క్రి. లక్ష్యపెట్టు; విను; లోఁబడు.
మని. మణి.



మనికట్టు. మణిబంధము.
మనికి. మనుట, జీవించుట; వసించుట; వాసస్థానము; స్థానము.
మనితకపడు. అ.క్రి. దుఃఖపడు.
మనికితపాటు. దుఃఖపడుట.
మనికితము. దుఃఖము; మనోవ్యథ.
మనితము. సం. విణ. తెలియఁబడినది.
మనికిపట్టు వాసస్థానము; ఉనికి; గృహము.
మనికితేఁడు. గృహస్థుఁడు
మనికులు. బ. వాస్తవ్యులు, స్థలజ్ఞులు.
మనియకాఁడు. అధికారి; నిఘామాన్యుఁడు
మనిసి. వా (మనుజ సామాన్యము) మనుష్యుఁడు; స్త్రీ.
మనీష. స. ప్రజ్ఞ; బుద్ధి.
మనీషి. సం. విణ. ధీరుఁడు, విద్వాంసుఁడు, బుద్ధిమంతుఁడు.
మను. ఋశ్యవాచకమైన మన్ను శబ్దము యొక్క లుప్తరూపము; మట్టి; నేల. అ. క్రి. జీవించు; వర్తించు; బ్రతుకు.
మనుఁగు. అ. క్రి. చచ్చు.
మనుఁబెంటి. మనుఁబడి.
మనుఁబిడి. ఆఁడు ఋశ్యమృగము.
మనుఁబోతు. ఋశ్యమృగము, బిళ్ళదున్న.
మనుకువ. వాసస్థానము; చెలిమి.
మనుగడ. జీవనము; జీవనోపాయము.
మనుగుడుపు. అల్లెము. [రూ. మంచు.
మనుచు స. క్రి. పోషించు; బ్రతికించు.
మనుజాశనుఁడు. సం. రాక్షసుఁడు.
మనుజుఁడు. సం. మనుష్యుఁడు.
మనుజేంద్రుఁడు. సం. నృపతి, రాజు.
మనుదిండి. ఒకదినుసుపాము, మాతులాహి
మనుపరి. విణ. కాపరి, రక్షకుఁడు.
మనుపాల. పాలకూర.
మనుపీనుఁగు. జీవచ్ఛవము, కదలుశవము
మనుపు. పోషణము,రక్షణము. ప్రే.రూ. మనుచు.
మనుపెంటి. ఆఁడు ఋశ్యమృగము.
మనుపోతు, మనుబిళ్ళ } ఋశ్యమృగము.
మనుమఁడు. పౌత్రుఁడు, కొడుకు కొడుకు; దౌహిత్రుఁడు, కూఁతురికొడుకు.

మనుమరాలు. పౌత్రి, కొడుకుకూఁతురు; కూఁతురుకూఁతురు. [యిచ్చు సొమ్ము.
మనువర్తి. గ్రా. అనాథలకు జీవనమునకై
మనువు. జీవనము; వర్తనము; మగని వరించుట; వివాహము; మఁగడు. అ. క్రి. చచ్చు. సం. మంత్రము; వైవస్వతాది. (వీరు పదునలుపురు — స్వాయంభువుఁడు, స్వారోచిషుఁడు, ఉత్తముఁడు, తామసుఁడు, రైవతుఁడు. చాక్షుషుఁడు, వైవస్వతుఁడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, రౌచ్యుఁడు, భౌత్యుఁడు)
మనువృత్తి. మి. మనువర్తి.
మనుష్యధర్ముఁడు. సం. కుబేరుఁడు.
మనుష్యయజ్ఞము. సం. అతిథిపూజ.
మనుష్యుఁడు. సం. మానిసి, మానవుఁడు.
మనెదారి. ప్రభువు, అధిపతి.
మనోగుప్త. సం. మణిసిల.
మనోజవసుఁడు. సం. విణ. తండ్రితో సమానుఁడు. రూ. మనోజవుఁడు.
మనోజుఁడు. సం. మన్మథుఁడు.
మనోజ్ఞము. సం. విణ. సుందరము, మనోహరము.
మనోభవుఁడు. సం. మన్మథుఁడు.
మనోరథము. సం. ఇచ్ఛ.
మనోరమము. సం. విణ. మనోజ్ఞము.
మనోవర్తి. గ్రా. రూ. మనువర్తి, మనోవృత్తి.
మనోహతుఁడు. సం. విణ. కార్య విఘాతాదులచే మనస్సున ఉత్సాహము చెడినవాఁడు.
మనోహరము. సం. బంగారు; భక్ష్య విశేషము. విణ. మనోజ్ఞము.
మనోహ్వ. సం. మణిసిల.
మన్కి. రూ. మనికి.
మన్దిండి. రూ. మనుదిండి.
మన్న. అడ్డగింపు.
మన్నఁడు ప్రభువు.
మన్నన. సమ్మానము, గౌరవము, వినయము చూపుట, గొప్పచేయుట.
మన్నా. గ్రా. అటకాయింపు.
మన్ని. జీవనము; మన్య, పెడతలయందుండు నరము. [వించు; మన్ననచేయు.
మన్నించు. స. క్రి. సమ్మానించు; గౌర
మన్నింపు. మన్నించుట; అపరాధ సహనము.
మన్నిక సమ్మానము.
మన్నిగొను. స. క్రి. చంపు
మన్నియ—ఁడు } ప్రభువు.
మన్నీఁడు }
మన్ను. ఋశ్య మృగము; యుద్ధ సాధన విశేషము; భూమి; మృత్తిక.
మన్నుఱేఁడు } భూపతి, రాజు.
మన్నె—కాఁడు }
మన్నెడి. రాజు; అరణ్యదేశమునకు దొర.
మన్నెము. రాజులు సమ్మానించి యిచ్చిన కొంత భూభాగము,
మన్నెముల్లు. మేకల కాలి గిట్టలలోని ముల్లుతీసెడు పెద్దసూది. [ద్దారు.
మన్నెవాఁడు. అధిపతి, భూపతి; జమీ
మన్నెఱికము మండలేశ్వరత్వము; మన్నెపు దొరతనము. రూ. మన్నెర్కము.
మన్నెలు. బ. నతివిశేషము.
మన్మఁడు. మనుమఁడు.
మన్మథ. సం. మన్మథసంవత్సరము.
మన్మథబాణములు. బ. ధాన్యభేదము. సం. పంచబాణములు.
మన్మథము. సం. కామచింత; వెలఁగ†.
మన్మథరసము సం. వీర్యము.
మన్మథుఁడు. సం. మరుఁడు; మదనుఁడు.
మన్మనము. సం. రతికాలమున ఆలుమగల గుసగుసలు.
మన్య. సం. పెడతలయందుండు పెద్ద నరము; పూర్ణచంద్రుఁడు గల దినము.?
మన్యము. గ్రా. మండెము.
మన్యువు. సం. కోపము; దైన్యము; యజ్ఞము; శోకము.
మన్వంతరము. డెబ్బదియొక్క మహాయుగముల కాలము; అంతపరిమితిగల మనువుల యధికారము.
మపుష్టకము. సం. అడవి పెసలు.
మప్పితము. విణ. మితము, పరిమితము.
మప్పు. స. క్రి. మరపు; అలవఱ్చు.

మబ్బు. మేఘము; చీఁకటి; అజ్ఞానము; మద్యపాన మదము.
మబ్బుకొను. అ. క్రి. మంపుకొను.
మబ్బుత్రోవ. మేఘద్వారము, ఆకాశము.
మబ్బుపగ. ప్రభంజనుఁడు, వాయువు.
మబ్బుపువ్వులవెల్లి. సముద్రము.
మబ్బుపూనినువు అగ్ని.
మబ్బుమేపరి. మబ్బుపగ. [ఇంద్రుఁడు.
మబ్బురవుతు. మేఘవాహనుఁడు,
మబ్బురావుంటనము } మత్తు వస్తువులు
మబ్బురావుంటు } కలిపిచేసినవిందు
మబ్బురూపరి. ఐరావతము.
మబ్బువిప్పు. ప్రభంజనుఁడు, వాయువు.
మభ్యపెట్టుట. స. క్రి. మోసముచేయుట, ఉపాయముగా దాఁటవేయుట.
మమత సం. మమత్వము, నాదియనెడి భావము.
మమ్మ—రె(రే) } అవ్య. ప్రశంసను తెలు
మామ్మా—రె(రే) } పునది.
మమ్మాయి. లేహవిశేషము.
మమ్ము. సముద్రముమీఁద ఓడలకు విఘాతముగ వీచెడు సుడిగాలివిశేషము.
మయము. మధ్యభాగము. సం ఒంటె; కంచర గాడిద.
మయుష్టకము. సం. అడవిపెసలు.
మయి. శరీరము; విధము; తడవ, పార్శ్వము; వెంబడి; కొన్నియెడల తృతీయా విభక్తియందు వచ్చెడి ప్రత్యయము.
మయికము. మదము, మత్తు; భ్రమ.
మయికొను. అ. క్రి. సమ్మతించు.
మయికోలు. ఇచ్ఛగింత, సమ్మతి.
మయిజోలు. పయిటకొంగు.
మయితాలుపు దేహి, ప్రాణి.
మయిద. మదము; గోరంట†.
మయిదానము. గ్రా. మైదానము. రూ. మయిదాను. [చోక్కు పొడి.
మయిదు. మదము; మాయ; చొక్కు,
మయినపువత్తి. దీపము వెలిఁగించువత్తి.
మయినము. మధూచ్ఛిష్టము, మైనము.
మయిమయి. అనాయాసము. క్రి. విణ. అనాయసముగా.
మయిమఱపు. పారవశ్యము.
మయిమఱువు. కవచము.
మయిల. కృష్ణవర్ణము; చీఁకటి; మాలిన్యము; అశుచి; మలినవస్త్రము. విణ. మలినము; అశుచి.
మయిలకోక. మాసినకోక.
మయిలవన్నె. మయిలవర్ణము.
మయిలారు. ఒక క్షుద్రదేవత.
మయిలారువాఁడు. కోమట్ల నడిగికొని జీవించువాఁడు.
మయిలు. మైలు.
మయిలుతుత్తము. తుత్థము, ప్రమానిపను పున వండిన అంజనవిశేషము.
మయివడి. సమ్మతి; అనుకూల్యము; విధము; సౌమ్యత. విణ. అనుకూలము.
మయిసున్నవజీరు; అనంగుఁడు, మన్మథుఁడు.
మయుఁడు. సం. అశ్వముఖుఁడు, కిన్నరుఁడు; అసురశిల్పి. [షము.
మయువు. సం. కిన్నరుఁడు; మృగవిశే
మయుష్టకము. సం. అడవిపెసలు.
మయూఖము. సం. కిరణము; కాంతి; జ్వాల. [ఉత్తరేను†.
మయూరకము. సం. మయిలుతుత్తము;
మయూరతుత్థము. సం. మయిలుతుత్తము
మయూరము. సం. నెమిలి; నెమిలిజుట్టు; ఓమము†; ఉత్తరేను†.
మయూరవిదళ. సం. నల్లతెగడ†.
మయూరారి. సం. ఊసరవెల్లి.?
మయూరు. మేజరు.
మయ్యంకి. తాళము.
మయ్యర. శ్మశ్రువు.
మర. కీలు; తిరుగుడుచీల; తిరుగుడునొక్కు.
మరందము. సం. పూఁదేనె.
మరందలు. మరఁదలు.
మరక. కఱ; డాగు.
మరకట్టు. తిరుగుడుచీలను తిరుగకుండ కట్టివేయు విద్య.
మరకతపట్టు. మి. వస్త్రవిశేషము.
మరకతము. సం. గారుత్మతము, పచ్చ.
మరకము. ఎనిమిదిపళ్లు; తూము.
మరకాఁడు. నావికుఁడు, ఓడనడపువాడు.
మరగాలు. కృత్రిమపాదము.

మరగు. అ. క్రి. పరిచితమగు; ఆశపడు. స. క్రి. ఆశించు; మోహించు.
మరగొమ్ము. గుఱ్ఱమువీఁది పల్లమునకు ముందు వెనుకల నానికకై యెత్తుగా నేర్పఱచియుండు భాగము.
మరచుట్టు. తిరుగడ; మరయుంగరము.
మరణము. సం. చావు; ప్రాణము విడుచుట.
మరణించు. సం. స. క్రి. చచ్చు; ప్రాణము విడుచు.
మరతకము. సం. పచ్చ.?
మరపు. ప్రే. మరగఁజేయు; నేర్పు.?
మరమేకు. తిరుగుడు-చీల.
మరమ్మతు. హిం. బాగుచేయుట.
మరల. అవ్య. పునరర్థకము.
మరలఁబడు. అ. క్రి మరలు.
మరలఁబాటు. మరలఁబడుట
మరలు. అ. క్రి. నివర్తిల్లు, తిరుగు, వెనుకకు తిరుగు. [మరలుచు.
మరలుచు. ప్రే. మరలఁజేయు. రూ.
మరవలి మనుఁగుడుపు.
మరసాన. ఱాళ్లపనివాని సాధనవిశేషము.
మరాటము. లాంగలి†.
మరాటి. మహారాష్ట్రుఁడు
మరాటివాఁడు. మరాటి. రూ. మరాఠీ.
మరాటీదేశము 56 దేశములలో నొకటి, మహారాష్ట్రము.
మరాళము. సం. హంస.
మరి. వారము, తడవ. అవ్య. మఱియు.
మరించు. సం. అ. క్రి. మరణించు.
మరిగ. రాతిచిప్ప, మెత్తని సబ్బురాతి నుండి తయారుచేసిన చిప్ప.
మరిగొమ్ము. కలుఁజు.
మరిచము. సం. మిరియము†.
మరిడిమహలక్ష్మి. ఒక దేవత.
మరిడివ్యాధి. కలరాజాడ్యము.
మరియాద. క్రమము; మర్యాద; న్యాయము.
మరీచము. సం. మిరియము†.
మరీచి. సం. కిరణము; సప్తఋషులలో ఒకడు; ఒక ప్రజాపతి.
మరీచిక. సం. ఎండమావులు.

మరు. వృత్తియందు మారుశబ్దమున కాదేశరూపము.
మరుఁడు. స్మరుఁడు, మన్మథుఁడు.
మరుచిప్ప. మన్మథ యుద్ధము, రతి.
మరుతేజి. మన్మథుని వాహనము, చిలుక.
మరుతేరు. వాయువు.
మరుత్తు. సం. వాయువు; దేవత; ఒక రాజు; మొక్కము; పిక్క†?
మరుత్పద్మాకరము. సం. విణ. సురదీర్ఘిక, ఆకాశగంగ.
మరుత్పాలుఁడు. సం. దేవేంద్రుఁడు.
మరుత్వంతుఁడు. సం. దేవేంద్రుఁడు; హనుమంతుఁడు; మేఘుఁడు.?
మరుత్సఖుఁడు. సం. అగ్నిహోత్రుఁడు; ఇంద్రుఁడు. [మణుఁడు, శివుడు.
మరుద్భుక్కటకుఁడు సం. నాగభూ
మరునయ్య. విష్ణువు.
మరునయ్యతేజి. గరుత్మంతుఁడు.
మరునల్లె. భృంగము, తుమ్మెద.
మరునిడాలు. మీనము; మకరము.
మరునిల్లు. మన్మథగృహము, యోని.
మరున్మాల. సం. పిక్క†.
మరుపని సురతము.
మరుమామ. చంద్రుఁడు.
మరురాణి. రతిదేవి.
మరులు. పిశాచము; మోహము, కామము.
మరులుఁదీఁగ. మరులుజడ†.
మరులుకొను. అ. క్రి. మోహించు. ప్రే. మరులుకొలుపు.
మరులుజెశ / మరులుమాతంగి } మట్టినతోఁడ నేమరులు పుట్టించెడి యోషధి, మదనము†
మరులుమ్మెత / మర్లమాతంగి } మరులుజడ†.
మరులుతేఁడు. భూతేశుఁడు, శివుఁడు.
మరువకము. సం. మరువము†; మంగ†.
మరువము వాసనగల ఒకచిన్న చెట్టు, ప్రస్థపుష్పము.
మరువు. సం. నిర్జలప్రదేశము; పర్వతము.
మరుసాము. మన్మథయుద్ధము.
మరూకము. సం. నెమిలి.

మర్కటకీటము. సం. సాలెపురుగు.
మర్కటము. సం. కోఁతి. రూ. మర్కటకము.
మర్కటి. సం. నిప్పులవన్నె కానుగు†; దూలగొండి†; ఆఁడుకోఁతి.
మర్కారి. పడవ నడిపించువాఁడు.
మర్తబు. హిం. విశ. పరిష్కారమైన.
మర్త్యము. సం. భూలోకము.
మర్త్యుఁడు. సం. మనుష్యుఁడు.
మర్దనము. సం. మర్దించుట.
మర్దలధ్వని సం. గుండిలము.
మర్దలము. సం. మద్దెల.
మర్దించు. సం. స. క్రి. నలుపు; నూఱు; పిసుకు, ఒత్తు.
మర్దితము. సం. విశ. మర్దింపఁబడినది.
మర్నాడు. మఱునాడు.
మర్మము. సం. సంధి; ఆయము, జీవస్థానము; కిటుకు; కపటము, నెపము ?
మర్మరము. సం. పెళపెళ, ఆకులయు వస్త్రములయు మ్రోఁత.
మర్మస్పృక్కు. సం. విశ. మర్మమును దాఁకునది.
మర్యాద. సం. మేర; తీరము; కట్టుపాటు, నిర్ణయము; సమ్మానము.
మర్లుఁబాము. మనుదిండి, మాలుధానము.
మర్షము. సం. క్షమ, ఓర్పు.
మఱ. మఱచుధాతువు విశేష్యరూపము; విస్మృతి; పరాకు; కీలు.
మఱఁదలు. తమ్ముని భార్య; తనకంటె చిన్నదగు మేనత్త మేనమామల కూఁతురు; భార్యచెల్లెలు, కేలికుంచిక.
మఱఁది. చెల్లెలి మగఁడు; మేనమామ కొడుకు; మగని తమ్ముడు; భార్యతోఁ బుట్టువు, శ్యాలకుఁడు.
మఱక. కఱ; మేఁకపడ్డ.
మఱకువ. అజ్ఞానము; పరాకు.
మఱగాలు. కృతిమపాదము.
మఱచు. స. క్రి. మఱపుఁజెందు, విస్మరించు. ప్రే. మఱపించు.
మఱపు. విస్మృతి; పరాకు; అజ్ఞానము; పారవశ్యము; ప్రమాదము.
మఱలు. అ. క్రి. మళ్లు, మరలు.
మఱి. అవ్య. వెండియు; ఇంకను; అనంతరము.
మఱిగ. జోడ్త వెలవలె బలపపుజాతితోఁ జేయఁబడిన పాత్రము.
మఱిమఱి. అవ్య. మఱియు మఱియు; అత్యంతము.
మఱియొకటి. స. అన్యము, వేఱొకటి, మఱొకటి.
మఱియొకఁడు. స. అన్యుఁడు.
మఱియొకతె. స. అన్య; అన్యస్త్రీ.
మఱు. వృత్తియందు మఱుగు మఱుస మాఱు శబ్దముల కాదేశరూపము. (మఱుపడు, మఱునాఁడు, మఱుమాట యని.)
మఱుఁగు. చాటు అ. క్రి. చాటగు; సంతాపించు.
మఱుఁగుడు. సంతాపము.
మఱుఁగుదొడ్డి. పాయిఖానా, విస్థావిసర్జన స్థానము.
మఱుఁగుపడు. అ. క్రి. మఱుఁగు.
మఱుఁగుపెరడు. మఱుగుదొడ్డి.
మఱుఁగువెట్టు. స. క్రి. చాటువెట్టు.
మఱుకువ. సంతాపము.
మఱుగుజ్జె. విశ. గూనివాఁడు; గూనిది.
మఱునాఁడు. మఱుసటిరోజు, పరదినము.
మఱుపడు. అ. క్రి. మఱుఁగగు.
మఱుపుట్టువు మఱుజన్మ.
మఱుమాట. ప్రతివచనము
మఱు, మ్రోఁత. ప్రతిధ్వని.
మఱువ. కండ. విశ. మూఁగ.
మఱువకందు. కుంభసంభవుఁడు, అగస్త్యుఁడు.
మఱువవాఁడు. విశ. మూఁగ.
మఱువు. కవచము; చాటు; మర్మము; పుట్టుమచ్చ.
మఱువెట్టు. స. క్రి. మఱుఁగువెట్టు
మఱుస. విశ. ఆవలిది.
మఱుసంజె. సాయంసంధ్య.
మఱ్ఱాకు. మఱ్ఱియాకు.
మఱ్ఱి. వటవృక్షము; అఱకము.
మఱ్ఱె. మఱ్ఱె†.
మఱ్ఱెయ. అఱకము.
మల. పర్వతము, కొండ.

మలఁక. చిక్కు; చుట్టు; మెలిక. విణ. వంకర. [గల మానవిశేషము.
మలఁకతూము, పది కుంచముల కొలఁది
మలఁకపుట్టి. ఇన్నూఱు కుంచముల కొలఁది గల మానవిశేషము. [మెఱుఁపు.
మలఁకమెఱుపు. ధనురాకారమగు
మలఁకవాలు. పాదరక్షు.
మలఁగ. ఎద్దుపై గంతతోడి సాకుగోనె.
మలఁగు. అ.క్రి. తిరుగు; మరలు; వంకరగు.
మలఁచు. ప్రే. మలఁగఁజేయు. స.క్రి. తొలంచు.
మలఁపు. నర్తనము. ప్రే. మలఁగఁజేయు.
మలఁపుగొను. అ క్రి నర్తించు.
మలక. తురక; మూఁడుడు.
మలకడము. పాదరక్షు.
మలగొంగ. ఇంద్రుఁడు, నగవైరి.
మలగొను. అ. క్రి. మెలిగొను.
మలచేము. విణ. అధికము; గొప్ప.
మలదాయ. నగవైరి, ఇంద్రుఁడు.
మలప. దూడచచ్చి పాలిచ్చెడు ధేన్వాదికము.
మలపు. అధిక్యము ప్రే. త్రిప్పు; మరలించు.
మలపువు. సం, కుక్కమేడి†.
మలమనికి. పక్షి; కాకి; సింహాసు; కోఁతి. రూ. మలమన్కి. [ధ్వన్యనుకరణము.
మలమల మాఁడుట మఱుఁగుటయందగు
మలమాసము. సం. అధికమాసము.
మలము. సం. ఆణవాది; వాతాది; (ద్వాదశమలములు, వస, శుక్లము, రక్తము, మజ్జ, మూత్రము, విష్ఠ, పింజూషము, నఖము, శ్లేష్మము, అశ్రువు, దూషిక, స్వేదము.) కిట్టము; దుష్టము; పాపము; మలినము.
మలయ. సం. తెల్ల తెగడ†.
మలయజము. సం. చందనవృక్షము; చందనము.
మలయము. సం. మంచిగందపు చెట్లకు స్థానమైన ఒకకొండ; ఆరామము; ఒక దేశము, మలబారు.
మలయజసిరి. మి. వస్త్ర విశేషము.
మలయమ్మ. పార్వతి.
మలయిక విహారము.
మలయు. అ. క్రి. తిరుగు; పెనఁగు; వ్యాపించు; ఉద్యమించు; ఉద్రేకించు; తపించు.
మలయువు. సం. కుక్కమేడి†.
మలరు. పూవు.
మలవిలుకాని తేరు. వృషభము.
మలసూదు. నగవైరి, ఇంద్రుఁడు.
మలహరుఁడు. సం. శివుఁడు.
మలహరుగుడి. మి. శివాలయము.
మలాక. శ్రీఖండము†. సం. ఆఁడేనుఁగు; కాముకి; కుంటెనకత్తె.
మలాకా. మలాకాదేశ సంబంధమైనది.?
మలాము. బంగారుపు నీరు మొదలగువాని పూఁత.
మలాము మలాము; పుంటికి పూసెడు మందు
మలారము. మట్టి గాజుల గుది; నిడుపు కొయ్యకొనను రెల్లు కట్టి పీఠి మొదలగునది ఊడ్చు సాధనము.
మలికితము. సం దేహము.
మలిగ. మళిగ.?
మలిగండ్లు. మలిచి తీయఁదగిన తాలు.
మలినము. సం. విణ. మాసినది; నల్లనిది; దూషితమైనది.
మలినముఖము. సం. కొండముచ్చు.
మలినముఖుఁడు. సం. దుర్జనుఁడు; చచ్చినవాఁడు; అగ్ని.?
మలిని. సం. ఋతుమతి.
మలిమిడి. పళుపార్ష్ణిరోగము.
మలిమ్లుచము. సం మలమాసము; దోమ.?
మలిమ్లుచుఁడు. సం. దొంగ; అగ్ని; వాయువు.
మలీమసము. సం. ఇనుము. విణ. మాసినది.
మలు. విణ రూ. మఱు.
మలుఁగు మత్స్యవిశేషము.
మలుకారు. ముక్కారుపంటలో రెండవ కారు; శీతకాలము.
మలుకు. దారము మొదలగువాని నెదురెదురుగా తగిలించి మరల పెడమర్లు త్రిప్పినది. రూ మలుక్కు.
మలుకువ. ముఱికి. [మిల్లు; నశించు;
మలుగు. తుంటి. అ. క్రి. అఱు, ఉపశ

మలుచు. స. క్రి. బియ్యము మొదలగునవి రాళ్లుపోవ చెఱుగు; తతి మెనఁబెట్టు; రాతిని తొలంచు. రూ. మల్చు.
మలుచూలు. రెండవ చూలు.
మలుపక్కము. కృష్ణపక్షము.
మలువు. క్రే. ఆర్చు; నశింపఁజేయు.
మలుసంజె. సాయంసంధ్య.
మలుసమర్త. రెండవసారిముట్టుతయగుట
మల్కా. తురక. రూ. మలుంకాఁడు.
మళ్లు. తుంటి.
మల్ల. మంటి కంచము.
మల్లకము సం దీపపు ప్రమిద.
మల్లకుఁడు. విణ. గడుసరి.
మల్లగుల్లము. వాదులాట. [చేయు.
మల్లచఱచు. అ. క్రి. భుజాస్ఫాలనము
మల్లచఱపు. మల్ల చఱచుట.
మల్లట. రూ. మల్లాట.
మల్లడి. తాపము, పరితాపము; పెనఁకువ.
మల్లడించు. అ. క్రి. పెనఁగొను; అతిశయించు.
మల్లడిగొను. అ. క్రి. పెనఁగొను; పరితపించు. క్రే. మల్లడిగొలుపు.
మల్లము. సం. ప్రమిద; మల్ల.?
మల్లరము. విణ. మదించినది.
మల్లసాల. భోజనశాల.
మల్లాట. పెనఁగు.
మల్లాడు. అ క్రి. పెనఁగులాడు.
మల్లామడి. విణ. పీడితుఁడు; పీడితము.
మల్లారము. రూ. మలారము.
మల్లిక. సం. మల్లెతీఁగె; పానపాత్రము; వర్ణపాత్రము. [తెల్లహంస
మల్లికము. సం. మాసిన ముక్కు కాళ్లుగల
మల్లికాక్షము. సం. మల్లికము; తెల్లని కన్నులుగల గుఱ్ఱము.
మల్లియ. మల్లెతీఁగె.
మల్లు. కోఁతి; జెట్టి పెనఁకువ.
మల్లుఁడు. సం. జెట్టి విణ. శ్రేష్ఠుఁడు.
మల్లుకట్టు. స. క్రి. అడ్డగించు. [పెనఁగు.
మల్లుపెనఁగు. అ. క్రి. జెట్టి పెనఁకువగా
మల్లె. తృణధాన్యము, మల్లిక; మల్ల; ఉపశాఖ. బ. స్ఫోటకపు బొబ్బలయందుఁ గలుగు పురుగులు; ధాన్యవిశేషము.
మల్లెజేగులు. రాపులుఁగు.
మల్లెమొగ్గలు. కంఠ భూషావిశేషము.
మల్లెలగుది. మల్లెపూ గుత్తివలె మనోజ్ఞ మగుటచేత కుక్కకియ్యబడిన పేరు.
మల్లెశ్రీగంధులు. మి.బ. ధాన్యవిశేషము.
మవురి. జీనుఁగోవి.
మవ్వము. కోమలత. విణ. కోమలము.
మశకము. సం. దోమ; దేహము విరియు రోగము.
మశకహరి. సం. దోమతెర. రూ. మశకారి.
మశూచి-క. స్ఫోటకము.
మషాఖతు. హిం. భూమిని బాగుచేయుట
మషాతు. హిం. నేల కొలుచుట.
మషాతుదారు. పొలము కొలుచువాఁడు.
మషాలు. హిం. దివిటీ.
మషాల్చి. హిం. దివిటీలు పట్టువాఁడు; దీపములు వెలిఁగించువాఁడు. రూ. మషాల్జీ?
మషి. సం. సిరా, కాగితము వ్రాసెడుమసి.
మషిమణి. సం. మసిబుడ్డి, సిరాబుడ్డి.
మస. విలాసము.
మసఁగు. అ. క్రి. రేఁగు, విజృంభించు.
మసక-న. ఇంచుకనలుపు; మునిచీఁకటి.
మసకము. సంభోగేచ్ఛ; సంభోగము; ఆహిరతి.
మసకపుఁబాము. సురతమొనరించుసర్పము.
మసకలుపారుట. మసకము.
మసకొను. అ. క్రి. సంభోగేచ్ఛగొను. క్రే. మసకొలుపు.
మసటు. మాలిన్యము. రూ. మసడు.
మసదరు. మూడురకానాలు.
మసనము. శ్మశానము.
మసర. ధూసరవర్ణము. విణ. ఆవన్నెగలది.
మసరపప్పు. హంస.?
మసరు. ఆవేశము.
మసలిక. మాంద్యము. విణ. మందము.
మసలు. అ. క్రి. ఆలస్యముచేయు; నీళ్లు సలసలకాఁగు; సంచరించు; వెనుకతిరుగు; తడయక; ఆలస్యముచేయక.?
మసలుకొను. అ. క్రి. మసలు.
మసారము. సం. నీలరత్నము.
మసాల. హిం. సంభారము, మిర్చి

మెంతులు జీలకఱ్ఱ మొ॥ పోగపుసామగ్రి; గుజ్జుమునకిచ్చు మందు. రూ. మసాలా.
మసి. నలుపు; కాలినమసి; బొగ్గు; మయిల. సం. కాగితము వ్రాసెడు కాటుక, సిరా. [-చిలుము.
మసికట్టు. బంగారు మొదలగువాని
మసికోఁతి. కొండముచ్చు.
మసిబుడ్డి. మి. సిరాబుడ్డి.
మసిలె. టూకుబండి.?
మసీదు. తురకలగుడి. [మసూర.
మసుర. సం. వేశ్య; చిఱుసెనగలు. రూ
మసూరము. సం. తలగడ; చిఱుసెనగలు
మసూరవిదళ. సం. నల్లతెగడ†.
మసూరి-క. సం. శీతలావ్యాధి, మశూచిక.
మసృణ. సం. నల్లగిసె†. [నిది.
మసృణము. సం. విణ. నున్ననిది; చిక్క-
మసెల. అటుక.
మసోదు. హిం. చిత్తువ్రాసినది. [దము.
మస్కరము. సం. వెదురు†; వెదురుదం
మస్కరి. సం. సన్న్యాసి.
మస్టు. రూ. మసటు.
మస్తకము. సం. శిరస్సు.
మస్తకి. హిం. ఒకమందుదినుసు.
మస్తము. సం. తల, శిరస్సు.
మస్తరించు. స. క్రి. లోపఱచు.
మస్తరు. అధీనత, లోఁకువ.
మస్తిష్కము. సం. తలలోనుండెడి మెదడు
మస్తీ. మదించిన యేనుఁగు.
మస్తు. మదము; గర్వము; సమృద్ధి.
మస్తువాఁడు. విణ. మత్తుఁడు; గర్వి; సంపన్నుఁడు.
మస్తువు. సం. పెరుఁగుమీఁది మీఁగడ.
మహ. మహా.?
మహంతు. దేవస్థానములకు ధర్మకర్తృత్వము జఱిగించు బైరాగి.
మహజోతులు. బ. దీపభేదము.
మహజేరు } హిం. పెక్కుమందిచేరి
మహజేర్నామా } వ్రాసికొను అర్జీ.
మహతాబు. మతాబా.
మహతి. సం. నూఱుతంతులుగల వీణ, నారదునివీణ; తెలుఁగు వ్యాకరణమున తిర్యగితర స్త్రీ వాచక శబ్దములకుసంజ్ఞ; విణ. గొప్పది.
మహత్తత్త్వము. సమష్టిబుద్ధి.
మహత్తు. సం. దొరతనము; గొప్పతనము; సమష్టిబుద్ధి; ప్రభావము; తెనుఁగువ్యాకరణమున పురుషవాచక శబ్దములకుసంజ్ఞ. విణ. గొప్పది.
మహదాజ్ఞ. సం. మహాజ్ఞ.
మహనాడు. అశేషసులస్థులయొక్క కూటము
మహనీయుఁడు సం విణ. గొప్పవాఁడు; పూజ్యుఁడు.
మహము. సం. ఉత్సవము; తేజము.
మహమ్మదీయుఁడు. మహమ్మదుమతస్థుఁడు
మహమ్మదు. సం. మహమ్మదీయ మత ప్రవక్త.
మహలు హిం. రాజమందిరము.
మహస్సు. సం. తేజస్సు. [న్నాలు.
మహసూలు. హిం. పంట. రూ. మహ
మహసూలుదార్లు. హిం. బ. పంటకాఁపులు
మహాంగము. సం ఒంటె.
మహాకందము. సం. రాచఉల్లి, వెల్లుల్లి†; ముల్లంగి†. [భటుఁడు.
మహాకాలుఁడు. సం. శివుఁడు; ఒక శివ
మహాకాళి. సం. దుర్గ, పార్వతి.
మహాకులీనుఁడు. సం. విణ. కులీనుఁడు.
మహాకులుఁడు. సం. విణ. ఉత్తమ వంశమునఁ బుట్టినవాఁడు.
మహాక్కర మి. అక్కరలలో భేదము.
మహాగణులు. వ్య. బ. జంగాలగురువుల బిరుదు.
మహాగ్రీవము. సం. ఒంటె. [రాచబీఱ†.
మహాజాలి. సం. పచ్చపువ్వుల బీఱ†;
మహాదేవి. దుర్గ, పార్వతి.
మహాదేవుఁడు. సం. శివుఁడు.
మహాధనము. సం. చిల్లమడ్డి; బంగారు; కృషి. విణ. గొప్ప వెలగల వస్త్రము; గొప్ప వెలగల వస్తువు. [నందము.
మహానందము. సం. మోక్షము, బ్రహ్మా
మహానటుఁడు. సం. శివుఁడు.
మహానసము. సం. వంటయిల్లు.
మహానిశ. సం. అర్ధరాత్రము.

మహానీలము. సం. సింహళ ద్వీపము నందుఁ గలిగిన ఒక నీలరత్నము; గొంటు కలగరగ†; పెద్ద నేరేడు†. [విశేషము.
మహానీలుఁడు. సం. దేవయోని సర్ప
మహాపథము. సం. రాజమార్గము; ఆకాశము; స్మశానము.
మహాపద్మము. సం. ఒక నిధి; దేవయోని సర్పవిశేషము; లక్షకోటిసంఖ్య.
మహాపెద్ద. మి. చాల గొప్పవాఁడు.
మహాప్రళయము. సం. లోకనాశము, బ్రహ్మప్రళయము.
మహాబల. సం. చిట్టాముదము†; నులితడ†.
మహాబలము. సం. సీసము.
మహాబలుఁడు. వాయువు; బుద్ధుడు. విణ. మిక్కిలి బలముగలవాఁడు.
మహాబిలము. సం. ఆకాశము.
మహామంచి. మి. మిక్కిలిమంచి.
మహామహిముఁడు. సం. మిక్కిలి మహిమ గలవాఁడు.
మహామాత్రుఁడు. సం. కార్యసహాయుఁడు, సేనానాయకుఁడు మొ॥; ముఖ్యమంత్రి; మావటీడొర; సంపన్నుఁడు.
మహామృగము. సం. ఏనుఁగు; శరభము.
మహామృత్యువు. సం. రుద్రుఁడు.
మహాయశస్కుఁడు, మహాయశుఁడు } సం. విణ. మిక్కిలి కీర్తి గలవాఁడు.
మహాయుగము. సం. నాలుగు యుగముల కాలము.
మహారంభము. సం. ఒక ఉప్పు.
మహారజతము. సం. బంగారు.
మహారజనము. సం. కుసుమపువ్వు; బంగారు.
మహారణ్యము. సం. పెద్దయడవి.
మహారథుఁడు. సం. పది(లేక)పదునొకండు వేలమంది విలుకాండ్రతో పోరెడు యోధుఁడు; తనను సారథిని గుఱ్ఱములను కాపాడుకొనుచు యుద్ధము చేసెడు వీరుఁడు.
మహారాజికుఁడు. సం. గణదేవతావిశేషము
మహారాజు. సం. చక్రవర్తి; ఒక బుద్ధుఁడు.
మహారాత్రి. సం. నడిరేయికిపిమ్మట రెండు ముహూర్తముల కాలము; దుర్గాష్టమి.

మహారాష్ట్రము. సం. 56 దేశములలో నొకటి.
మహారౌరవము. సం. ఒక నరకము.
మహార్ఘము. సం. విణ. మిక్కిలివెలగలది.
మహాశంఖము. సం. సంఖ్యావిశేషము; నొసలు; కణతయెముక; పుఱ్ఱెయెముక.
మహాశయుఁడు. సం. సముద్రుఁడు. విణ. గొప్ప యభిప్రాయము గలవాఁడు.
మహాశూద్రి. సం. గొల్లత; గొల్లని యిల్లాలు.
మహాశూద్రుఁడు. సం. గొల్ల.
మహాశ్వేత. సం. తెల్ల(నల్ల) నేలగుమ్మడు†.
మహాసహ. సం. కారుమినుము†; పెద్ద గోరంట†.
మహాసహము. సం. గొజ్జఁగి†.
మహాసేనుఁడు. సం. కుమారస్వామి. విణ. గొప్పసేనకధిపతి.
మహి. సం. భూమి. ఆవు.
మహికర్ణము. సం. పుట్ట. [యోగ్యము.
మహితము. సం. విణ. గొప్పది; పూజ్యము;
మహిమ—ము. సం. మాహాత్మ్యము, గొప్పతనము; ఒక ఐశ్వర్యము.
మహిషము. సం. దున్నపోతు.
మహిషవాహనుఁడు. సం. యముఁడు.
మహిషి. సం. పట్టపురాణి; ఒక చెట్టు; గేదె.
మహిళ. సం. స్త్రీ; మదించినస్త్రీ; ప్రేంకణము†; రేణుక†.
మహీక్షితుఁడు. సం. రాజు; ఱేఁడు.
మహీధ్రము. సం. పర్వతము.
మహీరుహము. సం. చెట్టు.
మహీలత. సం. ఎఱ్ఱ, వానపాము.
మహీసుత. సం. సీత. [కాసురుఁడు.
మహీసుతుఁడు. సం. అంగారకుఁడు; నర
మహేంద్రము. సం. ఒకకొండ.
మహేంద్రి. సం. బొంతరఁటి†.?
మహేంద్రుఁడు. సం. ఇంద్రుఁడు.
మహేచ్ఛుఁడు. సం. విణ. గొప్ప అభిప్రాయముగలవాఁడు.
మహేరణ. సం. అందుగు†.
మహేశ్వరుఁడు. సం. శివుఁడు; గొప్పప్రభువు
మహేశ్వరి. సం. పార్వతి.
మహోక్షము. సం. దొడ్డయెద్దు.
మహోత్పలము. సం. పద్మము, తామర†.

మహోత్సాహుఁడు. సం. విణ. అద్భుత కార్యారంభము కలవాఁడు.
మహోదధి. సం. సముద్రము.
మహోదయము. సం. కన్యాకుబ్జము; అధిపత్యము; అభివృద్ధి; మోక్షము.
మహోదరము.సం.ఉదరవ్యాధివిశేషము
మహోద్యముఁడు. సం. విణ. గొప్పవి యగు కార్యములఁజేయ యత్నించు వాఁడు.
మహౌషధము. సం. వెల్లుల్లి; సొంటి; పిప్పలి; అతివస; వసనాభి.
మళయాళము. మలయపర్వతము చుట్టుపట్టు దేశము, 56 దేశములలో నొకటి.
మళిగ. చింతపండు మిరపకాయలు మొదలగు పలు సరుకులు విశేషముగా నుంచుకొని అమ్మకము చేసెడి యిల్లు.
మళ్లు. అ.క్రి.రూ. మరలు. ప్రే.మళ్లించు.

## మా

మా.అవ్య. బళి.విణ. మిక్కిలి.సం.లక్ష్మి.
మాంగల్యము. సం. మంగళము; తాళిబొట్టు; శుభకార్యము. విణ. మంగళసాధనము.
మాంజిష్ఠము.సం.ఎఱుపు; ఎఱుపుమించిన పసుపువన్నె; ఆ వన్నెగలచీర. విణ. ఎఱ్ఱనిది.
మాంత్రికుఁడు. సం. మంత్రశాస్త్రము తెలిసినవాఁడు. [పట్టుచీర.
మాందాళి. కృత్రిమ మరకతము; పచ్చ
మాంద్యము. సం. ఆలస్యము; రోగము.
మాంసము. సం. సంజాడు, నీచు.
మాంసలుఁడు. సం. విణ. బలిసినవాఁడు; బలిమిగలవాఁడు.
మాంసశమ్కలి. సం. మాంసపుచక్కిలము
మాంసి. జటామాంసి†; తక్కోలము† కారుకొల్లి†.?
మాంసికుఁడు. సం. కటికవాఁడు, మృగపక్ష్యాదుల మాంసము విక్రయించి జీవించువాఁడు.
మాఁకు. మ్రాను.
మాఁగాయ. మామిడికాయ ఊరుగాయ.
మాఁగు. మాలిన్యము; ముఖమునందలి నల్లనిపొడ. అ. క్రి. కమియఁబండు.
మాఁగుడు. మాలిన్యము, నలుపు.
మాఁగుడువాఱు } అ. క్రి.మాయు, మలినమగు.
మాఁగువడు
మాఁగువాఱు
మాఁటినంగ. కాముకి. [లముగొను.
మాఁటు. తగులము; మాఁటు. అ. క్రి. తగు
మాఁటుమణఁగు } అ. క్రి. జంజాటము డిగినిర్బద్ధమగు. రూ.
మాఁటుమణుఁగు
మాఁటుమడఁగు, మాటుమడుఁగు.
మాఁటువడు. అ. క్రి. తగులంపడు.
మాఁడు. దగ్ధిక, అడుగంటిమాఁడిన అన్నము మొదలగునది; ఇంటియొక్క పైభాగపు కప్పు. అ. క్రి. దగ్ధమగు.
మాఁడుచు. ప్రే. మాఁడించు.
మాఁడుచెక్క. మాఁడు, భిస్సటు.
మాఁడెము. రూ. మండెము.
మాఁతు. చదరంగపుఆటయందుబంటుతో గాక తక్కినవానితో రాజునుగట్టుట.
మాకందము సం. మామిడి†; పరిమళము గల మామిడి†.
మాకరి. మాలకరి.
మాకొను. స. క్రి. కఱచు.
మాక్షికము. సం. తైలవర్ణముగల తేనె; తేనె
మాగధి. సం. అడవిమొల్ల†; పిప్పలి†; షడ్విధప్రాకృత భాషలలో నొకటి.
మాగధుఁడు. సం. బట్టువాఁడు, వంశవీర్యాదులనుపొగడియుపజీవించువాడు.
మాగాణి. వరిపంట పెట్టెడు నేల; దేశము.
మాగాని. దేశము, విలాతి. (తూర్పు మాగాని యని.)
మాగిలి. మాగాణి.
మాఘము. మాఘమాసము.
మాఘ్యము. సం. మొల్ల†.
మాచి. ఒకచెట్టు. సం. కాంచి†.
మాచిపత్తిరి } స్థౌణేయము†.
మాచిపత్రి
మాచెనపక్కె. మత్స్య విశేషము.
మాచేకమ్మ. పోటు, మగతొమ్మయి మీసములు గలిగిన ఆఁడుది.

మాజేం. హిం. గంజాయి బెల్లము మొదలగునవి చేర్చి సిద్ధముచేసిన మత్తువస్తువు.
మాట. వాక్కు, వచనము; పదము;నింద; వృత్తాంతము; ప్రతిజ్ఞావచనము.
మాటకాఁడు. విణ. వక్త, సభయందు భయములేక మాటాడువాఁడు. [వాఁడు.
మాటకారి.విణ. వాగ్మి, యుక్తిగా మాటాడు
మాటలమారి. విణ. వావదూకుఁడు, మిక్కిలి మాటలాడువాఁడు. [పోవుట.
మాటతప్పు. అ.క్రి. వాగ్దత్తము నెఱవేర్చక
మాటలల్లువాఁడు. కవి.
మాటాడు. అ. క్రి. స. క్రి. వచించు; అను.
మాటికి } అడుగడుగునకు, చీటికి
మాటిమాటికి } మాటికి, ముహుఃరర్థకము.
మాటీఁడు. మావటీఁడు.
మాటు. చాటు, మఱుఁగు; గుడికాని దాగుడుగొయ్యి, ఉపశయము; తడవ, ఆవృత్త్యర్థము. స.క్రి. మఱుఁగుపఱచు.
మాటువడు. అ. క్రి. మఱుఁగుపడు, అగపడక పోవు.
మాఠరుఁడు. సం. సూర్యుని ప్రక్కనుండు వారలలో నొకఁడు; వ్యాసుఁడు.
మాడ. సువర్ణము, వరాలోసగము, పణదశకము, రెండు రూపాయలు విలువగల నాణెము.
మాడపట్టు. బ్రహ్మరంధ్ర స్థానము.
మాడి. అడవియులవ†.
మాడికి. ద్ర. విధము.
మాడు. అ. క్రి మెలయు. [మాడువు.
మాడుగు. హర్మ్యము, మిద్దెటిల్లు. రూ.
మాడ్కి. ద్ర. విధము.
మాడ్కివోలె. ఇవార్థకముపైయివార్థకము.
మాడ్పు. ఒకచెట్టు. [ముత్యాలహారము.
మాణవకము. సం. ఇరువదిపేటల
మాణవకుఁడు. సం. బాలకుఁడు.
మాణవము. సం. పదునాఱుపేటల ముత్యాలహారము.
మాణవుఁడు. సం. బాలకుఁడు.
మాణవ్యము. సం. బాలకుల సమూహము
మాణిక్య. సం. బల్లి.
మాణిక్యము. సం. కెంపు.
మాణిమంథము. సం. సైంధవ లవణము.

మాత. సం. తల్లి; బ్రాహ్మ్యాది; లక్ష్మి; పార్వతి; నేల; ఆవు.(తల్లులైదుగురు—రాజుభార్య,అన్నభార్య,గురువుభార్య, భార్యతల్లి, తనతల్లి).
మాతంగము. సం. ఏనుఁగు.
మాతంగి. సం. దేవి; ఒకమహావిద్య; మతంగముని కన్య.
మాతంగుఁడు. సం.మాల, ఒకకిరాతజాతి
మాతగౌరక. మత్స్యవిశేషము.
మాతరపితరులు. సం. తలిదండ్రులు.రూ. మాతరపితలు.
మాతరిశ్వుఁడు. సం. వాయువు.
మాతలి. సం. ఇంద్రునిసారథి.
మాతాపితరులు. సం. తల్లిదండ్రులు.రూ. మాతాపితలు.
మాతాబి. జలతారు.
మాతామహి. సం. తల్లి తల్లి, అమ్మమ్మ.
మాతామహుఁడు. సం. తల్లి తండ్రి,తాత. బ. తల్లి వంశమువారు.
మాతుల. సం. మేనమామభార్య.
మాతులపుత్రకము. సం.ఉమ్మెత్తకాయ.
మాతులము. సం. ఉమ్మెత్త†; మఱ్ఱుఁబాము. [యొక్క భార్య.
మాతులాని. సం. జనము†; మేనమామ
మాతులాహి. సం. (ఉమ్మెత్తలోని) మఱ్ఱుఁబాము.
మాతులి. సం. మేనమామభార్య;జనము.
మాతులుంగకము } సం. మాదిఫలపు
మాతులుంగము } చెట్టు.
మాతులుఁడు. సం. మేనమామ.
మాతులేయుఁడు. సం.మేనమామకొడుకు.
మాతృక. సం. తల్లి; దాది; పార్వతి; వర్ణమాల; అసలుగ్రంథము. (సప్తమాతృకలు—బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి వైష్ణవి, వారాహి,ఇంద్రాణి,చాముండ)
మాతృకము. సం. తల్లియొక్క సొత్తు.
మాతృష్వసేయి } సం. తల్లితోడఁబుట్టిన
మాతృష్వస్రీయ } దాని కూఁతురు.
మాతృష్వసేయుఁడు } సం. తల్లి తోడఁ
మాతృష్వస్రీయుఁడు } బుట్టినదాని కొడుకు.
మాత్ర. చిన్నమందు ఉంట; గోనెసంచి.

సం. శబ్దాది విషయము; నేత్రాదివృత్తి; అక్షరావయవము; వృత్తాంశము; కొంచెము; కొలఁది; త్రుటి; పరివారము; భూషణము; ధనము. అవ్య. మాత్రమున, మాత్రాన.
మాత్రము. ఇతర వ్యవచ్ఛేదకము. సం. అవధారణము, నిశ్చయము; పరిమాణము; సర్వము. [చూచి ఓర్వలేకుండుట.
మాత్సర్యము. సం. చలము, ఒరులగొప్పను
మాద. ఒక రోగము.
మాదము. సం. రూ. మదము.
మాదవళము, మాదళము, మాదావళము, మాదావళి } కపిలవర్ణముగల చీర.
మాదింగ. మాదిఁగ. [కుట్టువాఁడు.
మాదిగ. మాదిగవాఁడు, చెప్పులు
మాదిగకత్తి. భిందిపాలము.
మాదిఫలము. మాతులుంగము†. రూ. మాదీఫలము.
మాదిరి. సామ్యము. విణ. సమానము.
మాదృశుఁడు. సం. విణ. నావంటివాఁడు.
మాదెన. స్థూల పుష్పము†.
మాద్రి. విణ. మాదిరి. సం. పాండురాజు రెండవభార్య, మద్ర రాజపుత్రి.
మాధవకము. సం. ఇప్పపువ్వులకల్లు.
మాధవకరము. గ్రా. మాధుకరము.
మాధవము. వైశాఖమాసము; వసంత ఋతువు.
మాధవి. సం. పువ్వుల గురివెంద†; మాదిఫలము†; సదాప†; ఇప్పపూలకల్లు; కల్లుబెల్లము; తేనె; కండచక్కెర; లక్ష్మి; గోమహిషాద్యవి సమృద్ధి; కుందెనకత్తె.
మాధవుఁడు. సం. విష్ణువు; వసంతుఁడు.
మాధుకరము. సం. మధుకర వృత్తి, తుమ్మెదలు పువ్వులయందు పూఁదేనెను గ్రహించునట్లు భిక్షుకులు గృహస్థుల యిండ్లకుబోయి భిక్షగ్రహించిజీవించుట
మాధురి. సం. మాధుర్యము; కల్లు.
మాధుర్యము. సం. తీపు; కావ్యగుణములలో నొకటి; పక్షులు మొదలగునవి పట్టుటకు బోయవేసెడు ఉల.?
మాధ్యస్థ్యము. సం. మధ్యస్థుఁడు చేయుతీర్పు
మాధ్వి. సం. పుష్పద్రవములతో చేసిన సారా, మద్యము.
మాధ్వీకము. సం. ఇప్ప పువ్వులకల్లు.
మాన. సం. మానిక.
మానన. సం. మన్నన.
మాననీయము. సం. విణ. మన్నింపఁదగినది.
మానము. సం. త్రాసు (త్రివిధ మానములు—తూఁచునది తులామానము,—అంగుళము బెత్తెడు మొ॥ అంగుళీమానము, గిద్ద సోల మొ॥-ప్రస్థమానము.); కొలఁది; మానిక; చిత్తోన్నత్యము; గర్వము; స్త్రీలకు పురుషులయెడఁగలుగు కోపవిశేషము; అభిమానము.
మానవతి. సం. అభిమానముగల స్త్రీ; స్త్రీ
మానవుఁడు. మనుష్యుఁడు.
మానసము. సం. మనస్సు; మానససరస్సు; అభిప్రాయము.
మానసించు. సం. అ. క్రి. తలఁచు.
మానసౌకసము. సం. హంస.
మానా. హిం. వరవడి.
మాని. సం. విణ. అభిమానముగలవాఁడు.
మానిక. సం. నాలుగు సోలల కొలఁది.
మానికదారి. భోగముది.
మానికము. కెంపు; రత్నము.
మానికె. కుడపము; మణి.
మానితము. సం. విణ. మన్నింపఁబడినది.
మానిని. సం. మానవతి.
మానిపుకెక్కుటిపులుఁగు, మానిపోటుపులుఁగు } దార్వాఘాటము, వడ్రంగిపిట్ట.
మానిసి. మానుషుఁడు, మనుష్యుఁడు; మానుషి, మనుష్యస్త్రీ; భటుఁడు.
మానిసికోఁతి. మానిసి యంతయెత్తుగల కోఁతి, పెద్దకోఁతి. [సుఁడు.
మానిసిదిండి. మనుజాశనుఁడు, రాక్షసుఁడు
మానిసిరౌతు. నరవాహనుఁడు, కుబేరుఁడు
మానిసిడేఁడు. నరపాలుఁడు.
మానిసిసింగము. నృసింహుఁడు.
మానీఁగ. భృంగ విశేషము.?
మాను. మ్రాను, చెట్టు; కొమ్మలక్రిందిభాగము, స్కంధము; మనోజ్ఞత. స. క్రి. విడుచు. విణ. మనోజ్ఞము.

మానుచు. క్రి. మనఁజేయు, మానించు.
రూ. మాన్చు. [కసింద వేరు.?
మానుపసుపు. కాలేయకము†; ఎఱ్ఱ
మానుపు. రూ. క్రి. మానుచు.
మానుపోటువు. దార్వాఘాటము.
మానుషి. సం. మనుష్య(స్త్రీ).
మానుషుఁడు. సం. మనుష్యుఁడు.
మానుష్యకము. సం. మనుష్యుల సమూహము.
మానెఁడు. విణ. కుడప ప్రమాణము; రెండు దోసెళ్ల ప్రమాణము.?
మానెరు. మానేరుతీఁగ.
మానేజరు. ఇం. మేనేజరు.
మానేరు. జ్యోతిష్మతి, ఎక్కుడుఁదీఁగె.
మానైనవాఁడు. విణ. అందగాఁడు; యోగ్యుఁడు.
మానోజ్ఞకము. సం. మనోజ్ఞత.
మాన్యము. పన్ను పట్టక అనుభవించునట్లు సన్మానించి యియ్యఁబడిన భూమి. విణ. మన్నింపఁదగినది.
మాపు. సాయంకాలము; రాత్రి (రేపు మాపు అని); మైల, మాలిన్యము (బట్ట మాపుఅని). క్రి. మాయఁజేయు, పోఁగొట్టు (రూపుమాపెనని.)
మాపుడు. మైల.
మాఫు. హిం. క్షమింపు. అ. క్రి. మాఫుచేయు.
మాబాగు. మిగుల మంచిది.
మామ. మాతులుఁడు; శ్వశురుఁడు.
మామకీనము. సం. విణ. నాది, నాయది.
మామకుఁడు. సం. మేనమామ. విణ. నా వాఁడు.
మామమామ. విష్ణువు. [వలదనుట.
మామా. అవ్య. మా ను మా ను, వలదు
మామిడి. చూతము, ఆమ్రము†.
మామిడిగుత్తులు. బ. ధాన్య విశేషము.
మామిలీయతు. హిం. నిర్వాహకత్వము.
మామిళ్లమ్మ. ఒక గ్రామ దేవత.
మాములు. హిం. వాడుక.
మామెల. శారిబ, సూడపాల†.
మాయ. సం. అవిద్య; ఇంద్రజాలాది విద్య; బుద్ధి; ఒక మోక్షపురి, హరి ద్వారము; పీతాంబరము; కపటము.
మాయకాఁడు, మాయగాఁడు, మాయదారి: మి. మాయగలవాఁడు, మాయావి.
మాయపోతు. విణ. మాయలమారి.
మాయము. మాయ. విణ. అదృశ్యము.
మాయలమారి. విణ. మాయలాఁడి; మాయలాఁడు.
మాయలాఁడి. మాయాశీలంరాలు.
మాయలాఁడు. విణ. మాయాశీలుఁడు.
మాయాకారుఁడు. సం. మాయకాఁడు.
మాయాదేవీసుతుఁడు. సం. శాక్య బుద్ధ దేవుఁడు.
మాయావి సం. విణ. మాయ చేయువాఁడు.
మాయి. మఱుఁగు; నలుపు. సం. విణ. మాయగలవాఁడు, మహేశ్వరుఁడు.
మాయికము. సం. విణ. మిథ్యయైనది.
మాయికుఁడు. సం. మాయావి.
మాయు. అ. క్రి. మలినమగు; నశించు. అవ్య. మాయురె.
మాయుకము. సం. గజవిశేషము.?
మాయురె. అవ్య. బళిరె.
మాయువు. సం. పిత్తము.
మాయూరము. సం. మయూరముల సమూహము. విణ. మయూరసంబంధమైనది.
మారకము. సం, విణ. చంపునది.
మారకుఁడు. సం. విణ. చంపువాఁడు.
మారజిత్తు. సం. బుద్ధదేవుఁడు.
మారణము. సం. చంపుట; అభిచార విశేషము; లోహదోషములను విఱుచుట.
మారాటము. రూ. మాఱాటము.
మారాము. మర్మము, కీలు.
మారి. అప. తాచ్ఛీల్యమునందు వచ్చెడు ఒక ప్రత్యయము; ఒక గ్రామ దేవత; అంటురోగము; ఉపద్రవము. సం. మారణము; మసూరికారోగము; వర్షము; జనక్షయము; ఒకశక్తి; చండి.
మారించు, మారిమసంగు, మారిమసలు: అ. క్రి. నాశము చేయు, చంపు.
మారిష. సం. దక్షునితల్లి.
మారిషము. సం. చిల్లికూర. [ఆర్యుఁడు.
మారిషుఁడు. సం. (నాట్యోక్తియందు)

మారీఫత్తు. హిం. వశము.
మారు. ప్రతి; మజ్జిగ.
మారుండము. సం. పాముగ్రుడ్డు.
మారుఁడు. సం. మన్మథుఁడు.
మారుకట్టు. ఇం. అంగడి.
మారుగడ. మాఱకము.
మారుతము. సం. వాయువు. [భీముఁడు.
మారుతాత్మజుఁడు. సం. హనుమంతుఁడు;
మారుతి. సం. స్వాతీనక్షత్రము; హనుమంతుఁడు; భీమసేనుఁడు.
మారుతుఁడు. శత్రువు.
మారుపు. ఒకవిధమైన చేఁప.
మారుమలయు. అ. క్రి. ఎదిరించు.
మారెడు } బిల్వము†.
మారేడు }
మారొడ్డు. అ. క్రి. ప్రతిఘటించు.
మార్కము. మాఱకము, ఒకటిచ్చి మఱియొకటి పుచ్చికొనుట.
మార్కవము. సం. గుంటగలగర†.
మార్కు. ఇం. గుర్తు, పాఠములు చదివినందుకిచ్చు సంఖ్య.
మార్కెట్టు. ఇం. అంగడి.
మార్కొను. అ. క్రి. సం. క్రి. ఎదిరించు.
మార్గణ. సం. వెదకుట; యాచించుట.
మార్గణము. సం. బాణము; వెదకుట.
మార్గణుఁడు. సం. విణ. యాచకుఁడు.
మార్గము.సం.త్రోవ;మృగశీర్ష నక్షత్రము; మార్గశీర్ష మాసము; అన్వేషణము; సంగీత విశేషము; కస్తూరి.
మార్గవులు. మి. మాఱకవులు.
మార్గశిరము } సం. ఒక మాసము.
మార్గశీర్షము }
మార్గితము. సం. విణ. వెదకఁబడినది.
మార్గ్యము. సం. విణ. వెదకఁదగినది; సంస్కరింపఁదగినది.
మార్చు. స.క్రి. వర్ధించు. ప్రే. చంపు; నాశముచేయు; మాఱుపఱచు; ఒకటిచ్చి ఒకటి పుచ్చుకొను.
మార్జన. సం. మద్దెలమ్రోఁత.
మార్జనము. సం. తుడుపు; తోముడు; పరిశుద్ధి; ప్రోక్షణము; లొద్దుగు†.
మార్జని. సం. చీఁపురు.
మార్జనీయము. సం.విణ. తుడుపఁదగినది.
మార్జారము. సం. పిల్లి; పునుఁగుపిల్లి.
మార్జారి. సం.ఆఁడుపిల్లి;ఆఁడుపునుఁగుపిల్లి
మార్జాలము. సం. పిల్లి; మార్జారము.
మార్జించు. సం. స.క్రి. శుభ్రపఱచు.
మార్జిత. సం. కొన్ని సంబారువులు చేర్చి పక్వముచేసిన పెరుఁగు, సిగిరి.
మార్తాండుఁడు. సం. సూర్యుఁడు.
మార్తుఁడు. శత్రువు. [చువాఁడు.
మార్దంగికుఁడు. సం. మృదంగము వాయిం
మార్దవము. సం. మెత్తన. [సవము.
మార్ద్వీకము. సం. ద్రాక్షకల్లు; ద్రాక్షా
మార్పడు. అ.క్రి. మాఱుపడు.
మార్పు. మాఱుపు; ఒకటిచ్చి మఱియొకటి పుచ్చుకొనుట.
మార్పెట్టు. అ.క్రి. ఎదిరించు.
మార్బలము. మి. శత్రుబలము.
మార్మలయు. అ.క్రి. ఎదిరించు.
మార్మాట. మాఱుమాట.
మార్షుఁడు. సం. రూ. మారిషుఁడు.
మార్ష్టి. సం. మార్జనము. [గునది.
మాఱంకము. విణ. ఎదిరించునది; ఎదుర
మాఱకము. సం. మాఱుపు.
మాఱట. విణ. ప్రతిరూపము.
మాఱటగద్దె. ప్రతిరూపమైనది; సింహాసనము.
మాఱటనోరు. మాఱునోరు.
మాఱటరతి. రతిదేవితో సమానమైన సౌందర్యముగల స్త్రీ.
మాఱాకు. ప్రాపుఁగోయ్య, ఉపఘ్నము.
మాఱాట-ము. మాఱాడుట; కలహము.
మాఱాడు. అ.క్రి ఎదురాడు. స.క్రి. ప్రతివచనము చెప్పు.
మాఱు. ప్రతి; ఎదురు; ఆవృత్తి; తడవ; తిరుగ; రెండవతడవ పెట్టఁదగిన భోజ్యపదార్థము;అంతర్ధానము. అ.క్రి.నశించు; మాఱుపడు; వేఱురూపమగు. విణ. ప్రతి; పెద; రెండవది; మఱియొకటి; ప్రతినిధి.
మాఱుఁదల్లి. సవతితల్లి, విమాత.
మాఱుకొను. అ.క్రి. స.క్రి. ఎదురుకొను.

మాఱుగడ. మాఱకము. [రూ. మార్పు.
మాఱుచే. క్రి. మాఱఁజేయు; చంపు.
మాఱుతుఁడు. శత్రువు.
మాఱుదల. వ్యత్యాసము, మాఱుపాటు.
మాఱుదారి. తప్పుత్రోవ, పెడదారి.
మాఱునీళ్ళు. బ. ముట్టునీళ్ళకు మఱుసటి నాఁటి స్నానము. [మగు.
మాఱుపడు. అ.క్రి. భేదపడు; అదృశ్య
మాఱుపాటు. వ్యత్యాసము; మాఱుపడుట
మాఱుపు. వినిమయము, ఒకటిచ్చి మఱి యొకటిపుచ్చుకొనుట.
మాఱుపెట్టు. అ.క్రి. ఎదిరించు.
మాఱుబేరము. చిల్లర (మాఱకపు) బేరము.
మాఱుమగఁడు. ఉపపతి.
మాఱుమనువు. (ఆఁడుదాని) ద్వితీయ వరణము, రెండవవివాహము.
మాఱుమనువుది. దిధిషువు, రెండవ పెండ్లాడిన స్త్రీ.
మాఱుమసలు అ.క్రి. సరిగా ఎదిరించు.
మాఱుమాట. ప్రతివచనము, ఉత్తరము.
మాఱుమూల. ఎదురుమూల.
మాఱుమొగము. పెడమొగము, విముఖము
మాఱుముఖమువడు. అ. క్రి. పెడమొగ మగు
మాఱుమ్రోఁత. ప్రతిధ్వని.
మాఱురూపు. మఱియొకరూపు.
మాఱొడ్డు. ప్రతిఘటనము. అ. క్రి. ప్రతి ఘటించు. [పుష్పహారము.
మాల. చండాలుఁడు. సం. పిక్క†; హారము;
మాలఁడు. చండాలుఁడు,
మాలకము. సం. వేము†; గద్దెర; దిబ్బ
మాలకరి. మాలాకారుఁడు; వనపాలకుఁడు
మాలకాకి. ద్రోణకాకము.
మాలతి. సం. జాజి†; యువతి.
మాలనూలు. మాలలుసేయు సన్ననూలు.
మాలపల్లె. చండాలవాటిక. [షము.
మాలము. సం. దిబ్బ; చడాలజాతి విశే
మాలఱ్ఱము. మాలతికము, చండాలత్వము, హీనత్వము.
మాలతికము. మాలఱ్ఱము.
మాలవాఁడు. చండాలుడు. [వాఁడు
మాలాకారుఁడు. సం. పూదండలుకట్టిఅమ్ము
మాలాతృణకము. సం. చిప్పకసపు†.
మాలిక. సం. పూదండ; మెడఁబెట్టుకొనెడు తీఁగె; విరజాజి†; మాడుగు; ఒకనది; కూఁతురు; పంక్తి, సమూహము.
మాలికాఁడు. కైవర్తకుఁడు.
మాలికుఁడు. మాలాకారుఁడు.
మాలిన్యము. సం. మఱికి.
మాలిమి. స్నేహము, మచ్చిక; వాత్సల్యము; ఓడనడుపువిధానము; మాలిమికాఁడు.
మాలిమికాఁడు. ఓడనడుపు విధానము నెఱిఁగినవాఁడు.
మాలియ. మాలిక; మాడుగు,
మాలి. సం. మాలాకారుఁడు. విణ. మాల గలవాడు; తోఁటమాలి.
మాలీసు. హిం. గుజ్జుమునుతోముట.
మాలు. అ.క్రి. చెడు; నశించు.
మాలవాఁడు. మాలుఁబోతు. విణ నీచుడు, అల్పుఁడు.
మాలుగు. సోమరితనము; మాలుగుట. అ.క్రి. సోమరితనముఁబొందు. రూ. మాల్గు
మాలుగుఁడు. అలసత్వము.
మాలుగుఁబోతు. సోమరి.
మాలుగులు. బోయలభుజములపైమెత్తలు
మాలుచే. క్రి. మాలఁజేయు. రూ. మాల్చు
మాలుధానము. సం. ముట్టుఁబాము.
మాలూరము. సం. మారేడు†; వెలఁగ†.
మాలె. పుష్పమాలిక; మాడుగు.
మాలెత. మాలది, చండాలస్త్రీ.
మాల్యము. సం. పూదండ; పుష్పము.
మాల్యవంతము. సం. ఒక పర్వతము.
మావఁతుఁడు. మావటివాఁడు.
మావటము. తమలపాకులకట్ట.
మావటి } హస్తిపకుఁడు, హస్త్యారోహుఁడు.
మావటికాఁడు }
మావటివాఁడు }
మావటీఁడు }
మావలి. సుగంధిమూల†.
మావి. జరాయువు, మనుష్యాదిగర్భస్థపిండమునకు రక్షకముగా మీఁదక్రమ్ముకొనియుండుపొర; మామిడి†.
మావిడి. మామిడి†.
మావికొమ్మయిలుపులుఁగు. కోకిలము.

మావు. గుఱ్ఱము; అశ్వసంగమము; పల్లె వాఁడు చేఁపలఁబట్టెడి ఒకసాధనము.

మావుమోమువాఁడు తురంగవదనుఁడు, కింపురుషుఁడు.

మావెలఁగ. వరుణము, ఉలిమిరి†.

మాషపర్ణి. సం. కారుమినుము†.

మాషము. సం. మినుము†; అయిదుగురిగింజలయెత్తు; త్వగ్దోషభేదము. విణ మూర్ఖము.

మాషీణము } సం. విణ. మినుములు పండు
మాష్యము } పొలము.

మాస. పక్షిభేదము.

మానటి } శూరుఁడు; మల్లుఁడు. విణ.
మానటీఁడు } శ్రేష్ఠుఁడు.

మాసము. మాషము, రెండున్నర చిన్న మెత్తు. సం. నెల. (ఇవి పండ్రెండు — చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఆషాఢము, శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తికము, మార్గశిరము, పుష్యము, మాఘము, ఫాల్గునము.)

మాసరము. సం. అన్నపు గంజిమీఁది మీఁగడ. విణ. వ్యాప్తము ? దీర్ఘము.?

మాసి. మైల. వా. మానిసి.

మాసిక. అతుకు; చిక్కు.

మాసికము. సం. ఆబ్దికమువలెను నెల నెలకు చేసెడు శ్రాద్ధము. విణ. మాస సంబంధమైనది.

మాస్టీఁడు. రూ. మాసటీఁడు.

మాహాత్మ్యము. సం. గొప్పతనము; విలక్షణత; ప్రభావము.

మాహిష్యుఁడు. సం. క్షత్రియునకు వైశ్య స్త్రీయందుఁ బుట్టినవాఁడు; అంతఃపురము కావలికి తగినవాఁడు.

మాహేంద్రము. సం. దినముయొక్క పదుమూడవ భాగము.

మాహేయి. సం. ఆవు.

మాహేశ్వరి. సం. ఒకమాతృక.

మాళవదేశము. సం. 56 దేశములలోనొకటి.

మాళిగ. మాడుగు.

## మి

మింగడ. రూ. మీఁగడ.

మింగనగొండి. భక్షకుఁడు.

మించిలి. జిబిలిక, నిశాంకుశ†.

మించె. పురుష పాద తర్జన్యాభరణము; మెఱపు; ప్రకాశము; ఆధిక్యము. అ.క్రి. అతిశయించు; అతిక్రమించు.

మించుఁగాలు. దక్షిణపాదము.

మించెఁబోఁడి. మెఱపువలె అందమైన స్త్రీ; స్త్రీ. రూ. మించుఁబోఁడి.

మించెదల. అతిక్రమణము; ఆధిక్యము.

మింజేమలే. హిం. అవ్య. దానిలో నొక పాలు.

మింటిచెట్టు. కల్పవృక్షము.

మింటిచూలి. వాయువు.

మింటితెరువరి. ఖగుడు, సూర్యుఁడు; అమరుఁడు.

మిండ. రక్తపుచ్ఛిక. విణ. వృత్తియందు మిండఁడుయొక్క లుప్తరూపము.

మిండఁడు. విటుఁడు; పురుషుఁడు. విణ. అధికుఁడు.

మిండగాఁడు }
మిండగిఁడు } మిండఁడు, విటుఁడు.
మిండగీఁడు }

మిండత. జారిణి.

మిండతికము. జారత్వము.

మిండలకోరి. జారిణి.

మిండాటము. జారతనము.

మిక్కటము. విణ. మిక్కిలి; వెక్కసము.

మిక్కణ. పతివత్ని.

మిక్కిలి. విణ. అధికము; శ్రేష్ఠము; [అత్యంతము.

మిక్కిలివాఁడు. విణ. అధికుఁడు.

మిక్కిలికంటిదేవర (వేలుపు). త్రినేత్రుఁడు; శివుఁడు.

మిక్కిలికన్ను. త్రిపురాంతకుని ఫాలనేత్రము. రూ. మిక్కిలి కను.

మిక్కలు. అ.క్రి. అతిశయించు; మీఱు.

మిక్కుటము. విణ. మిక్కిలి, వెక్కసము

మిగత. శేషము; అధికము; లాభము.

మిగుల. క్రి.విణ. మిక్కిలి; అత్యంతము.

మిగులు. శేషము; లాభము. అ. క్రి. శేషించు, అతిశయించు; మట్టుమీఱు.
మిగులుచే. ప్రే. మిగులఁజేయు; రూ. మిగుల్చు.
మిటమిట. కాయుట మండుటయందగు ధ్వన్యనుకరణము.
మిటమిటన. మిటమిటయనుట.
మిటమిటలాడు. అ. క్రి. ఎగసిపడు.
మిటాయి. హిం. పిండివంట. రూ. మిఠాయి.
మిటారము. నిక్కు; అతిశయము.
మిటారి. ప్రమద, మదముగల స్త్రీ; స్త్రీ; విలాసవతి; గడుసు. విణ. మదముగలది, నిక్కుగలది; ఉన్నతిగలది.
మిటారించే. అ. క్రి. నిక్కు; విజృంభించు; అతిశయించు.
మిటారింపు. విలాసము. [తము; తీక్ష్ణము
మిట్ట. దిబ్బ; ఉన్నతభూమి. విణ. ఉన్న
మిట్టపండ్లవాఁడు. దంతురుఁడు. [ములు
మిట్టపండ్లు. బ. ముందటికి వచ్చిన దంత
మిట్టమిఱ్ఱు. అత్యున్నతభూమి. విణ. అత్యున్నతము.
మిట్టాడు. అ క్రి. సంచరించు.
మిట్టించే. అ. క్రి. ఎగురు.
మిట్టిపడు. అ. క్రి. ఎగిరిపడు.
మిట్టిపాటు. మిట్టిపడుట.
మిట్టు. అ. క్రి. ఎగురు.
మిడి. గర్వము. విణ. మిడిసిపాటుగలది.
మిడిగ్రుడ్లవాఁడు. విణ. ఉన్నేత్రుఁడు.
మిడిగ్రుడ్లు. బ. ముందటికి తొకిన కనుగ్రుడ్లు.
మిడినాగు. ఎగిరిఎగిరిపడు సర్పవిశేషము.
మిడిపండ్లవాఁడు. విణ. మిట్టపండ్లవాఁడు.
మిడిపండ్లు. బ. మిట్టపండ్లు.
మిడిమాని. శూరుఁడు.
మిడిమేలము. మిడిసిపాటు.
మిడియు. వేదవాక్యము.
మిడియు. అ. క్రి. ఎగురు; వెలికుఱుకు.
మిడివోవు. అ. క్రి. తక్కు; తొలఁగు
మిడిసిపడు. అ. క్రి. మిట్టిపడు.
మిడిసిపాటు. గర్వము, మిడిసిపడుట.
మిడుఁగు. మిడుఁగుఱు.
మిడుఁగుఱుఁబురుగు. ఖద్యోతము.
మిడుఁగుఱు. అగ్నికణము; ఖద్యోతము, మిణుఁగుఱుఁబురుగు. బ. స్ఫులింగములు.
మిడుకు. జీవనము; పరిదేవనము. అ. క్రి బ్రదుకు; త్రుళ్ళు; కదలు; సంచరించు; దుఃఖించు; పరితపించు; ఎండు.
మిడుకుమాలు అ క్రి. ఉండు.
మిడుగుఱాయి. కఠినశిల.
మిడుచే. స. క్రి. ద్రవద్రవ్యమునుబొట్టు బొట్టుగా విడుచు; నెటికవిఱుచు.
మిడుత. శలభము, ఒకదినుసు తెక్కలు పురుగు [మిణుకు.
మిడుమిడుకను. అ క్రి పరితపించు;
మిణకరము. ఏమియుతోఁచక భ్రమించుట
మిణకరించే. అ. క్రి. ఏమియు తోఁచక భ్రమించు.
మిణుఁగు. రూ. మిడుఁగు. [లింగములు.
మిణుగుఁఱు. రూ. మిడుఁగుఱు. బ. స్ఫు
మిణుఁగుఱుఁబురుగు. ఖద్యోతము.
మితంపచుఁడు. సం. విణ. లోభి.
మితము. సం. విణ. కొలువఁబడినది; తెలియఁబడినది; తూఁచఁబడినది.
మితి. సం. పరిమాణము, కొలఁది; గడువు, హద్దు.
మిత్త. స్నేహితుఁడు. [శంఖపుష్పిక†.
మిత్తి. మృత్యుదేవత; చావు, మృత్యువు;
మిత్తిక. మన్ను, మృత్తిక.
మిత్తిగొంగ. శివుఁడు, కాలకాలుఁడు.
మిత్తిచూలు. కేతుగ్రహము.
మిత్తిమిత్తి. మహామృత్యువు, శివుఁడు.
మిత్తివేటకాఁడు. శివుఁడు, మృత్యుంజయుఁడు.
మిత్రము. సం. స్నేహితుఁడు; దండెత్తిపోవువాని శత్రుదేశమున కావలిదేశపు రాజు.
మిత్రుఁడు. సం. సూర్యుఁడు; స్నేహితుఁడు
మిథము. సం. అవ్య. అన్యోన్యము, పరస్పరము. [పట్టణము.
మిథిల. సం. విదేహనగరము, జనకరాజ
మిథునము. సం. ఆలుమగలజత; ద్వయము; మిథునరాశి.
మిథ్య. సం. అవ్య. అసత్యము.
మిథ్యాదృష్టి. సం. నాస్తికత.

మిథ్యామతి. సం. భ్రాంతి.
మిదిల. మిథిల.
మిద్దియ. మిద్దె.
మిద్దె. చంద్రశాల, మాడుపుమీఁద చదునుగా పలకలం కప్పి గచ్చు పూసినకప్పు; తామరపూవు మొదలగు వానిలోపలి దిమ్మె; ఉంగరముమీఁద దిమ్మెవలె నేర్పఱచెడి తదవయవవిశేషము.
మిన. కాంతి.
మినమిన. తళతళయను కాంతివిశేషము.
మినమినవాడు. మేదురుఁడు.
మినమినలాడు. అ.క్రి. మినమినయని మెఱయు.
మినహాయించి. అవ్య. వినా, విడిచి.
మినహాయింపు. తగ్గింపు; తీసివేత.
మిను. ఆకాశము.
మినుకు. మినుకుమినుక్కు మను కాంతి; కిణము; తాలిబొట్టు; చిన్న బంగారు నాణెము. బ. వేదము; వాక్కు. అ.క్రి. మినుకు మినుక్కుమను.
మినుకుఁజేడియ. సరస్వతి, వాగ్దేవి.
మినుకుతెరువరులు. దేవతలు.
మినుకుమినుకుమను. అ.క్రి. మినుకుమినుక్కుమని మెఱయు.
మినుకులదణి. బ్రహ్మ.
మినుకులబరణి } త్రయీతనువు,
మినుకులయిక్క } సూర్యుఁడు
మినుకులు. బ. వేదము; వాక్కు.
మినుక్కురను. అ. క్రి. మినుక్కుమని మెఱయు.
మినుచూలు. వాయువు, నభస్వంతుఁడు.
మినుపపోఁక. భక్ష్యవిశేషము.
మినుమినుకను. అ.క్రి. మినుకుమినుకుమను
మినుము. మాషము, సస్యవిశేషము. బ. ధాన్యవిశేషము.
మినువాఁక. గంగ.
మినువాఁకతోఁబుట్టువు. శూద్రుఁడు
మినుసికగలాఁడు } వ్యోమకేశుఁడు,
మినుసిగవేల్పు } శివుఁడు.
మినుక్కులచదువరి. విప్రుఁడు, అదితి.
మినుక్కులు. బ. వేదము; వాక్కు.
మిన్న రత్నము; భూషణము. విణ. శ్రేష్ఠము†
మిన్నక. అవ్య. ఊరక.
మిన్ను. ఆకాశము.
మిన్నుకొలఁకు. ఆకాశగంగ, సురదీర్ఘిక.
మిన్నుమన్ను. రోదసి, ఆకాశము భూమియు.
మిన్నువాఁక. స్వర్ణది, ఆకాశగంగ.
మిన్నువాఁకతాలుపు } శివుఁడు, గంగా
మిన్నువాఁకదారి } ధరుఁడు.
మిన్నేఱు. ఆకాశగంగ, స్వర్ణది.
మిన్వాఁక. రూ. మిన్నువాఁక.
మిమ్మటము. విణ. మిక్కుటము.
మిర. సం. మేర, మర్యాద.?
మిరాసి. హిం. పారంపర్యముగా వచ్చు సొత్తు, హక్కు.
మిరాసిదారు. పరంపరా ప్రాప్తమైన హక్కుగలవాఁడు.
మిరిమిడి. తళతళ.
మిరియము. మరీచము, ఒకదినుసు సంబారువు.
మిరెపకాండ్ర. ఒక ముండ్లచెట్టు.
మిరెపకాయ. బృహన్మరీచము.
మిరెము. రూ. మిరియము.
మిర్మిట్లు. బ. రూ. మిఱుమిట్లు.
మిర్యము. మిరియము.
మిఱిమిఱి. మించు; తళతళ.
మిఱు. విణ. మిఱుమిట్లుగలిగి.
మిఱుమిట్లు. బ. (కన్నులు) మిక్కిలి మిట్టుటలు. రూ. మిఱుమిట్టులు.
మిఱుమిట్లుగొను. అ. క్రి. (కన్నులు) మిక్కిలి చెదరు.
మిట్టు. ఉన్నతభూమి. విణ. ఉన్నతము.
మిట్టుచూపు. ఊర్ధ్వదృష్టి.
మిట్టెడు శిఖరము.
మిలమిల. మినమిన; మెదలుట మెలఁగుట యందగు ధ్వన్యనుకరణము.
మిలమిలన. మినమినలాడుట.
మిలమిలలాడు. అ. క్రి. మినమినలాఁడు.
మిలాయించు హిం స క్రి. కలుపు.
మిలు. బ. మీలు, చేఁపలు.
మిల్లి. చిన్నగరిఁటె.
మివులు. అ. క్రి. రూ మిగులు.
మిశ్రణము. సం. కలుపుట.
మిశ్రము } సం. విణ. కలిపినది; కలసి
మిశ్రితము } నది; కలపఁబడినది.

మిశ్రీకరించు. సం. స. క్రి. కలుపు.
మిశ్రేయ. సం. సదాప†.
మిష—ము. సం. నెపము.
మిషి. సం. జటామాంసి†.
మిస. కాంతివిశేషము. [అనుకరణము.
మిసమిస. మెఱయుటయందగు
మిసమిసమను. అ. క్రి. మిసమిసయని మెఱయు.
మిసి. మత్స్యవిశేషము. సం. జటామాంసి†; ఓమము†; సదాప†; అడవి సదాప†.
మిసికల్లు. మత్స్యవిశేషము.
మిసిమి. నూతనకాంతి; నవనీతము.
మిసిమింతుఁడు. విణ. అలసినవాఁడు
మిసిమింతురాలు. విణ. అలసినది.
మిసుకు అ. క్రి. కదలు. [శ్రోత్రి.
మిహి. మృదుత్వము. విణ. శ్రేష్ఠము;
మిహిక. సం. మంచు.
మిహిరుఁడు సం. సూర్యుఁడు.
మిళిందము. సం. తుమ్మెద.
మిళితము సం. విణ. మిశ్రము.
మిళ్ళి. మిల్లిగరిఁటె.

## మీ

మీ. విణ. మీఁదుశబ్దముయొక్క లుప్త రూపము. [శరభమృగము.
మీఁగండ్లమెకము. ఊర్ధ్వ లోచనము,
మీఁగడ. సంతానిక, కాఁగిన పాలమీఁది తెట్టె; మస్తువు, మండము, పెరుఁగు మీఁది తెట్టె. [తోడి పెరుఁగు.
మీఁగడపెరుఁగు. శ్రీఘనము, మీఁగడ
మీఁగాలు. పాదోపరిభాగము, పాదపృష్ఠము.
మీఁజేయి. కరోపరిభాగము, కరపృష్ఠము.
మీఁదిసాకిరి. ఉత్తరసాక్షి.
మీఁదు. పరము; ఊర్ధ్వము, ఉపరి భాగము; భవిష్యత్కాలము; దేవతకని నియమించిన ముడుపు.
మీఁదుమిక్కిలి. క్రి. విణ. కడుమిక్కిలి, అత్యంతము; పైఁగా
మీట. ఏతపుమ్రానిక్రిందియరభాగము.
మీటింగు. ఇం. సమావేశము.
మీటు. ఉద్రేకము; గొప్ప; పెంపు. విణ. అధికము. స. క్రి. ఎగఁజిమ్ము; పొడుచు; కట్టు; వీణెమీటు.
మీఢము. సం. విణ. తడుపఁబడినది.
మీనకేతనుఁడు. సం. మన్మథుఁడు.
మీనము, సం. మత్స్యము, చేఁప; మీనరాశి.
మీనవల్లంకి, మీనవల్లిక. పత్రికము, నీటికాకికిమత్స్యములనుపట్టెడుపక్షివిశేషము.
మీనాక్షి. ఒక దేవి; కుబేరుని కూఁతురు; మచ్చెకంటి.
మీను. మత్స్యము.
మీనురూపురిక్క. రేవతీనక్షత్రము.
మీనుమొసలిసిడెంబులమేటి. మన్మథుఁడు మకరకేతనుఁడు, మీనకేతనుఁడు.
మీమాంస. సం. కర్మ బ్రహ్మప్రతిపాదక శాస్త్రము; ప్రమాణములుచేత నిజము గ్రహించుట; (మీమాంసలు రెండు — పూర్వమీమాంస (ధర్మసూత్రములు); ఉత్తరమీమాంస (బ్రహ్మసూత్రములు).
మీమాంసకుఁడు. సం. మీమాంసాశాస్త్రజ్ఞుడు. [వర్ధిల్లు స. క్రి. అతిక్రమించు.
మీఱు. అ. క్రి. అతిశయించు; కడచు;
మీలదొంగ. మీనవల్లంకి. [లంకారము.
మీలనము. సం. కనుమూయుట; ఒక అర్థా
మీలముచ్చు. మీనవల్లంకి.
మీలవల్లంకి. మీనవల్లిక.
మీలితము. సం. విణ. మూయఁబడినది.
మీలు. బ. మత్స్యములు.
మీవడ. రూ. మీఁగడ.
మీస. శ్మశ్రువు, మీసము.
మీసకట్టు. మీసముయొక్క ఏర్పాటు.
మీసము. శ్మశ్రువు. మగవాని పైపెదవి మీఁది వెండ్రుకలవరుస.
మీసర. మృగశిర.
మీసరము. విణ. శ్రేష్ఠము.

## ము

ము. అప. అమహత్తులకును మహాన్నపుంసకములకును ప్రథమైక వచనమందు వచ్చెడి ప్రత్యయము (వనము, జలము

అని); అస్మచ్ఛబ్ద ప్రథమా బహువచనము (మేముఅని); ఇదితరువాతి యక్షరము నకు ద్విత్వముపుట్టించితాను త్రివాచకము అగును (ముజ్వేలుపులు, ముక్కంటియని) విణ. వృత్తియందు మూడుశబ్దమునకు ఆదేశముగావచ్చెను రూపము; ముందు శబ్దముయొక్క లుప్తరూపము.

ముంగ. ఎన్నులమోవు. విణ. మూఁగ.

ముంగడ. ముంగల.

ముంగతనము. మూర్ఖత.

ముంగమురము, ముంగమురాము, ముంగమురారి, ముంగయిమురారి } ముంజేతధరించెడు కటకవిశేషము.

ముంగర. ముక్కర. [పూర్వకాలము.

ముంగల. ముందుచోటు; ముందు; ఎదురు;

ముంగలి. విణ. మీఁదటి; ముందునడచు నది; ముందునడచువాఁడు.

ముంగలిది. విణ. ఎదుటనున్నది.

ముంగలు. అ. క్రి. ముందునడచు.

ముంగాము. పొట్లముగామడిచిన తాటాకు మట్టు; బెల్లముమొదలగువానిని నించిన బరువులోనగము.

ముంగాముచీర. ఆడువారుకట్టుకొనెడు ఒకదినుసునారకోక.

ముంగామురము, ముంగామురారి, ముంగామురుగు } ముంగామురువు, ముంజేతధరించెడు సువర్ణ కటకభేదము.

ముంగాలు. ప్రపదము, పాదాగ్రము. బ. ముంగాళ్లు.

ముంగి. ముంగిస. [ళు మూర్ఖునిస్వభావము.

ముంగిముశాతనము. గ్రా. మౌనము గానుం

ముంగిలి. గృహాంగణము; అంకణము యొక్క మధ్యప్రదేశము; అంకణము; మధ్యప్రదేశము.

ముంగిస. ముంగి, నకులము. [చివర.

ముంగిసమ్రానను. ముంగిసరూపుగల మునస

ముంగురులు. అలకలు, నొసటిపై గునిసి యాడెడు ఉంగరపువెండ్రుకలు.

ముంగేలు. ముంజేయి.

ముంగైమురారి. ముంగామురుగు.

ముంగ్గొంగు, చెఱఁగుకొన, ముందటికొంగు.

ముంగొన. ముందటికొన.

ముంగోపము. మి. ఓర్పులేక తటాలున వచ్చు కోపము.

ముంగోపి. విణ. ఓర్పులేకతటాలున కోపము చేసికొనువాఁడు.

ముంగోలు. విణ. మొదటిది, ప్రాథమికము.

ముంచే. ప్రే. మునుఁగఁజేయు. [కప్పు

ముంచేకొను. స. క్రి. ఆక్రమించుకొను;

ముంజకేశుఁడు. సం. విష్ణువు.

ముంజము. సం. పౌనిక, ముంజిగడ్డి.

ముంజి. మౌంజి, బ్రహ్మచారి కట్టుకొనెడు ముంజదర్భ మొలత్రాడు.

ముంజికాఁడు. బ్రహ్మచారి.

ముంజికోక. నారచీర.

ముంజె. లేఁత తాటికాయలోని గిజురు.

ముంజెయి, ముంజెయ్యి, ముంజేయి } మనికట్టు వఱకుఁ గల మోచేతి క్రింది చేయి, ప్రకోష్ఠము.

ముంజెరమ. నాసాపుటము. [గము

ముంజోరు. కొణిగ, చూరు ముందటిభా

ముంటఁజీల్చు. స. క్రి. పోఁజు.

ముండ. విధవ. బ. వేశ్య. సం. బోడతరము†. విణ. బోడిది.

ముండనము. క్షౌరము.

ముండము. సం. తల.

ముండమోపి. విధవ, ముండమోసినది.

ముండమోయు. అ. క్రి. వైధవ్యమునొందు; వ్యర్థమగు.

ముండరి, ముండలమారి } విణ. వైశికుఁడు, వేశ్యాసంగమశీలుఁడు.

ముండలు. బ. వేశ్య.

ముండి. సం. ముంగలవాఁడు; బోడతరము†; బోడితలవాఁడు; పయసున కొమ్ములు రాని మృగము.

ముండితము. సం. విణ. గొఱుగఁబడ్డది.

ముండితుఁడు సం. విణ. తల బోడియైన వాఁడు; తల గొఱుగఁబడినవాఁడు.

ముండుఁడు సం. గాహువు; ఒక అసురుఁడు. విణ. బోడితలవాఁడు; తెగిన చేతులుకాళ్లు మొదలగునవి కలవాఁడు.

ముండులవాన. అడవిపంది విడిచిన ముండ్ల వంటి యాకలు.

ముండ్లకంచె }
ముండ్లకంప } ఆవేష్టకము, వెలుగు.
ముండ్లపంది. శల్యము, ఏదుపంది.
ముండ్రెము. కబంధము.?
ముంత. జోడ్తవెలవంటి మానిపాత్రము; మానిక; వాడుకొనెడు చెంబు; మృత్పాత్ర విశేషము.
ముంతపొగ. మూతికి కట్టుటకు కాల్చి ముంతలో వేసిన మిరపకాయల పొగ.
ముంతమామిడి. అగ్రబీజము, ముంతలం తేసి కాయలుంగల మామిడిచెట్టు.
ముందడి. దట్టు, దుట్టము.
ముందర. మునుపు; మొదలు; ఎదురు.
ముందరడుగు వెనుకకుపెట్టు. అ. క్రి. వెనుదీయు.
ముందరిపప్పు. గ్రా. ముంతమామిడిపప్పు
ముందఱ. రూ. ముందర.
ముందఱిమ్రాను. అరణినిలుపుటకై అడ్డముగాఁగట్టబడిన మ్రాను.
ముందల. శిరోగ్రభాగము. [భాగము.
ముందు. ఎదురు; పూర్వకాలము; పురో
ముందుపడు. అ. క్రి. ముందగు
ముంపు. ముంచుట; గుంపు.
ముంపుగొను. అ. క్రి. గుంపుగూడు.
ముకద్దం. హిం. గ్రామపుపెద్ద. రూ. మొఖద్దం. [మొఖద్దమా
ముకద్ధమా. హిం. వ్యవహారము, పని. రూ.
ముకాబిలా. హి. సంప్రతింపు. రూ. మొఖాబిలా.
ముకాసా. గ్రా. పన్నులేకుండ నియ్యఁబడిన గ్రామము. రూ. మొఖాసా.
ముకు. ముక్కు.
ముకుందము. సం. ఎఱ్ఱదామర; నవనిధులలో ఒకటి; పాదరసము; ఒక రత్నము; కుందురువు†.
ముకుందుఁడు సం. మోక్షదాత, విష్ణువు.
ముకుఁ(గోళ్ళు బ. నాసారంధ్రములు.
ముకుఁజెఱమ. నాసాపుటము.
ముకుఁద్రాడు. నాథము, ఎద్దులముక్కునఁ గ్రుచ్చెడు దారము.
ముకుగొయ్య. మనుజుని బాధపెట్టు సాధనము.
ముకుటము. నారమడి, క్షౌమవస్త్రము. సం. కిరీటము.
ముకుదూలము. ముక్కునడిమి యెముక.
ముకుదొమ్మ. మత్స్యవిశేషము.
ముకుబంతి. గోవులకు శైత్యముచే నాసారంధ్రములయందుఁ గలిగెడు కేశావృత పిండరూప వ్యాధివిశేషము.
ముకురము. స. అద్దము; పొగడ†; మల్లె†; మొగ్గ; కుమ్మరిలాతము.
ముకులు. బ. చూచుకములు.
ముకుష్టకము. సం. అడవిపెసలు.
ముకుళము. సం. మొగ్గ; అరవిరిమొగ్గ; అభినయ హస్తవిశేషము.
ముకుళించు. సం. అ. క్రి. మొగుడు, ముడుచుకొను. [ముడుచుకొనినది.
ముకుళితము. సం. విశే. ముకుళించినది,
ముకుళీభవించు. సం. అ. క్రి. ముకుళించు
ముకూలకము. సం. దంతిచెట్టు.
ముక్క. తునుక, ఖండము.
ముక్కంటి. త్రినేత్రుఁడు, మూడుకన్నులుం గలవాఁడు, శివుఁడు. [రుఁడు.
ముక్కంటిచెలి. త్ర్యంబకసఖుఁడు, కుబే
ముక్కంటిచుక్క. ఉత్తరభాద్ర నక్షత్రము. [చూడామణి.
ముక్కంటితలపువ్వు. చంద్రుఁడు, శివ
ముక్కంటితొలిపట్టి. వినాయకుఁడు.
ముక్కంటిపండు. నారికేళఫలము.
ముక్కంటిపండుల మెక్కెడు దిండీఁడు. వినాయకుఁడు.
ముక్కంటిపట్టి వినాయకుఁడు.
ముక్కంటిమల }
ముక్కంటియిల్లు } కైలాసపర్వతము.
ముక్కంటిమావు. శివవాహనము, వృషభము.
ముక్కంటియమ్ములపాది. సముద్రము.
ముక్కంటివిల్లు. మేరుగిరి, మేరుధనువు.
ముక్కంటివెలఁది. భవాని, పార్వతి.
ముక్కంటిసొమ్ము. సర్పము, నాగభూషణము.
ముక్కఁడి. దుక్కిచాలించి ఆహారమునకు పోవునపుడు అరకలన్నిటి నొక్కచో ప్రోగుచేసి యొక్కటిగాఁ జేర్చి నిలిపి

నట్టి యా అగకలకాఁడ్ల మొత్తము ; అనే
కులకు ఒక పెట్టున తగిలెడు వ్యాధి,
సాంక్రమికామయము.
ముక్కద్దము. సులోచనము, కంటిజోడు.
ముక్కన్ను. మూడవకన్ను, ఫాలనేత్రము.
ముక్కపురుగు. తవుటిపురుగు.
ముక్కర. అడ్డబాస, నాసికాభరణభేదము
ముక్కరమాను. పుల్లిరుసు తిరుగుచట్రము.
ముక్కరము. నాసికారంధ్రము, ముకుఁ
గ్రోళ్లు.
ముక్కఱ. నాసికాభరణవిశేషము.
ముక్కలిపీఁట. ముక్కాలిపీఁట.
ముక్కాఁక. మూడు కాఁకలసమాహారము.
ముక్కాని. మూడు కానులు.
ముక్కారు మూడు కారులు.
ముక్కాలిపీఁట. మూడు కాళ్ళ పీఁట.
మూడుకాళ్ళమర్చిన యెత్తుబల్ల.
ముక్కాలు. మూడు కాళ్ళు, ముప్పాతిక.
ముక్కాలుగరెయ. త్రిపాదఘటిక.
ముక్కిండి. ముక్కిఁడి, విగత నాసికుఁడు.
ముక్కిఁడి. విణ. ముక్కుపోయినవాఁడు.
ముక్కిడి. ఒక చెట్టు.
ముక్కు. పక్షిముక్కు, చంచువు; చూచు
కము; నాసిక. అ. క్రి చెడు; ఏదైన
కష్టమైన పనిని చేయునపుడు శ్వాసమును
బిగఁబట్టు.
ముక్కుఁగంబము ముకుదూలము.
ముక్కుఁగమ్మి. ముక్కుపోఁగు, అడ్డబాస
ముక్కుఁగొయ్య. రూ. ముకుగొయ్య.
ముక్కుఁగోలఁది. విణ. నాసికాదఘ్నము.
ముక్కుఁగ్రోళ్ళు. } బ. నాసారంధ్ర
ముక్కుఁజెలమలు } ములు.
ముక్కుఁద్రాడు. రూ ముకుఁద్రాడు.
ముక్కుటము. నారమడి, క్షౌమవస్త్ర
భేదము
ముక్కుదాడిమ. ఒక చెట్టు.
ముక్కుదూలము. రూ. ముకుదూలము.
ముక్కుపూరెడు. ఒకజెనుసు పూరేడుపిట్ట.
ముక్కుపొడి. నస్యము.
ముక్కుపోఁగు. ముక్కుఁగమ్మి, నత్తు.
ముక్కుబంటి. విణ. నాసికాదఘ్నము.
ముక్కుముంగర. ఒకానొక అడవిచెట్టు.

ముక్కులు. బ. మిక్కిలి సన్ననూకలు;
ధాన్యవిశేషము.
ముక్కుస. మూడుకుంచములు వా. ముక్క
ముక్కూరు. అ. క్రి. అజ్ఞతనుపొందు.
ముక్కొంకులు. బ. మూడువంకరలు.
ముక్కొటిక. త్రిఘురములు.
ముక్కొను. అ. క్రి ఎదురుకొను.
ముక్కొమ్ముమెకము. ఖుశ్యమృగము,
మనుఁబోతు [రాంతకుఁడు.
ముక్కొటికలకంటు. శివుఁడు, త్రిపు
ముక్కోటి. మి. ముక్కోటి యేకాదశి.
ముక్కోణము. మి. త్రికోణము
ముక్కోపము. గ్రా. ముంగోపము.
ముక్కోపి గ్రా. ముంగోపి.
ముక్కోల. త్రిదండము. [టాలు
ముక్త సం. ముత్తెము; ముత్తరాలు; అంకు
ముక్తకంచుకము. సం. కుబుసము విడి
చిన పాము. [ముక్తి నొందినది.
ముక్తము. సం. విణ. విడిచిపెట్టఁబడినది;
ముక్తసరి. సంగ్రహము.
ముక్తసరు. హిం. సంగ్రహమైన.
ముక్తాఫలము. సం. ముత్యము.
ముక్తాయింపు. ముగింపు.
ముక్తావళి. సం. ముత్యాలహారము.
ముక్తాస్ఫోటము. సం. ముత్తెపుఁజిప్ప.
ముక్త్యార్. హిం స్వతంత్రుఁడు.
ముక్తి. సం. మోక్షము, విడుపు [వాఁడు.
ముక్తుఁడు. సం. మోక్షమును పొందిన
ముఖజుఁడు సం. బ్రాహ్మణుఁడు.
ముఖభూషణము. సం. తాంబూలము.
ముఖము సం. మొగము, మోము; నోరు;
మాట; ఒక నాటకసంధి; ఇల్లు మొదలగు
వాని ముందటి భాగము; మొదలు;
ద్వారము; ప్రధానము; ఉపాయము.
ముఖరము. సం. విణ. మిక్కిలి మ్రోఁగు
నది; అసంబద్ధవచనములాడునది.
ముఖరుఁడు. సం. విణ. ప్రేలరి.
ముఖవాసనము. సం. ముఖమును పరిమ
ళింపఁజేయు కర్పూరము మొ.
ముఖవీణ. సం. మొగవీణె. ? [చావడి.
ముఖశాల. సం. మొగసాల, తలవాకిటి
ముఖ్యము. సం. ప్రధానము, శ్రేష్ఠము.

ముఖ్యుఁడు. సం. సజాతీయులలో శ్రేష్ఠుఁడు.
ముగండి. ముక్కడి.
ముగము. ముఖము.
ముగతి. పతివత్ని.
ముగించు. ప్రే. సమాప్తముచేయు.
ముగింపు. సమాప్తి.
ముగితి. ముక్తి, మోక్షము.
ముగియిక. ముగింపు.
ముగియు. అ. క్రి. సమాప్తమగు.
ముగుద. స్త్రీ. విణ. ముగ్ధ స్త్రీ.
ముగుదుఁడు. విణ. ముగ్ధుఁడు.
ముగురు. మూఁడుశబ్దమునకు మహన్మహత్యర్థక బహువచనాంతాదేశము.
ముగ్గ. అప్ర. ఒకచెట్టు.
ముగ్గు. రంగవల్లిక. అ. క్రి. కాయమాగు.
ముగ్గురు స. బ. రూ. ముగురు. [ధ్యము
ముగ్గొయ్య. అగ్రదండము. విణ. అసా
ముగ్ధ. సం. స్వీయాంతర్భేదవిశిష్ట నాయికావిశేషము; ఉదయించుచున్న యౌవనముగల స్త్రీ; స్త్రీ.
ముగ్ధము. సం. విణ. తెలివిలేనిది; క్రొత్తది; సుందరమైనది.
ముచ్చి. చిత్రకారుఁడు.
ముచ్చిక. లేంకాయ తాటికాయ మొదలగువాని తొడిమక్రింది బిళ్ల.
ముచ్చికొను. అ. క్రి. ముసరుకొను.
ముచ్చిచ్చు. త్రేత, అగ్నిత్రయము.
ముచ్చిరి. విణ. శోకమునొందినవాఁడు; దుఃఖము నొందినవాఁడు.
ముచ్చిరితనము. మనోవ్యథ.
ముచ్చిరు. అ. క్రి శోకించు; దుఃఖించు.
ముచ్చిలి. ముచ్చిలిగుంట.
ముచ్చిలించు. స. క్రి. దొంగిలించు.
ముచ్చిలిక. వాదిప్రతివాదులమధ్యస్థులకు మీరు తీర్పుచేసిన ప్రకారము ఒప్పుకొని యెదమని వ్రాసియిచ్చెడు ఒడంబడిక; సేద్యముచేయు కాఁపులు నేలకలవారికి వ్రాసియిచ్చెడు ఒడబడిక. [అపటువు.
ముచ్చిలిగుంట. పెడతలయందలి గుంత,
ముచ్చిలిపాటు. కనికిపాటు.
ముచ్చిలు. స. క్రి. దొంగిలించు.

ముచ్చివాఁడు. చిత్రకారుఁడు.
ముచ్చివుక. ముప్పావులా.
ముచ్చె మీఁగాలు గుదిగాలు సైతముకప్పుకొని యుండెడు పాపోసు, పార్ష్ణిత్ర.
ముచ్చెబంగారు. కాకిబంగారము.
ముచ్చెఱువు జలములు. మి. బ. మూఁడు చెఱువులనీళ్లు, ఒకసామెత.
ముచ్చెలక. దుగులముబేడ. ? [కారుఁడు.
ముచ్చెవాఁడు. మాదిగవాఁడు, చర్మ
ముచ్చె. ముడ్డియందలి పూస, త్రికము.
ముచ్చెంగి. మత్స్యవిశేషము.
ముచ్చట. సల్లాపము; వాక్యము; వృత్తాంతము; కోరిక; ప్రేమము; వేడుక.
ముచ్చటకాఁడు. విణ. కోరికకలవాఁడు.
ముచ్చటపడు. అ. క్రి. కోరు.
ముచ్చటించు. అ. క్రి. ముచ్చటలాడు.
ముచ్చట్లు. బ. మూఁడుప్రదేశములు.
ముచ్చమడుఁగు. అ. క్రి. మిక్కిలిమడుఁగు
ముచ్చవలము. మూఁడు చేవలములు.
ముచ్చవుకము. పండ్రెండు.
ముచ్చు. రూ. ముచ్చు.
ముచ్చుట్టు. మూఁడుచుట్లు.
ముచ్చుప్రొద్దు. అర్ధరాత్రము.
ముచ్చుబొడుపు. దొంగపిల్లవాఁడు.
ముచ్చొకము. పండ్రెండు.
ముజ్జగన్మాత మి. త్రిలోకమాత, మూఁడు లోకములకు తల్లి.
ముజ్జగములు. మి. త్రిలోకములు.
ముజేరా. హిం. తిరుగరావలసినసొమ్ము.
ముజేముదారు. హిం. లెక్కలను పరీక్షించు నొక యుద్యోగస్థుఁడు.
ముటము. ముద్దపిసుక. [పిడుకలు.
ముటాలు. బ. గ్రా. వంటచెఱుకు; ముద్ద
ముట్టగొలుచు. స. క్రి. తుదివఱకుకొలుచు
ముట్టఁబడు అ. క్రి. డయ్యు.
ముట్టడము / ముట్టడి } నిర్బంధము; ముట్టడించుట.
ముట్టడించు. స. క్రి. ఊరు కోట మొదలగు దానిని చుట్టుకొని నిర్బంధించు.

ముట్టణము. రూ. ముట్టడము.
ముట్టించు. ప్రే. ముట్టఁజేయు, తాఁకించు; కాల్చు; రగుల్చు.
ముట్టికాళ్లవాఁడు. విణ. ముట్టుమోఁకాళ్లు గలవాఁడు, సంహతజానుకుఁడు.
ముట్టియ. ముట్టె.
ముట్టు. తాఁకుడు; స్త్రీ రజస్సు; కొలిముట్టు, పనికరము. స. క్రి. తాఁకు; శత్రువును దాఁకు; మర్మము దాఁకు; ముట్టడించు; కడముట్టు. విణ. రజస్వల.
ముట్టుకొను. స. క్రి. ముట్టడించు; ఆక్రమించు. ప్రే. ముట్టుకొలుపు.
ముట్టుకోలు. ముట్టడి.
ముట్టుకోలుగొను, ముట్టుకోలుపట్టు, ముట్టుకోలుపఱచు } స. క్రి. ముట్టడించు రూ. ముట్టుకోగ్గొను, ముట్టుకోల్పట్టు, ముట్టుకోల్పఱచు.
ముట్టుత రజస్వల.
ముట్టునీళ్లు. బహిష్ఠయైన స్త్రీ నాలవ నాఁడు చేయు స్నానము.
ముట్టుపడు. అ. క్రి. సంకటమగు.
ముట్టుపాటు. సంకటము.
ముట్టుసందు. అవతలకు పోవ దారి లేని సందు.
ముట్టె. పందిముక్కు, పోత్రము; పశుపక్ష్యాదుల మూతి.
ముట్టెచేఁప. మత్స్యవిశేషము.
ముట్టెమెకము. పంది, పోత్రి.
ముట్టెమోవు. కార్యనిర్వాహకసమయము
ముట్లచవిక. ముట్టువాండ్రుండెడి యిల్లు.
ముట్లుడిగినది. విగతార్తవ.
ముట్టైనది. ఋతిమతి.
ముఠా. హిం. జనసమూహము; కొన్ని గ్రామములు.
ముడాసు. తలపుట్టెకు సరిపోవుబుట్టటోపి
ముడి. గ్రంథి, దారము మొదలగు వాని ముడి; వెండ్రుకల ముడి; చెట్టు మొదలగు వాని బుడిపి; ఎద్దు మూఁపురము; కలహము; ముడివలె వ్రాసెడి కొన్ని హల్లులరూపాంతరములు సంధి. విణ. ఖండము కానిది; వికసింపనిది.
ముడికాఁడు. విణ. సంధానము చేయువాఁడు; ధూర్తుఁడు; దంభశూరుఁడు.
ముడికాళ్ళవాఁడు. విణ. ముట్టికాళ్లవాఁడు, గాడిదకాళ్ళవాఁడు.
ముడికొక్కు. ఒక పురుగు.
ముడిగిబ్బ ఆఁబోతు.
ముడిగొను. స. క్రి. ముడుచు; ముడివేయు. ప్రే ముడికొలుపు.
ముడిచె. సాంక్రామికరోగము.
ముడిబట్ట. అంచు కమ్ములు లేని వస్త్రము.
ముడిబొమ. ముడివడ్డ కనుబొమ.
ముడియ. పందెము; బట్టలు మొదలగు వాని మూట.
ముడియవిడుపు. ముడివిడుచుదొంగ. రూ. ముడియవిడువు.
ముడియువైచు. అ. క్రి. నిశ్చయముగా చెప్పు
ముడివడు. అ. క్రి. బద్ధమగు; ముడిగలది యగు; సంధించు; పెనఁగొను; అతిశయించు; కలుగు.
ముడివాటు. ముడివడుట.
ముడివెట్టు. స. క్రి. ముడివేయు.
ముడుఁగఁబాఱు. అ. క్రి. ముడుఁగు.
ముడుఁగు. అ. క్రి. ముకుళించు; తగ్గు; సంకోచించు; చేష్టలుడుగు.
ముడుఁగుఁదామర. పొత్తిదామర, నవస్ఫారిత†.
ముడుచు స. క్రి. ముడివెట్టు. ప్రే. ముడుఁగఁజేయు, ఆకుంచనము చేయు.
ముడుకు. మోఁకాలు.
ముడుచు. స. క్రి. ముడివేయు.
ముడుత. వళి; వస్త్రపు నెఱి; కడుపుమీఁది ముడుత.
ముడుపరి. ముడుపుపట్టిన వాఁడు.
ముడుపు. ధనము ముడిచినమూట; భూషణాదులమూట; ధనము.
ముడుము. మోఁకాలు.
ముడుసు. ముడ్డిపూస; ఎముక; గ్రంథిలాస్థి.
ముడేకము. ఏగాని.
ముడ్డి. రూ. మూడి, గుదము; కటివెనుకభాగము. త్రికము.
ముడ్డిపూస. వెన్నెముకక్రింది చివరపూస.
ముడ్పు రూ. ముడుపు.
ముణతరాములు. గ్రా. ఎటుతోఁచనిస్థితి.
ముణుచు. స. క్రి. ముడుచు.
ముణుఁగు. అ. క్రి. మునుఁగు.
ముణుఁగుఁదామర. రూ. ముడుఁగుఁదామర
ముతంగి. సం. తెల్లగిసె†.
ముతరాచ. ఒకశూద్రజాతి.
ముతుక. విణ. దళసరి, లావు.

ముత్త. విణ. వృద్ధ; వృద్ధుఁడు.
ముత్తడము. సరము.
ముత్తనియ్యవ్రేలు. చూపుడువ్రేలు.
ముత్తర. మల్లబంధవిశేషము.
ముత్తరము. మూఁడుతెరములు.
ముత్తరంగలు. కడుపుమీఁది త్రివళులు.
ముత్తరాచ. ఒక శూద్రజాతి.
ముత్తరులు. బ. మూఁడుకాలములు.
ముత్తవపులగము. చిట్టాముదము, బల.
ముత్తవ / ముత్తవ్వ } వృద్ధపితామహి.
ముత్తాత. వృద్ధపితామహుఁడు.
ముత్తి. మోక్షము, ముక్తి.
ముత్తిగ. తొమ్మిది.
ముత్తియము. ముత్తెము, మౌక్తికము.
ముత్తిరాచ వా. ముతరాచ.
ముత్తిరాజులు. బ. వా. ముతరాచవారు; వాహనములు మోయువాండ్లు.
ముత్తునియ. మూఁడు తునుకలు.
ముత్తుము. మూఁడుతూములు.
ముత్తువ. చిట్టాముదపుఁజెట్టు.
ముత్తెపుఁజిప్ప. శుక్తి; భక్ష్యవిశేషము.
ముత్తెపుఁబంట. చెఱకు.
ముత్తెపురిక్కనెల. చైత్రమాసము.
ముత్తెపుసవతు. చిత్రానక్షత్రము.
ముత్తెము. రూ. ముత్తియము, మౌక్తికము.
ముత్తెరువులాఁడి. త్రిపథగ, ఆకాశగంగ.
ముత్తెసరము. ముక్తాహారవిశేషము.
ముత్తెసరి. ముక్తాహారము; సస్యవిశేషము
ముత్తెసరులు. బ. ధాన్యవిశేషము.
ముత్తైద / ముత్తైదువ } పుణ్యస్త్రీ, సుమంగలి; వృద్ధసువాసిని.
ముత్త్రొవ. వా. చిట్టాముదపుఁజెట్టు.
ముత్త్రొవు. సరస్వతి;? జననీజనకులపల్లి.?
ముత్తో. ముత్తయిదువ.
ముత్త్యపుసరులు. బ. మౌక్తికహారములు.
ముత్త్యము. మౌక్తికము.
ముత్త్యాలకుచ్చు. పారితథ్యావిశేషము.
ముత్త్యాలతాటంకములు. వి. ముత్త్యములతో చేసిన చెవిపోగులు:
ముత్త్యాలమ్మ. ఒక గ్రామదేవత.
ముత్త్రోవ. మూఁడుత్రోవలు.

ముత్త్రోవద్రిమ్మరి. త్రిపథగ, ఆకాశగంగ.
ముదము. సం. సంతోషము.
ముదముద. సంకోచము.
ముదల. ఆజ్ఞ; లక్ష్యము; గనిమచేరికనేల.
ముదలకించు. స. క్రి. మార్కొను.
ముదలపెట్టు. స. క్రి. ఆజ్ఞాపించు.
ముదలించు. స. క్రి. అడుగు; మార్కొను
ముది. వార్ధక్యము. విణ. వృద్ధుఁడు; వృద్ధురాలు.
ముదికాకి. ఆల్లకోస.
ముదిగారము. వార్ధక్యము.
ముదిత. స్త్రీ. సం. పరకీయాభేదము.
ముదితము. సం. విణ. సంతోషము నొందినది.
ముదిమి. వార్ధక్యము.
ముదిమివాఁడు. వృద్ధుఁడు.
ముదియ. ముగ్ధస్త్రీ. [జ్యేష్ఠుఁడు.
ముదియనివారిలోఁబెద్ద. బ్రహ్మ, సుర
ముదియనివారు. నిర్జరులు, దేవతలు.
ముదియు. అ. క్రి. ముదిమిపొందు.
ముదిరము. సం. మేఘము.
ముదిరుఁడు. సం. విటుఁడు; కాముకుఁడు.
ముదివాఁడు / ముదిసినవాఁడు } వృద్ధుఁడు.
ముదుక. విణ. ముదుగు; వృద్ధుఁడు; వృద్ధురాలు.
ముదుకఁడు. విణ. వృద్ధుఁడు.
ముదుకసరులు. బ. ధాన్యవిశేషము.
ముదుగు. విణ. లావు, నూలిపోఁగు పెంద లగువాని లావు.
ముదుటుంగరము. ముద్దుటుంగరము.
ముదురు. అ. క్రి. కాయమొ॥ పరిణమించు; వర్ధిల్లు. విణ. వృద్ధము; వృద్ధుఁడు; లేఁతది కానిది. [మొగ్గ, కోరకము.
ముదురుమొగ్గ. పుష్పించుటకు సిద్ధమైన
ముదునలి. విణ. వృద్ధుఁడు; వృద్ధురాలు.
ముద్గపర్ణి. సం. పిల్లపెసర.
ముద్గము. సం. పెసర. బ. పెసలు.
ముద్గరము. సం. ఇనుపగుదియ; సమ్మెట; దిమ్మెస. [ముగ్ధస్త్రీ.
ముద్ద. కబళము; ఉండ; పిండము;

ముద్దకజ్జూరము. పిండఖర్జూరము†.
ముద్దకమ్మరి. ఊయికరఁగి యినుము చేసెడి కమ్మరజాతి.
ముద్దకర్పూరము. ఘనసారము.
ముద్దకవ్వము. కఱ్ఱబిల్ల తగిలించినకవ్వము
ముద్దకొలిమి. ఊయి యినుముగా కరఁగెడు కొలిమి.
ముద్దతు. హిం. కాలపరిమితి.
ముద్దయ్య. కుమారస్వామి.
ముద్దర. ముద్ర.
ముద్దరాలు. విణ. ముగ్ధస్త్రీ.
ముద్దాడు. స. క్రి. చుంబనాదిపూర్వకముగా లాలనముచేయు; ఆదరించు.
ముద్దాయి. హిం. ప్రతివాది.
ముద్ది. ఆపద.
ముద్దిడు. స. క్రి. చుంబనముచేయు.
ముద్దియ. ముగ్ధిక, ముగ్ధస్త్రీ.
ముద్దీటె. ఏనుఁగును పొడిచెడి ఐరిగోల.
ముద్దు. ముద్ర; చుంబనము; చిన్నవాండ్లయందలి ప్రేమ; తామరదుద్దు; మనోజ్ఞత. విణ. మనోజ్ఞము.
ముద్దుఁడు. విణ. ఏమియుఁ దెలియనివాఁడు; ముగ్ధుఁడు.
ముద్దుగలకాళ్ళపురువు. భృంగము
ముద్దుగలతల్లులబిడ్డఁడు. కుమారస్వామి
ముద్దుగుమ్మ మనోజ్ఞురాలగు స్త్రీ; స్త్రీ
ముద్దుటుంగరము. అక్షరములు చెక్కిన ఉంగరము, అంగుళిముద్ర. [చేయు.
ముద్దుపెట్టుకొను. స. క్రి. చుంబనము
ముద్దుప్రాలు. బ. ధాన్యవిశేషము.
ముద్దుమాట. బాలుర మధురవాక్కు.
ముద్దురాలు, ముద్దులగుమ్మ, ముద్దులాఁడి } మనోజ్ఞురాలగు స్త్రీ; స్త్రీ.
ముద్దులాఁడు. విణ. ముగ్ధుఁడు, మనోజ్ఞుఁడు
ముద్దె. తామరదుద్దు.
ముద్ర. సం అక్షరములుచెక్కినఉంగరము మొ॥; అచ్చు, లిపివిశేషము; చిహ్నము; సికా, ముద్రవేసినది; సుముఖాదిముద్ర.
ముద్రగడ. రాజదండము.
ముద్రణము. సం. ముద్రించుట.
ముద్రపలక. మి. ముద్రవేసెడు పలక.
ముద్రించు. సం. స. క్రి. ముద్రాంకితముచేయు.
ముద్రిక. సం. ముద్దుటుంగరము.
ముద్రితము సం. విణ. ముద్రింపఁబడినది; ముకుళితమయినది.
మున్. అవ్య. ముంగలన్.
మునక. స్నానము.
మునగ. శిగ్రువు†.
మునన. ఏతపుమ్రానిమీఁది యరభాగము
మునసపు, మునసబు } హిం. న్యాయముతీర్పు నధికారి, ప్రాడ్వివాకుఁడు.
ముని. విణ. మును శబ్దముయొక్క లుప్తరూపము; అగ్రము; ఆరంభము. సం. ఋషి, వసిష్ఠాది; బుద్ధదేవుఁడు; అగిసియ†
మునికొంగు. ముంగొంగు.
మునికోల. ప్రాజనము, కశ, ఎడ్లను బొడుచు కఱ్ఱ. రూ. ములుకోలు.
మునిచీకటి. ప్రొద్దు గ్రుంకిన తోడనే పర్వెడు పలుచని చీఁకటి. [పుత్రుఁడు.
మునిమనుమఁడు. ప్రపౌత్రుఁడు, పౌత్రుని
మునిమనుమరాలు. ప్రపౌత్రి, పౌత్రుని పుత్రిక.
మునిమాపు. ప్రదోషము, సంధ్యాకాలము
మునిముంగల మొట్టమొదట.
మునిముచ్చు. విణ. చెడ్డకాఁడు, పశ్యతోహరుఁడు; పశ్యతోహరురాలు.
మునియేఁడు. పరారి, నిరుటికి తొలిసంవత్సరము.
మునివ్రేళ్ళు. బ. కొనవ్రేళ్ళు.
మునిషీ. హిం. విణ. చదువుచెప్పువాఁడు; లేఖకుఁడు. [శ్రేష్ఠుఁడు.
మునీంద్రుఁడు. సం. బుద్ధదేవుఁడు; ఋషి
మును. ముందు; మొదలు; తుది.
మునుఁగు. అ. క్రి. మునుకవేయు; మరణించు; అడఁగు, నశించు; మఱుఁగుపడు.
మునుక. మునుఁగుట; మునుకవేయుట
మునుకు. అ. క్రి. సంతాపించు; మాఱుపలుకు; పలుకు.
మునుకువ. పూనిక, ప్రయత్నము.
మునుకొని అవ్య. ముందుగా. [పడు.
మునుకొను. అ. క్రి. ముందగు, ముందు
మునుకోలు. ముందగుట.

మునుగ. ~-వగ† [పగ్వ్రతము.
మునుగట్టు. తూగుపు(గొండ పూర్వ
మునుచీఁకటులవిచ్చుమొగ్గ. చంద్రుఁడు.
మునుచేయు. అ.క్రి.ముందగు. ప్రే.మునుఁగఁజేయు.
మునుపటిది. విణ. పూర్వకాలసంబంధి.
మునుపటివాఁడు. విణ పూర్వపువాఁడు.
మునుపడు. అ. క్రి. ముందగు.
మునుపు. ముందు, పూర్వము.
మునుము పైరుకోఁత నేర్పఱచుకొన్న మితి; వరుస; ఎదురు; ఎదుటిచోటు; సేనాముఖము; తెఱచుఁదనము. విణ. తెఱచు.
మునుముకొను. అ.క్రి. వరుసపెట్టు.
మున్కొను. అ.క్రి మునుకొను, ముందగు.
మున్గు. అ.క్రి. మునుఁగు.
మున్నడి. అవ్య. క్రి. విణ. ముందుగా.
మున్నరక. స్థైర్యము; తొలిమొక్క.
మున్నాడి. అవ్య. క్రి విణ. ముందుగా.
మున్నిడు అ.క్రి స్వాధీనము చేయు.
మున్నీటిచూలి. క్షీరోదజ, లక్ష్మి.
మున్నీటిపట్టి. అబ్జుడు, చంద్రుఁడు.
మున్నీటియగ్గి. బడబాగ్ని.
మున్నీరు. సముద్రము.
మున్ను. పూర్వము, ముందు; మొదలు.
మున్నుడి. తొలిపలుకు, పీఠిక.
మున్నూఱు. త్రిశతి, మూఁడునూఱులు.
మున్నూలు. త్రిసూత్రి, మూఁడు పేటలు.
మున్నెరిక. పూర్వరాగమువలనఁ గలిగిన విరహతాపము.
మున్నేఁడు. రూ. మునియేఁడు,
మున్పు. రూ. మునుపు.
మున్ము. రూ. మునుము.
మున్ముందు. ప్రప్రథమము.
మున్సిపు. మునసబు.
ముప్పఁడ్రు. బ. ముప్పదిమంది.
ముప్పటిలు. అ.క్రి. ఉపశమిల్లు.
ముప్పది స. మూఁడుపదులు, త్రింశత్తు.
ముప్పదిరెంటిగుంపు. రేవతీనక్షత్రము.
ముప్పరువునేల. క్రోశత్రయము.
ముప్పలము. మూఁడుపలములు.
ముప్పాతిక. మూఁడుపాతికలు.
ముప్పావు. మూఁడుపావులు.
ముప్పావులా. మూఁడు పావులాలు.
ముప్పిండి విణ. ముప్పిఁడి, ముప్పు లేనివాడు
ముప్పిడి. బాఁకు.
ముప్పిర. మూఁడు పిరలు. [పిరులుగలది.
ముప్పిరి. మూఁడుపిరులు. విణ. మూఁడు
ముప్పిరిగొను. అ. క్రి. మూఁడుపిరులుగా పెనఁగొను; పెనఁగొను.
ముప్పు. వార్ధక్యము; విపత్తు; మోసము.
ముప్పూఁట. మూఁడుపూఁటలు.
ముప్పేట. మూఁడు పేటలు.
ముప్పొంగు. అ. క్రి. మూఁడు పొంగులు పొంగు, ఉప్పొంగు.
ముప్పొత్తులు. బ. అశ్రద్ధ. [ముఁడు.
ముప్పొకలాఁడు. భగవంతుఁడు, త్రివిక్ర
ముప్పై. గ్రా. ముప్పది.
ముప్రొద్దు. మూఁడుపూఁటలు.
ముబ్బడి. విణ. ముమ్మడి, త్రిగుణము.
ముబ్బడించు. అ. క్రి. ముబ్బడియగు, త్రిగుణమగు. [తనువు.
ముబ్బానవాల్గీము. సూర్యుఁడు, త్రయీ
ముబ్బె. నితంబపార్శ్వము.
ముబ్బేడ మూఁడు బేడలు.
ముముక్షువు. సం. విణ. ముక్తి నొందనిచ్ఛగలవాఁడు.
ముమూర్ష. సం. చావనిచ్ఛ.
ముమూర్షువు. సం. చావనిచ్ఛగలవాఁడు.
ముమ్మడి. త్రిగుణము. [త్రిగుణమగు.
ముమ్మడించు. అ. క్రి. ముమ్మడియగు,
ముమ్మడుఁగు. విణ. మూఁడు మడుఁగులు గలది.
ముమ్మనుమఁడు. మునిమనుమఁడు.
ముమ్మనుమరాలు. ముని మనుమరాలు.
ముమ్మరము. విణ. అధికము, అగ్గలము.
ముమ్మరించు. అ. క్రి. అతిశయించు.
మామ్మాటు } త్రిరావృత్తి.
మామ్మాఱు }
ముమ్మూడు. మూఁడుమూళ్లు, తొమ్మిది.
ముమ్మూల. మూఁడు మూలలు. విణ. మూఁడు మూలలుగలది.
ముమ్మొనవాలు. త్రిశూలము.

ముమ్మొనవాలుదాలుపు } శూలి, శివుఁడు.
ముమ్మొనవాలుదాల్పు }
ముమ్మొటు. మూర్ధశిరోమణి.
ముయ్యంచె. మూడుమూలలు. విశే. మూడుమూలలుంగలది.
ముయ్యంచెతుంగ. మూడంచులతుంగ†.
ముయ్యగ్గి. త్రేత, అగ్నిత్రయము.
ముయ్యడ. ఆజ్యమానికలు, మూడుఅడ్డలు
ముయ్యాకుఁబొన్న. సాలపర్ణి†. [మిది.
ముయ్యాఱు. మూడుఆఱులు, పదునెని
ముయ్యేలగుట్ట. మూడు ఎల్లలు కలియు చోటు; మూడుదారులు కలియుచోటు.
ముయ్యేడు. మూడేళ్లు, ఇరువదియొకటి.
ముయ్యేఱు. త్రిపథగ, ఆకాశగంగ.
ముర. సం. గ్రంథద్రవ్య విశేషము.
మురంగి. సం. మునుగ†.?
మురజము. సం. మద్దెల, మృదంగము.
మురటి. పుచ్ఛము.?
మురము. అందుగు†.
మురమురి. మూలుగుటయందగు ధ్వన్యనుకరణము; అణఁగుటయందగు ధ్వన్యనుకరణము.
మురమురలాఁడు. అ.క్రి. కోపముగపగుచు
మురళి. పిల్లనగ్రోవి; అశ్వధారావిశేషము.?
మురళించె. స. క్రి. తిరస్కరించు.
మురారి. సం. శ్రీకృష్ణుఁడు, విష్ణువు.
మురాళము. గగఁదుడుచుట.
మురాళించె. స. క్రి. గగఁదుడుచు.
మురి. గర్వము, నడకయందలి కులుకు.
మురించె. ప్రే. త్రిప్పు.
మురికాఁడు. విశే. గర్విష్ఠుఁడు.
మురికి. వా. మాలిన్యము.
మురికొను. స. క్రి. ఖండించు.
మురిడీగొలుసు. ముంజేత వేసికొనెడు బంగారు మెలికగొలుసు.
మురిపము } నడకయందలి కులుకు, విలాసము; గర్వము, శృంగారగర్వము.
మురిపెము }
మురియ. ఖండము.
మురియఁబడు. అ. క్రి. అతిశయించు.
మురియు. అ. క్రి. నడచునప్పుడుకులుకు; శృంగారగర్వ మగపడుచు, గర్వించు; తిరుగు; తెగు; ముక్కలగు, విఱుగు.
మురుఁడు. సం. ఒక అసురుఁడు.
మురుగు. పట్టెలు తీర కడ్డీగా కొట్టించి ముంజేత ధరించెడి స్వర్ణాభరణము; అల్లిక వేసిన బంగారుకమ్మి.
మురుపు. సంతోషాతిశయము.?
మురుము. అందుగు†.
మురువనడ. అశ్వగతివిశేషము.
మురువు. సౌందర్యము; గర్వము; మురుగు; విలాసము; శృంగారగర్వము. విశే. సుందరము, మంజులము. [విప్పు.
ముర్మురము. సూర్యునిగుఱ్ఱము; ఊముక
ముర్మురుఁడు. సం. మన్మథుఁడు.
ముర్వ. కర్ణభూషావిశేషము; సౌందర్యము
ముఱకటము. త్రిప్పుట.
ముఱకటించె. స. క్రి. త్రిప్పు
ముఱకము. నిక్కు, ఉద్ధతి.
ముఱముఱమను } అ. క్రి. కోప వికారము చూపు.
ముఱముఱలాఁడు }
ముఱి. విశే. అల్పము; కుత్సితము; శౌర్యము.
ముఱికి కల్మషము, మాలిన్యము.
ముఱికిచెమట. మలినస్వేదము, కొంచు.
ముఱికినాడు. ఒకానొక దేశము; బ్రాహ్మణులలో నొక తెగవారు.
ముఱిచీఁకటి } గబ్బుచీఁకటి.
ముఱిముఱిచీఁకటి }
ముఱిముఱి. కొంచెము కొంచెము. (ముఱిముఱిచీఁకటియని.)
ముఱియు. అ.క్రి. గర్వించు.
ముఱు. తునుక; ముఱ్ఱుఁబాలు.
ముఱుగు. అ. క్రి. క్రుళ్ళు; నలఁగు.
ముఱుగుడు. విశే. ముఱిగినది.
ముఱుగుత్రోవ. దుర్గంధపు మార్గము.
ముఱ్ఱు. ముఱ్ఱుబాలు.
ముఱ్ఱుఁబాము మాతులాహి.
ముఱ్ఱుఁబాలు. పీయూషము, ఆవులు మొదలగునవి ఈనినతరువాత మూడు దినములలోని పాలు.
ములక. వార్తాకి†.

ములికి. బాణము; బాణపుటలుఁగు; బొంగరమువొనను గ్రువ్వఁబడియుండు ఇనుపముక్క.
ములికినాడు. ఒకానొక దేశము.
ములు. ముల్లు, కంటకము; త్రాసుముల్లు; వరిముల్లు; మల్లయుద్ధాయుధాగ్రము.
ములుక. వా. ములికి.† [కత్తి
ములుకత్తి. ముల్లుతీసెడు ఒకదినుసుచిన్న
ములుకోల. ముల్లుగఱ్ఱ.
ములుగ. అర్బుదఫలి†.?
ములుగు. మూలుగుట; బొక్కసము. అ. క్రి. మూలుగు; అఱచు.
ములుగొలిమిడి. కోకిలాక్షము.
ములుగోరంట. ఝింటి†.
ములుచిఁత. రూ. ముల్లుచిఁత†.
ములుచ. విణ. న్యూనము; మూఢుఁడు; ధూర్తుఁడు.
ములుచఁదనము. పలుచఁదనము.
ములుజెముడు. త్రికంటకము†.
ములుతారు. మృగములను పట్టెడు యొకదినుసు వల.
ములుతోఁటకూర. కంటక శాకిని†.
ములుత్రాసు. చిన్నత్రాసు.
ములుదోస. రోమశి†.
ములుపంది. శల్యము.
ములుబంతి. చోరసాధన విశేషము.
ములుము. బావులనీళ్ళు పాఱించి పండించెడు పొలము.
ములుమోదుగు. రోహితకము†.
ములువాలుగ. మత్స్యవిశేషము.
ములువెంపలి. కంటకపుంఖి†.
ములువెలఁగ. చతురశ్రికము†.?
ములువెలమ. వికంకతము†.
ములుసూపు. అ. క్రి. మీఱు, అతిశయించు.
ముల్కి. రూ. ములికి.
ముల్చ. విణ. రూ. ములుచ.
ముల్తుద. ముల్లుతుద†.
ముల్లంగి. మూలకము, ఒకదినుసుగడ్డ.
ముల్లంగిపిట్ట. పక్షివిశేషము.
ముల్లముస్తె. ములుచిఁత†.
ముల్లాకుటాయి. పత్రపరశుభేదము.
ముల్లియ. మొల్ల.
ముల్లు. రూ. ములు.
ములుకోల } తోత్రము, ప్రాజనము,
ముల్లుకఱ్ఱ } ఎడ్లను పొడిచెడి మునికోల
ముల్లుచిఁత. అలర్కము, ముండ్లముస్తె.
ముల్లుపుచ్చికొట్టుడుచు. అ. క్రి. మునుపటి కంటె నెక్కువ బాధకలుగు.
ముల్లె. ధనము ముడి; ముడుపు; మూట.
ముల్లెవిప్పెడువాఁడు. కన్నపుదొంగ.
ముల్లోకనాథుఁడు. మి. మూడులోకములకు నాథుఁడు.
ముల్లోకనుతుఁడు. మి. మూడులోకముల పొగడ్తనందినవాఁడు.
ముల్లోకపాత్రుఁడు. మి. మూడులోకములయందును గౌరవింపఁబడువాఁడు.
ముల్లోకములు. మి. బ. మూడులోకములు.
ముల్లోకవంద్యుఁడు. మి. మూడులోకములచే పొగడ్తగన్నవాఁడు.
ముల్లోకవిభుఁడు. మి. మూడులోకములకు ప్రభువు.
ముల్లోకార్చితుఁడు. మి. మూడులోకములచే నర్చింపఁబడినవాఁడు.
మువ్వురు. స. ముగ్గురు.
మువ్వ. మొనలో మూడు సందులు గల పెద్ద గజ్జె; ఒకపట్టణము. బ. పాదమున ధరించెడి పెద్ద గజ్జెలు. [గలది.
మువ్వంక. త్రిభంగి. విణ. మూడువంకలు
మువ్వంచె. మూడుపంచలు. విణ. మూడు పంచలుగలది.
మువ్వంచౌకు. ముయ్యాకు పొన్న†.
మువ్వంటు. నెలలోపలి మూడు పురుడులు
మువ్వకోడె. కాఁడికిని గంతకును క్రొత్తగా అలవఱచెడి యెద్దు.
మువ్వగలవన్నెమెకము. పెద్దపులి.?
మువ్వదోనె. అడుగున ఒంటిపలకగలదోనె
మువ్వన్నె. మూడువన్నెలుగలది.
మువ్వన్నెకాఁడు. సూర్యుఁడు.
మువ్వన్నెమెకము. పెద్దపులి.
మువ్వన్నెవిల్లు. ఇంద్రధనుస్సు.
మువ్వపనరము. మువ్వకోడె.
మువ్వరుస. మూడు వరుసలు.
మువ్వీసము. మూడు వీసములు.

ముప్పూరు. స. బ. ముగ్గురు
ముప్పేట్లి. మూడువిధములై. పరచుహ్యలు
ముప్పేతలు. బ. మూడు విధములైన దుఃఖములు.
ముప్పేలుపులయిక్క. సూర్యుడు.
ముప్పేసములు. బ. మూడు వేషములు.
ముషితము. సం. దొంగిలబడినది; దొంగిలబడినది.
ముష్కకము. సం. మొక్కపుచెట్టు.
ముష్కము. సం. వృషణము; మొక్కపుచెట్టు; మొత్తము.
ముష్కరి. ముష్కరుడు. సం. విణ బలవంతుడు; కుటిలుడు.?
ముష్కరుడు. సం. విణ. కుటిలుడు?; మూర్ఖుడు?; పొడవైనవృషణములుగలవాడు.
ముష్టి. సం. కత్తిపిడి; పిడికిలి; సమృద్ధి; ముసిడి†; అభినయహస్తవిశేషము.
ముష్టింపచేడు. సం. విణ దరిద్రుడు.
ముష్టీముష్టి. సం. పిడికిలి పోటులచే నొనర్చు యుద్ధము.
ముసగెస. గుసగుస.
ముసదరు. మూడురకాలాలు.
ముసద్దీ. హిం. లేఖకుడు.
ముసనాబు. అందలము ప్రక్కతెర.
ముసముస. ముసురుట మొదలగువాని యందగు ధ్వన్యనుకరణము; కోపముచే గలుగు చిఱచిఱ; పందిమూర్కొనుట యందగు ధ్వన్యనుకరణము.
ముసముసమను. అ. క్రి. ముసముసయని శబ్దించు; చిఱచిఱలాడు. రూ ముస ముసయను.
ముసరు. అ. క్రి. క్రమ్ము, మూగు.
ముసలము. సం. అయోగ్రము, రోకలి.
ముసలి విణ. వృద్ధుడు; వృద్ధురాలు; వార్ధక్యము నొందినది. సం. ఉడుము; ఎలుకజీడి†; నేలతాడు†; బల్లి; బలరాముడు.
ముసలితనము. కారు, వార్ధక్యము.
ముసలిది. వార్ధక్యమునొందినది.
ముసలివాడు వృద్ధుడు. [యుడు.
ముసల్మాను. హిం. తురక, మహమ్మదీయుడు.
ముసల్యుడు సం. విణ ముసలముచేత చంపదగినవాడు.
ముసాంబ్రము. ఒక మందు దినుసు.
ముసాపు(బు). నానుడువాన, ముసురువాన.
ముసి. విణ బొంకు.
ముసించు. అ. క్రి చెడు.
ముసిడి } ముష్టి, విషముష్టి†.
ముసిణి }
ముసినగవు } స్మితము, చిఱునగవు.
ముసిముసినగవు } రూ. ముసిముసినవ్వు.
ముసుంగు. ముసుగు.
ముసుండము. సం. ఇనుపకట్లలాటి కఱ్ఱ.?
ముసుండి. సం. కొయ్యగుదియ.?
ముసుగు. . అవగుంఠనము; ముసుగుడు, తలమీద కప్పుకొనుట.
ముసుగుడు. కప్పుడు.
ముసుగుడువడు అ. క్రి కప్పుడువడు.
ముసుగుబొంత. మట్టెం ఊడని తాడు మొదలగు చిన్నచెట్టు.
ముసుగువడు. అ. క్రి. కప్పుడువడు.
ముసుగువాఱు. అ. క్రి. ముసుగువడు.
ముసుకు. వా. ముసుగు.
ముసురు. సంతతవృష్టి; వర్షము.
ముసురుకవియు } అ. క్రి. క్రమ్ము.
ముసురుకొను }
ముసురుమూతి కోపవికారముగలముఖము
ముసువు. ముసుగు.
ముస్త సం. నిడుముస్తె†.
ముస్తకము. సం. కయివడిముస్తె†; నిడుముస్తె, తుంగముస్తె†.
ముస్తాదు. హిం. విణ సిద్ధమైన, తగియున్న
ముస్తాబు అలంకారము. విణ. ముస్తైదు.
ముస్తియ ముస్తె†.
ముస్తీదు. విణ. అయిత్తము, సిద్ధము.
ముస్తీబు హిం. విణ. ముస్తీదు.
ముస్తె నిడుముస్తె, తుంగ†; తుంగగడ్డ.
ముస్తెలమేపరి. పంది.
ముస్తైదు. విణ. సిద్ధముగనున్న.
ముహూర్తము. సం. పండ్రెండుక్షణముల కాలము, రెండుగడియలకాలము; అల్ప కాలము.

ముళ్లమాటలు. బ. మాయమాటలు.
ముళ్లయతి. మి. కలహాశనుఁడు, నారదుఁడు.

## మూ

మూ. విణ. మూఁడుశబ్దముయొక్క లుప్త రూపము.
మూఁక. సమూహము; సేన.
మూకవిప్పు. విణ. చెదరఁగొట్టునది.
మూఁకుడు. శరావము, కుండమీఁద మూసెడు తట్టవంటిమట్టిపాత్రము; తట్టవంటి మట్టిపాత్రము; మూఁత.
మూఁగ. దోమ; పక్షివిశేషము. విణ. మూకుఁడు, మూఁగవాఁడు.
మూఁగఁబాఱు. అ.క్రి. మూఁగు
మూఁగతీఁట. దట్టముగా తేలినతీఁట.
మూఁగది. మూక (స్త్రీ). [లోని భేదము.
మూఁగబిట్టుకోడి. పందెపు కోడిపుంజు
మూఁగబోతు. పొట్టుతోఁగూడినధాన్యము
మూఁగమొగ్గలు. వికసించనిమొగ్గలు.
మూఁగవాఁడు. విణ మూఁకుడు.
మూఁగి. నోరుమెంగ.
మూఁగు. అ.క్రి. ముసురుకొను, చుట్టుకొను
మూఁడగ్నులు. మి త్రేత, అగ్నిత్రయము.
మూఁడు. స. రెండునొకటి. అ.క్రి కలుగు; ముగియు. [గించు. రూ. మూడ్చు.
మూఁడుచు. ప్రే. మూఁడఁజేయు, కలి
మూఁత. ఆచ్ఛాదము, మూయుట; మూయుటకుఁదగినమూఁకుడు మొదలగునది.
మూఁతబల్లి. వాచూరుపట్టె, ముంజూరు మూయుబల్ల.
మూఁపు. భుజశిరము. [కకుదము.
మూఁపురము. ఎద్దుయొక్క భుజశిరము,
మూఁపురములయెద్దు. అచ్చుటెద్దు.
మూకు. సం. మూగవాఁడు; దీనుఁడు.
మూకుఁడు. సం. ఒక అసురుఁడు. విణ. రూ. మూకు.
మూగురు. స. బ. ముగ్గురు
మూగెలు. చుంచెలుక. [వాసనచూచు
మూచూచు. స. క్రి. అఘ్రాణించు,
మూజెవాని. గ్రా. నోటిమాటలు.
మూట బట్టలు మొదలగువాని ముడియు.
మూటము. రూ. ముటము.
మూడమంచు. దట్టమైనమంచు, హిమాని
మూడవకొలము. వైశ్యకులము.
మూడవకొలమువాఁడు. వైశ్యుఁడు.
మూడి. ముడ్డి.
మూడు. స. రెండునొకటి, త్రివాచకము.
మూఢుఁడు. సం. విణ. తెలివిలేనివాఁడు; బాలుఁడు.
మూతము. సం రాజులు చేతిక్రిందనుంచుకొను తలగడని. విణ. కట్టఁబడినది.
మూతి. నోటి పైభాగము; ముఖము.
మూత్రకృచ్ఛ్రము. సం. నీరుడిరోగము.
మూత్రము. సం. నీరు, కాలుమడి, ఉచ్చ.
మూత్రించు. సం. అ. క్రి. కాలుమడుచు, నీరు విడుచు. [విడిచినవాఁడు.
మూత్రితుఁడు సం. విణ. మూత్రము
మూదల తార్కాణ, నిరూపణము.
మూదలించు. స క్రి. నిరూపించు; ఎచ్చరించు.
మూదలిక. మూదల, తార్కాణ.
మూదేవి. పెద్దమ్మ.
మూన. వస్త్రగాలితము చేయఁగా రాలక నిలిచినది; రాగులు ఆముదాలు మేలు రాసి కాఁగా మిగిలినపొల్లు; మూఁగబోతు ?
మూను. స. క్రి. వస్త్రగాలితముచేయు.
మూయి. వ్యవధానము.
మూయు. స. క్రి. మూఁత పెట్టు; కప్పు.
మూర. రెండు జేనలకొలఁది, హస్తము. విణ నిడుపైనది.
మూరకోక. బారచాఁపు.
మూరకోల. గజపుకోల.
మూరిఁబోవు. అ. క్రి. అతిశయించు; వర్ధిల్లు; విజృంభించు; సఫలమగు; నశించు.
మూరు. అ. క్రి. అతిశయించు.
మూరుకొండ. రూపగంధి.
మూరుకొను. స. క్రి. మూచూచు.
మూరుతము. ముహూర్తము.
మూరెఁడు. విణ. రెండుజేనలకొలఁది.
మూరొ్కను. రూ. మూచూచు.

మూర్ఖు—ఁడు. సం. విణ. తెలిసి తెలియని వాఁడు; అవివేకి. [దప్పట.
మూర్ఛ. సం. రోగాదులచేత స్మృతి
మూర్ఛన. సం. సంగీతమునందు క్రమముగా సప్తస్వరములయొక్క ఆరోహణావరోహణములు. [గలవాఁడు.
మూర్ఛాలుఁడు. సం. విణ. మూర్ఛరోగము
మూర్ఛితుఁడు. సం. విణ. మూర్ఛిల్లినవాఁడు; మూఢుఁడు; పొడువైనవాఁడు
మూర్ఛిల్లు. సం. అ. క్రి. సొమ్మసిల్లు, మూర్ఛపోవు.
మూర్తము. రూ. మూరుతము. సం. విణ. కఠినమైనది; మూర్ఛారోగము గలది; స్వరూపముగలది.
మూర్తి. సం. శరీరము; స్వరూపము; కాఠిన్యము; ప్రతిమ. (త్రిమూర్తులు—బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుఁడు.)
మూర్తిమత్తు. సం. విణ. మూర్తిగలది.
మూర్ధజములు. సం బ. తలవెండ్రుకలు.
మూర్ధము. సం. శిరస్సు.
మూర్ధాభిషిక్తుఁడు. రాచవాఁడు; రాజు, పట్టాభిషిక్తుఁడైన రాజు; మంత్రి; మూర్ధావసిక్తుఁడు.
మూర్ధావసిక్తుఁడు. సం. క్షత్రియ స్త్రీకి బ్రాహ్మణునకుఁ బుట్టినవాఁడు.
మూర్వ. సం. చాఁగ†.
మూల. విదిక్కు, కోణము; గొంది; కొప్పు. సం. మూలనక్షత్రము.
మూలకము. సం. ముల్లంగి†.
మూలగ. మజ్జ.
మూలదుంప. మి. గ్రా. మూలకారణము, మొదటిగడ్డ. [మొదలు.
మూలధనము. సం. అసలుసొమ్ము, సంచి
మూలఫల. సం. కొమ్మనగొలిమిడి†.?
మూలబండరువు. మి. మూలధననిక్షేపము
మూలబంధము. సం. ఒకరోగబంధము; పునాది.?
మూలము సం. చెట్టువేరు; ఊడ; మొదలు; సంచిమొదలు; సమీపము; ఒకనక్షత్రము; మెట్టతామరదుంప.?
మూలమట్టము. గోడల మూలలను సరిచూచెడు మూడుమూలల మట్టపలక.
మూలమట్టు. మి. అవ్య. క్రి. విణ. ఆమూలము.
మూలయేలునేర్పరి. నిరృతి.
మూలఱాయి. వజ్రమణి. రూ. మూలతా.
మూలఱేఁడు నిరృతి, నైరృతుఁడు.
మూలాధారము. సం. గుదస్థానమునందుండెడు నాడులకాధారమైన చక్రము.
మూలిక. వా. మందాకు†.
మూలికము. సం. వృక్షము.
మూలికుఁడు. సం. వృక్షమూలమునఁ గూర్చుండి తపముచేయుటయే వ్రతముగాఁ గలవాఁడు.
మూలుగు. కుంథనము; మూలుగుట; అంబుదఘలి, ప్రసాధని†?. అ. క్రి. నొప్పివలని బాధచే ఒకవిధముగా ధ్వనిచేయు; కూయు. రూ. మూల్గు.
మూలుగులు. మాలుగులు.
మూల్యము. సం. వెల, ధర; జీతము.
మూవ. మువ్వ. విణ. రూ. మూఁగ.
మూవురు. స. రూ. మూగురు.
మూష. సం. మూస.
మూషకపర్ణి. సం. ఎలుకచెవి†.
మూషకము. సం. ఎలుక.
మూషిక. సం. ఆఁడెలుక; పందికొక్కు.
మూషికము. సం. ఎలుక. [నది.
మూషితము. సం. విణ. దొంగిలింపఁబడి
మూస. మూష, బంగారము మొదలగువానిని గరఁగెడు కరువు; విగ్రహములు పోయునది.
మూసకము. ఎలుక.
మూసవమురికి. అప్రయోజకుఁడు.
మూసిక. మంగళసూత్రమునందు తాళిబొట్టుకు ఈవలావలగ్రుచ్చి కట్టుకొనెడు నానుక్రోవి.
మూసిగంతలు. బ. దాఁగుడుమూఁతలు.

## మృ

మృగణ. సం. అన్వేషణము.
మృగతృష్ణ. సం. ఎండమావులు.
మృగదంశకము. సం. కుక్క.
మృగధూర్తకము. సం. నక్క.

మృగనాభి. సం. కస్తూరి
మృగపాలిక. సం. కస్తూరిపిల్లి.
మృగమదము. సం. కస్తూరి.
మృగము. సం. పశువు; జింక, లేడి; గజవిశేషము; మృగశీర్షము; అన్వేషణము; వేఁట; వేఁడుట.
మృగయ సం. వేఁట, వెదకుట.?
మృగయుఁడు. సం. బోయ, వేఁటకాఁడు; బ్రహ్మ.
మృగరిపువు. సం. సింహము.
మృగవాహనుఁడు. సం. వాయువు.
మృగవ్యము. సం. వేఁట.
మృగశిరము. సం. ఒక నక్షత్రము.
మృగశీర్షము. సం. మృగశిర.
మృగాంకుఁడు. సం. చంద్రుఁడు; శివుఁడు.
మృగాక్షి. సం. లేడికంటి.
మృగాజీవము. సం. సివంగి.
మృగాజీవుఁడు. సం. బోయవాఁడు.
మృగాదనము. సం. సివంగి.
మృగాదనుఁడు. సం. బోయవాఁడు.
మృగితము. సం. విణ. వెదకఁబడినది.
మృగితృష్ణాంబువు. సం. ఎండమావినీరు.
మృగేంద్రము } సం. సింహము, మృగ
మృగేంద్రుఁడు } రాజు.
మృగేర్వారువు. సం. కోడిబుడమలు, ఒక ధాన్యము.
మృగ్యము. సం. విణ. వెదకఁదగినది.
మృజ. సం. మార్జనము; నూనె మొదలైనవాని పూఁత.
మృడాని సం. పార్వతి.
మృడుఁడు. సం. శివుఁడు. [తూడు.
మృణాళము. సం. వట్టివేరు; తామర
మృతము. సం. మృతి; యాచనావృత్తి. విణ. మృతిఁబొందినది.
మృతాలకము. సం. తొగరిమన్ను.
మృతి సం. మరణము.
మృతుఁడు. సం. విణ. చచ్చినవాఁడు.
మృత్తాలకము. సం. తొగరిమన్ను.
మృత్తిక } సం. మన్ను; తొగరిమన్ను.
మృత్తు }
మృత్యుంజయుఁడు. సం. శివుఁడు.
మృత్యుప్రసూనము. సం. చెఱుకు†.
మృత్యువు. సం. మరణము; చంపునది; యముఁడు.
మృత్యుసూతి. సం. ఆఁడుపీత.
మృత్స } సం. మంచిమన్ను; తొగరి
మృత్స్న } మన్ను.
మృదంగము. సం. మద్దెల; తప్పెట; వెదురు†.
మృదుకవిత. సం. విణ. చతుర్విధ కవితలలో ఆశుకవిత్వమునకు పర్యాయముగా నుపయుక్తమైనది.
మృదుత్వక్కు. సం. బుజపత్తిరి†.
మృదులము. సం. విణ. కోమలము, మెత్తనిది. [మారము.
మృదువు. సం. విణ. మెత్తనిది; సుకు
మృద్వీక. సం. ద్రాక్ష†; నల్లద్రాక్ష†.
మృధము. సం యుద్ధము. [అబద్ధము,
మృష. సం. అవ్య. అసత్యము; దబ్బఱ,
మృష్టము. సం. విణ. శోధితము, పరిశుద్ధము, కడుగుట మొదలగువానిచేతగరగరికైనది

## మె

మె. స్త్రీవాచక ప్రత్యయము. (అమె, ఈమెయని)
మెంచ. తురక.
మెండియము. రూ. మెండెము.
మెండీఁడు. చూపుడువ్రేలు.
మెండు అధిక్యము; అతిశయము; మిట్టు. విణ. అధికము.
మెండుకొను. అ క్రి. అతిశయించు; విజృంభించు; నిండుకొను. ప్రే. మెండుకొలుపు
మెండెము. చూపుడు వ్రేల వేసికొనెఁ యుంగరము.
మెండొడ్డు. అ. క్రి. ఎదిరించు.
మెంతి. మేథి, సస్యవిశేషము; కూరలలో వేసెడి ఒక వస్తువు.
మెంతిపెరుఁగు. తిరుగఁబోసిన పెరుఁగు
మెంతిమజ్జిగ. చల్లకడి, తిరుగఁబోసినచ
మెంతికాయ. మెంతితో నూరఁబెట్టి మామిడికాయ. [గింజల
మెంతులు బ. సంబారుదినుసు, మెం
మెంబరు. ఇం. సభ్యుడు.

మెకపుటాము. కస్తూరి, మృగమదము.
మెకము. మృగము, జింక; చతుష్పాద జంతువు.
మెకములకొలముసామి. సింహము, మృగ [రాజు.
మెకములతిండి. మృగాదనము, సివంగి; వ్యాఘ్రము.
మెకములతేఁడు. సింహము, మృగేంద్రుఁడు
మెకములసామి. సింహము, మృగరాట్టు.
మెకములసూడు. వ్యాఘ్రము.
మెకమెకపడు. అ. క్రి. ఉద్ధతినొందు.
మెకమెకపాటు. ఉద్ధతి; ఆఁకలియోవ్వనట్టియార్తి.
మెక్కు. స. క్రి. తిను, భక్షించు.
మెగము. మృగము.
మెగ్గ. ఊట.
మెచ్చు. శ్లాఘనము; బహుమానము; ప్రీతి. స. క్రి. శ్లాఘించు; లక్ష్యపెట్టు. విశే. శ్లాఘ్యము; హృదయంగమము.
మెచ్చులచెట్టు. కల్పవృక్షము. [స్త్రీ.
మెచ్చులాఁడి. శ్లాఘ్య. మెచ్చుకొనఁదగి
మెచ్చులాఁడు. విశే శ్లాఘ్యుఁడు, మెచ్చుకొనఁదగినవాఁడు.
మెటిక. సోపానము.
మెటికలువిఱుచుట. అంగుళిమోటనము.
మెట్ట. నీరాసరా లేకుండ పండెడుచేను; పాదము; పర్వతము; మెరక నేల; ఉన్నతభూమి.
మెట్టజీలుగు సస్యవిశేషము.
మెట్టతమ్మి } మెట్టదామర } స్థలపద్మిని†.
మెట్టపంట. మెట్టచేనిపంట.
మెట్టవాలుపిట్ట. కోడి, చరణాయుధము. రూ. మెట్టవాల్పిట్ట.
మెట్టిక. సోపానము.
మెట్టినిల్లు. స్త్రీయొక్క అత్తగారిల్లు.
మెట్టియ. మెట్టె.
మెట్టు. త్రొక్కుడు; సోపానము; తిప్ప; కొండ; సుంకము పుచ్చుకొనెడుఘట్టము; పులిమజ్జిగ; అభిహతము; అంకెలవెరసి. బ. చెప్పులు; పావకోళ్లు; వీణెసరకట్లు. స. క్రి. త్రొక్కు.
మెట్టుఁద్రాలు. తలఁద్రాలు.
మెట్టుకు. ద్ర. తుదకు; మొత్తమునకు.
మెట్టుచాలు. గంగ, విష్ణుపది.
మెట్టె. రూ. మట్టె.
మెట్లగుంటక. గుంటకభేదము.
మెట్లు. బ. పాదరక్షలు; సోపానములు.
మెడ. గళము, కంఠము, గ్రీవ, మెడకాయ.
మెడకాయ. మెడ, కంధర.
మెడకొంకులు బ. జత్రువులు, మెడ ముందటి యడ్డయెముకలు.
మెడకోలము బాధపెట్టు సాధనము.
మెడనూలు. బంగారుతీఁగెల హారము.
మెడపొంపు } మెడవంపు } మెడ వెనుకటిభాగము.
మెడవల. చేఁపల వలలో భేదము.
మెడవాలు. చాకలవాఁడు; చాకలది.
మెడిదము. ధ్వని.
మెడుద. పులిమజ్జిగ.
మెణకరి. బ్రహ్మచారి.
మెణత. మెల్లె.
మెతుక. విశే. మృదువైనది, మందము.
మెతుకు. పులాకము, అన్నముయొక్క కణము; అన్నము.
మెతువు. విశే. మృదువైనది, మందము.
మెత్త. శయ్య, పఱపు; సాగరము మోసెడి యెద్దుగంతమీఁది పఱపు; గుఱ్ఱపుపల్లము; పల్లకిమోయువారు భుజముపై నొత్తకుండుటకై వేసికొను దూదివేసి కుట్టిన బిల్ల. విశే. మృదువైనది.
మెత్తఁబడు. అ. క్రి. మృదువగు; అణఁగు.
మెత్తఁబాటు మృదుత్వము; ఆలస్యము.
మెత్తబాఱు. అ. క్రి. మెత్తఁబడు.
మెత్తగిల్లు అ. క్రి. మెత్తనగు.
మెత్తడము, మెత్తుట.
మెత్తడి. మత్స్యవిశేషము.
మెత్తన. మృదుత్వము; శాంతి. విశే. మృదువు. క్రి. విశే. తిన్నగా.
మెత్తర. మల్లబంధ విశేషము.
మెత్తిసగోడ. ఏడూకము, లోపల ఎముక లుంచి పెట్టినగోడ.
మెత్తు. మన్ను మొదలగుదానినిదళముగా

పూసినపూఁత. స. క్రి. మన్ను మొదలగు దానిని దళముగా పూయు.
మెదడు. తలయందుండు క్రొవ్వు; మస్తిష్కము; మేధస్సు.
మెదలిక. మెదలుట.
మెదలు. అ. క్రి. కొంచెముచలించు; సంచరించు. [మెదల్చు.
మెదలుచు. ప్రే. మెదలఁజేయు. రూ.
మెదించు. స. క్రి. మర్దించు.
మెదికాళ్లు. కొయ్యకాళ్లు.
మెదుక. పిసక. విణ. మందము; మందుఁడు.
మెదుకగొను. అ. క్రి. పిసకపట్టు.
మెదుకు మెతుకు, పులాకము.
మెదుగు. అ. క్రి. ధాన్యము పొట్టపోవ నలఁగు; నలఁగు.
మెదుగుడు. పాఁతవస్త్రము.
మెదుచు. స. క్రి. మర్దించు.
మెదుపు. ప్రే. మెదుగఁజేయు.
మెదువు. విణ. మృదువు; మందము.
మెనుపు. స క్రి (కవ్వముతో) ఎమచు.
మెనుసురేషన్. ఇం. భూమి కొలఁత సంబంధమైన శాస్త్రము.
మెప్పు. శ్లాఘనము; ప్రీతి; వరము.
మెయి. శరీరము, విధము; పార్శ్వము; వెంబడి. అప. కొన్నియెడల తృతీయా విభక్తియందు వచ్చెడి ప్రత్యయము.
మెయికొను. అ. క్రి. సమ్మతించు; కలుగు; అనుకూలించు. స. క్రి. అంగీకరించు.
మెయికోలు. అంగీకారము, సమ్మతి.
మెయితాలుపు. దేహధారి, ప్రాణి.
మెయితాలుపులసామి. వరుణుఁడు.
మెయిపాలు. సమభాగము.
మెయిమఱపు. మైమఱపు, పారవశ్యము.
మెయిమఱువు. కవచము.
మెయిమెయి. రూ. మయిమయి.
మెయివడి. రూ. మయివడి.
మెర. అవ్య ప్రశంసనార్థకము.
మెరక. మిట్టనేల, ఉన్నతభూమి.
మెరపొలము. మిట్టపొలము.
మెరమెర. మనోవ్యథ; సంశయము; భేదము
మెరమెరపడు. అ. క్రి. సంశయపడు.
మెరమెరపాటు. సంశయపడుట.
మెరమెరలాడు. అ. క్రి. బాధపడు.
మెఱఁగు. ఉత్కృష్టకాంతి.
మెఱచు. అ క్రి. తళుక్కని ప్రకాశించు.
మెఱపు. విద్యుత్తు; ప్రకాశము; ఉత్కృష్టకాంతి. [వంటి మెఱపు.
మెఱపుఁదీఁగ. జ్యోతిష్మతీలత; తీఁగ
మెఱము. పిల్లమెఱము. స. క్రి. నాటిన శల్యాదికము ఇటునటు మెదల్చు.
మెఱమెచ్చు. మిక్కిలిమెచ్చు.
మెఱయు. అ. క్రి. ప్రకాశించు; బయలుపడు. ప్రే. బయలుపఱచు.
మెఱవడి అతిశయము; ఉద్రేకము; ఊరేగింపు; ధైర్యము; నేర్పు; గౌరవము. విణ. ప్రకాశితము. [బియ్యము.
మెఱికలు. బ. పొట్టవీడియు వీడని
మెఱియ. గుండ్రాయి.
మెఱియఁడు. విణ. చలింపనివాఁడు.
మెఱియత. విణ. చలింపని స్త్రీ.
మెఱుఁగుజిడ్డు. తళతళ మనెడు కాంతి; మెఱపు; నెయ్యిమొదలైనవాని జిడ్డు.
మెఱుఁగుఁబోఁడి. మెఱపువలె మనోజ్ఞరాలగు స్త్రీ; స్త్రీ.
మెఱుఁగుడుఁబురుగు(వు). ఖద్యోతము, మిడుఁగుఱుఁబురుగు. రూ. మెఱుఁగుడుఁబురువు. [రాజము.?
మెఱుఁగుడుజెట్టి. ఒకదినుసుజెట్టి, నట
మెఱుఁగునూనె. మెఱుఁగునకై పెట్టెలు మొదలగువానిమీఁద పూసెడు పూఁతనూనె.
మెఱుఁగునల్లలు. కట్లదండ.
మెఱుఁగురిక్క. పగడము; మిక్కిలికాంతి గల నక్షత్రము.
మెఱుకు. స. క్రి. పెఱుకు.
మెఱుపు. రూ. మెఱపు.?
మెఱుము. విద్యుత్తు. అ. క్రి. మెఱచు. స. క్రి. పొడుచు.
మెలఁకువ. ప్రబోధము, మేలుకొనుట; వర్తనము; జాగరూకత; జీవనము; సంచారము.
మెలఁకువకాఁడు. విణ. జాగరూకుఁడు.
మెలఁగు. అ. క్రి. వర్తించు; జాగరూకతతో వర్తించు; సంచరించు; జరగు.

మెలఁచు. ప్రే. మెలఁగఁజేయు.
మెలఁత / మెలఁతుక } స్త్రీ.
మెలక. కపటము, వంచన.
మెలకు. అ. క్రి. జ్వలించు, మండు.
మెలన. గ్రామముచుట్టు నుండుబయలు.
మెలపు. నేర్పు; జాగరూకత; మెత్తఁబాటు; భ్రమణము; చలింపమి. ప్రే. మెలయఁ జేయు. [తో వర్తించు; పెనఁగు.
మెలయు. అ. క్రి. వర్తించు; జాగరూకత
మెలిక. పెన, మెలంసు, పురి, వేష్టనము
మెలిగొను. అ. క్రి. పెనఁగొను.
మెలిగ్రుక్క. మణితము.
మెలిదారము. జాళ్లపనివారు దిండు ప్రక్కకొయ్యలకుఁగట్టెడు బిగిదారము.
మెలియు అ. క్రి. పెనఁగు.
మెలివడు. అ. క్రి. మెలిగొను.
మెలివెట్టు. స. క్రి. మెలివేయు.
మెలుచు. ప్రే. మెలియఁజేయు, పెనఁచు
మెలుతుక. స్త్రీ.
మెలుసు. మెలిక.
మెల్తి / మెల్తుక } స్త్రీ.
మెల్పు. మృదుత్వము.
మెల్ల. విణ. కంటికడ కొఱగినది; మెల్లై నది. క్రి. విణ. తిన్నగా.
మెల్లకంటి. కాకి. విణ. కేకరుఁడు; కేకర.
మెల్లకంటివాఁడు. విణ. కేకరుఁడు.
మెల్లన. తిన్నన; అల్లన; శనైరర్థకము.
మెల్లా. వా. చవిక.
మెల్లె. ఉపశాఖ.
మెసఁగు / మెసవు } స. క్రి. తిను, భక్షించు.
మెహదా. ఆయుధవిశేషము. [పాటు.
మెహనతు. హిం. బహుమతి; కష్టము,

## మే

మే. శరీరము; విధము; పార్శ్వము.
మేంఠుఁడు. సం. మావటీఁడు.
ఘేండించు. స. క్రి. భేదించు.
ఘేండుఁడు. ఘం. మావటీఁడు.
మేంఢము. సం. పొట్టేలు.
మేఁక. ఛాగి; ఛాగము.
మేఁకతిండి. తోఁడేలు, వృకము.
మేఁకపోతు. ఛాగము. [వ్యర్థము.
మేఁకయఱితిచన్ను. అజాగళ స్తనము;
మేఁకరాసి. మేషరాశి.
మేఁకసారము. గాంధారస్వరము.
మేఁగు. స. క్రి. పూయు; మెత్తు; ఆవరించు.
మేఁడి. నాఁగటిదుంపవెనుకనిలిపినకొయ్య
మేఁడికఱ్ఱ. మేఁడి. [భాగము.
మేఁడికోరు. నేలయొడయనికి వచ్చు ధాన్య
మేఁడిచీల. మేఁడిజాఱిరాకుండ వేసినచీల.
మేఁడితోఁక. దున్నెడువాఁడు పట్టుకొనుటకు మేఁడిచివరను అడ్డముగా చెక్కిన చిన్న కొయ్య. [భాగము.
మేఁడిపాలు సేద్యకాఁపునకువచ్చుధాన్య
మేఁడిసోగ. మేఁడితోఁక.
మేఁత. పశ్వాద్యాహారము;
మేఁతరి. కొందఱుశిల్పులలో ముఖ్యుఁడు. విణ. తిండిపోతు.
మేఁతలాఁడు / మేఁతాఁడు } అ. క్రి. మేఁతమేయు.
మేకము. సం. మేఁక.
మేకరాశి. సం. మేషరాశి.
మేకు. గూటము.
మేకొను. అ క్రి. సమ్మతించు; కలుగు; పూను. స క్రి. పొందు. ప్రే. మేలుకొలుపు.
మేకోలు. మేకొనుట.
మేఖల. సం. ఎనిమిది పేటలుగల స్త్రీల మొలనూలు; కొండనడుము; చిలుకడ త్రాడు.
మేఖలకన్యక. సం. నర్మదానది.
మేగలి. పూనిక.
మేఘజ్యోతి. సం. వజ్రాగ్ని, పిడుగు.
మేఘడంబరము. సం. ఉఱుము.
మేఘద్వారము సం. ఆకాశము.
మేఘనాదము. సం. ఉఱుము; చిఱ్ఱికూర.
మేఘనాదానులాసి. సం. నెమిలి.
మేఘనాదుఁడు. సం. ఇంద్రజిత్తు; వరుణుడు.
మేఘనామము. సం నిడుముస్తె
మేఘపుష్పము. సం. నీరు; తూఱ; శ్రీ కృష్ణుని తేరి గుఱ్ఱములలో నొకటి.

మేఘము. సం. మబ్బు; ఏనుఁగు కాలి యందలి మదము; ముసె†
మేఘవన్నె. మి. వస్త్రవిశేషము.
మేఘవాహనుఁడు. సం. ఇంద్రుఁడు.
మేఘుఁడు. సం. మబ్బు.
మేచకము. సం. చీఁకటి; నెమిలిపురికన్ను; నలుపు. విశే. నల్లనిది.
మేచే. పల్వలము.
మేజిస్ట్రీటు. ఇం. దండనాధికారి.
మేజా. హిం. బల్ల.
మేజువాని. హిం. విందు. [వేయు జోడు.
మేజోడు. పాదరక్షలకు లోపల కాలికి
మేట. ఎక్కలి.
మేటరి. విశే. మేటి.
మేటి. అధిపుఁడు; శ్రేష్ఠుఁడు; రాశి, కుప్ప; కసవువామి. విశే. శ్రేష్ఠము. ఇం. చిల్లఱ పనులు చేయు సేవకుఁడు.
మేటినీరుచూలి. వరుణుఁడు.
మేటిల్లు. అ. క్రి. అతిశయించు.
మేతము. సం. పొట్టేలు.
మేతుఁడు. సం. మావటీఁడు.
మేడ. హర్మ్యము; సౌధము.
మేడము. యుద్ధము; కలయిక, మేలము
మేడముపాడుచు. అ క్రి. యుద్ధముచేయు.
మేడి. ఉదుంబరము, అత్తి†.
మేడియము. రూ. మేడెము.
మేడు. ఉన్నతభూమి.
మేడుపడు. అ. క్రి. ఆజ్ఞతఁబొందు.
మేడెము. చెక్కడపు జామికీయంచు పనితరము.
మేడ్పడు. అ. క్రి. ఆజ్ఞతఁబొందు
మేఢ్రము. సం. మగగుఱి; పొట్టేలు.
మేతాలుపు. దేహధారి, ప్రాణి.
మేథి. సం. మెంతి†; మెంతులు.
మేదకము. సం. పల్లెము.
మేదకుఁడు. విశే. కపటములేనివాఁడు.
మేదతనము. ఆర్జవము, సాధుత్వము.
మేదర. వెదురుచాఁపలు మొదలగునవి యల్లి జీవించెడు యొకానొక జాతి.
మేదరవాఁడు. మేదరి.
మేదరసాని. మేదరివాని భార్య.
మేదరది. మేదరజాతి స్త్రీ.
మేదరి. కటకారుఁడు.
మేదస్సు. సం. మాంసమునందుండు క్రొవ్వు
మేదావి. ఔపాసనాగ్ని మసి.
మేదించు. స. క్రి. మర్దించు.
మేదిని సం. భూమి. [నది.
మేదురము. సం. విశే. చిక్కనైనను నునుపై
మేధ. సం. ధారణాశక్తిగల బుద్ధి, మఱపు లేని బుద్ధి.
మేధము. సం. యజ్ఞము.
మేధావి. సం. చిలుక. విశే. మేధగల వాఁడు, పండితుఁడు.
మేధి. సం. పసులఁగట్టుటకు కళ్ళమునఁ బాఁతిన గుంజ. [పవిత్రమైనది.
మేధ్యము. సం. ముంజికసవు?. విశే.
మేన. తోడఁబుట్టిన దానియొక్కయు తండ్రి తోడఁబుట్టిన దానియొక్కయు తల్లితోడఁబుట్టినదానియొక్కయు దేహసంబంధము. సం. మేనక. [అప్సరస.
మేనక. సం. హిమవంతుని భార్య; ఒక
మేనకాత్మజ. సం. పార్వతి.
మేనగోడలు. భాగినేయి, తోడఁబుట్టిన దాని కూఁతురు.
మేనత్త. పితృష్వస.
మేనబావ. జ్యేష్ఠ మాతులేయుఁడు, తన కంటె పెద్దవాఁడైన మేనత్త మేనమామల కొడుకు.
మేనమఱఁదలు. కనిష్ఠ మాతులేయి, తన కంటె చిన్నదైన మేనత్త మేనమామల కూఁతురు.
మేనమఱఁది. కనిష్ఠ మాతులేయుఁడు, తన కంటె చిన్నవాఁడైన మేనత్త మేన మామల కొడుకు. [బుట్టినవాఁడు.
మేనమామ. మాతులుఁడు, తల్లి తోడఁ
మేనయత్త. రూ. మేనత్త.
మేనయల్లుఁడు. రూ. మేనల్లుఁడు.
మేనఱికము తోడఁబుట్టినదానియొక్కయు తండ్రితోడఁబుట్టిన దానియొక్కయు దేహసంబంధ భావము.
మేనల్లుఁడు. భాగినేయుఁడు.
మేనవదిన. జ్యేష్ఠమాతులేయి, తనకంటె పెద్దదైన మేనత్త మేనమామలకూఁతురు.
మేనా. పల్లకి.

మేని. కాంతి.
మేను. శరీరము; జన్మము; పార్శ్వము.
మేనుందీగ. లతవలె కోమలమైన శరీరము. రూ. మేనుందీవ, మేనుదీగ.
మేనుతాలుపు. దేహధారి, ప్రాణి.
మేనుతాలుపులసామి. వరుణుఁడు.
మేనేజరు. ఇం. పై యధికారి, కార్యనిర్వాహకుఁడు.
మేపచ్చన చిహ్నము.
మేపరి. విణ. భక్షకుఁడు. తినువాఁడు.
మేపు. మేఁత; దోసెపిండి మొదలైనదానికి నూతికూడఁ జేర్చెడి మినుపపప్పు మొ. ప్రే. మేయఁజేయు.
మేపుట్టువు. తనుజుఁడు, కొడుకు; తనుజ, కూఁతురు.
మేపుమేయు. అ. క్రి. పశ్వాదులు మేఁత మేయు.
మేమరువు. కవచము.
మేమఱపు. మైమఱపు.
మేముఱువు. దేహత్రాణము, కవచము.
మేము. అస్మచ్ఛబ్దప్రథమాబహువచనము.
మేముడు. సమ్మతి.
మేమెయి. అనాయాసము. క్రి.విణ. అనాయాసముగా.
మేయు. స. క్రి. పశ్వాదులు మేఁతఁదిను.
మేర. హద్దు, ఎల్ల; మర్యాద; ఏర్పాటు.
మేరగట్టు. చక్రవాళపర్వతము.
మేరతప్పు. అ. క్రి. హద్దుమీఱు.
మేరు. మేరువు.
మేరుధన్వుఁడు. సం. శివుఁడు.
మేరువు. వీణాగ్రము; సారువ; శిఖరమునందుంచెడు మణి; హారమధ్యమునందు ప్రేలెడు మణి. సం. సుమేరువు, బంగరుకొండ.
మేల్. మేలు, క్షేమము. అవ్య. ప్రశంసార్థకము.
మేలమాడు. స. క్రి. పరిహాసము చేయు.
మేలము. పరిహాసము.
మేలి. మేలిమి శబ్దముయొక్క లుప్తరూపము.
మేలిచ్చుపులుఁగు. అరిష్టనేమి, గరుత్మంతుఁడు.
మేలిమదావళములు. బ. శ్రేష్ఠములైన యేనుఁగులు.
మేలిమి. అపరంజి, తప్తకాంచనము; గౌరవము; ఔత్కృష్ట్యము; ఆధిక్యము.
మేలిమిమెట్టవిల్మేటి. మేరుధన్వుఁడు, శివుఁడు.
మేలిల్లు. మేడ, సౌధము.
మేలు. శుభము; ఉపకారము; పుణ్యము, సుకృతము; లాభము; విశేషము; వలపు; మదము; ప్రేమము. విణ. శుభకరమైనది; అధికము; శ్రేష్ఠము; యోగ్యము; ఉపరి, ఊర్ధ్వము. అవ్య. మెచ్చుట, ప్రశంసార్థకము.
మేలుకట్టు. ఉల్లడ, చందువ, వితానము; మెట్టు.
మేలుకను. అ. క్రి. మేలుకొను.
మేలుకనుపు. ప్రే. మేలుకొలుపు.
మేలుకమ్మిచీర. ఓర మూడంగుళముల్ల వెడల్పు చాయనూలితో నేసిన అంచులు గల కోక.
మేలుకాంచు. అ. క్రి. మేలుకొను.
మేలుకాంచుట, మేలుకొంట. అవబోధము.
మేలుకొను. అ. క్రి. నిద్రఁదెలియు. స.క్రి. మోహించు.
మేలుకొలుపు. ప్రే. మేలుకొనఁజేయు. బ. సుప్రభాత గేయములు.
మేలుకోలు. అవబోధము, మేలుకొనుట.
మేలుచేయి. ఆధిక్యము, హెచ్చు. విణ. హెచ్చైనది; హెచ్చైనవాఁడు; గెలుపుగలది; గెలుపుగలవాఁడు.
మేలుతరము. మిన్న, శ్రేష్ఠము.
మేలుపడు. అ. క్రి. వలపుగొను.
మేలుబంతి. విద్యార్థులు చూచి ఒరవడి వ్రాయుమాదిరికి మీఁద మొదట వ్రాసిన అక్షరముల పంక్తి; చూచి యేదేని ఒక పని నేర్చుకొనుటకుఁగాని చేయుటకుఁగాని మొదట నేర్పడిన మాదిరి. విణ. శ్రేష్ఠము; శ్రేష్ఠుఁడు; శ్రేష్ఠురాలు.
మేలుమచ్చు. సౌధము; చంద్రశాల. బ. బాలికాక్రీడావిశేషము.
మేలురాసి. తూర్పెత్తిన ధాన్యపుప్రోగు.
మేలువాఁడు. విణ. వలపుకాఁడు; సుకృతి, మంచివాఁడు.
మేల్కను. అ. క్రి. మేలుకొను, జాగ్రత్తపొందు.
మేల్కనుపు. ప్రే. మేలుకొలుపు.
మేల్కొంట. అవబోధము.

మేల్కొను. మేలుకొను, ప్రబోధము నొందు
మేల్కొలుపు ప్రే. మేలుకొలుపు, ప్రబోధము గలిగించు.
మేల్దాపరి. వేశ్య.?
మేల్పడు. అ. క్రి. వలపుగొను.
మేల్తైవచ్చు. అ. క్రి. అచ్చివచ్చు.
మేల్బంతి. రూ. మేలుబంతి.
మేల్మచ్చు. సౌధము, మేలుమచ్చు.
మేవ. మత్స్యవిశేషము; ఉపాయనము.
మేవకి. నమ్రత; ఉపాయము. విణ. ఉచితము. [ఉపాయముగలవాఁడు.
మేవడికాఁడు. విణ. నమ్రతగలవాఁడు;
మేవు. స. క్రి. పూయు; ఆవరించు.
మేషము. సం. పొట్టేలు; మేషరాశి; అజశృంగి†.
మేషాండుఁడు. సం. ఇంద్రుఁడు.
మేషి. సం. ఆఁడుగొఱ్ఱె.
మేస్టరు. ఇం. యజమాని; ఉపాధ్యాయుఁడు
మేస్త్రి. పనివారలమీఁద పెద్ద.
మేహనము. సం. మగగుఱి; మూత్రము.
మేహము. సం. రోగవిశేషము.
మేళ. సం. కలయిక; కాటుక; సిరా; సిలి†.
మేళకము. సం. కలయిక.
మేళగాఁడు. విణ. మేళము వాయించువాఁడు; సూత్రధారుఁడు; వేశ్యాది జనసమూహములోని వాఁడు.
మేళగించు. అ. క్రి. జతగూడు; కలియు. ప్రే. జతగూర్చు; కలుపు. [చేయు.
మేళనమిచ్చు. సం. అ. క్రి. కలియునట్లు
మేళనము. సం. కలయిక.
మేళపుఁబెద్ద. మేళగాఁడు.
మేళము. నాగసరము మొదలగు వాద్యముల జత; మేళగాండ్లయు నటులయు సమూహము. సం. కలయిక; రాగానుగుణముగ స్వరస్థానములయందు మెట్లు కుదుర్చుట; వేశ్యాది జనసమూహము.
మేళవించు. రూ. మేళగించు.
మేళామణి. సం. సిరాబుడ్డి.
మేళామండము. సం. సిరాబుడ్డి.

## మై

మై. అవ. కొన్ని యెడల తృతీయా విభక్తియందు వచ్చెడి ప్రత్యయము; శరీరము; విధము; పార్శ్వము; తడవ.
మైఁగను. ఇంద్రుఁడు, సహస్రాక్షుఁడు.
మైకము. మత్తు.
మైకొను. అ. క్రి. సమ్మతించు.
మైకొలుపు. ప్రే. సమ్మతింపఁజేయు.
మైకోలు. సమ్మతి.
మైగిలుపు. అంగవిక్షేపము.
మైజారు. కొంత ఎడ యెడముగా అడ్డకమ్ములు వాతించిన ఆఁడుదాని చీర కొంగు.
మైజారుచీర. స్త్రీ వస్త్రభేదము.
మైతాలుపు. దేహధారి, ప్రాణి.
మైత్రము. సం. దినముయొక్క మూఁడవ భాగము; అనూరాధ నక్షత్రము.
మైత్రావరుణి. సం. అగస్త్యుఁడు.
మైత్రి, మైత్ర్యము } సం. స్నేహము, మిత్రభావము మిత్రకర్మము.
మైథునము. సం. రతి, సంగమము, గ్రామ్యధర్మము; కలయిక.
మైద. గోరంట†; మైకము; మదము.
మైదా. హిం. శ్వేత గోధూమ చూర్ణము.
మైదానము. హిం. బయలుభూమి.
మైదీఁగె. లతవలె కోమలమైన దేహము.
మైదు. మాయ; మైకము; మోహనశస్త్రము, చొక్కుపొడి.
మైనపుజిడ్డి. మైనపుగుడ్డ.
మైనపువత్తి. సిక్థవర్తి; దీపము వెలిగించుటకై మైనముతో చేసినవత్తి.
మైనము. మధూచ్ఛిష్టము, సిక్థకము.
మైనరు. ఇం. స్వాతంత్ర్యమునకుఁ దగిన యీడు రానివాఁడు.
మైనాకుఁడు. సం. పార్వతీదేవితమ్ముఁడు. రూ. మైనాకము.
మైనికుఁడు. సం. జాలరి.
మైపూఁత. అంగరాగము.
మైపోక. విణ. తేలిక.
మైమయి. రూ. మయిమయి, మై మై.
మైమఱచు. అ. క్రి. పరవశ్యమునొందు.

రుబ్బుతోలు. రుబ్బేడు తాటితోలు.
రుమ. సం. ఉప్పుపండెడు భూమి; సుగ్రీవుని పెండ్లాము.
రుమాలాలు. బ. రుమాళ్ళు; చేతిగుడ్డలు.
రుమాలు-వు. తలగుడ్డ; చేతిగుడ్డ.
రురువు. సం. నల్లచారల దుప్పి; ఒక రాక్షసుడు.
రువాణము. కాంతి.
రువారము. విలాస విశేషము.
రువ్వ. దమ్మిడి.
రువ్వపులుగు. కాటుక పిట్ట.
రువ్వము. తడవ. [వల్లె; తడవ.
రువ్వు. విసరివైచుట. స. క్రి. విసరివైచు;
రుశతి. సం. విణ. అమంగళవాక్కు.
రుష. సం. కోపము.
రుసి. ఋషి. [పట్టము.
రుసుము. హిం. లాభము; లంచము;
రుహ. సం. గరిక†; మహామంజిష్ఠ†.

## రూ

రూక. ధనము; చిన్నమెత్తు వెండిబంగారముల నాణెము. [జిడ్డు లేనిది.
రూక్షము. సం. బరుసు; స్నేహము లేనిది,
రూడి. రూఢి.
రూఢము. సం. విణ. మొలచినది; ప్రసిద్ధమయినది; నిశ్చయింపఁబడినది.
రూఢి, సం. మొలచుట; ప్రసిద్ధి; నిశ్చయము.
రూణించు. స. క్రి. మల్లులు ఒక విధముగా బంధించు.
రూణింపు. మల్లబంధ విశేషము.
రూపకము. సం. ఒక యర్థాలంకారము; రూపము; ఆఱు మాత్రల కాలముగల తాళభేదము; దృశ్యకావ్యము (ఇవి పది — నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవకారము, వీథి, అంకము, ఈహామృగము.
రూపగంధ. సం. మూరుకొండ†.?
రూపగు. అ. క్రి. వర్ధిల్లు. [డఁచు.
రూపడఁగు. అ. క్రి. నశించు. ప్రే. రూప
రూపము. సం. ఆకారము, స్వరూపము; శుక్లపీతాదివర్ణము; సౌందర్యము; అగ్నిగుణము; చక్షురింద్రియ గోచరము; నాటకము; రూప్యము; స్వభావము. [వతి.
రూపరి. విణ. సౌందర్యవంతుడు; సౌందర్య
రూపరు. అ. క్రి. అంగహీనమగు; నశించు.
రూపవంతుఁడు. సం. విణ. చక్కనివాఁడు.
రూపవతి. సం. విణ. చక్కనిది.
రూపసి. విణ. రూపరి.
రూపాజీవ. సం. వేశ్య.
రూపాయ } ముప్పది చిన్నముల యెత్తు
రూపాయి } వెండి నాణెము.
రూపించు. సం. స. క్రి. నిరూపించు; అగపఱచు.
రూపిక. రూపాయి.
రూపు. విధము; సౌందర్యము; స్వరూపము. [చంపు.
రూపుమాపు ప్రే. రూపుమాయఁజేయు;
రూపుమాయు అ. క్రి. నశించు; చచ్చు.
రూపురూపున. క్రి. వి. సమ్ముఖమున.
రూపుసెడు. అ. క్రి. నశించు; చచ్చు.
రూప్యము. సం. బంగారు వెండి మొదలగువాని నాణెము; రూపాయి; వెండి. విణ. సుందరము.
రూలు. ఇం. బ. సనుమగు గీఁతలు.
రూలుకఱ్ఱ మి. గీఁతలు గీయు కఱ్ఱ.
రూల్సు. ఇం. సూత్రము; నిబంధన.
రూషితము. సం. విణ. ధూళి మొదలగువానిచేఁ గప్పఁబడినది.

## రె

రె. అవ్య. ప్రశంసార్థక శబ్దముల కను ప్రయుక్తమగునది. (బళిరె, బాపురె యని).
రెంచె. (జూదమునందు) రెండు.
రెంట. ద్వైధము, రెండగుట; షడ్గుణములలో ఆఱవది.
రెంటత్రాగుడు. ద్విపము, ఏనుఁగు.
రెంటత్రాగుడు తిండి. కుంజరాశనము, సింహము. [ఏనుఁగు.
రెంటత్రాగుడు మెకము. ద్విపము,
రెంటనాల్కలు గలాఁడు. ద్విరసనము, పాము.

రెంటపంజాలు. లాయిడి.
రెంటము. మడుపు.
రెంటెము. జంట నేత వస్త్రము. [రాజు.
రెండవ వంగడంపు పబువు. క్షత్రియుఁడు,
రెండవ కొలము. క్షత్రియ వర్ణము.
రెండవ కొలమువాఁడు. క్షత్రియుఁడు.
రెండాడు. స. క్రి. అసత్యము పలుకు.
రెండు. భేదము. స. ద్వయము.
రెండొకటి. త్రికము, మూఁడు.
రెంబ. ఉపశాఖ.
రెక్క. రూ. రెక్క. [రెక్కలంపు.
రెక్కొను. అ. క్రి. వర్ధిల్లు; తేరుకొను; ప్రే.
రెక్కోలు. రెక్కొనుట.
రెచ్చెల. విణ. జగడాలమారి.
రెచ్చు. అ. క్రి. విజృంభించు.
రెట్ట. భుజము; పక్షిమలము; పక్షము.
రెట్టి. ద్విగుణము; మణుఁగు, గుణము. (మూఁడు రెట్లు నాలుగు రెట్లు అని.)
రెట్టించు. స. క్రి. ఇనుమడించు; ద్విగుణించు.
రెట్టు. ముతక బట్ట.
రెడి. రెడ్డి.
రెడ్డి. కాఁపువారి కులశ్రేష్ఠనామము. చతుర్వర్ణములలో నాలవది.
రెడ్డిపాలవంకలు. బ. ధాన్య విశేషము.
రెడ్డివారినానఁబ్రాలు. పటుపర్ణి †.
రెన్నాళ్ళు. రెండు రోజులు.
రెన్నెల్లు. రెండు నెలలు.
రెపరెప. రటితము, నిప్పువంట ప్రోఁత; గాలివీఁచుటయందగు ధ్వన్యనుకరణము.
రెపరెపమను. } అ. క్రి. ఆఁక లెత్తు.
రెపరెపలాడు. }
రెప్ప. ఱెప్ప.
రెప్పము. విణ. పూర్ణము.
రెబ్బ. ఉపశాఖ.
రెమ్మ. రెబ్బ.
రెమ్ము. స. క్రి. ఒడిసి తిగుచు; ఒడియు.
రెయి. రాత్రి.
రెయ్య. చిరుచేఁప.
రెల్ల. మెతుకు; రెల్లు.
రెల్లు. శరము†
రెల్లుకానుపు. శరజన్ముఁడు, స్కందుఁడు.
రెల్లుకానుపుతాత. హిమవంతుఁడు.

## రే

రే రాత్రి. అవ్య. రూ. రె.
రేఁగు. బదరి†. అ క్రి. ఎగయు; విజృంభించు; ఉద్రేకించు.
రేఁగుడు. లింగపొట్ల †.
రేఁచు. ప్రే. రేఁగఁజేయు.
రేఁటెము. జంట నేత వస్త్రము.
రేఁపు. రూ. రేఁమ. [లేఖ; పంక్తి.
రేక. తాటాకుమట్టతో కట్టినదొప్ప; రేఖ;
రేకంటు. దివాకరుఁడు, సూర్యుఁడు.
రేకచీరణము. రేఖలుతీర్చెడుచిన్నయులి.
రేకలాలు. ఒకవిధమైన ఖిరంగులు.
రేకు. ఱేకు; పచ్ఛదములో సగము.
రేకుమడఁచు. స క్రి. అణఁగఁద్రొక్కు.
రేకెత్తు. అ. క్రి. వృద్ధినొందు.
రేఖ. సం ఎడములేక యుండెడి వృక్షాదుల పంక్తి; పాణిపాదతలములయందలి గీఱ; గీఱ, గీఁత; శరీరస్థితి; రేగటినేల, నల్లనేల.
రేగడ } చిక్కమన్ను, బంకమన్ను, కృష్ణమృత్తిక.
రేగడి }
రేచకము. సం. ప్రాణాయామవిశేషము, ఊపిరి విడుచుట; ఏనుఁగుచెవి వంటి కాలితొడుగు;? కౌపీనము;? గాగర.?
రేచకి. సం. కరక†.
రేచని. సం. తెల్లతెగడ†; దంతిచెట్టు.
రేచితము. సం. వంకరలేక వేగముగాఁబోయెడి యశ్వధారా విశేషము.
రేచీఁకటి. నిశాంధ్యము, రాత్రులు కన్ను కనఁబడమి.
రేచీఁకు. నిశాంధ్యముగలవాఁడు.
రేచెల్వ. వేశ్య.
రేజేవరాలిమగఁడు. నిశాపతి, చంద్రుఁడు.
రేజోతి. నిశామణి, చంద్రుఁడు.
రేణము. దూడపేఁడ.
రేణు. రూ. రేణువు.
రేణుక. సం. గంధద్రవ్య విశేషము; పరశురాముని తల్లి.
రేణుకలు. నూఁగుదోసె†.
రేణువు. సం. పరాగము; దుమ్ము; రేణుక†.

రేతలి. భృంగము.
రేతస్సు. సం. వీర్యము, ఇంద్రియము; పాదరసము. రూ. రేతము.
రేతిరి. రాత్రి.
రేదొర. నిశాపతి, చంద్రుఁడు.
రేద్రిమ్మరి. దొంగ; రాక్షసి; రాక్షసుఁడు.
రేద్రిమ్మరీఁడు దొంగ; రాత్రించరుఁడు, నిరృతి; రాక్షసుఁడు.
రేనాఁడు. దేశవిశేషము.
రేను. రేఁగు†.
రేపకడ } ప్రభాతము, ప్రాతఃకాలము.
రేపాడి }
రేపగలు. అహోరాత్రము.
రేపు. పూర్వాహ్ణము, ప్రాతఃకాలము (రేపు, మాపు అని); పరదినము.
రేపాలఁతిమగఁడు. నిశాపతి, చంద్రుఁడు.
రేఫము. రవర్ణము. రూ. రేఫ. విణ. అధమము
రేఫుఁడు. సం. విణ. అధముఁడు
రేబ. శయ్య, పఱపు.?
రేయి. రాత్రి.
రేయింతిమామ. సముద్రుఁడు.
రేయివెల్గు. నిశామణి, చంద్రుఁడు.
రేయు. అ.క్రి. విజృంభించు. స.క్రి. ఖండించు
రేయెండ చంద్రాతపము, వెన్నెల.
రేరాయఁడు } నిశాపతి, చంద్రుఁడు.
రేఱేఁడు }
రేలు. బ. గణరాత్రము, పెక్కురాత్రులు.
రేవ. సం. నీలి†; నర్మదానది.
రేవంతుఁడు. అశ్వశిక్షకుఁడు. సం. గుహ్యకుల అధిపతి; సూర్యుని ఒక కొడుకు. [కుత్సితుఁడు.
రేవఁడు. చాకలవాఁడు; కృపణుఁడు;
రేవగలు. అహోరాత్రము.
రేవడ. రేగడ.
రేవడి. రూ. రేగడి.
రేవడినేల. కృష్ణభూమి. [భార్య.
రేవతి. సం. ఒక నక్షత్రము; బలరాముని
రేవతీరమణుఁడు. సం. బలరాముఁడు.
రేవలచిన్ని. ఓషధీవిశేషము.
రేవు. ఘట్టము, నద్యాదులయందు మనుష్యులు దిగుట కనువుగా నేర్పఱచిన దారి; సముద్రమునందు్ నోకలు ఎగుమతి దిగుమతి చేయుచోటు; కరవాక పట్టణము; రేఁగుచెట్టు.
రేవుజెక్కి. గాఁడిద.
రేవుబోయ. ఒడ నడపువాఁడు.
రేవువాఁడు. చాకలవాఁడు. [రేవెల్గు.
రేవెలుఁగు. రాత్రిమణి, చంద్రుఁడు. రూ.
రేవెల్గుజోడు. సూర్యుఁడు.
రేవేల్పు. చంద్రుఁడు.?
రేషణము. సం. చంపుట. [చులుకనిది.
రేసు. చులుకన, లాఘవము. విణ. లఘువు,
రేసుగుత్త. చేతిగుడ్డ.
రేసొద. కంకరి.

## రై

రై. సం. ధనము.
రైక. రవిక. [ఉద్యోగస్థుఁడు.
రైటరు. ఇం. వ్రాయువాఁడు, ఒక
రైతు. పంటకాఁపు, వ్యవసాయదారుఁడు
రైలు. ఇం. ఇనుపపట్టా. వా. పొగబండి.
రైల్‌స్టేషను. ఇం. పొగబండి నిలుచు స్థానము.

## రొ

రొ. అవ్య. సంబుద్ధియందు స్త్రీవాచకంబుల కనుప్రయుక్తంబగునది (అక్కరో, అమ్మరో అని); ప్రశ్నార్థకమునందు తద్వాచక శబ్దంబుల కనుప్రయుక్తంబగునది.
రొంజేడు. ప్రలాపము.
రొండి. నడుముయొక్క పార్శ్వము.
రొండిద్రెవేటు. మల్లబంధవిశేషము.
రొండు. శ్వాసరోగము.
రొండుడు. ప్రలాపము.
రొంప. పీనసరోగము; పడిసెము.
రొంపి. పంకము, బురద.
రొంపిదుకి. నీళ్లుగట్టి అడుసు గాదున్నుట.
రొంపిమాను. రొంపిదున్నిన పిమ్మట మిట్ట పల్లములు సరిపఱచుటకు మీఁద పాఱించెడు మాను.
రొక్కపు దొర. ధనాధిపుఁడు, కుబేరుఁడు.

రొక్కము. చేతివెల; ధనము; సమూహము.
రొక్కములరేఁడు. ధనాధిపుఁడు, కుబేరుఁడు. [బహువిధములు గలది.
రొక్కరొక్కములు. విశే. బ. ఉచ్చావచము
రొక్కించు. స. క్రి. రొక్కపఱచు.
రొచ్చు. అపవాదము; నుచ్చు; బురద; మాలిన్యము.
రొట్ట. ఉపశాఖ.
రొట్టియ. } రోటిక, భక్ష్య భేదము.
రొట్టె.
రొడ్డ. ఎడమ. రూ. లొడ్డ.
రొడ్డు. శ్వాసరోగము.
రొడ్డుడు. ప్రలాపము.
రొద. కలకలము, చేతన ధ్వని.
రొదాళము. ధ్వని.
రొదాళించు. అ. క్రి. ధ్వనించు.
రొప్పు. అ. క్రి. కూయు; (పులి) కూయు స. క్రి. కోపించు; తఱుము.
రొమ్ము. ఉరము, ఱొమ్ము.
రొయి. రూ. రొయ్యి.
రొయ్య. మత్స్యభేదము.
రొయ్యి. కట్టెనిప్పుమీఁది నిగుఱు.
రొల్లు. అ. క్రి. ప్రలాపించు.
రొల్లుడు. ప్రలాపము.
రొష్టు. హిం. తొందర.

## రో

రో. ధనము; విలువ? రూ. రోయి, అవ్య. రా. (అక్కరో, అమ్మరో, అని).
రోఁకటిబండ. శతపది, ఒకపురుగు; పాము లేని చిన్న రోఁకలి; క్రోష్టు; వృశ్చికత.
రోఁకలి. ముసలము, దంచెడు సాధనము.
రోఁకలి తాల్పు. ముసలి, బలరాముఁడు.
రోఁజు. ఒగర్పు, అత్యుచ్ఛ్వాసము, నిట్టూర్పు. అ. క్రి. నిట్టూర్చు.
రోఁజుడు. ప్రలాపము.
రోఁత. ఏవము; అసహ్యము. బ. తిట్లు.
రోఁతగించు. అ. క్రి. రోఁతపడు.
రోఁతలమారి. విశే. నిందితుఁడు.
రోఁతిబూడిద. రొయ్యి.
రోఁక. రోణము; మూల.

రోకము. సం. ఓడ; రంధ్రము; కదలిక; దీప్తి; రొక్కపమ్మకము.
రోకు. వికాసము. [రోగము వచ్చు.
రోగపడు. మి. స. క్రి. జబ్బు చేయు,
రోగము. సం. వ్యాధి, తెగులు; చెంగల్వకోష్టు†. [విశే. వైద్యుఁడు.
రోగహారి. సం. జాము†; బూడిద గుమ్మడి†.
రోగి. సం. విశే. తెవులుగొంటు.
రోచన. సం. గోరోజనము; ఉత్తమ స్త్రీ; ఎఱ్ఱగలువ.
రోచనము. సం. నిమ్మ†; కొండబూరుగు†. విశే. ప్రకాశించునది; రుచికరము.
రోచని. సం. తెల్ల తెగడ†; కంపిల్లము†.
రోచమానము. సం. గుఱ్ఱపు మెడమీఁదిసుడి.
రోచిష్ణువు. (ఁడు). సం. విశే. ప్రకాశించువాఁడు.
రోచిస్సు. సం. కాంతి; సూర్యకిరణము.
రోజు. హిం. దినము.
రోజుగుజస్తు. కడచిన దినము.
రోటు ఈఁచ.
రోటువోవు. అ. క్రి. ఈచఁబోవు.
రోడ్డు. ఇం. మార్గము. [కన్నీరు.
రోదనము. సం. ధ్వనియుక్తమైన ఏడ్పు;
రోదని. సం. తీఁటకసింద†.
రోదసి. } సం. భూమి; ఆకాశము;
రోదస్సు. } భూమ్యాకాశములు.
రోదించు. సం. అ. క్రి. రోదనము చేయు.
రోధము. సం. అడ్డు, ప్రతిబంధము.
రోధస్సు. సం. నద్యాదుల తీరము; ఒడ్డు.
రోధించు. సం. స. క్రి. అడ్డగించు.
రోపట్టు. వేశ్యాభృతి. [బాణము.
రోపణము. సం. మోపుట; పైరుచేయుట;
రోపము. సం. బాణము; రోపణము.
రోబంటరి. అడవిపంది. [చర్వణము.
రోమంథము. సం. నెమరు, పశువులచర్విత
రోమకర్ణకము. సం. చెవులపిల్లి?
రోమము. సం. (ముఖము శిరము తక్కఁ దక్కిన శరీరమునందుఁగల వెంట్రుక.
రోమరాజి. సం. నూఁగారు.
రోమవిక్రియ. సం. గగుపాటుచుట.
రోమశము. సం. పంది; గొఱ్ఱె; విశే. వెంట్రుకలు అధికముగఁ గలది.

రోమశి. సం. ములందోసె†.
రోమశుఁడు. సం. ఒక ఋషి; శరీరము నందు నిడు రోమములు గలవాఁడు.
రోమ హర్షణము. సం. గరు పొడుచుట; తాంద్రి†.
రోమహర్షణుఁడు. సం. సూతమహర్షి.
రోమాంచము. సం. గరుపొడుచుట.
రోమావళి. సం. నూఁగారు.
రోయి. వేశ్యకిచ్చెడు శుల్కము; (జూదపు) పందెము; కొదువ; ఎరవు, చేబదులు; అపవాదము.
రోయని. రోహిణి?
రోయావి ధనదానము.
రోయు. అ. క్రి. అసహ్యపడు. స. క్రి. వెదకు; నిందించు; విడుచు.
రోరవము. రౌరవమనెడి నరకము.
రోలంబము. సం. తుమ్మెద.
రోలు. ఱోలు.?
రోలుమ్రాను. ఉతక.?
రోవి. వృక్షవిశేషము.?
రోవెల. వేశ్యాశుల్కము ?
రోవెలఁది. వేశ్య, గణిక.
రోశంస. సం. ఇచ్ఛ.?
రోషము. సం. కోపము.
రోషించు. సం. అ. క్రి. కోపించు.
రోసము. రోషము.
రోసించు. అ. క్రి. రోషించు.
రోసుబడి. గ్రా. విణ. రోఁతగొట్టు.
రోహణము. సం. ఎక్కుట; ఒకకొండ.
రోహము. సం. ఎక్కుట; మొలక.
రోహి. సం. మఱ్ఱి†; ములుమోదుగు†; రావి†
రోహిణము. సం. మఱ్ఱి†; ములుమోదుగు†; చిప్పకపవు†.
రోహిణి. సం. ఒక నక్షత్రము; అంగిటి ముల్లు; ఆవు; తొమ్మిదేండ్లకన్య; బలరామునితల్లి; కటుకరోహిణి†; తెల్ల చంద్ర†.
రోహిణీవల్లభుఁడు. సం. చంద్రుఁడు.
రోహితకము. సం. ములుమోదుగు†; కెంపు.
రోహితము. సం. కుంకుమము; నెత్తురు; ఎఱుపు; ఎఱ్ఱచేఁప; కేసరిమృగము; ములుమోదుగు†; చక్కఁగానున్న యింద్రధనుస్సు. విణ. ఎఱ్ఱనిది.
రోహితాశ్వుఁడు. సం. అగ్నిహోత్రుఁడు; హరిశ్చంద్రుని కొడుకు.
రోహిత్తు. సూర్యుఁడు; లేడి; ఒక లత.
రోహిషము. సం. కొడగొట్టి; కామంచి†

## రౌ

రౌత. రాహుత్తుఁడు.?
రౌతు. గుఱ్ఱపు రవుతు.
రౌద్రము. సం. నవరసములలో నొకటి; ఒక సంవత్సరము; ఎండ; దినముయొక్క మొదటిభాగము. విణ. భయంకరము; తీక్ష్ణము.
రౌను. ఇం. ప్రయాణము.
రౌప్యము. సం. రూ. రూప్యము.
రౌమకము. సం. సంభరిదేశమున రుమ యనెడి గనియందుఁ బుట్టిన ఉప్పు.
రౌరవము. సం. ఒక నరకము. విణ. భయంకరము.
రౌలు. రూ. రగులు.
రౌలుకోలు. రగులుకొనుట.
రౌలుచు. గ్రా. రూ. రగులుచు.
రౌహిణేయము. సం. దినము యొక్క తొమ్మిదవ భాగము; గరుడపచ్చ; ఆవు దూడ. విణ. ఆవునకు సంబంధించినది.
రౌహిణేయుఁడు. సం. బలరాముఁడు; బుధుఁడు
రౌహిషము. సం. కామంచి†; కొండగొట్టి

## ఱ

ఱంకాట. జారత్వము చేయుట.
ఱంకాడు. అ. క్రి. జారత్వముచేయు.
ఱంకియ. రంకె.
ఱంకు. జారత్వము.
ఱంకుఁబోతు. జారిణి; జారుఁడు.
ఱంకుటాలు. జారిణి.
ఱంకుతెవులు. సుఖరోగము.
ఱంకుమగఁడు. జారుఁడు.
ఱంకుఱాలు. ఱంకుటాలు, జారిణి.
ఱంకులరాట్నము ఉత్సవ కాలమునందు వేడుకకు బాలకులు ఎక్కి త్రిప్పించెడు చుట్టు తొట్లతేర్పఱచిన వలయాకారపు యంత్రవిశేషము.
ఱంకులాఁడి. జారస్త్రీ.
ఱంకులాఁడు. జారుఁడు.
ఱంకుమేవు. అ. క్రి. జారత్వము చేయు.
ఱంకె. వృషభధ్వని; ధ్వని; కేక.
ఱంకెత. విణ. జారిణి.
ఱంకెలిడుమెకము ఆఁబోతు.
ఱంతిలు(ల్లు). అ. క్రి. కలకలధ్వనిచేయు.
ఱంతు. ఉత్సవము; కలకలధ్వని; కేళిక.
ఱంతె. కలకలధ్వని.
ఱంపకాఁడు. క్రకచి, ఱంపముతో పలకలు మొదలగువానిని కోయువాఁడు.
ఱంపము. క్రకచము, పలకలు మొదలగునవి కోసెడు సాధనము.
ఱంపియ. రంపియ.
ఱంపిలు(ల్లు). అ. క్రి. వ్యాపించు; వర్ధిల్లు; విజృంభించు; అతిశయించు; వాపోవు.?
ఱంపు. ఉచ్చు; కలకలము; రాపిడి.
ఱంపె. చర్మకారుఁడు తోలు కోసెడు సాధనవిశేషము; తాటాకులు మట్టగించి కోసెడు సాధనవిశేషము.
ఱక్కు. గీటు, గీఱు. స. క్రి. గీఱు.
ఱట్టడి, ఱట్టు } నింద, దూఱు, అపకీర్తి.
ఱప్ప. చిన్నఱాయి.
ఱయిక. రవిక.
ఱవ. వజ్రము;? చిట్టు.?
ఱవఱవ. కోపవికారము.
ఱవఱవలాడు. అ. క్రి. కోపవికారముచూపు
ఱవలి. ధ్వని; నిషాదాది సంగీతస్వరము.
ఱవిక. కంచెల, కంచుకము.
ఱవ్వ. నింద, అపవాదము. అపకీర్తి.
ఱవ్వమానిసి. నిందపడ్డ మానిసి.
ఱవ్వాడు. స. క్రి. నిందించు.

## ఱా

ఱా. ఱాయిశబ్దముయొక్క అంతరూపము; కలు, శిల.
ఱాఁగ. విణ. ఉద్ధతుఁడు; ధూర్తుఁడు; [ధూర్తురాలు.
ఱాఁగతుంగ. భద్రముస్తకము†.
ఱాకట్టు. రత్నస్థాపనము; ఱాతికట్టు.
ఱాచు. స. క్రి. రాపుడుచేయు; రుద్దు.
ఱాతిగుండె. కఠినహృదయము.
ఱాతినార. ఓషధీవిశేషము.
ఱాతినెల. కుట్టిమము.
ఱాతిపాఁచి. ఓషధీవిశేషము.
ఱాతిపువు. రాపువ్వు†.
ఱాతియులి. టంకము, కాసెయులి.
ఱాతివాలు. వజ్రాయుధము.
ఱాపు. అనుమర్దనము, రాయిడి.
ఱాపువ్వు. అశ్మపుష్పము†.
ఱాయి. శిల, రాయి.

## ఱి

ఱింగు. ఱెక్కల గాలిచప్పుడు.
ఱికము. అప. భావార్థక ప్రత్యయ విశేషము. (పెద్దఱికము, కన్నెఱికము, చుట్టఱికము అని.)
ఱిక్క. పశువులఁ దోలునప్పటిధ్వని. బ. [బొబ్బలు.?
ఱిక్కించు. స. క్రి. నిక్కించు.
ఱిచ్చని. శ్చేష్టత్వము.
ఱిచ్చవడు. అ. క్రి. చేష్టలుదక్కు.
ఱిచ్చవాటు. చేష్టలుదక్కుట.
ఱిప్ప. రూ. ఱివ్వ.
ఱిమ్ము. స. క్రి. చిమ్మనగ్రోవితో జలాదికముఁజిమ్ము. [న్యనుకరణము.
ఱివ్వు. పక్షి మొ॥ ఎగయుటయందగు ధ్వ

ఱివ్వన. ద్ర. అవ్య. క్రి. విశే. ఝడిత్యర్థకము, శీఘ్రముగా.

## ఱు

ఱు. అప. ఒకానొక బహువచన ప్రత్యయము. (విలుకాఱు, వేఁటకాఱు అనుచో.)
ఱుప్పు. స. క్రి. రూ. ఱువ్వు.
ఱువ్వు. ఱెక్కల గాలిచప్పుడు; కూలుట యందగు ధ్వన్యనుకరణము. స. క్రి. విసరివేయు.
ఱువ్వఁబులుఁగు. ఖంజరీటము.

## ఱూ

ఱూపు. స. క్రి. ఱువ్వు.

## ఱె

ఱెక్క. పక్షము.
ఱెక్కచేపు. కొన్ని మూరలు గల ఱేక.
ఱెక్కపాయలు. బ ధాన్యవిశేషము.
ఱెక్కలతలుపు. ద్వితయకవాటము.
ఱెప్ప. కనుఱెప్ప, పక్ష్మలము.
ఱెప్పపాటు. నిమిషము, ఱెప్పవాల్చుట.
ఱెప్పవేయనిమెప్పుమూఁకకేళాకూళి. దేవగంగ.
ఱెబ్బ. చెట్టుకొమ్మ.?
ఱెల్లు. శరము, కాశతృణము.
ఱెల్లుమూతి. కుమారస్వామి, శరజన్ముఁడు. శరవణభవుఁడు. రూ. ఱెల్లుచూలు.
ఱెల్లుదీవి. కుశద్వీపము.

## ఱే

ఱేఁచు. వనశునకము, పులిని చంపెడి చిన్న కుక్క వంటి మృగవిశేషము.
ఱేఁడు రాజు, దొర; మగఁడు.
ఱేకు. పుష్పదళము; తగడు; ఈఁక; అంచుకమ్ములు లేనివస్త్రము; దుప్పటిలోసగము
ఱేకుమడఁచు. స. క్రి. అణఁగఁద్రొక్కు.
ఱేపు. ప్రాతఃకాలము; వెనుకటి రోజు; పరదినము.
ఱేయు. అ. క్రి. అతిశయించు; విజృంభించు.
ఱేల. ఆరగ్వధము†.

## ఱై

ఱైక. అవిక.

## ఱొ

ఱొచ్చు. తిరస్కారము; బురద; అపవాదము; సందడి.
ఱొడ్డ. విశే. ఎడమ. (ఱొడ్డచేయి అని.)
ఱొడ్డు. విశే. అధికము.
ఱొప్పు. స. క్రి. తోలు;? కొట్టు.?
ఱొమ్ము. వక్షము.

## ఱో

ఱోలు. ఉలూఖలము, దంచుట రుబ్బుట మొదలగువానికి ఉపయోగించెడు సాధనము. అ. క్రి. అఱచు, రోదనము చేయు.
ఱోలుమాను. ఉత్తరాసి తిరిగెడు ఉతక.

---

## ల

ల. అప. ద్వితీయా బహువచనమునందు వచ్చెడు ప్రత్యయము (వనముల, హారు అను అని.); తృతీయాది బహువచనము పరమవుచుండఁగా వచ్చెడు ఆగమము. (రాముల చేత, వనితల కొఱకు, వనములకు అను చో.)
లంక. దీవి; తలవాకిటి ప్రక్కగది; కలాయము† సం. రావణుని పట్టణము; ఒకానొక రాక్షసి; గుడిసె వాటుది.
లంకణము. లంఘనము; జ్వరాదులచేత నుండెడి యుపవాసము.
లంకపాలము. ఏరు విడిచిన పొలము.

లంకాధిపతి. సం. రావణాసురుఁడు.
లంకించు అ.క్రి. తగులు. స క్రి. పెన వేయు; అవమానించు.
లంకింపు. చౌర్యము.
లంకిణి. ఒకవిధమైన బట్ట; ఒక రాక్షసి.
లంకియ. సంగము; తగులుపాటు; పెన.
లంకె. రూ. లంకియ; లంకెపలుపు.
లంకెపలుపు. (రెండు పశువుల మెడకు) లంకె వేసెడు పలుపు.
లంకెపాటు. తగులము.
లంకెపీఁట. (శాత్రి యొద్ద మెడకు) పెన వేసెడి మ్రాని పలక.
లంకె మానిసి. దాసుఁడు.
లంకెవెట్టు. స. క్రి. తగులువఱచు; పెన వేయు. [పి(యి)క.
లంకోపి(యి)క. సం.పిక్క† రూ. లంకా
లంగ. లంఘనము, దాఁటు.
లంగగొను. స క్రి. లంఘించు; దాఁటు.
లంగము. సం. సంగము
లంగరు. శీను, ఓడలు నిలుచుటకై అడుగున దిగవేసెడు నాఁగేలువంటి యినుప సాధనము. [కేర్పఱచిన అన్న సత్రము.
లంగరుఖానా. హిం. పనిచేయలేని బీదల
లంగా. హిం. అంగదట్టము.
లంగుఁడు. సం. విటుఁడు.
లంగోటి. గ్రా.హిం. గోఁచి.
లంఘ సం. లంగ.
లంఘనము. సం. దాఁటు; దూఁకుడు; గుఱ్ఱపు దూఁకుడు; లంకణము.
లంఘి. సం విశే. అతిక్రమించునది.
లంఘించు. సం.అ.క్రి. దూఁకు. స. క్రి. దాఁటు.
లంచము. సం. లంచేము. ?
లంచెగొండి. విశే. లంచము తీయువాఁడు.
లంచేము. కార్యమును చక్కఁబెట్టుకొనుటకై యొకనికి రహస్యముగానిచ్చు సొమ్ము, ఉత్కోచము.
లంజ సం. వేశ్య, జారస్త్రీ. ?
లంజిక. సం. వేశ్య.
లంజియ. } లంజిక, వేశ్య.
లంజె. } లంజిక, వేశ్య.
లంజెకాఁడు. విటుఁడు.
లంజెత. వేశ్య.
లంజెబేడిస. మత్స్యవిశేషము.
లంజెఱికము. లంజెతనము.
లంజెనవరము. గొంతెమగోరు†.
లంటఁడు గ్రా. గుండువలెనుండువాఁడు
లండి } విశే. కుత్సితుఁడు; కుత్సితురాలు.
లండీ } విశే. కుత్సితుఁడు; కుత్సితురాలు.
లండు—(బోతు } విశే. కుత్సితుఁడు; కుత్సితురాలు.
లంద. విశే తుందిలుఁడు.
లంపట—ము. శ్రమము; ఆపద.
లంపటపడు. అ. క్రి. శ్రమపడు.
లంపటుఁడు. సం. విశే. అత్యాసక్తి గలవాఁడు, విషయాసక్తుఁడు.
లంపతు. దాసీపుత్రుఁడు;రాజసేవకుఁడు.
లంపాకము. సం. ఒక దేశము. విశే. ఆసక్తిగలది.
లంపు. దొంగమేఁత; వర్గము.?
లంపులమారి. విశే. దొంగమేఁతమేయునది.
లంబకర్ణము. సం. చెవులపిల్లి; మేకపోతు; ఏనుఁగు. [వ్రేలాడుహారము మొ
లంబనము. సం. వ్రేలుడు; బొడ్డువఱకు
లంబమానము. సం. విశే. వ్రేలాడునది.
లంబము. సం. క్షేత్రాదులయందు వ్రేలాడెడి రేఖామాత్రము. విశే. దీర్ఘము; వ్రేలాడునది.
లంబాడి. హిం. ఒకజాతిజనము.
లంబి. కుటుంబము.
లంబిక. సం. కొండనాలుక.
లంబికాయోగము. సం. కొండనాలుకతో నాలుకను చేర్చుట, ఒక యోగము.
లంబితము. సం. విశే. వ్రేలాడెడి హారము మొ.
లంబీ రూ లంబి.
లంబు. స్థౌల్యము; గొప్పతనము.
లంబుషము. సం. ఏడుపేటల ముత్యాల హారము.? [హారవిశేషము.
లంబెన. గొంతుకయందు వ్రేలుచున్న
లంబోదరుఁడు సం. వినాయకుఁడు.
లంభనము. సం. తిట్టుట; దూషించుట; లాభము; ధ్వని;
లంభించు. సం. స.క్రి. తిట్టు; దూషించు.
లకుచము. సం. కమ్మరేఁగు, గజనిమ్మ†.

లకుముకి. టిట్టిభము, ఆకసమునందుండి ఱెక్కలార్చుచు పొంచు వేసి నీటిలోపలనుండు మత్స్యమును పట్టుకొని పోయి తినెడు పక్షివిశేషము.
లకోటా. హిం. కవరు, ఉత్తరములోన నుంచు కాగితపు సంచి; ఉత్తరమును అతికించుట.
లకోరి. ఆయుధవిశేషము, క్రూరబాణము.
లకోరీ. ఒక పావురము; లకోరి.
లక్క. లాక్ష,ఒకానొక చెట్టుబంక;లక్ష.?
లక్కతెవులు. ఒకదినుసు చీడ.
లక్కనము. లక్షణము, ఆనవాలు; వ్యాకరణాదిశాస్త్రము.
లక్కనుఁడు. లక్ష్మణుఁడు.
లక్కపెట్టె.చిత్రపేటిక.రూ.లక్కపెట్టియ
లక్కబియ్యము. లక్కపొడి, లాక్షాశకలములు.
లక్కాకు. ఆఁడువారు చుట్టికమ్మ చెవినుంచుకొనెడు లక్కపూసిన తాటాకు.
లక్కిమి. లక్ష్మి.
లక్కుమనుఁడు. లక్ష్మణుఁడు, లక్ష్మణస్వామి. రూ. లక్కుముఁడు.
లక్ష. సం. నూఱువేలు.
లక్షకము. సం. లక్షణచే అర్థమును(లక్ష్యార్థమును) బోధించు శబ్దము.
లక్షణ. సం. ఒకశబ్దవృత్తి; ఆఁడుబెగ్గురు.
లక్షణము. సం. చిహ్నము; గుఱుతు; చూపు; వ్యాకరణాది సూత్రము; పేరు; బెగ్గురు.
లక్షము. సం. గుఱి; నెపము.
లక్షించు. సం. స.క్రి. గుఱిచేయు; చాచు.
లక్ష్మణ. సం. ఆఁడుబెగ్గురు.
లక్ష్మణము. సం. గుఱుతు; పేరు.
లక్ష్మణుఁడు. సం.శ్రీరాముని తమ్ముఁడు. విశ. శ్రీమంతుఁడు. [ముఖ్యము.
లక్ష్మము. సం. చిహ్నము, గుఱుతు;
లక్ష్మి. సం. విష్ణుపత్ని; సంపద; (వస్త్ర భూషణాదులవలనఁ గలిగిన) శోభ; మెట్టతామర†; బుద్ధి†; వృద్ధి†; గొల్లజిడ్డు†; ప్రేంకణము†;పసుపు†;జమ్మి†.
లక్ష్మీపతి. సం. విష్ణువు; ప్రభువు.

లక్ష్మీవంతుఁడు. సం. విశ. భాగ్యవంతుఁడు; ఒప్పిదముగలవాఁడు.
లక్ష్మీశుఁడు. సం. విష్ణువు.
లక్ష్యము. సం. గుఱి; లక్షణచే తెలియఁదగిన యర్థము; చూడఁదగినది.
లగడ. చిమిడినయన్నము.
లగనము. లగ్నము.
లగాము. హిం. కళ్లెము, ఖలీనము.
లగాయతు. హిం. మొదలు. [లవుడి.
లగుడము. సం. దండము, కఱ్ఱసాఁగు,
లగుడు. శ్యేనవిశేషము.
లగువు. లాఘవము, చులుకన; గంతు. విశ. లఘువు, చులుక.
లగ్గ. ముట్టడించి కోటనుప్రాఁకుట.
లగ్గదింపు. కోటమీఁదనుండి శత్రువులపై దొర్లించెడి ఱాతిబండలు.
లగ్గపట్టు. స.క్రి. ముట్టడించికోటనెక్కు.
లగ్గమగు. అ.క్రి. స్వాధీనమగు.
లగ్గము. లగ్నము.
లగ్గు. మేలు, శుభము; ఉత్తరక్రియ.
లగ్నకుఁడు. సం. పూఁటకాఁపు.
లగ్నము. సం. మేషాది రాశ్యుదయము; మదపుటేనుఁగు. విశ. తగులుకొన్నది; సిగ్గుఁబొందినది.
లఘిమ—ము. సం. చులుకఁదనము, చులుకన, తేలిక; ఒకవిభూతి, ఒకసిద్ధి.
లఘిష్ఠము. సం. విశ. మిక్కిలిచులుకనైనది;మిక్కిలితేలికయైనది. [వాఁడు.
లఘిష్ఠుఁడు. సం. విశ. మిక్కిలిచులుకని
లఘుకము. సం. తోఁటపొఁక†.?
లఘుద్రాక్ష. సం. కిసుమిసు†.
లఘులయము. సం. తెల్లవట్టివేరు†.
లఘువు. సం. వట్టివేరు†; పిక్క†; నల్లఅగలు†; గంతు.? క్రి. విశ. శీఘ్రము, వేగము. విశ. వడిగలది;చులుకనిది;చేవలేనిది; ఒప్పిదమైనది; హ్రస్వాక్షరము.
లఘ్వి. సం. ఒకబండి. విశ. చులుకనైనది. కుఱుచయైనది.
లచ్చి. లోకమాత, లక్ష్మీదేవి; సంపత్తి, సంపద. [త్రుఁడు.
లచ్చికొమరుఁడు. మన్మథుఁడు, శ్రీపు
లచ్చికోడలు. సరస్వతి.

లచ్చితండ్రి. ప్రతి. క్షీరసముద్రరాజు.
లచ్చిదొరబూరగొమ్మ. శంఖము.
లచ్చినెచ్చెలి. పార్వతి.
లచ్చిమగఁడు విష్ణువు, లక్ష్మీపతి.
లచ్చియన్న. చందమామ, చంద్రుఁడు.
లచ్చిఱేనెడమకన్ను చంద్రుఁడు.
లచ్చివారము. శుక్రవారము, గురువారము.
లచ్చిసవతి. భూదేవి.
లచ్చనము. లక్షణము, గుఱుతు; వ్యాకరణశాస్త్రము.
లచ్చనుఁడు. లక్ష్మణుఁడు.
లజ్జ. సం. సిగ్గు.
లజ్జాళువు. సం. విణ. సిగ్గరి, సిగ్గుపడువాఁడు.
లజ్జించు. సం. అ. క్రి. సిగ్గుపడు.
లజ్జితము. సం. విణ. సిగ్గుపడినది.
లటపటంబులు. బ. జగడములు.
లటపటలు. బ. గప్పాలుకొట్టుట.
లటక్కు. మ్రింగుట మొదలగువానియందగుధ్వన్యనుకరణము.
లటహము. సం. వాద్యవిశేషము.
లటుక్కు. రూ. లటక్కు.
లట్టము. సం. కప్పూరము.?
లట్టు. పడియు; గాఁడి.
లట్టువ. చిటిక.
లట్వ. సం. ఒకవాద్యము; ఊరఁబిచ్చుక; భ్రమరకము, బొంగరము ?
లట్వము. సం. గుఱ్ఱము; ఒకజాతి; ఒక రాగము; లావుఁపిట్ట; లడ్డు ?
లడాయి. హిం. యుద్ధము, జగడము.
లడి. నిడుపుగా చుట్టిన సరిగ మొదలగు వానిచుట్ట.
లడ్డిగ—ము. ప్రయాణము పోవునప్పుడు నెయ్యినూనె మొ॥ పోసికొనిపోయెడు చిన్న మూతిగల పాత్రవిశేషము.
లడ్డు లడ్డుకము, మిఠాయిఉండ, భక్ష్య విశేషము.
లడ్డుకము. సం. లడ్డు.
లడ్డువము. లడ్డు.
లత. సం. తీఁగె; ఎఱ్ఱ దుంపదీఁగ; గరిక†; పూలగురివెంద†; ముస్త్యాలపొర ఫ్రోట?; కొమ్మ; పిక్క†; ప్రేకణము†; చీమ?; సాలెపురుగు?; కస్తూరిలత.

లతకూన. మి. తీఁగతీఁగవంటి స్త్రీ.
లతాంతము. సం. పుష్పము.
లతాంతాయుధుఁడు, లతాంతాస్త్రుఁడు. సం. పుష్పబాణుఁడు, మన్మథుఁడు.
లతాడోల. సం. తీఁగెయుయ్యెల.
లతాప్రతానని. సం. ఒకటితో నొకటి పెనఁగొన్న తీఁగలు మొ.
లతార్కము. సం. పచ్చనీరుల్లి†.
లతిక. సం. తీఁగె; హార విశేషము. ?
లత్త. దెబ్బ; ఆపద. సం. ఒక రోగము.
లత్తిక. ఒక దినుసు గచ్చకాయ. సం. ఉడుము.
లత్తిచేప. మత్స్యవిశేషము.
లత్తుక అలక్తకము, లాక్షారసము.
లత్తుకబొత్తులు. బ. ధాన్యవిశేషము.
లద్ది. ఏనుఁగుగుఱ్ఱము మొదలగువానిమలము
లద్దిపిప్పి. ఒక దినుసు చీడపురుగు.
లద్దిపురుగు. మగ్గిన మ్రాను మొదలగువాని యందు కలిగెడు తెల్లని క్రిమి విశేషము.
లద్దియ. నేయువాఁడు వస్త్రపు చివరను విడిచెడు కచ్చు.
లద్దె. లద్దియ; అశ్వాదుల పేఁడ.
లపక. విత్తము.
లపనము. సం. పలుకు; ముఖము; కంఠ ధ్వని.
లపితము. సం. మాట. విణ. మాటలాడఁబడినది.
లపేటా. చుంగు విడిచికట్టిన నెత్తిరుమాలు
లప్ప విణ. రాశి; పాణి విశేషము.
లప్పము మ్రాని పెట్టె మొదలగువాని సందుగొందులకు మొత్తెడు ఒక దినుసు సున్నపు ముద్ద.
లబ్బీలు. హిం. తురకలలో నొక జాతివారు.
లబ్ధము. సం. లాభము; భాగహారము చేయఁగా నేర్పడుసంఖ్య. విణ. పొందఁబడినది.
లబ్ధవర్ణుఁడు. సం. విద్వాంసుఁడు, పండితుఁడు.
లబ్ధి. సం. ప్రాప్తి; లాభము; కలిమి.
లభించు. సం. అ. క్రి. ప్రాప్తించు.
లభ్యము. సం. విణ. లభింపఁదగినది, పొందఁదగ్గది; యుక్తము; లాభము.

లమ. లతికా విశేషము. [మాట.
లమిడి. హిం. బాంది స్త్రీ, ఒక తిట్టు
లయ. మోసము; సం. తౌర్యత్రిక సామ్య
ము; తాళముయొక్క కాలము.?
లయకాఁడు. గాయకుఁడు.
లయకారి. పంచకుఁడు.
లయము. సం. నీటి పట్టిపేరు; నాశము;
ఏకీభావము. [మగు.
లయించు. సం. అ.క్రి. నశించు; సక్త
లయ్య. వేశ్య.
లరయిడి. మగగుతి ?
లలంతిక. సం. కంఠాభరణము; బొడ్డు
వఱకు వ్రేలాడు హారము మొ.
లలన. సం. విలాసవతి యగు స్త్రీ; స్త్రీ;
నాలుక.
లలాట పట్టిక. సం. విశాలమైన నొసలు.
లలాటము. సం. నుదురు, నొసలు.[మొ.
లలాటిక. సం. పాపటబొట్టు, బాసికము
లలామకము. సం. నొసట వ్రేలాడెడి
మాల; శిరమున కట్టిన దండ; బాసికము.
లలామము. సం. గుఱుతు; టెక్కెము;
తొడవు; నొసట నుంచుకొనెడు బొట్టు;
గుఱ్ఱము నొసటి చుక్క; తోఁక;
కొమ్ము; ప్రభావము; గుఱ్ఱము; (ఉత్తర
పదమైనచో) శ్రేష్ఠము, ప్రధానము.
లలాముఁడు. సం. విణ. ప్రధానమైన
వాఁడు, శ్రేష్ఠుఁడు.
లలి. క్రమము; ప్రేమ; వికాసము;ఉత్సా
హము; విలాసము; అత్యంతము?
లలిత. సం. దుర్గ.
లలితము. సం. సుకుమారత్వముచేత నగు
అంగ విన్యాసరూపమైన స్త్రీలయొక్క
శృంగార చేష్టా విశేషము. విణ. ఈప్సి
తము; మధురము; సుందరము; మృదు
వైనది.
లవంగపుఁజెట్టు. వరాంగకము †.
లవంగము. సం. దేవకుసుమము, లవం
గపు మొగ్గ, కరాపువు.
లవణము. సం. ఉప్పు; (త్రిలవణము—
సైంధవము, బిడము,రుచకము.) ఉప్పన;
ఉప్పునీటి సముద్రము; విణ. ఉప్పునిది.
లవణాకరము. సం. ఉప్పు సముద్రము;
ఉప్పళము.
లవణి. బిగువు.
లవణుఁడు. సం. ఒక అసురుఁడు.
లవణోదధి. } ఉప్పునీటి సముద్రము.
లవణోదము. }
లవనము. సం. (పైరు మొదలగువాని)
కోఁత; కోయుట. [ద్రవ్యము.
లవనను. ఇం. జీవనార్థమయి యిచ్చు
లవము. సం. కొంచెము; సూక్ష్మకాలము;
చేటు; కోఁత, కోయుట.
లవలవ. విణ. భేదిల్లినది. [వృక్షము.
లవలి. సం. కోమల వల్కల, ఒక ఫల
లవాజుమా. గ్రామసేవకుల జీతములకై
తీసికొనఁబడు కొద్ది పన్ను.
లవించు. సం. స. క్రి. కోయు.
లవిటి. అక్క మొదలు;తోఁక; చెవిటి;?
అశ్వపుచ్ఛము.?
లవిత్రము. సం. కొడవలి.
లవుఁడు. సం. శ్రీరాముని కొడుకు.
లవుటి. పక్షిపుచ్ఛము.?
లవుడి. పరిఘము. రూ. లవుణి.
లశునపటత్వము. సం. ఒక మణిదోషము.
లశునము. సం. వెల్లుల్లి†; కెంపునందలి
దోషవిశేషము.?
లష్కరు. హిం. లస్కరు.
లసుకు. స. క్రి. నాశముచేయు.
లస్కరు. దండు, సైన్యము.
లస్తకము. సం. పిడికట్టు; వింటినడిమిపిడి
లహరి. పెద్దఅల; ప్రవాహము.?

## లా

లాంగలము. సం. నాఁగలి; తాడు†; ఒక
పువ్వు; గృహదారు విశేషము;మగగుతి.
లాంగలి. సం. బలరాముఁడు; తరిగొబ్బ†;
(రూ. లాంగలికి.) నీరు పిప్పలి†;
టెంకాయ†; పాము.
లాంగూలము. సం. తోఁక; మగగుతి;
అభినయహస్త విశేషము.
లాంఛనము. సం. గుఱుతు; పేరు.
లాంతరు. ఇం. దీపముపెట్టుటకై అద్దము
లతో చేసినది.

లాంపట్యము. సం. లంపటభావము.
లాఁక. పక్షియాఁక.
లాఁకకట్టు. విఱిచికట్టిన పెడచేతుల కట్టు.
లాఁగ. బిలము.
లాఁగడాఁగుడు. సర్పము, బిలేశయము.
లాఁగరి. చెవి.
లాఁగించు. అ. క్రి. లంఘించు.
లాఁగు. లంఘనము; చల్లాడము; మల్లబంధవిశేషము. బ. మల్లవిద్యాభేదము; వేశ్యకన్యలం జేయు లగువులం.? [పొంచు.
లాఁచు. అ. క్రి. కవియు; కాంక్షించు;
లాఁత. లాఁయుట.
లాఁతసేయు. అ. క్రి. లాయు.
లాఁతి. స. అన్యము, పరాయి.
లాఁతివాఁడు. అన్యుఁడు.
లాఁతు. విణ. అధికము.
లాఁపరా. జలద్వార ముఖమున తృణాదికము చొరకుండ నమర్చియుండెడు గండ్లతాయి.
లాఁపు. లాఁచుట.
లాకకట్టు. లీకలతోడ చుట్టియుంచిన పని ముగియని పడుగు. రూ. లాకకట్టు.
లాకలు. బ. పాలెవాఁడు పడుగునందక్కడక్కడ చొప్పించెడు వెదురు బ్రద్దలు.
లాకు. ఇం. నీటికాలువల నీటికి తాళము వలెనుండు యంత్రము.
లాక్ష. సం. లక్క; లత్త.?
లాక్షణికుఁడు. సం. విణ. లక్షణజ్ఞుఁడు.
లాక్షాప్రసాదనము. సం. ఎఱ్ఱలొద్దుగు†.
లాగము, లాఘవము.
లాగి. విణ. లఘువు, సులభము.
లాగించు. స. క్రి. కొనిపోవు.
లాగు. సమ్మతి; విధము, ఆకర్షణము. స.క్రి. ఆకర్షించు ఈడ్చు.
లాగుకొను. స.క్రి. అపహరించుకొను.
లాగులాడు. అ. క్రి. పెనఁగులాడు.
లాఘవము. సం. లఘుత్వము; ఆరోగ్యము.
లాచారు హిం. విణ. నిరాధారముగానుండు
లాచి. గుఱ్ఱముమీఁదను గాడిదమీఁదను వేసెడు గోనె; చిన్నబండిమీఁద తెచ్చు భారము. రూ. లాచీ.
లాచు. అ. క్రి. ఒరయు, రాచు.
లాజము. సం. వట్టివేరు; నానబియ్యము.
లాజలు. సం. బ. పేలాలు; అక్షతలు.
లాటదేశము. సం. 56 దేశములలో నొకటి.
లాటరీ. ఇం. చీట్లు వేసి వస్తువుల నమ్ముట.
లాటి. పక్షివిశేషము.
లాటీ. దుడ్డుకఱ్ఱ, లవుడి.
లాటు. ఇం. ఏలములో నొకపద్దు.
లాడము. గుఱ్ఱపుగొరిజలకు కొట్టెడి యినుప తగటిబిళ్ల.
లాడి. పెద్దపుండు; పుండు పక్వమైనపుడు దానినుండి కారెడుచీము; లవుడి; బలి.?
లాడియ. లాడె.
లాడువాఁడు అందగాఁడు.?
లాడె. బరువుమోసెడి యెద్దు వీఁపున బరువెక్కించుట. రూ. లాడియ.
లాతము. యోగదండము; యతులు ధరించు దండము. రూ. లాతాము.
లాదు. హిం. కట్టడములలో వంపులు కట్టునపుడు వాని కాధారముగా కట్టు కట్టడము.
లాబము. వా. లాభము.
లాభము. సం. క్రయవిక్రయముల వలన వచ్చిన విశేష ధనము; వడ్డి; ప్రాప్తి, దొరకుట. [వేరు.
లామజ్జకము. సం. నీటివట్టివేరు, తెల్లవట్టి
లాయఖు. హిం. విణ. తగిన.
లాయము. అశ్వశాల.
లాయరు. ఇం. న్యాయవాది.
లాయిలాసా. హిం. శ్రమ. [డాయు.?
లాయు. అ.క్రి. ఉద్రేకించు, విజృంభించు;
లాల. సం. చొంగ, చొల్లు.
లాలనము. సం. లాలించుట, బుజ్జగము.
లాలము. ఉల్లారు క్రింది జాలరు.
లాలస. సం. అధికేచ్ఛ; ఔత్సుక్యము; యాచన. విణ. ఆసక్తురాలు.
లాలసరి. గుఱ్ఱపు పల్లముమీఁది యుల్లారు క్రింద వ్రేలెడు జల్లులదండ.
లాలసుఁడు. సం. విణ. విషయముల యందు ఆసక్తుఁడు.
లాలాటికము. సం. విణ. లలాటసంబంధమైన చేరుచుక్క బొట్టుము.

లాలాటికుఁడు. సం. విణ. ప్రభువుయొక్క మొగముఁజూచుచుండువాఁడు, పనులఁ జేయు నేర్పు లేని సేవకుఁడు.
లాలి. ఉయ్యెల; డోలిక నూచునప్పుడు పాడెడి పాట. [బుజ్జగించు.
లాలించు. సం. స. క్రి. లాలనముచేయు,
లాలిత్యము. సం. లలితభావము.
లాలు. విణ. ఎఱుపు.
లాలుకుంచెము. ఎఱ్ఱనికుచ్చులు; గంగిరెద్ల వాండ్రు పట్టుకొను నవరపు కుచ్చులు.
లాలూచి. హిం. అత్యాశ; నైచ్యము.
లావకము. సం. లావుకపిట్ట.
లావణము. కొలంవునకు క్రొత్తగావచ్చిన కొలంవుడుకానిని పట్టికయందు వ్రాసి కొనుట. [ముందుగానిచ్చెడుధనము.
లావణి. పనులుచేసెడు బీటి నేల కై
లావణ్యము. సం. నీడ ప్రతిబింబించెడి శరీరకాంతివిశేషము; ఉప్పన;రూపము, సౌందర్యము.
లావము. సం. లావుకపిట్ట; కోయుట.
లావరి. విణ. స్థూలాంగుఁడు; స్థూలాంగి.
లావఱు. అ. క్రి. బలహీనమగు.
లావాదేవి. హిం. ఇచ్చిపుచ్చుకొను సంబంధము.
లావిల. పక్షివిశేషము.
లావు. ఔక్క మొదలు; బలము; సామర్థ్యము; ఆధిక్యము; అతిశయము; స్థౌల్యము; విణ. అశక్యము.
లావుక. లావకము, ఒక పక్షి.
లాసకము. సం. నెమిలి.
లాసకుఁడు. సం. నర్తకుఁడు, ఆటకాఁడు
లాసము. సం. ఆట; నృత్యము; స్త్రీ నాట్యము.
లాసిక. సం. ఆటకత్తె, నర్తకి.
లాస్ఫోటని. సం. పిడి సాన.
లాస్యము. సం. స్త్రీల నృత్యము; తౌర్యత్రికము.
లాహిరి. మైకము. రూ. లాహిరీ.
లాహిరిమోదము. చిలుము, గంజాయి గొట్టము.
లాళము. రూ. లాడము.

## లి

లింగఁడు. శివుఁడు; జంగముయొక్క.
లింగకట్టుమాత్ర. మి. గ్రా. లింగాకారముగా చేసిన రసవస్తువుల గుళిక.
లింగకాయ. మి. గ్రా. లింగధారులు లింగము నుంచి కట్టుకొనెడు వెండి బంగారములతో చేసిన సజ్జకాయ.
లింగదొండ. మి.గ్రా. లింగాకారపు ఒక దినుసు దొండ †
లింగపొట్ల. మి.గ్రా. ఒక దినుసు పొట్ల†.
లింగబలిజెలు. మి. గ్రా. లింగధారు లయిన బలిజెవారు.
లింగము.సం.శివమూర్తివిశేషము;గుఱుతు; మగగుఱి; అనుమానము; ప్రధానము, ప్రకృతి; మహదాదిస్థూలాంతము; వ్యాప్యము; సూక్ష్మశరీరము; వేషము.
లింగరాజు. మి. కూఁకటిముఁగ.
లింగవృత్తి. సం. తాఁటదమ్ముఁడు, వేషధారి.
లింగశరీరము. సం. సూక్ష్మదేహము.
లింగి. వ్యాపకము; బ్రహ్మచారి యతి మొ॥; ఆత్మ; వేషధారి.
లింగిని. సం. లింగదొండ†.
లింపాకుఁడు. సం. మూర్ఖుఁడు.?
లికుచము. సం. రూ. లకుచము.
లిక్క. కులవిత్రము. గడ్డిమొ॥ కోసెడు చిన్న కొడవలి.
లిక్ష. సం. తలవెండ్రుకలయందు పుట్టెడి ఈరు, ఈపి; ఎనిమిది త్రసరేణువుల పరిమాణము.
లిఖించు. సం. స. క్రి. వ్రాయు.
లిఖితము. సం. లిపి; వ్రాఁత, వ్రాలు. విణ. వ్రాయఁబడినది.
లిఖితవ్యము. సం. విణ. వ్రాయఁదగినది.
లిఖితుఁడు. సం. వ్రాఁతసాకిరి, పత్రము వ్రాసికొను వానిచే రప్పింపఁబడిన పత్రమందు సంతకముచేసిన సాక్షి; ఒకముని.
లిఖియించు. సం. స. క్రి. వ్రాయు.
లిగాడు. గ్రా. బీద.

లిగువు. సం. మృగము; మూర్ఖుఁడు; మనస్సు; భూతలము.
లిద్ది. దంచి మిక్కిలి లోఁతుపడిన మ్రాని బోటికిఁగొట్టెడు గూటము; పడిసెము చేత ఊపిరి రాక ముక్కుడఁచుకొనుట.
లిపి. సం. వ్రాయి, వ్రాఁత, అక్షర విన్యాసము; లిఖితాక్షరము.
లిపిక(కా)రుఁడు } సం. లేకరి, వ్రాయస
లిపీక(కా)రుఁడు } కాఁడు.
లిప్తకము. సం. విషముపూసిన బాణము.
లిప్తము. సం. విణ. పూయఁబడినది; భుజింపఁబడినది; లిప్తకము.
లిప్స. సం. కోరిక, ఇచ్ఛ.
లిబి. లిపి.
లిబ్బి. ధనము; రాశి; నిధి.
లిబ్బిదొర. ధనాధిపుఁడు, కుబేరుఁడు.
లిబ్బిపడఁతి. లక్ష్మీదేవి.
లిబ్బిరాయఁడు } ధనాధిపతి, కుబేరుఁడు.
లిబ్బులదొర } రూ. లిబ్బులమేటి.
లిభి. సం. లిపి.?
లిమ్మ. మాంసాదులమీఁద ముసురుకొను ఈఁగలను తోలెడు రెమ్మ
లియ్యము. విణ. లయించినది.
లివ. లాఘవము. [ధ్వన్యనుకరణము.
లివలివ. దంతములు కదలుటయందగు
లీక. సం. లిక్ష.

## లీ

లీఢము. సం. విణ. ఆస్వాదింపఁబడినది.
లీనము. సం. విణ. లయించినది; కరఁగినది; మఱుఁగుపడినది.
లీల. విధము. సం. క్రీడ; విలాసము; శృంగారచేష్ట; ప్రేమాధిక్యమున వేషభాషాదులచేత ప్రియుని అనుకరించునట్టి స్త్రీశృంగారచేష్టావిశేషము; క్రియ.
లీస్టు. ఇం. పట్టీ, జాబితా.

## లు

లు. అప. ప్రథమా బహువచన ప్రత్యయము. (రాములు, పూవులు, ధనములు అని.)
లుంగ. వస్త్రభారము.
లుంగము. సం. మాదీఫలము†.
లుంగి. కుల్లాయి కుప్పసములు చేర్చికుట్టిన పావడ. [రించువాఁడు.
లుంటాకుఁడు. సం. దొంగ. విణ. అపహ
లుంఠనము. సం. గుఱ్ఱముపొర్లాడుట; భూమిమీఁది పొర్లిక; దోపిడి.
లుకలుక. పరుగెత్తుటయందును పురుగులు తొలుచుటయందును అగుధ్వన్యనుకరణము.
లుకలుకలాడు. అ. క్రి. తడఁబడు.
లుక్క. సం. లోపము; కోఁత.
లుగచెడు అ. క్రి. బాగుతప్పు.
లుగ్సాను. హిం. నష్టము.
లుచ్ఛా. హిం. నీచుఁడు.
లుఠనము. సం. భూమిమీఁది పొర్లిక; భూమిమీఁది గుఱ్ఱపుపొర్లిక.
లుఠితము. సం. విణ. భూమిమీఁద పొర్లాడినది. (గుఱ్ఱము.) [గంట.
లుడుగు. ఎద్దుమెడనుకట్టు నొకవిధమైన
లుప్తము. సం. దొంగసొమ్ము, దొంగిలించిన సొత్తు. విణ. లోపించినది; కోయఁబడినది.
లుబ్ధకుఁడు } సం. బోయవాఁడు. విణ.
లుబ్ధుఁడు } లోభి, పిసినివాఁడు; ఆస గలవాఁడు.
లులాయము. సం. దున్నపోతు.
లులాయి. సం. గేదె.
లులి. తక్కువ. [లింపఁబడినది.
లులితము. సం. విణ. చలించినది; కద
లులివడు. అ. క్రి. హీనమగు.
లుల్లిగాఁడు. విణ. కీడ్పడినవాఁడు; అధముఁడు.

## లూ

లూటి } కొల్ల; ఉపద్రవము; దౌడయం
లూటీ } దలి వ్రణము; వ్రణరంధ్రము.
లూడుపులు. బ. అప్ర. పాదరక్షలు.
లూత. సం. సాలెపురుగు; ఆఁడుచీమ; మర్మవ్రణము.
లూనము. సం. విణ. కొయ్యఁబడ్డది.

లూమము. సం. తోఁక.
లూలామాలము. వంచన, మోసము.
లూలి. గ్రా. పట్టని.

## లె

లెంక. భటుఁడు; సేవకుఁడు.
లెంట. అప్ర. పటికము.
లెంప. చెంప, ప్రక్క.
లెంపకాయ. చెంపకాయ.
లెంబి. రూ. లంబి.
లెక్క. పరవా, లక్ష్యము; సంఖ్య.
లెక్కగొను. స. క్రి. లెక్కచేయు, లక్ష్యముచేయు. [ఎన్నిక చేయు.
లెక్కపెట్టు. స. క్రి. లక్ష్యముచేయు;
లెక్కవాఁడు కరణము.
లెక్కసేయు } లెక్కించు } స. క్రి. లెక్కపెట్టు.
లెక్చరరు. ఇం. ఉపన్యాసకుఁడు.
లెక్చరు. ఇం. ఉపన్యాసము. [మెం.
లెప్పము. గుజె; లక్ష్యము, సున్నపుగచ్చు
లెస్స. శుభము, క్షేమము. విణ. క్షేమయుక్తము; ఆరోగ్యము; శ్రేష్ఠము; బాగు, అంగీకారార్థకము.
లెస్సవాఁడు. విణ. ఆరోగ్యుఁడు.

## లే

లే. విణ. లేఁత శబ్దముయొక్క లుప్త రూపము. అవ్య. నిశ్చయార్థకము (ఔ లే, దానికంటె ఇది విశేషము లే యని.)
లేఁక. లెంక.
లేఁగ. తర్ణకము, క్రొత్తగాఁ గలిగిన దూడ; మేతపట్టని దూడ; దూడ, వత్సము.
లేఁగటియావు. ధేనువు, లేఁగటిదూడ గల యావు.
లేఁగప్పు. లేఁతకప్పు.
లేఁగరువలి. మందమారుతము,
లేఁగసవు. బాలతృణము.
లేఁగొడుకు. కడగొట్టు బిడ్డఁడు.
లేఁగొన. చిగురుకొమ్మ.
లేఁగొమ్మ. లేఁగొన.
లేఁగౌను. సన్నడుము.
లేఁజందురుఁడు. బాలచంద్రుఁడు.
లేఁజిగురు. క్రొంజిగురు.
లేఁజీకటి. మందాంధకారము.
లేఁజెక్కులు. బ. పాలబుగ్గలు.
లేఁజెమట. చిరుచెమట.
లేఁజెప్పుడు. అవ్యక్తధ్వని.
లేఁజోవు. పంచని దోవతుల జత.
లేఁజౌన. చిన్నది, సుకుమారి.
లేఁజోలు. పసిబిడ్డ. [రము.
లేఁత. విణ. తరుణము; చులుకన; సుకుమా,
లేఁతమొగ్గ క్షారకము.
లేఁతయెఱుపు అరుణవర్ణము.
లేఁతాము. నవదళము?
లేఁదగిరిన. తగిరిప మొక్క†.
లేఁదడి. విణ. ఇంచుక తడిసినది.
లేఁదరఁగ. చిన్నయల.
లేఁదాఁకు. తాఁకు.
లేఁదూఁడు బాలమృణాలము.
లేఁదెర. పలుచని తెర.
లేఁదేఁటి. చిన్న తుమ్మెద.
లేఁబగలు. ప్రాహ్ణము.
లేఁబట్టి. పసిబిడ్డ.
లేఁబాఁపఁడు. అడ్డపట్టు పాఁప, శిశువు.
లేఁబాయము లేఁబ్రాయము.
లేఁబెయ్య. లేఁతదూడ.
లేఁబోద. చిన్న పొద.
లేఁబొన్న. పొన్న మొక్క.
లేఁబొర. సన్న పొర.
లేఁబోక. మందగమనము.
లేఁబ్రొద్దు. అపరాహ్ణము.
లేక. లేఖ, జాబు; ఎడము లేక మిక్కిలి చేరికయగు వృక్షాదుల వరుస; సమూహము.
లేకరి. లేఖకుఁడు. [యోజకుఁడు.
లేకి రాలిన ధాన్యపు గింజలు. విణ. అప్ర
లేకి బతుకు ఉంఛవృత్తి, లేకిగింజ లేరుకొని బ్రతికెడు బ్రతుకు
లేకివాఁడు. విణ. లేకిగింజ లేరుకొని బ్రతికెడువాఁడు; అ. పయోజకుఁడు.
లేకుండు. అ. క్రి. లేకపోవు; శూన్యమగు.
లేఖ. సం. ఎడము లేక మిక్కిలి చేరిక

యగు వృక్షాదుల పంక్తి; లిపి; జాబు; ఇచ్చిపుచ్చుకొలు పత్రము.
లేఖకుఁడు. సం. లేకరి; వ్రాయసకాఁడు; కరణము. [బుజపత్తిరి †.
లేఖనము. సం. వ్రాఁత, వ్రాయి; వాంతి;
లేఖని. సం. వ్రాసెడు కలము.రూ. లేఖిని.
లేఖనికుఁడు. సం. జాబులు కొనిపోయి యిచ్చువాఁడు; తన గుఱుతిడి యొకరిచే వ్రాయించువాఁడు.
లేఖనీయము. సం.విణ. వ్రాయఁదగినది.
లేఖర్షభుఁడు. సం. దేవేంద్రుఁడు.
లేఖహారకుఁడు. సం. జాబులు తీసికొని పోయియిచ్చువాఁడు.
లేఖితము. సం. విణ. లిఖితము.
లేఖుఁడు. సం. దేవత.
లేఖ్యము. సం. వ్యవహార విషయమైన వ్రాఁత. విణ. వ్రాయఁదగినది.
లేగాడ్పు. మందమారుతము.
లేచు. అ. క్రి. ఉత్థితమగు; మేలుకొను; ప్రాటమరించు.
లేచివరాలు. ఈడువచ్చిన స్త్రీ.
లేజోటి. చిన్నది, స్త్రీ.
లేట. కొమ్మ, శాఖ.
లేటమొగము. పెడమొగము.
లేటమొగమువడు. అ.క్రి. విముఖుడగు.
లేటి. జింక; ఆడుజింక; మగజింక.
లేటిమ్రొగలమేటి. మృగాంకుఁడు, చంద్రుఁడు. [వెనుకటిది.
లేటు. ఇం. ఆలస్యము. విణ. పూర్వపుది;
లేడి. లేటి, కురంగము. బ. లేళ్లు.
లేడికంటి. మృగాక్షి, లేడి కన్నులవంటి కన్నులుగల స్త్రీ.
లేదు. నఞర్థకము; ఎలుఁగుబంటి.
లేదుబంతి(టి). బొంకు,
లేనగవు. స్మితము, చిఱునగవు.
లేనడుము. కృశోదరము. [దము.
లేనిమాట. అభ్యాఖ్యానము, అబద్ధపు జగ
లేనెల. బాలచంద్రుఁడు. [వ్రాయువాఁడు.
లేపకుఁడు సం. సున్నము మొదలగువానిని
లేపనము. సం. అలుకుట; పూయుట; పూఁత; భోజనము.?
లేపము. సం. పూఁత; భోజనము; సున్నము మొ. [ప్రే. లేవఁజేయు.
లేపు. పడకమీఁద పఱచెడు పఱపు; జాలం.
లేప్యము. సం పూఁత. విణ. పూయఁదగినది.
లేబరము. విణ. శూన్యము.
లేబిత్తరి. చిన్నది, స్త్రీ.
లేబుడుత. పసిబిడ్డ.
లేమ. రామ, స్త్రీ. విణ. లేఁత.
లేమరి. ఉన్మాథుఁడు.
లేమావి. లేఁతమామిడి చిగురు.
లేమావిలాయపు తేజిరవుతు. శుక వాహనుఁడు, మన్మథుఁడు.
లేమి. కలుగమి; ఉండమి; దారిద్ర్యము.
లేమిడి. దారిద్ర్యము.
లేమొలక. లేఁతమొలక.
లేయనఁటి. లేఁతయరటి.
లేలిహానము. సం. పాము. విణ. మాటి మాటికి లేహనము చేయునది.
లేలేదు. నఞర్థకము.
లేవ. గుఱ్ఱపు తలాటము; కథము.
లేవఁజాలనివాఁడు. ఖంజుఁడు, కుంటి,
లేవడి. లేమి; దారిద్ర్యము. విణ. దరిద్రము.
లేవుడి. హిం. దొంగను కట్టి వీథివీథికి త్రిప్పుట; అవమానపఱచుట. [కొంచెము.
లేశము. సం. కొంచెపుఁదనము. విణ.
లేసు. విణ. చులకన; సులభము.
లేహనము. సం. నాకుట.
లేహము. సం. భోజనము; నాకుట.
లేహ్యము. సం. నాకి భుజింపఁదగినమందు; నాకి భుజింపఁదగిన వ్యంజనవిశేషము; అమృతము. విణ. నాకఁదగినది.

## లై

లైను. ఇం. వరుస.
లైసెన్సు ఇం. సెలవు చీటి.

## లొ

లొంక. కోన. [దీయు.
లొంగు. అ. క్రి. లోఁబడు; తగ్గు; వెను
లొండు. జలాశయవిశేషము.

లొంప. కొంప, అల్పగృహము.
లొంపు. ఒక తెగ.
లొగ్గడి. క్షోభము, కలగుండు.
లొగ్గడిలఁజేయు. అ. క్రి లోఁబడునట్లు చేయు; కలగుండు పడఁజేయు.
లొగ్గడిల్లు. అ. క్రి. క్షోభించు.
లొచ్చు, లొజ్జ } తక్కువ. విణ. న్యూనము.
లొట. విణ. అణఁగినది.
లొటకజిట్ట. లొట్టకన్ను జిట్ట.
లొటలొట. పోవుటయందగు ధ్వన్యను కరణము.
లొటలొటమను. అ. క్రి. లొటలొటయని ధ్వనించు.
లొటారము. బిలము, బొక్క; రంధ్రము; సుషిరము; శూన్యము; కుండ పెంకుల ధ్వని.
లొటిపిట. ఒంటె.
లొటిపిట్ట. ఒంటె.
లొట్ట. మగగుజి; రుచిగల పదార్థములను భుజించునపుడు నాలుకను అంగిటఁ జేర్చి పుట్టించెడు ధ్వని; పల్లము, గుంట. విణ. అణఁగినది.
లొట్టకంటివాఁడు. క్లిన్నాక్షుఁడు.
లొట్టకన్ను. దించుకొనిపోయిన కన్ను.
లొట్టకన్నుజిట్ట. పక్షివిశేషము.
లొట్టకాయ. మగగుజి.
లొట్టపోవు. అ. క్రి. అణఁగు.
లొట్టవేయు. అ. క్రి. రుచిగలపదార్థములను భుజించునప్పుడు నాలుకను అంగిటఁ జేర్చి ధ్వనిపుట్టించు; అబద్ధముచేయు.
లొట్టి. కల్లుదిసెడు కుండ.
లొట్టిపిట(ట్ట). ఒంటె.
లొట్టిముచ్చు. విణ. త్రాగుఁబోతు.
లొట్టియ. ఒంటె.
లొట్టె. ఒంటె, ఉష్ట్రము.
లొట్టెనుఁగు. ఒంటె; మహోష్ట్రము.
లొడపెట్టు స. క్రి. ద్రవద్రవ్యమును చేతి కలపెట్టు.
లొడలొడ. కాఱుటయందగు ధ్వన్యను కరణము. విణ. వదులు.
లొంత, లొడితెలి } ప్రాదేశము.
లొడితెఁడు. విణ. ప్రాదేశమాత్రము.
లొడుకు. విణ. పనికిమాలినది.
లొడుగు. ఆవుమెడను కట్టెడు ఘంటా విశేషము.
లొడ్డ. ఎడమ.
లొడ్డు. విణ. అధికము.
లొత్త. పల్లము.
లొద్ద రాశి.
లొద్ది. లోయ.
లొద్దుగు. లోధ్రము, గాలవము†.
లొబ్బెన. కంఠహార విశేషము.
లొల్ల. దున్నినచేల మిట్టపల్లములు లేక సరుదునట్టి బల్ల.
లొల్లి. విణ ఘనము, తఱచు.
లొల్లిగాఁడు. దరిద్రుఁడు; బికారి.

## లో

లో. అవ. నిర్ధారణషష్ఠియందు వచ్చెడు లోపల వర్ణకమునకు మాఱుగా వచ్చునది; లోను శబ్దముయొక్క సప్తమీ విభక్తి యందు నాక్షరము లోపింపఁగా మిగిలిన రూపము; వృత్తియందులోను లోపల శబ్దములకుమీఁది వర్ణములు లోపింపఁగా మిగిలిన రూపము. (లోఁబడు, లోచూపు మొ )
లోఁకువ. విణ అధీనము; తక్కువ.
లోఁగడ. అంతరాళము; గతకాలము; పూర్వము.
లోఁగా. ద. గ్రా. లోపల; క్రిందట.
లోఁగలి, లోఁగిలి } గృహాంతర్భాగము; గృహము; బవంతి.
లోఁగు. అ. క్రి. లోనువఁగు; అడఁగు; చొచ్చు; వెనుదీయు.
లోఁగొను. స క్రి. లోపలనడఁచుకొను; స్వాధీనము చేసికొను.
లోఁచు. ప్రే. లోఁగఁజేయు.
లోఁడు. స. క్రి. వ్రేలు మొదలగువానితో కెల్లగించు.
లోఁతిడి. విణ. ఉత్తానము, లోఁతులేనిది.
లోఁతు. నిమ్నము, మిక్కిలిపల్లము. విణ. మిక్కిలిపల్లమైనది.
లోఁబడు. అ. క్రి. అధీనమగు.
లోకజిత్తు. సం. బుద్ధదేవుఁడు.

లోకజ్ఞుఁడు. సం. విణ. లోకము తెలిసినవాఁడు, ప్రాజ్ఞుఁడు.
లోకతంత్రము. సం. లోకవ్యాపారము. (ఇది పంచవిధము—ధృతి, దాక్ష్యము, దేశము, కాలము, పరాక్రమము.)
లోకనము. సం. ఆలోకనము.
లోకపాలుఁడు సం. దిక్పాలుఁడు; రాజు.
లోకబాంధవుఁడు. సం. సూర్యుఁడు.
లోకమాత. సం. లక్ష్మీదేవి.
లోకము. సం. జగత్తు; జనము. [లోకములు మూఁడు—స్వర్గము, మర్త్యము, పాతాళము. పక్షాంతరమున పదునాలుగు—భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము. (ఈయేడును ఊర్ధ్వలోకములు.) అతలము, వితలము, సుతలము, రసాతలము, మహాతలము, తలాతలము, పాతాళము. (ఈయేడును అధోలోకములు.) ఇవి. 14.]
లోకస్థుఁడు. సం. లోకములో నుండు వాఁడు. [రామాయణము
లోకాభిరామవార్తలు. సం. బ. లోకాభి
లోకాయతము. సం. చార్వాకదర్శనము, స్వభావమునకుఁ గర్తృత్వము చెప్పునట్టి మతము. [లోకాయత మతస్థుఁడు.
లోకాయతికుఁడు. సం. చార్వాకుఁడు;
లోకాలోకము. సం. భూమిని చుట్టుకొని యుండు కొండ, చక్రవాళము
లోకేశుఁడు. సం. బ్రహ్మ. [దేవుఁడు.
లోకైకవేల్పు. మి. లోకమున కొక్కఁడే
లోగుక్క. మణితము.
లోచకము. సం. కాటుక; కంటినల్లగుడ్డు.
లోచకుఁడు. సం. మందమతి.
లోచనము. సం. కన్ను.
లోచమస్తకము సం. ఓమము†.
లోచేవి. ఆత్మానందము, జ్ఞానామృతము.
లోచెయి. కరతలము, అఱచెయ్యి; మర్మము. విణ. మర్మము తెలిపెడివాఁడు; రూ. లోచెయ్యి.
లోచూపు. జ్ఞానదృష్టి అంతర్ముఖత.
లోట. చిన్నపాత్రము.
లోటు. నష్టి; లోపము; తక్కువ.
లోటుపోవు. అ. క్రి. నష్టియగు; లోపమగు.
లోడి. మల్లులు సాదనకు త్రిప్పెడు సాధన విశేషము. రూ. లోడీ.
లోడు. ఒలిగుదిండు.
లోతక్కువ. విణ. శేషము, కొదువ.
లోతొడ. తొడకులోపలి భాగము.
లోధ్రము. సం. లొద్దుగు†.
లోన్ }
లోనన్ } అవ్య. అంతరర్థకము.
లోనగు. అ. క్రి. స్వవశమగు.
లోను. లోపల; మొదలు. (ఇంద్రుఁడు లోనగు దేవతలు, రాజులోనగు మనుష్యులు అని.) విణ. లోఁగువ.
లోపము. సం. మఱుఁగుపాటు; తక్కువ.
లోపల. లోను, అంతరము. అప. నిర్ధారణ షష్ఠియందు వచ్చెడు ప్రత్యయము. (దేవతలలోపల ఇంద్రుఁడు అధికుఁడు అని.)
లోపాయకారి. విణ రహస్యముగా నొకరి పక్షమునను న్న.
లోపాముద్ర. సం. అగస్త్యముని భార్య.
లోపాశకము. సం. నక్క.
లోపించు. సం. అ. క్రి. మఱుఁగుపడు; తక్కువపడు.
లోప్త్రము. సం. దొంగిలించిన సొమ్ము.
లోబంటరి. అడవిపంది.
లోబిత్తరి. మల్లబంధ విశేషము.
లోభము. సం. పిసినితనము.
లోభి సం. విణ. పిసినివాఁడు.
లోమము. సం. రోమము.
లోమశ. సం. జటామాంసి†; దూలగొండి†. వస†; వెలమసంది†.
లోమశము. సం. గొఱ్ఱె; పూతిమార్జాలము, బూతపిల్లి.
లోమశుఁడు. సం. రోమశుఁడు.
లోమొన. మల్ల బంధ విశేషము.
లోయ కొండసెఱియ, కొండపగులు.
లోల. సం. నాలుక; లక్ష్మి.
లోలము. సం. విణ. మిక్కిలి యిచ్ఛ గలది; కదలునది.
లోలాయపడు. అ. క్రి. శ్రమపడు.
లోలితము. సం. విణ. ఊఁచఁబడినది.

లోలుఁడు. సం. విణ. చంచలుఁడు; ఆసక్తుఁడు.
లోలుపుఁడు } సం. విణ మిక్కిలి యిచ్ఛ
లోలుభుఁడు } గలవాఁడు, లుబ్ధుఁడు.
లోలొంక. మల్లబంధ విశేషము.
లోవ. లోయ; రథపీఠముమీఁది చట్టపు అంచు; చూరు.
లోవయినము. కడచినది.
లోవరి. కత్తివ్వ, తొట్టికట్టు.
లోవాడికాఁడు. చోరుఁడు.
లోవి. వంటకుండ; నీళ్లు తెచ్చుకొనెడి ఇత్తడిపాత్రము, బిందె.
లోపిడి. పూర్వము, మునుపు.?
లోవు. అ. క్రి. లొంగు.
లోవెలి. బాహ్యాభ్యంతరములు.
లోవైనము. విణ. కడచినది.
లోష్టము } సం. గడ్డ, మంటిపెల్ల
లోష్టువు }
లోసబురు గ్రా. ఒడ్డునుదూరమున సముద్రయానము చేయుట.
లోహండి. లోవి.
లోహకారకుఁడు. సం. కమ్మరవాఁడు.
లోహజిత్తు. సం. వజ్రము, రవ్వ.
లోహపృష్ఠము. సం. రాపులుఁగు.
లోహమారకము. సం. పొన్నగంటికూర; శాలించశాకము.
లోహము సం. ఇనుము; అగలు; బంగారుము. (పంచలోహములు — బంగారు, వెండి, ఇత్తడి, కంచు, ఇనుము. రాగి, తగరము, సత్తు. ఇవి మూఁడు చేరి అష్టలోహములనఁబడును. నవలోహములనియును ఒక వాడుకకలదు.)
లోహలుఁడు. సం. విణ. స్ఫుటముగాని మాటలుగలవాఁడు.
లోహాభిసారము సం. ఆయుధములు ధరించిన రాజులకు నివాళి యిచ్చుట.
లోహిక. సం. లోహపత్రము.
లోహితకము. సం. కెంపు.
లోహితచందనము. సం. కుంకుమపువ్వు.
లోహితము. సం. రక్తచందనము; హరిచందనము; చెందిరము; నెత్తురు; ఎఱుపు; ఒకనదము. విణ. ఎఱ్ఱనిది.
లోహితాంగుఁడు. సం. కుజుఁడు.
లోహితాశ్వుఁడు. సం. అగ్నిహోత్రుఁడు.
లోహితుఁడు సం లోహితాంగుఁడు.

## లౌ

లౌకికము. సం. విణ. లోకవ్యవహారసిద్ధమైనది.
లౌడి. లవుడి, పరిఘము. రూ. లౌణి.
లౌనును ఇం. జీవనార్థము ఇచ్చుద్రవ్యము.
లౌల్యము. సం. లోలత్వము.
లౌహము. సం. విణ. లోహవికారమైనది.
లౌహిత్యము. సం. ఎఱ్ఱన; నదవిశేషము.

---

# వ

వంక. దిక్కు; పక్షము; వంకర, వంపు; వాఁగు; అపరాధము. [దారి.
వంకదార. కోటవాకిటి ముందటివంకర
వంకము. నులుచునపుడు కసవును క్రిందుమీఁదుగా త్రిప్పివేసెడు వంకరకొయ్య. సం. ఏటి రెండుదరుల నడుము; గుఱ్ఱపుజీను; గుఱ్ఱము ముందటివైపు ?
వంకర. వక్రత్వము. విణ. వక్రము.
వంకరటింకర. విణ. అనేకవిధములుగా వక్రమైనది.
వంకరబోను. మృగాదులఁబట్టువలభేదము
వంకరవోవు. అ. క్రి. వంకరయగు.
వంకరతొండమువాఁడు. వక్రతుండుఁడు, వినాయకుఁడు.
వంకనన్నములు. బ. శాలిధాన్యవిశేషము.
వంకాము. రూ. వంకము.
వంకాయ వార్తాకము.
వంకి. బాఁకు.
వంకిణి. బాఁకు.
వంకియ. సస్యవిశేషము. రూ. వంకె.

వంకి. స్త్రీలు సందిట ధరించెడుభూషావిశే
షము.
వంక్యము. సం. వక్రము; ఒంకె.
వంక్షణము. సం. గజ్జ, పొత్తికడుపున
కును తొడకును నడిమిసందు.
వంగ. వంగచెట్టు.
వంగఁదీయు. స. క్రి. వంచు.
వంగకాయ. వంకాయ.
వంగడము. వంశము, కులము.
వంగదేశము. సం. 56దేశములలోఒకటి.
వంగపండు. పక్షివిశేషము.
వంగము. సం. తగరము; వంగ†; సత్తు;
నూలిచీర; వంగదేశము.
వంగసము. వంశము.
వంగాకుబుడమలు. బ. ధాన్యవిశేషము.
వంగించు. స. క్రి. గోడివెట్టు.
వంగు. అ. క్రి. నమ్రమగు, ఒఱగు,
ముందటికి వాలు.
వంగుడు. బీఁటిక, స్ఫోటము.
వంగుళ్లు. బ. నట్టొట్లు.
వంచకము. సం. నక్క; ఇంటిముంగిస.
విణ మోసముచేయునది.
వంచకుఁడు. సం. విణ. ధూర్తుఁడు, మోస
కాఁడు, చెడ్డవాఁడు.
వంచన–ము సం. దగా, మోసము.
వంచి. స. ఒకటి. [దగాచేయు.
వంచించు. సం. స. క్రి. మోసపుచ్చు,
వంచితము. సం. విణ మోసగింపఁబడినది
వంచితుఁడు. సం. విణ. వంచింపఁబడిన
వాఁడు.
వంచియ } కసవు మొ|| కోయువారువాని
వంచె } నుంచుకొనుటకై వెనుకపిఱుఁ
దులమీఁద జాఱఁగట్టుకొనెడి యొడి;
తూమెఁడుగింజలు పట్టెడుగోనె.?
వంచె. ఒకటి; చీట్లలో అను. విణ
ముఖ్యము.
వంచెదివియ. తృణ విశేషము.
వంచెన. వంచన.
వంచెము. రూ. వంచ. [లించు.
వంచొడించు. అ క్రి బెదరు. రూ. వంచా
వంచు. ప్రే. వంగఁజేయు. [ప్రబ్బ†
వంజులము. సం. అశోకము†; నెమ్మి†;

వంజెఱఁగు. స్త్రీ పొగ్య్వచేలాంచలము.
వంజె. వంధ్య; గొడ్రాలు; గొడ్డుటావు;
గొడుగు లోపలి శలాకల కొసరాగా
నేర్పఱచిన కమ్ములు.
వంజెరము. మత్స్య విశేషము.
వంజో. వంజరము.
వంట. పాకము. బ. ఏరుపిడక. (వృత్తి
యందు వంటమోపు, పిడుకవంట అని.)
వంటకట్టియలు. } ఇంధనములు. బ.
వంటకట్టెలు. } వంటకై పొయ్యి
మంటవేసెడు కట్టెలు.
వంటకత్తియ. } పాచిక, పాచకు
వంటకత్తె. } రాలు.
వంటకము. అన్నము. సం. భాగము.
వంటచెఱకు. వంటకట్టెలు; గుడపాక
యోగ్యమైన యిక్షువు. [లిన నూనె.
వంటచమురు. పిడివంటలు తేల్చి మిగి
వంటపుట్టి. వంటచేసి పెట్టి జీవించునది.
వంటపూటివాఁడు. వంటవాఁడు.
వంటబ్రాహ్మణుఁడు. మి. వంటచేయు
బ్రాహ్మణుఁడు.
వంటయిల్లు. మహానసము, పాకశాల.
వంటయుప్పు. విడంగము, వండినయుప్పు.
వంటరాయి. మన్నువండి చేసిన మణి
విశేషము. పచ్చ. [పాచిక, వంటకత్తె.
వంటరి పాచకుఁడు, వంటవాఁడు;
వంటలక్క. పాచిక, వంటకత్తె. [వాఁడు.
వంటవాఁడు. పాచకుఁడు, వంటచేయు
వంటసరకు. ఇంధన సమూహము, కట్టెలు.
వంటసాల. వంటయిల్లు.
వంటి. విణ. బోఁటి అవ్య. పోని, వదర్థకము
వంటియము. తాలూకా, ఒకనిక్రింది
రాజ్యమునందు కొంతభాగము.
వంటిల్లు. వండుకొనుయిల్లు, రసవతి.
వంటు. అనుకూల్యము.
వంటెము. రూ. వంటియము. [పెట్టె.
వంట్రము. ఔషధములసంచి; మందుల
వంతుఁడు. సం. బ్రహ్మచారి; సేవకుఁడు.
విణ. పొట్టివాఁడు.
వండ. ఆపద; వండలి, ఎండిన బురద.
సం. అంకుటాలు. విణ. వికలాంగి.
వండము. సం. తోఁకతెగిన పశువు.

వండలి చెఱువు మొదలగు వాని యడుగున నుండెడి యొండిన బురద.
వండు. వండలి. స. క్రి. వంటచేయు.
వంత. ఏడ్పు; ఏఱు; సంతాపము, మనోవ్యథ
వంతకత్తియ. కట్టని.
వంతవేయు. అ. క్రి. కన్ను వేయు.?
వంతు. భాగము; వరుస; సామ్యము; పోటి.
వంతెన. సేతువు, ఏఱు మొదలగువానికి నీళ్లుపోవుటకు కన్నులు విడిచి మీఁద నడచిపోవునట్లు కట్టిన కట్ట. [బదనిక.
వంద గడ్డిరాసి. స. నూఱు, శతము. సం.
వందకము. సం. బదనిక†; చిఱుతేఁకు.?
వందనమాల. సం. ద్వారమందు కట్టిన తోరణము. [ముఖము.
వందనము. సం. నమస్కారము; స్తుతి;
వందఱ. ఖండము, తునుక.
వందఱలాడు. స. క్రి. ఖండించు.
వందారువు. సం. విణ. గోత్రనామములు చెప్పి పాదములు సోఁక మ్రొక్కువాఁడు
వంది. సం. బట్టువాఁడు, వంశావళిఁ జదువువాఁడు; రాజాదులను స్తుతి చేసి జీవించువాఁడు.
వందించు. సం. స. క్రి. స్తుతించు.
వందితుఁడు. సం. విణ. నమస్కరింపఁ బడినవాఁడు; స్తుతింపఁబడినవాఁడు.
వందు. అ. క్రి దుఃఖపడు; విచారపడు.
వందురు. దుఃఖము. అ. క్రి. క్లేశపడు; దుఃఖపడు.
వందె. తృణజాతి విశేషము.
వందొందు. మత్స్యవిశేషము.
వంద్యుఁడు. సం. విణ. నమస్కరింపఁ దగినవాఁడు; స్తుతింపఁదగినవాఁడు.
వంధ్య. సం. గొడ్రాలు; గొడ్డుటావు.
వంధ్యము. సం. విణ. ఫలింపనిది (చెట్టు మొ)
వంపు. వంగుట; వంకర. విణ. వంగినది; వంకరైనది.
వంశకము. సం అగరు.
వంశనర్తి. సం. దొమ్మరి.?
వంశము. సం. తండ్రితాతలు మొదలయిన వారి పరంపర, కులము; ఒక పురాణ లక్షణము; వెదురు†; పిల్లంగ్రోవి; వెన్నుముక; సమూహము.
వంశరోచన. సం. త్వక్క్షీర†.
వంశానుచరితము. సం. ఒక పురాణ లక్షణము, రాజవంశచరిత్ర వర్ణనము.
వంశి. సం. పిల్లంగ్రోవి.
వంశికము. సం. అగరు.
వక(కా)వకలు. బ. చెదరుటలు; బ్రద్దలు.
వకీలు. హిం. లాయరు, న్యాయవాది.
వకుళము. సం. పొగడ†.
వక్క. ఉడుకఁబెట్టిన పోఁకచెక్క.
వక్కణ-ము వ్యాఖ్యానము; జాబునందు మొదట వ్రాయుపద్ధతి.
వక్కణించు. స. క్రి. వచించు.
వక్కరము. వక్రత; వంకర. విణ. వంకరైనది; వక్రము.
వక్కరాలు. విణ. కుటిల స్త్రీ. [మలయు.
వక్కరించు. అ. క్రి. తిరుగఁబడు; మాఱు
వక్కలు. బ. పోఁకలు.
వక్కళించు. అ. క్రి. రూ. వక్కరించు.
వక్కలాకులు. } తాంబూలము.
వక్కాకు. }
వక్కాణ. రూ. వక్కణ.
వక్కాణము. సమాచారము. [వాక్రుచ్చు.
వక్కాణించు. స. క్రి. వ్యాఖ్యానించు,
వక్కు. విణ. కృశము; బక్క. [కట్టియ.
వక్కుకట్టె. విణ. కృశుఁడు. రూ. వక్కు
వక్కు. బకము. అ. క్రి. కృశించు; బక్కటిల్లు.
వక్కుపులుఁగు. బకము, వక్కుకొంగ.
వక్త. సం. విణ. నలుగురిలో నిర్భయముగా మాటలాడువాఁడు, పండితుఁడు.
వక్తవ్యము. సం. మాట. విణ. చెప్పఁ దగినది; నిందింపఁదగినది. [వస్త్రము.
వక్త్రము. సం. నోరు; ముఖము; ఒక
వక్రతమములు. సం. బ. ఐ ఔ లు.
వక్రము. సం. ఏరువంకర. విణ. వంకరైనది; క్రూరమైనది; అడ్డమైనది.?
వక్రములు. సం. బ. ఎ ఒ లు.
వక్రాంగి. సం. కటుకరోహిణి † విణ. వంకరైన దేహము గలది. [బడు.
వక్రించు. సం. అ. క్రి. మరలు, మరలఁ

వక్రిమ-ము. సం. వంకర. విణ. కుటిలము; వంగినది.
వక్రుఁడు. సం. కుజుఁడు; శని.
వక్షము. సం. ఱొమ్ము. రూ. వక్షస్సు.
వక్షోరుహము. సం. స్తనము.
వగ. విచారము; దుఃఖము; శోకము; ఆలోచన; విధము; గతి; విలాసము; శృంగార చేష్ట.
వగకత్తె. విణ. వగలాఁడి. [వన్నెకాఁడు
వగకాఁడు. విణ. విటుఁడు; విలాసకాఁడు,
వగచు. అ.క్రి. పశ్చాత్తాపపడు; ఏడ్చు; దుఃఖించు. స. క్రి. విచారించు; ఆలోచించు; తలఁచు. [జేయు.
వగదెంచు. క్రే. పరిష్కరించు; వగదెగఁ
వగదెగు. అ క్రి. పరిష్కృతమగు.
వగపు. విచారము; శోకము; చింత; మనోవ్యథ. అ.క్రి. వగచు.
వగరము. రూ. వగరు.
వగరు. శ్వాసరోగము; ఉబ్బసము.
వగరుచు. అ.క్రి. నిట్టూర్చు. రూ. వగర్చు.
వగరుపు. శ్వాసరోగము. రూ. వగర్పు.
వగలాఁడి. విణ. విలాసవతి, శృంగార చేష్టలుగల స్త్రీ.
వగలాఁడు రూ. వగకాఁడు.
వగ్గెరా. హిం. మొదలైనవి.
వగ్గు. రూ. వక్కు.
వగ్రహము. సం. వఱపు, అనావృష్టి.
వచ. సం. వస; గోరువంక.
వచనము. సం. మాట.
వచము సం. చిలుక.
వచస్సు. సం. వచనము.
వచించు. సం. స. క్రి. పలుకు, భాషించు, మాట్లాడు. రూ. వచియించు.
వచ్చ. చెట్టుకుఁబట్టి బొత్తిగా నాశము చేసెడి యొకదినుసు చీడ; ఇచ్చ.
వచ్చు అ. క్రి. ఆగమించు, చనుదెంచు, దూరమునుండి సమీపమునకు నడచు; కల్గు.
వచ్చుబడి. ధనాగమము.
వచ్చురాములు, బ. రాకయు పోకయు.

వజీరు. హిం. మంత్రి; రౌతు. [రౌతు.
వజీరుఁడు. శూరుఁడు, జోదు; వజీరు;
వజ్జిరము. సముద్రపు మత్స్య విశేషము; వజ్రము.
వజ్జీరుఁడు. రూ. వజీరుఁడు
వజ్రంపుదళుకులు. బ. ధాన్యవిశేషము.
వజ్రకము. సం. పాలుకాఁచెడిగిన్నె; వజ్రక్షారము; తామరవిత్తు.?
వజ్రకీటము సం. సాలగ్రామము లోపల నుండి తొలిచెడుపురుగు.? [చేసినగార.
వజ్రగార. మి. గ్రా. వజ్రములు నూఱి
వజ్రతుండుఁడు. సం. గరుత్మంతుఁడు.
వజ్రద్రుమ. సం. ఆకుజెముడు†
వజ్రనిర్ఘోషము. పిడుగుమ్రోఁత రూ. వజ్రనిష్పేషము.
వజ్రపుష్పము. సం. నువ్వులపువ్వు.
వజ్రము. సం. ఒకరత్నము, రవ; వజ్రాయుధము; పిడుగు; ఒక గ్రహయోగము. వాకట్టులనతికించుఒక బంక, సరేసు.
వజ్రలేపము. సం. వజ్రమునుకరగించి రెండు వస్తువులంటించుటకుఁ బూయుట.
వజ్రవల్లి. సం. నల్లేరు†.
వజ్రహాసము. సం. శివునికత్తి.?
వజ్రాంగి. సం. వజ్రమయకవచము; ? నల్లేరు†; అడవిగోధుమ†.
వజ్రావర్తము. సం. రామస్వామివిల్లు.?
వజ్రి. సం. ఇంద్రుఁడు; బుద్ధుఁడు; ఆకుజెముడు†.
వజ్రిక. సం. ముళ్లజెముడు† ?
వజ్రీఁడు. రూ. వజీరుఁడు.
వజె. వస†.
వజ్జె. ఉపాయము.
వటకము. సం. వడియము; వడ, గారె.
వటగ. విణ. నేర్పరి.
వటము. సం. త్రాడు; ఉండ, గోళము†; దండ; మజ్జె†; గవ్వ; వడ, గారె.
వటారము. నగరు; గుడారము.
వటారి. విణ. సమర్థము. రూ. వతారి.
వటారు. నగరు. [పురుగు; వడియము.
వటి. సం. త్రాడు? కొండనాలుక; చెద
వటించు. అ.క్రి పస్తుపడు.
వటివేరు. రూ. వట్టివేరు.

వటుకుఁడు. సం. బ్రహ్మచారి; బాల
కుఁడు; ఒక భైరవుఁడు.
వటువు. సం. బ్రహ్మచారి; బాలుఁడు.
వట్ట. చెఱకు గానుగకు వేసెడిఅడ్డమాను;
వృషణము. [పెట్టు సప్తమి.
వట్టము. తిరుగు, చిల్లర మార్చునపుడు
వట్టికాలు. పిక్క వెలుపటి కాలు.
వట్టిచేఁప. శుష్కమత్స్యము.
వట్టిది. విశ. రిక్తము, ఏమియు లేనిది;
ప్రయోజనము లేనిది; అసత్యము.
వట్టిమాట. అపవాదము; లేని మాట;
శుష్కాలాపము.
వట్టియావు. పాలు లేని యావు.
వట్టివడియము. మినుప పిండితోఁ జేసిన
వడియము. [షము, గశేధుక.
వట్టివరి. సస్యవిశేషము. బ. ధాన్య విశే
వట్టివేరు. ఉశీరము†.
వట్టు. వరుగు; ఎండిన పక్కు; దూలము
మొ॥ వానికి బలమునకయి వేసెడు
కట్టు. అ.క్రి. ఇంకు; కృశించు
వట్రము. ధాన్యాదులు నించిన గోనె.
వట్ర. విశ. గుండ్రము; వర్తులము.
వట్రన. గుండ్రన; వర్తులత్వము.
వట్రపడు. అ.క్రి. తగ్గు.
వట్రపెట్టు. అ.క్రి. తగ్గించు; లక్ష్యపెట్టు.
వట్రము. వక్క తిత్తి. విశ.
హ్రస్వము.
వట్రించు. అ. క్రి. తిరుగు.
వట్రిలు(ల్లు) అ.క్రి. ఒప్పు; ప్రవర్తిల్లు;
తిరుగు; కలుగు.
వట్రువ. గుండ్రము; ఋకారము.
వట్రువముస్తె. చక్రలి†. [తర నామము.
వట్రువసుడి. ఋకారముయొక్క రూపాం
వతర. విశ తవర, సమర్థుఁడు.
వతారి. విశ రూ. వతర.
వడ. వటము, గారె;మిరపకాయలు మొ॥
సంబారువులు చేర్చి చేసిన గారె;
తాపము; శ్రమము; సెగ; వడగాలి.?
వడఁకాఁడు. అ.క్రి. వడఁకు. [చలించు.
వడఁకు. కంపము. అ. క్రి. కంపించు;
వడఁబోయు. స.క్రి. వడియఁబోయు.
వడకు. ఉత్తరపు దిక్కు?.

వడకుఁగొండ. } హిమవత్పర్వతము.
వడకుగుబ్బలి }
వడకుత్రోవ. ఉత్తరాయణము.
వడగల్లు. కరకము, వర్షోపలము.
వడగవ్వ. మత్స్య విశేషము.
వడగాలి. ఉష్ణవాయువు; వేసంగి కాల
మందలి నిప్పుగాలి.
వడగొను. అ.క్రి. తాపముఁబొందు.
వడచు. స.క్రి. పోయు, కార్చు. రూ.
వడుచు.
వడజెక్కలిక. కుబేరుఁడు.
వడదెస. ఉత్తరపు దిక్కు.
వడదోలు. వేఁటకాఁడు శరీరమునకుఁ
గప్పుకొనెడు నిడుపు తోలు; గవుండ్ల
వాఁడు మొలకు కట్టుకొనెడు నిడుపు
తోలు.
వడపప్పు. శ్రమ పరిహారార్థమిచ్చెడు
నానఁబెట్టినసంబారువుచేర్చినపెసరపప్పు
వడపిందెలు. బ. తాపమును పోఁగొట్టు
నటువంటి ఊరవేసిన మామిడి పిందెలు.
వడము. మోకు; దండ.
వడముడి. భీముఁడు.
వడలు. ఒడలు. అ.క్రి. పుష్పాదులు
వాడు; గాడుపులు. [కరణము.
వడవడ వడఁకుట యందగు ధ్వన్యను
వడవడఁకు. అధికకంపము.
వడవు. విధము.?
వడారము. ద్ర. క్రి. విశ. బొత్తిగా.
వడి. శీఘ్రము, వేగము; శౌర్యము;
కాలము; దారముపిరి; పిరిబిగువు;
పిరిబిగువునఁబడుచిక్కు; పద్యయతి.
వడిఁగట్టు. స.క్రి. పాత్రమునోటికిగుడ్డకట్టి
నీళ్లు మొదలగువానిని వడియఁబోయు.
వడిఁబెట్టు. స. క్రి. వడిఁగట్టు; శోధించు.
వడికాఁడు. విశ. వేగవంతుఁడు;శూరుఁడు.
వడిగలతనము. విశ శౌర్యము.
వడిగొను. అ. క్రి. మెలిపడు; వేగము
గలుగు. ప్రే. వడిగొల్పు.
వడిపెట్టు. స. క్రి. మెలిపెట్టు; నులుము.
వడియ. చిలుకకొయ్య.
వడియఁగట్టు. రూ వడిఁగట్టు.
వడియఁబోఁత. వడియఁబోయుట.

వడియఁబోయు. స. క్రి. బియ్యము మొదలగు వానినికడిగి నీళ్లు వడియనుంచు
వడియము. వటకము, భోజనమప్పుడు నంజుకొను వ్యంజన విశేషము.
వడియు. అ. క్రి. స్రవించు, కాఱు; జాఱు; ఇఁకు; స్రవించు.
వడివాఁడు. శూరుఁడు.
వడివేయు. స. క్రి. వడిపెట్టు
వడుకు. స. క్రి. కదురు మొదలగు వానిని త్రిప్పి దూదిని నూలుగా నీడ్చు.
వడుకుడు. వడుకుట, వడుకనము.
వడుగఁడు. వటువు, బ్రహ్మచారి.
వడుగు. విధము; వటువు, బ్రహ్మచారి; ఉపనయనము. [వానిని దించు
వడుచే. ప్రే. కార్చు; నూనె మొదలగు
వడుపు. వడియుట.
వడువు. రూ. వడుగు.
వడువువోలె. ఇవార్థముపై ఇవార్థము.
వడుసు. మోటుతనముగా చలువచేయుటచే వస్త్రమునందు పడుగు పేకలు సందిచ్చి వంకరగా తొలఁగుట.
వడుసుడి. (రాజులకిచ్చు) దండువు.
వడుసుపోవు. అ. క్రి. వస్త్రము వడుసు కలదియగు.
వడె. చిలుకకొయ్య.
వడ్డన. వడ్డించుట, పరివేషణము.
వడ్డి. వృద్ధి, అప్పిచ్చినవానికి అప్పుపుచ్చుకొన్నవాని వలన నెలకు నూటికింతయని పెచ్చుగావచ్చు ధనము.
వడ్డించు. స. క్రి. పరివేషించు, భోజ్యపదార్థము పళ్లెమునందుంచు.
వడ్డికివడ్డి. చక్రవృద్ధి.
వడ్డిబ్రతుకు. వృద్ధిజీవనము, వడికిచ్చి బ్రదికెడు బ్రదుకు. [చువాఁడు
వడ్డిమేపరి. వార్ధుషికుఁడు, వడ్డిచేత జీవి
వడ్డీ. వా. తేమానము, వృద్ధి.
వడ్డెన. వడ్డించుట.
వడ్రంగము. వడ్రంగిపని, తక్షణము.
వడ్రంగి. కఱ్ఱపనిచేయువాఁడు, వర్ధకి, తక్షు
వడ్రంగిపిట్ట. దార్వాఘాటము
వడ్రము. రూ వడ్రంగము.
వడ్రవాఁడు. వడ్రంగి.
వడ్ల. వడ్రంగిపని
వడ్లంగి. వడ్రంగి.
వడ్లంగిపిట్ట వడ్రంగిపిట్ట.
వడ్లకంకణము. ఒకదినుసుతొంగ.
వడ్లచిలుక. క్రిమివిశేషము.
వడ్లత. వడ్లది.
వడ్లది. తక్షస్త్రీ.
వడ్లవాఁడు. స్థపతి. ?
వడ్లు. బ. శాలిధాన్యము, వరిగింజలు.
వణఁకు. కంపము. అ. క్రి. వడఁకు.
వణిక్కు. సం. వ్యాపారము; ఒకకరణము; క్రయవిక్రయములు చేయువాఁడు. రూ. వణిజుఁడు.
వణిజ్య-ము. సం. వాణిజ్యము.
వణితము. వంటెము, తాలూకా.
వతంసము. సం. శిరోభూషణము; చెవి కొనలనుంచుకొనెడి పువ్వుపల్లవాదిః, పూగమ్మ.
వతంసితము సం. విణ. సిగబంతిగాఁ జేయఁబడినది, శిరోభూషణము.
వతను. హిం. వాడుక, మామూలు.
వత్త. వరుగు.
వత్తి. వర్తి, దీపపు వత్తి; దశ, బద్దె.
వత్తె. దశ, బద్దె.
వత్స. సం కూఁతురు; పడ్డ.
వత్సకము. సం. కొడిసె †.
వత్సతరము. సం. దమ్యము.
వత్సదేశము. సం. 56 దేశములలోనొకటి
వత్సనాభము. సం విషభేదము, వసనాభి.
వత్సనాభి. వా. కుక్కకియ్యఁబడిన పేరు.
వత్సము. సం. ఱొమ్ము; సంవత్సరము; తటిపిదూడ.
వత్సరము. సం. సంవత్సరము.
వత్సలము. సం. వాత్సల్యరసము; తృణాగ్ని
వత్సలుఁడు. సం. విణ. వాత్సల్యము గలవాఁడు; ప్రేమగలవాఁడు.
వత్సాదని. తిప్పతీఁగ†. [శిష్యుఁడు
వత్సుఁడు. సం. బాలుఁడు; బిడ్డఁడు;
వదడు. ధూళి.
వదనము. సం. నోరు; ముఖము.
వదనిక. జీవంతి, బదనిక†.
వదర. విణ. వదరుఁబోతు.

వదరు. చేఁతిసాఁ †; సొరకాయ. అ. క్రి. ప్రేలు, ఉపయోగములేని మాటలు ఊరక మాటాడు; అదరు.
వదరుఁగప్ప. భేకభేదము.
వదరుఁబోతు. విణ. ప్రేలరి.
వదలు. విసర్జనము, విడుపు. అ. క్రి. విడిపోవు; ఊడు. స. క్రి. విడుచు, విసర్జించు
వదాన్యుఁడు. సం. విణ. మిక్కిలి యిచ్చువాఁడు, నెఱదాత; ప్రియవాది, మనోజ్ఞముగా మాటలాడువాఁడు.
వదావదుఁడు. సం. విణ. వక్త.
వదావళి. వదరుఁబోతుతనము, ప్రలాపము.
వది. ఏనుఁగు మొదలగువానిని బట్టుటకై త్రవ్వఁబడి ముండ్లు మొదలగు వానిచే కప్పఁబడిన పల్లము. సం. కృష్ణపక్షము.
వదిన. వా. వదినె.
వదినియ. వదినె.
వదినె. అన్న భార్య; భార్యకక్క; జ్యేష్ఠ మాతులేయి, తనకంటె పెద్దదగు మేనత్త మేనమామల కూఁతురు.
వదియ. తృణతతి విశేషము.
వదుఁడు. సం. విణ. వక్త.
వదులు. అ. క్రి. సడలు; బిగువుతప్పు. విణ. బిగుతు కానిది.
వదులుడి. బీటిక.
వదె. తృణతతి విశేషము.
వద్ద. రూ. ఒద్ద, దగ్గఱ.
వద్ధి. బస్తాంత్రి†?
వద్దు. వలదు, అక్కఱలేదనుట.
వధము. సం. చంపుట, మారణము.
వధించు. సం. స. క్రి. చంపు.
వధువు. సం. ఆఁడుది; భార్య; క్రొత్త పెండ్లికూఁతురు; కోడలు; గంట్లకచోరము†; పిక్క†; ప్రేంకణము†; మామెన†
వధూటి. సం. స్త్రీ; కన్యక; కోడలు.
వధూనిక. సం. వదినె?
వధ్యుఁడు. సం. విణ. చంపఁదగినవాఁడు.
వనచరము. సం. వానరము.
వనచరుఁడు. కిరాతుఁడు, బోయ.
వనజ. సం. పిల్లపెసర†.
వనజము. సం. పద్మము; ఏనుఁగు; ముస్తె†
వనట. వనరుట; వగపు; మనోవ్యథ; శోకము; పరిదేవనము.
వనతిక్తిక. సం. చిరుబొద్ది†; కరక†.
వనదీపము. సం. అడవి సంపెఁగ†.
వనధి. సం. జలధి, కడలి.
వనపు. పరిదేవనము; వనరుట.
వనప్రియము. సం. కోయిల; చార†?
వనబంధము. సం. చెఱువు.
వనమాల. సం. ఆకులు పువ్వులు చేర్చి కట్టిన తోమాలె; విష్ణువు ధరించుమాలిక.
వనమాలి. సం. విష్ణువు.
వనము. సం. అడవి; తోఁట, తోఁపు; జలము; కొండయూట, సెలయేఱు; ప్రవాసము; గృహము; సమూహము.
వనరు. అ. క్రి. శోకించు; దీనాలాపములాడు; విలపించు.
వనశృంగాటము. సం. పల్లేరు†.
వనస్పతి. సం. పూవకయె కాచెడుచెట్టు; చెట్టు. [జంతువు.
వనాటము. సం. వనమునందు చరించునట్టి
వనాయుజము. సం. అరబ్బీదేశపుగుఱ్ఱము.
వని. సం. అడవి; వానప్రస్థుఁడు.
వనిక. సం. అడవి; తోఁపు.
వనిత. సం. స్త్రీ; మిక్కిలి యనురాగముగల స్త్రీ; నల్లదంటెఁ†.
వనితము. సం. విణ. యాచింపఁబడినది; సేవింపఁబడినది.
వనీపకుఁడు. సం. విణ. యాచకుఁడు.
వనేచరము. సం. వనచరమృగము.
వనౌకసము. సం. వానరము. రూ. వనౌకము
వన్నియ. తెలుపు మొదలగువర్ణము; వర్ణన; బంగారు యొక్క మేలిమి; వర్ణపుపూఁత; ప్రత్యయము; అలంకారము; అందము; కాంతి; వర్ణపుచీర; ప్రసిద్ధి; విధము; అంకెవన్నె.
వన్నియలపిట్ట. చకోరము.
వన్నె. వన్నియ; వదిన. [సౌందర్యవతి;
వన్నెకత్తియ. వన్నెకత్తె, విలాసవతి;
వన్నెకత్తె. సొగసుకత్తె, శృంగార చేష్టలుగల స్త్రీ, వన్నెకత్తియ.
వన్నెకాఁడు. విణ. సొగసుకాఁడు;

సౌందర్యవంతుఁడు; విలాసవంతుఁడు, శృంగారవంతుఁడు.
వన్నెచీర. చిత్రవర్ణపు వస్త్రము.
వన్నెచెట్టు. వర్ణపుష్పము†.
వన్నెపులుఁగు. చకోరపక్షి.
వన్నెపూలు. బ. శాలిధాన్యవిశేషము.
వన్నెయొల్లె. చిత్రవర్ణముగల చిన్నచీరె.
వన్నెలపులుఁగు. జీవంజీవము, చకోరము.
వన్నెలాఁడి. విణ. విలాసవతి, శృంగారచేష్టలుగలస్త్రీ, సొగసుకత్తె.
వన్నెలాఁడు. విణ. విలాసవంతుఁడు, శృంగారవంతుఁడు, సొగసుకాఁడు.
వన్నెవెదురు. వృత్తపత్రము, ఒకదినుసు కూరాకు†.
వన్య. సం. వనసమూహము.
వన్యము. సం. విణ. అడవియందుఁ బుట్టినది.
వప సం. కడుపులో బొడ్డుక్రింద నుండెడి యొల్లిపొరవంటి క్రొవ్వు; బెజ్జము; శరీరమునందలి చమురువంటి పదార్థము.
వపనము. సం. క్షౌరము, గొరుగుట; విత్తుట; నేయుట. [రూ. వపుస్సు.
వపువు. సం. శరీరము; చక్క నిరూపము.
వప్త. సం తండ్రి. విణ. విత్తెడువాఁడు.
వప్రక్రీడ. సం. ఏనుఁగు మొదలగునవి కొమ్ములు మొదలగువానితో ఏటిదరులు మొదలగువానిని కోరాడెడియాట (పెల్లగించుట).
వప్రము. సం. సీసము; కోట; పుట్టకోట; వరిమడి; తీరము; కొండనెత్తము, పర్వత సానువుల క్రిందిభూమి.
వమథువు. సం ఏనుఁగుతొండపుతుంపురు; వమనము.
వమనము. సం. వాంతి; పీడనము.
వమి. సం. వమనము; అగ్ని.
వమ్ము. నాశము. విణ. వ్యర్థము.
వమ్మువోవు. అ. క్రి. వ్యర్థమగు; నష్టమగు.
వమ్రిక. సం. చెదలు. రూ. వమ్రము.
వయనము. సం. నేఁత, నేయుట.
వయసు. ఈడు, ప్రాయము. రూ. వయస్సు.
వయసుది. ఈడు వచ్చినది.
వయసువాఁడు. ఈడు వచ్చినవాఁడు.
వయస్థ. సం. ఉసిరిక†; కరక†; కాకోల్లి†; చిట్టెలక†; తిప్పతీఁగ†; బూరుగు†; సోమెద†. విణ. ప్రాయపుది.
వయస్థుఁడు. సం. యువకుఁడు.
వయస్య. సం. చెలికత్తె.
వయస్యుఁడు. సం. స్నేహితుఁడు.
వయస్సు. సం. ఈడు, ప్రాయము, యౌవనము; పక్షి.
వయాళి. విహారము; రథము.?
వయించు. స. క్రి. విక్షేపించు, పడవేయు, గిరాటువేయు; కలుకు. రూ. వగుంచు.
వయిజాతి ఒకానొక తెగ కోమటిజాతి.
వయిజాతిదొండ. ఊసరవెల్లి.
వయినము. తపిసీలు, వివరము; ఉపాయము; కారణము; క్రమము; విధము.
వయి. ప్రక్క; ఒడుపు, లక్ష్యము; ఉపాయము.
వయిపుకాఁడు. ఉపాయశాలి.
వయిమాలము. అధికము.
వయిరవులు, వయిరాలు } కట్టెనిప్పు.
వయిల. శ్యేనభేదము.
వయిసిక. కపటము.
వయిళము. క్రి. విణ. శీఘ్రముగ.
వయ్యంది. కంపటి.
వయ్యము. విణ. వ్యర్థము.
వయ్యాళి. రూ. వయాళి.
వర. సస్యవిశేషము. బ. ధాన్యవిశేషము.
వరండకము. సం. నోరుఊడికెడిరోగము.?
వరండము. సం. మొటిమ; నడిమితిన్నె; గడ్డికుప్ప; సమూహము.
వరఁకు. చిక్క. రూ. వరము.
వరఁగలించు. అ. క్రి. ప్రకాశించు.
వరఁత రూ. వ్రంత.
వరకము. సం. వరగలు. గ్రా. కఠినముగా పనిచేయించు శిక్ష.?
వరకు. బంగారు మొదలగువాని రేకు; మెలాము;? వలపు;? వంచన.?
వరగ. వరకము, పెద్దారుగ పైరు. బ. ఆ ధాన్యము.
వరగలించు. అ. క్రి. ప్రకాశించు.?
వరజే. చాలు.

వరట. పేడయెండినచెక్క. సం. ఆఁడు హంస; కణుఁదురీఁగ.
వరటము. సం. హంసము. [ఒక యేఱు.
వరణ. సం. కాశికి నుత్తరపు టెల్లయైన
వరణము. సం. వరించుట; వేష్టనము; బేలకట్టు; కోట; ప్రహరి; వంతెన; ఉలిమిరి † [ఏనుఁగు నడిమి తోలుంమోకు.
వరత్ర. సం. తోలు వారు; దూష్య,
వరదుఁడు. సం. విణ. మిక్కిలి అనుగ్రహము గలవాఁడు; వరమిచ్చువాఁడు.
వరను. రూ. వరఁకు.
వరపట. ద్ర. బహిరర్థకము.
వరబడి. కలవు.
వరము. సం. కుంకుమపూవు; అభీష్టము; శ్రేష్ఠము; దేవతాదుల వలన పొందఁబడు కోరిక; వరించుట; నవ నిధులలో ఒకటి. అవ్య. ఇంచుక ప్రియమైనది; మంచిదనుట. [కేర్పఱచిన కాలువ.
వరవ. చెఱువునకు నీళ్లు రా బట్టు ట
వరవర్ణిని. సం. పురుషుని మెప్పు వడసిన స్త్రీ; ఉత్తమ స్త్రీ; పసుపు; గోరోజనము; లక్క; ప్రేంకణము †
వరవుడము. దాస్యము.
వరవుడు. దాసి; సేవకుఁడు.
వరహా. వరాహముద్రగల ఒక బంగారు నాణెము. [గల సువర్ణముద్ర.
వరా. వరహా, తొమ్మిదిచిన్నముల యెత్తు
వరాంగకము. సం. లవంగపు పట్ట.
వరాంగము. సం. శిరస్సు; ఆఁడు మగల గుఱి; లవంగపు పట్ట; ఏనుఁగు. [త్రాడు
వరాటకము. సం. గవ్వ; తామరదుద్దు;
వరాటకుఁడు. సం. విణ. అనామధేయుఁడు.
వరాటిక. సం. గవ్వ.
వరాణసి. సం. కాశీపట్టణము,
వరారోహ. సం. ఉత్తమ స్త్రీ; గొప్ప పిఱుఁదులుంగల స్త్రీ.
వరారోహుఁడు. సం. మావటివాఁడు.
వరాశి. సం. ముతుకబట్ట. [వాఁడు.
వరాసి. సం. ముతుకబట్ట; కత్తిఁ బట్టిన
వరాహము. సం. అడవి పంది; వరహా; ఒక కొండ; వరాహుఁడు. [హము.
వరాహుఁడు. సం. విష్ణువు, ఆదివరా

వరి. సస్యవిశేషము; శాలిధాన్యము. సం. పిల్లపీచర†.
వరించు. సం. స. క్రి. కోరు.
వరిక. పక్షి విశేషము.
వరికూడు. శాల్యన్నము.
వరిగ వా. వరగ.
వరిగలు. వా. వరగలు.
వరిగుండము నీటిబూతము.?
వరిగెలు. వా. వరకములు.
వరిబీజము. ఒక వృషణవ్యాధి.
వరియ. తోత్రము.
వరియించు. రూ. వరించు.
వరివసితుఁడు. సం. విణ. ఉపాసింపఁబడినవాఁడు; సేవింపఁబడిన గుర్వు దేవత మొ.
వరివస్య. సం. ఉపాసన; సేవ; పూజ.
వరివస్యితుఁడు. సం. విణ. వరివసితుఁడు.
వరిష్ఠము. సం. మిరియము; రాగి; తీతువు. విణ. మిక్కిలి విశాలము; మిక్కిలి శ్రేష్ఠమైనది. [మిక్కిలి గొప్పవాఁడు.
వరిష్ఠుఁడు. సం. మిక్కిలి శ్రేష్ఠుఁడు;
వరీయస్సు. సం. ఒక యోగము.
వరీయుఁడు. సం. విణ. మిక్కిలి శ్రేష్ఠుఁడు; మిక్కిలి పడుచువాఁడు.
వరుఁడు. సం. పెండ్లికొడుకు; మగఁడు; అల్లుఁడు; అధిపతి. విణ. శ్రేష్ఠుఁడు.
వరుగు. ఎండవేసిన కాయ దినుసు; గృధ్రవిశేషము. [జేఁప.
వరుగుఁజేప. శుష్కమత్స్యము, ఉప్పుఁ
వరుజా. మడిగనిమ, మళ్ళకుఁగట్టిన గట్టు.
వరుణపాశము. సం. సెగఁడు.?
వరుణము. సం. ఉలిమిరి†; జలము; దినము యొక్క పదునాలవ భాగము.
వరుణాత్మజ. సం. కల్లు.
వరుణుఁడు. సం. ఒక దిక్పాలకుఁడు.
వరుమానము. వచ్చుఁబడి, రాబడి.
వరుస. పంక్తి; పరంపర; వంతు; క్రమము; బంధుత్వక్రమము; సామ్యము; విధము.
వరుసమొగ్గరము. దండవ్యూహము.
వరూథము. సం. కవచము; గృహము; చక్రరంధ్రములఁజొప్పించు నెమ్ములు;? రథముపైకప్పెడివ్యాఘ్రచర్మాదికము.?

వరూధిని. సం. సేన; ఒకయచ్చర.
వరేణ్యుఁడు. సం. విణ. ముఖ్యుఁడు,
 శ్రేష్ఠుఁడు. [తీయసమూహము, తెగ.
వర్గము. సం. వర్గు, అధ్యాయము; సజా
వర్గావర్గి. మార్పు.?
వర్గించు. సం. స. క్రి. వర్గుచేయు.
వర్గు. పేరువరుసగావ్రాసినలెక్క; వర్గువు.
వర్గువు. వర్గము, గ్రంథభాగము.
వర్చస్కము. సం. మలము.
వర్చస్సు. సం. తేజము; మంచిరూపము;
 మలము; శుక్లము. [వధము.
వర్జనము. సం. విడుపు; ఈవి; హింస;
వర్జనీయము. సం. విణ. వర్జింపఁదగినది.
వర్జించు. సం. స. క్రి. విడుచు.
వర్జితము. సం. విణ. విడిచిపెట్టఁబడ్డది;
 తీసివేయఁబడ్డది.
వర్జ్యము. సం. విడువఁదగిన దోషయుక్త
 కాలము. విణ. విడువఁదగినది.
వర్ణకము. సం. మైపూఁత; పూఁత; చంద
 నము; నీలిరంగుమెం. (ఆంధ్రవ్యాకరణ
 మునందు) ప్రత్యయము.
వర్ణకుఁడు. సం. బట్టువాఁడు.
వర్ణకారిక. సం. ముగ్గు.
వర్ణనము. సం. పొగడ్త, స్తోత్రము.
వర్ణపుష్పము. సం. పెద్దగోరింట†; వన్నె
 పూలు, ఒకధాన్యము; వన్నెచెట్టు.
వర్ణము. సం. అక్షరము; పూఁత; బంగారు;
 రూపము; మైపూఁత: భేదము; శుక్లాది;
 (ఇవి ఐదు—శుక్లము, కృష్ణము, సీతము,
 హరితము, రక్తము.) బ్రాహ్మణాది;
 (బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రజా
 తులు) స్తుతి; యశము; గుణము; ఏనుఁగు
 మీఁద ఫలించెడు చిత్రకంబళము.
వర్ణరూపిణి. సం. సరస్వతీదేవి.
వర్ణాటుఁడు. సం. గాయకుఁడు; చిత్తరువు
 వ్రాయువాఁడు; స్త్రీవలన జీవనము
 చేయువాఁడు.
వర్ణి. సం. బ్రహ్మచారి; చిత్తరువువ్రాయు
 వాఁడు; వ్రాఁతకాఁడు.
వర్ణించు. సం. స. క్రి. స్తుతించు.
వర్ణిక. సం. తెలుపు మొదలగువన్నె;
 బంగారువన్నె.
వర్ణితము. సం. విణ. స్తుతింపఁబడినది.
వర్ణిలింగి. సం. వేషధారి. [గుజ్జుపుదెక్క.
వర్తకము. బేరము. సం. వెలిచెపిట్ట;
వర్తకుఁడు. బేరము చేయువాఁడు.
వర్తనము. సం. ప్రవర్తనము, నడవడి;
 జీవనము.
వర్త్మని. సం. త్రోవ; కాలిజాడ; కదురు
 బిల్ల; కనుఱెప్ప. [వర్తించువాఁడు.
వర్త్మనుఁడు. సం. విణ. పొట్టివాఁడు;
వర్తమానము. వృత్తాంతము. సం. విణ.
 జరగుచున్నది; నడచుచున్నది.
వర్తి. సం. వృత్తి; దీపపువత్తి; దీపము;
 పరిమళద్రవ్యాదులు కూర్చి నూఱినగంధ
 పుబిల్ల; అత్తరుబిల్ల; పూసెడు వాగర;
 కాటుక; వరుస. విణ. వర్తించువాఁడు.
వర్తించు. సం. అ. క్రి. ప్రవర్తించు, ఉండు.
వర్తిక సం. ఏట్రింత; జొట్టుపు†.
వర్తికము. సం. మూనవల్లంకి.
వర్తిధూపము. సం. ఊఁదువత్తి.
వర్తిలు(ల్లు). రూ. వర్తించు.
వర్తిష్ణువు(ఁడు). సం. విణ. వర్తించువాఁడు.
వర్తులము. సం. విణ. గుండ్రనిది.
వర్తులాభరణము. సం. బవిర.
వర్త్మము. సం. త్రోవ; కనుఱెప్ప
వర్ది. వర్తమానము; ఆజ్ఞ.
వర్ధకి. సం. వడ్లంగి, వడ్లవాఁడు.
వర్ధనము. సం. పెరుఁగుట; పాలకుడు.
 విణ. పెరుఁగునది.
వర్ధమానకము. సం. మూఁకుడు.
వర్ధమానము. సం. ఆముదపుఁజెట్టు;
 మూఁకుడు; రాజగృహరచనావిశేషము;
 అభినయహస్తవిశేషము. విణ. వృద్ధి
 నొందుచున్నది.
వర్ధమానుఁడు. సం. విష్ణువు. విణ వృద్ధి
 నొందుచున్నవాఁడు.
వర్ధించు. క్రే. పెంచు.
వర్ధితము. సం. విణ. వృద్ధినొందింపఁ
 బడినది, పెంచఁబడినది; నఱకఁబడినది;
 నిండినది.
వర్ధిల్లు. సం. అ. క్రి. పెరుఁగు. [గాఁడు.
వర్ధిష్ణువు(ఁడు). సం. విణ. వృద్ధినొందు
వర్ధ్రి. సం. తోలువారు.

వర్మము సం. కవచము. [వాఁడు.
వర్మితుఁడు. సం. విణ. కవచము తొడిగిన
వర్మువు. సం. కవచము. [ముఖ్యురాలు.
వర్య. సం. తనంతటమగనివరించునట్టి స్త్రీ;
వర్యుఁడు. సం. విణ. శ్రేష్ఠుఁడు.
వర్ష. సం. బ. వానకాలము.
వర్షణము. సం. వాన కురియుట.
వర్షము. సం. వాన; సంవత్సరము; మేఘము; జంబూద్వీపము; భారతాది; (ఇవి తొమ్మిది—భారతము, రమ్యకము, కింపురుషము, హరి, భద్రాశ్వము, కురువు, హిరణ్మయము, ఇలావృతము, కేతుమాలము.) [కావలివాఁడు.
వర్షవరుఁడు. సం. కొజ్జా; అంతఃపురపు
వర్షాభువు. సం. ఆఁడుకప్ప; ఎఱ్ఱ; గలిజేరు; కప్ప; పట్టుపురుగు. విణ. వర్షాకాలమునందుఁ బుట్టినది.
వర్షాభ్వి. సం. ఆఁడుకప్ప.
వర్షాశనము. వా. రాజులు మొదలగువారు విద్వాంసులు మొదలగువారికి సంవత్సరమున కొకతూరి యిచ్చెడు సంవత్సరగ్రాసద్రవ్యము.
వర్షించు. సం. అ. క్రి. వాన కురియు.
వర్షీయుఁడు. సం. విణ. మిక్కిలి వృద్ధు.
వర్షోపలము. సం. వాన కురియునప్పుడు పడెడి రాయి. వడగల్లు.
వర్ష్మము. సం. శరీరము; మిక్కిలి చక్కని రూపము; కొలత.
వఱ. మేర.
వఱకు. అవ్య. దనుక, దాఁక, పర్యంతము.
వఱగొడ్డము. వంకరమాట.
వఱడు. గంధిలము, పెద్దజాతినక్క; నక్క.
వఱద. ప్రవాహము; అతిశయించిన ప్రవాహము.
వఱదగుడి. ఘూర్యాదిపరివేషము.
వఱదవాఱు. అ. క్రి. ప్రవహించు; వఱదలువాఱు.
వఱపు. వానలేమి, అవగ్రహము.
వఱల. అప. వృద్ధతపస్వి.
వఱలు. అ. క్రి. ఒప్పు; ప్రకాశించు; ప్రవర్తిల్లు; వ్యాపించు.
వఱువట్లు. బ. మిక్కిలి రొండుటలు.
వఱువట్లుగొను. అ. క్రి. మిక్కిలిరొండు.
వఱువాత. క్రి. ప్రాతఃకాలమున.
వఱువాయి. ప్రభాతకాలము.
వఱ్ఱియ. బీఁటిక.
వఱ్ఱు. ప్రవాహము; అతిశయము; హాలాది?
వఱ్ఱె. బీఁటిక.
వఱ్ఱొడ్డు. అ. క్రి. ప్రవహించు.
వల. ఆనాయము, మత్స్యములను పట్టెడు జాలము; మృగములు పక్షులు మొదలగు వానిని బట్టెడు వాగుర; కామము. విణ. వలను శబ్దముయొక్క లుప్తరూపము.
వలందావారు. డచ్చివారు.
వలందుబాజే. వలందావారి సైన్యము.
వలఁకు—వు. దిక్కు. [అనుకూలము.
వలఁతి. స్త్రీ. విణ. నేర్పరి; అధీనము;
వలకట్టు. స. క్రి. అనుకూలపఱచు.
వలకడ. దక్షిణదిక్కు.
వలకాఁక. మన్మథ తాపము.
వలకాఁడు. కాముకుఁడు. [పించునది.
వలకారి. విణ. వలపించు వాఁడు; వల
వలకోట. ప్రేమయను దుర్గము.
వలక్షము. సం. తెలుపు. విణ. తెల్లనిది.
వలగొను. స. క్రి. ప్రదక్షిణించు, చుట్టివచ్చు
వలగ్నము. సం. దేహముయొక్క మధ్యము, నడుము. [మోహించు.
వలచు. అ. క్రి. పరిమళించు. స. క్రి. కోరు;
వలచుట్టు. వలగొనుట. స. క్రి. వలగొను.
వలజ. సం. చక్కని రూపుగల స్త్రీ; భూమి. [పురద్వారము; యుద్ధము.
వలజము సం. వరిమడి; పైరు; ధాన్యరాశి;
వలతి. స్థానము. [వద్దు; కూడదనుట.
వలను. అధిక్యము. విణ. అధికము. అవ్య.
వలదొర. రతిపతి.
వలన. అప. పంచమీ విభక్తియందువచ్చెడు ఒక ప్రత్యయము. (నీ వలన, నా వలన అని.) [గుడు; ఇట్టి.
వలనము. సం. కంటిపాప తిరుగుడు; తిరు
వలను. దిక్కు; వైపు; పార్శ్వము; ఉపాయము; నేర్పు; ప్రదక్షిణము; శకునము; విధము; ఒప్పిదము; శుచిత్వము; అనుకూల్యము. విణ. కుడి; దక్షిణము; యుక్తము.

వలపక్షము. మి. పక్షపాతము.
వలపల. దక్షిణ భాగము, కుడివైపు.
వలపలగిలుక. రేఫముయొక్క రూపాంతర నామము.
వలపలించే. స. క్రి. ప్రదక్షిణించు.
వలపు. పరిమళము; ఇచ్చ; గంధము; మోహము; యువక యువతీ సంభృత ప్రేమ.
వలపుకత్తియ } విణ. కాముకి.
వలపుకత్తె
వలపుకాఁడు. విణ. కాముకుఁడు.
వలపుకీలు. నీవీబంధము.
వలపుమోపరి. గంధవహుఁడు, వాయువు.
వలపురాయఁడు. రతిపతి, మన్మథుఁడు.
వలపురుగు. తేలు.
వలబిటాకు. విటంకము.
వలభి. సం. మున్జూరు, కొణిగ; చంద్రశాల.
వలమానము. సం. విణ. తిరుగుచున్నది; చలించుచున్నది.
వలము. విస్తారము; స్థౌల్యము. విణ. స్థూలము; విస్తృతము.
వలమురి. దక్షిణావర్త శంఖము; విష్ణుశంఖము.
వలమురితాలుపు. శంఖి, విష్ణువు.
వలయము. సం. (చేతి) కడియము; కంఠమాల; చుట్టు.
వలయితము. సం. విణ. చుట్టఁబడినది.
వలయు. అ. క్రి. ఇష్టమగు; ఆవశ్యకమగు; యుక్తమగు; విహితమగు; వలయితమగు.
వలయును. క్రి. వలెను.
వలరాచేపని. గ్రామ్యధర్మము, రతి.
వలరాజు. రతిపతి, మన్మథుఁడు.
వలరాజుతల్లి. లక్ష్మీదేవి.
వలరాజుసూడు. శివుఁడు.
వలఱేఁడు. కైవర్తుఁడు; మన్మథుఁడు.
వలవంత. మన్మథవ్యథ.
వలవదు. వలదు, వద్దు.
వలవల. ఏడ్చుటయందు వ్రాలుటయందు అగు ధ్వన్యనుకరణము.
వలవలన. విణ. వదిలినది.
వలవాఁడు. వాగురికుఁడు.
వలస. రాజోపద్రవాదులచే దేశమువిడిచి పరదేశమునకుఁబోవుట.
వలసతీయు. అ. క్రి. వలస పోవు.
వలసిపోవు. అ. క్రి. రాజోపద్రవాదులచే దేశమువిడిచి పరదేశమునకుఁబోవు.
వలసినది. విణ. ప్రియము, అపేక్షితము.
వలాహకము. సం. మేఘము; శ్రీకృష్ణుని రథపుగుఱ్ఱములలో నొకటి; పర్వతము.
వలాహకుఁడు. సం. రాక్షసుఁడు.?
వలి. శైత్యము; కంపము. విణ. శీతము. సం. కడుపుమీఁదిముడుత; ముడుత.
వలికి. బెగ్గురుపక్షి; శ్మశానము.?
వలికిరి. శబ్దము.?
వలిగొను. అ. క్రి. చలిగొను; వణఁకు.
వలితండ్రి. ఆకాశము. [నము నొందినది.
వలితము. సం. విణ. చుట్టఁబడినది; చలనము నొందినది.
వలితిప్ప. హిమవత్పర్వతము.
వలినుఁడు. సం. విణ. వళులుగలవాఁడు.
వలిపని. శైత్యోపచారము.
వలిపము. మడుఁగువస్త్రము; సన్నని తెల్లవస్త్రము. విణ. పరిశుద్ధమైనది; తెల్లనిది.
వలిపిరి. చలి; వడఁకు.
వలిపిరిగొట్టు. విణ. వడఁకువాఁడు.
వలిపె. సూక్ష్మవస్త్రము.
వలిపెము. వలిపము.
వలిభము. సం. ఆఁడుదానికొకకుచ్చెళ్లు.?
వలిభుఁడు. సం. విణ. వళులుగలవాఁడు
వలిగట్టు. శీతనగము, మంచుకొండ. రూ. వలిగుబ్బలి, వలిగొండ, వలిమలము.
వలిమలకూఁతురు. హైమవతి, పార్వతి.
వలిమలల్లుఁడు. గిరిశుఁడు, శివుఁడు.
వలిమిడి. పశువులకు కాలి మడమల యందుఁగలిగెడి రోగవిశేషము.
వలిమొలక. వాయుపుత్రుఁడు
వలియు. అ. క్రి సన్నగిల్లు; డయ్యు.
వలిరుఁడు. సం. మెల్లకంటివాఁడు.
వలివెలుఁగు. హిమాంశువు, చంద్రుఁడు. రూ. వలివెల్గు.
వలీకము. సం. ఇంటిచూరు.
వలీముఖము. సం. కోఁతి.
వలుఁద. విణ. స్థూలము; పృథువు.
వలుకు. వళుకు.

వలువ—ము } సన్న వస్త్రము; వస్త్రము.
వలువు }
వలె. ప్ర. 'వలయును' అను దాని కాదేశము; ఉపమావాచకము. (చంద్రుని వలెనని).
వలెవాటు. వల్లెవాటు. [తునియ.
వల్కము సం. తోఁట, చెట్టు పట్ట;
వల్కలము. సం. నార, చెట్టుపైతోఁట.
వల్గ. సం. వాగె, గుఱ్ఱపు నోట కళ్లెము తగిలించెడి పగ్గము.
వల్గనము } సం. వేగముగా విడువఁబడి మీఁదికిఁ గాళ్లు కదలించుచు పోవెడి అశ్వధారా విశేషము.
వల్గితము }
వల్గువు. సం. చెప్ప వెంట్రుక; మేఁ పోతు. విశే. కోమలము; సుందరము.
వల్చు. అ. క్రి. స. క్రి. వలచు.
వల్ద. విశే. స్థూలము; పృథువు.
వల్ప్రము. విశే. పరిశుద్ధము; తెల్లనిది.
వల్పు. వలపు.
వల్మీకపాదుఁడు. సం. పుట్టకాలివాఁడు.
వల్మీకము. సం. పుట్ట. రూ. వల్మీకము.
వల్మీకశింబి. సం. పుటతమ్మి†.
వల్ల. విశే. అనుకూలము. ప్ర. వలన.
వల్లకాఁడు. ఒలికి, శ్మశానము.
వల్లకి. సం. వీణె.
వల్లడి. అకారణమైన ఆపద; గొల్ల.
వల్లడికాఁడు. అకారణమైన ఆపద చేయువాఁడు; చోరుఁడు.
వల్లభ. సం. ప్రియురాలు. [ప్రియము.
వల్లభము. సం. మేలిజాతి గుఱ్ఱము. విశే.
వల్లభుఁడు. సం. విశే. ప్రియుఁడు, మగఁడు; అధిపతి.
వల్లము. వరహాల జాలె.
వల్లరని. ఒకానొక చెట్టు.
వల్లరి. సం. చిగిరించిన లేఁతకొమ్మ; తీఁగ; పూగుత్తి; చిగురుగుత్తి.
వల్లవుఁడు. సం. గొల్లవాఁడు; వంటవాఁడు; భీముఁడు.
వల్లి. సం. తీఁగె. [వేయించు.
వల్లించు. స. క్రి. వల్లెవేయు. ప్రే. వల్లె
వల్లిక. సం. తీఁగె. [యము.
వల్లిగము. బొక్కెనమీఁది యినుప వల
వల్లియ. వల్లెత్రాడు.
వల్లిసూరణము. సం. పుల్లబచ్చలి†?
వల్లువము. వరహాల జాలె.
వల్లూరము సం. ఎండినచేఁప; పంది నంజుడు; ఎండిన మాంసము.
వల్లె. పశుబంధన రజ్జువు; వరుణుని పాశము చెప్పినది మరల మరలఁ జెప్పుట. అవ్య. అంగీకారార్థకము; మంచిదనుట.
వల్లెతాలుపు. పాశి, వరుణుఁడు. రూ. వల్లెత్రాడు దాల్పు. [పట్టుకొనెడి త్రాడు.
వల్లెత్రాడు. వల్లె; ఎద్దు కొమ్ములకు వేసి
వల్లెవాటు. త్రాకువలె నుండునట్లు మడతపెట్టి వైచుకొన్న ఉత్తరీయము.
వల్వ—ము వస్త్రము; సన్న వస్త్రము.
వల్వంత. దుఃఖము.
వశ. సం. ఆఁడేనుఁగు; గొడ్డుటావు; గొడ్డురాలు; కూఁతురు; పెండ్లాము; స్త్రీ. విశే. లోఁకువైనది.
వశంవదుఁడు. సం. విశే. మధురముగా మాటలాడువాఁడు; నీకు వశుఁడనయితిననెడివాఁడు.
వశక్రియ. సం. వశీకరణము; వశము చేసికొనెడు మంత్రతంత్రాది కర్మము.
వశము. సం. లోఁకువ; ఇచ్ఛ; ప్రభుత్వము. విశే. లోఁకువైనది.
వశవర్తి. సం. విశే. విధేయుఁడు.
వశి. సం. విశే. వ్యసనములు లేనివాఁడు; జయము గలవాఁడు.
వశికము. సం. విశే. శూన్యము.
వశి(సి)రము. సం. ఇందుప్పు; ఉత్తరేను;† గజపిప్పలి†.
వశిష్ఠుఁడు. సం. బ్రహ్మర్షి విశేషము.
వశీకరణము. సం. వశక్రియ; తత్సాధనమయిన మణి మంత్రాదులు. [జేయు.
వశీకరించు. సం. స. క్రి. లోఁకువగాఁ
వశ్యము. సం. అధీనము చేసికొనుట. విశే. లోఁకువైనది. [లోఁబడినవాఁడు.
వశ్యుఁడు. సం. అనుకూలమయినవాఁడు.
వశ్యౌషధము. సం. పెట్టుమందు.
వషట్కృతము. సం. విశే. హోమము చేయఁబడినది. (హవిస్సు.)

వస. వచ, ఒక మందు దినుసు. సం. వచ.
వసంతకడిమి. భూతీకదంబము†.
వసంతఘోషి. సం. కోవెల.
వసంతద్రుమము. సం. మామిడి†.
వసంతము. పసుపు సున్నము కలిపిన ఎఱ్ఱనినీళ్లు. సం. వసంతఋతువు; వసంతరాగము.
వసంతుఁడు. సం. కుసుమాకరుఁడు, వసంతఋతువు, మన్మథుని చెలికాఁడు.
వసతి. సౌఖ్యము, విణ. సౌఖ్యకరము.
వసం. ఇల్లు; ఉనికి; రేయి; శిబిరము.
వసనము. సం. ఉనికి; బట్ట.
వసనాభి. గ్రా. వత్సనాభము.
వసపడు, వసపోవు } అ. క్రి. వశపడు.
వసమగు. అ. క్రి. నిర్వహించు, అలయు
వసము వశము, అధీనత. విణ. అధీనము; వశ్యము.
వసల(లా). కొయ్యను అదను చేసెడు కొయ్య. [ప్రక్కనుండెడు కట్టడము
వసార(రా). పంచాది, కూటమునకు
వసి. మిక్కిలి; కొనచెక్కు, నకొయ్య; మీఁదు మొనగా చాటిన మేకు; ఇల్లు. సం. ఉనికి.
వసించు. సం. అ. క్రి. ఉండు, వాసము చేయు. రూ. వసియించు.
వసిగొను. అ. క్రి. పూను, ఉత్సహించు.
వసిగోడ. లోపల వసికొయ్యలుం చేసి పెట్టిన గోడ.
వసివాళ్లు. బ. మిక్కిలి వాడుటలు.
వసిష్ఠుఁడు. సం. బ్రహ్మమానసపుత్రుఁడు, ఒక బ్రహ్మర్షి.
వసుంధర. సం. భూమి. [ఒక పువ్వము†.
వసుకము. సం. చవుటుప్పు; జిల్లేడు†;
వసుగర్భ. సం. భూమి.
వసుదేవుఁడు. సం. శ్రీకృష్ణుని తండ్రి
వసుధ, వసుమతి } సం. భూమి, రత్నగర్భ.
వసులపొంతలు. ఒకదినుసు పందెపుపుంజు.
వసులు. అ. క్రి. తొలఁగు.
వసువు. సం. బంగారు; రత్నము; ధనము; ఒక పువ్వము†; పలుపు; కిరణము; అగ్ని; వసురాజు; గణదేవతా విశేషము. (అష్టవసువులు— అపుఁడు; ధ్రువుఁడు; సోముఁడు; అధ్వరుఁడు, అనిలుఁడు, ప్రత్యూషుఁడు, అనలుఁడు, ప్రభాసుఁడు. విణ. మధురము.
వసూలు. హిం. పోగుచేయుట.
వస్తాదు. హిం. ఉపాధ్యాయుఁడు; యజమానుఁడు; కసరత్తునేర్పువాఁడు.
వస్తి. సం. బట్టమొదటిబద్దె; పొత్తికడుపు
వస్తువు. సం. బండము, దినుసు, సరకు, పదార్థము; కౌళాచారమునందు లార్చనయందు మధువు.
వస్త్యము. సం. ఇల్లు.
వస్త్రము. సం. వలువ, బట్ట. [జీతము; వెల.
వస్నము. సం. వస్త్రము; ధనము; కూలి;
వస్నస. సం. సన్నపునరము. [ఒకపదవ.
వహనము. సం. మోయుట, వహించుట;
వహము. సం. ఎద్దుమూఁపురము; వాహనము. నుపయుక్తము.
వహవా. వహ్వా, ఆశ్చర్యసంతోషార్థములు
వహి. దస్తరము, లెక్కపుస్తకము; పుస్తకము; విధము. సం. ఎండ్రి. విణ. రౌతు.
వహించు. సం. స. క్రి. తాల్చు; భరించు, రూ. వహియించు.
వహేలనము. సం. తెగడిక, అవహేళనము.
వహ్ని. సం. అగ్ని; చిత్రమూలము†.
వహ్నిశిఖము. సం. కుంకుమపువ్వు; కుసుమపువ్వు.
వాహ్నిసంజ్ఞకము. సం. చిత్రమూలము†.
వళక్షము. సం. తెలుపు. విణ. తెల్లనిది.
వళవు విధము; ఉపాయము.
వళాగ్రము. సం. క్రముకభేదము.?
వళావళి. కుతూహలము; విజృంభణము.
వళావళికాఁడు. వ్యర్థభాషణుఁడు.
వళావళికాయ. కుతూహలముతో నుండువాఁడు.
వళి. వడి. సం. కడుపుమీఁది ముడుత; ముడుత; యత్యక్షరము.?
వళిరుఁడు సం విణ మెల్లకంటివాఁడు.
వళుకు. తగవు; అపదేశము.

# వా

వా. నోరు; ఖడ్గధార.
వాఃకిటి. సం. నీరుపంది.
వాఃపతి. సం. వరుణుఁడు.
వాంచే. గ్రే. వంచు.
వాంఛ సం. కోరిక, ఇచ్ఛ.
వాఁఛించే. సం. స.క్రి. కోరు.
వాంఛితము. సం.విణ. కోరఁబడినది.
వాంతము. సం.విణ.వాంతిచేయఁబడినది; వెడలఁగ్రక్కఁబడినది.
వాంతి. సం. వమనము; వెడలఁగ్రక్కుట.
వాంశికుఁడు. సం. పిల్లంగ్రోవి యూఁదు వాఁడు. [వంకరదైనది.
వాఁక. వైపు; నది; కొండకాలువ. విణ.
వాఁకతాలుపు శివుఁడు, గంగాధరుఁడు.
వాఁకుడు. కంటకారిక †
వాఁగడుపు. వాఁపుగల కడుపు.
వాఁగరత. సముద్రతీరము. రూ వాగర్త.
వాఁగు. అ.క్రి. వదరు; మ్రోఁగు; సైన్యము; కొండవాఁగు. బ. అలలు.
వాఁగుడు. ధ్వని, మ్రోఁగుడు.
వాఁచు. అ.క్రి. వాఁచిపోవు; ఊఁదు.
వాఁడి. ఆయుధాదులపై శిత్యము, పదను; శౌర్యము. విణ. పదనైనది; తీక్ష్ణము; క్రూరము; త్రిశక్తులలో మొదటిది. విణ. నిశితము.
వాఁడిగలాఁడు శూరుఁడు. [పోవు.
వాఁడిచెడు. అ. క్రి. కుంఠితమగు, మొక్క
వాఁడిమగఁడు. విణ. శూరుఁడు.
వాఁడిమి. తేజము; శౌర్యము.
వాఁడిముక్కువాఁడు. విణ. ఖరణసుఁడు.
వాఁడు. స. (తచ్ఛబ్దమునకు మహదర్థక ప్రథమైక వచనరూపము.) ఆపురుషుడు; సంబంధార్థము; (నావాఁడు, వారి వాఁడు అని.) జాతివాచకము. (మంగలవాఁడు చాకలవాఁడు అని.) [వేసెడు చూఁడు.
వాఁత. తెవులుంగొంటులైన పశ్వాదులకు
వాఁపి. విణ. వాఁపురోగముగలవాఁడు.
వాఁపిరి. ఏఁకరుట, ఏఁకట.
వాఁపిరిగొట్టు. విణ. వాపిరివాఁడు.
వాఁపు. శోఫరోగము, శ్వయథువు, ఊఁదు, ఏఁకట.
వాకట్టు. (మంత్రమూలికాదులచేత చేసెడు) వాగ్బంధనము. విణ. వాగ్బంధనము చేయునది. [విచారించుట.
వాకబుచేయుట. హిం. తెలిసికొనుట;
వాకము విణ వాటము.
వాకాటు. వాగ్వివాదము.
వాకిటిలెంకలు. ద్వారపాలకులు.
వాకిలి. తలుపు; ద్వారము.
వాకు. రూ. వాక్కు.
వాకుచి సం. కారుగచ్చ†.
వాకొను. అ.క్రి. మాటాడు; అఱచు. గ్రే. వాకొల్పు, వాకొలుపు.
వాకొనుట. వచనము. [వాగ్దేవి.
వాక్కు. సం. పలుకు, మాట; పలుకుఁజెలి,
వాక్పతి. సం. బ్రహ్మ; బృహస్పతి; కవీశ్వరుఁడు. విణ. చక్కఁగా మాటలాడు వాఁడు.
వాక్యము. సం. పదపదార్థముల యొక్క పరస్పర సంబంధము చెడక యేకార్థత్వముగలిగి క్రియతోఁడ గాని తదితరముతోఁడఁ గాని ముగిసెడి పదసముదాయము; మాట, కర్తృకర్మ క్రియాసంబంధముగల మాట.
వాక్రుచ్చు. స. క్రి. పేరుచెప్పు; చెప్పు.
వాగ. సం. వాగె, వల్గ. [తూలిక.
వాగఱ. చిత్రకారుఁడుచిత్తరువు వ్రాసెడు
వాగఱా. చెఱువునకు నీరువచ్చు కాలువ.
వాగలము } ఖలముఖము, కళ్లమునకు
వాగళ(ళ్ల)ము } ముందుభాగము; కళ్లము చుట్టు.
వాగాయిత్తము. వా. వాగ్వివాదము.
వాగియ. గుఱ్ఱపు వాగె.
వాగీశుఁడు. సం. రూ. వాక్పతి.
వాగీశ్వరి. సం. వాగ్దేవి.
వాగుజి. సం. బావంజి, కారుగచ్చ†.
వాగుర. సం. ఉరి, మృగములను పట్టెడి వల, బోను మొ.
వాగురికుఁడు. వేఁటకాఁడు, వాగురాజీవి.
వాగె. గుఱ్ఱపునోటికళ్లెముతగిలించెడిపగ్గము

వాగ్గులికుఁడు సం. అడపకాఁడు, తాంబూలదుఁడు.
వాగ్దేవి. సం. పలుకుఁజెలి, వాణి, సరస్వతి.
వాగ్మి. సం. చిలుక; బృహస్పతి. విణ. ప్రశస్తముగా మాటలాడువాఁడు, మాటకారి; సమర్థుఁడు.
వాఙ్మయి. సం. శబ్దబ్రహ్మమయి, వాగ్దేవి.
వాఙ్ముఖము. సం. ఉపన్యాసము, వాగుపక్రమము.
వాచ. సం. వాక్కు.
వాచంయముఁడు. సం. ముని, మౌని; మితభాషి. [శబ్దము.
వాచకము సం. వాచ్యార్థము తెలిపెడు
వాచస్పతి. సం. బృహస్పతి.
వాచాటుఁడు. సం. విణ. వదరుఁబోతు.
వాచాలుఁడు. సం. విణ. వదరుఁబోతు, తఱచు మాటలాడువాఁడు.
వాచించు. సం. స. క్రి. చెప్పు; చదువు.
వాచికము. సం. సమాచారము, వర్తమానము.
వాచ్యము. సం. అభిధచేఁ దెలియఁదగిన యర్థము. విణ. చెప్పఁదగినది; నిందింపఁదగినది.
వాచేగడము. పరిదేవనము.
వాచేరము. పరిదేవనము. [యాచించు.
వాచెఱచు. అ. క్రి. మొఱపెట్టు, దీనవృత్తితో
వాచవి. రుచి, నోటిరుచి.
వాచేరపము. పరిదేవనము.
వాచేరు. అ. క్రి. మొఱపెట్టు.
వాచూరు. ఇంటి ముంజూరు.
వాచూరుపట్టె. ఇంటిముంజూరుమోయునది
వాజపేయము. సం. యాగవిశేషము.
వాజము. సం. నెయ్యి; నీళ్లు; హవిస్సు; అంపగఱి; పక్షి ఱెక్క; వేగము; ధ్వని; యజ్ఞము; అన్నము.
వాజి. సం. గుఱ్ఱము; పక్షి; బాణము.
వాజిదంతకము. సం. అడ్డసరము†.
వాజిబీ. హిం. విణ. సరియైన, న్యాయమైన.
వాజె. ఓజ; రోఁత. విణ రోఁతగలది.
వాజెము. పక్షి విశేషము.
వాటపడు. అ. క్రి. అనుకూలమగు.

వాటపద్యములు. గ్రా. బ. ఆటవిడుపు పద్యములు.
వాటము. విణ. జాఱుపుగా నుండునది; అనుకూలమయినది; సక్రమయినది; పొందికయినది; ఓర. సం. మార్గము; తోఁట; చుట్టు వెలుగు వేసిన చోటు; వెలుగు; ఇండ్ల వరుస; భాగము.
వాటి. సం. కూర మొదలగువాని తోఁట; కంచెతోఁట; కుటీరము; ఇంటితోఁట.
వాటిక. సం. తోఁట; ఇండ్ల వరుస.
వాటు. వైచుట; హతి. [పోయెడుకాలు.
వాటుఁగాలు. నడచునపుడు పక్కవాటుగా
వాటురాయి. దొంగలు వైచుటకు అనువుగా ఏరి తీసికొని పోయెడు రాయి.
వాటులాడు. అ. క్రి. కొట్లాడు.
వాట్యాలకము. సం. ముత్తవ పులగము†.
వాట్లీఁడు. విణ. కొట్లాడువాఁడు.
వాడ. తావి; వీథి; ఇండ్ల వరుస.
వాడఁబాఱు. అ. క్రి. వాడు.
వాడకట్టు. వాటిక, వాడ, వీథి.
వాడగన్నేరు. కరవీరము, ఒక దినుసు గన్నేరు.
వాడగాలి. మలయ మారుతము.
వాడనిపువ్వులమ్రాను. కల్పవృక్షము.
వాడవదినె. వేశ్య; కులట. [యిల్లడ.
వాడిక. ఉపనిధి, చెప్పక చూపక యుంచిన
వాడు. మ్లాని, పుష్పాదులు వాడుట. అ. క్రి. ఖిన్నుఁడగు; మ్లానమవు. స. క్రి. ఉపయోగపఱుచు.
వాడుక. పనిపడుట, ఉపయోగము; అభ్యాసము; వ్యవహారము, లౌకికప్రసిద్ధి.
వాడుకపడు. అ. క్రి. అలవడు, పనుపడు.
వాడుకొను. స. క్రి. జనులు ప్రవాదముగా చెప్పుకొను; ఉపయోగపఱుచుకొను.
వాడుచు. ప్రే. వాడించు, వాడఁజేయు.
వాడుదల. వాడుక, అభ్యాసము.
వాడుదెంచు } అ. క్రి. మ్లానమగు.
వాడుపడు }
వాడుపాఱు }
వాడుముట్లు. బ. గృహోపకరణములు.
వాదెదవ. చెఱకు చివర, ఇక్ష్వగ్రము.
వాణి. సం. వాక్కు; సరస్వతి; నేత.

వాణిజ్యము. సం. వ్యాపారము; ఒక వైశ్యవృత్తి. [మత్తురాలు.
వాణిని. సం. నర్తకి, ఆటకత్తె; విదగ్ధ;
వాణీశుఁడు. సం. బ్రహ్మ.
వాతందయము. సం. పాము.
వాతకము. సం. సోమిదము†.
వాతకి. సం. విణ, వాతరోగముకలవాఁడు.
వాతకుంభము. సం. పిన్ననుదురు. [వాఁడు
వాతగానివాఁడు బట్టలకు రంగు వేయు
వాతమ్మి. సం. ఎక్కుడు†; పెన్నేరు†; ముయ్యాకుపొన్న†; శిముడి†; పులుంగుడు†
వాతపూరణము. సం. విణ ధ్వజవిశేషము, వ్యాసహస్తాకృతిగల్గిన వాతపూరితచిహ్నము; శివాధిక్యమును నెలకొల్పుటకు శైవులు ప్రదర్శించుమతచిహ్నము,
వాతపోత(థ)ము. సం. మోదుగు†.
వాతప్రమి. సం. గాలికి ఎదురు నడిచెడి మృగము.
వాతము. సం. వాయువు.
వాతమృగము. సం. వాతప్రమి.
వాతరట్టు. విణ. వదరుపోతు. [వాఁడు.
వాతవాఁడి. విణ. వాక్పారుష్యము గల
వాతసారథి సం. అగ్నిహోత్రుఁడు.
వాతసుతుఁడు. సం. వాయుపుత్రుఁడు.
వాతాయనము సం. కిటికీ.
వాతాయువు. సం. జింక.
వాతారి. సం. ఓమము; ఎఱ్ఱాముదము†; కందర†; కొరింద†; జీడి†; జెముడు†; నల్లవావిలి†; పిల్లపీఁచర†; పుత్రదాత్రి†; బొరంగి†; వాయువిళంగము†.
వాతికాసు. వా. లంచము.
వాతిబియ్యము. దహనము చేయునపుడు బంధువులుపీనుఁగునోట వేసెడుబియ్యము
వాతులము. సం. వాయుసమూహము. విణ. వాతరోగి; వెఱ్ఱిత్తినది. [చరిచి.
వాతూలము. సం. వాతులము; గాలిసుయిఁ
వాతెర(ఱ). అధరము, పెదవి.
వాతెఱకెంపు. దంతక్షతము.
వాత్య. సం. వాయుసమూహము, తుపాను.
వాత్సకము. సం. వత్సములసమూహము.
వాత్సల్యత. సం. దయాళుత్వము.

వాత్సల్యము సం. ప్రేమ; వాత్సల్యరసము. విణ. వాత్సల్యముగలది.
వాత్స్యాయనుఁడు. సం. కామసూత్రములు రచించినఒకముని; న్యాయసూత్రభాష్యకర్తయైన ఒక ఋషి.
వాదడుచు. అ. క్రి వాదాడు, వాదించు.
వాదనము. సం. వాద్యము; వాయించుట.
వాదము. సం. వాగ్వివాదము; రసవాదము; తగవు.
వాదర (ఖడ్గాది) తీక్ష్ణధార.
వారాడు. అ. క్రి వాదించు.
వాది. సం. తగవునకు పోయినవాఁడు; రసవాదము నెఱింగినవాఁడు. విణ. వాదించువాఁడు. [లాడు.
వాదించు. సం. అ. క్రి. వాదాడు; తగవు
వాదిడు. అ. క్రి. వాదముచేయు; వాదమునిడు. [వాద్యములు.
వాదిత్రము. సం. వాద్యము; చతుర్విధమైన
వాదు. వాదము.
వాదులాఁడు. విణ. వాదాడువాఁడు.
వాదోడు. మాటకుసహాయము; పసులకు నాలికచేఱులు మొదలగాఁగల తెవుళ్లను పరిశీలింప నోటఁజొప్పించి నోయితెఱపించుటకై యేర్పఱచిన దార్వాయసరూపయంత్రవిశేషము.
వాద్దెము. వాద్యము.
వాద్యము. సం. వాయిదము. (చతుర్విధ వాద్యములు—తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము—వీణాది తంత్రీవాద్యము, మృదంగాది చర్మవాద్యము, సన్నాయి మొదలైన సుషిరవాద్యము, తాళాది ఘన వాద్యము.)
వాధ్రీణసము. సం. ఛాగవిశేషము; ఖడ్గమృగము; ఎఱ్ఱనికంఠము శిరస్సు తెల్లని ఱెక్కలుఁగల ఒకపక్షి.
వాన. వర్షము; వర్షాకాలము.
వానకాళ్లు. బ. వర్షధారలు.
వానకోయిల. చాతకపక్షి; సర్పవిశేషము. రూ. వానకోవెల.
వానజొలిపులుఁగు. హంస.
వాసతటి. వర్షాకాలము; వర్షఋతువు.

వానవెచ్చెలి. వానకోయిల; వరుణుఁడు.
వానపాము } గండూపదము, ఎఱ్ఱి.
వానపేగు }
వానప్రస్థము. సం. మూడవ ఆశ్రమము; ఇప్పౌ†; మోదుగు†.
వానప్రస్థుఁడు. సం. తృతీయాశ్రమస్థుఁడు
వానము. సం. కుట్టుపని; చాఁప; గతి; వాసన; సొరంగము. విణ. వరుగు, ఎండిన కాయ మొ||; అడవిది.
వానరము. సం. కోఁతి.
వానరాయి. వర్షోపలము.
వానస్పత్యము. సం. పూచి కాచెడు చెట్టు
వానాయుజము. సం. వనాయు దేశమునందుఁబుట్టినగుఱ్ఱము రూ. వనాయుజము
వాని. రూ. వాఁడి.
వానించు. స. క్రి. వలచు.
వానీఁడు. వానెకులము వాఁడు; కుబేరుఁడు
వానీరము. సం. ప్రబ్బ†.
వాను. స.క్రి. కుండలు చేయు.
వానె. వైశ్యకులవిశేషము.
వానెత. వానెకులము వాఁడుది.
వానేయము సం. కైవడిముస్తె†.
వాపదండము. సం. నేఁతపలక.
వాపము. సం. గొఱుగుట; విత్తుట; నేయుట.
వాపసుచేయు. హిం. స.క్రి మార్చు, మఱియొకటియిచ్చు; మరల నిచ్చివేయు, తిరస్కరించు.
వాపాఠము. మి. కంఠపాఠము.
వాపి. సం. నడబావి, దీర్ఘిక; కోనేఱు.
వాపితము. సం. విణ. గొఱుగఁబడినది; విత్తఁబడినది.
వాపు. రూ. వాయింపు.
వాపుచ్చు. స.క్రి. నోరుతెఱచు; చెప్పు.
వాపోక. అఱచుట; ఏడ్చుట. [చేయు.
వాపోవు. అ.క్రి. ఆక్రందించు; రోదనము
వాప్యము. సం. చెంగల్వకోష్టు†.
వామ. సం. దుర్గ; కామిని; సుందరి; స్త్రీ.
వామదేవుఁడు. సం. శివుడు; ఒకముని.
వామన. పక్షివిశేషము.
వామనగాయ. ఊరుఁగాయకు ఉపయుక్తమైన ఒక దినుసు కాయ. [ఖండము.
వామనగొమ్ము. ఊరవేసిన వామనగాయ
వామనపొతుకాఁడు. పక్షివిశేషము.
వామనము. సం. దక్షిణపు దిక్కునందలి యేనుఁగు; ఊడుగు†.
వామనములు. బ. వామనగాయలు.
వామనుఁడు. సం. విష్ణుమూర్తి విశేషము. విణ. పొట్టివాఁడు; భజింపఁదగినవాఁడు.
వామము సం. ధనము; స్తనము. విణ. ఎడమది; సుందరము; ప్రతికూలము.
వామలూరము. సం. పుట్ట. రూ. వామలూరువు.? [స్త్రీ; స్త్రీ.
వామలోచన సం. చక్కని కన్నులుగల
వామి. గడ్డిరాసి. సం. ఆఁడు గుఱ్ఱము; ఆఁడు గాడిద; ఆఁడుఒంటె; ఆఁడునక్క
వాముఁడు. సం. శివుఁడు; మన్మథుఁడు
వాము. వా. ఓమము†; బంధుత్వము. స.క్రి. జాఱు; జవురు; చేతుల కుప్పఁజేసి ఎత్తు.
వాయ. దంచుటకై ఱోటిలో నొకతూరి పోసెడు ధాన్యము; కొండసందిచ్చిన నేల.
వాయదండము. సం. సాలెవాఁడు నేఁత నరితట్టెడు పలక.
వాయనము. సం. వ్రతోద్యాపన కాలమునందు స్త్రీలు ముత్తయిదువులకు ఉపాయనముగా నిచ్చెడు మోదకము మొ.
వాయము. విణ. వ్యర్థము.
వాయవ్యము. సం. విణ. వాయు సంబంధమైన దిక్కు మొ. [ద్రవము.
వాయసము. సం. కాకి; అగలు†; సరళ
వాయసారాతి. సం. గుడ్లగూబ.
వాయసి. సం. కాఁచి†; కాకిమేడి†
వాయసోలి. సం. కాకోలి†
వాయి. నోరు; ముఖము; కత్తియంచు; వాయువు. [మోయించు.
వాయించు. స. క్రి. వాదనము చేయు,
వాయింట. అజగంధ† [చుట.
వాయింపు. (వీణాది) వాదనము, వాయిం
వాయిదము. వాద్యము.
వాయిదా. హిం. గడువు.
వాయిదార. వంకలుగల కత్తి.
వాయివిడం(ళం)గము. చిత్రతండులు, క్రిమిఘ్నము† రూ. వాయువిడం(ళం)గము.

వాయుపుత్రుఁడు. సం హనుమంతుఁడు; భీముఁడు. రూ. వాయునందనుఁడు; వాయుసుతుఁడు మొ.
వాయువు. సం. వాతము; గాలి (పంచప్రాణములు — ప్రాణము మొ. పంచోపవాయువులు — నాగము; కూర్మము; కృకరము; దేవదత్తము; ధనంజయము).
వాయువేగి. సం. పక్కికియ్యఁబడిన ఒక పేరు.
వాయుసఖుఁడు. సం. అగ్నిహోత్రుఁడు.
వాయోడు. అ.క్రి. మాట పిరికియగు.
వార. ఎనిమిది పుంజముల నూలు; (లెక్కల యందలి) ఎచ్చుతక్కువలు; దరి.
వారంటు. ఇం. ఒకనిని పట్టుకొనుటకు అధికార పత్రిక.
వారఁబట్టు. స.క్రి. ఆపోశించు. [అనుట.
వారక. అవ్య. సంతతము, శమింపక
వారకము. లేనికాలమునందు వృద్ధ్యాదులు లేక యుపయోగార్థ మొకరికిచ్చి కలిగిన కాలమునందు మరలఁ బుచ్చుకొనెడు ధనము మొ. సం. ఒక గుఱ్ఱపు నడక. విణ. వారించునది.
వారడ. తాటాకు వారిన చివ్వ.
వారడి. నష్టి, లోపము.
వారడు. స.క్రి అప్ర. చాలించు.
వారణ ఒప్పుగా ? సం. చెలియలికట్ట ?
వారణబుస. సం. అరటి†. రూ. వారణవృష. [ఏనుఁగు; కవచము.
వారణము. శ్యేనభేదము. సం. నివారించుట;
వారణాసి. సం. కాశి.
వారధి. వంతెన.
వారము. గుఱ్ఱము. సం. సూర్యాదివాసరము; (ఇవియేడు-సూర్యవారము (ఆదివారము, భానువారము), సోమవారము, మంగళవారము, బుధవారము, బృహస్పతివారము, శుక్రవారము, శనివారము) ఏడుదినములు; తడవ; సమూహము; వాకిలి; క్షణము; కల్లుగిన్నె; కుబ్జకము†
వారముఖ్య. సం. జనులచేత సత్కరింపఁబడిన వేశ్య, ఉత్తమవేశ్య.
వారయాత్రికుఁడు. సం. పెండ్లిచుట్టము.?
బ. వరునితో వచ్చినవారు, పెండ్లికొడుకు వంకవారు.?
వారవాణము. సం. కవచము; చొక్కా.
వారసు. హిం. ఆస్తి-కర్త.
వారస్త్రీ. సం. వేశ్య. రూ. వారకాంత, వారాంగన మొ.
వారాణసి. సం. కాశి.
వారాంనిధి. సం. సముద్రము.
వారాశి. సం సముద్రము. రూ. వారిరాశి.
వారాహి. సం. ఒకమాతృక; అశ్వియాఁడు పంది; పాఁచితీఁగ; నేలతాడు†.
వారి. సం. ఉదకము; కురువేరు†; వాక్కు, సరస్వతి; కుండ; ఏనుఁగుల కొట్టము.
వారించు. సం. స. క్రి. నివారించు.
వారిజభవుఁడు సం. బ్రహ్మ. రూ. వారిజభువు మొ.
వారిజము. సం. తామర; శంఖము; శంబూకము; లవంగము†; దొనయుప్పు.
వారిజేము. బాడిద†: కొండబూరుగు†.
వారిజవైరి. సం. చంద్రుఁడు.
వారిణ చిన్నచేఁపలను బట్టెడు సాధనవిశేషము; తోలుమోకు.?
వారిణపీఁట. కాఁడి యేడికోల నడుమనుండుపలక. [ముస్తె†; కురువేరు†.
వారిదము. పారిభద్రము†. సం. మేఘము;
వారిధి. సం. సముద్రము, వారినిధి.
వారిపర్ణి. సం. నాఁచు†.
వారివాహము. సం. మేఘము.
వారు. స.క్రి. రెండుచేతులతో తాటాకు ఓర చివ్వు. అ.క్రి. ఉడుగు; వడియు. స. వాండ్రు. (ఆ స్త్రీలు; ఆ పురుషులు.) పూజ్యవాచకము. (అయ్యవారు అని.)
వారుఁడు. సం. శివుడు.
వారుచు. అ.క్రి. స.క్రి. గ్రా. వార్చు.
వారుణి. సం. పడమటిదిక్కు; కల్లు; శతభిష నక్షత్రము; ఒక దినుసు గరిక†; అగస్త్యుఁడు.
వారుపు రూ. వార్పు.
వారుపు—డు. గంజి.
వారువపుజన్నము. అశ్వమేధయాగము.
వారువము. గుఱ్ఱము.

వార్చు. అ.క్రి. ఆచమించు. (సంధ్య వార్చెనని.) స. క్రి. ప్రతీక్షించు, కనిపట్టు; ప్రే. వారఁజేయు. (గంజి వార్చెనని.)
వార్డరు. ఇం.చెరసాలలోనుండుబంట్రౌతు.
వార్త. సం. వర్తమానము, వృత్తాంతము; వర్తనము; జీవనోపాయము; అర్థానర్థవివేచనవిద్య; వార్తాకము†.
వార్తకాఁడు. మి. వార్తావహుఁడు.
వార్తము. సం. పొల్లు; ఆరోగ్యము. విణ. రోగముతీఱినది; జీవనోపాయముగలది.
వార్తాకము. సం. వంగ†; వంకాయ
వార్తాకి. సం. ములక†; నేలములక†.
వార్తావహుఁడు. సం. కృషివాణిజ్యాదులచేత జీవించెడి వర్తకుఁడు; వార్తలు గొనిపోవువాఁడు.
వార్తికము. సం. ఉక్తానుక్త దురుక్తార్థములను వ్యక్తము చేసెడు గ్రంథము; ఏట్రింత.
వార్తికుఁడు. సం. చారుఁడు; వైశ్యుఁడు; దూత, వార్తలం గొనిపోవు వాఁడు.
వార్ధకము. సం. ముసలితనము; వృద్ధుల సమూహము.
వార్ధక్యము. సం. ముసలితనము, నెలుపడియా కొండ్ల తరువాతి యవస్థ.
వార్ధి. సం. సముద్రము. [వాఁడు.
వార్ధుషికుఁడు. సం విణ. వడ్డిచేత జీవించు
వార్పు ఆచమనము; గంజి.
వార్మణము. సం. కవచముల సమూహము
వార్వపుటగ్గి. బడబాగ్ని.
వార్వము. గుఱ్ఱము.
వార్షికము. సం. కలుగ్రాంతి†. విణ. వానకాలమునఁగలిగినది; సంవత్సర సంబంధమైనది. [పెద్దవింటికోల.
వాఱంటువిల్లు. ఊళ్లపనివారివాఱుంగట్టిన
వాఱు. సన్నగాఁ గోసిన తోలు.
వాఱెన. నొగతో కాఁడిని చేర్చి కట్టెడు వాఱు మొ||; ఏఁడికోలతో కాఁడిని చేర్చి కట్టెడువాఱు మొ||; ముంగిసద్రానితో గడను చేర్చికట్టెడు వాఱు మొ.
వాఱెనపీఁట. ఏఁడికోలకును కాఁడికిని నడుమ చేరికగా నుండెడుకొయ్య.
వాలకము. మోసము; వేషము; ఆకారము. సం. ఉంగరము; నూడిగము.
వాలధి. సం. కుచ్చుగలతోఁక, ఏనుఁగు గుఱ్ఱము మొదలగువాని తోఁక.
వాలపాశ్యము. సం. జడబిళ్ల; రాగిడిబిళ్ల; సిగపూవు. [ద్రుంక; కత్తి.
వాలము. బెబ్బులి. సం. తోఁక; తలవెం
వాలయించు. ప్రే. నిర్బంధించు.
వాలఱుగుడు. వాలిఁడికోఁతి.
వాలవాయజము. సం. వైడూర్యము.
వాలహస్తము. సం. కేశసమూహము; వెండ్రుకలకుచ్చుగల తోఁక.
వాలాయము నిర్బంధము. విణ. అనివార్యము; నిరంతరము. క్రి. విణ. అవశ్యము; అత్యంతము. [నిర్బంధపఱుచు.
వాలాయించు. అ. క్రి. నిర్బంధపడు. ప్రే.
వాలారు. విణ. వాఁడియైనది.
వాలారు. స. క్రి. కులుకు; కత్తిని ఝళిపించు. [రుఁడు.
వాలి. సం.ఇంద్రాంశముచేఁ బుట్టిన వాన
వాలిఁడి. తోఁకలేనికోఁతి. విణ తోఁక లేనిది. [అంగిటిగుంట. ?
వాలిక. విణ. దీర్ఘము; వాఁడియైనది. సం.
వాలు. కత్తి; దైర్ఘ్యము; వాఁడిమి; ప్రతాపము. అ. క్రి. అతిశయించు; పక్షి మొ|| క్రిందికిదిగు; ఒఱగు; కొమ్మ మొ|| వంగు. స. క్రి. అతిక్రమించు. విణ. దీర్ఘము; వాఁడి; క్రూరము. [గల స్త్రీ; స్త్రీ.
వాలుఁగంటి. విశాలములయిన కన్నులం
వాలుక. సం. ఇసుక.
వాలుకము. సం. నూఁగుదోస†.
వాలుకొంగ. బకము.
వాలుగ. మత్స్యవిశేషము; మత్స్యము.
వాలుగటెంకి. మత్స్యవిశేషము. [థుఁడు.
వాలుగడాలు. మీనకేతనుఁడు, మన్మ
వాలుగడుపు. బొజ్జ.
వాలుగపాము. మత్స్యవిశేషము.
వాలుచు. ప్రే. వాలఁజేయు.
వాలుచేకట్టె. శుక్రుఁడు.
వాలుచూపు. ఓరచూపు.
వాలుడు. వాతారి†.

వాలుపు. వాల్చుట.
వాలుప్రొద్దు. నెత్తురుఁబ్రొద్దు, ప్రదోషము.
వాలుమగఁడు. విశే. శూరుఁడు
వాలుమెకము అడవిపంది.
వాలువ. రూ. వాలుగ.
వాలూరు. అ. క్రి. ఆలస్యమగు.
వాలెము. రూ. వాలాయము.
వాల్కము సం. విశే. నారది, చీరము.
వాల్గంటి. రూ. వాలుగంటి.
వాల్గడుపు. వాలుగడుపు.
వాల్చు. రూ. వాలుచు.
వాల్మీకము. సం. ఇంద్రధనుస్సు. ?
వాల్మీకి. సం. శ్రీమద్రామాయణమును రచించిన ఒకమహర్షి. రూ. వాల్మికి.
వాల్మీకుఁడు. సం. వాల్మీకి.
వాల్పు. రూ. వాలుపు.
వాల్లభ్యము. సం. దొరతనము.
వావదూకుఁడు. సం. విశే. వాగ్మి, వక్త, చక్కఁగా మాటలాడువాఁడు.
వావాదు. వాఙ్ముఖము.
వావి. బంధురీతి, బంధుక్రమము.
వావింట. వాయింట.†
వావిక. కంఠము మొదటిగుంట.
వావిరి. క్రమము; అనుగతి; ఉత్కర్షము. విశే. అత్యంతము; అనుగతము; ఉత్కృష్టము.
వావిలి. నిర్గుండి†.
వావురము. అశ్వము.
వావృత్తము. సం. విశే. వరింపఁబడినది.
వాశి. సం. బాడిస.
వాశిక. సం. అడ్డసరము†.
వాశిత. సం. ఆఁడేనుఁగు; స్త్రీ.
వాశితము. సం. మృగపక్ష్యాదుల యఱపు విశే. వాసన కట్టఁబడినది.
వాస. ఇంటికి మీఁద పఱపెడు వాసము.
వాసంతము. సం. ఒంటె; కోయిల; తెమ్మెర విశే. ఉంచబడినది; వసంతఋతువునఁ బుట్టినది.
వాసంతి సం. అడవిమొల్ల†; పువ్వుల గురివెంద†; బట్టకడిమి†.
వాసకము. సం. ఇల్లు; అడ్డసరము†.
వాసకసజ్జిక. సం. పడకిల్లు సింగారించి తానును సింగారించుకొని ప్రియుని కొఱకు వేచియుండెడు నాయిక.
వాసగృహము సం. పడకిల్లు.
వాసతేయి. సం. రాత్రి.
వాసన. సం. పరిమళము; ప్రత్యాశ; మునుపు అనుభవించినదాని స్మృతి.
వాసనకొడుపు. మి. పెద్దయూఁదువత్తి.
వాసనగడ్డి. గంధతృణము, భూతికము†.?
వాసనము. సం. వాసనకట్టుట; వస్త్రము. విశే. వసనసంబంధమైనది.
వాసనరాజనాలు. బ. ధాన్యవిశేషము.
వాసపోయు. అ. క్రి. వాసాలు పఱపు.
వాసము. ఇంటికి మీఁద పఱపెడు పట్టె. సం. వస్త్రము; గృహము; నివాసము; అడ్డసరము†. [పొడి.
వాసయోగము. సం బుక్కా మొదలైన
వాసరము సం. దినము, ప్రొద్దు.
వాసవుఁడు సం. ఇంద్రుఁడు.
వాసస్సు. సం. వస్త్రము.
వాసాగారము. సం. పడకటిల్లు; పట్టిల్లు.
వాసి. తారతమ్యము; భేదము; ఆధిక్యము; లాభము; ప్రసిద్ధి; పరిమితి. [బాడిస.
బాగు. విశే. ఉత్కృష్టము; స్వస్థము. సం.
వాసించు. సం. అ. క్రి. వసించు. స. క్రి. వాసనకట్టు.
వాసిగ్రోలు. మురళి.
వాసిత. సం. ఆఁడేనుఁగు; స్త్రీ.
వాసితము. సం. వాశితము. విశే. వాసన కట్టినది, పరిమళింపఁ జేయఁబడినది.
వాసియ. మురళి, పిల్లంగ్రోవి.
వాసుకి. సం. సర్పరాజము.
వాసుదేవుఁడు. సం. శ్రీకృష్ణుఁడు, విష్ణువు.
వాసువు. సం. నాట్య పరిభాషయందు బాలిక.
వాసె. పిల్లంగ్రోవి.
వాసెగ్రోలు. పిల్లంగ్రోవి.
వాసెన. అవిరిపోక యొసటి కుండ మూతి మూసికట్టిన గుడ్డ.
వాసెనకట్టు. వాసెనగుడ్డ కట్టువంటి కట్టు
వాసెనకుడుము. ఇడ్డెన, అపంతిక.
వాస్తవము. సం. యథార్థము.
వాస్తవికము. సం. విశే. యథార్థమైనది.

వాస్తవ్యము. సం. వసింపఁదగినది; ఉండఁ దగినది. [స్థుఁడు ?
వాస్తవ్యుడు. సం. వసించువాఁడు; గృహ
వాస్తుకము. సం. చక్రవర్తి కూర †. రూ. వాస్తూకము.
వాస్తువు. సం. గృహము; గృహనిర్మాణమునకుఁ దగిన భూమి; ఒక దైత్యుఁడు; వాస్తుకము †
వాస్సైనవాఁడు. గ్రా. విణ. ఖ్యాతుఁడు.
వాస్తోష్పతి. సం. ఇంద్రుఁడు.
వాస్త్రము. సం. విణ. వస్త్రముచేతఁ గప్పఁబడిన రథము.
వాస్యము. సం. విణ. ఆచ్ఛాదింపఁదగినది.
వాహద్విషము. సం. దున్నపోతు.
వాహనము. సం. ఎక్కఁదగిన యేనుఁగు గుఱ్ఱము పాలకి మొ.
వాహము. సం. గుఱ్ఱము; ఎద్దు; భుజము; వాయువు; ఇరుస
వాహసము. సం. పెనుఁబాము; నీళ్ళు పోవు తూము; నీరు చెంచలి †.
వాహితము. సం. విణ. దాఁటఁబడినది; దూకఁబడినది. [క్రింది చోటు.
వాహిత్థము. సం. ఏనుఁగు కుంభస్థలమునకు
వాహిని. వాగ్దోరణి. సం. నది; సేన; సేనా విశేషము (ఎనుబదియొక్క రథములు, అన్ని ఏనుఁగులు, ఇన్నూట నలువది మూఁడు గుఱ్ఱములు, నన్నూట ఏవురు కాల్బ్వరును గలది). [సముద్రుఁడు.
వాహినీపతి. సం. సేనానాయకుఁడు;
వాహ్యము. సం వాహనము. విణ. మోయఁదగిన యెద్దు మొ.
వాహ్యాళి. స్వారి.
వాళి. పసులుపోవు దారి; వాడుక.

## వి

వి. అప. ది అనుదానికి బహువచనము (పెద్దవి, మంచివి అని); సంబంధార్థ బహువచనము (వానివి, నీవి అని).
వింగడము. విణ. విస్తీర్ణము; సుందరము; వింతయైనది; విపరీతము; వేఱైనది.
వింగడించు. స. క్రి విభజించు.

వింజామర-ము. మి. తెల్లనిచామరము.
వింజిలి. మత్స్య విశేషము.
వింజె. వింధ్య పర్వతము.
వింట. ఆకర్ణించుట, వినుట.
వింటాలము. మల్లబంధ విశేషము.
వింటికోల. జాళ్ళపనివానియొక్క ధనురాకారమైన సాధన విశేషము.
వింటినారి. ధనుర్గుణము.
వింటిపట్టు. ధన్వంతరము.
వింటిపసి. కామధేనువు.
వింటిరాసి. ధనూరాశి.
వింటివాఁడు. విలుకాఁడు.
వింతు. వింధు.
వింత. ఆశ్చర్యము; అపూర్వము; అన్యము.
వింతరాలు విణ అన్యురాలు; వింతయైన స్త్రీ. [వాఁడు.
వింతవాఁడు. విణ అన్యుఁడు; వింతయైన
విందు. బంధుమిత్రాదులకు పెట్టెడు భోజనము; ఆతిథ్యము, ప్రార్థనాపూర్వకముగా పెట్టెడు భోజనము; బంధువు; అతిథి
విందుపురుగు ఒక దినుసు సాలెపురుగు.
విందువు. (ఁడు) సం విణ వేత్త, తెలిసినవాఁడు.
వింధ్య. సం. లవలి†; సన్నయేలకి.†
వింధ్యము. సం. ఒక పర్వతము.
వింధ్యుడు. సం. బోయవాఁడు.
వింశతి. సం. స ఇరువది. విణ. ఇరువది సంఖ్యగలది
వింశము. సం. విణ ఇరువదవది. [వెలఁగ.
వికంకతము. సం. ములువెలమ†; పుల్ల
వికచము. సం. కేతుగ్రహము. విణ. వికసించినది; బోడిది, వెండ్రుకలు లేనిది.
వికట. సం. మాయాదేవి. [వాఁడు.
వికటకవి. సం. వికటముగా మాటలాడు
వికటము. సం. విణ. వికృతము; విశాలము; సుందరము. [వంకరయగు.
వికటించు. సం. అ. క్రి. ఎదురు తిరుగు;
వికత్థనము. సం. మిథ్యాప్రశంస; ఆత్మస్తుతి; మిష. [వేసెడి దూలములు.
వికరణి దూలములు. బ. చిప్ప పెణకల
వికర్తనుఁడు. సం. సూర్యుఁడు.

వికర్మ. సం శాస్త్రనిషిద్ధమైనకర్మ.
వికర్మికుఁడు. సం. అంగిడి పారుపత్తెకాఁడు ?.
వికలము. సం.విణ. విచ్ఛేదము నొందినది.
వికలుఁడు. సం.విణ. వ్యాకులత్వము గలవాఁడు.
వికల్పము. సం. అవాంతరకల్పము; ఒకయర్థాలంకారము; భ్రాంతి; మాఱుదల దృశ్యము.
వికవిక. నవ్వుటయందగుధ్వన్యనుకరణము
వికస. సం. మంజిష్ఠ.
వికసనము. సం. వికాసము.
వికసించు సం.అ. కి.విరియు;ప్రకాశించు
వికసితము. సం.విణ. వికసించినది.
వికసిలు (ల్లు) అ.క్రి. వికసించు.
వికసుఁడు. సం. చంద్రుఁడు.
వికస్వరము. సం.విణ. వికసించునది.
వికారము. సం. తన్మయము; మనస్సుయొక్కగాని రూపము యొక్కగాని మాఱుపాటు; తెవులు. (షోడశవికారములు — ఏకాదశేంద్రియములు, పంచమహాభూతములును.) జననాది. (ఇవి ఆఱు — పుట్టుట, ఉండుట, వృద్ధినందుట, మార్పునొందుట, క్షీణించుట, నశించుట.) [వికారముగలది.
వికారి. సం. ఒక సంవత్సరము. విణ.
వికావిక నవ్వుట కేరుటయందగు ధ్వన్యనుకరణము. విణ చెల్లాచెదగు.
వికాసము. సం. తెలివి; వికసించుట.
వికాసి. సం. విణ. వికాసముగలది.
వికిరము.సం. వెదచల్లుట; ఏనుఁగు; కుంభస్థలమధ్యము; పక్షి; వృక్షము; ఖండము; శ్రాద్ధకాలమునందు నిమంత్రితులు భుజించినపిమ్మట విస్తరికు ముందు వేసెడు అన్నము; నూయి.
వికిరణము. సం. వెదచల్లుట; జిల్లేడు†.
వికీర్ణము. సం. విణ. వెదచల్లఁబడినది; చెదరినది.
వికుర్వాణుఁడు సం. విణ. సంతోషము నొందిన మనస్సుకలవాఁడు.
వికృతము సం. ఒక సంవత్సరము. విణ. వికారము నొందినది; తెవులునొందినది; గోఁతయయినది.
వికృతి. సం. వికారము; ఒక ఛందస్సు.
విక్కము. సం. ఏనుఁగుపిల్ల.
విక్కవిరియు. అ. క్రి. మిక్కిలి విరియు.
విక్కు. అ. క్రి. విజృంభించు; గర్వించు, ఒడలు విఱుచుకొను.
విక్రమ. సం. ఒక సంవత్సరము.
విక్రమము. సం. ఆక్రమణము; మిక్కిలి బలము; పరాక్రమము; క్రమముతప్పుట; పాదము.
విక్రమార్కుఁడు. సం. కలియుగమున ఒకశకకారుఁడైన నృపతిశ్రేష్ఠుఁడు.
విక్రమించు సం. అ.క్రి. వీర్యముచూపు; శౌర్యముచూపు.
విక్రముఁడు.సం.విష్ణువు;విక్రమార్కుఁడు
విక్రయము. సం అమ్మకము, అమ్మడు.
విక్రయి. సం. విక్రయికుఁడు.
విక్రయించు. సం. స. క్రి. అమ్ము.
విక్రయికుఁడు. సం. అమ్మెడువాఁడు.
విక్రాంతి. సం. విక్రమము; అశ్వగతి.
విక్రాంతుఁడు. సం. విణ. శూరుఁడు; విక్రయించినవాఁడు.
విక్రియ. సం. వికారము. [బడినది
విక్రీడితము. సం. విణ. మిక్కిలి ఆడఁ
విక్రీతము. సం. విణ. విక్రయింపఁబడ్డది.
విక్రీత. సం. అమ్మెడివాఁడు.
విక్రేయము. సం. విణ. అమ్మఁదగినది.
విక్లబము. సం.వ్యాకులత. విణ. భయము చేత వివశమయినది.
విక్లబుఁడు. సం. విణ. వ్యాకులత గలవాఁడు; భయశోకాదులచేత చేతులు కాళ్లు విలవిల పోవువాఁడు.
విక్షావము. సం. దగ్గు; తుమ్ము; ధ్వని.
విక్షిప్తము సం. విణ. విక్షేపముగలది; ఎగురవేయఁబడినది; విసరివేయఁబడినది.
విక్షేపము. సం. ఎగురవేయుట; విసరివేయుట; విసుచుట; వేయుట, కదలిక.
విక్షేపించు. సం స. క్రి. ఎగురవేయు; విసరివేయు.
విఖుఁడు. సం. విణ. ముక్కిడి.
విఖ్యాతము. సం.విణ. విఖ్యాతిఁజెందినది.

విఖ్యాతి. సం. మిక్కిలి ప్రసిద్ధి.
విఖ్యాతుఁడు. సం. విణ. సుప్రసిద్ధుఁడు.
విఖ్యుఁడు. సం. ముక్కుపోయిన వాఁడు, ముక్కిఁడి. రూ. విఖ్రుఁడు. [భాగము.
విగడియ. విఘటిక, గడియలో అఱువదవ
విగతము. సం. విణ. బొత్తిగాపోయినది; వెలుఁగులేనిది. [విభజనము.
విగమము. సం. నాశము; అపాయము;
విగళనము. సం. మిక్కిలి జాఱుట.
విగళితము. సం. విణ. మిక్కిలిజాఱినది.
విగాఢము. స. విణ. విగాహితము.
విగాహము. సం. మునుఁగుట రూ. విగాహనము.
విగాహించు. సం. అ. క్రి. మునుఁగు.
విగాహితము. సం. విణ. మునిఁగినది.
విగిరి. స్ఫోటభూమి.
విగుణము. సం. విణ. విరుద్ధగుణముగలది.
విగుణుఁడు సం. విణ. గుణములులేని వాఁడు.
విగుర్వించు. స. క్రి. చక్కఁగా విఱుచు.
విగ్రహము. సం. శరీరము; విభాగము; విస్తారము; యుద్ధము; రాజషడ్గుణములలో నొకటి. [ఎదుర్కొను.
విగ్రహించు. సం. అ. క్రి. పోరు. స. క్రి.
విగ్రుఁడు. సం. విణ. ముక్కిఁడి, విఖ్యుఁడు.
విఘటిక. సం. విగడియ. [శేషము.
విఘసము. సం. దేవతాతిథుల భుక్త
విఘాతము. సం. అడ్డంకి; పెద్ద దెబ్బ; చెఱుపు; వధము.
విఘాతించు. సం. స. క్రి. చెఱుచు; చంపు.
విఘ్నపడు. మి అ. క్రి అడ్డిపడు.
విఘ్నము. సం. అడ్డంకి, ప్రతిబంధము.
విఘ్నరాజు. సం. వినాయకుఁడు.
విఘ్నశాకము. సం. తోఁటకూర.?
విచక్షణుఁడు. సం. విణ. చదువరి. నేర్పరి; తెలిసినవాఁడు.
విచయనము. సం. వెదకుట.
విచర్చిక. సం. గజ్జి.
విచారణ. సం. విచారము, ప్రమాణముల చేత పరిశీలించుట, చర్చ.
విచారణీయము. సం. విణ. విచారణ చేయఁదగినది.
విచారపడు. మి. అ. క్రి. సంతాపించు.

విచారము. చింత. సం. తత్త్వనిర్ణయము; విమర్శ; వివేకము. [నది.
విచారించు. చింతించు. సం. అ. క్రి. ఆలోచించు.
విచారితము. సం. విణ. ఆలోచింపఁబడి
విచార్యము సం. విణ. ఆలోచింపఁదగినది.
విచికిత్స. సం. సంశయము. [నము†.
విచికిలము. సం. ఒకదిరుసుమల్లె†; దవ
విచిత్రము. సం. చోద్యము, ఆశ్చర్యము; చిత్రవర్ణము. విణ. ఆశ్చర్యకరము; చిత్రవర్ణముకలది.
విచిల్లిక. సం. పావలి†. ?
విచేష్టించు. సం. అ క్రి. మిక్కిలిచేష్టించు.
విచ్చేయు. మి. గ్రా. అ. క్రి. (పెద్దలు) వచ్చు; పోవు. [చుట్ట.
విచ్చ. నాలుగు వ్రేళ్లను చుట్టి తీసిన నూలి
విచ్చలవిడి. స్వాతంత్ర్యము. విణ. స్వతంత్రము. క్రి విణ. యథేచ్ఛము. [యథేచ్ఛ.
విచ్చవిచ్చలు. అవ్య. యథాయథలు,
విచ్ఛాయ. రత్నదోష విశేషము.
విచ్చు. అ. క్రి. విరియు; చీలు. ప్రే. విరియఁజేయు. రూ. విడుచు.
విచ్చుకత్తి. ఒఱ దూసిన కత్తి.
విచ్చుటాకు. చెవ్వాకు.
విచ్చుమొగ్గ. విరియు మొగ్గ; చెల్లాచెదరగుట. విణ చెల్లాచెదరైనది; చెల్లా చెదరు చేయునది.
విచ్ఛాయము. సం. మణి. విణ. నీడలేనిది; కాంతిలేనిది; చాయపోయినది.
విచ్ఛిత్తి. సం. ఎడఁబాటు; వస్త్రభూషణాద్యలంకారము కొలఁదిగా నుండినను మిక్కిలి యొప్పిదమును తోఁపఁజేసెడు స్త్రీలయొక్క శృంగార చేష్టావిశేషము; మైపూఁత; నఱకుడు.
విచ్ఛిన్నము. సం. విణ. ఎడఁబడినది; పూయఁబడినది; నఱకఁబడినది; వంకరైనది
విచ్ఛేదము. సం. ఎడఁబాటు; నఱకుడు.
విజనము సం. విణ. నిర్మనుష్య స్థలము.
విజయ. సం. జయతిథి; పార్వతి; పార్వతి యొక్క చెలికత్తె; ఒక సంవత్సరము; దినముయొక్క అఱవ భాగము.

విజయంచేయు. మి.అ.క్రి. (పెద్దలు) వచ్చు; పోవు. [ముత్యాల హారము.
విజయచ్ఛందము. సం. ఏనూఱు పేటల
విజయదశమి సం. (ఆయుధములు మొదలగువానిని బూజించెడు) ఆశ్వయుజ శుద్ధదశమి.
విజయము. సం. మిక్కిలి గెలుపు; దినముయొక్క ఆఱవ భాగము. [పోవు.
విజయముచేయు. అ.క్రి. (పెద్దలు) వచ్చు;
విజయి. సం. విణ. విజయము గలవాఁడు.
విజయుఁడు. సం. అర్జునుఁడు; విష్ణు ద్వారపాలకులలో నొకఁడు.
విజాతి. సం. విభిన్న జాతి.
విజాతీయము. సం. విణ. విలక్షణము; వేఱు ధర్మములు గలది.
విజిగీష. సం. మిక్కిలి జయింప నిచ్ఛ.
విజిగీషువు. సం. విణ విజిగీషగలవాఁడు.
విజితుఁడు. సం. విణ. జయింపఁబడినవాఁడు. [పెరుఁగు మొ.
విజిలము. సం.విణ. మీఁగడ గట్టిన
విజృంభణము. సం. మిక్కిలి విజృంభణము.
విజృంభించు. సం. అ క్రి. చెలరేఁగు; వికసించు; సామర్థ్యమును చూపు.
విజృంభితము. సం. విణ. వికసించినది; ఆవులించినది.
విజ్ఞప్తి. సం. విన్నపము.
విజ్ఞాతుఁడు. సం. విణ. ప్రసిద్ధుఁడు.
విజ్ఞానము. సం. శాస్త్రాదులయందలి జ్ఞానము; విశేష జ్ఞానము; కార్యము; శిల్పశాస్త్ర జ్ఞానము.
విజ్ఞాపనము. సం. విన్నపము.
విజ్ఞాపించు. సం. స.క్రి. విన్నవించు.
విజ్ఞుఁడు. సం. విణ. నేర్పరి; నిపుణుఁడు.
విజ్జో. తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము. అ.క్రి వ్యాపించు.
విజ్జోడు. విణ. సరికానిది; జోడుకానిది.
విజ్జోడుపడు. అ. క్రి. భేదపడు.
విటంకము. సం. కపోతపాలిక.
విటకత్తె. మి. గ్రా. విటురాలు, విటి.
విటకాఁడు. మి. గ్రా. విటుఁడు.
విటతటము, విటతాటనము, విటతాటనము — విణ. తాఱుమాఱు, ఈవలిదావలను ఆవలి దీవలను అనుట.
విటపము. సం. చిగురు; చిగిరించినకొమ్మ; కొమ్మ; బోదెలేనిచెట్టు; వృక్షవిస్తారము.
విటపి. సం. వృక్షము; మఱ్ఱిచెట్టు.
విటపుఁడు. సం. విటరాయఁడు.
విటరాయఁడు. విటశ్రేష్ఠుఁడు.
విటి. సం. విటకత్తె; పచ్చచందనము.†
విటుఁడు. సం. విటకాఁడు, జారుఁడు.
విటుకులాఁడి. విటురాలు.
విట్ఖదిరము. సం. కంపుతుమ్మ, తెల్లతుమ్మ.
విట్చరము. సం. ఊరఁబంది.
విట్టము. నిర్ణయము. ?
విట్టు. సం. మలము.
విట్సారిక. సం. పీతి గోరువంక.
విడంగము. సం. వాయువిళంగము†. విణ. నేర్పరి. [ఫుట.
విడంబన—ము. సం. అనుకరించుట; మోస
విడంబించు. సం. స. క్రి. అనుకరించు; మోసపుచ్చు; విస్తరించు. ?
విడఁద్రొక్కు. స. క్రి. విడుచు.
విడఁబడినది. విణ. బఱిదెగినది.
విడనాడు. స. క్రి. విడుచు, త్యజించు.
విడవలి. ఇండ్లకు కప్పెడు తృణవిశేషము.
విడి. అరుణకాంతి; ప్రతాపము; కృత్రిమ పద్మరాగ కాంతి; విసర్జనము; క్రోధము; పరాక్రమము; ప్రత్తికాయలోని జడ. విణ.అరుణము; ప్రత్యేకమైనది; విడువఁదగినది; పనినుండి విడిచినది. క్రి. విణ. ఒంటరి.
విడిగోలు. మాఱుపు. విణ పనిలేనిది.
విడిచిపుచ్చు. స. క్రి. విడిచిపెట్టు, త్యజించు. [లము.
విడిచివాటు గుడియ. సాఁగు, భిందిపా
విడిదల. విడియుచోటు, విడిమట్టు.
విడిది. విడియుట; విడిసినచోటు, బస.
విడిదిల్లు. వసతిగృహము.
విడిపట్టు. విడిదిచోటు.
విడిపోవు. అ. క్రి. శ్లథమగు; వదలు.
విడిమట్టు. వాసస్థానము; కాఁపురము; విడిది, దండువిడిసిన స్థలము.

విడిముడి. ధనము
విడిముడిగలవాఁడు. ఆఢ్యుఁడు.
విడియము. తాంబూలము.
విడియు. అ. క్రి. ప్రయాణమై పోవువారు దారిలో నొకచోటదిగు; వీడు; జాఱు.
విడివడు. అ. క్రి. వీడు; జాఱు; తెగనుండి వేఱుపడు; నిర్బంధమునుండి తొలఁగు.
విడివాటుబడియ. విడిచివాటుగుదియ.
విడివేఁట. డేగవేఁట.
విడివోవు. అ. క్రి. వదలు.
విడు. అ. క్రి. వీడు. ప్రే. విడుచు.
విడుగడ } విడుదల, విడుపు, విమోచనము.
విడుగర }
విడుగు. అ. క్రి. వికసించు.
విడుచు. ప్రే. త్యజించు, విడఁజేయు, విమోచనముచేయు.
విడుట. విడుచుట.
విడుత. తడవ, ఆవృత్త్యర్థము.
విడుదల. కడతేఱుట; విడుగర, విమోచనము.
విడుపరి. విణ. పరిత్యాగశీలుఁడు; త్యాగశీలుఁడు.
విడుపు. పరిత్యాగము, విడుచుట; విమోచనము; త్యాగము, దానము.
విడుమర. విడుదల; కడతేఱుట.
విడువడు. అ. క్రి. విడివడు.
విడువు. సం. గజకుంభమధ్యము; నీరేనుఁగు?.
విడూరము. సం. రూ. విదూరము.
విడెము. తాంబూలము.
విడ్చు. ప్రే. రూ. విడుచు.
విడ్డూరము. మౌర్ఖ్యము. విణ. మూర్ఖము.
విడ్పు. రూ. విడుపు.
విడ్యము. రూ. విడియము.
విడ్వరము. సం. ఉపద్రవము.
వితి. రూ. వితా.
వితండ. సం. స్వపక్షనిర్వాహణము లేక పరపక్షము నాక్షేపించు వాదము.
వితండము. సం. తలుపునకు వేసెడు తాళము.?
వితంతువు. సం. విధవ.
వితంసము. సం. మృగములను పక్షులను బట్టెడు ఉరిత్రాడు.
వితతము. సం. చేతితో కొట్టి వాయించు వాద్యము (భేరి, పటహము, ఢక్క మొ)?. విణ. విరివిచేయఁబడినది, విస్తృతము.
వితతి. సం. విరివి, విస్తారము; సమూహము?
వితథము. సం. అబద్ధపుమాట. విణ. అసత్యము, అబద్ధము.
వితమరి విణ. కార్యదక్షుఁడు.
వితము. విధము.
వితరణము. సం. దానము, త్యాగము.
వితరణి సం. విణ. దాత.
వితర్కము. సం. ఊహ; సంశయము.
వితర్కించు. అ. క్రి. ఊహించు; సంశయించు.
వితర్దిక. సం. అరుఁగు.
వితస్తి. సం. జేన.
వితా. విణ వ్యర్థము. అవ్య. వృథార్థకము.
వితాకు. నిశ్చేష్టత; పారవశ్యము; పరాకు. విణ. నిశ్చేష్టితుఁడు; పరవశుఁడు; నిశ్చేష్టితురాలు.
వితాకుఁడు. విణ. నిశ్చేష్టితుఁడు.
వితాకుపడు. అ. క్రి. నిశ్చేష్టతనొందు.
వితానము. సం. వృత్తవిశేషము; మేలుకట్టు; యజ్ఞము; విరివి; సమూహము; అవసరము. విణ. మందము; శూన్యము.
వితావిత. విణ. మిక్కిలి వ్యర్థము.
వితీర్ణము. సం. విణ. దాఁటఁబడినది; ఇయ్యఁబడినది.
వితీర్ణి. సం. ఈవి.
వితున్నకము. సం. కొతిమిరి; మయిలుతుత్తము; నేలయుసిరిక†. పాఁచి†.
వితున్నము. సం. నీరుచెంచలికూర †;
విత్త. మిక్కిలి చిన్న గోనె.
విత్తనము. విత్తు, బీజము.
విత్తము. సం. ధనము. విణ. తెలియఁబడినది; పొందఁబడినది; ప్రసిద్ధి నొందినది; విచారింపఁబడినది.
విత్తు. బీజము, విత్తనము; వీర్యము. స. క్రి. చల్లు, విత్తనములు మొలుపఁ జేయు.
విదగ్ధుఁడు. సం. విణ. నేర్పరి; చొరవకాఁడు.
విదరము. సం. వ్రచ్చుట; చీల్చుట.
విదర్భ. సం. నీళ్ళు తక్కువ భూమి.

వేఁగినాఁడు. వేఁగీదేశము.
వేఁగిస. సర్జకము†.
వేఁగీ. దేశవిశేషము. [భ్రష్టమగు.
వేఁగు. అ.క్రి.తపించు, గింజలు మొ॥ వేఁగు,
వేఁచు. ప్రే. వేఁగించు.
వేఁట. మృగపక్షులపెదకుట వధించుటయు, మృగయ; మేఁకపోతు;పొట్టేలు.
వేఁటకాఁడు మృగయుఁడు,బోయ. విశే. సంహారకుఁడు.
వేఁటకుక్క. విశ్వకద్రువు, వేఁటాడుట యందు నేర్పుగల శునకము.
వేఁపగిరి. వేఁటాడి జీవించెడి బోయ.
వేఁటపల్లె. బోయపల్లె. రూ. వేటపల్లియ.
వేఁటపిట్ట. దీపకము, దీమపుపిట్ట.
వేఁటరి. వేఁటకాఁడు.
వేఁటలాట. వేఁటలాడుట, మృగయ.
వేఁటలాడు. రూ. వేఁటాడు.
వేఁటాడు. స. క్రి. అడవియందు మృగములను పక్షులను వధించు; వధించు.
వేఁడి. ఔష్ణ్యము, వేఁడిమి; తాపము; చుఱుకు; తేజము.విశే. ఉష్ణము; ఎక్కుడను శాన్నఁడు అనుట. [అగ్నిలోచనుఁడు.
వేఁడికంటి. శివుఁడు, ఉగ్రాక్షుఁడు,
వేఁడికొను. స. క్రి. ప్రార్థించు.
వేఁడికోలు. వేఁడుకొనుట, ప్రార్థన.
వేఁడిమరీచులు. మి. వేఁడియగు కిరణములు.
వేఁడిమి. ఔష్ణ్యము, వెచ్చన; తాపము.
వేడివెలుఁగు ఉష్ణరశ్మి, సూర్యుఁడు.
వేఁడివేలుపు. తపనుఁడు, సూర్యుఁడు; అగ్ని, జ్వలనుఁడు. రూ. వేఁడివేలుపు.
వేఁడు స. ఎవఁడు. స. క్రి. ప్రార్థించు; కోరు; యాచించు.
వేఁడుకొను. రూ. వేఁడికొను.
వేఁడుకోలు. రూ. వేఁడికోలు.
వేఁత. రూ. వ్రేఁత. [మూఢుఁడు.
వేఁదుఱు. ఉన్మాదము. విశే. ఉన్మత్తుఁడు;
వేఁపపువ్వు. నింబకుసుమము.
వేఁపి. కుక్క.
వేఁపు. వేఁచుట.
వేఁపుడు, భర్జనము, వేఁచుట; వేఁచెడు చట్టి, సెనగపప్పు మొ॥ వేయించెడు ముండ. విశే. వేఁచినది.
వేఁబోక. వేకువ.
వేకువ ప్రభాతము, వేగుజాము.
వేగ. వడి, త్వర. క్రి. విశే. త్వరితము.
వేగంటి. సహస్రాక్షుఁడు, ఇంద్రుఁడు.
వేగంటి కచ్చేరి. ఇంద్రసభ; స్వర్గము.
వేగంటికొమరుఁడు. అర్జునుఁడు.
వేగంటిగొంగలు. బ. సురద్విషులు, అసురులు. [గజము.
వేగంటియెక్కుడు. ఐరావతము, ఇంద్ర
వేగంటిరౌతుగావించినదణి. సముద్రము.
వేగంటిసైదోడు. విష్ణువు, ఉపేంద్రుఁడు.
వేగన్నులసామి. సహస్రాక్షుఁడు, ఇంద్రుఁడు.
వేగపడు. మి. అ క్రి. త్వరపడు.
వేగపాటు. మి. సంభ్రమము, వేగిరపడుట.
వేగము. సం. శీఘ్రము; ప్రవాహము; మలమూత్రాది ప్రవృత్తి; కింపాక (మహాకాల) ఫలము.
వేగరి. చారుఁడు, సమాచారము తెలుపువాఁడు, హర్కారా.
వేగి. సం. డేగ; గుఱ్ఱము. విశే. వడిగలది.
వేగించు. అ. క్రి. జాగారముచేయు.
వేగిరకత్తె. విశే. త్వరగలది. రూ. వేగిరకత్తియ.
వేగిరకాఁడు. విశే. త్వరగలవాఁడు.
వేగిరపడు. అ. క్రి. త్వరపడు.
వేగిరపాటు. త్వరపడుట.
వేగిరపెట్టు స. క్రి. త్వరపఱుచు.
వేగిరము శీఘ్రము, వేగము, త్వర. క్రి. విశే. త్వరితము.
వేగిరించు. అ. క్రి. త్వరపడు.
వేగు రాజ్యసమాచారము; వర్తమానము, ఖబరు; చారుఁడు. అ.క్రి. ఉదయమగు; శుభోదయమగు.
వేగుఁజుక్క. శుక్రుఁడు.
వేగుఁజుక్కవారము. శుక్రవారము.
వేగుఁబోక. ప్రభాతము, వేకువ.
వేగుజాము. తెల్లవాఱుజాము.
వేగురిక్క. శుక్రుఁడు.

వేగురు. స. బ. వేయిమంది (వేయికి మహాన్మ్యహాత్మ్యార్థక బహు వచనాంతా దేశము).
వేగురుఁజేక్క. శుక్రుఁడు.
వేగుఱువారు } బ. చారులు
వేగుఱు }
వేగువాఁడు. చారుఁడు.
వేగువారు. బ. చారులు.
వేచు. స. క్రి. ఎదురుచూచు, ప్రతీక్షించు అ. క్రి. గర్వించు. [ఫణుఁడు.
వేచేంగులపాగ. అప్ర. శేషుఁడు, సహస్ర
వేటు. రూ. వ్రేటు. [శేషము.
వేడబము. కుతూహలము; మాయ; వంచన;
వేడము. మండలాగ్రము.
వేడించు. స. క్రి. చుట్టివచ్చు.
వేడుక. కౌతూహలము; ఇచ్ఛ; సంతోషము; వినోదము; వినోదకార్యము. విణ. వినోదకరము. [కత్తియ.
వేడుకకత్తె. వేశ్య; జారస్త్రీ. రూ. వేడుక
వేడుకకాఁడు. జారుఁడు; విటుఁడు. విణ. కుతూహలపరుఁడు; అపేక్షకుఁడు; క్రీడాసక్తుఁడు; వినోదకరుఁడు
వేడుకచెలి. వేశ్య.
వేడుకజోదము. కరిఖలము. [అపేక్షించు.
వేడుకపడు. అ. క్రి. కుతూహలపడు;
వేడుకసేయు. అ. క్రి. అపేక్షపడు.
వేడెము. మండలగతి.
వేడెవెట్టు. స. క్రి. పరివేష్టింపఁజేయు.
వేడ్క. వేడుక. (అమ్రేడితమగుచో వే వేడ్క.)
వేడ్కకాఁడు. రూ. వేడుకకాఁడు.
వేడ్కకోమ. వేశ్య. [అ. క్రి. అపేక్షించు.
వేడ్కపడు. రూ. వేడుకపడు, వేడ్క సేయు
వేణి. సం. గంగ యమున సరస్వతి ఇవి కలియుచోటు; ఒకనది; కాలువ, నది యొక్క పాయ; డావరడంగి†; వేణిక.
వేణిక. సం. సర్పాకారముగా అల్లినజడ.
వేణుకము. సం. ఏనుఁగును బొడిచెడి బరిగోల; పసులను చోలెడు మునికోల.
వేణుధ్మఁడు. సం. పిల్లంగ్రోవి యూఁదు వాఁడు.
వేణువాదకుఁడు. సం. మేదరవాఁడు.
వేణువు. సం. వెదురు†; పిల్లంగ్రోవి.
వేతనము. సం. సంబళము, జీతము; కూలి.
వేతసము. సం. ప్రబ్బలి†; పేము†.
వేతస్వంతము. సం. విణ. మిక్కుటమైన ప్రబ్బలు గలదేశము.
వేత్త. సం. విణ. తెలిసినవాఁడు.
వేత్రము. సం. బెత్తము; బెత్తపుచెట్టు.
వేత్రధరుఁడు. సం. ద్వారపాలకుఁడు; కట్టిక. బెత్తముచేతఁబట్టినవాఁడు.
వేత్రవతి. సం. నదీవిశేషము.
వేదండము. సం. ఏనుఁగు.
వేదన. సం. నొప్పి; తెలివి.
వేదనము. సం. జ్ఞానము.
వేదము. సం. తొలుచదువులు (వేదములు నాలుగు—ఋక్కు, యజుస్సు, సామము, అథర్వము.)
వేదముఖ్య. సం. పునుగుపిల్లి; జవ్వాదిపిల్లి?
వేదాంతము. సం. ఉపనిషత్తు.
వేదాంతి. సం. వేదాంతశాస్త్రము తెలిసినవాఁడు.
వేది. సం. సంస్కరింపఁబడిన యజ్ఞవేదిక; తిన్నె, అరుఁగు; ముద్దుటుంగరము; విద్వాంసుఁడు; బ్రహ్మ. విణ. తెలిసిన వాఁడు.
వేదిక. సం. తిన్నె, అరుఁగు.
వేదు. వికటగంధము; గంధము; వెగటు. బ. వెగటుమాట.
వేద్యము. సం. విణ. తెలియఁదగినది.
వేధముఖ్య. సం. కస్తూరి.
వేధము. సం. తొలిపుచ్చుట; కొట్టుట.
వేధముఖ్యకము. కచోరము†.
వేధస్సు. సం. బ్రహ్మ; విష్ణువు; విద్వాంసుఁడు. [కొట్టఁబడినది.
వేధితము. సం. విణ తొలిపుచ్చఁబడినది;
వేధించు. సం. స. క్రి. తొలిపుచ్చు; బాధించు; కొట్టు. [దగినది.
వేధ్యము. సం. గుఱి. విణ. తొలిపుచ్చఁ
వేనలి. జడ; కొప్పు; వెంట్రుక; సర్పాకారముగా అల్లిన జడ.
వేనీళ్ళు. బ. ఉష్ణోదకము.
వేనవేలు. విణ. బ. పెక్కువేలు.

వేను. అపలాపము. [కంపము.?
వేపథువు. సం. కంపము; వణఁకు; స్వగ
వేపనము. సం. కంపనము, వణఁకుట.
వేపితము. సం. విణ. కంపితము.
వేమము. సం. నేఁతపలక.
వేమఱు, వేమారు, వేమాఱు } ద్ర. క్రి. విణ. పలుమాఱు, మాటిమాటికి.
వేము. వేఁపచెట్టు, నింబము.
వేయంచులకైదువ, వేయంచులవాలు } విష్ణుచక్రము, సహస్రారము.
వేయి. స. సహస్రము.
వేయికన్నులవాఁడు, వేయికన్నులవేల్పు } సహస్రాక్షుఁడు, ఇంద్రుఁడు.
వేయిచేతులయేకిమిఁడు. సహస్రబాహువు కార్తవీర్యార్జునుఁడు.
వేయిచుంగలపాగగలదిట్ట. నాగకంకణుఁడు, శివుఁడు. [సూర్యుఁడు.
వేయిచేతులదిట్ట. సహస్రకరుఁడు,
వేయిచేతులఱేఁడు. సహస్రకిరణుఁడు, సూర్యుఁడు; కార్తవీర్యార్జునుఁడు.
వేయిచేతులసామి. సహస్రకరుఁడు, సూర్యుఁడు. [శేషుఁడు.
వేయిమోములవాఁడు. సహస్రముఖుఁడు,
వేయు. వైచు; దిగవిడుచు; ఉంచు.
వేరమి. వైరము.
వేరము. విరోధము;? శీఘ్రము.?
వేరు. వృక్షలతాదుల మూలము. స. అన్యము. [పనస+.
వేరుపనస. వేరునందు పండ్లు పండెడు
వేరుపరుపు. శోధనము.
వేరుబడు. అ.క్రి. భేదమగు.
వేరువిత్తు. విణ. నాశకము; నాశకుఁడు.
వేర్పడు. అ.క్రి. భేదపడు.
వేర్పాటు. భేదము; విరోధము.
వేఱడము. భేదము.
వేఱిఁడి. విణ. వెఱ్ఱివాఁడు; వెఱ్ఱిది.
వేఱిఁడించు. స.క్రి. అవివేకము పొందఁజేయు
వేఱిమి. భేదము.
వేఱు. భేదము; విభాగము. స. అన్యము.
వేఱుపడు. అ.క్రి. భేదపడు; విభక్తమగు.
వేఱుపాటు. భేదము; విరోధము. పుచ్చు.
వేఱుపోవు. అ. క్రి. వేఱుపడు. [ప్రే వేఱు
వేఱుబందము. భేదము, వేఱుపాటు.
వేఱొకటి. స. మఱియొకటి, అన్యము.
వేఱొకఁడు. స. మఱియొకఁడు, అన్యుఁడు
వేఱొకతె స. మఱియొకతె, అన్య.
వేల. సముద్రతీరము, చెలియలికట్ట; పొలిమేర; హద్దు; ఉప్పెన; కాలము, వేళ; రాజభోజనము; అనాయాస మరణము; రాగము; బుధుని భార్య; దాస్యము ?
వేలము. వేదము; శిబిరము; పాళెము.
వేలాకోలము. ఉన్మాదము; హేళనము.
వేలిమి. హోమము.
వేలిమికట్టె. సమిధ. రూ. వేలిమికట్టియ.
వేలిమిబొట్టు. రక్ష. [నము.
వేలు. ద్ర వేలు; వేయియొక్క బహువచ
వేలుచు. స.క్రి. హోమాగ్నియందు నేయి మొదలగువానిని సమర్పించు. రూ. వేల్చు
వేలుపు. దేవత; దేవతాస్త్రీ; జ్యోత్స్యము.
వేలుపుఁజెట్టు. దేవతరువు, కల్పవృక్షము.
వేలుపుఁదెరువు సురవర్త్మము, ఆకాశము
వేలుపుఁబెద్ద. సురజ్యేష్ఠుఁడు, బ్రహ్మ.
వేలుపుగమికాఁడు. సేనాని, కుమారస్వామి, బ్రహ్మ.
వేలుపుగాణ. గంధర్వుఁడు.
వేలుపుగిడ్డి. కామధేనువు.
వేలుపు జడదారి. నారదుఁడు, దేవర్షి.
వేలుపుటావు. కామధేనువు.
వేలుపుటెంకి. దేవళము.
వేలుపుటేరు. సురనది, గంగ.
వేలుపుటేలిక దేవేంద్రుఁడు.
వేలుపుటొజ్జ. బృహస్పతి, సురాచార్యుడు
వేలుపుదాయ. అసురుఁడు, సురద్విషుఁడు
వేలుపుబానిస. వేశ్య.
వేలుపుబాస. సంస్కృతము, దేవభాష.
వేలుపుబోనము. అమృతము.
వేలుపుమల. మేరుపర్వతము, సురాలయము
వేలుపు మానికము. చింతామణి.
వేలుపురాయఁడు, వేలుపుఱేఁడు } దేవేంద్రుఁడు, సురపతి, ఇంద్రుఁడు.
వేలుపులగౌరు. ఐరావతము.
వేలుపులత్రోవ. సురవర్త్మ, ఆకాశము.

వేలుపులబువ్వ } విధువు, చంద్రుఁడు.
వేలుపులబోనము }
వేలుపుఁమూఁక పేరిటి వెలఁది మగఁడు. కుమారస్వామి, దేవసేనాపతి.
వేలుపులయిక్క. స్వర్గము, త్రిదశాలయము.
వేలుపులయిల్లు. సురాలయము, మేరుపర్వతము.
వేలుపులు. బ. ఇంద్రాది దేవతలు; దేవతాస్త్రీలు.
వేలుపుసాని. దైవజ్ఞ, సోదకత్తె.
వేల్పు. రూ. వేలుచు.
వేల్పు. రూ. వేలుపు.
వేల్పుగమికాఁడు. రూ. వేలుపుగమికాఁడు
వేల్పుగాణ. వేలుపుగాణ.
వేల్పుగిడ్డి. కామధేనువు.
వేల్పుగొండ మేరుపర్వతము.
వేల్పుచెలులు. బ. అప్సరసలు.
వేల్పుజెట్టు. దేవతరువు, కల్పవృక్షము.
వేల్పుటెంకి. స్వర్గము.
వేల్పుటేటి మగఁడు. శివుఁడు, గంగాధరుఁడు.
వేల్పుటేటిసవతి. పార్వతి.
వేల్పుటేటిసవతికొడుకు. కుమారస్వామి, పార్వతీనందనుఁడు.
వేల్పుటెఱు. ఆకాశగంగ, గంగ.
వేల్పుటేలికలు. బ. దేవతాప్రభువులు.
వేల్పుటొజ్జ. బృహస్పతి.
వేల్పుడు. పూజ.
వేల్పుదణిగన్నతఁడు శివుఁడు.
వేల్పుదళవాయి. సేనాని, కుమారస్వామి
వేల్పుదాయలు. బ. అసురులు, సురద్విషులు.
వేల్పుదెరువు. ఆకాశము, సురవర్త్మము.
వేల్పుదొర. దేవేంద్రుఁడు, ఇంద్రుఁడు.
వేల్పుదొరతేజి. ఉచ్చైశ్శ్రవము.
వేల్పుదొరవిల్లు ఇంద్రధనుస్సు.
వేల్పుఁబెద్ద. బ్రహ్మ, సురజ్యేష్ఠుడు.
వేల్పుబానిస. వేశ్య.
వేల్పుబోనము. అమృతము.
వేల్పుమల. మేరుపర్వతము.
వేల్పుమావు. ఉచ్చైశ్శ్రవము.
వేల్పురాచుక్క. జ్యేష్ఠా నక్షత్రము.
వేల్పుఱేఁడు. దేవేంద్రుఁడు, ఇంద్రుఁడు.
వేల్పులకూడు. } అమృతము.
వేల్పులబోనము }
వేల్పులగిడ్డి. కామధేనువు.
వేల్పులమిత్తి. అడవిపంది.
వేల్పులమొగము. అగ్ని.
వేల్పులసాని. దైవజ్ఞ, సోదకత్తె.
వేల్పులు. బ. వేలుపులు.
వేల్పువెజ్జె. ధన్వంతరి. బ. స్వర్వైద్యులు అశ్వినీకుమారులు.
వేల్పునువారంపు విడిది. సముద్రము.
వేల్మి. యజ్ఞము
వేల్లంతరము. సం. వెలుతురు†; ఏఱుమద్ది†
వేల్లజము. సం. మిరియము.
వేల్లనము. సం. లుఠనము; అప్పడాలకఱ్ఱ; చలనము.
వేల్లము. సం. వాయువిడంగము†; చలనము.
వేల్లితము. సం. గమనము; అశ్వధారావిశేషము. విణ. కంపించినది; కదలింపఁబడినది; వంకరైనది.
వేవన్నెలపసిడిగట్టు. మేరుపర్వతము.
వేవిన. వేకువ.
వేవిలి. పాలము; నిరుడుదున్నిన పాలము.
వేవిళ్ళు. బ. భక్షణవస్తు వాంఛాతిశయరూప గర్భలక్షణ విశేషము; గర్భిణీస్త్రీ యొక్క వాంత్యాది వికారములు.
వేవు. అ. క్రి. రూ. వేగు.
వేవుజాము. తెల్లవాఱుజాము.
వేవురు. స. బ. రూ. వేగురు.
వేవెలుఁగు. సూర్యుఁడు, సహస్రాంశువు. రూ. వేవెల్గు.
వేశంతము. సం. పడియ, కుంట.
వేశము. సం. వేశ్యలవాడ; ఇల్లు; వేషము.
వేశవారము. సం. మసాల, వంటసంబారము. రూ. వేసవారము.
వేశ్మము. సం. గృహము.
వేశ్య. సం. భోగముది.
వేశ్యము. సం. వేశ్యాగృహము.
వేషము. సం. వస్త్రాభరణాది రూపమైన యలంకారము; తనతీరువిడిచి పాఱియొకవిధమున అలంకరించుకొనుట; స్త్రీలు మొదలైన వారివలె వేసెడు వేషము,

వేష్టకము. సం. కంచెకోట; చెట్టుబంక; పాగ. విణ. చుట్టుకొనునది.
వేష్టనము. సం. చుట్టుకొనుట; పాగ; చెవి వెలుపలిభాగము. [కంచెకోట.
వేష్టము. సం. చుట్టుకొనుట; చెట్టుబంక;
వేష్టించు. సం. స. క్రి. చుట్టుకొను.
వేష్టితము. సం. కంచెకోట. విణ. చుట్టుకొనఁబడినది. [వాఁడు.
వేష్టితుఁడు. సం. విణ. చుట్టుకొనఁబడిన
వేష్టువ. గ్రా. దోవతి.
వేసంగి } వేసవి, ఎండాకాలము,
వేసఁగి } గ్రీష్మ ఋతువు.
వేసగాఁడు. విణ. వేషధారి, స్త్రీలు పొందదలైనవారి వేషములు వేయువాఁడు.
వేసట. శ్రమము, అలయిక.
వేసడ. శ్యేనభేదము. [విశేషము.
వేసడము. వేసరము, కంచరగాడిద; శ్యేన
వేసము. వేషము.
వేసరము. శ్రమము. సం. కంచరగాడిద.
వేసరి. విణ. బాధకుఁడు.
వేసరించు. ప్రే. శ్రమపఱుచు.
వేసరు. అ. క్రి. శ్రమపడు; నొచ్చు; విసుగు; విచారముఁబొందు.
వేసలు. చిన్నకుండ, దాఁక.
వేసవారము. సం. రూ. వేశవారము.
వేసవి. రూ. వేసంగి.
వేసారు. అ. క్రి. వేసరు.
వేస్ట్రము. రూ. వేసడము.
వేహత్తు. సం. చూలుపడిన వెనుక ఆఁబోతు పైకొనుటచే ఈనుకపోయిన యావు.
వేళ. సం. ఉచితసమయము.
వేళము. క్రి. విణ. త్వరితముగ.
వేళాకోళము. చిక్కు. విణ. చిక్కయినది.

## వై

వైకక్షము. సం. జందెమువలె వేసికొనెడు పూదండ. రూ. వైకక్షకము.
వైకటికుఁడు. సం. రత్నములను సానబెట్టు వాఁడు. [కలిగినది.
వైకల్పికము. సం. విణ. వికల్పముచేతఁ
వైకల్యము. సం. వికలత్వము. [ధామము.
వైకుంఠము. సం. విష్ణువుయొక్క పరమ
వైకుంఠుఁడు సం. విష్ణువు.
వైకృతము. సం. విణ. వికృతినుండి కలిగినది. [ఱాయి.
వైక్రాంతము. సం. వజ్రమువంటి ఒక
వైఖరి. సం. కంఠగతమైన నాదరూపమగు వర్ణము. [వైష్ణవ విశేషము.
వైఖానసుఁడు. సం. వానప్రస్థుఁడు;
వైగుణ్యము. సం. విగుణముగా నుండుట.
వైఘ. సం. మధుర సమీపమునందుండెడి యొక నది.
వైచక్షణ్యము. సం. విచక్షణత.
వైచిత్రి } సం. విచిత్రముగానుండుట
వైచిత్ర్యము }
వైచు. స. క్రి. విక్షేపించు; పడవేయు; విసరివేయు.
వైజననము. సం. ప్రసవమగు నెల.
వైజయంతము. సం. ఇంద్రభవనము; ఇంద్రధ్వజము.
వైజయంతి. సం. జెండా, టెక్కెము; విష్ణుదేవుని మాలిక; తక్కలి†.
వైజయంతికుఁడు. సం. విణ. పతాకము పట్టినవాఁడు. [ఇంద్రుఁడు.
వైజయంతుఁడు. సం. కుమారస్వామి;
వైజాత్యము. సం. విజాతిత్వము.
వైజ్ఞానికుఁడు. సం. విణ. నేర్పరి.
వైజాతి రూ. వయిజాతి.
వైజాతితొండ. ఊసరవెల్లి.
వైడము క్రి. విణ. శీఘ్రముగా. [ర్యము.
వైడూర్యము. సం. పిల్లకన్నతనము, వైదూ
వైణవము. సం. వెదురుబియ్యము. విణ. వెదురునకు సంబంధించిన కఱ్ఱ పెం.
వైణవికుఁడు. సం. పిల్లంగ్రోవి యూఁదువాఁడు.
వైణికమౌని. సం. విణ. ఎల్లప్పుడు వీణ గలముని, నారదుఁడు.
వైణికుఁడు. సం. వీణవాయించువాఁడు.
వైణుకము. సం. వేణుకము.
వైణుకుఁడు. సం. వైణవికుఁడు.
వైతంసికుఁడు. సం. మృగపక్ష్యాదులను జంపి విక్రయించి జీవించువాఁడు.

వైతనికుఁడు. సం. కూలికిపనిచేయువాఁడు

వైతరణి. సం. నరకమందుండెడి ఒకయేఱు; రాక్షసుల తల్లి.

వైతాళికుఁడు. సం. వేకువను రాజులను మేలుకొలుపులు పాడువాఁడు. విణ. మేలుకొలుపువాఁడు.

వైదగ్ధి } సం. నేర్పు.
వైదగ్ధ్యము }

వైదర్భి. సం. రీతి విశేషము; దమయంతి; రుక్మిణి. [బడినది.

వైదికము. సం. విణ. వేదమునందుఁ జెప్పఁ

వైదికుఁడు. సం. వేదవేత్త; వేదము చదువువాఁడు. వ్య. వేదము తెలిసిన బ్రాహ్మణుఁడు.

వైదుషి } సం. విద్వాంసునితనము,
వైదుష్యము } పాండిత్యము.

వైదూర్యము. సం. వైడూర్యము, విదూర దేశమునఁ బుట్టిన రత్నము.

వైదేహకుఁడు. సం. బ్రాహ్మణస్త్రీ వైశ్యులకుఁ బుట్టినవాఁడు; బట్టువాఁడు; వర్తకుఁడు.

వైదేహి. సం. సీతాదేవి; వర్తకురాలు; గోరోజనము; పసుపు; పిప్పలి†.

వైద్యనాథుఁడు. సం. శివలింగవిశేషము.

వైద్యమాత. సం. అడ్డసగము†.

వైద్యకము. సం. ఆయుర్వేదము. [చికిత్స.

వైద్యము. సం. రోగచికిత్సాశాస్త్రము;

వైద్యుఁడు. సం. చికిత్సకుఁడు; అశ్వినీకుమారునిచే బ్రాహ్మణస్త్రీయందు కలిగినవాఁడు.

వైద్యుతరుచి. సం. మెఱుపుకాంతి.

వైధవ్యము. సం. విధవాత్వము.

వైధాత్రుఁడు. సం. సనత్కుమారుఁడు.

వైధృతి. సం. ఒక యోగము.

వైధేయుఁడు. సం. విణ. మూర్ఖుఁడు.

వైనతేయుఁడు. సం. గరుత్మంతుఁడు; అనూరుఁడు.

వైనము. వివరము, విభజనము; ఉపాయము; కారణము; క్రమము; విధము.

వైనీతకము. సం. రెండుమూడుజోళ్ళు ఎడ్లు కట్టినబండి (లేక) తేరు (లేక) అనేకులు మోయునట్టి అందలము.

వైపరీత్యము. సం. తడఁబాటు.

వైపు. ప్రక్క, తట్టు, భాగము; ఒడుపు; లక్ష్యము; ఉపాయము.

వైపుకాఁడు. విణ. ఉపాయశాలి.

వైపుల్యము. సం. విరివి, విపులత.

వైభవము. సం. విభవము; ప్రాభవము.

వైమనస్యము. సం. దుఃఖము నొందిన మనసు గలవానితనము.

వైమాత్రేయుఁడు. సవతితల్లికొడుకు.

వైమానికుఁడు సం. విణ. విమానమున సంచరించువాఁడు.

వైమాలము. విణ. అధికము.

వైముఖ్యము. సం. విముఖత.

వైయర్థ్యము. సం. వ్యర్థత. [చదివిన స్త్రీ.

వైయాకరణి సం. వ్యాకరణశాస్త్రము

వైయాకరణుఁడు. సం. వ్యాకరణశాస్త్రము చదివినవాఁడు

వైయాఘ్రము. సం. పులితోలుతో కప్పఁబడిన రథము.

వైమాత్యము. సం. అవినీతుని భావము.

వైరనిర్యాతనము. సం. వైరశుద్ధి.

వైరము. సం. విరోధము.

వైరపులు. కట్టెనిప్పు.

వైరశుద్ధి. సం. పగతీర్చుకొనుట.

వైరస్యము సం. వెగటు.

వైరాగి. సం. బైరాగి; వైరాగ్యసంపన్నుఁడు

వైరాగ్యము. సం. విషయములంతుచ్ఛము లనెడి బుద్ధిచేతఁ గలిగెడి రాగాభావము

వైరారోహము సం. అంతకంతకు చలమెచ్చెడి గొప్పయుద్ధము.

వైరాలు. వైరవులు.

వైరి. సం. శత్రువు.

వైరించు. సం. అ. క్రి. పగగొను.

వైరూప్యము. సం. విరూపత.

వైరోచనుఁడు. సం. బలిచక్రవర్తి.

వైల. శ్యేనవిశేషము.

వైలక్షణ్యము. సం. విలక్షణత.

వైలక్ష్యము. విలక్షత.

వైవధికుఁడు. సం. రూ. వార్తావహుఁడు

వైవర్ణ్యము. సం. వెలవెలవోవుట.

వైవశ్యము. సం. వివశత.

వైవస్వతుఁడు. సం. యముఁడు; ఒక మనువు; శనైశ్చరుఁడు.
వైవాహికము. సం. విణ. వివాహసంబంధ [మైనది.
వైశసము. సం. హింస; ఒకనరకము.
వైశాఖము సం. వైశాఖమాసము; కవ్వము.
వైశారద్యము. సం. విశుద్ధి, విశారదత్వము, నేర్పు.
వైశాల్యము. సం. వెడలుపు.
వైశికము. సం. వేశ్యాగృహము.
వైశికుఁడు సం. బహువేశ్యోపభోగరసికుఁడు, శృంగారనాయకులలో నొకఁడు.
వైశేషికము. సం. (సప్తపదార్థములను చెప్పునట్టి) తర్కశాస్త్రము.
వైశేషికుఁడు. సం. తర్కశాస్త్రము నెఱిఁగినవాఁడు.
వైశ్యుఁడు. సం. కోమటి.
వైశ్రవణుఁడు. సం కుబేరఁడు.
వైశ్వదేవము. సం. హోమబలిదానాతిథిభోజనాత్మకమైనదియు ప్రాతస్సాయంకాలములయందు గృహస్థునకు విహితమైనదియు నగు కర్మవిశేషము.
వైశ్వానరుఁడు. సం. అగ్నిహోత్రుఁడు.
వైషమ్యము. సం. వేఱిమి; విషమముగా నుండుట.
వైషయికము. సం. విణ. విషయసంబంధ [మైనది.
వైష్ణవము. సం. విష్ణువు దేవుఁడుగాఁగల ఒక మతము. విష్ణుసంబంధమైనది.
వైష్ణవి. సం. దుర్గ, ఒకమాతృక. [వాఁడు.
వైష్ణవుఁడు. సం. విష్ణుదేవు నుపాసించు
వైసారిణము. సం. చేఁప.
వైసిక. కపటము.
వైస్వర్యము. సం. విస్వరత్వము.
వైహళి. వాహ్యాళి. [మైనది.
వైహాయసము. సం. విణ. విహాయససంబంధ
వైహాళి. పెద్దసభ.
వైళము. క్రి. విణ. శీఘ్రముగా.

## వో

వోఢ. సం. సారథి, తేరునడుపువాఁడు; మోపరి, వహించువాఁడు.

## వ్య

వ్యంగము. సం. కప్ప. విణ. కొనటి; వికలాంగము.
వ్యంగ్యము. సం. వ్యంజనావృత్తిచే నెఱుఁగఁదగిన యర్థము.
వ్యంజకము. సం. అభినయము; వైఖరీరూపమగు శబ్దము. విణ. వ్యంజనావృత్తిచేఁ దెలుపునది; వ్యక్తము చేయునది.
వ్యంజన. సం. ఒకశబ్దవృత్తి.
వ్యంజనము. సం. పప్పు కూర నేయి పెరుఁగు మొ॥; అంగము; ఆలుమగలగుఱి; చిహ్నము; గడ్డము; మీసము, హల్లు; పర్యగ్నికరణాది పశుసంస్కారము ?
వ్యంజితము. సం. విణ. ప్రకాశితము; బయలుపఱుపఁబడినది.
వ్యంసకుఁడు. సం. మోసకాఁడు.
వ్యక్తము. సం. విణ. తెల్లమైనది, స్ఫుటమైనది; ప్రత్యక్షము; స్థూలము.
వ్యక్తి. సం. జనుఁడు; జాతికి వేఱైజాతికి ఆశ్రయమైన స్వరూపము.
వ్యక్తుఁడు. సం. విణ. పండితుఁడు.
వ్యగ్రుఁడు. సం. విణ. వ్యాకులుఁడు; ఒకటితగిలిన మనస్సు గలవాఁడు.
వ్యజనము. సం. విసనకఱ్ఱ.
వ్యడంబకము. సం. ఆముదపుఁజెట్టు.
వ్యతికరము సం. కలఁత; దుఃఖము; వ్యసనము; కలుపుట, మిశ్రణము.
వ్యతిక్రమము. సం. క్రమవిపర్యయము, అక్రమము. [మాఱుపడినది.
వ్యతిరిక్తము. సం. విణ. వేఱుపడినది;
వ్యతిరేకము. సం. వేఱు; విరోధము; మాఱు; ఒక యర్థాలంకారము.
వ్యతిపాతము. సం. ఒకయోగము; పలాయనము, పాఱిపోవుట; ఒక మహోత్పాతము.
వ్యత్యయము. సం. వ్యత్యాసము, తడఁబాటు; వ్యతిక్రమము, ఈవలిది ఆవల ఆవలిది ఈవల.

వ్యత్యస్తము. సం. విణ. వ్యత్యాసము గలది. [యము.
వ్యత్యాసము. సం. వ్యతిక్రమము, వ్యత్య
వ్యథ. సం. బాధ, కష్టము, దుఃఖము.
వ్యథితము. సం. దుఃఖితము; పీడితము.
వ్యధము. సం. తొలంచుట.
వ్యధితము. సం. విణ. తొలంపఁబడినది.
వ్యధ్వము. సం. చెడ్డత్రోవ.
వ్యపదేశము. సం. కపటము; చెప్పుట; సంజ్ఞ; నెపముపెట్టి తన యభిలాషను దెలుపుట.
వ్యపేతము. సం.విణ. తొలఁగిపోయినది.
వ్యభిచరించు. సం. అ.క్రి. తప్పిచరించు; అంకుపోవు.
వ్యభిచారము. సం. తప్పిచరించుట; అంకు.
వ్యభిచారి. సం. శృంగారభావ విశేషము; (ఇవి ముప్పదిమూడు — నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము, శ్రమము, ఆలస్యము, దైన్యము, చింత, మోహము, స్మృతి, ధృతి, వ్రీడ, చపలత, హర్షము, ఆవేగము, జడత, గర్వము, విషాదము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుప్తి, విబోధము, అమర్షము, అవహిత్థ, ఉగ్రత, మతి, వ్యాధి, ఉన్మాదము, మరణము, త్రాసము, వితర్కము.)
వ్యభిచారిణి. సం. అంకుటాలు.
వ్యయ. సం. ఒకసంవత్సరము.
వ్యయము. సం. లగ్నమునకు పండ్రెండవయిల్లు; ఖర్చు, వెచ్చము, వ్రయము; క్షీణించుట; నశించుట.
వ్యయించు. సం. క్షీణించు; నశించు. స.క్రి. వెచ్చించు. [నశించినది.
వ్యయితము. సం.విణ. వెచ్చింపఁబడినది;
వ్యర్థము. సం. విణ. ప్రయోజనము లేనిది.
వ్యవకలనము. సం. తీసివేఁత, ఒక సంఖ్యలో ఒకసంఖ్యను త్రోయుట.
వ్యవకలితము సం. విణ. వ్యవకలనము చేయఁబడినది. [నొందినది.
వ్యవచ్ఛిన్నము. సం. విణ. వ్యవచ్ఛేదము
వ్యవచ్ఛేదము. సం. ఖండించుట; భాగించుట; భాగహారము; తారతమ్యము; బాణగమనము.
వ్యవధ. సం. కప్పు; మఱుఁగు.
వ్యవధానము, వ్యవధి. సం. ఎడము; కప్పు; మఱుఁగు.
వ్యవసాయము. సం. ఉద్యోగము, ప్రయత్నము; జీవనోపాయము; నిశ్చయము. వా. కృషి, సేద్యము. [వాఁడు.
వ్యవసాయి. సం. విణ వ్యవసాయముగల
వ్యవసితము. సం. నిశ్చయము; వ్యవసాయము. విణ. అనుష్ఠింపఁబడినది; నిశ్చయింపఁబడినది; మోసపుచ్చఁబడినది.
వ్యవస్థ. సం శాస్త్రనిరూపిత నియమము, రచనానియమము. [బడినది.
వ్యవస్థితము. సం. విణ. వ్యవస్థచేయఁ
వ్యవహరించు. సం. అ. క్రి. వివాదము చేయు స.క్రి. వాడుక చేయు.
వ్యవహర్త. సం. న్యాయాధిపతి. విణ. వ్యవహరించువాఁడు. [రము చేయు.
వ్యవహారమాడు. సం. స. క్రి. వ్యవహా
వ్యవహారము. సం. తగవు; న్యాయము; వ్యాపారము; వాఁడుక; విచారణ; జూదము.
వ్యవహారి. సం. బేహారి; వ్యాపారము చేయువాఁడు. [గలది.
వ్యవహితము. సం. విణ. వ్యవధానము
వ్యవాయము. సం. తేజము; మఱుఁగు; సంగమము. [ఒంటరితనము.
వ్యష్టి. సం. వేఱుపాటు, ఒంటిపాటు,
వ్యసనము. సం. ఆపద; కామక్రోధముల వలనఁ బుట్టిన దోషము. (ఇవియేడు — పానము, స్త్రీ, మృగయ, ద్యూతము వాక్పారుష్యము; దండపారుష్యము; అర్థదూషణము) ఆసక్తి; పాపము; అశుభము; భ్రంశము; నిష్ఫలమైన ప్రయత్నము; దైవమువలని యనిష్టఫలము.
వ్యస్తము. సం. విణ. వేఱుపడినది; వ్యాకులతబొందినది; వ్యాపించినది.
వ్యళీకము. సం. అప్రియము; అకార్యము; అచ్చెరుపాటు; అసత్యము; లజ్జ; వంచన; అపరాధము; బాధ.

# వ్యా

వ్యాకరణము. సం. శబ్దశాస్త్రము.
వ్యాకీర్ణము. సం. విణ. చెదరినది.
వ్యాకులము. సం. విణ. కలఁతనొందినది.
వ్యాకులితము. సం. విణ. వ్యాకులము.
వ్యాకృతి. సం. వేఱుపఱుచుట; విశద పఱుచుట; భాషాంతరపఱుచుట; వ్యాకరణము.
వ్యాకోచము. రూ. వ్యాకోశము ?
వ్యాకోశము. సం. విణ. వికసించినది. రూ. వ్యాకోచము.
వ్యాఖ్య. సం. వివరణము, వ్యాఖ్యానము
వ్యాఖ్యాత. సం. విణ. వ్యాఖ్యానము చేసినవాఁడు.
వ్యాఖ్యాతము. సం. వ్యాఖ్యానము చేయఁబడినది; స్పష్టముగా చెప్పఁబడినది.
వ్యాఖ్యానము. సం. అర్థవివరణము చేయుట.
వ్యాఘాతము. సం. ఒకయోగము; ఒక అర్థాలంకారము; ప్రతిబంధము; దెబ్బ.
వ్యాఘూర్ణనము. సం. తిరుగుడు. [నది.
వ్యాఘూర్ణితము. సం. విణ. తిరుగుడుపడి
వ్యాఘ్రనఖము. సం. పులిగోరు; పులిగోరు†; ఒక ఆభరణము; ఒక గంధద్రవ్యము; నఖక్షతవిశేషము.
వ్యాఘ్రపాదము. సం. ములువెలఁగ†.
వ్యాఘ్రపుచ్ఛము. సం. ఆముదపుఁజెట్టు.
వ్యాఘ్రము. సం. పెద్దపులి; పెద్దా (ఎఱ్ఱా) ముదపుఁజెట్టు; ఉత్తరపదమైన చో శ్రేష్ఠవాచకము. [ట్రింత.
వ్యాఘ్రాటము. సం. భరద్వాజపక్షి, ఏ
వ్యాఘ్రి. సం. వాఁకుడు†; ఆఁడుపులి.
వ్యాజము. సం. కపటము; చెడ్డతనము; మిష, నెపము. [యోక్త.
వ్యాజ్యెగాఁడు. వివాదపడినవాఁడు, అభి
వ్యాజ్యెమాడు. అ. క్రి. వివాదపడు.
వ్యాజ్యెము. వివాదము, అభియోగము.
వ్యాధి. సం. చెంగల్వకోష్టు†; రోగము.
వ్యాధిఘాతము. సం. రేల†.
వ్యాధితుఁడు. సం. విణ. వ్యాధిగలవాఁడు, రోగి. [వాఁడు; దుష్టుఁడు.
వ్యాధుఁడు. సం. ఎఱుకలవాఁడు, బోయ
వ్యానము. సం. శరీరమంతట వ్యాపించి యుండు వాయువు, పంచప్రాణములలో నొకటి. [విష్ణువు.
వ్యాపకుఁడు. సం. విణ. వ్యాపించువాఁడు
వ్యాపనము. సం. వ్యాపించుట; ఆచ్ఛాదించుట. [దగినది.
వ్యాపనీయము. సం. విణ. వ్యాపింపఁ
వ్యాపన్నము. సం. విణ. మృతినొందినది.
వ్యాపాదనము. సం. చంపుట.
వ్యాపాదము. సం. ద్రోహచింత
వ్యాపాదితము. సం. విణ. చంపఁబడినది.
వ్యాపారము. సం. పని; ఉద్యోగము; వాణిజ్యము.
వ్యాపారి. సం. విణ. వ్యవసాయము గలవాఁడు, వ్యాపారముగలవాఁడు.
వ్యాపి. సం. విష్ణువు, వ్యాపించువాఁడు; వ్యాపించునది; ఆత్మ, పూర్ణవస్తువు.
వ్యాపించు. సం. అ. క్రి. నెరయు, క్రమ్ము, అంతట ప్రసరించు.
వ్యాపృతి సం వ్యాపారము. [గలవాఁడు.
వ్యాపృతుఁడు. సం. విణ. వ్యాపారము
వ్యాప్తము. సం. విణ. వ్యాపించఁబడినది; ప్రసిద్ధికెక్కినది; పొందఁబడినది.
వ్యాప్తి. సం. వ్యాపించుట; ప్రసిద్ధికెక్కుట; పొందుట.
వ్యాప్యము. సం. లింగము; చెంగల్వకోష్టు†. విణ. వ్యాపింపఁదగినది.
వ్యామము. సం. బార.
వ్యామోహము. సం. అత్యంతమోహము.
వ్యాయతము. సం. విణ. దృఢమైనది; దీర్ఘమైనది; అధికమైనది; వ్యాపారము గలది.
వ్యాయామము. సం. కసరత్తు, దేహపరిశ్రమము; సాము; బార.
వ్యాయోగము. సం. రూపకవిశేషము.
వ్యాలోలము. సం. విణ. మిక్కిలిచలించినది
వ్యావర్తకము. సం. భేదకము.
వ్యావర్తనము సం. వెనుకకు మరలుట; చుట్టుట; ఇతరేతరవియోగస్థానము.

వ్యావహారికము. సం. వ్యవహార సిద్ధము.
వ్యావహారికుఁడు. సం. మంత్రి.² విణ. వ్యవహారము తెలిసినవాఁడు.
వ్యావృత్తము. సం. విణ. వెనుకకు మరలినది; చుట్టఁబడినది. [వ్యతిరేకము.
వ్యావృత్తి. సం. నిరసనము, ఖండనము;
వ్యాసంగము. సం. మిక్కిలి అసంగము.
వ్యాసక్తుఁడు. సం. విణ. అత్యాసక్తిగలవాఁడు.
వ్యాసము. సం. విరివి, విస్తారము. వా. ఏదేని ఒక విషయమును విరివిగా వ్రాయుట.
వ్యాసుఁడు. సం. వేదవ్యాసుఁడు, కృష్ణద్వైపాయనుఁడు, బాదరాయణుఁడు, పారాశర్యుఁడు. [వ్యర్థమైనది.
వ్యాహతము. సం. విణ. బాధింపఁబడినది;
వ్యాహారము. సం. పలుకు, వాక్కు.
వ్యాహృతము. సం. విణ. వచింపఁబడినది.
వ్యాహృతి. సం. ఉచ్చారణము, పలుకు, వ్యాహారము; భూః భువః అను మొ.
వ్యాళగ్రాహి. సం. పాములవాఁడు. రూ. వ్యాళగ్రాహుఁడు.
వ్యాళము. సం. పాము; చిఱుతపులి; తులువయేనుఁగు. విణ. క్రూరమైనది. రూ. వ్యాడము.
వ్యాళాయుధము. సం. పులిగోరు; నఖి. రూ. వ్యాడాయుధము.

## వ్యు

వ్యుత్క్రమము. సం. వ్యతిక్రమము.
వ్యుత్థానము. సం. అడ్డపాటు; సమాధినుండి లేచుట; ప్రతికూలప్రవర్తనము; స్వాతంత్ర్యము [శబ్దసంభవప్రకారము.
వ్యుత్పత్తి సం. శాస్త్రాదిజన్య పరిజ్ఞానము;
వ్యుత్పన్నుఁడు. సం. విణ. శాస్త్రాదిజన్యపరిజ్ఞానము కలవాఁడు. [గించునది.
వ్యుత్పాదకము. సం.విణ. వ్యుత్పత్తిని కలి
వ్యుషితము. సం. చలిది.
వ్యుష్టము. సం. ప్రాతఃకాలము. విణ. పర్యుషితము. [స్తోత్రము.
వ్యుష్టి. సం. ఫలము; ప్రసిద్ధి; సమృద్ధి;

## వ్యూ

వ్యూఢము. సం. విణ. వ్యూహముగా ఉంచఁబడినది(సేన); ఉంచఁబడినది; దట్టమైనది; విశాలమైనది.
వ్యూతి. సం. నేత నేయుట.
వ్యూహము. సం. చక్కనియూహ; మొగ్గరము, దండునుతీర్చుట, యుద్ధార్థమైన సేనారచన; సమూహము; రచన. (వ్యూహభేదములు—దండము, భోగము, మండలము, అసంహతము. క్రౌంచచక్రగోమూత్రికాదులు వీని యవాంతర భేదములు.)

## వ్యో

వ్యోకారుఁడు. సం. ఇనుముపనిచేయువాఁడు, కమ్మరవాఁడు.
వ్యోమకేశుఁడు. సం. శివుఁడు.
వ్యోమము సం. ఆకాశము; జలము.
వ్యోమయానము. సం. విమానము.
వ్యోషము. సం. త్రికటుకము.

## వ్ర

వ్రంత. ఏఱు; పల్లము.
వ్రక్క. ఖండము, తునుక, బ్రద్ద.
వ్రక్కలించు.స. క్రి. భేదించు; వ్రక్కలు చేయు.
వ్రక్కలింత. భేదము.
వ్రక్కవాయు } అ.క్రి. తెగు, చిన్నముగు;
వ్రక్కవాఱు } చీలు, భిన్నముగు.
వ్రచ్చు. అ.క్రి. వ్రయ్యు. స.క్రి. భేదించు; చీల్చు, బ్రద్దలు చేయు; గోళ్ళతో చీల్చు; నఖక్షతము చేయు.
వ్రజము. సం. పసులమంద; పసులదొడ్డి; సమూహము; త్రోవ. [ప్రయాణము.
వ్రజ్య. సం. గమనము; వర్గము; తిరుగుట;
వ్రణము. సం. గాయము; కురుపు; కిణము
వ్రతతి. సం. తీఁగె; విరివి.

వ్రతము. సం. శాస్త్రవిహితమైన ఉపవాసాది పుణ్యకర్మానుష్ఠానము; నియమము
వ్రతి. సం. యజమానుఁడు; వ్రతముగలవాఁడు. వ్రతిభేదములు—ఋషి, స్నాతకుఁడు, యతి, స్థాండిలుఁడు, ద్వయాతిగుఁడు, మూలికుఁడు, లోచకుఁడు, ఔర్వ్యుఁడు, ఖపుటుఁడు.
వ్రప్పు. చీలిక.
వ్రయము. సం. వ్యయము, ఖర్చు.
వ్రయ్య. ఖండము, వ్రక్క, బ్రద్ద, చీలిక.
వ్రయ్యఁబడు, వ్రయ్యవాయు, వ్రయ్యవాఱు } అ. క్రి. వ్రయ్యు, భేదిల్లు, చీలు.
వ్రయ్యు. అ. క్రి. బ్రద్దలగు.
వ్రశ్చనము. సం. ఛేదనము; ఆకుఱాయి.

## వ్రా

వ్రాఁకుడు. వాఁకుడు†.
వ్రాఁత. లేఖనము, వ్రాయుట; లిపి.
వ్రాఁతకాఁడు. లేఖకుఁడు, లేకరి, వ్రాయువాఁడు; కరణము?
వ్రాఁతచావడి. గ్రంథకుటి, లేఖ్యశాల.
వ్రాఁతపని. లేఖనక్రియ; రంగువేయువాఁడు వస్త్రముల యంచులయందు రంగులతో వ్రాసెడు చిత్రము.
వ్రాతబల్ల. వ్రాఁతకాండ్రు కాగితము లుంచుకొని వ్రాయ నాలుగు కాళ్ళ చౌకపు వాటపు పలక.
వ్రాఁతసాకిరి. లిఖితుఁడు.
వ్రాజె. వా. అప్రయోజకుఁడు
వ్రాతము. సం. గుమి, సమూహము.
వ్రాత్యుఁడు. సం. (యోగ్యకాలమున) ఉపనయనాది సంస్కారము లేనివాఁడు.
వ్రాయసకాఁడు. లేకరి, లేఖకుఁడు.
వ్రాయసప్రవృత్తి. మి. లేఖనవృత్తి.
వ్రాయసము. వ్రాఁత; జాబు. [బొట్టు.
వ్రాయి. అక్షరము; రేఖ; పాఁచికమీఁది
వ్రాయించు. స క్రి. లిఖింపఁజేయు.
వ్రాయిఁడి. విణ. వ్రాఁతరానివాఁడు, నిరక్షరుఁడు.
వ్రాయు. స. క్రి. లిఖించు.
వ్రాలు. అక్షరములు; సంతకము, హస్తాక్షరములు. అ. క్రి. పక్షి క్రిందికి దిగు; ఒఱగు; మీఱు; తగ్గు. [వ్రాల్చు.
వ్రాలుచు. ప్రే. వ్రాలఁజేయు. రూ.

## వ్రి

వ్రిచ్చు. కాంతు. ?

## వ్రీ

వ్రీడ. సం. సిగ్గు.
వ్రీలు. అ. క్రి. చీలు, విదారితమగు.
వ్రీలుపడు. అ. క్రి. బలహీనమగు.
వ్రీహి. సం. వరిగింజ, వడ్లగింజ; వడ్లు; ఎఱ్ఱజిలమవడ్లు; ధాన్యము.
వ్రీళ. సం. సిగ్గు.

## వ్రే

వ్రే. గొల్లకులము.
వ్రేఁకటి. గర్భము.
వ్రేఁకన, వ్రేఁకము } భారము, బలువు; అతిశయము.
వ్రేఁగు. భారము, బలువు. అ. క్రి. వేఁగు
వ్రేఁగుపడు. అ. క్రి. భారపడు.
వ్రేఁచు. ప్రే. వేఁగఁజేయు.
వ్రేఁడు. గొల్లవాఁడు, గోపకుఁడు.
వ్రేఁత. వ్రేయుట; దెబ్బ.
వ్రేఁపుఁడు. వేఁపుడు. రూ. వేఁపుఁడు.
వ్రేటు. వ్రేఁత.
వ్రేటుగొను. స. క్రి. కొట్టు.
వ్రేత. గొల్లది, గోపిక. [కృష్ణుఁడు.
వ్రేతలమేలువాఁడు. గోపాలుఁడు, శ్రీ
వ్రేపల్లె. ఘోషము, గొల్లపల్లె. రూ. వ్రేపల్లియ.
వ్రేయు. స.క్రి. కొట్టు; నఱకు.
వ్రేలఁబడు. అ.క్రి. వ్రేలాడు.
వ్రేలాడు. అ.క్రి. లంబితమగు, వ్రేలు. రూ. వ్రేలియాడు. [వ్రేలాడు; ముసుఁగు.
వ్రేలు. అంగుళము, అంగుళి. అ. క్రి.
వ్రేలుకాడు. వా. అ. క్రి. వ్రేలాడు.

వ్రేలుచే. ప్రే. వ్రేలఁజేయు, వ్రేల్చు; కడుగు.
వ్రేలుడు. విణ. లంబితము, వ్రేలాడినది.
వ్రేలుబొట్టన. బాలక్రీడావిశేషము.?
వ్రేలుమిడి. త్రుటి, చిటిక.
వ్రేల్మిడి. తృటి; అంగుళిసంజ్ఞ.
వ్రేల్మి. వేలిమి, యజ్ఞము.
వ్రేల్మిడి. తృటి; భూతి.?
వ్రేలెఁడు. విణ. అంగుళప్రమాణము.

## వ్రై

వ్రైహేయము. సం. విణ. వడ్లుపండెడి పొలము; ధాన్యములుపండఁదగినపొలము.

---

## శ

శంక. సం. సంశయము; భయము; విచారము.?
శంకరభగవత్పాదులు. బ. సం. శ్రీ శంకరాచార్యులు, నరుఁడుగా నవతరించిన విశ్వేశ్వరుఁడు.
శంకరాభరణము. రాగవిశేషము.
శంకరుఁడు. సం. శివుఁడు; శంకరాచార్యుఁడు. విణ. సుఖమును గలుగఁజేయువాఁడు. [పడు. రూ. శంకిల్లు.
శంకించు. సం.అ క్రి. సందేహించు; భయ
శంకితుఁడు. సం. విణ. సంశయించినవాఁడు; భయపడినవాఁడు. [నము.
శంకుకర్ణము. సం. గాడిద; ఒక సిద్ధస్థా
శంకుల. సం. పోఁకగొత్తు; ఉలి.?
శంకువు. సం. మోడు; జానెఁడుకొయ్యమేకు, గసిక; ఈఁటె; మేకు; నీరుపంది; సంఖ్యావిశేషము.
శంఖచరి. సం. పాపటబొట్టు.
శంఖనఖము. సం. నత్తగుల్ల.
శంఖపాణి. సం. విష్ణువు. [విశేషము.
శంఖపాలకుఁడు. సం. విణ. నాగసర్ప
శంఖము. సం. సంకు, చిందము; నొసటియెముక; గజదంత మధ్యభాగము; లక్షకోట్లు; ఒకనిధి; సర్పవిశేషము; నఖియనెడి ఒక గంధద్రవ్యము.
శంఖిని. సం. కట్టుఁతీగ; పద్మపుతీఁగ; స్త్రీజాతి విశేషము.
శంప. సం. మెఱపు.
శంపాకము. సం. రేల†.
శంబము. సం. వజ్రాయుధము; రోఁకలి మొదలగువాని పొన్ను. విణ. సుఖము కలది.
శంబరము. సం. ఉదకము; ఒక చేఁప; గవయమృగము కంటె పెద్దదియగు మృగవిశేషము.
శంబరారి. సం. మన్మథుఁడు.
శంబరి. సం. ఎలుకజీడి†.
శంబరుఁడు. సం. ఒకరాక్షసుఁడు.
శంబలము. సం. దారిబత్తెము; మాత్సర్యము; తీరము.
శంబాకృతము. సం. విణ. ద్విహాల్యము.
శంబుకము } సం. కప్పచిప్ప.
శంబువు }
శంబూకము. సం. కప్పచిప్ప; ఏనుఁగు కుంభస్థలము కడచోటు.
శంబూకుఁడు. సం. ఒక శూద్రతపస్వి; ఒక రాక్షసుఁడు.
శంభము. సం. విణ. శుభముగలది.
శంభళి. సం. కుంటెనకత్తె. రూ. శంబలి.
శంభువు. సం. శివుఁడు; విష్ణువు; బ్రహ్మ; బుద్ధదేవుఁడు. రూ. శంభుఁడు.
శంస. సం. మాట; స్తోత్రము; ఇచ్ఛ; చెప్పుట. [చుట.
శంసనము. చెప్పుట; స్తుతించుట; ఇచ్ఛిం
శంసితము. సం. విణ. నిశ్చయింపఁబడినది; హింసింపఁబడినది; స్తుతింపఁబడినది; అనుష్ఠింపఁబడినది. [తినాసము†.
శకటము. సం. బండి; బండిపరిమాణము;
శకటరేఫ. సం. తెనుఁగున బండి ఱ అను అక్షరము.

శకము. సం. 56 దేశములలో నొకటి, శాకము దేశము; ఒక మ్లేచ్ఛజాతి; శక దేశ జనము. వా. ఒకని పరిపాలనముతోఁ జేరిన సంవత్సరము.

శకలము. చెట్టుమీఁది పట్ట; నార; రాగ ద్రవ్యము; తునుక.

శకలి. సం. చేఁప. [రూ. శకారి.

శకాంతకుఁడు. సం. విక్రమార్కుఁడు.

శకాబ్దములు. సం. బ. శకకారకులైన మహాపురుషుల మరణదినము మొదలు కొని ప్రవర్తిల్లిన సంవత్సరములు.

శకుంతము. సం. పక్షి; భాసపక్షి; ఒక పురుగు.

శకుంతి. సం. పక్షి.

శకుఁడు సం. శకదేశస్థుఁడు; శాలివాహనుఁడు, ఒక నృపశ్రేష్ఠుఁడు.

శకునము. సం. వలను, శుభాశుభసూచక నిమిత్తము; పక్షి; పక్షివిశేషము.

శకుని. సం. చిందపిట్ట; నల్లపిచ్చుక; పక్షి; ఒక కరణము; దుర్యోధనుని మేనమామ.

శకులము. సం. జేడిస మీను.

శకులాకకము. సం. తీఁగగతిక†.

శకులాదని. సం. కటుకరోహిణి†; నీరు పిప్పలి†.

శకులార్భకము. సం. కుచ్చుమీను.

శకులి. సం. చేఁప. [దూడ.

శకృత్కరి. సం. వత్సము, ఏడాదిలోని

శకృత్తు. సం. మలము.

శక్తి. సం. బలము; సామర్థ్యము; పార్వతీ దేవి; చిల్లకోల; ఇచ్ఛాది; (ఇవిమూడు— ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి.) ఉత్సాహాది (ఇవి మూడు—ఉత్సాహ శక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి); వసిష్ఠుని కొడుకు.

శక్తిధరుఁడు. సం. కుమారస్వామి.

శక్తుఁడు.. సం. విణ. శక్తిగలవాఁడు, సమర్థుఁడు.

శక్యము. సం. విణ. అలవి, సాధ్యము.

శక్రగోపము. సం. ఇంద్రగోపము.

శక్రధనువు. సం. ఇంద్రధనుస్సు.

శక్రపాదపము. సం. దేవదారువు.

శక్రపుష్పి. సం. వెన్న వెదురుకూర.

శక్రభువనము. సం. స్వర్గము. రూ. ఇంద్ర భవనము.

శక్రవల్లిక. సం. పెద్దపాఁపర†.

శక్రుఁడు. సం. ఇంద్రుఁడు.

శక్లుఁడు. సం. విణ. ప్రియవాది.

శక్వరము. సం. ఎద్దు. [ఒడ్డాణము.

శక్వరి. సం. ఒక ఛందస్సు; ఒక నది;

శచి. సం. శచీదేవి; ఇంద్రుని భార్య; పిల్ల పీఁచర†.

శచీపతి. సం ఇంద్రుఁడు.

శఠగోపము. సం. శఠారి, విష్ణుపాదచిహ్నములుగల పాత్రవిశేషము.

శఠగోపమువెట్టు. మి. అ. క్రి. టోపీవేయు.

శఠమతి. సం. మొండిపట్టువాఁడు, కుత్సిత మతి.

శఠించు. స. క్రి. మూర్ఖపుపట్టు పట్టు.

శఠుఁడు. సం. చతుర్విధ శృంగార నాయకులలో నొకఁడు; మధ్యస్థపురుషుఁడు. విణ. కుత్సితుఁడు; కపటి; ధూర్తుడు; మూర్ఖుఁడు; మొండివాఁడు.

శణపర్ణి. సం. సోమిదము†.

శణపుష్పి—క. సం. గిలక†.

శణము. సం. జనుము†. [వలత్రాడు.

శణసూత్రము. సం. జనపనారతోఁ నల్లిన

శతకము. నూఱు. విణ. నూఱు లేక నూటయొనిమిది సంఖ్యగలది. [కోట్లు.

శతకోటి. సం. వజ్రాయుధము; నూఱు

శతఘ్ని సం నాలుగుమూరల నిడివిగల యినుప ముండ్లకఱ్ఱ; కానుగు†; ఫిరంగి.

శతతార. సం. శతభిషానక్షత్రము.

శతద్రువు. సం. నూఱుపాయలై పాఱెడి యొకానొకనది.

శతధృతి. సం. బ్రహ్మ; ఇంద్రుఁడు.

శతపత్రకము. సం. వడ్లంగిపిట్ట.

శతపత్రము. సం. పద్మము; నెమిలి; బెగ్గురు; వడ్రంగిపిట్ట; రాచిలుక.

శతపది. సం. కట్లజెఱ్ఱి; చెవిచొరుపాము; రోఁకటిబండ.

శతపర్వ. సం. శుక్రుని భార్య.

శతపర్వము. సం. వెదురు†.

శతపర్విక. సం. గతిక†; వస†.

శతపుష్ప. సం. సదాప†.

శతప్రాసము. సం. గన్నేరు†.
శతభిషము. సం. ఒకనక్షత్రము.
శతమన్యువు. సం. ఇంద్రుఁడు.
శతమానము. సం. పల మెత్తు వెండి; తూముఁడు; 320గురిగుంజలయెత్తు వెండి; నూటికొలది. [అనంతము.
శతము. సం. వంద; నూఱు; అనేకము;
శతమూలి. సం. పిల్లపీఁచర†. [పీఁచర.
శతవీర్య సం. తెల్లగఱిక; నల్లద్రాక్ష; పిల్ల
శతవేది. సం. పుల్లప్రబ్బ†.
శతహ్రద. సం. మెఱుపు; వజ్రాయుధము.
శతాంగము. సం. యుద్ధమున కుపయోగించెడు రథము; రథము.
శతానందము. సం. విష్ణురథము.
శతానందుఁడు. సం. బ్రహ్మ; విష్ణువు; గరుడుఁడు.
శతారము. సం. వజ్రాయుధము.
శతావరి. సం. పిల్లపీఁచర†;; శచీదేవి.
శతాహ్వాయ. సం. సదాప†.
శత్రువు. సం. పగవాఁడు; దండెత్తిపోవువాని దేశమునకు ఆవలిదేశపురాజు. (శత్ర్వాదిరాజమండలము-శత్రుమిత్రులు తన్మిత్రులు, తన్మిత్రమిత్రులు, పార్ష్ణిగ్రాహుఁడు, ఆక్రందనుఁడు, ఆసారులిరువురు, మధ్యముఁడు, ఉదాసీనుఁడు)
శని. సం. శనైశ్చరుఁడు, ఛాయాపుత్రుడు
శనిప్రియము. సం. నీలరత్నము.
శనివారపుజడి. మి. మాననిది, తప్పనిది. (శనివారమునాఁడువచ్చిన వాన తిరుగ శనివారము వచ్చుదనుక పోదని లోకములో వాడుక.) [వారము.
శనివారము. సం. ఏడవవారము, మంద
శనైశ్చరుఁడు. సం. శనిగ్రహము.
శపథము. } సం. ఒట్టు; తిట్టు.
శపనము. }
శపించు. సం. స. క్రి. తిట్టు.
శఫము. సం. అశ్వాది పశుజాతియొక్క డెక్క; చెట్టువేరు.
శఫరము } చేఁప; ఎగిసిపడెడు
శఫరి } మత్స్యము
శబరాలయము. సం. బోయపల్లె.
శబరి. సం. శబర స్త్రీ.
శబరుఁడు. సం. ఆకులుకట్టుకొని అడవియందు తిరిగెడు బోయవాఁడు; శివుడు
శబలము. సం. చిత్రవర్ణము, మిశ్రవర్ణము విణ. చిత్రవర్ణముగలది.
శబలి. సం. చిత్రవర్ణముగల యావు.
శబ్దగ్రహము. సం. చెవి.
శబ్దనుఁడు. సం. విణ శబ్దించువాఁడు.
శబ్దము. సం. ధ్వని; వ్యాకరణశాస్త్ర శిక్షితమైన వాక్కు.
శబ్దశాసనుఁడు. సం. శబ్దమును అనుశాసించువాఁడు, వ్యాకరణాచార్యుఁడు.
శబ్దశాస్త్రము. సం. వ్యాకరణము.
శబ్దించు. సం. అ. క్రి. శబ్దముచేయు, మ్రోయు.
శబ్దితము. సం. విణ. శబ్దముచేయఁబడినది.
శమత్వము. సం. శమముగలిగియుండుట.
శమథము. సం. శాంతి.
శమథుఁడు. సం. మంత్రి.
శమనము. శాంతింపఁజేయుట; శాంతిబొందుట, అడఁగుట; వధము.
శమనస్వస. సం. యమునానది.
శమనుఁడు. సం. యముఁడు.
శమము. సం. శాంతి, కామక్రోధాదులు లేక యుడఁగియుండుట.
శమలము. సం. మలము.
శమి. సం. జమ్మి†; పెసలు మొదలగువాని పైపొట్టు. విణ. శమముగలవాఁడు.
శమించు. సం. అ. క్రి. అడఁగు; శాంతిఁబొందు రూ. శమియించు.
శమితము.. సం. విణ. శమించినది.
శమీధాన్యము. సం. మినుములు మొదలైన కాయధాన్యము.
శమీరము. నేలజమ్మి†.
శమేనా. గుడ్డతో నిర్మింపఁబడిన కుటీరము.
శమ్య. సం. కాఁడిచీల; యజ్ఞాంగశూలాకార కాష్ఠవిశేషము.
శమ్యాకము. సం. రేల†; పఱుపు.
శయనము. సం. పఱుపు; శయ్య; నిద్ర; సురతము. [కొను.
శయనించు. సం. అ. క్రి. పరుండు, పండు

శయనీయము. సం. పఱుపు, శయ్య; విణ. పడకకుఁదగినది.
శయము. సం. హస్తము; శయ్య; పాము
శయాళువు. సం. కుక్క; నక్క; పెనుఁబాము. విణ. నిదురపోతు.
శయించు. సం. అ. క్రి. శయనించు.
శయితుఁడు. సం. విణ. నిదురపోతు; నిద్రించినవాఁడు.
శయువు. సం. పెనుఁబాము.
శయ్య. సం. పఱుపు; పదగుంఫనము; పడక, మంచము మొ.
శరండము. సం. పక్షి; తొండ; పరడు.
శరండుఁడు. సం. ధూర్తుఁడు; కాముకుఁడు.
శరజన్ముఁడు. సం. కుమారస్వామి.
శరణము. సం. రక్షణము; గృహము.
శరణాగతి. సం. శరణుచొచ్చుట, ప్రపదనము, ప్రపత్తి; ఆశ్రయించుట.
శరణీయుఁడు. సం. విణ. శరణుచొచ్చఁదగినవాఁడు.
శరణు. రక్షకము; శరణాగతి; నమస్కారము. [బొందు.
శరణుబొచ్చు. మి. స. క్రి. శరణాగతిని
శరణ్యుఁడు. సం. వాయువు. విణ. రక్షించువాఁడు; శరణుచొచ్చఁదగినవాఁడు.
శరత్తు }
శరద } సం. శరదృతువు; సంవత్సరము.
శరధి }
శరనిధి } సం. సముద్రము; అమ్ములపొది.
శరభము సం. మహాసింహము, ఎనిమిది కాళ్లమృగము; ఒంటె.
శరభుఁడు. సం. ఒక వానరుఁడు.
శరము. సం. బాణము; జెల్లు†; జలము; పాలు పెరుఁగుమీఁది మీఁగడ.
శరవణభవుఁడు. స్కందుఁడు, కుమారస్వామి.
శరవ్యము. సం. గుఱి; లక్ష్యము.
శరారి. సం. ఆడేలు, బాతు.
శరారువు. సం. విణ. చంపునది.
శరావతి. సం. ఒకనది.
శరావము. సం. మూఁకుడు.
శరాసనము. సం. విల్లు. రూ. శరాసము.
శరీరము. సం. దేహము.
శరీరయాత్ర. దేహయాత్ర, దేహము యొక్క మనుగడ.
శరీరి. సం. జంతువు, ప్రాణి, జీవుఁడు. విణ. శరీరముకలవాఁడు.
శర్కర. సం. చెక్కెర, పంచదార; మొరము; మొరపనేల; పెంచిక; మధుమేహము; వ్రయ్య.
శర్కరకము. సం. కమలాఫలము†.
శర్కరిలము. సం. విణ. మొరప.
శర్ధనము. సం. పిత్తుట, అపానశబ్దము.
శర్ధించు. సం. అ. క్రి. పిత్తు.
శర్మము. సం. ఆనందము, సుఖము. విణ. సుఖము గలది. (ము లోపించిన) బ్రాహ్మణుని ఉపపదము.
శర్వరి. సం. రాత్రి; పసుపు; స్త్రీ; ఒక సంవత్సరము; సంధ్య.
శర్వల. సం. సేజా, చిల్లకోల.
శర్వాణి సం. పార్వతీదేవి.
శర్వుఁడు. సం. శివుఁడు.
శలకము. సం. సాలెపురుగు.
శలభము. సం. మిడుత. [శలలము.
శలము. సం. ఏదుపంది ముల్లు. రూ.
శలలి. సం. ఏదుపంది; ఏదుపందిముల్లు
శలాక. సం. సలాక, గొడుగు మొదలగువానికమ్మి; వీణ మొదలగువానిని వాయించెడు కొడుపు; వాగఱ; తోమరము.
శలాటువు. సం. ఒకమూలము. విణ. పండనిది; కాయ. [మీఁది పొలుసు.
శల్కము సం. ముక్క; నార; చేఁప
శల్యకము. సం. ఏదుపందివంటి మృగవిశేషము?; ప్రంగ; ఒక పక్షి.
శల్యము. సం. ఎముక; బాణము; సలాక; విషము; కొయ్యమేకు; చిల్లకోల; ఏదుపంది; ప్రంగ†; ఆయుధపుటలుఁగు.
శల్యుఁడు. సం. నకులసహదేవుల మేనమామ.
శల్లకి. సం. ఏదుపంది; అందుగు†.
శవము. సం. జలము; పీనుఁగు.
శశకము. సం. కుందేలు.
శశధరుఁడు. సం. చంద్రుఁడు.
శశము. సం. కుందేలు; చెవులపిల్లి; బోళము; లొద్దుగు†.

శశవిషాణము. సం. కుందేటికొమ్ము.
శశాంకుఁడు. సం. చంద్రుఁడు.
శశాదనము. సం. డేగ.
శశి. సం. చంద్రుఁడు.
శశిప్రభము. సం. అసత్యము; తెల్లగలువ.
శశోర్ణము. సం. కుందేటిబొచ్చు.
శశ్వద్బాలుఁడు. సం. కుమారస్వామి.
శష్కులి. సం. చక్కిలము; బయటిచెవి.
శష్పము. సం. లేఁతగడ్డి; ప్రతిభాహాని. వా. వెంద్రుక.
శసనము. సం. యజ్ఞమునందలి పశువధము
శస్తము. సం. శుభము. విణ. శుభకరమైనది; స్తుతింపఁబడినది; ప్రశస్తమైనది
శస్త్రమార్జుఁడు. సం. సానపెట్టువాఁడు.
శస్త్రము. సం. ఆయుధము; లోహము; ఇనుము; ఖడ్గము.
శస్త్రాజీవుఁడు. సం. విణ. ఆయుధకర్మచేత జీవించువాఁడు. [ధరించువాఁడు.
శస్త్రి. సం. చురకత్తి. విణ. శస్త్రమును

## శా

శాంఖికుఁడు. సం. రూ. కాంబవికుఁడు.
శాండిల్యము. సం. మారేడు†.
శాండిల్యుఁడు. సం. ఒక ముని.
శాంతము. సం. ఒకరసము; ఓర్పు; చిత్తోపశమము. విణ. శాంతిఁబొందినది; నిరుపాధికమగు ఆత్మ. [మరలుట.
శాంతి. సం. శమము; ఓర్పు; చాలించుట;
శాంతించు. సం. అ. క్రి. శాంతిబొందు.
శాంతుఁడు. సం. విణ. శాంతిగలవాఁడు.
శాంబరి. సం. మాయ; గారడి. [దీక్ష.
శాంభవదీక్ష. సం. శివదీక్ష; లింగధారణ
శాంభవి. సం. పార్వతి; నల్లగలిక.
శాకటము. సం. బండియెద్దు. విణ. బండిది
శాకము. సం. కూర; (ఇది ఆకు, పువ్వు, కాయ మొదలగు భేదములచే పది విధములు గలది) టేకు†; శాకద్వీపము; శక్తి
శాకశాకటము } సం. కూరమడి.
శాకశాకినము }
శాకిని. సం. ఒకదుర్గాసహచరి; కూరలుగల స్థలము; ఇంటితోఁట; దేవీశక్తి.

శాకునము. సం. శకునశాస్త్రము.
శాకునికుఁడు. సం. పక్షుల వేఁటకాఁడు.
శాక్కరము. సం. ఎద్దు.
శాక్తీకుఁడు. సం. శక్త్యాయుధముతో పోరుసలుపువాఁడు.
శాక్తుఁడు. సం. శక్తిని ఉపాసించువాఁడు
శాక్యముని } గౌతమ బుద్ధుఁడు,
శాక్యసింహుఁడు } శాక్యవంశమునకుఁ జెందినబుద్ధుఁడు.
శాఖ. సం. చెట్టుకొమ్మ; వేదభాగము; చేయి. [నము చేయువాఁడు.
శాఖారండుఁడు. సం. అన్యశాఖాధ్యయ
శాఖానగరము. సం. పాలెము; పేఁట.
శాఖామృగము. సం. కోఁతి.
శాఖి. సం. చెట్టు; వేదము; తురక, విణ. అంతర్భాగములు గలది.
శాటము. సం. వస్త్రవిశేషము; దుప్పటి.
శాటి. సం. ఒకవస్త్రము; చీర.
శాఠ్యము. సం. కపటము; వ్యాజము.
శాణము. సానరాయి; ఒరగల్లు; నాలుగు మాషములయెత్తు.
శాణా. జాణ, సమర్థుఁడు.
శాణాతనము. గ్రా. జాణతనము.
శాణికుఁడు సం. సానపెట్టువాఁడు.
శాణితము. సం. విణ. సానపెట్టఁబడినది.
శాతకుంభము. సం. బంగారు; ఉమ్మెత్త†.
శాతము. సం. సుఖము. విణ. వాఁడిచేయఁబడినది; కృశించినది. [స్త్రీ.
శాతోదరి. సం. కృశించినకడుపుగల స్త్రీ;
శాత్రవము. సం. శత్రుత్వము; సమూహము.
శాత్రవుఁడు. సం. శత్రువు. [బురద.
శాదము. సం. లేఁతపచ్చిక; అడుసు,
శాద్వలము. సం. విణ. లేఁతపచ్చిక కలది.
శానము. సం. కత్తులసాన; స్వర్ణచ్ఛేదన సాధనవిశేషము ?
శాపము. సం. ఒట్టు; తిట్టు.
శాపించు. సం. స. క్రి. శపించు.
శాబకము. సం శిశువు; పిల్ల.
శాబరము. సం. లొద్దుగు†; శివకృతతంత్ర విశేషము. విణ. శబరసంబంధమైనది.
శాబాసు. హిం. బాగుబాగు అనుట.
శాబ్దము. సం. విణ. శబ్దసంబంధమైనది.

శాబ్దికుఁడు. సం. వైయాకరణుఁడు.
శామనము. సం. శాంతి; వధము.
శామాకము. సం. చామలు.
శామిత్రము. సం. యజ్ఞము; యజ్ఞ పశు బంధనము; యజ్ఞపాత్రము.
శాయిక. సం. శయనము, పరుండుట.
శారద. సం. సరస్వతీదేవి; దుర్గ.
శారదగాఁడు. హాస్యగాఁడు.
శారదము. సం. పచ్చపెసర†; సంవత్సరము; ఏడాకులఅరఁటి†. విశే. శరత్కాలమందుఁబుట్టినది; క్రొత్తది; ప్రతిభ లేనిది.
శారది. సం. ఏడాకులఅరఁటి†; నీరుపిప్పలి†
శారభటము. సం. దినముయొక్క నాలుగవ భాగము.
శారము. సం. చిత్రవర్ణము; జూదపుసారె; వాయువు. విశే. చిత్రవర్ణముగలది.
శారి. సం. గోరింక, గోరువంక పిట్ట; యుద్ధార్థము ఏనుఁగుమీఁద పరచిన చాఁదోలు; వ్యవహార విశేషము; జూదపుసారె.
శారిక. సం. గోరింక, గోరువంకపిట్ట; వీణ మొదలగు వానిని వాయించుకోఁడుపు; నక్షత్రము. [పాళి. రూ. శారిఫలకము.
శారిఫలము. సం. నెత్తపలక, సోగటాల
శారిబ. సం. మామెన†
శారీరము సం. విశే. శరీర సంబంధమైనది. వా. కంఠస్వరము.
శార్కరము. సం. పాలనురుఁగు. విశే. మొరపనేల
శార్ఙ్గము. సం విష్ణుదేవుని విల్లు; విల్లు. విశే. శృంగసంబంధమైనది. [విష్ణువు.
శార్ఙ్గి. సం శార్ఙ్గమనుధనుస్సుగల వాఁడు,
శార్దూలము. సం. పులి; ఒకపక్షి
శార్దూలుఁడు. సం వ్యాఘ్రమునురుఁడు; (ఉత్తర పదమైనచో) శ్రేష్ఠుఁడు
శార్వరము. సం. కటికిచీఁకటి. విశే. చంపునది.
శార్వరి. సం రాత్రి.
శాల. సం. ఇల్లు; ఇంటియందు కొంత భాగము; పెనుఁగొమ్మ; చావడి. ?

శాలము. సం. ఒక చేఁప; మద్దిచెట్టు.
శాలి. సం. (బుద్ధిశాలి–అను మొదలగు) ఒక ప్రత్యయము; వరి; గంధమార్జాలము.
శాలివాహనుఁడు. సం శకకర్తయైన ఒక నృపుఁడు.
శాలిహోత్రము. సం. గుఱ్ఱము.
శాలిహోత్రుఁడు. సం. అశ్వశాస్త్రప్రవర్తకుఁడైన ఒక ఋషి. [వాఁడు.
శాలీనుఁడు. సం. విశే. దిట్టతనము లేని
శాలూకము. సం. తామర మొదలగువాని దుంప; జాజికాయ.
శాలూరము. సం. కప్ప. [పాలము.
శాలేయము. సం. సదాప†. విశే. వరిపండు
శాల్మలి. సం. బూరుగు†; ఒకద్వీపము.
శావము. సం. మృతసూతకము.
శాశ్వతము. సం. విశే. నిత్యము; ఎల్లప్పుడు ఒక్కరీతినుండు పరమాత్మ; నాశము లేనిది. [మాత్మ.
శాశ్వతుఁడు. సం. వేదవ్యాసుఁడు; పర
శాష్కులికము. సం. చక్కిలముల సమూహము. [వాఁడు.
శాష్కులుఁడు. సం. విశే. మాంసముతిను
శాసకుఁడు. సం. విశే. శాసించువాఁడు.
శాసనము. సం. దానపట్టా, రాజు తాను దానముచేసిన భూమికై వ్రాసియిచ్చిన కాలు; ఆజ్ఞ; శిక్ష; శాస్త్రము.
శాసించు. సం. స. క్రి. ఆజ్ఞాపించు; శిక్షించు. [వాఁడు.
శాస్త. సం. బుద్ధదేవుఁడు. విశే. శాసించు
శాస్తి. సం. ఆజ్ఞ; రాజదండనము.
శాస్త్రజ్ఞుఁడు. సం. శాస్త్రము తెలిసినవాఁడు.
శాస్త్రము. సం. నియమనగ్రంథము. (ఇవి యాఱు — తర్కము, వ్యాకరణము, ధర్మము, మీమాంసు, వైద్యము, జ్యోతిషము.) విశే. శస్త్రమువలనఁ గలిగినది.
శాస్త్రవిదుఁడు. సం. విశే. శాస్త్రము తెలిసిన వాఁడు.
శాస్త్రి. సం. విశే. శాస్త్రవిదుఁడు.
శాస్త్రీయము సం. విశే. శాస్త్రప్రోక్తము.
శాస్యము. సం. విశే. శాసింపఁదగినది.

## శి

శింఘాణము. సం. ఇనుపచిట్టెము; చీమిడి; కాచపాత్రము.
శింజ. సం. వింటినారి; నగలమ్రోఁత.
శింజితము. సం. భూషణములమ్రోఁత.
శింజిని. సం. వింటినారి; కాలియందె.?
శింబ } సం. పెసలు మినుములు మొదలగు
శింబి } వానిపై పొట్టు; తంబతీఁగచిక్కుడు.
శింబికము. సం. నల్లపెసలు†.
శింశప. సం. ఇరుగుడు†.
శికస్తు. శిథిలమగు; చెల్లాచెదరగు.
శిక్యము. సం. కావడియుట్టి; ఉట్టి. [నది.
శిక్యితము. సం. విణ. ఉట్టియందుంచఁబడి
శిక్ష. సం. షడంగములలో నొకటి; విద్యాభ్యాసము. వా. దండనము, శిక్షించుట.
శిక్షణము. సం. విద్యాభ్యాసము.
శిక్షించు. సం. స. క్రి. శిక్ష చేయు.
శిక్షితుఁడు. సం. విణ. శిక్షింపఁబడినవాడు; నేర్పరి.
శిఖ. సం. సిగ, జుట్టు; నెమిలిసిగ; సెగ, అగ్నిజ్వాల; చెట్టుకొమ్మచివర; కొన; ఊడ; కొమ్మ; తలిగొట్టు†; కిరణము.
శిఖండకము. సం. పిల్లజుట్టు, జులపాలు; నెమిలిపురి. [పురి.
శిఖండము. సం. చివర; కొన; జుట్టు; నెమిలి
శిఖండి. సం. అడవిమొల్ల†; ద్రుపదరాజు కొడుకు; నెమిలి; నెమిలిపురి; కోడి; బాణము.
శిఖరము. సం. పర్వతశిఖరము; చెట్టుకొన; మంచుపుకొండుకొన; కొన; కచ్చ; పండినదానిమ్మవిత్తువంటి కెంపుతునుక; శిలావిశేషము; అభినయహస్తవిశేషము.
శిఖరి. సం. కొండ; చెట్టు; ఉత్తరేను†.
శిఖరిణి. సం. సిగరి, పెరుఁగుతో ననేక ద్రవ్యములు కలిపి చేసినది; వృత్తవిశేషము; ఉత్తమస్త్రీ; రోమావళి; మల్లె†.
శిఖాతరువు. సం. దీపస్తంభము.
శిఖావంతుఁడు. సం. అగ్ని.
శిఖావళము. సం. నెమిలి.
శిఖి. సం. అగ్ని; నెమిలి; కోడి; చెట్టు; కేతుగ్రహము; బాణము; ఎద్దు. విణ. సిగగలవాఁడు.
శిఖిముఖి. సం చెకుముకిరాయి.
శిఖిగ్రీవము. సం. మయిలుతుత్తము.
శిఖివాహనుఁడు. సం. కుమారస్వామి.
శిగ్రుజము. సం. మునగవిత్తు.
శిగ్రువు. సం. మునగ†; కూర.
శితద్రువు సం. రూ. శతద్రువు. [యైనది.
శితము. సం. విణ. వాఁడియైనది; బక్క
శితశూకము. సం. యవధాన్యము.
శితసారకము. సం. తుమ్మికర†. [నల్లనిది.
శితి. సం. తెలుపు; నలుపు. విణ. తెల్లనిది;
శితికంఠము సం. కూకురుగుడ్డంగి.
శితికంఠుఁడు సం. శివుఁడు.
శితిసారకము. సం. తుమ్మికర†.
శిథిలము. సం. విణ. సంధులు వదలినది; జీర్ణమయినది; వదులయినది.
శిపివిష్టుఁడు. సం. విష్ణువు; శివుఁడు; బట్టతలవాఁడు; కుష్ఠరోగముగలవాఁడు.
శిఫ. సం. చెట్టుఊడ; పద్మగొమ్మ; మూలము; దుంప; నది; జటామాంసి†.
శిఫారసు. హిం. ఉపకారము చేయుమని ఒకరిని గురించి చెప్పుట.
శిబి. సం. హింసించెడిపశువు; శిబిచక్రవర్తి, పదియాఱుగురు రాజులలో నొకఁడు.
శిబిక. సం. పల్లకి, పాలకీ.
శిబిరము. సం. దండు దిగిన స్థలము.
శిర. సం. బోలునరము; ఈతె.
శిరము. సం. తల; పిప్పిలివేరు.
శిరసావహించు. సం. స. క్రి. తలయందు ధరించు.
శిరసు. సం. రూ. శిరస్సు.
శిరస్కము } సం. బొమిడికము,
శిరస్త్రము. } పాగ; ఇనుపకుళ్ళాయి
శిరస్త్రాణము } టోపి.
శిరస్యము. సం. స్నానాది సంస్కారము చేత గరగరికయైన తల వెంట్రుక.
శిరస్సు. సం. తల; శిఖరము; సేనాగ్రము వృక్షాదులచివర; ప్రధానము.
శిరాలుఁడు. సం. విణ. మిక్కిలి నరము గలవాఁడు.

శిరీషము. సం. దిరిసెనము†.
శిరోగృహము. సం. చంద్రశాల, మిద్దియిల్లు
శిరోజము. సం. తలవెండ్రుక.
శిరోధి: సం. మెడ, కంఠము.
శిరోరుహము. సం. తలవెండ్రుక.
శిల. సం. ఱాయి; కడపక్రిందిత్రొక్కుడుఁ గమ్మి; మణిసిల.
శిలము. సం. కోఁతకోసిన మళ్ళయందు జాఱిపడిన వెన్ను మొ॥ దానిని యేఱి కొని బ్రదుకుట.
శిలాక్షరము. సం. రాతిపైఁ జెక్కఁబడిన యక్షరము; శాశ్వతమైనది. [విశేషము.
శిలాజతువు. సం. సిలాజిత్తు, పర్వతధాతు
శిలాపాకి. సం. గురిగింజ.?
శిలాపుత్రము. సం. పాత్రము; గుండ్రాయి
శిలి. సం. గండూపది, ఆఁడుఎఱ్ఱి.
శిలీంధ్రము. సం. అరఁటిపువ్వు; కుక్క గొడుగు; ఎఱ్ఱి.
శిలీముఖము. సం. బాణము; తుమ్మెద.
శిలోంఛము. సం. ఉంఛము.
శిలోచ్చయము. సం. పర్వతము.
శిల్పకారుఁడు. సం. కాసెవాఁడు.
శిల్పము. సం. పనితనము, చిత్తరువు వ్రాయుట మొదలగు శిల్పములపని; నృత్తగీత వాద్యాది చతుష్షష్టి బాహ్యక్రియలు.
శిల్పి. సం. కాసెవాఁడు, వడ్లంగి మొద లగువాఁడు. (వీ రేవురు — వడ్లంగి, సాలె, మంగలి, చాకలి, ముచ్చి.)
శివ. సం. పార్వతి; నక్క; ఉసిరిక†; నేలయుసిరిక†; కరక;† జమ్మి†.
శివంకరుఁడు. సం. విణ. మేలుచేయు వాఁడు.
శివకము. సం. పశువులనుగట్టు గూటము, మేకు. [కవి, వీరశైవకవి.
శివకవి. సం. శివునిగూర్చి కవిత్వము చెప్పు
శివఘర్మజుఁడు సం. అంగారకుఁడు.
శివతాతి. సం. విణ. శుభముచేయువాఁడు.
శివమరులు. మి. శివసంబంధమైన నృత్యము. [పువ్వము†.
శివమల్లి. సం. లింగమల్లె, మోదెన, బక
శివము. సం. శుభము; సుఖము; జలము; వేదము; మోక్షము; ఒకయోగము; తియ్యమామిడి†; నూఁగుదోస†; గుగ్గిలపుఁ జెట్టు; మేకు. విణ. శుభకరము.
శివుఁడు. సం. ఈశ్వరుఁడు, ముక్కంటి.
శివకరవాలు మి. శివుని యాయుధము.
శివైక్యము. సం. విణ. శివునితో నొకటి యగుట. [చల్లనిది.
శిశిరము. సం. శిశిరఋతువు; చల్లన. విణ.
శిశుకము. సం. శిశువు; ఉలంచమీను; పిడక మొసలి. [మారచక్రము.
శిశుమారము. సం. పిడకమొసలి; శిశు
శిశువు. సం. పండ్లురానిపిల్ల; బిడ్డ.
శిశ్నము. సం. మగగుఱి
శిష్టాచారుఁడు. సం. విణ. సదాచారుఁడు; దురాచారుఁడు.
శిష్టి. సం. ఆనతి, ఆజ్ఞ.
శిష్టుఁడు. సం. విణ. సదాచారసంపన్నుడు; సజ్జనుఁడు; శ్రద్ధగలవాఁడు; విధేయుఁడు; ఆజ్ఞాపింపఁబడినవాఁడు.
శిష్యుఁడు. సం. దగ్గఱఁజేరి సేవచేయుచు విద్యాభ్యాసము చేయువాఁడు.
శిస్తు. భాగధేయము, పన్ను.

## శీ

శీకరము. సం. తుంపర; ఏనుఁగులొండము చివరయందు పుట్టెడు మదము.
శీకుఁడు. సం. హింసగలవాఁడు.
శీఘ్రము. సం. నీటివట్టివేరు; ఖండికంటి యాకు. క్రి. విణ. త్వరితముగ, వేగ ముగ. విణ. వడిగలది.
శీత. సం. నాఁగటిచాలు.
శీతకము. సం. చలికాలము.
శీతకరుఁడు. సం. చంద్రుఁడు. రూ. శీత మయూఖుఁడు, శీతాంశువు మొ.
శీతకుఁడు. సం. విణ. సోమరి.
శీతగువు(ఁడు). సం. చంద్రుఁడు.
శీతనగము. సం. హిమవత్పర్వతము.
శీతభానువు(ఁడు). సం. చంద్రుఁడు.
శీతభీరువు. సం. మల్లె†.
శీతము. సం. చల్లన; ప్రబ్బ†; విరిగి† విణ. చల్లనిది; అలసమైనది.

శీతలము. సం. పర్వతధాతు విశేషము; చందనము; సోమిదము† విణ. చల్లనిది.
శీతశివము. సం. ఇందుప్పు; జాతిపువ్వు; జమ్మి†; అడవిసదాప†. [వాఁడు.
శీతాళువు(ఁడు). సం. చలిని సహింపలేని
శీతు. సం. చలికాలము.
శీధువు. సం. పక్వమైన చెఱకురసమునఁ జేసినకల్లు; ఏనుఁగుకణతలయందు పుట్టెడుమదము; మద్యము; ఆసవము; చెఱకుపానకము.
శీర్ణము. సం. విణ. సడలినది; సన్నగిల్లినది
శీర్షకము. సం. రూ. శిరస్త్రాణము. [వాఁడు.
శీర్షచ్ఛేద్యుఁడు. సం. విణ. తలకొట్టఁదగిన
శీర్షణ్యము. సం. తలపాగ; తలవెండ్రుక; శిరస్త్రాణము; శిరస్యము.
శీర్షము. సం. శిరస్సు. [నము.
శీలనము. సం. దివ్యప్రబంధముల పరిశీల
శీలము సం. స్వభావము; మంచినడవడి.
శీలించు. సం. అ. క్రి. వాడుకపఱుచు; పరిశీలించు.
శీలుఁడు. సం. శీలముగలవాఁడు;? మంచి స్వభావముగలవాఁడు.?

## శు

శుంఠ. వా. తెలియనివాఁడు.
శుంఠి. సం. సొంటి.
శుంఠుఁడు. సం. విణ. మూఢుఁడు.
శుండ. సం. ఏనుఁగు తొండము; కల్లు; కల్లుత్రాగెడియిల్లు; నీటియేనుఁగు; వేశ్య; తామరతీఁగ.
శుండాలము. సం. ఏనుఁగు.
శుండి. సం. నల్లేరు†
శుంభుఁడు. సం. ఒక అసురుఁడు.
శుకజిహ్వము సం. ఏనుఁగు.? [షము.
శుకతుండము. సం. అభినయహస్త విశే
శుకనాసము. సం. దుండిగము†. [నము†.
శుకము. సం. మాచిపత్రి†; చిలుక; దిరిసె
శుకవాహుఁడు. సం. మన్మథుఁడు.
శుకుఁడు. సం. వ్యాసకుమారుఁడు; రావణునిమంత్రి.
శుక్కు. సం. వగపు; మనోవ్యథ.
శుక్తము. సం. పులికడుగు; మాంసము; పులుసు. విణ. పుల్లనిది; పరుషమైనది; పవిత్రమైనది.
శుక్తి. సం. ముత్తెపుచిప్ప; శంఖము; నత్తగుల్ల; పుఱ్ఱెపెంకిక; ఏనుఁగుజలగ; గుఱ్ఱపుసుడి; ఒకనేత్రవ్యాధి; నఖమను గంధద్రవ్యము.
శుక్తిజము. సం. ముత్యము.
శుక్తిమంతము. సం. ఒక కులపర్వతము.
శుక్రము. సం. రేతస్సు; కంటిపువ్వు; జేష్ఠమాసము; తెలుపు. విణ. తెల్లనిది.
శుక్రలుఁడు. సం. విణ. వీర్యవృద్ధి గలవాఁడు. [వారము.
శుక్రవారము. సం. భృగువారము, ఆఱవ
శుక్రశిష్యుఁడు. సం. అసురుఁడు.
శుక్రుఁడు సం. అసురులగురువు; అగ్నిహోత్రుఁడు.
శుక్ల. సం. శుక్లసంవత్సరము.
శుక్లము. సం. వెండి; వీర్యము; శుక్లపక్షము; తెలుపు విణ. తెల్లనిది.
శుక్లాపాంగము. సం. నెమిలి.
శుచి సం. అగ్నిహోత్రుఁడు; ఉపధాశుద్ధుఁడయినమంత్రి; శృంగార రసము; గ్రీష్మఋతువు; జ్యేష్ఠమాసము; ఆషాఢమాసము; తెలుపు. విణ. తెల్లనిది; పవిత్రము; పరిశుద్ధమై అనుపహతమైనది.
శుచిరోచి. సం. చంద్రుఁడు. [మైన యది.
శుద్ధచైతన్యము. సం. సర్వధర్మములకతీత
శుద్ధము. సం. తెలుపు. విణ. తెల్లనిది; పరిశుద్ధమైనది; దోషములేనిది; కేవలము
శుద్ధాంతము. సం. రాజుల అంతఃపురము; అంతఃపురమందుండు రాజస్త్రీ; అశౌచాంతము; వెనుకటితొట్టికట్టు. [త్వము.
శుద్ధి. సం. శోధనము; మార్జనము; నిర్మల
శునకము. సం. కుక్క.
శునకుఁడు. ఒకముని.
శుని. సం. కుక్క; ఆఁడుకుక్క.
శునీరము. సం. ఆఁడుకుక్కలసమూహము
శుభంయువు. సం. విణ. శుభముతోఁగూడుకొన్నవాఁడు.
శుభకృత్తు. సం. ఒకసంవత్సరము.

శుభదంతి. సం. వాయువుదిక్కునందలి ఆఁడేనుఁగు. విణ. చక్కనిపండ్లుగలది. రూ. శుభ్రదంతి.
శుభము. సం. మంగళము; ఒకయోగము. విణ. మంచిది; మంగళకరమైనది.
శుభాంగి. సం. రతిదేవి; కుబేరునిభార్య.
శుభ్రము. సం. అభ్రకము; తెలుపు; ఒక యోగము. విణ. తెల్లనిది; ప్రకాశించునది.
శుభ్రాంశువు(ఁడు). సం. చంద్రుఁడు.
శుల్కము. సం. సుంకము; ఓంకువ; వరుని నుండి ధనము తీసికొనుట; యజ్ఞాదులయందు సమర్పింపఁదగిన ద్రవ్యము.
శుల్బము. సం. రాగి; త్రాడు.
శుశ్రూష. సం. వినసిచ్ఛ; పెద్దలు చెప్పినట్టు వినుట; గుర్వాదులసేవ; చెప్పుట.
శుశ్రూషకుఁడు } సం. విణ శుశ్రూషచేయు
శుశ్రూషువు } వాఁడు; వినసిచ్ఛగల వాఁడు.
శుష్కము. సం. విణ. ఎండినకఱ్ఱ మొ॥; రసములేనిది; వట్టిది; కేవలము.
శుష్కించు } సం. అ. క్రి ఇంకు; ఎండు
శుష్కీభవించు }
శుష్మము. సం. బలము; సామర్థ్యము; తేజస్సు; నిప్పు, అగ్ని.
శుష్మఁడు. సం. అగ్నిహోత్రుఁడు.

## శూ

శూకకీటము. సం. తేలు; కంద్రీగ.
శూకధాన్యము. సం. వడ్లు యవలు మొ.
శూకము. సం. తేలుకొండి; యవగోధూమాదులముల్లు; కనికరము.
శూకలము. సం. శిక్షింపబఁడనిదుష్టాశ్వము.
శూకశించి. సం. దూలగొండి†.
శూద్ర. సం. శూద్రజాతి స్త్రీ
శూద్రి. సం. శూద్రునిభార్య.
శూద్రుఁడు. సం. నాలవ జాతివాఁడు.
శూన్య. సం. మల్లె†.
శూన్యము. సం. సున్న. విణ. తక్కువ యైనది; అపూర్ణమైనది; వట్టిది, లేనిది.
శూరసేనదేశము. సం. 56 దేశములలో నొకటి.
శూరుఁడు. సం. సూర్యుఁడు; వసుదేవుని తండ్రి. విణ. యుద్ధమున సాహసముగల వాఁడు.
శూర్పణఖ. సం. ఒకరాక్షసి. [కొలఁది.
శూర్పము. సం. చేట; రెండుతూముల
శూర్మి. సం. లోహప్రతిమ.
శూల. సం. కొఱ్ఱు; వేశ్య; నొప్పి.
శూలకుట్టు. మి. శూలనొప్పి.
శూలపాణి. సం. శివుఁడు.
శూలము. సం. అమ్మెడువస్తువు; త్రిశూలము, ముమ్మొనవాలు; మిక్కిలిపదనుగల ఇనుపకొఱ్ఱు; రోగవిశేషము; ఒకయోగము; బాధ; టెక్కెము.
శూలాకృతము. సం. కఱకుట్లు.
శూలి. సం. శివుఁడు. విణ. శూలరోగము గలవాఁడు; శూలముబట్టినవాఁడు.
శూల్యము. సం. శూలాకృతము.

## శృ

శృంఖల. సం. మగవాని మొలనూలు; ఏనుఁగుకాలిసంకెల; సంకెల.
శృంఖలకము. సం. కాళ్లకుబొండకొయ్య వేసిన ఒంటెపిల్ల.
శృంఖలము. సం. సంకెల; ఏనుఁగుకాలి సంకెల; మొలత్రాడు. [బడినది.
శృంఖలితము. సం. విణ. సంకెలవేయఁ
శృంగబేరము. సం. అల్లము†.
శృంగము. సం. కొమ్ము; కొమ్ముబూర, బూరగొమ్ము; కొండచఱియ; చిమ్మనగొట్టము; పర్వతశిఖరము; గుఱుతు; దొరతనము; ప్రాధాన్యము; జీవకము, వేఁగిస†. [కలసిపదారి; పరికెగడ్డ.
శృంగాటకము. సం. నాలుగుత్రోవలు
శృంగారము. సం. సౌందర్యము; గంధ వొడి; లవంగము; సిందూరము; నవరసములలో నొకటి; ఏనుఁగు అలంకారము; అలంకారము; సురతము.
శృంగారయోని. సం. మన్మథుఁడు.
శృంగారవనము. సం. ఉద్యానవనము.
శృంగారి. సం. ఏనుఁగు; పోఁక†. విణ. శృంగారము గలవాఁడు.

శృంగారించు. సం. స. క్రి. అలంకరించు.
శృంగారిలు. సం. స. క్రి. ఒప్పు.
శృంగి. సం. అతివస; మత్స్యరూపివిష్ణువు పాఁపమీను; కుండలము మొదలగునగల బంగారు; ఏనుఁగు; కొండ; పశువు; మ్రాను; బుషభము†. విణ.కొమ్ముగలది.
శృంగిణి. సం. ఆవు.
శృంగిబేరము. సం. అల్లము.?
శృంగీకనకము. సం. కుండలము మొద లైన నగల బంగారు.
శృతము. సం. పాకము, కాఁచుట. విణ. కాఁచఁబడినది; వండినది.

## శే

శేఖరము. సం. సిగనుజుట్టిన పూలదండ.
శేఖరించు. సం. అ. క్రి. గొప్పపడు.
శేపము. సం. శిశ్నము. రూ. శేపస్సు.
శేఫము. సం. శిశ్నము. రూ. శేఫస్సు.
శేఫాలిక. సం. నల్లవావిలి†.
శేముషి. సం. బుద్ధి.
శేలువు సం. విరిగి†.
శేవధి. సం. నిధి, పద్మశంఖాది.
శేవలము. సం. నీటిపాఁచి.
శేష. సం. అనుగ్రహముతో స్వనిర్మాల్యము నొసఁగుట.
శేషము. సం. మిగులు; వధము. విణ పరార్థముగాఁ బవర్తించునదై అప్రధానముగా నుండునది.
శేషశయనుఁడు. సం. శేషుఁడేశయ్యగాఁ గలవాఁడు, నారాయణుఁడు.
శేషాక్షతలు. సం. విణ. అనుగ్రహించి యిచ్చిన యక్షతలు.
శేషాచలము. సం. తిరుమల. రూ. శేష శైలము, శేషాద్రి మొ.
శేషి. సం. అంశి, సర్వజనసంరక్షకుఁడైన శ్రీమన్నారాయణుఁడు;
శేషించు. అ. క్రి. మిగులు. [రాముఁడు.
శేషుఁడు. సం. వేయి తలల సర్పము; బల

## శై

శైక్షుఁడు. సం. వేదాధ్యయనము నారంభించిన శిష్యుఁడు.
శైఖరికము. సం. ఉత్తరేను†.
శైత్యము. సం. చలువ. వా. జలుబు.
శైథిల్యము. సం. శిథిలత్వము.
శైనేయుఁడు. సం. సాత్యకి.
శైబికుఁడు. సం. బెస్త, బోయి.
శైలధన్వుఁడు. సం. శివుఁడు. [పర్వతము.
శైలము. సం. రసాంజనము; ఆపువు†;
శైలాటము. సం సింహము.
శైలాలి. సం. నటుఁడు, మేళగాఁడు.
శైలి. సం. సంకేతము, పరిభాష; శాస్త్రీయ వ్యవహారము.
శైలూషము. సం. మారేడు†.
శైలూషికి. సం. శైలూషజాతి స్త్రీ.
శైలూషుఁడు. సం. నటుఁడు; ధూర్తుఁడు; తాళధారకుఁడు; మేళముకట్టి జీవించువాఁడు.
శైలేయము. సం. ఇందుప్పు; మురి†; ఆపువ్వు†; తుమ్మెద. విణ. రాతితో సరియైనది.
శైలేయి. సం. పార్వతి.
శైవము. సం.శివుఁడు దేవుఁడుగాఁగలఒక మతము. విణ. శివసంబంధమైనది.
శైవలము. సం. నీటిపాఁచి; పద్మకాష్ఠము
శైవలిని. సం. నది.
శైవాలము. సం. నీటిపాఁచి.
శైవుఁడు. సం. శివభక్తుఁడు.
శైశవము. సం. శిశుత్వము, బాల్యము; వండ్లురాని చిన్నతనము. [భావము.
శైష్యోపాధ్యాయిక. సం. గురుశిష్యుల

## శొ

శొంఠి. గ్రా. శుంఠి.

## శో

శోకము. సం. మనోవ్యథ, వగపు, వ్యాకులత.

శోకించు. సం. అ. క్రి. పుత్రమరణాది దుఃఖముచేత తపించు, దుఃఖించు.
శోచనము. సం. వగచుట.
శోచనీయము, శోచితవ్యము } సం.విణ. శోకింపఁదగినది
శోచిష్కేశుఁడు. సం. అగ్నిహోత్రుఁడు.
శోచిస్సు. సం. వెలుఁగు, తేజస్సు; సూర్య కిరణము.
శోచ్యము. సం. విణ. శోకింపఁదగినది.
శోణకము. సం. దుండిగము†.
శోణము. సం. ఎఱుపు; ఎఱ్ఱనిగుఱ్ఱము; శోణనదము; అగ్ని; దుండిగము†. విణ. ఎఱ్ఱనిది.
శోణరత్నము. సం. కెంపు.
శోణితము. సం. నెత్తురు.
శోణిమ-ము సం. ఎఱుపు.
శోథము. సం. వాఁపురోగము.
శోధకుఁడు. సం. విణ. శోధించువాఁడు
శోధనము. సం. శుద్ధిచేయుట; పరిష్కరించుట; వెదకుట; మలము.
శోధని సం. చీఁపురుకట్ట.
శోధించు. సం. స. క్రి. (కడుగుట మొదలగువానిచే) శుద్ధిచేయు; పరిష్కరించు; వెదకు; పరిశీలించు.
శోధితము. సం. విణ. శోధింపఁబడినది.
శోధ్యము. సం. విణ. శోధింపఁదగినది.
శోఫము. సం. శోథము.
శోఫఘ్ని. సం. గలిజేరు†.
శోభ. సం. సొంపు, వస్త్రభూషణాది ప్రయుక్తమైన కాంతి; కాంతి; ఇచ్ఛ
శోభన-కృత్తు. సం. ఒక సంవత్సరము.
శోభనము. సం. ఒక యోగము విణ. సుందరము; మంచిది.
శోభాంజనము. సం. మునగ†. [రూ. శోభిల్లు.
శోభించు. సం. అ. క్రి. ప్రకాశించు.
శోభితము. సం. విణ. ప్రకాశించునది.
శోషణము. సం. శోషిల్లుట; ఒక మన్మథ బాణము; శుష్కింపఁజేయుట. విణ. శోషింపఁజేయునది.
శోషము. సం. క్షయరోగము; శోషిల్లుట.
శోషించు. సం. అ. క్రి. ఇంకు; ఎండు. రూ. శోషిల్లు.

## శౌ

శౌంఠ్యము. సం. శుంఠత్వము, మూఢత్వము
శౌండి. సం. పిప్పలి†. [వాఁడు.
శౌండికుఁడు. సం. సురాజీవి, గవల
శౌండుఁడు సం. విణ. కల్లుత్రాగి మత్తిల్లిన వాఁడు; ప్రసిద్ధుఁడు.
శౌకము. సం. శుకసమూహము.
శౌక్తికేయము. సం. ముత్యము.
శౌక్లికేయము సం. విషభేదము
శౌక్ల్యము సం. శుక్లత్వము
శౌచము. సం. శుచిత.
శౌద్ధోదని. సం. శాక్యబుద్ధదేవుఁడు.
శౌరి. సం. విష్ణువు, కృష్ణుఁడు.
శౌర్యము. సం శక్తి, బలము; ఉత్సాహము; ప్రౌఢి.
శౌల్కము సం.విణ. శుల్కసంబంధమైనది.
శౌల్కికుఁడు. సం. శుల్కాధ్యక్షుఁడు.
శౌల్బికుఁడు. సం. రాగిపనివాఁడు, కంచరి
శౌష్కలుఁడు. సం.విణ. ఎండినమాంసము నమ్మువాఁడు; మాంసము తినువాఁడు.

## శ్చ్యో

శ్చ్యోతము. సం. కాఱుట; జాఱుట; నేయిమున్నగువాని ధార.

## శ్మ

శ్మశానము. సం. ఒలికి, వల్లకాడు.
శ్మశ్రువు. సం. గడ్డము మీసాలవెండ్రుకలు

## శ్యా

శ్యామ. సం. కాళికాదేవి; యౌవనమధ్యస్థురాలు; యమున; నల్లపిచ్చుక; రేయి; నల్లతెగడ †; నీలి †; ప్రేంకణము†; బావంజి†; మామెన†.
శ్యామము. సం. ఇందుప్పు; మిరియము; ఆకుపసుపు; నలుపు; మబ్బు; కోయిల, బొద్దికూర; ప్రయాగయందలి మఱ్ఱి†; విణ. ఆకుపచ్చనిది; నల్లనిది.

శ్యామల. సం. పార్వతి, కాళిక, దుర్గ.
శ్యామలము. సం. నలుపు; రావిt. విణ. నల్లనిది. [ధాన్యవిశేషము.
శ్యామాకములు. సం. బ. చాములు, తృణ
శ్యామిక. సం. నలుపు; దోషము.
శ్యావము. సం. కోఁతివన్నె విణ. కోఁతి వన్నెగలది.

## శ్యే

శ్యేతము. సం. తెలుపు. విణ. తెల్లనిది.
శ్యేనము. సం. డేగ; తెలుపు.
శ్యేని. సం. ఆఁడుడేగ.

## శ్యో

శ్యోనాకము. దుండిగముt.

## శ్ర

శ్రథనము. సం. విణ. కట్టు; కూర్పు; విడుపు
శ్రద్దధానుఁడు. సం. విణ. శ్రద్ధగలవాఁడు.
శ్రద్ధ. సం. అక్కఱ; ఇచ్ఛ; గురువేదాంతాది వాక్యములయందు విశ్వాసము.
శ్రద్ధాళువు. సం. వేవిళ్లుగలస్త్రీ. విణ. శ్రద్ధగలది; శ్రద్ధగలవాఁడు.
శ్రమంపడు. మి. అ. క్రి. శ్రమపడు.
శ్రమణి. సం. తపస్సంపన్నురాలు; సంన్యాసిని; బౌద్ధసంన్యాసిని.
శ్రమణుఁడు. సం. యతి; బౌద్ధసంన్యాసి. విణ. నింద్యజీవనము కలవాఁడు.
శ్రమము. సం. అలసట, ప్రయాసము; అలవాటు; వ్యాయామము, సాము.
శ్రయణము. సం. ఆశ్రయించుట.
శ్రవణము. సం. చెవి; వినికిడి; శ్రవణనక్షత్రము; ఆత్మను బ్రహ్మము గావినుట
శ్రవణీయము. సం. విణ. వినఁదగినది; ఆత్మ, బ్రహ్మము.
శ్రవము. సం. చెవి.
శ్రవస్సు. సం. చెవి; కీర్తి.
శ్రవిష్ఠ. సం. ధనిష్ఠానక్షత్రము.

## శ్రా

శ్రాంతి. సం. శ్రమము; విశ్రాంతి. ?
శ్రాంతుఁడు సం. యతి. విణ. శ్రాంతిఁ బొందినవాఁడు, అలసినవాఁడు.
శ్రాణ సం. కాఁపుడుగంజి. [ర్థము.
శ్రాణము. సం. విణ. తైలపక్వమైన పదా
శ్రాద్ధదేవుఁడు. సం. యముఁడు.
శ్రాద్ధము. సం. శాస్త్రోక్తపద్ధతి ననుసరించు పితృకర్మ. విణ. శ్రద్ధతోఁగూడినది.
శ్రాయము. సం. ఆశ్రయించుట. విణ. శ్రీదేవత గాఁగల హవిస్సు ము.
శ్రావణము. సం. వినిపించుట; ఒకమాసము
శ్రావణికము. సం. శ్రావణమాసము.
శ్రావము. సం. వినుట.
శ్రావ్యము. సం. విణ. వినఁదగినది.

## శ్రి

శ్రితుఁడు. సం. విణ. ఆశ్రితుఁడు, సేవితుఁడు

## శ్రీ

శ్రీ. సం. లక్ష్మి; ఐశ్వర్యము; అవిద్య; విద్య; వృద్ధి; శోభ; సాధనము; కీర్తి; బుద్ధి; సరస్వతి; మారేడుt; ఒకరాగము త్రివర్గసంపత్తి; విషము; సాలెపురుగు ?
శ్రీకంఠుఁడు. సం. విషము కంఠమందుగలవాఁడు, శివుఁడు. [రుఁడు.
శ్రీకరుఁడు. సం. విష్ణువు. విణ. సంపత్క
శ్రీకారము. సం. శ్రీఅను అక్షరము.
శ్రీకార్యము. సం. గుడిపారుపత్తెము ?
శ్రీఖండము. సం. చందనము.
శ్రీగిరి. సం. శ్రీశైలము.
శ్రీఘనము సం. పెరుఁగు.
శ్రీఘనుఁడు. సం. బుద్ధదేవుఁడు.
శ్రీచూర్ణము. సం. తిరుచూర్ణము.
శ్రీజుఁడు. సం. మన్మథుఁడు.
శ్రీతాళము. సం తాటిచెట్టువంటి ఒక చెట్టు, విశాలదళ వృక్షము.

శ్రీదుఁడు. సం. కుబేరుఁడు. [జైనుఁడు.
శ్రీధరుఁడు. సం. విష్ణువు; బుద్ధదేవుఁడు; ఒక
శ్రీనగము. సం. శ్రీశైలము. [రుఁడు.
శ్రీనివాసుఁడు. సం. విష్ణువు; వేంకటేశ్వ
శ్రీపతి. సం. విష్ణువు; ప్రభువు.
శ్రీపర్ణము. సం. కూర నెల్లి†; తామర†; మారేడు†?
శ్రీపర్ణి-క. సం. గుమ్మడు†; టేఁకు†.
శ్రీపర్వతము. సం. శ్రీశైలము.
శ్రీపీఠము. సం. శ్రీవిద్యాచక్రపీఠము.
శ్రీపుత్త్రుఁడు. సం. మన్మథుఁడు.
శ్రీఫలము. సం. మారేడు†.
శ్రీఫలి. సం. ఉసిరిక†; నీలి†.
శ్రీమంతము. సం. బొట్టుగు†. విణ. సంపద గలది; ఒప్పిదము గలది.
శ్రీమంతుఁడు. సం. విష్ణువు; శివుఁడు; కుబేరుఁడు; ఇంద్రుఁడు. విణ. సంపద గలవాఁడు, భాగ్యవంతుఁడు; ఒప్పిదము గలవాఁడు.
శ్రీముఖ. సం. ఒక సంవత్సరము.
శ్రీముఖము. సం. గురువు మొదలగు పెద్దలు వ్రాసి పంపెడి పత్రిక.
శ్రీముద్రాంకము. సం. వైష్ణవులు ధరించు శ్రీచక్ర చిహ్నము.
శ్రీరంగనీతులు. వ్య. తా మాచరింపక యితరులకు చెప్పెడి నీతులు.
శ్రీరంగము. సం. ఉభయ కావేరీ మధ్యమున నుండు ఒక దివ్యక్షేత్రము.
శ్రీరామరక్ష. వ్య. నిరపాయము; వజ్రకవచమునకు పర్యాయము.
శ్రీలుఁడు. సం. విణ. సంపదగలవాఁడు; ఒప్పిదముగలవాఁడు.
శ్రీవత్సము. సం. విష్ణువుయొక్క ఱొమ్మునందలి మచ్చ; మహాపురుషలక్షణభూత దక్షిణావర్త శ్వేతరోమావర్తము; ఒక సారంగము.
శ్రీవత్సలాంఛనుఁడు. సం. విష్ణువు.
శ్రీవత్సాంకము సం. ఆఁబోతు.?
శ్రీవత్సాంకుఁడు. సం. విష్ణువు.
శ్రీవాసము. సం. వృక్షధూపము; పద్మము
శ్రీవృక్షకము. సం. గుఱ్ఱపుఱొమ్మునఁగల తెల్లనిసుడి.
శ్రీవృక్షకి. సం. ఱొమ్మున కంఠమున ముఖమున తెల్లని సుడిగల గుఱ్ఱము.
శ్రీవృక్షము. సం. మారేడు†; రావి.
శ్రీవేష్టము. సం. వృక్షధూపము.
శ్రీశుఁడు. సం. విష్ణువు.
శ్రీశైలము. సం. శివక్షేత్ర విశేషము.
శ్రీసంజ్ఞము. సం. లవంగము.
శ్రీహస్తిని. సం. గురుగు†.

## శ్రు

శ్రుతము. సం. వినికి; వేదము; శాస్త్రము విణ. వినఁబడినది. [సంగీతశ్రుతి; హద్ది.
శ్రుతి. సం. వేదము; చెవి; వినికి; నుతి;

## శ్రే

శ్రేణి. సం. పంక్తి; వరుస; ఇంటికుదురుజాల మీఁద వేసెడి పట్టెలు; సమానులైన శిల్పుల వరుస; బొక్కెన.
శ్రేణిక. సం. డేరా.?
శ్రేయము. సం. శుభము; ధర్మము; పుణ్యము; మోక్షము. విణ. ప్రశస్తము, శ్రేష్ఠమయినది. రూ. శ్రేయస్సు. [బొద్ది.
శ్రేయసి. సం. కరక†; గజపిప్పలి†; చిఱు
శ్రేష్ఠము. సం. విణ. ప్రశస్తమయినది.
శ్రేష్ఠి. సం. కులమునందు శ్రేష్ఠుఁడయిన శిల్పి. వ్య. వైశ్యుని ఉపపదము.
శ్రేష్ఠుఁడు. సం. కుబేరుఁడు. విణ. మేలిమిఁ బొందినవాఁడు, ప్రశస్తుఁడు.

## శ్రై

శ్రైష్ఠ్యము. సం. మేలిమి, శ్రేష్ఠత్వము.

## శ్రో

శ్రోణ. సం. గంజి, పులికడుగు.
శ్రోణి. సం. పిఱుఁదు; మొల, కటిప్రదేశము.
శ్రోణిఫలకము. సం. విశాలమైన శ్రోణి.
శ్రోణుఁడు. సం. పిచ్చుకకుంటు.
శ్రోత. సం. విణ. విను వాఁడు.

శ్రోతవ్యము సం. విశే. వినఁదగినది; ఆత్మ, బ్రహ్మము.
శ్రోత్రము. సం. చెవి. [పాలము?
శ్రోత్రియము. సం. అల్పము గా పన్ను ఇచ్చు
శ్రోత్రియుఁడు. సం. వేదము చదివిన వాఁడు; విద్య ఆచారము గలవాఁడు.

## శ్రౌ

శ్రౌతము. సం. అగ్నిత్రయము. విశే. వేదమునందు విధింపఁబడినది.

## శ్ల

శ్లక్ష్ణము. సం. విశే. సన్నము.
శ్లక్ష్ణుఁడు. సం. విశే. అల్పుఁడు; ప్రియము పలుకువాఁడు. [బలహీనము.
శ్లథము. సం. విశే. శిథిలము; దుర్బలము,

## శ్లా

శ్లాఘ. సం. పరిచర్య; ఇచ్ఛ; ప్రశంస, స్తుతించుట, మెచ్చుట.
శ్లాఘనీయము. సం. విశే. శ్లాఘ్యము.
శ్లాఘించు. సం. స. క్రి. పొగడు, ప్రశంసించు
శ్లాఘ్యము. సం. విశే. శ్లాఘింపఁదగినది.

## శ్లి

శ్లిష్టము. సం. విశే. శ్లేషతోఁ గూడినది.

## శ్లీ

శ్లీలము. సం. విశే. సంపదగలది.

## శ్లే

శ్లేష. సం. కలయిక; ఒక అర్థాలంకారము; ఒక శబ్దాలంకారము; కావ్య గుణములలో నొకటి.
శ్లేష్మణుఁడు. సం. విశే. శ్లేష్మలుఁడు.
శ్లేష్మము. సం. కఫము, తెమడ.
శ్లేష్మలుఁడు. సం. విశే. కఫరోగి.
శ్లేష్మాతకము. సం. విరిగి†.

## శ్లో

శ్లోకము. సం. సంస్కృత పద్యము, కీర్తి.

## శ్వ

శ్వదంష్ట్ర. సం. పల్లేరు†.
శ్వనిశ. సం. కొన్నికుక్కలు ఉపవాసము చేసెడి కృష్ణచతుర్దశినాటి రాత్రి.
శ్వపచుఁడు. సం. చండాలుఁడు; కుక్క మాంసము వండి తినువాఁడు.
శ్వభ్రము. సం. రంధ్రము, బొక్క; గుంట,
శ్వయథువు. సం. వాఁపురోగము.
శ్వవృత్తి. సేవ, చాకిరి.
శ్వశురుఁడు. సం. మామ, ఆలు మగల తండ్రి. బ. అత్తమామలు.
శ్వశుర్యుఁడు. సం. మగనితోఁబుట్టువు; భార్యతోఁబుట్టువు.
శ్వశ్రువు. సం. అత్త, ఆలుమగలతల్లి.
శ్వశ్శ్రేయసము. సం. శుభము, మేలు; సుఖము; మోక్షము. విశే. శుభకరము.
శ్వసనము. సం. శ్వాసము; వాయువు; మంగ†
శ్వసనుఁడు. సం. వాయుదేవుఁడు.
శ్వసితము. సం. శ్వాసము; నిట్టూర్పు; ఘూత్కారము.

## శ్వా

శ్వానబర్బర. సం. కుక్కవాయింట†.
శ్వానము. సం. కుక్క.
శ్వాపదము. సం. వ్యాఘ్రాది క్రూరజంతువు
శ్వావిధము. సం. ఏదుపంది.
శ్వాసకాసము. సం. ఉబ్బసముతోఁ గూడిదగ్గు; ఉబ్బసమును పుట్టించెడి దగ్గు.
శ్వాసము. సం. ఊపిరి; రొంపు, ఒక వ్యాధి; ప్రాణవాయువు.

## శ్వి

శ్విత్రము. సం. తెల్లపొడల కుష్ఠు.
శ్విత్రి. సం. విశే. శ్విత్రరోగము గలవాఁడు

# శ్వే

శ్వేత. సం. గవ్వ; కట్లతీఁగ; తెల్లకలిగొట్టు†.
శ్వేతకుటజము. సం. పాలకొడిసె†.
శ్వేతగరుత్తు. సం. హంస.
శ్వేతపత్త్రము. సం. హంస; తెల్లయిరుగుడు†
శ్వేతపాకి. సం. తెల్లగురిగింజ†.
శ్వేతపింగళము. సం. సింహము.
శ్వేతబృహతి. సం. తెల్లములక†.
శ్వేతమరిచము. సం. మునగవిత్తు; తెల్ల మిరియము.
శ్వేతము. సం. తెలుపు; వెండి; శ్వేత ద్వీపము; కైలాసపర్వతము; తెల్లపులుము సీసము; శంఖము; తెల్లమబ్బు; దినము యొక్క రెండవభాగము. విశ. తెల్లనిది
శ్వేతయావకము. సం. చీరపేను.
శ్వేతవాహనుఁడు. సం. అర్జునుఁడు; చంద్రుఁడు. [శ్వేతవాహి.
శ్వేతవాహుఁడు. సం. అర్జునుఁడు రూ.
శ్వేతసురస సం. తెల్లవావిలి†.
శ్వేతుఁడు. సం. శుక్రుఁడు.

---

# ష

షండము. సం. పద్మాదుల సమూహము; సమూహము; ఆఁబోతు; పొగ్గడి; పేడి.
షండుఁడు. సం. నపుంసకుఁడు.
షట్కము. సం. ఆఱు.
షట్కర్ముఁడు. సం. యజనయాజనాధ్య యనాధ్యాపనదానప్రతిగ్రహములనెడు షట్కర్మలుగలవాఁడు, బ్రాహ్మణుఁడు
షట్కాష్టకము. సం. వివాహసంబంధి గ్రహదోష విశేషము.
షట్పదము. సం. తుమ్మెద.
షడభిజ్ఞుఁడు సం. బుద్ధదేవుఁడు
షడాననుఁడు. సం. కుమారస్వామి. రూ. షణ్ముఖుఁడు వెం.
షడ్గ్రంథ. సం. గంట్లకచోరము†; వస†.
షడ్గ్రంథము. సం. గంట్లకానుగు, ఆఱు కనుపులకానుగు†.
షడ్జము. సం. సప్తస్వరములలో నొకటి.
షడ్జకుఁడు. సం. తోడియల్లుఁడు.
షడ్బిందువు. సం. విష్ణువు; ఒకపురుగు.
షడ్భాగము. సం. కప్పము;? మిడుఁగుఱు.?
షణ్ముఖి. సం. ఒక యోగముద్ర.
షణ్ముఖుఁడు. సం. కుమారస్వామి.
షరతు. హిం. ఒడంబడిక.
షరా. హిం. అనుబంధము.
షరాఖత్తు. హిం. ప్రాలికాపుతనము.
షరాపు. హిం. చిల్లరమార్చువాఁడు.
షరాయి. హిం. లాగు.
షర్టు. ఇం. లోపలధరించు చొక్కాయి.
షష్టి. సం. స. అఱువది.
షష్టికము. సం. సట్టికలు, అఱువదిదినము లలో పండెడు వడ్లు.
షష్టిక్యము. సం. విశ. సట్టికలుపండెడు నేల
షష్టితమము. సం. విశ. అఱువదవది.
షష్ఠము. సం. విశ. ఆఱవది.
షష్ఠి. సం. ఆఱవతిథి; పార్వతి.
షష్ఠ్యంతములు. సం. బ. తెలుఁగుకావ్యా వతారికలలో కృతినాయకునకుఁ జెప్పు షష్ఠీవిభక్త్యంత పద్యములు.
షహరు. హిం. పట్టణము.

## షా

షాకు. ఆయవ్యయములు లిఖించుపద్ధతి.
షాడబ(వ) ము. సం. ఆఱుస్వరములుగల రాగము; మధ్యాది షడార్థము లతోఁ జేరిన రసవిశేషము.
షాడ్గుణ్యము. సం. ఐశ్వర్యాదిగుణములు; సంధివిగ్రహాది రాజషడ్గుణములు;
షాణ్మాతురుఁడు. సం. కుమారస్వామి.
షాణ్మాసికము. సం. మృతుని ఆఱవనెలను ముందురోజున చేసెడి ఒక శ్రాద్ధము.

## షి

షికారీ. హిం. వేఁటకాఁడు.
షికారు. హిం. వేఁట; సవారి మీఁద పోవుట; వాహ్యాళి.
షిద్గుఁడు. సం. విటుఁడు; కాముకుఁడు.

## షు

షురువు. హిం. ఆరంభము.

## షో

షోడశకము. సం. పదియాఱు; ఈ సంఖ్య గల ఒక గణము — పంచభూతములు, పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, మనస్సు. [పండుగ.
షోడశపండువు. మి. పదునాఱు రోజుల
షోడశము. సం. విణ. పదియాఱవది.
షోడావాటరు. ఇం. సోడాకలిపిననీరు.

## ష్ఠీ

ష్ఠీవనము. సం. ఉమి, ఉమ్మి; ఉమియుట.

---

# స

సం. సం. ఉప. ఇది సంస్కృత పదములకు ముందు నిలిచి చక్కఁగా చక్కని మిక్కిలి అను నర్థములుంగలదియగును.
సంకట. అపణ్యద్రవ్యము.
సంకటపడు. మి. అ. క్రి. ఇఱుకుపడు.
సంకటపాటు. మి. సంకటపడుట.
సంకటము. సం. దుఃఖము; ఇఱుకు. విణ ఇఱుకయిన స్థలము.
సంకటి. ఉడికిన రాగిపిండి మొ॥; మిక్కిలి ఉడికిన అన్నము మొ.
సంకరము. సం. విణ. ఒండొంటి కలయిక, కలగలపు; అవకరము; పాలును నీరును కలసిన విధమునసైన అర్థాలంకారముల యొక్క పరస్పర సంబంధము.
సంకర్షణుఁడు. సం. బలరాముఁడు.
సంకలనము. సం. కూడిక, కూర్పుట.
సంకలితము. సం. విణ. కూర్పఁబడినది; రాశిగా చేయఁబడినది.
సంకలియ. సంకెల.
సంకల్పజము. సం. కామము.
సంకల్పజుఁడు. సం. మన్మథుఁడు.
సంకల్పము. సం. కోరిక; మనస్సున తలఁచుకొనుట; ఎన్నిక; మనోవ్యాపారము.
సంకల్పించు. సం. స. క్రి. ఎంచు.
సంకసుకుఁడు. సం. విణ. నిలుకడలేనివాఁడు; దుర్జనుఁడు.
సంకారము. సం. అగ్ని చటాత్కారము; అవకరము. [సమీపమైనది.
సంకాశము. సం. విణ. సమానమైనది;
సంకీర్ణము. సం. విణ. సంకటము; ఒకటితో నొకటి కలసినది; ఎడము లేకుండనిండినది; వ్యాకులమైనది. [శంఖువలయము.
సంకు. శంఖము; కన్యాశుల్కము. బ.
సంకుచించు. సం. అ. క్రి. సంకోచము నొందు [దినది.
సంకుచితము. సం. విణ. సంకోచమునొం
సంకుదారి. విష్ణువు.
సంకుమదము. సం. జవ్వాజి.
సంకులము. సం. విణ. అస్పష్టవాక్కు; పొసఁగనిమాట; ఒకటితోనొకటి కలసినది; వ్యాపించినది.
సంకులవాఁడు. శాంఖికుఁడు.
సంకువు. సం. జవ్వాజిపిల్లి. [త్కారము.
సంకృతి. సం. ఒకఛందస్సు; అగ్ని చటా
సంకెల. కాలికట్టగు ఇనుపగొలుసు.
సంకేతము. సం. సంజ్ఞ, సైగ; రహస్యస్థలము; శబ్దనిష్ఠమైన అర్థబోధనశక్తి విశేషము; పేరు; ఏర్పాటు; ఒడఁబాటు; నిర్దేశము.

సంకేతించు. సం. స. క్రి. పేరుపెట్టు; ఏర్పాటుచేయు; నిర్దేశించు.
సంకోచపిశునము. సం. కుంకుమపువ్వు.
సంకోచము. సం. కుంకుమము; ముకుళీభావము; ఇముడ్చుట; సంక్షేపము; ఒకచేఁప.
సంకోచించు. సం. అ. క్రి. సంకోచమునొందు
సంక్రందనుఁడు. సం. ఇంద్రుఁడు.
సంక్రమణము. సం. సూర్యుఁడు ఒకరాశి నుండి మఱియొకరాశికి ప్రవేశించుట; చక్కఁగానడచుట.
సంక్రమము. సం. నీటికట్టు మొదలగునది; వంతెన; చేనిగట్టు; సంక్రమణము.
సంక్రమించు. సం. అ. క్రి. ప్రవేశించు.
సంక్రాంతి. సం. మేషాది సంక్రమణము; మకరసంక్రమణము.
సంక్రామము. సం. వంతెన.
సంక్షిప్తము. సం. విణ. సంక్షేపింపఁబడినది
సంక్షేపణము. సం. సంక్షేప పఱచుట.
సంక్షేపము. సం. సంగ్రహము, క్షిప్తము చేయుట. [చేయు, క్షిప్తముచేయు.
సంక్షేపించు. సం. స. క్రి. సంక్షేపము
సంక్షోభణము. సం. కలఁతపెట్టుట.
సంఖ్య. సం. లెక్క; (దశగుణోత్తరములైన సంఖ్యావిశేషములు — ఏక, దశ, శత, సహస్ర, అయుత, లక్ష, నియుత, కోటి, అర్బుద, శంఖ, ఖర్వ, నిఖర్వ, మహాపద్మ, శంకు, సాగర, అంత్య, మధ్య, పరార్ధములు.) విచారణ; సమ్యక్ జ్ఞానము.
సంఖ్యము. సం. యుద్ధము.
సంఖ్యాతము. సం. విణ. లెక్కపెట్టఁబడినది.
సంఖ్యానము. సం. సంఖ్య; లెక్కపెట్టుట.
సంఖ్యావంతుఁడు. సం. పండితుఁడు.
సంఖ్యేయము. సం. విణ. లెక్కపెట్టఁదగినది.
సంగడము. జెట్టిసాధన కుపయోగమైన యిసుపగుండు; స్నేహము; చేరిక; పరివారము; సమీపము; జత; సేన; సహాయము
సంగడి. స్నేహము; జత; రెండు తాటిబొందులు జతగాకట్టిన తెప్ప; సమీపము; పార్శ్వము; వెనుక; సమూహము; విధము; వర్గము; మిత్రభావము.
సంగడికత్తె. చెలికత్తె, సఖి.
సంగడికాఁడు. స్నేహితుఁడు.
సంగడీఁడు. స్నేహితుఁడు.
సంగతము. సం. స్నేహము; చేరిక. విణ. యుక్తము; యుక్తియుక్తమైనవాక్యము.
సంగతి. సం. చేరిక, కలయిక; జ్ఞానము; సహవాసము. [మడుఁగు.
సంగమడుఁగు. ఊరికిసమీపమునందుండు
సంగమము. సం. కలయిక; మైథునము.
సంగము. సం. కూడిక, కలయిక, చేరిక; తగులము.
సంగరము. సం. జమ్మిపండు; యుద్ధము; ప్రతిజ్ఞ; అంగీకారము; ఆపద; విషము.
సంగాడి. స్నేహితుఁడు. [కత్తియ.
సంగాతకత్తె. మిత్రురాలు. రూ. సంగాత
సంగాతకాఁడు. మిత్రుఁడు.
సంగాతము. స్నేహము.
సంగాతి. స్నేహితుఁడు.
సంగి. సం. విణ. సంగముకలవాఁడు.
సంగీతము. సం. దర్శించుటకగు ఆటపాట వాయిదము. (ఇది మార్గమని దేశియని ద్వివిధము—మార్గము బ్రహ్మాదులచేత మహేశ్వరుని యొద్దనుండి వెదకి తేఁబడి భరతాదులచే ప్రయోగింపఁబడినది. దేశి దేశదేశములందలిజనులకుహృదయ రంజకమైన విధముగా నేర్పడినది) విణ. చక్కఁగా గానము చేయఁబడినది.
సంగీర్ణము. సం. విణ. అంగీకరింపఁబడినది.
సంగోరు. పంటయందు సగముకోరు.
సంగ్రహము. సం. సమ్యగ్గ్రహణము; స్వీకారము; సంపాదనము; సంక్షేపము సంక్షిప్తగ్రంథము.
సంగ్రహించు. సం. అ. క్రి. చక్కఁగాగ్రహించు; సంక్షేపించు.
సంగ్రామము. సం. పోరు, యుద్ధము.
సంగ్రాహము. సం. డాలుపిడి; పిడికిటఁబట్టుట; పిడికిలి.
సంఘము. సం. గుమి; ప్రాణిసమూహము.
సంఘర్షణము, సంఘర్షము } సం. ఒరయిక; పోటి; వివాదము; గాలి

సంఘాతము. సం. సమూహము; గట్టి దెబ్బ; ఒక నరకము. [గుంపుగూడు.
సంఘీభవించు. సం. అ. క్రి. పిండుగట్టు,
సంచము. సం. గ్రంథమును వ్రాయుటకై ఏర్పఱచిన కాగితములకట్ట.
సంచయనము. సం. ప్రోగుచేయుట.
సంచయము. సం. ప్రోగు; కూడబెట్టుట; సమూహము.
సంచరణము. సం. సంచారము.
సంచరము. సం. మార్గము.
సంచలియించు సం. స. క్రి. సంచలించు, మిక్కిలి కదలు.
సంచారము సం. తిరుగుట; నడక.
సంచారి. సం. ఒక శృంగారభావము. విణ. సంచరించువాడు.
సంచారిక. సం. కుంటెనకత్తె; జత; ముక్కు
సంచి. గోణి; గోణీభేదము; ధనము మొదలైనవియుంచెడు గుడ్డలు మొదలైన వానితోగుట్టిన తిత్తి. [కులు.
సంచిక. చేర్చికట్టిన కట్టిన కొన్ని తాటా
సంచికట్టు. సంచికట్టుకొని యదేపనిగా ప్రవర్తించువాడు. (వైద్యుడు)
సంచితము. సం. విణ. ప్రోగుచేయబడినది; రచింపబడినది.
సంచిమొదలు. మూలధనము.
సంచీ. రూ. సంచి.
సంచేయము సం. విణ. సంచయము చేయదగినది.
సంచేకరము ) క్రయ విక్రయము లు
సంచేకరువు } మొదలైన వాని గట్టికై
సంచేకారము ) ముందిచ్చెడు ధనము, సత్యంకారము.
సంచేము. బంగారు.
సంచే. జాడ; అందము; విధము.
సంజాయిషీ. హిం. సమాధానము.
సంజీవనము. సం. నాలుగిండ్లబవంతి.
సంజీవకరణి. సం. ఓషధీవిశేషము.
సంజీవని సం. ప్రాణధారణ హేతువైన ఒక ఓషధి.
సంజీవి. వా. సం. సంజీవని.
సంజ్ఞ సం. చేయి మొదలగువానితోడి సైగ; పేరు; తెలివి; సంకేత పరిభాష; గాయత్రి; సూర్యుని భార్య.
సంజ్ఞపనము. సం. చంపుట; విన్నవించుట.
సంజ్ఞపితము. సం. విణ. చంపబడినది.
సంజ్ఞప్తి. సం. చంపుట; విన్నవించుట.
సంజ్ఞువు సం విణ. ముడికాళ్ళ వాడు. రూ. సంజ్ఞుడు. [వేడిమి.
సంజ్వరము. సం. సంతాపము, కాక;
సంజె. సంధ్య, సంధ్యాకాలము.
సంజెపడు. అ. క్రి. సంధ్యాకాలమగు.
సంజోక. ఉభయముఖములయందు తాకెడి కొనముడిగల డుబుడక్క నడిమిత్రాడు. [మీదికెగురుట.
సండీనము. సం. చెట్టు మొదలైన వాని
సంత. చెంత; నిర్ణయింపబడిన దినము నందుంచెడు అంగళ్లవరుస; వేదపాఠము
సంతకన్ను. నిలుకడలేనిచూపు. (సంతలో నొకదానిపై దృష్టి స్థిరముగానుండదు.)
సంతకము. వ్రాతకర్త మొక్కచేవ్రాలు. దస్కతు, హస్తాక్షరములు.
సంతతము. సం. క్రి. విణ. ఎల్లప్పుడు, నిరంతరము. విణ. ఎడతెగనిది.
సంతతి. సం. గోత్రము, కులము, సంతానము, పుత్రపౌత్రపారంపర్యము; శిష్య ప్రశిష్య పరంపర; వరుస; విరివి.
సంతన. చేరిక. [అయిత్తపడు.
సంతనకట్టు. అ. క్రి. చేరు, సంఘీభవించు;
సంతనచేయు. స. క్రి. ప్రోగుచేయు.
సంతపడు అ. క్రి. ఒద్దికపడు. ప్రే. సంతపఱచు.
సంతపెట్టు. స. క్రి. ఒద్దికపఱచు.
సంతప్తము. సం. విణ. మిక్కిలి తాపము నొందినది.
సంతప్తుడు. సం. విణ. శ్రాంతుడు; ఆకలిదప్పులచేత పీడింపబడినవాడు; అగ్న్యాదులచేతపింపజేయబడినవాడు
సంతబసివి. బజారుపడతి.
సంతమసము. సం. అంతటనిండిన చీకటి
సంతరించు. స. క్రి. పరిపఱచు; నేకరించు; కలిగించు; రచించు; ధరించు; సంగ్రహించు; పోషించు.
సంతర్పణము. సం. తృప్తిపఱచుట.

సంతసపడు. అ. క్రి. సంతోషపడు.
సంతసము. సంతోషము. [సంతసిల్లు.
సంతసించు. అ. క్రి. సంతోషించు. రూ.
సంతానము. సం. బిడ్డ; పుత్రపౌత్ర పారం పర్యము, వంశము, కులము; ఒక దేవ వృక్షము. (సప్తసంతానములు— తటాకము, నిధి, అగ్రహారము, దేవాలయము, వనము, ప్రబంధము, పుత్రుఁడు)
సంతానిక. సం. పాలమీఁది మీఁగడ.
సంతాపనము. సం. మన్మథబాణవిశేషము
సంతాపము. సం. ఉష్ణము, కాఁక; మన్మథ తాపము; ఎండతాపము.
సంతాపించు. సం. అ. క్రి. మిక్కిలితపించు.
సంతాపితము. సం. విణ. మిక్కిలితాపము నొందినది. [చేత పీడింపఁబడినవాఁడు.
సంతాపితుఁడు. సం. ఎండ మొదలగువాని
సంతు. సంతానము; కులము.
సంతొసము. సంతోషము.
సంతోపము. సం. సంతసము.
సంతోషించు } సం. అ. క్రి. సంతోషపడు.
సంతోషిల్లు
సంతోసము. సంతోషము.
సంతోసించు } అ. క్రి. అలరు, ఆనందపడు
సంతోసిల్లు
సంద. సంధ్యాకాలము.
సందంశము. సం. పటుకారు; అభినయ హస్తవిశేషము.
సందడి. జనసమూహధ్వని; జనసమ్మర్దము; అతిశయము. విణ. సంకులము.
సందడించు } అ. క్రి. సందడిచేయు; అతిశయించు.
సందడిల్లు
సందడికాఁడు. విణ. సామాన్యుఁడు.
సందడిగొను. అ. క్రి. సందడించు. ప్రే. సందడిగొలుపు.
సందడిపడు. అ క్రి. సందడించు.
సందరము. సముద్రము.
సందర్భము. సం. కూర్పుట, కూర్పు; రచన; ప్రకరణము; ప్రబంధముయొక్క కూర్పు; పువ్వులు మొదలగువానిని గుచ్చుట; ప్రబంధము; సమయము; అనుకూలము.
సందర్భించు సం. అ. క్రి. సమయమగు.
సందానము. సం. కట్టు, బంధము; పలుపు, పసులనుగట్టెడు దామెన.
సందానితము. సం. విణ. కట్టఁబడినది; కూర్పఁబడినది.
సందానిని. సం. గోశాల. [పోవుట.
సందావము. సం. యుద్ధమువలనఁ బాఱి
సంది. సం. దండచేయి, ప్రకండము; సంధి, వద్దణములములో మొదటిది.
సందికడియము. కేయూరము, సందిట వేసికొను కడియము,
సందిగ్ధము. సం. సందేహము. శబ్దదోష ములలో నొకటి. విణ. సందేహముగలది.
సందితము. సం. విణ. సందానితము.
సందిదండ. కేయూరము, సందిటఁగట్టు కొనెడు భూషణము.
సందియపడు అ. క్రి. సందేహపడు.
సందియము. సందేహము.
సందిలి. ప్రకండము, దండచేయి.
సందిలిదండలు. బ. అంగదములు.
సందు ఇఱుకువీథి; కలయిక; సొరంగము ఏకమగుట; అడుగుజాడ; ఎడము; సంధి; సందుకట్టు; సందర్భము; రంధ్రము.
సందుకట్టు. మధ్యకాలము.
సందుకా. హిం. చిన్న పెట్టె.
సందుకొను. అ. క్రి. వ్యాపించు. స. క్రి. కూడు; పరిగ్రహించు.
సందుగొట్టు. అ. క్రి. సందుదవులు.
సందుఁడు. స్కందుఁడు, కుమారస్వామి.
సందుదవులు. అ. క్రి. సందుదోషముతగులు
సందుదోషము. మి. బిడ్డలకు మాససంధి యందుఁగలుగు బాలగ్రహదోషము.
సందువంకలు. ప్రకండనఖక్షతములు.
సందుసీసము. మల్లబంధ విశేషము.
సందె. సంధ్య.
సందెజాము. సంధ్యాకాలము.
సందెమల్లియ. రుద్రాక్షితీఁగె.
సందేశము. సం. వర్తమానము, కబురు, సమాచారము.
సందేశహరుఁడు. సం. దూత, హర్కారా.
సందేహము. సం. సంశయము; ఒకయర్థా లంకారము.

సందేహి. సం. విణ. సందేహముగలవాఁడు.
సందేహించు. సం. అ. క్రి. సంశయించు.
సందోహము. సం. సమూహము.
సంద్రము. సముద్రము.
సంద్రావము. సం. యుద్ధమువలనఁ బాఱుట
సంద్రుఁడు. సముద్రుఁడు.
సంధ. సం. ప్రతిజ్ఞ; మేర; సంధ్య; ఈనికి
సంధాత. సం. విణ. సంధాయకుఁడు.
సంధానము. సం. కూర్చుట; బాణము వింటినారియందు కూర్చుట; కల్లు సేయుట.
సంధానకరణి. సం. ఓషధీ విశేషము.
సంధానించు. సం. స. క్రి. కూర్చు.
సంధానితము. సం. విణ. కూర్చఁబడినది.
సంధాయకుఁడు. సం. విణ. సంధానము చేయువాఁడు, కూర్చువాఁడు.
సంధి. సం. కూడిక, కలయిక; కూర్చుట; శత్రువుతోడి పొందు; ముఖాది; (ముఖము, ప్రతిముఖము, గర్భము, విమర్శము, నిర్వహణము అని యివి నాటకము నందలి పంచసంధులు.) సందు; కన్నము సొరంగము; ఆఁడుగుఱ్ఱి; ఒకజాడ్యము.
సంధించు. సం. అ. క్రి. కూడు. స. క్రి. కూర్చు. [కలసినది.
సంధితము. సం. విణ. కూర్చఁబడినది;
సంధిత్సు. సం. సంధింపనిచ్ఛ.
సంధిత్సువు. సం. విణ. సంధింప నిచ్ఛగల వాఁడు. [నిచ్చెడి యావు.
సంధిని. సం. పెడావు; అకాలమునఁబిదుక
సంధిల్లు. సం. కూడు, చేరు, తగులంబడు.
సంధుక్షణము. సం. రాఁజఁబెట్టుట.
సంధుక్షితము. సం. విణ రాఁజఁబెట్టఁబడినది, బాగుగా రగుల్కొల్పఁబడినది.
సంధ్య. సం. ప్రొద్దుపొడుచుటకు మున్నైదు గడియలవఱకును ప్రొద్దుగ్రుంకిన వెనుక మూఁడు గడియలవఱకును గలకాలము; రేయి పగలు వీని నడుమనుండు కాలము; ప్రాతర్మధ్యాహ్న సాయంకాలముల సంధిసమయము; ఈ మూఁడు వేళల విధింపఁబడినకర్మ; ఈమూఁడువేళల చేసెడి ఉపాసన; ఒకనది; సంధి; కూర్చుట; ప్రతిజ్ఞ; మేర; త్రిసంధి పుష్పము, చింతనము, ధ్యానము.
సంన్యాసము. సం. రూ. సన్న్యాసము.
సంపంగి. చంపకము†.
సంపంగిపూవడ్లు. బ. ధాన్యవిశేషము.
సంపఁగియ. సంపెఁగ†.
సంపఁగె. చంపకము†. బ. ధాన్యవిశేషము
సంపతిల్లు. అ. క్రి. సమృద్ధమగు.
సంపత్తి. సం. సంపద; సమృద్ధి.
సంపత్తు } సం. ఐశ్వర్యము; గుణోత్కర్షము; హారభేదము.
సంపద }
సంపన్నము. సం. విణ. సంపదతోఁగూడినది; సమృద్ధమైనది; నిండారినది; సాధింపఁబడినది.
సంపన్నుఁడు. సం. విణ. సంపదగలవాఁడు
సంపరాయము. సం. యుద్ధము.
సంపర్కము. సం. కలయిక; చేరిక.
సంపాకము. సం. రేల†.
సంపాటము. చెక్కడపుపనియందు ఒమ్ము చ్చును అందు చెక్కెడు రత్నములను లక్కయుగూడఁజేర్చితూఁచెడి తూనిక. సం. కదురు. [విశేషము.
సంపాతము. సం. చక్కనిపాటు; పక్షిగతి
సంపాదకుఁడు. సం. విణ. సంపాదించు వాఁడు.
సంపాదనము. సం. గడించుట.
సంపాదించు. సం. స. క్రి. గడించు.
సంపాదితము. సం. విణ. సంపాదింపఁబడినది. [దగినది.
సంపాద్యము. సం. విణ. సంపాదింపఁ
సంపాసారి. కోమటి, వైశ్యుఁడు.
సంపు. సమృద్ధి. ప్రే. చంపు.
సంపుటము. సం. బరణి; ముకుళనము.
సంపుటించు. సం. స. క్రి. ముకుళించు.
సంపూర్ణము. సం. విణ. నిండారినది.
సంపృక్తము. సం. విణ. కలసినది.
సంపెంగ. చంపకము†.
సంపెఁగ. సంపఁగె. బ. ధాన్యవిశేషము.
సంపెట. కశ; ఇనుము సాఁగఁగొట్టెడి సమ్మెట. [వాఁడు.
సంప్రతి. లెక్కసరిచూచు పెద్దకరణము
సంప్రతించు. స. క్రి. లెక్క మొదలైనవి సరిచూచు. [నొకటి; చక్కనియావి.
సంప్రదానము. సం. షట్కారకములలో

సంప్రదాయము. సం. గురుపారంపర్యము; గురుపరంపరచేతవచ్చినది; వంశపురీతి.?
సంప్రధారణ. సం (దేనిదేని యిదియుక్తమని) సమర్థించుట.
సంప్రధారణము. సం. విచారణ; వ్యవహారమునందు నిశ్చయమును బుట్టించునట్టి లిఖిత సాక్ష్యాదులు.
సంప్రయోగము. సం. చక్కని ప్రయోగము; మూలికాదులతోఁ జేసెడి యుచ్చాటనాదిక్రియ; సంగమము.
సంప్రసారణము. సం. ఇ ఉ ఋ ౡ వర్ణములు య వ ర ల వర్ణములకు మాఱుగా వచ్చుట.
సంప్రహారము. సం. యుద్ధము; గమనము.
సంప్రేషణము. సం. ద్వాదశాహశ్రాద్ధము.
సంప్రేషము. సం. నియోగము.
సంప్రోక్షణము. సం. ఉదకాదులను బ్రోక్షించి చేసెడు ఒక సంస్కారము; చిలుకరించుట; పరిశుద్ధిచేయుట.
సంప్రోక్షించు. సం.స.క్రి. సంప్రోక్షణము చేయు. [వికసించినది.
సంఫుల్లము. సం.విణ. చక్కగా విరిసినది,
సంబంధము. సం. తాలూకు; చుట్టఱికము; కూడిక. (నవవిధ సంబంధములు— పితృపుత్ర సంబంధము, రక్ష్యరక్షక సంబంధము, శేషిశేషసంబంధము, భర్తృభార్యా సంబంధము, జ్ఞాతృజ్ఞేయ సంబంధము, స్వస్వామిసంబంధము, శరీరిశరీరసంబంధము, ఆధారాధేయ సంబంధము, భోక్తృభోగ్యసంబంధము)
సంబంధి. సం. చుట్టము, సంబంధముచేసినవాఁడు. విణ. సంబంధముగలవాఁడు; సంబంధము గలది. [స. క్రి. కూర్చు.
సంబంధించు. సం. అ. క్రి. సంబంధపడు
సంబడము. దారిబత్తెము; బత్తెము; జీతము
సంబడించు. అ. క్రి. సంబళించు.
సంబరము. సంభ్రమము, వేగిరపాటు; సంతోషము; కేళిక; ఉత్సవము; పండుగ
సంబరి. రూ. సంబళి. సం. ఎలుకజీడి†; పిల్లపీచరం†. [సంబరేణి.
సంబరేమ. సాతల, చర్మకష†. వా.
సంబలము. సం. జలము; దారిబత్తెము.

సంబవులు. బ. పాదరక్షలు; పావకోళ్లు.
సంబళకాఁడు. జీతకాఁడు.
సంబళము. సం. దారిబత్తెము; బత్తెము; జలము. వ్య. జీతము.
సంబళి. అవ్య. తొలఁగుము.
సంబళించు. అ.క్రి. పల్లపడు; తెప్పిలు.
సంబళిక. అడపము.
సంబాకృతము. సం.విణ. ద్విహల్యము.
సంబాగు—వు. ఏఱుదాఁటెడుసాధనము.
సంబాధము. సం. ఇఱుకు; ఆఁడుగుఱి.
సంబారము. వేశవారము.
సంబారు. రూ. సంబారము.
సంబావు. సస్యవిశేషము. బ. కసుమధాన్యము. [చేర్చు; కలిగించు.
సంబాళించు. స.క్రి. ఆదరించు; నెఱ
సంబాళిగలు. బ.పావకోళ్ళు; పాపోసులు.
సంబుద్ధి. సం. సంబోధనము.
సంబెరము. జలము.
సంబెళ. అడపము.
సంబోధనము. సం. పిలుపు, ఆహ్వానము.
సంభ్రమము. సంబరము. [రుక.?
సంభరువు. సం. పావకోళ్లు.? రూ. సంభ
సంభళి. సం. కుంటెనకత్తె.
సంభవము. సం. పుట్టుక; హేతువు; కూడిక, చేరిక; ఆధేయమాధారమును మీఱకుండుట.
సంభవించు. సం.అ.క్రి. పుట్టు; ప్రాప్తమగు, రూ. సంభవిల్లు.
సంభారము. సం. చక్కఁగాపోషించుట; చక్కఁగాధరించుట; సమూహము; సర్వపూర్ణత్వము; ఉపకరణము, సాధనము.
సంభావన—ము సం. సమ్మానము, బహుమానము; తలఁపు; యోగ్యత; ఒక అలంకారము. [దగినది.
సంభావనీయము. సం. విణ. సంభావింపఁ
సంభావించు. సం.అ.క్రి. చక్కగాతలఁచు. స.క్రి. బహుమానించు, సమ్మానించు.
సంభావితము. సం.విణ. చక్కఁగాఁతలఁపఁబడినది; సమ్మానింపఁబడినది.
సంభావ్యము. సం.విణ. సంభావింపఁదగినది
సంభాష—ణము. సం. ఆభాషణము.

సంభాషించు. సం అ. క్రి. చక్కఁగా మాటాడు.
సంభూతము. సం. విణ. పుట్టినది.
సంభృతము సం.విణ. చక్కఁగా ధరింపఁబడినది; చక్కఁగా భరింపఁబడినది.
సంభృతి. సం. చక్కఁగా ధరించుట; చక్కఁగా భరించుట.
సంభేదము. సం. నదీనదసంగమము; నది సముద్రముతో కలియుట; వికసించుట; కూడిక. [భోగము.
సంభోగము. సం.సంగమము;సంతోషము;
సంభోగించు. సం. అ. క్రి. రమించు; అనుభవించు. [భయము; ఆదరము.
సంభ్రమము సం.తొందర,తొట్రుపాటు;
సంభ్రమించు. సం అ.క్రి. వేగిరపడు, తొందరపడు.
సంమృష్టము. సం. విణ. శోధింపఁబడినది.
సంయతము. సం.విణ. కట్టఁబడినది.
సంయత్తు. సం. పోరు, యుద్ధము.
సంయమనము. సం. బంధనము; వ్రతము; యమలోకము.
సంయమని. సం. యమపురి.
సంయమము సం. ఇంద్రియనిగ్రహము; హింసాదులవలన విరమించుట; వ్రతాదులకంగమై తొలిదినము చేయఁదగిన యాచారము; ధారణ ధ్యానము సమాధి యను నీమూడింటి సంజ్ఞ. [గలవాఁడు.
సంయమి సం ముని. విణ. సంయమము
సంయామము. సం. రూ. సంయమము.
సంయావము. సం. గోధూమ భక్ష్యవిశేషము, సారెసత్తులు.
సంయిబుడ్డి సిరాబుడ్డి ?
సంయుక్తము సం. విణ. కూడుకొన్నది.
సంయుగము. సం. యుద్ధము.
సంయోగము. సం. కూడిక.
సంయోజితము. సం. విణ. మఱియొకదానితో కూర్పఁబడినది.
సంరంభము. సం. కోపము; ఆటోపము; ఉత్సాహము.
సంరంభి సం.విణ.సంరంభముగలవాఁడు.
సంరంభించు. సం. అ.క్రి. ఆటోపించు, వేగిరపడు.
సంరబ్ధము. సం.విణ.సంరంభమునొందినది
సంరావము. సం. ధ్వని.
సంరూఢము. సం. విణ. పెరిగినది; మొలచినది; వృద్ధినొందినది; పుట్టినది.
సంరోధించు. సం. నిరోధించు.
సంలాపము. సం ప్రీతితోడి పరస్పర సంభాషణము.
సంవత్సరము సం. ఏఁడాది. (ఇవి యఱువది— ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోద ప్రజాపతి, అంగిరస్సు, శ్రీముఖ, భావ, యువ, ధాత, ఈశ్వర, బహుధాన్య, ప్రమాది, విక్రమ, వృష, చిత్రభాను, స్వభాను, తారణ, పార్థివ, వ్యయ, సర్వజిత్తు,సర్వధారి,విరోధి,వికృత, ఖర, నందన, విజయ,జయ, మన్మథ,దుర్ముఖ, హేమలంబ,విలంబ,వికారి,శర్వరి,ప్లవ, శుభకృత్తు, శోభనకృత్తు, క్రోధి, విశ్వావసు, పరాభవ, ప్లవంగ, కీలక, సౌమ్య సాధారణ, విరోధకృత్తు, పరిధావి, ప్రమాథి,ఆనంద, రాక్షస,అనల,పింగళ, కాళయుక్త, సిద్ధార్థ, రౌద్ర, దుర్మతి, దుందుభి, రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన, క్షయకృత్తు. [సంవననము.
సంవదనము. సం. వశీకరణము. రూ.
సంవననము. సం. సప్తపదార్థములలో నొకటి, ధ్యానము.
సంవర్తకము సం. బలరాముని నాఁగలి.
సంవర్తము సం. ప్రళయము; మేఘవిశేషము; తాండ్రక†.
సంవర్తిక. సం. లేఁతతామరపూరేకు.
సంవర్తుఁడు. సం. ఒకముని; ఒక అవధూత; ఒక మేఘనాయకుఁడు.
సంవసథము. సం. ఊరు, గ్రామము.
సంవసించు. సం. స. క్రి. నివసించు.
సంవాదము. సం. సమాచారము, సందేశము; సంభాషణము.
సంవాహకుఁడు. సం. ఒత్తుపిసుకువాఁడు
సంవాహనము సం. చక్కఁగా మోసికొనిపోవుట; కాళ్లు మొ॥ పిసుకుట.
సంవిత్తి. సం. తెలివి; సమాచారము.
సంవిత్తు. సం. బుద్ధి; జ్ఞానము; సంకేతము; ప్రతిజ్ఞ; అంగీకారము;ఆచారము;

యుద్ధము; సంభాషణము; నామధేయము; సంతోషము.

సంవిత్ప్రదము. సం. విజ్ఞానపదము.

సంవీతము. సం. హారమువలె వేసికొన్న జందెము. విణ. చుట్టుకొనఁబడినది.

సంవృతము. సం. విణ. చుట్టుకొనఁబడినది

సంవృత్తము. సం. కలిగినది; ఐనట్టిది.

సంవేగము. సం. వేగిరపాటు, తొందర.

సంవేదము. సం. అనుభవము, ఎఱుక. రూ. సంవేదనము.

సంవేశము. సం. పీఠము; నిద్ర. [చ వడి.

సంవేశని. సం. మొగసాల, తలవాకిటి

సంవ్యానము. సం. పైబట్ట; బట్ట.

సంశప్తకుఁడు. సం. తిరుగనని ఒట్టుఁబెట్టుకొని యుద్ధము చేయువాఁడు.

సంశయము. సం. సందేహము, అనుమానము

సంశయాళువు. సం. విణ. సంశయించు స్వభావముగలవాఁడు.

సంశయించు సం. అ. క్రి. సందేహించు.

సంశయిత. సం. విణ. సంశయించువాఁడు

సంశ్రయము. సం. ఆశ్రయము, అండ.

సంశ్రయించు. సం. అ క్రి. ఆశ్రయించు.

సంశ్రవము. సం. అంగీకారము.

సంశ్రితము సం. విణ. ఆశయించినది.

సంశ్రుతము. సం. విణ. అంగీకరింపఁబడినది.

సంశ్లిష్టము. సం. విణ. కౌఁగిలింపఁబడినది

సంశ్లేషము. సం. ఆలింగనము.

సంశ్లేషించు. సం. స. క్రి. కౌఁగిలించు.

సంసక్తము. సం. విణ. కదిసినది, చేరినది; తగులువడినది.

సంసక్తి. సం. కదియిక, చేరిక.

సంసత్తు. సం. సభ.

సంసరణము. సం. సంసారము; పట్టణము నుండి వెడలుట; పురద్వారము; ఇఱుకులేక దండునడచుట; యుద్ధప్రారంభము.

సంసరించు. సం. అ. క్రి. పుట్టు.

సంసర్గ-ము. సం. సంబంధము; చేరిక.

సంసారము. సం. ఆలుబిడ్డలతోడియునికి; శరీరధారణము.

సంసారరజ్జు. సం. సంసారబంధము.

సంసారి. సం. సంసారముగల గృహస్థు.

సంసిద్ధి. సం. చక్కఁగా లభించుట; ముక్తి; స్వభావము; చక్కని సిద్ధి; మత్తురాలు.

సంసృతి. సం. సంసారము.

సంసృష్టము. సం. విణ. సంసర్గము నొందినది; శోధింపఁబడినది.

సంసృష్టి. సం. తిలతండులములు కలసిన విధమున నైన అర్థాలంకారముల యొక్క పరస్పర సంబంధము; సంసర్గము.

సంస్కరించు. సం. స. క్రి. చక్కఁజేయు బాగుచేయు; సంస్కారము చేయు.

సంస్కారము. సం. చక్కఁజేయుట; శోధించుట; వ్యుత్పత్తి; మున్ను అనుభవించినది తలఁపునకు వచ్చుట; పాకము; తిరుగఁబోఁత; శ్రౌతస్మార్త కర్మానుష్ఠానముచేత అదృష్టవిశేషమును గలిగించెడి గర్భాధానాదిక్రియాకలాపము [ఇవిపదునాఱు—గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మ, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, ఆగ్నేయము, వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యేష్టి (అపరకర్మ) ]

సంస్కృతము. సం. దేవభాష. విణ. నిర్మలము గావింపఁబడినది; బాగుచేయఁబడినది; అలంకరింపఁబడినది; శాస్త్రశిక్షితమైనది; పక్వము చేయఁబడినది; శ్రేష్ఠమైనది.

సంస్క్రియ. సం. సంస్కారము; శవదహనాదిక్రియ; నిర్మలము గావించుట.

సంస్తరము. సం. చిగుళ్లు మున్నగువానిచే నిర్మించినపాన్పు; పూలసెజ్జ; యజ్ఞము.

సంస్తవము. సం. పరిచయము; చక్కని స్తుతి

సంస్తావము సం. యజ్ఞమునందు ద్విజులు స్తోత్రము చేయుశాల.

సంస్త్యాయము. సం. గృహము; విస్తారము; సన్నివేశము; సమూహము.

సంస్థ. సం. ఉనికి; మేరమీరకుండుట; నాశము; వ్యవస్థ, కట్టుపాటు; సామ్యము; ప్రళయము. [వాఁడు.

సంస్థాత. సం. విణ. సుస్థిరముగా ఉండు

సంస్థానము. సం. సన్నివేశము; చతుష్పథము; మృత్యువు; చిహ్నము; ఆకృతి; చక్కనిఉనికి; మంచిస్థానము. విణ. ఉత్తమ స్థానముగలది.
సంస్థితము. సం. విణ. నిలువఁ బడినది; చచ్చినది; చక్కఁగా ఉండినది.
సంస్థితి. సం. చావు; చక్కనియునికి.
సంస్పర్శ. సం. కోరింద†.
స్పర్శస్పర్శము. సం. చక్కని స్పర్శము. సంబంధము; స్పర్శము. [సంస్ఫోటము.
సంస్ఫోటము. సం. యుద్ధము. రూ
సంహతము. సం.విణ. చేక్కఁగాఁజేరినది; దృఢసంయోగముగలది.
సంహతలము. సం. ప్రెంకుటకు వ్రేళ్లు చాఁచి, కూర్చినచేదోయి, కై మోడ్పు.
సంహతి. సం. సమూహము.
సంహననము సం. శరీరము. [చేయుట.
సంహరణము. సం. చంపుట, నాశము
సంహరించు. సం. స. క్రి. చంపు.
సంహర్త } సం విణ. సంహరించు
సంహారకుఁడు } వాఁడు.
సంహారము. సం. సంహరణము; నరక భేదము; ప్రళయము; సంక్షేపము.
సంహిత. సం. వర్ణసంయోగము; వేదము నందొక భాగము; భాగవత సంహిత సూతసంహిత మొ॥; మన్వాది ప్రోక్త ధర్మశాస్త్రము. [మిళితము.
సంహితము. సం. విణ. కూడుకొనినది;
సంహూతి. సం. అనేకులు చేరి పిలిచిన పిలుపు.
సంహృతము. సం.విణ సంహరింపఁబడినది
సంహృతి. సం. సంహారము.
సకలము. సం. విణ. సమస్తము; కళతోఁ గూడినది; సగుణబ్రహ్మము.
సకలాతిహాదాలు. బ. ఉన్నితో చేయఁ బడిన పరుపులుగల హౌదాలు.
సకలా(ళా)తు. మేలైన కంబళిదినుసు.
సకి. సఖి, చెలికత్తె; ఆఁడుది.
సకిన కృత్రిమపక్షి; కీఁచుకీఁచుమను ధ్వని; కీచుబిళ్ల; బొమ్మ.
సకినంపుఁబులుఁగు. కనకాక్షి, సకినము చెప్పెడు గూబవంటి పక్షివిశేషము.
సకినము. శకునము; శుభాశుభసూచక వాక్కు.
సకినలమంచము. సం. కీఁచుకీఁచుమని మ్రోఁగెడు మంచము, రవమంచము; కోళ్లు బొమ్మలుగా చేసిన మంచము.
సకినాలపులుఁగు. కనకాక్షి.
సకియ. సఖి, చెలికత్తె; ఆఁడుది.
సకిలించు. అ. క్రి. హేషించు, గుఱ్ఱము. కూయు.
సకిలింత } హేష, గుఱ్ఱపుకూఁత.
సకిలింపు }
సకుఁడు చెలికాఁడు, సఖుఁడు.
సకృత్తు. ఒకమాఱు.
సకృత్ప్రజము. సం. కాకి; సింహము.
సక్తము. సం.విణ. ఒకటతగిలినది; అంటుకొనినది; తగులువడినది.
సక్తుఁడు. సం. విణ. తగులువడినవాఁడు.
సక్తుఫల. సం. జమ్మి†.
సక్తువు. సం. పేలపిండి, పాడిపిండి.
సక్థి. సం. తొడ, ఊరువు.
సఖి. సం. చెలికత్తె; స్నేహితుఁడు; సహాయుఁడు.
సఖుఁడు. సం. స్నేహితుఁడు;సహాయుఁడు.
సఖ్యము. సం. స్నేహము.
సగంధుఁడు. సం. జ్ఞాతి. విణ. గంధముతోఁ గూడినవాఁడు.
సగటు. చదరంగమునందు శకటము; సామాన్యము. [సరాసరి.
సగటుసమాఱు. గ్రా. అవ్య. రమారమి,
సగతు. గుఱ్ఱపుపల్లముమీఁద కెంపులు చిగుళ్ళనుపచ్చలు ఆకులును రవలు పూవులును గా సంతరించి ఏర్పఱచిన బంగారు తీఁగ మోడిపని.
సగము. అర్ధము, అర్ధభాగము.
సగరుఁడు. సం. ఒకచక్రవర్తి.
సగర్భ్యుఁడు. సం.ఒక తల్లి కడుపునఁబుట్టిన వాఁడు, తోఁబుట్టువు.
సగిన. రూ. సకిన.
సగిలించు. అ.క్రి. రూ. సకిలించు.
సగిలింత. రూ. సకిలింత.
సగుటు. సరాసరి.
సగోత్రుఁడు. సం. దాయ, జ్ఞాతి.

సగ్గారి. నక్క.
సగ్గాలము. సృగాలము, నక్క.
సగ్గిసమ్ముగ్గిసలు. బ. ఉద్ధుగుడుపు.
సగ్గు, అ.క్రి. అడఁగు; తగ్గు; క్రుళ్ళు.?
సగ్గుబియ్యము. ఒక విధమైన కృత్రిమ ధాన్యము.
సగ్గిడ. చెంబు.
సగ్ధి. సం. పొత్తు, పొత్తుగుడుపు, నలుగురు ఒకచోటఁజేరి భుజించుట.
సచివుఁడు. సం. మంత్రి; స్నేహితుఁడు; సహాయుఁడు. (శృంగార నాయకునకు సచివులు నలుగురు — పీఠమర్దుఁడు, విటుఁడు, చేటుఁడు, విదూషకుఁడు.)
సచ్చెము. చిల్లరరొక్కముప్పు.
సచ్చు. అ.క్రి. రూ. చచ్చు.
సచ్ఛూద్రుఁడు సం. గొల్ల; మంగలి.
సజగ్ధి. సం. రూ. సగ్ధి.
సజావు. హిం.విణ. క్రమమైన; స్పష్టమైన.
సజ్జ. సం. కవచము; అలంకరణము.
సజ్జక. సం. పడకిల్లు.?
సజ్జన. సం. రాజాదులు ఎక్కుటకై అలంకరించి యేనుఁగును సిద్ధపఱచుట.
సజ్జనము. సం. యుద్ధమునకై సేనను సిద్ధపఱచుట; పదార్థములనొకచోఁజేర్చుట; బెత్తములవారు సందడిలేక తొలఁగించుట; రక్షణకై సైన్యమునుంచుట, పారా; రేవు; శిబిరరక్షణము కొఱకు చుట్టు బెట్టినవెలుగు.
సజ్జనుఁడు. సం. సాధువు; కులీనుఁడు, వేదవిహితాచారము గలవాఁడు.
సజ్జితము. సం. విణ. కవచముతొడిగినది; అలంకరింపఁబడినది.
సజ్జుఁడు. సం విణ. కవచము తొడిగిన వాఁడు; అలంకరింపఁబడినవాఁడు.
సజ్జె. సస్యవిశేషము; బుట్ట; శిరోగృహము. సూతికాగృహము. విణ. ఆయుతము; బ. గంటెలు, ధాన్యవిశేషము.
సజ్జెకము. విణ. మనోజ్ఞము,
సజ్జెకట్టు. విణ. ఆయుతము;
సజ్జెనకోల. బెత్తము.
సజ్జెపట్టు. శయ్యాగృహము.

సజ్జెరసము. సర్జరసము.
సజ్జొకారము. సర్జి కాక్షారము, సర్జకవృక్షమున నెత్తెడియుప్పు.
సజ్జారము. ఏనుఁగును కట్టుచోటు.
సట. కపటము, మోసము. సం. వ్రతుల జడ; జూలు.
సడ. తసి, దట్టమగు నాఱు వరుస.
సడగరము. తొట్రుపాటు, సంభ్రమము.
సడపు. స. క్రి. అపహరించు.
సడలు. ఊడుట; జాఱుట; వదలుట. అ. క్రి ఊడు; జాఱు; వదలు; వీడిపోవు.
సడలుచు. ప్రే. సడలఁజేయు. రూ. సడలుచు.
సడలువడు. అ. క్రి. సడలు. ప్రే. సడలువఱుచు.
సడవ. త్రోవ.
సడి. అపకీర్తి; నింద; జాడ.
సడించు. స. క్రి. దంచు.
సడింపులు ఎసటిపోఁతలుగా దంచిన బియ్యము.
సడికుడక. భక్ష్యవిశేషము
సడికె. కుక్కమెడత్రాడు. రూ సడికియ.
సడిసన్న. నిర్లక్ష్యము.? విణ సడి చనినట్టి.
సడుగు. ఒడ్డారము. ?
సడ్డ. శ్రద్ధ, అక్కఱ; గణన, లక్ష్యము, పర్వా.
సడ్డకుఁడు. తోడియల్లుఁడు.
సడ్డసేయు. స. క్రి. లక్ష్యపెట్టు, గణనచేయు.
సణుగు. బాధ.
సత స ఏడు, సప్తకము.
సతకడములు. బ. చదువులు.
సతతపసులటెంకి. స్వర్ణది, సురదీర్ఘిక, ఆకాశగంగ.
సతతము సం. క్రి. విణ. ఎల్లప్పుడు. విణ. నిరంతరము, ఎడతెగనిది.
సతనాలుకలదునీఁడు, సతనాల్కలజేజే } అగ్ని, సప్తజిహ్వుఁడు.
సతము. విణ సతతము, శాశ్వతము.
సతహుమాదలి. సప్తాశ్వుఁడు, సూర్యుఁడు.
సతాయించు. హిం. స. క్రి. హింసించు, బాధించు.
సతి సం. సాధ్వి, పతివ్రత; దక్షపుత్రి, సతీదేవి, పార్వతి; స్త్రీ.
సతీనకము. సం. లంకలు, నూఁగుదోసె†; గుండ్రని పెసలు, బటాణి†.

సతీపతి సం. శివుఁడు.
సతీర్థ్యుఁడు. సం. సహాపాఠి.
సత్కరించు. సం. స క్రి. సమ్మానించు.
సత్కారము. సం. సమ్మానము.
సత్కార్యము. సం. వేదవిహితకర్మము.
సత్కృతి. సం. సమ్మానము. [బడినవాఁడు.
సత్కృతుఁడు. సం. విణ. సత్కరింపఁ
సత్క్రియ. సం. సత్కారము.
సత్త. సత్తువ సం. ఉనికి; మంచితనము.
సత్తముఁడు. సం. విణ. అందఱికంటె మంచివాఁడు; అందఱికంటె పూజ్యుఁడు; శ్రేష్ఠుఁడు. [సత్రము.
సత్తరువు. అన్న ప్రదాన గృహము,
సత్తా. స. ఏడు, సప్తకము
సత్తి. శక్తి, పార్వతి; ఆయుధవిశేషము; బలము; శక్తిఋషి. వసిష్ఠునికొడుకు.
సత్తితాలుపు. కుమారస్వామి, శక్తిధరుడు
సత్తిదొరవెనలి. ఆకాశము.
సత్తినెచ్చెలి. లక్ష్మి.
సత్తిరా. శివుఁడు.
సత్తిరాపగఱు. మన్మథుఁడు.
సత్తు. లోహభేదము, సీసము; పేలపిండి; సత్త్వము; సత్యము. సం. నక్షత్రము. ? విణ. ఉన్నది, ఉన్నవస్తువు; ఆత్మ, బ్రహ్మము; చదువరి; పూజ్యము; శ్రేష్ఠము; సత్యము; సాధువు, మంచిది.
సత్తువ. శక్తి, శరీరబలము.
సత్తెనంగ. సస్యవిశేషము.
సత్పథము. సం. మంచిమార్గము; సదాచారము; నక్షత్రమార్గము. ?
సత్యంకారము. సం. క్రయవిక్రయముల గట్టిమాటకై ముందిచ్చెడి ధనము, జట్టి. సంచకరువు, బయానా.
సత్యము. సం. నిజము; ఒట్టు; కృతయుగము; సత్యలోకము. విణ. నిజమయినది; త్రికాలాబాధ్యమైనది, ఆత్మ, బ్రహ్మము.
సత్యవచనుఁడు. సం. ఋషి. విణ. సత్యవాది. [కూర. విణ. సత్యముగలది.
సత్యవతి సం. వ్యాసునితల్లి; సోమెద
సత్యావతీసుతుఁడు సం వ్యాసుఁడు
సత్యాకృతి. సం. సత్యంకారము.
సత్యానృతము. సం. వ్యాపారము, వాణిజ్యము.
సత్యాపనము. సం. సత్యంకారము.
సత్రము. సం. ధర్మశాల, అన్నప్రదానగృహము; అనేకదినములు చేసెడియజ్ఞము; నిరంతరదానము; అరణ్యము; కపటము. విణ. మంచివారిని కాపాడునది.
సత్రశాల. సం. నిత్యాన్నదానము చేసెడు గృహము. [వాఁడు.
సత్రి. సం. ఎడతెగక దానముచేయు
సత్త్వము. సం. సత్తి; బలము; సత్త్వగుణము స్వభావము; మనస్సు; ప్రయత్నము; ప్రాణము; ద్రవ్యము; పిశాచాది; జంతువు.
సత్వరము. సం. క్రి. విణ. త్వరితము, వేగము. విణ. వడిగలది.
సద. ఆకుమీఁదినూఁగు.
సదనము. సం. ఇల్లు; జలము.
సదమదమగు. అ. క్రి. నలఁగు.
సదమదము. విణ. నలఁగినది; సంహారము
సదమదముసేయు } స. క్రి. నలఁపు;
సదమదమొనర్చు } చంపు. రూ. సదమదమొనరించు.
సదము. సం. రూ. సదస్సు.
సదరహి హిం విణ. సదరు.
సదరు. విణ. పైనచెప్పిన, ఆ.
సదరుబోయలు. బోయలలో నొకజాతి.
సదసద. విణ. సదమదము.
సదస్యము. వ్యా. మహాదాశీర్వాదపుసభ.
సదస్సు. సం. సభ, ధర్మజ్ఞులసభ, యజ్ఞసభ. రూ. సదను
సదస్యుఁడు. సం. యజ్ఞవిధిపరీక్షాధికారి; సభ్యుఁడు; సభవారితోఁబాటు కూర్చుండినవాఁడు.
సదా. సం. అవ్య. ఎల్లప్పుడు.
సదాగతి. సం. వాయువు; స్వర్గము; మోక్షము; సూర్యుఁడు; మంచిప్రభువు.
సదాటు. విణ దృఢము. [తుఁడు.
సదాతనుఁడు. సం. విష్ణువు. విణ. శాశ్వ
సదానీర. సం. కరతోయానది.
సదాప. మిశ్రేయ†.
సదాముస్తె. ఒకానొక చెట్టు.

సదావృత్తి. వ్య. బైరాగులు మొదలగు వారికిచ్చెడు వంటసామాగ్రి.
సదాశివుఁడు. సం. శివుఁడు.
సదృక్షము. సం. విణ. సరి, సమానము.
సదృశము సం. విణ. సమానము; తగినది.
సదేశము. సం. సమీపము. విణ. సమీపమైనది.
సద్దు. ధ్వని.
సద్మము. సం. ఇల్లు; జలము.
సద్యము. సం. అవ్య. అప్పుడు, వెంటనే.
సధర్మము. సం. విణ. సమానము; ధర్మముతోఁ గూడినది.
సధ్ర్యంచుఁడు. సం. విణ. కూడఁబోవువాఁడు.
సనగ. రూ. సెనగ.
సనత్కుమారుఁడు. సం. వైద్యశాస్త్ర కర్తయగు బ్రహ్మకుమారుఁడు, సనత్సుజాతుఁడు.
సనదు. దానపత్రము; యోగ్యతాపత్రము ప్లీడర్లకిచ్చు పట్టా; ఆజ్ఞాపత్రము.
సనాతనము. సం. విణ. శాశ్వతము.
సనాతనుఁడు. సం. బ్రహ్మ; విష్ణువు; శివుఁడు; బ్రహ్మమానసపుత్రుఁడు. విణ. శాశ్వతుఁడు.
సనాథ. సం. మగనాలు.
సనాథము. సం. విణ. నాథుఁడుగలది.
సనాభి. సం. జ్ఞాతి. విణ. సమానుఁడు.
సని. శని, గ్రహము సం. అన్వేషణ.
సనివారము మి. శనివారము.
సనీడము. సం. సమీపము. విణ. సమీపమైనది.
సను. అ. క్రి. రూ. చను.
సనేకలు. రూ. సన్నెకల్లు.
సన్న. సైగ, హస్తాదులచేత చేసెడుసంజ్ఞ
సన్నకద్రువు. సం. మోరటి†.
సన్నగాఁడు. చీమ. విణ. అల్పుఁడు.
సన్నగాలి. మందమారుతము.
సన్నగాళె. తిరుచిన్నము, వాద్యవిశేషము
సన్నగిలు, సన్నగిల్లు } అ. క్రి. సన్నమగు, క్షీణించు రూ. సన్నగించు.
సన్నదు. రూ. సనదు.
సన్నద్ధుఁడు. సం. విణ. సిద్ధమయినవాఁడు; యుద్ధమునకు సిద్ధమైనవాఁడు, కవచము తొడిగినవాఁడు.

సన్నన. సన్నఁదనము.
సన్నపాకులగన్నేరు. శతకుంతము†. ?
సన్నపిల్లి. సాలెపురుగు.
సన్నపుబట్ట. సుచేలము.
సన్నపువల. జాలభేదము.
సన్నపువాఁడు. విణ. అల్పుడు.
సన్నమండెగలు. బ. శాలిధాన్యవిశేషము.
సన్నము. తనుత్వము; నాణెము; వలిపె. విణ. శ్లక్ష్ణము, సూక్ష్మము. సం. అల్పము; పొట్టిది. కృశించిన-; అవసన్నము; శిథిలము.
సన్నయము. సం. వెనుకనున్న దండు; సమవాయము; సమూహము.
సన్నయేలకి. చిట్టేలకి†.
సన్నరాష్ట్రము. రాస్న†.
సన్నవాఱు. అ. క్రి. సన్నగిల్లు.
సన్నసన. విణ. సులభము.
సన్నహనము. సం. కవచాదులం తొడుగుట; ప్రయత్నించుట.
సన్నాయి. నాగసరము.
సన్నాసి. సంన్యాసి.
సన్నాహము. సం. కవచము; ప్రయత్నము.
సన్నాహ్యము సం. యుద్ధమునకుఁ దగిన యేనుఁగు; సన్నాహయోగ్యము.
సన్ని. తుపాకికానను చెక్కియుండెడు బాఁకువంటికత్తి.
సన్నికర్షణము. సం. సమీపము; సమీపించుట.
సన్నికర్షము. సం. సమీపము, చేరువ.
సన్నికల్లు. వా. సన్నెకల్లు.
సన్నికృష్టము. సం. సమీపము. విణ. సమీపించినది; సమీపమైనది.
సన్నిధానము. సం. సమీపము; ఆశ్రయము
సన్నిధి. సం. సమీపము, చేరువ; దాపుననుండుట.
సన్నిపాతము. సం. జన్ని; కలయిక.
సన్నిభము. సం. విణ. సమానము.
సన్నివిష్టుఁడు. సం. విణ. సమీపించినవాఁడు; ఉన్నవాఁడు; కూర్చుండినవాఁడు.
సన్నివేశము. సం. రచన; పట్టణాదులకు వెలుపలనుండెడి మైదానము.
సన్నిహితము. సం. విణ. సమీపించినది.

సన్నీ. రూ. పన్ని. [ను చేయఁబడినది.
సన్నుతము. సం. విణ. చక్కఁగా స్తోత్ర
సన్నుతి. సం. చక్కని స్తోత్రము; చక్కఁ
గాస్తుతించుట. [త్రము చేయు.
సన్నుతించు. సం. స.క్రి. చక్కఁగా స్తో
సన్నె-కల్లు. నూఱెడుఱాయి, పేషణి.
సన్న్యసించు. సం.స.క్రి. కామ్యకర్మము
లనువిడుచు; సంన్యాసదీక్షను గైకొను.
సన్న్యస్తము సం.విణ. సంన్యసింపఁబడినది.
సమర్పింపఁబడినది.
సన్న్యాసము.సం.కామ్యకర్మములవిడుపు;
తురీయాశ్రమము; బ్రహ్మస్థితి.
సన్న్యాసి.సం.విణ.సన్న్యాసముగలవాఁడు
సన్మాననము. సం. గౌరవించుట.
సన్మానము. గౌరవము.
సన్మానించు. సం.స.క్రి. గౌరవించు.
సన్మానితము. సం. విణ. గౌరవింపఁబడి
నది; సమర్పింపఁబడినది. [ర్గము.
సన్మార్గము. సం. సదాచారము; వేదమా
సన్య. సంజ్ఞ, సైగ.
సపంక్తి. సం. సమానమైన పంక్తి.
సపత్ని. సం. సవతి.
సపత్నుఁడు సం. శత్రువు.
సపము. వా. శవము.
సపర్య. సం. పూజ; సేవ.
సపాట-ము. విణ. మట్టము.
సపిండీకరణము. సం. చచ్చినపంద్రెండవ
దినమునందుఁ జేసెడు సంవత్సరాంత
శ్రాద్ధము. [జ్ఞాతి.
సపిండుఁడు. సం. ఏడు తరముల లోపలి
సపీతి. సం. సహపీతి, ఆత్మీయులు పది
మంది చేరి యేక కాలమున చేసెడి
పానము.
సప్తకము. సం. వ. ఏడు. [మొలనూలు.
సప్తకి. సం. ఏడుపేటలుంగల ఆఁడుదాని
సప్తజిహ్వుఁడు. సం. అగ్నిహోత్రుఁడు.
(సప్తజిహ్వలు—కాళి, కరాళి, మనో
జవ, సులోహిత, సుధూమ్రవర్ణ,
స్ఫులింగిని, విశ్వరుచి.)
సప్తతంతువు. సం. యజ్ఞము.
సప్తతి. సం. వ. డెబ్బది.

సప్తదశకము. సం. పదునేడు.
సప్తదశము. సం. విణ. పదునేడవది.
సప్తపత్రము. సం. ఏడాకుల పొన్న†;
ఏడాకులరఁటి†
సప్తపది. సం. ఏడడుగులు; ఏడు పదములు
సప్తపర్ణము. సం. రూ. సప్తపత్రము.
సప్తమము. సం. విణ. ఏడవది.
సప్తమి సం ఏడవతిథి. [గింజ†; సంబరేను†
సప్తల. సం. విరజాజి†; కలిగొట్టు†; గురి
సప్తహస్తుఁడు. సం. అగ్నిహోత్రుఁడు.
సప్తార్చి. సం. అగ్నిహోత్రుఁడు. విణ.
క్రూరదృష్టిగలవాఁడు.
సప్తాశ్వుఁడు. సం. సూర్యుఁడు.
సప్తి. సం. గుఱ్ఱము.
సప్పపుఁజొక్కు. ఆశ్లేషానక్షత్రము.
సప్పము. సర్పము. [గూడినది.
సఫలము.సం. విణ.సార్థకము;ఫలముతోఁ
సఫేదు. హిం. తెలుపు. విణ. తెల్లనిది.
సబ్ కలెక్టరు ఇం.కలెక్టరుక్రింది యధికారి.
సబబు. హిం. కారణము.
సబము. పీనుఁగు, శవము.
సబరము. పీనుఁగు.
సబళము. అత్తిలము, ఆయుధవిశేషము.
సబాము. స్వభావము.
సబాసు. అవ్య. సెబాసు.
సబిడీ. ఆయుధవిశేషము.
సబురు. హిం. ఓడప్రయాణము.
సబ్బండు. హిం. విణ. అనేకభేదములు
గలది; అబద్ధోక్తి.
సబ్బు, సోపు; జిడ్డునుముతికినిపోఁగొట్టెడు
ఒక విధమైన కారము, మలారి.
సబ్బుబియ్యము. రూ. సగ్గుబియ్యము.
సబ్రహ్మచారి. సం. (వేదాధ్యయనము
నందు) సహపాఠి.
సభ. సం. పదిమంది కూర్చుండు
చావడి; గృహము; పెద్దలసమూహము;
కొలువుకూటము; సమూహము; జూదము;
వేదవిదులైనవారి సన్నిధి.
సభర్తృక. సం. ముత్తైదువ.
సభాజనము. సం. గమనాగమనాదుల
యందు బంధుమిత్రాదుల నాలింగనా

దుల చేత సంతోషపఱచుట, క్షేమాదుల నడుగుట; సుఖపెట్టుట.

సభాసదుఁడు, సభాస్తారుఁడు } సం. సభ్యుఁడు, సభలో నున్న వాఁడు.

సభికుఁడు. సం. జూదమాడించువాఁడు.

సభ్యము. సం. హోమరహితాగ్ని. విణ. సభకు సంబంధించినది.

సభ్యుఁడు. సం. విణ. సభయందుండు వాఁడు; సాధువు; విశ్వాసపాత్రుఁడు; సత్కుల ప్రసూతుఁడు.

సమ. సం. సంవత్సరము. [దామరఁ†.

సమంగ. సం. మంజిటి†; ముడుఁగు.

సమంజసము. సం. న్యాయము. విణ. న్యాయముతోఁ గూడినది; యోగ్యమైనది; మంచిది.

సమంతదుగ్ధ. సం. జెముడు†.

సమంతభద్రుఁడు. సం. బుద్ధదేవుఁడు.

సమకట్టు. సన్నాహము. అ. క్రి. ఉద్యోగించు, యత్నించు. స. క్రి. సిద్ధపఱుచు; ఏర్పఱచు; చేయు.

సమకుఱు, సమకూడు, సమకూరు } అ. క్రి. చేకూఱు, లభించు; సంభవించు, సిద్ధించు.

సమకూరుచు. ప్రే. సమకూరఁజేయు. రూ. సమకూర్చు.

సమకొను. అ. క్రి. లభించు; సిద్ధించు.

సమకొల్పు. ప్రే. లభింపఁజేయు, సిద్ధింపఁజేయు; సిద్ధపఱుచు; వహించు.

సమకోలు. లభించుట, సిద్ధించుట; సమ్మతి.

సమక్షము. సం. ఎదుట; ప్రత్యక్షము.

సమగ్రము. సం. విణ. సమస్తము.

సమగ్రిమ-ము. సం. సమగ్రత.

సమజము. సం. అడవి; పశుసమూహము.

సమజ్ఞ. సం. కీర్తి, యశము. సమత్వము.

సమచౌకము. మి. విణ. నలుచదరము

సమజ్య. సం. సభ, కీర్తి. [సమత్వము.

సమత. సం. కావ్యగుణములలో నొకటి;

సమత్వము. సం. బ్రాహ్మిస్థితి; సామ్యము; సమవర్తిత్వము; మధ్యస్థత్వము.

సమదర్శి. సం. విణ. సర్వభూతములను సమముగాఁ జూచువాఁడు, సర్వత్ర బ్రహ్మదృష్టి గలవాఁడు.

సమదృష్టి. సం. సర్వభూతములను సమముగాఁజూచు చూపు, సర్వత్ర బ్రహ్మదృష్టి. విణ. సమదర్శి

సమధికము. సం. విణ. అధికము; మిక్కిలి యెక్కువ.

సమధిగమము. సం. పొందుట.

సమను. ఇం. విచారణకై న్యాయాధికారులవలనఁ బిలువఁబడుట.

సమన్వితము. సం. విణ. కూడుకొన్నది.

సమపదము. సం. విలుకాఁడు రెండు కాళ్ళతో సమముగా నిలుచుట.

సమభిహారము. సం. చెప్పినది త్రిప్పి చెప్పుట; అత్యంతము.

సమము. సం. విణ. సమానము; సమస్తము; సాధువు; బ్రహ్మము.

సమయపడు. మి. అ. క్రి. సంకేతితమగు

సమయము. సం. శపథము; ఆచారము; కాలము; ఉచితకాలము; సిద్ధాంతము; బుద్ధి; సంకేతము; ఆజ్ఞ.

సమయు. అ. క్రి. చచ్చు; నశించు.

సమరత సమర్త.

సమరథుఁడు. సం. ఒక్క విలుకానితో సరిగా నిలిచి పోరెడి యోధుఁడు.

సమరము సం. యుద్ధము.

సమరసము సం. ఏకరసము, అభిన్నస్వభావము, అభేదము; సమానరాగము.

సమర్త. స్త్రీ ప్రథమఋతువు.

సమర్తాడు. అ. క్రి. రజస్వలయగు.

సమర్థనము. సం. పట్టినది తగినట్లు నెఱవేర్చుట; శంకను తొలఁగించుట, సమాధానము నొసఁగుట.

సమర్థము. సం. విణ అన్వయయోగ్యమైన యర్థముగలది; హితమయినది; శక్తిగలది.

సమర్థించు. సం. స. క్రి. పట్టినది తగినట్లు నెఱవేర్చు; శంకను తొలఁగించు, సమాధానము నొసఁగు.

సమర్థుఁడు సం. విణ. నేర్పరి; బలవంతుఁడు, గట్టివాఁడు.

సమర్ధకుఁడు. సం. విణ. వరమునిచ్చువాఁడు

సమర్యాదము. సం. సమీపము. విణ. మర్యాదతోఁ గూడినది.
సమవకారము. సం. రూపక భేదము.
సమవర్తి. సం. యముఁడు విణ. అంతటు సమముగా వర్తించువాఁడు.
సమవాయము. సం. సమూహము; కూడిన సంబంధము, కూడుకొనుట.
సమవేతము. సం. విణ. కూడిన సంబంధము నొందినది, కూడుకొన్నది.
సమశయ్య. సం. విణ. సమానముగా శయనించుట. [విణ. కలసియుండునది.
సమష్టి. సం. సమస్తము; సమూహము.
సమష్టిల. సం. ఏఁకువంగ†; గురుజకూర.
సమసకము. రూ. సమాసకము.
సమసనము. సం. సంక్షేపము; సమాసమున పదములనేకము చేయుట.
సమసారము. సంసారము.?
సమసీషము. మల్లబంధ విశేషము.
సమసుప్తి. సం. మహాప్రళయము.
సమస్తము. సం. విణ. అంతయు, సర్వము; సఫలము; పిండీకృతము.
సమస్య. సం. కైపదము, కవిశక్తి పరీక్షకొఱకు ఇచ్చెడి పద్యపాదము.
సమాంసమీన. సం. ఏఁటేఁట నీనెడియావు
సమాకర్షి, సం. విణ. దూరము వ్యాపించునట్టి పరిమళము. [యాకర్షించు.
సమాకర్షిలచే. సం. స. క్రి. మిక్కిలి
సమాఖ్య. సం. యశము; బందుకట్టు; పేరు.
సమాగతము. సం. విణ. చక్కఁగా వచ్చినది; పొందికగలది.
సమాగమము. సం. చక్కనిరాక; పొందిక
సమాఘాతము. సం. యుద్ధము; వధము.
సమాచారము. సం. సదాచారము; చక్కఁగా నడపుట. వా. వృత్తాంతము.
సమాజము. సం. పశువులకంటెనితరమైన మనుష్య సమూహము; ప్రామాణికులుండు స్థలము, సభ; ఉత్సవములలో గలగుంపు; ఏనుఁగు.
సమాజ్ఞ. సం. కీర్తి.
సమాధానపడు మి. అ. క్రి. సమ్మతిపడు. ప్రే. సమాధానపఱచు.

సమాధానము. సం. తత్పరత, చిత్తైకాగ్రత; జవాబు, ఉత్తరము.
సమాధి. బ్రాహ్మీస్థితి; ఒక యర్థాలంకారము; కావ్యగుణములలో నొకటి; సమర్థనము; నియమము; నిశ్చలబుద్ధి; ధ్యానము.
సమానము. సమ్మతి. సం. నాభియందలి వాయువు, పంచప్రాణములలో నొకటి. విణ. తుల్యము; ఒకటి; సాధువు.
సమానోదర్యుఁడు. సం. ఒకతల్లి కడుపునఁ బుట్టినవాఁడు, తోఁబుట్టువు.
సమాపకము. సం. విణ. ముగించునది; వధించునది. [వధించుట.
సమాపనము. సం. ముగించుట, పరిపుచ్చుట,
సమాప్తము. సం. విణ. సమాప్తినొందినది.
సమాప్తి. సం. ముగియిక; అవసానము, అంతము.
సమాప్తించు. సం. స. క్రి. సమాప్తముచేయు
సమాప్యము. సం. విణ. ముగియఁదగినది; చావఁదగినది.
సమాలంభము. సం. మైపూఁత, చందనము మొదలగువాని పూఁత; నలుఁగు పెట్టుట; చంపుట.
సమావృత్తుఁడు. సం. వేదాధ్యయనానంతరము ఇఁక గృహస్థుఁడవు కమ్మని గురువుచే ననుజ్ఞపొందినవాఁడు.
సమావేశము. సం. ఒకచోటఁ గలసియుండుట; ప్రవేశము.
సమావేశితము. సం. విణ. ఒకచోటఁ గలసియుండినది; ప్రవేశించనది.
సమాశ్రయణము. సం. శరణాగతి.
సమాసంజనము. సం. తగులము.
సమాసంజితము. సం. విణ. తగిలినది.
సమాసకము. సం. శుద్ధాంధ్రపదముల సమూహము.
సమాసము. సం. సంక్షేపము; విభక్తిలోపముచేసిన పదముల యేకీభావము.
సమాసార్థ. సం. సమస్య.
సమాహారము. సం. రాశిచేయుట; సంక్షేపము. రూ. సమాహరణము.
సమాహితుఁడు. సం. విణ. చక్కఁగా ఉంచఁబడినవాఁడు; అంగీకరింపఁబడినవాఁడు; సమాధియందున్నవాఁడు.

సమాహృతము. సం. విణ. సంక్షేపింపc బడినది. [క్షేపము.
సమాహృతి. సం. సంక్షిప్తగ్రంథము; సం
సమాహ్వయము. సం. పేరు; ప్రాణిద్యూతము; యుద్ధము. [సంగమము.
సమితి. సం. సమూహము; యుద్ధము;
సమిత్తు. సం. యుద్ధము; సమిధ.
సమిధ సం. చిదుగు; వంటచెఱకు; హోమకాష్ఠము.
సమిన్మహి. సం. యుద్ధభూమి.
సమీకము. సం. యుద్ధము;
సమీకరణము. సం. ఒకటిగాcజేయుట.
సమీకృతము. సం. విణ. ఒకటిగా చేయc బడినది.
సమీక్ష. సం. తత్త్వము; బుద్ధి; చక్కcగా చూచుట; మీమాంసాశాస్త్రము; యత్నము. [చక్కcగా నిరూపించుట.
సమీక్షణము. సం. చక్కcగా చూచుట;
సమీక్ష్యకారి. సం. విణ. చక్కcగా ఆలోచించి పనులం చేయువాcడు.
సమీచీనము. సం. సత్యము. విణ. సత్యమైనది; మంచిది; పరిశుద్ధమైనది; తగినది
సమీపము. సం. చేరువ, దగ్గఱ. విణ. చేరువైనది.
సమీపించు. సం. అ. క్రి. చేరువయగు.
సమీరణము. సం. వాయువు; మరువము;
సమీరణుcడు. సం. వాయువు; బాటసారి
సమీరము. సం. వాయువు.
సమీరితము సం. విణ. చేర్పcబడినది; పాఱవేయcబడినది.
సమీరుcడు. సం. వాయువు.
సమీహితము. సం. విణ. కోరcబడినది.
సముందనము. సం. తేమము, తడియుట.
సముcడు. సం విణ. సమానుcడు, పరమాత్మ
సముఖుcడు. సం. విణ. మాటలమారి.
సముచ్చయము. సం. రాశిగాచేయుట; ఒక అర్థాలంకారము; చకారార్థము (అదియు ఇదియు అను).
సముచ్ఛ్రయము సం. ఉన్నతి; మిక్కిలి పొడుగు; దైర్ఘ్యము; విరోధము. రూ. సముచ్ఛ్రాయము. [పొడుగైనది.
సముచ్ఛ్రితము. సం. విణ. మిక్కిలి

సముజ్ఝితము. సం. విణ. విడిచిపెట్టcబడినది
సముతు. కట్టుపాటు; తాలూకాలో నొక భాగము. [పట్టుపరచు
సముతుపడు అ. క్రి. పట్టుపడు. [పే
సముత్థానము. సం. ప్రయత్నము; వ్యాధి నిర్ణయము. [పాడిన సేన మొ
సముత్పింజము. సం మిక్కిలి కలcత
సముదయము. } సం. ఊర్ధ్వగతి, పై
సముదాయము. } లేచుట; చక్కని ఉదయము; సమూహము; యుద్ధము.
సముదాయించు. అ. క్రి ఓదార్చు.
సముదీర్ణము. సం. విణ. స్తుతింపcబడినది అత్యధికము.
సముద్గకము. సం. బరణి; నగలపెట్టె సంపుటము. రూ. సముద్గము.
సముద్దారు—cడు. హిం. కొన్ని గ్రామముల కధికారి.
సముద్ధతుcడు. సం. విణ గురువుచే శిక్షింపబడనివాcడు, అవినీతుcడు.
సముద్ధరణము. సం. మీcదికెత్తుట, ఉద్ధరించుట. [పూనికొను
సముద్ధూళించు. సం స. క్రి. (విబూది
సముద్ధూషించు సం. స. క్రి. స్తుతించు
సముద్ర నవనీతము. సం. చంద్రుcడు అమృతము.
సముద్రము. సం. మున్నీరు, సాగరము (సప్తసముద్రములు—లవణ సముద్రము ఇక్షుసముద్రము, సురా సముద్రము సర్పిస్సముద్రము, దధి సముద్రము క్షీరసముద్రము, జలసముద్రము.)
సముద్రాంత. సం. తీcటకసిందె; ప్రత్తి పిక్క. [బుట్టినది
సముద్రియము. సం. విణ. సముద్రమున
సముద్రుcడు. సం. మున్నీరు, సరిత్పతి.
సమున్నద్ధుcడు. సం. విణ. గర్వించినవాcడు; చదువని తన్ను చదువరిగా నెంచుకొనువాcడు; పుట్టినవాcడు.
సమున్నము. సం. విణ. ఆర్ద్రము.
సమున్నయము. సం. ఎగcజిమ్ముట చక్కని నీతి; పైకిc దీసికొనిపోవుట మిక్కిలి యెత్తు.

సమూాథము. సం. విణ. [పోగుచేయఁబడి నది; అప్పుడు పుట్టినది; వంగినది.
సమూరువు. సం. చక్కని ఊరువులుగల హరిణ విశేషము. [రూ. సమూహి ?
సమూహము. సం. గుంపు,సముదాయము.
సమూహ్యము. సం. యజ్ఞాగ్ని.
సమృద్ధి. సం. మిక్కిలి సంపద; మిక్కిలి వృద్ధి; నిండారుట. [గలవాఁడు.
సమృద్ధుఁడు. సం. విణ. మిక్కిలి సంపద
సమేతము సం. విణ. కూడుకొన్నది.
సమేలము ఒద్దిక; చేరిక.
సమేళము. మిశ్రభావము.
సమ్మంథము. సంబంధము.
సమ్మకరల చీర. స్త్రీ వస్త్ర విశేషము.
సమ్మతము సం. విణ. సమ్మతింపఁ బడినది. [ఇష్టము.
సమ్మతి. సం. అంగీకారము,అనుజ్ఞ;ఇచ్ఛ,
సమ్మతించు. సం. అ. క్రి. ఒప్పుకొను, అంగీకరించు. రూ. సమ్మతిల్లు.
సమ్మదము. సం. సంతోషము.
సమ్మర్దము. సం. రాయిడి; సంకులము; యుద్ధము.
సమ్మానసము. సం. గౌరవించుట.
సమ్మానము. సం. గౌరవము.
సమ్మానించు. సం. స. క్రి. గౌరవించు.
సమ్మానితము.సం.విణ.గౌరవింపఁబడినది
సమ్మార్జనము. సం. విణ. శోధనము.
సమ్మార్జని. సం. శోధని, చీఁపురు.
సమ్మాళిగలు. బ. రూ. సంబాళిగలు.
సమ్మితము. సం. విణ. సరితూఁగినది, సమానము.
సమ్మియ. సమ్మె. [జేర్చు.
సమ్ముఖమిచ్చు. సం. స. క్రి. దగ్గఱకుఁ
సమ్ముఖము. సం. విణ. అభిముఖము.
సమ్ముదము. సం. మిక్కిలి సంతోషము.
సమ్మూర్ఛనము. సం. మిక్కిలి మూర్ఛ నొందుట; అంతటను వ్యాపించుట.
సమ్మృష్టము. సం. విణ. శోధింపఁబడినది.
సమ్మె. కట్టుపాటు.
సమ్మెట. పెద్దసుత్తె, ముద్గరము.
సమ్యక్కు. సం.సత్యవాక్కు;సమంజసము
సమ్రాట్టు. సం. రాజమండలమున కధిపతి యైనవాఁడు, రాజసూయయాగము చేసినవాఁడు, సార్వభౌముఁడు.
సయాము. గ్రా. స్వకీయము, సొంతము.
సయాట—ము. రూ. సయ్యాట.
సయి. సహాశబ్దార్థకము.
సయికము. అల్పము;
సయికిలు. ఇం. సైకిలు, ద్విచక్రిక.
సయిగ. సంజ్ఞ, సైగ.
సయింపు. శాంతము.
సయిఁచు అ. క్రి. సయించు, రుచించు. స. క్రి. ఓర్చు, సహించు.
సయిఁపు—డు. శాంతము, సైఁచుట.
సయితము. అవ్య. సహితము, సైతము.
సయితుఁడు. సవిత, సూర్యుఁడు.
సయిదోడు. సైదోడు, తోఁబుట్టువు.
సయిరణ. శాంతము.
సయిరించు. అ. క్రి. సైరణచేయు.
సయ్యాట } సహక్రీడ; లీల; స్త్రీ
సయాట—ము } పురుషుల పరిహాసము; చెలగాటము;? ప్రియచేష్ట.?
సయ్యాటించు. స. క్రి. పరిహసించు.
సయ్యొద్ద } చేరిక.
సయ్యొద్ద }
సరంగు. నావికుఁడు.
సరంజాం. హిం. సరకులు, సామాను.
సరంబీ. బల్లకూర్పు.
సరకట్టు. వీణె మెట్టు.
సరకము. సం. చెఱుకుకల్లు; కల్లుత్రాగుట; కల్లుత్రాగెడి గిన్నె.
సరకారు. ఇం. సర్కారు.
సరకు. అమ్మఁదగిన వస్తువు; వస్తువు; పరవా; లక్ష్యము, గణన.
సరకుగొను. స.క్రి. లక్ష్యపెట్టు. [చేయు.
సరకుసేయు. స. క్రి. లక్ష్యపెట్టు, గణన
సరగ. క్రి. విణ. శీఘ్రముగ; ఒప్పుగా.
సరగు. వేగము, శీఘ్రము.
సరఘ. సం. తేనెటీఁగ.
సరట—ము. సం. తొండ.
సరడాలు. భక్ష్యవిశేషము. [రు తీఁగ.
సరడు స్త్రీలు మెడను ధరించెడు బంగా
సరణి. సం. త్రోవ, మార్గము; వరుస.
సరత్ని. సం. పిడికెలితిమూర.

సరదా. సంతోషము.
సరదారు. శూరుఁడు; రౌతు.
సరదారుఁడు. అధికారి.
సరదు. స. క్రి. సమభాగముగ పంచు.
సరపణి. బంగారుగొలుసు. [దించుట.
సరఫరా. హిం. కావలయువానిని పంపా
సరబడి. ద్వారము; స్నేహము.
సరమ. శ్రమము. సం. విభీషణుని పెండ్లాము; ఆఁడు కుక్క; వేలుపు కుక్క.
సరమగొను. అ. క్రి. శ్రమపడు.
సరము. స్వరము; ముక్కుగాలి; షడ్జాది స్వరము. సం. పేట, హారమునందలి సరము; పెరుఁగుమీఁది తెట్టు; గతి, నడక; కొలను.
సరవడి. ఈడిక.
సరవి. క్రమము; మార్గము.?
సరవెంద. తీక్ష్ణగంధి.
సరస. దాపు; అర్ధాసనము. సం. తెల్ల తెగడ; ద్రాక్ష.
సరసము. సం.విణ. రసముతోఁగూడినది. వా. పరిహాసము; శృంగారచేష్ట.
సరసర. క్రి.విణ. మిక్కిలిశీఘ్రముగ.
సరసి. సం. మడుఁగు, కొలను; తెగడ.
సరసిజనాభుఁడు. సం. విష్ణువు.
సరసిజభవుఁడు. సం. బ్రహ్మ.
సరసిజము, సరసీరుహము } సం. తామర.
సరసు. స.క్రి. సరదు. సం. కొలను, మడుఁగు
సరస్వంతము. సం. నదము; సముద్రము.
సరస్వంతుఁడు. సం. సముద్రుఁడు; రసికుఁడు; కుబేరుఁడు;? తెలిసినవాఁడు.?
సరస్వతి. సం. బ్రహ్మపత్ని పలుకుఁజెలి; వాక్కు; పలుకు; నది; నదీవిశేషము. ఆవు; స్త్రీలలో శ్రేష్ఠురాలు; మనువు పెండ్లాము; ఒకఓషధి.
సరస్సు. సం. కొలను, మడుఁగు; జలము.
సరళ. సం. తెల్లతెగడ.
సరళద్రవము. సం. వృక్షధూపము.
సరళము. సం. గకారాది (గజడదబలు); ఒకానొకచెట్టు. విణ. ఔదార్యము గలది; వంకరకానిది, తిన్ననిది.
సరాగము. ఒద్దిక. సం.విణ. రాగముతోఁ గూడినది. [చిన తెర.
సరాతి. గోడవలెగుడారముచుట్టు నేర్పఱ
సరాబు. నాణెముల పరిశీలకుఁడు.
సరాసరి. సగటు, అరసిచూడఁగానైన సమత్వము. వా. నేరుగా, తిన్నగా.
సరాళము. సం.విణ. సరళము.?
సరి. సరియ, హాగము. విణ, సమము; యుక్తము; కార్యాంతము; సమాప్తము; ఋజువు. క్రి.విణ. పూర్ణముగా. అవ్య. అంగీకారార్థకము.
సరించు. సం. అ.క్రి. పోవు
సరిక. సం. ఇంగువ; హారము.?
సరికట్టు. అ.క్రి. సరిపడు.
సరికడచు. అ.క్రి. మించుమించు; మీఱు.
సరిక్రొత్త. అతినూత్నము. [కంకె.?
సరిగ. హారము; జలతారు; బంగారపు
సరిగనెదిరించు. అ. క్రి. మాఱుమసలు.
సరిగస్తు. హిం. ఊరేగింపు.
సరిగె. హారము; జరబాజు.
సరిగొను. స.క్రి. చంపు.
సరిచేయు. స.క్రి. నాశముచేయు.
సరిచూచు. స క్రి. సంప్రతించు.
సరిటెంకణము. నతివివేకము.?
సరితరము భూమిని సారమునుబట్టి తరగతులుగా నేర్పఱచుట. [మొనభేదము.
సరితాళంపుమొన. మల్లయుద్ధమున గట్టు
సరితూఁగు. అ.క్రి. సమానమగు.
సరిత్తు. సం. నది.
సరిత్పతి. సం. సముద్రుఁడు.
సరిదండ. కేయూరము.
సరిదాఁకు. అ. క్రి. సరికట్టు.
సరిపడు. అ. క్రి. అనుకూలమగు; యుక్తమగు; సమానమగు.
సరిపణి. సరిపెణ.
సరిపుచ్చు. ప్రే. సరిపోవునట్లుచేయు.
సరిపెట్టు. స. క్రి. సరిచేయు; చంపు.
సరిపెణ. బంగారుమొదలగువానిగొలుసు
సరిపోవు. అ. క్రి. సమానమగు; సమాధానమగు; కార్యాంతమగు, అయిపోవు; నశించు.
సరిపోటు. వా. సాదృశ్యము.

సరిప్రొద్దు. సగమురాతిరి.
సరిఫేము. హిం. తురకలు పాగామీఁద కట్టుకొను సరిగపట్టె.
సరిచిత్తరము. మల్లబంధ విశేషము.
సరిబేసులు. బ. బాల క్రీడావిశేషము.
సరిమిడి. శౌర్యము.
సరియ. పగుల్లువాటిన సందు; సందు.
సరియగు అ. క్రి. నశించు.
సరియించు. స. క్రి. ఆఖండమునకు నూనె సిద్ధముచేయు.
సరితేమ. తోడిపెలఁది.
సరివచ్చు. అ. క్రి. సమమగు.
సరిహద్దు. హిం. పొలిమేర.
సరీసృపము. సం. పాము.
సరుకు. వా. సరకు.
సరుగు. అ. క్రి. వర్ధిలు, పెరుఁగు.
సరుడు. బాణము; గతిలేని బాణము; నురుఁగు. ?
సరుడు. ఎల్ల; వరద.
సరువడము. ముద్ద.
సరువు. హిం. విదేపుచెట్టు.
సరె. రంధ్రము. [కము.
సరే. అవ్య. అగుఁబోమ్మ, అంగీకారార్థ
సరేసు. ఒక దినుసుబంక. (వజ్రము.)
సరోజము. సం. పద్మము†.
సరోజయోని. సం. బ్రహ్మ, అబ్జయోని.
సరోజిని. సం. తామరకొలను; తామర తీఁగె.
సరోరుహము. సం. తామర†.
సర్కారు. హిం. ప్రభుత్వమువారు; అధికారి; ఒకజిల్లా.
సర్క్యూటు. ఇం. దేశసంచారము.
సర్కసు. ఇం. మల్లవిద్యాప్రదర్శన మొనరించు రంగస్థలము; జంతువులచేఁ గూడ ప్రదర్శింపఁబడుస్థలము; విద్యాప్రదర్శన స్థలము.
సర్గ. సం. అధ్యాయము.
సర్గము. సం. అధ్యాయము; విసర్జనము; నిశ్చయము; ఉత్సాహము; ఈవి, త్యాగము; మోహము; స్వభావము; పురాణలక్షణములలో నొకటి. (ఇది నవ విధము — మహత్సర్గము, అహంకార సర్గము, భూతసర్గము, ఇంద్రియసర్గము, దేవసర్గము, తమస్సర్గము, వనస్పత్యాది సర్గము, తిర్యక్సర్గము, మనుష్యసర్గము).
సర్జకము } సం. జీవకమను సుగంధద్రవ్య
సర్జము } ము; మద్ది†; వేగిస†.
సర్జరసము. సం. యక్షధూపము; వాద్య భాండవిశేషము.
సర్జికాక్షారము. సం. సజ్జాకారము.
సర్పము. సం. పాము.
సర్పరాజు. సం. వాసుకి.
సర్పశిరము. సం. అభినయహస్తవిశేషము.
సర్పాక్షి సం. గంధనాకులి, తెల్లదింటెన†.
సర్పి — స్సు. సం. నేయి; జలము. ?
సర్వ్య. సం. బాలెంత కిచ్చెడు మందు, కాయము.
సర్ఫర్రాజు. హిం. సేనానాయకుఁడు.
సర్వంకషము. సం. విణ. సర్వాధికము.
సర్వంసహ. సం. భూమి. [ఆకాశము.
సర్వగము. సం వాయువు; ఉదకము;
సర్వజనీనము. సం. విణ. సర్వలోక ప్రసిద్ధము; సర్వజనహితము.
సర్వజిత్తు. సం. ఒక సంవత్సరము.
సర్వజ్ఞుఁడు. సం. బుద్ధదేవుఁడు; ఈశ్వరుఁడు. విణ. సమస్తము నెఱిఁగినవాఁడు.
సర్వతాపనుఁడు. సం. మన్మథుఁడు.
సర్వతోభద్ర సం. గుమ్ముడు†.
సర్వతోభద్రము. సం. ఒక చిత్రకావ్యము; శబ్దాలంకారవిశేషము; నాలుగుదిక్కుల నాలుగిండ్లుగల వాకిండ్లుగల రాజగృహము; వేము†.
సర్వతోముఖము. సం. ఆకాశము; జలము.
సర్వతోముఖుఁడు. సం. ఆత్మ; బ్రహ్మ; శివుఁడు.
సర్వత్ర. సం. అవ్య. అంతట.
సర్వథా. సం. అవ్య. సర్వప్రకారములచేత
సర్వదమనుఁడు. సం. భరతుఁడు, శాకుంతలేయుఁడు.
సర్వదా. సం. అవ్య. ఎల్లప్పుడు.
సర్వదుంబాలా. హిం. పన్ను లేనిమాన్యము
సర్వధారి. సం. ఒక సంవత్సరము.
సర్వధురీణము. సం. అన్ని బరువులను మోసెడి యెద్దు.

సర్వాబందెకత్తెర. మల్లయుద్ధగతి విశేషము.
సర్వభక్షకుఁడు. సం. అగ్నిహోత్రుఁడు. విణ. అన్నింటిని భక్షించువాఁడు
సర్వమంగళ. సం. పార్వతీదేవి.
సర్వము. సం. అంతయు, సమస్తము.
సర్వరసము. సం. సర్జరసము.
సర్వల. సం. శేజా, చిల్లకోల.
సర్వలింగి. సం. పాషండుఁడు, వేదబాహ్యుఁడు.
సర్వవేదుఁడు. సం. సమస్త వేదములను జదివినవాఁడు; సమస్త ధనమును దక్షిణగా నిచ్చి విశ్వజిద్యజ్ఞమును చేసినవాఁడు
సర్వాంగ కచ్ఛడము. మి. స్త్రీలు శరీరము నిండ ధరించు చీర.
సర్వాంగీణము. సం. తాపము, విణ. అన్ని అవయవములకు సంబంధినది.
సర్వానుభూతి. సం. తెల్లతెగడ†.
సర్వాన్నీనుఁడు. సం విణ. అందఱి యన్నమును భుజించువాఁడు; భిక్షువు.
సర్వాభిసారము. సం. చతురంగ బలము యుద్ధమునకు సిద్ధమగుట.
సర్వార్థసిద్ధుఁడు. సం. శాక్యముని.
సర్వే. ఇం. పొలమును కొలుచుట మొదలగు పనులు.
సర్వేశ్వరుఁడు. సం. విష్ణువు, పరమశివుఁడు
సర్వౌఘము. సం. సర్వాభిసారము.
సర్షపము. సం. ఆవాలు†.
సల్లు. క్రుంక్కుటయందగు ధ్వన్యనుకరణము
సల. ఏటికాలువ మొదలగు వానినీళ్లు అవలికిఁబోవుటకు నడుమ నడ్డముగా నిలిపెడు జల్లితడిక.
సలక. చిన్నగోనె; రెండున్నరతూము.
సలగ. పాఱచిప్ప.
సలగము. మలము.
సలప. రూ. సలగ. [ధ్వన్యనుకరణము.
సలసల క్రాఁగుట తెర్లుట యందగు
సలహా. హిం. సమ్మతి, ఆలోచన.
సలాక. శలాక, బంగారు మొదలగు వాని కమ్మి. [కేఱుట.
సలాపము. సముద్రములో ముత్యాలచిప్ప
సలాము. హిం. నమస్కారము.
సలి, సందడి.
సలించు. అ. క్రి. చలించు.
సలికము. విణ. అల్పము.
సలిగ. ఆశ్రయము; ఆశ్రయబలము.
సలితము. కొలపుడు కానిని కొలవు నుండి త్రోయుట.
సలిలము. సం ఉదకము.
సలీసు. హిం. విణ. సులభమయినది.
సలుగ. ధాన్యమును కొలచునపుడు నిర్ణీత సంఖ్య ముగిసినతోడనే గుఱుతుకై వేసిటితో నెత్తిపోసెడు ధాన్యపు కుప్ప; కొలుచువానికి పుట్టికింతయని యిచ్చెడు పెచ్చుధాన్యము; పెచ్చు; రూపాయలు మొదలగునవి యెంచునపుడు నిర్ణీత సంఖ్య ముగిసినతోటనే గుఱుతుకై యెత్తియుంచెడు రూపాయ మొ. వా. సలగల.
సలుగు. ఏదుపంది వా. సళుపు
సలుపు. క్రి. రూ. చలుపు.
సలువ. రూ. సలుగ.
సలువు. రూ. సలుగు.
సల్లకి. సం. అందుగు†.
సల్లపనము } సం. సల్లాపము.?
సల్లాపము }
సల్లాపించు. సం. అ. క్రి. సంలాపించు.?
సవ—డి. జాడ.
సవతాలు. సవతి.
సవతి. సపత్ని, తోడిపెండ్లాము [మాత.
సవతితల్లి. మాఱుతల్లి, విమాత, సాపత్న
సవతు. సామ్యము. విణ. సమానమైనది.
సవదండవల. ఒక దిసుసువల.
సవదరించు. స. క్రి. వహించు.
సవనము. సం. యజ్ఞము; స్నానము; సోమపానము.
సవము. సగము. సం. యజ్ఞము; సోమరసమును పిండుట; జలము; మకరందము.?
సవయస్కుఁడు. సం. స్నేహితుఁడు. విణ. సమానవయస్సు గలవాఁడు.
సవర. విణ. చక్కనైనది; చదునైనది.
సవరచేయు. స. క్రి. చక్కఁజేయు; చదును చేయు.
సవరణ. వాహనాద్యలంకరణము; పరిక్ష

రము, సామగ్రి; సేవ; సౌమ్యము. రూ. సవరణము.
సవరణసేయు } స. క్రి. వాహనాదుల
సవరణించు } నలంకరించు.
సవరన. చక్కన; చదును. [గము.
సవరపుమెకము. జల్లిమెకము, చమరమృ
సవరము. చమరమృగముతోఁక; కొప్పులో నుంచుకొను వెండ్రుకలచుట్ట.
స్వవరలు. చెంచు ఏనాది జాతులఁబోలిన యడవిజనులు.
సవరాతిరి. అర్ధరాత్రము.
సవరించు. క్రి. అలంకరించు; చక్కఁబఱచు; కుదుర్చు; బాగుచేయు; కూర్చు; తాల్చు; చేయు.
సవరింత. సవరించుట.
సవరింతసేయు. స. క్రి. సవరించు.
సవరిల్లు. అ. క్రి. ఒప్పు.
సవరుచు. క్రి. రూ. సవరించు.
సవసన. కొద్దిగా వినుట; వినుట.
సవాయి. మేహరోగవిశేషము; పడవపెద్ద మోకు. [పోవుట
సవారి. హిం. పల్లకి (లేక) గుఱ్ఱము నెక్కి
సవారు. గ్రా. గుఱ్ఱపురౌతు.
సవాలు. హిం. ప్రశ్న; విచారణ.
సవి. అవ్య. అని, ఇత్యర్థకము.
సవిత. సం. సూర్యుఁడు; తండ్రి. రూ. సవితృఁడు.
సవిత్రి. సం. తల్లి; ఆవు.
సవిధము. సం. సమీపము. విణ. సమీపమైనది; రీతితోఁగూడినది.
సవిరెల. ప్రసారణి†.? [జాలము.
సవురు. విధము; సౌందర్యము. విణ. మం
సవేశము. సం. విణ. సమీపమైనది.
సవ్యము. సం. విణ. ఎడమది; కుడిది.
సవ్యసాచి. సం. అర్జునుఁడు.
సవ్యేష్ఠుఁడు. సం. సారథి. రూ. సవ్యేష్ఠ.
సవ్వడి. జాడ.
ససి. సస్యము, పైరు; యోగ్యత, బాగు; ఆరోగ్యము; నిగ్గు. విణ. బాగైనది; ఆరోగ్యముగలది; నిగ్గుగలది.
ససువు. విణ. సాధువు.
సస్కాని. రెండుడబ్బుల నాణెము, అర్ధణా
సస్య. పస్న, సంజ్ఞ.
సస్యము. సం. పైరు, వరి మొ॥; వృక్షాదుల ఫలము, పంట.
సస్యసంవరము. సం. మద్ది†.
సస్సియ. సస్యము.
సస్సెము. సస్యము.
సహ. అవ్య. గ్రా. ఒకటన్. సం. చేమంతి†; పిన్నగోరంట†; పిల్లపెసర†; భూమి.
సహకారము. సం. తియ్యమామిడి †; సాహాయ్యము
సహకారి. సం. విణ. సహాయుఁడు.
సహగమనము సం. కూడఁబోవుట; భార్య పతిదేహముతోఁగూడ చితిఁజొచ్చుట, సాగుమానము.
సహచరము. సం. నల్లగోరంట†. పచ్చపువ్వుల ములుగోరంట†. [గోరంట†.
సహచరి. సం. స్నేహితురాలు; భార్య;
సహచరుఁడు. సం. స్నేహితుఁడు. విణ. కూడఁదిరుగువాఁడు.
సహజ. సం. సోదరి, తోడఁబుట్టినది.
సహజము. సం. స్వభావము. విణ. కూడఁబుట్టినది.
సహజుఁడు. సం. తోడఁబుట్టినవాఁడు.
సహదేవి. సం. సర్పాక్షి†; పీతపుష్ప†; బల†.
సహదేవుఁడు. సం. పాండవులలోకడవాఁడు
సహధర్మిణి. సం. భార్య.
సహనము. సం ఓర్పు. విణ. ఓర్చునది.
సహపాఠి. సం. కూడఁజదువువాఁడు.
సహము. సం. బలము; ప్రకాశము; మనోబలము; మార్గశీర్షము; హేమంతఋతువు. విణ. సమర్థము; ఓర్పుగలది. [స్నేహము
సహవాసము. సం. కూడనుండుట;
సహస్యము. సం. పుష్యమాసము.
సహస్రదంష్ట్రము. సం. పాఠీనము.
సహస్రధారము. సం. విష్ణుచక్రము.
సహస్రపత్రము. సం. పద్మము.
సహస్రపాదుఁడు. సం. విష్ణువు; సూర్యుఁడు.
సహస్రము. సం. స. వేయి, వెయ్యి; అనేకము.
సహస్రవీర్య. సం. గఱిక†.

సహస్రవేధి. సం. ఇంగువ; పుల్లప్రబ్బలి.
విణ. వేయింటిని వేధించునది.
సహస్రాంశువు. సం. సూర్యుఁడు.
సహస్రాక్షుఁడు. సం. ఇంద్రుఁడు.
సహా. అవ్య. ఒకటన్.
సహాధ్యాయుడు. సం. సహపాఠి.
సహాయత. సం. సహాయుల సమూహము;
సాహాయ్యము.
సహాయుఁడు. సం. సహచరుఁడు, తోడైన
వాఁడు. [కూడిక.
సహారువు. జూదము నందలి పరిభాష;
సహించు. సం. స. క్రి. ఓర్చు.
సహితము. అవ్య. సైతము. రూ. సయితము.
సం. విణ. కూడుకొన్నది.
సహిష్ణువు. సం. విణ. సహనుఁడు; ఓర్పరి,
సహృదయుఁడు. సం. విణ. మంచి మనస్సు
గలవాఁడు.
సహోదరుఁడు. సం. తోడఁబుట్టినవాఁడు
సహ్యజ. సం. సహ్యగిరినుండి పుట్టిననది;
గోదావరి భీమరథి కృష్ణ మొ.
సహ్యము. సం. ఆరోగ్యము; సామ్యము;
సహ్య పర్వతము విణ. సహింపఁదగినది.
సళించు. అ. క్రి. దుఃఖించు.
సళుపరించు. అ. క్రి. వ్రణము మొదలగు
నది పోటెత్తు.
సళుపరింత సళుపు.
సళుపు. వ్రణము మొదలగువాని పోటు.
అ. క్రి. వ్రణము మొదలగునది పోటెత్తు.
సళువు. విణ. భారమైనది.
సల్లు. అ. క్రి. రూ. పడలు.

## సా

సా. విణ. సాము శబ్దముయొక్క లుప్త
రూపము. (సాబాలు, సామేను అని).
సాంకవము. సం. జవాది.
సాంకాలిక. సం. ప్రతిదినము నిచ్చెడు
వడ్డి ? [నేర్పడినది.
సాంకేతికము. సం. విణ. సంకేతమువలన
సాంఖ్య. సం. సాంఖ్యము ?
సాంఖ్యము. సం. ఒక యోగము; వేదాంత
శాస్త్రము; సాంఖ్య దర్శనము; శుద్ధాత్మ
తత్త్వ విజ్ఞానము.
సాంగత్యము. సం. చేరిక, కూడిక.
సాంతపనము. సం. ఒక వ్రతము, పంచ
గవ్యమును కుశోదకమును పుచ్చుకొని
ఒకరాత్రి ఉపవాసముండుట,
సాంత్వనము. సం. ఓదార్పు, మంచి మాట
లాడి ఓదార్చుట.
సాంత్వము. సం. దాక్షిణ్యము; మిక్కిలి
మధురమైన మాట; సామోపాయము.
సాందృష్టికము. సం. సద్యఃఫలము; అప్పు
డు గలిగెడు ఫలము.
సాంద్రము. సం. అడవి. విణ. తెఱచైనగి;
దట్టమైనది; మెత్తనైనది.
సాంధ్యము. సం. విణ. సంధ్యాసంబంధ
మైనది. [పరప్రాప్తిసాధనము.
సాంపరాయము. సం. పరలోకము;
సాంపరాయికము. సం. యుద్ధము. విణ.
పరలోకప్రాప్తి సాధనము.
సాంప్రతము. సం. అవ్య. యుక్తము,
ఇప్పుడు.
సాంబశివుఁడు } సం. ఉమామహేశ్వ
సాంబుఁడు } రుఁడు.
సాంబ్రాణి. సంబరేనుచెట్టువలనఁగలిగెడు
ధూపద్రవ్యవిశేషము; ఉత్తమాశ్వము.
సాంబ్రాణివత్తి. ఊఁదువత్తి.
సాంయాత్రికుఁడు సం. ఓడపై ద్వీపాం
తర గమనము చేసెడి వర్తకుఁడు.
సాంయుగీనుఁడు. సం. విణ. యుద్ధము
నందు నేర్పుగలవాఁడు.
సాంవత్సరికము. సం. ఆబ్దికము. విణ.
సంవత్సరాంతమున జరగునది.
సాంవత్సరుఁడు. సం. జోస్యుఁడు.
సాంశయికుఁడు. సం. విణ. సంశయించు
వాఁడు, సంశయమునొందిన మనస్సుగల
వాఁడు. పెంచు, పోషించు.
సాఁకు. స. క్రి. రక్షించు, కాపాడు;
సాఁకుడుపులుఁగు. పరభృతము, కోయిల
సాఁగఁదీయు. స. క్రి. ప్రార్థించు; పొడిగించు
సాఁగు. భిందిపాలము, అడుగున త్రాడు
గట్టిన కటారి యలుఁగువంటి యాయుధ
విశేషము. అ. క్రి. పొడుగగు; దీర్ఘ
మగు; దండాకారముగ నేలపవ్రాలు.

సాఁగుడు. సాఁగుట.
సాఁడు. రేతస్సు.
సాఁతు. గోనెలు నేయువారి జాతి.
సాకతము. ఊఅడింపు; అనుగ్రహము.
సాకము. ఉత్సవము; సాకు.
సాకల్యము. సం. సమగ్రత.
సాకిరి. సాక్షి.
సాకు. వ్యాజము, నెపము.
సాక్షాత్కరించు. సం.అ క్రి. ప్రత్యక్షమగు.
సాక్షాత్కారము. సం. సాక్షాత్కరించుట.
సాక్షాత్కృతుఁడు. సం. విణ. సాక్షాత్కరించిన వాఁడు.
సాక్షి సం. నిర్వికారమైన ఆత్మ విణ సాక్షాత్తుగా కనినవాఁడు (లేక) వినినవాఁడు. [సాక్షులు పదునొకండ్రు— (అందు కృతసాక్షులేవురు. అకృతసాక్షులాఱ్వురు) కృతసాక్షులు—లిఖితుఁడు, స్మారితుఁడు, యదృచ్ఛాభిజ్ఞుడు గూఢుఁడు, ఉత్తరుఁడు, అకృతసాక్షులు—గ్రామస్థులు, ప్రాడ్వివాక లేఖక సభ్యులు, రాజు, కార్యాధికారి, వారిచేపంపఁబడినవాఁడు. (కులవివాదములయందు) కులమువారు. కృతసాక్షులనఁగా నిర్ణయించుకొనఁబడిన సాక్షులు; అకృత సాక్షులనఁగా నిర్ణయించుకొనఁబడని సాక్షులు.]
సాక్ష్యము.సం. సాక్షియొక్క కర్మ (సాక్షాత్తుగా చూచుటవలనను వినుటవలనను సిద్ధించునది); శ్రాద్ధవిశేషము.
సాగనంపు స. క్రి. (ప్రయాణమైపోవువారిని) కొంతదూరము తీసికొనిపోయి విడుచు.
సాగరము. నెయ్యి నూనె మొదలగునవి నింపిన సిద్దెలజోడు. సం. సముద్రము; ఏనుఁగు చెవియందలి మదము.
సాగరాంబర. సం. భూమి.
సాగవేయు. స. క్రి. పంపు.
సాగింత. నతివిశేషము.
సాగు. కృషి. అ. క్రి. కడచు; ప్రవర్తిల్లు; వెళ్లు; యత్నించు; జరగు.
సాగుపాటు. జరగుపాటు.
సాగుబడి.కృషి, పైరుపెట్టుట; సాగుపాటు



సాగుబళా. నతివిశేషము. [య్యము
సాచివ్యము. సం. సచివత్వము, సాహా
సాజాత్యము. సం. సజాతీయత.
సాజము. సహజము.
సాట } వర్తకులు ఒక వస్తువునిచ్చి మఱియొక వస్తువును పుచ్చుకొనుట.
సాటా }
సాటాకోటి. సాటాబేరము, వస్తు వినిమయ వ్యాపారము.
సాటి. తోత్రము విణ. సమానము.
సాటిక } విణ. సాటి.
సాటువ }
సాతత్యము. సం. అవిచ్ఛిన్నముగా ఉండుట.
సాతల. సం సంబరేను†.
సాతాని. వా. చాతాని.
సాతాను. సైతాను. [దుకూలము.?
సాతి సం. ముగింపు; ఈవి; యాతన;
సాతు. వర్తకులగుంపు; బాటసాగులగుంపు
సాత్కృతము సం. విణ.అధీనము చేయఁబడినది. [పాలుని తల్లి.
సాత్వతి సం. ఒక నాట్యవృత్తి; శిశు
సాత్వికము. సం. సత్వమతిశయింప మనస్సునఁ గలిగెడి భావ విశేషము, రోమాంచాది సాత్విక గుణము. విణ. సత్వగుణములవలనఁ గలిగినది.
సాద. మృత్తికా శరావ విశేషము.
సాదన. సాధనము, అభ్యాసము; శరాభ్యాసము; ఆయుధాభ్యాసము.
సాదనకాఁడు. మల్లుఁడు; శస్త్రదక్షుఁడు.
సాదనజోదు. మల్లుఁడు.
సాదనము. సం. ఇల్లు.
సాదము. అన్నము. సం. కృశించుట; నాశనము.
సాదరు. సంపద; వాడకపు సొమ్ము
సాదా. హిం. విణ కలుపులేనిది; అలంకారములేనిది.
సాదావు. పాడువని యావు.
సాది. సం. గుఱ్ఱపురౌతు; మావటీఁడు; సారథి.
సాదు. సాధువైన గోమహిష్యాదికము. విణ. మంచిది; మంచివాఁడు, సాధువు.

సాదృశ్యము. సం. పోలిక.
సాధకము. సం. విణ. సాధించునది.
సాధన. సం. ఆరాధన.
సాధన చతుష్టయము. సం. వివేకము వైరాగ్యము శమాదిషట్క సంపత్తి ముముక్షుత్వము.
సాధనము. సం. సాధించుట; ఉపకరణము; ఉపాయము; ధనము; వధము; మృతిసంస్కారము; గమనము; అనుగమనము; ఋణదానము; నివృత్తి; నిర్వర్తనము; సైన్యము; మగగుఱి; తపస్సు; వేగము; సిద్ధి; ప్రమాణము; హేతువు.
సాధనీయము. సం విణ. సాధింపఁదగినది.
సాధర్మ్యము. సం. పోలిక.
సాధారణ. సం. ఒక సంవత్సరము; వేశ్య.
సాధారణము. సం. విణ. సామాన్యము; అందఱకు సంబంధించినది; అంతటను గలది. [ణత్వము
సాధారణ్యము. సం. సామాన్యము, సాధార
సాధించు. సం. స. క్రి. నెఱవేర్చు.
సాధితుఁడు. సం. విణ. దండుగ పుచ్చుకొనఁబడినవాఁడు; సాధింపఁబడినవాఁడు; సిద్ధుఁడు. [మిక్కిలిమంచిది.
సాధిష్ఠము. సం. విణ. మిక్కిలిపదిలము;
సాధీయసుఁడు. సం. మిక్కిలి దిటవుగలవాఁడు, మిక్కిలి మంచివాఁడు.
సాధువు. సం. బుద్ధదేవుఁడు; మునీశ్వరుఁడు. విణ. మంచివాఁడు; సుందరుఁడు; సత్కుల ప్రసూతుఁడు; వేదవిహిత మార్గమున నున్నవాఁడు; వడ్డికిచ్చి బ్రదుకు వాఁడు.
సాధ్యము. సం. ఒక యోగము. విణ. సాధింపఁదగినది.
సాధ్యుఁడు. సం. గణదేవతావిశేషము. విణ. సాధింపఁదగినవాఁడు.
సాధ్వసము. సం. భయము.
సాధ్వి. సం. క్రొత్తడి, పతివ్రత; సాధుస్వభావముగలది.
సాన. మణుల మొక్కలు పోఁ జాఁచెడు ఱాయి; కత్తులం మొ॥ నూఱెడుఱాయి; గంధము తీసెడు ఱాయి.
సానకత్తి. సాదనచేయు కత్తి.
సానలవాఁడు మణులను బాగుచేయు వాఁడు
సాని. స్వామిని, అధిపురాలు; కన్నెతికమైన వేశ్య; వేశ్య; ఉత్తరపదమగుచో భార్య (దొరసాని, మేదరసాని అని.)
సానిక. మట్టి కంచము. వా. సానికె.
సానికరణము. కరణము క్రింది వేటొక కరణము. [కలజాఁడు.
సానివాఁడు బోగమువాఁడు, వేశ్యా
సానుమంతము. సం. కొండ. రూ. సానుమత్తు. [అడవి; సుడిగాలి; త్రోవ.
సానువు సం. కొండ నెత్తము; కొన;
సాన్నాయ్యము. సం. హవిస్సు; మంత్రములచే సంస్కరింపఁదగిన నేయి మొ.
సాన్నిధ్యత } సం. సామీప్యము;
సాన్నిధ్యము } సన్నిధి.
సాపడు స. క్రి. భుజించు, తిను
సాపత్నుఁడు. సం. సవతి కొడుకు. రూ. సాపత్నేయుఁడు.
సాపత్న్యము. సం. సవతితనము.
సాపాటు. భోజనము.
సాప్తపదీనము. సం. స్నేహము.
సాఫల్యము. సం. సఫలత.
సాఫు. హిం. విణ. వంకరలేని; శుభ్రమైన, తేట; చిత్తుచూచి వ్రాసినది.
సాబాలు. సమాంశము, సగము.
సామంజస్యము. సం. సమంజసత్వము.
సామంతరాగోల. ఆయుధ విశేషము.
సామంతుఁడు. సం. ఒక దేశమునెల్లను చేరికనున్న రాజు. [కరణములు.
సామగ్రి. సం సమగ్రత; వస్తువులు, ఉప
సామజము. సం ఏనుఁగు. విణ. సామవేదము వలనఁ బుట్టినది.
సామము. సం. సామవేదము; శత్రువులను మంచి చేసికొనుట; మంచి మాట; అనుకూల ప్రవర్తన రూపమైన యొక యుపాయము. (ఇది పంచవిధము— పరస్పరోపకారము కనిపింపఁజేయుట, మంచితనము చేయుట, గుణములను కొనియాడుట, చుట్టఱికమును తెలుపుట, నేను నీ వాఁడనని మంచిమాటలాడుట.)
సామరస్యము. సం. సమరసత్వము.
సామరి. విణ సాము నేర్చినవాఁడు.

సామర్థ్యము. సం. నేర్పు; యోగ్యత; శక్తి.
సామాజికుఁడు. సం. సభలోనున్నవాఁడు
సామాను. హిం. వస్తువు; సామగ్రి.
సామాన్య. సం. సర్వసాధారణనాయిక.
సామాన్యము. సం. ఒక అర్థాలంకారము; సామ్యము. విణ సాధారణము, అందఱకు సమమైనది.
సామాన్యుఁడు. సం.విణ. స్వార్థము పరార్థము చూచుకొనువాఁడు.
సామి. రాజు, ప్రభువు; పెనిమిటి; కుమారస్వామి; స్వామి. రాజ్యసప్తాంగములలో మొదటిది [లోకోక్తి.
సామిత. పురాణోక్తి; దర్శనోక్తి;
సామితల్లి. పార్వతి.
సామిధేని. సం. ధాయ్యా; సమిధ.
సామిమల కుమారస్వామి వసియించి యుండు ఒకానొక పర్వతము.
సామి సామేనిఁజేకొన్నచాన. పార్వతి, అర్ధనారీశ్వరుని యర్ధాంగము
సామీప్యము. సం. ముక్తివిశేషము; భగవత్సాన్నిధ్యప్రాప్తి; సమీపము, సన్నిధి.
సామీరి. సం. హనుమంతుఁడు; భీముఁడు.
సాము. సగము; వ్యాయామము; మల్లవిద్య; ఆయుధాభ్యాసము.
సాముకంటి చుక్క. పుబ్బ.
సాముద్రకము. సం. సముద్రప్రోక్తమైన స్త్రీపురుషలక్షణములఁ దెలుపు గ్రంథము; ఉప్పు
సాముద్రము. సం. భాగ్యసూచక దేహలక్షణము; ఉప్పు. విణ. సముద్రమునఁ బుట్టినది. [మయినది.
సాముద్రికము. సం విణ సముద్రసంబంధ
సాముద్రికుఁడు. సం. విణ స్త్రీ పుంస లక్షణములు తెలిసినవాఁడు; సముద్రమున సంచరించువాఁడు.
సామెత. లోకోక్తి.
సామేను. అర్ధశరీరము.
సామ్యము. సం. పోలిక.
సామ్రాజ్యము. సం. సార్వభౌమపదవి.
సామ్రాణి. ఉత్తమాశ్వము.
సాయంకాలము. సం. మునిమాఁపు.
సాయంతనము. సం. విణ. సాయంకాలసంబంధమైనది.
సాయంప్రాతికము. సం. విణ. సాయంప్రాతఃకాలములలోఁ గలిగినది.
సాయకము. సం. బాణము; ఖడ్గము.
సాయము సాహ్యము. సం. సాయంకాలము; బాణము.
సాయరు. హిం. సుంకము.
సాయాహ్నము. సం. సాయంకాలము.
సాయి. సిరా. [వాండ్లు.
సాయిలవాండ్లు. బ. బుడిబుడుక్కల
సాయుజ్యము సం. ఐక్యము, ముక్తివిశేషము.
సారంగము సం. లేడి; మేఘము; చాతకము; ఏనుఁగు; తుమ్మెద. విణ చిత్రవర్ణముగలది.
సారంగి. వాద్యవిశేషము; వీణాభేదము. సం. చిత్రవర్ణముగల ఆవు మొ.
సారఘము. సం. తేనె.
సారటు ఇం. గుఱ్ఱపుబండి.
సారణము. శ్వాస విశేషము. సం. అతిసార రోగము.
సారణి. సం. చిన్నయేఱు, కాలువ; గొంతెమగోరు+.
సారథి. సం. తేరు గడపువాఁడు.
సారము. సం. కనికరము; జలము; ధనము; న్యాయ్యము; బలము; చేవ; మూలగ. విణ. శ్రేష్ఠము.
సారమేయము. సం. కుక్క.
సారవము. సం. విణ. సరయూ నది యందుఁ బుట్టినది. [నడికట్టు.
సారసనము. సం. స్త్రీల మొలనూలు;
సారసము. సం. పద్మము; బెగ్గురుపక్షి.
సారస్యము. సం సరసత్వము.
సారస్వతము. సం.విణ. సరస్వతీసంబంధమైనది.
సారాయి. కల్లు, మద్యము.
సారి. యుద్ధయాత్ర; తడవ; ఆవృత్త్యర్థకము (ఒకసారి అని).
సారించు. సం. స. క్రి. చాఁచు; తెఱచు; విసరు; సరిదీయు.
సారు. నాట్యగతి భేదము.

సారువ. ఎక్కుటకును బరువెక్కించుటకును పొడుగుగా కట్టవలె వేయించెడి యిసుక మొదలగువాని దిబ్బ; కట్ట.

సారువా–పంట. వర్షాకాలమునందు నీరా సరా ండెడు పల్లపు పంట.

సారూప్యము. సం. సమానరూప ప్రాప్తి, ముక్తివిశేషము.

సారె. కూఁతు నత్తగారింటికిఁ బంపునపుడు పంపెడు వరుస; కుమ్మరవాని చక్రము. బ. వీణె మెట్లు; పగడసాల కాయ; గోయివంక; పాచిక. ద్ర. మాటి మాటికి.

సారెసత్తు. జంతిక, సంయావము.

సారె సారెకు. ద్ర. అవ్య. మాటి మాటికి, ముహుురర్థకము.

సార్జంటు. ఇం. భటులమీఁద అధికారి.

సార్జంతులు. ఇం. సార్జెంటు.

సార్థకము. సం. విణ. సఫలము.

సార్థము. సం. ప్రాణి సమూహము; వర్తకుల సమూహము; బాటసారుల సమూహము; సమూహము. విణ. అర్థముతోఁ గూడినది. [ముఖ్యుఁడు.

సార్థవాహుఁడు. సం. వర్తకుఁడు. విణ.

సార్ద్రము. సం. విణ. తడిసినది.

సార్థా. విణ. సఫలము; అనుకూలము.

సార్వభౌమము. సం. కుబేరదిగ్గజము, ఉత్తరదిగ్గజము.

సార్వభౌముఁడు. సం. చక్రవర్తి, సమస్త భూమిని పాలించురాజు.

సాల. ఇల్లు; చావడి.

సాలంకలు. బ. ధాన్యవిశేషము.

సాలగ్రామము. సం. విష్ణుప్రతీకమైనశిలా విశేషము. రూ. శాలగ్రామము.

సాలపర్ణి. సం. ముయ్యాకుపొన్న†.

సాలప్రాంశుఁడు. సం. విణ. మిక్కిలి పొడవైనవాఁడు.

సాలభంజిక. సం. వస్త్రదంతకాష్ఠాదుల చేత చేయఁబడిన బొమ్మ. [మద్ది†.

సాలము. సం. కోట; చెట్టు; ఏపె,

సాలశృంగము. సం. కోటకొమ్మ.

సాలామిశ్రి. మి. ఒక మందు దినుసు.

సాలావృకము. సం. కుక్క; నక్క; కోఁతి; పిల్లి; మృగము. రూ. శాలావృకము.

సాలీఁడు. సాలెవాఁడు; లూత, సాలెపురుగు. [రూ. సాల్యానా.

సాలియానా. హిం. విణ. సంవత్సరపు.

సాలు. రాంకవము, సన్నవస్త్రము. హిం. ఏఁడాది.

సాలువ. జామారు; శాలువు.

సాలువము. శ్యేనభేదము.

సాలువు. సాలువ.

సాలె. సాలెవానికులము; సాలెవాఁడు.

సాలెపట్టు. ఆశాబంధనము, సాలెపురుగు నేసిన నేఁత.

సాలెపురుగు. తంతువాయము, లూత, బొడ్డునందలి నూలు విడిచి నేఁత నేసెడి యొక పురుగు.

సాలెవాఁడు. తంతువాయుఁడు, నేఁత నేయువాఁడు; తంతువాయభేదము.

సాలోక్యము. సం. భగవల్లోక నివాసము, ముక్తివిశేషము.

సాల్వడు. అ. క్రి. నిస్సారమగు; ఒఱగు. ప్రే. సాల్వఱుచు.

సావలి / సావలీఁడు } డుబుడక్కవాఁడు.

సావాలు. రూ. సాబాలు.

సావాసము. పొత్తు, సహవాసము.

సావాసి. సౌవిదల్లుఁడు.

సావి. కాలము. అవ్య. అని, ఇత్యర్థకము

సావిక. సం. మంత్రసాని. [భాగము.

సావిత్రము. సం. దినముయొక్క ఐదవ

సావిత్రి. సం. బ్రహ్మపత్ని, సరస్వతి; పార్వతి; సత్యవంతుని భార్య; తల్లి; సూర్యుని కూఁతురు.

సావిత్రుఁడు. సం. ఒకవసువు; శివుఁడు.

సావు. చావు.

సాశయందకము. సం. బల్లి; ఉడుము.?

సాసువులు. బ. ఆవాలు.

సాస్న. సం. గంగడోలు.

సాహసము. సం. బలాత్కారముతో చేసినపని, దుష్కార్యము; ప్రాణముల నపేక్షింపని కర్మ; తెంపు, తెగువ; చోరవ; జరిమానా. [గలవాఁడు.

సాహసవంతుఁడు. సం. విణ. సాహసము

సాహసాంకుఁడు. సం. విక్రమార్కుఁడు.
సాహసించు. సం. అ. క్రి. తెగించు.
సాహసికుఁడు. సం. విణ. సాహసము కలవాఁడు.
సాహస్రము. సం. వేయి; వేయింటి సమూహము; వేల సమూహము.
సాహస్రుఁడు. సం సహస్రబలమునకధికారి
సాహాయ్యము. సం. తోడుపాటు, మద్దత్తు, తోడు.
సాహి. సాహిణి.
సాహిణము. గుఱ్ఱపుశాల, తబేలా.
సాహిణి, సాహిణీ } గుఱ్ఱపువాఁడు, మండురకుఁడు
సాహితి. సం. సాహిత్యము.
సాహిత్యము. సం. అర్థజ్ఞానము; కూడిక; పాండిత్యము; మనుష్యకృతమయిన కావ్యము; ఒక్కక్రియతో అన్వయము గలదియై యుండుట.
సాహు-కారి, సాహుకారు } వర్తకుఁడు, రూపాయలు వడ్డీకిచ్చువాఁడు.
సాహెబు. ప్రభువు. [హెచ్చరిక.
సాహెూ. హిం. అవ్య. కటికవారుచేసెడు
సాళగము. సం. తిలతండుల న్యాయమున నైన రాగమేళనము.?
సాళగించు. సం. అ. క్రి. మిళితమగు.?
సాళగింపు. మేళనము.
సాళువము. శ్యేనభేదము.
సాళ్వుఁడు కుక్కకియ్యఁబడిన పేరు.
సాళ్వదేశము. సం.56 దేశములలోనొకటి.
సాళ్వము. సాళువము; సాళ్వదేశము.

## సి

సింగఁడు. నృసింహుఁడు; ఎఱుకవాఁడు. విణ కోపించినవాఁడు.
సింగన్నదాటులు. బ. బాలక్రీడావిశేషము.
సింగపుఁబీఁట. సింహాసనము.
సింగపుగొంగ. శరభమృగము.
సింగపురాసి. సింహరాశి.
సింగము సింహము; (పదోత్తరఘటితమగుచో) శ్రేష్ఠవాచకము.
సింగమునెక్కుదంట. పార్వతీదేవి, సింహయాన.
సింగరవళి. సింహనాదము.
సింగళము. సింహళద్వీపము.
సింగాణి ఒకదినుసువిల్లు; విల్లు; కుక్క పేరు
సింగారపుఁదోఁట. ఉద్యానవనము.
సింగారము. శృంగారము.
సింగారి. శృంగారవతియగు స్త్రీ.
సింగారించు. స. క్రి. అలంకరించు, శృంగారించు.
సింగి. ఎఱుకది.
సింగిణి సింగాణి. రూ. సింగిణీ.
సింగితమనుకు వల. జాలభేదము.
సింగినాదము. పొడదుప్పికొమ్ముతో చేయఁబడినయోగుల సుషిరవాద్యవిశేషము. వా. వ్యర్థసంభాషణము.
సింగిలీకము. పెద్దనల్లకోఁతి.
సింగోట. దిపిదారికొమ్మ.
సింఘాణము. సం. రూ. శింఘాణము.
సిందుకము. సం. వావిలి†.
సిందురము. సిందూరము; వావిలి†.
సిందువారము. సం. వావిలి†.
సిందూరము సం. చెందిరము, రక్తవర్ణము గల ఒక చూర్ణము; వావిలి.†
సింధుదేశము సం.56 దేశములలోనొకటి
సింధురము. సం. ఏనుఁగు.
సింధువు. సం. నది; ఒకనది; ఒకనదము; సముద్రము; ఏనుఁగుమదము; సింధుదేశము
సింధుశయనుఁడు. సం. విష్ణువు.
సింబ. సం. కందులు మున్నగు కాయధాన్యములు నుఱిచిన పొట్టు.
సింహద్వారము. సం. తలవాకిలి.
సింహనాదము. సం. బొబ్బ, సింహమువలె వీరులు చేసెడుధ్వని, పెడబొబ్బ.
సింహపుచ్ఛి. సం. నక్కతోఁకపొన్న†.
సింహము సం. సింగము మృగరాజు; సింహరాశి; ఉత్తరపదమైనచో శ్రేష్ఠవాచకము. (పురుషసింహము అని.)
సింహవాహిని. సం. దుర్గ.
సింహసంహననుఁడు. సం. విణ. సర్వాంగసుందరుఁడు.
సింహళము. సం.56 దేశములలోనొకటి.
సింహావలోకనము. సం. శబ్దాలంకారవిశేషము; ఒక న్యాయము.

సింహాసనము. సం. సింహముఖ మేర్పఱిచిన స్వర్ణమయమైన యున్నతపీఠము; స్వర్ణమయమయిన రాజాసనము.
సింహాస్యము. సం. అడ్డసరము†.
సింహి. సం. అడ్డసరము†; ఆఁడుసింహము; ములకి†; రాహువుతల్లి.
సింహిక. సం. రాహువుతల్లి.
సింహుండము. సం. జెముడు.
సింహ్వము. వా. సింహము.
సిక. సిగ; కేశబంధము.
సికత. సం. ఇసుక నేల; ఒక వ్యాధి. బ. ఇసుక.
సికతామయము. సం. ఇసుకతిన్నె.
సికతిలము. సం. విణ. ఇసుక నేల.
సికస్తు. హిం. శిథిలమయినది.
సికా. ముద్ర.
సికాయుంగరము. ముద్రటుంగరము.
సిక్తము. సం. విణ. తడిసినది.
సిక్థకము. సం. మయినము.
సిక్థము. సం. మైనము; మెతుకు, అన్నకణము.
సిక్యము. సం. ఉట్టి; ఏనుఁగుయొక్క స్తనాగ్రమునందలి మదము.
సిగ. కేశబంధము, శిఖ; మయూరశిఖ†
సిగపట్లు. కేశాకేశి, జుత్తు జుత్తుపట్టుకొని దెబ్బలాడుట.
సిగపూవు. వాలపాశ్య, శిఖపాయయందు గట్టెడి భూషణము; శిఖను చుట్టుకొను పుష్పము.
సిగబంతి. సిగదండ, శేఖరము.
సిగము. సివము.
సిగర. సిగరి.
సిగరము. శిఖరము.
సిగరి. శిఖరిణి, కొన్ని సంబారువులుచేర్చి పక్వముజేసిన మజ్జిగ; భస్మము.
సిగ్గరి. విణ. లజ్జాళువు, లజ్జగలవాఁడు. లజ్జగలది.
సిగ్గరికత్తె. విణ. లజ్జాశీల. రూ. సిగ్గరికత్తియ.
సిగ్గఱు. అ. క్రి. సిగ్గువడు.
సిగ్గిఁడి. విణ. సిగ్గుచెడినవాఁడు; సిగ్గుచెడినది.
సిగ్గు. లజ్జ, స్త్రీత్వాదులచేఁ గలిగెడు మనస్సంకోచము.
సిగ్గుపడు. అ. క్రి. లజ్జించు.
సిగ్గుపాటు. సిగ్గుపడుట.
సిగ్గువోవు. అ. క్రి. సిగ్గుపడు.
సిచయము. సం. వస్త్రము; జీర్ణవస్త్రము.
సిడము. ధ్వజము; ధ్వజస్తంభము.
సిడి. ఏతపు దూలము; సిడులజాతరకు నాటిన స్తంభముమీఁది యడ్డుమ్రాను.
సిడిముడి. కోపము.
సిడులు. బ. తోత్రము.
సిత. సం. చక్కెర, పంచదార.
సితచ్ఛత్ర. సం. పెద్దసదాప†.
సితము. సం. తెలుపు. విణ. తెల్లనిది; కట్టఁబడినది; ముగిసినది.
సితాననుఁడు. సం. గరుత్మంతుఁడు.
సితాభము, సితాభ్రము } సం. కర్పూరము.
సితుఁడు సం. శుక్రుఁడు. విణ. తెల్లనివాఁడు.
సిద్ధకిన్నెర. వీణాభేదము.
సిద్దాయము వెచ్చపు సొమ్మునందు కూడఁబెట్టిన ధనము.
సిద్దీ. హిం. నీగ్రోజాతివాఁడు.
సిద్దె. కుతువు, నూనె మొ॥ పోసెడుతోలుతిత్తి. రూ. సిద్దియ.
సిద్ధము. సం. ఒకయోగము. విణ. తయారు, ఆయత్తమైనది; ఈడేఱినది; నిష్పన్నము, వండఁబడినది; నిత్యమయినది, ఆత్మ, బ్రహ్మము.
సిద్ధాంతము. సం. నిర్ణయింపఁబడిన యంశము, స్థిరమైనపక్షము. బ. నవవిధజ్యోతిష గ్రంథములు.
సిద్ధాంతి సం. విణ. జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడు; తత్త్వశాస్త్రము తెలిసినవాఁడు; మీమాంసకుఁడు.
సిద్ధాంతీకరించు సం. స. క్రి. సిద్ధాంతముచేయు.
సిద్ధాయము. సం. అరి, కప్పము.†
సిద్ధార్థ సం. ఒక సంవత్సరము.
సిద్ధార్థము. సం. తెల్లావలు†.
సిద్ధార్థుఁడు. సం. శాక్యముని, గౌతమబుద్ధుఁడు.
సిద్ధి. సం. ఈడేఱుట; లభించుట; బుద్ధి†; ఒకయోగము.
సిద్ధించు. సం. అ. క్రి. సమకూడు, ఈడేఱు.
సిద్ధుఁడు. సం. విశ్వావస్వాది దేవయోని విశేషము; వ్యాసాది.

సిధ్మము. సం సిబ్బెము, సోబె
సిధ్మల సం. సొయ్యపొట్టు; ఉప్పజేప
సిధ్మలుఁడు. సం విణ. సోబెగలవాఁడు.
సిధ్యము సం. పుష్యనక్షత్రము
సినీవాలి సం. ప్రాతఃకాలమందు చంద్ర కళ కాన వచ్చెడియమావస్య; పార్వతి.
సిఫాయి హిం. కాలిబంటు రూ సిపాయి బ. ఇం. దేశీయసైనికులు [వచనము.
సిఫారసు యోగ్యతాపత్రిక; యోగ్యతా
సిబ్బంది హిం. బంట్రౌతులు
సిబ్బి ఇత్తడిమూఁకుడు; పల్లిక
సిబ్బితి సిగ్గు
సిబ్బితికత్తె. విణ. సిగ్గుగలస్త్రీ.
సిబ్బితికాఁడు విణ సిగ్గుగలవాఁడు.
సిబ్బిపల్లిక. మూతివెడల్పుగల చిన్నగంట
సిబ్బిమనిమెకము ఏనుఁగు.
సిబ్బియము. సిబ్బెము.
సిబ్బెము దేహమునందుఁ గలిగెడి యొక దినుసుపొడ, సోబె. సిధ్మము.
సిర సం. ఈనె; నాడి.
సిరంగఁడు. శ్రీరంగనాథుఁడు.
సిరంగము శ్రీరంగక్షేత్రము
సిరకా గ్రా. కాడి, పుల్లని యొక ద్రవము.
సిరదము. చీనము.
సిరము. తల; కర్పూరము. విణ. చల్లనిది. సం. పిప్పలీమూలము.
సిరసు. శిరము.
సిరస్తాదారు హిం. లెక్కలు చూచువారికి పై యుద్యోగస్థుఁడు. [ద్రవము.
సిరా. మషి, వ్రాయుటకు వినియోగించు
సిరాజి, దేశవిశేషము; కలధౌతవస్త్రము; ప్రవాళము; శ్రేష్ఠమైనది. రూ. సిరాజీ.
సిరాణము. ఆయుధవిశేషము.
సిరాబుడ్డి. మేళామండము.
సిరామరక్ష. శ్రీరామరక్ష.
సిరి శ్రీ, లక్ష్మి; సంపద; శోభ.
సిరికోడలు. సరస్వతీదేవి; రతిదేవి.
సిరిగందము. శ్రీచందనము+.
సిరిగట్టు. శ్రీశైలము.
సిరిగలవాఁడు. సంపత్తిగలవాఁడు.
సిరిచూలి. శ్రీపుత్రుఁడు, మన్మథుఁడు. రూ. సిరిపిల్ల.
సిరిమంతుఁడు విణ శ్రీమంతుఁడు.
సిరివరుఁడు విష్ణువు, శ్రీరమణుఁడు.
సిరిసింగణావత్తి బాలక్రీడా విశేషము. రూ. సిరసింగణాలవత్తి.
సిలము. రూ శిలము.
సిలాజితు } శిలాజతు, ఒక అంగడిమందు
సిలాజిత్తు } దినుసు.
సిలుగు ఉపద్రవము; అశుభము; ఆపద.
సిలువ క్రీస్తునుబంధించి వధించినకొఱ్ఱు.
సిల్హము సం చిల్లమడ్డి, ధూపద్రవ్యవిశేషము
సివంగి తరక్షువు.
సివఁగి. సివంగి; కుక్కకియ్యఁబడినపేరు. రూ. చివఁగి.
సివము దేవతావేశము
సివాయి. హిం. అక్కు తప్ప; కాక
సివారు హిం విణ గ్రామమునకుచేరియుండు
సివిలు. ఇం. విణ. ఆస్తివిషయమైన.
సివ్వఁగి. సివంగి, తరక్షువు.
సిసల్. హిం. విణ నిర్ధారణమైన.
సిసువరకము. శుశ్రూష.
సిసువు. శిశువు; పసిబిడ్డ.
సిసువుఁడు. శిష్యుఁడు.
సిసృక్ష. సం. సృజింపనిచ్ఛ.
సిసృక్షువు. సం. విణ. సృజింపనిచ్ఛగలవాడు.
సిసృప్స. సం. పోవనిచ్ఛ.
సిసృప్సువు. సం. విణ. పోవనిచ్ఛగలవాఁడు
సిస్తు. పన్ను. విణ. అందము.
సిళ్లు. బ (ఏనుఁగును పొడిచెడు) బరిగోల. రూ. సిడులు.

## సీ

సీ. శ్రీ. [కాయ.
సీకాయ. నూనెజిడ్డును పోఁగొట్టెడు ఒక
సీకాయచెట్టు. సిగ.
సీకారి. పాటపాడువాఁడు.
సీకు. ఇం. విణ. ఆరోగ్యములేని.
సీత. సం. శ్రీరామునిభార్య; నాఁగటి చాలు; గంగ.
సీతభేది. సం. ఆమవిరేచనము.
సీతాకోకచిలుక. చిత్రవర్ణము గలిగి చేటల వలెనుండు పెద్ద ఱెక్కలుగలయొకపురుగు.
సీతాఫలము. సం. ఒకానొకఫలవృక్షము

సీతాభోగసరులు. బ. ధాన్యవిశేషము.
సీతాభోగములు. సం. బ. వడ్లలోభేదము.
సీతి ఇగము, శీతము.
సీతు—వు. శీతము, చలి; శీతకాలము.
సీత్కారము సం. సీ అను ధ్వని, చలి మొదలగు వానివలన బాధ చేఁగలిగెడు ధ్వని విశేషము.
సీత్యము. సం. విణ. ఒకసారిదున్నినపొలము
సీదరపుఁబెద్ద శేషఫణి [కంచుకము
సీదరము దారిద్ర్యము; సర్పము; సర్ప
సీద్రపుఁబెద్ద శేషఫణి.
సీద్రము. రూ. సీదరము.
సీధ్రము. సం. గుదము.
సీపి. ముత్యపుచిప్ప.
సీమ. దేశము; ప్రదేశము; రాజ్యము. సం. ఎల్ల, హద్దు; పొలిమేర; [దేశసీమ, క్షేత్రసీమ, గృహసీమ, గ్రామసీమ అని సీమచతుర్విధము. అది అయిదువిధములైన చిహ్నములు గలది. అవి—ధ్వజిని, (వృక్షము మొదలగునవి చిహ్నములుగాఁ గలది) మత్స్యని, (తటాకాది జలస్థానము చిహ్నముగాఁగలది) నైధాని, (తుషాంగారాది నిధానము చిహ్నముగాఁగలది.) భయవర్జిత. (అభిజ్ఞానము కొఱకు అర్థి ప్రత్యర్థు లేర్పఱచిన చిహ్నముగలది) రాజశాసననీత. (రాజు స్వేచ్ఛచే నిర్మించిన చిహ్నముగలది) అని] పెడతల; వరిమడి. [న సంస్కారము.
సీమంతము. సం. పాపట; సీమంతోన్నయ
సీమంతిని. సం. స్త్రీ.
సీమకోడి. కుక్కుటభేదము.
సీమాటి. శ్రీమతి. సౌభాగ్యవతి.
సీరపాణి. సం. బలరాముఁడు.
సీరము. సం నాఁగలి.
సీరి. సం. బలరాముఁడు.
సీల. కీలము, మేకు, చీల.
సీలమండ. గుల్ఫము, చీలమండ.
సీలితము. రూ. సలితము.
సీవనము. సం. (బట్ట) కుట్టుట.
సీవరించు. అ. క్రి. కోపముతో సీత్కరించు.
సీవిరి. వింజామరము; ఆలవట్టము; సుర.
సీసకము. కిరీటము; మల్లబంధ విశేషము. సం. సీసము.
సీసము మల్లబంధవిశేషము; ఉన్మాదము; కోపము. సం. సత్తు, నాగము; సీసపద్యము.
సీసా. హిం. గాజుతో చేసిన బుడ్డి, కాచపాత్రము.

## సు

సు. సం. ఉప. మంచి మిక్కిలి అనుసర్థములను దెలుపునది.
సుంకము. శుల్కము, కొన్ని అమ్మెడు సరకులకుఁగాను దొరతనమువారికిచ్చెడు పన్ను; ప్రతిబంధము; కన్యాశుల్కము.
సుంకరి. శుల్కహారి, సుంకముతీయువాడు
సుంకరిమాటలు. బ. కలగలుపుమాటలు.
సుంకరిమెట్టు. శుల్కశాల, పన్నుపుచ్చుకొను చావడి.
సుంకరీఁడు. శౌల్కికుఁడు, సుంకరి.
సుంకీఁడు. సుంకరి.
సుంకు. జొన్న మొదలగువాని కంకిమీఁద పూఁత; పెండ్లియందు పళ్లెరమునఁబోసి వధూవరులమీఁద చెరగు బియ్యము; ప్రతిబంధము.
సుంకేసలము. వృక్షవిశేషము.
సుంత విణ. ఇంచుక. [జ్ఞము.
సుందరము. సం. విణ. చక్కనిది, మనో
సుందరి. సం. అందకత్తె; స్త్రీ.
సుందరుఁడు. సం. విణ. చక్కనివాఁడు.
సుకందకము. సం. నీరుల్లి†; మట్టుకాఁకర†
సుకత. సం. సాధువు కాని ఆవు.?
సుకబోగులు. బ. ధాన్యవిశేషము.
సుకము. సుఖము.
సుకర. సం. సాధువైనయావు.
సుకరము. సం విణ. సులభము.
సుకర్మము. సం. మంచిపని; ఒకయోగము.
సుకలుఁడు. సం. విణ. త్యాగియు భోగియు నయినవాఁడు. [నుండువాఁడు.
సుకవాసి. మి. విణ. కష్టపడక సుఖముగా
సుకారి. ఎద్దులమీఁద సరకెత్తించుకొని యూరూరుయతిరిగి వర్తకముచేసెడి యొక నీచజాతి.
సుకిని. సుఖిని; భక్ష్యవిశేషము.

సుకియ } సుకుని } మత్స్యవిశేషము.
సుకుమారము. సం. పుండ్రేక్షువు. †విశే. కోమలము, మృదువు.
సుకురుఁడు. శుక్రుఁడు.
సుకురువారము. మి. శుక్రవారము.
సుకురుసిసులు. రాక్షసులు, శుక్రశిష్యులు.
సుకులు. సుఖము.
సుకృతము. సం. పుణ్యము; శుభము. విశే. చక్కఁగాఁ జేయఁబడినది.
సుకృతి సం. విశే. పుణ్యాత్ముఁడు.
సుక్కురాచారి సిసువులు. రాక్షసులు.
సుక్కురుఁడు. శుక్రుఁడు
సుఖ సం. వరుణుని పట్టణము.
సుఖగోష్ఠి. సం. సంలాపము.
సుఖము. సం సౌఖ్యము, ఆనందము; ఆరోగ్యము; స్వర్గము. విశే. సుఖముగలది.
సుఖవర్చకము. సం. సజ్జాకారము.
సుఖవాసి. సం. కారుబుడమ† విశే. సుకవాసి.
సుఖి. సం. విశే. సుఖముగలవాఁడు.
సుఖించు. సం. అ. క్రి. సుఖపడు. రూ. సుఖియించు. [పరిమళముగల వస్తువు.
సుగంధి. సం. నూఁగుదోస†. విశే. మంచి
సుగంధిపాల. మి. గూడపాల†.
సుగంధిమూల. సం. మావలి†.?
సుగంధిమూలము. సం. వట్టివేరు†.
సుగతుఁడు. సం. బుద్ధదేవుఁడు.
సుగము. సుఖము.
సుగుడి. విశే. సరసుఁడు.
సుగ్గడి. అమాయికత్వము, తెలివిలేమి.
సుగ్గడితము. విశే. తెలుచునేఁతగలది.
సుగ్రీవము. సం. శ్రీకృష్ణుని తేరి గుఱ్ఱములలో నొకటి.
సుగ్రీవుఁడు సం. శ్రీరాముని చెలికాఁడు, వాలి తమ్ముఁడు. విశే. మంచిమెడగలవాఁడు.
సుచరిత్ర సం. పతివ్రత.
సుచేలకము సం. మంచిబట్ట. విశే. మంచి వస్త్రము కలది.
సుజనుడు. సం. సదాచారముగలవాఁడు. సజ్జనుఁడు, సాధువు, మంచివాఁడు.

సుడి వర్తువ; జలావర్తము; రోమావర్తము; అనిలావర్తము, వాత్య.
సుడిఁబడు. అ. క్రి. రూ. సుడివడు.
సుడికత్తి చక్రాయుధము.
సుడిగట్టు. చక్రవాళ పర్వతము.
సుడిగాలి. వాత్య.
సుడిగొట్టు—జాతి. వాయువు.
సుడిగొను. స. క్రి. చుట్టుకొను, వేష్టించు. (ఆమ్రేడిత మగుచో) సుడిసుడిగొను. క్రియా సుడిగొలుపు.
సుడిగోరు. వీణాదుల తంతి మీటుటకు బంగారు మొదలగువానితో చేసి వ్రేలికి వేసికొనెడి గోరు, కోణము.
సుడిదిరుగుట. గుండ్రముగా తిరుగుట; గుఱ్ఱపు కావా.
సుడియ తములపాకుల బరువు నందు సగము; విశే. తులువ.
సుడియడిదము చక్రాయుధము.
సుడియు. అ. క్రి. చుట్టిచుట్టి వీచు, చుట్టుకొను. [కలఁగఁ ద్రొక్కుకొను.
సుడివడు. అ. క్రి. చుట్టుకొను, చలించు,
సుడివాలు. చక్రాయుధము రూ. సుడికైదువు మొ.
సుడివోవు. అ. క్రి. వ్యర్థమగు.
సుదుము. నూఱు గొఱ్ఱెల గుంపు; కంటకాది భారము.
సుత. అవ్య. మొదలుకొని, ప్రభృత్యర్థకము. సం. కూఁతురు.
సుతనువు సం. స్త్రీ. విశే. మిక్కిలి కృశించినది; మంచి శరీరము గలది.
సుతరాం సం. అవ్య. బొత్తిగా; ఎంతమాత్రము. [లోకము.
సుతలము. సం. ఒక అధోలోకము, నాగ
సుతలాం. గ్రా. సుతరాం.
సుతశ్రేణి. సం. ఎలుక చెవి †.
సుతి. షడ్జాది స్వరారంభకావయవమైన హ్రస్వ మాత్రిక శబ్దవిశేషము; సంగీత శ్రుతి, కంఠ స్వరాదులకు సహాయమగు తంత్రి మొదలగు వాని ధ్వని.
సుతికాఁడు. సుతి పోయువాఁడు.
సుత్తియ సుత్తె.
సుతుఁడు. సం. కొడుకు; రాజు.

సుత్తె. ముద్గరము, దాఁగలిమీఁద బంగారు మొదలగువాని నుంచి సాఁగఁగొట్టెడు సాధనవిశేషము.

సుత్య. సం. సోమలతనుకొట్టి పిడుచుట; యజ్ఞస్నానము.

సుత్రాముఁడు, సం ఇంద్రుఁడు.

సుత్వుఁడు. సం. యజ్ఞమునందు సోమలతను కొట్టి పిడిచినవాఁడు; యజ్ఞ స్నానము చేసినవాఁడు.

సుద. తుద, అగ్రము.

సుదతి. సం. చక్కని పలువరుసగల స్త్రీ; [స్త్రీ.

సుదర్శన. సం. మేరుగిరియందలి నేరేడు†.

సుదర్శనము సం. విష్ణుచక్రము; మేరుపర్వతము; జంబూద్వీపము; అమరావతి, ఇంద్రపురి.

సుదర్శని సం. అమరావతి.

సుదాయము. సం. అరణము.

సుదూరము. సం. విణ. మిక్కిలిదవ్వు.

సుద్ద. తెల్లమన్ను, శ్వేతమృత్తిక.

సుద్దగించు. స. క్రి. బంగారు మొదలగువానిని సుత్తెతో మిట్టపల్లములులేక సుద్దపఱచు.

సుద్దము. విణ నిర్దోషము, శుద్ధము.

సుద్ది. జనశ్రుతి, వృత్తాంతము; పరిశుద్ధి; నీతివాక్యము; ముట్టయిన నాలవనాఁడు స్త్రీలు చేయు స్నానము.

సుద్దిగాఁడు. పరిశుద్ధుఁడు.

సుద్దిచేయు. స. క్రి. శుద్ధిపఱుచు.

సుద్దులమారి. దుష్టుఁడు.?

సుద్దులకొమారుఁడు. గొల్ల సుద్దులు మొ॥ చెప్పి జీవించువాఁడు.?

సుధ. సం. అమృతము; తేనె; గారసున్నము; జెముడు†; చాఁగ†. ఇటిక.

సుధన్వుఁడు. సం. గొప్పవిలుకాఁడు.

సుధర్మ. సం. దేవసభ.

సుధాంశుకాంతము. సం. చంద్రకాంతము

సుధాంశువు. సం. చంద్రుఁడు.

సుధాకరుఁడు. సం. చంద్రుఁడు.

సుధాపాణి. సం. ధన్వంతరి.

సుధాసూతి. సం. చంద్రుఁడు.

సుధి. సం. చదువరి, పండితుఁడు.

సునాభము. సం. మైనాకగిరి.

సునామని. చదివి వినిపించుట.

సునాయాసము. సం. విణ. మిక్కిలిసులభము

సునాసీరుఁడు. సం. ఇంద్రుఁడు.

సునిషణ్ణకము. సం. నీరు చెంచలి†.

సునీథుఁడు. సం. పుణ్యాత్ముఁడు.

సున్న. బిందువు, అనుస్వారము; అభావము; శూన్యము; పూర్ణసంఖ్య; మణిదోషము.

సున్నగిలు }
సున్నగిల్లు } అ. క్రి. గుండ్రమగు.

సున్నతి. హిం. ఉపనయనమున శిశ్నము కొనతోలును ఛేదించుట, మహమ్మదీయుల మొహరాదీల యాచారవిశేషము.

సున్నపుఁగాయ. సున్న ముంచుకొనెడు కరండము.

సున్నపెట్టు. స. క్రి. వంచించుట.

సున్నము. చూర్ణము, సుధ, తెల్లని యొక దినుసు కారపు వస్తువు. (సున్నములో భేదములు—సీమసున్నము రాతిసున్నము, గుల్లసున్నము, పాలసున్నము, సంకుసున్నము, ముత్తెపుసున్నము.)

సున్ని. నలుఁగునకై పచ్చిపెసలు మొదలగువానిని విసరిచేసిన పొడి.

సున్నితము. విణ. కచ్చితము.

సుపథము. సం. మంచిత్రోవ.

సుపర్ణ సం. వినత, గరుత్మంతుని తల్లి; తామరతీఁగ.

సుపర్ణము. సం. పాలపిట్ట; ఱేల†.

సుపర్ణుఁడు. సం. గరుత్మంతుఁడు.

సుపర్వుఁడు. సం. వేలుపు, దేవత.

సుపాణి ముత్యమునందలి శుభ్రమైననీరు; శుభ్రమైననీరుగల ముత్యము.

సుప్తి. సం. నిద్ర; తిమ్మిరి.

సుప్తుఁడు. స. విణ. నిద్రించినవాఁడు.

సుప్పాణి. రూ. సుపాణి.

సుప్రగల్భుఁడు. సం. అంతఃపురపాలకుఁడు?

సుప్రనిష్ఠ. సం. ఒకఛందస్సు.

సుప్రతీకము. సం. ఈశాన దిగ్గజము; మంచిశరీరము. విణ. మంచియవయవములుగలది.

సుప్రలాపము సం. మంచిమాట.

సుబ }
సుబా } హిం. రాజ్యమునందు ఒకగొప్ప భాగము.

సుబాణము. ఒకదినుసు పిరంగి.
సుబాదారు. సుబాకధికారి.
సుబారము. మల్లబంధవిశేషము.
సుబేదారు. హిం. సుబాకు ప్రభువు; సేనలోనొకయధికారి.
సుబ్బఁడు. సుబ్రహ్మణ్యస్వామి. [కొల్ల.
సుబ్బనచూఱ. బయలుపడునట్లు చేసెడి
సుబ్బనచూఱలాడు. స. క్రి. పెద్ద కొల్లగొను.
సుబ్బలి. పంకము.
సుబ్బు. గాలిమాట. అ. క్రి. బయల్పడు.
సుబ్రహ్మణ్యుఁడు. సం. కుమారస్వామి.
సుభగ. సం. విణ. సుందరి, పతిప్రియ; భాగ్యవంతురాలు. [కాఁగలయది.
సుభగంభావుకము. సం. విణ. ప్రియము
సుభగము. సం సుందరము; ఇష్టము.
సుభటుఁడు. సం. శూరుఁడు; శ్రేష్ఠుఁడైనబంటు.
సుభద్ర. సం. అర్జునునిభార్య, కృష్ణుడు†
సుభద్రము. సం. స్వరసముదాయనామవిశేషము.
సుభిక్ష. సం. ఆరెపువ్వు.
సుభిక్షము. సం. విణ. సులభమగు భిక్షాన్నముగల దేశము కాలము.
సుమంగలి. సం. ముత్తయిదువ.
సుమనము. సం. గోదుమలు†.
సుమనసము. సం. పుష్పము.
సుమనసుఁడు. సం. వేలుపు.
సుమనస్సు. సం. పువ్వు; జాజి†; వేలుపు; విద్వాంసుఁడు; గోధుమలు†; మంచి మనస్సు.
సుమనోరజము. సం. పుప్పొడి.
సుమము. సం. పుష్పము.
సుమహత్తు. సం. మిక్కిలిగొప్ప.
సుమారు. హి. కొంచెమెచ్చుతగ్గు.
సుమాషములు. సం. బొబ్బర్లు.?
సుమాళము. పారవశ్యము; అత్యుత్సాహము; ఆవేశము; సుఖము; మూర్ఛ.
సుమాళి. విణ. సుమాళముగలవాఁడు.
సుమాళించు. అ. క్రి. సుమాళమునొందు
సుమీ. వా. రూ. చుమీ.
సుముఖుఁడు. సం. గరత్మంతునికొడుకు; ఒక నాగకుమారుఁడు; విఘ్నేశ్వరుఁడు; విద్వాంసుఁడు. విణ. సుందరుఁడు.
సుమేరువు. సం. మేరుపర్వతము.
సుమ్మీ. వా. రూ. చుమీ.
సుమ్ము. వా. రూ. చుమ్ము.
సుయోధనుఁడు. సం. దుర్యోధనుఁడు.
సుర. గాలిసుడి; గాలి. విణ. పెద్ద సం. మద్యము, కల్లు; సురాపానపాత్రము.
సురంగ. సం. సొరంగము.
సురంగము. సం. సొరంగము; కైపడిముస్తై†; నారింజ†; ఒకలత.
సురఁటి. వట్రువవిసనకఱ్ఱ; చామరము?; కుంచె.? రూ. సురటీ.
సురఁటివీనులఁబట్టు. వాయువు.
సురకాని. కానిలోనాలవభాగము.
సురకొలి. ఒక దినుసుపిరంగి.
సురక్రోవి. అగ్నిప్రసరణాయుధము.
సురగవి. సం. కామధేనువు.
సురగాలి. సుడిగాలి. రూ. సుఁకరువలి వెం.
సురగి. శిఖరిణి†.?
సురజ్యేష్ఠుఁడు. సం. బ్రహ్మ.
సురటి. సం. రాగవిశేషము.
సురతము. సం. కలయిక, సంగమము.
సురతాణి. ఇంద్రుఁడు; ఇంద్రాణి.
సురతాణిలగ్గ. లగ్గ.?
సురతుఁడు. సం. విణ. దయగలవాఁడు.
సురదీర్ఘిక. సం. ఆకాశగంగ.
సురద్విషుఁడు. సం. అసురుఁడు. రూ. సురారి వెం.
సురధాణి. హిం. సుల్తాను.
సురనిమ్నగ. సం. ఆకాశగంగ.
సురపతి. సం. ఇంద్రుఁడు.
సురపాది. కాకాంగము†.
సురపున్నాగము. సం. సురపొన్న†.
సురపొన్న. ఒకనునుపొన్న, దేవవల్లభము.
సురభి. సం. గోవులమాత, దేవతాగోవు; ఆవు; అందుగు†; మురి†; బంగారు; వాసనగల కలువ; వసంతఋతువు; చైత్రమాసము; సంపెఁగ†; జాజికాయ; పరిమళద్రవ్యము. విణ. మంచిపరిమళము గలది; మనోజ్ఞమయినది.

సురభిచ్ఛదము. సం. కజివేము; †రుద్రజడ†
సురభితము సం. విణ. మంచివాసనగలది.
సురభిత్రిఫల. సం. జాజికాయ పోఁక కాయ లవంగపుకాయ.
సురభీకరించు. సం. స. క్రి. సువాసనకల దానినిగాఁజేయు.
సురమాయి. విణ. మిక్కిలి నల్లనిది.
సురమాలి. విణ. గాలినించినది; దిండు.
సురర్షి. సం. దేవర్షి, నారదుఁడు మొ.
సురలు. సం. బ. దేవతలు.
సురలోకము. సం స్వర్గలోకము.
సురవర్త్మము. సం. ఆకాశము.
సురస. నాగమాత; సర్పాక్షి.
సురసము. సం. నల్లగగ్గెర†. విణ. తియ్యనిది
సురళి. జంతు కారి†.
సురాచార్యుఁడు. సం. బృహస్పతి.
సురాజీవి. సం. గమలవాఁడు.
సురాటము. మల్ల బంధవిశేషము.
సురామండము. సం. కల్లు తేట.
సురారి. సం అసురుఁడు, రాక్షసుఁడు.
సురాలయము. సం. మేరుపర్వతము; స్వర్గము.
సురాష్ట్రజము. సం. కాక్షి.
సురాష్ట్రము. సం సూరతుదేశము.
సురాళము. భూతాద్యావేశజనిత శిరో భ్రమణము; కోపావేశము.
సురాళించు స. క్రి. దిగఁదుడుచు.
సురాళింపు. దిగదుడుపు.
సురిగ. చిన్నకొమ్మ.
సురిగి. ఒక నొకచెట్టు.
సురిగె ఉపశాఖ.
సురియ చురకత్తి. అసిపుత్రిక.
సురియాళు మాలవాఁడు
సురుఁగు. అ. క్రి. అదృశ్యమగు; పాఱు; జాడగాఁబోవు; చలించు; మ్లానమగు.
సురుగుడు ఒకానొక యెఱ్ఱచాయ చెక్క చెట్టు జాతధాతకి†.
సురుడు. దివటీకి మాఱుగా కాల్చి పట్టు కొనెడు వెలుతురు కట్టెలకట్ట.
సురుప్పు. పెట్లుప్పు.
సురుమా. హిం. ఒకవిధమైనకాటుక.
సురుము. పొడి, చూర్ణము.
సురూపుఁడు. సం. విణ. చక్కనివాఁడు; విద్వాంసుఁడు.
సురె. చురకత్తి.
సురెయాళు మాలవాఁడు.
సురేకారము. ఒకదినుసు ఉప్పు.
సురేజ్యుఁడు సం. బృహస్పతి.
సురై. హిం. కత్తి; ఖడ్గభేదము.
సురోత్తముడు. సం. సూర్యుఁడు.
సురోదము. సం. కల్లుసముద్రము
సుఱుసుఱు. ద్రుక్కుటయందగు ధ్వన్యాను కరణము వా. చుఱచుఱ.
సులభము సం విణ. సుళువు, సులు కగాదొరకునది.
సులువు. సులకనైనది; శీఘ్రము.
సులోచనము. సం. ముక్కద్దము, కండ్ల జోడు.
సుల్తాను. హిం. తురుష్క ప్రభువు.
సుల్వు. శీఘ్రము. [సువచము.
సువచనము. సం మంచి మాట. రూ.
సువర్చకము. సం సర్జికాక్షారము.
సువర్చల. సం ఆగిసె†; సింగిమిరి†.
సువర్తకము సం. తేలు†.
సువర్ణము. సం. బంగారు; మాడ; ధనము; ఒకపువ్వు; నల్లఅగలు. విణ. మంచివర్ణము గలది.
సువల్లి. సం. కారుగచ్చ†.
సువహ. సం. అందుగు†; కారెలక†; చెప్పతట్ట†; నల్లవావిలి†; సర్పాక్షి†; వీణె. విణ. సుఖముగ మోవఁదగినది.
సువారంపుటిల్లు. వంటయిల్లు.
సువారంపువాఁడు వంటవాఁడు.
సువారము. వంట.
సువాల. రూ. సువ్వాల.
సువాసిని. సం. పేరంటాలు, పేరంటము చేయు స్త్రీ.
సువ్రత. సం. మంచిగోవు, సులభముగా పిదుకఁదగినయావు. విణ. మంచివ్రతము గలది.
సువ్వలాల. సువ్వాల.
సువ్వాల. ఆఁడువారు పెండ్లిండ్లయందు సువ్వియను పదముతో ఆలాపముచేసి పాడెడు పాట; సువ్వి.

సువ్వి. దంచుటయందగు ధ్వన్యనుకరణము
సువ్వె. వా. చువ్వె.
సుశర్ముఁడు సం. ఒక రాజు.
సుషమ సం. మిక్కిలి కాంతి. విణ. మనోజ్ఞమైనది; సరిసమానరైనది.
సుషవి. సం. కాఁకర†; జీలకఱ్ఱ; నల్ల జీలకఱ్ఱ.
సుషి. సం. రంధ్రము.
సుషిమము. సం. చల్లన. విణ. చల్లనిది.
సుషిర. సం. సువ్వగుత్తిక †.
సుషిరము సం. రంధ్రము; పిల్లంగ్రోవి మొదలగు ముఖవాద్యము; కిక్కస†. విణ బెజ్జముగలది.
సుషుప్తి. సం. గాఢనిద్ర, కలలులేనినిద్ర, అవస్థావిశేషము.
సుషుమ్న. సం. ఒకనాడి.
సుషేణము సం. కలివి†.
సుషేణిక సం. నల్లతెగడ†.
సుస్తి. హిం. సోమరితనము. వా. జబ్బు.
సుహృదుఁడు. సం. స్నేహితుఁడు.
సుహ్మదేశము సం. 56దేశములలోనొకటి.
సుళువు విణ. సులభము. రూ. సులువు.
సుళ్లమారి. విణ. సుడులుగల వాఁడు; చుట్టఁబెట్టువాఁడు.

## సూ

సూ. వా. చూ.
సూకరము. సం. పంది; వరాహము.
సూక్ష్మము. సం. అధ్యాత్మము; కపటము; అణువు. విణ. సన్నము; కొంచెము.
సూక్ష్మవస్త్రము. సం. సన్నపుబట్ట.
సూచకము. సం. సూది; నక్క; కుక్క; కాకి; పిల్లి.
సూచకుఁడు. సం. విణ. కొండెకాఁడు; బోధచేయువాఁడు.
సూచన. సం. జాడ; గ్రుచ్చుట; తెలుపుట; అగపఱచుట; హింస.
సూచి. సం. సూది; ఒకనృత్యము; అభినయహస్తవిశేషము.
సూచించు. సం అ క్రి. సంక్షేపముగా తెలియఁజేయు; తెలియఁజేయు.
సూచిక. సం. సూది. విణ. తెలియఁజేయునది.
సూచితము. సం. విణ. సంక్షేపముగా తెలుపఁబడినది; తెలుపఁబడినది.
సూచినుకు. అల్పధారావర్షము.
సూచీముఖము. సం. ఒక వ్యూహము; అభినయహస్తవిశేషము; వజ్రము; పక్షివిశేషము; ఒక నరకము
సూటి. గుఱి; విధము; ఉపాయము
సూటికాఁడు. విణ. గుఱికాఁడు; అందగాడు
సూటిపడు. అ. క్రి. సరితాఁకు.
సూడించు అ. క్రి. పగగొను.
సూడిగములు బ. చేతికడియములు, పారిహార్యములు; ఆఁడుదాని చేతిగాజులు.
సూడిద / సూడిదె } కానుక; వింతవస్తువు.
సూడు ఈర్ష్య; పగ, విద్వేషము; పగ వాఁడు.
సూడుకాఁడు. శత్రువు.
సూడుకొను. అ. క్రి. పగగొను.
సూడుపట్టు అ. క్రి. విరోధించు.
సూతకము. సం. పురుడు, జాతాశౌచము; మైల, మృతాశౌచము; పాదరసము.
సూతము. సం. పాదరసము.
సూతి. సం. ప్రసవము, బిడ్డనుగనుట.
సూతిక. సం. బాలెంత.
సూతుఁడు. సం సారథి; బ్రాహ్మణ స్త్రీ క్షత్రియజాతుఁడు; బట్టువాఁడు; వడ్లంగి.
సూత్రానుఁడు. సం. వ్యాసశిష్యుఁడు. విణ. నేర్పరి.
సూత్రధారుఁడు. సం. నాందికి పిమ్మట వచ్చునట్టిపాత్ర, నాట్యప్రస్తావనచేయు ప్రధాననటుఁడు; వడ్లంగి; ఇంద్రుఁడు. వా మేళగాఁడు, ఆటాడించువాఁడు; నడపించువాఁడు.
సూత్రపడు మి. అ. క్రి. జతపడు.
సూత్రము. సం. నూలు, దారము; శాస్త్రాది సూచనాగ్రథము; జందెము; ఏర్పాటు. వా. ఉపాయము.
సూత్రించు. సం. స క్రి. సూత్రపఱచు.
సూదంటుఱాయి. అయస్కాంతము.
సూదనము. సం. చంపుట. విణ. చంపునది.
సూదనుఁడు. సం. విణ (పదాంతమున) సంహరించువాఁడు; కొట్టువాఁడు.

సూదము. సం. వండినపప్పు; దోషము; పాపము.
సూది. సూచి, బట్టలుకుట్టెడి సాధనము.
సూదిగొంటు. లతాపూగము†.
సూదితము. సం. విణ. చంపఁబడినది.
సూదిమల్లె. ఒకదినుసుమల్లె†
సూదిరాయి సూదంటురాయి.
సూదుఁడు. సం. విణ వంటవాఁడు.
సూన సం కూఁతురు; కొండనాలుక; జంతువధస్థానము;(ఇవిఅయిదు—: ఒడని, (అోలు,) పేషణి. (సన్నికల్లు,) చుల్లి, (ప్రొయ్యి) ఉదకుంభి, (నీళ్లకడవ,) మార్జని (పొరక) అని.] వ్య. గొఱ్ఱెలు మేకలు కోసెడి స్థానము.
సూనగాఁడు. మి. గ్రా. విణ. చంపువాఁడు; కటికి [పుట్టినది
సూనము. సం. ప్రసవము; పుష్పము విణ.
సూనరి మి. గ్రా. విణ. చంపువాఁడు; పూవులమ్మువాఁడు.
సూనుఁడు. సం. కొడుకు; తమ్ముఁడు; సూర్యుఁడు.
సూనువు. సం. కూఁతురు.
సూనృతము. సం శుభము; ప్రియమునుసత్యమునైనవాక్కు. విణ శుభముగలది.
సూపకారుఁడు. సం. వంటవాఁడు.
సూపధూపనము. సం. ఇంగువ.
సూపము. సం. అల్లము ఇంగువ ఉప్పు మొ॥ వేసి వండిన పప్పు.
సూపుఁడు. సం. విణ. వంటవాఁడు.
సూయాణము. శత్రుభయంకరమైన దండయాత్ర.
సూరణము. సం. కంద†.
సూరసూతుఁడు. సం అనూరుఁడు.
సూరి. సం. సూర్యుఁడు; విద్వాంసుఁడు.
సూరుఁడు. సం. సూర్యుఁడు.
సూరెగిలు } అ. క్రి. ప్రక్కకొదుఁగు.
సూరెగిల్లు }
సూరెపాను. ఆలవట్టము.
సూరెవుటము. సూర్యపటము.
సూరేకారము. క్షారవిశేషము.
సూరేపాను. రాజులకు పట్టెడు విసనకఱ్ఱ.
సూరెలు. బ. పార్శ్వము; ఇరుకెలఁకులు.
సూర్పము. సం. చేట.
సూర్మి. సం. లోహప్రతిమ.
సూర్యకాంతము. సం. అగ్నిమణి, సూర్యరశ్మిసోఁకి అగ్నిపుట్టెడి ఒకరాయి.
సూర్యతనయ సం. కాళింది, యమునానది.
సూర్యపటము. మేలుతెరపు మొకమాలు.
సూర్యపుత్రుఁడు సం శనిగ్రహము; యముఁడు; కర్ణుఁడు; సుగ్రీవుఁడు
సూర్యానువర్తిని సం ప్రొద్దుతిరుగుడు†.
సూర్యుఁడు. సం. వెలుఁగుఱేఁడు, గ్రహరాజు.
సూర్యేందుసంగమము సం. అమావాస్య.
సూల. రోగవిశేషము, శూల
సూలచేకట్లు. కంకణవిశేషము.
సూవె వా మూవె.
సూసకతురాయి } వాలపాశ్యవిశేషము, స్త్రీలుతలయందు ధరించు తిరుగుడుబిల్ల.
సూసకము }
సూనరి. సున్నముపూయువాఁడు, లేఁపకుఁడు.

## సృ

సృక్వము } సం. పెదవిమూల, సెలవి.
సృక్వ }
సృగము. సం. సాఁగు, భిండిపాలము.
సృగాలము. సం. నక్క. రూ. శృగాలము
సృగాలిక. సం. ఆఁడునక్క.
సృజన. సం. సృష్టి.
సృజించు సం. స క్రి. సృష్టిచేయు.
సృజ్యము. సం. విణ. సృజింపఁదగినది.
సృణి. సం. అంకుశము.
సృణిక. సం. చొంగ. రూ. సృణీక.
సృతి. సం. మార్గము; గమనము.
సృపాటిక. సం. పిట్టముక్కు.
సృమరము. సం. మహిషాకారముగల పెద్ద చమరమృగము.
సృష్టము సం. విణ సృజింపఁబడిన ప్రపంచము మొ॥; నిర్మింపఁబడినది; విడువఁబడినది; నిశ్చయింపఁబడినది; అధికమైనది; అలంకరింపఁబడినది
సృష్టి సం. నిర్మాణము, సృజించుట; స్వభావము; త్యాగము.

## సె

సెంటెన్సు ఇం. శిక్షావిధి.
సెక. ఉష్ణము, వెట్ట, వేఁడిమి; జ్వాల; తాపము
సెకకంటి శివుఁడు, అగ్నిదృక్కు.
సెకవెలుఁగు సూర్యుఁడు, ఉష్ణరశ్మి.
సెక్రెటరి. ఇం. కార్యదర్శి.
సెక్రేటరు. ఇం. రాజకార్యదర్శి కచేరీ స్థానము
సెగ రూ. సెక.
సెగపాపఁడు కుమారస్వామి, అగ్నిభువు.
సెగతేఁడు. అగ్ని, శిఖావంతుఁడు.
సెగ్గము. గోఁత. విణ. నింద్యము.
సెగ్గించు. స. క్రి. గోయు, ఏవగించు.
సెగ్గింపు. గోఁత.
సెగ్గు రూ సెగ్గము.
సెజ్జ. శయ్య; బుట్ట ?
సెట్టి వైశ్యుల శ్రేష్ఠనామము; వర్తకుఁడు.
సెనగ. చణకము; ఒక ధాన్యము.
సెపియించు. స. క్రి. శపియించు. రూ. సెపించు.
సెబాసు హిం. అవ్య. బళీ.
సెబ్బర. చెడుగు. విణ. చెడ్డది.
సెబ. రూ. సెబ్బర.
సెమ్మె. ఇత్తడి దీపస్తంభము.
సెర. నేత్రమునందలి రేఖ; కాంతి.?
సెరగు ఆపద.
సెరబడి. స్నేహము.
సెరబము. శరభమృగము.
సెరవు సహాయము.
సెల. సెలయేఱు; ఉపశాఖ; నీరు ఊరెడి ప్రదేశము; బాణపుములికి; ఏదుపంది ముల్లు; ములికోల మొదలగువాని చివర యందలియినుపముల్లు; బాణము; వ్రణము నందు చీము వ్యాపించెడి రంధ్రము.
సెలకట్టె. బాణము; బాణమువలె వేగముగాఁ బాఱుసట్టి శ్యేనవిశేషము. రూ. సెలకట్టియ.
సెలగ. ఉపశాఖ; జోసెడు పరిమాణము; సెలగపాలు.
సెలగత్తి. కల్లుగీఁచువాని కత్తి.
సెలగు. స. క్రి. ఖండించు.
సెలగొమ్మ. ఉపశాఖ.
సెలగోల. గొల్లవాఁడు పసుల మేపెడు కోల, చబుకుకట్టిన చిన్నకఱ్ఱ.
సెలపంది. ఏదుపంది.
సెలపు. రూ. సెలవు
సెలపుండు. నాడీవ్రణము.
సెలయు. అ. క్రి. చెలరేగు. స. క్రి. చిమ్ము
సెలయాట. కొండయూట. ప్రస్రవణము
సెలయేఱు నిర్ఝరము, పర్వతమునుండి ప్రవహించెడినది.
సెలవడు } అ. క్రి. సెలవేయు
సెలవాఱు }
సెలవి. పెదవిగూటాల, ఓష్ఠప్రాంతము
సెలవిచ్చు. స. క్రి. ఆజ్ఞాపించు.
సెలవిల్లు. రూ. సెలనువిల్లు.
సెలవు వ్యయము; అనుజ్ఞ. స. క్రి ఖండించు
సెలవులు. బ. ఓష్ఠప్రాంతములు.
సెలను. ఒక చెట్టు.
సెలనువిల్లు. సెలనుబద్దలతోఁ జేసినవిల్లు.
సెలుకాలుది. పందెపుకోడి పుంజు పేరు.
సెల్లా. అంచు కమ్ములు లేని తెల్లవస్త్రము.
సెల్లుఁడు. శల్యుఁడు.
సెవ. రూ. సెగ.

## సే

సేకము. సెగ. సం. చల్లుట; తడుపుట.
సేకరము. సంగ్రహము.
సేకరించు. అ. క్రి. తెప్పిఱిల్లు. స. క్రి. సంగ్రహించు.
సేగి. నష్టి; ఆపద; కీడు; పీడ.
సేచకము. సం. మేఘము. విణ. చల్లునది; తడుపునది.
సేచకుఁడు. సం విణ. తడుపువాఁడు.
సేచనము. సం. చల్లుట; తడుపుట; ఓడలోఁ జొచ్చిననీళ్ళు వెలికిఁ బాఱఁజల్లెడు బొక్కెన.
సేడుకఱ్ఱ. సాలెవాని సాధనవిశేషము.
సేతువు సం. కట్ట; గట్టు; ఉలిమిరిత.
సేద. శ్రమము, అలయిక.
సేదగొను. అ. క్రి. శ్రమమునొందు.
సేద్యకాఁడు. కృషీవలుఁడు, కమతకాఁడు

సేద్యము. కృషి, వ్యవసాయము.
సేన. విణ. బహు, అధికము. సం. దండు; చతురంగబలము.
సేనము. చిన్నయలి.
సేనాంగములు. సం. బ. ఏనుఁగులు గుఱ్ఱములు రథములు బంట్లు.
సేనాని సం. కుమారస్వామి; సేనానాయకుఁడు.
సేనాపతి. సం. సేనా సి. వ్య. దేంద్ర వాంద్ర కులశ్రేష్ఠనామము.
సేనాముఖము. సం. సేనయొక్క అగ్రభాగము; మూడురథములు మూడేనుఁగులు తొమ్మిది గుఱ్ఱములు పదునేవురు కాల్వురును గలసేన.
సేపు. సమయము. (కొంతసేపు, జాము సేపు అని.)
సేబాసు. అవ్య. సెబాసు.
సేమంతి-క. సం. ఒకగులాబి†; చేమంతి†.
సేమము. క్షేమము; శుభము.
సేమ్య. సేవియ.
సేరి. విణ. ఈనాముకాని పొలము.
సేరు. 24 తులములయెత్తు; ధాన్యమాన విశేషము.
సేరుంబావు. సవాసేరు.
సేల. వస్త్రము.
సేలు. అప. రూ. సాలు.
సేవ. సం. కొలువు, శుశ్రూష, సేవ్యాను కూల కారిత్వము, సినువరకము; సేవియ.
సేవంతి. సం. శతపత్రి, లాక్షాపుష్పం, గులాబి†.
సేవకము. సం. పీణకరివె.
సేవకుఁడు. సం. అనుజీవి, కొలువుడు కాఁడు.
సేవతి. సం. పిన్నగోరంట†.
సేవనము. సం కొలువు; కుట్టు.
సేవి. సం. విణ. సేవకుఁడు.
సేవించు. సం. స.క్రి. కొలుచు; భక్తితో సేవింపఁదగినవారి చిత్తమువనుసరించు.
సేవిక. సం. సేవియ, సేమ్య.
సేవితుఁడు. సం. విణ. సేవింపఁబడిన వాఁడు.
సేవియ. సేమ్య, గోదుమనూకతో సన్నగా తాలికలుచేసి పాలు పోసి వండెడు భక్ష్యవిశేషము.
సేవు. దొంతి కుండ.
సేవె. రూ. సేవియ.
సేవ్య. సం. బృందత†.
సేవ్యము. దున్నిసిద్ధము చేసినపొలము. సం. వట్టివేరు†; నీటివట్టివేరు†; రావి†; ఎఱ్ఱగన్నేరు†. విణ సేవింపఁదగినది.
సేవ్యుఁడు. సం. సేవింపఁదగినవాఁడు.
సేస. అక్షత; సేసఁబ్రాలు; పాపట.
సేసఁబ్రాలు. బ. తలఁబ్రాలు.
సేసకొప్పు. కొండెసిగ.
సేసలు. అక్షతలు.
సేళము. కారంభ, ప్రియంగువు†.

## సై

సై. ఉప. సహాశబ్దార్థకము.
సైంధవము. సం ఇందుప్పు, లవణోత్తమము, సైంధవలవణము; గుఱ్ఱము; సింధుదేశము; అందుఁబుట్టిన గుఱ్ఱము. విణ. సింధువునఁబుట్టినది.
సైంహికేయుఁడు. సం. రాహుగ్రహము.
సైఁచు. అ. క్రి. ఓర్చుకొను; రుచించు. స. క్రి. సహించు, ఓర్చు.
సైఁదము. గోదుమపిండి.
సైఁపు. ఓర్పు.
సైఁపుడు. ఓర్పు.
సైకతము. సం. ఇసుకతిన్నె; ఇసుకనేల.
సైకతలింగము. సం. ఇసుకలింగము.
సైకము. సూక్ష్మత్వము. విణ సూక్ష్మము, చిన్నది.
సైగ. సయిగ, హస్తాదుల సంజ్ఞ.
సైడ్డు. ఇం. ప్రక్క, పుట.
సైతము. అవ్య. సహితము. కూడ.
సైతవాహిని. సం. బాహుదానది.
సైతాను. హిం. పిశాచముల యధిపతి.
సైదోడు. తోఁబుట్టువు.
సైపు. హిం. కత్తి.
సైద్ధాంతికుఁడు. సం. విణ. సిద్ధాంతము తెలిసినవాఁడు.
సైనికుఁడు. సం. కొత్వాలు, సేనాధిపతి. విణ. సేనతోఁజేరినవాఁడు.

సైన్యము. సం. సేన.
సైన్యుఁడు సం. విణ. సైనికుఁడు.
సైబు. ఆయుధవిశేషము.
సైరంధ్రి ద్రౌపది; గట్టువాలు; అంతఃపురపుకావలికత్తె ని రూ. సైరింధ్రి.
సైరణ. సహనము.
సైరించు. అ. క్రి. సహించు, సైరణచేయు.
సైరింధ్రుఁడు సం. వేఁటాడెడి యొక సంకరజాతివాఁడు.
సైరికము. సం. దున్నెడియెద్దు. విణ. నాఁగలి సంబంధమయినది. [హాలికుఁడు
సైరికుఁడు. సం. దున్నెడువాఁడు,
సైరిభము. సం. కారెనుపోతు; స్వర్గము.
సైరెయకము. సం. గోరంట†.
సైలరు. ఇం. ఓడలమీఁదపనిచేయు వాఁడు.

## సొ

సొంటి. శుంఠి, శుష్కముచేసి యెండఁబెట్టిన అల్లము.
సొంటు. తప్పు, దోషము.
సొంతము. విణ. స్వకీయము.
సొంపారు, సొంపిలు, సొంపిల్లు } అ. క్రి. యోగ్యమగు; శోభించు; సొంపగు.
సొంపు సమృద్ధి; సంతోషము; ప్రసన్నత; యోగ్యత; కాంతి; సుఖము; సౌందర్యము.
సొకనాని. దేవాలయముఖద్వారప్రదేశము.
సొక్కు. వా. ఇంచుకంత శరీర విస్మృతి.
సొగటము. అడ్డసారె.
సొగటాలు. బ. పగడసాలాట; జూదమాడెడు సారెలు.
సొగటు. వాడు.
సొగపు, సొగయిక } చొక్కు, పారవశ్యము.
సొగయు. అ. క్రి. చొక్కు, మూర్ఛిల్లు. ప్రే. సొగయించు.
సొగసు. అందము; పారవశ్యము; విలాసము; శృంగారము.
సొగసుకత్తె. విటకత్తె. విణ. అందగత్తె; శృంగార చేష్టలుగల స్త్రీ.
సొగసుకాఁడు. విటకాఁడు. విణ. అందగాఁడు; శృంగారచేష్టలుగలవాఁడు.
సొగియించు. అ. క్రి. సుఖించు.
సొగియు. అ. క్రి ఇంపగు; మ్లానమగు; చొక్కు
సొచ్చెము. పెచ్చు; నిర్మలము, స్వచ్ఛము.
సొజ్జె. బియ్యమువేఁచివండిన యన్నము.
సొజ్జెబూరె. భక్ష్యవిశేషము.
సొటసొట. కార్శ్యము.
సొటసొటవోవు. అ. క్రి కృశించు. రూ. సొటసొటలువోవు.
సొట్టి. రూ. చొట్టి.
సొడ్డు. కొఱత, న్యూనత, ఆటలలో నోడినవానిమీఁద వేయు దెబ్బ
సొత్తు. సత్వము, సొమ్ము; హక్కు, స్వత్వము
సొద. చితి, పీనుఁగును లుచ్చుటకుఁ బేర్చిన కట్టెలు మొదలగువానిప్రోగు. చిత్యగ్ని.
సొన. గ్రుడ్డులోనిజిగ; బెండ మొదలగువాని మీఁది నూఁగు; ఊటకాలువ; చెట్టు కాయ మొ॥ కొయ్యఁగా స్రవించెడి రసము; ద్రవవిశేషము.
సొనచిక్కుడు. ఊలవ కాయ వంటి కాయలుగల ఒక చెట్టు. [రూ సొనాన్న.
సొన్న—ము. స్వర్ణము, బంగారు; మాడ.
సొన్నపట్టెరుమాలా. బంగారంచురుమాలు
సొన్నాయి. సుషిర వాద్యవిశేషము.
సొన్నారి. స్వర్ణకారుఁడు, కంసాలి.
సొబగు. సౌభాగ్యము, సౌందర్యము.
సొబగుఁడు. విటుఁడు. విణ. చక్కని వాఁడు, సుభగుఁడు.
సొబను. బడబచూలు.
సొమక, సొమ్మ } మూర్ఛ.
సొమ్మగొను, సొమ్మవోవు, సొమ్మసిల్లు } అ. క్రి. మూర్ఛిల్లు. రూ. సొమ్మలువోవు, సొమ్మసిలు
సొమ్ము. స్వము, ధనము; గోసమూహము; భూషణము. విణ. అధీనవస్తువు.
సొర. అనుగు†; చితి; ఒకజాతిమీను
సొరంగ—ము. బిలము, గుహావలెతొలిచిన రంధ్రము, సురంగ.
సొరగు. మూర్ఛ. అ. క్రి. లీనమగు.
సొరదోఁకి. విణ. దురాచారుఁడు
సొరపు. విణ. కృశము
సొరము. స్వరము, కంఠధ్వని; షడ్జాది.

సొరిది. వృక్షాదులపంక్తి, వరుస; క్రమము; అత్యంతము.
సొరుగాకు. ఎండాకు. [మ్లానమగు.
సొరుగు. మూర్ఛ అ. క్రి. మూర్ఛిల్లు;
సొరుగులపెట్టె. అఱలమర్చిన పెట్టె.
సొఱ అలాబువు, ఆనుగు; తుంబి†. రూ. సొఱ్ఱ. [పంక్తి.
సొలపు. నిస్త్రాణత, పారవశ్యము; మూర్ఛ;
సొయిమిక. వైముఖ్యము.
సొలయు. అ. క్రి. నిస్త్రాణమగు; మూర్ఛపోవు; వెనుదీయు; వైముఖ్యమునొందు, వైరస్యమునొందు.
సొలిమిడి. మూర్ఛ
సొలోపు. ఇం ఏటవాలు ప్రదేశము.
సొవ. సవ, జాడ.
సొసాయించు. మందలించు, హెచ్చరించు.

## సో

సోఁకు. స్పర్శము; వాయువు; రాక్షసుఁడు. అ. క్రి. స్పృశించు, తగులు; గ్రహమావేశించు.
సోకుజుక్క. మూలనక్షత్రము.
సోఁకుటొజ్జ. శుక్రుఁడు, దైత్యగురువు.
సోఁకుడు. స్పర్శము; గ్రహావేశము; పిశాచము, రాక్షసుడు.
సోఁకుడుముడుఁగు. ఓషధీవిశేషము.
సోఁకుదయ్యము. స్పర్శనము, గాలి.
సోఁకుమూకలగొంగ. విష్ణువు, దైత్యారి.
సోఁకుమూకలదటి. నైరృతి.
సోఁకులఱేఁడు. నైరృతి.
సోఁగు. సరము.
సోఁపు. ఒకానొక మసాలా దినుసు.
సోఁపుఁబిండి. చమసి, చణకపిష్టము.
సోగ. దైర్ఘ్యము; చాఁపు; ఉపశాఖ. విశ. దీర్ఘము.
సోజరు. ఇం. సైనికుఁడు.
సోటిక. న్యాయము.
సోడు. మాడపట్టు. [తలకెక్కు.
సోడుముట్టు. స. క్రి. అంతటవ్యాపించు;
సోఢ. సం. విశ. సమర్థుఁడు, సహించువాఁడు, ఓపువాఁడు, ఓర్చువాఁడు.
సోఢము. సం. విశ. ఓర్వఁబడినది, సహింపఁబడినది.
సోణము. నాసామూలము.
సోత్ప్రాసము. సం. ఎత్తిపొడుపుమాట.
సోద. గచ్చు, గార.
సోదన. శోధనము; శకునార్థము రామాయణము మొదలయిన గ్రంథములయందు దారము వేసి శోధించుట.
సోదనదివియ } సం. శోధనదీపిక, రహస్యప్రదేశములను చూపు
సోదనదీవియ } దివియ రూ. సోదనదీవె.
సోదరి. సం. తోడఁబుట్టినది.
సోదరుఁడు } సం. తోడఁబుట్టినవాఁడు.
సోదర్యుఁడు }
సోదించు. స. క్రి. శోధనముచేయు.
సోదియ } రాఁగల మేలుకీడులనుగూర్చి
సోదె } చేయుప్రశ్నము.
సోదెకత్తె. దైవజ్ఞ, విప్రశ్నిక, సోదెచెప్పు స్త్రీ. రూ. సోదెకత్తియ.
సోదెము } చోద్యము, ఆశ్చర్యము. విశ.
సోద్దెము } ఆశ్చర్యకరమైనది.
సోధ్రకము. సం. బిల్లు†.?
సోన. కొద్దివాన; వాన.
సోనంగి. శునకజాతి.
సోనబల్లి. లూత.
సోపనము. సోపానము, మెట్టు.
సోపప్లవుఁడు. సం విశ. ఉపరక్తుఁడు.
సోపానము. సం. మెట్టు.
సోబ. శోఫము, వ్యాధివిశేషము.
సోబతు. హిం. తోడు, సహవాసము.
సోబనము. శోభనము, మంగళము.
సోబనవారము. మంగళవారము.
సోబాన. ఒకదినుసు పెండ్లిపాట.
సోబె. సిబ్బెము, సిధ్మము. రూ. సోబియ.
సోమ. శ్రమము; పరాక్రమము.
సోమకర్కటి. సం. కరపుచ్చ, కరబూజ†.
సోమధార. సం. ఆకాశగంగ; ఆకాశవీథి.
సోమపీది } సం. యజ్ఞమునందు సోమ
సోమపుఁడు } పానముచేసినవాఁడు. రూ. సోమపీతి.
సోమము. పరాక్రమము. సం. సోమలత; సోమలతయొక్కరసము; జలము; కర్పూ

రము; దినముయొక్క పదునొక్కండవ భాగము. [వాఁడు.
సోమయాజి. సం. సోమయాగము చేసిన
సోమరాజి. సం. కారుగచ్చ†.
సోమరి. విణ. మందుఁడు.
సోమరెపాటు. సోమరితనము.
సోమలత. సం. సోమవల్లి, తిప్పతీఁగ.
సోమవల్కము.సం. వెలిచంద్ర† తేఁకు†.
సోమవల్కలము. సం. వెలిచంద్ర†.
సోమవల్లరి. సం. పొన్నగంటి కూర; సోమెదకూర.
సోమవల్లి సం. తిప్పతీఁగ.
సోమవారము. సం. ఇందువారము.
సోమసూత్రము. సం. పానవట్టమునుండి నీళ్లుపోవుదారి.
సోమాసి సోమయాజి
సోమాసిపెట్టుఁజెట్టు. ఇంద్రుఁడు.
సోమించు. అ. క్రి. సరిపోలు; పరాక్రమించు; విజృంభించు; వ్యాపించు.
సోమిందం. బ్రమ్మి†; శణపర్ణి.?
సోమిద. తిప్పతీఁగ†.
సోమిదమ. సోమిదమ్మ.
సోమిదము. శణపర్ణి†.
సోమిదమ్మ } సోమయాజి భార్య.
సోమిసాని }
సోము. సుఖము. విణ. ఆసక్తము.
సోముఁడు. సం. చంద్రుఁడు; శివుఁడు; కుబేరుఁడు; వాయువు; యముఁడు; ఒకవసువు; సుగ్రీవుఁడు.
సోమెద. శాకవిశేషము, సోమవల్లరి.
సోమోద్భవ. సం. నర్మదానది.
సోయగము. అందము; కాంతి.
సోరంగి. మత్స్యవిశేషము.
సోరణ-గండె } గవాక్షము. రూ. సోరణము, సోర్ణగండ్లు
సోరణగండ్లు }
సోరి. పంక్తి.
సోరు. పెట్లుపప్పు, సోరుపప్పు.
సోరువా. హిం. మాంసపుచారు.
సోల. నిసంచకము, ధాన్యమానవిశేషము.
సోలము. మత్తు; చొక్కు.
సోలింత. సోలుట. [మనొంది వ్రాలు.
సోలు. అ. క్రి. పైత్యాదులచేత వివశత్వ
సోలుదారులు. ఇం. ఇంగ్లీషుని పాయిాలు.
సోల్లుంఠనము. సం. దెప్పు, ఎత్తిపొడుపు మాట; స్తుతినింద. రూ. సోల్లుంఠము.
సోవతము. బలి, ఆహారము.
సోన. అత్యాశ. [సోళాందొప్పి.
సోళాదొప్పి. ద్యూతవిశేషము. రూ.
సోళు. శూన్యము.

## సౌ

సౌందర్యము. సం. చక్కఁదనము.
సౌకర్యము.సం. అనాయాసము; సౌలభ్యము
సౌకుమార్యము. సం. మార్దవము; కావ్య గుణములలో నొకటి.
సౌఖశాయనికుఁడు. సం. విణ. సుఖనిద్ర యాయని ప్రశ్నముచేయువాఁడు.
సౌఖ్యము. సం. సుఖము.
సౌగంధికము. సం. చెంగలువ, కహ్లారము; దానిమ్మవిత్తువంటి కాంతిగల కెంపు; కామంచిగడ్డి; గంధకము.
సౌగంధ్యము. సం. మంచివాసన.
సౌగంధికుఁడు. సం. సుగంధిద్రవ్యముల వ్యాపారి.
సౌచి-కుఁడు. సం. బట్టలుకుట్టువాఁడు.
సౌజన్యము. సం. మంచితనము.
సౌదామని } సం. మెఱుపు; మాలాకారమైనమెఱుపు;ఒక అప్సరఃస్త్రీ
సౌదామ్ని }
సౌదాయికము. సం. స్త్రీకితల్లితండ్రి భర్త మున్నగువారివలన లభించిన ధనము.
సౌధము సం.నగరు,రాజగృహము; మేడ.
సౌనందము. సం. బలరాముని ముసలము.
సౌనికుఁడు. సం. వధనువిధించు అధికారి; కటిక, మృగపక్ష్యాదులనుఁ జంపి విక్రయించి జీవించువాఁడు.
సౌపానము. సం. సోపానము.?
సౌప్తికము. సం. ముచ్చిలిపోటు; మహాభారతమునందలి యొక పర్వము.
సౌభాగినేయి. సం. భాగ్యవతి-కూఁతురు.
సౌభాగినేయుఁడు.సం. భాగ్యవతి-కొడుకు.
సౌభాగ్యము. సం. సుభగత్వము; ఒక యోగము.
సౌభ్రాత్రము.సం.మంచితోఁబుట్టుఁదనము ఉత్తమ సోదరులభావము.

సౌమనస్యము. సం. ప్రేమ, మంచిమనస్సు గలిగియుండుట; శ్రాద్ధమునందు పిండదానానంతరము బ్రాహ్మణహస్తము నందిచ్చెడు పుష్పదాన మంత్రము.
సౌమిత్రి. సం. లక్ష్మణుఁడు. రూ. సౌమిత్రుఁడు.
సౌమ్య. సం సౌమ్యసంవత్సరము.
సౌమ్యము. సం సోముఁడు దేవత గాఁ గలది.
సౌమ్యుఁడు. సం. బుధగ్రహము. విణ. మంచివాఁడు; తిన్ననివాఁడు; ఒప్పినవాఁడు. [బోళము.
సౌరభము సం మంచివాసన; కుంకుమము;
సౌరభేయము. సం. ఎద్దు.
సౌరభేయి సం ఆవు.
సౌరభ్యము. సం. పరిమళము; ఒప్పిదము; గుణగౌరవము.
సౌరభ్యుఁడు సం. కుబేరుఁడు
సౌరము సం. ఒకమతము. విణ. సూర్యునకు సంబంధించినది
సౌరాష్ట్రదేశము. సం. 56 దేశములలో నొకటి, సూరతు. [సూరతు.
సౌరాష్ట్రము. సం కంచు; రాగవిశేషము;
సౌరాష్ట్రికము. సం. విషభేదము. విణ. సౌరాష్ట్రదేశమునఁ బుట్టినది.
సౌరి. సం. శనిగ్రహము; యముఁడు.
సౌరికుఁడు. సం. కబ్బిలి, కల్లమ్మువాఁడు
సౌరు. చక్కఁదనము; విధము. విణ. సుందరము.
సౌరైనది. విణ. సుందరమైనది.
సౌరైనవాఁడు. విణ. సుందరమైనవాఁడు.
సౌవర్చలము. సం. సజ్జకాక్షారము; నల్ల ఉప్పు.
సౌవస్తకరణి. సం. ఓషధీవిశేషము.
సౌవిదల్లుఁడు } సం. అంతఃపురపు కావలివాఁడు. [ఒకటి.
సౌవిదుఁడు }
సౌవీరదేశము. సం. 56 దేశములలో
సౌవీరము. సం. పులికడుగు; సురమా, సౌవీరాంజనము; రేఁగుఁబండు; సౌవీరదేశము. [యుండుట.
సౌశీల్యము. సం. మంచి శీలము గలిగి
సౌష్ఠవము. సం. చక్కఁదనము, తిన్నదనము; నాట్యాంగవిశేషము.
సౌహార్దము } సం సుహృద్భావము, సఖ్యము.
సౌహార్ద్యము }
సౌహిత్యము. సం. తనివి, తృప్తి.
సౌహృదము } సం. సౌహార్దము.
సౌహృదయ్యము }

## స్క

స్కందుఁడు. సం. కుమారస్వామి.
స్కంధపత్త్రిక. సం. తలుపుపకమర్చెడు గందపట్టె ?
స్కంధము సం. మూఁపు; గోదె, చెట్టు కొమ్మలక్రింది మాను; వ్యూహము; సమూహము; శరీరము. (స్కంధత్రయము— ఆదానము, నిదానము, చికిత్స. ఇవి వైద్యశాస్త్రమునందలివి. స్కంధపంచకము — రూప వేదనా విజ్ఞాన సంజ్ఞా సంస్కార స్కంధములు. ఇవి బౌద్ధశాస్త్రోక్తములు.]
స్కంధశాఖ. సం. మాని మొదటికొమ్మ.
స్కంధావారము. సం. దండు విడిసిన చోటు; దండు.
స్కంధుఁడు. సం. రాజు.
స్కన్నము. సం. విణ. జాఱినది.

## స్ఖ

స్ఖలనము. సం. జాఱుపాటు; తొట్రుపాటు
స్ఖలించు. సం. అ. క్రి. జాఱు; తొట్రుపడు. రూ. స్ఖలియించు.
స్ఖలితము. సం. వెనుకద్రొక్కుట. విణ. జాఱినది; తడఁబడినది, తొట్రుపడినది.

## స్ఖా

స్ఖాలిత్యము. సం. జాఱిపోవుట; క్రమము తప్పుట; తప్పిపోవుట. వ్య. పొరపాటు.

## స్టా

స్టాంపు. ఇం. బిల్ల; ముద్రవేసిన కాగితము; ముద్ర.

## స్టీ

స్టీమరు. ఇం. పొగయోడ, ధూమనౌక.

## స్టే

స్టేషన్. ఇం. స్థానము, ఉండుతావు. [పోలీసుస్టేషన్, రైలుస్టేషన్ అని.]

## స్త

స్తంబకరి. సం. ధాన్యము; వడ్లు.
స్తంబఘనము } సం. గడ్డి దుబ్బు మొ॥ పెకలించెడి కొడవలి
స్తంబఘ్నము } పాఱ మొ.
స్తంబము. సం. గడ్డి మొ॥; వరిమున్నగు వానిదుబ్బు; బోదెలేని లత[పొద] మొ.
స్తంబేరమము. సం. ఏనుఁగు
స్తంభనము. సం. మ్రానుపడఁజేయుట; మంత్రశక్తిచేత అగ్ని మొదలగు వాని శక్తినణఁగఁ జేయుట; ఒక మన్మథ బాణము.
స్తంభబలి.వ్య. కంబవల్లి.
స్తంభము. సం. కంబము; మ్రానుపాటు, స్తబ్ధముగుట; నిలిచిపోవుట; జడత్వము.
స్తంభయిత. సం. విణ. స్తంభింపఁజేయు వాఁడు.
స్తంభించు. సం. అ. క్రి. నిలిచిపోవు;జడమగు; మ్రానుపడు. ప్రే. మ్రానుపడఁ జేయు.
స్తనంధయి. సం. చంటిపాప.
స్తనంధయుఁడు. సం. చంటిపాపఁడు, పాలుత్రాగెడి పిల్లవాఁడు.
స్తనము. సం. కుచము, చన్ను.
స్తనయిత్నువు. సం, మేఘము; ఉఱుము.
స్తనితము. సం. ఉఱుము.
స్తన్యము. సం. చనుపాలు.
స్తబకము. సం. వికసించిన పూగుత్తి; సమూహము.
స్తబ్ధము. సం. విణ. అణఁగినది; ముడిఁగినది; నిలిచిపోయినది; మ్రానుపడినది.
స్తబ్ధరోమము. సం. పంది, వరాహము.
స్తబ్ధుఁడు. సం. విణ. స్తంభించినవాఁడు.
స్తవము. సం. పొగడిక, స్తోత్రము.

## స్తి

స్తిమితము. సం.విణ. కదలనిది; తడిసినది.

## స్తు

స్తుతము. సం.విణ. స్తోత్రముచేయఁబడినది
స్తుతి. సం. పొగడిక, స్తోత్రము.
స్తుతించు. సం. స.క్రి. పొగడు, స్తోత్రము చేయు. రూ. స్తుతియించు.
స్తుతిపాఠకుఁడు. సం. బట్టువాఁడు. వా. భట్రాజు.
స్తుత్యము. సం. విణ. స్తోత్రముచేయఁ [దగినది.

## స్తూ

స్తూపము. సం. మన్నుమున్నగువానితిన్నె.

## స్తే

స్తేనుఁడు. సం. దొంగ.
స్తేమము. సం. తడియుట.
స్తేయము. సం. దొంగతనము.
స్తేయి. సం. దొంగ.

## స్తై

స్తైన్యము. సం. దొంగతనము.

## స్తో

స్తోకకము. సం. వానకోయిల.
స్తోకము. సం. నీటిబొట్టు; వానకోయిల. విణ. కొంచెము
స్తోత్రము. సం. స్తుతి, కొనియాడుట.
స్తోమము. సం. సమూహము; స్తోత్రము; యజ్ఞము; ధనము.

## స్త్రీ

స్త్రీ. సం. భార్య; ఆఁడుది.( స్త్రీజాతులు నాలుగు — పద్మిని, చిత్రిణి, హస్తిని, శంఖిని.)
స్త్రీఘోషము. సం. ప్రభాతము.?
స్త్రీధనము. సం. స్త్రీద్రవ్యవిశేషము. (ఇది షడ్విధము— అధ్యగ్నికృతము, అధ్యావాహానికము, ప్రీతిదత్తము, భ్రాతృసౌదాయికము, మాతృసౌదాయికము, పితృసౌదాయికము.)
స్త్రీధర్మిణి. సం. ఋతుమతి, ముట్టుది.
స్త్రీభూషణము. సం. మొగలి.?
స్త్రీరంజనము. సం. తాంబూలము.?
స్త్రీసభము. సం. స్త్రీల సమూహము.

## స్త్రై

స్త్రైణము. సం. స్త్రీకి సంబంధించినది.

## స్థ

స్థండిలము. సం. వ్రతము పూనినవాఁడు పండుకొనుటకు బాగుచేసి అలికి దర్భాదులచే సంస్కరింపఁబడిన భూమి; అగ్నిహోత్రము నుంచుటకై సంస్కరించిన స్థానము.
స్థగనము. సం. కప్పు, ఆచ్ఛాదనము.
స్థగితము. సం. విణ. కప్పఁబడినది.
స్థపతి. సం. ఇండ్లుకట్టెడి శిల్పి; రాజు; బృహస్పతి సవనముచేత యజించినవాఁడు; అంతఃపురపు కావలివాఁడు; వడ్లవాఁడు.? విణ. శ్రేష్ఠుఁడు.
స్థపుటము. సం.విణ.మధ్యానతముపార్శ్వోన్నతమునైనది.
స్థలకరణము (నాలుగైదు పల్లెలు గ్రామకరణీకము కటువంటి) గ్రామకరణీకములు గల 20 (లేక) 30 ఊళ్లకు అధికారి.
స్థలపద్మిని. సం. మెట్టతామర†.
స్థలము. సం. బాగుచేయని నేల; మెట్టనేల; ప్రదేశము.
స్థలి. సం. రూ. స్థలము.
స్థవిరుఁడు. సం. విణ. ముదుసలి.
స్థవిష్ఠము. సం. విణ. మిక్కిలి స్థూలము.
స్థవిష్ఠుఁడు. సం. విరాట్టు, వైశ్వానరుఁడు. విణ. అందఱికంటె మిక్కిలి లావైనవాఁడు.

## స్థా

స్థాండిలుఁడు. సం. స్థండిల భూమియందు శయనించెడి వ్రతి.
స్థాణువు. సం. ఈశానుఁడు, శివుఁడు; మేకు; మోడు, కొమ్మలులేని చెట్టు. విణ. స్థిరమయినది.
స్థాత. సం. విణ. ఉండువాఁడు.
స్థాతవ్యము. సం. విణ. ఉండఁదగినది.
స్థానకము. సం. పట్టణము; పాదు.
స్థానము. సం. చోటు. ప్రదేశము; గృహము; పోలిక; ఉనికి; త్రివర్గమునందొకటి, శత్రువుతో సమముగానుండుట; విలుకాని యుద్ధమప్పటి నిలుపు. (ఇది పంచవిధము—ప్రత్యాలీఢము, ఆలీఢము, సమపదము, విశాఖము, మండలము.)
స్థానాపతి. సం మధ్యవర్తి.?
స్థాని. సం.విణ. స్థానముగలది. [ధ్యక్షుఁడు
స్థానికుఁడు. సం స్థానరక్షకుఁడు, స్థానా
స్థానీయము సం. పట్టణము. విణ. స్థానమునకు సంబంధించినది; స్థానముఁ గలిగినది.
స్థాపకుఁడు సం. విణ. స్థాపించువాఁడు.
స్థాపత్యుఁడు. సం. అంతఃపురపు కావలివాఁడు. [పుంసవనము.
స్థాపనము, సం. స్థాపించుట; సమాధి;
స్థాపని. సం. చిఱుబొద్ది†.
స్థాపించు. సం. స. క్రి నిలుపు.
స్థాపితము. సం. విణ. నిలుపఁబడినది; నిశ్చయింపఁబడినది.
స్థామము. సం. సామర్థ్యము.
స్థాయి. సం. విణ. ఎప్పటికి ఉండునది, స్థిరము; ఉండువాఁడు.
స్థాయిభావము. సం. రత్యాదిభావము; నవరసముల యందుండెడిస్వాదుగుణము.
స్థాయుకుఁడు. సం. ఒక్కగ్రామమున కధిపతి.
స్థాలము. సం. కంచము.
స్థాలి. సం. వంటకుండ; కలిగొట్టు†.
స్థాలీపులాకన్యాయము. సం. కుండెఁడన్నమునకు ఒక మెతుకును పట్టిచూచుట అనెడు న్యాయము.
స్థావరము. సం. వింటినారి; కొండ. విణ. కదలనిది, వృక్షము పర్వతము మొ.
స్థావిరము. సం. ముదిమి. [బుడగ.
స్థాసకము. సం. చార్చిక్యము; జలాదుల
స్థాస్నువు. సం.విణ. చిరకాలముఉండునది

## స్థి

స్థితము. సం.విణ. ఉన్నది; నిలుచున్నది; ప్రతిజ్ఞ చేయఁబడినది; మర్యాదతోఁ గూడినది. [మేర.
స్థితి. సం. ఉనికి; కూర్చుండుట; నిలుకడ;

స్థితుఁడు. సం. విణ. ఉన్నవాఁడు; నిలుచున్నవాఁడు.
స్థిర. సం. భూమి; ముత్యాల్యదుపొన్న†.
స్థిరము. సం. కొండ; మెట్టు; మోక్షము. విణ. కదలనిది. [రము.
స్థిరవారము. సం. శనివారము, మందవా
స్థిరాయువు సం. బూరుగు†.
స్థిరుఁడు. సం. శని. విణ. నిలుకడగలవాఁడు; నిర్వికారుఁడు, ఆత్మ, బ్రహ్మము

## స్థూ

స్థూణ. సం. గృహస్తంభము; ఇనుప ప్రతిమ, సూర్మి.
స్థూరి. సం. బరువుమోసెడి గుఱ్ఱము.
స్థూలదంతకము. సం. ఉడుత.
స్థూలనాసము. సం. పంది.
స్థూలపుష్పకము. సం. బకపుష్పము†.
స్థూలము. సం. డేరా?. విణ. లావు, బలిసినది, బుద్ధిలేనిది, జడము.
స్థూలలక్షుఁడు. సం. విణ. నెఱదాత, మిక్కిలి యీవికాఁడు.
స్థూలి. సం. సొట్టిపిట్ట.?
స్థూలోచ్చయము. సం. పెద్దరాయి; మొటిమ ఏనుఁగునడితరపునడ; అసాకల్యము.

## స్తై

స్తైమము. సం. స్థిరత, స్థైర్యము.
స్తేయుఁడు. సం. పురోహితుఁడు; తీర్థపరి విణ. మిక్కిలి స్థిరుఁడు.

## స్థై

స్థైర్యము. సం. స్థిరత్వము, నిశ్చలత్వము; జాపత్రి.?

## స్థౌ

స్థౌణేయము. సం. రూ. థౌణేయము.
స్థౌరి. సం. వీఁపునబరువుమోసెడుగుఱ్ఱము. రూ. స్థూరి, స్థోరి.
స్థౌల్యము. సం. లావు, స్థూలభావము.

## స్న

స్నపనము. సం. స్నానము; అభిషేకించుట.
స్నపితము. సం. విణ. స్నానముచేసినది.
స్నవము. సం. స్రవణము, కాఱుట.
స్నస. సం. బోలుసరము.

## స్నా

స్నాతకుఁడు. సం. వేదాధ్యయనము సమాప్తము గావించి; వివాహమునకోసము స్నాతకవ్రతము చేసికొన్నవాఁడు.
స్నాతుఁడు. సం. విణ. స్నానముచేసిన
స్నానము. సం. మునుక. [సుస్నిఱెం.
స్నానీయము. సం స్నానసాధనమైన
స్నాయి. సం. స్నానముచేయువాఁడు.
స్నాయువు. సం. బోలుసరము.

## స్ని

స్నిగ్ధము. సం. విణ స్నేహముగలది; చిక్కనగలది; నునుపుగలది
స్నిగ్ధుఁడు. సం. స్నేహితుఁడు.

## స్ను

స్నుక్కు. సం. జెముడు†.
స్నుతము. సం. విణ. కాఱినది.
స్నువు. సం. కొండనెత్తము.
స్నుష. సం. కోడలు.
స్నుహి. సం. జెముడు†.

## స్నే

స్నేహము. సం. చెలిమి; తైలము; చమురుగల పదార్థము, [ఘృతము, మజ్జ, వస.]
స్నేహించు. సం. అ.క్రి. స్నేహముచేయు.
స్నేహితుఁడు. సం. మిత్రుఁడు, చెలికాఁడు.

## స్నై

స్నైగ్ధ్యము. సం. స్నిగ్ధభావము, స్నేహము.

## స్ప

స్పందనము, స్పందము } సం. కదలిక; అదరుట.
స్పర్ధ. సం. పోటి; పోలిక; క్రమసమున్నతి; వాదిప్రతివాదుల సంఘర్షణము.
స్పర్ధాళువు. సం. విణ. స్పర్ధగలవాఁడు.
స్పర్శనము. సం. తాఁకుడు; ఈవి; వాయువు

స్పర్శమణి. సం. పరుసవేది.
స్పర్శము. సం. ఈవి; తాఁకుడు; రోగము అంటురోగము; స్పర్శమణి.
స్పర్శవేధి. సం. పరుసవేది. ?
స్పర్శస్పందము. సం. కప్ప.
స్పశము. సం. యుద్ధము.
స్పశుఁడు. సం. వేగులవాఁడు.
స్పష్టము. సం. విణ. వెల్లడియైనగి; స్ఫుట మైనది. వా. విభజన.

స్పృ

స్పృక్క. సం. పిక్క†.
స్పృకుక్క. సం. స్పర్శము. ? . విణ. (ఉత్తరపదమైనచో) స్పృశించునది.
స్పృశి. సం. వాఁకుడు†. [కొను.
స్పృశించు. సం. స. క్రి. తాఁకు, ముట్టు
స్పృశ్యము. సం. విణ. స్పృశింపఁదగినది.
స్పృష్టము. సం. విణ. తాఁకఁబడినది.
స్పృష్టి. సం. తాఁకుడు, తగులుట, స్పర్శము.
స్పృహ. సం. కోరిక.
స్పృహణీయము. సం. విణ. కోరఁదగినది.
స్పృహ్యము. సం. మాదిఫలము†. విణ. కోరఁదగినది.

స్ప్రి

స్ప్రిష్ట. సం. విణ. తపింపఁజేయు రోగము.

స్ఫ

స్ఫట—ము. సం. పాముయొక్కపడగ.
స్ఫటి. సం. పాము; పటిక, పటికారము.
స్ఫటికము. సం. ధాతశిల, పటికపుఱాయి; సూర్యకాంతమణి; చంద్రకాంతమణి.

స్ఫా

స్ఫాతి. సం. వృద్ధి.
స్ఫారము. సం. బంగారు ముద్దగువాని తళుకు. విణ. విపులము, విశాలము; అధికము

స్ఫి

స్ఫికుక్క. సం. స్త్రీయొక్క పిఱుఁదులమీఁది యున్నత ప్రదేశము.
స్ఫిరము. సం. విణ. అధికమైనది.

స్ఫీ

స్ఫీతము. సం. విణ. వికసించినది; వృద్ధి నొందినది.

స్ఫు

స్ఫుటనము. సం. చీలుట; పగులుట; వికసించుట.
స్ఫుటము. సం. విణ. స్పష్టమైనది; వికసించినది.
స్ఫురణము. సం. అదరుట; తోఁచుట; ప్రకాశించుట.
స్ఫురించు. సం. అ. క్రి. అదరు; తోఁచు; ప్రకాశించు.
స్ఫురితము. సం. స్ఫురణము. విణ. అదరినది; తోఁచినది.
స్ఫులింగము. సం. మిణుఁగురు, నిప్పురవ.

స్ఫూ

స్ఫూర్జకము. సం. తుమ్మికి†.
స్ఫూర్జథువు. సం. పిడుగుమ్రోఁత.
స్ఫూర్తి. సం. స్ఫురణము; ప్రతిభ.

స్ఫే

స్ఫేష్ఠము. సం. విణ. మిక్కిలియధికమైనది

స్ఫో

స్ఫోటకము. సం. బొబ్బలుపొక్కుడురోగ విశేషము.
స్ఫోటము. సం. భేదించుట? కురుపు; శబ్దభేదము.

స్ఫ్య

స్ఫ్యము. సం. ఖడ్గాకారమైన యజ్ఞకాష్ఠము.

స్మ

స్మయము. సం. గర్వము.; ఆశ్చర్యము.
స్మరణము. సం. తలఁపు; జ్ఞప్తి.
స్మరధ్వజము. సం. ఉపస్థము.
స్మరమందిరము. సం. ఆఁడుగుఱి.
స్మరసఖుఁడు. సం. వసంతుఁడు; చంద్రుడు. ?
స్మరహరుఁడు. సం. శివుఁడు.

స్మరాంకుశము. సం. (పెంచిదిద్దిన) గోరు.
స్మరించు. సం. స. క్రి. తలఁచు.
స్మరుఁడు. సం. మన్మథుఁడు.
స్మర్త. సం. విణ. స్మరంచువాఁడు.

## స్మా

స్మారితుఁడు. సం. విణ. తలఁపుసాకిరి.
స్మార్తము. సం. స్మృత్యుక్తకర్మము. విణ. స్మృతికిసంబంధించినది.

## స్మి

స్మితము. సం. అధరమునందుమాత్రము (ప్రకాశించెడు) చిఱునవ్వు. విణ. వికసించినది.
స్మితి సం. స్మితము. ౨

## స్మృ

స్మృతము. సం. విణ. తలఁపఁబడినది.
స్మృతి. సం. తలఁపు; జ్ఞప్తి; మన్వాదిప్రణీతమైన ధర్మశాస్త్రము; బుద్ధి; ఒకయర్థాలంకారము.

## స్మే

స్మేరము. సం. విణ. చిఱునగవుగలది; వికసించినది.

## స్య

స్యందనము. సం. కాఱుట; జలము; తినాసము†; రథము.
స్యందము. సం. కాఱుట.
స్యంది. సం. విణ. స్రవించునది.
స్యందిని. సం. లాల, చొంగ.
స్యదము. సం. వేగము, వడి.
స్యన్నము. సం. విణ. కాఱినది. [మణి.
స్యమంతకము. సం. విష్ణుహస్తము నందలి
స్యమీకము. సం. కాలము; మేఘము; చెట్టు; పుట్ట.
స్యాలకుఁడు. సం. భార్యతోఁబుట్టువు.
స్యాలిక. సం. భార్యతోడఁబుట్టినది.
స్యాలుఁడు. సం. భార్యతోఁబుట్టువు.

## స్యూ

స్యూతము. సం. దాఁగర, పల్లిక. విణ. కుట్టఁబడినది.
స్యూతి. సం. కుట్టు; సంతతి.
స్యూనము. సం. కిరణము; దాఁగర; నూలిసంచి.

## స్ర

స్రంసనము. సం. క్రింద పడుట.
స్రంసి. సం. గొనుగు†; పోఁక. ౨
స్రక్కు సం. పూదండ.
స్రగ్గు. అ. క్రి. రూ. సగ్గు.
స్రగ్వి సం. విణ. పూలదండగలవాఁడు.
స్రజము సం. పూదండ.
స్రవ. సం చాఁగ†.
స్రవంతి. సం. నది.
స్రవణము. సం. కాఱుట.
స్రవము. సం కాఱుట. [యించు.
స్రవించు సం. అ. క్రి. కాఱు. రూ. స్రవి
స్రష్ట సం. బ్రహ్మదేవుఁడు.
స్రస్తము. సం. విణ. చ్యుతము, జాఱినది.

## స్రా

స్రావకము. సం. విణ. కార్చునది
స్రావణము. అగసాలెనాని కోఱముట్టు.
స్రావము. సం. కాఱుట.
స్రావి. రూ. సరవి.

## స్రు

స్రుక్కఁబడు. అ. క్రి. స్రుక్కు; దుఃఖించు.
స్రుక్కు. చిక్కు; దుఃఖము; శోకము. బ. కడుపుమీఁది ముడుతలు. అ. క్రి. వెచుదీయు; భయపడు; ముడుఁగు; ముడుతపడు; తగ్గు; దుఃఖించు; చింతించు; మూర్ఛిల్లు; సంకోచించు; వాడు; చుట్టుకొను. సం. గరిఁటెవంటి ఒక హోమపాత్రము.
స్రుగ్జిహ్వుఁడు. సం. అగ్నిహోత్రుఁడు. ౨
స్రుచము. సం. ఒకహోమపాత్ర, స్రుక్కు.
స్రుతము. సం. విణ. కాఱినది.

స్రుతి. సం. కాలుట.
స్రువ. సం. పెందుగు†; చాఁగ†.
స్రువము. సం. ఒక యజ్ఞపాత్ర.
స్రువావృక్షము. సం. ములువెలఁగ†.

## స్రో

స్రోతము. సం. రూ. స్రోతస్సు.
స్రోతస్విని. సం. నది.
స్రోతస్సు. సం. ప్రవాహము; నది; ఇంద్రియము బ. నవరంధ్రములు.
స్రోతోంజనము. సం. నీలాంజనము, సురమా

## స్లే

స్లేటు. ఇం. రాతిపలక.

## స్వ

స్వఃపతి. సం. ఇంద్రుఁడు.
స్వకము / స్వకీయము } సం. విణ. తనది.
స్వచ్ఛందము. సం. క్రి. విణ. యథేచ్ఛము మనసువచ్చినట్టు. విణ. స్వతంత్రము.
స్వచ్ఛందుఁడు. సం. విణ. స్వతంత్రుఁడు.
స్వచ్ఛము. సం. ముత్తెము; స్ఫటికము. విణ. నిర్మలము.
స్వజనుఁడు. సం. జ్ఞాతి; తనవాఁడు.
స్వతంత్రము. సం. విణ. సొంతము; స్వచ్ఛందము.
స్వతంత్రించు. సం. అ. క్రి. ఒకరి యనుమతి లేక తానుగా ఏర్పడు.
స్వతంత్రుఁడు. సం. విణ. ఒకరి ప్రేరణ లేనివాఁడు.
స్వధితి. సం. పరశువు, గండ్రగొడ్డలి.
స్వనము. సం. శబ్దము, ధ్వని.
స్వనితము. సం. ఉఱుము. విణ మ్రోసినది.
స్వప్నక్కు. సం. విణ. నిదురపోతు.
స్వప్నము సం. కల; నిదుర. ధర్మము.
స్వభావము. సం. నిజగుణము, సహజమైన
స్వభువు. సం విష్ణువు; బ్రహ్మ.
స్వము. సం. ధనము; తాను. విణ. తనది.
స్వయంపాకము. వ్య. తనచే వండుకొనఁబడెడి ఆహారము.
స్వయంభువు. సం. బ్రహ్మ; మన్మథుఁడు.
స్వయంవర. సం. తనంతట మగనివరించునట్టి స్త్రీ.
స్వయంవరము సం. కన్య తనకుఁదానే పతిని ఎన్నుకొనుట; రాజుల ఒక వివాహము.
స్వరము సం అచ్చు, అకారాది; వేద స్వరము [ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము]; షడ్జాది సంగీతస్వరము [స, రి, గ, మ, ప, ధ, ని]; ముక్కుగాలి; ప్రాణుల కంఠధ్వని.
స్వరాట్టు. సం. బ్రహ్మము; సూర్యుఁడు.
స్వరితము. సం. వేదస్వర విశేషము. [దీని భేదము దీర్ఘ స్వరితము]
స్వరువు. సం. వజ్రాయుధము; యూపస్తంభముయొక్క తునుక; బాణము; యజ్ఞము.
స్వరూపము సం. స్వభావము; తనరూపము
స్వర్గము. సం దేవతలుండు లోకము.
స్వర్ణకారుఁడు. సం. కంసాలి.
స్వర్ణక్షీరి. సం. రెడ్డివారి నానఁబ్రాలు†.
స్వర్ణది. సం. ఆకాశగంగ.
స్వర్ణపారేవతము. సం. పెద్దఈడ†; ఒక దిరుసు కిత్తలి†. [నాగకేసరము
స్వర్ణము. సం. బంగారము; ఉమ్మెత్త†;
స్వర్భాను. సం. ఒక సంవత్సరము
స్వర్భానువు. సం. రాహువు.
స్వర్లోకము. సం స్వర్గము.
స్వల్పము. సం. విణ. మిక్కిలిఅల్పమైనది.
స్వవాసిని. సం. పేరంటాలు; పుట్టినింట నుండెడు స్త్రీ.
స్వస. సం. తోడఁబుట్టిన స్త్రీ.
స్వస్తి. సం. అవ్య. శుభము.
స్వస్తికము. సం. తూర్పున ఉత్తరమున వాకిళ్లుగలయిల్లు; చమకము; ఆసనవిశేషము; మంగళద్రవ్యము; అభినయహస్త విశేషము; పాము-పడగమీఁది నల్లని రేఖలు.
స్వస్తిముఖము. సం. జాబు.
స్వస్తిముఖుఁడు. సం. బ్రాహ్మణుఁడు; బట్టువాఁడు.
స్వస్థము. సం విణ. నెమ్మదిగానుండునది; స్వరూపస్థితిగలది.
స్వస్రీయ. సం. మేనకోడలు.

స్వస్రీయుఁడు. సం. మేనల్లుఁడు.

## స్వా

స్వాంతము. సం. మనస్సు; గుహ.
స్వాగతము. సం. కుశలప్రశ్నము; సుఖము తోడిరాక; వృత్తవిశేషము
స్వాచ్ఛ్యము. సం. స్వచ్ఛత్వము.
స్వాతంత్ర్యము. సం. స్వతంత్రత.
స్వాతి. సం. స్వాతిదేవి, సూర్యుని భార్య; స్వాతినక్షత్రము.
స్వాదనము. సం. రుచిచూచుట, భుజించుట
స్వాదము సం. రుచి, రుచిచూచుట.
స్వాదితము. సం. విణ. రుచిచూడఁబడినది
స్వాదుకంటకము. సం. పల్లేరు; ములు వెలఁగ†.
స్వాదుధన్వుఁడు సం. తియ్యవిలుకాఁడు [మన్మథుడు.
స్వాదురస స. కాకునాలిమిడి†; ద్రాక్ష†.
స్వాదువు. సం. విణ. ఇంపయినది; గరగరికైనది; మంచిది; తీపి, తియ్యనిది.
స్వాదూదము. సం. మంచినీళ్లసముద్రము.
స్వాద్వి. సం. ద్రాక్ష†.
స్వాధీనపతిక. సం. చెప్పినట్లు వినెడి మగఁడుగల శృంగారనాయిక.
స్వాధీనుఁడు. సం. విణ. తనకు లోఁకువైన వాఁడు. [వేదము; జపము.
స్వాధ్యాయము. సం. వేదాధ్యయనము;
స్వాధ్యాయి. సం. వేదాధ్యయనము చేయువాఁడు; పట్టణము నందలివర్తకుఁడు.
స్వానము. సం. ధ్వని.
స్వాపతేయము. సం. ధనము.
స్వాపము. సం. నిద్ర; శయనము; అజ్ఞానము; తిమ్మిరి. [గలిగినది.
స్వాభావికము. సం. విణ. స్వభావముచేతఁ
స్వామి. సం. రాజు, ఒడయుఁడు; దేవుఁడు; కుమారస్వామి. విణ. అధికారి.
స్వామిని. సం. ఒడయురాలు.
స్వామ్యము. సం. ఆధిపత్యము; హక్కు; సొంతము. [అష్టస్వామ్యములు – విక్రయ, దాన, వినిమయ, జల, తరు, పాషాణ, నిధి, నిక్షేపస్వామ్యములు.]
స్వారాజ్యము. సం. స్వర్గలోకపు దొరతనము; స్వాతంత్ర్యము; బ్రహ్మత్వము.
స్వారాట్టు. సం. ఇంద్రుఁడు.
స్వారి. విహారము.
స్వాస్థ్యము. సం. స్వస్థత, నెమ్మది; ఆరోగ్యము; అన్నవస్త్రాదులు కలుగుటచేత నేర్పడెడి సంతోషము.
స్వాహా. సం. అగ్నిభార్య, స్వాహాదేవి.
స్వాహాప్రియుఁడు. సం. అగ్నిహోత్రుఁడు.

## స్వి

స్విన్నము. సం. విణ. స్వేదముతోఁగూడినది

## స్వీ

స్వీకరించు. సం. స. క్రి. అంగీకరించు, తనదిగా చేసికొను.
స్వీకర్త. సం. విణ. స్వీకరించువాఁడు.
స్వీకారము. సం. స్వీకరించుట.
స్వీకృతము సం. విణ స్వీకరింపఁబడినది.
స్వీయ. సం. పతియందు అనురాగముగల నాయిక.
స్వీయము. సం. విణ. తనది.
స్వీయుఁడు. సం. విణ. తనవాఁడు.

## స్వే

స్వేదజములు. సం. బ. (భూమియొక్క) చెమటవలనఁ బుట్టిన యీఁగలు పురుగులు మొ.
స్వేదని. సం. కందువు, పెనము.
స్వేదము. సం. చెమట; చెమటపోయుట.

## స్వై

స్వైరము. సం. స్వచ్ఛందము.
స్వైరి. సం. విణ. స్వతంత్రుఁడు, యథేచ్ఛముగా తిరుగువాఁడు.
స్వైరిణి. సం. జారస్త్రీ.
స్వైరిత. సం. స్వతంత్రత, యథేచ్ఛముగా తిరుగుట.
స్వైరుఁడు. సం. విణ. స్వతంత్రుఁడు; సోమరి

## హ

హంకరించు. అ. క్రి. అహంకరించు.
హంకారము. అభిమానము, అహంకారము
హంగామా. హిం. కొంతకాలము ఉండు నట్టి యధికారము.

హంజ. పాదము.
హండ. సం. పెద్ద మృత్పాత్రము. (వా. ...హాపాత్రము.) (వా. హాండా) రూ. హాండి
హంత-కుడు. సం. విణ. హింసించు [వాడు.
హంభ. సం. గోధ్వని. [శూరుడు.
హంవీరుడు. సం. క్షత్రియుడు. విణ.
హంస. సం. అంచ, నీళ్లువిడిచి పాలుత్రాగెడి పక్షి; యోగివిశేషము; పరమాత్మ; అశ్వమేధ సంబంధమైన గుఱ్ఱము; మంత్రవిశేషము; ఉచ్ఛ్వాసనిశ్వాస రూపమైన వాయువు; మాత్సర్యము; (ఉత్తరపద మైనచో) శ్రేష్ఠము; విధినిషేధముల వదలి ఆత్మారాముడై విరాజిల్లెడి ఒక అవధూత.
హంసకము సం. అందె, కాలికడియము.
హంసతిలకము. సం. రాగిడిబిళ్ల.
హంసపక్షము. సం. అభినయహస్తవిశేషము
హంసపదము. సం. హంసలు నివసించు చోటు, మానససరోవరము; కొలను.
హంసపాదము. సం. వ్రాతయందు తప్పు గలచోటనుంచెడు హంస పాదాకారమైన గుఱుతు.
హంసపాది. గోధాపది†.
హంసము. సం. హంస.
హంసవాహనుడు. సం. బ్రహ్మ.
హంసవాహిని. సం. సరస్వతి.
హంసాయి. హిం. ఇరుగుపొరుగువాడు.
హంసాస్యము. సం. అభినయ హస్త విశేషము.
హంసి-క. సం. ఆడుహంస.
హంసుడు. సం. సూర్యుడు; జీవుడు; విష్ణువు; శివుడు; లోభగుణము లేని రాజు
హంసోదకము. సం. పగలు సూర్య కాంతిచే తప్తమైన రాత్రి చంద్రకాంతిచే చల్లనైన ఏలకులు మొ|| కలిపినపానీయము
హక్కస్సు హిం. పగ.
హక్కు. హిం. బాధ్యత.
హక్కుదారు. హిం. బాధ్యతగలవాడు, ఆస్తి-కర్త.
హజరతు. హిం. గౌరవార్థపదము.
హజారము } హజూరు } రాజసభ, ఆస్థానము.
హజ్జ. పాదము.
హట్టము. సం. అంగళ్లబజారు. [ము
హట్టవిలాసిని సం. నఖము నెడుగంధద్రవ్య
హఠము. సం. పట్టు; బలాత్కారము; హఠయోగము. [వాడు.
హఠవాది. సం. విణ. పట్టుపట్టి సాధించు
హఠాత్కరించు. సం అ. క్రి. బలాత్కారము చేయు.
హఠాత్తు. తటుక్కున, తలవనితలంపు.
హడపము. రూ. అడపము.
హణిగ. ...వధానము.
హణిగలు బ. నతివిశేషము.
హతకుడు. సం. విణ. నీచజనుడు, పనికి మాలినవాడు.
హతాహతి. సం. దెబ్బలాడుట.
హతము. సం. విణ. కొట్టబడినది; చంపబడినది.
హతి సం. దెబ్బ, కొట్టు.
హతుడు. సం. విణ. కొట్టబడినవాడు; నిర్విణ్ణుడు; మనస్సు చెడినవాడు.
హత్తము. హస్తము, తొండము.
హత్తి. హస్తి, ఏనుగు.
హత్తించు. స. క్రి. కూర్చు, చేర్చు.
హత్తు. రూ. అత్తు
హత్య. సం. చంపుట.
హదను. సమయము.
హద్దు. మేర; ఆజ్ఞ.
హననము. సం. హత్య.
హనుమ-డు. హనుమంతుడు.
హనుమంతుడు } హనుమానుడు } సం. ఆంజనేయుడు.
హనువు. సం. నఖము నెడు గంధద్రవ్యము; చావు; ఆయుధము; వ్యాధి; కటుమర; చెక్కిలిమీది భాగము.
హన్నము. సం. పురీషము.
హన్నుడు. సం. విణ. ఏరగినవాడు.
హమాంబాపతు. హిం. మొత్తము.
హమాగ. కృతార్థకము.

హమేషా. హిం. అవ్య. ఎల్లప్పుడు.
హయగ్రీవుఁడు. సం. విష్ణ్వవతారవిశేషము; ఒక అసురుఁడు.
హయపుచ్ఛి. సం. కారుమినుము†.
హయమారకము సం. గన్నేరు†.
హయము. సం. గుఱ్ఱము. [కుబేరుఁడు.
హయవాహనుఁడు సం. సూర్యపుత్రుఁడు
హయాము హిం. కాలము; ఏలుఁబడి.
హర్కత్తు. హిం. ఆటంకము.
హరకాలా. వేగులవాఁడు.
హరణము. సం. హరించుట; అరణము; భాగహారము.
హరబ్బి. దేశవిశేషము; ఆదేశపుగుఱ్ఱము.
హరి. సం. హరివర్ణము; విష్ణువు; ఇంద్రుఁడు; సూర్యుఁడు; చంద్రుఁడు; యముఁడు; సింహము; గుఱ్ఱము; కోఁతి; పాము; నెమిలి; బ్రహ్మ; హంస; వాయువు; శ్రీగురువు; భర్తృహరి; కోయిల; కిరణము; కప్ప; చిలుక. విణ. ఆకుపచ్చనిది; పసుపుపచ్చనిది.
హరించు. సం. అ. క్రి. అడఁగు. ప్రే. అడఁచు.
హరికేశుఁడు. సం. శివుఁడు.
హరిగ. కేడెము.
హరిగోలు. రూ. అరిగోలు.
హరిచందనము. సం. చెందిరము; వెన్నెల; మిక్కిలిచల్లగానుండెడి పసుపువన్నెగల చందనము; ఒక దేవతావృక్షము.
హరిణము. సం. లేడి; తెలుపు. విణ. తెల్లనిది.
హరిణక్రీడనము. సం. బాలక్రీడావిశేషము
హరిణి. సం. ఆఁడుజింక; ఒక అప్సరస్త్రీ; సుందరి; బంగారుప్రతిమ; వృత్తవిశేషము; అడవిమొల్ల†. విణ. పచ్చనివన్నెగలది.
హరిత. సం. గఱిక.
హరితకము. సం కూర; మునుగ†.
హరితపత్రిక. సం. చిత్రమూలము†; పచ్చాకు.?
హరితము. సం. పచ్చిక†; ఆకుపచ్చవర్ణము; పచ్చగుఱ్ఱము; పచ్చపిట్ట, గిజిగాఁడు; పచ్చాకు†; పచ్చపెసర†; సింహము. విణ. ఆకుపచ్చనిది.
హరితాళము. సం. హరిదళము.
హరిత్తు. సం. దిక్కు; ఆకుపచ్చవర్ణము; పచ్చనిగుఱ్ఱము; సింహము; గఱిక. విణ. ఆకుపచ్చనిది.
హరిదశ్వుఁడు. సం. సూర్యుఁడు.
హరిదళము. పసుపువన్నెగల ఒకధాతువు
హరిద్ర. సం పసుపు.
హరిద్రాభము. సం. పసుపువర్ణము. విణ. పసుపువర్ణముగలది.
హరిద్రువు. సం. మ్రానిపసుపు.†
హరిన్మణి. సం. గరుడపచ్చ, మరకతము.
హరిప్రియ. సం. లక్ష్మి; భూమి; గంగ; సరస్వతి; తులసి†; ద్వాదశి.
హరిబువ్వము. బువ్వము బంతి.
హరిమంథకము. సం. సెనగ†.
హరివంతుఁడు. సం. ఇంద్రుఁడు.
హరివాణము. తట్ట, చిన్నపళ్లెరము.
హరివాలుకము. సం. కూఁతురుబుడమ, నూఁగుదోస†. [పాదము.
హరివాసరము. సం. ద్వాదశి ప్రథమ
హరిశరుఁడు. సం. శివుఁడు.
హరిశ్చంద్రుఁడు. సం. ఒక చక్రవర్తి, త్రిశంకుపుత్రుఁడు.
హరిహయుఁడు సం. ఇంద్రుఁడు; సూర్యుడు
హరీతకి. సం. కరక†.
హరుఁడు. సం. శివుఁడు, ఈశానుఁడు.
హరువు ఉపాయము; మనోజ్ఞత; నాణెమైనపని. విణ. మనోజ్ఞము; నాణెము.
హరువుకాఁడు. కార్యదక్షుఁడు.
హరుషము. హర్షము. రూ. హరుసము.
హరుసించు. అ. క్రి. సంతోషించు.
హరేణువు. సం. రేణుక†; బటాణి†.
హర్కారా. హిం. వార్తాహరుఁడు.
హర్త. సం. విణ. హరించువాఁడు.
హర్మ్యము. సం. మిద్దెటిల్లు, ధనికులమేడ
హర్యక్షము. సం. సింహము.
హర్యక్షుఁడు. సం. కుబేరుఁడు.
హర్యశ్వుఁడు. సం. ఇంద్రుఁడు.
హర్షకుఁడు. సం. విణ. సంతోషింపఁజేయువాఁడు.
హర్షణము. సం. సంతోషపడుట, ఒక యోగము; నేత్రరోగవిశేషము. విణ.

సంతోషింపఁజేయువాఁడు.
హర్షమాణుఁడు సం. విణ. సంతోషము నొందిన మనసుగలవాఁడు.
హర్షము. సం. సంతోషము; ఒకయోగము
హర్షి-తుఁడు. సం. విణ. సంతోషముగలవాఁడు.
హర్షించు. సం. అ. క్రి. సంతోషించు.
హలము. సం. నాఁగలి.
హలాయుధుఁడు. సం. బలరాముఁడు.
హలాహలము. సం. ఒకవిషము; జల్లి; గుఱ్ఱపునొసలు; నాఁగలి; నలికండ్లపాము.
హలి. సం. బలరాముఁడు; మడకఁదున్ను వాఁడు.
హలిని. సం. తటిగొఱ్ఱు†.
హలిప్రియ. సం. కల్లు.
హలిప్రియము. సం. కడిమి†.
హల్కా. అల్పము, నీచము.
హల్య. సం. నాఁగళ్ల సమూహము.
హల్యము. సం. దున్నినపొలము
హల్లకము. సం. ఎఱ్ఱకలువ.
హల్లకల్లోలము. రూ. అల్లకల్లోలము.
హల్లాసేయు. అ. క్రి. లగ్గయెక్కు.
హల్లీషకము. సం. స్త్రీల మండలాకార నృత్యము.
హల్లులు. సం. క కారాద్య క్షరములు.
హల్లోహలము. సం.? అధికము; కలవరము; చీకాకు; ఉప్పొంగుట; తొట్రుపాటు.
హవణించు. ప్రే. అలంకరించు; ధరించు చక్కఁబఱచు; ఉంచు.
హవణింపు. అలంకరణము.
హవణిక. అలంకారము; అవధానము.
హవణిల్లు అ. క్రి. ప్రకాశించు; విజృంభించు.
హవణు. ఒప్పిదము.
హవనము. సం. హోమము.
హవనీయము. సం. విణ. హోమము చేయఁదగినది.
హవము. సం. ఆజ్ఞ; పిలుపు; యజ్ఞము.
హవాలా. హిం. అధీనము.
హవిర్భుక్కు. సం. అగ్ని.
హవిష్యము. సం. హవిస్సు; నెయ్యి.
హవిస్సు. సం. అగ్ని హోత్రము నందు వేల్చుటకు ఇవురఁబెట్టినయన్నము; హోమయోగ్యమైనద్రవ్యము; నెయ్యి.
హవుసు రూ. హవాసు.
హవుసుకాఁడు. భోగి; విటుఁడు; సౌందర్యవంతుఁడు.
హవ్యము. సం. దేవతలకీయఁదగినయన్నము
హవ్యవాహనుఁడు } సం. అగ్ని హోత్రుఁడు. రూ. హవ్యవాట్టు.
హవ్యవాహుఁడు }
[భేదము.
హసంతి. సం. కుంపటి; ఒకమల్లె; శాకిని
హసదు. విణ అ ప్ర. దొడ్డవాఁడు.
హసనము. సం. నవ్వు; హాస్యరసము.
హసని. సం. హోమకుండము; కుంపటి.
హసము. సం నవ్వు; హాస్యరసము.
హసాదు. అవ్య. జయ జయ శబ్దముతో గొప్పవారిని సంబోధించుపదము; గొప్పవారి యాజ్ఞను విధేయులు మంచిదని యంగీకరించియుండుట యందును వచ్చును.
హసావళి నిచోళము, దుప్పటి.
హసించు. సం. అ. క్రి. నవ్వు.
హసితము. సం. అట్టహాసము; నవ్వు. విణ. వికసించినది; నవ్వినది.
హస్త. సం. హస్తనక్షత్రము.
హస్తతలము. సం. అఱచేయి.
హస్తము. సం. చేయి; ఏనుఁగుతొండము; మూర; మూరెఁడు; (కేశపర్యాయములకు పరమైనపుడు) వాని సమూహము. (కేశహస్తము చెు.)
హస్తవారణము. సం. చేతితో అడ్డగించుట; చంపవచ్చిన వాని నడ్డగించుట.
హస్తి. సం. ఏనుఁగు.
హస్తినఖము. సం. పట్టణపువాకిట వాటముగా నేర్పఱచినమట్టిదిబ్బ; కోటబురుజు
హస్తిన(నా)పురము. సం. ఢిల్లి.
హస్తిని. సం. ఆఁడుఏనుఁగు; ఢిల్లి; స్త్రీ జాతి విశేషము.
హస్తినీపురము. సం. ఢిల్లి.
హస్తిపకుఁడు. సం. మావటివాఁడు.
హస్తిపురము. సం. ఢిల్లి.
హస్తిమశకాంతరము. సం. ఏనుఁగునకు దోమకుఁగల వాసి.

హస్తిమల్లము. సం. ఐరావతము.
హస్తిమల్లుఁడు. సం. వినాయకుఁడు.
హస్త్యారోహుఁడు. సం. మావటీఁడు.
హాళంది. రూ. అళఁది.
హాళహాళి—క. త్వర.
హాళాహాళి. కలకలధ్వని; త్వర; శౌర్యము.
హాళ్లి. అభావమును తెలుపుగుర్తు.

## హా

హా. సం. అవ్య. విషాదవిస్మయ శోకాదు లను దెలుపునది.
హాకిము. హిం. యజమాని; సేనానాయకుఁడు; వైద్యుఁడు. [ముగు.
హాజరు. హిం. విణ. వచ్చియున్న; ప్రత్యక్ష
హాజారము. ఆస్థానము.
హాటకగర్భుఁడు. సం. బ్రహ్మ.
హాటకము. సం. బంగారము; ఉమ్మెత్త†.
హాని. సం. తక్కువగుట; కీడు.
హామిక. రూ. ఆమిక.
హాయనము. సం. సంవత్సరము; అగ్నిజ్వాలలు; ధాన్యవిశేషము.
హాయి. సుఖము.
హారకుఁడు. సం. దొంగ; జూదరి. విణ. దోఁచుకొనువాఁడు.
హారతి. ఆరతి, నీరాజనము.
హారము. సం. హారిచరిత్రము; ముత్యాల దండ; యుద్ధము. విణ. మనోహరము.
హారి. సం. మూల్యము; పథికజన సమూహము. విణ. రమ్యమయినది; హరించువాఁడు; హారముగలవాఁడు.
హారిద్రము. సం. కడిమి†; పసుపువర్ణము. విణ. పచ్చనిది.
హారీతము. సం. పచ్చపిట్ట; కపటము.
హారీతుఁడు. సం. ఒకముని.
హారువు. జూదమునందలి పరిభాష.
హార్దము. సం. స్నేహము; అభిప్రాయము.
హార్యము. సం తాండ్ర†. విణ. హరింపఁదగినది.
హాల. సం. కల్లు.
హాలము. సం. నాఁగేలు.
హాలహాలము. సం. హాలాహలవిషము.
హాలాహాలము. సం. నలికండ్లపాము; బల్లి; శివుఁడుకంఠమందుధరించినవిషము.
హాలికుఁడు. సం. సేద్యకాఁడు. రూ. హాలికుఁడు. [రము.
హాలుసాలు. హిం. నడచుచున్న సంవత్స
హాలెము. అత్యంతము.
హావడి. ఉపద్రవము.
హావము. సం. భ్రూనేత్రాదివికారములచే కొంచెము తెలియఁదగినమనోవికారము; స్త్రీలశృంగారచేష్ట.
హావళి. ఉపద్రవము.
హాస. క్రొత్త.
హాసము. సం. నవ్వు; (ఇది స్మితము, హసితము, విహసితము, ప్రహసితము, అపహసితము, అతిహసితము అని యాఱువిధములుగలది) హాస్యరసము; ప్రకాశము
హాసించు. సం. అ. క్రి. నవ్వు.
హాసిక. సం. నవ్వు.
హాస్తికము. సం. హస్తిసమూహము.
హాస్తినము. సం. ఢిల్లి.
హాస్యము. సం. నవ్వు; హాస్యరసము.
హాస్సేలు. హిం. పన్ను.
హాహా. సం. అవ్య. ఆశ్చర్యమును దుఃఖమును తెలుపును.
హాహుఁడు. సం ఒక దేవగాయకుఁడు.
హాళి. ఆసక్తి; సంతోషము.

## హి

హింగునిర్యాసము. సం. ఇంగువరసము; వేఁపచెట్టు.
హింగుపత్రి. ఇంగువాకు†.
హింగువు. సం. ఇంగువ.
హింగుళము. సం. ఇంగిలీకము.
హింగుళి. సం. ముండ్లములక†.
హింజలము. సం. నీరుగన్నేరు†.
హిండనము. సం. భ్రమణము; రతి; గతి; వ్రాయుట; క్రీడ.
హింతాలము. సం. గిఱకతాడు†.
హిందూ. హిందువు. ?
హిందోళము. సం. ఒకరాగము; డోలి.
హింస. సం. చంపుట; దొంగిలించుట కట్టుట కొట్టుట మొ.
హింసకుఁడు. సం. విణ. హింసించువాఁడు

హింసనము. సం. హింసించుట.
హింసించు. సం. స. క్రి. చంపు; బాధించు.
హింసితుఁడు. సం. విణ. హింసింపఁబడినవాఁడు.
హింస్ర. సం. ఒక చెట్టు; జటామాంసి; వస; నాడి.
హింస్రము. సం. విణ. చంపెడిజంతువు.
హిక్క. సం. ఎక్కిలి; వెక్కిలి; ఒక వ్యాధి.
హిజరి. హిం. మహమ్మదీయశకము
హిజారు. కాలికి తొడిగికొనుచట్ట.
హిజ్జలము. సం. ఎఱ్ఱగన్నేరు†.
హిడింబారి. సం. భీముఁడు.
హితము. సం. విణ. పథ్యము; మేలుచేయునది; ధరింపఁబడినది; పోయినది; ఇష్టమైనది.
హితవరి. రూ. ఇతవరి.
హితవు. హితము, ఇతవు.
హితుఁడు. సం. విణ. ఆప్తుఁడు, హితము చెప్పువాఁడు; ఇష్టుఁడు.
హిమ. సం. చిఱ్ఱేలకి†.
హిమకరుఁడు, హిమధాముఁడు } సం. చంద్రుఁడు.
హిమము. సం. మంచు; హేమంతఋతువు చందనము†. విణ. చల్లనిది.
హిమవంతము, హిమవంతుఁడు } సం. హిమవత్పర్వతము, నగాధిరాజు.
హిమవాలుక. సం. కర్పూరము.
హిమాంబువు. సం. మంచునీరు; పన్నీరు.
హిమాంశువు. సం. చంద్రుఁడు.
హిమాచలము. సం. మంచుకొండ. రూ. హిమాద్రి మొ.
హిమాని. సం. హిమసమూహము.
హిమాలయము. సం. హిమవత్పర్వతము.
హిమావతి. సం. రెడ్డివారి నానఁబ్రాలు†.
హిమాహ్వయము. సం. కర్పూరము.
హిమిక సం. గడ్డిపైఁబడిన మంచు.
హిరణ్మయము. సం. ఒక వర్షము. విణ. సువర్ణ వికారమైనది.
హిరణ్యగర్భుఁడు. సం. బ్రహ్మ.
హిరణ్యబాహువు. సం. శివుఁడు.
హిరణ్యము. సం. బంగారము; మాడ; ధనము; గవ్వ; రేతస్సు.
హిరణ్యరేతసుఁడు. సం. అగ్ని; సూర్యుఁడు; శివుఁడు. రూ. హిరణ్యరేతుఁడు.
హిరణ్యవాహము. సం. శోణనదము.
హిరాణీలు. బ. తురకలలో నొకజాతి.
హిలమోచిక. సం. చిలుకకూర.
హిహి. అవ్య. ఇసీ.

హీ

హీనము. సం. విణ. తక్కువైనది; అల్పమైనది, నీచమైనది; మూలఁడగినది; విడువఁబడినది.
హీనుఁడు. సం. తక్కువవాఁడు; నీచుఁడు.
హీర. సం. చీమ; లక్ష్మి.
హీరము. సం. వజ్రరత్నము.

హు

హుంకరించు. సం. అ. క్రి. హుమ్మని ధ్వనించు.
హుంకారము. సం. హుమ్మనిధ్వనించుట.
హుంకారించు. సం. అ. క్రి. హుంకారముచేయు.
హుంకృతి. సం. హుంకారము.
హుండీ. హిం. సొమ్మిచ్చుటకాజ్ఞాపత్రిక.
హుకుమతీ. హిం. ఆజ్ఞ.
హుకుము హిం. ఆజ్ఞ; ఆజ్ఞాపత్రము.
హుజూరు. హిం. సన్నిధి, సమక్షము.
హుటాహుటి. అతివేగము. విణ. వేగవంతము
హుడుక్కము. సం. ఉడుక, డక్కి.
హుడుకు. ఉడుక.
హుతభుక్కు. సం. అగ్నిహోత్రుఁడు.
హుతవహుఁడు, హుతాశనుఁడు, హుతాశుఁడు } సం. అగ్ని, అగ్నిహోత్రుఁడు.
హుమాయి. గుఱ్ఱము.
హురుమంజి. మౌక్తికము.
హురుమత్తు. విణ. గొప్ప, పెద్ద.
హురుముంజి(జీ). ఆర్మజ్ దేశము.
హుర్మత్తు. విణ. గొప్ప, పెద్ద.
హుర్మంజి. రూ. హురుమంజి.
హుసార, హుసారు } హిం. జాగ్రత్త. రూ. హుషారు
హుళక్కి. వా. హుళిక్కి.

హుళికి } అభావము; అసత్యము.
హుళిక్కి }

## హూ

హూ. ఆవులించుట యందగు ధ్వన్యనుకరణము.
హూణభాష. సం. ఇంగ్లీషుభాష.
హూణము. సం. దేశవిశేషము; మ్లేచ్ఛజాతి విశేషము.
హూతము. సం. విణ. పిలువఁబడినది.
హూతి. సం. పిలుపు.
హూర్ఛనము. సం. వంకర.
హూహువు. సం. ఒకానొక దేవగాయకుఁడు
హూహూ. దే చలియందగుధ్వన్యనుకరణము

## హృ

హృతము. సం. విణ హరింపఁబడినది.
హృతి. సం. హరించుట.
హృదయంగమము. సం. విణ. సమంజసము, వినుటకింపైనమాట; మనోహరము.
హృదయము. సం. మనస్సు; అభిప్రాయము; గుండెకాయ; రొమ్ము.
హృదయాళువు. సం. విణ. మంచిమనస్సు కలవాఁడు. [రొమ్ము.
హృది సం. మనస్సు; గుండెకాయ;
హృద్య. సం. వృద్ధియనెడి యోషధి.
హృద్యము. సం. విణ. మనసుకింపైనది, మనసుకు హితమైనది; మనసునందు పుట్టినది; ప్రియమైనది, ఇష్టమైనది.
హృషీకము. సం. ఇంద్రియము.
హృషీకేశుఁడు. సం. విష్ణువు.
హృష్టి. సం. సంతోషము.
హృష్టుఁడు. సం. విణ సంతోషించినవాఁడు

## హె

హెగ్గడి. కొజ్జా, అంతఃపురపు కావలి వాఁడు; అంతఃపురపు కావలికత్తె. బ. హెగ్గళ్లు.
హెగ్గడికత్తె. అంతఃపురపు కావలికత్తె.
హెగ్గడికాఁడు. అంతఃపురపు కావలివాఁడు
హెగ్గడీఁడు. హెగ్గడికాఁడు. [గుణించు.
హెచ్చించు. స. క్రి. వృద్ధిపొందించు;
హెచ్చిరిల్లు. రూ. ఎచ్చిరిల్లు.
హెచ్చిల్లు. అ. క్రి. వర్ధిల్లు. రూ. హెచ్చిలు.
హెచ్చరించు. రూ. ఎచ్చరించు.
హెచ్చరిక. రూ. ఎచ్చరిక.
హెచ్చరికించు. రూ. ఎచ్చరికించు.
హెచ్చు. రూ. ఎచ్చు.
హెచ్చుఅవలి. తారస్వరము.
హెడ్డు. ఇం. విణ. పయివుండు.
హెడ్మాష్టరు. ఇం. పాఠశాలా ప్రధానోపాధ్యాయుఁడు.

## హే

హెజీబు. మంత్రి.
హేడుఁడు సం. హెగ్గడి.? విణ. మూర్ఖుఁడు.
హేతి. సం. అగ్నిజాల; సూర్యకిరణము; ఆయుధము.
హేతువు సం. కారణము. [మంచుకాలము
హేమంతము. సం. హేమంతఋతువు,
హేమకారుఁడు. సం. అగసాలెవాఁడు.
హేమదుగ్ధకము. సం. మేడి†.
హేమపుష్పకము. సం. అశోకము†; సంపెఁగ†; లొద్దుగు†.
హేమపుష్పిక సం. అడవిమొల్ల†.
హేమము. సం. బంగారు; ఉమ్మెత్త†.
హేమలంబ. సం. ఒకసంవత్సరము.
హేమాంగుఁడు. సం. బ్రహ్మ; గరుత్మంతుఁడు.
హేమాద్రి. సం. మేరుపర్వతము.
హేమాహేమీలు. బ విణ. అధికులు, గొప్పవారు.
హేమించు. సం. అ. క్రి. బంగారమగు.
హేయము. సం. విణ విడువఁదగినది.
హేరంబుఁడు. సం. వినాయకుఁడు; శౌర్యగర్వితుఁడు.
హేర(రా)వళి. పాడవన్నెకోక.
హేరామి. హింసించుట; ఉపద్రవపెట్టుట.
హేరాళము. సం. విణ. అతిశయమైనది.
హేల. సం. స్త్రీల విలాసము; శృంగారచేష్ట; తిరస్కారము.
హేలాగతి. సం. అవలీల.
హేవాకము. సం. చిద్రూపము.?

హేష. సం. (గుఱ్ఱముయొక్క) సకిలింత.
హేషించు. సం.అ. క్రి. గుఱ్ఱము సకిలించు
హేషితము. సం. హేష.
హేళనము సం. అపహాస్యము, అవమానము.
హేళి. సం. సూర్యుఁడు; హేల.

## హై

హైన్యము. సం. హీనత్వము.
హైమనము. సం. మార్గశీర్షమాసము; హేమంతఋతువు; షష్టికధాన్యము. విణ. విణ. మంచుచేతఁగలిగినది.
హైమము. సం. వేసవిని మంచువలనఁగలిగిన జలము. విణ మంచుచేత కలిగినది; బంగారుచేత కలిగినది.
హైమవతి. సం. పార్వతీదేవి; గంగానది; కరక†; తెల్లవస†; రెడ్డివారి నానఁబ్రాలు†.
హైయంగవీనము. సం. అప్పుడుచిలికితీసిన ఆవువెన్న; ఆవెన్న కాఁచిననెయ్యి.
హైరాను. హిం. విణ. తొందరపడిన; ఎటుతోఁచని.

## హొ

హొ. విణ. హొన్నుశబ్దముయొక్క లుప్తరూపము.
హొంజూబిలి. సువర్ణోత్సవము, ఏఁబది యేండ్లపండుగ.
హొంత. పరిశ్రమము.
హొంతకాఁడు } జెట్టివాఁడు; మాయల
హొంతకారి } మారి. ?
హొంబట్టు. బంగారపుపట్టు. [యిత్తడి.
హొన్నిత్తడి. రాజరీతి, బంగారును బోలిన
హొన్ను. బంగారు.
హొన్నుచాయగలాఁడు. లక్ష్మణుఁడు.
హొమ్ము. విణ. ఒమ్ము.
హొయలు విలాసము.
హొయలుకాఁడు. అందగాఁడు.
హొయలుబండి. గాడీ.
హొరంగు. విలాసము.
హొరవలి. హేరవళి.

## హో

హో. పిలుచుటయందగు ధ్వన్యనుకరణము. అవ్య. ఆశ్చర్యార్థకము.
హోడము. సం. నావ, ఓడ.
హోత. సం. ఋగ్వేదము తెలిసిన ఋత్విక్కు; హోమము చేయువాఁడు.
హోత్రి. సం. శివుని అష్టమూర్తులలో నొకటి, యజమానుఁడు.
హోదా. హిం. ఉద్యోగము; అధికారము.
హోమము. సం. వైశ్వదేవము, దేవయజ్ఞము; అగ్నియందు వేల్చుట. [ద్రవ్యము.
హోమ్యము. సం. నెయ్యి. విణ హోమ
హోర. సం. శాస్త్రవిశేషము; రెండున్నర గడియకాలము; గంట; లగ్నము; రేఖాభేదము; రాశ్యర్థము ఉపాయము. ?
హోరాట. ఆటోపము, సంభ్రమము.
హోరాహోరి. క్రి. విణ. అవిరామము; లెస్సగా. ? [నుకరణము.
హోరు. గ్రా. వాయువుయొక్క ధ్వన్య
హోలాక } సం. వసంతోత్సవము,
హోలిక } హోలి
హోళి. కామునిపండుగ కడపటినాఁడు తగులఁబెట్టుటకై పోగుచేసెడి గడ్డికంప.
హోళిగ. భక్ష్యవిశేషము.
హోళిపండుగ. కామునిపండుగ.

## హౌ

హౌదా హిం. అంబారి; ఏనుఁగుమీఁది ఆస్తరణము; చేడోలం.
హౌసు. సొగసు; ఒయ్యారము.
హౌసుకాఁడు. సొగసుకాఁడు; ఒయ్యారకాఁడు. [కీయ ప్రజాసభ.
హౌసాఫ్‌కామన్సు. ఇం ఇంగ్లండులోని

## హ్ర

హ్రదము. సం (నీరూరెడి)లోఁతుమడుగు.
హ్రదిని. సం. ఏఱు.
హ్రసిష్ఠము. సం. విణ. మిక్కిలిహ్రస్వమైనది.
హ్రస్వగవేధుక. సం. బీఱ†.

హ్రస్వము. సం. లఘ్వక్షరము. వి. కురుచ, పొట్టి; కొంచెము.
హ్రస్వాంగము. సం. జీవకము†.

హ్రా

హ్రాదిని. సం. వజ్రాయుధము; ఏఱు; మెఱపు; అందుగు†.
హ్రానము. సం. తగ్గుదల.

హ్రి

హ్రిణీయ. సం. సిగ్గు.

హ్రీ

హ్రీ. సం. సిగ్గు; పార్వతీదేవి.
హ్రీణము. సం విణ. సిగ్గునొందినది.
హ్రీణుఁడు. సం. విణ. సిగ్గుపడ్డవాఁడు.
హ్రీతము. సం. విణ. హ్రీణము
హ్రీతుఁడు. సం. విణ. సిగ్గుపడ్డవాఁడు.
హ్రీబేరము. సం. కురువేరు†.

హ్రే

హ్రేష. సం. హేష.

హ్లా

హ్లాదనము. సం. సంతోషించుట; సంతోషము.
హ్లాదము. సం. సంతోషము.
హ్లాదిని. సం. అందుగు; ఆనందభైరవి, పరాశక్తి, చిచ్ఛక్తి.



ఇది శ్రీమన్మహేశ్వర పదపద్మారాధనపారీణ తత్కరుణాకటాక్షలబ్ధ సరససాహిత్యాంధ్రగీర్వాణకవితాచాతురీధురీణఉద్భటారాధ్యాన్వవాయగురుమల్లికార్జున భక్తిపరాయణ వైశ్యకులపద్మాకరపద్మమిత్రమామిడివంశపాథోరాశినిశీధినీకళత్ర వ్యాళకరాళ సగోత్రపవిత్ర విద్వదనుగ్రహపాత్ర భద్రమాంబాసూర్యనారాయణపౌత్ర విజయలక్ష్మీ వేంకనార్యపుత్ర వేంకటార్యవిరచితబగు నాంధ్రదీపికానామకగ్రంథంబునందు సర్వంబును సమాప్తము.

(ఇయ్యది శాలివాహనశకవర్షంబులు ౧౭౭౭ అగు వర్తమాన వ్యావహారిక చాంద్రమానాక్షయనామసంవత్సర వైశాఖ శు౧౫ శుక్రవారము ది ౨౨ మేయి అన ౧౮౦౬ సంవత్సరమున సంపూర్ణము చెయ్యబడ్డది )

ఓంతత్సత్।

వెల్కం-శ్రీ లక్ష్మీ దేవనాగరి-ప్రెస్సులయందు ముద్రితము.

# శబ్దార్థ కల్పతరువు

జగద్గురువులచేతను దేశనాయకులచేతను మహాత్ములచేతను పండితప్రకాండులచేతను పత్రికలచేతను ప్రశంసింపబడిన ఏకైక సత్కృతి సంస్కృతాంధ్రమహాకోశము.

ఇయ్యది రాష్ట్రపతి రాధాకృష్ణ మహాశయులచే అభిమానించి అభినందించి ఆవిష్కరింపబడెను. ప్రతి గ్రంథాలయమునను ప్రతి పాఠశాలలోను అవశ్యము ఉండవలసినదిగా విద్యాశాఖ వారిచేత అప్రూవుడు చేయబడినది.

## శబ్దార్థకల్పతరువు-అభిప్రాయములు కొన్ని మాత్రము——

"వ్యుత్పన్నానాం వ్యుత్పిత్సూనాంచ మహాంతముపకారం కల్పయత్యయం మహాన్ కోశః" శృంగేరి శ్రీ జగద్గురు శ్రీమదనవ విద్యాతీర్థ మహాస్వాములవారు.

"తత్రభవద్భిః సుమహత్తర మనర్ఘం కార్యం సంపాదితమ్"

శ్రీ పి. బి. అణ్ణంగరాచార్యులవారు.

"ఏతాదృగ్గ్రంథ నిర్మాణం వాఙ్మయతపఃకల్పమేవ"

గురుజీ శ్రీ మా. సదాశివరావ్ గోళ్వల్కర్.

"ఆప్‌కే ఇస్ గ్రంథసే ఆంధ్ర సాహిత్యకీ శ్రీవృద్ధి హోగీ"

శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు.

"కోశాంతర గవేషణక్లేశాపహారీ కోశోఽయమ్"

శ్రీ సచ్చిదానందేంద్ర సరస్వతీ స్వాములవారు.

"పండితానాం విద్యార్థినాంచ మహతే ఉపయోగాయ భవతి" శ్రీ సి కుంజన్ రాజా

"సముపలభ్యాహమిమం సాక్షాత్కల్పతరుమివాముదమానంద మన్వభవమ్"

శ్రీ ముదిగొండ వేంకటరామ శాస్త్రులవారు.

"ఈ కల్పతరువు సారస్వతాంబరమున నొక యుజ్జ్వలతార"

శ్రీ పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులవారు.

"ఈ గ్రంథము ప్రతి గ్రంథాలయమును ప్రతి విద్యార్థిని కరకమలము నలంకరించును"

శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు.

"ఈప్సిత పదార్థ ప్రదానమున ఇది నిజముగా కల్పతరువే."

శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రులవారు.

"ఈ నిఘంటువును ప్రకటించి తాము ఆంధ్రలోకమునకు అపారముగా ఉపకరించితిరి."

శ్రీ గాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు.

"ఈ నిఘంటువు మహోపకారకమైనది" శ్రీ బత్తుల కామాక్షమ్మగారు.

"ఆంధ్ర సాహిత్యమునకు మీరు చేసిన సాహాయ్యము మఱవఁదలఁచికొనినను మఱవఁబడదు."

శ్రీ 'బూరి శివరామ శాస్త్రులవారు.

"ఇది సామాన్య గ్రంథముగాదు. భూలోకకల్పతరువే"

ఆస్థానకవి శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు.

శ్రీ వాణీ గ్రంథప్రచారణ సమితి

మచిలీపట్టణము.